# ప్రథమ ముద్రణ పీఠిక

"కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళాకలాపుఁ డయి పొల్పువహించిన భట్టుమూర్తిచే
నీరిత మై సుఖార్థపదహీనపదాస్పద మైనయావసు
త్సారమణప్రవృత్తము సుసాధ్యము గాదు తలంచి చూడఁగన్." (సోమకవి.)

ఆంధ్రప్రబంధములలో వసుచరిత్ర ముత్తమోత్తమ మైనది. నిరర్గళమగు కవితాధార, సహజములగు శబ్దాలంకారములు, ఉచితమగు శ్లేషనైపుణ్యము, మనోజ్ఞమగువర్ణనముగల యీయుత్తమగ్రంథము రచించి విద్యార్థులకు సారస్వత భిక్ష పెట్టి యశఃకాయుఁడైన రామరాజభూషణుని జీవితచరిత్రము వసుచరిత్రము నందలి సారస్వతవిశేషములు నెఱుంగుట ప్రతిభాషాసేవకునకును విధి యగుటచే, బహుపర్యాయపఠనచాపల్యమునను సారస్వతపోషకులగు బ్రహ్మశ్రీ వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రులవారి యాజ్ఞావశమునను పీఠికను వ్రాయ దొరకొంటిమి. వసుచరిత్రమువలనను హరిశ్చంద్రనలోపాఖ్యానమువలనను గ్రంథకర్తనామము రామరాజభూషణుఁ డని స్పష్టమగుచున్నది. కులనిర్ణయమున కిం దాధారములు గానరావు. కృష్ణదేవరాయల కల్లుఁడును సదాశివరాయలను నామమాత్రమునకు రాజుగ నుంచి విజయనగరసామ్రాజ్యము నేకఛాటిగఁ బరిపాలించి మహాసంగ్రామములో విజయముగడించిన వీరాధివీరుఁడు నగు (అళియ) రామరాజువలన నీకవి బహువిధసత్కారముల నొందిన యదృష్టశాలి. రామరాజుకాలమున సమకాలికరాజు లందఱకంటె మిన్నయై పలుకుబడియందును వీరత్వమునందును ఐశ్వర్యమునందును నసమానుఁడై యుండి సారస్వతాభిమానముతోఁ బ్రకృతకవినిగూడఁ బలుమాఱు గౌరవించి గ్రంథముల రచింపఁజేసి యంకితము నొందెను. నాఁటఁగోలెఁ దానురామరాజుచే భూషితుఁడుగాన కవి రామరాజభూషణుఁడ నని చెప్పుకొనుచు వచ్చెను. పూర్వనామ మీయుభయగ్రంథములయందును గానరాదు. వసుచరిత్రమునఁ దిరుమలరాయలు కవిని ప్రశంసించుతఱి

"శ్రీరామక్షితిపున్ మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణున్ బహుసంస్కృతాంధ్రకృతులం బల్మాఱు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయవేదండాగ్రహారాదిస
త్కారం బందితి రామభూషణకవీ ధన్యుండ వీ వన్నిటన్."

అని కవిని బ్రశంసించియున్నాఁడు. ఈప్రశంసవలన గ్రంథకర్తనామము రామభూషణుఁ డని వ్యక్తమగుచున్నది. వసుచరిత్రము గద్యమునందు "సాహిత్యరసపోషణ రామరాజభూషణ" యని చెప్పుకొనినాఁడు, హరిశ్చంద్రనలోపాఖ్యానములోఁ

ప్రథమాశ్వాసము 58 వ పద్యములోఁ దనవృత్తాంత మీక్రిందివిధముగాఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. "పనధిలంఘనకృపావర్ధితోభయకవితాకళారత్నరత్నాకరుండ
సకలకర్ణాటరక్షాధురంధరరామవిభుదత్తశుభచిహ్నవిభవయుతుఁడ
వసుచరిత్రాదికావ్యప్రీతబహునృపప్రాపితానేకరత్నప్లవుండ
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహనిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ

తే-గీ. "శ్రీకరమహాప్రబంధాంకసింగరాజ, తిమ్మరాజప్రియతనూజ ధీరసూర
పౌత్త్రుఁడ రామనృపభూషణాఖ్యసుకవి, నంకిత మొనర్తు నీకావ్య మనఘుభక్తి."

ఉదాహృతపద్యములు రెంటివలనను కవి కర్ణాటదేశాధీశ్వరుని గ్రంథరచనాచాకచక్యముచే మెప్పించినట్లును సుభయగ్రంథగద్యలతో సమన్వయించినఁగాదిన గ్రంథకర్తనామము రామభూషణుఁడని రామరాజభూషణుఁడని రామనృపభూషణుఁడని యుంటచే నిది బిరుదనామ మనుట కెంతమాత్రము సంశయింపఁ బనియుండదు. ఇతనినామము మూర్తియనియు బట్టుకులమువాఁడనియు గ్రహించుట కీకవికృతమని ప్రతీతిగలిగియున్న ఉత్పలమాలికలోని నగు

"లొట్టి యిదేటిమాట పెనులోభులతో మొగమోట యేల తా
... ... ... ... ...
రట్టడి బట్టుమూర్తి కవిరాయనిమార్గ మెఱుంగఁ జెప్పితిన్."

అను భాగమువలన రామరాజభూషణుని మూర్తి యని వ్యవహరించువారనియు నిందులకుఁ బీఠికాదియం దుదాహృతమైన పద్యమునందలి బట్టుమూర్తినామము, బట్టుమూర్తి బాపురమని యేర్చెనను నైతిహ్యము మఱియు నన్యవిధముల నేక కర్తృకమని విశ్వసింపఁబడు నరసభూపాలీయమునందలి కర్తృపదమగు మూర్తి నామము కారణ మగుచున్నవి. నరసభూపాలీయము రచించిన మూర్తికవియు, వసుచరిత్రము, హరిశ్చంద్రనలోపాఖ్యానములు రచించిరి. రామరాజభూషణుఁడు వేఱువేఱువ్యక్తులను వాద మొకటిగలదు. గాని యందు సత్యమున్నటులఁ గానరాదు. భిన్నత్వము వాకొనువారిలోఁ గిర్తిశేషులగు వీరేశలింగము రామకృష్ణయ్యపంతులు ప్రభృతులు ముఖ్యులు. మిగిలినచరిత్రవిదులలోఁ జాలమంది యేకత్వము నామోదించినవారే? నరసభూపాలీయమునఁ గవి తనప్రతిభాదికమును వంశానుక్రమణికయు నీవిధముగాఁ జెప్పుకొనియున్నాఁడు.

సీ. "శతలేఖనీపద్యసంధానధౌరేయుఁ ఘటికాశతగ్రంథకరణధుర్యు
ఆశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యనిరోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తి నిపుణు
తత్సమభాషావితానజ్ఞు బహుపద్యసాధితవ్యస్తాక్షరీధురీణు
ఏకసంధోచితశ్లోకభాషాకృత్యు చతురునోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు

తే-గీ. "సమితయమకాశుధీప్రబంధాంకసింగ, రాజసుతతిమ్మరాజ పుత్త్రప్రసిద్ధ
సరసవేంకటరాయభూషణసుపుత్త్రు, ననుబుధవిధేయుఁ శుభమూర్తి నామధేయుం,"

పై పద్యమునందలి మూర్తికవి పూర్వులనామములు హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి రామరాజభూషణుని పూర్వులనామములు సర్వవిధముల సరిపోవుచున్నవి. తండ్రిపేరు నూరపరాజనియు నతని బిరుదనామము వేంకటరాయభూషణుఁడనియు నిశ్చయింతుమేని యేకత్వము సర్వవిధముల నిర్బాధకము కాఁగలదు. ఇరువురిశైలి యొకటి. కాలమొకటి. బిరుదము లొక్కతీరువె. ఇష్టదైవ మొకఁడె. కావున రామరాజభూషణుని జన్మనామము మూర్తియై యుండును. ఇంతదనుక నుపలభ్యములైన యీకవి పుస్తకములలో మొదటిది నరసభూపాలీయము, రెండవది వసుచరిత్రము, మూడవది హరిశ్చంద్రనలోపాఖ్యానముగ నిశ్చయింపవచ్చును. కీ॥ శే. కందుకూరి వీరేశలింగముగారు వసుచరిత్రమునకు నరసభూపాలీయము లక్షణగ్రంథమనియుఁ దొలుత వసుచరిత్రము పిదప నరసభూపాలీయము రచింపఁబడినటులఁ దలంచిరిగాని యాయూహ కెన్నియో బాధకములు గలవు. నరసభూపాలీయకాలమునాఁటికి దిరుమలరాయలు పట్టాభిషిక్తుఁడు గాలేదుగాన నాతని నెల్లూరితిమ్మరాజని వాకొనఁబడెను. ఇంతియగాక నరసభూపాలీయముతో రామరాజు ప్రశంస యీక్రిందివిధముగాఁ గావింపఁబడెను.

సీ. "ఖలు నతిద్రోహిసల్కాము తిమ్మని హరించి సకలకర్ణాటదేశంబు నిలిపె
నతునివర్ధితునిఁ దత్సుతునిబట్టముగట్టి కుతుపనమల్కునతోణి నిలిపెఁ
బదిలుఁడై రాచూరు ముదిగల్లు కప్పంబు సేయఁ గాంచి సపాదు సీమ నిలిపె
శరణన్న మల్కు నిజామున కభయం బొసంగి తదీయరాజ్యంబు నిలిపె
తే-గీ. నవని సంతయుఁ రామరాజ్యంబుచేసెఁ, దనగుణంబులు కవికల్పితములుగాఁగ
నలవియె వచింపఁ దత్కావ్యములను వెలయ, భూమి నొకరాజమాత్రుఁడే రామవిభుఁడు."

అశ్వా-౧., ప.౭౦.

ఈపద్యమువలన నరసభూపాలీయరచనాకాలమునాఁటికి రామరాజు స్వలక్షము తిమ్మరాజును జంపించి సదాశివరాయలను రాజ్యమునఁ బ్రతిష్ఠించెననియుఁ గుతపనముల్కని చెప్పఁబడిన ఇబ్రహీం కుతుపషాను బట్టాభిషిక్తు గావించెననియు ఆలీ ఆదిల్ షాకు ముదిగల్లు రాచూరుదుర్గములతోనున్న కళ్యాణపురము నొసంగెననియు హుస్సేను శరణాగతుఁడు కాఁగా వానిరాజ్యము వాని కొసంగెననియు మూర్తికవి చెప్పియున్నాఁడు. ఈవిజయములన్నియుఁ జరిత్రముతో సమన్వయించితిమేని. క్రీ. శ. 1550 నాఁటివి. అప్పటికి మూర్తికవియు రామరాజుచే సత్కృతుఁడౌండి రామరాజభూషణుఁడు కాలేదు. ఇక్కతన నరసభూపాలీయము క్రీ. శ. 1555 లోఁగ రచింపఁబడిన దనుటకు సంశయములేదు. ఇఁక వసుచరిత్రమందుమా! రామరాజు తల్లికోటయుద్ధములో వీరమరణము నొందినపిదప నెల్లూరితిమ్మపార్థివుఁడు తిరుమలదేవరాయనామముతో జీర్ణకర్ణాటరాజ్యమును బునరుద్ధరించి మహమ్మదీయుల యలజడికి సహింపఁజాలక రాజధానిని పెనుగొండగఁ జేసికొని పరిపాలిం

చుట సూచింపఁబడెనని వసుచరిత్రమునందలి యీ క్రిందిపద్యమువలన గ్రహింప వచ్చును.

చ. "తిరుమలరాయశేఖరునిధీరచమూభటరాజి యాజిభీ
కరయవనేశ్వరప్రహితఖానబలంబున జక్కుసేయ ని
ద్ధరఁ బెనుగొండ కొండలు మదద్విపచర్మక పాలమాలికా
పరికరభూషితంబులయి బల్విడిఁ గాంచె గిరీశభావమున్." వసు. ఆ-1. ప. 39

వసుచరిత్రమును దిరుమలదేవరాయ లంకితము నొందునాఁటికి వార్ధకదశలో నుండియుండును గాననే యం దాతనికుమారుల విక్రమములును గుమారుఁడు శ్రీరంగరాయలు యువరాజపట్టాభిషిక్తుఁ డగుటయుఁ జెప్పఁబడెను.

చ. "హరిపదభక్తిశీలుఁ డగు నారఘునాథనృపాలు కూర్మిసో
దరుఁడు సిరంగరాయ వసుధావరుఁ డాత్మగుణప్రమోదవ
త్తిరుమలరాయశేఖర వితీర్ణమహాయువరాజపట్టబం
ధురుఁ డయి సర్వభూభువనధూర్వహశక్తిసహించు సొంపయున్." వసు- ఆ-1. ప-7.

రాజ్యము పెనుగొండకు మార్చినసుగూడ మహమ్మదీయులదాడి తగ్గలే దనియుఁ బైపద్యమువలన తిరుమలదేవరాయలు ముస్తఫాఖానుతో క్రీ. శ. 1577లో సంగర మొనరించి నష్టపడెననియుఁ బిదప తిరుమలదేవరాయలు కుమారులకు రాజ్యమునొసంగి తాను విద్యాగోష్ఠులతోఁ గాలయాపనముఁ జేయుతఱి మూఁడవకుమారుఁడగు వేంకటపతిరాజు ఆలీ ఆదిల్‌షాతోఁ బెనుగొండలో సంగర మొనరించి పరాజితుఁడై పెనుగొండవదలి చంద్రగిరి రాజధానిగఁ జేసికొని యట కాలము గడపెననియు నీక్రింది వసుచరిత్రపద్యమువలనఁ దెలిసికొన నవకాశము కలుగుచున్నది.

మ. "హరుఁ డాతారకశైలదుర్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖరవిఖ్యాతివహించుఁ జంద్రగిరిదుర్గం బందు శ్రీ వేంకటే
శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖర సదాసంసేవ్యుఁడై యార యి
ద్ధరబం టేలికవాసి తద్గిరులకున్ దద్వల్లభశ్రీలకున్."

వీనినన్నింటిని సమన్వయించి చూచితిమేని భట్టుమూర్తి శ్రీకృష్ణదేవరాయల సామ్రాజ్యమున నూత్నయౌవనము విద్యార్థిదశయుఁ గడపి తద్రాజ్యపతనానంతరము నరసభూపాలు నాశ్రయించి నరసభూపాలీయగ్రంథరచనాముఖంబున బహువిధసత్కారములనొంది వేంకటపతిరాయల యనంతరము రాజైన సలకము తిమ్మయను వధించి సదాశివరాయలను నామమాత్రముగ విద్యానగరరాజ్యమునకు రాజును జేసి యావద్రాజ్యమండలమును రామరాజు పాలించుతఱి నట నాశ్రయము గల్పించుకొని రసికుఁడగు రామరాజును బహువిధసంస్కృతాంధ్రకృతులచే మెప్పించి "రత్నహారహయవేదండాగ్రహారాది" సత్కారములనొంది రామరాజ

భూషణబిరుదము దాల్చి సుప్రసిద్ధుఁడై 1565 లో జరిగిన తల్లికోటయుద్ధమున రామరాజు ఘోరమృత్యువునొంది విజయనగరరాజ్యము భిన్నభిన్న మైపోయిన పుడు తిరుమలదేవరాయలు పెనుగొండలోఁ గొంతకాలము జీర్ణకర్ణాటరాజ్యము నుద్ధరించి పాలించుచున్న క్రీ. శ. 1577 ప్రాంతముననుఁ, దరువాత, చంద్రగిరికీరాజకుటుంబము పోయినకాలముననుఁ కవి యీ రాజకుటుంబము నాశ్రయించి యుండె ననియు క్రీ. శ. 1577 పైనను 1580 కిఁ గొంచెము పూర్వముననుఁ వసుచరిత్రము తిరుమలదేవరాయల కంకితము గావించెననియు విశ్వసింపవచ్చును. భట్టుమూర్తి నరసరాజువలన నొందినసత్కారములు సామాన్యములై యుండును. దానశీలుఁడగు రామరాజును తనవిద్యావివేకముచేఁ బలుమాఱు మెప్పించి రామరాజభూషణబిరుద నామము వహించి యేనుగులు హయములు రత్నహారములు అగ్రహారములు నొంది యైశ్వర్యశాలి యయ్యెను. వసుచరిత్రము తిరుమలరాయల కంకితము నొసంగి కవు లెవరు నొందియుండని రత్నాభిషేకగౌరవము నొందెను. పిదప నీతఁడు సమృద్ధికైశ్వర్యములతోఁ దులఁదూఁగుచు నుండెననుటకు హరిశ్చంద్రనలోపాఖ్యానములోని యీపద్యపాదములు తార్కాణ కాఁగలవు.

"వసుచరిత్రాది కావ్యప్రీతబహునృపప్రాపితానేకరత్నాష్టపుండ
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహనిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ."

రామరాజభూషణుఁడు స్వప్రతిభాదికముచే నమితధనము అగ్రహారములు మడిమాన్యములు గజతురంగాదులు సముపార్జించి పరితృప్తుఁడై తనయంతిమగ్రంథమును రామభద్రున కంకితముగావించుచుఁ దా నొనరించిన ధర్మకార్యములు కృతిరచనాభిలాషము నీక్రిందివిధముగా హరిశ్చంద్రనలోపాఖ్యానమునఁ బ్రశంసించియున్నాఁడు.

సీ. "సుతులఁ బెక్కండ్ర శాశ్వతరామనామధన్యులఁజేసి పిలుచు భాగ్యోదయంబు
రచితాగ్రహారంబు రామచంద్రపురాంకభూతం బొనర్చిన పుణ్యరేఖ
నవదివ్యభవనంబు నవరించి శ్రీరామవిభుఁ బ్రతిష్ఠించిన విపులమహిమ
రామసరోనామరమణీయముగఁ దటాకము వినిర్మించిన ఘనయశంబు

తే-గీ. "సఫలతవహించు నీహరిశ్చంద్రనలకథాయుగనిబంధచిత్రబంధప్రబంధ
మంకిత మొనర్పు రఘుభర్త కఖిలభర్త, కరుతరాభీప్సితము లెల్ల నొదవు నీకు."

(ప్రథ. ఆ. వ 14.)

రామరాజభూషణుఁడు అగ్రహారప్రదానము, శ్రీరామాలయనిర్మాణము, సరోవరప్రతిష్ఠ గావించి పరమార్థముగూడ సంగ్రహించియున్నాఁడు. ఇంతవఱకీకవినివాసస్థల మిదమిత్థమని రూపింపఁబడకపోవుట సంతాపకరము. ఈకవి జన్మస్థానము బట్టుపల్లెయనియు నిది రామరాజభూషణుని పూర్వులగు ప్రబంధాంకము వారను నింటిపేరుగలవారికి కృష్ణదేవరాయ లొసంగిరని కీర్తిశేషులగు వీరేశలింగ

మువంతులువారు వ్రాసియున్నారు. ఇది బళ్లారిమండలము పాలమండలము చెంత గలదని కొందఱును గడపమండలములోని పులివెందలచెంతగలదని కొందఱును జెప్పుచున్నారు. జటప్రోలు చెంతగలదని సురభివంశచరిత్రకారులు చెప్పుచున్నారు. కృష్ణామండలములోని మోదుకూరె యీబికజన్మస్థానమని మఱికొందఱు చెప్పుచున్నారు. ఇందలి సత్యనిర్ణయమునకుఁ బాటుపడి రామరాజభూషణప్రతిష్ఠాపితకీర్తి చిహ్నముల నారయుటకు సోదరపరిశోధకులు పూనుకొనమి పరితాపకారణము.

శ్రీకృష్ణదేవరాయలు విద్యానగరసంస్థానము పాలించుచు క్రీ. శ. 1530 లోఁ గీర్తిశేషుఁడగునాఁటికి భట్టుమూర్తి విద్యార్థిదశ పూర్తిచేసికొని యాసంస్థానమున నుండెననియుఁ బిదప 1580 వఱకు జీవించి యశఃకాయము గైకొనియుండునని యు నితని జననము 1510 ప్రాంతమున నైయుండునని యు డెబ్బదియేండ్లకుఁ బైఁగ జీవించెననియుఁ బూర్వోక్తవిషయసమన్వయముచేఁ దెలిసికొనవచ్చును. గాని యీనిర్ణయమువలన వసుచరిత్రము రచించునాఁటికి అఱువదిదైదుసంవత్సరముల వయస్సు, హరిశ్చంద్రనలోపాఖ్యానము రచించునాఁటి కంతకంటె నెక్కుడువయస్సుండియుండును. ఇంతవార్ధకములో శృంగారరసపూరితమగు వసుచరిత్రము ద్వ్యర్థి కావ్యమగుహరిశ్చంద్రనలోపాఖ్యానము రచించియుండునని మేము చెప్పఁజాలము. వసుచరిత్రము నీకవి నరసభూపాలీయము రచించినపిదప కొంతకాలమునకుఁ బూర్తిచేసి సత్కారాదులనొంది తిరుమలరాయల నానందపఱచియుండును. ఆవల కవి సజీవిగ నుండియుంటచేఁ దిరుమలరాయపుత్రుల ప్రోత్సాహమున శ్రీరంగ రాయల యువరాజ్యపట్టాభిషేకము వేంకటపతిరాయల చంద్రగిరిపరిపాలనము చేర్చియుండును. తరువాతఁ గొంతకాలమునకు రచింపఁబడినది హరిశ్చంద్రనలోపాఖ్యానము. ఈరీతిగ యోచించినచో వసుచరిత్రము హరిశ్చంద్రనలోపాఖ్యానము వయస్సు తీరకముందు రచించియున్నటుల నిశ్చయింప నగునుగాని యిందులకు నాధారములు గానరామిచే వంశాదికమునందలి తుదియంశములను లక్ష్యమునం దుంచుకొని కాలనిర్ణయ మొనరించితిమి. ఈసమన్వయమున కిచ్చగింపక కవులచరిత్రములో వీరేశలింగముపంతులువారు రాయలకాలమున రామరాజభూషణుం డుండి యుండఁడనియు నరసభూపాలీయము కవికృతమగు ద్వితీయగ్రంథమనియు శాసించిరని తోఁచెడిని.

రామరాజభూషణుఁడు సంగీతశాస్త్రమునందును, జ్యోతిశ్శాస్త్రమునందును యోగశాస్త్రమునందును, పరిజ్ఞానముగలవాఁడనియు వ్యాకరణశాస్త్రజ్ఞుఁడనియు వసుచరిత్రము చెప్పక చెప్పుచున్నది. కృతినొందిన తిరుమలదేవరాయలో రసికుఁడు. సంస్కృతాంధ్రసాహిత్యసంపన్నుఁడు. ఇతఁడు జయదేవుని గీతగోవిందముపై వ్రాసిన శ్రుతిరంజనియను వ్యాఖ్యానము మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకాలయములోఁ గలదు. గీతగోవిందవ్యాఖ్య చెఱుకూరి లక్ష్మణసూరికృతముగఁ బ్రత్యంతరములు లభించుచున్నవనియు "యథామదీయే ప్రసన్నరాఘవవ్యాఖ్యానే" అని

యుదాహరించినభాగములు లక్ష్మణసూరికృత ప్రసన్నరాఘవవ్యాఖ్యయందుఁ గలవు గాన తిరుమలరాయల కారోపించిన శ్రుతిరంజని కర్తృత్వము విశ్వసనీయము గాదని శృంగారశ్రీనాథమునఁ బ్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు. శ్రుతిరంజని వ్యాఖ్యాత తిరుమలరాయలు కాకపోయినను అతఁడు రసజ్ఞుఁడు పండితుఁ డనుటకు నీక్రిందియాధారములు దృష్టాంతములు కాఁగలవు.

"శ్రీరామరాయే శ్రితభాగధేయే కాలేః పదం శాశ్వత మభ్యుపేతే.
తదనుభువ మశేషాం పాలయన్ రాజనీత్యా
పవనతనయ కేతాదానరీత్యామహాత్మ్యా
భరతమహితభూమా భాతితస్యానుజన్మా
వరతిరుమలరాజస్సాహితీభోజరాజః."

(శాసనశ్లోకములు.)

శా. 'వర్ధిష్ణు ప్రతిభాపరాశర' — ఆ. 2. ప 157

సుగంధి—'సారసాహితీసదధ్వచారిభూరిధీరసా' — ఆ. 6. ప 102

ఈయుదాహృతాంశములవలనఁ దిరుమలదేవరాయలు భాషాప్రవీణుఁడనియు సుధీలోలుఁడనియు విద్యావినోదియనియు స్పష్టమగుచున్నది.

## రామరాజభూషణునిగ్రంథములు.

రామరాజభూషణుఁడు మూర్తినామముతో రచించిన నరసభూపాలీయము లక్ష్యలక్షణవిశిష్టమగు నలంకారగ్రంథము. దీనికే కావ్యాలంకారసంగ్రహమని నామాంతరము గలదు. నాటకలక్షణభాగమును మాత్రము వదలి ప్రతాపరుద్రీయమును నరసరాజున కంకితముగా నిం దాంధ్రీకరింపఁబడెను. ఇందలి పద్యములు చాల వఱకు వసుచరిత్రములోని పద్యములను బోలియున్నవి. నరసభూపాలీయము రచించునాఁటికి మూర్తికవి తనప్రతిభాదికము తానే చెప్పుకొనవలసినస్థితియందుంటచే నెన్నియో బిరుదాదికములను వాకొనెను. వసుచరిత్ర రచనము నాఁటికి అశేష పండితమండితమగు రామరాజు సభాస్థలమునఁ బ్రముఖుఁడై సత్కారముల నొందుచు జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందె మేలందుల కనుసామెతకు దృష్టాంతమయ్యెను. కావుననే తన్నుఁగూర్చి వసుచరిత్రమునందు విస్తరించి చెప్పుకొనఁడయ్యెను. వసుచరిత్రము నరసభూపాలీయము నేకకర్తృత్వమనుటకు నుభయగ్రంథములందు సమానములగు పద్యములు గలవు. ఇది యేకకర్తృత్వ మనుటకు సాధకము.

శా. "ఆమోదంబున శ్రీనృసింహవిభుదానాంభోనదు ల్సాగర
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గు వర్షాశర
త్సామానాధికరణ్యశంక నచటం దామోదరుం డొందు ని
ద్రాముద్రానుగతప్రమోదములఁ జిత్రం బేకకాలంబునన్."

(నరస-ద్వితీ)

మ. "రామత్స్వావరుదానతోయతటినీవ్రాతంబు కల్లోలినీ
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గ వర్షాశర

త్సామాసాధికరణ్యలబ్ధి నచటం జక్రాయుధుం డొందు ని
ద్రాముద్రానుగతప్రబోధములఁ జిత్రం బేకకాలంబునన్. వసు. ఆ. 1. ప.

శా. "గంగం దాల్చితి వుత్తమాంగమునఁ దన్ గైకోలు గావించి త
ర్ధాంగీకార మనం బురంధ్రి నిను వామాంగంబునం దాల్ప నే
శృంగారోన్నతిఁ జూడు మంచు గిరిజన్ శీర్షాపగా బింబిత
స్వాంగానందితఁ జేయు శంభుఁడు నృసింహాధీశునిం బ్రోవుతన్." (నరసభూపాలీయము.)

శా. "ఆమందాకిని మౌళిఁ దాల్చి నను నర్ధాంగీకృతం జేసి తా
నా మే ల్మేలని యార్య యల్గఁ బ్రణతుండై తత్పదాంభోజయో
గామర్షంబున గంగయుం స్మారయఁ జూడాభోగసవ్యక్రియా
సామర్థ్యంబున వేఁడు శంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుతన్." (వసుచరిత్రము.)

ఇటులె పోలికగలపద్యము లుభయగ్రంథములనుండి పెక్కు లుదాహరింప వచ్చునుగాని విస్తరశంకచే వదలుచున్నారము. ఇఁకఁ బ్రకృతమగు వసుచరిత్రమును దానిరచనావిధానమును గుఱించి తెలిసికొనుట యవసరమగుటచే వసుచరిత్రము వంక కొంకమాఱు దృష్టి మఱలింతము,

వసుచరిత్ర మాంధ్రభాషలోఁగల ప్రశస్తగ్రంథములలో నొకటి. ఇందు రామరాజభూషణుఁడు తనయావచ్ఛక్తి నుపయోగించి యున్నాఁడు. ఇతఁడు యమకాది శబ్దాలంకారములకుఁ బాటువడక శ్లేషలు ధ్వనులు శ్రుతిరంజకమగు ననుప్రాసాలంకారములు, ముక్తపదగ్రస్తములు చెప్పియున్నాఁడు. చిత్రకవిత కొండొకచో శ్రుతిపేయముగా నున్నను నందు నిరుపయోగపదాడంబరము నిండి యర్థగ్రహణమునకు వీలుకలుగదు గావునఁ దొల్లిటి యాలంకారికశిరోమణులు చిత్రకవితను యమకాదుల నీక్రిందివిధముగా గర్హించియున్నారు.

"ప్రాయేణ యమకే చిత్రే రసపుష్టి ర్నవిద్యతే"
"కావ్యాంతర్గడుభూతా యా సాతు నేహ ప్రపంచతే" (విశ్వనాథపంచాననుఁడు)

తెలుచుగా యమకము చిత్రకవిత లోనగువానివలన రసపుష్టి నశించుననియు బంధములు కావ్యమునకుఁ బుడుపువంటి వనియు నుదాహృతశ్లోకభావము. వసుచరిత్రమున బంధకవితయు గర్భకవితయు లేదు. అందందు యమకములు కానవచ్చిననవియు సాహిత్యరసపోషణుని యమృతవాణినుండి వచ్చినవగుటచే నందు రసప్రతిబంధము కానరాదు. రామరాజభూషణుఁడు సంగీతకళారహస్యనిధి యగుటచేఁ బఠనానుకూలముగ లయగ్రహించి, యమప్రాసాలంకారములు విశేషించి యుపయోగించియున్నాఁడు. శబ్దాలంకారరచనాకౌశలము రామరాజభూషణుని యెడల సహజమగుటచే నలంకారాభిరామములగు పద్యములలో మచ్చునకేని వ్యర్థవాక్యముగాని భావలోపముగాని కానరాదు. శబ్దాలంకారమగు ననుప్రాసములు నిండియున్న యీక్రిందిపద్యములలో భావలోపముగాని వ్యర్థపదప్రయో

గముగాని కానరాక పఠనసౌకర్యము శ్రోత్రపేయమునై యెంత మనోజ్ఞముగ నున్నదో చూడుఁడు.

సీ. "ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ మొకసీమ నానామయూరనినద
మొకవంక సకలంక మకరాంక హయహేష లొకక్రేవ వనదేవ యువతిగీతి
ఒకచెంత సురకాంత లకరాంతతతనాద మొకదారి వనశారికోదితంబు
ఒకయోరఁ బటుచారణకుమారఫణితంబు లొకదండ నలిమండలికలగాన

తే. మొక్కమొగి మ్రోయఁ గదళీగృహోపపన్న, కిన్నరీబృందబృందసంగీతగీతి
నమరు నతివేలకోలాహలములకలిమి, నమరు నీయద్రి కోలాహలాఖ్య మొప్ప."

సీ. "లలనాజనాపాంగవలనావసదనంగ తులనాభికాభంగదోఃప్రసంగ
మలసానిలవిలోలదళసాసవరసాలఫలసాదరశుకాలపనవిశాల
మలినీగరుదనీకమలినీకృతధునీకమలినీసుఖితకోకకులవధూక
మతికాంతసలతాంతలతికాంతరనితాంతరతికాంతరణతాంతసుతనుకాంత

తే. మకృతకామోదకురవకావికలవకుల, ముకుళసకలవనాంతప్రమోదచలిత
కలితకలకంఠకులకంఠకాకలీవి,భాసురము వొల్చు మధుమాసవాసరంబు."

క. "వీనులవిందై యమృతపు సోనలపొందై యమందసుమచరదళినీ
గానముక్రందై యారవ, మానందబ్రహ్మమైన నధిపతి వల్కెన్."

ఇట్టి యనుప్రాసాద్యంతనియమపద్యములు వసుచరిత్రమునఁ బెక్కులు గలవు. అందు భావసమృద్ధికిఁ గవితాగాంభీర్యమున కెట్టి కొంత గానరాదు గాని యావలి కవులీశబ్దాలంకారముల [illegible] వసుచరిత్రము ననుకరింపఁబోయిమాత్రము కృతార్థులు కాఁజాలరైరి. వసుచరిత్రమునందు ముఖ్యముగాఁ జూడఁదగినది శ్లేష, ధ్వని. రామరాజభూషణుఁ డిట్టిశ్లేషలను విదూషకునిచరిత్రము చెప్పించుతావునను, శుక్తిమతిగర్భధారణాకథావసరమునను మిగుల మనోజ్ఞముగాఁ జెప్పియున్నాఁడు. కృత్యాదియందలి కృతిపతివంశావతారమునందును చంద్రమలయానిలమన్మథాద్యుపాలంభనములందును రామరాజభూషణుఁడు తనశ్లేషనైపుణ్యము వెల్లివిరియించి యున్నాఁడు. ఇంతయేల వసుచరిత్రమునందు శ్లేషయో ధ్వనియో శబ్దాలంకారమో అపూర్వమగు భావసౌష్ఠవమో వర్ణనాచమత్కారమొ లేనిపద్య మరుదనుట సాహసముగాదు.

వసుచరిత్రమునందు కైశిక్యాదివృత్తులు వైదర్భ్యాదిరీతులు మాధుర్యాదిగుణములు ద్రాక్షాదిపాకములు శృంగారాదిరసములు ఉద్దీపనవిభావాది సంభోగశృంగారభావములు లోనగునరసభూపాలీయమునందలి కావ్యగుణములకు లక్ష్యములైనపద్యములు చాలగలవు. వీనినిబట్టియే వసుచరిత్రము నరసభూపాలీయమునకు లక్ష్యగ్రంథమనుటలో విమర్శకులు సంశయింపకున్నారు. వసుచరిత్రమునందలి కథావస్తువును భట్టుమూర్తి భారతమునుండి గ్రహించెను. కాని మూలకథను ఔచితినిబట్టి స్వతంత్రించి తనప్రబంధమునందుఁ బెక్కువిధముల మార్చి పరిష్కారము నిట్లు చెప్పినాఁడు.

ఉ. "కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కృతుల్
వావిరిపుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్."

భారతములో నింద్రుఁడు వసురాజుతపమునకు మెచ్చి విమానాదిక మొసంగి నటు లుండఁ గోలాహాలు నెగమీఱి భువనక్షేమము సంతరించినందుల కొసంగి నటుల మార్పఁబడెను. వసురాజునకు గిరికాపరిగ్రహణమునాఁటికే పుత్రు లున్నటు లుండ రామరాజభూషణుఁడు వసురాజు నవివాహితుఁడాయని యనుమానించువిధముగఁ జిత్రించెను. వసురాజు వేఁటకేగి గిరికను స్మరింప రేతస్స్ఖలనమగుటయు నతఁడా రేతస్సు గిరికకడఁ జేర్పుటయు లోనగు కథాంశము లీప్రబంధమునందుఁ దొలంగింపఁబడెను. ఇవియన్నియుఁ గథాకల్పనమునకు రామరాజభూషణుఁడు పెట్టిన మెఱుంగులు. ఇన్ని మెఱుంగులు పెట్టినను వసుచరిత్రమునందుఁ గథాకల్పన మున్నటులఁ దోఁచదు. వర్ణనములు, కల్పనములు, భావములు, కవితాసౌష్ఠవముతోఁ బాటు కథాసౌష్ఠవమును బాటింపకపోవుట యొకగొప్పకొఱంత. కావుననే వసుచరిత్రమును రసికులు సారస్వతపరిచయమునకుఁ బఠింతురుగాని కథాపఠనమునకుఁ బఠింపకున్నారు. వసుచరిత్రమునందలి కథాకల్పనలోపములనుగూర్చి రక్తాక్షిసంవత్సరపు టుగాదిసంచికయందు వసుచరిత్రము చంద్రికాపరిణయముల కథావస్తునిర్మాణమనువ్యాసములో నిటుల వ్రాసియున్నారము.

"వసుచరిత్రము కేవలము లక్ష్యగ్రంథము. అందుఁ గథాపరికరములు చాలినన్ని లేవు. శబ్దాలంకారములు, శ్లేష, వైదగ్ధ్యము, వర్ణననైపుణ్యము, పదాడంబరము మాత్రము కానవచ్చును. ప్రతిపద్యము నూతనభావమును వెల్లడించును. రసము వెదజల్లును. భాషామాధుర్యము తేటపడును గాని యాపద్యరత్నములఁ గథాసూత్రమున గ్రుచ్చ వీలులేదు. భట్టుమూర్తి సాహిత్యరసపోషకుఁడు సంగీతరహస్యనిధి. వసుచరిత్రములోని ప్రతిపద్యము నాయంశమునె వెల్లడించును. సాహిత్యరసపోషణునకు రసపోషణమున నేమికొఱంత! భట్టుమూర్తి సాహిత్యసముద్రమును మథించి పద్యరత్నములను బ్రోగుచేసెను. సానఁబట్టెను. క్రొత్తమెఱుంగులు వెలయించెను. సాహిత్యపీఠమును బాలించు భారతికి రత్నసమూహము నొసంగనేకాని కథాసూత్రమువ నందచందముగ గ్రుచ్చి యొసంగఁజాలక పోయెను."

వసుచరిత్రమునందుఁ బ్రథమాశ్వాసమున సహజశోభాభిరామముగ నొప్పు వనలక్ష్మి యలంకృతమైనవిధము మనోహరతరముగఁ జెప్పఁబడినది. రెండవయాశ్వాసమునందలి శుక్తిమతీకోలాహలుల సంగమఘట్టము శ్లేషాలంకారవ్యాప్తమై కవికిఁ గలయపారప్రతిభాతిశయమును వెల్లడించుచున్నది. కథాంశము నటుంచినచో కోలాహలుఁడు యౌవనోన్మాది. శుక్తిమతి భీరువుగ స్ఫురించును. ఇట శ్లేషరూపమున నర్థద్వయముఁ జెప్పుటలోఁ గవి లోకోత్తరమార్గముల నన్వేషించెను. మూఁడవ

యాశ్వాసమునఁ గపటజటిలుని వంచనప్రసంగము సమయోచితవాగ్ధోరణి వేషధారణము మిగులఁ బ్రశస్తతరము. నాలుగవయాశ్వాసమునందలి మన్మథాద్యుపాలంభనములు మంజువాణిదౌత్యము గిరికాసాంత్వనము మొదలగువర్ణనాంశములు మనోజ్ఞతరములు. ఐదవయాశ్వాసమున నింద్రుఁడు వివాహసంధాన మొనరించి ప్రత్యేకనగరమును నిర్మించుట. చుట్టపక్కముల నాహ్వానించుట పెండ్లికూతునిఁ జేయుటతోఁ గడచినది. ఇందుఁ గథాంశము చాలతక్కువ. ఆఱవయాశ్వాసము యథాశాస్త్రీయవివాహము గిరికను బుద్ధులఁజెప్పి యత్తవారింటికిఁ బంపుట. వసురాజు తనగృహమున నొకశుభముహూర్తమునందు గిరికతో సమాగమోత్సవ మొనరించుకొనుట. ఈకథాంశముల రామరాజభూషణుఁడు శ్లేషనైపుణ్యము, వర్ణనసౌష్ఠవము, ఉచితపదప్రయోగము సంగీతసాహిత్యవేత్తృతచే నిండారఁజేసి వసుచరిత్రమున నద్వితీయముగా రచించెను. మనుచరిత్రభావచ్ఛాయలు శృంగారనైషధశృంగారశాకుంతలాదిభావచ్ఛాయలు గొన్ని వసుచరిత్రమునఁ గలవు. అవియన్నియు రామరాజభూషణుని బహుగ్రంథపరిచయమునకుఁ దార్కాణములు కాఁగలవు.

## వసుచరిత్రమునందలి నాటకరీతులు

రామరాజభూషణుఁడు ప్రకృతకావ్యమునఁ గొన్ని యెడల నాటకరీతులను జూపి యాకాలమున రసికులకుఁగల నాటకపఠనాభిలాషను సూచించియున్నాఁడు. ఇట్టి నాటకరీతులు ప్రభావతీప్రద్యుమ్నమునందుఁ దక్క నితరగ్రంథములందుఁ గానరావు. విదూషకపాత్రమును రాజు వెంటఁగొని తెచ్చుట నాటకకవులయెడఁ గాననగును. అతఁడు రాజున కిష్టప్రియాఘటనమునఁ బాటుపడి కథాకల్పనమునకుఁ దీయరానిసంబంధము గలవానిగ నాటకకవులు సృజింతురు. రత్నావళి, శాకుంతలాదులు కేవల విదూషకప్రాముఖ్యమిళితములు. వసుచరిత్రమునందును నటులె విదూషకుని కార్యనైపుణ్యము నాటకానుకూలముగ నభివర్ణింపఁబడినది. వసురాజు గిరికను సందర్శింప నేతెంచుట, విదూషకుఁడు కుమారికల దరియ నేగుట, మంజువాణి రాజుచెంత నవకాశము పురస్కరించుకొనుట లోనగురసవత్కథాఘట్టములు మంజువాణిచే గిరికాజన్మవృత్తాంతమును వసురాజు చాటున నుండ విదూషకునకుఁ జెప్పించుట, పరస్పరసంభాషణసందర్భములు, నాటకరీతులను సమస్తవిధముల ననుకరించియున్నవి. చెలికత్తియలు గిరికపాటయందు యతిభియ్యమై యున్నదన యతివేషమున విదూషకుఁ డేతెంచుటయు, తుమ్మెదబాధ సపనయింపఁ గలహంసిరాదాయె ననుకొనునంతలో మాతృసఖియగు కలహంసివచ్చుటయు, దుష్యంతుని యొద్దనుండి శకుంతలవలె రాజువద్దనుండి గిరిక హేత్వంతరములఁ బురస్కరించికొని మోముద్రిప్పుచుఁ బోవుటయుఁ బ్రసంగావసరమున వసునామము విని గిరిక యూరడిల్లుటయు లోనగునవి నాటకానుకూలములగు పాత్రప్రవేశసూచనములుగాఁ జెప్పవచ్చును. ఇంతయేల కృత్యాదిపద్యము కథాసూచనముగను కృత్యంత

మండలిశాంతిభరతవాక్యమగు ప్రశస్తియను నిర్వహణసంధ్యంగమునకుఁ బోలికగా నున్నవి. వసురాజు గిరికాదులను దర్శించుటకు వంచకయతివాక్సహాయమును బురస్కరించుకొని ప్రవేశించుట వందిమాగధస్తోత్రాదికముతో యవనికచాటు నుండి రాజపాత్రము వచ్చునటులుగా నీక్రిందివిధమున రామరాజభూషణుఁడు మనోహరముగాఁ జెప్పియున్నాఁడు.

మ. "ఇది సంధింపఁగ వేళ యంచు వసురాజేంద్రుండు సింధ్రనీ
రదవారప్రతిసీర వల్వడిన తారాభర్తలీలన్ లతా
చ్ఛదసంఘాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగభ్రమ
న్మదభృంగీరుతి వందిమాగధకథామాధుర్యముం జెల్వఁగాన్." 3 ఆశ్వా. ప. 45

ఆకాలమున నాటకరంగములలోఁ బ్రధానపాత్రము ప్రవేశించినపుడు తెరలు కొంచెముకొంచెము సడలించువిధము క్రమక్రమముగాఁ బాత్రధారి యొక్క ముత్తెములపట్టయు నొసలు మోముదోఁచువిధము చంద్రోదయావసరమును బురస్కరించికొని యీక్రిందివిధముగ రామరాజభూషణుఁడు మనోహరతరముగా నభివర్ణించియున్నాఁడు.

మ. "హరిదంభోరుహలోచన ల్గగనరంగాభోగరంగత్తమో
భరనేపథ్యము నొయ్యనొయ్య సడలింపన్ రాత్రిశైలూషికన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతి వొల్చె రేకయి సగమై బింబమై తూర్పునన్." చతుర్థాశ్వాసము. ప. 17

మఱియొకచోట రామరాజభూషణుఁడు తెర నాకస్మికముగా సడలింపఁ గథాపాత్రములు ప్రేక్షకులకు గోచరించువిధము గూడ నీక్రిందివిధముగాఁ జెప్పియున్నాఁడు. దీనిచేఁ గవికి నాటకసంప్రదాయములఁ బ్రబంధములలోఁ బ్రవేశపెట్టుటలోఁగల యభిరుచి తేటతెల్లము గాఁగలదు.

సీ. ... ... ... ...
నిఖిలభూములు జవనిక వాపదారున నెదిరినట్లై తోఁచు నింతులార

చతుర్థాశ్వాసము. ప. 59

ఇంతియగాక, మంజువాణి యాకాశయానమునఁ బోవునపుడు భూమి కనిపించిన దని వర్ణించినభాగము శాకుంతలమునందలి దుష్యంతుఁడు రథ మాకాశము నుండి క్రిందికిదిగునపుడు గోచరించినభూమిని వర్ణించినశ్లోకముతోడను, కోలాహలాదులు అత్తవారింటికిఁ బంపునపుడు గిరికకు బుద్ధులుచెప్పుట శకుంతల నత్తవారింటికిఁ బంపుతఱి కణ్వమహర్షి బుద్ధులు చెప్పినశ్లోకముతోడను బోలియున్నవి. తెలుఁగునం దింకను రమణీయత సమకూర్పఁబడినది. ఇటులె కొన్నిచోటుల నింకను నాటకానుకరణములు నాటకచ్ఛాయలుగూడఁ గలవు.

వసుచరిత్రమునందుఁ గొన్ని లోపములుగూడ లేకపోలేదు. ముఖ్యములగు వ్యాకరణసంశయములు ఆలంకారికసందేహములు వ్యాఖ్యానమునం దాయాతావులలోఁ జర్చించియున్నారము. కావున విస్తరశంకచే నిట వదలితిమి. విదూషకపాత్రమువలని ప్రయోజనము కథయందుఁ గలదుగాని యీపాత్రము కథారంగమునుండి నిష్క్రమించుపట్టునఁ గవి సామాన్యప్రబంధధర్మము లవలంబించెఁగాని తన కల్పనావిదగ్ధతఁ బ్రకటించియుండలేదు. మంజువాణి కనవసరముగా నాకాశసంచారశక్తి, కామరూపధారణశక్తి యొసంగి యాయమ కమానుషధర్మముల నారోపించుట, కొండొకచో సామాన్యసఖిగ నుపయోగించుటలోఁ గవియాశయము బోధయగుటలేదు. వసురాజు పరిజనులతో రథసహాయమునఁ జేరవచ్చిన ప్రదేశమునుండి వసురాజపురముఁ జేరుటకు మంజువాణి కాకాశయానముఁ జెప్పుటలోఁ బ్రయోజనమంతగాఁ గానరాకున్నది. గిరిక జాబిల్లి వెలుంగుల కోరువఁజాలక పరితాపము నొందుచున్న సమయమున మంజువాణి తదభీష్టక్రియాధుర్యయై

తే. "అబ్జముఖులార యేఁబోయి యచలకన్య, యుత్తలముఁ జెల్పి వసురాజుచిత్త మరసి
వత్తు నత్యంతశుభవార్తఁ దెత్తు (ననుచుఁ, గొమ్మ హారంబు పూని యేఁగుటయు నిచట.)"

పైవిధముగ నేగెను. తరువాత గిరిక నోదార్చుచు వసురాజుచెంతనుండి వచ్చితినని తాను కార్యవేగమ్మున నంబరోత్పతనకౌశల మొందితినని తెలుపుచు నధిష్ఠానపురవర్ణనము విటవిటీకృత్యములు రాజశయనమందిరము తనపాంచాలీరూపధారణము రాజు పరితాపోక్తులు లోనగు ప్రబంధోచితప్రసంగముతోఁ జాలకాలము మంజువాణి గడపినది. రాజున కీపె యంత్రపాంచాలియైనదియు నాకాశగమనమున వచ్చినదియుఁ దెలియదు. కాననే త్వరగఁబోయి తనయంగుళీయకము గిరిక కిచ్చి యాయమ ప్రాణము కాపాడు మనెను. దీనిని బట్టిచూడ మంజువాణి ప్రగల్భమునకు నాకాశగమన మొందినటుల వాకొనెననియె తలంపవలసివచ్చును. లేకున్న కవి వసురాజు విమానయానకథాంశము నాధారపఱచికొని ప్రబంధము రచించినట్లు మంజువాణి యాకాశయానశక్తి నాధారపఱచికొని వేఱొకప్రబంధము చెప్పవలసివచ్చును. ఎట్లైననేమి మంజువాణి వసురాజునొద్దకుఁ బోయివచ్చితినని చెప్పు ప్రసంగము కథకు సంబంధించినదిగాఁ గనుపించుటలేదు. ఈయవకాశమును గల్పించుకొని కవి తన కవితాప్రతిభఁ జూపుటకుఁ గథాంశము గమనింపక యత్నించెనని తోఁచును. ఈస్వల్పాంశముల విడచితిమేని వసుచరిత్రము లోకోత్తరగ్రంథమనుటలో సంశయము లేదు. వసుచరిత్రమును జూచి యనేకులు ఆ నియమములఁ బాటించి ప్రబంధములు వ్రాసిరి. అట్టివానిలో చంద్రికాపరిణయము, శకుంతలాపరిణయము, రసికజనమనోభిరామము, కవిరాజమనోరంజనము లోనగునవి చాలవఱ కనుకరణగ్రంథములే. ఇంతియకాక యొకానొక సంస్కృతకవి వసుచరిత్రమును యథారూపముగ సంస్కృతీకరించి రామరాజభూషణుని భావములు దేవభాషలోఁ

ప్రతిష్ఠించెను. మఱియొకకవి కథాంశము కొలఁదిగా నున్నను గవితాలోలుపుఁడై వసుచరిత్రమును సంస్కృతరూపకముగా మార్చెను. మఱియొకకవి పిల్లవసుచరిత్రమను పేర వసుచరిత్రమునందలి ముఖ్యకథ చిన్నిప్రబంధముగా రచించెను. ఇవి యన్నియు వసుచరిత్రమునెడ సమకాలికవిద్వల్లోకమునకుఁగల యాదరణాతిశయమునకు దృష్టాంతములు.

రామరాజభూషణుఁడు విద్యావివాదములలో జోక్యము గలుగఁజేసికొని యవసరమైనచోఁ దిట్టుకవితఁగూడఁ జెప్పి యాత్మౌన్నత్యమును బ్రతిష్ఠించుకొనెననియు నవసరము వెంట నెంతవిద్వాంసునేని దిరస్కరించుచుండెననియు అయ్యలరాజు రామభద్రున కీకవికి బద్ధమత్సర ముండియుండుననియు నీక్రిందిపద్యములవలన గ్రహింప నవకాశము కలుగుచున్నది.

శా. "గుత్తిం బుల్లెలు గట్టి చంద్రగిరిలోఁ గూడెత్తి పెన్గొండలోఁ
హత్తిన్ సత్రమునందు నెండి బలుదుర్గాధీశు తాంబూలపుం
దిత్తుల్ మోసి పదస్థులైనఘనులం గీర్తింప దీవించెదన్
మత్తారాతియయాతినాగమసుతున్ మంత్రీశ్వరుం దిమ్మరుస్." (చాటువు)

ఉ. "లొట్టయిజేటిమాట పెనులోభులతో మొగమోట మేల లోఁ
గుట్టక యున్న వృశ్చికముఁ గుమ్మరపు ర్వని యందు రేగదా
పట్టపురాజు బట్టి సరిపల్లె సరాసరి యీయకున్న నే
తిట్టకమాన ... ... ... ...
... ... ... ... ...
రట్టడిభట్టుమూర్తి కవిరాయని మార్గ మెఱుంగఁ జెప్పితిన్." (చాటువు)

సీ-గీ. "రామరాజవిభూషణరత్నఖచిత, చారుమస్తకలాపాదిహారివాక్య
గౌరవము పెక్కుభంగుల గణనఁ జేసి." అప్పకవీయము.

ఉ "గట్టిగ భట్టుమూర్తి పగఁగట్టి ప్రబంధము లెన్నిచెప్పినన్
గిట్టక యొగ్గులెన్నియుడికించిన రాము గుఱించి సొమ్మదిం
బుట్టిన చింతఁ దత్కథనపూర్వముగా రచియించి గెల్పుచే
పట్టిన రామభద్రకవిఁ బ్రస్తుతిఁజేసిన పున్నె మబ్బదే." నాగన్నశతగిరిశాసనము.

రామరాజభూషణుని శ్రేయస్సు సహింపకయో రామరాజభూషణుఁడు ఎదుటివారిని దిరస్కరించు స్వభావము గలవాఁడగుటవలననో సమకాలికకవు లతని ద్వేషించినటులఁ బైపద్యములు తార్కాణ యగుచున్నవి. అల్లసాని పెద్దనార్యునకు రామరాజభూషణుఁడు శిష్యుఁడని జనపరంపర చెప్పుటయేగాక ఆంధ్రకౌముది యందు సమకాలికుఁడగు తద్గ్రంథకర్త వ్రాసియున్నాఁడు. "నానాసూనవితానవాసనల" యనుపద్యము ముక్కుతిమ్మనదనియు "మోహోపదేశతమోదితములైన" అనుపద్యము అయ్యలరాజు రామభద్రకృతమనియు ఈరెండుపద్యములు వసుచరి

త్రములోఁ జేర్పఁబడుటకుఁ గథాంతరములు గల వందురుగాని యవి విశ్వసనీయ ములు కావు.

## హరిశ్చంద్రనలోపాఖ్యానము

రామరాజభూషణుని గ్రంథములలో నీద్వ్యర్థికావ్యముగూడ నొకటియై యున్నది. రచనాకాలమును జెప్పియున్నారముగాన యీవ్యాసము పూర్తిచేయు లోఁగా నీగ్రంథమునుగూర్చి యించుక చెప్పుట చాలయవసరము. చరిత్రమును బరిశీలించినను రచనావిధానమును జూచినను హరిశ్చంద్రనలోపాఖ్యానము రాఘవ పాండవీయము రచింపఁబడిన పిదప రామరాజభూషణుఁడు వ్రాసియుండునని మా నమ్మకము. పింగళిసూరకవి తనపాత్రము తెలుఁగుబాసలో మొదటిదిగాన రచనము నందలి కష్టములు రచనావిధానమునుగూర్చి ముచ్చటించినాఁడు. అట్టిప్రసంగము హరిశ్చంద్రనలోపాఖ్యానమునందుఁ గానరాదు. కొన్నికొన్ని స్థానములయందు రామరాజభూషణుఁడు పింగళిసూరకవి రాఘవపాండవీయమునందుకంటె హరి శ్చంద్రనలోపాఖ్యానమునందె ప్రాగల్భ్యము చూపినాఁడు. అంతమాత్రమున హరిశ్చంద్రనలోపాఖ్యానము రాఘవపాండవీయము నతిక్రమించఁజాలదు. గౌరన కవికాలము స్పష్టముగఁ బదమూఁడవశతాబ్దమని తెలియుచుండ నతఁడు హరిశ్చంద్ర ద్విపదకుఁ గథాంశము హరిశ్చంద్రనలోపాఖ్యానమునుండి గ్రహించెననుటయు రామరాజభూషణుని కీవలివాఁడై యుండుననుటయు నవిచారవాక్యములు. హరి శ్చంద్రనలోపాఖ్యానము ఐదాశ్వాసముల చిన్నగ్రంథము. పరస్పరసాదృశ్యము లేని నలహరిశ్చంద్రకథాంశములను గలిపి చెప్పుట సామాన్యకార్యము గాదు. కథలను రెంటిని జోడించునపుడు రామరాజభూషణుఁడు చూపిన నైపుణ్య మనన్యసామాన్య మైనది. సూరకవి వర్ణనాంశముల కెడమీయక రాఘవపాండవీయమునందుఁ గథా కల్పనమునకే యెక్కుడు పాటుపడెను. రామరాజభూషణుఁ డట్లుగాక కథాంశము నటులుంచి తన ద్వ్యర్థికావ్యమున నష్టాదశవర్ణనలకుఁ దావొసంగి కథాంశము తగ్గించినాఁడు. కావుననే హరిశ్చంద్రనలోపాఖ్యానము పాఠకలోకము నాకర్షించు చున్నది.

## వసుచరిత్రము—వ్యాఖ్య.

ఈయుత్తమగ్రంథము వ్యాఖ్యానసహాయము లేకున్నచోఁ గవిభావము లన్నియు నవగతమగుట కష్టము. పలువు రీగ్రంథమునకు వ్యాఖ్యలు వ్రాసిరిగాని యందు నిజామురాష్ట్రమునందలి లేములవాడనివాసియు రాజేశ్వరస్వామిభక్తుఁ డును బహుగ్రంథకర్తయునగు సోమనాథకవికృతమగు విద్వద్రంజనీవ్యాఖ్య విపుల ముగ సరసముగా నున్నటులఁ దోఁచుచున్నది. ప్రాచీనముద్రితప్రతులం దన్నింటి యందును సోమనాథునివ్యాఖ్యానము సంగ్రహింపఁబడి ముద్రితమై యున్నది. గద్య మునందుఁగూడ ముద్రాపకులు సోమకవివ్యాఖ్యయందలి ముఖ్యాంశములు చేర్చితి

మని వ్రాసికొనిరి. సోమనాథునివ్యాఖ్య సంపూర్ణప్రతి మా కెటను లభింపనయ్యెను. ముద్రితవ్యాఖ్యాభాగ మసమగ్రముగ నుండెను. బ్రౌనుదొరవారు చిరకాలము క్రిందట వసుచరిత్రమునకు జూలూరు అప్పయ్యపంతులువారిచే వ్యాఖ్య వ్రాయించి ప్రకటించిరిగాని యది కేవలప్రతిపదార్థరూపమైనదిగ గోచరించెను. అందుచే సర్వజనోపయోగార్థముగా సోమనాథకవి వ్యాఖ్యానమునందులేని యనేకా పూర్వాంశములు దృష్టాంతములు అలంకారసమన్వయములు వ్యాకరణసిద్ధాంతములు సమకూర్చి యీముద్రణమున వ్యాఖ్యానమునందు బ్రహ్మశ్రీ వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రిగారి యాజ్ఞానుసారముగా మిగుల విపులముగా మేము వ్రాసియున్నారము. ఇంక విస్తృతిఁ జేయవలసియున్నను ప్రకాశకులయాజ్ఞానుసార మింతతో ముగింపవలసివచ్చినది. సోమనాథకవివ్యాఖ్యానమునం దుదాహరించని యనేక సంస్కృతాంధ్రోదాహరణములను సోమనాథుని కీవలిగ్రంథములనుండి కొన్ని దృష్టాంతములను నీవ్యాఖ్యయందు మే మొసంగి వ్యాఖ్యానముమాత్రము కృతజ్ఞతా సూచకముగా సోమనాథునిదిగనే యుంచితిమి. భవిష్యత్పరిశోధకు లుదాహృత గ్రంథములన్నియు సోమనాథుని వని నిశ్చయించి కాలనిర్ణయమునఁ బ్రమాదపడుదురేమో యని మేము చేసిన స్వల్పసేవ నిటఁ బ్రశంసించుకొనవలసివచ్చినది. పూర్వముద్రణమునందులేని యనేకముఖ్యాంశము లీముద్రణమునందుఁ జేర్చి వ్యాఖ్యానము విపులీకరణము గావించితిమిగాన రసజ్ఞులగుభాషావిదులకు మే మొనరించినకృషి పూర్వవ్యాఖ్యతోఁ బోల్చి పరిశీలించినఁ దెలియగలదు. ప్రత్యంతరములతో మూలగ్రంథమునుబోల్చి కవ్యభిప్రాయానుసారముగాఁ గొని పాఠములు నిర్ణయింపవలసియున్నది. సోమనాథుని సంపూర్ణవ్యాఖ్యాసహాయమున నింకను వ్యాఖ్యానము విపులము చేయవలసియున్నదిగాని చిరకాలముక్రిందనే వసుచరిత్రము ప్రతులు చెల్లిపోవుటవలనఁ ద్వరలో నూతనముద్రణము ముగింపకున్నఁ బాఠకలోకము నిరుత్సాహులగుదురని యిప్పటి కీవిధముగా నీగ్రంథరాజమును బ్రచురణమునకు సిద్ధపఱచితిమి.

ఆంధ్రభాషయందును సంస్కృతభాషయందును గల యమూల్యగ్రంథరాజములను విపులవ్యాఖ్యలతో సుచితములగు నవతారికలతోఁ బరిశుభ్రముగ ముద్రించుచు సారస్వతసేవయే లక్ష్యమునం దుంచుకొని యాంధ్రమాతృపరిచర్య గావించుటలోఁ దనివిసనని బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి సదుద్యమమే యీపీఠిక వ్రాయుటకు వ్యాఖ్య విపుల మొనర్చుటకుఁ బ్రధానకారణమగుటచే ఆంధ్రలోకముతోఁబాటు మేమును వారియెడఁ గృతజ్ఞుల మగుచున్నారము.

ఇట్లు, భాషాసేవకులు,

శేషాద్రి రమణకవులు,

శతావధానులు.

నందిగామ
10-1-26

# చతుర్థముద్రణ పీఠిక.



ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున వసుచరిత్ర మొక యపూర్వసృష్టి; అత్యద్భుతసృష్టి యని చెప్ప నొప్పును. స్వరప్రధాన మగు సంగీతమును, వర్ణప్రధాన మగు సాహిత్యమును సమ్మేళనముచేసి, చేతనాచేతనములకై, సంగీత సాహిత్యములకు గల ప్రభావమును విశదీకరించుచు, కవితాశిల్పమునకు పరమావధియైన వసుచరిత్రము సాహిత్యప్రపంచమున నవతరించినది మొదలు, ప్రశస్తి కెక్కి నేటికిని ఆంధ్రప్రబంధవాఙ్మయమునకు మకుటాయమాన మై యున్నది.

ప్రబంధ ప్రత్యేక విశిష్టత మనుచరిత్రతో ప్రారంభమై వసుచరిత్రతో పరిణతి చెందినది. ఒకటి విజయనగర సామ్రాజ్యము మహోన్నతసౌభాగ్య మనుభవించిన కృష్ణరాయయుగమునకు సంబంధించినది. వేఱొకటి సామ్రాజ్యపతనానంతరమున తిరుమలరాయని కాలమున వెలసినది. ప్రబంధము లీ రెండింటినడుమ, వెనుకను పుంఖానుపుంఖములుగ వెలసినను, మను-వసు చరిత్రములే, తెలుఁగువారి బహుమానపాత్రములై, ప్రామాణికములై పంచకావ్య ప్రశస్తిని బడసినవి. ఆంధ్రభాషలో కవిగా, కావ్యనిర్మాణదక్షుఁడుగా పేరొందుటకు మొదట మనుచరిత్రమును, నా వెనుక వసుచరిత్రమును చదువవలెను. దీనితోఁగూడ సాహిత్య సంస్కారమే గాక, శాస్త్రీయవిజ్ఞానము, సంప్రదాయ వివేకముగూడ లభించును. మనువు గట్టిపడిన తరువాతఁగదా వసువుపై భ్రాంతి !

వసుచరిత్ర రచయిత రామరాజభూషణమహాకవి తొలుత మూర్తినామధేయుఁడై, కావ్యాలంకారసంగ్రహ మను నరసభూపాలీయమును రచించి, ఆ వెనుక శ్రీ కృష్ణరాయని అల్లుఁడగు నళియ రామరాయని యాస్థానియై రామరాజభూషణుఁ డయ్యెను. వసుచరిత్ర రచనానంతరమున హరిశ్చంద్రనళోపాఖ్యానమును రచియించెను. వాస్తవికస్థితి యిట్లున్నను, మూర్తి, రామరాజభూషణుఁ డనువార లిరువురు ప్రత్యేక వ్యక్తు లనియు, నొక్కరనియు వాదప్రతివాదములు ప్రబలి, తుదకు నొక్కరే యను సిద్ధాంత మంగీకృత మయ్యెను. కావ్యాలంకారసంగ్రహకర్త యగు మూర్తికవియే, వసుచరిత్రను రచించిన రామరాజ భూషణుఁ డని యీ క్రింది వివరణమువలన నిశ్చయముగా నిరూపింపవచ్చును. వసుచరిత్ర రచింపఁబడిన యేఁబదేండ్లలో నా గ్రంథమునకు ప్రతిబింబముగా వెలువడిన సురభి మాధవరాయకవి చంద్రికాపరిణయముఁగూర్చి యీ క్రింది చాటువు గలదు:—

చ. సురభికులామలాబ్ధిఁ బొడసూపిన మాధవరాయచంద్రుఁ డా
సరసపదార్థరంజనము సత్కవిహృద్యముగాఁగఁ జంద్రికా
పరిణయమున్ రచించె నది భావ్యము నీ వసుచర్య చూడఁగాఁ
బరఁగె నిగూఢవృత్తి నటు వర్తిలె నీకును మూర్తినామమున్.

మాధవరాయని కాలముననే రచిత మగు నీ చాటువునుబట్టి యప్పటినుండియు మూర్తి, రామరాజభూషణుల నామము లొక్కటియేయై యుండు నని చెప్పనొప్పును. క్రీ. శ. 1750 ప్రాంతమున నున్న వసుచరిత్రవ్యాఖ్యాత సోమకవియు, "కారణజన్ముఁడై కవినికాయము మెచ్చఁగ...భట్టు

మూర్తియై" అని రామరాజభూషణుని మూర్తిగా పేర్కొనినారు. ఆ పద్య ప్రస్తావన వసుచరిత్ర కారులగు శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారు రీ భిన్నవాదములు వెలార్చిరి. శ్రీ ఘంటి రామ కృష్ణయ్యగారు బలపఱచిరి. ఈ భిన్నవాదము లన్నింటిని సక్రమముగ శాస్త్రీయముగ సోపపత్తి కముగ ఖండించి కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీయుత వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రులుగారు మూర్తి రామరాజభూషణు లొక్కరే యని సిద్ధాంతీకరించిరి. అదియే నేఁ డంగీకృత మైనది.

వసుచరిత్ర క్రీ. శ. 1569-70 ప్రాంతమున పెనుగొండలో తిరుమలదేవరాయని పట్టాభిషేకా నంతరమున రచిత మైనది. హరిశ్చంద్రనలోపాఖ్యానమను నిది పేర్కొనఁ బడుటచే నిది రామరాజ భూషణుని రెండవకృతి.

వసుచరిత్ర కృతికర్త భట్టుకులజుఁ డని యందఱు నైకకంఠ్యముగ నంగీకరించిరి. ఈ మన సాహిత్యపథకమున జాతి మత భేదములు లేవుగదా! వసుచరిత్రము నతి గౌరవముతోడను, పవిత్ర భావముతోడను నెంతమందియో యగ్రవర్ణములకుఁ జెందిన పండితులు, కవులు సంభావించుచు, నిట్టి లోకోత్తరకావ్యరాజమును రచించినకవియెడల జాతివిషయమై హేయమగు యభిప్రాయము నే మాత్రమును కలిగియుండనట్లు వసుచరిత్రమునఁ గల భాషాంతరీకరణములు, ముద్రణములు విశదము చేయుచున్నవి. నేటి మన విమర్శనములం దిట్టి భేదభావములను జొప్పించుట మనలోపమే యని చెప్పవచ్చును. దాని నెంత త్వరగ లేకుండఁ జేసికొనిన నంత మంచిది.

వసుచరిత్ర యవతరించిననాఁటినుండి ప్రసిద్ధికెక్కిన గ్రంథము కావున నాంధ్రవాఙ్మయ మున నే రెండు మూఁడు గ్రంథములకో కలిగిన యాంధ్రేతరభాషాంతరీకరణభాగ్య మీ గ్రంథ మునకుఁ గలిగినది. అందు మొదటిది:—

## 1. సంస్కృతభాషాంతరీకరణము

ఇది సుప్రసిద్ధులగు నప్పయదీక్షితులవారి శిష్యుఁడగు శ్రీ కాళహస్తికవిరచితము. అప్పయ దీక్షితులవారి కాలము క్రీ. శ. 1530-1610 వఱకు నని చెప్పనగును. మఱియు కాళహస్తి కవి తాను తెలుఁగు వసుచరిత్రమునే సంస్కృతీకరించుటచేత నిది క్రీ. శ. 1600 ప్రాంతమునఁ బుట్టి యుండవచ్చును. ఇది యముద్రితము. ఇందలి విషయములను నీ వ్యాసానుబంధమునఁ జూడనగును. దీని ననుసరించి వసుమంగళనాటకము పేరుసూరిచే రచితమైనది. అది యముద్రితము. దానివిషయ మిందు గలదు. (చూ. అనుబంధము 1)

## 2. అరవభాషాంతరీకరణము

ఇది అంబలత్తాడుమయ్యన్ అను కవిచే రచితమైనది. అరవభాషలోనికి మన తెలుఁగు కావ్య మనూదిత మగుట తెనుఁగువారికి గర్వహేతువు కదా! ఇతఁడు పెదుపర్తి పాలయ శిష్యుఁడు. ఈ పాలయ పెదుపర్తి బసవనమనుమఁడు. బసవన క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడు గావున నీతఁడు క్రీ. శ. 1600 ప్రాంతమువాఁడు కావలెను. ఈ తమిళభాషాంతరీకరణభాగ మీ వ్యాసానుబంధ మునఁ జూడ నగును. (చూ. అనుబంధము 2)

## 3. ఆంగ్లభాషాంతరీకరణము

క్రీ. శ. 1829 వ సంవత్సరమున 'దక్కను కవుల చరిత్రము'న కావలి వేంకట రామస్వామి గారు భట్టుమూర్తింగూర్చి వ్రాయుచు నందలి కృత్యాదిపద్యములను గిరికా వసురాజ సమా గమము నాంగ్లములోనికి భాషాంతరీకరించియున్నారు. అదియు 3 వ యనుబంధమునఁ గలదు. ఇందు భట్టుమూర్తిజీవిత మాంగ్లభాషలోఁ గలదు.

# వ్యాఖ్యలు

ఆంధ్ర ప్రబంధములలో నాముక్తమాల్యద కఠినమై, తొలినుండి వ్యాఖ్యానము నపేక్షించినది. వసుచరిత్ర కఠినము గాకపోయినను, శ్రుతిమనోహరముగ నున్నను, శ్లేషకావ్యము గావునను, సంగీతశాస్త్ర సంప్రదాయ సమ్మిళితము గావునను దీనికి వ్యాఖ్య యవసర మయ్యెను. అందులో మొదటిది —

## 1. విద్వజ్జనరంజనీ వ్యాఖ్య

ఈ వ్యాఖ్య సోమకవి రచితము. ఈతఁడు వేములవాడ రాజేశ్వరస్వామి భక్తుఁడు. ఈతఁడు వ్యాఖ్యాతయేగాక కవియై 1. చతుర్భుజాభిషేకము 2. ధ్రువచరిత్ర 3. మరుత్సందేశము 4. ముద్రాలాభము 5. గంగావివాహము మున్నగు గ్రంథములను రచించెను. ఈతఁడు క్రీ. శ. 1750 ప్రాంతమువాఁడని, గొరకిస వ్యాఖ్యానములలో నిది పూర్వపుదని ఆంధ్రభాషోద్ధారకులు బ్రౌనుదొరవా రభిప్రాయపడిరి. ఈ వ్యాఖ్యతోఁగూడ నేఁడు వసుచరిత్ర ముద్రితమైనది గావున నిదియే మిక్కిలి వ్యాప్తిగన్నది.

## 2. ప్రతిపదార్థ ప్రకాశిక

ఈ వ్యాఖ్య యముద్రితము. బ్రౌనుదొరవారి యాస్థాని ములుపాక బుచ్చయశాస్త్రి దీనిని రచించి బ్రౌనుదొరవారి కంకితము గావించియున్నాఁడు. సోమామాత్యుని వ్యాఖ్య విద్వజ్జనరంజన మేగాని సామాన్యజనరంజకము గాకపోవుటచే బుచ్చయశాస్త్రి ప్రతిపదార్థవ్యాఖ్య వ్రాసెను. ఇందుండి యవతారికా - ఆశ్వాసాంత గద్యపద్యములు నిందు (అనుబంధము 4 లో) ఉదాహరించియున్నాఁడను. దీనివలన నా కాలమున పండితులకు బ్రౌనుదొరవారియం దెంత గౌరవమో, బ్రౌనుదొరవారి భాషాభిమాన మెంతయో తేటపడుచున్నది.

## 3. సప్రతిపద టీక

ఇది బ్రౌనుదొరవారి యాస్థానమున పండితులై, మనుచరిత్రము, విజయవిలాసము మున్నగువాని వ్యాఖ్యానములు రచించిన సుప్రసిద్ధులు జూలూరి అప్పయపండితులచే రచితము. ఇది 1844 సం॥న ముద్రితమైనది. దీని ప్రతు లిపుడు లభ్యము కాకుండుటచే నీ గ్రంథమునుగూర్చి వివరించుచున్నాఁడను.

సప్రతిపదటీక ఛార్లిసుఫిలిప్ బ్రౌనుదొరవారి అనుమతిని జూలూరి అప్పయపంతులుగారిచేత 1844 సం॥ వ్రాయఁబడ్డది. ఈ గ్రంథము వ్రాఁతయచ్చుపుస్తకములు పెక్కింటివలె తోలుబైండు గలిగియున్నది. ఆకృతి (8×12) పీచుకాగితములు. 387 పుటలు. మూలము పెద్దయక్షరములు, వ్యాఖ్య చిన్నయక్షరములు. ఆశ్వాసముల పేరు ప్రథమ ద్వితీయాదినామములుగాక స్పష్టముగా 'మొదటి-రెండో - మూడో - నాలుగో - అయిదో - ఆరో ఆశ్వాసం' అని పెద్ద యక్షరములతో ముద్రింపఁబడినది. పుటలకు పైని రెండుప్రక్కలను, వసుచరిత్ర Vasucharitra అని తెలుఁగు యింగ్లీషు పేర్లు రెండును కలవు. తెలుగుననే ఆశ్వాససంఖ్యయు, పుటలసంఖ్యయు క్రింద నీయఁబడినది. అచ్చుపొరపాట్లు లేక చదువ ముచ్చటగ నున్నది.

ఈ గ్రంథము "Christian Vernacular Knowledge Society Press" నందు బ్రౌనుదొరవారిచే క్రీ. శ. 1844 లో ముద్రితమైనది. కాని, క్రీ. శ. 1839 వ సంవత్సరమున బ్రౌనుదొరవారు దీనిని ముద్రించుటకు ప్రారంభించినట్లు వారి యీ క్రింది వ్రాఁతవలన తెలియుచున్నది.

D. 759. Fly leaf 1st Volume Vasucharitra.

N y Mr. C. P. Brown:

The Vasucharitra
A celebrated Telugu Poem
With an ample verbal Commentary
By the very learned Zuluri Appayya

At the suggestion of C. P. Brown who paid for the work.

'The book is in the handwriting of the learned critic himself while the original text is in the handwriting of his son. Zuluri Appayya has for more than 20 years enjoyed the reputation of being the most learned of Telugu Scholars. His patience, humility and good sense always commanded great respect. In 1839 I printed the work verbatim from this volume but in a few places filled up an omission."

దీనిని బ్రౌనుదొరవారు "American Mission Press" లో ముద్రించినట్లు, దీని ముద్రణ వ్యయమునకు ప్రెస్సువారు పంపిన యుత్తర మొకటి దీనియందు గలదు. కాని పై 1839 వ సంవత్సరముద్రణము నేడు కానరాదు. బహుశః వారు కొంతవఱకు ముద్రించినప్పటికి కారణాంతరములచే నాగిపోగా క్రీ. శ. 1844 లో నీ ముందు చెప్పబడిన ముద్రాయంత్రమున వారిది సంపూర్తి గావించియుందురు.

ఈ వ్యాఖ్య నప్పయపండితులు క్రీ. శ. 1834 ఏప్రిల్ 5 వ తేదీని ముగించినట్లు వారే యిట్లు వ్రాసినారు.

"అన ౧౮౩౪ సం॥ యేప్రెల్ నెల ౫ వ తేదివఱకు మ-రా-శ్రీ చా॥ ఫి॥ బ్రౌనుదొరగారి సెలవుప్రకారం ఈ వసుచరిత్ర ఆఱు ఆశ్వాసములకున్ను జూలూరి అప్పయ్య ప్రతిపదటీక వెయ్యడమైనది." ఈ వ్యాఖ్యానము వ్యావహారికభాషలో వ్రాయఁబడినను గ్రాంథికములో వ్రాసినదానికంటె చాల సుగమముగ నున్నది. ఉదాహరణము చూపుదము, 3 ఆ. 48 పద్యము:—

చ॥ అనుపమకాంతివైభవసమన్వితు నా వసురాజుఁ గాంచు ప
ద్మిని సరసాంతరంగమున మించె వినూతనరాగసంపదం
బొనరె నఖండవాసనలు నుత్కళికల్ విలసిల్లె నల్లన
ల్లన నిగిడెం బ్రమోదతరళస్థితులై తమిఁ జూపు తుమ్మెదల్.

"ఉత్కళిక లనగా తరంగములు గనుక, తరంగ సదృశములైన సంచారీభావములున్నూ ఉత్కళిక లనబడుతూన్నవని విచారించవలెను. అటువంటి ఉత్కళిక అనగా ఉద్గతములైన మొగ్గలు విలసిల్లెను. "భవే దుత్కళికోత్కంఠా హేలాసలిలవీచి"ష్వితి విశ్వః. అనగా తరంగముల వలెనే సంచారీభావములు చూడఁబడుచున్నవి. ఏలాగనంటే సముద్రతరంగములు ఉద్గమించుచున్నూ లీనమౌచున్ను ఉండినవై, ఆ సముద్రమునకు ఉత్కర్షము చేయుచున్నూ, తిరిగి తత్స్వరూపమును పొందుతున్నూ ఏప్రకారం వర్తించునో ఆప్రకారంగా, స్థాయీభావమైన రీతియందు సంచారీ భావములైన శంకాసూయాదులు వర్తించుచున్నూ ఆ స్థాయీభావమునున్నూ, తమ్మునున్నూ పోషించుచున్నవై రసాత్మకము పొందుచున్నవని విచారింపవలెను.

పూర్వవ్యాఖ్యానములరీతి నిది యున్నది. అచ్చులోఁగూడ, అనాటికి చిన్నయసూరి అను శాసనము లేదు గావున 'రమణీయ్య' 'కమనీయ్య' యిత్యాదిగాను, వ్యవహారరీతిగాను స్పష్టముగా నున్నవి.

జూలూరి అప్పయపండితులు బ్రౌనుదొరగారికి చేదోడు వాదోడుగా నున్నవారు. నిజాము పేట వాస్తవ్యులు. వీరి గ్రంథములు 1. రామపంచాశత్కందపద్యములు, 2. శ్రీనివాసతారావళి 3. యదువంశభూషణశతకము. ఋూఁడింటెని కీర్తిశేషులు పసుప్పులేటి అనందాచార్యులవారు తమ వైజయంతీ పత్రికలోఁ బ్రకటించియున్నారు (క్రీ. శ. 1893).

## 4. వసుచరిత్ర వ్యాఖ్య

ఉద్దండపండితుఁడును, విద్వత్కవియు, సంగీతసాహితీవేత్తయు నగు శిష్టు కృష్ణమూర్తి వసు చరిత్రమునకు వ్యాఖ్య వ్రాసెను. ఈ వ్యాఖ్యయందు నొక్కొకచోట నెసిమిది యర్థములను గూడ వ్రాసెను. మఱియుం నే యే పద్య మేయేరాగముతో చదువవలెనో దానిసిగూడ నీతడు తెలిపెను. ఈ వ్యాఖ్యాన మిపుడు లభ్యము కాకున్నను నందలి సంప్రదాయసిద్ధములగు విషయములు తూర్పు గోదావరీమండలమున సాహిత్యవిద్వాంసుల వాడుకలో నున్నవి.

## 5. శ్రీ తేవప్పెరుమాళ్లయ్యగారి వ్యాఖ్య

ప్రశస్త విద్వాంసులగు తేపప్పెరుమాళ్లయ్యగారు (దేవరాజసుధీమణి) అనందసుత్రణమునకు పై వ్యాఖ్యలఁ బరిశీలించి సంస్కృతమున వ్యాఖ్యానపద్ధతిని భాషాసాహిత్యవిషయములఁ దెలుపుచు విపులవ్యాఖ్య కొంతవఱకు రచించిరి. దీనియందలి విశేషములు చదివినవారలకు గోచరించును గాన వేఱుగా వివరింపఁ బనిలేదు.

## వసుచరిత్ర - ప్రతిపదార్థప్రకాశికా వ్యాఖ్య

### ములుపాక బుచ్చయశాస్త్రి ప్రణీతము

క. శ్రీరమ్యకంఠ కంఠ, స్ఫారశ్రీవిజితశరదశరదరగిరిభి
త్పారదవార నిజోజ్జ్వల, గౌరాకార ద్యుకేశ కాశిపురీశా.

సీ. శ్రీమించు వైభవశ్రీయుతశ్రీదులు, పరమభోగాప్తిసుపర్వవరులు
సత్యభాషాహరిశ్చంద్రు లు సాహస, విక్రమార్కులు రణవిజయు లఖిల
విద్యల భోజులు వితరణకర్ణులు, నీతికావ్యులు మతినిర్జరేజ్యు
లవనిపాలనరాము లతిధైర్యహేమాద్రు, లతులప్రతాపాగ్ను లన్యకామి

తే. నీధనైకపరాఙ్ముఖుల్ నిఖిలధర్మ, పరులు నై కుంపిణీసార్వభౌము లలఘు
భరతఖండంబు నేకాతపత్రముగను, సరవిఁ బాలింపుచుండు నా సమయమునను.

తే. వారిలో నింగిలీషుసద్వంశవార్ధిఁ, బుట్టె దేవిడు విద్యావిభూతిగీష్ప
తిప్రభావుఁడు సకలదిగ్దేశవిదిత, విమలచరితుఁడు సతతసద్వృత్తిపరుఁడు.

సీ. అతనికిఁ బుట్టె సన్నుతదివ్యశుభమూర్తి, సకలలక్షణశాస్త్రచక్రవర్తి

[దీని ప్రతి మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకాగారమునఁ గలదు. సంఖ్య డి. 760. A Descriptive Catalogue of Telugu Manuscripts, Vol. II Prabandhas- Sringara Prabandhas Pages 1009-1113]

## విమర్శనలు

వసుచరిత్రకు పై వ్యాఖ్యానములేగాక, యధునాతన కాలమున పెక్కు విమర్శనలు కలవు. నవీనవిమర్శన పథకము ననుసరించి వసుచరిత్రముపై "మను వసు ప్రకాశిక"[1] అను విమర్శనము బయలువెడలినది. దానిపై "మను వసు ప్రకాశికా విమర్శన"[2] దాని కనుబంధములు రెండు బయలు వెడలినవి. ఈ విమర్శనముల ధోరణి సాహిత్యరంగము విడిచి పత్త్రికాశాస్త్రమువఱకుఁ బోయినది. మను చరిత్రము "మ" మాణిక్యమువంటిదనియు, "వ" వసుచరిత్రము వజ్రమువంటిదనియు, వీనిలో కాంతి గుణములచే, నొక్కదానికే ప్రాశస్త్యమనియు, నట్టిదృష్టితోనే మను, వసువులను విమర్శించుచు వివాదములు పెరిగినవి. ఈ విమర్శనములలో సాహితీవిమర్శనముకన్న వ్యక్తిగతవిమర్శనమే హెచ్చు. తరువాతి విమర్శనములలో కెల్ల మకుట మనఁదగినది, శాస్త్రీయమైన విమర్శన పద్ధతులపై వ్రాయఁబడినది 'వసుచరిత్రవిమర్శనము'; కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీయుత వఝ్ఝల చిన సీతారామశాస్త్రి ప్రణీతము, శ్రీ వావిళ్లవారిచేఁ బ్రకటితము (1915, 1927). వసుచరిత్రముగూర్చి, రామరాజభూషణునిగూర్చి యెఱుఁగఁగోరువారి కిది పెద్దకాణాచి. ఇట్లే శ్రీశాస్త్రులవారి 'హరిశ్చంద్రనలోపాఖ్యాన' పీఠిక (వావిళ్లవారి ముద్రణము) రామరాజభూషణకవి శ్లేష, ద్వ్యర్థికవితాసామర్థ్యము; సాహితీ విశిష్టత తెలిసికొనుటకేగాక నేటి యాంధ్రవాఙ్మయప్రపంచమున నత్యున్నతశ్రేణికిఁ జెందిన విమర్శన ములలో నొకటియై యున్నది.

## పిల్లవసుచరిత్రములు

వసుచరిత్ర తరువాతి ప్రబంధకవులకు, పండితులకు పరవడియైనది. తమ గ్రంథములను వసు చరిత్రకు ప్రతిబింబముగాఁ జేయలేకపోయినను, పుత్రికగానైన చేయుటకు కవు లభిలషించుచుండిరి. గనుపర్తి అబ్బయామాత్యుని పురూరవశ్చరిత్రము (క్రీ. శ. 1600), అడిదము సూరకవి కవిజన రంజనము (క్రీ. శ. 1760), అకలంకము కృష్ణకవి శకుంతలాపరిణయము (క్రీ. శ. 1800) పిల్ల వసుచరిత్ర లనిపించుకొనినవి. తిమ్మకవి రసికజనమనోభిరామమునకును కొంద టీ బిరుద మిచ్చిరి. ఇవి యన్నియు వసుచరిత్ర కాంధ్రవాఙ్మయమునఁ గలిగిన ప్రాశస్త్యమును చాటుచున్న వని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. సురభి మాధవరాయకవి చంద్రికాపరిణయము దీని ప్రతిబింబము.

శ్రీమద్రామాయణమునకు బాలరామాయణమువలె, భారత భాగవతములకు బాలభారత, బాల భాగవతములవలె, వసుచరిత్ర గురుస్థాన మాక్రమించిన పిదప లఘువసుచరిత్రము బయలువెడలినది. దాని వృత్తాంతము పూర్వోక్త 'వసుచరిత్రవిమర్శనము' ఆఱవ భాగమునఁ గలదు.

---

1. శ్రీ వెన్నేటి రామచంద్రరావుగారు.

2. విమర్శకాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

అను విద్వాంసుల విమర్శనము లా కాలమున "చింతామణి" "సరస్వతి" "మంజువాణి" పత్త్రికలలోఁ బ్రకటితములు.

ఇంతటితో గాలక, వసుచరిత్రమును లింగము వేంకటరాయమంత్రి క్రీ. శ. 1876 లో వసుగిరికాపరిణయ మను యక్షగానమును రచించియున్నాఁడు. అది ముద్రితమైనది. ఇవి యన్నియు రామరాజభూషణుని కీర్తిని దినదినప్రవర్ధమానము గావించునవియే గదా!

వసుచరిత్రము శబ్దశక్తి సంస్కృతాంధ్రభాషాశ్లేషపరిణతి చెందినదగుటమున ప్రౌఢవిద్వాంసుల పాండితిని పరీక్షించుట కిందలి పద్యములు నికషోపలములైనవని. ఇందు మూఁడవయాశ్వాసము 101 వ పద్యమగు.

శా. ఆ తన్వంగి యనంగరుఙ్మాంకరణవజ్ర్యాము క్తచూతాస్త్రని
ర్ఘాతం బోర్వక తమ్ములంచుఁ దటినీగర్భ ప్రసంజాతకం
జాతవ్రాతముమాటుఁ జెంద నవి యేచన్ సాగ ముమ్మున్నగాఁ
జ్ఞాతి శ్చే దనలేన కి మ్మనెడి యాచారూఢి సత్యంబు గన్.

అనుదానిని తమ్ములు అను శబ్దములోని స్వారస్యము వచ్చునట్లుగా అనువాదముచేయ బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరకవిగారిని (1833-1897) బొబ్బిలివలస జమీనుదారగు శ్రీయినుగంటి సీతారామప్రభువర్యుఁడు కోరెనఁట. వారిట్లు సంస్కృతీకరించిరి.

శ్లో. సా ఽసహ్యాస్మరరుఙ్ముక్తి నూత్నయగుణోన్ముక్తామ్రబాణక్షతిం
తన్వీ సారసజాతి రిత్యపధృతా పద్మాటవీ మాశ్రితా,
సా సింధోదరసంభవాఽపి పురత స్తద్బాధనే నోద్యతా
జ్ఞాతిశ్చే దనలేన కిం త్వితి వచ స్సత్యం యథా స్యా త్తథా.

(అభినవాంధ్రకవితాపితామహుని కవితావినోదములు. భారతి 1932 సం. 9, పుట 462)

ఇదియే, విజయనగరసంస్థానపండితులు విద్వద్గజకంఠీరవులు శ్రీముడుంబ నరసింహాచార్యులవారి కొసగఁగా వా రిట్లు సంస్కృతభాష ననువదించిరి—

శ్లో. తన్వంగీ కుసుమాస్త్రరుఙ్మాంకరణవజ్ర్యాఘాతగూతాశుగా
భీతా కిం శరణం భవే దిహ మమే త్యాలోచనా వ్యాంజసే,
సా కంజాత మవేక్ష్య పద్మ మభజ త్తద్బాధతే హంత తాం
జ్ఞాతిశ్చే దనలేన కిం వచ ఇదం స్వార్థా త్కృతం ప్రస్ఫులేత్.

(శ్రీ ముడుంబ నరసింహాచార్యజీవితము భారతి - 1930. ఏప్రిలు సం. 7. పుట 642.)

వసుచరిత్రమున నీ క్రింది పద్యము, రామరాజభూషణుడు నంది తిమ్మనవద్ద 3 వేల రూప్యములకుఁ గొని, తన కావ్యమునఁ జేర్చుకొనె నని యొక కథ గలదు. అది కేవలము కల్పిత మని, దాని మూలసంస్కృతశ్లోకమునుబట్టి తెలియఁగలదు.

శా. నానాసూనవితానవాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపంబంది యో
షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్.

దీని మూలశ్లోకము—

భృంగానవాప్తిప్రతిపన్నఖేదా కృత్వా వనే గంధఫలీ తపో౽లమ్,
తన్నాసికా౽భూ దనుభూతగంధా స్వపార్శ్వనేత్రీకృతభృంగసేవ్యా.

ఈ శ్లోకము విద్యానాథమహాకవి యని ప్రసిద్ధిగన్న అగస్త్యుని నలకీర్తికౌముదియందుఁ గల దని బ్రహ్మశ్రీయుత వెంప్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గ్రంథమునందు లభించిన రెండు సర్గల సాంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ప్రకటించుచు వ్రాసినారు. రామరాజభూషణుఁడు దీనిని చూచియే పద్యము వ్రాసియుండును. ఇట్లే వసుచరిత్రమున శాకుంతలాదినాటకములలోని శ్లోకములకు భాషాంతరీకరణము కానవగును.

రామరాజభూషణకవి బాల్యమున నల్లసాని పెద్దనామాత్యుని శిష్యుఁడై, రాయల కవితాగోష్ఠీవిలాసములను గ్రహించినాఁడు. తన గురువుగారు కవిత్వ మిట్లుండవలె నని ("పూత మెఱుంగులున్...") ఉత్పలమాలిక 24 చరణములు చెప్పఁగా, తాను కవిత్వ మిట్లే యుండవలె నని ("లొట్ట యిదేటిమాట...") మాలికను తత్క్షణము చెప్పెను. అంతకు ముందు ఉత్పలములు పంచపాదులేగాని మాలికారూపమున లేకపోవుటచే నీ మొదటి రెండింటికి ఖ్యాతి వచ్చినది. దీనినిబట్టి రామరాజభూషణకవి బాల్యమునుండి యసమానమైన కవితాధార గలఁడని తెలియుచున్నది. తరువాత దీని ననుసరించి కవులు మాలికలు వ్రాయఁజొచ్చిరి.

కవి, చిత్రకారునికన్న మిన్నయని రామరాజ భూషణుఁడు మహాసమర్థతతో నిరూపించినాఁడు. ఈ క్రింది పద్యమున శుక్తిమతీనది స్త్రీవలె సంభ్రమముతో వచ్చుచున్నట్లుగా శ్లేషలో నద్భుతభంగిని చెప్పినాఁడు —

ఉ. వేణి చలింప కంపితనవీనమృణాలభుజాగ్రకంకణ
శ్రేణి నటింప లోలశఫరీనిబిరీసకటాక్షకాంతి వి
న్నాణము చూప హంసకగణస్వననంబును మీఱ సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖశోభితయై కడు సంభ్రమించుచున్. (2 ఆ. 237 ప.)

దీనిని రవివర్మ గంగావతరణముతోఁ బోల్చిన, చిత్రకారుఁ డెట్లు కృతార్థుఁడు కాలేక పోయెనో తెలియవచ్చును.

పద్యమున శ్లేషచే మనకు స్త్రీ మనోనేత్రముల కగపడుచున్నది. ప్రకృతిలో కన్నుల కగుపడునది నదియే. రవివర్మ ఆకాశగంగ యవతరించుట చిత్రించఁబోయి, గంగవచ్చునట్లు కొన్నిగీతల మూలమునఁ దెలిపి, యావెనుక వానిమధ్య నొక స్త్రీ చిత్రమును లిఖించినాఁడు. దీనివలన అతని యాశయము భగ్నమైనది. ఏలయనఁగాఁ బ్రకృతిలో గంగ స్త్రీరూపమున లేదుకదా! రామరాజభూషణుని చిత్రము మనస్సును హత్తుకొని యద్వితీయముగ నున్నది.

శ్లేషవలన భాషయందలి శబ్దస్వరూప పరిణామ మెఱుంగుటకు సాధ్యమగును. వసుచరిత్రయందలి శ్లేషాను ప్రాసాదులయందు మార్పరాని ప్రయోగములకు నిటీవల వ్యాకరణములయందు ప్రత్యేక నిర్ణయము చేయవలసివచ్చినది. మఱియు నప్పకవి వసుచరిత్రనుండి పద్యము లుదాహరింపకపోఁగా, కూచిమంచి తిమ్మకవి యందుండి 30 పద్యములను లక్ష్యముగా గ్రహించినాఁడు.

ఈ క్రిందివి వ్యాకరణములో వసుచరిత్ర ప్రయోగములకు ప్రత్యేకనిర్ణయము చేయఁబడినవి.

| | | |
|---|---|---|
| ముసలిమూసులు | 1-45 | ముసలిమ్రాకులు—అచ్ఛి. సూ. 18 |
| కావుకావనువారి | 1-56 | కావుకావుమని—సంధి. 47 |
| కన్గోఁజాలక | 2-41, 4-136 | కన్గొనజాలక—క్రియా. 60 |
| మనమరాలు | 5-35 | మనుమరాలు—శబ్దర. |
| వసు—D | | |

ననుమని సుఖాన్వితుండై మనుమని దీవించె-అనిరుద్ధ 5 ఆ. ననుమ శబ్దము నానుష్టము.

కాని "మన్మఁడు" అని ఉత్వలోపరూపము గలదు.

మఱి లోకోత్తరుఁడైన యంగిరసు మన్మండు—నన్నయ.

దీనివలన మనమఁడు మనమరాలు నేర్పడును.

ఇవి యమక శ్లేషానుప్రాసాదులచే మార్పరానివై యున్నవి.

| | | | |
|---|---|---|---|
| డించగనే | దీపించమి | చాలించరాదె | పెంచను |
| 6-12 | 6-82 | 6-94 | 6-56 పద్యాలు చూడను. |

బాల, క్రియా సూ. 88.

కొమ్మంచుక్ 6-65, అమ్మని 6-80 } సంధి. 4 సూ.

తత్సమసంధి—

అర్చిడగరాదు 3-180.

సాంస్కృతిక గసడదవాదేశము—

పెంపువరీక్షింపమె 3-6.

పూవుంబోడి 3-183 బా. సూ. 23 సూత్రముచే నిచట పూర్ణానుస్వారము రాదు.

చిగురుంబోడి కళాపూర్ణోదయము.

హరిమైసాది శిరంబునన్ 1-69.

చిగురుగొమ్మం జేవగానుండునే—సముచ్చయలోపము.

బాలింగిలియు. నిర్వ. మురారిం జేరపేడిమ్మైయిక్ ఉ. హరి.

వాలియు (మురారియు)

శ్లేషసఖండ నిర్బింద్వో స్త్రైశసం సత్ర చిన్మతం—

సొలసి తటిల్లతాంగి 3-67

చేఁగల-చేకల ఒక యర్థమున సార్థానుస్వారము ఒక యర్థమున నిరనుస్వారము.

రామరాజభూషణుఁడే కులజుఁడైన నాంధ్రమహాజనుల కెల్ల పూజ్యుఁడు. అతని ప్రబంధ మాంధ్రవాఙ్మయము నిలుచునంతవఱకు నిలుచును. నేఁడు నవీనవిమర్శపథకము ననుసరించి ఇందు జీవకళాసృష్టి లేదనుట సరికాదు. ప్రాచీనాంధ్ర సాహిత్యమును పునరుద్ధరించుటకుఁ బ్రయత్నములు జరుగుచున్న నేఁటికాలమున బహుముఖములుగా నీగ్రంథమును పరీక్షింపవలసియున్నది. వసుచరిత్రను చదివి, ఆనందించుటకు నొకవిధమగు సంస్కారము, ప్రతిభ యుండవలెను. అవి లేనిచో నా గ్రంథవిమర్శనమునకు మన మధికారులము కానేరము. దీని నెంత పొగడినను తనివి తీరదు. ఇంతటినుండియైన నీ గ్రంథమును బఠించి, యుత్తమసాహితీపద్ధతుల నేర్చిన, నీ రచన ఫలవంత మగును.

ఇట్లు,

నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.

# అనుబంధము 1

## వసుచరిత్ర - సంస్కృతము

ప్రారంభము—

శ్లో. కల్యాణ మావహతు నః కరిరాజవక్త్రో బ్రహ్మాండ పాదపటకో గలిపద్మ పాదః,
పాదో ధిబృందపమధుః పరమేశభాగ్యం తారాసమం హి సుమన స్తబకీకృతేందుః.

గద్యవాక్యాని—

అథ నిరతిశయశైశవయేవ యో మహనీయో రుచిభిః ఫలమోహారుచిభిశ్చ తరుణతరుణీకబలన సమృద్ధిం దర్శయామాస.

సీ. తరుణార్కకబళనోద్ధతిఁ జూపె నెవ్వఁడు
రుచులచే ఫలమోహరుచులచేత.

శ్లో. వాల్మీకి పారాశరి కాళిదాస దండి ప్రహృష్యద్భవభూతి మాఘాన్,
బిల్హణ మయూరం బాణం విం చ మహాకవీంద్రాన్ మనసా భజే తాన్.

శ్లో. సంత్యక్తవృత్తినియమాం సఖిలా స్తథాన్యా మన్యార్థపంచనపరా మతిమూర్ఖసంద్యామ్,
ఉత్ప్రేక్షనీం కుకవితా ముపరిప్లవార్థం ధీరోత్తమా న గణయంతి ధృతానుభావాః.

శా. భావం బెక్కడలేక, వృత్తనియమాపాయంబుఁ గాంతింప కెం
డే ఘట్టించి, పరార్థసంచలనచే గీసించి, పూర్ణాళి సం
భావింపం గని విప్రణీతకృతి సామాన్యాకృతిం బూని పై
పై పన్నెల్ పచరింప దానిఁ దిలకింపంబోరు ధీరోత్తముల్.

శ్లో. నాళ్ళీనన ప్రథితకుండలివల్లభ శ్రీ నాథేషు నద్ధజనాస్థితి పాలనేషు,
సోమే చ శోభయతి భాస్కరనామ్ని చాంధ్రకావ్యప్రపంచమహిమాసహిమానసీయాః.

మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలుగింపన్ సొంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

శ్లో. సవిధసమ్ముఖసాపయపస్ఫురద్విభిధమందకలావిధిప్తపతమ్,
ద్విపరాజముఖాంకృతగౌరవం పరపరాజగురుం వరదం భజే.

శ్లో. శ్రీదక్షిణామూర్త్యవతారాపతారం శ్రీకంఠభాష్యాంబుధిపూర్ణచంద్రమ్,
అత్యాపరాదప్పయదీక్షితేంద్రం విద్యాగురుం మంత్రగురుం భజామి.

శ్లో. వ్యాఘ్రోపచార మఖిలం వివిధోపచారలాతాగణాలిమతిలోలవితానపాలిమ్,
మత్పాదయో రపి పదా మహితాల్పతాం యః శ్రీకాళహస్తినిలయం శివ మాశ్రయే తమ్.

శ్లో. కామాక్షీ దేవి కరుణామయి కామకోటికాంచీపురేశ్వరి కదంబవనీనివాసే,
కాపైకచూతపతినా కలితా పథానా పర్ణామృతం కలయ కావ్య మిదం మదీయమ్.

ఇతి పీఠికా సమాప్తా—

శ్లో. వసుప్రభు ర్యాగవధారణీత్యా కోలాహలక్ష్మాభృ త్సముపాగతేన గానేన,
గీతోజ్జ్వలాయాం గిరిజాభిధాయాం కల్యాణశాలీతి కథా ప్రసక్తా పుణ్యా.

శ్లో. గానం క్షితౌ గాయనగాయనీనాం, నాకే త్రిశంకో ర్నారదగానగాతే
నాకేప్యనిన్గీతినయోనుసర్వ, మానంద బృందావనమానసైః.
నానాగాయన గాయనీమణులు గానం బుర్వి నాలింపనో
నానాట న్నగభేది పీటంగల గంధర్వాప్సరోగీత వి
ద్యానైపుణ్యము లెన్నియేని వినమో యంత్రాన నీరాత్రాన విం
తైర నాదం బొసంగు నర్చునే మదికి నిత్యానందసందోహముల్. 2-16.
జీవనమెల్ల సత్కవి నిషేవితమాయ యెల్ల స్వచ్ఛతా
పావనతా గభీరతలపట్టు ప్రసారము లెల్ల విశ్వధా
త్రీవలయత్రికాలఫలదేశికముల్, నవకంబులెల్ల ము
క్తావళి విభ్రమాస్పదము లానది పెంపు నుతింప శక్యమే. 2-105

శ్లో. యజ్జీవనం కవి వినోది యదంతరంగ, మచ్ఛం గభీరమపి పావనమర్థదాయి
ధాత్రీత్రికాలఫలదాగతయోయదీయా, ముక్తాళి విభ్రమ భరాపి యదద్భుతీలాః.
తెనుగునందువలె సంస్కృతమున నిది యాశ్వాసాంతములు.
నానాసూన వితాన వాసనల - అనుపద్యమునకు సంస్కృతము.
సారంగస్సకలప్రసూనకులకీ సర్వాత్మనోపేక్షతే
మామిత్యేవ విచింత్య గంధఫలికా మాన్యాతపః స్వాశ్రితా
నాసాకార ముపేత్య సర్వసుమనస్సౌరభ్య భోగాద్వధూ
చంచద్వీక్షణ చంచరీక పటలీం సంప్రాప కిం పార్శ్వయోః.

గ్రంథాంతమున—

శ్లో. కామాక్షి దేవి కరుణామయి కామకోటి కాంచీపురేశ్వరి కదంబవనీనివాసే,
కాంత్యైకచూతపతినా కలితావధానా కర్ణామృతం కలయ కావ్య మిదం మదీయమ్.
శ్లో. కామాక్షి దేవి కరుణాం మయి పూరయిత్వా కాంత్యైకచూతపతినా కవితానుమోదా,
కాంతం సువర్ణఘనవృత్త మలంకృతాఢ్యం కర్ణోచితం కలయ కావ్య మిదం మదీయమ్.

గద్య. ఇతి శ్రీ కామాక్షీదాసకాళహస్తికవికృతౌ వసుచరిత్రచంపూకావ్యే షష్ఠాశ్వాసః.
వసుచరిత్రచంపూకావ్యం సంపూర్ణమ్.

[వసుచరిత్రసంస్కృతగ్రంథము తంజావూరిలోని శరభోజీసరస్వతీభవనభాండారమునం గలదు. దీనికి రెండు ప్రతులు గలవు. తెలుగులిపితో తాళపత్రప్రతియు, నాగరలిపిలో కాకితపుప్రతియుం గలవు. ఇవి రెండును మంచిస్థితియం దున్నవి. ఈ గ్రంథ మముద్రితము. తంజావూరి పుస్తకాలయ గ్రంథసంఖ్య 4146-4147. దీని వివరణము తంజావూరి సంస్కృతగ్రంథముల సూచికా సంపుటములలో 7 వ సంపుటమగు కావ్యసంపుటమున 3150 పుటనుండి 3153 పుటవఱకును గలదు.]

## వసుమంగళనాటకము

వసుచరిత్ర చంపువుగనే కాక నాటకముగఁ గూడ సంస్కృతమున వెలసినది. ఇదియు నముద్రితమే. దీనికి వ్యాఖ్యానముతోఁగూడ మూఁడు ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకశాలలోఁ గలవు. దీని రచించిన కవి పేరుసూరి. ఈతఁడు శ్రీధరవంశ్యుఁడు. కౌశిక గోత్రుఁడు. వేంకటపండితుని పుత్త్రుఁడు. పేరుసూరి పౌత్రుఁడు. ఈతని తల్లి వేంకమాంబ. గౌతమగోత్రజుఁడైన అన్నాధ్వరి కూఁతురు. ఈతఁ డీ వసుచరిత్రనాటకమునే కాక సంస్కృతమున రామచంద్రవిజయము, భరతాభ్యుదయము, చకోరసందేశము, వేంకటభూషణము మున్నగునవి రచించెను. ఈతఁడు ఈ వసుమంగళ నాటకమును మధురలో శ్రీమీనాక్షీ సుందరేశ్వరుల వివాహసందర్భమున రచించియుండుటచే, నీతఁడు దాక్షిణాత్యుఁడైన తెలుఁగుకవి యని చెప్పనొప్పును. ఈతని శైలిని చూపుటకు నాందీశ్లోకము నుదాహరించుచున్నాను—

శ్లో. అష్టాభిః స్వకలాభి రేష రమణీయాభి రాపాదితా
ముష్యద్రత్నఘటీవినిస్సృతమణీధారాభిషేకశ్రియమ్,
కోటీరోపరి మానయన్ ప్రణయినీరాగ ప్రణాళీమివ
స్తోమః కశ్చి దుదేతు మంగళపరిష్వంగానుషంగాయ నః.

[ప్రాచ్యలిఖిత పుస్తకశాల సంస్కృత గ్రంథసూచి సంపుటము 11. గ్రంథ సంఖ్య 12659 60-61.]

ఈ సంస్కృతనాటకమునకు, తెలుఁగునాటకమునకుఁ గల సంబంధమునుగూర్చి కీ. శే॥ శ్రీ క్రొత్తపల్లి సూర్యారావుగారు 1922 ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము లో వివరించియున్నారు.

Page 28

(చూ. సీ॥ వలుదగుబ్బలు..................

8. ఎడుత్తయాళ్ కుడుపార్ కొళియునై త్తనంగళిందిడప్పదలిహాడమక్కట్
తడుప్పరు మిరాగ మంగులి యుదవత్తాళమాయ్ కావళై యొలిప్ప
అడుత్త చేతనము మచేతన మాహ వచేతనంచేతన మాహ
కొడుత్తిడు మొరుపణ్ణిశైత్తదళ్ పుడైశూళ్ కోడైయర్ పూరై యొత్తరైప్ప ||

(చూ. శా. మహిళామండల..................)

9. తున్నువైంకొడియన్ శెన్నిత్తూయపద మలరుదిర్తుం
ఉన్నరుందళిరిల్ మేయ వురువినై ప్పిడిత్తలెత్తుం
మన్నుకోకనకకణ్ణార్ తోట్టినై మలైత్తుం తెన్రల్
ఎన్నుమామత్తిల్ వందానికైయులా విడినే యాహి||

Page 29 — 19 వ సంతప్పటలం॥

(మా. శా. భూనాథాగ్రణి..................)

10. నరపతి తనక్కుం యిన్బనారిక్కుం బోగాంతత్తిల్
విరివురు బ్రమ్మానంద మేవియ తవిత్తై యిన్రాయ్ప్
పెరుదియకరణబంద మిన్నైయాయ్ప్పె శోణాదా
యుఱైదరి నహావరుత్త మొళిందదాయ్ మిహావిళంగకా మీట్చిప్పటలం ||

[ఈ తమిళవసుచరిత్రవృత్తాంతము తొలుత తెలుగులోకమున కెఱుకపఱచినవారు శ్రీ మా. రామకృష్ణకవిగారు. వీరు 1914 లో దీని నెఱుకపఱచి, 1942 వ సంవత్సరమున శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యా పత్రికయందు (Journal of Sri Venkateswara Oriental Institute, Tirupati, Vol. III, No. 2. పుటలు 25-30) పూర్తిగఁ దెలిపియుండిరి. పైని వివరించిన పం దుండియే గ్రహింపఁబడినవి.]

•

# అనుబంధము 3

## వసుచరిత్ర - ఇంగ్లీషు

### BHATTUMURTI

This poet was born in a village called Bhattu Palle, in the district of Pulvendala, in Ceded Districts. He was a distinguished orator, and possessed a critical knowledge of the Sanskrit and Telugu dialects. As the poets of his time were greatly patronized by the sovereigns of various provinces, Bhattu Murti chiefly confined his labours to versification in the vernacular tongue, and the harmony of his numbers was so much admired that he obtained a great many scholars whom he made proficient in prosody. He, in course of time, proceeded to the court of Krishna Raja, who admiring his talents, retained him as one of his eight celebrated bards; during the life-time of this monarch he composed an epic poem entitled "*Narasabhupaliyam*", or the History of Narasabhupala, which was a work of great labour and much admired by his contemporaries, and by posterity. After the death of Krishna Rayalu, he wrote another epic poem called "*Vasoocharitra*" subject of which is the love and nuptials of King Vasoo and the beautiful nymph, Gerckanica; the work was dedicated to King Tirumala, and the invocation of the poem commences in the following manner:—

"The earth-born Seta viewed with grace replete
Her beauteous form reflected near her feet.
By brilliant gems that each with various shade
And plastic pow'r, a graceful maid portray'd;
She, Rama's consort and betrothed wife
Conceived, a new creation sprung to life,
Touch'd by the dust of her lord's potent foot;
Till he remov'd the Goddess anxious doubt.
Then in the nuptial rites and holy band,
He grasp'd the jewels in his heav'nly hand
May Seta's husband blessings e'er bestow
On Terumala Raya's royal brow
With moonlike face from which each science gleams,
With ruby lips replete with sacchrine streams,

From which the boon of latent wishes flow,
And which rich fruits effectually bestow;
With nectar-vased breasts as pure as truth,
Abundant source of wealth and blooming youth,
With arms like tendrils that in shadowy bow'rs,
Is decked in beauty of unfading flow'rs;
Sri was produced when Rama's efforts tried,
In Janaka's lactious ocean wide,
He, Heris self while fiercely bending low,
Bent the tough string to Iswara's mountain bow,
May that bright Goddess choicest blessings bring
To Terumala Raya, peerless king.

The sister arts that yield harmonious sound,
In music and in poesy are found,
The dulcet component of tunes and verse,
Each with her charms th' enraptur'd soul immerse,
And whirl'd in circling eddies round and clear,
Like Saraswati's fragrant breasts appear;
May he who can (of lawful love the tests)
Grasp with his palms those luscious budding breasts.
And in love's despot mark them as his own
By no ignoble puncture plainly shown
May that Divinity his pow'rs select
And Terumala mighty king protect.

The alphabet that like a rosary seems
By her lute's melody soon melt in streams
And all round reflect fair Vani's face
As God supreme pervading time and space.
May she the gift of eloquence confer
On Terumala king without compeer.

Arria with jealous rage possessed
To her great consort his reproach addressed
Well! well! Thou faithless to my marriage bed
Mandakini, thou keepest on thy head
Whilst I, alas! am dwindl'd half way
The God prostrating then began to pray.
I appease her ire by humbly bending low
But Ganga waxing wrath did clamorous grow
Till Sumbhu tied his hair, this pretext sage

The Goddess silenced and restrained her rage
May that great being in a bounteous show'r
On Torumala all his mercies pour.
On either side with fragrant braided hair
Like dusky clouds that float in ambient air
With ornamental symbols on each side
Of full blown shining in their beauties' pride
With flaming eyes that dart her splendours clear,
And snake ring pendants that adorn each ear,
With necklaces whose light illumes each land
And graceful camalas in either hand,
With robes of diverse hues and powder rare
Of Ruthi's Lord, a drug beyond compare
Thus decked the mountain born half of her lord
Does in each essence to her mate accord
May she bestow on Torumala Roy
Victorious battle and triumphant joy.

While he with mighty tusks resistless strook
The mountain huge Ragutasara shook
Then graceful Gowri with inconscious start
Embraced Sri Kuntha to her throbbing heart,
While Ganga o'er great Siva's brow
In falling streams is dashed on earth below;
The mountain-born is pleased with feats now done
By her own elephantine faced son
To that prescient God, whose name I take
With holy awe obeisance I make.

The following lines are taken from the second book of the same poem, and are supposed to be spoken by Manjuvani when she was deputed by her mistress Gorokanika to Vasoo Rajah.

Oh ruler of the world, thy presence bright
Fills each expanding heart with true delight
And joy; as when propitious fortune pours
Unmeasured treasures down in Golden show'rs
Or when the moon in plenitude array'd
Shoots her bright splendours through the midnight shade
Friend of the world! Oh pow'rful deity!
The effulgence of thy penetrating eye
Dispels the darkness and the gloom profound

Whose sable mantle covers us around
Thy graceful presence this auspicious day
Of King of Kings, exiles each, care away!
With every keen desire and wish possessed
Fill'd to satiety we stand confessed,
Oh! sov'reign of the Earth! thy heav'nly tread
Approaching doth with potent blessing shed
On mortals immortality and grace
And makes our wisdom match th' ethereal race
Pre-eminent in good thy virtue pours
Like fruitful autumn its prolific stores;
Whilst we our homage pay we gain these thrifts
The rural Goddess sheds her choicest gifts
Exuberent to me and to my friends; with joy
In plenty we our happy hours employ,
We can the grateful voice sufficient raise
Receive the boon and give eternal praise?

The foregoing poem of the Vasucharitra was much admired by the contemporaries of Bhattu Murti, and became a model for after poets who composed in the Telugu language. Bhattu Murti was highly rewarded by Terumala Raya for this and other works that he composed at the command of that monarch so that he passed his days in peace and happiness until his death which happened at his residence in the sixtieth year of his age.

[This is an extract from "Biographical Sketches of Deccan Poets" written by Cavelly Venkataramaswami, late Head Translator and Pandit in the literary and Antiquarian Depirtment at Calcutta. Printed in 1829. (Reprinted in Madras 1888) N. VENKATA RAO.]

శ్రీరస్తు.

# వసుచరిత్రము, సవ్యాఖ్యానము

## ప్రథమాశ్వాసము



భూపుత్త్రి వివాహవేళ నిజమంజీరాగ్రరత్న స్వలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవకన్యాలీల యంచు న్మదిం
దా భావింప శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గప్పు సీ
తాభామాపతి ప్రోవుతం దిరుమలేంద్రశ్రీమహారాయనిన్. 1

అవతారిక:—పవననందనకరుణాసమాసాదిత సంస్కృతాంధ్రకవితాసామ్రాజ్యధురంధరుండును సంగీతసాహిత్యవిదుండును నగు రామరాజభూషణమహాకవి "శ్లో. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే" అను కావ్యప్రకాశకారుని అలంకారవచనప్రమాణానుసారముగ సమసఫలసాధనభూతమగు నని తలంచి 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అను నియమము నసత్కావ్యవిషయ మని గ్రహించి వసుచరిత్రమను లోకోత్తరశృంగారకావ్యరత్నము రచింప నుద్యోగించి "ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపి తన్ముఖం" అను నాచార్యదండి వాక్యానుసారముగఁ గావ్యారంభము ఆశీర్వాదరూపముగనైనను, నమస్కారరూపముగనైనను, వస్తునిర్దేశరూపముగనైనను గావచ్చునుగాన నాశీర్వాదరూపముగ నీవిధముగ గ్రంథారంభముఁ గావించెను.

శ్రీ=లక్ష్మీస్వరూపురాలైన, భూపుత్త్రి=పుడమికూఁతురైన సీతాదేవి, 'శ్రీరూపా భూపుత్త్రీ శ్రీభూపుత్త్రీ' అని సమాసము. (శ్లో. 'రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణోరేషాఽనపాయినీ' అను ప్రమాణముచేత లక్ష్మికి సీతాత్వము) వివాహవేళన్=పెండ్లికాలమందు, అనఁగా వరుఁడును దాను నొక్కచోఁ గూర్చున్నసమయమం దనుట. నిజ=తనసంబంధమైన, మంజీర=అందెయొక్క, ని. 'పాదాఙ్గదం తులాకోటి ర్మఞ్జీరో నూపురోఽస్త్రియామ్, హంసకః పాదకటకః' అని యమరము. అగ్రరత్న=శ్రేష్ఠమైన రత్నమందుఁగల, అనఁగా ముఖమణియందుఁ గలయనుట. ని. 'పరార్ధ్యాగ్రప్రాగ్రహరప్రాగ్ర్యాగ్ర్యాగ్రీయమగ్రియమ్' అని యమరము. స్వలీలా=స్వకీయమైన విలాసాకృతియొక్క, అభివ్యక్తిన్=ప్రతిబింబమును, తనమంజీరాగ్రరత్నమందుఁ బ్రతిబింబించిన తనస్వరూపము నని యర్థము. ఇక్కడ లీలాశబ్ద మాకారపరము. వర=పెనిమిటియైన శ్రీరామమూర్తియొక్క, అంఘ్రిరేణు=పాదధూళివలన, భవ=పుట్టిన, కన్యా=కన్నియయొక్క, లీలయంచున్=విలాస మని. ఇక్కడ లీలాశబ్దము విలాసపరము. ని. 'లీలావిలాసక్రియయోః' అని అ. శ్రీరాములపాదరేణుస్పర్శముచేతఁ బాషాణము అహల్యాదేవిరూపమును వహించెఁ గావున మంజీరాగ్రరత్నంబును బాషాణజాతి యగుటంబట్టి తత్పాదరేణుస్పర్శముచేత స్త్రీరూపమును వహించెనో యని యాశయము. మదిం దా భావింపన్, మనస్సునఁ దా నూహింపఁగా, శుభక్రమాకలనచేన్=

శుభ=పెండ్లికాలమందలి, క్రమ=పాదవిన్యాసమునందు, [illegible] తద్రత్నముకా=ఆమణిని, కప్పు=మఱుఁగుచేయునట్టి, సీతాభామాపతి=సీతాదేవి నాయకుఁడైన శ్రీరామస్వామి, తిరుమలేంద్ర శ్రీమహారాయనికా=తిరుమలదేవరాయక్షితిపతికి, [illegible] అని కృతిపతి కాశీర్వచనము.

సీతాదేవి తనవివాహకాలమునందుఁ దనయందియమునందుఁగల రత్నమునందు ప్రతిఫలించిన శ్రీరాముని పాదస్పర్శనమువలన మంజీరరత్నము స్త్రీరూపము దాల్చి [illegible] వచ్చుచున్నదని తలంపఁగా సన్నెకల్లుఁ ద్రొక్కించు నెపముచే మంజీరరత్నప్రతిబింబమును [illegible] పఱచి సీతాదేవి భ్రాంతిని బోఁగొట్టిన శ్రీరామచంద్రుఁడు కృతికర్తయగు తిరుమలరాయ ప్రభువునకు సమస్తైశ్వర్యములు ప్రసాదించుఁగాత మని తాత్పర్యము.

ఇక్కడ వివాహవేళ యనఁగా సన్నెకల్లు ద్రొక్కించువేళ, క్రమ మనఁగాఁ బాదవిక్షేపము 'క్రము పాదవిక్షేపే' అని ధాతువు.

విద్వజ్జనరంజని యనువ్యాఖ్యానములో సోమకవి క్రము పాదవిక్షేపమను [illegible] సన్నెకల్లు త్రొక్కించుట యనుమిషచే రాముఁడు రత్నము మాటుపఱచెననుట [illegible], సన్నెకల్లు ద్రొక్కుతఱి సీత నిలచియుండవలెను గానఁ బ్రతిబింబము [illegible], శుభక్రమాకల నమునకు శుభపాదవిక్షేపణము నర్థము చెప్పినయెడల "క్లిష్టంత దావగతి [illegible]" అను లక్షణానుసారముగాఁ గ్లిష్టనామకదోషము ప్రాప్తించు నని [illegible] కలనమనియే వ్రాసియుండుననియు వారొని శుభక్రమాకలనమునకు శుభలీల యను నర్థము వ్రాసి యున్నాఁడు కాని శుభ, క్రమ, ఆకల మను మూఁడుశబ్దముల కర్థము వదలి శుభలీల యనుట [illegible] ప్రాయము కాఁజాలదు. క్రమమనఁ బాదవిక్షేపమనుట ప్రయోగరూఢమగుట చేఁ గ్లిష్టనామదోష మున కిట నవకాశము కానరాదుగానఁ బదక్రమాకలన మనవలసిన యవసరము కానరాదు. సీత భ్రాంతిని విస్తరించి వర్ణించినటుల రాముఁడు గావించిన భ్రాంతినివారణమును విస్తరించి వర్ణించుట [illegible] శ్యకముగావున సన్నెకల్లు త్రొక్కించుట యిట ననుకూలముగ నున్నది. వివాహవేళ [illegible] మంజీరస్థప్రతిబింబము సన్నెకల్లు త్రొక్కుటకు వివాహణనంతరము సాఁచినపుడును సన్నెకల్లు త్రొక్కనపుడును మఱుఁగుపఱచె ననుటలో సరసము గలదు. అపుడు శంక - నంరానివారణము [illegible] జెప్పినటు లగును. కావున నిప్పట్టఁ బూర్వాధునిక వ్యాఖ్యాతలమతమే సోమకవి మతముకంటె [illegible] నీయము.

"ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా, వికాయత్తోఽనుకూలస్స్యాత్" [illegible] ణము వలన భర్తృలాలితయై ప్రణయకోపము నుజ్జగించిన సీతాసాధ్వి స్వాధీనపతిక యనియు, [illegible] వ్రతుఁడును వికాయత్తుఁడునగు శ్రీరామచంద్రమూర్తి అనుకూలనాయకుఁ డనియు తెలియఁ దగు.

ప్రతిభాశాలియగు రామరాజభూషణుఁ డీపద్యమునఁ గథాసూచనము [illegible] మంజీరాగ్రరత్నమునందలి ప్రతిఫలమువలన శుక్తిమతి కోలాహలుల కలయికవలనఁ గలిగిన గిరి [illegible] ప్రకారమును, సన్నెకల్లు త్రొక్కించుటఁ దెలుపు శుభక్రమాకలనమువలన వసురాజు కోలాహలుని గోటితో మీటుట్లయు సువ్యక్తము లగుచున్నవి. ఇదియే కావ్యార్థసూచన మనఁబడును. సీత [illegible]

కళ్యాణావసరము ప్రకృతపద్యమునఁ బ్రస్తావిత మగుటచేఁ గృతిభర్తయగు తిరుమలరాయునికి సమస్త శుభప్రాప్తి యగుననియు సీతారాముల ప్రణయకోపము క్షణములో నుపాయాంతరముచే విచ్ఛిన్న మైనట్టుల తిరుమలరాయనిరాజ్యమునఁ దోఁచు సామాన్యారిష్టములు తొలఁగి శుభప్రాప్తి యగు ననియుఁ గవి యాశయము. రాముని గూర్చియుండక సీతాభామాపతి యనుటవలనను ఇందు సీతకుఁ బ్రాముఖ్య మొసంగఁ బడుటవలనను సీతాపురుషకార మిట సూచితము.

కావ్యారంభమున శ్రీకారను శుభదాయక మనుట కీక్రిందిపద్యములు ప్రమాణములు కాఁగలవు.

తే. "వేదములకెల్ల నోంకార మాదియైన, కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది
కానఁ గవివరు లెల్లను దానిఁ దక్క, నితరవర్ణంబు లిడరు సత్కృతుల మొదల."

క. పదపడి శ్రీకారము కృతి, మొదల నిలచి దోషపుంజము లడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును, గదిసి సువర్ణంబు సేయుకరణిన్ ధరణిన్.

ఈ పద్యమున మొదటిచరణమందు మంజీరశబ్దమునకు, 'మఞ్జురుచ్యమీరయతీతిమఞ్జీరః' అని వ్యుత్పత్తి వివారింపవలయును 'మంజు ఈరయతి' యన్నచోట 'ఇకోయణచి' అను పాణినిసూత్రమును బట్టి మంజుశబ్దపు టంతనున్న యుకారమునకు వకారము ప్రాప్తింపఁగా మంజీరశబ్దము శకంధ్వాదిగణ ములోనిది గనుక, 'శకన్ధ్వాదిషు పరరూపం వాచ్యమ్' అను వరరుచివాక్యము చేత నది యపవాదింపఁ బడి యుకారమునకుఁ బరరూప మీకారము వచ్చినది.

శ్లో॥ 'శకన్ధుశ్చ కర్కన్ధుశ్చ కుద్దాలోఽలన్తపర్కటీ, లాఙ్గలీషామనీషాచ హలీషా చ పతఞ్జలిః,
కులీరాకోశ్చ మంజీర మస్తిష్కః కులటాదయః, తథా వృకస్కన్ధసీమన్తాశ్చ శకన్ధ్వాదిగణేస్మృతాః,

అన్నందున నివి మొదలైన పదములయందు హల్లునకును మీఁద నడిచిన యచ్చునకును విశ్రమము చెల్లును గనుక మంజరశబ్దమందు హల్లయిన జకారమునకు విశ్రమము చెప్పినాఁడు. ఇందుకు లక్షణము.

క. 'వివరిలికె వ్యాకరణమునను, వరరుచిచేఁ జెప్పఁబడినవాక్యమువలనం
బరరూప మనిత్యంబై, పరఁగుశకంధ్వాదులకు నుభయముం జెల్లున్'

అని యప్పకవి. ఇది పరరూపయతి యనిపించుకొనును. పద్యాదియందు మగణము శ్రీప్రదము; 'మో భూమి స్త్రీగురు శ్శ్రియం వితనుతే' అని లక్షణము. తా భావింప ననుచో భ్రాంతిమ దలంకారము.

శార్దూలవిక్రీడితవృత్తము:—

'సారాచారవిశారదా ! యినయతిన్ శార్దూలవిక్రీడితా
కారంబై మసజమ్ము లిమ్ముగ సతాగప్రాప్తిమైఁ జెల్వగున్.'

సీ. సకలలో కాభినం దద్యకలాకలాపంబు దొరయు నెమ్మోముచం దురుసతోడ
బహుదివ్యఫలపరి పాకసౌభాగ్యంబు నెరపు కెమ్మోవిమా నికముతోడ
నపవయశ్శ్రీన్నిధా నంబులై తగునురో భవసుధాపూర్ణకుం భములతోడ
నమ్లానసుమమాలి కాభిరూప్యముఁ దాల్చు లలితభుజాకల్ప లతలతోడ

పాలిఁగాఁ జేయుచున్నట్టి, [వి] నఖరేఖలు=అంగుళిరేఖలను, అనఁగా వ్రేళ్ల వ్రాఁకు వ్రాఁతలను, అలఘు ప్రస్తారములు=గురుప్రస్తారములు గలవానిఁగా, చేయు=ఒనరుప్పునట్టి. 'అలఘూనామివ ప్రస్తారో యాభిః' అని విగ్రహము. 'లోవంక వ్రాయ గురువగు, నేవంకయుఁ లేక యున్న నెసఁగును లఘువై' యని లక్షణము. నఖశబ్దముచేతఁ దదాశ్రయమయిన యంగుళి లక్షిత మగుచున్నది. రేఖ యనఁగా లేఖ, రలల కభేదము. శ్లో. 'రలయో ర్లడయో స్తద్వ ల్లళయో శ్శసయో రపి, వబయో ర్ణణయో శ్చాన్తే సవిసర్గావిసర్గయోః, సబిన్దుకాబిన్దుకయో స్స్యా దభేదేన కల్పన' మ్మని భోజరాజు. సకలచ్ఛందములకును మొదట సర్వగురువృత్తము పుట్టుచున్నది గనుక గురుప్రస్తారముఁ జెప్పినాఁడు. నఖరేఖలన్నచోట, 'తస్యాః ప్రథమా చ జనపదానాం స్యా' త్తనెడు నన్నయభట్టీయసూత్రముచేత ద్వితీయకుఁ బ్రసమ. అలఘుప్రస్తారము లన్నచో స్త్రీలింగవిశేషణ మయినను, 'ఉభయవిధమమహతీనా' మనెడు సూత్రముచేత నపుంసకలింగము. సర్వ=సమస్తములైన, కళా=విద్యలచేత, కాంతుఁడు=ఒప్పుచున్నవాఁడు, లేక, సర్వకలా=సరస్వతీదేవికి, కాంతుఁడు=పెనిమిటియయిన చతుర్ముఖుఁడు,

సరస్వతీస్తనద్వయములోఁ దొలుతదానిని సంగీతముగను రెండవదానిని సాహిత్యముగను నిరూపించి రెంటికి ననుకూలములగు ప్రస్తారములు వర్ణించుట కనుసరణముగ నున్నది. అలఘుప్రస్తారము లనుట వలన స్తనములు తాళఫలోపమానము లగుటవలనను బ్రహ్మదేవుఁడు సర్వకలాకాంతుఁ డగుటవలనఁ గలల గ్రహించి (కళాకాంతరూపములగు) చంద్రరూపములగు నఖాంకములను (అర్ధచంద్రాకారములగు) గురురేఖలను పాలిండ్లజోడుపైఁ జిత్రించె ననుట స్వారస్యము. సంగీతమునకు స్వరప్రస్తారము ఛందములకు ఛందఃప్రస్తారములు సుప్రసిద్ధములు.

సంగీత సాహిత్యములగు స్తనములపైన లఘుప్రస్తారములు గావింపఁదగినవాఁడు సర్వకలాకాంతుఁడే గావున బ్రహ్మకు సర్వకలాకాంతుఁ డనుటలో సరసము గలదు.

సరస్వతీస్తనములలో నొకటియగుసాహిత్యము ఆలోచనామృత మగుటవలనను వేఱొకటియగు సంగీతము ఆపాతరమ్య మగుటవలనను సంగీతసాహిత్యములు సకలామోదకము లని గ్రాహ్యము.

తిర్మలమహారాయక్ష్మావల్లభుక్=తిరుమలమహారాయభూపతిని, ప్రోచుక్=రక్షించుఁగాత మని యాశీర్వచనము.

తాత్పర్యము. సమస్తజనులకు సంతోషములై యొప్పారుచుఁ దాటిపండువలె వట్రువగాఁ బటువుగా (తాళవృత్తరూపమగు సంగీతసాహిత్యాకారముతో) నున్న సరస్వతీదేవి గుబ్బలపై (నలఘుప్రస్తారరూపములగు) గోటిగంటుల నెలకొల్పుచున్న సమస్తకళాధీశ్వరుఁడగు బ్రహ్మదేవుఁడు కృతికర్తకు సమగ్రాయురారోగ్యములఁ బ్రసాదించుఁగాత.

ఇక్కడ పల్కుఁజెలికిం బాలిండ్లజోడై యన్నచోట, పల్కుఁజెలికి ననెడునకారాంత పదముపై నున్నపకారము బకార మయినది, పదాంతనకారము బిందు వైనది. ఇందులకు లక్షణము.—

క. 'నాంతము లయినపదంబుల, పొంతం బై నున్నశబ్దముల కచటతపల్
గొంతి గజడదబలగు న, య్యంత నకారంబు సున్న యభినవదండీ.'

దాపల బిందువు గదిసి యున్నందున బకారము రెండవచరణము మొదలనున్న మకారమునకు విశ్రామక్షమ మయినది. ఇది బిందుయతి యనిపించుకొనును. ఇందుకు, అప్ప.

క. 'కవి జూని నిలుచుఁ బదుపము, యమునాసికములకు బిందుయుతు లన వెమ్మకొ
గనుకట్టు నాల్గురిప్రలుకు, జెనుసున్నఁ డాసి కమునఁ బిఱుదఁ గదియుచోన్.'

అని లక్షణము.

మ. రమణీయాక్షసరాకృతిం బొలుచు వర్ణశ్రేణి వీణానులా
పముచేతం గరఁగించి యందు నిజబింబం బొప్ప నచ్ఛామృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును దద్వర్ణాళియం దెల్లఁ బూ
ర్ణము గావించినవాణి తిర్మలమహారాయోక్తిఁ బొల్చుం గృపన్. 4

ఈపద్యమునందుఁ గవి బ్రహ్మాత్మకత్వము బ్రహ్మప్రతిపాదకత్వమును ధ్వన్యంతరమున వర్ణపంక్తికి నధ్యవసించినాఁడు.—

రమణీయ=సుందరమయిన, అక్షసర=స్ఫటికాక్షమాలికయొక్క, ఆకృతిన్ = ఆకారముచేత, పొలుచు=ప్రకాశించుచున్న, వర్ణశ్రేణి=అక్షరపంక్తిని, వీణా=వల్లకియొక్క, అనులాపముచేతన్ = పలుకఁబడిచే, కరఁగించి=నీరుచేసి, అందున్ = కరఁగి నీరైన యాయక్షరపంక్తియందు, నిజ=తన యొక్క, బింబము=నీడ, ఒప్పన్=కనుపడుచుండఁగా, అచ్ఛ=స్వచ్ఛమైన, అమృతత్వమును=బ్రహ్మస్వరూపము నని యర్థము. నిర్మలోదకమాట నని భావము. ఆత్మప్రతిపాదకత్వమును, బ్రహ్మప్రతిపాదకత్వము నని యర్థము, బింబాపాదకత్వమునని భావము, కరఁగించి యందు నిజబింబ మొప్ప నన్నదియే యధ్యవసించినాఁడు. క్రమాలంకారము. తద్వర్ణాళియం దెల్లన్=ఆవర్ణశ్రేణియందంతట, పూర్ణము గావించిన = నిండింపఁజేసిన, వాణి=సరస్వతీదేవి, తిర్మలమహారాయ = తిరుమలదేవమహారాయనియొక్క, ఉక్తిన్=వాక్కునందు, కృపన్ =దయచేత, పొల్చున్=వర్తించుఁగాత మని యాశీర్వచనము.

భావమయందలి వర్ణములు స్ఫటికమాలికవలె వర్తులాకారముగ నున్న వనియు సరస్వతీ వీణాగానవశమున వర్ణరూపముగనున్న యక్షమాలిక కరఁగి నీరయ్యె ననియుఁ దినవ నిర్మలామృతత్వము నాత్మప్రతిపాదకత్వము నా రసమునందుఁ బూర్ణముగ నించి అచ్ఛామృతత్వము శుద్ధబ్రహ్మముగను ఆత్మప్రతిపాదకత్వము బ్రహ్మప్రతిపాదకత్వముగను నధ్యవసించిన బ్రాహ్మి యీపద్యమునఁ జెప్పఁబడు టచే అలం. రూపకాతిశయోక్తి

తాత్పర్యము. అక్షసరాకారముగనున్న యక్షరపంక్తిని వీణాగానవశమునఁ గరఁగించి యారసమునందుఁ దననీడ ప్రతిబింబింప నావర్ణశ్రేణియందు అచ్ఛామృతత్వము ఆత్మప్రతిపాదకత్వము నిండారఁజేయు వాగ్రూపయగు సరస్వతీదేవి కృతికర్తయగు తిరుమలరాయని వాక్కులలో వెల్గుఁగాక.

తిర్మల యన్నచోట సమాసము సేయునప్పుడు, తిరు అను శబ్దమున రేఫముమీఁది ఉకారము లోపము చేసి తిర్మల యని చెప్పినాఁడు. ఇందుకు లక్షణము. గీ. కాంత చన్గవ చనుగవ కార్మొఱుపులు, 'కారుమెఱుపులు' అని యప్పకవీయమున. తిర్మలమహారాయోక్తిన్ అనుచోట, వ. 'ఇతరత్ర చ ద్వితీయా' అనెడు సూత్రముచేత సప్తమ్యర్థమందు ద్వితీయ వచ్చినది.

శా. ఆమందాకిని మౌళిఁ బూని నను సర్ధాంగికృతం జేసి తా
నా పేర్మే లని యార్య యల్గఁ బ్రణతుం డై తత్పదాంభోజయో

గామర్షంబున గంగయు న్మోదయఁ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేఁడుశంభుఁడు కృతిస్వామిం గృపం బ్రోవుతన్. 5

మందాకిని యనఁగా, 'మన్దం అకతి వృద్ధత్వ కృతాఙ్గ శైథిల్యేన కుటిలం గచ్ఛతీతి మన్దాకినీ' అను వ్యుత్పత్తిచేత, ని. 'షష్టి వర్షాతు మన్దాకినీ' అను నిఘంటువుచేతను, అఱువదిసంవత్సరములు ఘోష్టిన ముసలిదానికిని, ని. 'మన్దాకినీ వియద్గఙ్గా' అను నమరనిఘంటువుచేత ఆకాశగంగకును నభిధానము గనుక, ఆమందాకిని మౌళింబూని=ఆముసలిదాని నెత్తి నెక్కించుకొని, ఆర్యయనఁగా, ('అరణీయా పిత్రాసిభి రభిగమ్యే త్యార్యా') అను వ్యుత్పత్తిచేతను, (ని. 'ఆర్యా షోడశవత్సరా' అను నిఘంటువుచేతను) బదియాఱు సంవత్సరముల వయసుగల జవ్వనికిని, (ని. 'ఆర్యా దాక్షాయణీచైవ' అను నమరనిఘంటువుచేతఁ) బార్వతికిని బేరు గనుక, నను నర్ధాంగీకృతం జేసితి, పదియాఱేండ్ల వయసుగల భార్యనయిన నన్ను నర్ధాంగీకారము చేయఁబడినదానిఁగాఁ జేసితివి, పౌరా మేల్మేలని, యార్య యల్గన్ = అవునవును బాగుబాగని పార్వతీదేవి యలుక వహింపఁగా నని యర్థము. శివునకు నాకాశగంగ జటాజూటవాసిని యనియును, పార్వతీదేవి యర్ధదేహముగాఁ జేయఁబడిన దనియును భావము.

ముదుసలివగు మందాకినిని నెత్తి నెక్కించుకొని పదియాఱుసంవత్సరముల జవ్వనినగు నన్ను సగము పాటించుట తగ దని పార్వతి విచారమునొంద, ప్రణతుండై=నమస్కరించినవాఁడై, తత్=సవతియైన యా పార్వతియొక్క, పదాంభోజ యోగ=పాదములు సోఁకుటవలననైన, అమర్షంబునన్= కోపముచేత, గంగయు న్మోఱయన్=జటాజూటమందలి గంగయును మొఱపెట్టఁగా నని యర్థము. శివుఁడు శిరస్సు వంచి పార్వతీదేవిపాదములకు నమస్కరింపఁగాఁ దలనుండు గంగ కదలఁబాఱి ధ్వని చేసిన దని భావము. చూడా+ఆభోగ=జటాపటలముయొక్క, సమ్యక్క్రియా, అనఁగాఁ (దలవంచి నప్పుడు క్రిందికి జాఱిన గంగవలనఁ జెదరఁగాఁ దిరుగఁ దానిని) జక్కపఱచుకొనుట, దానియందలి, సామర్థ్యంబునన్=నేర్పుచేత, అనఁగాఁ జక్కపఱచుకొనుట యనెడు వ్యాజముచేత ననుట, వేఁడు= గంగ నోదార్చుటకై ప్రార్థించునట్టి, శంభుఁడు=శివుఁడు, కృతిస్వామిన్=కృతిపతియైన తిరుమలదేవ రాయని, కృపన్=దయచేత, ప్రోవుతన్=రక్షించుఁగాత మని యాశీర్వచనము.

ఇక్కడ హరుని దక్షిణనాయకునిఁగా వర్ణించినాఁడు. పలువురియందు సమానుఁడుగా నుండు వాఁడు దక్షిణనాయకుఁడు. 'తుల్యోఽనేకత్ర దక్షిణః' అని లక్షణము.

ప్రణతుఁ డయ్యె ననుటచేఁ బూర్ణముగ శివుఁడు తలవంచె ననియు నందువలననే పదాంభోజ యోగము సంభవించి గంగ మొఱసెననియు గ్రావ్యము. జడలలోఁ బదిలపఱుపఁబడినను అవమానము సహింపలేక మొఱయుటచే చిరువురకు సవతికలహము గాటముగఁ గలదనియు శివుఁడు నేర్పుతోఁ బరిహరించె నని భావము.

తాత్పర్యము. శివుఁడు (ముదుసలికత్తెయగు) మందాకినిని నెత్తి నెక్కించుకొని (పదునాఱేండ్ల ప్రాయముగల యార్యయగు) తనను నర్ధాంగీకృతను గావించుటచేఁ బార్వతి కినుక నొందెను. పార్వతికోపముఁ బోఁగొట్టనెంచి శంకరుఁడు పాదానతుఁడు కాఁగా నాయవమానమునకు నోర్వక మందాకిని ప్రవాహధ్వనిమిషచే ననిష్టముఁ జెలిపెను. నేర్పరియగు శివుఁడు చెక్కుచెదరిన జడల

సవరించుకొనుచున్నది కొనకొని వచ్చెను. అట్టి శంకరుడు కృతిభర్తకు మంగళములను ప్రసాదించుఁ గాత.

సీ. ఘనఘనాఘనలక్ష్మి • నెనయుకొప్పిరుగడ నిరుగడఁ దరుణాబ్జ•కృతవతంస
మురుచిత్రకాగ్నిశి•ఖోన్మేష మిరువంక నిరువంకఁ గుండలి•స్ఫురితకర్ణ
ముడివోనిమిన్నులీ•నెడుపేరు లిరుదెస నిరుదెసఁ గమలబం•ధురకరంబు
నెఱిమించుచిలుతవ•న్నియచేల మిసిమేన నిరుమేన రతిమనో•హరవిభూతి
తే. యమర ననోన్యవేషభా•షాపహీనఁ, భావవిభవంబుఁ దెలుపుచుఁ•బరమమైత్రి
మగనిసామేననిలిచిన•యగతనూజ, ప్రభవజయ మిచ్చుఁ దిరుమల•రాయమణికి.

ఈపద్యమందు నాలుగు పాదములయందును సర్వస్వాంగమునను నభేదావ్యవహారము చేసి శివపార్వతుల యొక్కవేషమునే కవి ప్రతిపాదించినాఁడు. ఎట్లన్నను,

ఇరుగడన్=రెండువైపులను, ఘనఘనాఘనలక్ష్మి నెనయుఁ కొప్పు అనఁగా, శివుని వైపున, ఘన=అధికమైన, ఘనాఘన=వర్షించుచున్న మేఘముయొక్క, లక్ష్మిన్=సంపదను, ఎనయు=పొందుచున్న, కొప్పు = కేశబంధము (ఆకాశము,) శివుఁడు వ్యోమకేశుఁడని ప్రసిద్ధము, (ని. 'శక్ర ఘాతుక మత్తేభ వర్షుకాబ్దా ఘనాఘనాః' అని అ.) పార్వతివైపున. అధికమైన వర్షాకాలపు మేఘపుకాంతి వంటికాంతిని బొందుచున్నకొప్పును, అబ్జశబ్దము చంద్రకమలములయందు వర్తించుచున్నది. (ని. 'అబ్జో ధన్వన్తరౌ చన్ద్రే నిచులే శఙ్ఖపద్మయోః' అని వి.' ఇరుగడన్=రెండువైపులను, తరుణాబ్జ=బాలచంద్రునిచేత, కృత=చేయఁబడిన, వతంసమున్ = శిరోభూషణమును, అవ యను నుపసర్గ మొదటి యకారమునకు వికల్పముచేత లోపము గలదు గనుక, అవతంసము, వతంసము అని రెండువిధములును గలవు. ఇందుకు. శ్లో. 'వష్టిభాగురిరల్లోపమవాప్యో రుపసర్గయో' అని ప్రమాణము. పార్వతి వైపున, నూతనకమలముచేఁ జేయఁబడినశిరోభూషణమును, నీలమేఘమువంటి నల్లని పెన్నెఱులతోడను కర్ణావతంసికమగు కమలముతోడను పార్వతియు, మిన్నసికతోడను శిరోభూషణమగు బాలచంద్రరేఖతోడను శివుఁడును నుండి రని భావము.

ఇరువంకన్=ఉభయపార్శ్వములయందును, ఉరుచిత్రకాగ్నిశిఖోన్మేషము, అనఁగా శివుని పార్శ్వమందు, ఉరు=అధికమైన, చిత్రక=ఆశ్చర్యకరమైన, అగ్నిశిఖా=ఫాలనేత్రాగ్నిజ్వాలయొక్క, ఉన్మేషమున్=వికాసమును, పార్వతీదేవిపార్శ్వమందు, ఉరు=అధికమైన, చిత్రక=తిలకరూపమైన, అగ్నిశిఖా=కుంకుమయొక్క. ఉన్మేషమున్=వికాసమును, (ని. 'చిత్రం స్యా దద్భుతా లేఖ్య తిలకేషు') (ని. 'కుంకుమే౽గ్నిశిఖం వరమ్' అని వి.) ఇరువంకన్=రెండుప్రక్కలను, కుండలిస్ఫురితకర్ణము అనఁగా, శివునివైపున, కుండలిన్=పాముచేత, స్ఫురిత=ప్రకాశించుచున్న, కర్ణము=చెవియును, పార్వతివైపున, రత్నకుండలము గలదై ప్రకాశించుచున్నచెవియును, కుంకుమతిలకముతోడను గండ్థలాలంకృతపత్రములతోడను పార్వతియు, జ్వాలారూపమగు నొసలికంటితోడను కుండలముగాఁ జేయఁబడిన సర్పముతోడను శంకరుఁడు నుండి రని భావము.

మిన్నులనఁగా, పలుకులును గాంతులును, ఇరుదెసన్ = రెండుదిక్కులయందున్ను, ఉడివోని మిన్నులు=శివుని దిక్కున-ఉడిగిపోనిపలుకులు, అనఁగా వేదములు, వానిని, ఈనెడు=పుట్టించు బ్రహ్మముఖ

ములు, పేరులు=హారములు, అనఁగా బ్రహ్మకపాలమాలిక లనుట, పార్వతిదిక్కున, ఊడిగిపోని కాంతులఁ బుట్టించునది రత్నములుగనుక ఇక్కడ నుడిగి యను పదమునకు కిరణయుక్తము లర్థమైనది, కమలమనఁగా లేడియును, పద్మమును, (ని. 'స్యాత్కురఙ్గేఽపి కమలః' అని అ.) ఇరుచెనకె = రెండుదిక్కులను, కమలబంధురకరంబు, అనఁగా శివునిదిక్కున, కమల=లేడిచేత, బంధుర=సుందరమైన, కరంబు = హస్తమును, పార్వతిదిక్కున, పద్మముచే సుందరమైనహస్తమును, రత్నహారముల తోడను, కమలాలంకృతహస్తములతోడను పార్వతియు, బ్రహ్మకపాలమాలికలతోడను లేడితోఁ గూడిన హస్తములతోడను శివుఁడును నుండి రని భావము.

ఇరుమేనఁ =శరీరద్వయమందును, శివునిశరీరమందు, నెఱిమించు=బాగుమీఱు, చిఱుతవన్నియ చేలము=మూఁడువన్నెలు గలిసిన వ్యాఘ్రాజినాంబరమును, పార్వతిశరీరమందు చిత్రవర్ణముగల వస్త్రమును, విభూతి, అనఁగా భస్మమును, ఐశ్వర్యమును, (ని. 'భూతి ర్భస్మని సమ్పది' అని అ.) ఇరుమేనఁ =శరీరద్వయమందును, రతి మనోహరవిభూతి, శివునిశరీరమందు, రతిమనోహర = మన్మథుని యొక్క, విభూతి=భస్మమును, పార్వతీశరీరమందు, మన్మథైశ్వర్యమును, లేక రతీదేవివలెఁ జక్కనైన శోభ, చిత్రవస్త్రముతోడను, రతీదేవివంటి చెలువముతోడను పార్వతియు, పులితోలుతోడను, మన్మథుని బూదితోడను శంకరుఁడు నుండి రని భావము.

అమరఁ = ఒప్పుచుండఁగా, అన్యోన్య = పరస్పరసంబంధమయిన, వేషభేద = భేదముగల వేషమందలి, అసహిష్ణుభావ=సహింపనితాత్పర్యముయొక్క, విభవంబుఁ =వైభవమును, తెలుపుచుఁ =తెలియఁజేయుచును, అనఁగా దంపతులకిద్దఱు నొక్కవేషమే యుండవలె నన్నతాత్పర్యముఁ దెలియఁ జేయుచు ననుట. పరమమైత్రిఁ = ఉత్కటమయిన స్నేహముచేత, మగనిసామేననిలిచిన = పెనిమిటి యొక్కయర్ధశరీరమందుఁ బాదుకొనియున్న, అగతనూజ = పర్వతపుత్రియైనపార్వతి, తిరుమలరాయమణికిఁ =తిరుమలరాయశ్రేష్ఠునికి, ప్రధనజయ మిచ్చుఁ =యుద్ధములయందలిజయము నిచ్చుఁగాక యని యాశీర్వచనము.

ఇరుగడఁ దరుణాబ్జకృతవతంసమన్న చోట ఋత్వసంబంధయతి చెప్పినాఁడు. ఇందుకు,

తే. 'సారెకుఁ గాదులఁ గలవట్రుసుడుల కెల్ల, ఋత్వమిత్రంబు లగునచ్చు లెనయ నైదు
చెల్లు హాయలును స్వరమైత్రిఁ జెందునపుడు, వెలయు నివి ఋత్వసంబంధవళు లనంగ.'

అని యప్పకవీయము. ఇరు అనెడిపదములోనిది రేఫగాని శకటరేఫ గాదు.

తాత్పర్యము. అన్యోన్యప్రేమాతిరేకవశమున శివరూపమును ధరించి మగనిసామేను నలంకరించిన లోకమాతయగు పార్వతీదేవి తిరుమలదేవరాయలకు సంగ్రామవిజయమును బ్రసాదించుగాత. శివుఁడు సంహారదేవత యగుట శివకుటుంబినియగు పార్వతియు భర్తృభావానుసారముగ విరోధులఁ దెగటార్చి కృతిపతికి సంగ్రామవిజయము ప్రసాదించుగాత మని కవ్యాశయము. శివుఁడు పార్వతియు నభేదస్వభావు లనుటకు "వాగర్థావివ సంపృక్తౌ" అనుకాళిదాసోక్తి తార్కాణము.

అలంకా — శ్లేషమూలకోత్ప్రేక్ష.

పుత్త్రధర్మము సార్థకము గావించుకొనిన గజాననుఁడు కృతికర్తకుఁ గార్యారంభములందు విఘ్నములఁ బోకార్చుఁగాక.

సీ. తరుణార్కకబళనోద్ధతిఁ జూపె నెవ్వాఁడు రుచులచే ఫలమోహరుచులచేత
నకలంక రామముద్రికఁ బూనె నెవ్వాఁడు శయముచే హృత్కుశేశయముచేత
మున్నీరుఁ బల్వలంబుగ దాఁటె నెవ్వాఁడు జవముచే గుణగణార్ణవముచేత
నక్షశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాఁడు రణముచే నియమధారణముచేత

తే. ధరణి నెవ్వాఁడు దానవద్విరదదళన
విహృతిఁ దనకేసరికిశోరవృత్తిఁ దెలిపె
నతని మత్కావ్యభవ్యవాగమృతఘటన
మంజులస్వాంతు హనుమంతు మదిఁ దలంతు. 8

ఎవ్వాఁడు=ఎవ్వఁడు, రుచులచేన్ = శరీరకాంతులచేతను, ఫలమోహరుచులచేతన్=ఫలమను భ్రాంతివలనఁ బుట్టినస్పృహచేతను, (ని. 'అభిషఙ్గేస్పృహాయాంచ గభస్తౌచ రుచిస్స్త్రియామ్' అని అ.) తరుణార్క = బాలసూర్యునియొక్క, కబళన=మ్రింగుటయందును, తిరస్కరించుటయందును, ఉద్ధతిన్=ఎగురుపాటును, చూపెన్=కనుపఱచెనో, హనుమంతుఁడు రక్తవర్ణుఁ డన్నందుకు నుదాహరణము. 'అరుణకమలవర్ణం ప్రజ్వలత్పావకాక్షః' మిత్యాది హనుమద్వర్ణనము. ఇట నాంజనేయుని శైశవక్రీడాదికములు, దైవదత్తవరప్రభావాదికములు, అమానుషకార్యనిర్వహణములు సూచితములు.

ఎవ్వాఁడు, శయముచేతన్=హస్తముచేతను, హృత్కుశేశయముచేతన్ = హృదయకమలము చేతను, అకలంక=నిష్కళంకమయిన, ముద్రికయనఁగా, ఉంగరమును స్వరూపమును గనుక, రామముద్రికన్=రామాంగుళీయకమును, రామస్వరూపమును, పూనెన్=వహించెనో, అనఁగా హస్తముచేత నుంగరమును హృదయముచేత స్వరూపమును వహించినాఁ డని క్రమాలంకారము. (ని. 'పఞ్చశాఖశ్శయశ్శపాణిః శతపత్రం కుశేశయమ్' అని అ.) ఇట నాంజనేయుని జవపరాక్రమాదికములు స్వామికార్యనిర్వహణశక్తియు ననన్యసామాన్యకార్యఘటనశక్తియు సూచితములు.

ఎవ్వాఁడు, జవముచేన్=వేగముచేతను. గుణగణార్ణవముచేతన్=గుణసమూహముయొక్క బుజుభావముచేతను, మున్నీరున్=సముద్రమును, పల్వలంబుగ దాఁటెన్=చవుటిపడియమాత్రముగా దాఁటెనో, ఇక్కడ గుణగణార్ణవముచేత ననియుం జెప్పుటవలన సురసను జయించుట మొదలైన యుపాయసాధనములచేతఁగూడ నని భావము. ఇట జవాతిశయము నసురనిగ్రహణబలాతిశయము నాంజనేయుని బ్రహ్మచర్యాది నియమపాలనరూపకమగు సుగుణసమృద్ధియు సూచితములు.

ఎవ్వాఁడు, రణముచేన్=యుద్ధముచేతను, నియమధారణముచేతన్=బ్రహ్మచర్యాదినియమములయొక్క ధారణముచేతను, అక్షశిక్షాప్రౌఢి నలరారెన్=అక్షశబ్దము రావణపుత్త్రునియందును నింద్రియములయందును వర్తించుచున్నది గనుక, అక్షాసురుని శిక్షాప్రౌఢిచేతను, ఇంద్రియనిగ్రహమందలి

వలెఁ బ్రాభవమందను నొప్పునవాఁ డాయెనో. ఇక్కడ క్రమాలంకారము. ఈతుశబ్దు మున్ద్రయు వాచక మగుపదములకు, (ని. 'అతుమిస్త్రియే' అని అ.) ఇట నాంజనేయుని ధైర్యాతిశయము బల బాహువీర్యసంగ్రామ నైపుణ్యాదికములు దష్టాంతరశక్తియు సూచితములు.

ఎవ్వాఁడు, ధరణిన్=భూమియందు, దానవద్విరద లనఁగా, 'దానవా ద్విరదా ఇవ దానవ ద్విరదా' అని స. 'ఉపమితంవ్యాఘ్రాదిభిః' అనెడు పాణినీయసూత్రముచేత, ఉపమితసమాసము చేయఁగా రాక్షసశ్రేష్ఠులని యర్థము, ఇందుకు, (ని. 'స్యురుత్తరపదేవ్యాఘ్రపుంగవ ర్షభ కుంజరాః, సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' అని అ.) దానవద్ద్విరదము లనఁగా మదవద్గజములును, ఇందుకు ని. 'మదోదానం' అని అ. దానవద్విరద=దైత్యశ్రేష్ఠులనెడు, దానవద్ద్విరద= మదవద్గజములయొక్క, ఇచట దానవత్+ద్విరద. దానవ+ద్విరద. అను రెండుపక్షములయందును ద్విరదశబ్దాదిదకారమునకు ద్విత్వమే ప్రాయికముగను. అనచి చ, 'అచఃపరస్యయరోద్వేవాస్తోనచి' అని పాణిని. అచ్చుకంటెఁ బరమైన హకారేతరహల్లునకుఁ బరము నచ్చు లేనప్పుడు ద్విత్వము వికల్పముగా నగును, దళన=భేదనమందలి, విహృతిన్=విహారముచేత, తన కేసరికిశోరవృత్తిం జెలిపెన్= తనయొక్క సింహకిశోరవ్యాపారమును గనుపఱచెనో యని యర్థము. కేసరి యనెడు వానరునికిఁ గుమారుఁడనియు భావము. ఆకేసరిన్=అట్టిసద్గుణవిశిష్టుఁడును, మత్కావ్య=నాచేత రచింపఁబడెడు కావ్యమందు, భవ్యవాక్=శుభవాక్కులనెడి, అమృత=అమృతముయొక్క, ఘటన=పొందించుటయందు, మంజుల=మృదువైనట్టి, స్వాంతున్=మానసము గలిగినవాఁడునునగు, హనుమంతున్=హనుమద్దేవుని, మదిఁ దలంతున్=మనస్సునందు ధ్యానము చేయుచున్నాను.

రామరాజభూషణుఁడు పవననందన కరుణాప్రాప్తకవితావైభవుఁ డగుటచే మనోహరకవితా సిద్ధికి నిష్టదేవతాస్తుతి నిటులఁ గావించెను. అర్థాలంకారము. శ్లేష. శబ్దాలంకారము-ఛేకానుప్రాసము.

తా. బాల్యమున భాస్కరుని ఫలమని మ్రింగఁబోయి యమానుషశక్తిని జాటి, సీతాన్వేషణమున శ్రీరామముద్రికను గైకొని స్వామికార్యనిర్వహణశక్తి ప్రకటించి, సముద్రమును పడియ వలె దాఁటి జవాతిశయము సువ్యక్తమొనరించి, అక్షకుమారాదిరాక్షసులఁ దునిమి, సంగ్రామనైపుణ్యము ప్రకటించిన రాక్షసదంతావళములకుఁ గేసరికిశోరమగు (సింగపుఁబిల్లయగు కేసరిపుత్రుఁడగు) నాంజనేయునకుఁ గవి మనోరథసిద్ధికై నమస్కరించుచున్నాఁడు.

సీ. భువిఁ గవితాకన్యఁ • బుట్టించె నెవ్వాఁడు బడినాగమములెల్ల • నడపె నెవ్వాఁ
డేను నీ వనుమాట • లెనయించె నెవ్వాఁడు కోమలపదలీలఁ • గూర్చె నెవ్వాఁ
డనఘుతులాకోటి • నలరించె నెవ్వాఁడు నిఖిలగుణంబులు • నేర్పె నెవ్వాఁ
డినకరసంప్రాప్తి • నెసఁగించె నెవ్వాఁడు రహిఁ బెంచె నర్థగౌ • రవము నెవ్వాఁ

తే. డట్టి వాణీగురుత్వమహత్త్వఖనుల
ఘనులఁ బ్రాచేతస వ్యాస • కాళిదాస
దండి భవభూతి మాఘ సత్కవి మయూర
భారవుల భారవుల నాత్మఁ • బ్రస్తుతింతు.

ఈపద్యమందు వాల్మీకి మొదలుగాఁగల సంస్కృతమహాకవులను గవితయనెడు కన్యకను జనసాధ్యవస్థాసంపాదకులనుగా నేర్పఱిచి యర్థద్వయమునకు నభేదాధ్యవసాయము చేసి చెప్పినాఁడు.

ఎట్లన్నను, ఎవ్వాఁడు=ఎవ్వఁడు, భువిఁ = భూమియందు, కవితాకన్యకఁ = కవితయనెడు కన్యకను, పుట్టించెఁ=జనింపఁజేసెనో, అనఁగా వాల్మీకి యని తెలియవలెను. వాల్మీకియే కవితాకన్యను బుట్టించె ననుటకు,

శ్లో. 'ఆదికవీ చతురాస్యౌ కమలజ వల్మీకజౌ వందే
లోకశ్లోక విధాత్రో ర్యయోర్భిదాలేశమాత్రేణ.'

భువియనెడుపదము ప్రథమాంతమైన తద్భవము. ఇందుకు శబ్దానుశాసనసూత్రము 'భూదివోస్తు ఙ్యాయత్తత్' భూ దివ్ శబ్దములకు సంస్కృతసప్తమ్యేకవచనముగాఁగల భువి, దివి అనురూపము లాంధ్రమందుఁ బ్రాతిపదికముగా నుండునని సూత్రార్థము. బడిఁ=వెంబడిగా, ఎవ్వఁడు, ఆగమము లెల్ల నడిపెఁ=వేదముల నెల్ల విభజించి ప్రవర్తింపఁజేసెనో, అని కవితాపరమైన యర్థము. అనఁగా వ్యాసులని తెలియవలయును.

శ్లో. 'నమ స్సర్వవిదే తస్మై వ్యాసాయ కవివేధసే
చక్రే పుణ్యం సరస్వత్యా యో వర్ష మివ భారతమ్.'

అనుశ్లోకమువలన వ్యాసుఁడు కవితాకాంతకు దేశికుఁడని స్పష్టమగుచున్నది. ఆగమోక్తధర్మముల జరిగించెనో యని కన్యాపరమైన యర్థాంతరము.

ఎవ్వాఁడు, వీనునీవనుమాటలు = 'త్వమేవాహం నసంశయః' అని కాళిదాసునిఁగూర్చి సరస్వతీదేవి చెప్పెను గనుక సరస్వతినైన నేనే నీవనుమాటలను, ఎనయించెఁ = వ్యాపింపఁజేసెనోయని యర్థము. నేను నీవనునవి మొదలుగాఁగల మాటలను బాల్యమందు నేర్పినాఁ డని యర్థాంతరము. ఎవ్వఁడు, కోమల=లలితమైన, పదలీలఁ = శబ్దవిలాసమును, కూర్చెఁ = ఘటింపఁజేసెనోయని యర్థము. శ్లో. 'దణ్డినః పదలాలిత్య' మన్నాఁడు గనుక దండియని తెలియవలయును. కోమల = మృదువైన, పదలీలఁ = పాదక్రియను, అనఁగా నడుగులు పెట్టినడుచుటను, కూర్చెఁ = ఘటింపఁజేసెనోయని యర్థాంతరము. (నిఘ. 'లీలావిలాసక్రియయోః' అని అ.)

ఎవ్వాఁడు, అనఘ=పవిత్రమైన, తులా=త్రాసుయొక్క, కోటిఁ=ఒకప్రదేశమందు, అలరించెఁ=కవితారూప సరస్వతి నొప్పునట్లు చేసెనో యని యర్థము. శ్లో. 'అహో మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ ఫణితిం తులాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని, గిరాందేవీ సద్యశ్శ్రుతికలిత కహ్లారకలికా కళాయాంమాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ' అన్నాఁడు గావునఁ గవితారూప సరస్వతిని దులయందుఁ దూఁచినవాఁడు భవభూతియని గ్రహింపవలయును. అనఘమైన, తులాకోటిఁ=పాదభూషణమును అలంకరించెనని యర్థాంతరము. (న.'పాదాఙ్గదం తులాకోటిః' అని అ.) ఎవ్వఁడు, నిఖిలగుణంబులు=శ్లేషాదిసమస్తగుణములును, నేర్పెఁ=తెలియఁజేసెనో యని యర్థము. శ్లో. 'దణ్డినః పదలాలిత్యం భారవే రర్థగౌరవమ్, ఉపమా కాళిదాసస్య మాఘే సన్తి త్రయోగుణాః' అన్నాఁడు గనుక నీగుణత్రయము గలవాఁడు మాఘుఁడని తెలియవలెను. కన్యకు సమస్తగుణములఁ దెలిపెనో యని యర్థాంతరము.

ఎవ్వాఁడు, ఇన=సూర్యునియొక్క, కర = కిరణములయొక్క, సుప్రాప్తిన్=పొందుటను, ఎసఁగించెన్=ప్రకటింపఁజేసెనో యని యర్థము. అనఁగా మయూరుఁడని తెలియవలయును. ఇన=పెనిమిటియొక్క, కరసంప్రాప్తిన్ = పాణిగ్రహణమును, ఎసఁగించెన్ = ఒనఁగూర్చెనో యని యర్థాంతరము. (ని. 'ఇనస్సూర్యే నృపే పత్యౌ' అని వి.) ఎవ్వఁడు, అర్థగౌరవమున్ = శబ్దమునందలి యర్థాతిశయమును, రహిన్=ఒప్పునట్లు, నించెన్=నిండించెనో యని యర్థము. అనఁగా భారవి యని తెలియవలెను. వివాహానంతరమందు ధనాతిశయత్వమును నిండించెనో యని యర్థాంతరము.

అట్టి=అటువంటి, వాణీ=కవితారూప సరస్వతియొక్క, గురుత్వ=జనకత్వ ప్రయుక్తమయిన, మహత్త్వ=శ్రేష్ఠతకు, ఖనులన్=ఆధారభూతులైన, ఘనులన్=శ్రేష్ఠులైన, భారవులన్, భా = కాంతియందు, రవులన్=సూర్యులైన, ప్రాచేతస=వాల్మీకిని, వ్యాస = వ్యాసుని, కాళిదాస = కాళిదాసుని, దండి=దండిని, భవభూతి=భవభూతిని, మాఘసత్కవి = మాఘుఁ డనెడు కవిశ్రేష్ఠుని, మయూర= మయూరుని, భారవులన్=భారవిని, ఆత్మన్=అంతరంగమందు, ప్రస్తుతింతున్= స్తోత్రము చేయుచున్నాను.

అనఁగాఁ గవితాకన్యఁ బుట్టించె నన్నది మొదలుకొని అర్థగౌరవము నించె నన్నపర్యంతము చెప్పఁబడిన కార్యములకు వాల్మీక్యాదిభారవిపర్యంత మహాకవులు క్రమముగాఁ గర్త లని క్రమాలంకారము గ్రహింపవలయు. కవితాకన్య యనుచోట రూపకాలంకారము. శ్లో. 'ఆరోప్యవిషయస్యస్యాదతిరోహితరూపిణః, ఉపరంజక మారోప్య గుణం తద్రూపకం విదుః' అని లక్షణము. ఆగమము లనునిది మొదలైన స్థలములయందు నర్థద్వయమునకు భేదమున్నను నభేదాధ్యవసాయము చేసినాఁడు గనుక నతిశయోక్తి. ఇక్కడ శ్లేషమూల మని తెలియవలయును. రూపకాతిశయోక్తులకు నంగాంగిభావముచే సంకరము.

తాత్పర్యము. కవిత్వమును జన్మింపఁ జేసినవాఁడు (ఆదికవి) వాల్మీకిమహర్షి. పిదప వేదవిభాగము గావించినవ్యాసుఁ డాకవిత నభివృద్ధినొందింప సరస్వతీ స్వరూపుఁడగు కాళిదాసుఁడు క్రొత్తనిగ్గులు గూర్చెను. ఆవల దండి మృదుశైలిలోఁ గవితారచనము గావింప భవభూతి మిగుల మనోహరముగా నలరించెను. తరువాత మాఘుఁడు సమస్తగుణములు సమకూర్ప సూర్యశతకరచనముచే మయూరుఁడు, అర్థగౌరవముచే భారవి కవితను శోభిల్లఁజేసిరి. ఇటుల గీర్వాణకవితకు వివిధాలంకృతుల సమకూర్చిన సంస్కృతమహాకవులకు నమస్కరించుచున్నాఁడను (కన్యపరమగు నర్థము సుగమ మగుటచే నుదాహరింపలేదు).

మ. మహిమ న్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
క్షమనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవ న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్. 10

ఈపద్యమునందు నన్నయభట్టాద్యాంధ్రకవులను వర్ణించినాఁడు. ప్రపంచమనఁగా విస్తరమును విశ్వమును గనుక బహుళాంధ్రోక్తిమయప్రపంచ మనెడు ప్రపంచముచేత నని యర్థము చేసి యాంధ్రోక్తిమయ ప్రపంచపరముగాను ప్రపంచపరముగాను నర్థద్వయంబునుఁ జేయవలసినది.

షహిక్=భూమియందు, ముక్=ముందు, వాగనుశాసనుండు = శబ్దానుశాసనుండైన నన్నయ భట్టును, సరస్వతీశాసనుండైన బ్రహ్మయును, సృజియింపక్=నన్నయభట్టు ప్రతిష్ఠింపఁగానని యాంధ్ర ప్రబంధ విస్తారపరమయినయర్థము. బ్రహ్మదేవుఁడు పుట్టింపఁగానని ప్రపంచపరమయిన యర్థాంతరము. కుండలీంద్రుండు=కుండలేష్టిఁ జేసి కుండలములు ధరించిన తిక్కనసోమయాజి శ్రేష్ఠుఁడును, శేషాహియును, తత్ = ఆ యాంధ్ర ప్రబంధవిస్తారముయొక్క, మహనీయ = ఒప్పిదమయిన, స్థితి=ఉనికికి, మూలమై= ఆధారమయి, నిలువక్=నిలిచియుండఁగా నని యర్థము. ఆవిశ్వముయొక్క యునికికి నాధారమయి నిలు వఁగానని యర్థాంతరము. శ్రీనాథుండు=శ్రీనాథుఁడనుకవి, ప్రోవక్=పోషింపఁగానని యర్థము, విష్ణువు సంరక్షింపఁగానని యర్థాంతరము. మహామహులై=మహాతేజస్సుగలవారై, సోముఁడు=నాచనసోముఁ డును, భాస్కరుండు=హుళిక్కి భాస్కరుఁడును ప్రసిద్ధులుకవులును, వెలయింపక్ = ప్రకాశింపఁ జేయఁగా నని యర్థము. చంద్రసూర్యులు ప్రకాశింపఁజేయఁగానని యర్థాంతరము. సొంపువాటించు= చక్కనగుచున్న, ఈబహుళాంధ్రోక్తిమయప్రపంచమునక్=ఈయధికమయిన యాంధ్రప్రబంధవిస్తార మనెడు విశ్వముచేత, తత్=ఆపూర్వోక్తకవులయొక్క, ప్రాగల్భ్యము=ప్రౌఢిమను, ఊహించెదక్= భావించుచున్నాను. ని. 'ప్రపఞ్చః స్యాత్ ప్రోక్తో విస్తరే చ ప్రతారణే' అని విశ్వనిఘంటువు. మత్తేభవృత్తము. 'నలువొందక్ సభరల్ నమల్ యవలతోఁ నగూడి మత్తేభమిం, దలరారుం బగునాలు గాపిరతిచే నానంపగంగాధిపా.'

అలంకారము, శ్లేషోత్ప్రేక్షలు.

తాత్పర్యము. నన్నయభట్టారకుఁడు తొలుత కవితాసతిని బుట్టించెను. తిక్కనసోమయాజి కవితా సతి యభివృద్ధికి మూలమయ్యెను. శ్రీనాథుఁడు కవితాసతిని రక్షించెను. సోముఁడు భాస్కరుఁడు వెలయించిరి. ఇటులొప్పారు నాయాకవులనేర్పు నెన్నెదనని కవిస్తుతి పరమగు నర్థము. ప్రపంచమును దొలుత బ్రహ్మ సృష్టించెననియుఁ శేషుఁ డా ప్రపంచమును భరించెననియు, విష్ణువుపోషించెననియు సూర్య చంద్రులు వెలుఁగొందఁజేసిరనియుఁ బ్రపంచసంబంధమగు నర్థాంతరము నీపద్యమున నిమిడియున్నవి.

శా. భావం బెక్కడ లేక వృత్తనియమోపాయంబుఁ జింతింప కెం
దే వర్తించి పరార్థవంచనలచే దీపించి మూర్ఖాళి సం
భావింపం గుకవిప్రణీతకృతి సామాన్యాకృతిం బూని పై
పైపన్నె ల్పచరింప దానిఁ దిలకింపం బోరు ధీరోత్తముల్. 11

ఈ పద్యమునను గుకవిదూషణము చేయువాఁడై కుకవిప్రణీతకృతి సామాన్యాకృతిం బూని పైపై వన్నెల్పచరింపనని చెప్పుటచేత సామాన్య యనఁగా వేశ్యగనుకఁ గుత్సిత కవిచేతఁ జెప్పఁబడిన ప్రబంధపరముగాను వేశ్యాస్త్రీపరముగాను నర్థద్వయము గలుగఁ జెప్పినాఁడు. అది యెట్లనఁగా,

భావంబెక్కడలేక=భావమనఁగా వ్యంగ్యార్థమును, చిత్తమును, వ్యంగ్యమెక్కడ విచారించినను లేకయని కుత్సితకవి ప్రబంధపరమైనయర్థము, చిత్త మెవనియందును లేకయని సామాన్యపరమైన యర్థము. వృత్తనియమోపాయంబుఁజింతింపక.వృత్తములనఁగా శార్దూలమత్తేభవిక్రీడితాది వృత్తములును వ్యాపారములును, వృత్త=శార్దూలాది వృత్తములయొక్క, నియమ=యతిప్రాసాది లక్షణముయొక్క,

ఆపాయంబుఁ=హానిని, చింతింపక=విచారింపక యని యర్థము. వ్యాపార నియమముయొక్క హానిని విచారింపక యని యర్థాంతరము. ఎంతేవత్తించి=ఎక్కడనో యపండితులయొద్దఁ జదువఁబడినదై యని యర్థము. ఎల్లెడల వ్యభిచరించినదై యని యర్థాంతరము. పరార్థవంచనల చేఁ=పరకవులయుక్తిని దొంగిలించుటచేత, దీపించి=ప్రకాశించినదై యని యర్థము. పరద్రవ్యముల నపహరించుటచేతఁ బ్రకాశించినదై యని యర్థాంతరము. మూర్ఖాళి సంభావింపఁ=తెలిసీతెలియనివారియొక్క శ్రేణి మెచ్చుఁగానని యర్థము. మూర్ఖురాలైన, ఆలియనఁగాఁ జెలికత్తియ మెచ్చుఁగా నని యర్థాంతరము. కుకవి ప్రణీతకృతి, కుకవి=కుత్సితకవిచేత, ప్రణీత=చెప్పఁబడిన, కృతి=ప్రబంధము, సామాన్యాకృతిఁ బూని (విత్తమాత్రోపాధే స్సకలపురుషాభిలాషిణీ సామాన్యవనితా అను లక్షణలక్షితమైన) వేశ్య యొక్క స్వరూపమును వహించి, భోగము దాఁటిపోయినదై యనుట. పైపై వన్నెల్పదనరింపఁ=పైపై మెఱుఁగులు గనుపడుచుండగా, దానిఁ=ఆకుకవిప్రణీతకృతిని, ధీరోత్తముల్ = పండితశ్రేష్ఠులు, తిలకింపఁ బోరు=విమర్శించి చూడరనియర్థము. దానిఁ=ఆ వేశ్యను, ధీరోత్తముల్=ప్రాజ్ఞులచేతఁ దిరస్కరింపఁ బడని యంతఃకరణములుగల ధైర్యశాలులు, తిలకింపఁబోరు = కన్నెత్తి చూడ రని యర్థాంతరము.

మొదటి పాదమునకు ప్రాసయతి. అర్థద్వయాభేదాధ్యవసాయమువలన నలంకారము శ్లేషమూలకాతిశయోక్తి. ఆకృతిశబ్దము సాదృశ్యవాచకముగాన నలంకార ముపమ. ఉపమకు అతిశయోక్తికి సంకరము.

తాత్పర్యము. కుకవుల కవిత్వము వ్యంగ్యార్థాదికావ్యగుణములును, శార్దూలాది వృత్తనియమములు లేనిదై శబ్దార్థచౌర్యములచే నొప్పారి పామరజనస్తోత్రపాత్రమై పైమెఱుంగులతో నుండునని యర్థము. వేశ్య నిలుకడతో నుండక నడవడి గొంచెపోక శాసింపక విచ్చలవిడిగాఁ దిరుగుచు నితర ద్రవ్యాహరణమె నియతి గాఁ జేసుకొని మూర్ఖలగు చెలికత్తెలు పాటించుచుండ సంచరించుచుండును. కావున (కుకవికవిత్వమును వేశ్యయు) ధీరోత్తములు (పండితులు, ధైర్యశాలురు) దానిని జూడనొల్లరని భావము.

వ. అని యిష్టదేవతావందనంబును సుకవికవితాభినందనంబును గుకవినిందనంబు
నుం గావించి సనాతనాధునాతనాఖిలమహాకవిజనానుగ్రహంబునఁ బురాతన
పుణ్యశ్లోకరాజర్షివర్ణనాకర్ణనోత్కంఠిత సకలజనసేవ్యం బగు నొక్కమహా
కావ్యంబు రసోచిత చమత్క్రియాకల్పభవ్యంబుగా నొనరింపం బూని యున్న
సమయంబున.

అని=ఇట్లని, ఇష్టదేవతావందనంబును=ఇష్టదేవతలనుగురించిన నమస్కారమును, సుకవికవితాభినందనంబును, సుకవి=సత్కవీశ్వరులయొక్క, కవితా=కవిత్వముయొక్క, అభినందనంబును= స్తోత్రమును, కుకవినిందనంబును=కుత్సితకవులదూషణమును, కావించి = చేసి, సనాతన=ప్రాచీనులైనవారును, అధునాతన = నవీనులైనవారునునగు, అఖిలమహాకవిజన = సకలమహాకవులయొక్క, అనుగ్రహంబునఁ=అంగీకారముచేత. పురాతన=ప్రాచీనుఁడైన, పుణ్యశ్లోక = పుణ్యకరమైన కీర్తి గలిగిన, రాజర్షి=రాజర్షియొక్క, వర్ణన=వర్ణనముయొక్క, ఆకర్ణన=వినుటయందు, ఉత్కంఠిత=

స్వజాతోత్కృష్టములైన, సకలజన=సమస్తజనులచేత, సేవ్యంబులు=సేవింపదగినవి, ఒక్కమహాకావ్యంబున్=ఒకమహాప్రబంధమును, రసోచిత = శృంగారాదిరసములకుఁ దగియుండెడు; చమత్క్రియా=శబ్దచమత్కారములయొక్క. కల్పనా=రచనయనెడు, ఆకల్ప=అలంకారముచేత, భవ్యంబుగాన్ = యోగ్యమానట్టులుగా, ఒనరింపంబూని = నిర్మించుటకు సిద్ధపడి, ఉన్నసమయంబునన్ = ఉన్నకాలమందు, దీనికి ముందరిపద్యముతో నన్వయము, 'ప్రకృత్యుక్తప్రకారేణ రచనారసజ్ఞాసీ' యని యథర్వణాచార్యుఁడు.

సీ. వసుమతీభార ధూ◆ర్వహత నెవ్వనియుర్వి రావరాహాంక మ◆ర్థము వహించుఁ
కరగతచక్రవిక్రమశక్తి నెవ్వానిరామానుజత్వంబు ◆ రమణ కెక్కు
జీర్ణకర్ణాటల◆క్ష్మీపునస్సృష్టి నెవ్వానిలోకేశ్వర◆త్వము ప్రసంగుఁ
జటులశార్వరమగ్న◆సర్వవర్ణోద్ధారపటిమ నెవ్వనిరాజ◆భావ మొదవు
తే. నతఁడు వీరప్రతాపరా◆జాధిరాజ, రాజపరమేశ్వరాష్టది◆గ్రాజకులము
నోభయంకరబిరుదస◆న్నుతజయాభి, రామగుణహారి తిరుమల◆రాయశౌరి. 13

ఇందుఁ దిరుమలదేవరాయనికిఁ ద్రిమూర్త్యాత్మకత్వముఁ బ్రతిపాదించి యర్థద్వయమునకు నభేదాధ్యవసాయము చేసి చెప్పినాఁడు. ఎట్లన్నను,

వసుమతీభార=భూభారముయొక్క, ధూర్వహతన్=భారవాహిత్వముచేత, అనఁగా భరించుటచేత, ఎవ్వని=ఏరాజుయొక్క, ఉర్వరావరాహాంకము = భూవరాహరూపమైన బిరుదు, అర్థము వహించున్ = సార్థకత్వమును దాల్చునోయని యర్థము. ఏరాజుయొక్క భూవరాహ మనెడు పేరు సార్థకత్వమును వహించునోయని యర్థాంతరము. రెండర్థములకు నభేదాధ్యవసాయము. అంక మనఁగా లాంఛనమునకును నామమునకును బేరు. 'అంక ముత్సంగచిహ్నయోః, అమ. తిరుమలదేవరాయలు భూవరాహరూపమగు బిరుదము గలవాఁడుగ నుండెనని భావము.

కరగత=హస్తగతములైన, చక్ర=రాష్ట్రములుగలిగిన, విక్రమశక్తిన్ = పరాక్రమశక్తిచేత, ఎవ్వాని=ఏరాజుయొక్క, రామానుజత్వంబు=రామదేవరాయల సోదరత్వము, రమణకెక్కున్ = వన్నెకెక్కునోయని యర్థము. కరగత=హస్తగతమైన, చక్ర=సుదర్శనముయొక్క, విక్రమశక్తిన్ = పరాక్రమశక్తిచేత, ఎవ్వని=ఏరాజుయొక్క, రామానుజత్వంబు = బలరామసహోదరత, అనఁగాఁ గృష్ణమూర్తియగుట, రమణకెక్కునోయని యర్థాంతరము. (ని. 'చక్రం రాష్ట్రే చక్రం సుదర్శన' మని అ.) ఈరెండు చరణములయందును, రాజునకు భూవరాహనామమును గృష్ణరూపమును గలుగఁజెప్పినాఁడు గనుక నామరూపములు చెప్పఁబడినవిష్ణు వని గ్రహింపవలయును. తిరుమలదేవరాయలు హస్తమున రాజ్యచక్రము నిమిడిచికొని స్వతంత్రముగా రాజ్యమును బరిపాలనము గావించుచున్నాఁ డని భావము.

జీర్ణ=శిథిలమయిపోయిన, కర్ణాటలక్ష్మీ=కర్ణాటరాజ్యలక్ష్మియొక్క, పునస్సృష్టిన్=తిరిగి కలిగించుటవలన, ఎవ్వాని=ఏరాజుయొక్క, లోకేశ్వరత్వము=జనేశ్వరత్వము, ప్రసంగున్=ఒప్పుచుండునో యని యర్థము. ఇక్కడ లోకశబ్దము జనపరము (ని. 'లోకస్తుభువనేజనే' అని. అ.) జీర్ణకర్ణుఁడనఁగా వృద్ధశ్రవకి పదపర్యాయముచేత నింద్రుఁడు, అతనినుండి, జటా=దుర్వాసశ్శాపమువలనఁ జలించిన,

క్షుద్రనృపోపద్రవలోపభద్రవద్రసానిత్య రసార్ద్రితానుసంధాయక వైనందిన
దానధారాప్రవాహుండును, నసమసమరసముత్సాహసాహస హసితసిత
వాహుండును, నభంగభువనమంగళసర్వస్వ మరకత పండపుండరీకాగ్రవర్ణనీయ
సువర్ణకలశకర్ణికాధిష్ఠిత రాజ్యలక్ష్మీరత్నోపధానాడంబర సంబోధకాంబురుహ
బంధుబింబానుబింబ వైభవుండును, త్రైలోక్యవినుత చాళుక్య నారాయణా
ఙ్కసంకల్పితాశేష పోషణ ప్రాభవుండును, కృపాణకృష్ణనిర్మథ్యమాన రణా
ర్ణవసముత్పన్న విజయలక్ష్మీనిక్షిప్త నిరుపమ నిరీక్షణలక్ష్మకరమకరపతాకాలోకన
మాత్రసంపాదిత కంపస్వేదభీరూభవన్నానావజీర సేవామానభేనుండును, శ్రీ
రామచంద్రచరణకమలయుగళాభివాసుండును, నాత్రేయగోత్రపావనుండును,
నఖిలకర్ణాటరాజ్యపురుజ్జీవనుండును, శ్రీరంగరాజ రత్నరత్నాకర పూర్ణ
చంద్రుండును నగు తిరుమలరాయదేవేంద్రుండు, నిస్తంద్రవిభవసాంద్రుండై
యొక్కనాఁడు వజ్రకీలితద్వారబంధబంధురలక్ష్మీవిలాసంబు జననసమయజలాంత
ర్లక్ష్యమాణజలజసదనాసమాగమనసంపదసొంపు సంపాదింప సాభోగయవనికా
భ్యంతరసద్వ్యస్నముద్వ్యతయంత్రపాంచాలికాసంచారంబులు జిలుగుతరంగల
మఱుంగుదొరంగివచ్చు నచ్చరమెఱుంగుబోండ్ల తెఱంగు లెఱుంగింపఁ జంద్రకాంత
భిత్తిబింబిత చంద్రాననావదనంబులు తరంగభక్తిబహుళాకృత నవేందుబింబం
బుల యందంబు పొందుపఱుప నభినవస్ఫటికోపలసంస్థాపిత సోపానపార్శ్వ
కరికరాకారరేఖావిశేషంబులు సప్రతిచ్ఛాయ సంజాయమానసంక్రందనవేదండ
శుండాదండప్రచారంబులం బచరింపఁ గలశవారాశిచెలువునం బోలు పలరు
విమలపట్టాంబరవితానవిద్యోతమాన మహాస్థానభవనరాజంబునం దెలిదీవిశీవి
నలరు నమూల్యముక్తామయసింహాసనంబున సుఖాసీనుండై సామంతమకుట
ఘట్టనజాత జాతరూపరేణుపరంపరఁ బీతాంబరత్వంబు వహించిన మిత్రవర్గం
బుతో సారూప్య దేదీప్యమానభక్తోపలాలనపరాయణుండగు నాదినారాయణు
కరణి సిరుల నిరవొందుచు. **14**

పొడిరియుత్ = మఱియును, ప్రచండ=మిక్కిలితీక్ష్ణమైన, రుచి=తేజస్సుచేత, పరిమండిత=పరిపూర్ణమైన, మార్తాండమండల = సూర్యమండలమువలె, పాండిత్య=సామర్థ్యముచేత, భూషిత=అలంకరింపఁబడిన - అనఁగా సూర్యమండలమువలె సముజ్జ్వలమైన, భుజార్గళ=తలుపున కడ్డము వేయుం గడియమానులవంటి భుజములయొక్క, నిరర్గళ=అడ్డములేని, ప్రతాప=పరాక్రమముయొక్క, దీపిత=ప్రకాశించుచున్న. వర్తమానార్థమం దుక్తప్రత్యయము. ప్రకాశ=ప్రకాశముచేత, కౌశికీభూత=గుడ్లగూబవలె నంధులైనవారును, ఇంద్రులైనవారును, (ని. 'మహేంద్రగుగ్గులూలూకవ్యాళగ్రాహిషు కౌశికః' అని అ.) కదనభూతల=యుద్ధభూమియందు, భీత=భయపడినవారును, అభీత=భయపడనివారునునగు, విమతక్ష్మాధీశ్వరుండును=శత్రురాజులుగలవాఁడును, ఇక్కడ క్రమాలంకారము. అనఁగా నీరాజు యొక్క మిక్కిలి తీక్ష్ణమైన భుజపరాక్రమముచేత యుద్ధమందు భయపడి పాఱిపోయిన శత్రురాజులు

భూమియనుసతి నీచనృపులవలని బాధయను తాపముచేఁ జరితపించుచుండె శిశిరకృత్యములచేఁ దాపము బోఁగొట్టవలయును గావున దానధారలచే రసార్ద్రీభావము సంతరించె ననియు, దానధారలు ప్రతిదినమును నతిశయించుటచే ధారాజలము ప్రవాహరూపము దాల్చెననియుఁ దిరుమలరాయ లవతరించి భూకాంతసౌఖ్యము గడించుటచే భద్రవతి యయ్యెననియు భావము. భేరీభాంకరణము మేఘధ్వనిగను పట్టాభిషేక సమయావర్జిత శాతకుంభకుంభములు మేఘములుగాఁ జెప్పఁబడుటచే భూమికి రసార్ద్రిత సమస్తావయవములకుఁ జెందెనని గ్రహింపవలెను. అలంకారములు: అతిశయోక్తి రూపకానుప్రాణితో, ఉత్ప్రేక్షయు.

అసమ = సమానరహితమైన, సమర=యుద్ధమందలి, సముత్సాహ=మిక్కుటమైన యుల్లాసము చేతను, సాహస = తెగువచేతను, హసిత=పరిహసింపఁబడిన, సితవాహనుండు = శ్వేతవాహనుఁడయిన యర్జునుఁడును,

అభంగ=భంగములేనిదియు, భువనమంగళసర్వస్వ = జగన్మంగళమునకు యావద్ధనమైనదియు, మరకతదండ = మరకతరత్నమయమైన కాడగలిగినదియునగు, పుండరీక = శ్వేతచ్ఛత్రమనెడి, అభంగ= తరంగప్రసారములేనిదియు, భువనమంగళసర్వస్వ = సలిలమంగళమునకు యావద్ధనమైనదియు, మరకతదండ = మరకతమణివలె పచ్చనైనమృణాళము గలిగినదియు, (ని. 'భఙ్గ స్తరఙ్గే రుగ్భేదే భేదే జయవిపర్యయే, భువనం విష్టపే లోకే సలిలేపి వియత్యపి.' అని వి). (మకరవక్త్రాజ్జాతం మరకతం) మకరవక్త్రమువలన రత్నములు పుట్టునని ప్రసిద్ధి. శ్లో. 'ప్రసహ్య మణి ముద్ధరే న్మకరవక్త్రదంష్ట్రాంతరాత్,' అని భర్తృహరి. మకరవక్త్రమునందు రత్నము జనించు ననుటకు రత్నశాస్త్రమునందలి యీపద్యము దృష్టాంతము కాఁగలదు.

క. "జలధరఫణిఫణనీచయ, జలచరకరిమస్తవేణుకంబువరాహో
జ్జ్వలవంశ్రశుక్తు లుదరంబుల ముత్యము లొదవు వర్ణములు వివిధములై."

ఈశబ్దమువలె వర్ణవ్యత్యయసిద్ధములైన శబ్దము లనేకములు గలవు. కశ్యపః, పశ్యకః, హింసికా, సింహికాఇత్యాదులు. పుండరీక=తెల్లతామరయొక్క, అగ్రకోనయందలి,వర్ణనీయ = స్తోత్రముచేయఁదగిన, సువర్ణకలశ=శ్వేతచ్ఛత్రాగ్రమందలి బంగారపుకలశ మనెడి, కర్ణికా=దిమ్మెయందు, అధిష్ఠిత=నివసించిన, రాజ్యలక్ష్మీ=రాష్ట్రసంపదయొక్క, రత్నోపధాన=పద్మరాగమణిమయమైనయొరుగుడుబిళ్ళయొక్క, ఆడంబర = విజృంభణమునను, సంబోధక = తెలివిడిపఱచునట్టి, అనఁగా నొరుగుడుబిళ్లయొక్క విలాసమును గనుబఱచుచున్నట్టి, అంబురుహాబంధుబింబ = సూర్యబింబముయొక్క, అనుబింబ=ప్రతిఫలించుటయొక్క, వైభవుండును = వైభవముగలవాఁడును, అనఁగా నీరాజుయొక్క శ్వేతచ్ఛత్రసువర్ణకలశమందు సూర్యబింబము ప్రతిఫలింపఁగా నెట్లుండు ననిన నాశ్వేతచ్ఛత్రమనెడి శ్వేతపద్మమందు నివసించియుండు రాజ్యలక్ష్మియొక్క కెంపులుగూర్చిన యొరుఁగుడుబిళ్లయో యనునట్లుండు నని తాత్పర్యము. వి. 'పుణ్డరీకం సితామ్భోజే సితచ్ఛత్రేపి భేషజే' అని వి.

మరకతదండముతోడను వర్ణకలశముతోడను నొప్పారి భువన (లోక-జల) మంగళసర్వస్వమగు శ్వేతచ్ఛత్రము పుండరీక మని చెప్పఁబడుటచే ఛత్రదండము మృణాలమనియుఁ ఛత్రాగ్రమునఁ గల సువర్ణకలశమె కర్ణిక యనియు నందు రాజ్యలక్ష్మి నివసించుచున్నదనియుఁ బ్రతిబింబరూపముగ నున్న

సూర్యబింబ మెరుగుడుబిళ్లయనియు చెప్పఁ గను. శ్వేతచ్ఛత్రమునకుఁ బుంశికమనియుఁ గావుఁ బ్రతిబింబించు సూర్యునకు అంబుజబాంధవుఁడనియుఁ జెప్పుటచే రత్నస్థగితమగు శ్వేతచ్ఛత్రము సూర్య కిరణప్రసారముచేఁ బ్రజ్వరిల్లుచుండెనని స్వారస్యము.

త్రైలోక్య = మూఁడులోకములవారిచేత, వినుత = స్తోత్రముచేయఁబడిన, చాళుక్యనారాయణాంక = చాళుక్యనారాయణబిరుదమనెడి నామముచేత, సంకల్పిత = సంకల్పింపబడిన, అశేషపోషణ ప్రాభవుండును = సమస్తజనపోషణమందు సామర్థ్యముగలవాఁడును, నారాయణమూర్తి సర్వప్రపంచ పోషకుఁడనుట ప్రసిద్ధంబకదా.

కృపాణ = ఖడ్గమనెడు, కృష్ణ-కృష్ణనామముగల విష్ణువుచేత, నిర్మథ్యమాన = లెస్సగా మథింపఁ బడుచున్న, రణార్ణవ = యుద్ధమనెడుసముద్రమువలన, సముత్పన్న = ఉద్భవించిన, విజయలక్ష్మీ=విజయ సమృద్ధియనెడు సంపదచేత, నిక్షిప్త=ప్రసరింపఁజేయఁబడిన, నిరుపమ=అసమాన,నిరీక్షణ=చూపులయొక్క, నర్మకర=విలాసమునుగలుగఁజేయుచున్న, నిరీక్షణములో యున్నట్టులుగానున్న, మకరపతాకా=చిత్రిత మకరాకారములుగల టెక్కెములయొక్క, అనఁగా వైరకుటిపాసీలయొక్క, ఆలోకనమాత్ర=చూచుట మాత్రముచేత, సంపాదిత=సంపాదింపఁబడిన, కంప=వడఁకును, స్వేద = చెమటయును గలిగి, భీరూ భవత్=భయశీలురగుచున్న, నానా = సమస్తమైన, వజీర = మ్లేచ్ఛప్రధానులయొక్క, సేనా=సైన్య ములయొక్క, మాన=గర్వమును, భేదనుండును=పోఁగొట్టినవాఁడును, మకరపతాకలు విజయలక్ష్మీ నిరీ క్షణములవంటివి గనుక తదాలోకనముచేత వజీరసైనికులు కంపస్వేదరూపశృంగారానుభావములు గల వారైరనుట, కంపస్వేదములు శృంగార భయానకరస సాధారణములు గనుక భీరూభవద్వజీర సేనల యొక్క భయానకరసకార్యములైన కంపస్వేదములను శృంగారరసకార్యములైన కంపస్వేదములనుగా నధ్యవసించినాఁడు.

లక్ష్మి సముద్రమథనమున జనించినట్టుల విజయలక్ష్మికూడ జనించెను. ఎటులన, ఖడ్గమను విష్ణువుచే మథింపఁబడిన సంగ్రామమనెడు సముద్రమునందు లక్ష్మివలె విజయలక్ష్మి జన్మించినదనియు నాయకు వాలాదృగ్చాపులవలె మకరపతాక లొప్పుటచే నరకవజీరులు కంపము స్వేదము (వణఁకుట, చెమర్చుట) శృంగార భావవికారముల నొందిరని భావము. చూపులు రూపసంపదకంటె మోహాకరములనుట నిర్వివా దాంశము. "వీక్షాలసీసమంచిత కరళాక్షిపాతములచే గెలువఁబడి కెంప్రముఖస్త్రీలు" అను పద్య మిట ననుసంధించుకో నగును.

శ్రీరామచంద్ర=శ్రీరామస్వామియొక్క, చరణకమలముగళ=పాదపద్మములద్వంద్వమునుగూర్చి, అభివాదనుండును = నమస్కారములు గలవాఁడును, ఆత్రేయగోత్రపావనుండును = ఆత్రేయగోత్ర మును బవిత్రముచేసినవాఁడును, అనఁగా వద్గోత్రజుఁడనుట, అఖిలకర్ణాటరాజ్యపునరుజ్జీవనుండును, అఖిల= సమస్తమయిన, కర్ణాటరాజ్య = కర్ణాటరాజ్యముయొక్క, పునరుజ్జీవనుండును = మరల నుద్ధ రించుటగలవాఁడును, శ్రీరంగరాజరత్న=శ్రీరంగరాజశ్రేష్ఠుఁడనెడు,రత్నాకర = సముద్రమునకు, పూర్ణ చంద్రుఁడును = రాకాసుధాకరుండును, అగు=ఆయినట్టి, తిరుమలరాయ దేవేంద్రుండు = తిరుమల రాయశ్రేష్ఠుఁడు, ఇంతపర్యంతము జోడుగా సంకల్పియముగను చెప్పినాఁడు. నిస్తంద్రవిభవ సాంద్రుఁడవై=నిశ్చలమైన యైశ్వర్యముచేత సంపూర్ణుఁడవై, పిక్కవాఁడు=పికదినమును,

ఇక్కడ కవి ఆ రాజుయొక్క సభామంటపమును క్షీరసముద్రముగాను సింహాసనమును శ్వేతద్వీపముగాను రాజు నాదినారాయణమూర్తినిగాను వర్ణించుచున్నాఁడు. ఎట్లనిన, వజ్రకీలిత = వజ్రమణులుదాపిన, ద్వారబంధ = ద్వారబంధమందు, అనఁగా లక్ష్మికమ్మియందు, బంధుర = సుందరమౌచున్న, లక్ష్మీవిలాసంబు = లక్ష్మీప్రతిమయొక్క విలసనము, జననసమయ = జన్మించుసమయమందు, జలాంతర్లక్ష్యమాణ = ఉదకములోపలఁ గనుపడుచున్న, జలజసదనా = లక్ష్మీదేవియొక్క, సమాగమన సంపద = వచ్చునట్టి వైభవముయొక్క, సొంపు = శృంగారమును, సంపాదింపన్ = కనుపఱుప, సాభోగ = పరిపూర్ణతతోఁ గూడిన, అనఁగా విశాలమైన, యవనికా = తెరయొక్క, అభ్యంతర = లోపలనుండి, సద్యః = అప్పుడె, సముద్గత = బయలువెడలి రాఁజూచుచున్న, యంత్రపాంచాలికా = కీలుబొమ్మలయొక్క, సంచారంబులు = ప్రచారములు, (ని. 'పాంచాలికా పుత్త్రికా స్యాద్వస్త్రదన్తాదిభిః కృతా' అని అ.) జిలుగుతరంగలమరుంగుచొరంగి వచ్చు = సాంద్రములైన యలలయొక్క మరుగును విడిచివచ్చుచున్న, అచ్చరమెఱుంగుబోండ్లు = అప్సరః స్త్రీలయొక్క, తెఱంగు తెఱంగింపన్ = విధములను దెలియఁజేయుచుండఁగా, తరంగలనుటకు, క. పులకము బలకము లనఁగాఁ, బులక లలక లనఁ దరంగములు నాఁగఁ దరం, గలు తరగ లనఁగ హంసంబులు హంస లనంగఁ గృతులఁ బోలుచు ముకుందా. అని యుదాహరణము. చంద్రకాంత = చంద్రకాంతమణి నిర్మితములైన, భిత్తి = గోడలయందు, బింబిత = ప్రతిఫలించిన, చంద్రాననావదనంబులు = చంద్రునివంటిముఖములుగల స్త్రీలయొక్క వదనములు, తరంగభక్తి = తరంగములయొక్క రచనచేత, బహూకృత = అనేకములుగాఁ జేయఁబడిన, నవ = నూతనమైన, ఇందుబింబంబుల = చంద్రబింబములయొక్క, అందంబులు = చక్కఁదనములను, పొందుపఱుపన్ = చక్కఁజేయుచుండఁగా,

అభినవ = మిక్కిలినూతనములైన, స్ఫటికోపల = స్ఫటికమణులచేత, సంస్థాపిత = స్థాపింపఁబడిన, సోపానపార్శ్వ = మెట్లప్రక్కలయందలి, కరికరాకార = గజతుండాకృతులుగాఁ జేర్పఁబడిన, రేఖావిశేషంబులు = రేఖాభేదములు, సప్రతిచ్ఛాయ = ప్రతిబింబముతోఁ గూడునట్టులుగా, సంజాయమాన = జన్మించుచున్న, సంక్రందనవేదండ = ఐరావతముయొక్క, శుండాదండ = తుండముయొక్క, ప్రచారంబులన్ = విధములను, పచరింపన్ = కల్పించుచుండఁగా, కలశవారాశిచెలువునఁ బొలుపలరు = క్షీరసముద్రమువలె నొప్పుచున్న, విమల = స్వచ్ఛమైన, పట్టాంబర = పట్టువస్త్రముయొక్క, వితాన = మేలుకట్టుచేత, (శ్లో. 'అస్త్రీ వితానముల్లోచః' అని అ.) విద్యోతమాన = మిక్కిలియుఁ బ్రకాశించుచుండెడు, మహాస్థాన భవనరాజంబునన్ = ఘనమైన యాస్థానమంటపశ్రేష్ఠమందు, తెలిదీవిఁ గేలినలరు = శ్వేతద్వీపమువలె నొప్పుచున్న, దీవి యనుపద మన్యదేశ్యము. అమూల్యముక్తామయసింహాసనంబునన్ = అమూల్య = విలువలేనట్టి, ముక్తామయ = ముత్తియములఁ గూర్చిన, సింహాసనంబునన్ = సింహాసనమందు, సుఖాసీనుండై = హాయిగాఁ గూర్చున్నవాఁడై, సామంత = సమానప్రతిపత్తిగలరాజులయొక్క, మకుట = కిరీటములయొక్క, ఘట్టన = ఒరయికలచేతను, జాత = పుట్టిన, జాతరూప రేణు = బంగారపు రజముయొక్క. (శ్లో. 'చామీకరం జాతరూపం' అని అ.) పరంపరన్ = వరుసలచేత, పీతాంబరత్వంబు వహించిన = పచ్చనివస్త్రములుగలుగుటను దాల్చినవిష్ణుసారూప్యమువహించిన, మిత్త్రవర్గంబుతోన్ = స్నేహితులసమూహముతో, అనఁగా సామంతరాజులకిరీటములు రాపాడి రాలిన బంగారపు రజముచేత దగ్గరనున్న స్నేహితుల వస్త్రము లన్నియు బంగారువస్త్రములవలె నుండె నని

వసు—

భావము. సారూప్య = సమానరూపత్వముచేత, సేవ్యమాన = మిక్కిలి ప్రకాశించుచున్న, భక్త = ఏకాంతులయొక్క, ఉపలాలన = మన్ననయందు, పరాయణుండగు = ఆసక్తుండైన, ఆదినారాయణు కరణిన్ = శ్వేతద్వీపనివాసుండైన యాదినారాయణమూర్తివలె, సిరుల నిరవొందుచున్ = సకలైశ్వర్యములచేత నొప్పుచున్నవాఁడై, అని ముందర కన్వయము.

సీ. కటకేంద్రుఁ డంపిన • గంధసింధురము లాత్మస్వామిమారుహ • స్తములు మొగుడ
హయనాథుఁ డంపిన • హరులు కైజామోర లార్చుచుఁ బతికి జో • హారు సేయ
నావాడపతిపంపి • నయమూల్యకటకముల్ కర్తపేరుగఁ బదా • గ్రములఁ బెనఁగఁ
బాండ్యేశుఁ డంపిన • భర్మంబు లధిపతి ప్రతిగా నిజాంకము • ద్రలు వహింప
తే. శౌర్యకీర్తులతో వచ్చు • సకలదిగ్న
రేంద్రరాజ్యేందిరలమాడ్కి • నిగురుబోఁడ్లు
చటులమాణిక్యమయదండ • చారుచామ
రములు వీవంగఁ జేరోల • గమున నుండి. 15

కటకేంద్రుఁడు = కటకపురిరాజు అనఁగా గజపతి, అంపిన = పంపించిన, గంధసింధురములు = మదపుటేనుఁగులు, ఆత్మస్వామిమారు = తమరాజు ప్రత్యామ్నాయముగా, హస్తములు మొగుపన్ = చేతులు జోడించి మ్రొక్కఁగానని యర్థము. తుండములు ముడవఁగాననిభావము. ని. 'హస్తోనక్షత్రభేదే స్యాత్కరేభకరయోరపి' అని వి.

కటకపాలకుఁడు గజపతియగుటచే నేనుఁగులను బంపెననియు నవి హస్తములను మోడ్చి తమ యజమానులకు బదులుగా రాజభక్తి సామంతధర్మము ప్రకటింపసాగెను.

హయనాథుఁడంపిన = అశ్వపతిపంపిన, హరులు = గుఱ్ఱములు, కైజామోరలార్చుచున్ = కైజామోరలనఁగా, కళ్లెముతో వెనుకబిగించిపెట్టిన మూతులు, వానినల్లార్చుచున్ = చిమ్ముచు, పతికిన్ = తమరాజునకుఁ బ్రతిగాననుట, జోహారుసేయన్ = దండములు పెట్టఁగా,

అశ్వపతియను మహమ్మదీయుఁ డంపిన జాతిగుఱ్ఱములు కళ్లెపుఁబూన్కిచే మెడలు మూతులు బిగఁబట్టి కదలించుచు నుంట నమస్కారసమయమునందలి తలకదల్చుటతో సమముగా నుండెననియుఁ దమప్రభువులకుమాఱ నవి నమస్కరించుచుండెననియు నెఱుంగనగును.

నావాడపతిపంపిన = నావాడదేశాధిపతిపంపించిన, ఇక్కడ నావాడ యనఁగా దేశవిశేషవాచకమగు నకారాదిపదము, అమూల్యకటకముల్ = విలువలేనట్టి గండపెండేరములు, కర్తపేరుగన్ = తమరాజు పేరుగా, పదాగ్రములఁబెనఁగన్ = పాదాగ్రంబులయందుఁ బెనుచుకొనఁగా,

నావాడదేశప్రభువుపంపిన కటకాద్యాభరణములు ప్రభువునకు మాఱుగాఁ బాదములను బెనఁగి విడువకుండెను. దోషులగువారు పాదములపైఁబడి వదలక పెనఁగినటులఁ గటకము లుండెను.

పాండ్యేశుఁడంపిన = పాండ్యదేశాధిపతి పంపిన, భర్మంబులు = సువర్ణంబులు, అధిపతిప్రతిగాన్ = తమరాజునకు బదులుగా, ఇక్కడ ప్రతి యనునది దేశ్యపదము గాని సాంస్కృతికావ్యయము గాదు. 'ప్రతిమాట లేటికిఁ బలుకవయ్య' యని శబ్దానుశాసనుప్రయోగము. నిజ = తనయొక్క, అంక ముద్రలు వహింపన్ = తిరుమలరాయఁడు వరాహధ్వజుఁడు గనుక లాంఛనమైన వరాహముద్రల

నవిరిత్యర్థము, ఏడు శాస్త్రములందు సప్తసంతతులు బలసెను. అప్పు. ఇందుఁ గృతిగాక తక్కినసంతానములకుఁ బ్రతిష్ఠ సేసినచోటనే యుండునదియును గృతిమాత్రము సర్వత్ర వ్యాపించునది యనియును దాత్పర్యము. వానికిని = తక్కిన యాసంతానములకును, కృతిముఖంబున నె = కృతిమూలముచేతనే, విశ్వవిఖ్యాతిగాన్ = ప్రపంచమునందుఁ బ్రసిద్ధిగలుగునట్లుగ, కృతియె = ప్రబంధమే. సంతతి పతంబున = సంతానములలో శ్రేష్ఠమైనది, అది మాకు సంఘటింపు = కాఁబట్టి మాకృతి మాకు ఘటించునట్లొనర్పుము. అనఁగా. ప్రబంధము చెప్పి యది మాకుఁ గృతి యిమ్మనుట.

తాత్పర్యము. సప్తసంతానములలోఁ జేరిన తటాకాదిసంతానములు ఎట నిలిపిన నచటనే యుండును. వానికి వ్యాపకశక్తి లేదు. సమస్తసంతానముఁ గృతివలననే పేరు ప్రతిష్ఠలు కలుగునుగాన కృతిరచన గావింపు మని కృతికర్త కవిని గోరెను.

ఉ. కేవలకల్పనాకథలు ♦ కృత్రిమరత్నము లాద్యసత్కథ
ల్వావిరిపుట్టురత్నము ల♦ వారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు ♦ సానలఁ దీరినజాతిరత్నముల్
గావున నిట్టిమిశ్రకథ♦గా నొనరింపుము నేర్పుపెంపునన్. 19

కేవలకల్పనాకథలు = పురాణాదులయందుఁ జెప్పఁబడక కేవలము కవిచేతఁ గల్పింపఁబడినకథలు, కృత్రిమరత్నములు = గాజుపచ్చలు సుమ్మాయిముత్యములు మొదలైనవానివంటివి, ఆద్యసత్కథల్ = పూర్వరాజచరిత్రలు, వావిరిపుట్టురత్నములు = పుట్టినవి పుట్టినట్టుగానే యుండువజ్రములు మొదలైనవానివంటివి, అవారిత = నివారింపఁబడని, సత్కవికల్పనా = శ్రేష్ఠుఁడైనకవియొక్కరచన యనెడు. విభూషా = అలంకారమును, వహ = వహించిన, పూర్వవృత్తములు = పూర్వులయొక్క కథలు సానలఁదీరినజాతిరత్నముల్ = వజ్రపుసానలఁదీర్పఁబడిన యుత్తమరత్నములవంటివి, కావునన్ = కాఁబట్టి నేర్పుపెంపునన్ = నిపుణత్వాతిశయముచేత, ఇట్టి మిశ్రకథగా నొనరింపుము = ఈలాటి మిశ్రకథగా నుండునట్లు రచియింపుము, అనఁగాఁ గవికల్పనాచమత్కృతియును బూర్వరాజవృత్తాంతమును గూడియుండునట్లు లోకకృతి రచియింపు మనుట. అలంకారము. రూపకము.

తాత్పర్యము. కేవలము పురాణకథావస్తువిశేషము లేక కల్పింపఁబడిన కథావస్తుకావ్యములు పచ్చలు గాజుతాళ్ళవంటి కృత్రిమరత్నములు. పురాణకథలు గనినుండి యప్పుడే తీసిన రత్నపుమూలగ తాళ్ళవంటివి. కల్పనామనోహరములగు పూర్వకథావిశేషములు సానలతేలిన మణులవంటివి గావున మిశ్రకథ నేర్పుమెయి గావింపు మని భావము.

వ. అని సబహుమానంబుగాఁ దాంబూలజాంబూనదాంబరాగ్రహారాది ప్రదానంబుల నాదరించుటయు నేను నానందకందళితాంతరంగుండ నై కృతిపతి వంశావతారం బభివర్ణించెద. 20

అని=ఇట్లు పలికి, సబహుమానంబుగాన్ = బహుమానపూర్వకముగా, తాంబూల = కర్పూరతాంబూలమును, జాంబూనద = సువర్ణమును, అంబర = చీనాంబరములును, అగ్రహార = అగ్రహారములును, ఆది = మొదలుగాఁగలవానియొక్క, ప్రదానంబులన్ = ఈవులచేత, ఆదరించుటయున్ = మన్నన సేయఁగా, ఏనున్ = నేనును, ఆనంద=సంతోషముచేత, కందళిత=పల్లవించుచున్న, అంతరంగుఁడనై = అంతః

వాఁ డనియును నక్షత్రమార్గమందు, అనఁగా నాకాశమందుఁ బ్రవర్తించువాఁ డనియును భావము.

కువలయానందకరుఁడు తమోహారి యను విశేషణములవలన నిట సూచితుఁడైనవాఁడు లోకానందకరుఁడును అహంకారాది దుర్గుణములఁ బోఁదోలువాఁడై యౌవనము నాంతమున సుప్రసిద్ధుఁడై యుండెనని గ్రాహ్యము.

వసువులుగురియు = వసువులనఁగా ధనములును, కిరణములును గనుక ధనముల వెదఁజల్లునట్టి, విబుధదాతృతిలకుండు = శ్రేష్ఠులైనదాతలకు భూషణమైనవాఁడని యర్థము, కిరణములను బ్రసరింపఁ జేయువాఁడనియును. విబుధులనఁగా దేవతలు, ప్ర. 'ప్రథమాం బిబతే వహ్ని ర్ద్వితీయాం బిబతే రవిః' అను రీతిగా దేవతలకుఁ గళాప్రదానములచేత దాతృశ్రేష్ఠుఁడైనవాఁడనియును భావము. వి. 'దేవభేదే నలేరశ్మౌ వసూ రత్నే ధనే వసు' అని వి. లచ్చితోఁబుట్టిన = అగర్భశ్రీమంతుఁడైన, లక్షణాఢ్యుఁడు = విశాల ఫాలత్వాది శుభలక్షణసంపన్నుఁడనియర్థము. లక్ష్మీదేవికిఁ దోఁబుట్టినవాఁడనియును మృగ లాంఛనుఁ డనియును భావము.

వసువులు గురియుట లచ్చితోఁబుట్టుట యనువిశేషణములవలన నిందుఁ జెప్పఁబడినవాఁడు దాతయనియు నైశ్వర్యసమృద్ధి గలవాఁడనియు గ్రాహ్యము.

అంబుజాసనుఁడనన్ = బ్రహ్మయనునట్లులుగానని యర్థము. కమలాసులను దిరస్కరించువాఁడని భావము. విధుఁడనఁగన్ = విష్ణువనునట్లులుగాననియర్థము. విధునామముగలవాఁడని భావము. సోముఁ డనన్ = శివుఁడను నట్టులుగా నని యర్థము. సోమనామముగలవాఁడని భావము. నెగడి = ప్రకాశించి, హంససంగతినదరన్ = హంసవాహనసంగతిచేత: బ్రకాశించుటకు నని యర్థము.

సూర్యసంగమముచేఁ జంద్రుఁడు ప్రకాశించు ననుటకు

తే. ఇనకర స్పర్శనంబున నింపుమిగిలి, చిన్నిసారంగధరుఁడు భ్రాజిల్లునట్లు

ఇనకరస్పర్శనంబున నింపుమీఱి, చిన్నిసారంగధరుఁడు భాసిల్లసాగె.

సారంగధరచరిత్రము.

సూర్యసంగమముచేతఁ బ్రకాశించుటకనిభావము. (ని. 'వహా శ్వేతచ్ఛదే హంసః' అని అ.) సురలఁ బ్రోవన్ = దేవతల రక్షించుటకు ననియర్థము. అమృతకళాదానముచేత దేవసంరక్షణముసేయుట కనిభావము. సురలనెడుపదమునకు స్త్రీత్వబహుత్వములు వచ్చుటను. ని. 'స్త్రీత్వబహుత్వే సురా దేవసమాసే' అని న. దాక్షాయణీ ప్రేమఁబూనన్ = పార్వతియందుఁ బ్రీతివహించుటకనియర్థము. అశ్విన్యాదినక్షత్రములయందుఁ బ్రీతివహించుట కని భావము. చంద్రునికి రోహిణియందుఁ బ్రేమాతిశయము గనుక నిచ్చట రోహిణియందనిచెప్పిన విశేషము. ని. 'దాక్షాయణీ త్వపర్ణాయాం రోహిణ్యాం తారకాసుచ' అని వి. నేర్పుజాణ = నేర్చిన చతురుఁడును, కాంతినిస్తంద్రుఁడు = కాంతియందు నిశ్చలుఁడైనవాఁడునైన, చంద్రుండు = చందురుఁడు, అలరున్ = ఒప్పుచుండును.

తాత్పర్యము. కృతికర్తకుఁ గూటస్థుఁ డగుచంద్రుఁడు తొలుతఁ బాలసముద్రమున జనించి దిన దినాభివృద్ధి శుక్లపక్షమున నొందుచు రాత్రుల నలంకరించి షోడశకళాశాలియై కలువలఁ దనుపుచుఁ జీకటులఁ బోఁదోలుచుఁ గిరణప్రసారము గావించుచు లక్ష్మికి సహోదరుఁడై త్రిమూర్తిరూపముగ హంససంగతితో నలరారెను. సురలఁ బ్రోవ దాక్షాయణీ (అశ్వినీ) ప్రేమ దాల్చెను.

అలంకారము. కావ్యలింగము. సమాసోక్తి. రూపకము.

చ. అతనికిఁ గల్గె సౌమ్యుఁడు గుణార్జవరమ్యుఁ డతం డవార్యదో
ర్ధ్యుతదివిజారిభైరవుఁ బురూరవుఁ గాంచెఁ జిరాయు వాయు వా
కృతికి జనించె నాసుకృతికిం గలిగె న్నహుషుం డకల్మషుం
డతనికిఁ బుట్టె శామ్యదభియాతి యయాతి తదన్వయంబునన్. 22

అతనికిన్=ఆ చంద్రునికి, గుణార్జవరమ్యుఁడు, గుణ = సుగుణములయొక్క, ఆర్జవ=ఋజుభావముచేత, అనఁగా దిన్నఁదనముచేత, రమ్యుఁడు=సుందరుఁడైన, సౌమ్యుఁడు=అనఁగా మనోజ్ఞుఁడైన బుధుఁడు, ఇక్కడ శ్లిష్టవిశేషణము. ని. 'సౌమ్యో బుధే మనోజ్ఞేస్యా దనుగ్రే సోమదైవతే' అని వి.) కల్గెన్=సంభవించెను. ఆతండు=ఆ బుధుఁడు, అవార్యదోర్ద్యుతదివిజారిభైరవున్, అవార్య=నివారింపశక్యముగాని, దోర్ద్యుత=భుజపరాక్రమముగల, దివిజారి = రాక్షసులకు, భైరవున్= భయంకరుఁడైన, పురూరవున్=పురూరవుని, కాంచెన్=కనియెను. చిరాయువు=దీర్ఘాయుష్మంతుఁడైన, ఆయువు=ఆయువనెడిరాజు, ఆకృతికిన్=కుశలుఁడైన యాపురూరవునికి, జనించెన్=జన్మించెను. ఆ సుకృతికిన్ = పుణ్యాత్ముఁడయిన యా యాయువునకు, అకల్మషుండు = కల్మషరహితుఁడయిన, నహుషుండు=నహుషుఁడనెడిరాజు, కలిగెన్ = పుట్టెను. అతనికిన్ = ఆ నహుషునికి, శామ్యదభియాతి, శామ్యత్=నశించుచున్న, అభియాతి=శత్రువులుగల, యయాతి = యయాతియనెడు రాజు, పుట్టెన్=జనియించెను. తదన్వయంబునన్=ఆ యయాతియొక్క వంశమందు, ఇది ముందరి పద్యమున కన్వయము.

తాత్పర్యము. పూర్వోక్తగుణవిశిష్టుఁడగు నాచంద్రునకు గుణగణశోభితుఁడు మనోహరరూపుఁడగు బుధుఁడును, ఆతనికి రాక్షససమూహభయంకరుఁడగు పురూరవుఁడును, నాతనికిఁ జిరంజీవియగు నాయువును, నతనికిఁ బాపరహితుఁడగు నహుషుండును జన్మమొందిరి. ఆ నహుషునకు విరోధుల బీరము శాంతింపఁజేయు యయాతి జనించెను. ఆవంశమునందు —

శా. ద్వీపప్రోద్భవసూక్తపంచమమహావేదంబు దీపించె నే
భూపాలోత్తముపేర భారతియు నేపుణ్యాత్మువంశస్తవం
బాపాదించి కృతార్థ యయ్యె నతఁ డాశాంతక్షమాపాలన
వ్యాపారాభిరతుండు వొల్చు భరతుం డాత్రేయగోత్రేయుఁడై. 23

ద్వీప=ఏటినడిదీవియందు, ప్రోద్భవ=ఉద్భవించిన వ్యాసులచేత, సూక్త=లెస్సఁగాఁ జెప్పఁబడిన పంచమమహావేదంబు, (శ్లో. 'భారతఃపఞ్చమో వేదః' అని చెప్పియున్నది గనుక) నయిదవ వేదమయిన భారతము. ఏభూపాలోత్తముపేరన్=ఏ రాజశ్రేష్ఠునిపేరిట, దీపించెన్=ప్రకాశించెనో, భరతమధికృత్యకృతోగ్రంథః భారతః అనఁగా భరతు నధికరించి చేయఁబడినగ్రంథము భారతము. భారతియున్=సరస్వతీదేవియును, ఏ పుణ్యాత్మువంశస్తవం బాపాదించి కృతార్థయయ్యెన్ = ఏధర్మాత్మునియొక్క వంశస్తవమును బ్రతిపాదించి కృతార్థురాలాయెనో, అనఁగా భరతునివంశస్తవరూపమైన ధన్యత్వము నొందెనోయని యర్థము. భరతస్య పుణ్యాత్మనాగుణేనభారత్యాః కృతార్థత్వగుణోవర్ణిత ఇత్యుల్లాసాలంకారః. (శ్లో. 'ఏకస్యగుణదోషాభ్యా ముల్లాసోన్యస్యతౌయది' ఇతిలక్షణమ్.) కృతార్థయనఁగా నన్వర్థయనియు భరతవంశస్తవాపాదనమ్ముచే భారతియని యన్వర్థనామము గలదనియును గ్రహింప

వలయును. (భరతస్యేయం భారతీ, సరస్వత్యాః భారతీతి నామ ప్రసిద్ధమ్, తస్యయోగతో న్యర్థప్రకల్పనాన్నిరుక్త్యలంకారః. శ్లో. 'నిరుక్తిర్యోగతో నామ్నామన్యార్థత్వప్రకల్పన' మితిలక్షణమ్.) అతండు, ఆశాంతక్షమా = దిక్కులంతముగాఁగల భూమియొక్క, పాలన = పరిపాలనరూపమైన, వ్యాపార = వ్యాపారమందు, అభిరతుండు = ఆసక్తుఁడైన, భరతుండు = భరతుఁడనురాజు, ఆత్రేయగోత్రేయుఁడై = ఆత్రేయగోత్రమందు జన్మించినవాఁడై, పొల్చున్ = ప్రకాశించును. అనఁగాఁ బైఁజెప్పఁబడిన యయాతియొక్క వంశమందు భరతుఁ డనురాజు సార్వభౌముఁడై ప్రసిద్ధినొందెనని భావము.

ద్వీపశబ్దమునకు, ద్విధాగతా ఆపః అత్రేతి ద్వీపః, ద్వ్యంతరుపసర్గేభ్యోప ఈత్ అనెడు పాణినీయసూత్రముచేత ద్విశబ్దమునకంటెఁ బరమైన యప్ఛబ్దముయొక్క యకారమునకు నీకారాదేశము వచ్చినది, నిత్యసమాసమందు స్వరవ్యంజనములు రెండును జెల్లును గనుక నీశబ్దమందలి వకారమునకు విశ్రమముఁ జెప్పినాఁడు, ఇది యఖండయతియనియు నిత్యసమాసయతియనియుఁ జెప్పంబడుచున్నది.

క. లోకంబునఁ గర్ణాటవ, నౌకోద్వీపాంతరీప నాస్తిపదార్థా

నేకానోన్యన్యజనార్దన, సాకాదులు నిత్యసమసనము లండ్రు బుధుల్.

భారతి కృతార్థురాలు భరతుని వంశస్తవము గావించుకతన నయ్యె ననుటవలన భరతుని మహోన్నతస్థితి యిట సూచితము. కావుననే యతఁ డాశాంతక్షమాపాలకుఁడని చెప్పఁబడెను. భారతమని చెప్పక పంచమవేదమనుటవలన సాగ్రంథప్రాశస్త్యమును వ్యాసునకు ద్వీపప్రోద్భవుఁడనుటచే నయోనిసంభూతత్వము సూచితమగుటవలన భారతముయొక్కయు వ్యాసునియొక్కయు మహత్త్వములు గ్రాహ్యములు. అలంకారము. నిరుక్తి. ఉల్లాసాలంకారము.

తా. భరతుఁడు వ్యాసకృత మహాభారతమునకుఁ గథానాయకుఁడై నిజవంశస్తవమువలన భారతీదేవిని బునీతను గావింపనేర్చి సమస్తదిగంతములను దనపరిపాలనమునఁ జేర్చుకొని యాత్రేయగోత్రుఁడై ప్రశస్తి నొందెను.

ఉ. ఆభరతాన్వయంబున రణాధ్వరయూపభుజుల్ మహాధరి

త్రీభుజు లుద్భవించిరి యుధిష్ఠిరముఖ్యులు విశ్రుతాఖ్యు లు

ర్వీభరణప్రవీణులు వివేకధురీణులు దానదీక్షితా

గ్రాభిహితు లుసుధీయుతు లుదారదయాహృదయు లుశుభోదయుల్. 24

ఆభరతాన్వయంబునన్ = ఆ భరతునియొక్క వంశమందు, రణాధ్వరయూపభుజుల్, రణ = యుద్ధమనెడి, అధ్వర = యజ్ఞమందు, యూప = యూపస్తంభములైన, భుజుల్ = బాహువులుగలవారును, మహాధరిత్రీభుజులు = ధరిత్రీభుజులనఁగా భూమినిబాలించురాజులు గనుక మహారాజులైనవారును, విశ్రుతాఖ్యులు = ప్రసిద్ధమైననామధేయములుగలవారును, ఉర్వీభరణప్రవీణులు = భూభరణమందు నిపుణులైనవారును, వివేకధురీణులు = వివేకధురంధరులైనవారును, దానదీక్షిత = దానదీక్షగలవారిలో, అగ్రాభిహితుల్ = అగ్రగణ్యులైనవారును, సుధీయుతులు = యోగ్యమైనబుద్ధితోఁగూడినవారును, ఉదార = అతిశయమైన, దయా = దయ, హృదయులు = మానసమునందుఁగలవారును, శుభ = శుభకరమైన, ఉదయులు = అభ్యుదయము గలవారును నగు, యుధిష్ఠిరముఖ్యులు = ధర్మరాజాదులు,

ఉద్భవించిరి = సంభవించిరి, ధరిత్రీభుక్ఛబ్దమునకు సంస్కృతద్వితీయైక వచనముగనురూపము ప్రాతిపదికముగా గ్రహింపఁబడియె. 'గుణవద్గుణోద్వితీయైకవచనతుల్యోభవేద్వికృతౌ' అని నన్నయభట్టీయము.

తా. భరతునివంశమునందు సంగరకలాప్రవీణులు ప్రతిష్ఠాశాలురు త్యాగమూర్తులు ధర్మస్వరూపులు నగుధర్మరాజాదులు జనించిరి.

క. ఆసంతతి వైభవజిత, వాసవుఁ డగుతాతపిన్న • వసుధాధిపుఁ డు
ద్భాసిల్లెఁ గీర్తిమయము, క్తాసౌధసువర్ణకలశి • తవిభావసుఁ డై. 25

ఆసంతతిన్ = ఆధర్మరాజాదులయొక్క వంశమందు, (ని. 'సంతతిర్గోత్ర జననకులాన్యభిజనాన్వయాః' అని అ.) వైభవ=విభవముచేత, జిత = జయింపఁబడిన, వాసవుఁడగు = ఇంద్రుఁడుగల, తాతపిన్న వసుధాధిపుఁడు = తాతపిన్నయనురాజు, కీర్తిమయ = కీర్తిరూపమైన, అనఁగా, కీర్తిరూపయినట్టి, ముక్తాసౌధ = ముత్యాలమేడయందు, సువర్ణకలశిత = బంగారుకలశముగాఁ జేయఁబడిన, విభావసుఁడై = సూర్యుఁడుగలవాఁడై, ఉద్భాసిల్లెన్ = మిక్కిలియుఁ బ్రకాశించెను. అనఁగా ధర్మరాజాదులసంతతిలోఁ దాతపిన్నన యనెడురాజు సూర్యమండలపర్యంతము వ్యాపించిన శుభ్రమయిన కీర్తిగలవాఁడై ప్రకాశించె ననుట.

కీర్తి తెల్లగాఁ జెప్పుట కవిసమయము గావున నిటఁ గీర్తి ముక్తాసౌధముగాఁ జెప్పఁబడెను. మౌక్తికసౌధ మనుటవలనఁ గీర్తి భూభాగమునందు విస్తృతముగ నుంటయేగాక యాకాశమునుగూడ నొరయుచున్న దని యాశయము. సూర్యుఁడు కనకకలశముగా నుంటవలనఁ గీర్తి దివము నంటె నని గ్రహింపవలయును. విభా ప్రభైవ వసుర్ద్రవ్య మస్య విభావసుః అను వ్యుత్పత్తివలన విభావసుఁడు కాంతియే ధనముగాఁగలవాఁ డగుటఁచే ముక్తాసౌధాగ్రమునఁ బ్రకాశార్థముగ సూర్యునిఁ గాంతిమంతముగ నుండు కలశముగఁ జేసి రని యాశయము.

తా. ఆవంశమునఁ గీర్తిశాలియగు తాతపిన్న భూపాలుఁడు జనించి పేరెన్నికఁ గాంచెను.

ఉ. ఆసుగుణాబ్ధికిం బ్రశమి • తాఖిలదోషుఁడు చక్రపాలనా
భ్యాసుఁడు సోమదేవుఁ డను • నద్భుతశీలుఁడు గల్గె నాకళా
భ్యాసికి నుద్భవించె దుర • హంకృతిమత్పరవాహినీశసం
త్రాసదబాణలాఘవుఁడు • రాఘవుఁ డాజికృతప్రమోదుఁ డై. 26

ఆసుగుణాబ్ధికిన్ = ఆసుగుణసముద్రుఁ డనెడు సముద్రునికి, ప్రశమితాఖిలదోషుఁడు = నిరసింపఁబడిన సమస్తములైన రాత్రులు గలవాఁడని యర్థము. పోఁగొట్టఁబడిన సమస్తపాపములుగలవాఁడని భావము. (ని. 'దోషస్స్యాద్దూషణే పాపే దోషా రాత్రౌభుజేపి చ' అని వి.) చక్రపాలనాభ్యాసుఁడు = చక్రవాకపరిపాలనమం దభ్యాసము గలవాఁడని యర్థము. రాష్ట్రపరిపాలనమం దభ్యాసము గలవాఁడనిభావము. సోమదేవుఁడను నద్భుతశీలుఁడు = దేవుఁడనఁగా దేవతయను రాజును, చంద్రుఁడును విరుద్ధగుణవిశిష్టుఁడని యర్థము. సోముఁడనెడు నద్భుతసద్వృత్తిగలరాజని భావము. కల్గెన్ = సంభవించెను. (ని. 'దేవ స్సురే ఘనే రాజ్ఞి' అని వి.) ఇక్కడ సముద్రునివలనఁబుట్టి రాత్రి నిరాసకత్వాది విరుద్ధగుణములతోఁగూడిన చంద్రుండయినాఁడు గనుక నద్భుతశీలుఁడని చెప్పఁబడినాఁడు.

ఆకళాభ్యాసికిన్ = కళ లనఁగా షోడశకళలును, విద్యలును, అచంద్రునికని యర్థము, ఆరాజున కనిభావము. దురహంకృతిమత్ = దురహంకారయుక్తుఁడైన, పరుఁడనఁగా నుత్కృష్టుఁడును శత్రువును, పర = ఉల్లోలకల్లోలమాలికలచేత నుత్కృష్టుఁడైన, వాహినీశ = వాహినియనఁగా నదియును, సేనయును—నదీనాథుఁడయిన సముద్రునికి, సంత్రాసద=భయప్రదమౌచున్న, బాణలాఘవుఁడు=శర లాఘవముగలిగిన, రాఘవుఁడు = శ్రీరామస్వామియని యర్థము. దురహంకారయుక్తులైన శత్రుసేనాధిపతులకు భయప్రదమౌచున్న బాణలాఘవముగల రాఘవుఁడనురాజనిభావము.(శ్లో. 'పరస్స్యాదుత్తమా నాత్మవైరి దూరేషు కేవలే, వాహిన్యాం తు తరఙ్గిణ్యాం సేనాసైన్యప్రభేదయోః.'అని వి.) అజి=అజమహారాజు కుమారుఁడయిన దశరథునియందు, కృత= చేయఁబడిన, ప్రమోదుఁడై=సంతోషము గలవాఁడయి యనియర్థము. యుద్ధరంగమందుఁ జేయఁబడిన సంతోషముగలవాఁడయి యని భావము. ఉద్భవించెన్=జన్మించెను. ఇక్కడఁ జంద్రునికి జన్మించిన చంద్రేతరవంశసంభవుఁడయిన రాముఁడును నద్భుతశీలుఁడేయని తెలియవలయు. కారణమయినచంద్రునకుఁ గార్యమయిన రామునకును సారూప్యమున్నది గనుక సమాలంకారప్రభేదము. శ్లో. 'సారూప్యమపి కార్యస్య కారణేన సమం విదుః' అని లక్షణము. చంద్రరాఘవపరములను నర్థాంతరములుంటచే శబ్దమూలధ్వని.

చంద్రుఁడు రాత్రుల నిరసించుటయుఁ జక్రవాకములను బాలించుటయు (నర్థాంతరముగ)ఁ జెప్పుటయద్భుతశీల హేతువులు. చంద్రుఁడు సహజధర్మము వదలుట యద్భుతక్రియగఁ బ్రశంసింపఁబడినది. కళాభ్యాసి యనుటవలనఁ జంద్రుఁడు షోడశకలాభిరాముఁడయ్యుఁ బూర్వోక్తవిపరీతగుణవిశిష్టుఁడగుట యద్భుతశీలము. దోషము శమింపఁజేయుట రాష్ట్రముల నేలుట యద్భుతశీలధర్మములు.

తా. తాతసన్నరాజునకుఁ బుణ్యశీలుఁడు రాజ్యపాలనసుశీలుఁడగు సోమదేవుఁడను నాతనికి విరోధిసేనావినాశన హేతుభూతుఁడగు రాఘవరాజును జనించెను.

క. ఆవిభునకు నర్జునపరి, భావకుఁడై పిన్నశౌరి•పగిదిఁ బొడమె వం
శావహుఁడు పిన్నశౌరి ర,మావల్లభుఁ డతఁడు బుక్క•మహీధవుఁ గాంచెన్. 27

ఆవిభునకున్=ఆ రాఘవరాజునకు, అర్జునపరిభావకుఁడై=శౌర్యముచేత నర్జునుని దిరస్కరించినవాఁడైయని రాజపరమైన యర్థము. అర్జునములనఁగా వేరుమద్దిచెట్లు, వానిని బెకలించినవాఁడనిబాలకృష్ణపరమైన యర్థాంతరము. వంశావహుఁడు = వంశోద్ధారకుఁడని యర్థము. వేణువును ధరించినవాఁడని యర్థాంతరము. రమావల్లభుఁడు = రాజ్యలక్ష్మీవల్లభుఁడని యర్థము. లక్ష్మీవల్లభుఁడని యర్థాంతరము. ఈపదత్రయమందును నర్థద్వయమున కభేదాధ్యవసాయము. అటువంటి, పిన్నశౌరియనురాజు, పిన్నశౌరిపగిదిఁ బొడమెన్=బాలకృష్ణునివలె జనించెను. ఇక్కడ ధర్మసామ్యనామసామ్యములచేతఁ బిన్నశౌరితోఁ బిన్నశౌరి సమానుఁడని తాత్పర్యము. అతఁడు=ఆపిన్నశౌరి, బుక్కమహీధవుఁ గాంచెన్ = బుక్కరాజును గనియెను. అలంకారము ఉపమ. అర్జునపరిభవాదులు శ్లేషము లగుటచే నలంకారము శ్లేషమని యాధునికులు.

తా. రాఘవభూపాలునకు నర్జున పరిభవకరణ పరాక్రమశాలియగు పిన్నశౌరి జన్మించెను. ఆతనికి బుక్కరాజు తనయుఁడై జనించెను.

సీ. తనభవ్యధామంబు • తనభవ్యధామంబుకరణి మిత్రోన్మేష•కరము గాఁగఁ
దనధర్మగుణములు • దనధర్మగుణములట్లతులితశ్రుతిమార్గ•గతుల నెసఁగఁ

దనమహాహవదీక్ష • దనమహాహవదీక్షపగిది నానావనీపకులఁ బెంపఁ
దనయంబకంబులు • దనయంబకములట్ల పరభీరువిముఖతఁ • బరిఢవిల్లఁ
తే. బరఁగుఁ గఠినాద్రిజడలుఠ•జ్జరఠకమఠ, కూటకిటిగూఢచరణది•క్కోటికరటి
కుటిలతాసహభూసౌఖ్య•ఘటనభూరి, భుజబలనిహారి యార్వీటి•బుక్కశౌరి. 28

ధామమనఁగాఁ బ్రతాపమును గృహమును (ని. 'గృహ దేహ త్విట్ప్రభావా ధామాని' అని అ.) తన=తనయొక్క, భవ్యధామంబు=శుభకరమైన ప్రతాపము, తనభవ్యధామంబుకరణి=తనయొక్క శుభకరమైన గృహమువలె, మిత్త్రక్షేమకరముగాఁగన్ = మిత్త్రుఁడనఁగా సూర్యుఁడును, మిత్త్రమనఁగా బంధువును, (ని. 'మిత్త్రం సుహృది మిత్త్రోర్కః' అని వి.) సూర్యప్రకాశకర మగుచుండఁగానని ప్రతాపపరమైన యర్థము. బంధుజనవికాసకరమగుచుండఁగా నని గృహపరమైన యర్థము. బుక్కరాయలు బంధుజనపోషకుఁడనియు సూర్యుని మించిన పరాక్రమశాలియు నని భావము.

ధర్మమనఁగా ధనుస్సును, న్యాయమును, గుణమనఁగా నారియును, గుణమును, (శ్లో. 'ధర్మః పుణ్యే యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ, ఉపమాయా మహింసాయాం చాపే' అని వి.) ('మౌర్వ్యాంద్రవ్యాశ్రితే సత్త్వశుక్లసంధ్యాదికే గుణః' అని అ.) తన ధర్మగుణములు = తనయొక్క చాపశింజినులు, తనధర్మగుణములట్ల=తనయొక్క న్యాయగుణములవలె, శ్రుతియనఁగా కర్ణమును వేదమును, (ని. 'వేదే శ్రవణే శ్రుతిః' అని అ.) అతులిత=సమానరహితమగునట్టులుగా, శ్రుతిమార్గగతులన్ = శ్రవణమార్గప్రవర్తనములచేత, ఎసఁగన్=ఒప్పుచుండఁగానని ధనుర్గుణపరమైన యర్థము. వేదమార్గ ప్రవర్తనములచేత నొప్పుచుండఁగానని న్యాయగుణపరమైన యర్థము. బుక్కరాయలు సంగరమున నాకర్ణాంతము ధనువు లాగుననియు శ్రుతిధర్మముల ననుసరించి సంచరించు ననియు భావము.

ఆహవమనఁగా యుద్ధము, హవమనఁగా యజ్ఞము (శ్లో. 'అజ్ఞాహ్వనాధ్వరాహవాః' అని అ.) తన మహాహవదీక్ష=తనయొక్క యధికమైన యుద్ధదీక్ష, తనమహాహవదీక్షపగిదిన్=తనయొక్క యుత్కృష్టమైన యజ్ఞదీక్షవలె, అవనీపకులనఁగా రాజులు, వనీపకులనఁగా యాచకులు, పెంపు అనఁగా క్షయమును, వృద్ధియును, నానా=సమస్తమైన, అవనీపకుల=రాజులను, పెంపన్=నాశనము నొందించుచుండఁగానని యుద్ధదీక్షాపరమైన యర్థము సమస్తమైన యాచకులను వృద్ధిఁబొందింపఁగానని యజ్ఞదీక్షాపరమైన యర్థము. బుక్కరాయలు యాగములయందు త్యాగగుణముచే యాచకులను దనుపు ననియు సంగ్రామమున విరోధిరాజన్యులఁ దెగటార్చుననియు భావము. పెంపన్=అనుటలో నాశనము చేయుట వృద్ధినొందించుట యను నర్థద్వయము కలదు. పెంచుట=నశింపఁజేయుట యనుటకు—

ఉ. తెంపరియై శరింబోరిని దేవకికుఱ్ఱల ముద్దుబిడ్డలన్
జంపితి వంతమైన నుపశాంతి వహింపక త్రాలమీఁద నన్
బెంపితి విస్సిరో... భాగవతము.

అంబకము లనఁగా బాణములును నేత్రములును, (ని. 'అంబకం నేత్రశరయోః' ఇతికోశః.) తన యంబకంబులు=తనయొక్క బాణములు, తనయంబకములట్ల=తన నేత్రములవలెనే, పరులనఁగా శత్రువులును, అన్యులును, భీరువనఁగా భయశీలుఁడును స్త్రీభేదమును, పరభీరు=శత్రువులలో భయపడువాండ్రవలన, విముఖతన్=తిరుగుటచేత, పరిఢవిల్లన్=ఒప్పుచుండఁగా నని బాణపరమైన యర్థము. పరస్త్రీపరాఙ్ముఖత్వముచేత నొప్పుచుండఁగా నని నేత్రపరమైన యర్థము. ఇక్కడ నుపమానోపమేయ

ములు ప్రకృతములే గనుక సముచ్చయోపమాలంకారము. బుక్కరాయలు పిఱికివారిపై బాణములను బ్రయోగింప నొల్లఁడనియుఁ బరకాంతలను సందర్శింపనొల్లఁడనియు భావము.

కఠిన = కర్కశములైన, అద్రి = పర్వతములయొక్కయు, జడమనఁగా మాంద్యమును, జలమును, లడలకభేదము. జడ = మాంద్యములోనని యర్థము. ఉదకములోనని భావము. లుఠత్ = పొరలుచుండెడు, జరఠకమఠ = ముదికూర్మముయొక్కయు, కూటకిటి=కపటవరాహముయొక్కయు, గూఢచరణుఁడనఁగా గూఢప్రచారుఁడును బన్నగుఁడును, గూఢప్రచారుఁడైన శేషాహియొక్కయు, దిక్కోటికరటి = దిగ్భాగములఁబడియుండెడు ఏనుఁగులయొక్కయు, కుటిలత = కుటిలత్వమును, అనఁగా క్రూరభావమును, అసహా = సహింపని, భూ = భూదేవిని, సౌఖ్య = సుఖభావమును, ఘటన = పొందించునట్టి, భూరి = అధికమైన, భుజబల = బాహుబలముచేత, విహారి = విహరించునట్టి, ఆర్వీటిబుక్కశౌరి = ఆర్వీడను రాజధానికధిపతియైన బుక్కరాజు, పరఁగున్ = ఒప్పును. అనఁగాఁ గులపర్వతములు మొదలైనవాని పరిస్పందము లేక యావద్భూభారము నీ బుక్కరాజు తన బాహుబలముచేతనే భరించియుండె నని భావము.

తా. భూభరణనియుక్తమగు కమఠము జడసంచారము ముదిమిగలదగుటయుఁ గిటి కాపట్యస్థితి గలదగుటయు శేషువురహస్యముగనున్న నడవడిగలవాఁడగుటయు దిగ్గజములు మూలనున్నవియు నగుటచే భూదేవి తనకుఁ దాన బుక్కరాయల వరించి మిగుల సౌఖ్యము నొందుచున్నదని భావము.

మొదటినాలుగు పాదములందు శ్లేషమని యుపమ యని యందురు. మూఁడవపాదమున నలంకారము శబ్దశ్లేష. ఆయాతావుల వాక్యార్థహేతుక కావ్యలింగము. పదార్థహేతుక కావ్యలింగాలంకారములు గ్రాహ్యములు. భవ్యధామము భవ్యధామము అనుచో ఛేకానుప్రాసము. గీతమున తవర్ణములు మాఱివచ్చుట వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారము.

క. ఆబుక్కనృపతి కతులభు, జాబందీకృతమదాంధ॰శత్రురమావే
ణీబంధవిలసదసిధా, రాబంధురుఁడైనరామ॰రాజు జనించెన్. 29

ఆబుక్కనృపతికిన్ = ఆబుక్కరాజునకు, అతుల = సమానరహితమైన, భుజా = బాహువులచేత, బందీకృత = చెఱవెయ్యఁబడిన, మదాంధ = మదముచేతఁ గన్నుగానకయున్న, శత్రు = శత్రురాజుల యొక్క, రమా = రాజ్యలక్ష్మియొక్క, వేణీబంధ = జడయేమోయన్నట్లుగా, విలసత్ = ప్రకాశించుచున్న, అసిధారా = ఖడ్గధారచేత, బంధురుఁడైన = సుందరుఁడైన, రామరాజు = రామరాజనెడు కుమారుఁడు, జనించెన్ = పుట్టెను. అలంకారము వస్తూత్ప్రేక్ష.

తా. బుక్కరాజునకు రామరాజు జనించెను. అతని ఖడ్గము విరోధిరాజుల రాజ్యలక్ష్మిజడయేమో యనునటులుండెను. ఖడ్గమును దత్కాంతిని వేణితో (నలుపునకుఁ) బోల్చుటకు-

సీ. పార్శ్వభూమి నభీరు భట కదంబ కరాళ హేతిచ్ఛటాచ్ఛాయ లిరులుకొనఁగ. మనుచరిత్రము.

సీ. ఏరాజుభూరితే॰జోరుణాలోకంబు లోకంబుతమము ని॰రాకరించు
నేధన్యుబాహాధ॰రాధరాభోగంబు భోగంబు సవరించు॰భూమిసతికి
నేపుణ్యునభిరూప॰రూపానుభావంబు భావంబు గరఁగించు॰భామినులకు
నేభవ్యుశుభకీర్తి॰శోభావిభోగంబు హారంబు దశదిశా॰యావతమున
తే. కతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ॰ డరికృతాంతుఁ
డనుపమస్వాంతుఁ డాశ్రిత॰వనవసంతుఁ

డనఘుతరకందనోలిమహాపురిని
శాంతుఁ డగు రామ మేదినీకాంతుఁ డలరు. 30

విరాజు = ఏ ప్రభువుయొక్క, భూరి=అధికమైన, తేజః = ప్రతాపమనెడు, అరుణ=సూర్యుని యొక్క, ఆలోకంబు = ప్రకాశము, లోకంబు = లోకముయొక్క, తమము =చీఁకటిని, నిరాకరించుక్ = నిరసించునోయనియర్థము. శ్లోకమును బోఁగొట్టునోయని భావము. (శ్లో. 'అరుణో భాస్కరేపి స్యాద్వర్ణభేదే సత్త్రిషు' అని అ.) శ్లో. 'రాహా ధ్వాంతే గుణే శోకే తమశ్శబ్దోభిధీయతే' అని వి.)

ప్రతాపమునకుఁ బోలికగా నితర భాస్కరనామములు చెప్పక అరుణనామము చెప్పుటవలనఁ బ్రతాపము ఎఱ్ఱగా నున్నదని భావము. లోకంబు తమము అనుచో షష్ఠికి ప్రథమావిభక్తి.

ప్రయోగము.—

చ. పరువడి నొప్పునప్పరము భద్రగజంబుల పెల్లు నుల్లస
త్తురగచయంబు పెంపున విదూషితగోనికరంబు పేర్మియుక్. భోజరాజీయము.

విధన్య = విక్రుతాత్తునియొక్క, బాహా = భుజమనెడు, ధరాధర = శేషునియొక్క, ఆభోగంబు =పరిపూర్ణత్వము, భూమినలికిక్ = భూకాంతకు, భోగంబునవరించుక్ = సుఖమునుగలుగఁజేయునో, బాహువులను శేషువుతోఁ బోల్చుటవలన సాజానులంబమూలనియు భూభరణసమర్థములనియు నాశయము.

విపుణ్య = విపుణ్యాత్మునియొక్క, అభిరూప=మనోహరమైన, గుప = చక్కఁదనముయొక్క, అనుభావంబు = ప్రభావము, భామినులకుక్ = స్త్రీలకు, భావంబు=మనస్సును, కరఁగించుక్ = ప్రవింపఁ జేయునో, సౌందర్యము స్త్రీజనమనోహరముగ నుపభోగార్హముగ నున్నది. రూపము సాలంకారికు లిట్టుల నిర్వచించిరి.

శ్లో. అంగాన్యభూషితాన్యేవ ప్రక్షేపాద్యైర్విభూషణైః, యేనభూషితవద్భాతి తద్రూపమితికథ్యతే.

లక్ష్యము.—

సీ. తొడవు లూడ్చినసైన తొయ్యలిరూపులోఁ జిన్నపోయినపట్లు చెన్నుమీఱు. హరివంశము

విభవ్య=వియోగ్యునియొక్క, శుభ = శుభకరమైన, కీర్తి = యశస్సుయొక్క, శోభావిహారంబు = కాంతిప్రచారము, దశదిశాయోవతమునకుక్ = దశదిక్కులనెడు యువతీసమూహమునకు, హారంబు = ముత్యాలహారమువలె నుండునో,

కీర్తికిఁ గల దిగంతవ్యాపకత్వము మనోహరత్వము, శుభ్రకాంతి విశేషము నిచట సూచితము.

అతఁడు=అట్టి, మతిమంతుఁడు= బుద్ధిమంతుఁడైనవాఁడును, అతిశాంతుఁడు=మిక్కిలిశాంతిగుణము గలవాఁడును, అరిక్రుతాంతుఁడు=శత్రువులకు యముఁడైనవాఁడును, అనుపమస్వాంతుఁడు=ఉపమానరహితమైన మనస్సుగలవాఁడును, ఆశ్రితవనవసంతుఁడు = ఆశ్రితులనెడు వనములకు వసంతర్తువైనవాఁడును, అనఘుతర = మిక్కిలి నిష్కల్మషమైన, కందనోలిమహాపురి = కందనోలనెడు మహాపట్టణమే, నిశాంతుఁడు=నివాసముగాఁగలవాఁడును, అగు=అయిన, రామమేదినీకాంతుఁడు = రామభూమీశ్వరుఁడు, అలరుక్ =ఒప్పుచుండును. అలంకారము. రూపకము సంసృష్టి. శబ్దాలంకారము ఛేకానుప్రాసము.

తా. కందనోలుమహానగరమునేలు రామధాత్రీశ్వరుఁడు సూర్యునిమించినపరాక్రమముతోడను, భూభరణయోగ్యమగు భుజశక్తితోడను, యువతీమనోరంజకమగు రూపముతోడను దిశావిశ్రాంతమగు కీర్తితోడను సకల శరోధుల వంచించుచు నాశ్రితుల రంజించుచు భూమండలమునఁ జెలఁగెను.

శా. ఆరామక్షితిభర్తకుం బ్రథితసత్యాలాపధర్మోద్భవ
శ్రీరమ్యుం డగుతిమ్మరాజు బలలక్ష్మీధామభీమప్రథా
పారీణుం డగుకొండశౌరి విజయప్రఖ్యాతచారిత్రుఁ డౌ
శ్రీరంగేంద్రుఁడు గల్గి రైందవకులక్షేమంకరాకారులై. 31

ఆరామక్షితిభర్తకున్ = ఆరామరాజునకు, ప్రథిత=ప్రసిద్ధమయిన, సత్యాలాప = సత్యవాక్యములుగల, ధర్మోద్భవ=ధర్మరాజుయొక్క, శ్రీ=కాంతిచేత, రమ్యుండగు=ఒప్పుచున్నవాఁడైన, అనఁగా ధర్మరాజయిన, తిమ్మరాజు=తిమ్మరాజును, అని యర్థము. ప్రసిద్ధమయిన సత్యవాక్యరూపధర్మములవలనఁ బుట్టిన సంపదచేత నొప్పుచున్నవాఁడని భావము. బలలక్ష్మీ = బలసమృద్ధికి, ధామ = స్థానభూతుఁడైన, భీమ=భీమునియొక్క, ప్రథా=ప్రసిద్ధియందు, పారీణుండగు = దరిముట్టినవాఁడైన, అనఁగా భీముఁడైన, కొండశౌరి = కొండలరాయఁడును అనియర్థము. బలసమృద్ధికి స్థానభూతులైనవారలకు భయంకరమయిన ప్రసిద్ధియందు దరిముట్టినవాఁడని భావము. విజయ = అర్జునునియొక్క, ప్రఖ్యాత = ప్రసిద్ధమయిన, చారిత్రుఁడౌ=చరిత్రములుగలిగిన, అనఁగా నర్జునుఁడయిన, అనియర్థము. విజయప్రతిపాదకములైన ప్రసిద్ధచరిత్రలు గలవాఁడనిభావము. శ్రీరంగేంద్రుఁడు ఐందవకుల = చంద్రసంబంధమైన, వంశమునకు, క్షేమంకర=క్షేమకరనులైన, ఆకారులై=రూపములుగలవారై, కల్గిరి. ఇది ధర్మజభీమార్జునులకు నీ ముగ్గురు రాజులకును సాధారణవిశేషణము, కలిగిరి=సంభవించిరి.

అలంకారము పదార్థహేతుక కావ్యలింగము.

ఈమువ్వురు వీరులు నైందవకులక్షేమంకరు లనుటకు సత్యాలాపసంసక్తి, బలలక్ష్మీధామత్వము, విజయ ప్రఖ్యాతియు హేతువులు. కావునసే క్షేమకరము, సత్యాలాపము ప్రథితమైనదనియు బలము భీమ మనియు విజయము ప్రఖ్యాత మనియు నాశయము. క్షేమంకర-"క్షేమప్రియ మద్రేఽణ్ఖచ్" అని ఖ ప్రత్యయము. "అరుర్ద్విషదజన్తస్యముమ్" అని ముగాగమము. ఇటులె శుభంకరాదు లూహ్యములు.

తా. రామరాజునకుఁ బరాక్రమశాలులగు తిమ్మరాజు కొండరాజు శ్రీరంగరాజు అనుమువ్వురు కుమారు లుదయించిరి. ఈమువ్వురు ధర్మరాజభీమార్జునులవలె సత్యబలవిజయసంశోభితులై ప్రతిష్ఠ గడించిరి.

శా. ఆరాజత్రితయంబులో నసమబాణారాతి విజ్ఞాతదో
స్సారుం డాత్తసుభద్రుఁ డర్జునగుణశ్లాఘ్యుండు నై పొల్చునా
శ్రీరంగేంద్రుఁ డశేషరాజ్యపదవీసింహాసనాక్షీణల
క్ష్మీరాజన్నిజసంతతి ప్రథితుఁడై మించెన్ ధరామండలిన్. 32

ఆరాజత్రితయంబులోన్ = పైఁజెప్పఁబడిన ముగ్గురురాజులలోపల, ఇది నిర్ధారణషష్ఠి. శ్లో. 'లోపలనిర్ధారణోద్భవాషష్ఠీ' అనిన. అసమబాణ=మన్మథునికి, అరాతి=శత్రుఁడైన రుద్రునిచేత, విజ్ఞాత=ఎఱుఁగఁబడిన, దోస్సారుండు=భుజబలముఁగలవాఁడును, అని యర్థము. అసమ = సమానరహితములైన, బాణ=బాణములుగలిగిన, అరాతి=శత్రువులచేత, విజ్ఞాత=ఎఱుఁగఁబడిన, దోస్సారుఁడు = భుజబలము గలవాఁడని భావము. ఆత్త = పొందఁబడిన, సుభద్రుఁడు = సుభద్రగలవాఁడును, అని యర్థము. పొందఁబడిన మంచిశుభగుణములు గలవాఁడనిభావము. అర్జునగుణశ్లాఘ్యుండు=అర్జునునియొక్క గుణములచేత

గొనియాడఁదగినవాఁడును, అనఁగా సజ్జనుఁడని యర్థము. నిర్మలమయిన గుణములచేతఁ గొనియాడఁ దగినవాఁడని భావము. ఐ=అయినవాఁడై, పొల్చు=ప్రకాశించుచున్న, ఆశ్రీరంగేంద్రుఁడు=ఆశ్రీరంగ రాజు, అశేష=సమస్తమైన, రాజ్య=రాజ్యములయొక్క, పదవీ=వైభవములతోఁగూడిన, సింహాసన= సింహాసనసంబంధమైన, అక్షీణ=క్షీణముగాని, లక్ష్మీ = సంపదచేత, రాజత్ = ప్రకాశించుచున్న, నిజ సంతతి=స్వకీయమయిన సంతతిచేత, అనఁగాఁ బరిక్షిత్తుమొదలైనవారిచేత, ప్రథితుఁడై=ప్రసిద్ధుఁడై యని యర్థము. తనసంతతిచేతనని భావము. ఇక్కడ ధర్మజభీమార్జునులలో నర్జునునిసంతతి రాజ్యసింహాస నాధిపత్యమునకు నంతరమై నిలిచిన ట్లాముగ్గురు రాజులలో శ్రీరంగరాజుసంతతిమాత్రమే రాచరికము నకు నిలిచినదని తాత్పర్యము. ధరామండలిన్=భూమండలమందు, మించెన్=అతిశయించెను.

విజయప్రఖ్యాతచరిత్రుఁడగు శ్రీరంగరాయనియెడ నింకను నర్జునగుణశ్లాఘ్యస్థితిగలదు. అన మహాబాణాలివిజ్ఞాత దోశ్శక్తి. ఆత్తసుభద్రత్వను. ఇందుచే విజయప్రఖ్యాతచారిత్రము రూఢము. రాజ్య మశేషమైనదగుటచే లక్ష్మీ యక్షీణ యని చెప్పఁబడెను. కావుననే సంపద సంతతికిఁగూడ యథా విధముగ సంక్రమించె నని యాశయము.

తా. పరాక్రమశాలులగు విరోధులను వంచింప నేర్పరియు శుభలక్షణలక్షితుఁడునగు శ్రీరంగ రాజు సమస్తరాజ్యము నాక్రమించి తనరాజ్యము సంతానమునై తము యథేచ్ఛముగా ననుభవింపఁదగిన కట్టుదిట్టములు గావించెను.

శా. క్షోణీవిశ్రుతనిత్యదాననిధి యై • సొంపొందుశ్రీరంగరా
ట్పాణిం బాయనిసత్కృపాణి యదనం • బ్రత్యర్థిదానైకపా
రీణం బౌటరుదే తదీయకరతాదృక్షడ్గవిద్ధాహిత
శ్రేణు ల్మున్నుగఁ గర్ణఖేచరవితీర్ణిప్రౌఢి వాటింపఁగన్. 33

క్షోణీ = భూమియందు, విశ్రుత = ప్రసిద్ధమైన, నిత్య = ఎడతెగని, దాననిధియై=దానమునకు స్థానమై, సొంపొందు=చక్కనౌచున్న, శ్రీరంగరాట్=శ్రీరంగరాజుయొక్క, పాణిన్ = హస్తమును, పాయని = ఎడబాయకరయుండునట్టి, సత్కృపాణి=శ్రేష్ఠమయిన ఖడ్గము, అదనన్ = సమయమందు, ప్రత్యర్థి = ప్రతియాచకవిషయమయిన, దాన = త్యాగమందు, ఏక = ముఖ్యముగా, పారీణంబౌట = సమర్థమయినదౌట, అరుదే=ఆశ్చర్యమా, అనఁగా నాశ్చర్యము కాదని యర్థము. ప్రత్యర్థి=శత్రువుల యొక్క, దాన=ఛేదనమందు, పారీణమయినదనిభావము. (ని. 'అభియాతిపరారాతిప్రత్యర్థిపరిపన్థినః." అని అ. 'దానంగజమదేత్యాగే పాలన చ్ఛేద శుద్ధిషు' అనివి.) ఇక్కడస్త్రీలింగమయిన కృపాణీశబ్దమునకు విశేషణంబైన ప్రత్యర్థిదానైకపారీణంబన్నపదము నపుంసకమయినందులకు (సూ. 'ఉభయవిధమమహతీ నామ్' అనిన.) అదను, అన్నపద ము కారాంతముగనుక, (సూ. 'కేషాంచిదుదంతానాంనేతి విభక్త్యావునోలు క్స్యాత్' అను నన్నయభట్టీయపుసూత్రముచేత సప్తమీవిభక్తి పరమగుచుండఁగా ఉన్నువు లోపమువచ్చి నది.) తదీయకర=ఆశ్రీరంగరాజుహస్తమందలి, తాదృక్షడ్గ=అలాటిఖడ్గముచేత, విద్ధ=వేధింపఁబడిన, అహిత శ్రేణుల్మున్నుగన్=శత్రుసమూహములుగూడ, కర్ణ ఖేచరవితీర్ణప్రౌఢివాటింపఁగన్=కర్ణునివలెను ఖేచరుని వలెను వితరణ మహిమను వహించె నని యర్థము. కర్ణునివలె నర్థమును ఖేచరునివలెఁ బ్రాణమును నిచ్చెనని భావము.

కృపాణి శ్రీరంగరాయలహస్తము న వదలకుంటకు క్షోణీవిశ్రుతనిత్యదానమె హేతువు. కానసే యది సత్కృపాణి. తాదృశ్విశేషణవలన ఖడ్గమునెడల సుప్రసిద్ధగుణములు సూచితములు. కర్ణఖేచర

వితీర్ణిప్రౌఢీ యనుటలో శ్రీరంగరాయని ఖడ్గధాటికి వెఱచి లోనైనరాజులు కర్ణునివలె ధనము, హేతులు ఖేచరునివలెఁ బ్రాణముల నొసంగిరని భావముగాన నిచటను విజయప్రఖ్యాతి సూచితము.

తా. దాననిధియగు శ్రీరంగరాయలఖడ్గము హస్తమునం దెడబాయకయుంటచేఁ బ్రత్యర్థి (విరోధి-యాచక) దానైక (ఖండన-త్యాగ) పారీణమగుటలో నచ్చెరు వించుకేని లేదు. ఆఖడ్గముచే మరణము నొందినవారుగూడఁ గర్ణునివలెఁ ద్యాగమునకు ఖేచరునివలె మరణమునకు నలవాటుపడియున్నారు.

ఖేచరుఁడనువాఁడు సర్పనగరమం దొకానొక నాగకుమారునిమారుగాఁ దాను గరుత్మంతున కాహారమయి ప్రాణత్యాగము సేయఁబూనెననుట పురాణప్రసిద్ధము. నిత్యదాననిధియైన రాజుహస్తము నెడబాయనిఖడ్గము దానపారీణమాటయేమి వింత? నగరమునందలి యాఖడ్గముచేత విద్ధులైన శత్రువులును వితరణమహిమను బూనినారని యర్థము. ఇక్కడఁ బాణిస్థితకృపాణి వితరణగుణ మహితశ్రేణులయందు నుల్లసిత మగుచున్నదని చెప్పినాఁడు గనుక నుల్లాసాలంకారము. శ్లో. 'ఏకస్యగుణదోషాభ్యా ముల్లాసోన్యస్యతౌ యది' అని లక్షణము.

సీ. వెస విభీషణరాజ్య • విముఖుఁడై సహ్యభూవలయంబు చేకొని • నిలువఁడేని
సప్తసాలాంతర • స్థాయియై నిదురించుతఱిని జాగరణంబుఁ • దాల్పఁడేని
శ్రుతిదూరభోగస • క్తత విఱ్ఱవీఁగి తాఁ జరణ మగ్రజు దెసఁ • జాపఁడేని
నలరారుసిరి దన • యడుగునఁ గూర్చి గట్టిగ నీగిచేయి మా • టికొనఁడేని
తే. రమణఁ బ్రతి సేయ వచ్చు శ్రీ • రంగశౌరి, భయదరిపుపురహారి ని • ర్భయవిహారి
యార్యసత్కారకారి యౌ • దార్యవిభవ,ధారియై మించు శ్రీరంగ • శౌరి కెపుడు.

ఇందు శ్రీరంగశౌరియనఁగా శ్రీరంగనాయకస్వామి, శ్రీరంగశౌరికి ననఁగా నీపైఁ జెప్పఁబడిన శ్రీరంగరాజునకు నామసామ్యమున్నను గుణసామ్యములేనందున సమానుఁడు గాఁడని చెప్పినాఁడు. ఏలాగన్నను,

వెసన్ = శీఘ్రముగా, విభీషణరాజ్య = భయంకరులైన శత్రువులయొక్క దేశములకు, విముఖుఁడై = ఎదిరించిపోఁజాలనివాఁడై, సహ్యభూవలయంబు చేకొని = సహ్యమయినంతభూవలయము ననఁగా దనజీవనమునకుఁ దగినభూమిని గ్రహించి, నిలువఁడేనిన్ = అందులోఁ గాలము గడపుచుండక పోయినట్లులాయెనేని అనియర్థము. విభీషణరాజ్యమనఁగా లంక, దానికిఁ బోకయున్నవాఁడనియు సహ్యభూవలయమనఁగా సహ్యపర్వతమువల్ల బుట్టిన కావేరియొక్క వలయము, దానిఁ బరిగ్రహించి నిలిచియున్నవాఁడనియు, అనఁగా నుభయకావేరీమధ్యస్థుఁడై యున్నవాఁ డనియును భావము. (స. 'సహ్యంచ తత్ భూవలయంచ' అనియును, 'సహ్యాత్పర్వత విశేషాద్భవతీతిసహ్యాభూః కావేరీ, తస్యాః వలయః, సహ్యభూవలయః' అనియుఁ నుభయత్ర విచారింపవలయును.) (ని. 'సహ్యా శైలాంతరారోగ్యసోఢ వ్యేషు ప్రచక్షతే' అని వి.)

సప్తసాలాంతరస్థాయియై = సాలమనఁగాఁ గోట - ఏడుకోటలలోపల నున్నవాఁడై, నిదురించు తఱిని = నిద్రించు నిశాసమయమందు, జాగరణంబుసలుపఁడేనిన్ = కన్నుమూయక నిద్రవేగించు చుండక పోయెనేని అని యర్థము; సప్తప్రాకారమధ్యగతుఁ డనుటకు.-

శ్లో. "సప్తప్రాకారమధ్యే సరసిజముకుళోద్భాసమానే విమానే
కావేరీమధ్యదేశే ఫణిపతిశయనే శేషపర్యంకభాగే

నిద్రాముద్రాభిరామం"

అను శ్లోకముకూడ నాధారము కాఁగలదు.

సప్తప్రాకారమధ్యగతుఁ డనియు దేవుఁడు గానఁ గన్నుమూయక యున్నాఁడనియును భావము. విగ్రహముగనుక మూయలేఁడనియును జెప్పవచ్చును. నిదురించుతఱి ననఁగా జాతుర్మాస్య దీక్ష యందు జాగ్రదవస్థయైనయోగనిద్రను బొందినవాఁడనియైనను జెప్పవచ్చును. యోగనిద్ర జాగ్రద వస్థయన్నందుకు. శ్లో. 'నిద్రాజాగ్రతిరేవయస్యనిగమస్తోమావతంసోత్పలమ్' శ్లో. 'నిద్రాముద్రాం నిఖిలజగతీరక్షణేజాగరూకా' మనునవి ప్రమాణములు.

శ్రుతిదూర = వేదబాహ్యమయిన, భోగ = సుఖమందలి, సక్తతన్ = ఆసక్తిచేత, విఱ్ఱవీఁగి = గర్వించి, తాన్ = తాను, చరణమగ్రజు దెసఁజాపఁడేని = అన్నయగుటచేఁ బూజ్యుఁడయిన యింద్రుని దిక్కునఁ గాళ్లుసాపి పడుండక పోయినట్లాయెనేని యనియర్థము ఇక్కడ నింద్రావరజ శబ్దార్థ మను సంధించిచెప్పినాఁడు. శ్రుతిదూర = చెవులులేని శేషాహియొక్క, భోగ=శరీరముయొక్క, సక్తతన్= సంపర్కముచేత, అనఁగా శేషగాత్రమందుఁ బవళించుటచేత, విఱ్ఱవీఁగినాఁడనియును దూర్పు దిక్కునఁ బాదములు చాపి పడమటిశిరస్సుగాఁ బవ్వళించియున్నాఁడనియును భావము. (ని. 'భోగస్సుఖే ధనే చాహే శ్శరీరఫణయో ర్మతః' అని అ.)

అలరారు = ఒప్పుచున్న, సిరి = ధనమును, తన యడుగునఁ గూర్చి = తనక్రిందదాచిపెట్టు కొని, గట్టిగన్ = దృఢముగాను, ఈఁగిచేయి = దాన మిచ్చెడు కుడిచెయ్యి, మాటికొనఁడేని = ముడిచి పెట్టుకొనియుండకపోయెనేని అనియర్థము. సిరియనఁగా లక్ష్మి, ఆమెకు పాదసేవ ఘటింపఁజేసినాఁ డని యును గుడిచెయ్యి తలక్రిందఁ బెట్టుకొన్నాఁడనియును భావము.

"కటినికటశిరః పార్శ్వవిన్యస్తహస్తం"

అను శ్లోకభావమువలన శ్రీరంగనాయకుల హస్తవైఖరి దెలియవచ్చును.

భయద = భయంకరులైన, రిపు = శత్రువులయొక్క, పుర = పట్టణములను, హారి = హరించు వాఁడును, నిర్భయ = భయరహితమానట్టులుగా, విహారి = విహరించువాఁడును, ఆర్య = పూజ్యుల యొక్క, సత్కార = పూజను, కారి = చేయువాఁడును, ఔదార్యవిభవధారి = వితరణవైభవమును వహించినవాఁడును, ఐ = అయినవాఁడయి, మించు = అతిశయించుచున్న, శ్రీరంగశౌరికిన్ = శ్రీరంగరాజునకు, ఎపుడున్ = ఎప్పుడును, శ్రీరంగశౌరి = శ్రీరంగనాయకస్వామి, రమణన్ = యుక్తమానట్లుగా, ప్రతిసేయవచ్చున్ = ఈడుచేయవచ్చును.

అనఁగా రాజైన యీ శ్రీరంగశౌరి భయంకర శత్రుపట్టణములను హరించువాఁడు గనుక నితనికి పైఁజెప్పఁబడిన భయంకర శత్రురాజ్యవిముఖుఁ డయిన శ్రీరంగశౌరి సమానుఁడు కాఁడనియు భయరహితమానట్లుగా విహరించు శ్రీరంగశౌరికి నేడుకోటలలోపలనుండియు భయముచేతఁ గన్ను మూయకయుండునట్టి శ్రీరంగశౌరి సమానుఁడు గాడనియుఁ బూజ్యులయినవారియొక్క పూజసేయు నట్టి యీరంగశౌరికిఁ బూజ్యుఁడయిన యన్న నవమానించిన శ్రీరంగశౌరి సమానుఁడు కాఁడనియుఁ వితరణవైభవమును వహించినయీరంగశౌరికి ధనము దాచిపెట్టికొనియిచ్చునట్టి చెయ్యి ముడుచు కొన్న శ్రీరంగశౌరి సమానుఁడు కాఁడనియును దాత్పర్యము.

అలంకారము యథాసంఖ్యము, వ్యతిరేకము.

తా. విరోధులకు వెఱచి రాజ్యమును వదలి తరలుట విడుకోటల చాటుననుండియు జాగరణావస్థలో నుండుట శ్రుతిదూరమగు భోగసక్తి (వేదాచారవిరుద్ధవర్తనము) సిరినడుగున జేర్చి దానహస్తము దాచుటలోనగు లోపములవలన శ్రీరంగనాయకులు ప్రకృత వంశమూలపురుషుఁడగు శ్రీరంగశౌరికి సాటిగాఁడు. (అర్థాంతముచే శ్రీరంగనాయకుల గుణగణము లూహ్యములు.)

క. ఆమనుజేంద్రునకుఁ బురంధ్రీమణియై తిమ్మమాంబ ♦ శ్రీరామునకున్
భూమిజ సుత్రామునకుఁ బులోమజయునుబలె జగంబులో నుతి కెక్కన్. 35

ఆమనుజేంద్రునకున్ = ఆ రంగరాజునకు, పురంధ్రీమణియై = భార్యారత్నమై, తిమ్మమాంబ = తిమ్మమ్మయనునామె, శ్రీరామునకున్ = శ్రీరామస్వామికి, భూమిజ = సీతాదేవియును, సుత్రామునకున్ = దేవేంద్రునకు, పులోమజయునుబలెన్ = శచీదేవివలె, (ని 'పులోమజాశచీంద్రాణీ' అని అ.) జగంబులోనుతికెక్కన్ = జగత్తునఁ బ్రసిద్ధి కెక్కియుండును.

తిమ్మమాంబ యనుటలో నంబాశబ్దముమీఁద నంబాశబ్దమునకుఁ గవి ప్రయోగములు చాల గలవు.

శ్లో. "ఆర్యాంబాదికశబ్దాస్స్యు రత్ర శ్రేష్ఠత్వగోచరాః,
తత స్తద స్తశబ్దేభ్యో నైవశ్రేష్ఠత్వగోచరాః." (అథర్వణ)

తా. ఆశ్రీరంగరాయలకు ధర్మపత్నియగు తిమ్మమాంబ శ్రీరామునకు సీతవలె నింద్రునకు శచీదేవివలె నొప్పి భర్తృప్రియముగా సంచరించెను.

సీ. ధర యేయపాంసుల ♦ తల చూపరాకుండఁ దనకూర్మి తేని నప్పునసె ముంచెఁ
గమల యేనిశ్చల ♦ రమణువేరెదకు మోపై నిల్చి యతనిపే ♦ రడుగఁబఱచె
సతి యేయచండిక ♦ పతిఁ జట్టుకూఁతురై జగడాలు పచరించి ♦ సగము చేసె
వాని యేమితసూక్తి ♦ వదలదు తలవాకిలి నిజేశు మాటమో ♦ చె నసఁ జేసె
తే. ననుచు భూకాంత శ్రీకాంత ♦ హరునికాంత, నజునికాంతను నిరసించి ♦ యాసిరంగ
పార్థివునికాంత తిమ్మాంబ ♦ పతికిఁ గుశల, కీర్తిబలవృద్ధినిర్మల ♦ స్ఫూర్తు లొసఁగు.

పాంసులయనఁగా జారిణి (ని. 'స్వైరిణీపాంసులాధస్యాత్' అని అ.) అనఁగాఁ బతివ్రత, ధర = భూకాంత, ఏయపాంసుల = ఏ పతివ్రత, అనఁగాఁ గాదనుట, ఏమన్నను, తలచూపరాకుండన్ = తల యెత్తుకొని తిరుగఁగూడకుండునట్లు, తనకూర్మి తేనిన్ = తన ప్రాణేశ్వరుని, అప్పునసె ముంచెన్ = అప్పులలోనే మునింగిపోవునట్లు చేసెను అని యర్థము. పాంసువనఁగాఁ బరాగము. అది గలది పాంసుల, అదిగానిది యపాంసుల గనుక భూమియే పరాగరహితురాలు, అనఁగాఁ బరాగసహితురాలనియును దలగానరాకుండునట్లుగాఁ మన్నుధరించినకూర్మరాజును నీటమునిఁగియుండునట్టులు చేసినదనియును భావము. కూర్మి తేఁడన్నచోట కూర్మశబ్దముమీఁద జీష్విధింపఁబడినదిగనుకఁ గూర్మమనిచెప్పవలసినందుకుఁ గూర్మి తేఁడని చెప్పినాఁడు.

కూర్మమనుటను కూర్మి తేఁడనుట అపుష్టార్థదోషమైనను (తల్లక్షణము 'ప్రకృతానుపయుక్తార్థమపుష్టార్థం తదుచ్యతే') శ్లేషమునందు అపుష్టార్థదోష ముండ దనునథర్వణాచార్యుని "అపుష్టార్థోపిసాధుస్స్యాత్ యతిచేత స్సుఖావహః" కారికవలన హృదయరంజకవాక్యమున దోషవిచారణము తగ దని సోమకవివ్యాఖ్యలోఁ గలదు.

కమల యేనిశ్చల = శ్రీకాంత యేనిశ్చలురాలు, అనఁగా నిశ్చలురాలు కాదనుట. అదేమన్నను, రమణు పేరురము మోపి పైఁబల్చి = పెనిమిటియైన విష్ణుమూర్తియొక్క వక్షమునకు బయలుపడునట్లుగాఁ ద్రొక్కిపట్టినదై, ఆతని పేరడఁగఁజేసెన్ = ఆయనపే రడఁగిపోవునట్లుగాఁ జేసెనని యర్థము. లక్ష్మి యేనిశ్చలురాలు, అనఁగాఁ జంచలురాలేయనియును పెనిమిటి వక్షస్స్థలమందు నిలిచి యాయనయొక్క పేరును, అనఁగా హారమును క్రిందుపఱిచినదనియును భావము. లక్ష్మీనారాయణాదినామములయందుఁ దన పేరు ముందుగాఁ బలుకఁబడుచున్నది, గనుక యాయన నామమును క్రిందుపఱిచినదని ప్రకారాంతరము.

సతి = అనఁగా హరుని కాంత, ఏయపచంచిక = ఏటిసాధ్వి, అనఁగాఁ సాధ్వి గాదనుట, ఏమన్నను, పతిన్ = నాథుఁడైన హరుని, పట్టుహోఁబుట్టి = రాతికిఁబుట్టినదై, అనఁగాఁ శిలసురాలై, జగడాలుపచరించి = జగడాలాడి, సగము చేసెన్ = కృశించి సగమగునట్లుగాఁ జేసెనని యర్థము. చండికానామము గలదియును, హిమవంతునికిఁ గూఁతురైనదనియును జగడాలుపచరించి జగడాలు, అనఁగా ప్రకాశరూపమైన కాంతిగలుగంజేసి పతి నర్ధనారీశ్వరునిఁ జేసినదనియును భావము.

వాణి = అనఁగా నజుని కాంత, ఏమితసూక్తి = ఏ మితభాషిణి, అనఁగా బహుభాషిణి యనుట, పదలదుతలవాకిలి = బయటవాకిటనే నిలుచుచు, నిజేశుమాట మోచెనన్ జేసె = తన పెనిమిటిని నింపపాలాయె ననునట్టులుగాఁ జేసెనని యర్థము. వాగ్రూపిణి గనుక సరస్వతి యేమితసూక్తి యనఁగా సకలసూక్తిస్వరూపురాలనియు నోరెడఁబాయదనియును నిజేశ్వరుని వాణీవహుఁడనఁ జేసె ననఁగా వాణీయుక్తముఖునిఁ జేసెననియును భావము.

అనుచున్ = ఇట్లు పలుకుచు, భూకాంతన్ = భూదేవిని, శ్రీకాంతన్ = లక్ష్మీదేవిని, హరుని కాంతన్ = పార్వతీదేవిని, అజుని కాంతన్ = సరస్వతీదేవిని, నిరసించి = తిరస్కరించి, ఆసిరంగపార్థివునికాంత = ఆ శ్రీరంగరాజుయొక్క భార్యయైన, తిమ్మాంబ = తిమ్మమ్మ, పతికిన్ = పెనిమిటికి, కుశల = క్షేమమును, కీర్తి = కీర్తిని, బలవృద్ధి = బలసంపత్తిని, నిర్మలస్ఫూర్తులు = మాలిన్యరహితమైన స్ఫూర్తులను, ఒసఁగున్ = కలుగఁజేయు నని క్రమాలంకారము. భూమివలనఁ గూర్మమునకు లోపించిన కుశలత్వము లక్ష్మివలన విష్ణునకు లోపించినకీర్తి పార్వతివలన శివునకు లోపించిన బలము సరస్వతివలన బ్రహ్మకు లోపించిన నిర్మలస్ఫూర్తి గుర్తించి తిమ్మమాంబ యీశుభోదయములు తనభర్తకుఁ గలుగఁజేసెను.

తా. భూదేవియు లక్ష్మీదేవియుఁ బార్వతియు సరస్వతీదేవియు భర్తృసేవావిధులలోఁ జాల లోపములు గావించిరని తిమ్మమాంబిక గుర్తించి పతికి కుశలము యశస్సు బలము నిర్మలత్వమును గూర్చి భర్తృసేవాపరాయణురాలై పొగడిక గాంచెను. అలంకారము వ్యతిరేకము.

శా. చేతోజాతసమానమూర్తి యగునా శ్రీరంగధాత్రీధవుం
డాతిమ్మాంబికయందుఁ గోనవిభుఁ డిమ్మాధీశు రామప్రభున్
ధూతాశేషవిపత్తు శ్రీతిరుమలేంద్రున్ వేంకటాఖ్యానవి
ఖ్యాతుం గాంచె సురద్రుపంచకము నయ్యంభోధిరాజుం బలెన్. 37

చేతోజాతసమానమూర్తియగు = మన్మథునికి సమానమైన యాకృతిగలవాఁడైన, ఆ శ్రీరంగధాత్రీధవుండు = ఆ శ్రీరంగరాజు, ఆతిమ్మాంబికయందున్ = భార్యారత్నమైన తిమ్మమ్మయందు, కోనవిభున్ =

కోనమరాజును, తిమ్మాధిశుఁ = తిమ్మరాజును, రామప్రభుఁ = రామరాజును, ధూతాశేషవిపక్షుఁ = కంపింపఁజేయఁబడిన సమస్తశత్రువులు గలిగిన, శ్రీతిరుమలేంద్రుఁ = సంపద్యుక్తుఁడైన తిరుమలదేవరాయలను, వేంకటాఖ్యానవిఖ్యాతుఁ = వెంకటరాయఁడను ప్రసిద్ధిగలవానిని, సురద్రుపంచకముఁ = కల్పవృక్షపంచకమును, అయ్యంభోధిరాజుంబలెఁ = ఆక్షీరసముద్రుఁడువలెనే, కాంచెఁ = కనెను. అలంకారము ఉపమ.

అంభోధిరాజుంబలెఁ అనుటలో సోమకవి అంభోధిరాజుఁ అని విడదీసి ద్వితీయైకవచనమనెను గాని కవిప్రయోగానుసారముగా నది ప్రథమావిభక్తియె. పూర్ణానుస్వారము నుగాగమమునకు బదులు ఆదేశసరళపూర్వకమగుటచే వచ్చియుండును. వాఁడుంబోలె, నీవుంబలె అనుపదములు ప్రయోగరూపములు.

తా. సముద్రుఁడునకు సంతానము మొదలగు కల్పవృక్షము లైదు జనించినటుల శ్రీరంగాధిపునకుఁ దిమ్మాంబికయందు కోనరాజు తిమ్మరాజు రామరాజు తిరుమలరాజు వెంకటరాయలు అనునైదుగురు కుమారులు జననము నొందిరి.

క. అం దగ్రజుండు రాజపు, రందరుఁ డన వెలసెఁ గోన•రాజు నిజభుజా
సందీపితాసిభిదుర, స్పందనిపాతితమహావి•పక్షోత్కరుఁడై. 38

అందుఁ = ఆ కుమారులయందు, అగ్రజుఁడు = పెద్దవాఁడైన, కోనరాజు = కోనమరాజను కుమారుఁడు, నిజ = స్వకీయమగుచున్న, భుజా = బాహువునందు. సందీపిత = మిక్కిలియుఁ బ్రకాశించుచున్న, అసి = ఖడ్గమనెడి, భిదుర = వజ్రాయుధముయొక్క, స్పంద = చలనమాత్రముచేత, నిపాతిత = కొట్టిపడనేయఁబడిన, మహాత్ = అధికమైన, విపక్ష = శత్రువులయొక్క, ఉత్కర = సమూహము లనెడు, మహాత్ = అధికమైన, అవి = పర్వతములయొక్క, (సి. 'అవిశ్శైలేరపామేషే' అని వి.) విపక్షోత్కరుఁడై = రెక్కలగమిగలవాఁడై, రాజపురందరుఁడనన్ = రాజులలో నింద్రుఁడనునట్టులుగా, వెలసెన్ = ప్రకాశించెను. అలంకారము రూపకము.

తా. వారిలోఁ బెద్దవాఁడగు కోనరాజు దేవేంద్రుఁడు తనవజ్రాయుధముతోఁ గొండల రెక్కలను నఱికి పరాక్రమించినటులఁ దనకరస్థమగు ఖడ్గముతో విరోధులఁ జెండి పేరుప్రతిష్ఠల నొందెను.

శా. శ్రీరంగాధిపు కోనభూవిభునికీ•ర్తిస్వచ్ఛతుండాంకతే
జోరాజద్ద్విజరాజు తీవ్రగతిచే • సూర్యాతిగుం డై నభం
బారోహించి పవిన్ హసించుచు నహీ•నారాతులం జించి త
త్సారాహర్నిశగుప్తవాసవసుధన్ • సాధించుఁ జిత్రంబుగన్. 39

శ్రీరంగాధిపు కోనభూవిభుని = శ్రీరంగరాజుకుమారుఁడైన కోనమరాజుయొక్క, కీర్తి = కీర్తియనెడు, స్వచ్ఛ = తెల్లనైన, తుండ = ముఖమే, అంక = చిహ్నముగాఁగల, తేజః = ప్రతాపమనెడు, రాజత్ = ప్రకాశించుచున్న, ద్విజరాజు = గరుత్మంతుఁడు, తీవ్రగతిచే సూర్యాతిగుండై = తీవ్రమనఁగా నత్యుష్ణము నత్యంతమును గనుక నత్యుష్ణగతిచేత సూర్యునిఁ దిరస్కరించినవాఁడైయనియు, అత్యంతగతిచేత సూర్యమండలమును దాఁటినవాఁడయి యనియు నర్థము. (ని. 'తీవ్ర మత్యుష్ణ కటుక నితాంతే

ష్వన్యవస్మృతమ్' అని అ.) నభంబారోహించి=ఆకాశముపైకిఁబోయి, పవిన్ హసించుచున్=వజ్రాయుధమును దిరస్కరించుచు ననియును వజ్రాయుధమును లక్ష్యము సేయక యనియు నర్థము. అహీన=అధికులైన, అరాతులన్=శత్రువులను, చించి=పెరికెలఁ జేసియనియును, అహి+ఇన = అమృతరక్షకసర్పశ్రేష్ఠులనెడు,అరాతులం జించియనియు నర్థము. తత్=ఆయధికులైన శత్రువులయొక్క, సార = బలముచేత, అహర్నిశ=దివారాత్రములును, గుప్త=రక్షింపఁబడుచున్న, వాస+వసుధన్ = నివాసభూమిని యనియును, తత్=ఆసర్పశ్రేష్ఠులయొక్క,సార=బలముచేత, అహర్నిశ=గుప్తమయిన, వాసవ=ఇంద్రునియొక్క,సుధన్=అమృతముననియుం నర్థము. చిత్రంబుగన్=ఆశ్చర్యకరానట్టుగా,సాధించున్ = స్వవశముగాఁ జేసికొనును, అనఁగా రంగరాజు పెద్దకుమారుఁడయిన కోనరాజు సూర్యుని మించిన వేఁడిమిగల ప్రతాపముచేత బలవంతులైన శత్రువుల సంహరించి వారివారి నివాసభూము లన్నిటిని దనవశము చేసికొన్నాఁడని భావము. అలం. రూపకము.

తేజోద్విజరాజు రక్తవర్ణుఁడనియు నాతని తల కీర్తియును స్వచ్ఛవర్ణము గలదనియు భావము. పరాక్రమము తొలుత సూర్యమండలమును అవల నాకాశమును ఇంద్రలోకమును దాఁటుటచే దిగంత లోకాంతర వ్యాపకశక్తి దానికి సహజ మనియుఁ గాననే అహీన+అరాతినిరాసము సాధ్య మయ్యెనని యాశయము.

తా. కోనభూపాలుని పరాక్రమము సూర్యమండలమును మించి యాకాశము నంటి వజ్రాయుధమును దిరస్కరించి బలవంతులగు విరోధులను జెండాడి వారిచే సురక్షితమగు వసుధ నార్జించుచున్నది. (గరుడుఁడు అమృతము దెచ్చుటకు సూర్యమండలము, ఆకాశము దాఁటి యింద్రుని లక్ష్యపెట్టక సర్పములఁ జెండి యమృతముఁ దెచ్చుట యర్థాంతరము.)

క. ఆతనితమ్ముఁడు తిమ్మక్ష్మాతలపతి వొగడఁ గనియె • ఘనుఁ డనఁ గీర్తి
వ్రాతవినూతనకైతక, జాతద్యోతనకృపాణ•చపలాన్వితుఁ డై. 40

ఆతనితమ్ముఁడు = ఆకోనమరాజుతమ్ముఁడయిన, తిమ్మక్ష్మాతలపతి=తిమ్మరాజు, కీర్తివ్రాత = కీర్తిసమూహమనెడు, వినూతన=మిక్కిలి నూతనమైన,కైతక=కేతకీపుష్పములయొక్క, జాత=సమూహమునకు, ద్యోతన=సూచకమైన, కృపాణ=ఖడ్గమనెడు, చపలా = మెఱపుతోడ, అన్వితుఁడయి = కూడుకొన్నవాఁడయి, ఘనుఁడనన్ = మేఘుఁడనునట్టులుగానని యర్థము. మహాత్ముఁడనునట్టులుగా ననిభావము. పొగడుగనియెన్ = స్తోత్రముఁ జెందెను. (ని. 'తటిత్సౌదామనీవిద్యు చ్చఞ్చలా చపలాపిచ' అని అ.) ఇక్కడ మేఘవాచకమయిన శబ్దమునకు ముపర్ణకము రావలసినను, సూ. 'వివక్షాతఃప్రవృత్తిశ్చ ప్రత్యయస్యక్వచిత్క్వచిత్' అను నథర్వణవచనముచేత మహద్వివక్ష చేసి ఘనుఁ డని చెప్పినాఁడు. అలం. రూపకము.

తా. మెఱపు మెఱయఁగనే మొగలి పూయుట సహజము. తిమ్మరాజు ఘనుఁడు (మేఘుఁడు) గావున నతనికృపాణమను మెఱపులకాంతు లతిశయింపఁగనే కీర్తియను మొగలిరేకు లుదయించుచున్నవి. (తిమ్మరాజునకుఁ బరాక్రమచిహ్నమగు ఖడ్గము కీర్తికరముగ నున్న దని భావము.)

సీ. ధాత్రీశ్వరులు గాని • ధాత్రీశ్వరులు గారు పురుడు వాగనుభూతి•భూతిగతుల
మానవేంద్రులు గాని • మానవేంద్రులు గారు పోల్క నయాభోగ•భోగకళల

రాజహంసులు గాని • రాజహంసులు గారు సరి సత్కళాసార•సారరుచుల
నరపుంగవులు గాని • నరపుంగవులు గారు తర మెన్న వరధర్మ•ధర్మభృతుల
తే. జగతినీమేటికనినృపుల్పొగడ నెగడె, నేబిరుదురాయ రాహుత్తా•హితవధూభు
జంగబిరుదాంకపుంఖిత•సమరవిజయ, కాహళుఁడు తిమ్మవిభుఁ డాజి•దోహళుండు.

జగతిన్ = భూమియందు, ఈ మేటికిన్ = ఈ రాజశ్రేష్ఠునికి, వాగనుభూతి, వాక్ = విద్యయొక్కయు, అనుభూతి = అనుభవముయొక్కయు, భూతి = ఐశ్వర్యముయొక్కయు, గతులన్ = మార్గములచేత ననియర్థము. ఇక్కడ వాగ్గీః పరిశీలనము చేతను భస్మముచేతను నని యర్థాంతరము గ్రహించి యశ్లే దార్ఢ్యవసాయము చెప్పవచ్చును. పురుడు = ఈఁడు, ధాత్రీశ్వరులుగాని = ధాతయు నీశ్వరుఁడుగాని, అనఁగా బ్రహ్మరుద్రులుగాని, ఇక్కడ క్రమాలంకారము. నాల్గుపాదములయందు నీలాగే యని తెలియవలెను. ధాత్రీశ్వరులనుచో 'ఇకోయణచి' యను సూత్రానుసారముగ రేఫాదేశము వచ్చును గాన ధాతాచ ఈశ్వరశ్చ ధాత్రీశ్వరౌ యని యొకచోటను ధాత్ర్యాః ఈశ్వరాః+ధాత్రీశ్వరాః అని వేఱొకచోటను విగ్రహమును జెప్పుకొనవలయును.

ధాత్రీశ్వరులుగారు = భూమీశ్వరులుగారు, నయాభోగ = నీతిపరిపూర్ణతయొక్కయును, భోగ = భోగములయొక్కయు, కళలన్ = విశదభావములచేత, పోల్కి = పోలిక, మానవేంద్రులు గాని = మనువు నింద్రుఁడుగాని, 'అత్ర మను రేవమానవఇతివ్యుత్పత్తిః ప్రాజ్ఞఇతివత్' మానవేంద్రులు గారు = నరేంద్రులుగారు, మానవశ్చ+ఇంద్రశ్చ మానవేంద్రౌ అను విగ్రహముచే మానవుఁడే మను వనియు, మానవానాం+ఇంద్రాః, మానవాః+ఇంద్రఇవ మానవేంద్రాః మానవశ్రేష్ఠుఁడనియు విగ్రహము చెప్పుకొనవలయును.

సత్కళాసార=శ్రేష్ఠమైన చతుష్షష్టికళాసారముచేత నని యర్థము. షోడశకళలచేత ననిభావము. సారరుచులన్=బలమైన తేజస్సుచేతను, సరి = సాటి, రాజహంసులుగాని = చంద్రసూర్యులుగాని, రాజహంసులుగారు = రాజశ్రేష్ఠులుగారు, ఇక్కడ సూర్యవాచకమైన హంసశబ్దమునకు దుష్టవిధాన మావశ్యకముగావున నుకారయుక్తమైన పాఠము సాధువని గ్రహింపవలయును. రాజాచ హంసశ్చ రాజహంసౌ యనియు, వేఱొకచో రాజానోహంసాఇవ రాజహంసాః యనియుఁ విగ్రహము.

వరధర్మ = శ్రేష్ఠమైన ధనుస్సుయొక్కయు, ధర్మ = న్యాయముయొక్కయు, భృతులన్ = భరణములచేత, తరమెన్నన్ = సామ్య మెంచి చూడఁగా, నర=అర్జునుఁడును, పుంగవులుగాని = ధర్మ దేవతయైన వృషభముగాని, నరపుంగవులుగారు = రాజులుగారు, ఇక్కడ పశువాచకమైనపుంగవశబ్దము మీఁద మహద్విపక్షచేసి దుష్టు విధించినాఁడు. ఈవిషయము ౪౦ వ పద్యమందు మునుఁ దన్నచోట స్పష్టీకృతంబై యున్నది. నరశ్చ పుంగవశ్చ నరపుంగవౌ యనియు, నరాః పుంగవాఇవ నరపుంగవాః అనియుఁ విగ్రహము.

అని = ఇట్లు, నృపుల్పొగడన్ = రాజులు స్తోత్రముచేయఁగా, బిరుదరాయరాహుత, అను నదియు, అహితవధూభుజంగ, అనునదియునగు, బిరుదాంక = బిరుదావళులచేత, పుంఖిత = నిండింపఁ బడిన, సమర = యుద్ధమందలి, విజయకాహళుఁడు =విజయప్రయుక్తమైన కాహళులు కలిగినవాఁడును, ఆజి = యుద్ధమందు, దోహళుండు = వికాసముగలిగినవాఁడును నగు, ఏతిమ్మవిభుండు = ఏ తిమ్మరాజు,

సొగడెక్ = వృద్ధిఁబొంది ప్రకాశించెనో, యెత్తుగీతియందలి యచ్ఛబ్దము (ఏశబ్దము)నకును ముందరివచ నపుమొదల నున్నతచ్ఛబ్దమునకును నన్వయము, అలంకారము శ్లేషమూలకపరిసంఖ్య.

తా. తిమ్మరాజు విద్యచే బ్రహ్మను, ఐశ్వర్యముచే శంకరుని, నీతిచే మనువును, ఇంద్రునికళలచేఁ జంద్రుని, ప్రకాశముచే సూర్యుని, ధనుర్విద్యలో నర్జునుని, ధర్మమునందు ధర్మదేవతను మించి సాటి రాజులలోఁ జేరన్నిక నొంది రాయరాహుత్త, అహితవధూభుజంగాది బిరుదము లొంది కీర్తి గాంచెను.

వ. తత్క్రమంబున. 42

ఆ తిమ్మరాజుయొక్క కులమువరుసయందు.

తే. రవికులం బలరింప శ్రీరాముఁ డైన, శౌరి తనరెండుకన్నులుఁ సరియె కాఁగఁ
దలఁచి సోమాన్వయము పవిత్రంబు సేయ, నవని శ్రీరంగవిభురాముఁ డై జనించె.

రవికులంబలరింపక్ = సూర్యవంశమును బ్రకాశింపఁ జేయుటకొఱకు, శ్రీరాముఁడయినశౌరి = శ్రీరామావతారమునొందిన విష్ణుమూర్తి, తన రెండుకన్నులు సరియెకాఁగఁదలఁచి = తనయొక్క రెండు కన్నులను సమానముగ నెంచి, ఇక్కడ విష్ణుమూర్తియొక్క కన్నులు సూర్యచంద్రు లని భావము. సోమాన్వయము పవిత్రంబు సేయక్ = చంద్రవంశముఁ బవిత్రము చేయుటకు, అవనిక్ = భూమి యందు, శ్రీరంగవిభురాముఁడై = శ్రీరంగరాజుకుమారుఁడైన రామరాజై, జనించెక్ = జన్మించెను.

అలంకారము సంబంధాతిశయోక్తి, రూపకమును.

తా. సూర్యచంద్రులు విష్ణువునకుఁ గనులు గావున విష్ణువు తొలుత సూర్యవంశమున దశరథు నకుఁ దనయుఁడుగాఁ బుట్టి రెండవకన్ను గౌరవించుట కిపుడు చంద్రవంశమున శ్రీరంగవిభునిపుత్త్రుఁ డగు రామరాజుగా జనించెను.

సీ. పట్టాభిషేకవిపర్యయంబునఁ బ్రోలు వెడలి ప్రియానుజుల్ వెంటఁ గొలువఁ
జిత్రకూటాభిఖ్యఁ జెలఁగుపెన్గొండసాంద్రహరిద్విపేంద్రనాదవనిఁ జెంది
ఖలజనస్థానవాసులఁ బల్వుర వధించి మహిమ సలకకఖరస్మయము మడంచి
హరివీరభటమహోద్ధతి నబ్ధి గంపింప దురమునఁ గదిసి తద్ద్రోహిఁ దునిమి

తే. యనఘుతరపార్థివేందిర నధిగమించి, సాధుకర్ణాటవిభవసంస్థాపనంబు
పూనిశరణాగతులనెల్లఁ బ్రోచె రాముఁ, డతఁడు నిజచరితంబు రామాయణముగ.

ఈపద్యమునందలి రాముఁ డతఁడు అను వాక్యమునుబట్టి చూడ రామరాజుపరముగా శ్రీరా మునిపరముగా నర్థద్వయము కనుపట్టుచున్నది.

రాముఁ డతఁడు = రాముఁడైన యారాజు, నిజ = స్వకీయమయిన, చరితంబు = చరిత్రము, రామాయణముగక్ = రామాయణకథ యగునట్లుగా, అభేదాధ్యవసాయముచేత ననుట, ఇక్కడ రాముని చరిత్రము రామాయణము కావలసినదేయని యానురూప్యము గ్రహింపవలయును. పట్టాభిషేక విపర్యయంబునక్ = పట్టాభిషేకముయొక్క వ్యత్యయమందు, రామస్వామికివలె రామరాజునకును బట్టాభిషేకము విఘ్నమయినదని చెప్పుచున్నాఁడు. ప్రోలువెడలి = పట్టణమును బయలువెళ్లి, ప్రియా నుజుల్ వెంటఁగొలువక్ = ప్రియులైన యనుజులు, అనఁగాఁ దిరుమలరాయఁడు వేంకటరాయఁడు నను తమ్ములు వెంబడిఁ గొలిచిరాఁగా నని రామప్రభుపరమయిన యర్థము. ప్రియయనఁగా భార్యయైన సీతయు ననుజుఁ డనఁగాఁ దమ్ముఁడైన లక్ష్మణుఁడును దోడఁ గొలిచి రాఁగా నని శ్రీరామపర మయిన యర్థాంతరము.

అభిఖ్య యనఁగా నామము, ప్రభయును, చిత్ర=విచిత్రములైన, కూట=శృంగముల యొక్క, అభిఖ్యన్ = ప్రభచేత, చెలఁగు=విలసిల్లుచున్న, పెన్గొండన్ = పెన్గొండయన్న, సాంద్ర=దట్టమయిన, హరి=గుఱ్ఱములును, ద్విపేంద్రక్=మదపుటేనుఁగులునుగలిగిన, అదవనిన్=అదవనియనెడు పట్టణమును, చెంది=ఆక్రమించి యని యర్థము. చిత్రకూటాభిఖ్యన్ = చిత్రకూటమనెడు పేరుచేత, చెలఁగు=ఒప్పుచున్న, పెన్గొండన్ = మహాపర్వతమందు, సాంద్ర = నిబిడమయిన, హరి = సింహములయొక్కయు, ద్విపేంద్ర=గజశ్రేష్ఠములయొక్కయు, నాద=ధ్వనులుగలిగిన, వనిన్=అరణ్యమును, చెంది=ప్రవేశించి యని యర్థాంతరము. (ని. 'అభిఖ్యా నామశోభయోః' అని అ.)

ఖల=పాపాత్ములైన, జనస్థానవాసులన్=జనపదనివాసులను, పల్వురవధించి=అనేకుల సంహరించి, మహిమన్=ప్రభావముచేత, సలక=సలకుఁడను, ఖర=క్రూరునియొక్క, స్మయమడంచి=గర్వము నడంచి యని యర్థము. ఖల=పాపాత్ములయిన, జనస్థానవాసులన్ = జనస్థానమందున్న రాక్షసులను, పల్వురవధించి=అనేకులను సంహరించి, మహిన్=భూమియందు, మసలక = జాగుసేయక, ఖర=ఖరాసురుని యొక్క, స్మయమడంచి = గర్వనాశము చేసి యని యర్థాంతరము.

సలకము తిమ్మరాజును సలకనామమున వ్యవహరింతురనుటకు దృష్టాంతము.—

శ్లో. మహత్తరే మానవలోకశాసితు ర్మనోఽనుకూలా మహిషీపదే తదా,
కృతాభిషేకా సలకక్షితీశితు ర్వరాత్మజాసీ ద్వరదాంబికాపధూః.

అచ్యుతరాయాభ్యుదయము, మూఁడవసర్గము ర వ శ్లో.

హరి=గుఱ్ఱములయొక్కయు, వీరభట=శూరులైన భటులయొక్కయు, మహోద్ధతిన్ = అధికమైన యౌద్ధత్యముచేత, అబ్ధిగంపింపన్=సముద్రము చలించునట్లుగా, దురమునఁగదిసి=యుద్ధమందుఁ దారసించి, తద్ద్రోహిందునిమి = పూర్వమందుఁజెప్పఁబడిన సలకనామకద్రోహిని వధించి యనియర్థము. హరివీరభట=కపివీరులయొక్క, మహోద్ధతిన్ = అధికౌద్ధత్యముచేత, అబ్ధిగంపింపన్=దక్షిణసముద్రము వణఁకఁగా, దురమునఁగదిసి=యుద్ధమందుఁ దారసించి, తద్ద్రోహిందునిమి=ప్రసిద్ధుఁడైనరావణుని వధించి యని యర్థాంతరము.

అనఘుతర=మిక్కిలి నిష్కల్మషమైన, పార్థివేందిరన్=రాజలక్ష్మిని, అధిగమించి=పొంది యని యర్థము. అనఘుతర=నిష్పాపులరాలైన, పార్థివేందిరన్ = పృథివికిఁగొమార్తెయైన లక్ష్మిని అనఁగా సీతాదేవిని, అధిగమించి=కలిసికొని యని యర్థాంతరము. సాధు=లెస్సైన, కర్ణాటవిభవసంస్థాపనంబు = కర్ణాటరాజ్యవైభవసంస్థాపనమును, పూని=వహించి యని యర్థము. సాధు=యోగ్యులైనవారియొక్క, కర్ణాట=కర్ణగోచరమైన, విభవసంస్థాపనంబు పూని=వైభవముయొక్క సంస్థాపనమును వహించి యని యర్థాంతరము. శరణాగతులనెల్లఁబ్రోచెన్ = శరణమనఁగా గృహమును రక్షణమును, గృహమునుగూర్చి వచ్చినవారినందఱిని రక్షించెనని యర్థము. రక్షణమునుగూర్చి వచ్చినవిభీషణాదులను సంరక్షించెనని యర్థాంతరము. (ని. 'శరణం గృహరక్షిత్రోః' అని విశ్వము.) అలంకారము శ్లిష్టరూపకము.

తా. రామరాజు పట్టాభిషేకప్రయత్నము భంగము గాఁగనే సోదరసహితుఁడై ఆదోనికిఁ జేరి యచటిదుష్టులఁ బెక్కండ్రను దెగటార్చి సలకముతిమ్మయగర్వ మడఁచి సైన్యముతో నిజరాజధానికిఁజేరి కర్ణాటరాజ్యస్థాపకుఁ డయ్యెను. ఇతనిచరిత్ర మాయావిశేషయుక్తమై రామచరిత్రమను రామాయణమును బోలియున్నది.

మ. హరిశౌర్యం డగు రామభూవిభుని తీవ్రాటోపవద్వాహినీ
శరవేగంబున నాత్మమూలబలముల్ జారన్ దళాడంబరం
బరుగం గొమ్మలు వోవ లావరి నిజామాదుల్వజీరుల్ భజిం
తురు నమ్రత్వముఁ గానలో ముసలిమానుల్గా వితర్కింపఁగన్. 45

హరి శౌర్యుండగు=సింహముయొక్క పరాక్రమమువంటి పరాక్రమముగల, రామభూవిభుని = రామరాజుయొక్క, తీవ్ర = అత్యంతమయిన, ఆటోపవత్ = యుద్ధత్వరతోఁగూడిన, వాహినీ=సేనయొక్క, శరవేగంబునన్ = బాణవేగముచేతనని యర్థము. తీవ్రాటోపవత్ = అత్యంతాడంబరముతోఁగూడిన, వాహినీ=నదియొక్క, శరవేగంబునన్=జలవేగముచేతనని యర్థాంతరము. ఆత్మమూలబలములు= తమకు నమ్మకమయిన మూలబలములు, జారన్ = పలాయనమయిపోఁగా ననియర్థము. తమయొక్క ప్రేళ్లసత్తువ హరించిపోఁగా నని వృక్షపరమయిన యర్థాంతరము. దళాడంబరంబరుగన్ = దళమనఁగా రాణువయును బత్రమును, రాణువయొక్క విజృంభణము నశింపఁగా ననియర్థము. ఆకులయొక్క విజృంభణము నశింపఁగానని యర్థాంతరము. ని. 'దళోంశే స్త్రీభటే భేదే' అని వి. 'దళంపర్ణంఛదః పుమాన్' అని అ. కొమ్మలువోవన్=పుత్త్రపౌత్త్రాదులు హతులుకాఁగా నని యర్థము. శాఖలు విరిగిపడి పోఁగా నని యర్థాంతరము. ఇంతవఱకు నర్థద్వయమునకు నభేదాధ్యవసాయము. లావరి=బలముచేడి, నిజామాదుల్వజీరుల్=నిజాము మొదలైన ప్రభువులుఁ బ్రధానులును, కానలోన్=అరణ్యమందు, ముసలిమానుల్గావితర్కింపఁగన్ = ముదిమ్రానులోయని (జనులు) ఊహించునట్లులుగా మానులన్నచోట శ్లేషసంశ్లేషము లేమికిఁ గారణము మృగ్యము. తురకలని భావము. నమ్రత్వమున్ = వంగుటను, భజియింతురు = అంగీకరింతురు. ఇక్కడ నుభయసాధారణ్యము.

అర్థద్వయమునకు నభేదాధ్యవసాయము సం. 'జీర్ణవృక్షగతధర్మసంబంధేన నిమిత్తేన మ్లేచ్ఛానాం వృక్షత్వేనోత్ప్రేక్షణా దుత్ప్రేక్షాలంకారః హరిశౌర్యవిశేషణస్య మ్లేచ్ఛాది నమ్రీకరణహేతుతయా కావ్యలింగభేదః అనయోస్సంకరః.'

ముసలిమ్రాకులని బహువచనమునందుంటకు బదులు ముసలిమానులనుట అర్థాంతరము గాపాడుటకుఁ గవి యొనరించిన నియమోల్లంఘనము. ముసలిమాను లనుచోట ముసలి యనువిశేషణము ప్రాణివాచకమున కర్హ్యముగాని యచేతనమున కర్హము గా దనువాద మొకటి కలదు. ఇట్టి ప్రయోగములు కలవు.

సీ. సఖివనప్రియవతంస మితండు గాఁ డైన ముదియనికొమ్మలఁ గదియకున్నె.

చంద్రాంగదచరిత్రము.

తా. రామభూపాలుని వాహినీశరవేగమున కోరువఁజాలక మూలబలములు కోలుపోయి దళములు కొమ్మలు పోవ నిజామాది యవనప్రభువులు నమ్రులై ముసలిమానులు గాఁ బరిగణింపఁబడుచున్నారు.

సీ. ఎదలపైఁ బొదలుపయ్యెదలు జారఁగఁ బారు బిబ్బీలకు ముసుంగులబ్బఁ జేసె
ఘనభేరికాధ్వనుల్వాని గుండియలు ప్రీల వ్రాలుమల్కలకు గోలీలు సేసె
నుడుగనివిభ్రాంతిఁ దడగాల్లు వడ నిల్చు ఖానులు డాగఁ జీకటులు సేసెఁ
గడ లేనికాందిశీకత నేగుదమ కుర్చి జడధు లెల్లను గాలిపడలు సేసె

తే. అనుచు శిరములఁ దాల్తు రెవ్వనిసమగ్ర
సైన్యధుతధూళిఁ జకితులై చనుసపాద
కుతుపశాహినిజామాదికుతలపతు ల
తండు నృపమాత్రుఁడే రామధరణివిభుఁడు. 46

ఎదలపైఁ బొదలు=పక్షస్స్థలములమీఁద నొప్పారెడు, పయ్యెదలు = పైఁటచెఱఁగులు, జారన్ =జారి పోవునట్టులుగా, పారు=పరుగిడునట్టి, బిబ్బీలకున్ = నిజామాదుల యంతఃపురస్త్రీలకు, ముసుంగు లబ్బఁ జేసెన్ = ముసుఁగులు గలుగునట్టుగాఁ జేసెను. సైన్యధూళికిఁగల ప్రసరణశక్తి సూచితము. అప్రసరణము భయార్తులై తొలఁగినపైఁట నెఱుఁగని యవనాంతఃపురకాంతలకు (గోషా గాపాడు) ముసుఁగగుటయే ధూళి శిరోధారణ మగుటకు హేతువు.

ఘనభేరికాధ్వనులువిని = ఘనమైన రణభేరియొక్క భాంకారధ్వనులువిని, గుండియలు వ్రీలన్ = గుండెలు పగులఁగా, వ్రాలు = నిర్జీవులై కూలిన, మల్కాలకున్ = తురకలకు, గోలీలు సేసెన్ = గోలీ లేర్పఱచెను. ఇచట ధూళికిఁగల వ్యాపకనిబిడత్వములు సూచితములు. అనాథలై గతించిన మల్కాలకు గోలీ లేర్పఱచుటయే ధూళిఁ దలఁ దాల్చుటకు హేతువు.

ఉడుగనివిభ్రాంతిన్ = తీరకయుండెడు భయవిభ్రాంతిచేత, తడగాల్లిపడన్ = కాళ్లుతడ బడఁగా, నిల్చు = కదలలేక నిలిచిన, ఖానులు = మ్లేచ్ఛప్రభువులు, డాగన్ = దాగుటకు, చీఁక టులుసేసెన్ = చీఁకట్లు గల్పించెను. ఇట నిబిడత్వమునకుఁగల పరమావధి సూచితము. ఇందుచేఁ బ్రాణ భయార్తులగు పిఱికివాండ్రకు దాఁగ నవకాశము గలుగుటయే ధూళి తలఁ దాల్చుటకు హేతువు.

కడలేని కాందిశీకతనేఁగు = తుదిముట్టని భయపలాయనముచేతఁ బోవుచున్న, తమకున్ = తమకు, ఊర్విన్ = భూమియందు, జడధులెల్లను = సముద్రముల నన్నిటిని, కాలినడలుసేసెన్ = నడిచిపోఁ దగిన లోఁతుగలవానిఁగాఁ జేసెను. ఇట ధూళికిఁగల సముద్రపర్యంతవ్యాప్తి సూచితము సముద్రతరణ మున కవకాశము గల్గించుటయే ధూళిని దలదాల్చుటకు హేతువు.

అనుచున్ = ఇట్లనుచు, ఎవ్వని=ఏ రాజుయొక్క, సమగ్ర = సంపూర్ణమైన, సైన్య=సేనలచేత, ధుత=ఎగురఁగొట్టఁబడిన,ధూళి = పరాగమును, చకితులై చను=భయపడి పోవుచుండు, సపాదకుతుపశాహి నిజామాది = సపాదులు మొదలైన, కుతలపతులు = ప్రభువులు, శిరములఁదాల్తురు=శిరసావహింతురో యని యర్థము. ధూళి శిరస్సులమీఁదఁబడునని భావము. అతఁడు=అట్టివాఁడైన, రామధరణి విభుఁడు= రామరాజు, నృపమాత్రుఁడే=అందఱు రాజులవంటివాఁడా, అనఁగాఁ గాఁడనుట. సేనాపరాగము తమపై వ్యాపించుచుండఁగా శత్రురాజులు పలాయితులైరని భావము. ఇచట మ్లేచ్ఛులకు సేనాధూళులయందు ముఖావరణాదికల్పనాసంబంధము లేకున్నను సంబంధమునుఁ జెప్పుటచే నతిశయోక్త్యలంకారము. అది శిరస్సుచే వహించుట యనెడుశ్లాఘన మనురూపకమును నిలుపుచుండుటచే రెండిటికిని సంకరము.

రామరాయలు మహమ్మదీయుల జయించినను వారియంతిపురికాంతల యభిమానమునకు మహమ్మ దీయమత ధర్మమునకు వ్యతిరేకముగ వర్తింపలేదని యాశయము. సమగ్రసైన్యధూళి గావుననే యింత వ్యాప్తి నొందినది. ఇందుఁ జెప్పఁబడిన సపాదుని నిజమగు పేరు మహాబాత్తు.

పయ్యెద అనుట తప్పు తి. పైవి యెదకు వస్త్రోక్తిని బయ్యెదయ్యె. అప్పకవి.

"పయ్యోదేత్యాదినానుగత యకారస్యాపి ఇతిపృథగేత్వం విహితమేవ-
డోలాభూషోత్తరీయాణి ప్రసైత్వం నాస్తి మధ్యయః." అహోబలపండితీయము.

పయ్యెద యని పయ్యాద యని రెండురూపములును గలవు.

తా. రామరాజుసేనాఘూళి బిబ్బీలకు ముసుఁగులుగను, మల్కులకు గోలీలుగను, ఖానులకుఁ జీకటులుగను, సముద్రము కాలినడగను జేయుటచే నుపకారకృతజ్ఞతాసూచకముగా నిజాామాదియవన ప్రభువులు తలఁదాల్పసాగిరి.

శా. విశ్వామిత్రునిఁ గొల్చి రాముఁ డతఁ డుర్విం జెందెఁ గళ్యాణము
న్విశ్వామిత్రులు గొల్వ రాముఁ డితఁ డుర్విం జెందెఁ గళ్యాణముల్
శశ్వత్కీర్తులు రాము లయ్యిరువురున్ సాధించుకళ్యాణలా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథనధర్మాలంబనవ్యక్తముల్. 47

విశ్వామిత్రునిఁ గొల్చి = విశ్వమునకు శత్రుఁడైనవానిఁ గొల్చి యని యర్థము. విశ్వామిత్రమహాముని సేవించి యని భావము. రాముఁడతఁడు = ఆ దశరథపుత్రుఁడైన రాముఁడు, ఉర్విం జెందెఁ గళ్యాణమున్ = భూమియందు వివాహమంగళము బొందెను. విశ్వామిత్రులుగొల్వన్ = విశ్వామిత్రమహామునులే తన్నుఁ గొల్వఁగా, రాముఁడితఁడు = ఈ రామరాజు, ఉర్విం జెందెఁ గళ్యాణమున్ = భూమియందుఁ గల్యాణమును బొందెనని యర్థము. కల్యాణప్రాప్తి యిక్కడ సమానధర్మము. విశ్వ = సమస్తమైన, అమిత్రులు = శత్రువులు, కొల్వన్ = సేవింపఁగా, ఉర్వియందుఁ గల్యాణమనెడు పట్టణమును బొందినాఁడని భావము. శశ్వత్కీర్తులు = ప్రకాశించుచున్న కీర్తిగలిగిన, రాములయ్యిరువురున్ = ఆ ఇద్దఱురాములును, సాధించు = సాధించిన, కల్యాణలాభైశ్వర్యంబులు = కల్యాణప్రాప్తిరూప వైభవములు, ధర్మమనఁగా న్యాయమును జాపమును గనుక, ధర్మనిర్మథన = న్యాయవిధ్వంసము చేతను, ధర్మాలంబన = న్యాయావలంబనము చేతను, వ్యక్తములు = ప్రకటములైనవియని యర్థము. చాపఖండన చాపావలంబనములచేతఁ బ్రకటములైనవి యనిభావము. అనఁగా ధర్మనిర్మథన వ్యాపారమువలనఁ గల్యాణలాభమును బొందిన రామునికంటె ధర్మావలంబనవ్యాపారముచేతఁ గల్యాణమును బొందిన రామప్రభుం డుత్తముఁడని చమత్కారము గ్రహింపవలయును.

అలంకారము వ్యతిరేకము.

తా. రాముఁడు విశ్వామిత్రుని సేవించి కళ్యాణ మొందెను. రామరాజు విశ్వ+అమిత్రులు గొల్వ కళ్యాణ (నగర) ము బడసెను. ఇరువురును గల్యాణము నొందిరి గాని శ్రీరాముఁ డొందిన కల్యాణ ప్రాప్తి ధర్మనిర్మథనరూపము (ధనుర్భంగరూపము) రామరాజొందిన కళ్యాణము ధర్మాలంబనరూపము- (ధర్మస్థాపనరూపము.)

సీ. ప్రబలావలేపవిగ్రహాజాయమానాగ్రహాముడించి బహుధావనాప్తిఁ గాంచుఁ
బురమెల్లఁ బ్రత్యగ్రభూతిపాలుగఁ జేసి యచలాసనాభ్యాసియై కృశించు
రతినిథ రామానుగతమైత్రిపై రోసి కలనైనఁ గల్యాణకాంత యిడఁడు
సవిఁ బ్రాణాయామసంసిద్ధికై సారెసారెకుఁ గుండలిస్థాన మంటు
తే. మానకసిజాముఁ డపవర్గమార్గవృత్తిఁ, బెరయుపరబుద్ధి నెవ్వానిఁ బేరు దలఁచి

యతఁడు శ్రీరాముఁ డఖిలసన్నుతికి నెగఁడె, సేతుకాశీతలాంతరసంఖ్యాతయశుఁడు.

రామరాజు నిజామునకుఁ గావించిన పరాజయపరముగను శ్రీరామకృతమగు నపవర్గపరముగను నీపద్యమున కర్థద్వయము గలదు.

మానక=విడువక, నిజాముఁడు=నిజాముసాహేబు, పరబుద్ధిన్ = శత్రుబుద్ధిచేతనని యర్థము. పరబ్రహ్మబుద్ధిచేత నని యర్థాంతరము. ఎవ్వాని పేరుదలఁచి = ఏ రామరాజు నామము నెంచి యని యర్థము. ఏ శ్రీరాముల పేరుదలఁచి యని యర్థాంతరము. ప్రబల = ఉత్కృష్టమైన, అవలేప = గర్వము చేతనైన, విగ్రహ = విరోధమువలన, జాయమాన = పుట్టుచున్న, ఆగ్రహమున్ = కోపమును, డించి = విడిచిపెట్టి, బహు = తఱుచుగా, ధావనాప్తిఁగాంచున్ = పలాయనము బొందునో యని యర్థము. ప్రబల = మిక్కుటమైన, అవలేప = వ్యాప్తిగల, విగ్రహ = దేహమువలన, జాయమాన = పుట్టుచున్న, ఆగ్రహమున్ = అభిమానమును, డించి = పరిత్యజించి, బహుధా = పలువెఱఁగులుగా, వనాప్తిఁగాంచున్ = అరణ్యమును బొందునోయని యర్థాంతరము. నిజాము రామరాజుధాటికి వెఱచి విరోధము మఱచి యడవులకుఁ జేరఁబోయెననుట.

పురమెల్లన్ = పట్టణమంతయును, ప్రత్యగ్ర = నూతనమైన, భూతిపాలుగఁ జేసి = బూడిదపాలుచేసి, అచలాసనాభ్యాసియై = కొండలలో నుండు నలవాటు గలవాఁడై, కృశించున్ = క్షీణించునో యనియర్థము. పురమెల్లన్ = దేహమంతయు, ప్రత్యగ్రభూతిపాలుగఁజేసి, అనఁగా నొంటి నిండఁ బూడిద పూసికొని, అచల = నిశ్చలమైన, ఆసన = పద్మాసనము మొదలైనవానియందలి, అభ్యాసియై = పరిచయము గలవాఁడై, కృశించున్ = క్షీణించునోయని యర్థాంతరము. (ని. 'పురం పురి శరీరే చ' అని వి.) నిజాముఁడు రామరాజునకుఁ దనరాజ్యము కైవసముఁ జేయనొల్లక దహించి యడవుల కేఁగెననుట.

ఇభరామ = ఇభరాం అనెడువానియందు, అనుగత = పొందఁబడిన, మైత్రిపైన్ = స్నేహము మీఁదనుండెడు, రతిన్ = ఆసక్తిని, రోసి = మానుకొని, కలనైనన్ = స్వప్నమందైనను, కల్యాణకాంక్షయిడఁడు = కల్యాణమను పట్టణము మీఁదివాంఛ మనస్సునఁ బెట్టకయుండునోయని యర్థము. రతినిభ = చక్కఁదనమందు రతీదేవితో సమానురాలైన, రామా = స్త్రీలయందు, అనుగత = పొందఁబడిన, మైత్రిపై రోసి = స్నేహముమీఁద విరక్తిఁజెంది, కలనైనన్ = స్వప్నమందైనను, కల్యాణకాంక్షయిడఁడు = కాంచనాభిలాష చేయకుండునో యని యర్థాంతరము. నిజాముఁడు ఇభరాంపై గల ప్రేమ గూడ మఱచి కలనైనఁ గళ్యాణనగరమును దలంచుట లేదనుట.

సరవిన్ = యుక్తమైనట్టులుగా, ప్రాణాయామసంసిద్ధికై = ప్రాణస్థైర్యముకొఱకు, అనఁగాఁ జావుదప్పించుకొనుకొఱకు, సారెసారెకున్ = మాటిమాటికి, కుండలిస్థానమంటున్ = సర్పములకు స్థానమైన పుట్టపై నెక్కునని యర్థము. ఇక్కడఁ బుట్టనెక్కినవానిని బూరిగఱచినవానిని పాఱిపోవు వానిని యుద్ధమందుఁ జంపరని సంప్రదాయము. ప్రాణాయామమనెడు యోగాంగసిద్ధికొఱకుఁ గుంభకావిష్ట మానసుఁడగుచుఁ గుండలినీశక్తికి స్థానమైన మూలాధారమంటునని యర్థాంతరము. నిజాముఁడు చావుదప్పించుకొనుటకుఁ బుట్టలనెక్కి బ్రతుకుచున్నాఁడనుట.

అపవర్గమార్గవృత్తిఁబెరయు = వర్గమనఁగాఁ బుత్రపౌత్రాదికము; అపగతమైన పుత్రపౌత్రాదికము యొక్క మార్గమందలి వృత్తిని బొందునో యని యర్థము. అపవర్గమనఁగా మోక్షము, మోక్ష

మార్గ ప్రవృత్తిని బొందునోయని యర్థాంతరము. అతఁడు = అనఁగా నిజాముఁడు పరబుద్ధిచేత నెవరిపేరు దలఁచి పైనిఁజెప్పిన ప్రకారముగాఁ బ్రవర్తించునో యతఁడైన, శ్రీరాముఁడు, శ్రీ = సంపద్యుక్తుఁడైన, రాముఁడు=రామప్రభుఁడని యర్థము. శ్రీ=లక్ష్మీయుక్తుఁడైన, రాముఁడు=శ్రీరాముఁడని యర్థాంతరము. అఖిలసన్నుతికిఁదగఁడె = సకలమైనవారియొక్క స్తోత్రమునకు నర్హుఁడు కాఁడా, అనఁగాఁ గాఁదగుననుట. అతఁడు మఱియు సెట్టివాఁడనఁగా, సేతుకాశీతలాంతరఖ్యాతయశుఁడు = సేతుకాశీల మధ్యభూమియందుఁ బ్రసిద్ధమైన కీర్తిగలవాఁడని యర్థము.

కుండలిస్థానము

శ్లో. భుజంగాకారరూపేణ మూలాధారం సమాశ్రితా, శక్తిఃకుండలినీనామ బిసతంతునిభాశుభా.

వ. దేహమధ్యస్థానంబున మూలాధారచక్రం బలరు నది మొదలుగ సహస్రారంబు తుదగాఁ బృష్ఠభాగంబున వీణాదండంబుభంగి సమస్తనాడికామూలకందంబై మూలోర్ధ్వచ్ఛిన్నవంశాభంబై షడాధారసమన్వితంబై యుండుదీర్ఘాస్థి బ్రహ్మదండి యనంబరగు. నా బ్రహ్మదండి మూలాధారప్రకోణస్థయై కుండలీనామపరాశక్తియుక్తయై ప్రాణాగ్నిబిందునాదనిలయయై సావిత్రీ సరస్వతీ నామికయై బ్రహ్మరంధ్రగతయై సుషుమ్నానాడి ప్రవర్తిల్లు. సీతారామాంజనేయసంవాదము.

గుదస్థానమునందున్న మూలాధారచక్రమునందు అధఃకుండలి గలదనియు శిరస్సునం దూర్ధ్వకుండలి కలదనియుఁ జెప్పుదురు. కుండలినే కుండలిని యందురు,)

తా. రామభూమివిభుని పేరు విన్నంతనె నిజాముఁడు మోహశీలుఁడై వనవాసియగుటకు గర్వాదు లుజ్జగించి మేన విభూతిఁ బూసి కాంతాకనకములపై నాసమాని ప్రాణాయామాభ్యాసమునఁ గుండలిస్థానమంటి అపవర్గమునకుఁ బాటుపడెను (నిజాముఁడు రామరాజు నెదిరింపఁజాలక పొందిన పరాజయ మాయాతావుల సూచితములు)

చ. అరిజయకీర్తిసాంద్రుఁ డగు నయ్యభిరామనరేంద్రసోదరుం
దిరుమలదేవరాయల నుతింపఁ దరంబె తదీయహేతిశాం
కరి యతిలోహితావయవనంగాఁ దను న్నాత్మహృదంతరంబులం
దరలక తాల్చువారలకుఁ దార్చు సురీవరణీయవై ఖరుల్. 40

అరిజయ=శత్రుజయమువలని, కీర్తి = యశస్సుచేత, సాంద్రుఁడగు = సమగ్రుఁడైన, అయ్యభిరామనరేంద్రసోదరుల్ = ఆరామనృపునితమ్ముఁడైన, తిరుమలదేవరాయలన్ = తిరుమలదేవరాయలను, నుతింపఁదరంబె=స్తోత్రము చేయశక్యమా, అనఁగా శక్యముగాదనుట. అదేమనిన, తదీయ = ఆతిరుమలరాయనిసంబంధమైన, హేతి = ఖడ్గమనెడు, శాంకరి=శాంకరీనామకశక్తి, అతిలోహితావయవఁగాన్ = మిక్కిలిరక్తముగల మూర్తిగలదానిఁగా, తనున్ = తన్ను, ఆత్మహృదంతరంబులన్ = స్వకీయవక్షస్స్థలాంతరములయందు, తరలకతాల్చువారలకున్ = చలింపక ధరించినవారికి, సురీవరణీయవైఖరుల్ = దేవతాస్త్రీలకు వరింపఁదగిన వైఖరులను, తార్చున్ = ఘటనపఱుచును, అని ఖడ్గపరమైన యర్థము. అనఁగా వారిని వాతముగావించి స్వర్గమందలి యప్సరః స్త్రీప్రాప్తిగలుగఁ జేయునని తాత్పర్యము. ఉదయభాస్కరునిరీతిగానత్యంతరక్తిమతోఁ గూడిన దేహము కలదానినిగాఁ దన్ను స్వకీయ మానసాంతరముఁయందు ధ్యానముచేసి నిలిపిన వారికి దేవతాస్త్రీవశీకరణసామర్థ్యము నిచ్చునని శక్తి

పరమయిన యర్థము. శాంకరి నరుణాకారముగలదానిఁగాను నామెదేహకాంతిచేత ముందు గానే భూమి నరుణికమైనదానిగాను ధ్యానముచేసినవారికి స్త్రీవశీకరణసిద్ధియగునని యోగమరహస్యమున నిట్లు చెప్పఁబడెను.

శ్లో. "యోవకాన్ధానిమగ్నాంయో దివం భూమించ చింతయేత్,
తస్య సర్వావశం యాతా స్త్రైలోక్యవనితాధ్రువమ్."

యుద్ధనిహతులకు సురాంగనాసమాగమము కలుగు ననుటకు.

క. అతని యనుజుండు చినమ, ల్లలిరుణనీ రేజాశరుఁడు లలి నొప్పెను హా
స్నుతగాయక నుతసాయక, హతనాయక ఘటితసౌరహరిణేక్షణుఁడై.

చంద్రికాపరిణయము.

తా. రామరాజసహోదరుఁడగు తిరుమలదేవరాయలు మహావీరుఁడై శత్రురక్తారుణితమగు ఖడ్గము దాల్చి పేరొందెను. అతనిఖడ్గముచేఁ జెగిన ప్రతిపక్షవీరులు సురకాంతాసమాగమము నొంది స్వర్గమున సుఖింపసాగిరి.

క. ఆరాయమణికి జగతీ, హారాయితకీర్తిశుభ్రుణికి ♦ ననుసంభవుఁడై
నారాయణాంశభవుఁ డితఁ, డౌరా యన వేంకటక్షమాధిపుఁ డలరున్. 50

జగతీ=భూమికి, హారాయిత = ముత్యాలహారమువలె నాచరించుచున్న, కీర్తిశుభ్రుణికిన్=కీర్తి యొక్క శుభ్రకాంతిగలిగిన, ఆరాయమణికిన్ = ఆతిరుమలదేవరాయశ్రేష్ఠునికి, అనుసంభవుఁడై = తోడఁబుట్టినవాఁడై, అనఁగాఁ దమ్ముఁడై, నారాయణాంశభవుఁ డితఁ డౌరా యనన్ = ఇతఁడు నారాయణమూర్తియొక్క యంశమువల్ల జన్మించినవాఁ డవురా యనునట్లులుగా, వేంకటక్షమాధిపుఁ డలరున్=వేంకటరాయభూమీశ్వరుఁ డొప్పుచుండును. అలం. ఉపమ.

తా. ఆతిరుమలదేవరాయల తరువాతివాఁడగు వేంకటరాయలు లోకమునకు హారమువలె నున్న కీర్తిగలవాఁడై నారాయణాంశభవుఁ డనుకొనునటులఁ బ్రసిద్ధి నొందెను.

సీ. నిరతంబు దుర్మార్గ♦నిరతు లౌ తురకల నతులసన్మార్గసం♦గతులఁ జేసె
ననియతమోహాంధు ♦ లౌ పారసీకుల స్వస్త్రీసుఖైకని♦శ్చలులఁ జేసె
నతినిగ్రహాత్ము లౌ♦యవనుల భూతసంతానతృప్తిప్రదా♦త్మకులఁ జేసె
ద్విజపక్షపాతంబు ♦ దెగడుపాశ్చాత్యుల ద్విజపక్షపాతభా♦వితులఁ జేసె
తే. ననుచుఁ గడు మెచ్చి జయలక్ష్మి ♦ యాజిరంగ
శాతరబరీద కేతన♦ఘటితభద్ర
కలశ మెదురుగఁ బూని యే♦ఘనునిఁ జెందె
నతఁడు సామాన్యుఁడే వేంక♦టాద్రివిభుఁడు. 51

నిరతంబున్=ఎల్లప్పుడును, దుర్మార్గనిరతులౌ=దుర్మార్గమం దాసక్తులౌచున్న, తురకలన్=తురకలను, అతులసన్మార్గసంగతులఁ జేసెన్ - అతుల=సమానరహితమైన, సన్మార్గ=సజ్జనమార్గముతోడ, సంగతులఁజేసెన్ = కూడుకొన్నవారినిగాఁ జేసెనని యర్థము. సత్+మార్గమనఁగా నక్షత్రమార్గమగు నాకాశము, ఆకాశసంగతులఁ జేసెనని యర్థాంతరము. వేంకటరాయలు దుర్మార్గులగు తురకల మంచితోవను ద్రిప్పెనని స్వర్గాభిముఖులఁ గావించెనని భావము.

అనియతక=నియతములేని, మోహ=కాముకత్వముచేత, అంధతా=కన్ను గానకయున్న, పార సీకులన్=మ్లేచ్ఛులను, స్వస్త్రీ=స్వకీయ లైనభార్యలవలని, సుఖ=భోగమందు, ఏక = ముఖ్యములానట్టు లుగా, నిశ్చలులఁజేసెన్ = చలించనివారినిగాఁ జేసెనని యర్థము. స్వర్గస్త్రీసుఖాసక్తులనుగాఁ జేసెనని యర్థాంతరము. ఇచట స్వ+స్త్రీ = తమయొక్కయుది, స్వః+స్త్రీ స్వర్గస్త్రీ అని యర్థము. ఈరెండు పక్షములయందును స్త్రీశబ్దసకారమునకు ద్విత్వముగాని, స్వరశబ్దవిసర్గమునకు వికల్పలోపముగాని చేయవచ్చును. మోహాంధులగు పారశీకులఁ గులకాంతాలోలురుగ నొనర్చెనని దేవకాంతాసుఖలోలురుగఁ జేసెనని భావము.

అతినిర్దయాత్మతా = (పక్ష్యంశనిర్దయాంతఃకరణులైన, యవనులన్ = యవనదేశపుతురకలను, భూతసంతానతృప్తిప్రదాత్మకులఁజేసెన్ = ప్రాణికోటికిఁ దృప్తిప్రదమైన మనస్సుగలవారినిగాఁ జేసె ననియర్థము. పిశాచగణమునకుఁ దృప్తిప్రదమైన, అనఁగాఁ దినఁదగినదై తనివిఁ జెందించునట్టి దేహము గలవారినిగాఁ జేసెనని యర్థాంతరము. ఇక్కడ నాత్మక్ శబ్దము దేహపరము. (ని. 'ఆత్మాయత్నో ధృతిర్బుద్ధి స్స్వభావో బ్రహ్మవర్ష్మ చ' అని అ.) నిర్దయాత్ములగు యవనుల భూతదయాపరతంత్రులుగఁ జేసెననియుఁ బిశాచాదుల కాహారముఁ జేసెననియు భావము.

ద్విజపక్షపాతంబుఁదెగడు = బ్రాహ్మణపక్షపాతమును నిందించునట్టి, పాశ్చాత్యులన్=పశ్చిమ దేశస్థులైన తురకలను, ద్విజపక్షపాతభావితులఁజేసెన్ = అనఁగా బ్రాహ్మణపక్షపాతమందుఁ జిత్తముగల వారినిగాఁ జేసెననియర్థము. ద్విజ=కంకగృధ్రాదిపక్షులయొక్క, పక్షపాత=పక్షవిక్షేపముచేత, భావి తులఁజేసెన్ = పొందఁబడినవారినిగాఁ జేసెననియర్థాంతరము. (ని. 'లబ్ధంప్రాప్తంవిన్నంవిత్తంభావితమా సాదితంచభూతంచ' అని అ.) బ్రాహ్మణద్వేషులగు పాశ్చాత్యుల బ్రాహ్మణాభిమానులుగఁ జేసెననియుఁ బక్షులపక్షవిక్షేపములఁ బొందువారు గావించె ననియు భావము.

అనుచున్ = ఈలాగుపలుకుచు, కడుమెచ్చి=మిక్కిలియు శ్లాఘించి, జయలక్ష్మి=జయలక్ష్మియ నెడునాయిక, ఆజిరంగ=యుద్ధరంగమందు, కాతర=భయశీలుఁడైన, బరీద=బెడదకోటనబాబుయొక్క, కేతనఘటిత = ధ్వజమందునిలుపఁబడిన, భద్రకలశము=సువర్ణకలశమనెడు పూర్ణకలశము, ఎదురుగఁ బూని=ఎదురుగఁ బట్టుకొనివచ్చి, ఏఘనునిఁ జెందెన్=ఏమహానుభావునిఁబొందెనో, అతఁడు=అట్టి, వేంక టాద్రివిభుఁడు = వేంకటరాయఁడు, సామాన్యుఁడే = అందఱురాజులవంటివాఁడా, అనఁగాఁ గాఁడనుట. అలంకారము పర్యాయోక్తి. అతిశయోక్తి. జయలక్ష్మి యిచట నభిసారికగాఁ జెప్పఁబడెను. అభిసారికాలక్షణము.—

"మదనానలసంతప్తా యాభిసారయతి ప్రియం, జ్యోత్స్నీతమస్వినీయానయోగ్యాంబరవిభూషణా,
స్వయంవాభిసరేద్యాతుసాభవేదభిసారికా,అస్యా స్సంతాపచింతాద్యా విక్రియాస్తు తథోచితం."

రసార్ణవసుధాకరము.

ఇట జయలక్ష్మి దివాభిసారిక:—

తా. వేంకటరాయలు దుష్టులగు విరోధులనందఱను సాధించి సత్ప్రవర్తులనుగా (నిహతుల నుగా), జేయుటచే జయలక్ష్మి యానందించి బెడదకోట నవాబు కేతనముపైఁ గలసువర్ణకుంభమును గొని యెదురుగా వచ్చి వరించెను.

మ. కడిమి న్వేంకటరాయశౌరి నెదురంగా లేక యత్యాహితం
బెదరన్ గౌతమి దాఁటువేళ నిజకాంతాశ్రుప్రవాహాప్తిఁ గా

ల్నడ దప్పక్ జడుఁడై నిజాముఁ డుడుపాలంబంబునం దాఁటి యె
క్కడఁ గన్న న్భజియించునయ్యుడుపరేఖ న్నామమోహంబునన్. 52

కడిమిక్ = పౌరుషములచేత, వేంకటరాయశౌరి నెదురంగాలేక=శూరవంశసంజాతుఁడైన వేంకటరాయల నెదిరించి నిలువఁజాలక, అత్యాహితంబడరక్ = మహాభయముద్రేకింపఁగా, గౌతమిదాఁటు వేళక్ = పాఱిపోవుచు గోదావరిని దాటుసమయమందు, నిజ = స్వకీయమైన, కాంతా = భార్య యొక్క, అశ్రు = శోకబాష్పములవల్లనైన, ప్రవాహా = పైనీటిపొల్లయొక్క, ఆప్తిక్ = కూడికచేత, కాల్నడ దప్పక్ = కాల్నడకుఁ బాదియ్యకపోఁగా, జడుఁడై=విభ్రాంతిఁ బొందినవాఁడై, నిజాముఁడు = నిజాము సాహేబు, ఉడుపాలంబంబునం దాఁటి=ఉడుపశబ్దము తెప్పయందును జంద్రునియందును వర్తించును, తెప్పతొయ్యొయొక్క యాధారముచేతదాఁటి, ఎక్కడఁగన్నక్ = ఏకడఁజూచినను, అయ్యుడుపరేఖక్=నెలపొడుపునాఁటి చంద్రరేఖను, నామమోహంబునక్=ఏకనామభ్రాంతిచేత, భజియించుక్ = సేవించును. అనఁగా నుడుపరేఖ యాపత్కాలమందుఁ దమ్ము నుద్ధరించుటచేత నుడుపరేఖానామము గల చంద్రరేఖను సేవించునని తాత్పర్యము. నెలపొడుపునాఁడు తురకలందఱు చంద్రునిఁ జూచుట ప్రసిద్ధము గదా. అలంకారము హేతూత్ప్రేక్ష. అతిశయోక్తి.

మహమ్మదీయులు చంద్రుని భజింతు రనుటకు-

క. 'గోవధము చేయఁ దురకల, దైవంబవు నీవు మొదలఁ దక్కఁగఁ బాంథ
స్త్రీవధము సేయ రోయుదె, నీవర్తన మేమి చెప్ప నీరజవైరీ.' మనుచరిత్రము.

తా. మహమ్మదీయులు వేంకటరాయల నెదిరింపలేక గోదావరి దాఁటి పాఱిపోవుతఱి బిబ్బీల కన్నీటి ప్రవాహముచేఁ గాలినడ తప్పెను. అంత ఉడుపసహాయమున గోదావరి దాఁటి నామసామ్యముచే నుడుప (పడవ) కృతమగు మేలునకు ఉడుపరేఖకు (బాలచంద్రునకు) మ్రొక్కుచున్నారు.

ఉ. ఏకసపాదలక్షమిత • మింద్రజదోశ్చరితప్రబంధ మ
స్తోక మె యంచుఁ జాపజిత•ధూర్జటి వేంకటశౌరి శౌర్యదీ
క్షాకృతి కర్ణభీష్మజయ•శక్తి ననేకసపాదలక్షసం
ఖ్యాకమనీయభూరివిభ•వాప్తి వహించు నుదంచితోన్నతిన్. 53

ఇంద్రజ = ఇంద్రుకుమారుఁడైన యర్జునునియొక్క, దోశ్చరితప్రబంధము = భుజపరాక్రమచరిత్రమయిన ప్రబంధము, అనఁగా భారతము, ఏకసపాదలక్షమితము = పాదసహితమయిన లక్షయనెడు నిబంధము గలది, అస్తోకమె = అది మిక్కిలియు నధికమయినదా, అనఁగాఁ గొంచెము, అంచుక్ = అని వచించుచు, చాపజితధూర్జటి- చాప = ధనుస్సుచేత, జిత = జయింపఁబడిన, ధూర్జటి= శివుఁడు గలిగిన, అర్జునునివలె, అని యర్థము, ధూర్జటియనెడు పరరాజుగలవాఁడని భావము. వేంకటశౌరి=వేంకటరాయఁడు, శౌర్యదీక్షా=పరాక్రమ దీక్షయందు, కృతి = కుశలుఁడైన వాఁడయి, కర్ణభీష్మజయశక్తిక్ = అర్జునునివలెఁ గర్ణుని భీష్ముని జయించుటయందలి సామర్థ్యముచేత, చెవులకు భయంకరమైన జయశక్తి చేత నని భావము. అనేక=మితములేని, సపాదలక్ష=పాదసహితములైన లక్షయనెడి, సంఖ్యా=సంఖ్యచేత, కమనీయ=ఒప్పుచున్న, భూరి = అతిశయమయిన, విభవాప్తిక్—పరాక్రమప్రబంధవిభవప్రాప్తిని, ఉదంచితోన్నతిక్=మిక్కిలియు నొప్పుచున్న యౌన్నత్యముచేత, వహించుక్ =

పొందించుకొనును, అని యర్థము. అనేకులైన సపాదులయొక్క లక్షలకొలఁదియగు కాంచనవిభవము యొక్క ప్రాప్తిని బొందించుకొనునని భావము, అనఁగా నర్జునునికంటె నితఁడు పరాక్రమచరిత్రమం దధికుఁడని ఫలితార్థము. ఇక్కడ భూరిశబ్దము కాంచనవాచకము. (ని. 'భూరి ప్రాజ్యసువర్ణయోః' అని విశ్వము.) అలం. శ్లేషోత్థాపితవ్యతిరేకము.

తా. సపాదలక్ష శ్లోకపరిమితిగల యర్జున దోశ్చరితము తెలుపుభారతము గొప్పదియా యని నిరసించి చాపవిద్యలో ధూర్జటి (యనువాని) ని జయించిన వేంకటపతిరాయలకీర్తికృతి కర్ణభీష్మ జయశక్తి (చెవికి భయంకరమగు గెల్పుబీరముతో) నొప్పి యనేక సపాదలక్షసంఖ్యల (సపాదుల యొక్క) భూరి (సువర్ణ) విభవముతోఁ బేరెన్నికను గాంచెను.

ఉ. ఆయనుజుల్ విశుద్ధహరిదంతమహాకరిదంతకాంతిరే
ఖాయతకీర్తులై కొలువ గౌతమినీట నరాతిఘాతిక్షౌ
క్షేయకరక్తము ల్గడిగి శ్రీరమణీవరమూర్తిరామభూ
నాయకుఁ డుర్వి నేలె భువనస్తవనీయజయాభిరాముఁడై. 54

ఆయనుజుల్=పైనిఁ జెప్పఁబడినతమ్ములు, అనఁగాఁ దిరుమలరాయఁడు వేంకటరాయఁడు నను వారు, విశుద్ధ=స్వచ్ఛమయిన, హరిదంత=దిగంతములయందలి, మహాకరిదంత=మహాగజదంతముల యొక్క, కాంతిరేఖా=కాంతిశ్రేణివలె, ఆయత=విస్తారమయిన, కీర్తులై=యశస్సుగలవారై, (కాంతి రేఖాయిత అని పాఠముఁ జేసినచో యతికి భంగములేకుండును, కాంతిరేఖవలె నాచరించునట్టి యని యర్థము. ఇదియే కవిహృదయ మని తోఁచెడిని.) కొలువన్=సేవింపఁగా, గౌతమినీటన్=గోదావరీజలమందు, అరాతి=శత్రువులను, ఘాతి=ఖండించిన, కౌక్షేయక=ఖడ్గముయొక్క, రక్తముల్గడిగి=నెత్తురులను గడిగివైచి, అనఁగాఁ గండనోలు మొదలుకొని గోదావరిపర్యంతము తనఖడ్గముచేత శత్రుసంహారముచేసి గోదావరిలోఁ గత్తిగడిగినాఁడని భావము. (ని. 'కౌక్షేయకో మణ్డలాగ్రః కరవాలః కృపాణవత్' అని అ.) శ్రీరమణీవరమూర్తి=లక్ష్మీకాంతుఁడు నాథుఁడైన నారాయణునివంటి స్వరూపముగల, రామభూనాయకుఁడు=రామభూమీశ్వరుఁడు, భువన=లోకములచేత, స్తవనీయ=స్తోత్రము చేయఁదగిన, జయ=శత్రుజయముచేత, అభిరాముఁడై=ఒప్పుచున్నవాఁడై, ఉర్విన్=భూమిని, ఏలెన్=పరిపాలించెను. కాంతిరేఖాయితకీర్తు లనుచోట నుపమాలంకారము.

గౌతమీజలమున ఖడ్గమును గడుగుట పరాక్రమచిహ్నము.

'గౌతమీవారి తరవారి కడిగినాఁడు.' శ్రీనాథుఁడు

అరాతులు గౌతమి దాఁటిపోవుటవలననే గౌతమీజలమున ఖడ్గము గడుగవలసివచ్చెను. రామరాయసోదరులకీర్తి కుపమానముగ దిగంతదంతిదంతములు చెప్పఁబడుటచే వారలకీర్తి దిగంతవిశ్రాంత మయ్యెనని యాశయము.

తా. సోదరు లీవిధముగాఁ గీర్తిశాలులై పరాక్రమధురంధరులై తోడుపడుచుండ రామరాజు గౌతమీజలమున శత్రురక్తారుణితమైన ఖడ్గము గడిగి నిర్విరోధముగాఁ బ్రతాపవంతుఁడై రాజ్యమును బరిపాలింపసాగెను.

క. ఆరామశౌరిపిమ్మట, ధీరామరశాఖి వీరతిరుమలరాయం
డారామసేతుహిమవ, త్తారమణీరమణుఁ డై జగంబు భరించెన్. 55

ఆరామశౌరిపిమ్మటన్ = ఆరామదేవరాయని యనంతరమందు, ధీరామరశాఖి = విద్వాంసులకుఁ గల్పవృక్షమయిన, అనఁగాఁ గల్పవృక్షమువలెఁ గోరినపదార్థములనెల్ల నిచ్చువాఁడని భావము. వీరతిరుమలరాయండు=శూరుఁడైన తిరుమలదేవరాయఁడు, ఆరామసేతుహిమవత్తీరమహీరమణుఁడై = రామసేతువు మొదలుకొని హిమవత్పర్వతపర్యంతమైన భూకాంత కధిపతియై, జగంబుభరించెన్ = జగత్తును భరించిన వాఁడాయెను. ధీరామరశాఖి యనుచో రూపకాలంకారము.

తా. రామరాయలపిదప బండితులపాలి పారిజాతమగు తిరుమలరాయలు సేతువుమొదలు హిమవంతమువఱకుఁ గల విశాలరాజ్యమును బరిపాలింపసాగెను.

సీ. కావుకావనువారిఁ ♦ గదిసి తుంగపయోధరపదాంతరంబు చే♦రంగనీదు
విప్పృతాగ్రరదనులై♦ వ్రేళ్లు చీఁకెడువారి మోముఁ జేర్చి శిరంబు♦మూరుకొనదు
పదములు దొట్రిలఁ ♦ బరువు లెత్తెడివారి ననురక్తవృత్తి వె♦న్నాడి చనదు
పలుచాపలములఁబు♦ట్టలు మెట్టఁజనువారిఁ దత్తరంబున గ్రుచ్చి ♦ యెత్తుకొనదు
తే. కాంచదో విజయశ్రీలఁ♦ బెంచదో ప్ర, తాపబాలార్కులను శుభో♦దయము మీఱ
నౌర తిరుమలరాయబా♦హాసిపుత్రి, యఖిలలోకాద్భుతక్రీడ ♦ నతిశయిల్లు. 56

ఈపద్యమందుఁ దిరుమలరాయనియొక్క బాహాసిని బుత్రవతియైన పుత్రికనుగా నధ్యవసించి యర్థద్వయమును గలుగఁజెప్పినాఁడు. ఎట్లనిన,

కావుకావనువారిన్ = రక్షించురక్షించుమనువారిని, కదిసి=సమీపించి, తుంగ=ఉన్నతములైన, పయోధర = మేఘములకు, పద = స్థానమైన యాకాశముయొక్క, అంతరంబు = మధ్యప్రదేశమును, చేరంగనీదు=ప్రవేశించునట్టులుగాఁ జేయదు, అనఁగా నట్టివారిని హతము చేసి యూర్ధ్వలోకగతులనుగాఁ జేయదని ఖడ్గపరమైన యర్థము. కావుకావురని పోరుపెట్టియేడ్చెడు శిశువులను దగ్గరఁబోయి యున్నత కుచమధ్య ప్రదేశమందుఁ జేర్చుకొనదని పుత్రికాపరమైన యర్థాంతరము. ఇక్కడఁ బయోధర శబ్దము స్తనపరము. ని. 'స్త్రీస్తనాబ్దౌ పయోధరౌ' అని అ. పసికూన లేడ్చునపుడు తల్లులు పాలుబ్బు చనుదోయి మధ్యఁ జేర్చుట తల్లులకు సహజము. అసిపుత్రి యటులఁ జేయదు.

విప్పృత = తెఱవఁబడిన, అగ్రరదనులై = ముందరిపండ్లు గలవారై, వ్రేళ్లుచీకెడువారిన్=వ్రేళ్లు నోటఁ గఱచుకొన్నవారిని, మోముఁ జేర్చి = మొనవాఁడితాఁకించి, శిరంబుమూరుకొనదు = శిరస్సును భిన్నముగాఁ జేయదని యర్థము. విప్పృతాగ్రరదనులై = కానఁబడిన ముందరి పండ్లు గలవారై, వ్రేళ్లు చీఁకెడు వారిన్=వ్రేళ్లు గుడుచుకొను బాలకులను, మోముఁజేర్చి=ముఖమానించి, శిరంబుమూరుకొనదు= మూర్ధాఘ్రాణముసేయదని యర్థాంతరము. నోటఁ జేయివేసికొను విరోధి పరాజయమున కొప్పుకొన్నటు లగునుగాన నట్టివానిని జంపక విడుచుట రాజధర్మమును సంగరధర్మమును నై యున్నది.

పదములు దొట్రిలఁ బరువులెత్తెడువారిన్=కాళ్ళు తడఁబడఁగాఁ బాఱిపోవువారిని, అనురక్తవృత్తి వెన్నాడిచనదు=అనుగతమైన రక్తముగల వృత్తిచేత వెంటఁ దఱుముకొనిపోదని యర్థము. తప్పటడుగులు పెట్టి నడుచునట్టి చిన్నవాండ్ర ననురాగయుక్తమైనవృత్తిచేత వెంబడించిపోదని యర్థాంతరము. ప్రతివీరున కెదురునడవక తడగాళ్లతోఁ బరుగెత్తుట భీరులక్షణము. అట్టివారల వెన్నాడుట తును మాడుట వీరధర్మమునకు వ్యతిరేకము.

పలు = అనేకవిధములైన, చాపలములన్ = చిత్తచాంచల్యములచేత, పుట్టలు మెట్టఁజనువారిన్ = పుట్టలపై నెక్కఁబోవువారిని, తత్తరంబునఁ గ్రుచ్చి యెత్తుకొనదు = త్వరపాటుచేత గ్రుచ్చి లేవనెత్త దని యర్థము. బాల్యచాపల్యముచేతఁ బాముపుట్టలమీఁదికిఁ బోవుచున్న బాలురను గ్రుచ్చి కౌఁగి లించుకొనదని యర్థాంతరము. పుట్టలమెట్టలకేగుట దాగుకొనుటకు సలుపుప్రయత్నము కాననే యట్టి వారిని ఖండింపదు. కావుకావనుతఱిఁ బురిటికందువనియు ప్రేష్ఠచీకెడితఱి నెలలబిడ్డయనియుఁ దప్పుటడుగులు వేయుతఱి నేడాదిశిశువనియుఁ బుట్టలుమెట్టలెక్కుతఱి నొకటిరెండేండ్లశిశువని విజయశ్రీ యను బాలికను ప్రతాపార్కుఁడను బాలుని గ్రహింపవలయును.

శుభోదయము మీఱన్ = శుభకరమైన యభ్యుదయ మతిశయించునట్టులుగా నని యర్థము. జనన మతిశయించునట్టులుగా నని యర్థాంతరము. కాంచదో విజయశ్రీలన్ = విజయసమృద్ధులను బొందలేదా యని యర్థము. విజయలక్ష్ములను బాలికలను కనలేదా యని యర్థాంతరము. పెంచదో ప్రతాపబాలార్కులను = బాలసూర్యులవంటి ప్రతాపముల నతిశయింపఁ జేయలేదా యని యర్థము. ప్రతాపములనెడు బాలసూర్యులను, అనఁగా బాలురను, పెంచలేదా యని యర్థాంతరము. ఔర = భళా, తిరుమలరాయ బాహాసిపుత్రి = తిరుమలదేవరాయని బాహువునందలి యసి యనెడు, అనఁగా ఖడ్గలత పుత్రికయు, అఖిలలోకాద్భుతక్రీడనతిశయిల్లున్ = సమస్తలోకములకు నాశ్చర్యకరమైన విహారముచేత నతిశయించును.

(ని. 'స్యాచ్ఛస్త్రీచాసిపుత్రీచ ఛురికాచాసిధేనుకా' అని అ.) అనఁగా దిరుమలదేవరాయని బాహువునందలి ఖడ్గమనెడు స్త్రీ విజయశ్రీలనెడు కొమార్తెలను బ్రతాపము లనెడు బాలసూర్యులవంటి కొమాళ్ళను గనిపెంచిన బిడ్డలతల్లియైయుండినను బైనాల్గుచరణములయందును భేదాధ్యవసాయము చేతఁ బ్రాప్తమైన బిడ్డలతల్లులయందుఁ గనుపడని చరిత్రచేతను నద్భుతక్రీడయని యావిష్కృతము చేసినాఁడు. కావుకావనుచోఁ గృపాణపరమైన యర్థమందు మధ్యమపురుషైకవచనముగనుక ముపర్ణకము రావలసినది (సూ. 'ప్రార్థనార్థేమురేకత్వేకథ్యతేమధ్యమార్థకః, విభాషాంతం పదంత్యేకే నప్రాణేతుకదాచన') అనునథర్వణ వచనమువల్ల మొదటికావను పదముమీఁద హల్లుపరమగుచుండఁగా వైకల్పిక ముపర్ణకము రాకున్నను, రెండవకావుపదమున కచ్చుపరమగుచుండఁగా నిత్యముగా రావలసినది గనుక నిక్కడ 'శబ్దశాస్త్రవిరుద్ధం హి చ్యుతసంస్కార మిష్యతే' అనులక్షణముచేత చ్యుతసంస్కార దోషము ప్రాప్తమగుచున్నదని శంకింపఁగూడదు. ఎందువలననినిన, (సూ. 'తజ్జాసమాచదేశ్యాగ్రామ్యాచైవం చతుర్విధా భవతి' అను న.) సూత్రోక్తక్రమంబున నాంధ్రభాష నాలుగువిధములు గలది, అందు నిది గ్రామ్యోక్తి, ఈగ్రామ్యోక్తి ప్రయోగము తత్తత్స్వభావ వర్ణనయందు యుక్తమని యథర్వణాచార్యాదులమతము, కావున శ్లేషైకతానుండగు నీకవి కిది దోషము గాదు.

"కావుము" పదమునకు హల్లుపరమైనపుడు ముపర్ణము లోపించుట కలదు. అచ్చుపరమగుచో లోపించుట వ్యాకరణవిరుద్ధమైనను గవిప్రయోగము లిట్టికార్యమునకుఁ గానవచ్చెడిని.

కావుకా వనుట రక్కసులమూఁకనె (పాండురం.)

ఆడిదె నీదు పంతెము (కళాపూ.)

భవచ్చిత్తేప్సితం బెద్ది చెప్పునిఁక (మార్కం.)

ఇక్కడఁ గాందిశీకస్వభావవర్ణనయందే చెప్పినాఁడు గదా. నం. 'అత్రాసిపుత్రీత్యపుత్రవత్యా

అపి పుత్త్రపోషణ కృత్యవైధుర్యేణాద్భుతచరిత్రం వ్యజ్యతే నాత్ర సమాసోక్తిః శ్లేషోవా విశేష్యస్యాపి శ్లిష్టత్వాత్. అలం. వ్యంగ్యము. మీఁదినాల్గుపాదములు శ్లేషమూలాతిశయోక్తి.

తా. తిరుమలదేవరాయ ఖడ్గపుత్త్రి విజయశ్రీలను కుమారితలఁ గాంచియుఁ బ్రతాపార్కులను కుమారులను గాంచియు (శిశుపోషణమునందును శత్త్రుసంహారమునందును బూర్వోక్తసందర్భములలో జోక్యము గలిగించుకొనకున్నను) లోకాద్భుతవిధముగఁ గనిపెంచుటలోఁ బేరొందెను.

చ. కిరి కసహాయజీవనము • కేవలగండము లద్రికోటికిం
గరులకు దుస్సహప్రకట•ఖర్జువు శ్వేతపుమేను చక్రికిం
విరసులఁ బొంద నొల్ల నని • వేడ్కఁ భజించె ధరాపురంధ్రి శ్రీ
తిరుమలదేవరాయ జగ•తీరమణుఁ రమణీమనోభవున్. 57

కిరికిన్ = ఆదివరాహమునకు, అసహాయ = సహాయసంపత్తిలేని జీవనము = బ్రదుకు అని యర్థము. ఒంటిగాఁ దిరుగుట యని భావము. (ని. 'కోలఃపోత్త్రీ కిరిఃకిటిః' అని అ.) అద్రికోటికిన్ = కులపర్వతములకు, కేవలగండములు = అన్నియుఁ బ్రాణగండములే యని యర్థము. గండశిలలని భావము. కరులకు = దిగ్గజములకు, దుస్సహ = సహింపశక్యము గాని, ప్రకట = స్ఫుటమైన, ఖర్జువు = అనఁగా గజ్జియని యర్థము. కండూతి యని భావము. చక్రికిన్ = శేషాహికి, శ్వేతపుమేను = అనఁగా బొల్లివిడిచిన దేహమని భావము. (ని, 'చక్రీ జాలికభిత్కోకకులాలాహిసూచకే' అని మే.) కాఁబట్టి, ఈవిరసులఁబొంద నొల్లనని=ఈరోఁత గొట్టువాండ్రను బొందనొల్లనని, ధరాపురంధ్రి = భూకాంత, రమణీమనోభవున్ = స్త్రీజనమన్మథుఁడైన, శ్రీతిరుమలదేవరాయ జగతీరమణున్ = సంపద్యుక్తుఁడైన తిరుమలదేవరాయ ప్రభువును, వేడ్కన్ = వేడుకచేత, భజించెన్ = సేవించెను. అలం. ఉత్ప్రేక్ష. కావ్యలింగము.

అసహాయ జీవనము అను ఒంటరితనము. వరాహములలో గుంపును జీలి విడిగా సంచరించువానిని ఒంటరికాఁడు, ఒంటికాఁడనుటకుఁ బ్రమాణములు-

సే. 'కమ్మినొంటరికానిదొమ్మినొంచుయశంబు బయటిపల్లెలు గూల్చు బల్మికల్మి'
(చంద్రాంగదచ. ఆ. ౧)

సీ. 'అనురక్తిరేచునూతనసారసాటోప మొంటికాండ్రకుఁ బెంపు లొసఁగు నెచట'
హరిశ్చంద్రార్థమున నొంటికాఁడు పంది. నలార్థమున వియోగి. (హరిశ్చంద్రనలో. ఆ. ౨)

తా. వరాహ మొంటరిదనియు, శైలములు గండములు గలవనియు, ఏనుఁగులు కండూతిగలవనియు, సర్పము బొల్లి విడచినదనియుఁ దలంచి యీవిరసుల నందఱను భూసతి విసర్జించి సుందరాకారుఁడగు తిరుమలదేవరాయలను భజించెను.

సీ. బహుమహీధరకూట•పటలిపాలుగఁ జేసె గంధాంధసింధుర•ఘటల నెల్ల
శాఖిశాఖాశిఖా•వయములఁ దగిలించె నమితకోదండదం•డముల నెల్ల
శరధికుటుంబినీ•ఝరుల వెంబడిఁ బంచె రాహుతుచాగ్రహ•రముల నెల్ల
దుర్దమకర్దమ•స్తోమంబులో వైచె విజయమంగళశంఖ•వితతి నెల్లఁ
తే. దగవరి గదా నిజాముఁ దు•ద్దండజయప, టిష్ఠతిరుమలరాయధా•టికిఁ జలించి
పఱచునెడశక్తిమఱచియు•మఱువడయ్యెఁ,దత్తదుచితప్రవేశసం•ధానయుక్తి.

గంధాంధ = గర్వాంధములైన. సింధురఘటల నెల్లన్ = గజఘటలనన్నిటిని, ఘటయనఁగాఁ బండ్రెండేనుఁగులగుంపు, (సి. 'కరిణాంఘటనాఘటా' అని అ.) బహుమహీధరకూట = అనేకములైన పర్వత శిఖరములయొక్క, పటలి పాలుగఁజేసెన్ = సమూహముపాలగునట్టులుగాఁ జేసెను, అమితకోదండ దండముల నెల్లన్ = మితములేని వింటిబద్దలనన్నిటిని, శాఖి = వృక్షములయొక్క, శాఖా = కొమ్మల యొక్క, శిఖా = అగ్రములయొక్క, చయములన్ = సమూహములయందు, తగిలించెన్ = సక్తములుగాఁ జేసెను, రామా = భార్యలయొక్క, కుచ = స్తనములయందలి, అగ్ర = శ్రేష్ఠములైన, హారముల నెల్లన్ = ముత్యాలహారము లన్నిటిని, శరథి = సముద్రునియందలి, అగ్ర = శ్రేష్ఠములైన, హారముల నెల్లన్ = ముత్యాలహారము లన్నిటిని, శరధి = సముద్రునియొక్క, కుటుంబినీ = భార్యలైన నదుల యొక్క, ఝురుల వెంబడిన్ = ప్రవాహముల వెంబడి, పంచెన్ = పంచెను. విజయ = జయప్రయుక్తములైన, మంగళ = శుభకరములైన, శంఖ = శంఖములయొక్క, వితతి నెల్లన్ = సమూహమునంతయు, దుర్దమ = సహింపఁగూడని, కర్దమస్తోమంబులోన్ = బురుదరొంపిలో, వైచెన్ = పడవైచెను, నిజాముఁడు = నిజాంఖానుఁడు, తగవరి గదా = మర్యాదగలవాఁడుగదా, ఏమనిన, ఉద్దండ = పరాక్రమప్రయుక్తమైన, జయ = విజయమందు, పటిష్ఠ = సమర్థుఁడైన, తిరుమలరాయ = తిరుమలదేవరాయలయొక్క, ధాటికిఁజలించి = దాడికిఁ జంచలించినవాఁడై, ధాటీలక్షణము, (సం. 'శత్రుసేనావమర్దాయ సద్యస్సుభట ఘోటకైః, విజిగీషాప్రవృత్తిర్యా సాధాటీతి నిగద్యతే.') పఱచునెడన్ = పాఱిపోవునప్పుడు, శక్తి మఱచియున్ = తనసామర్థ్యము మఱచి పోయినను, తత్తత్ = వానివానియొక్క, ఉచిత ప్రవేశ = తగిన చోటఁ బ్రవేశించుటయొక్క, సంధాన = కూర్చుటయందలి, యుక్తిన్ = ఉపాయమును, మఱవఁ డయ్యెన్ = విస్మృతినొందఁడాయెను.

శక్తిమఱచియు నుచితప్రదేశసంధానశక్తి మఱచిపోవకుంటవలననే నిజాముఁడు తగవరి (ఉచితజ్ఞుఁ)డయ్యెను. నిజామునకు మదపుటేనుఁగులు ధనుర్ధారులు విజయశంఖములు గలవని చెప్పుటలోఁ గవి హైందవసాంగ్రామికవస్తు సముదాయము మహమ్మదీయులకుఁ జెప్పుటవలన సహజమునకు విరుద్ధము. కావున నిది సమయవిరోధ మనుకావ్యదోషము. ఇందులకుఁ గవిజనాశ్రయమున దృష్టాంతము—

క. ఘనదండకాష్టకృష్ణా, జినములు సొగయింప నొక్కజినముని చనుదెం
చె ననఁగ సమయవిరోధం, బని కవులకుఁ జెప్పుఁ గవిజనాశ్రయుఁ డొనరన్.

ఇటులఁ గొంద ఱందురు. తిరుమలరాయలధాటి ఉద్దండ జయపటిష్ఠ మనుటవలనను నిజాముఁడు చలించిపఱచె ననుటవలన నాయక ప్రతినాయకులగు వీరు లిరువురు సములని తెలియును. నిజాముఁడసామాన్యుఁ డనుటకు సింధురఘటలు, అమితకోదండములు, రామాకుచాగ్రహారములు, శంఖవితతి తార్కాణము.

తా. తిరుమలదేవరాయనిదాడికి నిలువలేక పాఱిపోవునప్పు డేనుఁగులను బర్వతశిఖరములకై పాఱఁదోలి, వింటిబద్దలు చెట్లకొమ్మలకుఁదగిలించి భార్యలయొక్క ముత్యాలహారములు నదులలోఁ బాఱవైచి విజయశంఖములు బురుదలో వైచిపోఁగా నది వానివాని జన్మస్థానములయందు వానివానిని బ్రవేశ పెట్టుట యుచితమని విచారించి ప్రవేశపెట్టినాఁ డనునట్టులనుండెను. (ఏనుఁగులు పర్వతముల యందు జన్మించుటయును వింటిబద్దలు వృక్షశాఖలచేతఁ జేయఁబడుటయును ముత్యాలు జలధియందుఁ బుట్టుటయును శంఖములు బురుదలోఁ బుట్టుటయును లోకంబునఁ బ్రసిద్ధంబకదా.) అలం. హేతూత్ప్రేక్ష.

చ. తిరుమలరాయశేఖరుని ♦ ధీరచమూభటరాజి యాజిభీ
కరయవనేశ్వరప్రహిత ♦ ఖానబలంబులఁ జక్కఁ జేయ ని
ద్దరఁ బెనుగొండకొండలు మ♦దద్విపచర్మకపాలమాలికా
పరికరభూషితంబు లయి ♦ బల్విడిఁ గాంచె గిరీశభావమున్. 59

తిరుమలరాయశేఖరుని = తిరుమలదేవరాయశ్రేష్ఠునియొక్క, ధీర = ధైర్యయుక్తమైన, చమూభటరాజి = సేనాభటసమూహము, ఆజి = యుద్ధమందు, భీకర = భయంకరమైన, యవనేశ్వరప్రహిత = నవాబులచేఁ బంపఁబడినట్టి, ఖానబలంబులన్ = తురకలఫౌజులను, చక్కఁజేయన్ = ఖండింపఁగా, (మహమ్మదీయు లాజిభీకరు లగుటచేతనే యెదిరించి విజయ మొందుటకు దిరుమలరాయలు ధీరచమూభటరాజిని నియోగించెను. సేన యవనేశ్వరప్రహిత మనుటవలన నాసంగమునకు నవాబులు సైనికులను మాత్రమే పంపి రనియుఁ దాము రాలే దనియు నాశయము.)

ఇద్ధరన్ = ఈభూమియందు, పెనుగొండకొండలు = పెనుగొండసంబంధమైన కొండలు, మదద్విప = మదపుటేనుఁగులయొక్క, చర్మ=చర్మములను, కపాలమాలికా = కపాలమాలిక లనునట్టి, పరికర= అలంకారసామగ్రిచేత, భూషితంబులయి = అలంకరింపఁబడినవియై, గిరీశభావమున్=రుద్రభావమునని యర్థము. పర్వతరాజత్వమునని భావము. (ని. 'గిరీశో గిరిశో మృడః' అని అ.) బల్విడిఁగాంచెన్ = తత్క్షణమే పొందెను. మదద్విపచర్మకపాలమాలికా పరికరభూషితత్వము గిరీశునకును బెనుగొండ కొండల కును సమానధర్మము.

తా. తిరుమలదేవరాయని సేనాభటులు, తురకలయొక్క చతురంగబలములను సంహరింపఁగాఁ బెనుగొండకొండలపై నేనుఁగులయొక్క చర్మములును దలపుఱ్ఱెలయొక్క పంక్తులును బడియుండుట చేత నాకొండలు గజచర్మకపాలమాలికాధరుఁడైన రుద్రునివలె నుండె నని. అలంకారము. కావ్యలింగ భేదము. శ్లేషసంకీర్ణము.

సీ. కప్పువాటింపదు ♦ గగనమధ్యంబుపై సుప్యాంగుపృథులప♦యోధరముల
నలఁత నొందదు విని♦ర్మలసుధాధామకో పరిసమారోహవై ♦భవమునందుఁ
దడఁబాటుఁ బూన దు♦త్తమరసజ్ఞాస్థానవాటిఁ బొటిలునాట్య♦పాటవమున
శ్రమము నొంద దశేష♦కమలాకరాభోగతరుణకేళీమహో♦ద్యమమునందు
తే. ననుపమాకల్పపరిపూర్తి ♦ నతిశయిల్లు, ననిశని స్తంద్రగతిఁ బొల్చు♦నఖిలభువన
గర్భగౌరవ మేరీతిఁ గాంచెనొక్కొ, వీరతిరుమలరాయభూ♦విభునికీర్తి. 60

ఈ పద్యమందుఁ దిరుమలదేవరాయని కీర్తియందలి స్త్రీలింగస్వారస్యముచేత గర్భిణీస్త్రీ త్వారోపణము చేసి యర్థద్వయమునకు నభేదాధ్యవసాయముగాఁ జెప్పినాఁడు. ఎట్లనఁగా,

వీరతిరుమలరాయభూవిభునికీర్తి=వీరుఁడైన తిరుమలరాయని కీర్తియనెడుస్త్రీ, అఖిలభువన = సమస్తప్రపంచమనెడి, గర్భ=గర్భముయొక్క, గౌరవమున్ = భారమును, ఏరీతిఁగాంచెనొక్కొ=ఎట్లు పొందినదోగాని, (అఖిలభువన = సమస్తలోకములయొక్క, గర్భ = మధ్యభాగమునందు, గౌరవము = గొప్పతనము అని యర్థాంతరము.)

గగనమధ్యంబుపైన్=ఆకాశమధ్యమందు, ఉప్యాంగు=అభివృద్ధియగు, పృథుల = విస్తారమయిన, పయోధరములన్ = మేఘములచేత, కప్పువాటింపదు = నల్లఁబడ దని కీర్తిపరమైన యర్థము. కీర్తి నిరుపా

ధికస్వచ్ఛవస్తువు గనుక సంపర్కదోషముచేత మలినము కానేరదని భావము. గగనమధ్యంబుపైన్ = గగనమువలె సూక్ష్మమైన మధ్యప్రదేశముమీఁద, ఉప్పొంగు = పొంగుచున్న, పృథులపయోధరములన్ = పీనస్తన చూచుకములయందు, ఇక్కడ సప్తమ్యర్థమందు ద్వితీయవచ్చినందుకు, న. 'అన్యస్యాః క్వచిద్భవేచ్ఛాన్యా' అని, కప్పువాటింపదు = సైల్యమును వహింపదని గర్భిణీస్త్రీపరమయిన యర్థాంతరము. గర్భిణికి సూక్ష్మమధ్యత్వమును నాశ్చర్యమే యని తెలియవలయును.

వినిర్మల = మిక్కిలియు స్వచ్ఛమయిన, సుధాధామక = చంద్రునియొక్క, ఉపరి = మీఁదికి, సమారోహ = వ్యాపించుటయొక్క, వైభవమునందున్ = వేడుకయందు, అలంతనొందదు = వెనుకదీయదని కీర్తిపరమయినయర్థము. వినిర్మల=మిక్కిలియుఁదెల్లనైన, సుధాధామక = సున్నపుగచ్చుచేసిన సౌధములయొక్క, ఉపరి=మీఁదికి, సమారోహ = ఎక్కుటయొక్క, వైభవమునందున్ = విలాసమందు, అలంతనొందదు = ఆయాసమును బొందదని గర్భిణీపరమైన యర్థాంతరము. గర్భవతియయ్యు నున్నతములగుభవనముల నెక్కుతఱి నలసట నొందక పోవుట యొకవిశేషము. పృథులపయోధరముల ప్రేగు నితంబభరము గర్భభారము నలసట గూర్పమి యాశ్చర్యము.

ఉత్తమ=సత్పురుషులయొక్క, రసజ్ఞా = జిహ్వయనెడు, ఆస్థానవాటిన్ = ఆస్థానప్రదేశమునందు, పాటిలు = ప్రవర్తించుచున్న, నాట్యపాటవమునన్ = నటించునేర్పునందు, అనఁగాఁ గొనియాడఁబడుటయం దనుట, తడబాటుఁబూనదు = విపర్యాసమును వహింపదని యర్థము. (ని. 'రసజ్ఞారసనాజిహ్వా' అని అ.) ఉత్తమ = శ్రేష్ఠులైన, రసజ్ఞ = శృంగారాదిరసముల గుర్తెఱిఁగినవారియొక్క, ఆస్థానవాటిఁ బాటిలు= సభాస్థలియందుఁ బ్రవర్తించుచున్న, నాట్యపాటవమునన్ = తాండవనైపుణ్యమందు, తడబాటుఁ బూనదు = శ్రమచేతఁ దడబడదనియర్థాంతరము. సాధారణముగా నొంటరిపాటునఁ జెలికత్తెలముందునఁగాక రసజ్ఞుల యాస్థానవాటికలలో నాట్యముసలుపుచుండినను శ్రమనొందకపోవుట విశేషము. (రసజ్ఞుల యాస్థానిలో నృత్యప్రకటనము తడబాటునకు హేతువు.)

అశేష = సమస్తమయిన, కమలాకర = కమలమనఁగా నుదకము, దానికి నాకరములైనవి సముద్రములు వానియొక్క, ఆభోగ = పరిపూర్ణతయొక్క, తరణకేళి = దాఁటుటయనుక్రీడయొక్క, మహోద్యమమునందున్ =అధికప్రయత్నమునందు, శ్రమమునొందదు = కష్టముఁ జెందదని యర్థము. అశేష = సమస్తమయిన, కమలాకర = సరోవరములయొక్క, ఆభోగ = పరిపూర్ణతయొక్క, తరణకేళి = జలక్రీడావిహారముయొక్క, మహోద్యమమునందున్ = అధికప్రయత్నమునందు, శ్రమమునొందదు = ప్రయాసపడదని యర్థాంతరము. (ని. 'సలిలంకమలంజలమ్' అని అ.) జలక్రీడ పరిపూర్ణమైనదగుటచేతను, అది సరోవరముగాక కమలాకరమగుటచే మెలపునఁ జరింపవలసియుంటవలనను నామహోద్యమమున శ్రమ సహజము. శ్రమలేమి యాశ్చర్యము.

అనుపమ = సమానరహితమైన, ఆకల్పపరిపూర్తిన్ = కల్పపర్యంతపరిపూర్ణతచేత, అతిశయిల్లు = అతిశయించునట్టి అని యర్థము. ఆకల్పమనఁగా నలంకారము వస్త్రాభరణమాల్యాద్యలంకారపరిపూర్తిచేత నతిశయించునని యర్థాంతరము. (ని. 'ఆకల్పవేషౌనైపథ్యమ్' అని అ.) అనిశ=ఎల్లప్పుడును, నిస్తంద్రగతిఁబొల్చున్ = నిరుపద్రవగతిచేతఁ బ్రకాశించు నని యర్థము. మాంద్యము లేనినడకచేతఁ బ్రకాశించు నని యర్థాంతరము.

తా. (వీరతిరుమలరాయని కీర్తికాంత యఖిలభువనగర్భభారమును వహించి గర్భిణియైయుండియు స్తనచూచుకములందు నైల్యము వహింపకపోవుట మొదలైన గర్భిణీవ్యతిరిక్తధర్మములచేతఁ బ్రవర్తించెను గనుక నాగౌరవమును నెట్లులు పొందెనో) తిరుమలదేవరాయనికీర్తి మేఘమండలము నావరించి చంద్రమండలము నతిక్రమించినదనియు నుత్తమజనులచేతఁ బ్రశంసింపఁబడుచున్న దనియును సముద్రములను దాఁటిపోయినదనియును బ్రహ్మకల్పపర్యంతము నిలిచియుండుననియును సర్వకాలమును నిరుపద్రవగతిచేతఁ బ్రకాశించునది యనియును ఫలితార్థము.

మ. ధర నెవ్వానికి వ్రాయఁ బద్మజుఁడు వ్రాఁత ల్వానితో నేగు న
స్థిరము ల్శాశ్వతకీర్తి యా తిరుమల • శ్రీరాయనారాయణుం
డు రహిన్ వ్రాసినశాసనాక్షరము లుం • డుం బుత్త్రపౌత్త్రాన్వయ
స్థిరవృత్తిం బృథుకాక్షరంబులు గురు • శ్రీవర్ణ తుల్యంబులే. 61

ధరన్ = భూమియందు, ఎవ్వానికిన్ = ఎవ్వనికి, పద్మజుఁడు = బ్రహ్మ, వ్రాయన్ = నొసట వ్రాయుచున్నాఁడో, వ్రాఁతలు = ఆవ్రాలు, వానితోనేగున్ = ఆపురుషునితో నడుగుచు, అస్థిరములు= శాశ్వతములుగానివి యని యర్థము. 'అస్థిరాంతిగృహ్ణాంతీత్యస్థిరాణి. రా ఆదానే' అనువ్యుత్పత్తిచేత వస్తులను గ్రహించినవనిభావము. శాశ్వతకీర్తియా = శాశ్వతమైన కీర్తిగలిగిన, తిరుమలశ్రీరాయ= తిరుమల దేవరాయఁడనెడు, నారాయణుండు = నారాయణమూర్తి, ఇక్కడ శాశ్వతకీర్తియనెడు పదమారోప్యమాణారోపవిషయములకు సాధారణ విశేషణము. రహిన్ = లెస్సగా, వ్రాసిన శాసనాక్షరములు = ఎవరికైనను వ్రాసియిచ్చినశాసనములమీఁదివ్రాలు, పుత్త్ర = కొమాళ్లు, పౌత్త్ర =మనుమలు, అన్వయ = వానివంశము, అంతపర్యంతమైన, స్థిరవృత్తిన్ = శాశ్వతవృత్తిచేత, ఉండున్ = ఉండును. పృథుకశబ్ద మర్భకుని యందును బ్రహ్మయందును వర్తించును. బ్రహ్మపరమైనప్పుడు, (ని. 'పృథుర్మహాన్ కో బ్రహ్మ') అని యర్థము గ్రహింపఁదగినది. (ని. 'పోతః పాకోర్భకో డింభః పృథుకశ్శాబకశ్శిశుః' అని అ. 'మారుతే వేధసి బ్రధ్నే పుంసికః' అని అ.) తిరుమలశ్రీనారాయణుండన్నాఁడు గనుకఁ దిరుమలదేవరాయని నారాయణుఁడని చెప్పవలయును. పృథుక = అర్భకుఁడైన బ్రహ్మయొక్క, అక్షరంబులు = వ్రాలు, గురు=జనకుఁడైన నారాయణునియొక్క, శ్రీవర్ణ = శుభాక్షరములతోడ, తుల్యంబులే = సమానములౌనా, అనఁగాఁ గావనుట, పృథుకుఁడనఁగా బ్రహ్మయును, గురుశ్రీయనఁగా గురుతరసంపత్తిగలవాఁడు రాజు నని భావము.

బ్రహ్మవ్రాఁతకంటెఁ దిరుమలరాయఁడు వ్రాసినవ్రాఁత శాశ్వతమయినదని ఫలితార్థము. (ని. కీర్తిస్తు నారాయణే') అన్నాఁడుగనుక నారాయణుని కీర్తి శాశ్వతము. పృథుకుఁడనఁగా బ్రహ్మదేవుఁడు గనుక బ్రహ్మదేవునివ్రాలు గురువైన నారాయణునివ్రాలతో సమానమవునా యని ప్రకారాంతరము. ఇచట నప్రకృతమైన బ్రహ్మలిఖితాక్షరమునకుఁ బ్రకృతమైన తిరుమలదేవరాయ శాసనాక్షరముతో సామ్యానిష్పత్తి వర్ణించుటచేఁ బ్రతీపాలంకారభేదము. అది అస్థిరాదిపదగతశ్లేషచే జీవించినది. (శ్లో. వర్ణ్యేనాన్యస్యోపమాయా అనిష్పత్తివచశ్చ తత్' అని లక్షణము.) (మాతృశ్రీయన్నటులఁ దండ్రిని గురుశ్రీయనుటఁ దగునుగాన గురుశ్రీయనఁ దండ్రియని కొందఱందురు.)

తా. బ్రహ్మదేవుఁడు మానవుల ఫాలములపై వ్రాసినవ్రాఁతలు వారితోనే పోవును. స్థిరకీర్తిశాలియగు తిరుమలరాయ నారాయణుని వ్రాఁతలగు శాసనవర్ణము లటులఁగాక తరతర ముష

కరించును. బ్రహ్మవ్రాసినవ్రాఁత యతనితండ్రియగు నారాయణుని వ్రాఁతతో సమానము కాఁజాలదు.

సీ. ఘనసీధురక్తలో♦చనయుక్తిఁ గడ నుండు మాతంగతతి నంటు♦మలిన మెల్ల
గరదుఁడై వెస నధో♦గతిఁ బడ్డయమ్మహా♦హీనుని నెనసిన♦యేవ మెల్ల
నరకహేతుహిరణ్యా♦హరణవృత్తిఁ జరించుకొమ్ముకాని భజించు♦కొదవ లెల్ల
రౌరవాధారఘో♦రప్రపాతకులైన విషమగోత్రుల నంటు♦వృజిన మెల్లఁ

తే. గడిగికొనియె వసుంధరా♦కమలనయన, యార వీరప్రతాపరా♦జాధిరాజ
రాజదేవేంద్ర తిరుమల♦రాయచంద్ర, సాంద్రపట్టాభిషేకాంబు♦పమునయమున.

సీధువనఁగా మద్యమును, నేనుఁగులకన్నులయందుఁ బుట్టెడుమదమును. ఇందుకు-

ఉ. చెక్కున దాన మత్తులను సీధువు వీనుల సాగరంబుచే
ముక్కున శీర్ణకంబు చనుముక్కున శిక్యము శేషసిన్మదం
బక్కున దానవారి విపులాంఘ్రిల మేఘము జారుచుండఁ జెం
పెక్కి కరీంద్ర మొప్పె సెలయేటులతోడినగేంద్రమో యనన్. అని ప్రయోగము.

మాతంగతతియనఁగాఁ జండాలసమూహంబును, గజసమూహంబును, ఘన = అధికమైన, సీధు= మద్యపానమువలన, రక్త=ఎఱ్ఱనైన, లోచన=కన్నులయొక్క, యుక్తిన్=సంయోగముచేత, కడనుండు= వెలిగానుండెడు, మాతంగతతిన్ = చండాలసమూహమును, అంటు = అంటుకొన్న, మలిన మెల్లన్ = మాలిన్యమంతయును, అని యర్థము. అధికమైనసీధు వనెడుమదముచేత నెఱ్ఱనైన కన్నులతో దిక్కుల యందున్న గజసమూహము నంటియున్నదని భావము.

గరదుఁడై=గరదుఁడనఁగా (శ్లో. 'అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారాప హర్తాచ షడేతేహ్యాతతాయినః' అని చెప్పియున్నది గనుక) విషప్రయోగముచేయునట్టి యాతతా యియై, వెసన్ = శీఘ్రముగా, అధోగతిఁబడ్డ=అధోగతిపాలైన, అమ్మహాహీనునిన్ = ఆయతినీచుని, ఎనసిన=కలిసిన, ఏవ మెల్లన్ = అసహ్యమంతయు అని యర్థము. విషప్రదుఁడై పాతాళలోకమందున్న, అమ్మహాహీను, మహాత్+అహి+ఇను ననఁగా నామహాపన్నగస్వామిని గలిసికొనియున్నదనిభావము. శేషుని గరదుఁడని మహాహీనుఁడని యధోగతి నొందినవాఁడని తలంచితలంచి భూకాంత విసర్జించెను.

నరకహేతు=నరకమునఁబడుటకుఁ గారణమైన, హిరణ్యాహరణవృత్తిన్ = స్వర్ణస్తేయవృత్తిచేత, చరించు=ప్రవర్తించునట్టి, కొమ్ముకానిన్=అగసాలవానిని, భజించు = సేవించిన, కొదవ లెల్లన్=తక్కువ లన్నియును అని యర్థము. నరకహేతు=నరకాసురోత్పత్తికిహేతువైన, హిరణ్యాహరణవృత్తిన్ = హిర ణ్యాక్షసంహారవ్యాపారముచేత, చరించు=సంచరించిన, కొమ్ముకాని=కొమ్ముగలిగిన యజ్ఞవరాహమూర్తిని భజించినదనిభావము. హిరణ్యశబ్దము హిరణ్యాక్షపరమైనందుకు-శ్లో. 'క్రీడాభిన్నహిరణ్యకుక్షికుహర' మ్మని ప్రయోగము. ఆదివరాహముయొక్కయుం భూమియొక్కయు సంయోగమువలన నరకాసురుఁడు జనించెను గావుననే వరాహము నరకహేతుభూతమయ్యెను.

రౌరవ = రౌరవమనెడు నరకమునకు, ఆధార=ఆధారమైన, ఘోరప్రపాతకులైన = భయంక రోత్కృష్టపాపములు గలవారైన, విషమగోత్రులన్ = ఎగుడు దిగుడులైన కులము గలవారిని,

చెందు=పొందిన, వృజినమెల్లన్=పాపమంతయును అని యర్థము. రౌరవ = రురుమృగసమూహమునకు, అనఁగా జింకగుంపులకు, ఆధార = ఆధారభూతములైన, ఘోర = భయంకరములైన, ప్రపాతములైన= దరులుగలిగినట్టి, విషమగోత్రులన్ = విషమసంఖ్యగల అనఁగా సప్తసంఖ్యగల కులపర్వతములనియును విషమాకారముగల పర్వతములనియును జెప్పఁదగినవానిఁ బొందియున్నదనిభావము. ఇక్కడ, శ్లో. 'వివ క్షాతః ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచిత్క్వచిత్' అను నథర్వణవచనముచేతఁ బుంస్త్వము విధించి నాఁడు.

వసుంధరాకమలనయన=భూకాంత, వీరప్రతాప, రాజాధిరాజరాజదేవేంద్ర యనెడు బిరుదులుఁ గల, తిరుమలరాయచంద్ర = తిరుమలరాయచంద్రునియొక్క, సాంద్ర = దట్టమైన, పట్టాభిషేక= పట్టాభిషేకసంబంధమైన, అంబుసముదయమునన్ = జలసమూహముచేత, కడిగికొనియెన్ = కడిగివైచి కొనెను, అనఁగాఁ బోఁగొట్టుకొనెననుట, ఔర = ఆశ్చర్యము, అనఁగాఁ దిరుమలదేవరాయనికిఁ బట్టాభి షేకము కాఁగా భూదేవి యాజలముచేతఁ దడుపఁబడినదై యిదివఱకుఁ దనకు సాంగత్యము గలిగి యున్న దిగ్గజములను శేషాహిని యజ్ఞవరాహమును గులపర్వతములను నిరసించి తిరుమలదేవరాయలను బొందినదని భావము. ఇచటఁ దిరుమలదేవరాయ పట్టాభిషేకోదకమునకు భూదేవీవృజినక్షాళనముఁ జేయుటతో సంబంధము లేకున్నను దత్సంబంధముఁ జెప్పుటవలన నతిశయోక్త్యలంకారము. అది శ్లేషతో సంకరమైనది.

తా. భూదేవి తొలుత మాతంగసమూహమువలన నంటినయేవమును మహాహీనసంసక్తివలన నెనసినయేవమును కొమ్ముకానిచెలిమిచే నొందిన కొదువను విషమగోత్రసంసక్తివలన నంటిన కలుషమును తిరుమలదేవరాయల పట్టాభిషేక జలమువలనఁ గడిగికొని శుద్ధురాలయ్యెను. (అనఁగాఁ దిరుమలరాయల పట్టాభిషేక సమయజలము భూభాగమునందంతట ప్రవహించెనని భావము.)

తే. ఆవిభునిదేవి శ్రీవెంగళాంబ పుట్టి, నిల్లు మెట్టినయిల్లు వర్ధిల్లఁ జేసెఁ
బుట్టినింటికి మథనంబు మెట్టినింటి, కమితదోషాహతియుఁ గూర్చుకమలఁ దెగడి.

ఆవిభునిదేవి = ఆతిరుమలదేవరాయనిభార్య, శ్రీవెంగళాంబ = సంపద్యుక్తురాలైన వెంగళమ్మ, పుట్టినింటికి మథనంబు మెట్టినింటి కమితదోషాహతియుఁ గూర్చుకమలఁ దెగడి=పుట్టినింటికి రాపాట మును మెట్టినింటికి మితములేని దోషంబులచేతఁ గొట్టుపడుటయును గలుగఁజేసిన లక్ష్మీదేవిని దిరస్క రించి, పుట్టినిల్లు మెట్టినయిల్లు వర్ధిల్లఁజేసెన్ = పుట్టినయిల్లును మెట్టినయిల్లును వృద్ధిఁబొందఁజేసెను అని యర్థము. లక్ష్మీదేవికిఁ బుట్టినిల్లు క్షీరసముద్రమును మెట్టినయిల్లు పద్మమును గనుక, పుట్టినింటికిన్ = క్షీరసముద్రమునకు, మథనంబు=మందరాచలమథనమును, మెట్టినింటికిన్ = పద్మమునకు, అమితదోషాహ తియున్=మితములేని రాత్రివేధయునని భావము. పుట్టినిల్లు, మెట్టినయిల్లు అనుచోట, సూ. 'వాతః' న. అనుసూత్రముచేత అకారమునకుఁ బరమైనయికారమునకు వచ్చుసంధి వైకల్పికమని తెలియవల యును. ఇచట నుపమానమైనలక్ష్మీంబట్టి వెంగళాంబయందు గుణవిశేషవర్ణనవలన వ్యతిరేకాలంకా రము. అదియుం దోష అను పదగతశ్లేషచే జీవించినది.

తా. పుట్టినిల్లగు సముద్రమునకు మథనమును మెట్టినిల్లగు తామరపూవునకు దోషాహతి(రాత్రి వలనిబాధ)యును గలుగఁజేసిన లక్ష్మిని నిరసించి తిరుమలదేవరాయల ధర్మపత్నియగు వెంగళాంబ పుట్టిల్లు మెట్టినయిల్లు నలంకరించి మిగులఁ బేరొందెను.

ఉ. ఉంచినయగ్రహారములఁ • నున్నతవైఖరివిద్య లెల్ల ర
ప్పించినవిప్రవక్త్రములఁ • బెంచిననవ్యవనోత్కరంబులన్
నించినబల్తటాకముల • నెమ్మిఁ గనం దగువెంగళాంబ య
ఛ్యంచితకీర్తిసౌధవిశ • దాక్షరసూనమరాళరాజమై. 64

ఉంచినయగ్రహారములన్=ఆమె నిలిపిన యగ్రహారములయందును, ఉన్నతవైఖరిన్ = మహోన్నతముగా, విద్యలెల్లరప్పించిన = వేదశాస్త్రాదివిద్యల నన్నిటిని వచ్చునట్టులు చేయఁబడిన, విప్రవక్త్రములన్=బ్రాహ్మణులయొక్క ముఖములందును, పెంచిననవ్యవనోత్కరంబులన్ = వృద్ధిఁబొందింపఁబడిన నూతన వన సమూహములయందును, నించినబల్తటాకములన్ = నిండింపఁబడిన గొప్పచెఱువులయందును, వెంగళాంబయఛ్యంచితకీర్తి = వెంగళమ్మయొక్క మిక్కిలి యొప్పిదమగుచున్నకీర్తి, సౌధ విశదాక్షర సూనమరాళరాజమై=సున్నపుగచ్చుచేసిన మేడలును బరిశుద్ధములైన యక్షరములును తెల్లని పుష్పములును హంసశ్రేష్ఠములును నయినదై, నెమ్మిన్ = ప్రీతిచేత, కనందగున్=చూడఁదగియుండునని క్రమాలంకారము.

అనఁగా వెంగళమ్మ పైనిఁ జెప్పఁబడిన యగ్రహారాది సంతానము లనేకములుగాఁ జేసి బహుకీర్తిఁబొందినదని తాత్పర్యము. సౌధవిశదాక్షరసూనమరాళరాజ మన్నది సమాహారద్వంద్వము. ఇచటఁ గీర్తిని సౌధాద్యనేకవిధరూపముగా నూహించుటవలన నుల్లేఖాలంకారము. శ్లో. 'ఏకస్యబహుధోల్లేఖా దుల్లేఖాలంకృతి ర్మతా' అని సాహిత్యదర్పణము.

కీర్తి సౌధరూపముగ నున్న దనుటచే నాకాశపర్యంతవ్యాప్తి, అక్షరరూపముగ నున్నదనుటచే స్థిరత్వము, హంసరూపముగ నున్నదనుటచే భూస్వర్గవ్యాపకము, సూనరూపముగ నున్నదనుటచే జనవశీకరణాదికములు సూచితములు.

తా. వెంగళాంబకీర్తి యామె ప్రతిష్ఠించిన యగ్రహారములలో సౌధరూపముగను విద్య చెప్పించిన బ్రాహ్మణముఖముల నక్షరరూపముగను నెలకొల్పిన వనములందు సుమరూపముగను బాదు కొల్పిన తటాకములందు మరాళరూపముగను నున్నది.

సీ. వసుమతి దా నయ్యు • వరుని వారింపదు కందమూలంబులఁ • గడుపు పెంప
శ్రీకాంత దా నయ్యుఁ • బ్రియు నిరోధింపదు క్రింపై విరోధికిఁ • గేలు సాపఁ
దానురుక్మిణియయ్యుఁ•దగ దన దాత్మనాయకుఁ డొకనరు క్రిందఁ•హారులఁ బట్టఁ
దా నన్నపూర్ణాభి•ధాన యయ్యును మాన్ప దొకనాఁడుఁ దనతేఁడు•బికిర మెత్త
తే. ననుచు ధరనిందిరను భోజ•తనయనార్య, నార్యనుతనార్య మేయచ•వ్యలహసించి
పతికి నభిమతభోగసౌ•భాగ్య మొసఁగు, విమలసద్గుణనికురుంబ • వెంగళాంబ.

వసుమతిదానయ్యున్=వసువులనఁగాధనములు, తాను ధనవంతురాలై యుండియు, వరునిన్=పెనిమిటిని, కందమూలంబులఁగడుపుపెంపన్ = దుంపగడ్డలు ప్రేళ్లు మొదలైనవానిచేతఁ బొట్టఁబోసి కొనుచుండఁగా, వారింపదు = వలదని మాన్పదు, అనియర్థము. భూదేవి వసుమతీనామముగల దనియు నామెతు వరుఁడైన వరాహమూర్తికి దుంపగడ్డలు మొదలైనవి యాహారము లనియును భావము.

శ్రీకాంతదానయ్యుఁ = శ్రీయనఁగా సంపద, తాను సంపదచేత నొప్పుచున్నదనియును, ప్రియుఁ=పెనిమిటిని, క్రిందై విరోధికిఁ గేలుసాఁప = శత్రువునికిఁ గ్రిందుపడి చెయిచాఁపఁగా, నిరోధింపదు=వలదని నివారింపదు అని యర్థము. లక్ష్మీదేవి శ్రీకాంతానామము గలదనియు నామె పెనిమిటియైన విష్ణుమూర్తి వామనుఁడై విరోధియగు బలిచక్రవర్తిని యాచించినాఁడనియును భావము.

రుక్మిణిదానయ్యుఁ = రుక్మమనఁగా బంగారము, అదిగలస్త్రీ రుక్మిణి, తాను బంగారముగల దయ్యుండియు, ఆత్మనాయకుఁడు = ప్రాణేశ్వరుఁడు, ఒకనరుని క్రింద హరులఁబట్టఁ=ఒకమనుష్యుని క్రింద గుఱ్ఱములను బట్టెడుకొలువు సేయఁగా, తగదనదు = ఇదికూడదనిచెప్పదు, అనియర్థము. భోజ తనయ రుక్మిణీనామము గలదనియు నామెకుఁ బెనిమిటియైనకృష్ణుఁ డర్జునునికి సారథియైనాఁడని యును భావము.

తా నన్నపూర్ణాభిధాన యయ్యును = తా నన్న సమృద్ధిచేత సంపూర్ణురాలను పేరుగలదై యుండియును, తనఱేఁడు బికిరమెత్తఁ = తననాథుఁడు భిక్షమెత్తుచుండఁగా, ఒకనాఁడుఁ = ఒక్క నాఁడైనను, మాన్పదు=నివారింపదు, అనియర్థము. పార్వతీదేవి యన్నపూర్ణయను నామధేయము గల దనియు నామెకు నాథుఁడైన హరుఁడు కపాలహస్తుఁడై భిక్షమెత్తినాఁడనియును భావము. బికిరమను నది వికిర శబ్దమునకుఁ దద్భవము.

అనుచుఁ=ఈలాగుపలుకుచు, ధరఁ=భూదేవిని, ఇందిరను=లక్ష్మీదేవిని, భోజతనయఁ=రుక్మిణీ దేవిని, ఆర్యఁ=పార్వతీదేవిని, ఆర్యనుత నార్యామేయచర్యలఁ-ఆర్యనుత = పతిసేవాపారతంత్ర్యము వలనఁ బూజ్యులైనవారిచేత స్తుతిచేయఁబడిన, నారీ=స్త్రీలయొక్క, అమేయ = ఎన్నశక్యముగాని, చర్యలఁ=చర్యలచేత, హసించి=తిరస్కరించి, విమలసద్గుణనికురుంబ=నిర్మలమైన సద్గుణ సమూహము గల, వెంగళాంబ=వెంగళమ్మ, పతికిఁ = పెనిమిటియైన తిరుమలదేవరాయనికి, అభిమతభోగసౌభాగ్య మొసఁగుఁ=ఇష్టమైన భోగములయొక్క సౌష్ఠవమును గలుగఁజేయును, అనఁగా వెంగళాంబ పతి వ్రతా శిరోమణియై పెనిమిటియొక్క సేవ సేయుచుండునని తాత్పర్యము. ఇచట శ్లేషచే నిలుపఁబడిన వ్యతిరేకాలంకారము. ఆర్యయనుశబ్ద మనేకపర్యాయము లావృత్తియాటచే వృత్త్యనుప్రాస మను శబ్దాలంకారము.

తా. వసుమతి (భూదేవి) తనభర్తయగు నాదివరాహము కందమూలములు భుజించుచుండ వారింపలేదనియు శ్రీకాంత (లక్ష్మీదేవి) క్రిందుపడి యాచించువామనుని నడ్డగింపలేదనియు రుక్మిణి తన భర్త యొకసామాన్యునిగుఱ్ఱములఁ బట్టుట మానుపలేదనియు అన్నపూర్ణ శివునిభిక్షావృత్తి మానుపలేద నియు వారివారిలోభ స్వభావములను దెగనాడి భర్త కభిమతభోగాదికములు సంతరించుచు వెంగళాంబ పేరొందెను.

శా. రారాజద్గుణశాలి తిర్మలమహా॰రాయందు శ్రీవెంగళాం
బారామామణియందుఁ గాంచె సుతులం॰ బ్రఖ్యాతసత్కీర్తి ల
క్ష్మీరాముఁ రఘునాథభూమిరమణుఁ॰ శ్రీరంగరాయాగ్రణిఁ
శ్రీరామావనినాథుఁ బ్రాభవనిధిఁ॰ శ్రీవేంకటక్ష్మావరున్. 66

రారాజత్=మిక్కిలియుఁ బ్రకాశించుచున్న, ఇది యఙ్లుగంతమువై శతృప్రత్యయాంతము. గుణ=సద్గుణములచేత, శాలి=ఒప్పుచున్న, తిర్మలమహారాయందు = తిరుమలదేవరాయఁడు, శ్రీవెంగ

శాంబారామామణియందున్ = సంపద్వ్యక్తశాలైన వెంగళమ్మయను వనితారత్నమునందు, సుతులన్ = కొమాళ్లను, కాంచెన్=కనెను. ఎవరిననఁగా, ప్రఖ్యాతసత్కీర్తి = ప్రసిద్ధమైన మంచికీర్తియందు, లక్ష్మీరామున్=నారాయణుఁడైన, ఇక్కడ 'కీర్తిస్తునారాయణే' అనువచనప్రకారము నారాయణసామ్యము చెప్పినాఁడు. రఘునాథభూమిరమణున్ = రఘునాథరాజును, శ్రీరంగరాయాగ్రణిన్=శ్రీరంగరాయశ్రేష్ఠుని, శ్రీరామావనినాథున్ = శ్రీరామరాజును, ప్రాభవనిధిన్=ప్రభుత్వమునకు నిధియైన, వేంకటక్ష్మావరున్=వేంకటరాయని, కాంచెన్=కనెను అని యన్వయము.

తా. గుణశాలియగు తిరుమలదేవరాయ నృపాలుఁడు వేంగళాంబికయందు రఘునాథభూపాలకుఁడు, శ్రీరంగరాయలు, శ్రీరామరాజు, వేంకటరాయలు అనునామములుగల నలుగురు కుమారులఁ గాంచెను.

క. ఆజగదభినుతసుగుణస, మాజులలో నగ్రజుండు ♦ మహనీయయశో
రాజీవాసనుఁడు సుధీ, రాజీవాసనుఁడు వెలసె ♦ రఘునాథుఁ డిలన్. 67

ఆజగదభినుతసుగుణసమాజులలోన్ = జగజ్జనులచేత మిక్కిలియు స్తోత్రముచేయఁబడిన సుగుణసమూహముగల యారాజులలోపల, అగ్రజుండు=జ్యేష్ఠుఁడైనవాఁడును, మహనీయ=ఒప్పుచున్న,యశః=కీర్తియందు, రాజీవాసనుఁడు = చంద్రుఁడైనవాఁడును, (ఇక్కడ, 'రాజీవాని+అస్యంతే క్షిప్యంతే అనేనేతి రాజీవాసనః, అసు క్షేపణే' యనెడుధాతువువలన రాజీవము లితనిచేతఁదిరస్కరింపఁబడుచున్నవిగనుక రాజీవాసనుఁడనఁగాఁ జంద్రుఁడనియర్థము)సుధీరాజీవాసనుఁడు, సుధీ=యోగ్యమైన బుద్ధియందు, రాజీవాసనుఁడు = బ్రహ్మయైనవాఁడునగు, రఘునాథుఁడు = రఘునాథరాజు, ఇలన్=భూమియందు, వెలసెన్=ప్రకాశించెను. ఇచట రఘునాథరాజును గీర్తిబుద్ధిరూపవిషయభేదముచేఁ జంద్రబ్రహ్మలుగా నెంచుటచే నుల్లేఖాలంకారము. శ్లో. 'ఏకస్యబహుధోల్లేఖేప్యసౌ విషయభేదతః' అని లక్షణము.

తా. లోకోత్తరులగు నా నలువురుకుమారులలోఁ బెద్దవాఁడగు రఘునాథరాజు చంద్రునివంటి ధవళయశము గలవాఁడై పవిత్రశీలమునందు నలువను బురుడించుచుఁ బేరొందెను.

సీ. బలువాహినుల మించు♦మలకల ఘననామకంబులు దూల మూ♦లంబు లెత్తుఁ
బ్రతిరోధివరణవ♦ర్గము ద్రోచి తన్మహా♦భోగశాలిక్షేత్ర♦ములు హరించు
వల గొన్న బహురాజ♦వంశగుల్మంబులఁ బలుదెఱంగుల గ్రుచ్చి ♦ పాఱవైచు
వడిఁ జొచ్చి కలఁచి యా♦వనరాసుల సమగ్రజీవనం బెల్ల దు♦ష్కీర్తిఁ గలుపు
తే. నవని నసహాయశూరత ♦ నధిగమించు, ననఘతిరుమలరాయనం♦దనసమిద్ధ
ధీరరఘునాథభుజపీఠిఁ ♦ బీట వెట్టు, సాహసోదగ్రబిరుదవ♦రాహమూర్తి. 68

ఈపద్యగీతిచివర బిరుదవరాహమూర్తి యని చెప్పుటచేత బిరుదపరముగాను వరాహపరముగాను నర్థద్వయము విచారింపవలసినది. ఎట్లనఁగా,

బలు=బలవంతములైన, వాహినులన్=సేనలచేత, మించు=అతిశయించుచున్న, మలకల=మ్లేచ్ఛులయొక్క, ఘననామకంబులు దూలన్=ఘనమైన పేళ్లడఁగిపోవునట్టులుగా, మూలంబులెత్తున్=మొదళ్లు లాగివైచు నని బిరుదపరమైన యర్థము. బలువాహినులమించు=బలువైన నదులయందు నతిశయించుచున్న, మలకల=మలుపులయందలి, ఘననామకంబులు దూలన్=మేఘనామములన్నియుఁ దుంగలతుఁ

జెల్లునుగనుక ఘననామకంబులనఁగాఁ దుంగలు, అవి తూలిపోవునట్టులుగా, మూలంబులెత్తుక్ = వాని దుంపలు పెల్లగించునని వరాహపరమైనయర్థాంతరము. (ని. 'కురవిన్దో మేఘనామా ముస్తా ముస్తక మస్త్రియామ్' అని అ.)

ప్రతిరోధివరణవర్గముఁ ద్రోచి=ప్రతిరోధు లనఁగాఁ జోరులు, వారియొక్క వరణవర్గమనఁగాఁ బ్రాకారసమూహము, దానిఁబడఁగొట్టి, తత్=ఆచోరులయొక్క, మహాభోగశాలి = అధికభోగములచేత నొప్పుచున్న, క్షేత్రములు=కళత్రములను, హరించుక్ = చెఱఁబట్టును అనియర్థము. (ని. ప్రతిరోధిప రాస్కందిపాటచ్చరమలిమ్లుచాః, ప్రాకారో వరణస్సాలః' అని అ) ప్రతిరోధివరణవర్గముఁద్రోచి = అవరోధకమైన చుట్టుకంచెలు మొదలైనవాని సమూహమును బడఁద్రోచి, తత్ = ఆయావరణవర్గమందలి, మహాభోగ=అతివిస్తృతములైన, శాలిక్షేత్రములు=వరిమళ్లను, హరించుక్ = తిను నని యర్థాంతరము. (ని. 'క్షేత్రం శరీరే కేదారే సిద్ధస్థానకళత్రయోః' అని వి.)

వలఁగొన్న=చుట్టువైచిన, బహురాజ=అనేకశత్రురాజులయొక్క, వంశ=వర్గముయొక్క, గుల్మంబులక్ = సేనలను, పలుతెఱంగుల గ్రుచ్చిపాఱవైచుక్ = అనేక విధములచేత గ్రుచ్చి నఱికివైచును అనియర్థము. వలఁగొన్న = ఆవరించిన, బహు=అనేకములైన, రాజవంశగుల్మంబులక్ = శ్రేష్ఠమైన వెదురుపొదలను, పలుతెఱంగులక్=దంష్ట్రాప్రచారములచేత, గ్రుచ్చి పాఱవైచుక్=గ్రుచ్చి పెల్లగివేయు నని యర్థాంతరము. (ని. 'గుల్మారుక్స్తంబ సేనాశ్చ' అని అ.) పలుదెఱంగులన్నచోటఁ దకారంబు చెప్పవలయును. రాజపక్షమందుఁ గర్మధారయసమాసము గనుకను,

గీ. 'సంధిఁగూర్పంగఁ బ్రథమాంతశబ్దవితతి, పైఁ గచటతపలకు వికల్పంబు చెల్లుఁ
గాకు సంబోధనావ్యయకర్మధార, యంబుల నచేతనంబుల నబ్జనాభ.'

అని చెప్పియున్న ప్రకారముగాఁ గర్మధారయమందుఁ దకారాదేశము వైకల్పికము గనుక నిక్కడ తకారంబ యుక్త మని యెఱుంగునది.

వడిఁజొచ్చి కలఁచి=త్వరగాఁజొచ్చి కలగుండుపడఁజేసి, యావనరాసుల = యవనదేశ సంభవులైన తురకలయొక్క, సమగ్రజీవనం బెల్లక్=నిండారులైన బ్రతుకంతయును, దుష్కీర్తిఁగలుపుక్ = అపకీర్తిపాలుగాఁ జేయుననియర్థము. వడిఁజొచ్చి కలఁచి = వడిగాఁ బ్రవేశించి కలకపాఱునట్టులు చేసి, ఆ వనరాసుల=ఆ సముద్రములయొక్క, సమగ్రజీవనం బెల్లక్ = సంపూర్ణమైనయుదకమునంతయును, దుష్కీర్తిఁగలుపుక్ = కీర్తియనఁగా నిక్కడబురద, కొఱమాలిన బురదపాలుసేయునని యర్థాంతరము. ('కీర్తిర్యశసికర్దమే' అ.)

అవని నసహాయశూరత నధిగమించుక్=భూమియందు నసహాయశూరత్వముచేతఁ బ్రవర్తించు నని యర్థము. ఒంటిగాఁ దిరుగునని యర్థాంతరము.

(56-వ పద్యమువద్ద వరాహమునకుఁ గల ఒంటరికాఁడను పేరునకుఁగల యసహాయశూరపద ప్రయోజనము కొంతవఱకు సూచింపఁబడినది.)

అనఘ=పుణ్యాత్ముఁడైన, తిరుమలరాయ నందన=తిరుమలదేవరాయని కుమారుఁడైన, సమిద్గభీర=యుద్ధమందు గంభీరుఁడైన, రఘునాథభుజపీఠిఁ బీటవెట్టు = రఘునాథరాజుయొక్క బాహుపీఠమందుఁ గూర్చున్నయట్టి, సాహసోదగ్ర=సాహసమునం దుత్కృష్టమైన, బిరుదవరాహమూర్తి = లాంఛనవరాహమూర్తి, పైనిఁ జెప్పఁబడినకార్యములు సేయునని సంబంధము.

ఇందులో వరాహలాంఛనముగల రఘునాథరాజు చేసినకార్యములన్నిటిని లాంఛనమైన వరాహమూర్తిపరముగా నభేదాధ్యవసాయము చేసి చెప్పినాడు. ఇచట బిరుదవరాహవిశేష్యము శ్లేషించి నందున నప్రకృతవరాహవిషయమైన శబ్దశక్తిమూలధ్వని. కాని శ్లేషాలంకారము గాదు. ఉభయ శ్లేష యందు విశేష్యము శ్లేషింపదు.

భోగశాలిక్షేత్రము లనుచో పోలికవడి.-

క. పోలింపఁ బుభుబుభులకు ము, పోలికవడి శిల ముల్లమున కెన యనఁగా
శిలఁ బుల్లం బనఁగా, భూలోకం బమరలోకమున కెన యనఁగన్.

తా. తిరుమలదేవరాయల కుమారుఁడగు రఘునాథరాయలు శూరశిరోమణియై వరాహలాంఛనుఁడై మ్లేచ్ఛసేనల రూపుమాపి, విరోధులకోటల నుగ్గునూచము గావించి, విరోధిరాజకుటుంబములఁ జెగటార్చి యవనసేనలఁ బరాజయరూపమగు నపకీర్తిపాలు గావించి పరాక్రమించి పేరొందెను.

శా. యాదోరాశిగభీరమూర్తి రఘునాథాధీశుఁ డుద్దండబా
హాదర్పాంధసపాదమల్కికనిజామానీకముల్ ద్రుంప జ
న్యాదూరక్షితిఁ బాఱుకృష్ణకును గృష్ణాంకంబు నాఁ డబ్బె బి
బ్బీదీవ్యన్నయనాబ్జకజ్జలజలాభీల ప్రవాహంబునన్.

యాదోరాశి=సముద్రునివలె, గభీరమూర్తి=గంభీరుఁడైన, రఘునాథాధీశుఁడు = రఘునాథరాజు, ఉద్దండ=ఉత్కటమైన, బాహాదర్ప=భుజగర్వముచేత, అంధ=కన్నుఁగానకయున్న, సపాద = సపాదుల యొక్కయు, మల్కిక = మలకలయొక్కయు, నిజామ = నిజామునొక్కయు, అనీకములు = సైన్యములను, త్రుంపఁగ్ =సంహరింపఁగా, జన్య=యుద్ధమునకు, అదూరక్షితిక్ =సమీపభూమియందు, పాఱు= ప్రవహించుచున్న, కృష్ణకుక్ = కృష్ణానదికి, బిబ్బీ = మ్లేచ్ఛస్త్రీలయొక్క, అనఁగా బూబులయొక్క, దీవ్యత్ =ప్రకాశించుచున్న, నయనాబ్జ=పద్మములవంటి కన్నులయందలి, కజ్జలజల=కాటుక నీళ్లయొక్క, అభీలప్రవాహంబునక్ =భయంకర ప్రవాహముచేత; కృష్ణాంకంబు = కృష్ణయను పేరు, నాఁడబ్బెక్ = నాఁడుకలిగెను. కృష్ణానదిజన్యాదూరక్షితిని బ్రవహించుటవలననే సంగరరంగమున గుడారముల నాశ్రయించియున్న యవనాంగనలు కజ్జలబాష్పములు విడిచి ప్రవాహమును గృష్ణనామాంకితముఁ జేయ వీలుపడినది. నిజామాదులను రఘునాథరాయలు ద్రుంచుటకు వారియుద్దండబాహాదర్పాంధతయే కారణము. కన్నీటిప్రవాహము అభీలమగుటవలననే కృష్ణకుఁ గృష్ణాంకము సమకూర్పఁ జాలినదని పద ప్రయోజనము వ్యక్తమగుచున్నది.

తా. రఘునాథరాయనిచేత యుద్ధమందు హతులైన తురకలభార్య లంద ఱేడువఁగా వారి కాటుకకన్నీళ్లయొక్క ప్రవాహము కృష్ణలోఁ గలిసి నదీజల మెల్ల నల్లఁబడినందున నాఁటనుండి యా కృష్ణకు కృష్ణ యను పేరు గలిగెను. (కృష్ణానదీజలమంతయు నల్లనగుటకుఁదగిన కాటుకకన్నీళ్ల ప్రవాహమై పాఱుచుండుట కెంతమంది స్త్రీ లేడువవలసి యుండునో యంతమంది తురకలను రఘునాథ రాయఁడు వధించినాఁడని భావము.)

ఇది నిరుక్త్యలంకారము. శ్లో. 'నిరుక్తి ర్యోగతో నామ్నా మన్యార్థత్వప్రకల్పనమ్' అని లక్షణము. ఇటయు నదికిం గృష్ణాభిఖ్యను గూర్చి హేతువుగాని యంజనాశ్రుప్రవాహమును హేతు

ఫుగాఁ జెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము. అంజనాశ్రుప్రవాహమునకు నదీనైల్యసంపాదకత్వ సంబంధము లేకున్నం దత్సంబంధముఁ జెప్పుటవలన నతిశయోక్తియు. ఈరెండలంకారములకు సంకరము.

మ. హరిమై సాదిశిరంబు సాదిమెయి జాత్యశ్వోత్తమాంగంబు గూ
డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెండన్ దివ్యమందారవృ
ష్టి రహిం బ్రాణయుతంబులై గగనవాటిం బర్వ గంధర్వకి
న్నరరూపంబులు దాల్చి సారె కవి యానందించుఁ దచ్ఛౌర్యమున్. 70

హరిమైన్=గుఱ్ఱపుకళేబరమందు, సాదిశిరంబు = రౌతుతలయును, సాదిమెయిన్=రౌతుకళేబరమందు, (ని. 'అశ్వారోహ స్తు సాదినః' అని అ.) జాత్యశ్వోత్తమాంగంబు = ఉత్తమాశ్వముయొక్కతలయును, కూడన్=అంటుకొనునట్లుగా, రణోర్విన్=యుద్ధభూమియందు, రఘునాథ శౌరి=రఘునాథరాయఁడు, అసిఁజెండన్=ఖడ్గముచే నఱుకఁగా, దివ్య మందారవృష్టిన్=దేవతలు గురిపించునట్టి పారిజాతపుష్పవర్షముచేత, రహిన్=లెస్సఁగా, ప్రాణయుతంబులై = ప్రాణములతోఁ గూడుకొన్నవియై, గగనవాటింబర్వ=ఆకాశవీథికిసెగసి, గంధర్వ కిన్నరరూపంబులుదాల్చి=ఇక్కడ వ్యుత్క్రమము, ఏలాగనిన, గుఱ్ఱపుకళేబరమందు రౌతుతల చెలంగఁగాఁ గిన్నరులై నారనియును రౌతుకళేబరమందు గుఱ్ఱపుతల చెందఁగా గంధర్వులైనారనియుఁ దెలియవలయు. అశ్వదేహమును మనుష్యముఖమును గలవారు కిన్నరులు, మనుష్యదేహము నశ్వముఖమును గలవారు గంధర్వులు గనుక నీపద్యములో వ్యుత్క్రమముగాఁ జెప్పఁబడినది.

ఇందుకు మాఘునిప్రయోగము-

'బింబోష్ఠం బహుమను తే తురఙ్గవక్త్రశ్చుంబాతం ముఖమిహకిన్నరంప్రియాయాః,
శ్లిష్యంతంముహురితరోపి తన్నిజస్త్రీ ముత్తుఙ్గస్తనభరభఙ్గభీరుమధ్యామ్.' అని.

సారెకున్=మాటిమాటికి, అవి=ఆ కిన్నర గంధర్వరూపములు, తచ్ఛౌర్యమున్ = ఆరఘునాథరాయని శూరత్వమునుగూర్చి, ఆనందించున్=సంతోషించును. ఇచట అసంబంధసంబంధాతిశయోక్త్యలంకారము.

అశ్వశిరము మనుష్యుని మొండెమువద్దను మనుష్యశిర మశ్వకళేబరము వద్దను బడునటులఁ జెండుటవలన రఘునాథరాయల ఖడ్గలాఘవము సూచితము. ఖండితులు దివి చేరి యానందించుట రఘునాథరాయశౌర్యమునకు గొప్ప దృష్టాంతము.

తా. రఘునాథరాయలు తనఖడ్గముతో రౌతులను సంగరమునఁ జెండఁగా గుఱ్ఱముల మొండెములకడ రౌతులతలలు రౌతుల మొండెములకడ గుఱ్ఱముల తలలు పడెను. సంగ్రామ వినోదాగతులగు దేవతలు గురియు కల్పకుసుమవర్షమువలన హతులు కిన్నరులుగను గంధర్వులుగను మాఱి దివి కెగసి రఘునాథరాయల పరాక్రమము ప్రశంసింప సాగిరి.

చ. హరిపదభక్తిశీలుఁ డగు నారఘునాథనృపాలుఁ డూర్జితో
దరుఁడు సిరంగరాయవసుధావరుఁ డాత్మగుణప్రమోదవ
త్తిరుమలరాయ శేఖర వితీర్ణమహాయువరాజపట్టబం
ధురుఁ డయి సర్వభూమిభువనంధురార్యమహాశక్తి వహించు నెంతయున్. 71

హరిపదభక్తిశీలుఁడగు = విష్ణుమూర్తియొక్క పాదములయందలి భక్తియే స్వభావముగాఁగల, ఆరఘునాథనృపాలుకూర్మిసోదరుఁడు=ఆరఘునాథరాయనిముద్దుతమ్ముఁడు, సిరంగరాయవసుధావరుఁడు= శ్రీరంగరాయభూమీశ్వరుఁడు, ఆత్మ=తనయొక్క, గుణ=సుగుణములకు, ప్రమోదవత్=సంతోషము గల, తిరుమలరాయశేఖర = తిరుమలదేవరాయ శ్రేష్ఠునిచేత, వితీర్ణ=ఇయ్యఁబడిన, మహత్=ఉత్కృష్టమైన, యువరాజపట్టబంధురుఁడయి = యువరాజపట్టాభిషేకముచేత నొప్పినవాఁడై, ఎంతయున్ = అతిశయముగా, సర్వభూభువన=సమస్త భూలోకముయొక్క, ధూః=భారమును, వహ=వహించునట్టి, శక్తిన్=సామర్థ్యమును, వహించున్=పూనియుండును.

రఘునాథరాయలువహింపఁదగిన యువరాజపదవి శ్రీరంగరాయ లొందుటకు హేతువూహ్యము. రఘునాథరాయ లోకపరాక్రమమునందె పేరొందెను. శ్రీరంగరాయలు పరాక్రమమునందునను ఆత్మగుణసమృద్ధిచే (పితౄజ్ఞానిర్వహణముచేఁ) దండ్రి నలరించుటచేతను యువరాజపదవి నొందె నని తలంపవచ్చును.

తా. శ్రీరంగరాయలు తన సుగుణసముదయముచేఁ దండ్రియగు తిరుమలదేవరాయల నలరించి తండ్రివలన యువరాజపదవి నొంది భూభరణయోగ్యమగు శక్తిసామర్థ్యములు గలిగి హరిపదభక్తిచేఁ బేరొందెను.

చ. ఉరమున నేఁగుఁ గుండలి పయోధరధారల నాను నెప్పుడున్
గిరులు కరుల్ రజోవిహృతికిం జను వెళ్లఁడు నేల కూర్మశే
ఖరుఁ డిది యేల బాలజనకల్పితసౌఖ్య మటంచు ధారణీ
తరుణి సిరంగరాయవసుధావరుఁ జేరెఁ గుమారమన్మథున్. 72

ఈపద్యములో భూభర్తలైన శేషాహి మొదలైనవారియందు బాలత్వారోపము చేసి యందువలన భూమి వారిని బరిత్యజించి కుమారమన్మథుఁడైన శ్రీరంగరాయనిం జేరె నని చెప్పినాఁడు.

ఎట్లనిన, ఉరమున నేఁగుఁ గుండలి=కుండలి యనఁగా శేషుఁడు, ఉరమున నేఁగున్=బొమ్మతోఁ బారియాడు ననియర్థము. సర్పముగనుక బొమ్మనడుచు నని భావము. గిరులు=అనఁగాఁ గులపర్వతములు, ఎప్పుడున్ = నిరంతరమును, పయోధర ధారల నానున్=స్తన్యపానము సేయు నని యర్థాంతరము. మేఘజలధారలచేతఁ దడియునని భావము. కరులు=దిగ్గజములు, రజోవిహృతికిం జనున్=దుమ్ముఁ బూసికొను నాటలకుఁ బోవునని యర్థము. ఏనుఁగులుగనుక మన్ను చల్లుకొనునని భావము. కూర్మశేఖరుఁడు=కూర్మరాజు, వెళ్లఁడు నేల = నేలంటు వదలఁడని యర్థము. భూమి కాధారమై యుండు నని భావము. ఇది యేల బాలజనకల్పిత సౌఖ్య మటంచున్=ఇదియేమి పసిబాలురచేతఁ గల్పింపఁబడిన సంయోగసౌఖ్యం బని యాలోచించి, ధారణీతరుణి = భూమియను కొమరుఁబ్రాయముగలస్త్రీ, కుమారమన్మథున్=యౌవనపురుషులలో మన్మథునివంటివాఁడైన, సిరంగరాయ వసుధావరుఁ జేరెన్ = శ్రీరంగరాయ భూమీశ్వరునిఁ జేరెను. (శ్లో. 'యథాయూన స్తద్వ త్పరమరమణీయాపి రమణీ కుమారాణామంతఃకరణహరణం నైవకురుతే' అనుశ్లోకార్థము ననుసంధించి చెప్పినాఁడు.)

అనఁగా శ్రీరంగరాయఁడు భూభరణసామర్థ్యమందు శేషాహి మొదలైనవారికంటె నధికుఁడని తాత్పర్యము. పయోధరధార లనెడి పదము కొననున్న నకార మానున నెడి పదము మొదటనున్న

స్వరముతో నదుకునపుడు సంధి గాంచినదనియు, నాను ననెడిపదము మొదటనున్న నకారము పరమగు చుండఁగా లోపమును బొందినదనియును దెలియవలయును. ఇచట భూకాంతకు శ్రీరంగరాయనిం బొందుటను గూర్చి శేషాదుల బాలత్వము హేతువు గాకున్నను హేతువుగా వర్ణించుటవలన హేతూత్ప్రేక్ష. అదియుఁ బయోధరేత్యాది పదగతశ్లేషచే నిలిచినది.

భూదేవి తరుణిగాన బాలజనకల్పితసౌఖ్యము నిరాకరించెను. కావుననే యుపభోగార్హుఁడగు కుమారమన్మథుని వరించెను. బాలురకు యువతుల మెలఁకువ లెఱుంగరా వనుటకు-

'జవరాలు చెక్కు-గీటిన వసవల్చుబాలకుఁడు డెందమునం దలరంగ నేర్చునే.'

యనునైషధపద్యము గ్రాహ్యము.

తా. సర్పము బొమ్మతోఁ బోవుట, శైలములు పయోధరధార లానుట, కరులు రజోవిహృతి సంచరించుట, కూర్మము నడువఁ జాలక పోవుట శిశుచిహ్నములుగా భావించి బాలురతోఁ గలసి యుండుట సుఖము గాదని కుమారమన్మథుఁడు శ్రీరంగరాయలను వలచి ధారుణీతరుణి చేరెను.

సీ. కుంతలస్థలికి నే•గుణగరిష్ఠునిచీటి కమనీయకేతకీ•గర్భదళము
మంజులలాటసీ•మకు నేమహాభాగు తేజంబు కాశ్మీర•తిలకరేఖ
వత్సభాగమున కే•వైభవాధికుని యపారకీర్తిమతల్లి•హారవల్లి
కాంచిదేశమున కే•ఘనుని సంతతదానవారి నిర్ఝరధార•హీరరశన
తే. యంగమున కెవ్వనిచమూతు•రంగకోటి, ఘాటికాధుతధూళి మాం•ధాళిపట్టు
సమధికాకల్పరుచిఁబూను•జగతికతఁడు, రాజమాత్రుండె శ్రీరంగ•రాయశౌరి. 73

సమధిక=అత్యంతాతిశయమైన, ఆకల్పరుచిన్ = ఆకల్పమనఁగా వస్త్రాభరణ మాల్యానులేపన రూపమైన చతుర్విధ శృంగారాత్మక నైపథ్యమునకుఁ బేరు గనుక నట్టి చతుర్విధశృంగారముయొక్క శోభను, ('చతుర్థాలంకృతిర్వాసో భూషామాల్యానులేపనైః' అని లక్షణము.) (ని. 'ఆకల్పవేషౌ నేపథ్యమ్'అని అ.)పూను=వహించునట్టి, జగతికిన్ = భూదేవియనుస్త్రీకి, కుంతలస్థలికిన్ = కుంతలదేశ మనెడు కుంతలదేశమునకు, అనఁగా శిరస్సునకు, ఏగుణగరిష్ఠునిచీటి = గుణశ్రేష్ఠుఁడైన యేరాజుయొక్క యాజ్ఞాపత్త్రిక, కమనీయ=మనోహరమైన, కేతకీ=మొగలియొక్క, గర్భదళము=గర్భములోపలి ఱేకా యెనో, అనఁగా లేఁత గేదఁగిపూవు ఱేకాయెనో,

మంజుల = మనోహరమైన, లాటసీమకున్ = లాటసీమయనెడు, మంజు = సుందరమైన, లలాటసీమకున్ = ఫాలప్రదేశమునకు, ఏమహాభాగు = మహాభాగుఁడైన యేరాజుయొక్క, తేజంబు= ప్రతాపము, కాశ్మీరతిలకరేఖ=కుంకుమబొట్టుయొక్క రేఖ యాయెనో, తేజము (ప్రతాపము) రక్త వర్ణముగాఁ జెప్పుట కవిసమయము గావునఁ గుంకుమపూవు తిలకముతో నిటఁ బోలిక చెప్పఁబడెను. తిలకము రేఖాకారముగ నున్న దనుటచేఁ బ్రతాపము జగద్వ్యాపక మొందుచున్నదని భావము.

వత్సభాగమునకున్=వత్సదేశ మనెడు వక్షోభాగమునకు, ఏవైభవాధికుని=వైభవముచేత నధికుఁ డైన యేరాజుయొక్క, అపారకీర్తిమతల్లి=అంతములేని కీర్తిమతల్లిక, మతల్లికాశబ్దము ప్రశస్తవాచకము. (శ్లో. 'మతల్లికామచర్చికా ప్రకాండముద్ధతల్లజౌ, ప్రశస్తవాచకాని' అని అ.) హారవల్లి = తీఁగవంటి ముత్యాలహారమాయెనో, వత్సమన వక్షోభాగమునకుఁ జెల్లుననుటకు-

ని. 'వత్సరేకుటజేవత్సస్సు, తాదా తర్ణకేత్రిషు' వక్షస్య స్త్రీచా — నానార్థరత్నమాల.
క. తోరముగ వత్సదోగ్ధృ, క్షీరంబులు. — విష్ణుపురాణము.

కాంచిదేశమునకున్ = కాంచిదేశమనెడు కాంచిదేశమునకు, అనఁగాఁ గటిభాగమునకు, ఏఘనుని = ఘనుఁడైన యేరాజుయొక్క, సంతత=ఎడతెగని, దాన=దానసంబంధమైన, వారి = ఉదకముయొక్క, నిర్ఝరధార=ప్రవాహధార, హీరరశన = వజ్రమణిమయమైన మొలనూలాయెనో, (ని. 'స్త్రీకట్యాం మేఖలా కాంచీ సప్తకీరశనాచసా' అని అ.) హీరకాంతి జలధారకాంతియు సమముగా నుంటచే నుపమానోపమేయములు యుక్తముగ నున్నవి. హీరరశన జలధారను బోలియున్నదని భావము.

అంగమునకున్ = అంగదేశమను నంగమునకు, అనఁగా శరీరమునకు, ఎవ్వని = ఏ రాజుయొక్క, చమూతురంగకోటి = సేనాసంబంధమైన యశ్వసమూహముయొక్క, ధాటికా = దవుడుచేత, ధుత = ఎగురఁగొట్టఁబడిన, ధూళి=పరాగము, మాంధాళిపట్టు = మదుపువన్నెగల పట్టువస్త్ర మాయెనో, ఇంత వఱకుఁ బ్రథమచరణమందు మాల్యశృంగారమును రెండవచరణమం దనులేపనశృంగారమును మూఁడవ చరణమందును, నాలవచరణమందును నాభరణశృంగారమును నెత్తుగీతియందు వస్త్రశృంగారమును నాయెనని తెలియవలయును. అతఁడు = అట్టి, శ్రీరంగరాయశౌరి = శ్రీరంగరాయశ్రేష్ఠుఁడు, రాజమాత్రుండె=సాధారణరాజువంటివాఁడా, అనఁగాఁ గాఁడనుట. అనఁగాఁ బైనిఁజెప్పఁబడిన కుంతలాది దేశములనన్నిటిని స్వాధీనముచేసికొని యేలినాఁడని తాత్పర్యము. ఇచట రూపకాలంకారము. అదియుఁ గుంతలేత్యాదులయందు శ్లేషించినది. తక్కినచోట శ్లేషించలేదు.

తా. శ్రీరంగరాయల యాజ్ఞాపత్రము భూసతి కుంతలస్థలమున మొగలిరేకువలెను పరాక్రమము నొసట (లాటదేశమున) కుంకుమపూవు తిలకముగను కీర్తి వత్సభాగమున హారముల రీతిగను దానజలము కాంచీదేశమునకు వజ్రముల మొలనూలువలెను సైన్యధూళి మదుపువన్నె పట్టువలువవలెను జతుర్విధాలంకారదాయకముగ నుండెను.

మ. జలధిన్ దానపయోధునీఝరులచేఁ ♦ జంద్రున్ యశోలక్ష్మిచే
జలదవ్రాతము నాత్మకారితమహాసత్రాగ్ని ధూమంబుచేఁ
జెలు వొప్ప న్వెలయింపఁ జాలు భళిరే ♦ శ్రీరంగ రాయక్షమా
లలనావల్లభుఁ డెల్లదాతలకు నెల్లన్ దాత యూహింపఁగన్. 74

జలధిన్ = సముద్రుని, దాన = దానసంబంధమైన, పయః = ఉదకముచేతనైన, ధునీ = నదులయొక్క, ఝరులచేన్ = ప్రవాహముచేతను, చంద్రున్ = చంద్రుని, యశోలక్ష్మిచేన్ = కీర్తిశోభచేతను, జలదవ్రాతమున్ = మేఘసమూహమును, ఆత్మకారిత = తనచేతఁ జేయింపఁబడిన, మహాసత్ర = మహాయజ్ఞములయందలి, (ని. 'సత్రమాచ్ఛాదనేయజ్ఞే సదాదానేవనేపిచ' అని వి.) అగ్ని=అగ్నిసంబంధమైన, ధూమంబుచేన్ = పొగచేతను, చెలువొప్పన్ = బాగొప్పఁగా, వెలయింపఁజాలు = ప్రకాశింపఁజేయుటకుఁజాలునట్టి, భళిరే=మఱ్ఱిఁబాగా, శ్రీరంగరాయ క్షమాలలనావల్లభుఁడు=శ్రీరంగరాయభూపతి, ఊహింపఁగన్ = విచారింపఁగా, ఎల్లదాతలకు నెల్లన్ దాత = దాతలైనవారికందఱికిని దాతయౌను, అనఁగా లోకములో సముద్రుఁడును జంద్రుఁడును మేఘుఁడును దాతలలో శ్రేష్ఠులని చెప్పఁబడుచున్నారు. గనుక వారలకు నీ శ్రీరంగరాజు దాత యైనాఁడని యర్థము దానోదకనదీప్రవాహముల

చేత సముద్రునికి జలసమృద్ధిని శుభ్రయశస్సుయొక్క శోభచేతఁ జంద్రునికిఁ గాంతిసమృద్ధిని యాగా గ్నిధూమముచేత మేఘునికి రూపసమృద్ధిని గలుగఁజేసినాఁడని భావము. పెలయింపఁజాలును అనువఱకు వాక్యముచేత రాజునందు దాతలకు దాతృత్వమును సమర్థించుటవలనఁ గావ్యలింగాలంకారము.

ఈపద్యమున శ్రీరంగరాయల దానాతిశయము కీర్తి వైభవము యజ్ఞనిర్వహణము సూచితములు.

తా. శ్రీరంగరాయలు దానజలముచేత సముద్రమును కీర్తివైభవముచేత శశాంకుని యజ్ఞధూమముచేత మేఘములను నభివృద్ధి నొందించి పెరొంచెను. అందువలన దాతలని పేరుగొన్న సముద్రము చంద్రుఁడు జలదములకంటె శ్రీరంగరాయలె దాత యని భావము.

శా. తుంగక్ష్మాధరకోటు లెక్కి కమలా•ప్తు న్మ్రింగి వీరారిశౌ
ర్యాంగారంబుల నొక్కగ్రుక్కఁ గొని స•ద్యశ్శ్రాంతి మానంగ నా
నుం గల్లోలవతీభుజంగజలసం•దోహంబు లెల్లన్ సమి
ద్రంగప్రౌఢసిరంగరాయపృతనా • రంగద్రజోజాలముల్. 75

సమిద్రంగ=యుద్ధరంగమందు, ప్రౌఢ=సమర్థుఁడైన, సిరంగరాయ = శ్రీరంగరాయనియొక్క, పృతనా = సేనాసంబంధమైన, రంగత్ = ఒప్పుచుండెడు, రజోజాలముల్ = పరాగ సముదాయములు, తుంగ క్ష్మాధరకోటు లెక్కి=పొడవైన పర్వతసమూహముల నెక్కి (లేక పర్వతాగ్రముల నెక్కి), కమలాప్తున్ మ్రింగి=సూర్యునిఁగబళించి, వీరారిశౌర్యాంగారంబులన్ = వీరులైనశత్రువులయొక్క శౌర్యముల నెడు నిప్పులను, ఒక్కగ్రుక్కఁగొని = ఒకసారిగదిగమ్రింగి, సద్యశ్శ్రాంతి మానంగన్ = అప్పుడు పొందిన శ్రమనివారణ మగునట్టులుగా, కల్లోలవతీ=నదులకు, భుజంగ=విటుఁడైన సముద్రుని యొక్క, జలసందోహంబులెల్లన్ = ఉదకసమూహముల నన్నిటిని, ఆనున్=త్రాగును. (ని. 'భుజఙ్గో విటసర్పయోః' అని అ.)

తా. శ్రీరంగరాయలయొక్క చతురంగబలపాదఘట్టనమువల్లఁ బుట్టినపరాగము కమ్ముకొనుచుండఁగాఁ గులపర్వతములు కప్పఁబడియెననియు సూర్యబింబము కనుపడక పోయెననియుఁ బరాక్రమవంతులైన శత్రువుల శౌర్యములు నశించెననియు సముద్రములన్నియుఁ బూడిపోయె ననియును భావము.

ఇచ్చట సేనాధూళి సముద్రపానముఁ జేయుటకుఁ బర్వతారోహణాదులవలనం గలిగిన యాయాసముఁ బోఁగొట్టుకొనుట ఫలముగాకున్నను ఫలముగా నుత్ప్రేక్షించుటచే ఫలోత్ప్రేక్ష. అర్థాపత్తి. సమాసోక్తి.

సైన్యధూళి యాకాశమువఱకు నంటు ననుట కవిసంప్రదాయము.

మ. తలపం జొప్పడి యొప్పె నప్పుడు తదుద్యజ్జైత్రయాత్రాసము
త్కలికాసంఖ్య దసంఖ్య సంఖ్య జయవత్కాంఖాణరింఖావిశృం
ఖల సంఘాత ధరాపరాగ పటలాక్రాంతంబు మిన్నే అన
ర్గళభేరీరవనిర్గళద్గగన రేఖాలేపపంకాకృతిన్. రాఘవపాండవీయము.

సీ. భూరిభుజంగికాం•భుక్తనిర్ముక్తుఁ డై వారక బుసకొట్టు•వానిఁ దెగడి
పంకనిశ్శంకుఁ డై • పారదారికవృత్తి వదలక పల్లొత్తు•వాని నెడసి

మధుపాంగనాసంగమప్రౌఢి నెపుడు వోవని చెక్కుచెమరులవాని రోసి
బింకంపుసానులవంక రాపడి నెలవంక పైఁ బూనినవాని మాని
తే. పుడమిచెలి చెందె నకలంకభోగభాస, మాను నక్షయసౌకర్యమానితాను
భావు నమలినదానవైభవు నకూట, రాగనిస్తంద్రు శ్రీరంగరాయచంద్రు. 76

భూరి=అనేకులైన, భుజంగికా = జారస్త్రీలచేత, భుక్త=భోగింపఁబడి, నిర్ముక్తుఁడై = విడువఁబడిన వాఁడై, వారకబుసకొట్టువానికి=విడువక నిట్టూర్పులు పుచ్చుశేషుని, తెగడి=నిరసించి యని యర్థము. భూరి=అనేకులైన, భుజంగికా=ఆఁడుపాములచేత, భుక్త=భోగింపఁబడి, నిర్ముక్తుఁడై=కుబుసము విడిచిన వాఁడై, ని. 'నిర్ముక్తో ముక్తకఞ్చుకః' అని అ. వారకబుసకొట్టు=విరామము లేక ఫూత్కారము సేయుచున్నవాఁ డని భావము.

పరకాంతాభుక్తనిర్ముక్తగాత్రుఁడు రాజ్యపాలనమున కనర్హుఁ డని భూకాంత పరిత్యజించె నని యాశయము.

పంక=పాపవిషయమై, నిశ్శంకుఁడై=శంకలేనివాఁడై, పారదారికవృత్తికి = పరస్త్రీకాముకవృత్తితోడ,వదలకపల్లొత్తువానికి=విడిచిపెట్టక దంతక్షతములు సేయు యజ్ఞవరాహామును, ఎడసి=ఎడఁబాసి యని యర్థము, పంక మనఁగా బురద, దానికి సందేహింపనివాఁడై, పారదారికవృత్తికి= పారంధృణాతీతి పారదారీ, సఏవ పారదారికః. అనఁగా దరులనురలంద్రోయు వ్యాపారముతోడ నెల్లప్పుడును, దంష్ట్రాగ్రములచేత ఘట్టనముసేయువాఁడని భావము. ని. 'పఙ్కఃకర్దమపాపయోః' అని వి.

పరదారావృత్తి మిగుల పాపదాయకము. అట్టిదుర్నీతిని విడువఁజాలనివాఁడు రాజ్యపాలన కనర్హుఁడని భూకాంత విడనాడెను.

మధుపాంగనాసంగమప్రౌఢికి=మద్యపానముఁ జేయు స్త్రీలతోడి సంభోగమందలి ప్రౌఢిమచేత, ఎపుడువోవని చెక్కుచెమరుల వానికి=ఎవ్వుడును బోకుండెడు చెక్కుచెమటలుగల దిగ్గజమును, రోసి=అసహ్యపడి యని యర్థము. మధుపాంగన లనఁగా తాఁడుతుమ్మెదలు వానియొక్క సాంగత్యప్రౌఢిమగలవాఁడు, ఎప్పుడును గండస్థలమదధారలు గలవాఁడును అని భావము.

స్త్రీగమనమె పాపమై యుండ మధుపానముచేయుసతులఁ గవయుట మిగుల దోషకరము. కాన నట్టివారిని వర్జించెను.

బింకంపుసానులవంకరాపడి=సానియనఁగా వారకాంత, సాను వనఁగాఁ బర్వతపుపెద్దచరియ, బింకముగల వారకాంతలవల్ల రాపిళ్ళఁబడి, నెలవంక పైఁబూనినవానికి=నఖక్షతములు వహించిన కులపర్వతమును, మాని=విడిచిపెట్టి యని యర్థము. పెద్దచరులయొక్క మలకలయందు రాపిళ్లఁబడి చంద్రికలను బై ధరించినది. అనఁగా నత్యున్నతమై యుండునది యని భావము.

వారకాంతాలోలురను గూడ భూతరుణి విసర్జించును. అందు సామాన్యపుసానులుగాక బింకపు సానులగుట రాజులకు వారివలన నాపదలు చిక్కులుగూడ నెక్కువగునని యాశయము.

పుడమిచెలి=భూకాంత, అకలంకభోగ భాసమానుకు=కళంకరహితమైన భోగముచేతఁ బ్రకాశమానుఁడైనట్టియు, అని రాజపరమైన యర్థము. శేషుఁడు కళంకరహితమైన భోగముగలవాఁడనుట. ఇది ప్రథమచరణమునకుఁ గ్రమమని తెలియవలయును. భోగములనఁగాఁ బడగలు నల్లని

మచ్చలుగల పడగలచేత నొప్పుచున్నవాఁడని భావము. (శ్లో. 'మూర్ధ్నా ముకున్దపదపఙ్కజముద్రితేన' అని) శేషశిరోవిశేషణముగాఁ జెప్పఁబడియున్నది. (ని. కళఙ్కోఙ్కాపవాదయోః' అని అ.) అక్షయ=క్షయములేని, సౌకర్య = తిన్నఁదనముచేత, మానిత = ఒప్పుచున్న, అనుభావుక్=ప్రభావము గలిగినట్టియు, అని రాజపరమైన యర్థము. యజ్ఞవరాహము క్షయముగల సౌకర్యముతోఁ గూడిన దనుట. ఇది రెండవచరణమునకుఁ గ్రమము. క్షయమనఁగాఁ గల్పాంతమును, సౌకర్యమనఁగా సూకరభావమును, కల్పాంతసూకరత్వముతోఁ గూడినదని భావము. (ని. 'క్షయఃకల్పాన్తఇత్యపి' అని అ.) అమలిన=మాలిన్యరహితమైన, దానవైభవుక్=త్యాగముయొక్క వైభవము గలిగినట్టియు, అని రాజపరమైన యర్థము. దిగ్గజము మాలిన్యసహితమైన త్యాగవైభవముగల దనుట. ఇది మూఁడవచరణమునకుఁ గ్రమము. దానమనఁగా మదము, మలినమైన మదవైభవము గలదని భావము. (ని. 'దానం గజమదే త్యాగే' అని వి.) అకూట = కపటములేని, రాగ=అనురాగముచేత, నిస్తంద్రుక్ = నిశ్చలుఁడైనట్టి, అని రాజపరమైనయర్థము, కులపర్వతము కపటముగల యనురాగముతోఁ గూడినదనుట, ఇది నాలవచరణమునకుఁ గ్రమము, కూటములనఁగా శిఖరములు శిఖరములయందలి ధాతురాగముతోఁ గూడినదై చలింపని దని భావము.(ని. 'మాయానిశ్చలయన్త్రేషు కైతవానృతరాశిషు, అయోఘనే శైలశృఙ్గే సీరాఙ్గే కూట మస్త్రియామ్' అని అ.) శ్రీరంగరాయచంద్రుక్ = శ్రీరంగరాయశ్రేష్ఠుని, చెందెక్ = పొందెను. అనఁగా భూకాంత తనకు భర్తలైన శేషాహి మొదలైనవారియందు శబ్దశ్లేషచేత సంప్రాప్తమైన దుర్ఘటభావములను విచారించినదై వారిసాంగత్యము నిరసించి యుత్తమనాయక ధర్మములుగల శ్రీరంగరాయప్రభువును బొందె నని యర్థము. ఇచట శ్లేషోత్థాపిత వ్యతిరేకాలంకారము.

తా. శేషుఁడు భుజంగికాభోగనిర్ముక్తుఁడగుటవలనను వరాహము పారదారికవృత్తి నుంటవలనను దిగ్గజములు మధుపాంగనాసంగముతో నుంటవలనను పర్వతములు పెద్దసానులతో నలరారుటవలనను భోగయోగ్యములు కావని గ్రహించి భూకాంతయే తాదృగ్దోషరహితుఁడగు శ్రీరంగరాయల వరించి సుఖజీవనము చేయసాగెను.

మ. ఘనశౌర్యుండు సిరంగరాయనరలోకస్వామితోఁబుట్టు రా
మనృపాలాగ్రణి సహ్యజాంబుధిపయోమధ్యోర్వి శ్రీరంగప
ట్టనలంకానగరంబు పుణ్యజనపీడావార్త లేకుండఁ గై
కొనియె న్మిత్రభవోపకారనిరపేక్షుం డై విచిత్రంబుగన్. 77

ఘనశౌర్యుండు=అధికపరాక్రమముగలిగిన, సిరంగరాయనరలోకస్వామితోఁబుట్టు = శ్రీరంగరాయజననాథుని తమ్ముఁడైన, రామనృపాలాగ్రణి = రామనరపాలశ్రేష్ఠుఁడు, తోఁబుట్టు, అన్నచోట ('వువర్ణశోభ వేద్యత్రక్వచిన్నిత్యఃక్వచిత్తువా') అను నథర్వణవచనమువలన వువర్ణకము వైకల్పికము గనుక తోఁబుట్టువు అని చెప్పఁబడలేదు. సహ్యజా = కావేరియనెడు, అంబుధి = సముద్రముయొక్క, పయః=ఉదకముయొక్క, మధ్యోర్విక్ = మధ్యభూమియందలి, శ్రీరంగపట్టణలంకానగరంబు = శ్రీరంగపట్టణమనులంకాపురమును, పుణ్యజనపీడావార్తలేకుండక్ = సజ్జనబాధ యనెడుమాట లేకుండునట్టులు, మిత్ర=స్నేహితులవలన, భవ=కలిగిన, ఉపకార=సహాయమందు, నిరపేక్షుండై = అపేక్షలేనివాఁడై, అనఁగా నసహాయుఁడై, కైకొనియెక్=సాధించి పుచ్చుకొనెను అనియర్థము. దశరథరాముఁడు మిత్రభవోపకారము నపేక్షించినవాఁడై, పుణ్యజనులకు బాధ గలుగునట్టులుగా సముద్రోదకమధ్యభూమి

యందలి లంకాపట్టణమును సాధించినవాఁడనుట, మిత్రభవుఁ డనఁగా సూర్యునివలన సంభవించిన సుగ్రీవుఁడుగనుక నతనిసహాయ మపేక్షించినాఁడనియునుఁ బుణ్యజనులనఁగా రాక్షసులు. ని. 'యాతుధానః పుణ్యజనః' అని అ. వారలకుఁ బీడగలుగునట్లుగా సాధించినాఁడనియును భావము. ఇచట రామనరపాలుఁడనెడు రామనరపాలుఁడని రూపకము. అదియు 'సహ్యజాంభోధీ' త్యాదిరూపకములచే సాహాయ్యము చేయఁబడుటచే సావయవరూపకము. తొల్లిటియవస్థకంటె రాజభావావస్థయందు మిత్రభవోపకార నిరపేక్షత్వాది శ్లేషచే ననుగ్రహింపఁబడిన విశేషముం జెప్పుటచే నధికాభేదరూపకము. ఘనశౌర్యత్వ విశేషణముచే మిత్రాపేక్ష లేకయే లంకాసాధనమును సమర్థించుటవలనఁ గావ్యలింగాలంకారము. ఈరెంటికిని సంకరము.

రాముఁడు పుణ్యజనపీడ మిత్రభవోపకారాపేక్షతో లంకానగరముచేకొన రామరాజు పుణ్యజనపీడారహితముగ మిత్రభవోపకారానపేక్షముగ నాయానగరములు చేకొనుట విచిత్రము. పుణ్యజనుల పీడించుట మిత్రభవోపకార మాసించుట లేమిచే శ్రీరామునకంటె రామరాజే యుత్తముఁడు. కాననే ఘనశౌర్యుఁడు,

తా. రామరాజు శ్రీరంగపట్టణమును పుణ్యజనపీడారహితముగా మిత్రభవోపకార నిరపేక్షముగఁ గైకొని పరిపాలింపసాగెను.

శా. రామక్ష్మావరు దానతోయతటినీవ్రాతంబు కల్లోలినీ
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గువర్షాశర
త్సామానాధికరణ్యలబ్ధి కచటం జక్రాయుధుం డొందు ని
ద్రాముద్రానుగతప్రబోధములఁ జిత్రం బేకకాలంబునన్. 78

రామక్ష్మావరు = రామభూమీశ్వరునియొక్క, దానతోయతటినీవ్రాతంబు=దానజలనదీసముదాయము, కల్లోలినీస్వామిం జెందన్ = నదీనాయకుఁడైన సముద్రునియందుఁ బ్రవేశించుచుండఁగా, యశంబు=కీర్తి, మేఘములఁబర్వన్ = మేఘములయందు వ్యాపింపఁగా, కల్గు = సంప్రాప్తమగుచున్న, వర్షాశరత్సామానాధికరణ్యలబ్ధికిన్ = వర్షాకాలశరత్కాలములయొక్క యేకకాలావస్థానమునకు, అచటన్=ఆక్షీరసముద్రమందు, చక్రాయుధుండు=శ్రీమహావిష్ణువు, నిద్రాముద్రానుగతప్రబోధములన్ = నిద్రాజాగరూకతలను, ఒందున్=పొందుచుండును.

నిద్రాప్రబోధము లేకకాలమున నొందుట చిత్రము. దానతోయము తటినీవ్రాతమగుటవల్లనే విష్ణువు వర్షాకాలవాహినులని గుర్తింపఁగలిగెను. తటినీవ్రాతము సంగమించుటవల్లనే సముద్రుఁడు కల్లోలినీస్వామి యనిపించుకొనెను. యశము మేఘములఁ దెల్లఁజేయుటవలనఁ బాండురవర్ణవిశేషము, ఆకాశపర్యంతవ్యాప్తి సూచితములు.

తా. విష్ణుమూర్తికి వర్షర్తువునందు నిద్రయును శరదృతువునందు మెలఁకువయును గనుక సీరామప్రభువు సేయుచుండెడు దానములనుగురించి విడువఁబడిన యుదకము నదులై ప్రవహించి క్షీరసముద్రమందుఁ బ్రవేశించుచుండఁగా నప్పుడే యితనియొక్క శుభ్రయశస్సుచేత మేఘములన్నియుఁ దెల్లనగుటయుఁ గలుగఁగా నక్కడ శయనించియుండెడు విష్ణుమూర్తి నదులు సముద్రమందుఁ బ్రవేశించుటచేత వర్షాకాలమని నిద్రను, మేఘములు తెల్లఁగానుండుటచేత శరత్కాలమని జాగరూకతను బొందుచుండెను. ఇచట మూఁడు సంబంధాతిశయోక్తులకు సంకరము,

క. ఆరఘునాథప్రభృతిధ, రారమణేంద్రులకు మువ్వురకు సోదరుఁడై
సారమతి వేంకటపతి, క్ష్మారమణీప్రియుఁడు వెలయు శత్రుఘ్నుఁ డనన్. 79

ఆరఘునాథప్రభృతిధరారమణేంద్రులకు మువ్వురకు సోదరుఁడై=రఘునాథుఁడు మొదలైన యా ముగ్గురు రాజశ్రేష్ఠులకును దమ్ముఁడై యని యర్థము. రామ లక్ష్మణ భరతులకుఁ దమ్ముఁడై యని యర్థాంతరము. సారమతి=యోగ్యమయిన బుద్ధిగలిగిన, వేంకటపతిక్ష్మారమణీప్రియుఁడు=వేంకటపతి యనురాజు, శత్రుఘ్నుఁడనన్=శత్రుసంహారకుఁడనునట్టులుగా నని యర్థము. శత్రుఘ్నుఁడనునట్టులుగా నని యర్థాంతరము. వెలయున్=ప్రకాశించును. ఇందు రఘునాథాదులకు మువ్వురకుఁ దమ్ముఁడౌట యను ధర్మనిమిత్తముచేత శత్రుఘ్నస్వరూపోత్ప్రేక్ష.

తా. రఘునాథరాయలు మొదలగు మువ్వురు సోదరులకుఁ గడసారివాఁడై శత్రుఘ్నుఁడే మో యనునటుల వేంకటపతిరాయలనువాఁడు పొగడొందెను.

సీ. చెక్కు నొక్కదె యంచు దిక్కరిగ్రామణి,
యక్కుఁ జేరదె యంచు రిక్కరాయఁ
డలుత నొందదె యంచు హాలాహలాహారి,
కంటి కబ్బదె యంచు దంటచిలువ
యంక మొందదె యంచు యదుకులశ్రేష్ఠుండు,
మోముఁ జూడదె యంచు మొదటిగిబ్బ
యడుగు ద్రొక్కదె యంచు నమృతంపుమున్నీరు,
చాయ నుండదె యంచు సౌరశాఖి
తే. తనచెలిమి కాసపడ నొచ్చె మునికి వారిఁ
దెగడి యాత్మసవర్ణలబ్ధికిఁ జరాచ
రంబునఁ జరించుఁ దిరుమలరాయతనయ
ధీరవేంకటరాయసత్కీర్తికన్య.

చెక్కునొక్కదెయంచున్=చెక్కిలి నొక్కి ముద్దయినను బెట్టుకొనదాయెనని, దిక్కరిగ్రామణి=దిగ్గజశ్రేష్ఠమయిన యైరావతమును, అక్కుఁజేరదెయంచున్=ఱొమ్మునకైనను రాదాయెనని, రిక్కరాయఁడు=చంద్రుఁడును, అలుత నొందదె యంచున్=కంఠాశ్లేషమైనం జేసికొనదాయెనని, హాలాహలాహారి=శివుఁడును, కంటికబ్బదె యంచున్=కంటికైనదక్కదాయెనని, దంటచిలువ=ప్రౌఢసర్పమును, అనఁగా శేషుఁడనుట, అంకమొందదెయంచున్=తొడమీఁదికి రాదాయెనని, యదుకులశ్రేష్ఠుండు=బలరాముఁడును, మోముఁజూడదెయంచున్=మొగమయినం జూడదాయెనని, మొదటిగిబ్బ=ఆది వృషభమును, అడుగుద్రొక్కదెయంచున్=కాలుద్రొక్కకయైనఁబోయెనని, అమృతంపుమున్నీరు=క్షీరసముద్రుఁడును, చాయనుండదెయంచున్=సరసనైన నుండదాయెనని, సౌరశాఖి=కల్పవృక్షమును, ఇంతవఱకుఁ జెక్కునొక్కదెయంచున్, అక్కుఁజేరదెయంచు నిత్యాది విశేషణముల వలన నైరావతచంద్రాదులయందు నాయకవ్యవహారస్ఫూర్తియగుచున్నది, తనచెలిమికాసపడన్=తన

సాంగత్యమునకు నాశింపఁగా. ఓచ్చెమునికిన్=లోపమున్నందున, వారిఁ దెగడి=పైనిఁ జెప్పఁబడిన వారిని దిరస్కరించి, ఆత్మసవర్ణలబ్ధికిన్=తనకుఁదగినవారు లభించుకొఱకు, తిరుమలరాయతనయ ధీరవేంకటరాయసత్కీర్తికన్య = తిరుమలదేవరాయలకొమారుఁడై ధీరుఁడైన వేంకటరాయలయొక్క శ్రేష్ఠమయిన కీర్తియనుకన్య, చరాచరంబునఁజరించున్=చరాచరాత్మకమయిన ప్రపంచమందంతట సంచరించునని యర్థము.

తా. వేంకటపతిరాయలకీర్తి నిష్కళంకమయిన ధావళ్యముగలదిగనుకఁ దనతో సామ్యమును బొందవలయునని విచారించిన యైరావత చంద్రాదులకుఁ గ్రమముగా లోపము లుండుటచే అనఁగా నైరావతమునకు గండస్థలమందు మదజలమాలిన్యమును జంద్రునకు వక్షోభాగమందు గళంకమును శివునకుఁ గంఠమందు నైల్యమును శేషునికిఁ గన్నులయందు నీలిమయును బలరామునికిఁ దొడలయందు నీలాంబరమును నాదివృషభమునకు ముక్కున నల్లమచ్చలును క్షీరసముద్రునికి నడుగున ననఁగా నధఃప్రదేశమందు నల్లనిబురదయును గల్పవృక్షమునకు ఛాయయందు నీలిమయును ననునవి కలిగియుండుటచేత సామ్యమును బొందలేకైరి గనుక వారిని దిరస్కరించి తనతో సమానమయిన వస్తువును వెదకునిమిత్తమయి తిరుగుచున్నదో యనునట్లుగా జగత్తునందంతటను వ్యాపించెనని భావము.

చెక్కునొక్కెడే యనునది మొదలైనవిశేషణములవలన దిక్కరిచంద్రాదులయందు నాయకస్ఫూర్తి గలుగుచున్నది గనుక సమాసోక్త్యలంకారము. మదజలకళంకాదిమలినీభూతగండస్థల వక్షస్స్థలాదియుక్తము లయినదిక్కరిచంద్రాద్యుపమానములకంటెఁ గీర్తియం దాధిక్యముస్ఫురించుచున్నది గనుక వ్యతిరేకాలంకారము, శ్లో. 'విశేషణానాం తౌల్యేన యత్ర ప్రస్తుతవర్తినా, అప్రస్తుతస్యగమ్యత్వే సాసమాసోక్తిరిష్యతే. భేదప్రధానసాధర్మ్య ముపమానోపమేయయోః, ఆధిక్యాదల్పకథనా ద్వ్యతిరేకస్స ఉచ్యతే.' అని లక్షణములు కీర్తికన్య జగమునం దిరుగుటను సపత్నప్రాప్తిఫలముగా నుత్ప్రేక్షించుటచే ఫలోత్ప్రేక్ష.

మ. హరుఁ డాతారకశైలదుర్గమున నధ్యాసీనుఁ డై రాజశే
ఖరవిఖ్యాతి వహించుఁ జంద్రగిరిదుర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖరసదాసంసేవ్యుఁ డై యౌర యి
ద్ధర బంటేలికవాసి తద్గిరులకుం దద్వల్లభశ్రీలకున్. 81

హరుఁడు=శివుఁడు, ఆతారకశైలదుర్గమునన్=నక్షత్రము పేరిటి యాపర్వతదుర్గమందు, అధ్యాసీనుఁడై=నివసించినవాఁడై, రాజశేఖరవిఖ్యాతివహించున్=రాజశ్రేష్ఠుఁడను ప్రసిద్ధిచేత నొప్పుచుండు నని యర్థము. వెండికొండయందు నివసించినవాఁడనియుఁ జంద్రశేఖరనామము గలవాఁడనియును భావము. శ్రీవేంకటేశ్వరుఁడు=సంపద్యుక్తుఁడైన వేంకటరాయఁడు, చంద్రగిరిదుర్గంబందున్=చంద్రుని పేరిటి పర్వతదుర్గమందు, బహురాజశేఖరసదాసంసేవ్యుఁడై = బహురాజశ్రేష్ఠులచేత నెల్లప్పుడును సేవింపఁబడినవాఁడై, ఒప్పెన్=వెలయుచుండెను. ఔర=భళీ. ఇద్ధరన్=ఈభూమియందు, తద్గిరులకున్=ఆతారకగిరి చంద్రగిరులకును, తద్వల్లభశ్రీలకున్=ఆతారకగిరి చంద్రగిరుల కధిపతులైన హర వేంకటేశ్వరుల సంపదలకును, బంటేలికవాసి=బంటుగౌరవాసి యని యర్థము. చంద్రమనఁగా బంగారముగనుకఁ జంద్రగిరియనఁగా బంగారుకొండ యని చెప్పి వెండికొండకును బంగారుకొండకును

బంటేలికవాసియనియును బ్రకారాంతరము. (ని. 'వసుచన్ద్రౌ చార్జునంచ కళ్యాణం భూరిహైరికమ్' అని అమరశేషము.) ఇచట మొదటిరెండువాక్యములయందు దారకగిరి చంద్రగిరులకు వానియేలికల కును భృత్యరాజాంతరమును సమర్థించుటచే వాక్యార్థహేతుకకావ్యలింగాలంకారము, అది శ్లేషచే లేవ నెత్తఁబడినది.

తా. శివుఁడు వెండికొండపై రాజశేఖరనామముతో నొప్పెను. వేంకటపతిరాయలను వేంక టేశ్వరుఁడు చంద్రగిరి (బంగారుకొండ)పై ననేకరాజశేఖరులు గొలువ కొలువు దీరిచి యుండెను. కావున శివునకు వేంకటేశ్వరునకు (వేంకటపతిరాయలకు) బంటునకు రాజునకుఁ గలయంత వ్యత్యాసము గలదు.

సీ. చుట్టఁ జుట్టుకొని శేషుఁడు నిద్రపోవును ముదిపన్నగములలోఁ మొదటివాఁడు
మొనయక కాదిమకూర్మము ముడుంగు మేను మోపిన పెద్దవారిలోఁ బెద్దవాఁడు
సమధికాశాప్తి హస్తము చాచుఁ బద్మినీవైరి డిక్కరి తలవడఁకువాఁడు
తనయొంటిపంటిచేతనె యంటు నాదికాలముఘోణి పాండురోమములవాఁడు
తే. కదలలేఁడద్రి బహువయఃక్రమమువాఁడ, టంచు వారలనిరసించి యవనికాంత
తనభుజాదండమున నుండఁ బనరుచుండు, భావజనిభుండు వేంకటక్ష్మావిభుండు.

చుట్టఁజుట్టుకొని శేషుఁడు నిద్రపోవును=శేషుఁడు శరీరమంతయుఁ గుదియఁడీసికొని యెప్పుడును నిద్రించుచుండును. అదియునుంగాక, ముదిపన్నగములలో మొదటివాఁడు = ముదిసిన పాములలో నగ్ర గణ్యుఁడు, ఆదిమకూర్మము, అనఁగా భూమికిముందుగాఁ బుట్టినకూర్మము, మేను మోపినన్ = శరీరము మోపఁగా, మొనయక = పైకొనక, ముడుంగున్ = ముడుచుకొనిపోవును. అదియునుంగాక, పెద్ద వారిలోఁ బెద్దవాఁడు = వృద్ధులలో మిక్కిలివృద్ధు, దిక్కరి = దిగ్గజము, సమధిక= మిక్కిలియు నధిక మైన, ఆశాప్తిన్ = ఆశనుబొందుటచేతను, హస్తముచాచున్ = చేఁజాచుచుండును, అనఁగా లేకితన ముగా యాచించును. అదియునుంగాక, పద్మినీవైరి = పద్మినీజాతిస్త్రీలకుఁ గాఁబగానివాఁడును, తల వడఁకువాఁడు=తలవణఁకించుముసలివాఁడు, అని యర్థము. ఆశలనఁగా దిక్కులు, ని. 'ఆశాశ్చప్రష్ఠా దిశాప్రోక్తా' అని అ. హస్తమనఁగాఁదుండము, (శ్లో. 'హస్తోనక్షత్రభేదేస్యాత్కరేభకరయోరపి' అని వి.) పద్మినియనఁగఁ బద్మలత. (ని. పద్మినీస్త్రీవిశేషేపి సరస్యాం మంబుజేపిచ' అని వి.) కనుక దిక్కులయందుఁ దుండముసాచువాఁడనియును దామరతీఁగెలనుఁ ద్రెంచివేయువాఁడనియును, శిర శ్చాంచల్యమే స్వభావముగాఁగలవాఁడనియును భావము. ఆదికాలముఘోణి = అనఁగా నాదివరా హము, తనయొంటిపంటిచేతనె యంటున్ = ఒంటిపల్లనఁగా నన్నిపండ్లు నూడిపోఁగా మిగిలినపల్లని యర్థము. దానిచేతనే నొక్కుననియును, అదియునుంగాక, పాండురోమములవాఁడు = నెరసినవెంట్రు కలుఁగలవాఁడనియును అర్థము. ఒంటికొఁబగలవాఁడనియు శ్వేతవరాహముగనుక తెల్లనివెండ్రుకలు కల వనియును భావము. (దంష్ట్రీఘోణీస్తబ్ధరోమా' అని అ.)

కదలలేఁడద్రి=అద్రియనఁగాఁ గులపర్వతుఁడు కదలలేఁడు, కూర్చున్నచోటినుండి యివతల నవతల కదలలేఁడు. అదియునుంగాక, బహువయఃక్రమమువాఁడు-బహు = అనేకములైన, వయః = బాల్యకౌమారయౌవనములయొక్క, క్రమమువాఁడు = క్రమించుటగలవాఁడు, అని యర్థము. అవల

మనియు ననేకములైన పక్షులయొక్క గతిగలిగినవాఁడనియును భావము. ఇక్కడ వయశ్శబ్దము పక్షిపరము. (ని. 'వయః పక్షిణి బాల్యాదౌ పయో యౌవనమాత్రకే' అని వి.) అటంచుక్ = కాలాగని, వారలనిరసించి = వృద్ధధర్మములుగల శేషుఁడు మొదలైనవారిని నిరాకరించి, అవనికాంత=భూకాంత, తనభుజాదండమునసుండక్ = తనయొక్క బాహుదండమందు నివసింపఁగా, భావజనిభుండు = ఈపదము సాభిప్రాయము, మన్మథసమానుఁడైన, వేంకటక్ష్మావిభుండు = వేంకటరాయభూమీశ్వరుఁడు, తనరుక్ = ఒప్పుచుండును. ఇక్కడ దిక్కరి ఘోణాద్రులకు మహద్విపత్తు చేసి చెప్పినాఁడు. అలంకారము శ్లేషోత్థాపితహేతూత్ప్రేక్ష. కావ్యలింగము పరికరమును.

అవనికాంతగఁ జెప్పఁబడుటఁ బడుచుగుబ్బెత యని తెలియవలయును. కాంత కావుననే ముదుసలివారలందఱిపొందును విసనాడి భావజనిభుఁడుగ నున్న వేంకటపతిరాయల వరించెను. భుజాదండములనుటచే వేంకటపతిరాయలు నడిమివయస్సువాఁడని గరిడీసాములలో నారితేరి దేహపటుత్వము గడించినవాఁడనియుఁ గాననే ధరణీకాంతావహనయోగ్యమగు భుజపటుత్వముగలదని యెఱుంగునది.

తా. శేషుఁడు, ఆదికూర్మము, మాతంగము, ఆదివరాహము, భూమీధరము అనువీరలు తనను భరింపఁదగినవారు కారని ముదుసలివాండ్రని భావించి భూకాంత భావజునిబోలు మనోహరాకారముగల వేంకటపతిరాయల భుజాదండము నాశ్రయించి సుఖజీవనము గడపసాగెను.

మ. అతిధీరుం డతిదానశూరుఁ డతిర•మ్యాకారుఁ డత్యంతసు
వ్రతుఁ డంచుం దను సన్నుతించు కవివా•గ్వ్యాపార మెల్లన్ యథా
ర్థతమం బై విలసిల్లఁ దిర్మలమహా•రాయేంద్రు శ్రీవేంకట
క్షితినాథోత్తముఁ డందు నిందు గతిఁ గ•ల్పించెం గవిశ్రేణికిన్. 83

అతిధీరుండు=అత్యంతధైర్యము గలవాఁడును, అతిదానశూరుఁడు = అతిశయమైన దానమందుఁ దెగువగలవాఁడును, అతిరమ్యాకారుఁడు = మిక్కిలి మనోహరమైన రూపముగలవాఁడును, అత్యంతసువ్రతుఁడు=అత్యుత్కృష్టమైన నియమముగలవాఁడును, అంచుక్ = అనిపలుకుచు, తనుక్ = తన్ను, సన్నుతించు= స్తుతిచేయుచున్న, కవి = కవులయొక్క, వాగ్వ్యాపారమెల్లక్ = వాగ్వృత్తినంతయును, యథార్థతమంబై విలసిల్లక్ =మిక్కిలి యథార్థమై యొప్పునట్టులుగా, తిర్మలమహారాయేంద్రు శ్రీవేంకటక్షితినాథోత్తముఁడు = తిరుమలదేవరాయని కుమారుఁడైన వేంకటరాయభూనాథశ్రేష్ఠుఁడు, కవిశ్రేణికిక్ =కవిసమూహమునకు, అందునిందుక్ =అనఁగాఁ బరలోకమందు నీలోకమందును, గతిఁగల్పించుక్ =సద్గతిఁగలుగఁజేయును. ఇక్కడ నపరిమితధనప్రాప్తిచేత నైహికమును ధీరత్వము మొదలైన యర్థగుణములతోఁ గూడిన పుణ్యశ్లోకునిసన్నుతిచేత నాముష్మికమును గవిశ్రేణికిఁ గలుగఁ జేయు నని యాశయము.

క. ఆతనయులు జగతీవి, ఖ్యాతనయులు గొలువ శాశ్వ•తైశ్వర్యకళా
స్వీతుఁడు తిర్మలరాయో, ర్వీతలనాయకుఁడు వెలయు•విభవోన్నతుఁడై. 84

జగతీ=భూమియందు, విఖ్యాత=ప్రసిద్ధమయిన, నయులు=నీతిగల, ఆతనయులు = పూర్వోక్తులైన రఘునాథప్రముఖకుమారులు, కొలువక్ = సేవించుచుండఁగా, శాశ్వతైశ్వర్యకళాస్వీతుఁడు=స్థిర

మయిన వైభవముతోఁ గూడిన, తిర్మలరాయోర్వీతలనాయకుఁడు = తిరుమలదేవరాయ భూమీశ్వరుఁడు, విభవోన్నతుఁడై=ఐశ్వర్యముచేత నధికుఁడై, వెలయున్=ఒప్పును.

తా. శాశ్వతైశ్వర్యశాలురును కీర్తిశాలురునగు నీనలువురుకుమారులు తన్నుఁ గొలుచుచుండ తిరుమలరాయఁడు మిగుల విభవముతో రాజ్యమును బాలింపసాగెను.

సీ. ఎంతకాలము మహా•శాంతసంగతి దివ్యదంతావళంబులు • దరల కుండు
నెంతకాలము వరా•హేంద్రుఁ డద్వంద్వుఁడై కల్పము ల్వనరాశిఁ•గడపుచుండు
నెంతకాలము భుజం•గేశుఁ డాదిమభిక్షుపదనిషేవణనిష్ఠఁ • బాయ కుండు
నెంతకాలము గిరు•ల్సంతతాభ్యున్నతి నలహంసపద్ధతి • నంటి యుండు
తే. నంతకాలముఁ దనయంద•యచలయై య, నంతయై రత్నగర్భయై•యవని యలర
నలరుఁ గర్ణాటరాజ్యసిం•హాసనాధి, రాజ్యశుభశాలి తిరుమల•రాయమౌళి.

ఎంతకాలము = ఎంతమట్టుకు, మహాశాంతసంగతిన్ = మహాశాంతులైనవారి సాంగత్యముతోడ, దివ్యదంతావళంబులు=దిగ్గజములు, తరలకుండున్=కదలకుండునో యని యర్థము. దిగంత సంగతి నెంతకాలముండునో యని భావము. ఎంతకాలము=ఎంతమట్టుకు, వరాహేంద్రుఁడు=యజ్ఞవరాహమూర్తి, అద్వంద్వుఁడై=సుఖదుఃఖాది ద్వంద్వరహితుఁడై, వనరాశిన్ = వనసమూహమందు, కల్పములు=అనేకకల్పములు, గడపుచుండున్ = తపము సేయుచుండునోయని యర్థము. అనహాయుఁడై జలరాశియందుఁ గల్పములు గడపుచుండునోయని భావము. ఎంతకాలము = ఎంతమట్టుకు, భుజంగేశుఁడు=శేషుఁడు, ఆదిమభిక్షు=పురాతనభిక్షుకులయొక్క, పదనిషేవణనిష్ఠఁబాయకుండున్ =పాదసేవానిష్ఠను బాయకుండునోయని యర్థము. ఆదిమభిక్షువనఁగా శివుఁడు, ఆతనిపాదభూషణమయి యుండునో యని భావము. ఎంతకాలము=ఎంతమట్టుకు, గిరులు = కులపర్వతములు, సంతతాభ్యున్నతిన్ = నిరంతరాతిశయముచేత,అలహంసపద్ధతినంటియుండున్ =ఆయోగిమార్గ మవలంబించియుండునో యని యర్థము. ఇక్కడ హంసశబ్దము యోగిపరము, ఔన్నత్యముచేత సూర్యమార్గమైనగగనము నంటి యుండునోయని భావము. ఇక్కడ హంసశబ్దము సూర్యపరము. అంతకాలము=అంతమట్టుకు, అనఁగా దంతావళప్రభృతు లెంతకాలము వైరాగ్యదశలతో నుందురో యంతకాలమని యర్థము. శాశ్వతకాలమనుట. దిగ్దంతిప్రభృతులకు దిగంతసంగతిమొదలైనవి శాశ్వతముగా సంభవించుట ప్రకటము, తనయందు=తనయందే, అవని=భూమి, అచలయై=చలింపనిదైయని యర్థము. అచలానామముగలదై యని భావము. అనంతయై = అంతములేనిదై యనఁగా నాశములేనిదై యనియర్థము. ని. 'వృతావవసితేరమ్యేసమాప్తావన్తః' అని వి. అనంతానామము గలదై యనిభావము. రత్నగర్భయై=రత్నపరిపూర్ణయై యని యర్థము. రత్నగర్భానామముగలదై యని భావము. ని. 'జగతీరత్నగర్భాచ' అని అ. అలరన్ = ఒప్పుచుండఁగా, కర్ణాటరాజ్యప్రయుక్తమైన, సింహాసన=సింహాసనమందలి, అధిరాజ్య=అధిరాజభావమునెడు, శుభ=శుభముచేత, శాలి=ఒప్పుచున్న, తిరుమలరాయమౌళి=తిరుమలదేవరాయశ్రేష్ఠుఁడు, అలరున్ = ప్రకాశించును.

భూమిభరణశీలులైన శేషాహిప్రభృతులకు నురమున నేగుఁగుండలి యనెడుపద్యములో బాల్యావస్థయును భూరిభుజంగికా యనెడుపద్యములో యౌవనావస్థయును బట్టఁబట్టుకొని యనెడుపద్యము

లో వార్ధకావస్థయును నెంతకాలము సుహాళాంతసంగతి యనెడు నీపద్యములోఁ దుర్వ్యాపస్థయును జెప్పఁబడెనని గ్రహింపవలయును.

ఇచట దిగ్గజాదులయందు విశేషణసామర్థ్యమువలన నప్రస్తుతయోగివృత్తాంతము తోఁచుచుండుట వలన సమాసోక్త్యలంకారము. శ్లో. 'విశేషణానాంతౌల్యేన యత్ర ప్రస్తుతవర్తినామ్, అప్రస్తుతస్య గమ్యత్వే సా సమాసోక్తి రిష్యతే.' అని లక్షణము.

తా. దిగ్గజములు దిక్కుల భరించునంతకాలమును, ఆదివరాహము ఆదిశేషువు శైలములు భూభరణప్రశస్తిచే నలరునంతకాలమును గర్ణాటరాజ్యసింహాసనము నధిష్ఠించిన తిరుమలదేవరాయల పరిపాలనమునం దీయపనీకాంత శాశ్వతసుఖశీలయై వర్తించుఁగాక.

## షష్ఠ్యంతములు

క. ఏవంవిధవివిధగుణ, శ్రీవారిధి కఖిలసుజన•సేవధికి ధనుగ
ప్రావీణ్యశరధిశరధికి, ధావద్రిపుసంఘలంఘి•తదిశావధికిన్. 86

ఏవంవిధ=ఈవిధమైన, వివిధగుణ=నానావిధములైన సుగుణములయొక్క, శ్రీ=సంపదకు, వారిధికిన్=సముద్రుఁడైనవానికి, గుణశ్రీ యనెడు శ్రీకి ననఁగా లక్ష్మికి, వారిధికిన్, ఉత్పత్తిస్థానమైనవానికిని, అని ప్రకారాంతరము. అఖిలసుజన=సమస్తసజ్జనులకు, సేవధికిన్=నిధియైనవానికిని, ని. 'నిధి ర్నా సేవధిః' అని అ. ధనుఃప్రావీణ్య=విలువిద్యయొక్కసామర్థ్యమందు, శరధి=సముద్రమే, శరధికిన్=అమ్ములపొదిగాఁగల రుద్రుఁడైనవానికిని, ధావత్=పారిపోవుచున్న, రిపు=శత్రువులయొక్క, సంఘ=సమూహముచేత, లంఘిత=దాఁటఁబడిన, దిశావధికిన్=దిగంతముగలవానికిని, ఈపద్యము మొదలు కృతికర్తకు నైదుపద్యములవఱకు షష్ఠ్యంతములు చెప్పుచున్నాఁడు. ప్రతిపద్యమున నంత్యప్రాసము కడవఱకుఁ జెప్పఁబడుచున్నది. ఉల్లేఖాలంకారము.

క. ఉన్నతజయజన్యబిరుద, మన్నెవిభాళాదిబిరుద•మాన్యునకు మహో
దన్నిబిడజన్యపటహాజ, ధ్వాన్నినదక్షరదరిచ్ఛ•టాసైన్యునకున్. 87

ఉన్నత=ఉత్కృష్టమైన, జయ=విజయమువల్ల, జన్య = సంభవించిన, బిరుదమన్నెవిభాళాది=మన్నెవిభాళుఁడనెడి బిరుదు మొదలైన, బిరుద=బిరుదులచేత, మాన్యునకున్ = పూజ్యుఁడైనవానికిని, సీసపాదము. 'శౌర్యధుర్యునకు లాంఛనమునకు నామమగు బిరుదసుటపన్నగవిభూష' అని యాంధ్రనిఘంటువున, మహత్=ఉత్కటముగా, ఉద్యత్=ప్రకాశించుచున్న, నిబిడ=సాంద్రమైన, జన్యపటహాజ=రణభేరివలనఁబుట్టిన, ధ్వాన్నినద=ధ్వాంకారధ్వనివలన, క్షరత్=నశించుచున్న, అరిచ్ఛటా=శత్రుసమూహముయొక్క, సైన్యునకున్=సేనలుగలవానికిని, అనఁగా నిశనిరణభేరియొక్కనాదను వినఁగా గుండెలుపగిలి శత్రుసైన్యములన్నియు నశించునుట.

క. క్ష్వేళారుతశీలాహిత, ఫాలావ్యాతలిపినిభాసి•భాసిచ్ఛాయా
పాళికిఁ బరిపాలితనర, పాళీద త్తద్విపాద్య•పాయనతతికిన్. 88

క్ష్వేళారుతమనఁగా సింహనాదము, ని. 'క్ష్వేళాతు సింహనాద స్స్యాత్' అని అ. క్ష్వేళారుతశీల=సింహనాదమే స్వభావముగాఁగలిగిన, అనఁగాఁ బరాక్రమవంతులైన, అహిత=శత్రువులయొక్క, ఫాల=నొసళ్ళయందలి, ఆవ్యాత=వ్రాయఁబడిన, లిపినిభ=అక్షరపంక్తివలెనున్న, అసి=ఖడ్గముయొక్క

భాసి=ప్రకాశమానమైన, ఛాయాపాళికిన్ = చాయలవరుసగలవానికిని, పరిపాలిత = స్వీకరింపఁబడిన, నరప=రాజులయొక్క, ఆళీ=సమూహముచేత, దత్త=సమర్పింపఁబడిన, ద్విపాలి = ఏనుఁగులు మొదలైన, ఉపాయనతతికిన్ = కానుకలసమూహముకలవానికిని, ని. 'ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్తథో పదా,' అని యమరము. అలం. ఉత్ప్రేక్ష.

క. ఉద్ధతరిపువిద్ధతపన, పద్ధతి కరిభవనదవని•పటదంబుధిసం
పద్ధరణసముద్ధరణస, మిద్ధరణరజో వ్రజోద్య•దిభమదసృతికిన్. 89

ఉద్ధత=ఉత్కటమగునట్టులుగా హతులైన, రిపు=శత్రువులచేత, విద్ధ = భేదింపఁబడిన, తపనపద్ధతికిన్ = సూర్యమండలముగలవానికి, శ్లో. 'ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమణ్డలభేదినౌ, పరివ్రాడ్యోగయుక్తశ్చ రణేచాభిముఖో హతః.' అనెడు వచనమువలన యుద్ధాభిలాషచేత నెదిరించి హతులైన శూరులు సూర్యమండలమును భేదించుకొనిపోయి వీరస్వర్గమును బొందుచున్నారని సంప్రదాయము. అరి=శత్రువులకు, భవనత్ = దాగియుండెడు గృహమగుచున్నట్టియు, అవని=భూదేవికి, పటత్ =వస్త్రమగుచున్నట్టియు, అంబుధి=సముద్రముయొక్క, సంపద్ధరణ=జలరూపమైన సంపత్తియొక్క హరణముచేత, సముద్ధరణ=ఆసంపత్తియొక్క పునరుద్ధరణముచేత, సమిద్ధ=ప్రకాశమానములైన, రణరజోవ్రజ=యుద్ధరంగమందలిపరాగసమూహమును, ఉద్యత్ =ఉదయించుచున్న, ఇభమద=గజమదజలముయొక్క, సృతికిన్=స్రవణముగలవానికిని, ఇది క్రమాలంకారము. సముద్రము శత్రువులకు డాఁగఁదగినగృహమైనందున రణధూళిచేత సంపద్ధరణముచేసినాఁడనియును నవనికాంతకు నాచ్ఛాదనపటమైనందున నిభమదజలప్రవాహముచేతఁ బూరించినాఁ డనియును దెలియవలయును. అలం. అతిశయోక్తి—కావ్యలింగము.

క. ధీరవివిధారిగిరిపవి, ధారికిఁ గర్ణాటకాంధ్ర•ధరణీపునరు
ద్ధారికిఁ దిరుమలదేవమ, హారాయాగ్రణికి వితర•ణామరమణికిన్. 90

ధీర=ధైర్యవంతులైన, వివిధారి = నానావిధశత్రువులనెడు, గిరి = పర్వతములకు, పవిధారికిన్ = వజ్రాయుధధరుఁడైనవానికిని, అనఁగా నింద్రుఁడైనవానికిని, కర్ణాటకాంధ్రధరణీపునరుద్ధారికిన్=కర్ణాటభూమిని నాంధ్రభూమిని మరల నుద్ధరించినవానికిని, అనఁగాఁ గర్ణాటాంధ్రదేశములు మ్లేచ్ఛులచేత నాక్రమింపఁబడియుండఁగా వారిం డ్రను జయించి తిరుగ నేలినాఁడని తాత్పర్యము. తిరుమలదేవమహారాయాగ్రణికిన్ = తిరుమలదేవరాయశ్రేష్ఠునికిని, వితరణామరమణికిన్ = దాతృత్వమందు నమరమణి యనఁగా జింతామణియైనవానికిని. అలం. రూపకము. ఉపమ.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినవసుచరిత్రం బనుమహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 91

అభ్యుదయ పరంపరాభివృద్ధిగాన్ = పైనిఁజెప్పఁబడిన తిరుమలదేవరాయనికి శ్రేయఃపరంపరలయొక్క యభివృద్ధి యగునట్టులుగా, నాయొనర్పంబూనిన = నేను రచింపఁబూనిన, వసుచరిత్రంబను మహాప్రబంధంబునకున్ = వసుచరిత్రమనెడు మహాప్రబంధమునకు, కథాక్రమం బెట్టిదనినన్ =కథయొక్క క్రమ మెట్టి దనఁగా.

## కథా ప్రారంభము

శా. శ్రీరమ్యం బగునైమిశంబునఁ దపశ్శ్రీ న్విరాజితావ్యాజతే
జోరాజుల్ శుకశౌనకాదిమునిరాజుల్ సూతుఁ జూచి ము
న్నేరాజేంద్రుఁడు దివ్యచిహ్నధరుఁడై యేలెన్ మహీమండలం
బారాజేంద్రునిఁ దెల్పు మా కన నతం డత్యంతహర్షంబునన్. 92

శ్రీరమ్యంబగు-శ్రీ = వనలక్ష్మిచేత, రమ్యంబగు=మనోహరమైన, నైమిశంబునన్=నైమిశారణ్యమందు, తపశ్శ్రీన్=తపస్సంపదచేత, రాజిత = ప్రకాశించుచున్న, అవ్యాజ = దంభరహితమైన, తేజోరాజులు = తేజస్సమూహము గలిగిన, శుక శౌనకాది మునిరాజులు=శుకుఁడు శౌనకుఁడు మొదలుగాఁగల మునిశ్రేష్ఠులు, సూతుఁజూచి = సూతునివీక్షించి, మున్ను = పూర్వకాలమందు, ఏరాజేంద్రుఁడు = ఏరాజశ్రేష్ఠుఁడు, దివ్యచిహ్నధరుఁడై = దేవతా లాంఛనములను ధరించినవాఁడై, మహీమండలంబు=భూమండలమును, ఏలెన్ = పరిపాలించెనో, ఆరాజేంద్రునిఁ దెల్పుమాకనన్ = ఆరాజశ్రేష్ఠుని మాకుఁ దెలియఁజెప్పుమని పలుకఁగా, అతండు = ఆసూతుఁడు, అత్యంతహర్షంబునన్ = మిక్కిలి సంతోషముతో. ఇది ముందరిపద్యముతో నన్వయము. తెలుపుమాకనుచోట మధ్యమపురుషైకవచన మైనందువలన ముకారాగమము రావలసినదయినను (స. 'పరేహలివికల్పేన మువర్ణః ప్రార్థనార్థకే') అను నథర్వణవచనమువల్ల హల్లుపరమగుచుండగా వైకల్పికమువర్ణము రాదయ్యె.

దృష్టాంతము:—

క. తగునే యిట్లు కృతార్థుఁడ, వగునీ కుఱి కొఱుక కిట్టు లాలస్యము సేఁ
దగుట కృతఘ్నతకును నెల, వగు టొప్పునె కొఱుకు కడకు నద్రోహుఁడవై.

(భారతము-శాంతిపర్వము.)

తా. ప్రకృతిసౌందర్యముచే మనోహరముగానున్న నైమిశవనమందు శౌనకాదిమహామునీంద్రులు సూతునిగాంచి భూమండలము నేరాజు దివ్యచిహ్నములను ధరించి పరిపాలించెనో యాతని చరిత్రమును మాకు నెఱిఁగింపుఁ డని కోరఁగా సూతుఁడు మిగుల సంతోషముతో (నిటులఁ జెప్పెను.)

శా. శక్రాపాదితదివ్యచిహ్నధరుఁడై చంచద్విమానాధిరా
జక్రీడాపరుఁడై యమానుషమహాసత్త్వాఢ్యుఁడై చేదిభూ
చక్రేశుండు ధరిత్రి యేలె వసుసంజ్ఞం దచ్చరిత్రంబు ని
ర్వక్రప్రౌఢిమ విన్నవింతు నని వాగ్వైచిత్రితో నిట్లనున్. 93

శక్ర=దేవేంద్రునిచేత, ఆపాదిత=పొందింపఁబడిన, దివ్యచిహ్నధరుఁడై = దేవతాలాంఛనములను ధరించినవాఁడై, చంచత్=ప్రకాశించుచున్న, విమానాధిరాజ = విమానశ్రేష్ఠమందలి, క్రీడా=విహారమందు, పరుఁడై=ఆసక్తుఁడై, అమానుష = మనుష్యసాధారణముగాని, మహాసత్త్వాఢ్యుఁడయి = మహాబలముచేతనధికుఁడయి, చేదిభూచక్రేశుండు=చేదిదేశాధీశ్వరుండు, వసుసంజ్ఞన్=వసువనెడిపేరుచేత, ధరిత్రియేలెన్=భూమిని బరిపాలించెను, తచ్చరిత్రంబున్ = అతనికథను. నిర్వక్రప్రౌఢిమన్ = సరళమైన ప్రౌఢిమచేత, విన్నవింతునని = విన్నపము చేయుచున్నానని, వాగ్వైచిత్రితోన్=వాక్యచమత్కృతితోడ, ఇట్లనున్ = ఈవక్ష్యమాణప్రకారముగాఁ బలికెను. తచ్చరిత్రంబు నిర్వక్రప్రౌఢిమ

నసుచో ద్రుతమునకు స్థిరమగువివర్ణము పరముగానున్నందున ('లుగ్వా ద్రుతప్రకృతికాత్పరతస్సరళే స్థిరేనస్యస్యాత్' న.) అనుసూత్రముచేత లోపము వచ్చినది. ఇచట నసుధాతువు తద్ధర్మార్థక రూపము భూతార్థమునం బ్రయోగింపఁబడెను.

తా. దేవేంద్రునివలన దివ్యచిహ్నముల నొంది విమాన సంచారియై మనుష్యాతీతశక్తిశాలియై చేదిదేశపురాజగు వసుమహారాజు భూమండలమును బరిపాలించెను. అతని చరిత్రమును మీ కెఱిం గింతు నని చిత్రవాక్కల్పనలతో సూతుఁడు మునుల కీకథ తెలుపసాగెను.

సీ. వరసుమనోభవ్య◆తరుల కావాల మత్యలఘుకలాపాలి ◆ కలరుభరణి
సరి లేనితెలిముత్తె◆సరులకోటారు కళ్యాణపరంపర◆ల తొలుదీవి
సురుచిరమణుల కా◆కరసీమ శ్రుతిహితభాషితద్విజకోటి◆పట్టుఁ గొమ్మ
సరసుల కారామ◆సరణి శ్రీరంగగేహక్రోడవాసిని ◆ కాటపట్టు
తే. వెలయునావరణాంబుసం◆వీతహాట, కాండమోహదపరిఖావృ◆తాంఘ్రివజ్ర
దంతురప్రాంతగంగాని◆రంతరాగ్ర, భూరివరణం బధిష్ఠాన◆పురవరంబు. 94

వర=శ్రేష్ఠులును, సుమనః=మంచిమనస్సుచేత, భవ్యతరులు = అత్యంతయోగ్యులు నసెడు, వర సుమనో భవ్యతరులకున్-వర=శ్రేష్ఠములయిన, సుమనః=పుష్పములచేత, భవ్య=యోగ్యములైన, తరులకున్=వృక్షములకు, ఆవాలము=పాదైనదియు, అత్యలఘు=అత్యధికములయిన, కలా = విద్యలయొక్క, పాలికలు = సమూహములనెడు, అత్యలఘు = అత్యంతఘనమైన, కలాప = భూషణములయొక్క, ఆలికలకున్=సమూహములకు, భరణి=సొమ్ములుంచెడు భరణియైనదియు,

సరిలేని=సమానము లేని, తెలిముత్తెసరుల=శుభ్రములైన ముత్యాలహారములనెడు, సరిలేని తెలిముత్తెసరుల=సమానములేని తెల్లముత్తెసరి పల్లెయొక్క, కోటారు=ధాన్యపురాసులుంచెడు స్థలమైనదియు, కళ్యాణపరంపరల = శుభపరంపరలనెడు, కళ్యాణపరంపరల = సువర్ణపరంపరలయొక్క, తొలుదీవి = జంబూద్వీపమైనదియు, (ని. 'కల్యాణ మక్షయే స్వర్ణే కళ్యాణం మఙ్గళేపిచ' అని వి.) తొలుదీవి యను టలో "జంబూప్లక్షకుశక్రౌంచ" యని తొలుదొలుత జంబూద్వీపము లెక్కింపఁబడుననియు దీవులలోఁ బేరెన్నిక గలదనియు భావము.

సురుచి=మంచికాంతిగలిగిన, రమణులు = స్త్రీలనెడు, సురుచిర = లెస్సగాఁ బ్రకాశించునట్టి, మణులకున్=రత్నములకు, ఆకరసీమ=గనియైనదియు, శ్రుతిహిత=వేదవిహితములైన, భాషిత = వాక్యములుగల, ద్విజకోటి=బ్రాహ్మణసమూహమనెడు, శ్రుతిహిత=చెవులకింపైన, భాషిత=పలుకులుగల, ద్విజకోటి=శుకపికాది పక్షిసమూహముయొక్క, పట్టుఁగొమ్మ=అవలంబశాఖయైనదియు,

సరసులు = శృంగారాదిరసజ్ఞులనెడు, సరసులకున్ = సరస్సులకు, ఆరామసరణి=ఉద్యానవాటికయైనదియు, శ్రీరంగగేహక్రోడవాసినికిన్ - శ్రీరంగగేహ = శ్రీరంగమేమందిరముగాఁగల విష్ణుమూర్తియొక్క, క్రోడవాసినికిన్=వక్షస్స్థలవాసినికి, అనఁగా లక్ష్మికి, లక్ష్మియనెడు, శ్రీరంగగేహక్రోడవాసినికిన్-శ్రీ=శోభాయుక్తమైన. రంగగేహక్రోడవాసినికిన్ = నాట్యమందిరాంతరవర్తిని యగు నర్తకికి, ఆటపట్టు=నాట్యస్థానమైనదియుఁ, (ని. 'ననా క్రోడంభుజాన్తరం' అని అ.)

ఆవరణాంబు=మహాజలముచేత, సంవీత = ఆవరింపఁబడిన, హాటకాండ = హిరణ్మయమైనబ్రహ్మాం

డమోయనునట్టి, మోహద = భ్రాంతి గలుగఁజేయుచున్న, పరిఖావృతాంఘ్రి-పరిఖా = అగడ్తచేత, వృత=పరివేష్టింపఁబడిన, అంఘ్రి=అడుగుమట్టు గలిగినదియు, వజ్రదంతురప్రాంత = వజ్రమణులచేతఁ జెక్కఁబడిన పార్శ్వభాగము గలిగినదియు, గంగానిరంతరాగ్ర - గంగా = ఆకాశగంగతోడ, నిరంతర=ఎడములేకయున్న, అగ్ర=అగ్రభాగము గలిగినదియు, భూరి = సువర్ణమయమయిన, వరణంబు = కోటగలిగినదియు, (ని. 'స్వర్ణేపి భూరి' అని అ.) (ని. 'ప్రాకారో వరణస్సాలః' అని అ.) అధిష్ఠాన పురవరంబు=అధిష్ఠాన మనెడు పట్టణశ్రేష్ఠము, వెలయున్=ప్రకాశించును.

ఇందు శ్లిష్టరూపకము. అందు కలాపాలికలు సురుచిరమణులు అన్న రెండు చోట్ల శబ్దశ్లేషము. తక్కినది యర్థశ్లేషము. ఆకరసీమేత్యాదులయం దుల్లేఖాలంకారము. రెంటికి సంకరము.

తా. అధిష్ఠానపురము పూవుఁదీగలకు, బుద్ధిమంతులకు, విద్యలకు, విభూషణములకు, శుద్ధ మౌక్తికములకు, తెలిముత్తెములకు పద్మకు, శుభములకు, సువర్ణమునకు, ప్రకాశవంతములగు మణులకు, సుందరాంగులకు, విద్యావంతులగు విప్రులకు, విహగరాజములకు, సరసులకు, సరోవరములకు, లక్ష్మికి, నక్తకరాంద్రకు నునికిపట్టై పరిఖాజలముచేతను పార్శ్వభాగ వజ్రకాంతులచేతను అగ్రభాగమునందు సందు లేకున్న గంగాజలముచేతను నావరింపఁబడిన బంగారపుకోట మహాజలముచేత నావరింపఁ బడిన హిరణ్మయమైన బ్రహ్మాండమువలె నొప్పుఁ దనరారును.

చ. అలఘుతరగ్రహాంశుగుణితాగణితాభినుతాగ్రరత్నకం
దళరుచిఁ బొల్చువీటివరణంబు గతావరణం బొనర్ప ని
చ్చలు నలకోటకొమ్మబలుసందులపొందుల నేగఁగాఁ జుమీ
యలవఱచెం బతంగుఁ డసహాయరథాంగముగా శతాంగమున్. ౯౫

అలఘుతర=మహత్తరములైన, గ్రహాంశు = సూర్యాదినవగ్రహకాంతులచేత, గుణిత = రెట్టింపఁ జేయఁబడిన తత్తద్గ్రహసమానవర్ణములు గలిగినవియు, అగణిత = ఎన్నశక్యముగానియవియు, అభినుత = మిక్కిలిపొగడఁదగినవియునగు, అగ్రరత్నకందళరుచిఁబొల్చు = అగ్రభాగమందలి పద్మరాగాది రత్నాంకురముల కాంతిచేత నొప్పుచున్న, వీటివరణంబు = అధిష్ఠానపురముయొక్క కోట, గతావరణం బొనర్పన్=గతమనఁగా గతి, దానికి (నావరణ మనఁగా నిరోధము) గతి నిరోధము సేయఁగా, నిచ్చలున్=నిరంతరమును, అలకోటకొమ్మబలుసందులపొందుల నేగఁగాఁజుమీ = ఆకోటకొమ్మలయొక్క బలమైనసందులవెంబడిగాఁ బోవుటకేసుమీ, పతంగుఁడు=సూర్యుఁడు, శతాంగమున్ = రథమును. ని. 'శతాఙ్గ స్స్యన్దనో రథః' అని అ. అసహాయరథాంగముగాన్ = జతలేనియొంటిబండికల్లు గలదానినిగా, అలవఱిచెన్ = పనుపఱిచెను, గ్రహాంశుగుణిత, అన్నచోట గ్రహమండలము నంటియున్నందున సూర్యాంగారకులు రక్తవర్ణముగలవారును శుక్రచంద్రులు శ్వేతవర్ణము గలవారును గురుబుధులు పీత వర్ణముగలవారును శని నీలవర్ణముగలవాఁడును రాహుకేతువులు ధూమ్రవర్ణముగలవారునని చెప్పి యున్నది గనుక నాయాగ్రహకాంతులచేత నాయావర్ణసామ్యముగల పద్మరాగాదిమణులకాంతు లినుమడింపఁబడినవని యర్థము. శ్లో. 'భాస్కరాఙ్గారకౌ రక్తౌ శ్వేతౌ శుక్రనిశాకరౌ, గురుసోమాత్మజౌ పీతౌ కృష్ణవర్ణశ్శనిస్తథా, రాహుకేతూ ధూమ్రవర్ణౌ గ్రహవర్ణాః ప్రకీర్తితాః.' అని నవగ్రహవర్ణము లకు లక్షణము. నవరత్నములకును తత్తద్వర్ణసామ్యమూలకముగా నవగ్రహము లధిదేవతలు. ఎట్లనఁ

గా, శ్లో. 'మాణిక్యం తరణేః సుజాతమమలం ముక్తాఫలం శీతగో ర్మాహేయస్యతు విద్రుమో మరకతం సౌమ్యస్య గారుత్మతమ్, దేవేజ్యస్య తు పుష్పరాగ మసురామాత్యస్య వజ్రంశనే ర్నీలం నిర్మల మన్య యోశ్చ కథితే గోమేధ వైదూర్యకే' అని ప్రమాణము. అలం. ఫలోత్ప్రేక్ష.

సూర్యుఁడు పతంగుఁడు (పక్షి) గాన కొమ్మలసందునఁ బోవ సాగెను. సూర్యగమన నిరోధి యగుటచేఁ గోటపైఁగల రత్నములకాంతి సూర్యకాంతి నెంతయో యతిశయించి యుండె ననుట. సూర్యునకు గమన నిరోధ మొకనాటిది కాదు. నిచ్చలుఁ జరుగునది. కావుననే యసహాయరథాంగమును జేసికొనెను.

తా. నవగ్రహాదుల కాంతులచేఁ బ్రతిష్ఠానపురపుఁ గోటపైఁగల రత్నములకాంతులు పైకి వ్యాపింప సూర్యుఁ డాకాంతిపుంజమునుండి పోవఁజాలక కోటకొమ్మల సందులనుండి యెటులో పోవుటకు అసహాయచక్రముగల రథము నేర్పఱచుకొని ప్రయాణ మలవఱచికొనెను.

చ. పురిపరిఖామహాంబునిధి భూరిగభీరతరాంబుపూరముల్
సరభసవృత్తిఁ జొచ్చి బలిసద్మతలం బతలం బొనర్పఁగాఁ
జరణకృతప్రచారములు సాగవు వీరికి నంచు నబ్జజుం
డురగులఁ జేసెఁ బన్నగకులోద్భవులన్ వడిఁ దేలి యాడఁగన్. 96

పురి = అధిష్ఠానపురసంబంధమైన, పరిఖా = అగడ్తయనెడు, మహాంబునిధి = మహాసముద్రము యొక్క, భూరి=అతిశయమును, గభీరతర=మిక్కిలిలోఁతునైన, అంబుపూరములు=జలప్రవాహములు, సరభసవృత్తిఁజొచ్చి = వేగముతోఁజొరఁబారి, బలిసద్మతలంబు=రసాతలమును, (ని. 'అధోభువన పాతాళ బలిసద్మరసాతలమ్' అని అ.) అతలంబొనర్పఁగాన్ = స్వరూపరహిత మైనదానిఁ జేయఁగా నని యర్థము. (ని. 'అథస్వరూపయోరస్త్రీతలమ్' అని అ.) అతలమనఁగాఁబాతాళము గనుక నిక్కడ స్వారస్యము గ్రహింపవలయును. (శ్లో. 'భూపా పేటీభువనమతలమ్') ఇత్యాది ప్రయోగములు విచారింపవలయును, చరణకృతప్రచారములు సాగవువీరికినంచున్ = వీరికి ననఁగా నీసర్పములకు, చరణకృత ప్రచారములు=పాదములచేతఁ జేయఁబడిన సంచారములు, సాగవు=జరుగనేరవు, అంచున్=అని విచారించి, అబ్జజుండు=బ్రహ్మదేవుఁడు, పన్నగకులోద్భవులన్=సర్పకులసంభవులను, వడిఁ దేలియాడఁగన్= వడిగా నీటిపైఁ దేలియాడెడుకొఱకు, ఉరగులఁజేసెన్ = ఉరముచేత నడచువారిఁగాఁ జేసెను. పన్నగ పదంబు సాభిప్రాయ మని తెలియవలయును. ('ఉరసాగచ్ఛంతీత్యురగాః పద్భిః నగచ్ఛంతీతిపన్నగాః' అని వ్యుత్పత్తులు.) అలం, అతిశయోక్తి. ఉత్ప్రేక్ష. నిరుక్తి.

పన్నగకులోద్భవుల నురగులఁ జేసెననుటవలనఁ దొలుత నడువనే లేకుండి రనియు నిందులకుఁ బాతాళ మతల మగుటయే కారణమనియు ఉరగులగుటచే నిపుడు దేలియాడఁగలిగిరనియు భావము. పరిఘాజలము మహాంబుధిరూపముగను గభీరాంబుపూరరూపముగ నుండుటవలననే బలిసద్మము సరభసవృత్తిఁ జేరఁగలిగెను.

తా. అధిష్ఠానపురపు అగడ్త మిగుల లోతు గలిగి పాతాళలోకమువఱకు నుంటచే నందలిజలము పాతాళలోకమునంతట నిండి యతలము (ప్రదేశము లేనటుల) గావింప నచట నుండు పన్నగములు నడువఁజాలకుంటచే బ్రహ్మ కరుణించి యురగములుగా (ఉరముతోఁ బోవువానిగా)ఁ జేసెను. కావుననే నీళ్లపైఁ దేలి యాడుచు నురముతోఁ బాములు పోవుచున్నవి.

మ. చతురాస్యు ల్పురుషోత్తము ల్బుధగురు • ల్సర్వజ్ఞమూర్తు ల్మహా
శతమన్యు ల్శుచిధర్మపుణ్యజనతా • శ్లాఘ్యు ల్ప్రచేతు ల్సదా
గతు లక్షీణనవార్థకర్తలు కళా • కాంతు ల్జగద్బంధు లా
క్షితిదేవు ల్పురి దేవతామహిమలం • జెన్నొందుట ల్చిత్రమే. 97

ఈపద్యములో నధిష్ఠానపురమందలి బ్రాహ్మణులయందు దేవత్వమారోపించి యర్థద్వయమునకు నభేదాధ్యవసాయముగాఁ జెప్పినాఁడు. అదియెట్లనఁగా, చతురాస్యుల్ = ఆస్యమందుఁ బుట్టినది యాస్యము, అనఁగా వాక్యము, చతురములైన (అనఁగాఁ బ్రౌఢములైన) వాక్యములు గలవారును అని యర్థము, చతురాస్యుఁడనఁగా నాలుగుముఖములు గలవాఁడు బ్రహ్మగనుక బ్రహ్మలని యర్థాంతరము. పురుషోత్తముల్ = పురుషశ్రేష్ఠులనియర్థము, విష్ణుమూర్తులని యర్థాంతరము. బుధగురుల్ = పండితులైనవారికిని గురువులు, (అనఁగా హితాహితోపదేష్టలనియర్థము.) బుధబృహస్పతులని యర్థాంతరము. సర్వజ్ఞమూర్తుల్ = సకలము దెలిసినవారని యర్థము. రుద్రమూర్తులనియర్థాంతరము. మహాశతమన్యుల్ = మహత్తరములైన యనేకయజ్ఞములు చేసినవారని యర్థము. మహేంద్రులనియర్థాంతరము. శుచిధర్మ = పవిత్రతచేతను, పుణ్యజనతా = సుజనత్వముచేతను, శ్లాఘ్యులు = కొనియాడఁదగినవారని యర్థము, అగ్ని యమ నిరృతు లని యర్థాంతరము. ప్రచేతుల్ = ప్రకృష్టమైన మనస్సుగలవారని యర్థము, వరుణులని యర్థాంతరము. (ని. 'ప్రచేతావరుణః పాశీ' అని అ.) సాంతపదాంత సకారమునకు వికల్పము చేత లోపము గలదు గనుక నిక్కడ లోపము వచ్చినది. (సాంతపయః ప్రభృతేస్లోపో న్యేషాంప ప్రయోగమహితానామ్' అని న.) సదాగతులు = శ్రేష్ఠమైన యోగమనముగలవారని యర్థము, వాయుదేవులని యర్థాంతరము. అక్షీణ = క్షీణముగాని, నవ = నూతనమైన, అర్థకర్తలు = అర్థకల్పనములు చేయువారని యర్థము, నవార్థములనఁగా నవసంఖ్యగలనిధులు వానికిఁ గర్తలనఁగాఁ గుబేరులని యర్థాంతరము. (ని. 'అర్థోభిధేయరైవస్తు ప్రయోజననివృత్తిషు' అని అ.) అక్షీణసదర్థకర్తలని పాఠాంతరము. కళాకాంతుల్ = విద్యలకధిపతులని యర్థము, చంద్రులని యర్థాంతరము. జగద్బంధులు = జగజ్జనుల కాప్తులని యర్థము, సూర్యులని యర్థాంతరము. (ని. 'ఖద్యోతో లోకబాన్ధవః' అని అ.) ఇట్టివారైన, ఆక్షితిదేవుల్ = ఆబ్రాహ్మణులు, పురిన్ = పట్టణమందు, దేవతామహిమలన్ = దేవప్రభావములచేత, చెన్నొందుటల్ = ఒప్పుచుండుటలు, చిత్రమే = ఆశ్చర్యమా. అనఁగా శబ్దశ్లేషచేత ప్రాప్తములైన బ్రహ్మాదిదేవతాధర్మములుగల బ్రాహ్మణులు దేవతామహిమలచేతఁ జెన్నొందుట యేమి వింత యని యర్థము. అలం. శ్లేష. కావ్యలింగము.

తా. ఆపురమందలి బ్రాహ్మణులు విద్యలందు నేర్పరులై పురుషశ్రేష్ఠులై పండితులకుఁ గూడ గురువులై పుణ్యాత్ములై బుద్ధిశాలులై యజ్ఞరతులై దేవతామహిమలతో నుండిరి. (పురబ్రాహ్మణులు బ్రహ్మస్వరూపులు శివస్వరూపులు బృహస్పతి శుక్రస్వరూపులు నయి క్షితిదేవులు గావునదేవతాస్వరూపముతో నలరారుచుండి రని యర్థాంతరము.)

సీ. పగలైనఁ దెల్విఁ గో • ల్పడనిరాజులు శరంబులు చన్న వెలవెలఁ • బోనిఘనులు
ధనదాశఁ గేలుమో • డ్పనిసార్వభౌమాంకు లనివెన్కముందుఁ జూ • డనికుమారు
లరి మెచ్చఁ గరములు • నెరపనియినులు లాఁకుమనవాలుమఱువని • పురుషసింహు
లనయంబు నడకఁ ద • ప్పనిగోత్రపతు లెప్పుడును సోదరము లేని • యనఘభోగు

తే. లారవీరనవీరస•మైకపరులు, వరలుదురు వీటఁ బుష్పవ•ద్వంశ్యు లగుటఁ
గువలయాధారకమలాను•గుణవిహార, సారసౌజన్యధరులు రా•జన్యవరులు. 98

ఈపద్యమునందు నధిష్ఠానపురమందలి రాజుల నభివర్ణించి చెప్పినాఁడు. పగలైనఁ దెల్వి గోల్పడనిరాజులు, పగలనఁగా విరోధములును దివాభాగమును, రాజులనఁగా క్షత్రియులుఁ జంద్రులును, తెల్వియనఁగా ముఖవికాసంబును గాంతియును, పగలైనన్ = విరోధములు ప్రసక్తమయినను, తెల్విఁ గోల్పడని=ముఖకాంతిఁదప్పని, రాజులు=రాజులైన క్షత్రియులు అనియర్థము. ఇందువలన రాజైన చంద్రుఁడు విరోధము ప్రసక్తమైనప్పుడు ముఖకాంతి దప్పెడువాఁడని తెలియఁబడుచున్నది. దివాభాగమందుఁ జంద్రుఁడు కాంతిహీనుఁడగుచున్నాఁడని భావము. ఇక్కడ నభేదాధ్యవసాయమూలకమైన వ్యతిరేకాలంకారము. ఉత్తరత్ర యీరీతిగా గ్రహింపవలయును. శరంబులు చన్న వెలవెలఁ బోని ఘనులు-శరములనఁగా బాణములును నీళ్లును, ఘనులనఁగా నధికులును మేఘములును, శరంబులు చన్నన్= బాణములు చెల్లిపోఁగా, వెలవెలఁబోని=తెల్లపోకయుండెడు, ఘనులు=అధికులైనరాజులు అని యర్థము. ఘనులైన మేఘములు బాణములు చెల్లిపోఁగానే తెల్లపోవునట్టి వనుట. ఉదకములు వర్షింపఁబడఁగా మేఘములు తెల్లఁబడుచున్నవని భావము.

ధనదుఁడనఁగా ధనమిచ్చువాఁడును గుబేరుఁడును, ఆశయనఁగాఁ దృష్ణయును దిక్కును, సార్వభౌముఁడనఁగాఁ జక్రవర్తియును నుత్తరదిగ్గజమును, (ని. 'ఆశాతృష్ణాదిశా ప్రోక్తా' అని వి.) (ని. 'సార్వభౌమ స్సర్వపృథ్వీపాలకే దిగ్గజాన్తరే' అని నా.) ధనదాశ=ధనమిచ్చువానియందలి యాశచేత, కేలు మోడ్పని=చేయిముడుచుకొని యాచింపని, సార్వభౌమాంకులు=చక్రవర్తిచిహ్నములు గలవారని యర్థము. సార్వభౌమనామక దిగ్గజము ధనదాశచే హస్తముపట్టి యడుగుకొనునది యనుట, కుబేరుని దిక్కునఁ దుండము ముడిచికొనియున్నదని భావము. కుమారుఁడనఁగా=రాజకుమారుఁడును గుమారస్వామియును, అనిన్=యుద్ధమందు, వెన్కముందుఁజూడని=సంకోచింపని, కుమారులు=కోమరు ప్రాయముగల రాజులని యర్థము. కుమారస్వామి యుద్ధమందు వెనుకముందు చూచువాఁడనుట, షణ్ముఖుఁడు ముందు మూఁడుముఖములతోడను వెనుక మూఁడుముఖములతోడను జూచునని భావము.

అరియనఁగా శత్రువును జక్రవాకమును, కరములనఁగాఁ బన్నులును గిరణములును, ఇనుఁడనఁగాఁ బ్రభువును సూర్యుఁడును, అరమనఁగాఁజక్రాంగము. (ని. 'అరంశీఘ్రేచచక్రాఙ్గే' అని వి.) అరాణ్యస్య సంతియసెడు వ్యుత్పత్తిచేత నరియనఁగా బండిగారెకుఁ బేరు గనుకను బండిగారెపేళ్లన్నియుఁజక్రవాకములకుఁ జెల్లునుగనుకను నిక్కడ నరిశబ్దము చక్రవాకములయందును వర్తించుచున్నది. (ని. 'కోక శ్చక్ర శ్చక్రవాకో రథాఙ్గాహ్వయ నామకః' అని అ.) (ని. 'బలిహస్తాంశవః కరాః' అని అ.) (ని. 'ఇనస్సూర్యే ప్రభౌ రాజ్ఞి' అని అ.) అరిమెచ్చన్=శత్రువు మెచ్చునట్లుగాఁ బన్నులియ్యని ప్రభువులని యర్థము. ఇనుఁడైన సూర్యుఁడు శత్రువు మెచ్చునట్లుగాఁ బన్నిచ్చువాఁడనుట, సూర్యుఁడు చక్రవాకము మెచ్చునట్లుగాఁ గిరణప్రసారణము సేయుచున్నాఁడని భావము. వాలు అనఁగాఁ గత్తి, పురుషసింహుఁడనఁగాఁ బురుషశ్రేష్ఠుఁడును, నరసింహుఁడును, ఆలమునన్ = యుద్ధమందు, వాలు మఱువని = కత్తియేమఱని, పురుషసింహులు = పురుషశ్రేష్ఠులని యర్థము. నరసింహుఁడు యుద్ధమందుఁ గత్తి యేమఱినవాఁ డనుట. నరసింహుఁ డాయుధములేకయే హిరణ్యకశిపుని వధించినాఁడని భావము.

నడక యనఁగా నడవడియు, సంచారమును, గోత్రపతులనఁగాఁ గులపతులును బర్వతశ్రేష్ఠములును, అనయంబుꣳ = సర్వకాలమును, నడకఁదప్పని=నడవడిఁదప్పని, గోత్రపతులని=కులపతులని యర్థము. గోత్రపతులైన పర్వతశ్రేష్ఠములు నడవడి దప్పినవనుట. పర్వతము లెప్పుడును సంచారములేక యుండునని భావము. సీదర మనఁగా శృంగారభావంబును కుబుసమును, భోగులనఁగా రాజులును సర్పములును, (ని. 'భోగీ భుజఙ్గమే రాజ్ఞి' అని వి.) ఎప్పుడును = ఏసమయమందును, సీదరములేని = తోఁతగొట్టుతనములేని, అనఘభోగులు=భోగపరులైన రాజులనియర్థము. సర్పములెప్పుడును సీదరముగా నుండునవియనుట. పాములు నిరంతరమును గుబుసము గలవియనియును భావము.

పౌరవీరనꣳ=పౌరావీరు అనునట్లుగా, వీరనయైకపరులు = వీరనీతియందు ముఖ్యాసక్తిగలవారును, పుష్పవద్వంశ్యులగుటꣳ = పుష్పవంతులనఁగాఁ జంద్రసూర్యులు, (ని. 'ఏకయోక్త్యాపుష్పవంతౌ దివాకరనిశాకరౌ' అని అ.) వారివంశమందుఁ బుట్టినవారు పుష్పవద్వంశ్యులు, పుష్పవద్వంశ్యులగుటవల్ల, కువలయ=కలువలకు, ఆధార =ఆధారమైనదియు, కమలానుగుణ = పద్మముల కనుకూలమైనదియునగు, విహార = సంచారములుగలవారనియు, పుష్పవంతులవంశమందుఁబుట్టినవారుగనుకఁ బుష్పపరిపాలనము సేయుచున్నవారనియు నర్థద్వయము. కువలయమనఁగా భూవలయము, కమల అనఁగా లక్ష్మియుఁ గావున భూవలయాధారరాజ్యలక్ష్మ్యనుగుణవిహారములు గలవారని భావము. సారసౌజన్యధరులు=యోగ్యమయిన సుజనత్వమును వహించినవారునయిన, రాజన్యవరులు=రాజశ్రేష్ఠులు, వీటꣳ = అధిష్ఠానపురమందు, వరలుదురు=ప్రకాశింతురు.

ఇచట రాజఘనాదిపదములు శ్లేషించుటచేఁ బ్రకృతమాత్రమందు విశ్రమించిన శక్తిగలవైనను బగలైనఁజెల్వఁగోల్పడనీత్యాది వ్యతిరేకవిశేషముల సామర్థ్యముచేఁ దోఁచుచున్నచంద్రమేఘాదులయందు వైరకాలవైరూప్యాదిదోషములు దోఁచుటచేత రాజులయందుఁ జంద్రాది ప్రతియోగికవ్యతిరేకము దోఁచుచున్నది. అలం. వ్యతిరేకాలంకారధ్వని. సమాలంకారము.

తా. ఆపురమందలి రాజకుమారులు సూర్యచంద్రవంశజులు, భూభరణసమర్థులు, లక్ష్మీవిహితప్రవర్తనులును. ఇంతియకాక యెంతవిరోధమందేని ప్రతిభఁ గోల్పోవరు. బాణములుముగిసినను తెల్లఁబోరు. ఎన్నఁడును యాచింపరు. సంగరమున ముందువెనుకలు చూడరు. పన్నులు విశేషముగా విధింపరు. సంగరమునఁ గత్తి యేమఱరు. నీతిని దప్పరు. వారినడవడిలో తోఁతగొట్టుతన మనునది లేదు.

చ. చెలిపులిగూడు మానుపని శ్రీదుని గాదని మిత్రు నక్షయో
జ్జ్వలవసుఁ జేయ మిత్రవసుసంపద కైనఘనావరోధము
న్వెలివడఁ జేయనేర్తురు మణీవిపణీతపనీయరాశిపే
శలరుచిఁ గోటికోటివిలసద్ధ్వజకోటిఁ బురీకిరాటకుల్. ౧౨

చెలి=స్నేహితుఁడైన వానియొక్క, పులిగూడు = భిక్షాన్నమును, మానుపని = విడిపింపలేని, శ్రీదునిꣳ=కుబేరుని, కాదని=నిందించి, ఇక్కడ శ్రీదశబ్దము సాభిప్రాయము. పురీ=అధిష్ఠానపురమందలి, కిరాటకుల్ =వర్తకులు, మణీవిపణీ = రత్నమయములైన యంగడివీథులయందలి, తపనీయరాశి = సువర్ణరాసులయొక్క, పేశలరుచిన్=నిద్దంపుకాంతిచేతను, కోటికోటి=ప్రతికోటిఘనమందును, ఈశబ్దము లాక్షణికము. విలసత్ = ప్రకాశించుచున్న, ధ్వజకోటి=పడగలసమూహముచేతను, మిత్రుꣳ = స్నేహితుఁ

డైనసూర్యుని, అక్షయ = క్షయములేనిదియు, ఉజ్జ్వల = ప్రకాశమానమైనదియునగు, వసు=ధనము గలవానిఁగా, చేయన్ =చేయుటకును, మిత్రవసుసంపదకైన ఘనావరోధము స్వాలివడఁజేయన్ =అతని ధనసంపదకువచ్చిన ప్రబలవిరోధమును బోఁగొట్టుటకును, నేర్తురు=సమర్థులౌదురని యర్థము. (ని. 'మిత్రంసుహృదిమిత్రోఽర్కః' అని వి.) సుహృద్వాచకమైనమిత్రశబ్దము నిత్యనపుంసకమైనను బుంలింగ ప్రయోగంబును గలదు. (ని. 'క్వచిదర్థవిశేషేతుక్లీబేప్యుభయలిఙ్గతా') అని యథర్వణవచనము. (ని. 'దేవభేదే నరే రశ్మౌ వసూరత్నే ధనే వసు' అని అ.)

అనఁగానిష్టాహాస్త్యనిష్ట పరిహరరూప ఫలద్వయ సంపాదకులౌదురనుట. సువర్ణరాసులయొక్క నిద్ధమైనకాంతిచేతను, నక్షయోజ్జ్వల వసుఁజేయననఁగా నక్షయరశ్మివంతునిఁ జేయను, రశ్మికిఁ దటస్థమైన ఘనావరోధముననఁగా మేఘావరోధనమును, కోటికోటివిలసద్ధ్వజకోటిచేతను, అనఁగా ధ్వజపట జనితవాయువులచేతఁ బోఁగొట్టనేర్తురనిభావము. అనఁగా నాపట్టణమందుండెడుకోమట్లు సూర్యమండల మేఘమండలములపర్యంతము వ్యాపించియుండెడు సువర్ణరాసులును ధనరాసులును గలిగి కుబేరునిఁ దిరస్కరించుచున్నారని తాత్పర్యము. ఇచటఁ గోమట్లనుఁ గుబేరునికంటె నాధిక్యమును వర్ణించుటవలన వ్యతిరేకాలంకారము.

తాను శ్రీదుఁడయ్యుఁ జెలికాని భిక్షావృత్తి బోఁగొట్టలేమి లోపము. కానసే వానిఁ దిరస్కరించి మిత్రునకు వసుసంపదఁ గూర్చిరి. అంతఁబోక ఘనావరోధములఁ దొలఁగించిరి. కానపురీకిరాటులు మిత్రజనోపకారులు. ఇంతియేగాక వారికోటు లపరిమితిగలధనరాసులుగూడఁ గోటులైయున్నవిగాన నైశ్వర్యమునను మిన్నలె.

తా. కుబేరుఁడు తనచెలికాఁడగు శివుఁడు భిక్షాన్న మారగించుట నివారింపనందులకుఁ బుర వైశ్యులు నిరసించి తాము మిత్రునకు (సూర్యునకుఁ జెలికానికి) వసునంపద (కిరణసమృద్ధిధనము)తమ సువర్ణరాసులకాంతులచే సమకూర్చి వారికిఁగల్గు మేఘములవలని (గొప్పవియగు) నిర్బంధములు కోటలపై నెత్తిన టెక్కెముల సాహాయ్యమున నివారింపఁగలిగిరి.

మ. బలిచూడామణు లందు విష్ణుపదజుల్ ♦ వాటించు ధాన్యంపుఁది
ప్పలు చంద్రామృతసాంద్రసేకమునఁ బై ♦ పై మోసు లెత్తంగఁ ద
త్కులమాంకూరపుఁబంపు మేయు నెలజింకన్ సారె వారించు. వా
రలతోఁబుట్టువు గంగ పద్మముఖని♦ర్యద్భృంగనాదార్భటిన్. 100

బలిచూడామణులు=బలవంతులలో శ్రేష్ఠులైన యని యర్థము. శూద్రులు విష్ణుపదజులుగనుక బలిచక్రవర్తి శిరోభాగము విష్ణుపాదాక్రాంతమైనందున దానికిఁ జూడారత్నములని ప్రకారాంతరము. విష్ణుపదజుల్ =శూద్రులు, అందనెడుపదము తత్రార్థమైన దేశ్యపదము. (న. 'సాశ్రయానాశ్రయాపి స్యాత్తత్రార్థగతసప్తమీ' అని యథర్వణోక్తి.) అందున్ =ఆ పట్టణమందు, పాటించు=రచించునట్టి, ధాన్యంపుఁదిప్పలు=ధాన్యరాసులు, చంద్రామృతసాంద్రసేకమునన్ = చంద్రసంబంధమైన యమృతము యొక్క దట్టమైన తడుపుటవలన, పైపై మోసు లెత్తంగన్ =పైపైని మొలక లెత్తఁగా, తత్కులమాంకూరపు=ఆవరియొక్క పైరుయొక్క, పంపు=ప్రదేశమును, మేయు=తినునట్టి, నెలజింకన్ =చంద్రునిలో నున్న జింకను, వారలతోఁబుట్టువు=ఆ శూద్రులకుఁ దోడఁబుట్టినదైన, అనఁగా శూద్రులును గంగయును విష్ణుపాదమందుఁ బుట్టినారుగనుక వారలతోఁబుట్టువని చెప్పినాఁడు, గంగ=ఆకాశగంగ,

పద్మముఖ=పద్మమనెడు ముఖములవలన, నిర్యత్ = బయలువెడలుచున్న, భృంగనాద = తుమ్మెదల యొక్క ఝంకారమనెడు, ఆర్భటిన్ = అంతుచేత, సారెన్ = మాటిమాటికిని, వారించున్ = మేయకుండఁ దోలును, అనఁగా నాపట్టణమందుండు శూద్రులు పండించుధాన్యరాసులు చంద్రమండలము నంటి యుండు ననుట. విష్ణుపదజుల్పండించు, అని పాఠాంతరము. అలం—కావ్యలింగము.

చంద్రుఁడు ప్రకాశించుటయుఁ దామరపూవులు వికసించుటయు నేకకాలమునందు జరుగ వనియుఁ గవి రెంటి నేకకాలమునఁ జెప్పుట యొకదోషమనియుఁ గొందఱందురు. కాని యట్టిదోషమున కిట నవకాశములేదు. (ముకుళించిన) తామరపూవులనుండి తుమ్మెదలధ్వని బయలువెడలుట చెప్పఁబడు టచే నిది యుక్తియుక్తము.

తా. ఆపురమునందలి శూద్రులు ధాన్యరాసులు చంద్రమండలము నంటునటులఁ బోయఁ జంద్రామృత సేకమునఁ బైభాగమున మొలకలెత్తెను. చంద్రునియందలి లేడి యామొలకల మేయఁ బోవ శూద్రులతోఁబుట్టువగు గంగ పద్మముఖమునుండి వెలువడు తుమ్మెదల నాదముచే నాలేడిని వారింప సాగెను.

చ. పరబలభంగచంగము ల•భంగురతుంగమతంగజంబు ల
ప్పురిఁ బరికీర్ణకర్ణపుట•పూరితభూరితరానిలాహతి
న్విరియఁగఁ దోల మేఘములు • నింగిఁ దొఱంగి తదంఘ్రిమూలముల్
శరణము నందఁ బోలు ననిశంబు పదంబుమదంబు పేరిటన్. 101

పరబల = శత్రుసైన్యముయొక్క, భంగ=భంగక్రియయందు, చంగములు = సమర్థములై నట్టియు, అభంగుర=జయవిపర్యయములేనట్టియు, తుంగ=అత్యున్నతములైనట్టి, మతంగజంబులు = ఏనుఁగులు, అప్పురిన్=ఆపట్టణమందు, పరికీర్ణ=మిక్కిలివ్యాప్తమైనదియు, కర్ణపుటపూరిత=చేటపలవంటి కర్ణద్వయముచేత నిండింపఁబడినదియు, భూరితర=అత్యధికమైనదియునగు, అనిల=వాయువుయొక్క, ఆహతిన్ = తాఁకుడుచేత, విరియఁగన్ = విచ్చిపోవునట్టులుగా, తోలన్ = పారఁగొట్టఁగా, మేఘములు = మొయిళ్లు, నింగిఁదొఱంగి = ఆకాశమునువిడిచి, తదంఘ్రిమూలముల్ = ఆయేనుఁగుల యొక్క పాదములనుగూర్చి, శరణమునందఁబోలున్ = శరణుఁజొచ్చియుండఁబోలును. ఏలాగనిన, అనిశంబు=నిరంతరమును, పదంబుమదంబుపేరిటన్ = పాదములవలనఁబుట్టెడు మదవ్యాజముచేత, శరణము నందఁబోలునని సంబంధము. ఏనుఁగులకుఁ గపోలద్వయాదులైన యష్టస్థానములయం దష్ట మదములు పుట్టుచున్నవనియు నందుఁ బాదములయందు మేఘమను మదముపుట్టుచున్నదనియుఁ దెలి యునది. ఇందుకు—

శ్లో. 'దానం కపోలయో స్సిద్ధురక్ష్ణో శ్ళ్రోత్యోస్తుసాగరః
కరాగ్రే శీకర స్సిక్యం స్తనాగ్రే మేహనే మదః
హృదయే ఘర్మసలిలం మేఘస్తు చరణవ్రజే
సంజ్ఞయాష్టమదా హ్యేతే జాయన్తే భద్రదన్తినామ్.'

అని యమరశేషమునఁ జెప్పఁబడియున్నది. అనఁగా నాపట్టణమందలి యేనుఁగులు మేఘ మండల పర్యంతమైన పొడవు గలిగి యున్న వని యాశయము. అలం. అతిశయోక్తి. ఉత్ప్రేక్ష. అపహ్నవము.

తా. విరోధులబలములను రూపు మాపు నాపురమాతంగములు చెవిగాడ్పులతో నింగినున్న మేఘములను విరియఁదోల నవి (యేనుఁగుల పాదములను బుట్టుమదజలము పేరు మేఘము గావున) మద వ్యాజమున నేనుఁగులను శరణు గోరుచుండవచ్చును.

మహాస్రగ్ధర. పరభూభృత్ప్రాప్తినబ్ధిం • బడురవిహారులం • బ్రౌఢిఁ బాటింప వెందుఞ్
సరిగాఁ దద్ధిక్కృతు ల్లైన్యచక రవి హారి య్యై • చాయకుఞ్ రా నడంచుం
జరణోద్యద్ధూళిఁ దద్వాసతఁ దగుహారియుఞ్ • సప్తిగాఁ బాదధారా
స్ఫురణం బేవింత యంచుం • బురిహారులు నగుం • బూర్ణధారాసమృద్ధిన్. 102

ఈపద్యమున నధిష్ఠానపురమందలి యశ్వములవర్ణించినాఁడు. ఏలాగనిన, పురి=ఆపట్టణ సంబంధమైన, హారులు = గుఱ్ఱములు, పరభూభృత్ప్రాప్తిన్ = శత్రురాజప్రాప్తివలన (భయపడి), (ని. 'భూభృద్భూమిధరే నృపే' అని అ.) అబ్ధింబడు=సముద్రములోఁ బడునట్టి, రవిహారులన్ = సూర్యాశ్వములను, ప్రౌఢిన్=ప్రౌఢిమచేత, సరిగాన్=తమకు సమానమౌనట్టులుగా, ఎందున్=ఏసమయమందును, పాటింపవు=విచారింపవు అని యర్థము. సూర్యాశ్వము లస్తాచలప్రాప్తిచేత సముద్రములో మునుఁగుచున్నవనిభావము. తద్ధిక్కృతులైన్యచక = తనగుఱ్ఱముయొక్క యవమానములను సహింపక, రవి=సూర్యుఁడు, హారియై=తానుగుఱ్ఱమై, చాయకున్ రాన్ = పోలికకు రాఁజూడఁగా, చరణోద్యద్ధూళిన్=గొరిసెలవల్ల నెగురుచున్న పరాగముచేత, అడంచున్ = అడఁచును అనియర్థము. సూర్యుఁడు హరియనెడు నామముగలవాఁడనియును లేక సంజ్ఞాదేవి నూఱడించుకొఱకు నశ్వమయినాఁ డనియును మధ్యాహ్నసమయమందు నీడక్రిందికి జలపానార్థమయి వచ్చు గుఱ్ఱములయొక్క ఖురధూళిచేత నాచ్ఛాదితుఁ డగుచున్నాఁడనియును భావము. తద్వాసతఁదగు = ఆసూర్యునియందలి నివాసత్వముచేత నొప్పుచున్న, హారియున్ = విష్ణుదేవుఁడును, (శ్లో. 'ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణః' అని యున్నది.) సప్తిగాన్=సూర్యతిరస్కారమును సహింపక తాను గుఱ్ఱముగాఁగా, పాదధారాస్ఫురణంబేవింతయంచున్ = ధారయనఁగా నాస్కందితము, (ధౌరితకము, రేచితము, వల్గితము, ప్లుతము అనెడు గతిభేదములకుఁ బేరు.) పూర్ణత్వములేక పాలికపాలయిన ధారాస్ఫురణ మేమి యాశ్చర్యమని పలుకుచు, పూర్ణధారాసమృద్ధిన్ = సంపూర్ణమయినధారాసమృద్ధిచేత, నగున్=పరిహాసముసేయునని యర్థము. విష్ణుదేవుఁడు హయగ్రీవమూర్తియైనాఁడనియును పాదమందు గంగాజలధారాస్ఫురణము గలవాఁ డనియును భావము. (ని. 'పాదారశ్మ్యంఘ్రితుర్యాంశాః' అని అ.) (శ్లో. 'ఆస్కన్దితం ధౌరితకం రేచితం వల్గితం ప్లుతమ్, గతయోఽమూః పఞ్చధారాః' అని అ.) అనఁగా నధిష్ఠానపురమందలి గుఱ్ఱములు సూర్యాశ్వములు మొదలైనవానిఁ దిరస్కరించిన వేగముగలవని ఫలితార్థము.

ఇందు సూర్యాశ్వములకు సముద్రపతనమునుగూర్చి శ్లేషచే ననుగ్రహింపఁబడిన పరరాజప్రాప్తిని హేతువుగాఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్ష. మఱియు సూర్యవిష్ణువుల కశ్వత్వమునొందుటకు నిజాశ్వపరిభవాసహత్వమును సూర్యమండలవాసమును హేతువులుగాఁ జెప్పుటవలన రెండు హేతూత్ప్రేక్షలు. ఈమూఁడిటికి సంకరము. ఇది మహాస్రగ్ధరావృత్తము. 'లసదుద్యత్కీర్తివల్లీలలితగుణగణాలంకృతాంగా సతాన, స్థసరాగంబు ల్మహాస్రగ్ధరకు వసుమునిస్థాన విశ్రాంతి యొప్పన్' అని లక్షణము.

తా. ఆపురమునందలి యశ్వములు సూర్యుని యశ్వములను దిరస్కరించును. అవమానము సహింపక మింటిమొగమున నవి పైకిరాఁగా గిట్టలదుమ్ముచేఁగప్పును. సూర్యమండలస్థుఁడగు విష్ణువు గుఱ్ఱమై యెదిరింపరాఁగాఁ బాదధారాస్థితికిఁ బరిహసించి పంచధారాప్రశస్తిచేఁ బరాభవించును.

మ. అలఘుస్యందనకోటి వీటిమణిరథ్యావాటికాహాటకా
కలితక్షోణులఁ బేఁగుచోఁ జటులచక్రక్షుణ్ణతత్క్షోదముల్
గలయం బర్వి సుపర్వలోకనదిలో గాంగేయపంకంబు జొ
బ్బిలఁ జేయం దఱుచై జనించి యచటం బెంపొందుఁ బొందామరల్. 103

అలఘుస్యందనకోటి = అధికమయినరథసమూహము, వీటి=పట్టణముయొక్క, మణి=రత్నస్థాపితములయిన, రథ్యావాటికా = రథ్యయనఁగా రథములకు హితమైనత్రోవ, (ని. 'రథ్యాప్రతోలీవిశిఖా' అని అ.) వానియొక్క శ్రేణియందలి, హాటకాకలిత క్షోణులన్=సువర్ణమయములైన కట్టడపునేలలయందు, పేఁగుచోన్=పోవుచుండెడు సమయమందు, చటుల=చంచలములైన, చక్ర=బండికండ్లచేత, క్షుణ్ణ=నలిగిన, తత్క్షోదముల్ = ఆబంగారపు చూర్ణములు, కలయంబర్వి=అంతటఁ గలయఁబ్రాకి, సుపర్వలోకనదిలోన్ = దేవతానదియైన యాకాశగంగలో, గాంగేయపంకంబు జొబ్బిలఁజేయన్=బంగారపు బురదను ఱొంపియానట్టులు చేయఁగా, (ని. 'తపనీయం శాతకుంభం గాఙ్గేయం భర్మ కర్బురమ్' అని అ.) తఱుచై జనించి=దట్టమైజన్మించి, అచటన్=ఆయాకాశగంగయందు, పొందామరలు= బంగారపు కమలములు, పెంపొందున్ = వృద్ధిఁబొందుచుండును. ఇచట రథ్యాపరాగములకు నాకాశగంగయందు వ్యాపించుటకు సంబంధము లేకున్నను సంబంధముఁ జెప్పుటచేత నతిశయోక్త్యలంకారము.

పొందామర, పొన్ను+తామర పొందామర. సూ. సమాసంబులందుఁ బ్రాఁతాదుల తొలియచ్చులమీఁదివర్ణంబులకు లోపంబు లుప్తశేషంబులకుఁ బరుషంబులు పరంబగునపుడు నుగాగమంబగు ననుసూత్రములచేఁ బైరూపసిద్ధి.

స్యందనములు అలఘు అనుటచే భారముగనున్నవనియుఁ గోటియనుటచే నసంఖ్యాకములనియుఁ జక్రక్షుణ్ణము చటులము లగుటవలననే క్షోదము జనించినదనియు నది కలయఁబర్వుటవలననే యాకాశగంగలోన సైతముఁ బడెనని యాశయము.

తా. ఆవీటి రాచబాటలు బంగారుకట్టడములుగలవి గావున రథము లాప్రదేశమునఁ బోవుతఱి బంగారుధూళి లేచి యాకాశగంగలోఁ బడఁగా నందు బంగారు తామరలు జనించెను.

క. అన్నగరనాట్యశాలలఁ, జెన్నగుమురజములరవళిచే నటియించున్
గన్నియలకన్న మున్నుగఁ, బన్నగభుక్తతులు దృష్టిపాత్రము లగుచున్. 104

అన్నగర=ఆయధిష్ఠానపురసంబంధములైన, నాట్యశాలలన్ = నాటకశాలలయందు, చెన్నగు= ఒప్పిదమగుచున్న, మురజములరవళిచేన్ = మృదంగములయొక్క నాదములచేత, (ని. 'మృదఙ్గా మురజాః' అని అ.) కన్నియలకన్న మున్నుగన్ = నాట్యముచేయవలయు పడుచులకంటెముందుగా, పన్నగభుక్ =నెమళ్లయొక్క, తతులు=సమూహములు, ని. 'మయూరోబర్హిణోబర్హీ నీలకణ్ఠోభుజఙ్గభుక్' అని అ. దృష్టిపాత్రములగుచున్ = దర్శనయోగ్యములగుచు, (స. 'దృష్టియుక్తందృష్టిసదృశచిహ్న

యుక్తం + పాత్రలపత్రసమూహో యేషాంతే') అనెడు సమాసముచేత దృష్టిసదృశములైన చిహ్నములతోఁగూడిన యీఁకలుగలవగుచు అని యర్థద్వయము, నటియించున్=నాట్యముసేయును. నెమలి యీఁకలమీఁదఁ గన్నులవలెఁ బొడలు గలిగియుండుట ప్రకటము. మృదంగధ్వనియందు మేఘధ్వని భ్రాంతి జనించెనని భావము. ఇందు భ్రాంతిమదలంకారము వ్యంగ్యము. శ్లో. 'కవిసమ్మతసాదృశ్యా ద్విషయేపిహితాత్మని, ఆరోప్యమాణానుభవోయత్రసభ్రాంతిమాన్మతః' అని లక్షణము. అదియును నటనరూపవాచ్యసిద్ధ్యంగమైనది గావున గుణీభూతవ్యంగ్యము.

తా. ఆనగరమునందలి నాట్యశాలలలోని మద్దెలలమ్రోఁత లుఱుము లనుకొని నృత్యముసేర్చు చెలువలకంటె మున్నుగ నెమిళ్లు నటింపసాగును.

ఉ. చందనగంధు లిందుమణిసౌధతలంబుల గొండ్లి సల్పఁగా
నందలిదివ్యచిత్రములయం దొకరై యనిమేషభామినుల్
కందళితాద్భుతస్ఫురణఁ గన్గొని తన్నటనాంతగీతని
ష్యందసజీవచిత్రములసందడి నేగుదు రప్పురంబునన్. 105

అప్పురంబునన్=ఆయధిష్ఠానపురమందు, చందనగంధులు = స్త్రీలు, ఇందుమణిసౌధతలంబులన్=చంద్రకాంతమణి నిర్మితములైన మేడలయందు, గొండ్లిసల్పఁగాన్ = నాట్యము సేయఁగా, అందలి దివ్యచిత్రములయం దొకరై = ఆమేడలయందలి దివ్యములైన చిత్రప్రతిమలయందుఁ దాము నొక చిత్రప్రతిమలవలె నున్నవారై, అందలి యన్నచోట నల్యాగమము వచ్చినందునకు, (సూ. 'జేరలిచ' అని న.) (శ్లో. 'అల్యాగమస్స్యా దంద్వందోః' అని యథర్వణవచనము.) అనిమేషభామినుల్ = ఱెప్పపాటులేని దేవతాస్త్రీలు, ఇక్కడి దేవతాస్త్రీలు ఱెప్పపాటు లేనివారు గనుక ఱెప్పపాటు లేని చిత్తరువు బొమ్మలలోఁ గలిసి యేర్పడకయుండిరని యాశయము. కందళిత = అంకురించుచున్న, అద్భుతస్ఫురణన్=ఆశ్చర్యస్ఫూర్తిచేత, కన్గొని=ఆయాటచూచి, తన్నటనాంత = ఆనాట్యపుతీరుగడ యందలి, గీత=గానామృతముయొక్క, నిష్యంద = ప్రసరముచేత, సజీవ = ప్రాణయుక్తములైన, చిత్రముల=చిత్తరువుబొమ్మలయొక్క, సందడిన్=తొట్రుపాటునందు, విగుదురు=పోవుచుందురు. అనఁగా నాపట్టణమందలి మేడలు స్వర్గము నంటియున్నవనియు నక్కడనున్న స్త్రీలయొక్క నాట్య మప్సర స్త్రీలకును వింతయై కనుపడుచున్నదనియు నా నాట్యమందు జరిగెడు గానరసమందు నచేతనములను సచేతనములుగాఁ జేయుసామర్థ్యము గలిగి యున్నదనియుఁ దాత్పర్యము. అలంకారము సామాన్యము.

చేల్పుచెలువలు చిత్రములలోఁ గలసిపోవుటకు 'అనిమేషభామిను లగుట తోడ్పడినది. అంగ చలనముచే ద్యోతకము కాకుంటకు అద్భుతస్ఫురణవలని మ్రాన్పాటు తోడైనది. ఆశ్చర్యమువలన మ్రాన్పాటు కలుగుననుటకు-

శ్లో. స్తంభోహర్ష భయామర్ష విషాదాద్భుతసంభవః
అనుభావా భవం త్యేతే స్తంభస్య మునిసమ్మతాః.
అద్భుతాద్యథా. తద్గీతశ్రవణైకాగ్రా సంసదశ్రుముఖీబభౌ
హిమనిష్యందినీప్రాతః నివాతేవవనస్థలీ.
అత్ర కుశలవగీతమాధుర్యాతిశయేన శ్రవణైకాగ్రతారూపవిస్మయేన స్తంభః.

తా. చెలువలు మేడలపై నాట్యముచేయుచుండ వేల్పుచెలులు చూడవచ్చి యటగల చిత్రములలోఁగలసి యొరుల గుఱుతింపరానటుల వర్తించి గానామృతప్రసరణమునఁ జిత్రములు సజీవములై చలించుచుండ నాసందడిలోఁ దమదారిని బోవుదురు.

చ. ఒనరుఁ బురాధిరాజమున•నుజ్జ్వలవజ్రకలాపగోపురా
గ్రనిహితహేమకుంభములు • గాంగహిరణ్మయకంజమంజిమం
దనరఁగ నిక్కి దిక్కరుల•తండము తుండము సాఁచు నంచునుం
చినవెదురుబొమ్మలో యనఁగఁ • జిత్రితసాంద్రమృగేంద్రరూపముల్. 106

పురాధిరాజమునన్=అధిష్ఠానపట్టణశ్రేష్ఠమునందు, ఉజ్జ్వల=ప్రకాశమానములైన, వజ్ర=వజ్రమణులయొక్క, కలాప=సముదాయముతోఁగూడిన, గోపుర = పురద్వారములయొక్క, అగ్ర = అగ్రభాగములయందు, నిహిత=ఉంచఁబడిన, హేమకుంభములు = బంగారపు కలశములు, ని. 'పురద్వారంతు గోపురమ్' అని అ. గాంగ = ఆకాశగంగా సంబంధమైన, హిరణ్మయకంజ = సువర్ణకమలముల యొక్క, మంజిమన్=సౌందర్యముచేత, అనఁగా సువర్ణకమలములవలె, తనరఁగన్ = ఒప్పుచుండఁగా, నిక్కి=పైకి నుబికి, దిక్కరులతండము=దిగ్గజములసమూహము, తుండముసాఁచునంచున్ = తుండమును జాపి పట్టఁబోవునని, ఏనుఁగులు తుండములతోఁ గమలములంబట్టి త్రెంచివైచు వాడుక గలదుగనుక సువర్ణకమలభ్రాంతిచేతఁ బట్టి పెకలింపఁ బోవునని తాత్పర్యము. ఉంచినవెదురుబొమ్మలో యనఁగన్ = నిలిపిన బెదురు జంత్రపురూపములో యన్నట్టులుగా, చిత్రితసాంద్రమృగేంద్రరూపముల్ = చిత్రించిన దట్టమైన సింహరూపములు, ఒనరున్ = ఒప్పుచుండును. అనఁగా గోపురాగ్ర సువర్ణ కలశములు గోపురస్థాపితములైన వజ్రమణులయొక్క తెల్లని కాంతులపైని స్వచ్ఛమైన యాకాశగంగాజలముపైఁ బ్రకాశించెడు సువర్ణకమలములవలె నుండెననియు నాకలశములు దిగ్గజములను మించియుండెననియు భావము. ఇచట గోపురాగ్ర సువర్ణకలశముల నాకాశగంగాకమలములనుగా నుత్ప్రేక్షించుటచే స్వరూపోత్ప్రేక్ష. అచట సింహప్రతిమాస్థాపనమునకు దిగ్గజకర ప్రసారణనివృత్తిఫలముగా నుత్ప్రేక్షించుటవలన ఫలోత్ప్రేక్ష.

తా. గోపురములపైఁగల కనకకలశములు బంగారు తామరపూవులని దిగ్గజములు తుండములు సాచకుండుటకై నెలకొల్పిన వెఱపుబొమ్మలవలెఁ బురమునందుఁ జిత్రితములై సింహప్రతిమలు కనఁబడుచుండును.

సీ. ఘనులఁగొండలపాలు•గాఁ జేసినకొలంత ద్విజరాజు నెపుడుఁ గుం•దించుకొదవ
కువలయంబు దినంబుఁ•గూల్చునాడిక బంధుజీవ మామోదిగాఁ • జేయనిసడి
కల్యాణగోత్రంబు•గరిమ వంచినదూరు సరసుల నింకించు•పరుసఁదనము
దానికే ల్వసులక్ష్మిఁ • బూనఁ జేయనిరట్టు తమ్ములఁ బంకాప్తిఁ•దార్చునగడు
తే. నలువ వారించుకొనియొఁ ద•న్నగరసతుల
నెఱికురులు ముద్దుమోములు • నిడుదకన్ను
లలతిమోవులు బిగిగుబ్బ • లరిదినాభు
లలఁదొడలును మృదుపదం•బులు నొనర్చి. 107

ఘనులఁగొండలపాలుగాఁజేసినకొఱంత = ఘనులనఁగా మహాత్ములును మేఘములును, మహాత్ములైన వారిని గట్లపాలుగాఁజేసిన తక్కువ యని యర్థము. మేఘములను బర్వతములయందు వ్యాపింపఁ జేసినాఁడని భావము. ద్విజరాజు నెపుడుఁగుందించుకొదవ=ద్విజరాజనఁగా బ్రాహ్మణోత్తముఁడును, చంద్రుఁడును; బ్రాహ్మణోత్తముని నెల్లకాలము విచారపడఁజేసిన వెలితియని యర్థము. చంద్రునిఁ బ్రతిపక్షమందును గృశింపఁ జేసినాఁడని భావము. కువలయంబుదినంబుఁ గూల్చునాడిక = కువలయమనఁగా భూవలయమును, గలువయును, భూవలయమును బ్రతిదినమును గూలిపోవునట్లుచేసిన యపవాదమని యర్థము. కలువలను దివాభాగమందు ముకుళింపఁజేసినాఁడని భావము. బంధుజీవమామోదిగాఁజేయని నడి=బంధుజీవమనఁగా బంధుజనజీవంబును, మంకెనపువ్వును, బంధుజనుల జీవమును సంతోషముగల దానిగాఁ జేయకపోయిననింద యని యర్థము. మంకెనపువ్వును పరిమళహీనమైనదానిగాఁ జేసినాఁడని భావము.

(ని. 'బన్ధూకో బన్ధుజీవకః' అని అ.) కళ్యాణగోత్రంబుగరిమవంచినదూరు = కళ్యాణగోత్రమనఁగా మంగళకరమైన వంశమును, కాంచనాచలమును, ని. 'కల్యాణ మక్షయే స్వర్ణే మఙ్గళేపి నపుంసకమ్' అని మే. మంగళకరమైన వంశముయొక్క గౌరవమును బోఁగొట్టినదూషణయని యర్థము, కనకాచలముయొక్క యౌన్నత్యమును వంచి హారునకు విల్లుగాఁజేసినాఁడని భావము. సరసులనింకించు పరుసఁదనము=సరసులనఁగా రసజ్ఞులును, సరోవరములును, రసజ్ఞులైనవారిని దగ్ధపఱిచిన పరుషత్వమని యర్థము, సరోవరముల నెండకాలమం దింకిపోవునట్టులు చేసినాఁడని భావము దానికేల్వసులక్ష్మిఁ బూనఁజేయనిరట్టు=దానియనఁగా దాతయు, నేనుఁగును, కేలనఁగా హస్తంబును, గజతుండంబును, వసులక్ష్మియనఁగా ధనసంపదయును, గాంతిసంపదయును, దాతయొక్క హస్తము ధనసంపదను వహింపఁ జేయక పోయినరద్దియని యర్థము, ఏనుఁగుతుండము కాంతిసంపదను వహింపఁజేసినాఁడు గాఁడని భావము. తమ్ములఁ బంకాప్తిఁ దార్చునగడు = తమ్ములనఁగా సోదరులును, దామరలును, పంకమనఁగాఁ బాపమును, బురదయును, సోదరులను బాపప్రాప్తియందుఁ బొందించిన రవ్వయని యర్థము, తామరలను బురదపాలుచేసినాఁడని భావము.

నలువ = బ్రహ్మదేవుఁడు, తన్నగరసతుల = ఆయధిష్ఠానపురస్త్రీలయొక్క, నెఱకురులు=చక్కని తలవెండ్రుకలను, ముద్దుమోములు = మనోహరములైన మొగంబులును, నిడుదకన్నులు = సోఁగలైన కన్నులను, ఆలతిమోవులు=సన్నపుపెదవులను, బిగిగుబ్బలు=దృఢములైనకుచంబులను, అరిదినాభులు = వింతలైననాభులను, అలరుఁదొడలును=ఒప్పిదమయినతొడలను, మృదుపదంబులును = కోమలములైన పాదంబులను, ఒనర్చి=సృజించి, వారించుకొనియెఁ = నివారించుకొనియెను. ఘనులఁ గొండల పాలుగాఁ జేసినకొఱంత యనునది మొదలుకొని తమ్ములఁబంకాప్తిఁ దార్చునగడు అనుపర్యంతంబును సంప్రాప్తమయిన యపవాదంబును బోఁగొట్టుకొనెనని యర్థము. మేఘంబులనుఁ గొండలపాలుగాఁ జేసిన కొఱంత యనునది మొదలుకొని తామరలను బురదపాలుచేసిన యగడు, అనెడు పర్యంతము ద్యోతమానంబు లగుచున్న మేఘాదు లుపమానంబు లగుచున్నట్టులుగా శిరోజంబులుమొదలైన యవయవంబులను సృజించినాఁడని భావము. ఇది క్రమాలంకారము. శిరాది పాదపర్యంతంబు వర్ణించినాఁడు.

తా. ఆపట్టణపుస్త్రీలు మేఘంబులవంటి నల్లని కలవెండ్రుకలును, జంద్రునివంటి మనోహరంబులైన మొగంబులును, గలువఱేకులవంటి సోఁగలైనకన్నులును, మంకెనపువ్వువంటి యెఱ్ఱనిపెదవులును,బంగారుకొండలవంటి బటువైన చన్నులును, సరోవరంబులవంటిలోఁతుగల నాభులును, నేనుఁగుతుండంబులవంటి చక్కనితొడలును, తామరపువ్వులవంటి మృదువైనపాదంబులును గలవారని ఫలితార్థము. అలంకారము రూపకము. యథాసంఖ్యము.

మ. పురిపూఁదోఁటలతావి మిన్నులమ వేల్పుల్ మెచ్చి తద్భూజభా
స్వరసంతానములన్ దివిం బెనుప నాసంతానముల్ దివ్యని
ర్ఝరిణీనిర్మలవారిపూరపరిపోషం బందియుం దన్మహా
తరులక్ష్మీపరిపూర్తి గాన కెసఁగెం దత్కల్పశాఖిప్రథన్. 108

పురి=ఆయధిష్ఠానపురసంబంధమైన, పూఁదోఁటల=పువ్వుతోఁటలయొక్క, తావి = పరిమళము, మిన్నులమన్=ఆకాశము నావరింపఁగా, వేల్పుల్మెచ్చి = దేవతలాపరిమళమును మెచ్చి, తద్భూజ = ఆపువ్వులచెట్లయొక్క,భాస్వరసంతానములన్ = ప్రకాశమానములైన పిలకలను, దివింబెనుపన్ = స్వర్గమందు నాటి పెంపుసేయఁగా, ఆసంతానములు=ఆపిలకలు, దివ్యనిర్ఝరిణీ=ఆకాశగంగయొక్క, నిర్మల=స్వచ్ఛమైన,వారిపూర=జలసమృద్ధిచేత, పరిపోషంబుదియున్=మిక్కిలి పోషణముఁజెందినదయ్యును, తన్మహాతరులక్ష్మీపరిపూర్తిఁగానక = ఆమొదటిచెట్లయొక్క శోభాసమృద్ధిని బొందఁజాలక, తత్కల్పశాఖిప్రథన్ = వానికంటె.గొంచెముతక్కువైనవియను ప్రసిద్ధిచేత, ఎసఁగెన్=ప్రకాశించెను, అనియర్థము. కల్పప్రత్యయ మీషదసమాప్తియందుఁ జెప్పఁబడి యున్నది. దేవతరుపంచకమునకును గల్పతరువ్యవహారము గలదు గనుక సంతానములు తత్కల్పశాఖిప్రథననఁగా బ్రసిద్ధమైన కల్పవృక్షవ్యవహారముచేతఁ బ్రకాశించె ననిభావము. అనఁగా నాపట్టణోద్యానములయందలి వృక్షములు స్వర్గమందుండెడు కల్పవృక్షములకంటె నతిశయించి యున్నవని యాశయము. పూఁదోఁటయనుచోట పూవుతోఁట యని యుండఁగా ప్రాఁతాదిగణములోనిది గనుక తొలియచ్చుమీఁదివర్ణములకు లోపమును శేషమునకు నుగాగమమును దాని కనుస్వారాదేశమును రాఁగాఁ బూఁదోఁట అను రూపము. ఇచట దేవవృక్షములకు యోగముచే నన్వార్థకల్పనవలన నిరుక్త్యలంకారము. అతిశయోక్తియు.

దేవ భూరుహములకు సంతానము లనుపేరువచ్చుట భూమిలోని వృక్షముల సంతతి యగుట వలననియుఁ గల్పవృక్షములని పేరువచ్చుట సుగంధాదులయందు భూలోకవృక్షములకంటె తక్కువయై యుంటవలననే యనియు నాశయము.

తా. పురమునందలి పూఁదోఁటలతావులు మిన్నంట వేలుపులుమెచ్చి యాపూఁదోఁటల మొలకలు కొన్నిస్వర్గమున వేల్పులు నాటిరి. ఆమొలకల నాకాశగంగాజలముచేఁ బెంపొందించిరి. అవి భూలోకవృక్షములకంటెఁ గొఱఁతఁబడియుంటచేఁ గల్పవృక్షము లని పేరొందెను.

సీ. పొన్నపూఁ బోఁడి నేలఁ బోదివితే చెలి యది పొడమె బల్దీవిపైఁ బోదువ వలదె
చెలువమాటిలి వేల కలువచా లదియుఁ గప్పఁగ రాదె మిన్నులఁ బావికడది
మొగడతమ్ములనేలఁ మూసితేసతి మాయఁ దగదె మానసభూమిఁ థానము లవి
తరుణి పూఁ రెమ్మయొత్తవదేల యది హేమశిఖరిదాపుది బయల్పేయఁదగునె

తే. యనుచు రసమర్మసరసోక్తులాడునట్టి, జట్టికాండ్ర యథోచితసరసవచన
రచనఁ దేల్చుచు వివిధవిభ్రమముపరల, విరులునిలుతురుపుష్పలావికలు వీట.

పద్యములో నధిష్ఠానపురమందలి పువ్వులమ్మెడు పడుచులతోఁ బువ్వులుకొనవచ్చిన కోడె కాండ్రు పలికెడు మర్మగర్భిత నర్మవాక్యములకు నారీతిన ప్రత్యుత్తరములిచ్చుచు వారు పువ్వులమ్ము టను వర్ణించినాఁడు. ఏలాగన్నను,

పొన్నపూ వొడిసేలపొదివితేచెలి యదిపొడమె బల్దీవిపైఁ బొదువవలదె=ఇక్కడఁ బొన్నపూ వుపమానము నాభి యుపమేయము, బల్దీవి యుపమానము జఘన ముపమేయము. ఉపమానములచేత నుపమేయముల గ్రహింపవలయును. ఇది రూపకాతిశయోక్త్యలంకారము. శ్లో. 'రూపకాతిశయోక్తి స్స్యా న్నిగీర్యాధ్యవసానతః' అని లక్షణము. నాభి నొడిఁగాఁగనుపడకుండఁ బొదువుకొన్నా వేమే యని మర్మము, పొన్నపువ్వును జూపక యొడిలో దాచినావేమేయని మర్మగర్భితమైన నర్మము. [ఇది జట్టికాండ్ర ప్రశ్నము] అది, ఆనాభి = జఘనముమీఁదం బొడమెను బొదువవలదా యని మర్మము, ఆపొన్నపువ్వు బలువైన ద్వీపాంతరముమీఁద నుద్భవించెనుగనుక నపురూపమైనది దాని దాచవలదా యని మర్మగర్భితమైన నర్మము. [ఇది పుష్పలావికల ప్రత్యుత్తరము] ఉత్తరత్ర యీలాగున మర్మ నర్మములను బ్రశ్నోత్తరములను విచారింపవలయును.

చెలువమాటితివేల కలువచాలు=చిన్నదానా నల్లకలువలచాలు కప్పిపెట్టితి వేమేయని నర్మము, నూఁగారు కప్పిపెట్టితివేమేయని మర్మము. [ఇది ప్రశ్నము] అదియుఁ గప్పఁగరాదె మిన్నులబావి కడది=ఆకలువచాలు మిన్నులబావికడది యనఁగా నాకాశగంగదాపుది గనుకఁ గప్పిపెట్టఁదగదా యని నర్మము, మిన్ననఁగా నడుము బావియనఁగా నాభి, ఆనూఁగారు నడుముపైనున్న నాభిదాపుదిగనుకఁ గప్పిపెట్టఁదగదా యని మర్మము. [ఇది యుత్తరము] మిన్నులబావియన పొక్కిలి యనుటకు.

శ్లో. 'వాపీకాపిస్ఫురతి గగనే తత్పరే సూక్ష్మపద్యా.' (కువలయానందము.)

మొగడతమ్ముల నేలమూసితే సతి=ఓచిన్నదానా తామరమొగ్గల నేలమూసిపెట్టితివే యనినర్మ ము, గుబ్బచన్నుల నేలమూసిపెట్టితివే యనిమర్మము. [ఇది ప్రశ్నము] అవి=ఆతామరమొగ్గలు, మానస భూనిధానములు=మానస సరోభూమియందలి నిక్షేపములు, మూయఁదగదె=మూసిపెట్టఁగూడదా యని నర్మము, అవి=ఆగుబ్బచన్నులు, మానస భూనిధానములు=మానసభూమి యనఁగా వక్షస్స్థలము తన్ని క్షేపములు, లేక మానసభూఅనఁగా మన్మథుఁడు మన్మథనిక్షేపములు గనుక మూసిపెట్టఁగూడదా యని మర్మము. [ఇది యుత్తరము]

తరుణి పూరెమ్మయెత్తవదేల = లేఁతవయస్సుగల యోచిన్నదానా! పూఁదీఁగె యేలయెత్తవే యనినర్మము, బాహువు నేటికెత్తవేయని మర్మము. [ఇది ప్రశ్నము] అది=ఆపూరెమ్మ, హేమశిఖరి దాపుది=మేరుపర్వతముకడనుండునది, బయల్పోయఁ దగునె=బయలుపఱుపవచ్చునా యని నర్మము, బాహువు స్తనసమీపముననున్నది బయలుపుచ్చవచ్చునా యని మర్మము. [ఇది యుత్తరము]

అనుచున్=ఈలాగుపలుకుచు, రసమర్మసరసోక్తులాడునట్టి=మోహరసగర్భితములైన సరసవాక్య ములు పలుకునట్టి, జట్టికాండ్రన్ = పువ్వులుకొనవచ్చిన కోడెకాండ్రను, యథోచిత సరస వచన రచనఁ దేల్చుచున్=వానికిఁదగిన సరసవాక్యములయొక్కరచనచేత సంతోషింపఁ జేయుచు, వివిధవిభ్ర

మమువరలన్=నానావిధమైన విలాసము లొప్పఁగా, వీటన్=ఆయధిష్ఠానపురమందు, పుష్పలావికలు=పువ్వులఁగోసెడువనితలు, విరులు విలుతురు=పువ్వులమ్ముచుందురు. అలం. రూపకాతిశయోక్తి.

మ. అమరుం దత్పురిచెంతఁ గాంతకనకా•బ్జాలంబరోలంబ శు
క్తిమతీవాహిని సారసారణులు త•త్కేదారకోదారస
స్యము ముక్కారును బండఁ జేయ దివివా•రల్ వీటిసత్త్రాన్నభా
గము లాసింపఁగఁ దత్సురాలయనదీ•ఖ్యాతిన్ విడంబించుచున్. 110

తత్పురిచెంతన్ = ఆయధిష్ఠానపుర సమీపమందు, కాంత=మనోహరములైన, కనకాబ్జ=సువర్ణకమలములే, ఆలంబ=అవలంబనముగాఁగల, రోలంబ=తుమ్మెదలు గలిగిన, (ని. 'ఇన్దిన్దిర శ్చఞ్చరీకో రోలంబో బంభరశ్చ సః' అని అ.) ఈవిశేషణము శుక్తిమతీనదికి నాకాశగంగకును సాధారణవిశేషణము. శుక్తిమతీవాహిని = శుక్తిమతియను పేరుగలనది, సార = బలమైన, సారణులు = కాలువలు, (ని. 'సారణీ చాల్పసరితి' అని వి.) తత్=ఆపట్టణసంబంధమైన, కేదార=వరిమళ్లయందలి, కోదార-సస్యమున్=పైరును, ముక్కారునుబండఁజేయన్ = మూఁడు కార్లయందును బండునట్లులు చేయుచుండఁగా, దివివారల్=స్వర్గసంబంధులు, అనఁగా దేవతలు, వీటిసత్త్రాన్నభాగము లాసింపఁగన్ = సత్త్రమనఁగా యజ్ఞము. (ని. 'సత్త్ర మాచ్ఛాదనే యజ్ఞే సదాదానేవనేపిచ' అని అ) ఆపట్టణమందలి యజ్ఞాన్నభాగములు, అనఁగా హవిర్భాగములు కోరి వచ్చియుండుటచేత, తత్సురాలయనదీఖ్యాతిన్ విడంబించుచున్=హవిర్భాగములనిమిత్తమయి వచ్చి దేవత లెప్పుడు నాపట్టణమంద యుండుటచేతఁ బట్టణము సురాలయముగా నుండునుగనుక శుక్తిమతీనది సురాలయనదీఖ్యాతిని విడంబించుచు, అనఁగా స్వర్గగంగాఖ్యాతిచేఁ బ్రకాశించుచు, అమరున్ = ఒప్పుచుండును. అనఁగా నాపట్టణప్రాంతమందలి శుక్తిమతి యనెడునది బంగారుకమలములుగలిగి యుండుటచేతను, యజ్ఞాన్నభాగములకొఱకై దేవతలు వచ్చి యెప్పుడునుండుటచేతను నాపట్టణము స్వర్గమువలెనేయుండును గనుక దానిచెంతఁ బ్రవహించుచుండుటచేత నానదియు స్వర్గనదివలె నొప్పుచుండునని యాశయము. ఇచట శుక్తిమతీనదికి సురాలయనదీఖ్యాతి న్విడంబించుచున్ అనుటచే సాదృశ్యవర్ణనవలన నుపమాలంకారము.

ముక్కారులఁ బండుటకు జలప్రశస్తియే కారణముగాని భూసారణము కారణము గాదనుటకు-

మ. విలసత్సారణికానుకూలయి విబుధద్వీపి స్యనర్ఘామృతం
బుల ముక్కారును బండుశాలులు, (చంద్రికాపరిణయము.)

తా. పొందమ్ములఁదేనె త్రోలు తేటుల కిరవగు శుక్తిమతీనదికాలువల సహాయమున నావీటియందు ముక్కారు వరి పండును. ఆధాన్యసహాయమునఁ బౌరులు యజ్ఞములుచేయుచుండ దేవతలు హవిర్భాగములకై వచ్చుచుంటవలన శుక్తిమతి యాకాశగంగవలెఁ బేరొందెను.

శా. వీటన్ మీఁటగుజోటు లేటివరదన్ • వేమాఱుఁ గ్రీడింపఁ ద
త్పాటీరాంకసపంకశంఖగతముక్తాశ్రేణి యవ్వాసనన్
బాటించున్ మృగనాభిపంకయుతభా•మాకంబుకంఠాప్తి నే
న్నాటన్ మిన్కులు గల్గువారి కగు జ•న్మస్థానసౌఖ్యోన్నతుల్. 111

జోటియనఁగా స్త్రీ, ఇది యోషిచ్ఛబ్దతద్భవము. పీటక్ = ఆయధిష్ఠానపురమందు, మీటగు= శ్రేష్ఠులయిన, జోటులు = స్త్రీలు, ఏటివరదక్ = శుక్తిమతీనదీప్రవాహమందు, వేమాఱుఁ గ్రీడింపక్ = పలుమాఱును జలక్రీడలాడుచుండుటచేత, తత్ = ఆపురస్త్రీలసంబంధమైన, పాటీర = శ్రీచందనమే, అంక=చిహ్నముగాఁగలవై పరిమళించునవియు, సపంక = బురదతోఁగూడుకొన్నవై నల్లనైనవియునగు, శంఖ = నదీగర్భములైన శంఖములను, గత = పొందిన, అనఁగా నాశంఖములయందుఁ బుట్టిన, ముక్తా శ్రేణి=మౌక్తికసమూహము, అవ్వాసనక్ = ఆ సంస్కారముచేత, మృగనాభిపంకయుత = కస్తూరికా పంకముతోఁ గూడుకొన్న, భామాకంబుకంఠ = కంబుగ్రీవమనఁగా మూఁడురేఖలుగల కంఠము, ని. 'కంబుగ్రీవా త్రిరేఖాసా' అని అ. స్త్రీలయొక్క రేఖాత్రయయుక్తకంఠములయొక్క, ఆప్తిక్ = ప్రాప్తిని, పాటించుక్ = పొందును.

అనఁగా ముత్తెములు చందనపరిమళముతోఁగూడిన కర్దమమంటిన మూఁడుచుట్లుగలశంఖముల యందు మునుపున్నవి గనుక నాసంస్కారముచేత నాశంఖములకుఁ బ్రతినిధియైన కస్తూరికర్దమయుక్త రేఖాత్రయ సహిత కాంతాకంఠప్రదేశములను బొందుచున్నవనుట. ఏనాట న్మిన్కులుగల్గువారికగు జన్మస్థానసౌఖ్యోన్నతుల్ = మిన్కులనఁగా ధనములు, అవి గలిగినవారికి జన్మస్థానసౌఖ్యోన్నతులు గలుగునని యర్థము. మిన్కులనఁగాఁ గాంతులును, ముత్తియములు కాంతులుగలవని భావము. శుక్తి మతీనదీగర్భగత శంఖజనిత ముక్తాఫలములు పురకాంతాకంఠదేశములయందు హారములై ప్రకాశించునని ఫలితార్థము. శంఖములయందు ముత్యములు పుట్టుట రత్నశాస్త్రప్రసిద్ధము. ఇందుకుఁ బ్రమాణము. రత్నపరీక్షయందు,

క. 'వరశంఖజనితమౌక్తిక, మరయఁ గపోతాండమువలె నత్యుజ్జ్వలమై,
పరఁగునది మంత్రసాధన, పరులకుఁ దక్కంగ దుర్లభం బితరులకున్.

ఇచట ముత్యములకు స్త్రీకంఠప్రాప్తిని గూర్చి శంఖోత్పత్తివాసనకారణమాటచే హేతూత్ప్రే క్ష.ఏనాటక్ ఇత్యాదికముచేతసామాన్యముచేఁ బ్రకృతార్థమును సమర్థించుటవలన నర్థాంతరన్యాసము.

తా. శుక్తిమతీనదియం దాపురకాంతలు పలుమాఱు జలక్రీడఁ గావించుటచే నది యందలి శంఖములందలి ముత్తెములకునైత మాతావి పట్టువడెను. అందుచే మౌక్తికములను దండలుగా గ్రుచ్చి యఱుతఁ దాల్తురు.

ఉ. చెన్నగునన్నదీపులినసీమల దాఁగిలిమూఁతలాడుచున్
వెన్నెలరేలు కప్పురపువిప్పుటనంటులనీడ నీఁగురా
కన్నెలఁబోయునన్నులకుఁ గన్నులు మూయుఁ దదీయవాసనల్
మన్ననఁ గాంచి కప్రపుదుమారము రేఁచుసమీరడింభముల్. 112

చెన్నగు=చక్కనగుచున్న, అన్నదీపులిన సీమలక్ = ఆశుక్తిమతీనదియొక్క యిసుకతిన్నెల యందు, దాఁగిలిమూఁతలాడుచుక్ = దాఁగిలిమూఁతలనఁగాఁ జిన్నపదుచులాడెడునాట (అదియేలా గనిన, నొకతెమూర్చుండి ముందుగా నొకదానికిఁ గన్నులు గట్టిగామూసి పట్టి కడమపడుచులందఱుఁ బోయి యెక్కడెక్కడనో దాఁగియున్నతర్వాత దీని విడిచిపెట్టినఁ బోయి వెదకి దాఁగినవాండ్రలో నెవరినైనఁ దాఁకినఁ దాఁకఁబడినవాండ్రు కన్నులు మూయించుకొనవలయునదిగా నాడునాటకుఁ

చేరుగనుక) అట్టియాటయాడుచు, వెన్నెలరేలు = వెన్నెలగలరాత్రులు, కప్పురపువిప్పటనంటుల = గొప్పలైన కర్పూరపరఁటిచెట్లయొక్క, నీడన్ = నీడయందు, ఈఁగు = దాఁగియుండెదు, రాకన్నెలన్ = రాచకన్నియలను, ఆరోయు = వెదకునట్టి, అన్నులకున్ = స్త్రీలకు, కప్రపుదుమారము రేఁచుసమీరడింభముల్ = కర్పూరపుధూళి నెగరఁగొట్టుచున్న పిల్లవాయువుల నెడుపిల్లలు, ఇక్కడ సమీరడింభము లనెడు డింభములని రూపకాలంకారము. తదీయ = ఆదాఁగియున్న స్త్రీలయొక్క, వాసనల్ = దేహవాసనలను, మన్ననఁగాంచి = మన్ననచేత గ్రహించి, కన్నులుమూయున్ = కన్నులుమూయును, అనఁగా నాదాఁగియున్న స్త్రీలవాసనలుగాంచినవై యాదాఁగినస్త్రీలకు సహాయముగా వెనుకవచ్చిన స్త్రీలకుఁ దమచేత రేఁపఁబడిన కర్పూరపు దుమారముచేతఁ గన్నులు కనుపడకుండఁ జేయునని భావము. అలం. సామాన్యాలంకారము. హేతూత్ప్రేక్ష.

తా. వెన్నెలరేలయందుఁ జెలువలు శుక్తిమతీపులినముల దాఁగిలిమూఁతలాడుచుండు నెడఁ గొందఱు కర్పూరపుఁటరఁటిచెట్లనీడలలో దాఁగ వారిని వెదకవచ్చు చెలులకనులనిండఁ గప్పురపుదుమారము నిండినగాలి వీచుటచేఁ గనులు మూఁతపడుచుండును.

చ. వలనగునమ్మహాతటిని◆వారి నవారితకేళిసల్పు కాం
తలచనుమిట్టలం దొఱఁగు◆దట్టపుతట్టుపునుంగువాసనల్
చిలుకుచు వీటిరాజనపుఁ◆జేలకు దిద్దినకాల్వవెంట రా
దళముగ నాని యప్పునుఁగు◆తావులె వల్చుఁ దదీయధాన్యముల్. 113

వలనగు = యుక్తమైన, అమ్మహాతటినివారిన్ = ఆ మహానదియొక్క యుదకమందు, అవారితకేళిసల్పు = అనివారితమగునట్టులుగా జలక్రీడలాడుచుండెడు, కాంతల = స్త్రీలయొక్క, చనుమిట్టలందొఱఁగు = మిట్టచన్నులవలననుండి వదలుచున్న, దట్టపు = దట్టమైన, తట్టుపునుంగు = తట్టుపునుఁగువాసనలు, చిలుకుచున్ = పరిమళము వెదచల్లుచు, వీటిరాజనపుచేలకు దిద్దినకాల్వవెంటరాన్ = ఆపట్టణసంబంధమైన రాజనపువరిచేలకుఁ బాఱునట్టులుతీర్చిన కాలువవెంబడిరాఁగా, దళముగనాని = బలమగునట్టులుగా నా తట్టుపునుఁగును గ్రహించి, తదీయధాన్యముల్ = ఆరాజనపుధాన్యములు, అప్పునుఁగుతావులెవల్చున్ = ఆ పునుఁగువాసనలచే పరిమళింపజేయును. అనఁగాఁ బునుఁగువాసన గలిగియుండుననుట. ఇచట ధాన్యములకుఁ బునుఁగువాసనసంబంధము లేకున్నను సంబంధముఁ జెప్పుటచే నతిశయోక్త్యలంకారము.

వలనగుననుటవలన శుక్తిమతి జలక్రీడోచితముగ నున్నదనియుం నది మహాతటినియైనను జరుపునది యవారితకేళి గావునఁ జెలువల గుబ్బలపై దువాళించుపునుఁగుతావులు జలములలోఁ గలిసిపోవఁగలిగెనని యాశయము. చనుమిట్టలనుటచే జలకేళి యవారితమనుటవలనను స్నానమాడువారు ప్రౌఢకాంతలని గ్రాహ్యము.

తా. శుక్తిమతీజలమునందుఁ బునుఁగుతావులూలయు గుబ్బలుగలజవరాండ్రు జలక్రీడగావింప వారిగుబ్బల పూఁతతావులు నీటఁగలసి కాలువలవెంటఁ బోవుజలము వరిమళ్ళకుఁ జేరుటచే నం దుదయించువరి పునుఁగుతావుల వెదచల్లును.

చ. పగడపుజిట్టలన్ మనికి◆పట్టుగఁ గట్టినపట్టుజీనువుల్
జిగి బిగి మించుచంచువులఁ◆జించినచో రసపూర మారఁ జె

న్నగురసదాడిగుంపులు పురాంతికసీమల శాలిపాలికా
జగదభినంద్యగానరససంగతిఁ గన్నుల నీరు గ్రమ్మతిన్. 114

పగడపుజిట్టలన్ = శుక్తిమతీతీరమందున్న పవడపుఁదీఁగెలచిట్టిపొదలను, మనికిపట్టుగఁగట్టిన = నివాసభూమిగా గ్రహించిన, పట్టుజీనువులు=పట్టుజీనువులనెడు పక్షివిశేషములు, జిగి = కాంతిచేతను, బిగి=కాఠిన్యముచేతను, మించు=అతిశయించుచున్న, చంచువులన్ = ముక్కులచేత, చించినచోన్ = బ్రద్దలుచేసినయెడల, రసపూరమూరన్ = రసప్రవాహ మూరుచుండఁగా, రసదాడిగుంపులు = తెల్ల చెఱకుగుంపులు, పురాంతికసీమలన్=పట్టణసమీపప్రదేశమందలి, శాలిపాలికా = వరిచేలుకాపాడెడు పడుచులయొక్క, జగదభినంద్య = జగజ్జనులచేతఁ గొనియాడఁదగిన, గానరస = సంగీతరసముయొక్క, సంగతిన్ = అనుభవముచేత, కన్నులనీరుగన్గతిన్ = కన్నుల నానందబాష్పములు వహించినట్టులుగా, చెన్నగున్=ఒప్పుచుండును. ఇక్కడఁ జెఱకులయందుఁ గన్నులు అనఁగాఁ గణుపులు గలవు గనుకఁ బక్షివిశేషములయొక్క చంచుస్ఫుటనముచేతఁ గన్నులయందైన రసపూరోదయమును రసదాడిగుంపుల యందు నానందబాష్పములుగా నుత్ప్రేక్షించినాఁడు. మఱియు గానరసప్రభావముచేత మోళ్లు చిగుర్చుట ఱాళ్లుగరఁగుట మొదలైనవి కవిసమయసిద్ధములై యున్నవి గనుక నచేతనములైన యిక్షు కాండములయం దానందబాష్పోదయము యుక్తమే యని విచారింపవలయును. మ్రాఁకులు చిగుర్చుటకు దృష్టాంతము. భారతచంపువు మొదటిస్తబకమున,

శ్లో. 'ఆలాపకాలసమపల్లవితాంకవీణా సౌరభ్యపాతిమధుపారవసంకులస్య,
తంత్రీస్వరస్యసమితౌ తరుణీస్వనస్య జానాతి యత్రచతురోపి న తారతమ్యమ్.'

అను నీపద్యమున నాలాపకాలమునకు సమముగా నొడియందలి వీణచిగిర్చెనని చెప్పంబడియెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. శుక్తిమతీతీరముననున్న పగడపుఁదీఁగెలలో గూండ్లుగట్టిన పట్టుజీనువులను పక్షులు తెల్ల చెఱకుఁ జెట్టులను జంచువులతోఁ జీల్ప నూరుచున్నరసపూరము శాలికాపాలికలపాటచే నుదయించు నానందబాష్పోదయమువలె నొప్పును.

క. ఆరాజధాని కధిపతి, యై రాజిలువసున్నృపాలుఁ డతఁ డసిధారా
ధారాధరధారాజల, భారాహతరాజహంసపద్మోదయుఁ డై. 115

ఆరాజధానికిన్=ఆ యధిష్ఠానపురమునకు, అధిపతియై=ప్రభువై, వసున్నృపాలుఁడు = వసురాజు, రాజిలున్=ప్రకాశించును. ఏలాగనిన, అతఁడు=ఆ వసురాజు, అసిధారా = ఖడ్గధారయనెడు, ధారాధర=మేఘసంబంధమైన, ధారాజలభార=ధారారూపమైన యుదకభారముచేత, ఆహత = కొట్టఁబడిన, రాజహంస=రాజశ్రేష్ఠులయొక్క, పద్మా=సంపదయొక్క, ఉదయ = అభ్యుదయమనెడు, రాజహంస = రాజహంసలయొక్కయు, పద్మ = కమలములయొక్కయు, ఉదయుఁడై = అభ్యుదయముగలవాఁడై, ప్రకాశించునని సంబంధము. అనఁగా మేఘసంబంధిధారారూపజలభారము రాజహంసలయొక్కయుఁ గమలములయొక్కయు నభ్యుదయము నేలాగున హరించునో యాలాగుననే వసురాజుయొక్క ఖడ్గధార రాజశ్రేష్ఠులయొక్క సంపదభ్యుదయమును హరించు నని భావము. వర్షజలధారలు రాజ

హంసలకును బద్మములకును ననిష్టము లౌట ప్రసిద్ధంబకదా. ఇచట ఖడ్గాదులను మేఘాదిరూపముచే రూపించుటవలన రూపకాలంకారము.

తా. సుగమము.

సీ. తనయశోవిశదము♦క్తాసౌధపాళికి నంబుదాయనము వా♦తాయనముగఁ
దనశౌర్యశిఖిశిఖా♦తతికి జాంబూనదభూధరం బపరంజి♦పూదె గాఁగఁ
దనబలోద్ధతరజో♦దంభకుంభినికిఁ దారాగ్రహంబులు గర్భ♦రత్నములుగఁ
దనదానధారాఖ్య♦వనధికి మిన్నేఱు కల్లోలధుతవారి♦కణము గాఁగఁ
తే. దనవినూతనసుగుణసం♦తానవల్లి, సముదయంబున కంభోజ♦సంభవాండ
భాండములఖండఫలపరం♦పరలుగాఁగ, వరలుభవ్యవిభావిభా♦వసుఁడు వసుఁడు.

భవ్య=ఉత్కృష్టమైన, విభా = తేజస్సునందు, విభావసుఁడు = సూర్యుఁడైన, (ని. 'విభావసు ర్గ్రహపతిః' అని అ.) వసుఁడు=వసురాజు, తన=తనయొక్క, యశః=కీర్తియనెడు, విశద=స్వచ్ఛమైన, ముక్తాసౌధపాళికిన్=ముత్యాలమేడలయొక్క సమూహమునకు, అంబుదాయనము=ఆకాశము, వాతాయనముగన్ = గవాక్ష మగుచుండఁగా, అనఁగాఁ గగనముకంటెఁ గీర్తి యతిశయమైనదనిభావము, ఉత్తరత్ర యీలాగుననే గ్రహింపవలయును. తన=తనయొక్క, శౌర్య = ప్రతాపమనెడు, శిఖిశిఖా తతికిన్=అగ్నిజ్వాలాసమూహమునకు, జాంబూనద భూధరంబు=కాంచనాచలము, అపరంజిపూదెగాఁ గన్=బంగారుపూదె యగుచుండఁగా,

తన=తనయొక్క, బల = సైన్య (పదఘట్టన)ముచేత, ఉద్ధత = ఎగిరిన, రజః = పరాగమనెడు, దంభకుంభినికిన్=కృత్రిమభూమికి, తారాగ్రహంబులు = నక్షత్రములును సూర్యాది గ్రహములును, గర్భరత్నములుగన్=గర్భస్థములైన రత్నములగుచుండఁగా భూమి రత్నగర్భయగుట ప్రసిద్ధము. తన=తనయొక్క, దానధారాఖ్యవనధికిన్ = దానధారాజలమనెడు సముద్రమునకు, మిన్నేఱు = ఆకాశగంగ, కల్లోల = మహాతరంగములవలననుండి, ధుత = ఎగసిన, వారికణముగాఁగన్ = ఉదకబిందు వగుచుండఁగా,

తన = తనయొక్క, వినూతన=అపూర్వమైన, సుగుణసంతాన = సుగుణసముదాయ మనెడు, సంతానవల్లి సముదయంబునకున్=కల్పలతాసమూహమునకు, అంభోజసంభవాండభాండములు=బ్రహ్మాండ భాండములు, అఖండ=సంపూర్ణమైన ఫలపరంపరలుగాఁగన్ = ఫలములయొక్క దొంతరలగుచుండఁగా, వరలున్ = ప్రకాశించును. ఇచట నైదు పరంపరితరూపకములకుసంసృష్టి. ఈరూపకములవలనంగీర్త్యాదుల కతివైపుల్యము ధ్వనించుచుండెం గావున నలంకారముచే వస్తుధ్వని.

తా. వసురాజు విశాలమగు యశము నసమానమగుశౌర్యము నధికజలసమృద్ధియు విశేషమగు దానగుణముగలవాఁడై సద్గుణవంతుఁ డని పేరొందెను.

చ. మసలక యెల్లకాలమును ♦ మారుతపారణధార్యమాణ యై
యసమశిలోచ్చయంబుల న♦నంత యనంతతపం బొనర్చి తా
వసుమతి యై తదీయగుణ♦వాసన గంధవతీప్రతీతియుం
బొసఁగఁగఁ దెల్పె రత్నపరి♦పూర్ణమహాకటకాభిరూప్యమున్. 117

టీ. అనంత=భూదేవి, (ని. 'భూర్భూమిరచలానన్తా' అని అ.) మసలక=జాగుసేయక, ఎల్లకాలము=నిరంతరము, మారుతపారణ = వాయు భక్షణముచేత, ధార్యమాణయై = ప్రాణధారణము చేయుచున్నదై, అసమ=విషమాకారములైన, అనఁగా దుర్గమములైన, శిలోచ్చయంబులన్ = పర్వతములయందు, అనంతతపంబొనర్చి = అంతములేని తపస్సుచేసి, అనఁగాఁ జిరకాలము తపస్సుచేసి యని యర్థము. మారుతపారణమనఁగా వాయువాహారము గాఁగలది సర్పముగనుక శేషుఁడని చెప్పవలయును. అతనిచేత ధరింపఁబడుచున్నదనియు, అసమశిలోచ్చయంబుననఁగా సప్తసంఖ్యగల కులపర్వతములయందు నిలిచియున్నదనియును భావము. తా వసుమతియై=అనఁగా వసురాజుగలదై యని యర్థము. వసుమతీనామముగలదైయని భావము. (ని. 'సర్వంసహా వసుమతీ వసుధోర్వీ వసుంధరా' అని అ.) తదీయగుణవాసనన్ = ఆవసురాజుయొక్క గుణవాసనచేత, ఇక్కడ గుణప్రకాశమునువాసనగా నధ్యవసించినాఁడు. గంధవతీప్రతీతియున్=గంధవతియను ప్రసిద్ధియును, పొసఁగఁగన్=ఒప్పుచుండఁ గానని యర్థము. ('సి. గన్ధవతీ పృథివీ') అని చెప్పఁబడియున్నది గనుక భూమిగంధవతియని భావము. రత్నపరిపూర్ణ మహాకటకాభిరూప్యమున్ = కటకశబ్దము హస్తకంకణములయందును బర్వత సానువులయందును వర్తించును గనుక రత్నములచేతఁ బరిపూర్ణమైన కంకణసౌభాగ్యమును, తెల్పెన్ =ప్రకటింపఁజేసెనని యర్థము. (ని. 'కటకం వలయే సానౌ రాజధానీ నితంబయోః' అని వి) రత్నకటకమనఁగా రత్న సానువైన మేరుపర్వతము, దానిచేతఁజేయఁబడిన సౌభాగ్యమును దెల్పెననిభావము. (సి. 'మేరు స్సుమేరు ర్హేమాద్రీ రత్నసాను స్సురాలయః' అని అమరము.) ఇచట భూమికిఁ గులపర్వతనివాసమును దపశ్చర్యగా నధ్యవసించుట వసుమతీత్వప్రాప్తి హేతువౌటచే నుపన్యసించుటవలన హేతూత్ప్రేక్ష. అదియు శ్లేషచే జీవించినది. రూపకాతిశయోక్తితో సంకరమైనది.

తా. భూదేవి మారుతపారణగావించి యసమశైలాదులకడఁ దపస్సుచేసి వసుమతి(వసురాజు గలదియు ధనవంతురాలు)యై తద్గుణ్యావాసనవలన గంధవతి (మాల్యాది సుగంధవస్తువులుగలది భూదేవి) యను పేరొందిరత్నకటకాభిరూప్యము (మేరుపర్వతము కర్ణికగానుంట-కంకణ సౌభాగ్యము) కలిగి వెలయుచున్నది.

సీ. మీఁటినరాజు బ*ల్మి నడంప లో నైన నభినవస్థితిఁ బెంప * నతఁడె నేర్చుఁ
దేఁటి చూచినఁ దీవ్ర*దీప్తిఁ జూప జనాళి కక్షిసాఫల్య మీ * నతఁడె నేర్చు
సింధు లింకఁ బ్రతాప*శిఖిఁ బూన విశ్రాణితాంబుల నవి నింప * నతఁడె నేర్చు
సమిదున్ముఖునితేజ*ము మలంపఁ బాదంబు లంటిన వెలయింప * నతఁడె నేర్చు
తే. మండలముఁ దాల్ప హరిదేస*మైత్రి నిలుప, నలఘుసన్మార్గగతిఁ దెల్ప*నతఁడె నేర్చు
నాజగద్బంధునకు వసు*రాజనామ, మిడినచతురాస్యుకౌశలం * బెన్న నరిది. 118

ఈపద్యమునందు వసురాజును శబ్దశ్లేషచేత సూర్యునిగా నధ్యవసించి యర్థద్వయమునుగలుగఁ జెప్పినాఁడు. ఏలాగనిన:-

మీఁటినరాజు బల్మినడంపలోనైన నభినవస్థితిఁ బెంప నతఁడె నేర్చున్ = రాజనఁగా నొకానొక రాజును జంద్రుఁడును, గర్వించి తన్ను నధిక్కరించిన రాజుయొక్క బల్మి నడఁగించుటకును లోఁబడినవారైన వంతకంతకు వృద్ధిఁబొందించుటకును నతఁడె నేర్చు నని రాజపరమైనయర్థము, తనకంటె మీఁద నున్న

చంద్రునియొక్క కాంతిసంపద నణఁగించుటకును దర్శయందుఁ దనతోఁ గూడిన వెనుక స్వకిరణప్రాప్తిచేతఁ గళాయుక్తునిఁగాఁ జేయుటకును నతఁడ నేర్చునని సూర్యపరమైన యర్థాంతరము. సూర్యునికిరణములే చంద్రునియందు సుధాభూతములవుచున్నవని శాస్త్రము.

శ్లో. 'సలిలమయేశశినిరవేర్దీధితయోమూర్ఛితాస్తమోనైశం,
క్షపయంతి దర్పణోదరనిహితా ఇవమన్దిరస్యాన్తః' అని ప్రమాణము.

లేఁజిచూచినఁ దీవ్రదీప్తిఁజూప జనాళి కక్షిసాఫల్యమీనతఁడె నేర్చుక్ = ఎదిరించి చూచిన వారికిఁ దీక్ష్ణమైన ప్రతాపమును గనుపఱుచుటకును దదితరజనులకునుఁ బ్రసన్నభావముచేత నేత్రానందము సేయుటకును నతఁడే నేర్చునని రాజపరమైనయర్థము. తనమీఁద దృష్టినిలిపినవారికిఁ దీక్ష్ణకాంతి గనుపఱుచుటకును సకలపదార్థప్రకాశముచేత జనులకు నేత్రసాఫల్యముఁ గలుగఁ జేయుటకును నతఁడే నేర్చునని సూర్యపరమైనయర్థాంతరము. సింధులింకఁ బ్రతాపశిఖిఁ బూనవిశ్రాణితాంబుల నవి నింప నతఁడె నేర్చుక్ =సింధుశబ్దము సముద్రములయందును నదులయందును వర్తించునుగనుక సముద్రము లింకిపోవునట్లులుగాఁ బ్రతాపము గనుపఱుచుటకును దానోదకములచేత నాసముద్రములను మరల నిండింపఁజేయుటకును నతఁడే నేర్చునని రాజపరమైన యర్థము. ఇక్కడ విశ్రాణితశబ్దమునకు భావార్థమందు క్తప్రత్యయము గనుక దానమని యర్థము, నదు లింకునట్లుగా నెండగాయుటకును దిరుగ మేఘజనితజలధారలచేత నింకిపోయిననదులను నిండింపఁజేయుటకును నతఁడే నేర్చునని సూర్యపరమయిన యర్థాంతరము, ఇక్కడ విశ్రాణితశబ్దమునకుఁ గర్మార్థమందు క్తప్రత్యయము. ని. 'సిన్ధు స్సముద్రేనద్యాంచ' అని అ. సూర్యకిరణములచేతనే వర్షముకలుగుచున్నదని శ్రుతిప్రమాణము.

సమిదున్ముఖుని తేజము మలంపఁ బాదంబులంటిన వెలయింప నతఁడె నేర్చుక్ =సంగరోన్ముఖుఁడైనవాని ప్రతాప మడఁగించుటకును గాళ్లమీఁదఁ బడిన బాగుపఱుచుటకు నతఁడే నేర్చునని రాజపరమైన యర్థము. సమిదున్ముఖుఁడనఁగాఁ గట్టెలకెదురెక్కెడువాఁడు-అగ్ని, అతని తేజస్సును బగటివేళఁ బోఁగొట్టుటకును స్వకిరణప్రాప్తినిఁ జెందఁగానే రాత్రివేళఁ బ్రకాశింపఁజేయుటకును నతఁడే నేర్చునని సూర్యపరమైన యర్థాంతరము. ని. 'పాదారశ్మ్యఙ్ఘ్రితుర్యాంశాః' అని అ.

మండలముదాల్పక్ =దేశమువహించుటకని యర్థము. మండలాకారమునువహించుటకనియర్థాంతరము. (ని. 'మణ్డలం పరిధౌ కోష్ఠే దేశే ద్వాదశరాజసు, క్లీబే థ నివహే బింబే త్రిషు' అని మే.) హరిదాసమైత్రినిలుపక్ =హరియనఁగా నింద్రుఁడును శ్రీకృష్ణుఁడును, మైత్రియనఁగా స్నేహమును ('మిత్రస్య సూర్యస్యాపత్యం స్త్రీమైత్రీ') అనెడు వ్యుత్పత్తిచేత సూర్యపుత్రియైన కాళిందియును, ఇంద్రునియందు స్నేహము నిలుపుటకని యర్థము, శ్రీకృష్ణునియందుఁ గాళిందీకన్యను సమర్పించుటకని యర్థాంతరము. అలఘు సన్మార్గగతిఁ దెల్పక్ =శిష్టాచారప్రవర్తనము దెలియఁజేయుటకని యర్థము, గగనగతిఁ దెలియఁజేయుటకని యర్థాంతరము. అతఁడె నేర్చుక్ =ఆరాజే నేర్చునని యర్థము, ఆసూర్యుఁడే నేర్చునని యర్థాంతరము. ఆజగద్బంధునకుక్ =జగజ్జనులకు నాప్తుఁడైన యారాజునకని యర్థము. జగద్బంధుఁడనఁగా సూర్యుఁడునుగనుకనిక్కడ సారస్యము గ్రహింపవలయును. వసురాజనామమిడిన =వసురాజనఁగా వసువనెడు రాజును వసువులనఁగా రశ్ములును వానికిరాజు సూర్యుఁడు గనుక నతనికివసురాజనెడు పేరుపెట్టిన, చతురాస్యకౌశలంబు=బ్రహ్మదేవుని నిపుణత్వము, ఎన్ననరిది=ఎంచుటకు శక్యముగానిది, ఇక్కడఁ జతురాస్యశబ్దము చతురములైన ముఖములు గలవాఁడని సాభిప్రాయముగావునఁ

బరికరాంకురాలంకారము. ఇచట శబ్దశక్తిమూలధ్వని లేక శ్లేషము. సాభిప్రాయ మని విచారింప వలయును.

తా. వసురాజు తన్నుమించిన రాజులవంచించుటకు లోఁబడినవారిని వృద్ధినొందించుటకును, ప్రజల నాగ్రహముఁ జూపి లోఁబఱచుకొనుటకును, గ్రహదృష్టితోఁగాంచుటకును, పరాక్రమము వెలయించుటకు ఔదార్యము ప్రకటించుటకును,ఎదిరించినచోఁ దేజము వెలయించుటకుఁ బాదములంటిన నను గ్రహించుటకుఁ, గత్తిపట్టుటకుఁ జెలిమి నెఱపుటకు సమర్థుఁడై వసురాజనామముతో నొప్పెను.

మ. జననాథాగ్రణి యొక్కనాఁడు హిమవజ్జాతుండు కోలాహలా
ఖ్యనగాధీశుఁడు ప్రాలి శుక్తిమతి నాఁగఁగా వేగ లేగవ్వ మీ
టినసూటిఁ బోటవ్రేలిగోట నెగమీటెం గుంఠితాహార్యశా
సనగర్వాగ్రహుఁడై బలారి తనతోఁ సఖ్యంబు వాటింపఁగాన్. 119

జననాథాగ్రణి = రాజశ్రేష్ఠుఁడైన యావసురాజు, ఒక్కనాఁడు = ఒకదినమందు, హిమవజ్జాతుండు=హిమవంతునివలన సంభవించిన, కోలాహలాఖ్యనగాధీశుఁడు=కోలాహలుఁడనెడు పేరుగలపర్వత శ్రేష్ఠుఁడు, ప్రాలి=పైఁగావచ్చి ప్రవేశించినవాఁడై, శుక్తిమతి నాఁగఁగ = శుక్తిమతీనది నడ్డగింపఁగా, వేగఁగ=శీఘ్రముగా, లేగవ్వమీటినసూటిఁ=చిన్నగవ్వ నెగమీటినటులుగా, బోటవ్రేలిగోటఁ=కాలి బోటనవ్రేలిగోటిచేత, ఎగమీటెఁ = ఎగిరిపోవునట్టులుగా మీటివైచెను. ఏలాగనిన, బలారి = దేవేంద్రుఁడు,కుంఠిత=మొక్కపోయిన, అహార్యశాసన=పర్వతశిక్షవలనఁబుట్టిన, గర్వాగ్రహుఁడై=గర్వశౌర్యములు గలవాఁడై,తనతో సఖ్యంబు వాటింపఁగఁ=తనతో స్నేహముసేయునట్టులుగా, ఎగమీటెనని సంబంధము. ఇంద్రుఁడు తాను వజ్రాయుధముచేఁజేసిన పర్వతశిక్ష వసురాజుయొక్క కాలిగోటిచేఁ జేయఁబడెను గనుకఁ దనయొక్క పర్వతశాసన గర్వశౌర్యములను విడిచిపెట్టి వసురాజుతో స్నేహము చేసె నని తాత్పర్యము. అలంకార-వ్యతిరేకము, కావ్యలింగము.

బోటవ్రేలనుటకు-

సీ. ఘనసారచూర్ణ మొక్కలతాంగి తెచ్చిన బోటవ్రేలనే చుక్కబొట్టు పెట్టె. మను. ఆ. 3.

కోలాహలుఁడు హిమవజ్జాతుఁ డనుటవలన మిగులగొప్పవాఁడనియు నగాధీశుఁ డనుటవలన నున్నతోన్నతశైలరాజములలో నొకటియనియు భావము. కావునే మహాతటిని యగుశుక్తిమతిని నాఁగినది. దేవేంద్రుఁడు సఖ్యమువాటించుటకు లేగవ్వను మీటునటుల బోటనవ్రేలిగోట నెగమీటుటయే కారణము. ఈకార్యము వేగ జరిగిన దగుటచే బలలాఘవాదికములు సూచితములు.

తా. కోలాహలపర్వత మొకమాఱు శుక్తిమతి కడ్డము ప్రాలి దానిగమన నిరోధముగావింప వసురాజు పర్వతమును గాలిగోటితో నెగమీటెను. అందులకు మెచ్చి యింద్రుఁడు వసురాజుతో స్నేహముచేయఁ దొడఁగెను.

తే. ప్రబలకోలాహలాహార్యపతనరుద్ధ, విపులశుక్తిమతీమగ్నవిపుల కతని
చరణనఖరేఖసంవర్తసమయజలధి, నుద్ధరించినకిటిదంష్ట్ర యొఱపుఁ దెలిపె.120

ప్రబల=బలిష్ఠమయిన, కోలాహలాహార్య=కోలాహలపర్వతముయొక్క, పతన=పడుటవలన, రుద్ధ=అడ్డగింపఁబడిన, విపుల=విస్తారమయిన, శుక్తిమతీ=శుక్తిమతీనదియందు, మగ్న = మునిఁగియున్న, విపు

లకున్=భూమికి, (ని. 'విపులాగహ్వరీధాత్రీ' అని అ.) అతని=ఆవసురాజుయొక్క, చరణనఖరేఖ = రేఖాకృతిగల పాదనఖము, సంవర్తసమయజలధిన్ = ప్రళయకాలసముద్రమువలననుండి, ఉద్ధరించిన= పైకెత్తిన, కిటిదంష్ట్ర = యజ్ఞవరాహమూర్తి కోఱయొక్క, ఒఱపుఁ దెలిపెన్ = రీతిని గనుపఱిచెను. ఇక్కడఁ బ్రళయకాలసముద్రమునకును శుక్తిమతీనదికిని వరాహదంష్ట్రకును వసురాజ పాదనఖమునకును నుపమానోపమేయభావమని విచారింపవలయును. ఉపమాలంకారము స్పష్టమే.

తా. కోలాహలము వ్రాలుటచే మగ్నమైన భూమి నుద్ధరించుటలో వసురాజుపద నఖరేఖ ప్రళయమున భూమి నుద్ధరించిన వరాహదంష్ట్రవలె నుండెను.

చ. బలరిపుమిత్త్రుఁ డైనయల•పార్థివతల్లజుపాదపల్లవో
జ్జ్వలనఖరేఖదండ నగ•షండవిఖండనచండిమంబు తా
వలముగ నభ్యసించెనో కో • వజ్రము రాజశిరోవిభాగభా
గలఘుకిరీటవజ్రకళి•కాకృతి నిచ్చలు నాశ్రయించుచున్. 121

వజ్రము=వజ్రాయుధము, (ని. 'వజ్రోస్త్రీ హీరకేపవౌ' అనిఅ.) రాజ=సామంతరాజులయొక్క, శిరోవిభాగ=శిరఃప్రదేశములను,భాక్=పొందిన, అలఘు=అతిశయములైన, కిరీట = కిరీటములయందలి, వజ్రకళికాకృతిన్ = మొగ్గలుగాఁ దీర్పఁబడిన వజ్రమణిస్వరూపముచేత, నిచ్చలునాశ్రయించుచున్= నిరంతరమును నాశ్రయించినదై, బలరిపుమిత్త్రుఁడైన=దేవేంద్రునికి స్నేహితుఁడైన, అలపార్థివతల్లజు =రాజశ్రేష్ఠుఁడైన యావసురాజుయొక్క, పాదపల్లవ = చిగురుటాకువంటి పాదమందు, ఉజ్జ్వల= ప్రకాశించుచున్న, నఖరేఖ=రేఖాకృతిగల నఖముయొక్క, దండన్ = సమీపమున, నగషండ=పర్వత సమూహములయొక్క, విఖండన=భేదనమందలి,చండిమంబు=తీక్ష్ణత్వమును, తావలముగన్=స్థిరవాసనటు లుగా, అభ్యసించెనో కో = నేర్చుకొనఁబోలును. పాదనఖరేఖ పల్లవోజ్జ్వలము గావున వజ్రము కళికా కృతినొందెను. ఆశ్రయించినదినిచ్చలు, విద్యనభ్యసించినది తావలముగ, రాజువద్దవజ్రాయుధము విద్య నభ్యసించుట బలరిపుమిత్త్రుఁడగుటవలన, పార్థివతల్లజుఁడుగాననే దేవేంద్రునకు మిత్త్రుఁడైనది.

తా. వసురాజుయొక్క పాదనఖము పర్వతభేదనము చేసినది గనుక నాసామర్థ్యము తనకు లభిం చుకొఱకుసామంతరాజమకుటసంఘటిత వజ్రకళికారూపముచేత నాశ్రయించి యాయనపాదనఖసన్ని ధానమందుఁ బర్వతసమూహభేదనపాండిత్యమును నేర్చుకొన్నది.

ఈచెప్పుటచేత వసురాజు కాలిగోటిచేతఁ బ్రబలమయినపర్వతము నెగమీటినబలముగలవాఁ డనియును సామంతరాజులచేత నిరంతరమును బాదప్రణామము చేయఁబడుచున్నవాఁడనియుఁను దెలి యఁబడుచున్నది. అలం. ఉత్ప్రేక్ష.

చ. ఘనుఁ డతఁ డేఁగుదెంచి సరి•గద్దియ నుండ నగారి శైలఖం
డనకథ చారణాలి వొగ•డన్ నిజసన్నుతి కోసరించునే
ర్పునఁ దల వంచి పీఠతట • రూఢమణిన్ బొటవ్రేల మీటు న
య్యనఘుఁడు కొండ మీటినమ•హాద్భుతకృత్యము దెల్పుకై వడిన్. 122

ఘనుఁడు=గుణాధికుఁడైన, అతండు = ఆవసురాజు, ఏగుదెంచి=వచ్చినవాఁడై, సరిగద్దియ నుం డన్=సమానముగా గద్దెమీఁదఁ గూర్చుండఁగా, నగారి = పర్వతద్వేషియైన యింద్రుఁడు, శైలఖండన

కథ=తాను బర్వతములను ఖండించినకథను, చారణాళివొగడన్ = స్తోత్రపాఠకసమూహము స్తోత్రము సేయఁగా, నిజసన్నుతికొసరించు నేర్పునన్ = ఆత్మస్తుతికి సహింపకపోయినట్టులుగా, అనఁగా నామిష చేతననుట, తలవంచి = తలవంచుకొని, పీఠతట = గద్దెపీటయొక్క దరియందు, రూఢ = స్థాపింపఁబడిన, మణిన్ = ఒకానొకరత్నమును, బొటవ్రేలమీటుచున్ =కాలిబొటనవ్రేలితో మీటుచు, ఏమితాత్పర్యము చేతననఁగా, అయ్యనఘుఁడు = నిష్కల్మషుఁడైన యావసురాజు, కొండమీటిన = కోలాహల పర్వతమును కాలిబొటనవ్రేలిగోటితో సెగమీటిన, మహాద్భుతకృత్యమున్ = అత్యాశ్చర్యకరమైన కార్యమును, తెల్పుకైవడిన్ = తెలియఁజేయునట్టులుగా, పీఠతటరూఢమణిని బొటనవ్రేలమీటునని సంబంధము.

తా. వసురాజు దివ్యవిమానారూఢుఁడై స్వర్గమునకుఁబోయి దేవేంద్రునితోఁగూడ సరిగద్దియ మీఁద గూర్చున్నసమయమందు దేవేంద్రుఁడు పర్వతభేదనముచేసిన మహిమను జారణులు కైవారము సేయఁగా నాత్మస్తుతికి లజ్జించినవానివలెఁ దలవంచుకొని బొటనవ్రేలితోఁ బీఠపార్శ్వగత రత్నమును మీటుచుండుట వసురాజీప్రకారముగా బొటనవ్రేలిగోటిచేతఁ బర్వతమును మీటివైచినాఁడు. ఇట్టి వాని సన్నిధానమందు నేను వజ్రాయుధముచేతఁ బర్వతభంజనము చేసినకథ యేమిగొప్ప యని పొగడుచు న్నారు కాఁబట్టి పొగడవద్దని తెలియఁజేసినట్టులుగా నుండెను.

ఇచట లజ్జ కనుభావమైన పీఠలేఖనమందు వసురాజొనర్చిన పర్వతసముత్సారణవ్యాపారముం దెలుపుట నుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్షాలంకారము.

మ. అనఘాత్మీయపదోపకంఠమునఁ బ్రాణాచారముం బూనురీ
తి నితాంతానతశృంగమై నిభృతమై దిక్కేఁది యక్కొండ యుం
డిన గొన్నాళ్ళకుఁ గేళిశైలముగఁ బాటించె న్మహీజాని మ
న్ననఁ దచ్ఛైలశిరంబుపై మృదుపదన్యాసంబు గావించుచున్. 123

అనఘ=కల్మషరహితమైన, ఆత్మీయ=స్వకీయమైన, పద=పాదములయొక్క, ఉపకంఠమునన్ = సమీపమందు, అనియర్థము. పదోపకంఠమునన్=స్థానమైన పట్టణముయొక్క సమీపమందనిభావము. ప్రాణాచారముం బూనురీతిన్=ప్రాణాచారము పడ్డట్టులుగా, నితాంత=మిక్కిలియు, ఆనత=వంపఁబడిన, శృంగమైన=శిఖరముగలదై, నిభృతమై=నిశ్చలమైనదై, దిక్కేఁది=దిక్కుచెడి, అక్కొండయుండినన్=ఆ కోలాహలపర్వతముండఁగా, కొన్నాళ్ళకున్=కొన్నిదినములమీఁద, మహీజాని=వసురాజు,(మహీజాయా అస్యేతి మహీజానిః జాయాని జితి సమాసాన్తో నిఙాదేశః) బహువ్రీహియందు జాయాశబ్దంబు జానియగు. (బాలవ్యా.)

మన్ననన్ = ఆదరముచేత, తచ్ఛైలశిరంబుపైన్ = ఆ పర్వతశిరోభాగముమీఁద, మృదుపదన్యాసంబు గావించుచున్=మృదువైన పాదవిన్యాసము సేయుచు, కేళిశైలముగఁబాటించెన్=క్రీడా పర్వతముగా నంగీకరించెను. ఇందు నితాంతానతశృంగత్వ నిభృతత్వా నన్యగతికత్వాదులు ప్రాణా చారలక్షణములని తెలియవలయును. ఉత్ప్రేక్షాలంకారము.

కోలాహలుఁడు పరాభవింపఁబడి శృంగము వాల్చి చలింపక కొంతకాల మున్నపిదప వసురాజు కరుణించెను. వెంటనే కరుణింపలేదు. కరుణించుటకు హేతువు ప్రాణాచారపడుటయే. నితాంతా నతశృంగమగుటవలననే నగాధీశుఁడు కేళిశైలమగు నవకాశము కలుగుట,

తా. తనపదోపకంఠమున శృంగము వ్రాల్చి నిశ్చంచలముగాఁ బ్రాణాచారముపట్టుటచేఁ గోలాహలుని వసురాజు కౌన్నాళ్లకుఁ గరుణించి క్రీడాశైలముగఁ గొని శైలశిఖరమున విహరింపసాగెను.

ఉ. ఆనరలోకపాలకు మ•హామహనీయభుజోపగూహన
శ్రీ నిరవొందుచుం బుడమి • చేడియ గోత్రము లూఱడిల్ల సం
తానసమృద్ధిచే శుభవి•తానము తానక మయ్యె నేకసం
తానముఁ గన్న దైవతవ•తంసపురిం బురణించి నవ్వుచున్. 124

ఆ నరలోకపాలకు = ఆ వసురాజుయొక్క, మహాత్ = అధికమైన, మహనీయ = ఒప్పుచున్న, భుజోపగూహన శ్రీన్ = భుజాలింగనసంపత్తిచేత, ఇరవొందుచున్ = ఒప్పుచు, పుడమి చేడియ = భూకాంత, గోత్రములూఱడిల్లన్ = వంశములూఱడిల్లఁగానని యర్థము, కులపర్వతములు ధరాభరణశ్రమమునుబాసి విశ్రాంతినొందఁగానని భావము. సంతానసమృద్ధిచేన్ = సంతానపరంపరలచేత ననియర్థము, సప్తసంతానసమృద్ధిచేత ననిభావము. ఏకసంతానముఁగన్న = ఒక్కకొడుకు కొడుకుగాఁడన్నసామెతగా నొకసంతు గలిగి కదళీవంధ్యయైన, దైవతవతంసపురిన్ = ఇంద్రపట్టణమయిన స్వర్గమును, పురణించినవ్వుచున్ = విజృంభించి పరిహాసముసేయుచు, శుభవితానము తానకమయ్యెన్ = శుభసముదాయమున కాస్పదమాయెనని యర్థము, స్వర్గమందు సంతానవృక్ష మొక్కటియే యున్నదని భావము. (ని. 'సన్తాన స్సన్తతౌ గోత్రే స్యా దపత్యే సురద్రుమే' అని విశ్వము.)

పుడమిచేడెగాన నరలోకపాలకుని భుజోపగూహన మొందెను. ఉపగూహనము మహామహనీయము. శుభవితానములు సంతానసమృద్ధిగోత్రాంగీకరణము. నవ్వుట స్వోత్కర్షాసూచకము.

తా. భూకాంత వసురాజు భుజోపగూహనములతో నానందించుచు గోత్రములు (భూమిని భరించుశైలములు) ఊఱడిల్ల శుభాస్పదమగు సంతానసమృద్ధితో నలరి యేకసంతానము (ఒక కల్పవృక్షము) గల యమరావతిని నవ్వసాగెను.

క. ఆగతి నభిమతభోగ, శ్రీ గలభువి కొసఁగె నుల్ల•సితపత్రలతా
సౌగంధ్యము నవకళికా, సౌగంధ్యము చైత్రలక్ష్మి • సైరంధ్రిక్రియన్. 125

ఆగతిన్ = పూర్వోక్తప్రకారముగా, అభిమతభోగశ్రీగల = అభీష్టసుఖసంపత్తిగలిగిన, భువికిన్ = భూకాంతకు, చైత్రలక్ష్మి = వసంతలక్ష్మి, సైరంధ్రిక్రియన్ = సైరంధ్రియనఁగాఁ బాతివ్రత్యహానిలేకుండఁ బరగృహమందు స్వాధీనురాలై యుండి రాజకన్యకలకు మకరికాపత్రరచనాదికృత్యములాచరించునట్టి స్త్రీకిపేరుగనుక నట్టిసైరంధ్రివలెనే, (ని. సైరంధ్రీ పరవేశ్మస్థా స్వవశా శిల్పకారికా' అని అ.) ఉల్లసిత = వికసించిన, పత్రలతా = తీఁగెలుగా వ్రాయఁబడు మకరికాపత్రరచనలయొక్క, సౌగంధ్యము = సంబంధసహితత్వమునని యర్థము, ఆకులయొక్కయుఁ దీఁగెలయొక్కయు సంబంధసహితత్వమునని భావము. సౌగంధ్యశబ్దమునకు నిక్కడ గంధమనఁగా సంబంధము సంబంధసహితమయినది సగంధము సగంధభావము. సౌగంధ్యమని విచారింపవలయును. (ని. గన్ధో గన్ధక ఆమోదే లేశే సంబన్ధ గర్వయోః' అని వి.) నవకళికా = కోంచెముగా వికసించిన మొగ్గలయొక్క, సౌగంధ్యము = సౌరభ్యమును, ఒసఁగెన్ = ఇచ్చినదాయెను: అనఁగా భూమియందు వసంతర్తువు ప్రవేశించి వృక్షలతాదులను జిగిరింపఁజేసి పుష్పింపఁజేసె నని భావము,

శ్రీగల యన్నచోటఁ బ్రథమావిభక్తియైన శ్రీశబ్దమునకంటెఁ బరమందున్నకల యనెడుపద మందలి కకారమునకు గకారాదేశము వచ్చినది గనుకం బ్రాసముగాఁ జెప్పినాఁడు. ఇది సంధిగతప్రాస మనంబడును. దీనికిఁ బ్రమాణము.

తే. 'సంధిఁగూడిన వ్రాలుప్రాసంబులైన, నవియె సంధిగతాఖ్యల నమరుచుండు
దివిజు లాశ్చర్యమొంద శౌరివడవైచెఁ, జెంగి పోనీక మధురలోనం గరినన.'

అలం. కావ్యలింగము. ఉపమ. అప్పకవీయము.

తా. భూదేవి రాజన్యునకు నభీష్టసుఖములఁ గూర్చుచుండ నంతలోఁ జైత్రలక్ష్మి సైరంధ్రివలెఁ బత్త్రలతాసౌగంధ్యము కళికాసౌగంధ్యము సమకూర్చి భూదేవి నలరింపసాగెను. (అంతలో వసంతము వచ్చె ననుట.)

సీ. లలనాజనాపాంగ • వలనావసదనంగ తులనాభికాభంగ•దోఃప్రసంగ
మలసానిలవిలోల • దళసాసవరసాల ఫలసాదరశుకాల • పనవిశాల
మలినీగరుదనీక•మలినీకృతధునీకమలినీసుఖితకోక•కులవధూక
మతికాంతసలతాంత•లతికాంతరనితాంత రతికాంతరణతాంత•సుతనుకాంత

తే. మకృతకామోదకురవకా•వికలవకుల, ముకులసకలవనాంతప్ర•మోదచలిత
కలితకలకంఠకులకంఠ • కాకలీవి, భాసురము వొల్చు మధుమాస•వాసరంబు.

లలనాజన=స్త్రీజనముయొక్క, అపాంగ=క్రేగంటిచూపులయొక్క, వలన=చలనమందు, ఆవసత్=నివసించిన, అనంగ=మన్మథునితోడ, తులన=సమానధర్మముగల, అభిక = కాముకులయొక్క, (ని. 'కమనః కామనో భికః' అని అ.) అభంగ = అంతరాయములేని, దోఃప్రసంగము = ఆలింగన ప్రచారములు గలిగినదియు.

మన్మథుఁడు చెలువల కడగంటిచూపుల కదలికల నాశ్రయించి యుండు ననుట ప్రసిద్ధము,

శ్లో. "నూన మాజ్ఞా కరస్తస్య సుభ్రువో మకరధ్వజః,
యతస్తన్నేత్రసంచార సూచితేషు ప్రవర్తతే." భర్తృహరి.

అతఁ డనంగుఁడు గావున నే క్రేగంటిచూపుల నాశ్రయించి బ్రతుకవలసివచ్చినది. పురుషులు మన్మథసమాను లగుటవలనఁ జెలువలు కౌఁగిలింతలు అభంగముగా నెఱవేర్చుచున్నారు.

అలస=మందగతిగల, అనిల=వాయువుచేత, అనఁగా మలయమారుతముచేత, విలోల = మిక్కిలియుఁ జలించుచున్న, దళ=చిగురుటాకులుగలిగినవియు, సాసవ=ఆసవ మనఁగా మకరందము, మకరందముతోఁ గూడుకొన్నవియునగు, రసాల = తియ్యమామిడిచెట్లయొక్క, (ని. 'ఆమ్ర శ్చూతో రసాలో సౌ' అని అ.) ఫల=ఫలములయందు, సాదర = ఆదరముతోఁ గూడుకొన్న, శుక=చిలుకలయొక్క, ఆలపన=ఆలాపముచేత, విశాలము=విస్తారమయినదియు,

గాడ్పులు మందముగా వీచుచున్నవి. ఫలములు ఆసవము విరివిగా నున్నది. ఫలాశచేఁ జిలుకలు కలస్వనము చేయుచున్నవి. చిలుకలకు ఫలాశదీఱకున్నదనియు ఫలోత్పత్తికాలమనియు నెఱుంగనగు. పరిమళభారవాహము లగుటచే గాడ్పు లలసముగ నుండెను.

అలినీ = ఆఁడుతుమ్మెదలయొక్క, గరుత్ = ఱెక్కలయొక్క, అనీక = సమూహముచేత, మలినీ

కృత=నల్లనివిగాఁ జేయఁబడిన, ధునీ = నదీసంబంధములైన, కమలినీ=తామరతీఁగెలయందు, సుఖిత = సంజాతసుఖములైన, కోకకులవధూకము=చక్రవాకస్త్రీలు గలిగినదియును,

పుష్పరసము విరివిగా లభించుటచేఁ దుమ్మెదలు మెఱుఁగెక్కినవనియు వానిఱెక్కల కాంతులచేఁ దమ్ములు నల్లఁగ నున్నవనియు భావము.

అతికాంత=అత్యంతమనోహరములైన, సలతాంత = పుష్పసహితములైన, లతికాంతర=తీఁగెలయిండ్లలోపల, నితాంత=ఎడతెగని, రతికాంతరణ = మన్మథయుద్ధమందు, తాంత=అలసిన, సుతను కాంతము=స్త్రీపురుషులు గలిగినదియును,

వసంతర్తువు మనోహరముగనుంటచే స్త్రీపురుషులు నిరంతరకేళికల మెలఁగసాగిరి. కానశే బడలిరి. పొదరిండ్లు ప్రసవావృతములై కామోపభోగములకుఁ దగియుండును. మొదటిపాదమున దట్టపుఁగౌఁగిలింతలు ఇందు రతియుఁ జెప్పఁబడినది. వసంతమునఁ బొదరిండ్లు భోగాగ్రములనుట.

అకృతక=కృత్రిమముగాని, అనఁగా స్వభావసిద్ధమయిన, ఆమోద = పరిమళముగలిగిన, కురవక=గోరంటపువ్వులుగలిగినదియు, అవికల=విచ్ఛిన్నములుగాని, వకుళ=పొగడచెట్లయొక్క, ముకుళ = మొగ్గలుగలిగిన, సకల=సమస్తములైన, వనాంత = వనమధ్యములయందు, ప్రమోద=సంతోషముచేత, చలిత=సంచరించుచున్న, కలిత=ఒప్పెసములగుచున్న, కలకంఠ=కోయిలలయొక్క, కుల=సమూహముయొక్క, కంఠకాకలీ = కంఠసంబంధమయిన యవ్యక్తమధురధ్వనిచేత, భాసురము=ప్రకాశించుచున్న దియుఁ నగు, మధుమాసవాసరంబు = వసంతవాసరము, పొల్చుక్ =ప్రకాశించును. ఈసీసపద్యపు ప్రతిపాదమునను నాలుగంత్యప్రాసములు గలుగఁ జెప్పినాఁడు.

తా. వసంతమునందు పొగడలు గోరంటలు పూచియుఁ బొగడలు మొగ్గలు తొడిగియు నుండఁ గోకిలలు కూయసాగెను. కాముకులు కౌఁగిలింతలసుఖ మనుభవింపసాగిరి. చిలుకలు తీయమావిపైఁ జేరి మధురముగ భాషింపసాగెను. తుమ్మెదఱెక్కలచే నల్లనైన తమ్మితీవియలలో జక్కవలు మెలఁగఁ దొడఁగెను. స్త్రీపురుషులు వసంతవశమునఁ బుష్పితములై మనోహరముగానున్న పొదరిండ్లలో నలసట గలుగునటులఁ గామకేళికలఁ దేలిరి.

చ. ఒసర హిమావకుంఠనముఁ • లూడ్చి తెమల్చినపత్త్రభంగముల్
సన నసియాడుచుక్ మొగడ•చన్నులు పల్లవపాణిఁ గప్పనూ
తసలతికాలతాంగుల సు•దారగతిం జలి వాపి నెయ్యపుం
బెనఁకువ నేర్పె దక్షిణస•మీరణుఁ డొయ్యనఁ దావు లంటుచున్. 127

ఒసరక్ =ఒప్పిదమగునట్టులుగా, హిమ = మంచనెడు, అవకుంఠనములు = పైముసుఁగులను, ఊడ్చి=విడఁదీసి, తెమల్చిన=చలింపఁజేయఁబడిన, పత్త్రభంగముల్సనక్ = భంగములనఁగాఁ బరంపరలను రచనలును, భంగములనఁగాఁ బరంపరలనుటకు—

శ్లో. 'కస్తూరీవరపత్త్రభంగనికరో భ్రష్టో న గండస్థలే.' శృంగారతిలకము.

పర్ణపరంపరలనెడు కస్తూరికాపత్త్రరచనలు చెదరిపోవుచుండఁగా, అసియాడుచుక్ = కంపించుచు, మొగడచన్నులు = పూమొగ్గలనెడు లేఁతచన్నులను, పల్లవ = చిగురుటాకులనెడు, పాణి = హస్తములచేత, కప్ప = ఆచ్ఛాదించుచుండెడు, నూతన = క్రొత్తవైన, లతికా = తీఁగె

లనెడు, లతాంగులన్ = స్త్రీలను, అనఁగా నవోఢలను, ఉదారగతిన్ = ఉదారశబ్ద మతిశయ మందును దాతయందును వర్తించుచున్నదిగనుక నతిశయగతియనెడు ముక్తాహారాది ప్రదానము చేత, చలివాపి = శైత్యనివారణము చేసి యనియును గంపము పోఁగొట్టి యనియును నర్థము. దక్షిణ సమీరణుఁడు = దక్షిణవాయువనెడు దక్షిణనాయకుఁడు, ఒయ్యనన్ = తిన్నఁగా, తావులంటుచున్ = తావులనఁగాఁ బరిమళములును స్థానములు గనుకఁ బరిమళములంటుచు ననియును గళాస్థానములంటుచు ననియును నర్థము. 'నెయ్యపుం బెనఁకువ నేర్పెన్' పెనఁకువ యనఁగా నల్లికయును గలయికయును గనుక నిష్టమైన యల్లిక నేర్పెననియును గలయిక నేర్పెనని యర్థము. అనఁగా శీతకాలము పోయి వసంతకాలము రాఁగానే మలయమారుతము వ్యాపించి నూతనపుఁదీఁగెలయందుఁ జిగురుటాకులను పూమొగ్గలను నుత్పాదించి తీఁగెలంతట నల్లుకొనునట్టులుగాఁ జేసెనని తాత్పర్యము. అలం-రూపకసావయవము. శ్లిష్టమును.

ఇట లతాంగులు నవోఢలు. కాననే నూతనలతికాలతాంగు లనఁబడిరి. మొగడచన్నులు చేతులఁ గప్పుకొనుట, హిమాపకుంఠనము గీలించికొనుట స్వభావగుణములు. బహుస్త్రీయాసదృశశీలుఁడు దక్షిణనాయకుఁడు గావున దక్షిణసమీరుఁ డిట దక్షిణనాయకుఁడని తెలియునది. లతాంగులయెడ సదృశముగా వర్తించుటయే యిందులకుఁ దార్కాణ.

నవోఢాలక్షణము. రసమంజరినుండి-

శ్లో. బలాన్నీతా పార్శ్వం ముఖ మనుముఖం నైవ కురుతే
ధునానా మూర్ధానాం క్షిపతి వదనం చుబనవిధౌ
హృది న్యస్తం హస్తం క్షిపతి గమనారోపితమనా
నవోఢా వోఢారం రమయతి చ సస్తాపయతి చ.

తా. మంచుముసుఁగులు తొలఁగించి పత్త్రాదులు చెదర మొగడచన్నులు చేత మాటుపఱచు కొను నూతన లతాంగుల (నవోఢలను-తీవియలను) జలివాపి దక్షిణ సమీరుఁడు తావులు (సుగంధములు-కళాస్థానము) తాఁకుచుఁ బెనఁకువ నేర్పుచుండెను.

మ. అలరుంగైదువుజోదుకూర్మిసయిదోడై మాధవశ్రీతపః
ఫలమై యాడుమరుత్కుమారుఁ బ్రియమొప్పం దేనెనీరార్చి పెం
దెలిపూఁజొంపపుఁబొత్తులం బొదివి ధాత్రీజాతముల్ జోల వా
డె లసత్పల్లవడోల నుంచి కలకంఠీనాదగీతంబులన్. 128

అలరుంగైదువుజోదు=పుష్పాయుధుఁడైన మన్మథునియొక్క, కూర్మిసయిదోడై =ముద్దుతమ్ముఁడై, మాధవశ్రీ=వసంతలక్ష్మియనెడు లక్ష్మీదేవియొక్క, తపఃఫలమై=తపస్సునకుఫలరూపమై, ఆడు=క్రీడించుచుండెడు, మరుచ్ఛబ్దము వాయువునందును దేవతలయందును వర్తించును. (ని. 'మరుతౌ పవనామరౌ' అని అ.) మరుత్కుమారున్=కుమారవాయువనెడు దేవతాకుమారుని, ప్రియమొప్పన్ = ప్రేమాతిశయమొప్పఁగా, తేనెనీరార్చి = పువ్వుదేనియలచేత జలకమాడించి, పెందెలి పూఁజొంపపుఁబొత్తులంబొదివి=విశాలమైన తెల్లని పువ్వుగుత్తులనెడు పొత్తులలోఁ బొదిగి, లసత్ =ఒప్పుచున్న, పల్లవ=చిగురుటాకులనెడు, డోలనుంచి = తొట్లలోఁ బరుండఁబెట్టి, కలకంఠీనాద = ఆఁడుకోయిలలయొక్క

ధ్వనియనెడు, గీతంబులన్=పాటలచేత, ధాత్రీజాతముల్ = వృక్షములనెడు పెంపుడుతల్లులయొక్క సమూహములు, జోలవాడెన్=జోలపాడెను. (ని. 'ధాత్రీ స్యా దుపమాతాపి క్షితిర ప్యామలక్యపి' అని విశ్వము.) అలం-పరికరము. కావ్యలింగము.

తా. మన్మథుని చెలికాఁడును, మాధవ (వసంత-విష్ణు) తపఃఫలమునగు మరుత్కుమారుని (చిఱుగాడ్పులు-దేవపుత్త్రుఁడు) తేనెనీటఁ దానమాడించి పూజొంపంపుఁ బొత్తులఁ బరుండఁబెట్టి పల్లవడోలిక నుంచి కోయిలలనాదముతో ధాత్రీజాతములు (వృక్షములు-దాదులు) జోలఁబాడ సాగెను.

సీ. మునుసుమనోరాగ • మునవసంతము సూపెఁ గాననేందిర యశో • కంపుఁగొమ్మ
కాకొమ్మ నగుచు నె • య్యమునఁ గ్రొన్ననతేనె మెలఁగెడుసరసాళి • మీఁదఁజల్లె
నాసరసాళిసో • యగపుఁబాటలతోడఁ జని మాధవి ప్రవాళ • శాటిఁ దుడిచె
నామాధవి పరాగ • మక్షిరాగము మించఁ బఱతెంచుకలకంఠి • పై విదిర్చె
తే. నిట్లు లతికలు హితకోటి • నెనసి యపుడు, మదనదేవోత్సవక్రీడఁ • బొదలు ననిన
వరులుఁ దరుణులువిరుల యో • నరులవరలు, సిరులవలరాచజాతర • లేయుటరుదె.

ముసు=ముందుగా, కానసేందిర = వనలక్ష్మియనెడు నొకానొకస్త్రీ, అశోకంపుఁగొమ్మకున్ = అశోకతరుశాఖ యనెడు శోకరహితస్త్రీకి, సుమనోరాగమునన్ = మంచి మనోరాగముచేత, లేక కుసుంబాపువ్వులయొక్క పుప్పొడిచేత ననియర్థము, పుష్పరక్తిమయనిభావము. వసంతముసూపెన్ = రంజకద్రవ్యవిశేషమును గనుపఱిచెను, అనఁగా వసంతము చిలికెననియర్థము. వసంతర్తుధర్మమును గనుపఱిచెనని భావము. ఆకొమ్మ=ఆయశోకపుకొమ్మ, నగుచున్ = పరిహాసముచేయుచు, నెయ్యమునన్= చెలిమిచేత, క్రొన్ననతేనె = క్రొత్తపూఁదేనియ, మెలఁగెడు = తిరుగుచున్న, సరసాళిమీఁదఁజల్లెన్ = సరసమైన తుమ్మెదయనెడు సరసురాలైన సఖిమీఁదఁజల్లెను.

ఆసరసాళి=అనఁగా సరసమైన యాతుమ్మెద యనియెడు సరసురాలైన యాసఖియని యర్థము. సోయగపుఁబాటలతోడఁజని=శృంగారయుక్తమైన పాటలుపాడుచుఁబోయి, మాధవి = యనఁగా బండిగురువిందతీఁగె, అది యనెడు మాధవీనామముగలయొకానొకస్త్రీయొక్క, ప్రవాళమనఁగాఁ జిగురుటాకు, అదియనెడు వస్త్రముచేత, తుడిచెన్ = ఆ పూఁదేనియను దుడిచివైచెను, ఆమాధవి, అనఁగా బండిగురువిందతీఁగెయనెడు మాధవీనామముగల యాస్త్రీ, పరాగము, అనఁగా రంజకద్రవ్యవిశేషమును అని యర్థము, పుప్పొడి యనిభావము. అక్షిరాగముమించఁ బఱతెంచుకలకంఠిపై విదిర్చెన్ = స్వాభావికమయిన నేత్రరక్తిమ మించుచుండఁగాఁ బరుగెత్తివచ్చుచున్న యాఁడుకోయిలమీఁద విదిలించెననియును ద్వరితముగావచ్చుచున్న యవ్యక్తమధుర కంఠస్వరముగల స్త్రీమీఁదను గన్నులెఱ్ఱఁ బడునట్లుగా విదలించెననియును నర్థము విచారింపవలయును. ఇచట నభేదాధ్యవసాయము సేయవలయును.

ఇట్లు=ఈప్రకారముగా, లతికలు=తీఁగెలు, హితకోటినెనసి = ఇష్టసమూహమును గలిసికొని, అపుడు=ఆవసంతర్తువునందు, మదన దేవోత్సవక్రీడఁ బొదలుననినన్ = మన్మథదేవతాసంబంధమయిన యుత్సవక్రీడచేత నొప్పుచుండునని చెప్పుచుండఁగా, వరులుఁదరుణులు = పురుషులును స్త్రీలును, విరుల

రోవరులన్ = పూఁజప్పరములయందు, వరలుసిరులన్ = ప్రకాశించుచుండెడు సంపదలచేత, వలరాచజాతరల్సేయుటరుదె = మన్మథోత్సవములు సేయుట యాశ్చర్యమా, అనఁగా నాశ్చర్యముగాదనుట. అలం-శ్లేషము. అర్థాపత్తి.

తా. అశోకాదులు పుష్పింప నామకరందమును దుమ్మెదలు పానముజేసి పాటలుపాడసాగెను. బండిగురివెందలు పుష్పాదులతో నలరెను. కోకిలలు సంచరింపఁదొడఁగెను. ఇదియంతయుం లతికలొనరించు వసంతక్రీడవలెనుండుటచే స్త్రీపురుషులు వసంతోత్సవములు జరుపుటలో నచ్చెరు వేమున్నది ?

మ. అరిగాఁ బంచమ మేపగించి నవలాంలవ్వేళ హిందోళవై
ఖరి సూపం బికజాత మాత్మరవభంగవ్యాకులం బై వసీ
ధర నాలంబితపల్లవవ్రతవిధుం ల్దాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్. 130

నవలాలు=అనఁగా స్త్రీలు, ఇది దేశ్యపదముగనుక హ్రస్వము రాలేదు. ఇందుకు, (ని. దీర్ఘాణాం హ్రస్వస్స్యాన్నచదేశ్యపదేనచైకవర్ణేపి' అని న.) అవ్వేళన్ = ఆవసంతాదియందు, అరిగాఁ బంచమ మేపగించి = కోవెలలకుఁ బ్రతికూలమగునట్టులుగాఁ బంచమస్వరము విసర్జించి యని యర్థము. రి అనఁగా ఋషభస్వరమునకు సంజ్ఞగనుక ఋషభస్వరరహితమగునటులుగా నని భావము.

శ్లో. 'ప్రథమశ్రవణాచ్ఛబ్దశ్శ్రూయతే హ్రస్వమాత్రకః,
సాశ్రుతి స్సమ్పరిజ్ఞేయా స్వరావయవలక్షణా,
శ్రుతిభ్యస్స్యు స్స్వరాష్షడ్జ ఋషభగాంధారమధ్యమాః,
పంచమో ధైవతశ్చాథ నిషాద ఇతి సప్తతే,
తేషాంసంజ్ఞా స్సరిగమపధనీతి సప్తస్వరామతాః.'

అని సంగీతశాస్త్రమున, హిందోళవైఖరి సూపన్ = హిందోళమనఁగా హిందోళరాగము, అది ఋషభపంచమస్వరములు రెండును గాక కడమ యైదుస్వరములతోఁ గూడుకొన్న యౌడవరాగ మనియును శిశిరర్తువసంతర్తువులయొక్క సంధికాలమందు గానముచేయఁబడునదియనియు సంగీతశాస్త్రప్రసిద్ధముగనుక నట్టి హిందోళరాగముయొక్కవైఖరిని గనుపఱుపఁగా, అనఁగా నారాగమును బాడఁగా ననుట.

శ్లో. 'శిశిరస్య వసన్తస్య సన్ధౌ హిన్దోళరాగకః' అనియును,
శ్లో. 'ఔడవః పఞ్చభిః ప్రోక్త స్స్వరైః షడ్భిస్తు షాడవః,
సంపూర్ణ స్సప్తభి ర్జ్ఞేయ ఏవంరాగాస్త్రిధామతాః.'

అనియు నిత్యాదులు సంగీతశాస్త్రమందుఁ జెప్పఁబడియున్నవి. పికజాతము = కోకిలసమూహము, ఆత్మరవ=స్వీయమయిన పంచమస్వరముయొక్క, భంగ=తిరస్కారమువలన, వ్యాకులంబై=విచారముగలదై, వనీధరన్=వనభూమియందు, ఆలంబిత = అవలంబింపఁబడిన, పల్లవ = చిగురుటాకులుఁగల, వ్రత=నియమముయొక్క, విధులు = విధానములను, తాల్పన్=వహింపఁగా, అనఁగాఁ బర్ణభక్షణముచేసి తపస్సుచేయఁగా ననుట, తదీయధ్వనిన్ = ఆకోకిలసమూహముయొక్క రవమును, అనఁగా బంచమస్వరమును; వసంతము=వసంతరాగము, మహాసంపూర్ణభావోన్నతిన్ = మహత్తయిన సంపూర్ణభావాతిశ

యముచేత, సరిగాన్ = కోకిల కనుకూలమౌనట్టులుగా నని యర్థము. ఋషభసహితమగునట్టులుగా నని భావము. కైకొనియెన్ = అంగీకరించెనని యర్థము. వసంతర్తుప్రవేశముకాఁగానే స్త్రీలు ఋషభపంచమములతోఁగూడ సప్తస్వరసహితమయి సంపూర్ణసంజ్ఞగలవసంతరాగమును బాడిరని యాశయము.

"కేచిదౌడవసంపూర్ణాః కేచిత్షాడవపూరణాః, కేచిత్సంపూర్ణరాగాశ్చ" అని ఔడవషాడవములును పంచషడ్స్వరముల నొప్పి సంపూర్ణము లగుటవలన సప్తస్వరసహితమైన వసంతరాగమును సంగీతకలారహస్యనిధియగు రామరాజభూషణుఁడు మహాసంపూర్ణవిశేషణవిశిష్టముగాఁ జెప్పెను.

మ. కరఘాతంబుల కోర్వ లేక హిమసం॰ఘాతంబు శీతక్షమా
ధరదుర్గంబు భజింపఁగా నలజగ॰త్కంపప్రదాస్తోకభీ
కరదోషాయతిశాలిఁ జుట్టుకొని ల॰గ్గ ల్వట్టి ధట్టింతు నం
చరవిందాప్తుఁ డుదీచి కేఁగెఁ బ్రబలుం॰ డై మాని దాక్షిణ్యమున్. 131

కరఘాతంబులకోర్వలేక = ముష్టిఘాతములకు సహింపలేక యని యర్థము. కిరణముల వేఁడిమికిఁ దాళలేకయని భావము. హిమసంఘాతంబు = మంచుయొక్కగుంపు, శీతక్షమాధరదుర్గంబుభజింపఁగాన్ = హిమవత్పర్వతదుర్గము నవలంబింపఁగా నని యర్థము. స్వకీయస్థానముగనుక శీతక్షమాధరదుర్గమును శీతసంఘాత మాశ్రయించెనని యాశయము. అల = ఆ, జగత్కంపప్రద = జగత్తులకుఁ దొందరనిచ్చుచున్నదనియు, అస్తోకభీకర = అధికభయమును బుట్టించునదియు, దోష = పాపముయొక్క, ఆయతి = దైర్ఘ్యముచేత, శాలి = ఒప్పుచున్నట్టి, హిమసంఘాతంబు అని యర్థము. జగత్తులను జలిచేత వడఁకించుననియు మిక్కిలి భయంకరమయియుండుననియు దోషాయతిశాలియనఁగా రాత్రియొక్క దైర్ఘ్యముచేత నొప్పుచుండుననియును భావము. శీతకాలపురాత్రియెక్కువగా నుండుట ప్రకటముగదా. చుట్టుకొని = ఇట్టి హిమసంఘాతమునఁ జుట్టువైచికొని, లగ్గల్వట్టి = ఆవరణముదాఁటి, ధట్టింతునంచున్ = మర్దింతుఁగాకయని, అరవిందాప్తుఁడు = కమలములకు హితుఁడయిన సూర్యుఁడు, మానిదాక్షిణ్యమున్ = మోమోటము వదలి యని యర్థము. దక్షిణస్థితత్వము మానియనిభావము. ప్రబలుండై = బలాధికుఁడయి, ఉదీచికేఁగెన్ = ఉత్తరపుదిక్కునకుఁబోయెను. మంచువలన నరవిందములు చెడిపోవుచున్నవి గనుక సూర్యుఁ డరవిందాప్తుఁ డయినందున మంచును శిక్షింపఁ బోవుట యుక్త మనునభిప్రాయము గ్రహింపవలయును. అలం. హేతూత్ప్రేక్ష. కావ్యలింగమును.

మంచువలనఁ దామరపూవులు చెడిపోవుటఁ జూచి యరవిందాప్తుఁడు తనయాప్తభావము ప్రకటింప నెంచెను. కావుననే దాక్షిణ్యమును విడనాడెను. తామరలు మంచుచేఁ జెడిపోవు ననుటకు-

శ్లో. అథవా మృదువస్తు హింసితుం మృదునైవా రభతే ప్రజాంతకః,
హిమసేకవిపత్తిరత్ర మే నలినీ పూర్వనిదర్శనం మతా.

మ. చివురుంగైదువువేల్పు చైత్రమున న॰క్షీణధ్వజోత్క్షేపవై
భవుఁడై తెమ్మెరతేరిపైఁ గదలి రాఁ॰ బ్రత్యగ్రనాలాగ్రవా
ర్ష్యవిటంకంబులు ప్రాకి వల్లివసజా॰స్యల్లల్లి రుత్ఫుల్లప
ల్లవహాస్తంబుల భావిభావుకఫలో॰ల్లాసంబుతోఁ గ్రొవ్విరుల్. 132

చివురుంగైదువువేల్పు = అనఁగా మన్మథుఁ డనెడుదేవుఁడు, చైత్రమునన్ = చైత్రమాసమందు, అక్షీణ = తక్కువగాని, ధ్వజోత్క్షేపవైభవుఁడై = మీనధ్వజారోహణమనెడు పట్టాంబరధ్వజారోహణ

వైభవముగలవాఁడయి, తెమ్మెరతేరిపైఁ గదలిరాక = మలయమారుతమనెడు రథముమీఁద నెక్కి రాఁగా, ప్రత్యగ్ర = నూతనములయిన, సాలాగ్ర = వృక్షాగ్రములనెడు, హర్మ్యవిటంకంబులు ప్రాకి = సౌధాగ్రములపైకెక్కి, వల్లివనజాస్యలు = తీఁగలనెడు స్త్రీలు, ఉత్ఫుల్ల = వికసించిన, పల్లవ = చిగురుటాకులనెడు, హస్తంబులన్ = హస్తములచేత, భావి = ముందురాఁగలిగిన, భావుక = భవ్యమయిన, ఫలోల్లాసంబుతోన్ = పండ్లయొక్క యుల్లాసమనెడు ఫలోల్లాసముతోడ, క్రొవ్విరులు = క్రొత్తగా వికసించినపుష్పములను, చల్లిరి = చల్లినవారైరి.

తెమ్మెర తేరుగాఁగలవాఁ డగుటవల్లనే వేలుపు. తెమ్మెర రథముగాన నరదమునకంటె టెక్కెమెత్తుగానుండవలయుఁ గాన నది యతిక్షీణమైనది. కాననే క్రొవ్విరులు చల్లుటకు సాలాగ్రహర్మ్యవిటంకము లెక్కవలసి వచ్చినది. చైత్రమున మన్మథోత్సవములు గావించుట సుప్రసిద్ధము. మీనధ్వజమిట ధ్వజోత్క్షేపవైభవము, రథోత్సవము తెమ్మెరతేరిపైఁ గదలివచ్చుట యని తెలియునది.

లోకములో నొకానొకదేవునికి సంవత్సరోత్సవము జరిగించునెడల నాదేవుఁడు ధ్వజారోహణవైభవము నంగీకరించి క్రమముగా రథారూఢుఁడై వచ్చుచుండఁగాఁ బురస్త్రీలారథముమీఁద దోసిళ్లతోఁ బువ్వులు మొదలయినవి చల్లెడు సంప్రదాయముగనుక దాని ననుసంధించి మన్మథరథోత్సవవిషయముగాఁ జెప్పినాఁడు. అలం. రూపకము. సావయవము.

తెమ్మెర. తె. దక్షిణపు ఎరల్ గాలిగావునఁ దెమ్మెరలు అనువ్యుత్పత్తివలనఁ దెమ్మెరలు అను శబ్దమె యుక్తము. పూర్వకవు లీశబ్దము లు వర్ణాంతముగఁ బ్రయోగించిరి. ఇటీవలికవులు ఏకవచనరూపము తెమ్మెర యని భ్రాంతిపడిరి.

వ. మహిళామండలమంజులభ్రమరకామర్దంబు శ్యామాముహు
ర్ముహురున్మీలితపత్త్రభేదనిపుణంబుం బద్మినీకంకణ
గ్రహణాపాదియునై సగంధవిటసంప్రాప్తిన్ విజృంభించుచున్
విహరించెన్ మధుమత్తగంధవహ మవ్వేళన్ వనాంతంబునన్. 133

ఈపద్యమునందు మధుమాసమునందలి గంధవహపరముగను మద్యపానము గావించిన గర్వాత్ముని పరముగాను అర్థద్వయము గవి చెప్పియున్నాఁడు.

మహిళా = ప్రేంకణపుఁ దీఁగెలయొక్క, (శ్లో. 'శ్యామాతుమహిళాహ్వయా, లతాగోవిన్దనీగున్ద్రా ప్రియఙ్గుః ఫలినీఫలీ' అని అ.) మండల = సమూహమందు, మంజుల = మనోహరములయిన, భ్రమరక = తుమ్మెదలయొక్క, ఆమర్దంబు = సమ్మర్దము గలిగినదియునని యర్థము. మహిళామండల = స్త్రీసమూహముయొక్క, మంజుల = కోమలములయిన, భ్రమరక = ముంగురులయొక్క, ఆమర్దంబు = పీడనము గలదని యర్థాంతరము. (శ్లో. 'అలకాశ్చూర్ణకుస్తలాః, తే లలాటే భ్రమరకాః' అని అ.) శ్యామా = లతావిశేషముయొక్క, ముహుర్ముహురున్మీలిత = మాటిమాటికిని వికాసమును బొందుచుండెడు, పత్త్ర = ఆకులయొక్క, భేద = భేదనమందు, నిపుణంబున్ = సమర్థమయినదియును, అని యర్థము. శ్యామా = యౌవనమధ్యస్థురాలియొక్క, ముహుర్ముహురున్మీలిత = మాటిమాటికిని రచియింపఁబడుచుండెడు, పత్త్ర = మకరికాపత్త్రములయొక్క, భేద = భిన్నపఱచుటయందు, నిపుణంబున్ = సమర్థమయినదని యర్థాంతరము. పద్మినీ = పద్మలతాసంబంధమయిన, కంకణ = జలబిందువులయొక్క,

గ్రహణ=గ్రహించుటను, ఆపాదియుఁ = ఆపాదించుచున్నదియనని యర్థము, పద్మినీ=పద్మినీజాతిస్త్రీయొక్క, కంకణగ్రహణాపాదియును, ఇక్కడఁ గంకణశబ్దముచేత హస్త మపలక్షిత మగుచున్నదిగనుక హస్తగ్రహణాపాదనము సేయుచున్నదని యర్థాంతరము. ఐ=ఇట్టిదై, సగంధ=పరిమళయుక్తమయిన, విటప=తరువిస్తారముయొక్క, ప్రాప్తిఁ=పొందికచేత, విజృంభించుచుఁ = గర్వించుచును అని యర్థము. (ని. 'విస్తారో విటపో౽స్త్రియామ్' అని అ.) సగంధ=గర్వసహితుఁడయిన, విటప=విటనాయకునియొక్క, ప్రాప్తిఁ=సాంగత్యముచేత, విజృంభించుచుఁ = విజృంభించుచు అని యర్థాంతరము. మధు = మధుమాసమందు, మత్త=క్రొవ్విన, గంధవహము = వాయువు అని యర్థము. మద్యముచేత మదించినదని యర్థాంతరము. (ని. 'గన్ధో గన్ధక ఆమోదే లేశే సమ్బన్ధ గర్వయోః' అని వి.) అవ్వేళఁ=ఆకాలమందు, వనాంతంబునఁ = వనమధ్యమందు, విహరించెఁ=సంచరించెను.

మధుమత్తగంధవహమను నమహన్నపుంసకమునకుఁ బుంస్త్వవివక్షచేయుట కవిసమ్మతము.

ఉ. శ్రీయుతమూర్తి యోపురుషసింహమ! సింహముపాలిసొమ్ము గో
మాయువు గోరు... (భాగవతము)

తా. మారుతము వసంతునిస్నేహమున నుల్లసిల్లి ప్రేంకణపుఁజెట్లపైఁగల తుమ్మెదల కొత్తిడి గూర్చుచు, లతావిశేషములఁ జివురాకులను వేఱుపడునటులఁ గదిలించుచు, తమ్మిపూలపైఁగల జలకణములంటుచుఁ దావులొలయుఁ జెట్ల నాశ్రయించి వనాంతరము సంచరింపసాగెను. (మధుమత్తుఁడగు పురుషుఁడు చెలువలముంగురులఁ దొలంగఁ ద్రోయుచు చెలువలమకరికాపత్రాదులఁ జెదరఁ జేయుచుఁ బద్మినీజాతి స్త్రీలహస్తములఁ దాఁకుచు విటులచెలిమితోఁ జెలరేఁగెనని యర్థాంతరము.)

సీ. ఏపారుపొదరిండ్ల • నాపాటలాశోకదీపార్చిఁ గనకక • లాప మరసె
సాలావలులు దాఁటి • యేలాలతావారబాలాతతిపరాగ • పటము లూడ్చె
నానామధుపనవ్య • గానామృతము మెచ్చి సూనాసవము లెల్లఁ • జూర లిచ్చె
ఝంకారహితధీర • హుంకారశుకభటాహంకారముల ఘలా • హాతి యొనర్చె
తే. ననుచు నాగంధవహుని ధౌ • ర్త్యములు దెలుపు, లీలవిరిసినవిరులు రా • లినరజంబు
లొలికినరసంబు లురిలిన • ఫలము లధిపు, మ్రోలనిడిపల్కి రుద్యాన • పాలురపుడు.

వసంతవాయువును దొలుత గంధవహశబ్దసారస్యముచే గర్వితుఁగాఁ జెప్పి దుండగములను జూపి యిపుడు గంధవహనామ మానుకూలముగఁ గావించిన ధౌర్త్యములు వనపాలకులు రాజునకు దృష్టాంతసహితముగా నెఱింగించునటులఁ జెప్పుచున్నాఁడు.

ఏపారు=అతిశయించుచున్న, పొదరిండ్లఁ = లతాగృహములనెడు గృహములయందు, ఆపాటలాశోకదీపార్చిఁ - ఆపాటల = అంతటనెఱ్ఱనైన, అశోక=రక్తాశోకపుష్పమనెడి, దీపార్చిఁ = దీపజ్వాలికచేత, కనకకలాపమరసెఁ = కనకమనఁగా సంపెఁగయును బంగారమును, బంగారము పేళ్లన్నియుఁ సంపెఁగకుఁ జెల్లును. సంపెఁగపువ్వులనెడు కనకస్తోమము గాంచెను. పొదరిండ్లు గావునఁ దలుపులు ద్వారబంధములు లేనివి. అందు ఆపాటలములగు నశోకపుష్పములను దీపములు గలవు. కాన కనకలాప మరయఁ గలిగెను పరద్రవ్యసందర్శనమెయిట ధౌర్త్యము.

సాలావలులుదాఁటి = సాలమనఁగా వృక్షమును ప్రాకారమును, (ని. 'అనోకహః కుటస్సాలః' అని అ. ని.) ('ప్రాకారో వరణ స్సాలః' అని అ.) వృక్షసమూహములనెడు ప్రాకారసమూహములు దాఁటి, ఏలాలతా=ఏలకితీఁగెలనెడు, వారబాలా = వేశ్యాంగనలయొక్క, తతి=సమూహముయొక్క, పరాగ=పుప్పొడియనెడు, పటములు=వస్త్రములను, ఊడ్చెన్=విడిపించెను. మధుపశబ్దము తుమ్మెద యందును మద్యపాయియందును వర్తించును. లతావార = తీవెలచాలను, బాలా = బాలికలయొక్క యనుట తగును. వారస్త్రీ సర్వజనపరిగ్రహణయోగ్యురాలు గాన నట ధార్ష్ట్యమునకుఁ దావులేదు. ఉండెఁబో బాలాపటము లూడ్చునంత ధార్ష్ట్యము గాదు.

నానా=సమస్తములయిన, మధుప = తుమ్మెదలనెడు మద్యపాయులయొక్క, నవ్య=నూతన మయిన, గానామృతము మెచ్చి=అమృతప్రాయమయిన సంగీతమును మెచ్చి, సూనాసవములెల్లఁ జూర లిచ్చెన్=సూనాసవమనఁగా పూఁదేనెయు నిప్పపువ్వు మొదలైన పువ్వులచేతఁ జేయఁబడిన మద్యంబును, పూఁదేనియలనెడు నిప్పసారా మొదలైనవానిఁ జూరలిచ్చెను. మధుపులు త్రాగుఁబోతులు గాన వారలగానమునకు మెచ్చుట వారలకు పుష్పాసవము (సారాయము) కానుకగా నొసంగుట ధార్ష్ట్యము. ఇందుల కొలికినరసము తార్కాణము.

శంకారహిత=శంకలేనట్టి, ధీర=సమర్థమైన, హుంకార = హుమ్మనెడు ననుకరణశబ్దముతోఁ గూడుకొన్న, శుక=చిలుకలనెడు, భట=భటులయొక్క, అహంకారములన్ = గర్వములచేత, ఫల= పండ్లయొక్క, ఆహతి=పతనమనెడు, ఫలాహతి=వస్తులాభభంగమును, ఒనర్చెన్=చేసెను. చిలుకలు బంట్లు. కాననే జంకు గొనరు. వారికొఱకు ఫలాహతి గావించుటయు ధార్ష్ట్యమె. ఫలాహతి యనుటలోఁ గార్యఫలము చెఱచుటయు నగుగాన నదియ యుక్తమని యాశయము.

అనుచున్=అనిపలుకుచు, ఆగంధవహుని = గంధవహుఁడనఁగా వాయువును గర్వగ్రస్తుఁడును. ఆవాయువనెడు గర్వగ్రస్తునియొక్క, ధార్ష్ట్యములు జలుపులన్ = దుండగములు తెలియఁజేసినట్టులుగా, విరిసినవిరులు= ఊడిపడినపువ్వులును, రాలినరజంబులు = రాలినపుప్పొడులును, ఒలికినరసంబులు= క్రమ్మరిల్లినపూఁదేనియలును, ఉరిలినఫలములు=రాలిపడిన ఫలములును, అని క్రమాలంకారము. అధిపుమ్రోలనిడి = వసురాజుముందర నుంచి, ఉద్యానపాలురు = వనపాలకులు, అపుడు = ఆసమయమందు, పలికిరి=ఒకవాక్యమును బలికిరి. ఉద్యానపాలు రన్నచోట (ని. 'లుజసోలజసోలాం తాల్లాంతాత్తురరోతయోః క్రమేణ స్తః.' న.) అనుసూత్రముచే నకారపరక లకారాంతశబ్దమగు నీవనపాలశబ్దమునకు బహువచనమున రువర్ణకము వచ్చినది. అలం. ఉత్ప్రేక్ష. క్రమము. శ్లేషోత్థాపితము.

క. స్వామీ యేమని పొగడెద, మామనికిన్ మనికి యైన • యారామమునం
గామనిశితాస్త్రములు ద, త్కోమలతరలతలు చిగురు•కొమ్మలచేవల్. 135

స్వామీ=ఏలినవాఁడా, ఆమనికిన్ = వసంతమునకు, మనికియైన=నివాసస్థానమైన, ఆరామమునన్=ఉద్యానవనమందు, కోమలతరలతలు = ఇక్కడ లతాశబ్దమువలనఁ దజ్జన్యములైన పుష్పములు లక్షితము లగుచున్నవి. కోమలతర=అత్యంతసుకుమారములైన, లతలు=తీఁగలయందుండు పుష్పములు, కామనిశితాస్త్రములు=మన్మథకఠోరబాణములు, చిగురుకొమ్మలున్=లేఁతకొమ్మలును సారములు కాఁబట్టి, ఏమనిపొగడెదము = ఏమనికొనియాడఁగలము. అనఁగాఁ గొనియాడఁజాలమనుట. అత్యంత సుకుమార

ములైన పుష్పములు మన్మథకఠోరబాణములని చెప్పుటయును జిగురుకొమ్మలయందే చేవలని చెప్పుటయును విరోధము. ఉద్దీపనములనియును దినదిన ప్రవర్ధమానములనియును బరిహారము. అలం. విరోధాభాసము. అతిశయోక్తి.

దత్తమండలములలోఁ జివురుచెట్టను నొకజాతివృక్షముగలదనియు నది యెంతముదిరినను జేవ బట్టదనియు గవి దత్తమండలవాసి గాననే యావృక్షస్వభావమెఱింగి-యచ్చట చివురుచెట్టుకొమ్మలు గూడఁ జేవబాఱియుండునని యతిశయోక్తిగఁ జెప్పెనని కొందఱందురు. ఇది సమంజసమని తోఁచెడిని. "అచటఁ బుట్టిన చివురుఁగొమ్మైన చేవ" యను మనుచరిత్రపద్యభాగము "చిగురుఁగొమ్మయుఁ జేవ" యను రామాభ్యుదయవాక్యము వృక్షపరముగాఁ జెప్పఁబడియున్నవి.

**తే.** నాథ చివురులు రంజిల్లె • ననలు మొలిచె
నలరె విరులెల్ల పూఁపలు • దలలు సూపెఁ
బసిమి నిరవొందెఁ బిందియల్ • బలసె నవశ
లాటువులు సాంద్రరుచులఫలంబు లెసఁగె. 136

నాథ=స్వామీ, చివురులు రంజిల్లెన్ = చిగురుటాకులు రక్తిమచేత నొప్పెను, ననలు మొలిచెన్ = మొగ్గలు పొటమరించెను, అలరె విరులెల్లన్ = పుష్పములన్నియు వికసించెను, పూఁపలు దలలు సూపెన్ = మొటిమెలు పొడఁజూపెను, పిందియల్ = లేఁతపిందెలు, పసిమిన్=పసరుచాయచేత, ఇరవొందెన్=అమరెను, నవశలాటువులు = నూతనములైన కాయలు, బలసెన్=బలిష్ఠములాయెను. ఫలరబులు=పండ్లు, సాంద్ర=దట్టమైన, రుచులన్ = తియ్యఁదనముచేత, లేక అరుణపీతాదివర్ణముల చేత ననియైనఁ జెప్పవచ్చును. ఎసంగెన్=ప్రకాశించెను. అనఁగా నీచెప్పఁబడినవియన్నియుఁ గలిగియున్నవని తాత్పర్యము. ఇచటఁ జివురులుమొదలుకొని పండ్లవఱకుఁగల యవస్థలు వరుసగాఁ జెప్పినాఁడు.

**ఉ.** కేళివనాళి నీయెడ శుకీనినదార్భటి చెప్ప నేల భూ
పాలక నీలకంఠములు • పాయక మ్రోయులతాంతవాసనా
జాలము సోఁడుముట్ట సురసాలము వీడ్కొని వచ్చు షట్పదీ
మాలికఁ దోఁచునబ్బురపుమబ్బులయుబ్బులు గుబ్బతిల్లఁగన్. 137

భూపాలక=ఓవసుమహారాజా, కేళివనాళిన్=కేళికావనశ్రేణియందు, ఈయెడన్=ఈవసంతసమయమున, శుకీ.ఆఁడుచిలుకలయొక్క, నినదార్భటి = శబ్దాడంబరమును, చెప్ప నేల=చెప్పనక్కఱ లేదు. అనఁగా విరామములేకయే యున్నదనియు వసంతర్తువు గనుక నిప్పుడు చిలుకలయొక్క కోలాహలధ్వనులు గలిగియుండుట చిత్రముగాదనియును భావము. ఇఁక నేమనిన, లతాంత=ఉద్యానవనపుష్పములయొక్క, వాసనాజాలము=పరిమళసముదాయము, సోఁడుముట్టన్=మిన్నంటి కపాలములకెక్కఁగా, సురసాలము వీడ్కొని=కల్పవృక్షమును విడిచిపెట్టి, వచ్చు=వచ్చుచున్న, ఇక్కడఁ గల్పవృక్షపుష్పవాసనలకంటె నుద్యానవనపుష్పవాసనలు శ్రేష్ఠములని భావము. షట్పదీమాలికన్ = ఆఁడుతుమ్మెదలయొక్క సమూహమందు, తోఁచు=స్ఫురించుచున్న, అబ్బురపుమబ్బుల=అద్భుతమేఘములయొక్క, ఉబ్బులు=ఉల్బణములు, గుబ్బతిల్లఁగన్ = అతిశయించుచుండఁగా, నీలకంఠములు =

వర్ష ర్తువునందు ధ్వనిచేయవలసిన నెమళ్లును, (ని. 'మయూరో బర్హిణో బర్హీ నీలకంఠో భుజఙ్గభుక్' అని అ.) పాయకర్త్రుయుక్ = ఎడతెగక కేకారవములు చేయుచుండును. అనఁగా షట్పదీమాలికయం దలి మేఘభ్రాంతిచేత నీలకంఠము లెడతెగక ధ్వనిచేయుననుట.

చిలుకలధ్వనులచేత ఫలసమృద్ధి తుమ్మెదలరాకచేఁ బ్రసూనసమృద్ధి సూచితములు.

ఉద్యానవనపుష్ప సౌరభము దిగంతవ్యాప్తమగుటయేగాక మిన్నంటినది. కానసే కల్పవృక్ష ములవీడి షట్పదములు మాలికలుగా రాఁగలిగెను. అబ్బురపుమబ్బులుగా నుండుటవలన నకాలమేఘో దయముగ నెమిళ్లు తలంచెననుట. తుమ్మెదలమేనిచాయలు మేఘములుగాఁ దోఁచెననుటవలన దుమ్మెదల సంఖ్యాబాహుళ్యము తెలియనగును.

తా. ఉద్యానవనము చిలుకల ధ్వని చెప్ప వీలులేదు. తుమ్మెద లుద్యానపుష్పసౌరభ లుబ్ధములై కల్పవృక్షముల వదలి వచ్చుచుంటఁ జూచి మేఘములేమో యని నెమిళ్లు తెంపులేక గానము చేయు చున్నవి.

క. మహనీయమధుఝరీసం, గ్రహమునఁ గాలువలు వఱపి • గనిమలుగ రజం
బహరహము నెఱపి మాకుక్, సహకారము లయ్యె నచటి•సహకారంబుల్. 138

మహనీయ=విస్తారమైన, మధు = పుష్పరసములయొక్క, ఝరీ = ప్రవాహములయొక్క, సంగ్ర హమునక్ =సంపాదనముచేత, కాలువలువఱపి = కాలువలుగాఁ బాఱించి, గనిమలుగక్ = కట్టలుగా, రజంబు=పుప్పొడిని, అహరహముక్ = ప్రతిదినమును, నెఱపి=సవరించి, మాకుక్ = అనఁగాఁ దోఁటపని చేయునట్టి మాకు, అచటిసహకారంబులు = ఆవనమందలి తియ్యమామిడిచెట్లు, సహకారములయ్యెక్ = తోడుపని చేయునట్టివి యాయెను.

తా. తేనియసోనలతోఁ గాలువలుతీర్చి పుప్పొడితోఁ గట్టలేర్పఱచి సహకారములు (తియ్య మావిళ్లు) ఉద్యానపాలకులకుఁ దోడ్పడుచున్నవి.

మ. బలుకర్పూరపుటనంటికప్పూరపుఁదిఽప్పల్గప్పి యుప్పొంగుజా
ల్గలగొజ్జంగులనీరు సజ్జకపుఁగే•ళాకూళికిక్ డిగ్గి త
జ్జలసూత్రంబులు ప్రాకి తుంపురులుగా • జారుక్ నిదాఘాంశునా
వళివీడ్కొన్నతమంబుఁ గాంచి వనిలో • వర్తించుమంచో యనన్. 139

బలు=బలిష్ఠమైన, కర్పూరపుటనంటి = కర్పూరపనఁటుల సంబంధములైన, కప్పూరపుఁదిప్పల్గప్పి = కర్పూరపుఁదిన్నెలనుముంచి, ఉప్పొంగు = పైకిపొంగుచునుండెడు, జాల్గల = ప్రవాహముగలిగిన, జాలు అనుచో జా అనునక్షరమును దంత్యముగా నెఱుంగునది. గొజ్జంగులనీరు = గొజ్జంగిపూవులనీరు, సజ్జికపు =సిద్ధమైన, కేళాకూళికిక్ డిగ్గి=కౌతుకఖానాలోనికి దిగి, తజ్జలసూత్రంబులు ప్రాకి = ఆజలయంత్రముల వ్యాపించి, అనఁగా నాయాతుఖానాలో నుండెడు కారంజాలలోనికెక్కి, తుంపురులుగాజారుక్ = శీకరములుగాజారును. ఏలాగుననఁనిన, నిదాఘాంశు=సూర్యునియొక్క, ఆవళి=అడావడిని, వీడ్కొన్న = తప్పించుకొన్న, తమంబుఁగాంచి = వనమందలి చీఁకటినిజూచి, వనిలోక్ = ఉద్యానవనములో, వర్తించు=ప్రవర్తించుచున్న, మంచోయనక్ = హిమమాయనునట్లుగా జారునని సంబంధము. ఈచెప్పు టచేత నావనమందుఁ గర్పూరపనఁటులును గొజ్జఁగిపూపొదలును నధికముగా నున్నవనియును జలయం

త్రము లనేకములుగా నున్నవనియు వృక్షవిస్తారములు సూర్యకిరణములఁ జేరనీయక నీడలచేతఁ జీకట్లు కమ్మించుచున్నవనియును భావము. అలం. ఉత్ప్రేక్ష.

గొజ్జంగినీ రుప్పొంగుచుండుటవలననే కప్రపుటనంటె కప్రపుఁదిప్పలను గప్పఁగలిగినది. కాన నాజలమునకుఁ గర్పూరసుగంధముగూడఁ గలదు. జలమందు వేగ ముంటవలననే జలయంత్రములనుండి తుంపురులుగా జారఁగలిగినది. ఇందువలన జలయంత్రములు కప్పూరపుటనంటులు గొజ్జంగులు నావనమున మిగులఁ గలవనియు వనము వసంతమున విహారయోగ్యముగా నున్నదనియు భావము.

తా. గొజ్జంగినీ రావనములోని కప్పూరపుఁదిప్పల మంచి ప్రవహించి కేళాకూళిలోఁ జేరి యందుండి జలయంత్రములనుండి తుంపురులుగా జారుచున్నది. చెట్లును దట్టముగాఁ బెనఁగొని చీకటులవలె నీడలు గ్రమ్మియున్నవి.

శా. ఆయారమ్ములఁ బొల్చుకొమ్మలబెడం • గాపల్లవశ్రేణిరం
గాయాతావులమించుపూఁబఱపు లాహా యెన్నఁగా శక్యమే
యాయుద్యానముసాటి చైత్రరథ మెట్లౌ నాయతశ్రీయుతం
బై యొక్కొక్కనగంబె చైత్రరథమై యందుఁగ విజృంభింపఁగన్. 149

ఆయారమ్ములఁబొల్చు = అపాదరింఢ్లయందుఁ బ్రకాశించునట్టి, కొమ్మల = శాఖలయొక్కయుఁ, స్త్రీలయొక్కయు, బెడంగు = చక్కఁదనంబును, ఆపల్లవశ్రేణి = ఆచిగురుటాకుల పంక్తియొక్కయు, విటశ్రేణియొక్కయు, (శ్లో. 'పల్లవఃకిసలేషిద్గే' అని వి.) రంగు = సొగసును, ఆయాతావులమించు పూఁబఱపులు = ఆయాపరిమళములచేత నతిశయించుచున్న పుష్పవిస్తారములును, ఆయాస్థలములయందతిశయించుచున్న పుష్పశయ్యలును, ఆహా = ఆశ్చర్యము, ఎన్నఁగా శక్యమే = గణించుటకు శక్యమా అనఁగా శక్యము గాదనుట. ఆయుద్యానము సాటిచైత్రరథ మెట్లౌను = చైత్రరథమనఁగాఁ గుబేరవనము. (శ్లో. 'అస్యోద్యానం చైత్రరథమ్' అని అ.) ఆయుద్యానవనమునకు సమానము కుబేరువన మేరీతిగా నవుచున్నది యనఁగా సమానము గాదనుట. ఎందువలన ననిన, ఆయత విస్తారమైన, శ్రీ=సమృద్ధితోడ, యుతంబై =కూడుకొన్నదై, ఒక్కొక్కనగంబె=ఒక్కొక్క వృక్షమే, చైత్రరథమై = కుబేరవనమై యని యర్థము. శోభాయుక్తమయినదియుఁ జైత్రునికి ననఁగా వసంతునికి రథమయినయదియు ననిభావము. అందు న్విజృంభింపఁగన్=అవనమందుఁ బ్రకాశించుచుండఁగా, ఆయుద్యానవనమునకు సాటి చైత్రరథ మెట్లౌనని సంబంధము. శ్లేషానుప్రాణితార్థాపత్తి. కావ్యలింగము.

కుబేరుని యుద్యానవనమంతయుఁ జైత్రరథమనఁబడుచున్నది. ఈవనమందున్న యొక్కొక్క వృక్షమే చైత్రరథ మనిపించుకొనుచున్నది. కాన నుద్యానము పెక్కు చైత్రరథములుకలది. కుబేరుఁ డొకచైత్రరథము కలవాఁడు. కుబేరచైత్రరథమునకును, చైత్రుని (వసంతుని) రథములకు నెలవగు నీయుద్యానవనమునకు సాటిసేయఁదగదు.

తా. కొమ్మలసొంపు, పల్లవరీతి, తావులమించు, పూఁబఱపుల యొఱపుఁగల యాయుద్యానమునకుఁ జైత్రరథ మెన్నటికి సాటిగాదు. ఆయుద్యానవనమందలి ప్రతివృక్షమును జైత్రరథమువలె నొప్పుచున్నది.

సీ. ఇమ్ములై మరుహజారమ్ములై పొదలుండఁ బూఁజవికలు వేఱె • పూనవలదు
తెప్పలై నెత్తావిఁకుప్పలై పుప్పొళ్లదుల గందవొడి త్రోవఁ • జిలుకవలదు

సారమై హిమజలాసారమై పూఁదేనె నెఱయఁ గేళాకూళి నింపవలదు
మొత్తమై మారుతాయత్తమై గంబూర మెగయ వితానముల్ బిగియవలదు
తే. స్వామి యారామశుభవైభవములు సూడ
నెపుడు విచ్చేయుదురొ యంచు నెదురు సూచు
సహజసౌభాగ్యములు గూర్పుఁ జైత్రుఁ డతఁడు
కూర్మి భవదీయవనపాలకుండు గాఁడె. 141

ఇమ్ములై=విశాలములైనవై, మరుహజారమ్ములై = మన్మథునికిఁ గొలువుకూటములై, పొదలుం డఁగ్=పొదరిండ్లుండఁగా, పూఁజవికలు వేఁజెపూనవలదు=పువ్వుచప్పరములు ప్రత్యేకముగా నిర్మాణము చేయ నక్కఱ లేదు. పొదరిండ్లు మరుహజారములను మించియున్నవి. అనఁగా రత్యాదిక్రీడలకుఁ దగియున్నవనుట. ఇమ్ముగా నున్నకతనఁ బ్రమదాజనమున కెందఱకేని చాలునని యాశయము.

తెప్పలై=తెట్టెలుతెట్టెలై, నెత్తావికుప్పలై = పరిమళరాసులై, పుప్పొళ్లు = పుష్పపరాగములు, ఉరులఁగ్=రాలుచుండఁగా, గందవొడి=బుక్కాపొడి, త్రోవఁగ్=మార్గమందు, చిలుకవలదు = చల్ల నక్కఱలేదు. గందవొడిలో నొకవిధమగు సుగంధమే గలదు. పుప్పొడిలో వివిధసుగంధము లిమిడి యున్నవి. అట్టి పుప్పొడి తెప్పలై తావులకుప్పలై యున్నపుడు వనము పుష్పవల్లికలచే నెంత మనోహరముగ నున్నదో యెంత సుగంధబంధురముగ నున్నదో తెలిసికొమ్మనుట.

సారమై=బలమై, హిమజలాసారమై=మంచువానవలెనున్నదై, పూఁదేనె = మకరందము, నెఱయఁగ్=వ్యాపించుచుండఁగా, కేళాకూళినింపవలదు = హౌతుఖానాలో నీళ్లునింపనక్కఱలేదు. మంచు వానవలెఁ దేనియ గురియుటచేఁ బ్రసవబాహుళ్యము సూచితము. ప్రసవవల్లికలు పొదరిండ్లుగ సువాసనల నొసంగునవిగ, మకరందవాహినులగ నుండెననుట.

మొత్తమై=రాశియై, మారుతాయత్తమై = వాయువశమై, గంబూరమెగయఁగ్=పచ్చకర్పూర మెగురుచుండఁగా, వితానముల్బిగియవలదు = మేలుకట్లుకట్టనక్కఱలేదు. చిఱుతగాడ్పులకె పచ్చకప్పురపుదుమారము లేచుచున్నది. అది చాందినివలెనున్నది. పచ్చకప్పురము వాయువులో లీనమై మేలుకట్టు వలె నున్నదని భావము.

స్వామి=దేవరా, ఆరామ = ఉద్యానవనసంబంధమైన, శుభవైభవములుసూడఁగ్ = శుభసంపదలను జిత్తగించుకొఱకు, ఎపుడువిచ్చేయుదురొయంచుఁగ్ = ఎప్పుడువిజయముచేయుదురోయని, సహజ =స్వభావసిద్ధములైన, సౌభాగ్యములు=శృంగారములను, కూర్పు = ఘటనపఱచెడు, చైత్రుఁడు = వసంతుఁడు, ఎదురుసూచుఁగ్=ఎదురెదురుచూచుచుండును. ఏమనిన, అతఁడు = ఆ వసంతుఁడు, కూర్మిఁగ్ =మైత్రిచేత, భవదీయవనపాలకుండుగాఁడె = దేవరవారియొక్క తోఁటమాలికాఁడా యని యర్థము. వసంతుఁడు వనములను బాలించువాఁడని భావము. పొదరిండ్లు మన్మథుని కొలువుకూటములటులుంట, పుష్పరజము రాసులై త్రోవలనిండియుండుట, పూవుదేనియలు కేళాకూళులలోఁ బూర్తిగనుండుట, పచ్చకప్పురపుధూళి మింటికెగసి చాందినీవలెనుండుట యారామశుభవైభవములగు సహజసౌభాగ్యములు. వీనిని సంతరించుటవలననే చైత్రుఁడు వనపాలకుఁ డగుచున్నాఁడని భావము.

తా. ప్రభువులు వనవిహారార్థమై వత్తురని వనపాలకు లుద్యానవనమందుఁ బూలపందిళ్ళు వేసి మార్గమందు మెత్తగా నుండుకొఱకు గందవొడిచల్లి యాతుఖానాలో నీళ్లునింపి పైని మేలుకట్లుకట్టిసిద్ధ

పఱుపవలయునది మర్యాదగనుక నివి మేము చేయనక్కఱలేకయే వసంతుఁడు దేవరవారివనపాలకుఁ డయినందున వీనికిమారుగాఁ బైఁజెప్పఁబడిన శాదరింష్టు మొదలైనవాని సిద్ధపఱిచి తమరాకడ కెదురు చూచుచున్నాఁడు. ఉద్యానవన మింతరమ్యముగానున్నది గనుక వనవిహారార్థముగా దేవరవారు విజయము చేయఁదగినదని వనపాలకులు విజ్ఞాపనముచేసిరని ఫలితార్థము.

అలం. ఉదాత్తము. కావ్యలింగము.

క. అని వనపాలురు దెలిపిన, జనపాలున కనఘపూగసాళావళినూ
తనపాళీఘనకేళీ, వనపాళీదర్శనోత్సవం బిగురించెన్. 142

అని=ఈలాగని, వనపాలురుదెలిపినన్ = వనపాలకులు విన్నపముసేయఁగా, జనపాలునకున్ = రాజునకు, అనఘ=నిష్కల్మషమైన, పూగసాల = పోకచెట్లయొక్క, ఆవళి = పంక్తులయొక్క, నూతన =నవీనమయిన, పాళీ=సముదాయముతోఁగూడిన, ఘన = అధికమయిన, కేళీవనపాళీ = క్రీడావనప్రదేశముయొక్క, దర్శన = చూచుటయందలి, ఉత్సవంబు = వేడుక, ఇగురించెను=అంకురించెను.

అలం. వృత్త్యనుప్రాసము.

తా. ఇటుల వనపాలురు తెలుప వసురాజునకుఁ బోకమ్రాకులచేఁ గనువిందుఁ గూర్చు వనములందు విహరింపఁ గోర్కి కలిగెను.

తే. నృపుఁ డలవనీపకుల నవనీపకుల నొ
నర్చి యచ్చో నిజారామ నవవసంత
సమయసౌభాగ్యములు చూడఁ జనుమనోర
థంబున రథంబుఁ దెమ్మనఁ దడయ కపుడు. 143

నృపుఁడు=వసురాజు, అలవనీపకులన్ = ఆవనపాలకులనని యర్థము. యాచకులనని యర్థాంతరము. అవనీపకులనొనర్చి=అనేకగ్రామములు నగ్రహారములనునిచ్చి దేశాధిపతులను జేసియని యర్థము. యాచకులు గానివారినిఁగాఁ జేసియని యర్థాంతరము (ని. 'వనీపకో యాచనకః' అని అ.) అచ్చోన్ = ఆ సమయమందు, నిజారామ = స్వకీయమయిన యుద్యానవనమందలి, నవ = నూతనమయిన, వసంత సమయ=వసంతర్తుసంబంధమయిన, సౌభాగ్యములు = వైభవములను, చూడఁజను = చూడఁబోవునట్టి, మనోరథంబునన్=అభిలాషచేత, రథంబుదెమ్మనన్=రథముదెమ్మని యాజ్ఞాపింపఁగా, తడయక = జాగుసేయక, అపుడు = ఆ సమయమందు, దీనికి ముందరిపద్యముతో నన్వయము.

అలం. విరోధాభాసము. శబ్దా. వృత్త్యనుప్రాసము.

తా. వసురాజు వనపాలురకు ధనాదికముల నొసంగి గౌరవించి తన యారామమునందుఁ గల వసంతఋతు సౌభాగ్యములను సందర్శింప నెంచి రథము నాయత్తము గావింపు మని యాజ్ఞనొసంగెను.

సీ. జతఁ గూర్చి తారవజ్రాలఁ బన్నినకమ్మి గ్రమ్మినమణిరథాంగములగములు
నీలాలదృష్టిపూనినవక్రముఖములఁ దగుపచ్చపనినిగనిగనినొగలు
ముత్యాలబవిరెకెంపులచట్టము తదంశుధట్టంబుమాడ్కిఁ గెంబట్టుపఱపు
పగడాలకంబాలబిగిమించుపుష్యరాగపులోవవైదూర్యఘంటికలును

తే. దళతళనిమానికంబుల • కలశమును జ
యాంకకేతనమును గల్గు • నరద మొకటి
మనసుతోనన మెలఁగుసా • మ్రాణికాశ్వ
రత్నములఁ బన్ని తెచ్చె సా • రథి యొకండు. 144

జతఁగూర్చి=జోడించి, తారవజ్రాల=తారశబ్దము ముత్యములు మొదలైనవానియొక్క సంశుద్ధియందు వర్తించుచున్నది. శ్లో. 'తారో వానరభిన్ముక్తా విశుద్ధౌ శుద్ధమౌక్తికే' అని మే. వజ్రాలన్నందుకు, సూ. 'వికృతౌక్వచిచ్చలోపో మోర్దీర్ఘశ్చాతఆదిమస్యభవేత్' న. అను సూత్రముచేతను, శ్లో. 'ప్రాయశోవైకృతపదేలోపోదీర్ఘశ్చమోర్మతః' అను నథర్వణవచనమందలి ప్రాయశ్శబ్దగ్రహణము వలనఁ గొన్నియెడలఁ దత్సమశబ్ద మువర్ణకమునకు లోపంబును దత్పూర్వవర్ణమందలి యకారమునకు దీర్ఘంబును వచ్చునని వేద్యముగనుక నిచట వజ్రాలని ప్రయోగించినాఁడు. పరిశుద్ధములైన వజ్రముల చేత, పమ్మిన=నిర్మించిన, కమ్మిక్=కట్టుటచేత, క్రమ్మిన=పొదిగిన, మణిరథాంగములగములు = పద్మరాగ మణిమయములైన చక్రములయొక్క సముదాయములును,

నీలాలదృష్టిపూనిన=నీలమణులే దృష్టులుగాఁ బెట్టిన, నక్రముఖములక్ = మకరవక్త్రములచేత, తగు=ఒప్పుచున్న, పచ్చపని=మరకతమణిరచనచేత, నిగనిగని=నిగనిగమెఱయునట్టి, నొగలు=ధూర్దండములును, అనఁగా నొగకఱ్ఱలును, మరకతమణి మొసలిమేనిచాయవలెఁ బసుపురంగుగాఁగూడ నుండును. ఇందులకుఁ బ్రమాణము.

సీ. ...మెరుగుడుపురుగు మే మెఱయుచందంబునఁ గొమరుమిగిలిన పాలకొమ్ముచాయ
జిగి దళుకొత్తు రాచిలుకఱెక్కలవన్నె పాలు పారు దిరిసెంపుఁబూవువన్నె
తే. గ్రాలు నెనిమిదిరంగుల డాలుఁగలిగి, ...... శుద్ధమరకతంబు. (రత్నపరీక్ష.)

ముత్యాలబవిరె=ముత్యాలుగూర్చిన వలయముగల, కెంపులచట్టము = కెంపులుచెక్కిన చట్టమును, తదంశుఘట్టంబుమాడ్కిక్ = ఆ కెంపులయొక్క కాంతిపుంజమో యన్నట్టులుగానున్న, కెంబట్టుపఱపు = ఎఱ్ఱపట్టుపఱుపును, ముత్తెములవలయమునకుఁ గెంపులు తాపడముచేసిరి. కెంపులకాంతి పుంజమువలె నెఱ్ఱపట్టుపఱపు పైనమర్పఁబడియున్నది. ముత్తెములకాంతిని గెంపులకాంతిమించి కెంజాయ తులకించుటచే నాకాంతులే పఱపువలె నున్నవనుట. అలం. ఉత్ప్రేక్ష.

పగడాలకంబాలజిగిమించు = పవడపుస్తంభములయొక్క కాంతిచేత నతిశయించుచున్న, పుష్యరాగపులోవ=పుష్యరాగ మణిమయమయిన చప్పరపువలయమును, వైదూర్యఘంటికలును=వైదూర్య మణివికారములైన చిఱుగంటలును, వైదూర్యము లోహకాంతి గలిగియుండును. వైదూర్యలక్షణము-

తే. పగలు గొందిఁ గానఁబడిన బిడాలంపుఁ, గన్నువోలె వెలుఁగు గలిగి నూలు
తిరిగినట్లు మీఁదఁ దెరబారువైదూర్య, రత్నమున కతిప్రయత్నమునను. (రత్నపరీక్ష)

తళతళనిమానికంబుల = గోమేధికమణివికారమయిన, కలశమును = పైకలశమును, ఈమట్టుకు నవరత్నములును గలుగఁ జెప్పినాఁడు. ఇందునకుఁ బ్రమాణము. రత్నపరీక్షయందు-

క. 'కురువింద వజ్ర మౌక్తిక, పరమరకత శక్రనీల వైదూర్య మనో
హరపుష్యరాగ విద్రుమ, నరసుత గోమేధికములు నవరత్నంబుల్.'

జయాంకకేతనమును=జయప్రయుక్తమయిన బిరుదులుగలధ్వజమును, కల్గు=కలిగిన, అరదమొకటి=ఒకానొకరథమును, మనసుతోనసమెలఁగు = మనస్సుప్రకారముగా నడుచునట్టి, అనఁగా మనోవేగముగల, సామ్రాణికాశ్వరత్నములఁ బన్ని=సామ్రాణిసంజ్ఞగల యశ్వశ్రేష్ఠములనుగట్టి, ఇక్కడ రత్నమయమయిన రథమునకు నశ్వరత్నసంయోగమర్హ్యమని విచారింపవలయును. తెచ్చెసారథియొకండు = ఒకసారథి తీసికొనివచ్చెను.

ఈ పద్యములో మొదటిచరణమందు మణిరథాంగములనియును, మూఁడవచరణమందుఁ గెంపులచట్టమనియును జెప్పుటవలనఁ బౌనరుక్త్య మనఁదగదు. పద్మరాగమునకుఁ గెంపునకును భేదముగల దనియుఁ బద్మరాగము కలియుగమందు లేదనియుఁ బూర్వయుగములయందుఁ గలదనియును స్ఫురింపఁజేయుటకొఱకు మణిశబ్దమును గ్రహించినాఁడని తెలియవలయు.

క. 'ధరఁ బద్మరాగ మెందును, దొరకదు కలియుగమునందుఁ దోఁచిన ప్రైగె
నిరుపమనిర్మలరుచిగల, కురువిందపుఁ గెంపు గలదు కోరి ధరింపన్.'

అని రత్నపరీక్షయందుఁ జెప్పంబడియున్నది. అలం. ఉత్ప్రేక్ష. ఉదాత్తము.

తే. తెచ్చిన నసేకచక్రసం॥దీప్తమును న, తీతహారిదశ్వమును జగ॥ద్విశ్రుతోరు
సారథియునైనయమ్మహా॥సారసహితు, నరద మరుదయ్యె జనలోచ॥నాబ్జములకు.

తెచ్చినన్=సారథి రథమును దోలుకొనిరాఁగా, అనేక = అనేకములైన, చక్ర=బండికండ్లతోడ, సందీప్తమును=మిక్కిలియుఁ బ్రకాశించుచున్నదియు నని యర్థము. సూర్యరథ మొకబండికల్లు గలదనుట. అతీత=అతిక్రమింపఁబడిన, హరిత్=దిక్కులుగల, ని. 'దిశస్తు కకుభఃకాష్ఠా ఆశాశ్చ హరితశ్చ తాః' అని అ. అశ్వము=గుఱ్ఱాలుగలదియునని యర్థము. సూర్యరథ మతిక్రమింపఁబడకున్న దిక్కులుగల గుఱ్ఱముగలదనుట. హరిద్వర్ణముగల గుఱ్ఱముగలదని భావము. జగద్విశ్రుత = జగత్ప్రసిద్ధుఁడైన, ఉరు=ఘనుఁడైన, సారథియును = సారథిగలదియునని యర్థము. సూర్యరథము జగద్విశ్రుతోరుసారథి లేనిదనుట. జగత్ప్రసిద్ధుఁడైన యనూరునితోఁ గూడుకొన్నదని భావము. ఐన = అయినట్టి, అమ్మహాసారసహితు నరదము = సారసహితుడనఁగాఁ బద్మబాంధవుఁడైన సూర్యుఁడు, ఆ మహాసూర్యునియొక్క రథమని యర్థము మహాబలసమేతుఁడైన యా వసురాజురథమని భావము. జనలోచనాబ్జములకున్ = జనులయొక్క నేత్రములనెడు కమలములకు, అరుదయ్యెన్=ఆశ్చర్యకరమాయెనని యర్థము. ప్రసిద్ధసూర్యరథవిలక్షణము గనుక జనలోచనాబ్జముల కరుదయ్యెనని తెలియవలయును. అనర్ఘ్యమణిమయమయినదిగనుక జనులయొక్క నేత్రకమలములకువింతగాఁగనుపడెనని భావము.

తా. అనేకచక్రములతోఁ గూడియున్నదియు, సూర్యాశ్వములవంటివాజులఁ బూన్చినదియు నేర్పరియగు సారథికలదియు నగువసురాజురథము చూపరులకు మిగుల నాశ్చర్యకరముగ నుండెను.

మ. ద్రవిణాధీశ్వరుఁ డాత్మరూఢవసునా॥థఖ్యాతిభీతిం గరం
బు విమానోత్తమ మంపెనో యన రుచిం॥బొల్పారునాస్యందనం
బవనీనాయకుఁ డెక్కె నొక్కమొగి శం॥ఖారావము ల్వందిపుం
గవవాచావిభవంబు వేత్రధరహుం॥కారంబు దోరంబుగన్. 146

ద్రవిణాధీశ్వరుఁడు = ద్రవిణ మనఁగా ధనము, దానికధిపతియైన కుబేరుఁడు, ఆత్మ=తనయందు, రూఢ=ప్రసిద్ధమైయుండెడు, వసునాథఖ్యాతి = (వసుభిరితినాథః వసునాథః అని విగ్రహము.)

వసువనెడురాజునట్టి ప్రఖ్యాతివలనఁబుట్టిన, లేక వసురాజునకు నాథుఁడనునట్టి ఖ్యాతివలనఁబుట్టిన, భీతిన్ = భయముచేత, అనఁగా నిట్టి ప్రసిద్ధికి నితఁ డర్హుఁడౌనాయని వసురాజునకుఁ గోపమువచ్చు ననుభయముచేతనని యర్థము. వసువనఁగా ధనము దానికి నాథుఁడనిభావము. (వసూనాం ధనానాం నాథః వసునాథః అని విగ్రహము.) ఈయర్థమున కనుగుణముగా ద్రవిణాధీశ్వరపదమును బ్రయోగించినాఁడు. కరంబు = అప్పనమగునట్టులుగా, విమానోత్తమ మంపెనోయనన్ = విమానశ్రేష్ఠమును, అనఁగాఁ బుష్పకమునంపినాఁడోయనునట్టులుగా, రుచింబొల్పారు = రత్నకాంతిచే నొప్పుచున్న, ఆ స్యందనంబు=ఆ రథమును, ఒక్కమొగిన్ = ఏకకాలమందు, శంఖారావముల్ = శంఖనాదములును, వందిపుంగవ = స్తుతిపాఠకోత్తములయొక్క, వాచావిభవంబు = వాక్యవైభవమును, వేత్రధర = వెండిబెత్తములవారియొక్క, హుంకారంబు = హుమ్మనెడు నదలింపులును, తోరంబుగన్ = అతిశయించునట్టుగా, అవనీనాయకుఁడు=వసురాజు, ఎక్కెన్=ఎక్కినవాఁడాయెను అలం. పరికరము. ఉత్ప్రేక్ష.

కుబేరుఁడు ద్రవిణాధీశ్వరుఁడు గావున నితరులు వసునాథులైయుండ వెఱచుట సంభవించినది. కాననే యాత్మరూఢమగు వసునాథఖ్యాతి గాపాడుకొనవలసివచ్చినది. రత్నఖచితమగుటవలన రుచింబొల్పారి రథ మొప్పెను. కావునఁ గుబేరుఁ డంపినటుల నుండెను. తొలుత శంఖనాదములు పిదపఁ బ్రయాణానుకూలముగ వందిస్తోత్రములు మూగిన ప్రజలఁ బోఁదోలుటకు వేత్రహస్తులయదలింపులు క్రమముగా నెఱవేర్పఁబడెనని భావము.

తా. కుబేరుఁడు పంపినవిమానమువలెనున్న యలంకృతమగు రథముపై వసురా జెక్కి బయలుదేరెను.

చ. పొడఁగన వేల యబ్బె నని • పొంగి కళింగశకాంగముఖ్యు ల
యొ్యడ వెడ యీక క్రందుకొని • యెల్లెడలన్ వెడలంగ వారిబల్
తొడవుల రాలి ముత్యములు • తోరము లై తొరఁగెం బురంబున
ల్గడలఁ బ్రసూనకోరకని• కాయము నింపినసొంపు పెంపునన్. 147

పొడఁగనవేళయబ్బెనని = దర్శనముసేయుటకు సమయముదొరకెనని, పొంగి = సంతోషించి, కళింగశకాంగముఖ్యులు = కళింగదేశ శకదేశాంగదేశాధిపతులు మొదలైనవారు, అయ్యెడన్ = ఆ సమయమందు, ఎడయీకక్రందుకొని = సందియ్యక దొమ్మిగూడి, ఎల్లెడలన్వెడలంగన్ = అన్నిదిక్కుల నుండి బయలుదేరఁగా, వారిబల్తొడవులరాలి = ఆ రాజులయొక్క ఘనమైనభూషణములనుండి రాలి, ముత్యములు = ముక్తాఫలములు, తోరములై = అధికములై, పురంబునల్గడలన్ = పట్టణపు నాల్గుదిక్కులయందును, ప్రసూనకోరకనికాయము = పూమొగ్గలయొక్క గుంపులును, నింపినసొంపు పెంపునన్ = నిండుగాఁబోసిన చందముగా, తొరఁగెన్ = రాలిపడెను. అలం. నిదర్శనము.

ఎడయీక క్రిక్కిరిసినటులుంటవలననే భూషణస్థమౌక్తికములు రాలెను. రాజముఖ్యులు ఎల్లెడల వెడలుటవలననే పురము నలుగడల ముత్తెములు రాలు నవకాశము కలిగెను. దర్శనోత్సాహమునఁ బొంగినకతనఁ బరస్పరఘట్టనములు మౌక్తికములు రాలుట గమనింపలేదని భావము.

తా. రథము నెక్కి బయలువెడలు వసురాజును సందర్శించుట కితరదేశాధిపతులగు రాజులు క్రిక్కిరిసివచ్చుటవలన వారివిభూషణస్థమౌక్తికములు పురమునఁ బూవులు మొగ్గలు చల్లినటుల నొప్పెను.

వ. అప్పు డప్పురందరవైభవుండు మణిచాపశరకలాపరాజితంబును మదాంధ రాజహంసోద్వేజకకూజితంబును మంజుతరకంజరాగపుంజపింజరితమరీచిమంజరీ సంజనితసమంజససౌదామనీధామంబును మౌక్తికవితానదంతురితాంతరాభి రామంబును మసారసారకిరణధోరణీసంస్కారితవినీలశరదంబును నగు నరదంబు నధివసించి సముజ్జ్వలితహేతిధరవిభ్రమంబులు నుద్దండదండధరసంభ్రమంబును నున్నిద్రపుణ్యజన వాగ్విశేషంబులు నుజ్జృంభితవాహినీశ్వరరసోన్మేషంబులు నుద్ధూతకేతనానిలకోలాహలంబును నున్నతరాజరాజభజనకౌతూహలంబులు నుగ్రసేనాగణకలకలంబులు నవధరించుచు నానందనోద్యానరాజంబుఁ జేరం జనుసమయంబున. 148

ఈ వచనపు మొదట వసురాజును బురందరవైభవుండని చెప్పుటచేత రాజపరముగాను నింద్ర పరముగాను నర్థద్వయము నాలోచింపవలయును. ఏలాగనిన,

అప్పుడు=ఆప్రయాణసమయమందు, అప్పురందరవైభవుండు = ఇంద్రవైభవముగల యీ వసు రాజు, మణిచాప = రత్నమయచాపముచేతను, శరకలాప = బాణతూణీరములచేతను, రాజితంబును= ప్రకాశించుచున్నదియును, అని రాజపరమైన యర్థము. మణిచాప = ఇంద్రధనువుచేతను, శరక లాప = జలసముదాయముచేతను, రాజితంబును=ప్రకాశించుచున్నదియు నని మేఘరూప మహేంద్ర రథపరమయిన యర్థాంతరము. (ని. 'శరంనీరే శరఃకాణ్డే' అని ని. 'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతేపిచ' అని అ.) మదాంధ = మదముచేతఁ గన్నులుగానకయున్న, రాజహంస = రాజశ్రేష్ఠులకు, ఉద్వేజక = పీడాకరమయిన, కూజితంబును = నేమిధ్వని గలదియును, అని యర్థము. నేమియనఁగా రథచక్రముయొక్క యంచులు, మదాంధములైన రాజహంసలకుఁ బీడాకరమయిన గర్జాధ్వనిగలది యగు నని యర్థాంతరము. మంజుతర = మిక్కిలియుఁ మనోహరములైన, కంజరాగ = పద్మరాగమణుల యొక్క, పుంజ = సమూహముయొక్క, పింజరిత = సాంద్రమగుచున్న, మరీచి = కాంతులయొక్క, మంజరీ=గుచ్ఛములవలన, సంజనిత = పుట్టిన, సమంజసఃచక్కనైన, సౌదామనీ = మెఱపుతీఁగెలవంటి, ధామంబును = కాంతిగలిగినదియునని రథపరమయిన యర్థము. మంజుతరకంజరాగపుంజపింజరితమరీచి మంజరివలె సంజనితమగుచున్న మెఱపుతీఁగెలయొక్క కాంతిగలదియు నని మేఘపరమయినయర్థాం తరము. ని. 'తటిత్సౌదామనీ విద్యుచ్చఞ్చలాచపలాపిచ' అని అ. మౌక్తిక = ముత్తియములుగూర్చిన, వితాన=మేలుకట్టుచేత, దంతురిత = విరళముగాఁ జేయఁబడిన, అంతర=మధ్యప్రదేశముచేత, అభిరామం బును=ఒప్పుచున్నదియుఁ నని యర్థము. (ని. 'అస్త్రీవితానముల్లోచః' అని అ.) మౌక్తికవితాన = ముక్తా ఫలసమూహముచేత, దంతురిత = వ్యాపింపఁబడిన, అంతర = ఉదరాంతరముచేత, అభిరామంబును = ఒప్పుచున్నదియు నని యర్థాంతరము. (ని. 'పూగోవితానం ప్రకరః' అని యమరశేషము.) మేఘ మందు ముత్యాలుపుట్టుచున్నవన్నందుకుఁ బ్రమాణము —.

ఉ. 'నీరదముల్ దిగంతముల నిండి తటిద్ఘనగర్జితంబు లే
పార మహోగ్రవృష్టి గురియం బ్రభవించి నితాంతకాంతితో
నారయఁ గుక్కుటాండసమమై పడుముత్యము లంతరిక్షసం
చారులు పట్టుకొందురు వెసన్ వసుధం బడకుండ నేర్పునన్.'

అని రత్నపరీక్షయందుఁ జెప్పఁబడియున్నది.

మసారసార=ఇంద్రనీలమణిశ్రేష్ఠములయొక్క, (ని. 'మసారమిన్ద్రనీలంస్యాత్' అని వి.) కిరణ=కాంతులయొక్క, ధోరణీ=సరణిచేత, సంస్మారిత=లెస్సగా స్మరింపఁజేయఁబడిన, వినీల = మిక్కిలినల్లనైన, శరదంబును = మేఘముగలదియఁనని యర్థము. ౹ మసారసారకిరణధోరణీసంస్మారితమయినవీల మేఘమని యర్థాంతరము. అగు=అయినట్టి, అరదంబు నధివసించి = రథమునెక్కి కూర్చున్నవాఁడై, సముజ్జ్వలిత = మిక్కిలియుఁ బ్రజ్వరిల్లుచున్న, హేతి=ఖడ్గములను, ధర=ధరించినవారియొక్క, విభ్రమంబులును=వీరవిలాసంబులుననియర్థము. హేతియనఁగా నగ్నిజ్వాలకును బేరుగనుక హేతిధరుఁడనఁగా నగ్నిదేవుఁడు, సముజ్జ్వలితుఁడగుచున్న యగ్నియొక్కవిలాసములును, అని యర్థాంతరము. (ని. 'రవే రర్చిశ్చ శస్త్రంచ వహ్నిజ్వాలాచ హేతయః' అని వి.) ఉద్దండదండధరసంభ్రమంబులును = ఉద్దండులైన దండధరులనఁగా బాణాకట్టిలు ధరించినవారు. వారియొక్క ఉత్సాహములను, అనియర్థము. ఉద్దండుఁడైన యముని యొక్క యుత్సాహములను, అనియర్థాంతరము. ఉన్నిద్ర = వికాసయుక్తులైన, పుణ్యజన=సజ్జనుల యొక్క, వాగ్విశేషంబులును=వాక్యవిశేషములను, అని యర్థము. పుణ్యజనుఁడనఁగా నైరృతి-ఉన్నిద్రుఁడైన నైరృతియొక్క వాగ్విశేషములను, అనియర్థాంతరము. ఉజ్జృంభిత=ఉత్కటముగా విజృంభించుచున్న, వాహినీశ్వర=సేనానాయకులయొక్క, రసోన్మేషంబులు = వీరరసవికాసములను, అని యర్థమున వాహినీశ్వరుఁడనఁగా నదులకు రాజైనవరుణుఁడు, రసమనఁగా జలము, ఉజ్జృంభితుఁడగుచున్న వరుణునియొక్క జలోన్మేషములను, అని యర్థాంతరము. ఉద్ధూత=ఎగరఁగొట్టఁబడుచున్న, కేతన = ధ్వజపటములసంబంధమయిన, అనిల=వాయువుయొక్క, కోలాహలంబులను=కలకలధ్వనులను, అని యర్థము. ఉద్ధూతకేతనుఁడైనవాయువుయొక్క కోలాహలమును అని యర్థాంతరము. ఉన్నతరాజరాజభజన కౌతూహలంబులును=రాజాధిరాజులయొక్క సేవాకౌతూహలములను అని యర్థము. రాజరాజనఁగా కుబేరుఁడు, అతనిసేవాకౌతూహలములను, అని యర్థాంతరము. (ని. 'రాజరాజో ధనాధిపః' అని అ.) ఉగ్రసేనాగణకలకలంబులును = ఉగ్రమయిన సేనాసమూహమందలి కలకలములను, అని యర్థము. ఉగ్రుఁడనఁగా రుద్రుఁడు, అతని సేనారూపమయిన ప్రమథగణములయొక్క కలకలములను, అని యర్థాంతరము. అవధరించుచున్=చిత్తగించుచును, ఆనందనోద్యానరాజంబుఁ జేరఁ జనుసమయంబునన్ = ఆనందకరమయిన యుద్యానవనశ్రేష్ఠమును సమీపించిపోవుచున్న సమయమునందని యర్థము. ఆనందనోద్యానమును సమీపించిపోవుచున్న సమయమందని యర్థాంతరము. ఇచట నందనోద్యానమనఁగా నింద్రునియుద్యానవనమునకుఁ బేరు. ఎట్లనఁగా, (ని. 'నన్దనంవనమ్' అని అ.) దీనికి ముందటి పద్యముతో నన్వయము. శ్లేషాలంకారము.

తా. వసురాజు సమస్తవస్తుసంపూర్ణముగనున్న రథము నధిష్ఠించి పరిజనులప్రసంగమున కానందించుచు మహేంద్రవైభవముతో నలరి యుద్యానమునకుఁ బయలుదేరెను.

సీ. నృపమౌళిభవసువ◆ర్ణపరాగములు సువర్ణపరాగములు నభి◆న్నత వహించెఁ
గమనీయతపనీయ◆కదళికాపవనంబు కదళికాపవనంబు ◆ కలిసి మెలఁగె
లలితమాగధలోక◆కలకంఠగానంబు కలకంఠగానంబు ◆ నలమికొనియెఁ
దతవాదకసమీర◆హతకిన్నరీరుతుల్ కిన్నరీరుతులు నే◆కీభవించె
తే. నపుడు సేరంగవచ్చిన◆యవనిజాని, కవనిజానీక మచట సా◆ష్టాంగ మెఱఁగెఁ
గేళివనబహిరంగణా◆క్షీణమధుర, మధురసఝరానుబింబసం◆భావనమున. 149

నృప=రాజులయొక్క, మౌళిభవ = కిరీటముల రాపిడివలన రాలిన, సువర్ణపరాగములు=బంగారు రాపొడులును, సువర్ణపరాగములు = బంగారుపేళ్లు సంపెఁగకుఁజెల్లును గనుక సువర్ణమనఁగా సంపంగి, సంపంగి చెట్లయొక్క పుప్పొడులును, అభిన్నతవహించెన్ = వేఱులేక పోవుటను వహించెను, కదళి యనఁగా ధ్వజమును గదళీవృక్షమును, (ని. 'కదళీవైజయన్త్యాం చ రంభాయాం హారిణాన్తరే' అని వి.) కమనీయ = సుందరమైన, తపనీయ = సువర్ణవికారమునైన, కదళికా = ధ్వజసంబంధమైన, పవనంబు = వాయువును, కదళికాపవనంబు = కదళీవృక్షసంబంధమైన వాయువును, కలిసిమెలఁగెన్ = కలిసికొని ప్రవర్తించెను. కలకంఠమనఁగా మధురధ్వనికల కంఠంబును గోయిలయును, లలిత=ఒప్పుచున్న, మాగధ లోక = గానరూపముగా స్తుతిచేయు మాగధజనముయొక్క, కలకంఠగానంబు = మధురధ్వనిగల కంఠములచేతఁ బాడెడు సంగీతంబును, కలకంఠ = కోయిలలయొక్క, గానంబు = పంచమస్వరగానము లును, అలమికొనియెన్=మిళితమాయెను.

శ్లో. 'రాజ్ఞః పురజనస్యాపి మఙ్గళాచారశంసినః,
మాగధ్యా మాగధికాగీతైః మాగధా ఇత్యుదీరితాః.' అని మాగధలక్షణము.

తతవాదక=వీణలు వాయించువారియొక్క, (ని. 'తతం వీణాదికంవాద్యమ్' అని అ.) సమీర హతకిన్నరీరుతుల్=వాయువుచేతఁ గొట్టఁబడుచున్న తీఁగెలుగల కిన్నరీసంజ్ఞగల వీణలయొక్క నాదము లును, కిన్నరీరుతులును=కిన్నరపక్షి కాంతానినాదములును, ఏకీభవించెన్=ఒకటియాయెను.

అపుడు=ఆసమయమందు, చేరంగవచ్చిన=సమీపింపవచ్చిన, అవనిజానికిన్=వసురాజునకు, అవ నిజ=వృక్షములయొక్క, అనీకము=సముదాయము, అచటన్=ఆప్రదేశమున, కేళివన = ఉద్యానవనము యొక్క, బహిరంగణ=బైటిముంగిలియందలి, అక్షీణ = తక్కువగాని, మధుర = తియ్యని, మధురస = మకరందముయొక్క, ఝర = ప్రవాహమందయిన, అనుబింబసంభావనమునన్=ప్రతిబింబ మనెడు మిషచేత, సాష్టాంగమెరఁగెన్ = సాష్టాంగమగునట్లుగా నమస్కరించెను. అనఁగా వనబాహ్యప్రదేశ మందలి మకరందప్రవాహమందు వనతరుసమూహము ప్రతిఫలింపఁగా నేలాగుననుండెననిన, వచ్చిన వసురాజునకు వనవృక్షము లన్నియు నమస్కరించినట్టులుగా నుండెనుట. అలం. సహోక్తి. వ్యాజోక్తి. శబ్దాలం. ఛేకానుప్రాసము.

తా. రాజుదాల్చిన సొమ్ముల యొఱపిడివలన రాలినపరాగము పుప్పొడియుఁ, డెక్కెముల గాడ్పులు నరఁటిచెట్టులగాడ్పులును, మాగధగానము కోకిలగానమును, వీణాగానము కిన్నరీపక్షిగానము గలసిపోయెను. కేళివనసమీపముననున్న తేనెయేళ్లయందుఁ బ్రతిబింబించిన యాకృతులతో వృక్ష రాజములు రాజునకు సాష్టాంగనమస్కృతు లాచరించెను.

క. కులపతియు వేత్రధరు లొ, త్తిలి సాంగుభళా యనంగఁ • దేరు డిగి మహీ
శుల ననిపి బలము నచటనె, నిలిపి యుపవనంబు సొచ్చి • నిజహితయుతుఁ డై.

కులపతియుఁన్ = వంశకర్తయైన వసురాజును, వేత్రధరులు = వెండిబెత్తములవారు, ఒత్తిలి= ఒకవైపునకు నోసరిల్లి, సాంగుభళాయనంగ = సాంగుభళాయని హెచ్చరికసేయఁగా, తేరుడిగి=రథముపైనుండిదిగి, మహీశులననిపి = తనతోఁ గూడవచ్చినరాజులను బంపించి, బలము నచటనె నిలిపి= సేనలవారి నావనబాహ్యమంద నిలిపి, ఉపవనంబుసొచ్చి = ఉద్యానవనములోఁ బ్రవేశించి, నిజహితయుతుఁడై=తనయిష్టసఖునితోఁ గూడుకొన్నవాఁడై, దీనికి ముందరిపద్యముతో నన్వయము.

తా. వేత్రహస్తులు బరాబరులుసేయ వసుమహారాజు రథము దిగి పరివారమునంతయు నటనుంచి హితులతోఁగలసి యుద్యానవనమునఁ బ్రవేశించెను.

తే. ఘనతరఫలానతాఖండ•కదళికలును, గీరరాజీకృతసజీవ•తోరణములుఁ
బొంగు నెలమావికురుజాల•భంగనవఫ, లావళులుఁగాంచె నృపుఁడువ•నాగ్రసీమ.

ఘనతర=అధికతరములైన, ఫల=పండ్లగెలలచేత, ఆనత = వంగియున్న, అఖండ = సంపూర్ణములైన, కదళికలును=అరఁటిచెట్లును, కీరరాజీ = శుకపంక్తులచేత, కృత = చేయఁబడిన, సజీవతోరణములున్=ప్రాణసహితములైన తోరణములును, పొంగు = ఉల్లసిల్లుచున్న, ఎలమావి = గుజ్జుమామిళ్ళయొక్క, కురుజాలున్ = జొంపములును, అభంగ=చిలుకలు మొదలైనవానిచేత కొట్టఁబడనివియును, నవ=నూతనమైనవియునగు, ఫలావళులున్ = ఫలసమూహములును, వనాగ్రసీమన్ = ఉద్యానవనము ముందరను, నృపుఁడు=వసురాజు, కాంచెన్=చూచెను.

రాజాధిరాజు వచ్చునపుడు పట్టణముముందరఁగాని క్రీడావనముముందరఁగాని పండ్లగెలలతో నుండెడు నరఁటిచెట్ల నుభయపార్శ్వములయందు నిలిపి పచ్చనితోరణములుగట్టి మామిడిచిగురు జొంపములు వ్రేలఁగట్టి భిన్నములుగాని ఫలముల నాస్వాదించి యీరీతిగా నలంకరించుటయును రాజాయలంకారమునుఁ జూచుచుఁ బ్రవేశించుటయునుఁ బ్రసిద్ధముగనుక వనాగ్రసీమయందు స్వతస్సిద్ధములుగానున్న కదళీస్తంభాదులను వసుమహారాజు చూచెనని భావము. అలం. సమాసోక్తి.

తఱచుగా నగరాలంకారములయందు ఖండితకదళికలు నిర్జీవములగు చివురుతోరణములు త్రెంపిన ఫలము లుపయోగించుట సహజము. ఇట నటులఁగాక యరఁటిచెట్లు తా మున్నచోటన నఖండితముగఁ జిలుకగుంపులు బారులుగఁ దిరుగుచు సజీవతోరణములుగ ఫలావళులు తమ నెలవులనే పక్షిచంచూహతులచే భిన్నములుగాక యభంగములుగా నుండి నేత్రోత్సవము గలిగించెను.

తా. అరఁటిచెట్లు ద్వారస్తంభములుగ నిలిపి చిలుకలబారులు తోరణములుగఁజేసి మావిచివురులు, ఫలములు వ్రేలగట్టినటులున్న వనాగ్రసీమను రాజు చూచెను.

మ. అలచైత్రాంచితసత్త్రిశాలికల సం•ప్రాప్తాహారతృప్తిం గుతూ
హలము ల్గాంచుద్విజావళుల్ శ్రుతిహిత•వ్యాజానులాపంబుతో
నలఘుశ్రీకరశాఖికాంచలవిసం•వ్యక్తేక్షుసారార్ద్రాక్షతం
బులు రాల్చెన్ నరదేవరత్నమకుటీ•భూషావిశేషంబుగన్. 152

అల=ఆ, చైత్ర=వసంతునిచేత, అంచిత=ఒప్పుచున్న, సత్త్రశాలికలన్ = వనప్రదేశములయందని యర్థము. చైత్రాంచిత=చైత్రమాసమం దొప్పిదములగుచున్న, సత్త్రశాలికలన్=యజ్ఞశాలలయందనియైనను నిరతాన్నదానశాలలయందనియైనను నని యర్థాంతరము. (ని. 'సత్త్ర మాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనేపిచ' అని అ.) ఇష్టాహారతృప్తిన్ = ఇష్టమైన యాహారమువలని తృప్తిచేత, కుతూహలముల్గాంచు = సంతోషములను బొందుచున్న, ద్విజావళుల్ = శుకపికాదులైన పక్షులయొక్క సముదాయములని యర్థము. బ్రాహ్మణ సమూహములని యర్థాంతరము. శ్రుతిహిత = చెవులకింపును, అవ్యాజ=దంభరహితమునైన, అనులాపంబుతోన్ = ముహుర్భాషణముతోడ, అలఘు=అధికములును, శ్రీకర = శోభాకరములునై, శాఖికా = కొమ్మలయొక్క, అంచల=అగ్రములవలన, వినిర్యత్ = జారుచున్న, కేసరార్ద్రాక్షతంబులు = ఆర్ద్రాక్షతములవంటి యనఁగాఁ బసుపుచేతఁ దడుపఁబడిన యక్షతలవంటి, కేసరములు = కింజల్కములను, నరదేవ = వసురాజుయొక్క, రత్నమకుటీ = మణిమయ కిరీటమునకు, భూషావిశేషంబుగన్ = అలంకారవిశేషమానట్టులుగా, రాల్చెన్=చల్లెను, అనియర్థము. శ్రుతిహితావ్యాజ = వేదహితమైన, అవ్యాజమైన, అనులాపంబుతోన్ = వాక్కుతోడ, అలఘుశ్రీ=అధికశోభాకరములైన, కరశాఖికా = అంగుళులయొక్క, (ని. 'అఙ్గుళ్యః కరశాఖాస్స్యుః' అని అ.) అంచల=అగ్రములనుండి, వినిర్యత్=జారుచున్న, కేసరార్ద్రాక్షతంబులు = కింజల్కసదృశములైన యార్ద్రాక్షతములును, నరదేవరత్నమకుటీభూషా విశేషమగునట్టులుగాఁ జల్లెనని యర్థాంతరము. బ్రాహ్మణాశీర్వాద మంత్రాక్షతములు రాజకిరీటాలంకార మగుట ప్రకటంబకదా. అలం. శ్లిష్టరూపకము.

చైత్రము యజ్ఞాదులకు వసంతునకు ననుకూలమైనది. కావుననే సత్త్రశాలిక లంచితములైనది. కేసరార్ద్రాక్షతలు అలఘుశ్రీకరశాఖికాచ్యుతములు గావుననే సువర్ణచ్ఛాయాశోభితములుగ నున్నవి. కావున మకుటమునకు భూషావిశేషముగ నొప్పెను. పూవులు విరియఁబూచి తమంత రాలుచున్నవి గానఁ గేసరార్ద్రాక్షతచ్ఛాయము లని గ్రాహ్యము.

తా. వనప్రదేశమునఁ జెట్లపైఁగల స్వరముతోఁ బలుకుచున్న చిలుకలు కదలుచుంటవలన విరియఁబూచిన కొమ్మలనుండి పచ్చని కింజల్కములు వసురాజు కిరీటముపై భూషణప్రాయముగా రాలెను.

ఉ. ఆదరణీయరామకథ • నాంకశుకోక్తులతోడఁ దీవము
త్తైదువచాలు శోభనపు • టాసతు లెత్తె సదాగతిం గిరి
క్షోదవినోదికిం జిగురు • జొంపపుఁగెంపులపళ్లెరంబులం
బ్రోదిఁ దనర్చునగ్గలపు • మొగ్గలు ముత్తెపుముగ్గు లీనఁగన్. 153

ఆదరణీయ=మన్నింపఁదగిన, రామకథనాంక = రామరామ యనెడుకథనమే చిహ్నముగాఁ గల, శుకోక్తులతోడన్ = చిలుకపలుకులనెడు రామనామాంకములైన, చిలుకపలుకులవంటి పలుకులతోడ, తీవముత్తైదువచాలు = తీఁగెలనెడుసువాసినులపంక్తి, సదాగతిన్=వాయువుచేత నని యర్థము. శుభాగమనముచేత నని యర్థాంతరము. చిగురుజొంపపుఁగెంపులపళ్లెరంబులన్ = ఎఱ్ఱని చిగురుటాకుల గుత్తులనెడు కెంపులతోఁ జేసినపళ్లెరములయందు, ప్రోదిఁదనర్చు=పెంపుచేత నొప్పుచున్న,

అగ్గలపుమొగ్గలు = మిక్కుటమైన తెల్లనిపూమొగ్గలు, ముత్తైపుముగ్గులీనఁగన్ = ముత్యాలరంగవల్లులను గల్పించుచుండఁగా, గిరికాదవినోదికిన్ = కోలాహలపర్వత భంజనవినోదియైన వసురాజునకు, శోభనపుటారతులెత్తెన్ = మంగళహారతులెత్తెను. అనఁగా నుద్యానవనమందుఁ బువ్వులతీఁగెలెఱ్ఱనిచిగురుటాకుల జొంపములతోడను దెల్లనిపూమొగ్గలతోడను నలరి మలయమారుతముచేతఁ గదలి యాడుచుండఁగా వానిమీఁదనుండి చిలుకలు రామరామయని పలుకుచుండె నని తాత్పర్యము. అలం. రూపకము.

సత్ + ఆగతికి నానందించి ముత్తైదువులు సంతసముతో నాగతునకు హారతి నిచ్చుట యాచారము. కాన శోభనపుటారతులెత్తిరి. శోభనపుటారతి భావిశుభసూచకము. పల్లేరము చిగురుజొంపము. పల్లేరమందలి ముత్తెపురంగవల్లు లగ్గలపుమొగ్గలు. ఆరతినిచ్చువారు తీవముత్తైదువులు. ఇవి వసంత సౌభాగ్యమునకు రాజున్యుని శుభప్రాప్తికిఁ గారణములు. ఆవనమునఁ బువుతీఁగలు మొగ్గలప్రేగుచేఁ గదలుచు రాజున కారతి నిచ్చునటు లుండెనని యాశయము.

మ. అలరారన్ నెలఱాలఁ గట్టినమహీజావాలము ల్గొన్ని స
త్ఫలసాంద్రంబులు గొన్ని పల్లవరుచిప్రాగ్భారపట్టాంబరో
జ్జ్వలము ల్గొన్ని సమగ్రశారదరజోజాలంబు లై మాధవుం
డులుపానించినరౌప్యపాత్రికలు నా నొప్పెన్ నృపాగ్రంబునన్. 154

వనవృక్షములు సాష్టాంగపడుట,రంభాస్తంభములు శుకములు ద్వారాలంకరణములగుట, శుకాది స్వనముతోఁ దీవియపడఁతులు మంగళపుటారతులు పాడుట చెప్పి వసంతుఁడు వసురాజునకుఁ గానుక లొసంగుటను జెప్పుచున్నాఁడు.

అలరారన్ = ఒప్పెసలారఁగా, నెలఱాలఁగట్టిన = చంద్రకాంతమణులతోఁగట్టిన, మహీజావాలముల్ = వృక్షములయొక్క పాదులు, కొన్నిసత్ఫలసాంద్రంబులు = కొన్నిశ్రేష్ఠమయిన ఫలముల చేత నిండింపఁబడియున్నవియును, కొన్ని = ఒకకొన్ని, పల్లవరుచిప్రాగ్భార=ఎఱ్ఱని చిగురుటాకులయొక్క కాంత్యతిశయమనెడు, పట్టాంబర = ఎఱ్ఱపట్టుతాప్తాలచేత, ఉజ్జ్వలములు = ప్రకాశించుచున్నవి యును, కొన్ని = మఱికొన్ని, సమగ్ర = సంపూర్ణమయిన, శారదరజోజాలంబులు = శారదము లనఁగా నేడాకుల యరఁటిచెట్లు, వానియొక్క రజోజాలమనఁగాఁ గర్పూరసముదాయము, అదిగలవియును (ని. 'సప్తపర్ణో విశాలత్వ క్ఛారదో విషమచ్ఛదః' అని అ.) ఐ=ఆయినవై, మాధవుండు = వసంతుఁడు, (ని. 'మాధవస్తు వసంతే స్యాత్' అని వి.) ఉలుపానించిన=కానుకలచేతనింపిన, రౌప్యపాత్రికలునాన్ = వెండిపళ్లెరము లనునట్టులుగా, నృపాగ్రంబునన్ = వసురాజుముందట, ఒప్పెన్ = ఒప్పుచుండెను. రాజులకు వెండిపళ్లెరములయందు మంచిమంచిఫలములను బట్టుతాప్తాలును గర్పూరమును నుంచి యెదుటఁ గానుక పెట్టుట ప్రకటంబకదా. చంద్రకాంతములచేతఁ గట్టినపాదులను రౌప్యపాత్రికలు గాను నందు రాలినఫలాదులను గానుకలఁగాను జెప్పినాఁడని తెలియవలయు.

అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

నెలఱాలపాదులు వెండిపళ్లెరములవలె నున్నవి. అందుఁ దమంతరాలిన ఫలములు, చివుళ్లకాంతి యను పట్టువలువలు, ఏడాకుల యరఁటిచెట్ల కప్పురపుఁబొడి వసంతుఁడు సమర్పించిన కానుకవలె నున్నది.

వసంతుఁడు మాధవుఁడు (లక్ష్మీశ్వరుఁడు)గాన నైశ్వర్యశాలియైన రాజునకుఁ దగినకానుక సంతరించె నని భావము.

తా. చంద్రకాంతశిలలలోఁ రచించిన పాదులు పళ్లెములవలెను, అందు రాలినపండ్లు, చివురులను పట్టువస్త్రములు, కప్పురపురజము కానుకకు వసంతుఁడు సేకరించిన వస్తుసముదాయమువలెను నుండెను.

మ. కలకంఠార్భటి నొండొరుం బిలుచుచున్ ♦ గాఢచ్ఛదాచ్ఛాదికల్
వ్రాలయంగా నవగంధబంధురరజం♦బు ల్చిందఁగా జాలకం
బులు గాసిం బడఁగా నికుంజనిలయం♦బుల్ మీఱి వాయుత్వరం
దల చూపెం బ్రతతీసతీవితతి గో♦త్రాకాంతుఁ డేతేరఁగన్. 155

గోత్రాకాంతుఁ డేతేరఁగన్ = భూకాంతుఁడైన వసురాజు రాఁగా, ప్రతతీ = తీఁగెలనెడు సతీ = స్త్రీలయొక్క, వితతి = సమూహము, కలకంఠార్భటిన్ = కలకంఠములనఁగాఁ గోయిలలు వాని యొక్క నాదమనెడు కలకంఠార్భటి యనఁగా మధురమైన కంఠనాదముచేత, ఒండొరుంబిలుచుచున్ = ఒకరినొకరు పిలుచుచు, గాఢ = దృఢమైన, ఛద = ఆకులనెడు, ఆచ్ఛాదికల్ = మేలుముసుఁగులు, వ్రాలయంగాన్ = తొలఁగిపోవఁగా, నవగంధబంధురరజంబుల్చిందఁగాన్ = గంధమనఁగాఁ బరిమళమును మైపూఁతకుఁ దీసినగంధమును, నవ=నూతనమైన, గంధ=పరిమళముచేత, బంధుర=మనోహరమగుచున్న, రజంబులు = పుష్పరాగములనెడు, రజంబులు = అనఁగా నంగరాగములు, చిందఁగాన్ = చెదిరి పోఁగా, జాలకంబులు గాసింబడఁగాన్ = జాలకములనఁగాఁ బూమొగ్గలు గవాక్షములు పూమొగ్గలనెడు గవాక్షములు గలఁగిపోఁగా, (ని. 'జాలం గవాక్ష ఆనాయే క్షారకే దంభబృందయోః' అని వి.) నికుంజ = పొదరిండ్లనెడు, నిలయంబుల్ = గృహములను, మీఱి = అతిక్రమించి, వాయుత్వరన్ = వాయువుయొక్క వేగముచేతనని యర్థము. వాయువేగమువంటి వేగముచేత నని యర్థాంతరము. తలచూపెన్ = పొడచూపెను. అనఁగా నుద్యానవనమందు మలయమారుతము వీచుచుండఁగా బొదలలోపలనున్న తీఁగెలు కోవెలలు నాదములు చేయఁగాఁ బైయాకులు తొలఁగిపోఁగాఁ బుప్పొడులు రాలఁగాఁ బూమొగ్గలు గాసిపడఁగాఁ బొదరిండ్లు దాఁటి పైకి వచ్చెనని యాశయము.

తా. రాజు నగరము ప్రవేశించుతఱి పురకాంతలు మేడలెక్కి సందర్శించుట సహజము గావున రాజు వనమున కేతెంచుతఱి వనసుందరులగు చివురుతీగబోండ్లు కలకంఠస్వరమున నొకరినొకరు బిల్చుకొనుచుఁ జిగురాకుముసుఁగు తొలఁగిపోవ గంధరజము రాపిడిచే జారిపోవుచుండ జాలకములు (గవాక్షములు మొగ్గలు) ఒరయునటుల వాయుత్వరతో సందర్శింపవచ్చిరి.

అలంకారము శ్లిష్టరూపకము.

చ. జనపతి దారసిల్ల నొక♦సంపఁగితావులకొమ్మ రాగవ
ద్ఘనసుమనోభిరామ యయి ♦ కాఁక వహింపఁగఁ బోలుఁ గానిచో
ననుపమపంచసాయక క♦రాంచలచంచలచాపశింజినీ
జనితకఠోరఝంకృతులు ♦ స్నైఁపక యున్నె పరాగపాండువై. 156

జనపతిదారసిల్లన్ = వసురాజు సమీపమునకు రాఁగా, ఒకసంపఁగితావులకొమ్మ = ఒకానొక సంపఁగిచెట్టుయొక్క వాసనలు గలకొమ్మయనెడు సంపంగిపువ్వులవాసన గలస్త్రీ, ఇది కర్తృపదము. రాగవత్ = అనురాగము గలిగినదియు, ఘన = అతిశయమైనదియు, సుమ = లెస్సైనదియునగు, మనః = మనస్సుచేత, అభిరామయయి = ఒప్పుచున్నదైయని యర్థము. రాగవత్ = గౌరవర్ణముగల, ఘనసుమనోభిరామయయి = ఘనమైన పుష్పములచేత నొప్పుచున్నదని భావము. తాఁక వహింపఁగఁబోలున్ = విరహతాపమును వహింపఁబోలును, అని యర్థము. సంపఁగిపువ్వులయందుఁ గాఁకగుణము గలదని భావము. కానిచోన్ = లేకపోయినట్టులయ్యెనేని, పరాగపాండువై = పరాగమువలెఁ దెల్లనివర్ణము గలదై, అనఁగా విరహతాపముచేతఁ దెల్లఁబడినదేహముగలదై యని యర్థము. పుప్పొడిచేతఁ దెల్లఁగా నున్నదనిభావము. అనుపమ = ఉపమానరహితమైన, పంచసాయక = మన్మథునియొక్క, కరాంచల = హస్తాగ్రమందు, చంచల = చలించుచున్న, చాప = ధనువుయొక్క, శింజినీ = తుమ్మెదచాలుచేతఁ గల్పింపఁబడినవారివల్ల, జనిత = పుట్టింపఁబడిన, కఠోర = పరుషములైన, ఝంకృతులు = ఝంకారములను, సైఁపకయున్నె = సహింపలేకపోవునాయని యర్థము. అనఁగా విరహతాపమును బొందకయున్నట్టయిన సహించునుగదా యనుట. విరహులు మన్మథచాపశింజినీధ్వనులను సహింపలేకపోవుట ప్రసిద్ధంబకదా. సంపఁగికిని దుమ్మెదలకును విరోధముగనుక సంపఁగికొమ్మ తుమ్మెదలయొక్క ఝంకారమును సహింపదని భావము. మధుపఝంకారములను మన్మథచాపగుణధ్వనులనుగా వర్ణించినాఁడు. అనఁగా వసురాజు సమీపమం దొకసంపఁగిపువ్వులకొమ్మ స్వభావసిద్ధమయిన యుష్ణగుణము గలిగి పుప్పొడిచేతఁ గప్పఁబడినదై తుమ్మెదలు లేక కనఁబడె ననుట.

అలం. రూపకము. పర్యాయోక్తము.

పంచసాయకుని చంచలశింజిని తుమ్మెదలబారు. కావున నారిమ్రోఁత ఝంకృతిగఁ జెప్పఁబడెను. సంపఁగికొమ్మ రాజును జూచి తొలుత రాగము వహించెను. ఆవల విరహతాపమొందెను. తుమ్మెద నారిమ్రోఁతలు కఠోరములయ్యెను. పిదపఁ బరాగపాండుత నొందెనని యాశయము.

మన్మథునినారి తుమ్మెదచా లనుటకు.

శ్లో. మౌర్వీలోలంబమాలా ధనురథవిశిఖాః కౌసుమాః పుష్పకేతోః
భిన్నంస్యా దస్యబాణై ర్యువజనహృదయం స్త్రీకటాక్షేణ తద్వత్. (సాహిత్యదర్పణము)

చ. చలితలతాంతకాంతి యను • చందురుకావిచెఱంగు దాఁటి స
మ్మిళితవయోవిలాసముల • మీటిన విచ్చుఫలస్తనాగ్రము
ల్వ్రేలువడఁ గప్పెఁ దత్క్షణమ • వేల్లితదోహదధూపధూమకుం
తలములు విప్పి దాడిమల • తాలలితాంగి నృపాలుచెంగటన్. 157

నృపాలుచెంగటన్ = వసురాజుసమీపమందు, దాడిమలతా = దాడిమశాఖయనెడు, లలితాంగి = స్త్రీ, చలిత = కదల్పఁబడిన, లతాంతకాంతియను = ఎఱ్ఱనిపూవుయొక్క కాంతియనెడు, చందురుకావిచెఱంగు దాఁటి = చంద్రకావిపైఁటకొంగును దొలఁగఁద్రోచికొని, సమ్మిళిత = సమకూడియున్న, వయోవిలాసములన్ = పక్షిచంచువిలాసములచేత నని ఫలపరమయినయర్థము. యౌవనవిలాసములచేత నని స్తనపరమయినయర్థము. మీటినవిచ్చు = మీటితే అవిసిపోవుచున్న, ఫల = ఫలములనెడు, గోటమీటి

తే విచ్చిపోవునట్లుగానున్న, ఫలస్తనాగ్రములు=ఫలములవంటి కుచములయొక్క కొనలు, వెలువడఁగ = బయలుపడఁగా, తత్క్షణమ = అప్పుడే, వేల్లిత = వక్రమయిన, ని. 'ఆవిద్ధం కుటిలం భుగ్నం వేల్లితం వక్రమిత్యపి' అని అ. దోహదలక్షణము.

శ్లో. 'తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతమ్,
పుష్పాద్యుత్పాదకంద్రవ్యం దోహదంస్యాత్తుతత్క్రియా.'

దోహద మనఁగాఁ దరుగుల్మలతాదులకు నకాలమందుఁ బుష్పములు మొదలైనవానిని బుట్టించు ద్రవ్యమునకును నట్లుచేసెడు క్రియకును బేరు. అట్టిదోహదసంబంధమయిన, ధూపధూమ = ధూపము యొక్క ధూమరేఖయనెడు, ఇక్కడ దానిమ్మచెట్టునకుఁ జేయుదోహదము ధూపములు వేయుట యని తెలియవలయును. కుంతలములువిప్పి = తలవెండ్రుకలు విడఁదీసి, కప్పెఁ=ఫలస్తనాగ్రములను గప్పెను. వస్త్రహీనత సంభవించినప్పుడు తలవెండ్రుకలచేత మానసంరక్షణము చేసికొనుట స్త్రీలకు స్వభావమని తెలియవలయును. అనఁగా వసురాజునకుఁ జేరువ నొక దానిమ్మచెట్టుకొమ్మ యొఱ్ఱని పువ్వుయొక్క కాంతి నతిక్రమించి చిలుకలు మొదలైనవి యంటినంతనఁ బగిలిపోవు మొనలుగలవై, దోహదధూపధూమముచేతఁ గప్పఁబడిన పక్వఫలములతోఁ గనుపించెనని తాత్పర్యము.

గుబ్బలు పయంటదాఁటుట సమకూడిన వయసు పొంకమువలన. స్తనాగ్రములంటిన విచ్చునటులుండె ననుటవలన జవ్వనపుబింకము సూచితము. మోహమునఁ బొలఁతులకు గుబ్బలుబ్బుననుట ప్రసిద్ధము. కాననే గుబ్బలు మీటిన విచ్చునటులున్నవని చెప్పఁబడెను. ఇటులె మోహావస్థలోనున్న వరూధినివి "మీటినవిచ్చుగబ్బిచనుమిట్టని" పెద్దన చెప్పెను.

ధూమాదిదోహదములు ఫలవృక్షముల కకాలఫలకుసుమోత్పత్తులకై గావించుట యాచారము.

ఉ. దోహదధూపధూమములతోఁ గనుపట్టెడి తత్పురీవన
పుష్యాహము నోసమస్తవిబుధోత్తమ చూచితె... (ప్రభావతీప్రద్యుమ్నము)

దాడిమకు ధూపక్రియయు దోహదవిశేషమె.

'మేషామిషాంబుసంసేక స్తత్కోశామిషధూపనమ్,
శ్రేయానయం ప్రయోగః స్యా ద్దాడిమీఫలవృద్ధయే.
మత్స్యాజ్యత్రిఫలాలేపై ర్మాంసై రాజావికోద్భవైః,
లేపితాధూపితా సూతే ఫలంతాళీవదాడిమీ.'

సీ. చిగురుకెంగేలు సాఁచె రసాలవల్లరి తేఁటిచూపులఁ జూచె తిలకలతిక
పికగీతిఁ బాడి చూపెఁ బ్రియాళులత పల్కెఁ గీరభాషలఁ గర్ణికారశాఖ
ముఖపక్తి నింపె నింపు గలసంపఁగికొమ్మ వన్నెగా నగియె లేఁబొన్నతీఁగె
సురభిళశ్వాసంబు నెరపె సింధుకవల్లి గ్రుచ్చెఁ దావులు సోఁకఁ గ్రోవిరెమ్మ
తే. యాత్మరుచిరోపచారంబు లధిపకల్ప, కంబునకుఁ దత్తదామోద గరిమఁ బెనుప
నంగనానిత్యకలితదోహదవిశేష, సన్నుతాచారములసడి సన్నకతన. 158

ఈపద్యములో రసాలవల్లర్యాదులయందు స్త్రీలింగమహిమచేత స్త్రీత్వద్యోతనమగుచున్నది నుక. వానియొక్క పల్లవస్పర్శాదులు వసురాజునందుఁ జేయఁబడిన కరస్పర్శాదినర్మచేష్టలం

గాను వసురాజనెడు కల్పవృక్షమునకుఁ జేయఁబడిన దోహదవిశేషములుగాను జెప్పినాఁడు. ఏ లాగున ననిన.

రసాలవల్లరిమొదలైన, అంగనాః=స్త్రీలచేత, నిత్య=నిరంతరమును, కలిత=జమకుఁ జేయఁబడు చుండెడు, దోహదవిశేష = పూర్వోక్తదోహదవిశేషరూపములైన, సన్నుతాచారముల=ప్రసిద్ధాచారములయొక్క, సడిసన్నకతనన్=సంజ్ఞచేత, ఆత్మరుచిరోపచారంబులు = తాము సేయుచున్న మనోహరములైన కరస్పర్శాదిదోహదోపచారములు, అధిపకల్పకంబునన్ = వసురాజనెడు కల్పవృక్షమునకు, తత్తదామోదగరిమఁబెనుపన్ - తత్తత్=ఆయా, ఆమోద = ఆనందముయొక్క లేక పరిమళము యొక్క, గరిమన్=ఆధిక్యమును, పెనుపన్=వృద్ధిఁబొందించునట్లుగా, రసాలవల్లరి=తియ్యమామిడి కొమ్మయనెడు రసాలవల్లరియను పేరుగల నాయిక, చిగురుకెంగేలుసాఁచెన్ = చిగురనెడు హస్తమును వసురాజుపైకిఁ జాఁచెను. అనఁగా హస్తస్పర్శము చేసెననుట. ఇది కరస్పర్శరూపమైనదోహదము, తియ్యమామిడి హస్తస్పర్శరూపమైనదోహదముచేతఁ బూచునదిగనుక నాపరిచితిచేత హస్తస్పర్శ చేసెనని భావము. సర్వత్ర యీలాగున నాయాదోహదపరిచితిగల వృక్షశాఖాంగనలవలన నాయా దోహద మాచరింపఁబడినదని తెలియవలయును.

తిలకమనఁగా బొట్టుగుచెట్టు, తిలకలతిక=బొట్టుగుకొమ్మయనెడు తిలకలతికానామకనాయిక, తేఁటిచూపులఁజూచెన్ = తుమ్మెదలనెడు చూపులచేతఁ జూచెననియర్థము. ఇది వీక్షణరూపమయిన దోహదము. ప్రియాళువనఁగాఁ బ్రేంకణము. ప్రియాళులత=ప్రేంకణపుతీఁగె యనెడు ప్రియాళులతానామకనాయిక, పికగీతిఁబాడిచూపెన్ = కోకిలగానమనెడు పాటఁబాడెనని యర్థము. ఇది గానరూపమయిన దోహదము. కర్ణికారశాఖ = కొండగోఁగుకొమ్మ యనెడు కర్ణికారశాఖానామక నాయిక, కీరభాషలన్ = చిలుకపలుకులవంటి పలుకులచేత, పల్కెన్=భాషించెను, అనియర్థము. ఇది సల్లాపరూపదోహదము. ముఖరక్తి యనఁగా శాఖాముఖపుష్పరక్తిమయును ముఖమిచ్చుటయును. ఇంపుగలసంపంగికొమ్మ=సంపఁగికొమ్మ యనెడు సంపఁగికొమ్మయను పేరుగల నాయిక, ముఖరక్తినింపెన్ = శాఖాముఖకుసుమరక్తియనెడు ముఖమిచ్చుటను గలుగఁజేసెనని యర్థము. ఇది ముఖరాగరూప దోహదము. లేఁబొన్నతీఁగె = లేఁతపొన్నతీఁగె యనెడు లేఁబొన్నతీఁగెయను పేరుగల నాయిక, వన్నెగానగియెన్ = వన్నెయనఁగాఁ బుష్పకాంతియును సొగసును, పుష్పకాంతియనెడు నవ్వుచేత సొగసుగా నవ్వెను. ఇది హసితరూప దోహదము. శ్వసనమనఁగా వాయువును విశ్వాసమును, సింధుకవల్లి = వావిలికొమ్మయనెడు సింధుకవల్లీనామక నాయిక. (ని. 'అథ సింధుకః, సిన్ధువారేన్ద్రసురసౌ నిర్గుణ్డీన్ద్రాణికేత్యపి' అని అ.) సురభిళ = పరిమళయుక్తమైన, శ్వసనంబున్=వాయువనెడు నిశ్వాసమును, నెరపెన్ = పొందించెను. ఇది ముఖవాయురూపదోహదము. తావులనఁగా వాసనలును గళాస్థానములును, క్రోవిరెమ్మ=క్రోవికొమ్మయనెడు క్రోవిరెమ్మ యనుపేరుగలనాయిక, తావులు సోఁకన్ = పరిమళములనెడు కళాస్థానము లంటునట్లుగా, గ్రుచ్చెన్ = కౌఁగిలించెను. ఇది యాలింగనరూపదోహదము.

కల్పక మభీష్టఫలదాయి గనుక సకలదోహదక్రియాయోగ్య మని తెలియవలయును. ఆయా వృక్షములకుఁ జేయఁదగిన దోహదక్రియలకుఁ బ్రమాణము.

శ్లో. 'అశోకశ్చరణాహత్యా వకుళో ముఖసీధునా,
ఆలిఙ్గనా త్కురవక స్తిలకో వీక్షణేనచ,
కరస్పర్శేన మాకన్దో ముఖరాగేణచమ్పకః,
సల్లాపతః కర్ణికార స్సిన్ధువారో ముఖానిలాత్,
గీత్యాప్రియాళుర్నితరాం నమేరు ర్హాసితేనచ.'

అనఁగా నశోకవృక్షము పాదతాడనముచేతను బొగడచెట్టుమియుఁటచేతను నెఱ్ఱపువ్వులపెద్ద గోరింట యాలింగనముచేతను దిలకవృక్షము చూచుటచేతను మామిడిచెట్టు హస్తస్పర్శముచేతను సంపెఁగచెట్టు ముఖరాగముచేతను గొండగోఁగుచెట్టు సల్లాపముచేతను వావిలిచెట్టు ముఖవాయువుచేతను ప్రేంకణపుచెట్టు గానముచేతను సురపొన్న నవ్వుటచేతను బుష్పించుచున్నవి. అనఁగా నాయావృక్షము లాయాదోహదములచేత నకాలమందును బుష్పించుచున్నవని శాస్త్రప్రసిద్ధము.

అంగనాదోహదములచే శిక్షితములు గావున లతలు ఉపచరించెను. రాజు అధిపకల్పకము గావున రసాలవల్లర్యాదులు ఆమోదగరిమ పెంచెను.

తా. వసురాజు వనములోనికి రాఁగానే తియ్యమావిచివురులు నిక్కెను. బొట్టుగుతీఁగ తుమ్మెద లతో నిండియుండెను. ప్రేంకణపుఁదీఁగ కోకిలగానములతో నలరెను. కొండగోగు చిలుకపలుకులతో నొప్పెను. సంపెఁగ కెంజాయలతోఁ దనరెను. పొన్నపూచెను. వావిలి పూలతావితో నెసఁగెను. క్రోవి సుగంధానిలములకుఁ దానకమయ్యెను. ఇవి రాజున కుపచారములు చేయునటులుండెను.

అలం. రూపకము. సమాసోక్తి.

మ. చను వొప్పన్ నగి పల్కి పాడి కని యాశ్వాసంబు నొందించి చే
కొని మోమిచ్చి కవుంగిలించి తరులం గొన్నింటి మన్నించి యం
గన లయ్యో మము నెంతచేసి రనుచుం గంకేళియుం గేసరం
బును భూజానికి మ్రొక్కె గుచ్ఛవినతిం బూఁదేనెకన్నీటితోన్. 159

చనువొప్పన్ = మన్ననయొప్పునట్లులుగా, నగి=నవ్వి, పల్కి=సంభాషించి, పాడి=గానము చేసి, కని=వీక్షించి, ఆశ్వాసంబునొందించి = ఊరటఁబొందునట్లులుచేసి, చేకొని = అంగీకరించి యని యర్థము, కరస్పర్శచేసి యనిభావము. మోమిచ్చి=ముఖరక్తినొసఁగి, కవుంగిలించి=ఆలింగనము చేసికొని, తరులంగొన్నింటిమన్నించి = పైపద్యములోఁ జెప్పఁబడిన రసాలాదివృక్షముల నెనిమిదింటిని మన్నించి, అనఁగాఁ బైనిజెప్పఁబడిన హాసనము మొదలుగాఁగలదోహదక్రియ లెనిమిదియును మన్ననచేత జరిగించెడు నర్మచేష్టల ననుసరించినవి యయినందున నాక్రియలచేత వాని మన్నించిరా రనుట. అంగనలు=స్త్రీలు, అయ్యో=అక్కటా, మమునెంతచేసిరనుచున్=మమ్ము నెంతయవమానము చేసినారో చూచితివాయని, అనఁగాఁ దన్ని యుమిసినారనుట. అశోకము తన్నినఁ బూయునది యనియుఁ బొగడ యుమిసినఁ బూయునదియనియును దెలియవలయును. కంకేళియున్=అశోకమును, కేసరంబును=పొగడయును, గుచ్ఛవినతిన్ = పువ్వుగుచ్ఛభారమువలని వంగుట యనెడునమ్రత్వము చేత, పూఁదేనెకన్నీటితోన్ = మకరందమనెడు కన్నీటితోడ, భూజానికిమ్రొక్కెన్ = వసురాజునకు నమస్కరించెను. అలం. ఉత్ప్రేక్ష.

అంగనలు మమ్మెంత చేసిరని చేసినయవమానము చెప్పుకొనకపోవుటవలన నశోకమునకుఁ గేసరమునకుఁ గలిగిన యవమానాతిశయము సూచితము. సాటివారిలో గౌరవము లేకపోఁగా నగౌరవము కలుగుటచేఁ జెలులయ్యు రాజుముందు చెప్పుకొనవలసివచ్చినది. పూఁదేనె కన్నీరగుటవలన నశ్రులు నయనాంచల పూరములుగ నున్నవనియుఁ బూలప్రేఁగున వంగుట చనుగవ ప్రేఁగున వంగినటులున్న దనియు భావము. కేసరకంకేళులు పూలతోఁ దేనెతో నలరె ననుట.

తా. ఇతరలతల సగౌరవముగ దోహదములచేఁ దృప్తినొందించి యంగనలు తమ్మవమానించిరని పూలప్రేగుతో వంగిన తేనియచాలాలయు కంకేళికేసరములు రాజుముందు నమస్కరించి కన్నీరు విడుచుచున్నటులుండెను.

మ. లలితైణాంకశిలాలవాలమను కే ◆ ళాకూళిలో నీరు పైఁ
జెలు వొప్పన్ ధరియించి తోడనె మిళ ◆ చ్చిక్రోడదంష్ట్రా దళ
త్ఫలరంధ్రంబులచే వెలార్చి జలసూ ◆ త్రస్తంభముం బోనియ
గ్గలపుంజాయలగుజ్జునారికెడముం ◆ గాంచెన్ విభుం డయ్యెడన్. 160

లలిత=ఒప్పుచున్న, ఏణాంకశిలా=చంద్రకాంతశిలలచేత రచింపఁబడిన, ఆలవాలమను = పాదు నట్టి, కేళాకూళిలోన్ = కుండులో, అనఁగా నాతుఖానాలో, నీరుపైఁ జెలువొప్పన్ ధరియించి = ఉపరిభాగమందుఁగాయలలో నీళ్లుధరించి, అనఁగాఁ బైనున్న కాయలలోనికి నీళ్లెగఁబిల్చియనియర్థము. తోడనే=వెంబడిగానే, మిళత్=సమకూడుచున్న, చిక్రోడ = ఉడుతలయొక్క, ని. 'చిక్రోడ స్థూల దంతకః' అని యమరశేషము. దంష్ట్రా = కోఱలచేత, దళత్=బ్రద్దలగుచున్న, ఫల = కాయలయొక్క, రంధ్రములచేన్ = రంధ్రములచేత, వెలార్చి = బయలువెడలించుచున్నదై, జలసూత్రస్తంభముం బోని= జలయంత్రనాళమువలెనున్న, అగ్గలపుంజాయల = దట్టమైన నీడలుగల, గుజ్జునారికెడమున్ = గున్న టెంకాయచెట్టును, అయ్యెడన్=ఆవనస్థలియందు, విభుండు=వసురాజు, కాంచెన్ = చూచెను. అలం. రూపకానుప్రాణితమగు నుపమ.

గుజ్జునారికెడము గావున సమోన్నతమగు జలసూత్రస్తంభమువలె నుండెను. అగ్గలపుంజాయల గుజ్జునారికెడమనుటవలన ఫలరంధ్రములనుండి జలము, నీడనాసించివచ్చినవారికై సరాసరిగఁ బడుచు నంతటియెత్తుగానుండెనని తోఁచును. అగ్గలపుంజాయల నారికేళము గావుననే చంద్రకాంత శిలాలవాలములోని జలమును జల్లబఱుచుటకుఁ దగియున్నదని యెఱుంగనగును. దళత్ ఫలరంధ్రము లనుటవలన నుడుత లపుడే కోఱలతో గంట్లువేయుచున్నవనియుఁ గాననే మికముగ బిందురూపముగఁ దుంపురులు రాలుచున్నవనియు జలయంత్రమువలె వసంతర్తువున నారికేళము లుంటచే రాజు చూచెనని తెలియ నగును.

తా. చంద్రకాంతశిలాలవాలమునందున్న కొబ్బరిచెట్టు జలసూత్రస్తంభమువలె నుండెను. ఉడుతలుకొఱకు కొబ్బరికాయలలోనినీరు వడియుచు జలయంత్రమువలెనుండ రాజు చూచెను.

తే. నృపునెదుటఁ దేనెవాఁకలో ◆ నిబిడవిచల
దతనుపత్త్రాళిఫలసాంద్ర ◆ మగుచు నొక్క

నగము కైవ్రాలి యేటిలో ♦ నాటియున్న
నాఁటియున్నతనగరాజు ♦ నలువుఁ దెలిపె. 161

నృపుసెమటర్ = వసురాజుముందఱ, తేనెవాఁకలోఁ = పూఁదేనెకాలువలో, నిబిడ = దట్టమానట్టులుగా, విచలత్ = చలించుచున్న, అతను = గొప్పలైన, పత్త్రాళి = ఆకులచేతను, ఫల=కాయలచేతను, సాంద్రమగుచుర్ = దట్టమైనదై, ఒక్కనగము = ఒకవృక్షము, కైవ్రాలి = ఒరగఁబడినదై, ఏటిలోన్ = శుక్తిమతీనదిలో, నాటియున్న=పాదుకొనియున్న,, నాఁటి=ఆకాలమందలి, ఉన్నతనగరాజు=పొడవుగలిగిన కోలాహలపర్వతశ్రేష్ఠనియొక్క, నలువుదెలిపెన్ = చందమును దెలియఁజేసెను. అనఁగా శుక్తిమతీ ప్రవాహస్థితకోలాహలపర్వతస్మృతి నుదయింపఁజేసెననుట. (ని. 'శైలవృక్షౌ నగౌ వగౌ' అని యమరము) అలం. నిదర్శనము.

తా. తేనియప్రవాహములోఁ బ్రతిబింబించు ఆకులతోఁ బండ్లతో నలరువృక్షము శుక్తిమతీ నదిలో నొరగి నాటుకొనియున్న కోలాహలపర్వతమును వసురాజునకు జ్ఞాపకము చేయుచుండెను.

ఉ. ఉన్నతి నన్నగాగ్రమున ♦ నున్న యొకానొకకిన్నరద్వయం
బన్నిఖిలోక్తివేది కపు ♦ డన్యదురాసద మైనయొక్కయా
సన్నశుభంబుఁ దిన్న నిప్ర ♦ సన్ననిజోక్తులఁ దెల్పి తోన యే
గె న్నరదేవపాదపవి ♦ ఖిన్నబృహన్నగకూటవాటికిన్. 162

ఉన్నతిన్ = సుఖాతిశయముచేత, అన్నగాగ్రముననున్న = అవృక్షాగ్రమునందున్న, ఒకానొక కిన్నరద్వయంబు=ఒకకిన్నరపక్షిమిథునము, అన్నిఖిలోక్తివేదికిన్ = సకలజంతువులయొక్క పలుకు దెలిసిన యావసురాజునకు, అపుడు = ఆసమయమందు, అన్యదురాసదమైన=మఱియొకరికిఁ బొందశక్యముగాని, ఒక్కయాసన్నశుభంబున్ = ఒకసమీపకాలశుభమును, తిన్నని=మృదువైన, ప్రసన్ననిజోక్తులన్ = ఆదరముతోఁగూడిన స్వకీయభాషలచేత, తెల్పి = తెలియఁజెప్పి, తోన = వెంటనే, నరదేవ=వసురాజుయొక్క, పాద=పాదమనెడు, పవి=వజ్రాయుధముచేత, ఖిన్న = ఖేదపెట్టఁబడినదియు, బృహత్ = మిక్కిలి గొప్పదైనదియునగు, నగ=కోలాహలపర్వతముయొక్క, కూటవాటికిన్ = శిఖరశ్రేణికి, (ని. 'కూటోఽ స్త్రీ శిఖరం శృఙ్గమ్' అని అ.) ఏగెన్ = పోయెను. అనఁగా వసురాజును గోలాహలపర్వత గమనోత్సుకునిఁగా నొనర్పనోయన కిన్నరమిథునంబు పర్వతశిఖరతలమున కరిగెనని భావము.

వృక్షమునకు శైలమునకు నర్థమగు నగమునె మరల చెప్పుటవలనను గిన్నరశబ్దము పక్షివిశేషమునకు గిన్నరులకు సరిపడుటవలనను జెట్టుపైఁ గిన్నరపక్షిమిథునముండెననియు శైలాగ్రమునఁ గిన్నరులు విహరించుచుండిరనియు భావాంతరము స్ఫురించును. కిన్నరసూక్తిభావమును వసురాజునిఖిలోక్తి వేదిగావునసే గ్రహింపఁగలిగెను. అన్యదురాసదమగు శుభముగాన వసురాజు అనన్యసాధ్యమహిమాసంపన్నుఁడనుట. నగాగ్రమునుండి నగాగ్రమున కేగుట కిన్నరసహజము. కోలాహలపర్వతముపైకిఁ గిన్నరమిథున మేగుట యానగరమున కేగ వసురాజున కుత్సుకము కలిగించుటకు.

తా. కిన్నరద్వయము నగముపైఁ జేరి పలుకుచుండ రాజు త్వరలో ననన్యసాధ్యమగు శుభము తనకు సమకూడ నున్నదని తలంచెను. వెంటనే కిన్నరద్వయము కోలాహలపర్వతమువీఁదికి ఎగిరి పోయెను.

క. ఆలోకాద్భుతవిహగయు, గాలోకప్రీతివలన • నతిలోకవయగ
కోలాహలకోలాహల, లీలాహలహళిక చెంగలించెఁ బతికిన్. 163

ఆ=అట్టి, లోకాద్భుత = లోకాశ్చర్యకరమైన, విహగయుగ = కిన్నరపక్షిమిథునముయొక్క, ఆలోకప్రీతివలనన్=దర్శనమువలనఁ బుట్టిన మక్కువచేత, పతికిన్ = వసురాజునకు, అతిలోక=లోకాతీతమైన, వయః = పక్షులయొక్క, కోలాహల = కలకలధ్వనులుగలిగిన, కోలాహల = కోలాహల పర్వతమందలి, లీలాహలహళిక = లీలావిహారోత్సవము, చెంగలించెన్ = ఉద్రేకించెను. కిన్నరపక్షులు భూలోకమునకు నాశ్చర్యకరములైనవియ కదా.

తా. లోకాశ్చర్యకరములగు కిన్నరపక్షులను జూచినంతన రాజునకు వేడుక గలిగెను. అవి కోలాహలపర్వతముపైఁ జేరి కలకలధ్వనులు గావించుచుంట నాలించి యటకుఁ బోవనెంచెను.

ఆశ్వాసాంతము

మ. అవితోర్వీనవఖండఖండపరశుజ్యాభోగిసాభోగభో
గవిభాస్వద్భుజదండ దండధరవీక్షారూక్షనానావిప
క్షవిభుక్ష్వేపకకాండ కాండభయకృద్గంభీరభేరీమహా
రవదీర్ణాద్రిపిచండ చండబలధౌరంధర్యహార్యగ్రజా. 164

అవిత=రక్షింపఁబడిన, ఉర్వీనవఖండ = భూమియొక్క భరతఖండము మొదలైననవఖండములు గలవాఁడా, ఖండపరశు = శివునియొక్క, (ని. 'భూతేశః ఖణ్డపరశుః' అని అ.) జ్యా = వింటినారి యైన, భోగి=సర్పముయొక్క, అనఁగా శేషాహియొక్క, సాభోగ = అతిదీర్ఘత్వముతోఁగూడిన, భోగ=శరీరమువలె, (ని. 'భోగస్సుఖే స్త్ర్యాదిభృతావహేశ్చ ఫణ కాయయోః' అని వి.) విభాస్వత్= విలసిల్లుచున్న, భుజదండ = బాహుదండములు గలవాఁడా, దండధర = యమునియొక్క, వీక్షా = (క్రూర)దృష్టివలె, రూక్ష=తీక్ష్ణమైన, నానా=సమస్తమైన, విపక్షవిభు = శత్రురాజులను, క్ష్వేపక=చిమ్మివైచునట్టి, కాండ = బాణములుకలవాఁడా, (వ్యు. 'కస్య బ్రహ్మణః అణ్డః కాణ్డః' అనువ్యుత్పత్తి చేతఁ గాండమనఁగా బ్రహ్మాండము.) కాండ = బ్రహ్మాండమునకు, భయకృత్ = భయంకరమైన, గంభీర = గంభీరమైన, భేరి = రణభేరియొక్క, మహాత్ = గొప్పదియయిన, రవ = ధ్వనిచేత, దీర్ణ=బ్రద్దలుచేయఁబడిన, అద్రిపిచండ=పర్వతోదరములుగలవాఁడా, (ని. 'పిచణ్డ ముదరే విద్యాత్పశో రవయవేపిచ' అని వి.) చండ = సమర్థమైన, బల = బలముయొక్క, ధౌరంధర్య = భారమును వహించుటయందు, హార్యగ్రజా = బలరాముఁడైనవాఁడా, అనిసంబోధనము. ఈపద్యము ముక్తపద గ్రస్తముగాఁ జెప్పఁబడియెను.

క. శ్రీకర్ణాటేశ్వర వి, శ్వాకర్ణితబిరుదశాసనాంక వితీర్ణ
శ్రీకర్ణ దశదిశాలల, నాకర్ణాభరణసుగుణనవరత్నఖనీ. 165

శ్రీ=సంపద్యుక్తమయిన, కర్ణాట = కర్ణాటరాజ్యమునకు, ఈశ్వర = ప్రభువైనవాఁడా, విశ్వ= ప్రపంచముచేత, ఆకర్ణిత = వినఁబడిన, బిరుదశాసనాంక = బిరుదములతోఁ గూడిన శాసనచిహ్నములు గలవాఁడా, వితీర్ణశ్రీ = వితరణసమృద్ధియందు, కర్ణ = కర్ణుఁడైనవాఁడా, దశదిశా=పదిదిక్కులనెడి, పూర్వాదిక చతుర్దిక్కులును నాగ్నేయాదిక చతుర్విదిక్కులును నూర్ధ్వాధఃప్రదేశములునుగూడ పీ

పదియు దశదిక్కు లనంబడును. లలనా=స్త్రీలకు, కర్ణాభరణ=కర్ణభూషణములైన, సుగుణ = సుగుణము లనెడు, నవరత్న = నూతనరత్నములకు, ఖనీ = గనియైనవాఁడా, ఈపద్యము ద్విప్రాసముగలదిగాఁ జెప్పంబడియెను.

పృథ్వి. కబంధహారధీరతాకర కరాసికృత్తత్రుట
త్కబంధపరిపంథిసంగ్రథితసూర్య సూర్యర్పిత
ప్రబంధరసబంధురార్థపదబంధ బంధుస్వధీ
నిబంధన యబింధనాగ్నినిభనిత్య తేజోనిధీ. 163

కబంధహార=కబంధాసురసంహారకుఁడైన శ్రీరామునియొక్క, ధీరతా = ధైర్యమునకు, ఆకర = స్థానమైనవాఁడా, అనఁగా శ్రీరామునితో సమానమైన పరాక్రమము గలవాఁడని భావము. ఖరాసి= తీక్ష్ణమైనఖడ్గముచేత, కృత్త = ఖండితులై, త్రుటత్ = తెగిన, కబంధ= మొండెములుగల, ని. 'కబంధో స్త్రీ క్రియా యుక్తమపమూర్ధకళేబరమ్' అని అ. పరిపంథి = శత్రువులచేత, సంగ్రథిత=భేదింపఁ బడిన, సూర్య = సూర్యమండలముగలవాఁడా, సూరి = విద్వత్కవులచేత, అర్పిత = సమర్పింపఁబడిన, ప్రబంధ = ప్రబంధములయందలి, రస = శృంగారాది రసములచేత, బంధుర=సుందరమగుచున్న, అర్థ= అర్థంబును, పదబంధ = పదసందర్భమునుగలవాఁడా, బంధు = బంధువులయందు, స్వధీనిబంధన = తా ననెడుబుద్ధి నిబంధనము గలవాఁడా, అనియైనను, బంధువులకు స్వాధీనుఁడవైనవాఁడా, అని యైనను అర్థము. అబింధనాగ్ని = బడబాగ్నితోడ, నిభ = సమానమైన, నిత్య = శాశ్వతమైన, తేజః= ప్రతాపమునకు, నిధి = స్థానమైనవాఁడా, ఈవృత్తము ముక్తపదగ్రస్తముగాను ద్విప్రాసముగలదిగాను జెప్పంబడియె. ఈ పృథ్వీవృత్తమునకు జ స జ స య వ గణములును బండ్రెండవ యక్షరము యతిస్థానమునుగా నుండవలయును. ఇది పదియేడవఛందం బగు నత్యష్టిఛందంబునఁ బుట్టిన వృత్తము.

లక్షణము-

ప్రియంబగుచు రుద్రవిశ్రమము పృథ్వికాసంజ్ఞికా
హ్వాయంబగు జసంబుతో జసయవంబులుఁ గూడినన్.

కాని యాధునికకవులు పృథ్వీవృత్తమునకు తొమ్మిదింట యతి వాడియున్నారు.

గద్యము. ఇది శ్రీరామచంద్రచరణారవిందవందనపవననందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకష చతుర్విధ కవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతం బైనవసుచరిత్రంబునందుఁ బ్రథమాశ్వాసము.

ఇది శ్రీమదాత్రేయకులకలశాంభోనిధి సంపూర్ణసోమ సోమాభిధాన మంత్రివరపౌత్త్రుండును సోమసుతసిద్ధేశ్వరమంత్రీశ్వరపుత్త్రుండును శ్రీమత్పార్వతీరాజేశ్వరవరప్రసాద సమాసాదిత హృద్యాన వద్య నిఖిలవిద్యావిశారదుండును నగుసోమకవిచేత విరచితం బయినవిద్వజ్జనరంజనీనామకప్రతిపద టీకారూపం బగువసుచరిత్రనామ కాంధ్రకావ్యరత్నవ్యాఖ్యానమునందలి ప్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు

# వసుచరిత్రము, సవ్యాఖ్యానము

## ద్వితీయాశ్వాసము



తిరుమలరాయ జయ
శ్రీతరుణీరమణ సుగుణ•శీతల యాకా
శీతలసేతుధరాతిధు
రాతతభుజదండ మూరు•రాయరగండా. 1

శ్రీ=సంపద్యుక్తుఁడవైన, తిరుమలరాయ = తిరుమలరాయ నామము గలవాఁడా, జయశ్రీ తరుణీ రమణ=జయలక్ష్మీనాథుఁడ వైనవాఁడా, సుగుణ=శుభగుణములచేత, శీతల=చల్లనైనవాఁడా, శీతలత్వము సర్వజనాహ్లాదగుణసూచకము. ఆకాశీతల=కాశీప్రదేశము మొదలుకొని, ఇక్కడ ఆఙ నెడు నిపాతము, అభివ్యాప్త్యర్థకము. (ని. 'ఆ జీషదర్థే భివ్యాప్తౌ సీమార్థే ధాతుయోగజే' అని అమరము.) సేతు=సేతుపర్యంతమైన, ధరా=భూమియొక్క, అతిధురా = అత్యంతభారముచేత, తత=వ్యాప్తమైన, భుజదండ=బాహుదండముగలవాఁడా, మూరురాయరగండా = మూరురాయరనఁగా అశ్వపతి, నరపతి, గజపతులు, వారికి భర్తవైనవాఁడా యని యర్థము. అనఁగా నీముగ్గురు రాయలను వశము చేసికొని విశాలమగు భూచక్రము నిర్వక్రపరాక్రమముతోఁ బరిపాలించుచున్నాఁడనుట.

తే. అవధరింపుము శౌనకా•ద్యఖిలసన్మునీంద్రులకు రోమహర్షణి • యిట్లు పలుకు
నమ్మహీజాని నిజవిహా•రాచలేంద్ర, దివ్యసౌభాగ్యములు చూడఁ • దివురుటయును.

అవధరింపుము=చిత్తగింపుము, శౌనకాద్యఖిలసన్మునీంద్రులకు = శౌనకుఁడు మొదలుగాఁ గల సమస్త మునిశ్రేష్ఠులకు, రౌమహర్షణి యిట్లుపలుకు = రోమహర్షణ పుత్రుఁడైన సూతుఁడు ఈలాగని పలుకును. ఏమనిన, అమ్మహీజాని = ఆవసురాజు, నిజ విహారాచలేంద్ర దివ్యసౌభాగ్యములు చూడఁ దివురుటయును=స్వకీయమైన క్రీడాపర్వత మగుచున్న కోలాహలాద్రియొక్క దివ్యమైన వైభవములు చూచుటకొఱకుఁ బ్రయత్నము చేయఁగాను.

ఉ. ఆయెడ నొక్కనర్మసచి•వాగ్రణి యిట్లను నోయఖండతే
జోయుత యద్భుతం బొకటి • చూచితిఁ జూపెద నీకు నాదుచే
చాయనె చూడు మభ్రమునఁ • జక్కఁగ నల్లదె నల్లమబ్బులోఁ
బాయవు కొన్ని మ్రాఁకులు నృ•పా యవుఁ జుమ్మవి నాకభూజముల్. 3

ఆయెడన్=ఆసమయమందు, ఒక్కనర్మసచివాగ్రణి = ఒకయిష్టుఁడయిన మంత్రిశ్రేష్ఠుఁడు, ఇట్లనున్ = వక్ష్యమాణప్రకారముగాఁ బలికెను. ఓయఖండతేజోయుత = అఖండ తేజస్సంపన్నుండవైన మహారాజాగ్రణీ, అద్భుతం బొకటి చూచితిన్=నే నొక యాశ్చర్యమును జూచితిని, చూపెద

నీకు నాదుచేచాయనె చూడుము = నీకుఁ గనుపఱుచుచున్నాను నాయొక్కచేతి వెంబడిగానే చూడుము. అభ్రమునఁ జక్కఁగను = ఆకాశమందు సూటిగాను చూడు మని వెనుక కన్వయము. అల్లదె నల్లమబ్బులోఁ బాయవు కొన్ని మ్రాఁకులు=అల్లవిగో నీలమేఘములోఁ గొన్నివృక్షము లెడ తెగకయున్నవి, నృపా=వసురాజా, అవి=అకనుపడెడు వృక్షములు, నాకభూజముల్=కల్పవృక్షములు, అవుఁజుమ్ము = అవునుజుమీ, భూలోకవాసులకు దేవవృక్షదర్శన మద్భుతము. ఆకాశమునందున్న నల్ల మబ్బులోనుండి వృక్షము లగుపడుటయే దేవభూరుహభ్రాంతిహేతువు.

తా. వసురాజు నాతని తన ప్రియమంత్రి చూచి రాజా! నేనొకయాశ్చర్యమును జూచితిని. నీకుఁ గూడఁ జూపెదను. నావ్రేలిచాయను దిలకింపుము. ఆకాశమునందలి నల్లమబ్బులో నెడతెగక కాన వచ్చునవి దేవవృక్షములు దమా! అనెను.

చ. అన విని నవ్వి సూక్ష్మగతి ♦ నారసి యారసికావతంసుఁ డి
ట్లను మనకేళిశైల మది ♦ యల్లది తన్మఘువాశ్మకూట మ
మ్మనికిమహీజము ల్చదలు♦మ్రాఁకు లటంచు భ్రమించి పల్కెదై
నను మృష గాదు నీపలుకు ♦ నాకనగంబులె తద్ద్రుమావళుల్. 4

అన విని=నర్మసచివుఁ డీలాగు పలుకఁగా విని, నవ్వి=నవ్వినవాఁడై, సూక్ష్మగతినారసి = సూక్ష్మమార్గముచేత విచారించి, ఆరసికావతంసుఁడు = రసికజనశ్రేష్ఠుఁడైన యావసురాజు, ఇట్లనున్ = ఈలాగనిపలికెను. ఏమనియనిన, మనకేళిశైల మది=అకనఁబడునది మనక్రీడాపర్వతము, అల్లది = అదిగో కనఁబడునది, తత్=ఆక్రీడాపర్వతసంబంధమైన, మఘువాశ్మ=ఇంద్రనీల మణిమయమైన, కూటము=శిఖరము, అమ్మనికిమహీజముల్ = ఆయింద్రనీలమణి శిఖరమందలి వృక్షములు, చదలు మ్రాఁకులటంచు భ్రమించి పల్కెదు = ఆకాశవృక్షములని భ్రమపడి పల్కుచున్నావు. ఐనను=అయి నప్పటికిని, మృషకాదు నీపలుకు=నీమాట యబద్ధముగాదు. ఏమనిన, తద్ద్రుమావళుల్ = మనక్రీడా పర్వతసంబంధమైన యింద్రనీలమయ శిఖరములయందలి వృక్షములు, నాకనగంబులె=నీవు చెప్పిన ట్లుగా నాకనగంబులె, అనఁగా నాకాశవృక్షములే యని యర్థము. స్వర్గసంబంధమైన కల్పవృక్షముల వంటివే యని భావము.

నాకశబ్దము ఆకాశమందును స్వర్గమందును వర్తించుచున్నది. ని. 'ఆకాశే త్రిదివే నాకః' అని అమరము. ఇందులో సచివుఁడు భ్రమనొందినవాఁడు రాజు భ్రమనివారణము చేసినవాఁడును గనుక రాజునకంటె సచివుఁడు కొంచెము తక్కువవాఁడైనందున పీఠమర్దుఁడని తెలియవలెను. ఇందు నకు, శ్లో. 'కించిదూనః పీఠమర్దః' అని లక్షణము. మంత్రి స్థూలగతినారయకచెప్పినది గావున రసికా వతంసుఁడగు రాజు దానిని సూక్ష్మగతి నారయుటయు నర్థాంతరముచే సమర్థించుటయు రసికావతం సత్వమునకు హేతువులు. సచివాగ్రణినే ఇంద్రనీలశిఖరము మేఘసమూహముగను శైలోపరివృక్ష ములు దేవవృక్షములుగను భ్రమింపఁజేయుట శిఖరప్రకాశమునకు ఔన్నత్యాతిశయమునకు సూచనలు. మనకేళిశైలమునే గుఱుతింపలేకపోతివా? యిదియేనా నీవు కనిపెట్టిన విచిత్రమని రాజు నవ్వెను.

అలం. పరికరము. నిరుక్తి.

తా. రసికాగ్రేసరుఁడగు వసురాజు మంత్రిమాటలాలకించి నవ్వి సూక్ష్మదృష్టితోఁ జూచి ఓయీ! నీవు భ్రమపడుచున్నాఁడవు. అదే మనక్రీడాశైలము. నీవు మేఘములనినవి ఇంద్రనీలపుఁ

జటియలు. నాకభూజములన్నవి శిఖరస్థవృక్షములు. ఐనను నీమాట తప్పుగాదు. అవి నాక భూజములే.

సీ. అచటిసానులు రత్న♦రుచిరంబు లననేల వానివంశము లెల్ల ♦ నీను మణుల [లు
ద్రుమములెల్లను సురా♦గమములౌటరుదె నిత్యసురాగములుతదీ ♦ యాంకురము
లతలు సంజీవను ♦ ల్గావె యచ్చట వానితావులు నతనుసం♦జీవనములు
రసములెల్లను సిద్ధ♦రసములౌ టెంత తత్ప్రసవంబులును సిద్ధ♦రసము లచట

తే. నచటిమణిచిత్రభూములు ♦ నచట నమరు, నమరతరువులగుములు ♦ నచటి తీవ
లచటిపొందమ్మికొలంకులు ♦ నభవునింట, నైన నాదంటబలువింట ♦ నైనఁ గలవె.

అచటిసానులు = ఆకోలాహలాద్రియందలి చఱులు, రత్నరుచిరంబులననేల = మణులచేతఁ బ్రకాశమానములైనవని వేఱ చెప్పనేల, వంశమనఁగా సంతతులును వెదుళ్లును, (ని. 'వంశో వేణౌకులే వర్గే పృష్ఠస్యావయవే పిచ' అని విశ్వము.) వాని = ఆచఱులసంబంధమైన, వంశములెల్ల = సంతతులన్నియుఁగూడ, ఈనుమణులఁ = రత్నముల నుత్పాదించును, అనియర్థము. ఆచఱులయందలి వెదుళ్లు ముత్యములను బుట్టించుచున్నవని భావము. వెదుళ్లయందు ముత్యాలు పుట్టుచున్నవనుటకు-

క. 'విదితముగ బొంగువెదురున, నొదవినమౌక్తికము తారకోజ్జ్వలము శుభ
ప్రదము' అని రత్నశాస్త్రము.

ద్రుమములెల్లను = అక్కడివృక్షము లన్నియును, సురాగమములౌటరుదె - సుర+అగమములు=దేవతా సంబంధమైనవృక్షములు, అనఁగాఁ గల్పవృక్షములౌట ఆశ్చర్యమా అనఁగాఁ గాదనుట. ఏమనిన, తదీయాంకురములు = ఆవృక్షములయొక్క చిగుళ్లుఁగూడ, నిత్య = నిత్యములయిన, సురాగములు = కల్పవృక్షములే యని యర్థము. సు+రాగములు శోభనరక్తిమ గలవని భావము. లతలు సంజీవనుల్గావె = తీఁగలు సంజీవనీలతలుగావా, అనఁగా అవుననుట. ఏమనిన, అచ్చట = ఆకోలాహలాద్రియందు, వానితావులును = ఆతీఁగెలయొక్క వాసనలుగూడ, అతను సంజీవనములు = అధికసంజీవనులని యర్థము. అతను = దేహరహితు లయినవారికిని, సంజీవనములు = బ్రతికించునవి యని ప్రకారాంతరము. అతనుఁడనఁగా మన్మథుఁడు గనుక మన్మథోద్దీపకములని భావము. రసములెల్లను = జలములన్నియును, సిద్ధ=ప్రసిద్ధమైన, రసములౌట = మధురసములౌట, ఎంత=ఏమిగొప్ప, అచట = ఆపర్వతమందు, తత్ప్రసవంబులు = ప్రసవ మనఁగా గర్భమోచనము, ఆజలములయొక్క శిశువులుఁగూడ, సిద్ధరసములు = ప్రసిద్ధ మధురరసములేయని యర్థము. ఆజలములయందలి ప్రసవములనఁగా పుష్పములు, సిద్ధమైన మకరందము గలవని భావము.

శ్లో. స్యాదుత్పాదే ఫలే పుష్పే ప్రసవో గర్భమోచనే' అని అమరము.

కాఁబట్టి, అచటిమణిచిత్రభూములు = అక్కడి రత్నప్రచురములైనభూములును, అచట నమరు నమరతరువుల గుములు = అక్కడ నొప్పుచుండెడు దేవతావృక్ష సమూహములును, అచటి తీవలు = అక్కడి తీఁగెలును, అచటి పొందమ్మికొలఁకులు = అక్కడనుండెడు బంగారు తామరలు గలకొలఁకులును, అని క్రమాలంకారము. అభవునింట నైనఁ = హరునకు గృహమైన కైలాసపర్వతమందైనను, ఆదరంట = ఆహరునియొక్క, బలువింటనైనఁ = గొప్పవిల్లయిన మేరుపర్వతమందైనను, కలవె=ఉన్నవా, అనఁగా లేవనుట, అనఁగాఁ గైలాస మేరు పర్వతములకంటె మహిమాతిశయము గలదనిభావము. అలం-శ్లేషానుప్రాణితార్థాపత్తి.

తా. కోలాహలపర్వతమునందలి చఱియలు రత్నమయములై యుంటయే కాదు. అచటి వెదుళ్ల యందుఁగూడ రత్నములు (ముత్యములు) జనించుచున్నవి. చెట్లు కల్పవృక్షములవలె నలరి క్రొంజివు ళ్ళతోఁ దనరుచున్నవి. తీఁగలు మన్మథోద్దీపనకరములై తావు లొలయుచున్నవి. జలము తేనియచవు లొలుకుచున్నవి. శివుని మనికియగు కైలాసముగాని విల్లగు మేరువుగాని యీవిధముగ విహారయోగ్య సమస్తవస్తుసమృద్ధిగ నలరుట లేదు.

మ. అది గాదే మనకేళిభూధరము దవ్వా చూత మాయద్రిసం
పద లంచుం గయిదండఁ బూని ధరణీపాలుండు లీలాగిరిం
గదియన్ నర్మసఖుండు వల్కె నచటం గల్పద్రుహాలారసో
న్మద వైమానికమానినీ మధురగానస్వాన సానందుఁడై. 6

అదిగాదే మనకేళిభూధరము = అదేకాదా మనక్రీడాపర్వతము, అనఁగా అకనఁబడునట్టిది గాదా మన క్రీడాపర్వతమైన కోలాహలాద్రి యనుట. దవ్వా = దూరమా, అనఁగా దూరము కాద నుట. కాఁబట్టి, చూత మాయద్రిసంపదలంచున్ = ఆపర్వత సంబంధమైన సౌభాగ్యముల నన్ని టిని జూతమనిపలుకుచు, కయిదండఁబూని = హస్తావలంబనముచేసి, ధరణీపాలుండు = వసురాజు, లీలాగిరింగదియన్ = క్రీడాపర్వతమును చేరఁబోఁగాను, అచటన్ =ఆసమీపించిన స్థలమందు, కల్పద్రు= కల్పతరుసంబంధమైన, హాలారస = సురాపానముచేత, ఉన్మద = మత్తుగొనియున్న, వైమానిక మానినీ = దేవతాస్త్రీలయొక్క, మధుర = మనోహరమైన, గానస్వాన = సంగీతనాదముచేత, సానం దుఁడై = ఆనందసహితుఁడై, నర్మసఖుండు='ప్రియసఖుండు, వల్కెన్ = వక్ష్యమాణప్రకారముగాఁ బలికెను.

తొలుత కిన్నరీమిథునకోలాహలములు రాజు నుత్సుకపఱుప నిపుడు వేల్పుచెలువలగానము మఱింత సంతోషాతిశయము గూర్చెను. శైలము మిగుల సమీపమునం దుంటవలననేరాజు మంత్రి కైదండతో నేగెను. వేల్పుచెలువలు కల్పవృక్షాసవము గ్రోలి పాటలు పాడుచుంటచేతనే వారి గానము మధురము, ఆనందకరమునైయుండెను. కంఠస్వరము మధుపానమువలన మధురమగు ననుటకు-

ఉ. అళియుంబోలె నిప్పుడు వనాళి యమార్గమునం జరించు ని
న్నోలలితాంగి కాదనుచు నున్నది మందసమీరణంబునన్
గ్రాలుప్రవాళమంజరులు క్రమ్రకరంబుల విభ్రమంబుగా
బాలరసాలపుష్పరసపాయి వనప్రియకంఠహుంకృతిన్.

శ్లో. 'రతిపతిప్రహితేనకృతక్రుధః ప్రియతమేషు వధూ రనునాయికాః,
వకుళపుష్పరసాసవపేశల ధ్వనిరగాన్నిరగాన్మధుపాళినః.' మాఘము.

తా. రాజు మంత్రికయిదండ గొని మిగుల సమీపముననున్న కోలాహలపర్వతమునందలి విశే షముల దర్శింపవలయునని యుత్సాహపడి దరియఁ గల్పవృక్షాసవము గ్రోలి పాటలపాడు వేల్పు ముగుదల మధురగానము వినవచ్చెను. ఆనందముతో నాపాట నాలించి యిటులఁ జెప్పఁదొడంగెను.

సీ. ఒకచాయ నవపాయ పికగేయసముదాయ మొకచాయ నానామయూరనినద
మొకవంక నకలంకమకరాంకహాయహేషలొకక్రేవ నవదేవయువతిగీత

నొకచెంత సురకాంత♦ల కరాంతతతనాద మొకదారి నవశారి♦కోదితంబు
లొకయోరఁ బటుచార♦ణకుమారఫణితంబు లొకదండ నలిమండ♦లికలగాన
తే. మొక్కమొగి మ్రోయఁ గదళీగృ♦హోపపన్న, కిన్నరీబృందబృందసం♦గీతరీతి
నమరునతివేలకోలాహ♦లములకలిమి, నధిపయీయద్రికోలాహ♦లాఖ్య మొక్కొ.

ఒకచాయన్ = ఒకదిక్కున, అనపాయ = ఎడఁబాటులేని, పిక = కోకిలయొక్క, గేయ = గానములయొక్క, సముదాయము = సంఘంబును, ఒకసీమన్ = ఒకప్రదేశమందు, నానా=సమస్తమయిన, మయూర = నెమళ్లయొక్క, నినదము = కేకారవంబును, ఒకవంకన్ = ఒకవైపున, అకలంక=తొట్రుపాటులేని, మకరాంకహయ = మన్మథాశ్వములయొక్క, అనఁగా చిలుకలయొక్క, హేషలు = సకిలింపులును, అనఁగా పలుకులును, ఒకక్రేవన్ = ఒకపార్శ్వమందు, వనదేవయువతిగీతము=వనదేవతాస్త్రీలయొక్క గానమును, ఒకచెంతన్ = ఒకపార్శ్వమందు, సురకాంతల = అప్సరఃస్త్రీలయొక్క, కరాంత=హస్తాగ్రములయందలి, తత = వీణాదివాద్యములయొక్క, నాదము=ధ్వనియును, ఒకదారిన్=ఒకమార్గమందు, నవ=నూతనమయిన, శారికా=గోరవంకలయొక్క, ఉదితంబులు=భాషితములును, (ని. 'ఉక్తం భాషిత ముదితం' అని అమరము.) ఒకయోరన్=ఒకవైపున,పటు=సమర్థులైన, చారణకుమార = పిన్నవయసుగల చారణులయొక్క, ఫణితంబులు = స్తుతివాక్యములును, ఒకదండన్=ఒకవైపున, అలిమండలి = తుమ్మెదగుంపులయొక్క, కలగానము = అవ్యక్తమధురమైన గానంబును, ఇవన్నియు నేకసమయమునందుంటనే యేకగతి మ్రోయుటగాఁ జెప్పఁబడెను. ఈమధుర ధ్వను లన్నియుఁ గలసిపోవుట నదియంతయుఁ గోలాహలముగ నుండెను. అలంకారము - నిరుక్తి. ఉత్ప్రేక్ష.

ఒక్కమొగిమ్రోయన్ = ఏకరీతిగా ధ్వనించుచుండఁగా, కదళీగృహ = అరఁటిచప్పరములయందు, ఉపపన్న=కూడుకొనిన, కిన్నరీబృంద=కిన్నర స్త్రీసమూహముయొక్క, బృందసంగీతరీతిన్ = సముదాయగానముయొక్క వైఖరిచేత, అమరు=ఒప్పుచుండెను, అతివేల = అతిశయమయిన, కోలాహలములకలిమిన్ = కలకలధ్వనులు గలిగియున్నందున, అధిప = వసుమహారాజా, ఈయద్రి=ఈపర్వతము, కోలాహలాఖ్యమొక్కొ=కోలాహలమనెడు పేరుగలదాయెనో యేమొ.

తా. ఈపర్వతమునం దెడతెగని కోకిలలపాటలు, నెమిళ్లయఱపులు, చిలుకలపలుకులు, వనదేవతాగానములు, వేల్పుచెలువల వీణాగానములు, గోరవంకలనుడువులు చారణయువకుల భాషణములు తుమ్మెదలఝుంకారములు కలసి మెలసి మ్రోయఁ గిన్నరీబృందగీతరవమందు లీనమై కోలాహలముగా నుంటచేఁ గాఁబోలు కోలాహలనామ మీశైలము పొందినది?

మ. ఘనజాంబూనదరౌప్యరత్నరుచులం ♦ గన్పట్టు నీగట్టుఁ జొ
ట్టినగండోపలమండలంబు గనుఁగొం♦టే మేదినీశైలశా
సన యుష్మచ్ఛరణావధూత మగునీ♦శైలంబు నూరార్పఁగా
ననుకంపామతిఁ జేరు మేరుముఖగో♦త్రాధీశులం బోలెడిన్. 8

ఘన=అధికమయిన, జాంబూనద = బంగారుయొక్కయును, రౌప్య = వెండియొక్కయును, రత్న=మణులయొక్కయును, రుచులన్ = కాంతులచేత, కన్పట్టు = కనుపడుచున్న, ఈగట్టుఁజొట్టిన

గండోపలమండలంబు = ఈకోలాహలపర్వతమును జుట్టుకొనియున్న గండశిలలయొక్క సమూహమును, కనుఁగొంటే=చూచితివా, మేదినీ = భూమియందు, శైలశాసన=ఇంద్రుఁడవైన వసురాజా, ఈసంబోధనము కోలాహలపర్వతభంజనాభిప్రాయగర్భము. యుష్మత్=మీయొక్క, చరణ=పాదముచేత, అవధూతమగు = ఎగురఁగొట్టఁబడిన, ఈశైలంబును=ఈకోలాహలపర్వతమును, ఊరార్పఁగాన్ = ఊరడించుకొనుటకుఁ గాను, అనుకంపామతిన్ = దయామతిచేత, చేరు=వచ్చి ప్రవేశించిన, మేరు ముఖ గోత్రాధీశులం బోలెడిన్=మేరువు మొదలయిన పర్వతాధిపతులను బోలుచున్నవి చూచితివా యని సంబంధము. ఇందులో గండోపలములు జాంబూనద రౌప్య రత్న కాంతులచేతఁ గానఁబడుచున్నవి. కనుక నీకాంతులుగల మేరు కైలాస రోహణాద్రులు మొదలయిన పర్వతములే వచ్చియున్నట్టుగానే యున్నవని యర్థము. గండోపలములు మేరుముఖ పర్వతరాజములవలె నున్నవని చెప్పుటచేతఁ గోలాహలపర్వతమునకు లోకాతీతమైన మహత్త్వము ధ్వనితమగుచున్నది.

అలంకారవిచారము-'అత్ర గండోపలమండలస్య జాంబూనదరౌప్యరత్నమయత్వాసంబంధేఽపి తత్సంబంధోక్త్యా అతిశయోక్తిః తయానుప్రాణితయా గండోపలానాం మేరుముఖపర్వతోత్ప్రేక్షయా కోలాహలస్యలోకాతిశాయి మహత్త్వం ధ్వన్యత ఇత్యలంకారేణ వస్తుధ్వనిః.' అను సోమకవివాక్యమువలన నలంకారము అతిశయోక్తి. వస్తుధ్వని.

తా. ఓ భూదేవేంద్రా! కోలాహలపర్వతముచుట్టునుగల బంగారుగండశిలలు మేరువువలెను, వెండిగండశిలలు కైలాసమువలెను, రత్నమయములగు శిలలు రోహణపర్వతమువలె నున్నవి. నీకాలితాఁకిడిచే నొచ్చిన నీనగరాజు నోదార్చుటకు వచ్చిన శైలరాజములవలె నీగండశిల లున్నవి.

ఉ. అక్కట నీయుదగ్రచరణాహతి కోరువ లేక యేగతిన్
స్రుక్కెనొ గట్టురాచకొమరుం డలనాఁడు కపోతహుంకృతిం
గ్రక్కన మూర్ఛచుం బిలముఖంబున నేఁడును గంటె నెత్తురుల్
గ్రక్కెడు ధాతువు ల్చెదరఁగా నరుణాంబుఝరీమిషంబునన్. 9

అక్కట=అయ్యయో, నీ=నీయొక్క, ఉదగ్ర=ఉత్కటమయిన, చరణాహతికిన్ = పాదప్రహారమునకును, ఓరువలేక=సహించలేక, గట్టురాచకొమరుండు = పర్వతాధిపతియైన హిమవంతుని కుమారుఁడు, అనఁగా నీకోలాహలుఁడు, అలనాఁడు=తన్నఁబడిన యాసమయమందు, ఏగతిన్ స్రుక్కెనో = ఏప్రకారముగా సొమ్మసిల్లెనో తెలియదు. కపోత=గువ్వలయొక్క, హుంకృతిన్ = హుంకారమనెడు హుంకారముచేతను, అనఁగా ఆయాసముచేత హుం అనెడు అనుకరణధ్వనిచేత, గ్రక్కనమూర్ఛచున్ = నిల్పులేక మూర్ఛచును, బిలముఖంబునన్ = గుహాయనెడు ముఖముచేత, ధాతువుల్చెదరఁగాన్ = నాడులు చెదరఁగా ననియర్థము. గైరికాదిధాతువులు చెదరఁగానని భావము. అరుణ=ఎఱ్ఱనైన, అంబు=ఉదకముయొక్క, ఝరీ=ప్రవాహమనెడు, మిషంబునన్ = వ్యాజముచేత, నేఁడును=ఇప్పుడును, నెత్తురుల్ గ్రక్కెడున్=నెత్తురు గ్రక్కుచున్నాఁడు, కంటే=చూచితివా. ఝరీమిషంబునన్ అనుచోట అపహ్నవాలంకారము. రూపకము. శ్లేషము. అర్థాపత్తి.

చరణాహతి ఉదగ్రమైనదగుటచేతనే గట్టురాకొమరుఁ డోరువలేకపోయెను. అనఁగా నంతవానిని నొప్పించెనుట. ఆనాఁటియవస్థ యెటుల సహించెనోగాని యీనాఁటికి నేడ్చుచున్నాఁడు, కాననే నీవు మేదినీశైలశాసనుఁడ వని సారస్యము,

కపోతధ్వనిని హుంకృతిగా మూల్గుటగాఁ జెప్పుదు రనుటకు దృష్టాంతము.

శ్లో. పరిణతరవిగర్భవ్యాకులా పౌరుహూతీ
దిగపిమదకపోతీ హుంకృతైః క్రందతీవ. — భోజచరిత్రము.

శ్లో. అలీవపశ్య ప్రతిషేధతీయం కపోతహుంకారగిరావనాళిః. — నైషధము. తృ. స.

మ. నను నువ్వెత్తుగఁ బాఱ మీటితివి నానాధైర్యసామగ్రి మ
జ్జనకున్ మున్నె తృణీకరించితి కృపాస్వాంతంబునం బ్రోవు మిం
క నరేంద్రా యని గట్టు వేఁడెడి నినుం గంటే తృణగ్రాహినూ
తననీలాశ్మదరీముఖాగ్రవిచలద్వాతూలమంద్రధ్వనిన్. 10

నను = నన్ను, ఉవ్వెత్తుగఁ బాఱమీటితివి = బొత్తిగా నెగిరిపోవునట్టు గోటమీటితివి, నానాధైర్యసామగ్రిన్ = నానావిధమైన ధైర్యసంపదచేత, మజ్జనకున్ = మాతండ్రియైనహిమవంతుని, మున్నె తృణీకరించితివి = మునుపే తృణప్రాయముగాఁ జేసితివి. కాఁబట్టి, కృపాస్వాంతంబునన్ = దయాసహితమైన మనస్సుచేత, ఇంకన్ = ఇఁకమీఁదను, ప్రోవుము = రక్షింపుము. నరేంద్రాయని = వసురాజాయని, తృణగ్రాహి = గఱికగఱచుకొన్న, నూతన = నవీనమైన, నీలాశ్మ = మహానీలముల యొక్క, దరీ = గుహాయనెడు, ముఖ = ముఖముయొక్క, అగ్ర = చివరను, విచలత్ = చరించుచున్న, వాతూల = వాయుసంబంధమయిన, మంద్రధ్వనిన్ = గంభీరధ్వనియనెడు హీనస్వరముచేత, గట్టు = కోలాహలాద్రి, వేఁడెడినినున్ = నిన్ను ప్రార్థించుచున్నది, కంటే = చూచితివా. అనఁగా లోక మందు బలవంతునిచేత నవమానమును బొందినవాఁడు భయపడి నోట గఱిక గఱచుకొని హీనస్వరము చేతఁ గాచి రక్షింపుమని వేఁడుకొనుట ప్రసిద్ధము. మాతండ్రియగు హిమవంతుని తొలుతనే గడ్డి పఱకగ ధైర్యసంపదచే నిర్జించితివి. నన్నో పాఱమీటితివి. కాననే రక్షింపుమని కోలాహలుఁడు ప్రార్థించెను. ప్రార్థించుతఱిగడ్డికఱచుట వధింపవలదని తెలుపుట. విచారాతిశయమున భయాతిశయమునఁ బ్రార్థించుతఱి కంఠముగద్గదికమై సంకుచితస్వరమగును గానఁ గంఠరవము మంద్రధ్వనిగఁ జెప్పఁబడెను.

అలం. రూపకము. శ్లేష. అపహ్నవము. అర్థాపత్తియును.

వ. మఱియు నిక్కులాచలసంతానంబు సంతానకుసుమవాసనాసమాగతసారంగ సంగీతభంగీతరంగంబు లుపాంగంబులుగాఁ బాడు వేల్పుగాణీలపాణీరిత మాణిక్యవీణా మధురరాణామృతంబులఁ గరఁగి జగుకురువిందకందళంబుల జలంబులఁ బద నైనగ్గైరికతలంబులం బొడమిన కారణగుణంబునఁ బగడంబు డంబు విడంబించునిగనిగనితొగరునిగుడనెగడునగణితలతావితానంబుల నొయ్యనొయ్యన యొయ్యారంబుల నుయ్యెల లూఁగునజరగజరాజయానలయు పరివిసృమరచరణకంజమంజూతరమంజీరంబులఁ బెచ్చుపెరుగునచ్చపుఁబచ్చలచాయలు మెచ్చులు సేయఁ బచ్చికల మచ్చికల విచ్చలవిడిఁ గ్రచ్చుకొని మేసవ నుంకించునంకపురాజింక జంకించి మగుడరాఁ దివియునెడ బెగడి తొడిఁబడఁ దడఁబడ నడుగు లిడఁ గందుచందురుని మేనఁ జిందుసుధాబిందుసందోహంబుల పొందున డిందుపడి భవదరుణచరణనిఘాతిఁ బెకలినకఱకు ఱెఱకలు మగుడ నిగి

రించిన తెఱంగునఁ బరఁగు కార్స్వరగుల తెగలను గని సమదసామజసమాజంబు లని యరసి మెఱసిన మెఱపునొఱపు లుపరిపరికీర్ణగైరికపరాగంబు లనియు నుఱుము లురుముఖబృంహితంబు లనియు రేసి యేసగాఁ దివిసి తడవిండ్ల నేసి క్రొవ్వనం గూసి డాసి తదుదరకరకనికరములు జలజలఁ దొరంగినం జూచి గుత్తంపుముత్తియంబు లని యేఱి సారెసారె గీరనగింజలాడం దలంచుచెంచు ముద్దియల యశ్రాంతమృగయాపరిశ్రాంతి నివారించుపటీరతరువాటికలును బటీరతరువాటికావిటపములు నికటకూటకోటీవిటంకంబుల నొరయ నెరయు సురభిళరజంబులతోఁ బరిఫుల్లహల్లకపరాగపూరంబులు పరితుణ్ణకాశ్మీరకేసరాసారంబులు పరిమృదితశైలేయసారంబులుఁ బసిమి యొసఁగ సగపాలు మేళవించి యభ్యంచితకాంచనప్రసవసౌరభసమాగమంబునం బువ్వగట్టి గంధవహుండు సవరించినయందంపుగందవొడి నెఱవలపులు వలపులరేనికలనం గలయలయికల నపయింప నింపుసొంపునఁ బెంపుమిగులుకింపురుషచంపకామోదలకు దాఁపు లగుసేవంతివూఁబొదలును, సేవంతివూఁబొదలజినుకున ననఘహిమసలిలములు నెలచలప దొనలఁదొట్టి జలజలన జాలుకొని వెల్లువలై మల్లడిగొని యల్లనల్లన నతిశీతలశిలాతలంబుల మెలఁగుకస్తూరిమెకంబులమదభరంబులం దొరఁగునాభీరక్తంబు లిగిరి గనిగట్టిననిగరములు గరఁచికొని పఱచి యవలఁ గమ్మనఁ బరిమళించుకజ్జవాద్యాదికలయికలఁ గలనిగ్గుల నగ్గలంబులై కదలి కర్పూరకదళికలపుప్పొడితిప్పలయొప్పు నప్పళించి గ్రక్కునఁ జిక్కనైన యాచొక్కపుఁగదంబంబులు పూయువిద్యాధరీకదంబంబుల యాటపాటలకు మెచ్చి యచ్చట వనదేవత లెత్తునారతిపళ్లెరంబులకరణిఁ దనరుతరణికాంత పట్టికలను దరణికాంతపట్టికలఁ బుట్టుదట్టంపుసెకలపై నెట్టుకొనునతిచిరప్రసూతచమరీస్తన్యంబులు పొంగినఁ గనుంగొని చెంగటిమునిజన తపోవనసవనభవనంబులఁ బ్రవర్గ్యారంభంబు లని విందులకు ముందుముందుగాఁ గ్రందుకొని వచ్చుబృందారకసందోహంబులునుం గలిగి, నవరతామోదసిద్ధమహిళాకులం బయ్యు ననవరతామోదసిద్ధమహిళాకులం బై, నిశాకరకాంతరాజీవరాగచ్ఛాయం బయ్యు ననిశాకరకాంతరాజీవరాగచ్ఛాయం బై, మేరుభూరిప్రభాభాసమానం బయ్యు నమేరుభూరిప్రభాభాసమానం బై వెలయుచున్నయది విలోకింపుము.

మఱియును, ఇక్కులాచలసంతానంబు = కులపర్వతమైన హిమవంతునిసంతానమవుచున్న యీ కోలాహలపర్వతము, సంతానకుసుమ = పారిజాతపుష్పములయొక్క, వాసనా = పరిమళమును గూర్చి, సమాగత = వచ్చిన, సారంగ = తుమ్మెదలయొక్క, సరస=మనోహరమైన, సంగీత=గానముయొక్క, భంగీ = రీతియొక్క, తరంగంబులు = పరంపరలు, ఉపాంగంబులుగా = శ్రుతులౌనట్లుగా, పాడు = గానముసేయుచున్న, వేల్పుగాణీల = గానముసేసెడునచ్చరలయొక్క, పాణి = హస్తముల చేత, ఈరిత = పలికింపఁబడుచున్న, మాణిక్యవీణా = పద్మరాగమణివికారములైన వీణలయొక్క,

మధురతమనోహరమైన, రాణామృతంబులఁగరఁగి = రాణయనఁగా రాగము, అమృతప్రాయములైన రాగములచేత నీరుగాఁగరఁగి, జరగు=ప్రవహించుచున్న, కురువిందమనఁగా కెంపు:-నీ. 'సులలితమత్త కోకిలలోచనద్యుతి నలరారుఁ గురువింద మనెడు కెంపు' అని రత్నశాస్త్రము. కురువిందకందళంబుల= మొలకకెంపులసంబంధమైన, జలంబుల = ఉదకములచేత, పదనైన=తడిసి బురదయైయున్న, గైరిక తలంబులన్ = గైరికాది ధాతుప్రదేశములయందు, పాదమినకారణగుణంబున = అనఁగా నెఱ్ఱనైన కెంపులనీటిచేత బురదపదనైన రక్తధాతుప్రదేశములయందుఁ బుట్టిన హేతువువలన, పగడంబు డంబు విడంబించు = పగడపుఁగాంతిని ప్రకటముసేయుచున్న, నిగనిగని = నిగనిగ మెఱయుచున్నట్టి, తొగరునిగుడన్ = రక్తిమయతిశయింపఁగా, నెగడు=వృద్ధిఁబొందుచున్న, అనఁగా పగడపుతీఁగెలవలె నున్న, అగణిత=ఎన్న శక్యముగాని, లతావితానంబులన్=తీఁగెమొత్తములయందు, ఒయ్యనొయ్యనన్ = తిన్నతిన్నఁగాను, ఒయ్యారంబులన్ = విలాసములచేత, ఉయ్యెలలూఁగు = ఉయ్యెలలూఁగునట్టి, అజరగజరాజయానల = దేవతాస్త్రీలయొక్క, ఉపరి = ఊర్ధ్వభాగమందు, విసృమర = వ్యాపించు నట్టి, చరణకంజ = పాదకమలములయందు, మంజుతర = మిక్కిలియు మనోహరములౌచున్న, మంజీరంబులన్ = అందెలయందు, పెచ్చుపెరుగు = అతిశయించుచున్న, అచ్చపుపచ్చల = పరి శుద్ధములైన మరకతమణులయొక్క, చాయలు = కాంతులు, మెచ్చులుసేయ = మనోరంజనము సేయఁగా, పచ్చికలమచ్చికలన్ = పచ్చగడ్డిపరకలనెడు భ్రమతచేత, విచ్చలవిడిఁ గ్రచ్చుకొని = స్వేచ్ఛగా కదియఁబడి, మెసవనుంకించు = మేయఁజూచుచున్న, అంకపురాజింకన్ = లాంఛన రాజకురంగమును, జంకించి = అదలించి, మగుడరాఁదివియు నెడ = వెనుకకుఁ దిరుగఁదీసెడు, సమయమందు, బెగడి=బెదురుకొని, తోడిఁబడన్ = వెంబడివెంబడిగా, తడఁబడు నడుగులిడన్ = తప్పటడుగులువెట్టి త్రొక్కఁగా, కందు=కమలిన, చందురునిమేనన్ = చంద్రునిదేహమునందు చిందు=వెడలిపడుచున్న, సుధాబిందుసందోహంబుపొందునన్ = అమృతబిందుసమూహముయొక్క సాంగత్యముచేత, డిందుపడి = పూర్వమం పడఁగిపడి, భవత్ = నీసంబంధమైన, అరుణ = ఎఱ్ఱ నైన, చరణ=పాదముయొక్క, నిహతిన్=దెబ్బచేత, పెకలిన = పెల్లగిలి యూడిపోయిన, కఱకుటెఱ కలు=కర్కశములైన రెక్కలు, మగుడనిగిరించిన తెఱంగునంబరఁగు=మరల నిగురువెట్టినవో యన్న ట్లుగానున్న, కార్మొగులతెగలనుగని = నల్లని మబ్బుగుంపులను జూచి, మద = మదయుక్తములైన, సామజ=ఏనుఁగులయొక్క, సమాజములని = సమూహములని, అరసి=విచారించి, మెఱసినమెఱుపు నొఱపులు = ఆమబ్బుగుంపులయందు మెఱసినమెఱుపుతీఁగెలయొక్క కాంతులను, ఉపరి=మోఁదను, పరికీర్ణ=వ్యాపింపఁబడిన, అనఁగా చల్లుకొనఁబడిన, గైరిక=గైరికధాతుసంబంధమైన, పరాగంబులని యును=జాజురేఖలనియును, ఉఱుములు=గర్జితములు, ఉరుముఖబృంహితంబులనియున్ = అధికతరము లైననోటియందలి ఘీంకారములనియును భ్రాంతిని బొందియని భావము. రేసి=ఉద్రేకించి, అనఁగా చెలరేఁగి, వినఁగాఁదివిసి = విటవాలుగాఁదీసి, తడవిండ్లనేసి = తడవింటిబద్దలచేత బాణములువేసి, క్రొవ్వునంగూసి=ఉత్సాహముచేత క్రొవ్వునకేకవేసి, డాసి=సమీపమునకుఁబోయి, తదుదర=ఆమేఘ గర్భములయందలి, కరక=వడగండ్లయొక్క, నికరములు = సమూహములు, ని. 'వర్షోపలస్తు కరకా' అని యమరము. జలజలఁ దొరఁగినఁజూచి = జలజలరాలఁగాఁ జూచి, గుత్తంపుమౌక్తికంబులని=బిగు వైన ముత్తెములని భ్రమసి, ఏటి=ఏటిపుచ్చుకొని, సాఁగసాచకన్ = మాటిమాటికిని, గీరనగింజలాతం

దలంచు = అచ్చనగండ్లాడవలెనని తలంచుచున్న, చెంచుముద్దియల = చెంచుకన్నెపడుచులయొక్క, అశ్రాంత=ఎడతెగని, మృగయా=వేటయందలి, పరిశ్రాంతిక్ = ఆయాసమును, నివారించు=పోఁగొట్టుచున్న, పటీరతరువాటికలును = శ్రీచందనతరువులయొక్క సమూహములును,

గీరనగింజలన ఓమనగుంటలయాట యని పూర్వవ్యాఖ్యాతలు వ్రాసియున్నారు గాని యది గణనీయముగాదు. ఓమనగుంటలయాటకు గట్టివి యనవసరము. కావున బిగితములగు తాలతో నాడఁదగునాట అచ్చనగండ్లే యని తెలిసికొననగును. గీరనగింజలన అచ్చనగండ్లయాటలో నొకవిధమగు భేదముగలయాట. ఇందులకుఁ బ్రయోగము.

ఉ. చారుచిరత్నరత్నమయసౌధములన్ బురివైశ్యకన్యకల్
గీరనగింజలాడుతఱిఁ గ్రిందను జిందినదివ్యరత్నముల్
శౌరులు ద్రొక్కుచుం జనఁగఁ బాడుకొనన్ ధరణీపురంధ్రికిన్
వారక రత్నగర్భ యనునామము పెట్టిరి సత్కవీశ్వరుల్. తారాశశాంకము. ఆ. 2.

పటీరతరువాటికావిటపములు = శ్రీచందనతరు సమూహములయొక్క విస్తారములు, నికట= సమీపమందలి, కూట=శిఖరములయొక్క, కోటి= అంచులయొక్క, విటంకంబులను=అగ్రభాగములను, ఒరయన్=రాపాడఁగా, నెఱయు=రాలిన, సురభిళరజంబులతోన్ = పరిమళయుక్తమయిన రాపాడితోడ, పరిఫుల్ల = లెస్సగావికసించిన, మల్లిక=ఎట్టికలువలయందలి, పరాగపూరంబులు = పుప్పొడుల యొక్క మొత్తములును, పరిక్షుణ్ణ=మిక్కిలి నలిగిన, కాశ్మీర=కుంకుమపువ్వుయొక్క, కేసర=కింజల్కములయొక్క, ఆసారంబులు = ధారాపాతములును, పరిమృదిత=లెస్సగామర్దింపఁబడిన, శైలేయ=రాతిపువ్వుయొక్క, సారంబులు = స్థిరాంశములును, ఇది పరిమళయుక్తమైనదని తెలియవలయును. ని. 'శైలేయగన్ధిని శిలాతలాని' అని ప్రయోగము. పసిమియొసఁగ సగపాలు మేళవించి = పచ్చఁదన మొప్పునట్టుగా నర్థభాగముగూడఁగలిపి, అభ్యంచిత = మిక్కిలి యొప్పుచున్న, కాంచనప్రసవ = సంపంగిపువ్వులయొక్క, సౌరభ=పరిమళముయొక్క, సమాగమంబునన్ = చేరుటచేత, పువ్వుగట్టి=వాసనాయుక్తముచేసి, గంధవహుండు = వాయువనెడు బుక్కావాఁడు, సవరించిన = సిద్ధపఱచిన, అందంపుగందవొడి=యోగ్యమయిన బుక్కాయొక్క, వలపులనఁగా వాసనలు. ఇందులకు ప్రయోగము. క. 'కుందనపుఁగమ్మవలపుం, జెందిన చందమునఁ దెల్ల చెఱుకునఁబండై, సుందరి యగునక్కన్నియ, యందెల ప్రాయంబువిడువ నాయిత మయ్యెన్.' అని కవికర్ణరసాయనము. నెఱవలపులు = నిండు వాసనలు, వలపులరేని = మన్మథునియొక్క, కలనఁగల=యుద్ధమందు సంప్రాప్తమైన, అలయికలను = బడలికలను, అనఁగా సురతశ్రమములను, అపనయింపన్ = పోఁగొట్టుచుండఁగా, ఇంపు సొంపునఁ దెంపుమిగులు = ఇష్టమైన విలాసముచేతను నతిశయించుచున్న, కింపురుష చంపకామోదలకున్ = సంపంగిపువ్వువాసనవంటి వాసనగల కింపురుషస్త్రీలకు, తావులగు=నివాసస్థానములైన, సేమంతి పూఁబొదలును=చేమంతిపువ్వుఁబొదలును, వలపులజేనికలయికలలోని యలసటఁ బోఁగొట్టఁదగినవి వలపులే యని యాశయము.

సేమంతిపూఁబొదలఁజినుకు = చేమంతిపువ్వుఁబొదలవలనఁ గురియుచున్న, అనఘహిమకణలీలములు=నిర్మలమైన మంచుసీల్లు, కాంచనకపోలఁదొట్టి = చంద్రకాంతశిలామయములైన కొండపోసల

యందు నిండి, జలజలనజాలుకొని = జలజలజాఱునట్లుగా జాలుగట్టి, వెల్లువలై మల్లడిగొని = వఱదలై చుట్టుకొని, అల్లనల్లనన్ = తిన్నతిన్నఁగాను, అతిశీతల = మిక్కిలి చల్లనైన, శిలాతలంబులన్ = రాతిబండల యందు, మెలఁగు = ప్రవర్తించునట్టి, కస్తూరిమెకంబులు = కస్తూరి మృగములయొక్క, మదభరంబులఁ దొరఁగు = మదాతిరేకముచేత స్రవించునట్టి, నాభీరక్తంబులు = నాభిసంబంధమైన నెత్తురులు, ఇగిరిగని గట్టిన = ఎండిగడ్డగట్టిన, నిగరములు గరఁచికొని = పెళ్ళికలను గరఁగఁదీసికొని, పఱచి = ప్రవహించి, అవల = ఆవలను, గమ్మనఁ బరిమళించు = గమ్మనునట్లుగాఁ బరిమళించుచున్న, కఱ్ఱజవ్వాదికలయికలఁ గల = కఱ్ఱజవ్వాదియొక్క మేళనమువలనఁ గలిగిన, నిగ్గులన్ = నిగ్గులచేత, అగ్గలంబులై = అతిశయించినవై, కదలి = అక్కడనుండి సాగి, కర్పూరకదళీకర = కర్పూరపరఁటులయొక్క, పుప్పొడితిప్పల = పుప్పొడితిన్నెల యొక్క, అనఁగా గర్పూరపురాసులయొక్క, ఒప్పు = ఒప్పిదమును, అప్పళించి = అలమికొని, గ్రక్కునఁ జిక్కనైన = అప్పుడే గట్టిపడిన, అచొక్కపుకదంబంబులు పూయు = చొక్కమైన యాయనులేపనముల నలఁదుకొన్న, అప్పుడె సమకూడిన కలపములనలందుకొనినటులఁ దెలుపుట సుగంధాతిశయము సూచించుట. విద్యాధరీకదంబంబుల = విద్యాధరస్త్రీసమూహములయొక్క, ఆటపాటలకు మెచ్చి = నృత్తగీతములకు మెచ్చుకొన్నవారై, విద్యాధరశబ్దము సాభిప్రాయము. వారు విద్యాధరస్త్రీలు గావున నే నృత్తగీతములప్రశస్తి వెల్లడియగునటులఁ బ్రాగల్భ్యము చూపఁగల్గిరి. అచ్చటన్ = ఆస్థలమందు, వన దేవతలెత్తు = వనదేవతలు పట్టిన, ఆరతిపళ్లెరంబులకరణిన్ = నివాళిపళ్లెరములో యన్నట్లుగా, తనరు = ఒప్పుచున్న, తరణికాంతపట్టికలును = సూర్యకాంతమణులయొక్క వట్రసిపలకలును,

తరణికాంతమణిపట్టికలవలనఁ బుట్టు = సూర్యకాంతమణిపట్టికలవలనఁ బుట్టిన, దట్టంపుసోనల పైన్ = దట్టమైన కాఁకలమీఁద, నెట్టుకొను = వ్యాపించిన, అనతిచిరప్రసూత = అతిచిరప్రసూతలుగాని అనఁగా నూతనముగా నీనిన, చమరీ = చమరీమృగములయొక్క, స్తన్యంబులు = చనుపాలు, అనఁగా స్తనములకు మిక్కుటమయి తమకుఁ దామ స్రవించుచున్న చనుపాలనుట, పొంగినఁగనుంగొని = పొంగఁగాఁ జూచి, చెంగటి = అక్కడికి సమీపమందున్న, మునిజనతపోవనసవనభవనంబుల = ముని జనులయొక్క తపోవనములయందుండెడు యజ్ఞశాలలయందలి, ప్రవర్గ్యారంభంబులని = యజ్ఞమందు పాలతోఁ జేయఁబడెడు ప్రవర్గ్యహోమములయొక్క ప్రారంభములనుకొని, విందులకున్ = హవిర్భాగములకు, ముందుముందుగాఁ గ్రందుకొనివచ్చు = ఒకరికంటె నొకరుముందుగా సందడిపడివచ్చునట్టి, బృందారక సందోహంబులును = దేవతాసమూహములును, సూర్యకాంతశిలలు సూర్యరశ్మి సోఁకినంతనఁ దాకరానంత వేఁడి వహించును. కావున నటఁబడి సవరపుమృగములపాలు పొంగఁగలిగినవి. సూర్యకాంతములపై జలముపడిన మ్రోఁతకలిగి పొంగు ననుటకు—

నళినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ — మను. ద్వితీ. 12.

V కలిగి = కలిగియుండి, నవరత = ప్రథమసురతమందలి, ఆమోద = ఆనందముతోఁగూడిన, సిద్ధమహిళా = సిద్ధాంగనల, కులంబయ్యును = సమూహముగలదైనను, అనవరతామోదసిద్ధమహిళాకులంబై అని విరోధము. అనవరత = ఎల్లప్పుడును, ఆమోద = సౌరభముచేత, సిద్ధ = సిద్ధమైయుండెడు, మహిళా = ప్రేంకణపుతీఁగెలచేత, ని. 'శ్యామాతు మహిళాహ్వయా, లతా గోవిన్దనీగున్ద్రా' అని అమరము. ఆకులంబై = వ్యాప్తమైనదియు నని విరోధపరిహారము. నిశాకరకాంతరాజీవరాగచ్ఛాయం బయ్యు

ననిశాకరకాంత రాజీవరాగచ్ఛాయంబై యని విరోధము. నిశాకరకాంత = చంద్రకాంతములయొక్క, రాజీ=సమూహంబును, వరాగచ్ఛాయంబయ్యును = శ్రేష్ఠమైన వృక్షచ్ఛాయలును గలదియనియును, లేక చంద్రకాంతములును పద్మసంబంధిరక్తచ్ఛాయలును గలదనియును, అనిశ=నిరంతరమును, ఆకర=గనులయందు, కాంత=మనోహరములైన, రాజీవరాగ=పద్మరాగమణులయొక్క, ఛాయంబై=కాంతులు గలదియును అని విరోధపరిహారము. మేరు = మేరుపర్వతమువలె, భూరిప్రభా = కాంచనప్రభలచేత, భాసమానంబై=ప్రకాశమానమైనదనియును, నమేరు=సురపొన్నవృక్షములయొక్క, భూరి = అధికమైన, ప్రభా=శోభలచేత, భాసమానంబై = ప్రకాశమానమైనదనియును విరోధపరిహారము. ని. 'భూరిప్రాజ్యసువర్ణయోః' అని విశ్వము. వెలయుచున్నయది = ప్రకాశించుచున్నది, విలోకింపుము = కటాక్షించి చూడుము.

చ. కొలఁకులపజ్జ సజ్జకపు • గొజ్జఁగిపూఁబొదరిండ్ల జోరునం
జిలుకుహిమాంబుపూరములు • శీతకరోపలపట్టికాతటం
బుల దుముకం బుటం బెగయు • భూరితుషారకణంబు లెల్లెడ
న్వలఁగొన నిన్నగంబు హిమ • వన్నగ మం దనరారు భూవరా. 12

భూవరా=వసురాజా, కొలఁకులపజ్జన్ = తామరకొలఁకులయొక్క చేరువను, సజ్జకపు=మనోహరమైన, గొజ్జంగి పూఁబొదరిండ్ల = గొజ్జంగిపూఁబొదలయందు, జోరునంజిలుకు = జోరునఁగురియునట్టి, హిమాంబుపూరములు = మంచునీళ్ళధారలు, శీతకరోపలపట్టికా = చంద్రకాంత శిలామయములైన పలకలయొక్క, తటంబులన్ = దరులయందు, దుముకన్ = పడిగాఁ బడుచుండఁగా, పుటంబెగయు = మీఁదికెగురుచున్న, భూరి=అధికమైన, తుషార=మంచుయొక్క, కణంబులు = తుంపురులు, ఎల్లెడన్వలఁగొనన్ = అంతటం బరివేష్టింపఁగా, ఇన్నగంబు = ఈకోలాహలపర్వతము, హిమవన్నగమన్ = హిమవత్పర్వత మనునట్టుగా, తనరారున్ = ఒప్పుచుండును. అనఁగాఁ దండ్రినిఁ బోలియుండునని భావము. హిమవన్నగము=హిమవత్పర్వతము, అన్ తనరున్ = అనునొప్పిదమును, అరును=నిండియుండునని యొక వ్యాఖ్యయందు గలదు. అన్ అనుదాని కనునటుల సనునర్థము చెప్పుటకు వలనుపడదు. అనన్ అనుదానికి హ్రస్వరూపముగ అన్ అనుట విచార్యము. అన్ అను దానిని తద్ధర్మార్థకాకారముఁగాఁ గొనుటకంటె గ్రంథకర్త స్వతంత్రించి అనన్ అనుటకు అన్ అని యనెననుటయే సమయోచితము సరసమునై యున్నది. తనరు విశేషముగాఁగొని అరున్ క్రియగాఁగొని అన్ తద్ధర్మార్థకక్రియగాఁగొనుట సరసము గాదు.

తా. సరస్సులనంటియున్న గొజ్జంగి పొదరిండ్లనుండి మంచునీరు రాలి చంద్రకాంతశిలలపైఁ జిందులువార-ఎల్లెడల మంచువానలు గురియుచుండఁ జల్లదనమున కునికిపట్టుగానున్న యీకోలాహల పర్వతము మంచుకొండ యనఁదగియున్నది.

అలం. కావ్యలింగము.

మ. అని కేళీసచివుండు దెల్ప నిజలీ • లాహార్య మాసింహాసం
హననుం డెక్కి తదీయనిర్ఝరసమీ • రాందోళితైలాసుగం
ధినికుంజాంతనవేందుకాంతమణివే • దిం బ్రోదియై విశ్రమిం
చిన నం దొక్కకలస్వనంబు విన వ • చ్చెన్ మాధురీధుర్య మై. 13

అని = ఇట్లని, కేళీసచివుండు చెల్పన్ = క్రీడాసహాయుఁడైన మంత్రి విజ్ఞాపనము సేయఁగా, నిజ = స్వకీయమైన, లీలాహార్యము = క్రీడాపర్వతమును, ఆసింహాసంహననుండెక్కె = సింహసంహననుఁడనఁగా శ్రేష్ఠములైన యంగములతోఁ గూడినవాఁడు, అట్టివసురాజెక్కినవాఁడై, (ని. 'వరాఙ్గరూపో పేతో యః స్సింహసంహననో హిసః' అని అమరము.) తదీయ = ఆక్రీడాపర్వతసంబంధమైన, నిర్ఝర = సెలయేటి ప్రవాహముయొక్క, సమీర = వాయువు చేత, ఆందోళిత = చలింపఁజేయఁబడుచున్న, ఏలా = ఏలకితీఁగెల చేత, సుగంధి = మంచిపరిమళముగల, నికుంజ = పొదరింటియొక్క, అంత = సమీపమందలి, (ని. 'అన్తస్తు ప్రాన్తికే నాశే స్వరూపే' అనివిశ్వము.) నవ = నూతనమయిన, ఇందుకాంతమణి = చంద్రకాంతమణికల్పితమైన, వేదిన్ = అరుగుమీఁదను, ప్రోదిమైన్ = సుఖమానట్టులుగా, విశ్రమించినన్ = కూర్చుండియుండఁగా, అందున్ = ఆపర్వతమందు, ఒక్కకలస్వనంబు = ఒకానొక యవ్యక్త మధురమైననాదము, మాధురీధుర్యమై = మాధుర్యాతిశయమును వహించినదై, వినవచ్చెన్ = శ్రవణగోచరమాయెను. వసురాజు విశ్రమించినది చంద్రకాంతశిల. వసంతమునఁ బ్రోదిమై విశ్రమింపఁదగినది. సెలయేటిగాడ్పుచే నేలకీసుగంధ మట నొలయుచున్నది. కలస్వనము మాధుర్యముగ వినవచ్చినది. ఇవి కిన్నరీవచనముల కనుకూలఫలసూచనలు.

తా. క్రీడాసచివునితోఁ గూడి వసురాజు కోలాహలపర్వత మెక్కి యొకచంద్రకాంతశిలపై విశ్రమించియుండ కలస్వనాభిరామమగు మధురగానము వినవచ్చెను.

క. వీనులవిందై యమృతపు, సోనలపొందై యమంద • సుమచలదళినీ
గానముక్రందై యాస్వన, మానందబ్రహ్మమైన • నధిపతి వల్కెన్. 14

వీనులవిందై = చెవులపండువై, అమృతపుసోనలపొందై = అమృతవర్షములతో మైత్రిగలదై, అమంద = అధికమైన, సుమ = పుష్పములయందు, చలత్ = సంచరించుచుండెడు, అళినీ = ఆఁడుతుమ్మెదలయొక్క, గానము = సంగీతమువంటి, క్రందై = నాదముగలదై, ఆస్వనము = (వినఁబడిన) యామధుర ధ్వని, ఆనందబ్రహ్మమైనన్ = ఆనందజనకమయినపరబ్రహ్మముతో సమానము కాఁగా, అధిపతివల్కెన్ = వసురాజొకవాక్యము పలికెను. కలస్వనము గానము గనుక ఉద్దీపనవిభావమని తెలియవలెను. అళిగానముకంటె అళినిగానము మిగుల మనోహరము. సుమచరదళినీ యనుటవలనఁ బూవులపైఁ జరించుచుండేనియద్రావు తుమ్మెదయని భావము. పుష్పాసవము కంఠరవమునకుఁ బ్రశస్తిగూర్చుఁగాన నాగాన మానందబ్రహ్మమునకుఁ జేరువలో నుండె ననుట.

తా. చెవులకుఁ బండువుగ నమృతస్వరూపముగ భ్రమరీగానసమానముగానుండిన యాధ్వని యానందస్వరూపముగ నుంటచే రాజు మంత్రితో నిటులనెను.

శా. నాదం బొక్కటి పిక్కటిల్లె దిశలన్ • నవ్యామృతావ్యాహతా
స్వాదంబై విన నయ్యెడిం బ్రియవయ • స్యా వింటివే షట్పదీ
నాదంబో కలకంఠనాదమొ మరు • న్నారీమణీవల్లకీ
నాదంబో వివరింప రాదు పరమా • నందానుసంధానమై. 15

పరమానంద = ఉత్కృష్టమైన యానందమునకు, అనుసంధానమై = సంఘటనము సేయునట్టిదై, నాదం బొక్కటి = ఒకానొకధ్వని, దిశలన్ = దిక్కులయందు, పిక్కటిల్లెన్ = పూర్ణీభవించెను, నవ్య =

నూతనమయిన, అమృత = అమృతమువలె, అవ్యాహత = అవిచ్ఛిన్నమౌనట్టుగాను, ఆస్వాదంబై = అనుభవయోగ్యమై, విననయ్యెడిక్ = వినఁబడుచున్నది, ప్రియవయస్యా = ఇష్టసఖుఁడా, వింటివే = విన్నావా, షట్పదీనాదంబో = ఆఁడుతుమ్మెదలయొక్క నాదమో, కలకంఠనాదమొ = కోవెలలయొక్క కంఠనాదమో, మరున్నారీమణీ = దేవతాస్త్రీలయొక్క, వల్లకీనాదంబో = వీణానాదమో, వివరింపరాదు = ఏర్పఱుప శక్యముగాదు. వసంతసౌభాగ్యసందర్శనార్థము వచ్చిన విబుధకాంతలవీణాగానమో పంచమస్వరమునఁ బాడు పరభృతములపాటయో తుమ్మెదలరవళియో నేర్పఱుపరాకుండె ననుటచే నీమూఁటి నతిశయించి విలక్షణరూపముగ గాన ముండె నని యాశయము. దిక్కులఁ బిక్కటిల్లుటవలన షట్పదీవల్లకీకోకిలగానములలో నొకటి కాదనుట. కావుననే యమృతమువలె ననుభవయోగ్యముగ నుండె ననుట.

తా. అమృతమువంటి గానము దిక్కులఁ బిక్కటిల్లినది. తేటిపాటయో వీణాధ్వనియో కోకిలకూఁతయో యేర్పఱుపరానంత మనోహరముగా నున్నది. మిత్రమా! విన్నాఁడవుగదా?

శా. నానాగాయనగాయనీక్షణులగానం బుర్వి నాలింపమో
నానాఁటన్ నగభేదిపీటఁ గల గంధర్వాప్సరోగీతవి
ద్యానైపుణ్యము లెన్నియేని వినమో యం దైన నిం దైన విం
దైన నాదం బొనగూర్చునే మదికి ని ట్లానందసందోహమున్. 16

ఉర్విన్ = భూమియందు, నానా = వివిధములయిన, గాయనగాయనీమణుల = సంగీతముపాడెడు పురుషులలోను స్త్రీలలోను శ్రేష్ఠులైనవారియొక్క, గానంబు = సంగీతమును, ఆలింపమో = విన్నవారముగామా, నానాఁటన్ = నాఁడునాఁడు, నగభేదిపీటఁగల = నగభేదియైన యింద్రునిపట్టణమందున్న, అనఁగా స్వర్గమందున్న, గంధర్వ = గంధర్వులయొక్కయు, అప్సరః = అచ్చరలయొక్కయు, గీతవిద్యా = సంగీతవిద్యయందలి, నైపుణ్యములు = నేర్పులు, ఎన్నియేనివినమో = ఎన్నియైనప్పటికిని విన్నారముగామా, అందైనన్ = ఇప్పుడు చెప్పఁబడిన యాస్వర్గమందైనను, ఇందైనన్ = ఈభూమియందైనను, విందైన = హితమైనదై, నాదంబు = శబ్దము, మదికిన్ = మనస్సునకు, ఇట్లు = ఈప్రకారముగా, ఆనందసందోహమున్ = సంతోషపరంపరను, ఒనగూర్చునే = సంఘటించెనా, అనఁగా లేదనుట.

తా. మనము పెక్కండ్రు గాయకులయొక్కయు గాయకురాండ్రయొక్కయు గానము వినుచున్నారము. స్వర్గమునందున్న వేల్పుజవరాండ్ర గానవిద్యావిశేషములు పలుమాఱు దేవేంద్రుని కొలువుకూటములోఁ జవి చూచియున్నారము. కాని యిట్టి యానందదాయకమగు గానమును దొల్లి విని యెఱుఁగము.

చ. అన విని కేళికాసచివుఁ డాస్వన మల్లన నాలకించి యో
జనవర! వల్లకీరవముఁ సంగతిఁ బాడెద రెవ్వరో వి నూ
తనగతి నిమ్మహాద్రి పయిఁ దన్మృదుపంచమషడ్జశయ్య కో
యన్న నెలుఁ గిచ్చె వింటె ప్రమదాకులకోకిలకేకిలోకముల్. 17

అన విని = వసురాజిట్లు పల్కఁగా విన్నవాఁడై, కేళికాసచివుఁడు = క్రీడాసహాయుఁడైన మంత్రి, ఆస్వనమల్లన నాలకించి = ఆనాదము తిన్నఁగా విని, ఓజనవర = ఓరాజా, ఎవ్వరో = ఎవరో

కాని, వల్లకీరవముసంగతిఁ = వీణానాదముతోఁగూడ, పాడెదరు = గానము సేయుచున్నారు. వినూతనగతిఁ = క్రొత్తరీతిగా, ఇమ్మహాద్రిపయిఁ = ఈకోలాహలపర్వతముమీఁద, పాడెదరని వెనుక కన్వయము. తత్ = ఆగానసంబంధమైన, మృదు = మృదులమయిన, పంచమషడ్జశయ్యాకు = పంచమ స్వరశయ్యకును షడ్జస్వరశయ్యకును, ప్రమద = సంతోషముచేతఁగాని, ప్రకృష్టమయిన మదము చేతఁగాని, ఆకుల = తొట్రుపడుచున్న, కోకిల = కోవెలలయొక్కయు, కేకి = నెమళ్ళయొక్కయు, లోకముల్ = సమూహములు, ఒయ్యనన్ = వెంబడిగానె, ఎలుఁగిచ్చెన్ = ప్రతిధ్వనినిచ్చెను, వింటె = విన్నావా. ని. 'పికః కూజతి పఞ్చమం, షడ్జం మయూరో వదతి' అని చెప్పఁబడియున్నది. కనుక పంచమశయ్యకుఁ గోవెలలును షడ్జశయ్యకు నెమళ్లును ఎలుఁగిచ్చె నని క్రమాలంకారము.

తా. రాజీటులఁజెప్పఁగాఁ గేళీసచివుఁడు మెల్లఁగ నాధ్వని నాలకించి యెవ్వరో వీణారవమువలెఁ గ్రొత్తపోకడలతో నీగిరిపైఁ బాడుచున్నారు. ఆగానమందలి పంచమస్వరము నాలకించి కోయిలలు షడ్జమస్వరము నాలకించి నెమిళ్ళు ప్రతిధ్వని చేయుచున్నవి వింటివా యనెను.

క. అనవుడు శశికాంతదరీ, జనితప్రతినాద మైన ♦ సంగీతకల
స్వనము మనమున నొకానొక, యనురాగభరంబుఁ బెనుప ♦ నవనిపుఁ డనియెన్.

అనవుడు = నర్మసచివుఁ డీరీతిఁ బలుకఁగా, శశికాంత = చంద్రకాంతశిలామయమయిన, దరీ = గుహలవల్ల, జనిత=పుట్టఁబడిన, ప్రతినాదమయిన = ప్రతిధ్వనికలిగిన, సంగీతకలస్వనము = నాద సంబంధమయిన అవ్యక్తమధురధ్వని, మనమునన్ = మనస్సునందు, ఒకానొక = ఒకానొకటైన, అనురాగభరంబు = ప్రేమాతిశయమును, పెనుపన్ = వృద్ధిఁబొందింపఁగా, అవనిపుఁడనియెన్ =వసురా జొకవాక్యము పలికెను.

గీతము పంచమషడ్జశయ్యలకు నెలవై వీణాగానమువలె నుంటయే కాదు. చంద్రకాంతశిలాతల ములలోఁ బ్రతిధ్వనించినది. కావున శిలాతలముల సహజశైత్యవశమునఁ గలస్వనమై వినవచ్చినది. రసికావతంసుఁడు గాన వినికిడివలననే యనురాగభరము వహించెను.

అలం. సమాధివ్యంగ్యము.

ఉ. ఎచ్చటివారొ యీదరుల ♦ నీబలుకోనల నీనగాళిలో
నెచ్చట నున్నవారొ మది ♦ కింపులు నింపుకలస్వనంబుతో
నిచ్చటఁ బాడుచుండఁ గత ♦ మెయ్యదియో వివరించి క్రమ్మఱన్
వచ్చెదవే తదాయతన♦వాటికిఁ బోవుద మీక్షణంబునన్. 19

ఎచ్చటివారొ = ఎక్కడనుండువారో, ఈ దరులన్ = ఈగుహలయందును, ఈబలుకోనలన్ = ప్రబలమయిన యీకోనలయందును, ఈనగాళిలో = ఈవృక్షశ్రేణిలోను, ఎచ్చట నున్నవారో = ఏస్థలమందునున్నారో, మదికిన్ = మనస్సునకు, ఇంపులనింపు = ఇష్టముల నాపాదించుచున్న, కల స్వనంబుతో = అవ్యక్తమధురమయిన నాదముతోడ, ఇచ్చటఁబాడుచుండ = ఈపర్వతమందు గానము సేయుచుండుటకు, కతమెయ్యదియో = కారణమేమో, వివరించి=విమర్శించి, క్రమ్మఱన్వచ్చెదవే = వేగ తిరుగవచ్చెదవా, తదాయతనవాటికి = అగృహవాటికి, ఈక్షణంబునన్ = ఇప్పుడే, పోవుదము = పోదము.

ఆ పాట పాడువారి చెలువున కీక్షణమున నే పోవుదము. వారెవ్వరో విమర్శించిరమ్మనుట యను రాగభరమునకు సూచన. క్రమ్మఱవచ్చెదవే యనుటలో నాకర్షణకరమగు నాపాటవినుచునం దెయుందు వేమో మనమిరువుర మేగుద మనుట.

తా. ఈ గుహాలయందు ఈ కోనలలో ఈ కొండలపై నింత మనోహరముగాఁ బాడుచున్న యాచెలువలెవరో యిటుఁ బాడుటకుఁ గారణమెద్దియో తెలిసికొనిరమ్ము. వారున్నచోటికిపుడ పోవుదము.

చ. అని యనుపక వినోదసఖుఁ ♦ డచ్చటిపూఁబొదరిండ్లు చూచి కాం
చనమణికందరాసదన♦సంతతు లారసి పక్వగోస్తనీ
ఘనతరకాయమానములు ♦ గన్గొని తిన్ననికన్నెమావిగుం
పునఁ బెనగొన్నమల్లియలఁ ♦ బూచినకోనలు గాంచి యొక్కచోన్. 20

అని = ఈలాగనిపల్కి, అనుపక = పంపఁగాను, వినోదసఖుఁడు = నర్మసఖుఁడు, అచ్చటి = ఆ కోలాహలపర్వతమందలి, పూఁబొదరిండ్లుచూచి = లతాగృహముల వీక్షించి, కాంచన = సువర్ణమయములైన, మణి = రత్నమయములయిన, కందరా = గుహాలనెడు, సదనసంతతులు = గృహసమూహములు, ఇచ్చట కందరా శబ్దము ఆకారాంతస్త్రీలింగము. (ని. 'దరీ తు కందరో వాస్త్రీ' అని అమరము.) ఆరసి = వెదకి, పక్వ = పండిన, గోస్తనీ = ద్రాక్షలయొక్క, (ని. 'మృద్వీకా గోస్తనీ ద్రాక్షా' అని అమరము.) ఘనతర = గొప్పలయిన, కాయమానములు = పందిళ్ళు, కన్గొని=పరీక్షించి, తిన్నని = చక్కనైన, కన్నెమావి = గున్నమామిళ్ళయొక్క, గుంపునన్=సమూహమందు, పెనగొన్న= అల్లిన, మల్లియలు = మల్లెతీఁగెలు, పూచిన = పుష్పించియున్న, కోనలుగాంచి = వనప్రదేశములు చూచి, ఒక్కచోన్=ఒకానొకస్థలమందు, ముందరికన్వయము.

పొదరిండ్లు పూవులతో నిండియుంటయు గుహాజాతము కాంచనమణిసంవృతములై యుంటయుఁ గాయమానములు పక్వద్రాక్షాలతావృతములై యుంటయు మల్లియలు మావిగున్నలఁ బెనఁగొని యుంటయు శైలము దర్శనీయముగ విహారయోగ్యముగ నున్నదనుటకు సూచనలు. ఆమనోగానము గావించువా రీప్రకృతిసుందరప్రదేశమునం దుండువారై యుందురని వినోదసఖుఁడు పరికింపసాగెను.

సీ. రేలెల్ల నమృతమ♦రీచి నంటున నంటఁగరఁగి నిర్మలపయో♦ఝరులఁ దొరఁగి
బలువిడి పెనులోయఁ♦బడిన క్రొన్నెలరాలచఱులలో నిరుగడఁ♦దఱచు మెఱచు
పటికంపుపణకుల♦పజ్జ గొజ్జఁగినీటి యేటిక్రేవలఁ జలి♦యిసుకవెట్టు
నేడాకుటనఁటుల ♦ నెలమావిగుమురుల సురపొన్నకూటాలఁ♦జుట్టుకొనిన
తే. బండిగురువిందతీఁగెచ♦ప్పరము లెనసి, ముడిగొనిన ద్రాక్షపందిళ్ల♦నడుమఁ గిన్న
రీనినాదానుకారిశా♦రీశుకాది, ఘోషఘుమఘుమితం బైన♦కోనఁ గనియె. 21

రేలెల్ల=రాత్రులయందంతటను, అమృతమరీచి=చంద్రునియొక్క, నంటున=సంపర్కముచేత, అంటఁగరఁగి = మొదలుముట్ట నీరుగాఁగరఁగి, నిర్మలపయోఝరుల = స్వచ్ఛమయిన జలప్రవాహరూపముచేత, తొరఁగి=బయలువెడలి, బలువిడి=విస్తారమానట్టులుగా, పెనులోయఁబడిన=పెద్దసొరియఁబడిన, క్రొన్నెలరాల = చంద్రకాంతశిలలయొక్క, చఱులలోన్ = చఱియలలో, ఇరుగడ=ఉభ

యపార్శ్వములయందును, తళుకుమెఱుగు = అతిశయముగా ప్రకాశించుచున్న, పటికంపు = స్ఫటిక శిలలయొక్క, పఱకుల = పేటులయొక్క, పజ్జన్ = చేరువను, గొజ్జఁగినీటి = గొజ్జంగిపువ్వులనీరువలన నైన, ఏటి=ఏటియొక్క, క్రేవలన్ = పార్శ్వములయందు, చలియిసుకవెట్టు = కర్పూరమును గూడఁ బెట్టుచున్న, (ని. 'ఘనసార శ్చన్ద్రసంజ్ఞ స్సితాభ్రో) హిమవాలుకా' అని యున్నది గనుక చలి యిసుక యనునీపదము హిమవాలుకానామార్థ మని తెలియవలెను) ఏడాకుటనఁటులను = కర్పూరపు టరఁటులను, ఎలమావిగుమురులన్=లేఁతమామిడిచెట్లగుంపులను, సురపొన్నకూటాలన్=కూటములవంటి సురపొన్నచెట్లను, చుట్టుకొనిన = అల్లుకొన్న, బండిగురువిందతీఁగెచప్పరములెనసి = బండిగురువింద తీఁగెలయొక్క చవికెలను గలసికొని, ముడిగొనిన = పెనగొన్న, ద్రాక్షపందిళ్ళ=ద్రాక్షపందిళ్ళయొక్క, నడుమన్ = మధ్యభాగమందు, కిన్నరీ = తంతికట్టువాద్యభేదములలో నొకటైన కిన్నెరయొక్క, నినాద=నాదమును, అనుకారి = పోలియున్న, శారీశుకాదిఘోష=గోరవంకలు చిలుకలు మొదలయిన పక్షులయొక్క కలకలధ్వనులచేత. ఘుమఘుమితంబైన = ఘుమఘుమయనెడు శబ్దముగలదిగాఁ జేయఁ బడుచున్న, కోనఁగనియెన్=ఒకకోననుఁ జూచెను. అలం. సహజోక్తి.

తా. వినోదసచివుఁడు పోయిపోయి యొకకోన గాంచెను. అది చంద్రకిరణములు సోకి చంద్ర కాంతశిలలనుండి జాలువారిన జలమె చంద్రకాంతశిలారూపముగనున్న లోయతో నలరుచుండెను. దానికిరుగడ పటికపుఁబేటులుగలవు. చెంత గొజ్జంగినీటికాలువ పాఱుచుండెను. చెంగటఁ జలియిసుము గల యేడాకులయనంటులు మావిగుమురులఁ సురపొన్నగున్నలు · నిండియుండెను. వీని నావరించి బండి గురువిందతీఁగలు ద్రాక్షలు పందిరులవలె నుండెను. చిలుకలు గోరవంకలు నచట పాటలు పాడుచు ఘుమఘుమారావములు జనింపఁజేయుచుండెను.

లయగ్రాహి.

ఓరఁగయి వ్రాలినన♦మేరువులపుప్పొడులఁ♦సారువులవెంట సహ♦కారమిళ దేలా
ధారములజారుహిమ♦వారికృతసారణులఁ♦బైరయినచెంగలువ♦యీరికలలోఁగా
శ్మీరకృతసేతువులఁ♦దారిఁ జనుచోఁ నచటఁ♦గూరుకలహంసలగ♦దైరొదలుసేయం
గీరములుసారెఁబెఱ♦వారలిటుచేరి రని♦చారణులఁ జీరవసు♦వీరసఖుఁ డంతన్.

ఓరఁగయి వ్రాలిన=ఒరగఁబడి వ్రాలిన, నమేరువుల=సురపొన్నలయొక్క, పుప్పొడుల = పుష్ప పరాగములయొక్క, సారువులవెంటన్ = సారువులనఁగా గురుతరవస్తువులను మీఁదికెక్కించుటకుఁ గట్టిన సేతువులు, వానివెంబడిగానున్న, సహకార = తియ్యమామిళ్ళతోడ, మిళత్ = కూడుకొన్న, ఏలా=ఏలకితీఁగెలయొక్క, ఆధారముల = పాదులవల్లనుండి, జాఱు = స్రవించుచున్న, హిమవారి = మంచునీరిచేత, కృత = చేయఁబడిన, సారణులన్ = కాలువలవలన,(ని. 'సారణీ చాల్పసరితి' అని విశ్వము). పైరైన=పెరిగిన, చెంగలువ=మెట్టచెంగల్వలయొక్క, ఈరికలలోన్=చాల్వలలోను, కాశ్మీర= కుంకుమపువ్వుచేత, కృత=చేయఁబడిన, సేతువుల=కట్టలయొక్క, దారిన్ = మార్గమునను, చనుచోన్= పోయెడుసమయమందు, అచటఁగూరు = అక్కడనిద్రించుచున్న, కలహంసలు = ధూమ్రవర్ణముగల హంసలు, అగడై = బెదరుకొన్నవై, రొదలుసేయన్ = క్రేంకారములుసేయఁగాను, కీరములు = చిలు కలు, సారెన్=మాటిమాటికి, పెఱవారలు = అన్యులు, ఇటుచేరిరని = ఇక్కడికివచ్చినారని, చారణులఁ జీరన్=చారణులనువారిని బిల్వఁగా, వసువీరసఖుఁడు = శూరుఁడైన వసురాజుయొక్క స్నేహితుఁడు,

అంతర్ = అమీఁదటను, పుష్పొడి సారువులవలె రాలుటవలన నమేరువులు పుష్పభరముచేఁ బూర్తిగ వంగియున్న వనుట. అలం. ఉదాత్తము.

తా. సురపొన్నతరువులు పుష్పభరముచే నొరగియుండఁ బుప్పొడికుప్పలు పంతెనలవలె నుండెను. దానివెంట గుజ్జుమావిడుల నల్లుకొన్న యేలకితీఁగలనుండి మంచుబిందువులు రాలి జాలువారుచుండ నిరుక్రేవలఁ జెంగలువ లచటఁ బైరగుచుండెను. కుంకుమపూవ్రుకుప్ప లాచెంగలువతోఁటలకు గనిమలవలె నుండెను. వినోదసచివుఁ డాత్రోవను బోవుచుండ నటఁ గూర్కుపోవు కలహంసములు లేచి రొదలుచేయఁ దొడఁగెను. చిలుక లారొదలవిని పరు లిటకు వచ్చిరని చారణులఁ బిలుచుచుండు కేళి (ముందఱి పద్యముతో నన్వయము.)

సీ. పగడాలకొణిగలఁ•నిగనిగ ల్వజ్రంపుజగతిక్రేవల నెఱ•జాజు నింప
నీలజాలకజాల•జాలోకములఖండకాలాగరుజధూప•కాంతిఁ బెనుప
ముత్యాలనవరంగ•ములరంగు నవరంగ వల్లీవిభూతి ముం•గిళ్ల నునుప
గారుత్మతద్వార•చారుప్రభాపూరతోరణంబులహరి•త్తులు పొసంగ
తే. భర్మపాంచాలికాపాణి•పద్మ రాగ, రాజినీరాజనోపచా•రముగ వఱలఁ
దరళవైదూర్యవలభిక•ల్తైకలు నెరప, నిరుపమం బైనదివ్యమం•దిరము గనియె.

పగడాలకొణిగెలనిగనిగల్ = కొణిగె లనఁగా ముంజూరులు, పగడాలజాలరుగట్టిన ముంజూర్ల యొక్క నిగనిగ మెఱయునట్టికాంతిరేఖలు, జగతి యనఁగా వేదిక. 'గీ. 'జిగిలి యన నరు గనఁగను జగతి యనఁగఁ, దిన్నె యన వేదికాఖ్య లై యెన్నఁ దనరు' అని ఆంధ్రనామసంగ్రహము. వజ్రంపుజగతిక్రేవల్ = వజ్రమణికల్పితములైనయరుగులయొక్క పార్శ్వభాగములయందు (ప్రతిఫలించి), నెఱజాజునింపక్ = జాజుపట్టెలనెడు భ్రాంతి నుదయింపఁజేయఁగాను, వజ్రములకాంతి జాజుపట్టెలరంగుగాఁగూడ నుండును. అటులుండుట వజ్రప్రశస్తికిఁగూడ నొకతార్కాణ. ఇందులకు దృష్టాంతము-

"సర్వద్రవ్యాభేద్యం లఘ్వంభసితరతిరశ్మిమత్ స్నిగ్ధం
తటిదనలశక్రచాపోపమంచ వజ్రం హితాయోక్తం." బృహత్సంహిత.

నీల=ఇంద్రనీలమణిమయములైన, జాలక = గవాక్షములయొక్క, జాల = సమూహమువలన, జ=పుట్టిన, ఆలోకములు=కాంతులు, అఖండ=ఎడతెగని, కాలాగరు = కృష్ణాగరువల్లను, జ = పుట్టిన, ధూపకాంతిక్ = అనఁగా తదాశ్రయమయినధూపమును, పెనుపక్ = వృద్ధిఁబొందించఁగాను, అనఁగా కృష్ణాగరుధూపధూమమనెడు భ్రాంతి నుదయింపఁజేయఁగా ననుట. ముత్యాలనవరంగములరంగు = నవరంగములనఁగా నవరంగపుచవికెలనెడు గృహవిశేషములు, ముక్తామయములైననవరంగముల యొక్క కాంతి, నవ=నూతనమైన, రంగవల్లీ = ముత్యాలముగ్గులయొక్క, విభూతిక్ = సంపదను, ముంగిళ్లక్ = గృహాంగణములయందు, ఉనుపక్ = ఉండునట్టుచేయఁగాను, అనఁగా ముత్యాలనవరంగపుఁజవికెలయొక్క ముంగిళ్లయందు వ్యాపించి ముత్యపుముగ్గులనెడు భ్రాంతి నుదయింపఁజేయఁగా ననుట. గారుత్మత = మరకతరత్నమయములైన, ద్వార = వాకిళ్లయొక్క, చారు = మనోహరమయిన, ప్రభాపూర=కాంతిసమృద్ధియనెడు, తోరణంబుల = తోరణములయొక్క, హరిత్తులు=పసరుఛాయలు

శోభసంగన్=ఒప్పఁగాను, అనఁగా మరకతద్వారకాంతిపూరములు తోరణభ్రాంతి నుదయింపఁజేయఁగా ననుట.

భర్మ=సువర్ణవికారములయిన, పాంచాలికా = బొమ్మలయొక్క, పాణి=హస్తములయందలి, పద్మరాగ=మాణిక్యములయొక్క, రాజి=పఙ్క్తి, నీరాజనోపచారముగవఱలన్ = నీరాజనదీపపఙ్క్తియో యనట్టు ప్రకాశించఁగాను, అనఁగా నీరాజనదీపభ్రాంతి నుదయింపఁజేయఁగా ననుట. తరళ=తెరలఁ బాఱుచుండెడు, వైదూర్య=వైడూర్య మణిమయములయిన, వలభికల్=స్తంభములమీఁద నుండెడు శ్రేణులు, తెరలునెరపన్ = తెరచీరలను గల్పింపఁగాను, అనఁగా వైడూర్య వలభికలయొక్క కాంతులు తెరలనెడు భ్రాంతి నుదయింపజేయఁగా ననుట.

ఆ. వె. 'పగలు గొంది గానఁబడెడుబిడాలంబు, కన్నుఁబోలె వెల్గు గల్గి నూలు
దిరుగునట్టు మీఁదఁ దెరబారువైడూర్య, రత్నమునకు దీప్రయత్నమునకు.'

అని రత్నశాస్త్రము.

నిరుపమంబైన=ఉపమానరహితమయియున్న, దివ్యమందిరము=యోగ్యతరమయిన గృహమును, కనియెన్=చూచెను. అనఁగా నాగృహసంబంధములైన రత్నకాంతులే గృహాలంకారములై యొప్పఁగాఁ బ్రకాశించునట్టి యొకానొకదివ్యమందిరమును జూచెననుట.

అలం. స్వభావోక్తి. ఉత్ప్రేక్ష. ఉదాత్తమును.

తా. శ్రీదాసచిప్పఁడొకానొకలో నొకదివ్యమందిరమును గాంచెను. దానికిఁ బగడములతో మునాలు లమర్పఁబడియుండెను. అవి వజ్రవేదికలపైఁ బ్రతిబింబించి జాజుపట్టెలవలె నుండెను. నీలపు గవాక్షులకాంతులు కాలాగురుధూపములవలె నుండెను. ముత్తెములు చవికలనేలపైఁ బ్రతిబింబించి ముగ్గులవలె నుండెను. గరుడపచ్చతోరణములు పచ్చనికాంతులఁ గ్రక్కుచుండెను. బంగారుబొమ్మల కేలగల పద్మరాగమణులు హారతులఁగను వైదూర్యస్తంభశ్రేణులు తెరలవలె నుండెను.

క. కనుఁగొని మణిమందిరమున, మునుకొని కలధౌతభిత్తిముకురతలబహి
ర్జనితానుబింబనమ్మలు, వనితారత్నములు మెలఁగుచవల నెఱిఁగింపన్. 21

కనుఁగొని=చూచినవాఁడై, మణిమందిరమునన్=రత్నమయమయిన గృహమునందు, మునుకొని= ముందుగానె, కలధౌత=సువర్ణమయమయిన, (ని, 'కలధౌతం రౌప్యహేమ్నోః, అని అమరము.) భిత్తిముకురతల=అద్దమువంటి గోడలవలననుండి, బహిః=బాహ్యమునందు, జనిత=ఉదయించుచున్న, అనుబింబనమ్ములు=ప్రతిబింబములు, వనితారత్నములు=శ్రేష్ఠస్త్రీలు, (ని. 'జాతే జాతే యదుత్కృష్టం తద్రత్న మితి కథ్యతే' అని అ.) మెలఁగు=ప్రవర్తించునట్టి, వలను=జాడను, ఎఱిఁగింపన్ = తెలియఁజేయుచుండఁగా, వైపద్యముతో నన్వయము. మందిరము మణిమయ మయినది గనుక తదీయ మణిమయమయిన కాంచనభిత్తిని ముకురతలముగాఁ బోల్చినాఁడు. అనఁగా ఆగోడచుట్టును బంగారు కుందనంబును మధ్యప్రదేశమందు రత్నఫలకములును గలిగియున్న దని భావము.

తా. ఆమణిమందిరమునకు రజతవికారములగు నద్దమువలె మెఱుఁగులు గ్రక్కు గోడలుగలవు. అందుఁ బ్రతిబింబితములైన యాకారములు మందిరమునఁ జెలువలు గలరనుజాడఁ శ్రీదాసచిప్పన కెఱుంగఁజేసెను.

చ. తరువులపొంతఁ బొంచి వసుధావరమిత్త్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ దమోవినీలకచఁ దామరసోదరసోదరప్రభం
దరళవిలోచనం దతనితంబఁ దటిన్నిభగాత్త్రవల్లరిం
దరుణశశాంకఫాల నొకతన్విఁ దరంగవళిం దలోదరిన్. 25

తరువులపొంతఁబొంచి = చెట్లచాటున పొంచియుండి, వసుధావరమిత్త్రుఁడు = వసురాజుయొక్క స్నేహితుఁడు, (ని 'అథ మిత్త్రం సఖాసుహృత్' అని మిత్త్రశబ్దము నిత్యనపుంసకమగుటవలన మిత్త్రమని చెప్పవలసినదైనను, శ్లో. 'క్వచి దర్థవిశేషేతు క్లీబే పృథయరూపతా' అనెడు ఆథర్వణవచనమువలన మిత్త్రుఁడని చెప్పినాఁడు.) అచ్చటన్ = ఆమణిమందిరమందు, తరుణి = కొమరుప్రాయము గలిగినట్టియు, తమః = చీఁకటివలె, వినీల = మిక్కిలి నల్లనైన, కచన్ = తలవెండ్రుకలు గలిగినట్టియు, తామరస = పద్మముయొక్క, ఉదర = గర్భమునకు, సోదర = సమానమైన, ప్రభన్ = కాంతిగలిగినట్టియు, తరళ = చంచలములైన, విలోచనన్ = నేత్త్రములు గలిగినట్టియు, తత = విశాలమైన, నితంబన్ = కటిభాగము గలిగినట్టియు, తటిత్ = మెఱుపుతోడ, నిభ = సమానమైన, గాత్త్రవల్లరిన్ = తీఁగెవంటి దేహముగలిగినట్టియు, తరుణశశాంక = బాలచంద్రునివంటి, ఫాలన్ = నొసలుగలిగినట్టియు, తరంగవళిన్ = తరంగములవంటి కడుపుమడతలు గలిగినట్టియు, తల = అరచేతివంటి, ఉదరిన్ = గర్భముగలిగినట్టియు, ఒకతన్విన్ = ఒకానొకస్త్రీని, కాంచెన్ = చూచెను.

ఈపద్యమందు రీతియనెడు గుణము గ్రహించవలెను. ని. 'యథార్థక్రమనిర్వాహే రీతి రిత్యభిధీయతే' అని లక్షణము. ఈపద్యమునఁ దన్వి యనుశబ్దమునకుఁ గలవిశేషణములన్నియుఁ దకారముతోఁ బ్రారంభించ బడినవి గావున, నొకతన్వి యనువిశేష్యమును దకారముతో నుండవలయునని వ్యాఖ్యాత. ఒకదన్వి యని దిద్ది ఒకదన్వి యనునది కర్మధారయసమాసము గనుకను కర్మధారయసమాసమందు గసడదవాదేశము వికల్పముగావచ్చును గనుకను తవర్గతృతీయవర్ణమేయని తెలియవలెను అని వ్రాసియున్నాఁడు. అది శబ్దశాస్త్రసాహసముదక్క నన్యముగాదని వేఱొకవ్యాఖ్యాత వ్రాసియున్నాఁడు. ఇటుఁగవ్యభిప్రాయ మిదియని జాయిగ్రుద్ది యొకదన్వి యనుటయే గ్రంథకర్తమతమనుట యత్యూహ. తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవాదేశము పూర్వకవుల కవితలోఁ దఱుచుగఁ గానరాదు, కొలఁదిగనున్నను నవి ప్రకృతమునకు లక్ష్యములు కావు. భారతాదులయందలి "ఎంతగుమతులైన" "ఇట్లు దపంబుసేయు" "ఎవ్వండు వఱించు" లోనగుచోటులగల యాదేశగసడదవలు ప్రాసస్థానములగుట రూఢములు. ఇటనొ శబ్దాలంకారప్రియుఁడగు నీకవిదవర్ణమె పెట్టనెంచి ఒకదన్వియని యుండునని యూహ. ప్రథమమున పద్యము తకారముతో నారంభింపఁబడినది. మూఁడవపాదము యతిస్థలమున నితంబయనుచో తవర్ణమె యతిలోఁ జేర్పఁబడినది. మొదటిపాదమున ధవర్ణము యతి. ఇఁకనాలుగవపాదమున నొకదన్వియనెనని నిశ్చయించుట కవ్యభిప్రాయమునకు భిన్నము. కాదుపో కేవల ప్రయోగశరణ్యమగు సాంస్కృతికపరుషములపైఁగల గసడదవాదేశమును దృక్పథమునం దుంచికొని యొకదన్వియని శాసింపఁబోవుట యుంచితముగాదు.

తా. చెట్లచాటుననుండి రాజమిత్త్రుఁడు పొంచి చీఁకటివంటి వెన్నెరియుఁ దమ్మిగద్దియవంటి మేనిచాయయుఁ నిలుకడలేని చూపులు వ్రేఁగైన కటిభాగము మెఱుపువంటి మేనుదీఁగ బాలచంద్రునివంటి నుదురు తరఁగలవంటి వళులుగల యొకానొకసుందరిని గాంచెను.

మ. లలితామోదలతావితానవృతలీలాచంద్రశాలాతలో
జ్జ్వలనీలాతతవేదిపైఁ మొగులుక్రేవన్ మించుక్రొమ్మించు నా
నలువై యత్తఱి నత్తలోదరియు వీణావాదనప్రౌఢిచేఁ
జెలులన్ రంజిలఁ జేయుచున్కి నృపసంసేవాపరుం డాత్మలోన్. 26

లలిత = సుందరమయిన, ఆమోద = పరిమళముగల, లతా=తీఁగెలయొక్క, వితాన = సమూహముచేత, వృత = ఆవరింపఁబడిన, లీలా = విలాసయుక్తమయిన, చంద్రశాలాతల = శిరోగృహప్రదేశమందు, (ని. 'చన్ద్రశాలా శిరోగృహం' అని అమరము,) ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, నీల = ఇంద్రనీలమణిమయమయిన, ఆతత = విశాలమైన, వేదిపైన్ = అరుగుమీఁద, మొగులుక్రేవన్మించు= మేఘసమీపమం దతిశయించుచున్న, క్రొమ్మించునాన్ = క్రొత్తమెఱుపోయన్నట్టుగా, నలువై = ఒప్పిదమై, అత్తఱిన్ = ఆసమయమందు, అత్తలోదరియున్ = ఆస్త్రీయును, వీణావాదనప్రౌఢిచేన్ = వీణ వాయించుటయందలి ప్రౌఢిమచేత, చెలులన్ = చెలికత్తియలను, రంజిలఁజేయుచున్కిన్ = సంతోషింపఁ జేయుచుండుటచేత, నృపసంసేవాపరుఁడు = వసురాజుయొక్క భృత్యకృత్యమునం దాసక్తుఁడై యానర్మసఖుఁడు, ఆత్మలోన్ = తనలోను, ముందరిపద్యముతో నన్వయము.

ఉజ్జ్వలనీలవేదిక యనుటవలనఁ జంద్రశాలయం దంతటను వేదికాకాంతు లావరింపఁబడి యున్నవనియు నట సామాన్యమగు మెఱుపు ప్రకాశింపదుగాన తొలకరిమెఱుపువలెఁ గాంతామణి యున్నదనియుం భావము.

తా. తావులొలయు తీవలచేఁ బెనఁగొనియున్న చంద్రశాలయందలి నీలవేదికపైఁ దొలకరి మెఱుపువలెనుండి వీణియ నేర్పుగా వాయించుచుఁ జెలికత్తియలఁ దనుపుచున్న కాంతామణిని రాజమిత్రుఁడు గాంచి తనలో—

సీ. తనకప్పు నెఱికొప్పునను నెపూని గౌరీసమాఖ్య మించ జనించినట్టియార్య
తనచాపలము చూపులనె చూపి సిరు లెల్ల కడఁ జల్ల వచ్చినకమలపాణి
తనపాండిమము నవ్వులనె యుంచి గాంధర్వ మవనికిఁ దెచ్చినహంసయాన
తనయదృశ్యత నడుమనె తాల్చి సాంగయై మొనసిన యతనుసమ్మోహవిద్య
తే. గావలయు నీవెలఁదిదీనికాంతి గుణకళాభిరూప్యంబు లెఱిఁగించి యామహేశు
నా నగోద్ధారకుని నాప్రజాధినాథు, నాజగన్మోహనుని దెత్తునను చుఁ జనియె.

తనకప్పు = తనయొక్క శరీరనైర్మల్యమును, నెఱిగొప్పున నెపూని = ఘనమైన కేశపాశమందే వహించి, గౌరీసమాఖ్యమించ = గౌరియనుపేరు మించునట్లుగా, జనించినట్టి = సంభవించిన, ఆర్య= ఆర్యాదేవి, అనఁగాఁ బార్వతియని యర్థము. (ని. 'ఆర్యా దాక్షాయణీ చైవ గిరిజా' అని అమరము.) గౌరవర్ణయుక్తురాలు గనుక గౌరియనియును, ఆర్యయనఁగాఁ గులీనురా లనియును అర్థము గ్రహించవలెను. (ని. 'మహాకుల కులీ నార్య సభ్య సజ్జన సాధవః' అని అమరము.) తనచాపలము=తనయొక్క చపలభావమును, చూపులనె చూపి = వీక్షణములయందే కనుపఱచి, సిరులు = సంపదలను, ఎల్లకడన్ = అంతటను, చల్లవచ్చిన = వెదచల్లెదునిమిత్తమయి వచ్చిన, కమలపాణి = లక్ష్మీదేవి యనియును, కమలములవంటి హస్తములు గలదనియును అర్థము. తనపాండిమము = తనయొక్క శరీరధావళ్యమును, నవ్వులనెయుంచి = నవ్వులయందే యుంచి, గాంధర్వము = గానమును, అవనికిఁదెచ్చిన =

భూమికిం దీసికొని వచ్చిన, హంసయాన = హంసవాహనముగల సరస్వతియనియును, హంసనడపుల వంటి నడపులు గలదనియు అర్థము. గాంధారమును బాడుట దేవతలకుమాత్రము సాధ్యముగాని మానవులకు సాధ్యము కాదు. గాంధారమును భూలోకమునం బ్రసరింపఁజేసినది తొలుత సరస్వతీదేవియె కాన గాంధర్వ మనుచో గాంధారమనుట యుచితమని కొందఱందురు. గాంధారము దేవైకగేయ మనుటకు-

శ్లో. షడ్జమధ్యమనామానౌ గ్రామౌగాయంతిమానవాః
పతగాంధారనామానం సలభ్యో దేవయోనిభిః.

తనయదృశ్యతర్ = తనయొక్కకనుపడకపోవుటను, నడుమనె తాల్చి = మధ్యభాగమందేవహించి' సారంగరైయె మొనసిన = ఆకారసహితయై యవతరించిన, అతను సమ్మోహవిద్య=మన్మథునియొక్క సమ్మోహనవిద్య యనియును, అతను = అధికమయిన, సమ్మోహనవిద్యయని యర్థము. నడుమనెయన్నచోట, (ని. 'కేషాంచిదుదంతానాంనేతి విభక్త్యావునోలుక్స్యాత్' అనుసూత్రముచేత, ఉన్నుకు లోపము వచ్చినది. ఎ-అనునది ఏవార్థకము.)

ఈవెలఁది అనఁగా నీకనఁబడుచున్న చిన్నపడుచు, కావలయుర్ = పైనూహింపఁబడిన ప్రకారముగానే యుండవలెను. కాఁబట్టి, దీని = ఈచిన్నదానియొక్క, కాంతి=గౌరవర్ణమును, గుణ=నిశ్చలగుణమును, కళా=సంగీతవిద్యను, అభిరూప్యంబులు=సౌందర్యమును, ఎఱింగించి=తెలియఁజెప్పి, ఇక్కడ, తనకప్పు నెఱిగొప్పన నెపూని గౌరీసమాఖ్యమించ జనించినదని చెప్పుటచేత, కాంతికి సార్వకాలికత్వంబును సిరుల వెదచల్లుటకు సర్వవిషయికత్వంబును గాంధర్వకళకు స్వర్గ భూలోకములయందు నుభయత్ర ప్రకాశకత్వంబును సారంగరై మొనసిన దన్నందున నాభిరూప్యమునకు సద్భావమును అని తెలియవలెను. అమహేశుర్ = అమహేశ్వరు ననియర్థము, అమహాప్రభువు ననిభావము. అనగోద్ధారకుని = అమందరధరుఁడైన నారాయణమూర్తినని యర్థము, అకోలాహలపర్వతము నెత్తినవాని నని భావము. అప్రజాధినాథుర్ = అబ్రహ్మనని యర్థము. అజననాథునని భావము. అజగన్మోహనుని = జగత్తును మోహింపఁజేయు నామన్మథునని యర్థము, జగన్మోహనాకారునని భావము. తెత్తుననుచుం జనియెర్ = తీసికొనివచ్చెదనని పోయెను.

ఆచిన్నదానిం బార్వత్యాదులఁగాఁ జెప్పినాఁడు గనుక వసురాజు నీశ్వరాదులఁగాఁ జెప్పెను. కావున నీమె కాతఁడు తగినభర్తయని భావము. క్రమాలంకారము. ఇందులో తనకప్పు నెఱికొప్పన నెపూని యన్నందునఁ గొప్పున కతినైల్యంబును, తనచాపలము చూపులనె చూపి యన్నందున వీక్షణముల కతిచాంచల్యంబును, తనపాండిమము నవ్వులనె యుంచి యన్నందున నవ్వునకు ధావళ్యంబును, తన యదృశ్యత నడుమనె తాల్చి యన్నందున మధ్యమున కతిసూక్ష్మత్వమును సిద్ధించినది గనుక నిందువలన నత్యంతసౌందర్యద్యోతన మగుచున్నదని తెలియవలెను.

'మానవాః. మాళితోపి ర్ణ్యః దేవతాశ్చరణ స్తథా' యను నాలంకారికనియమానుసారముగ. గిరిక మనుజకాంత యగుటచే ముఖాదిగా నవయవవర్ణనము గావింపఁబడుచున్నది. గిరికను గౌర్యాద్యుపమానములతోఁ జెప్పుటచే రూపకాలంకారము. శబ్దశ్లేషమువలన విశేషోక్తియుం గావలయుననుటు నుత్ప్రేక్షావాచకమువలన. నుత్ప్రేక్షయు మహేశాదిశబ్దసాభిప్రాయపశమున సమమును భరికరాలంకారమును గ్రామ్యములు.

తా. ఈకాంత తన నల్లదనము కొప్పున నిమిడ్చినపార్వతియో చాంచల్యము చూపుల నిమిడిన చిన లక్ష్మియో పాండిమము నవ్వునం దిమిడించిన సరస్వతియో యదృశ్యత నడుమునందుంచిన మోహన విద్యయో కావలయును. ఈచెలువ కలరూపు మాఱేని కెఱుకజేసి యిటకుఁగొనివత్తునని క్రీడాసచివుఁ డటనుండి పోయెను.

చ. చని విభుఁ గాంచి పల్కు బల♦శాసనసన్నిభ నీదుపంపునం
 బనివిని తీవెగుం బనక ♦ పాండురసైకతనిర్ఝరీతటం
 బనక దరీపుటం బనక ♦ నన్నియు నారసి యొక్కచో వినూ
 తనలవలీలతావళుల♦తావులతావల మైనతావునన్. 28

చని=పోయి, విభుఁగాంచి=వసురాజును జూచి, పల్కున్ = పలికెను. ఏమనియనిన, బలశాసనసన్నిభ=ఇంద్రసమానుఁడవైనస్వామీ, నీదుపంపునన్ = నీయొక్క పంపకముచేత, పనివిని = పోయినవాఁడనై, తీవెగుంపనక=పొదరిండ్లే యనికాక, పాండుర = తెల్లనైన, సైకత = ఇసుకతిన్నెలు గల, నిర్ఝరీ = నదులయొక్క, తటంబనక = దరియనికాక, దరీపుటంబనక = గుహయనికాక, అన్నియు నారసి=సమస్తమునువెదకి, ఒక్కచోన్ = ఒకస్థలమందు, వినూతన=మిక్కిలి సుకుమారములైన, లవలీలతావళుల = ఏలకితీఁగెలగుంపులయొక్క, తావుల=పరిమళములకు, తావలమైన = స్థానమైన, తావునన్=ప్రదేశమందు, ముందరిపద్యముతో నన్వయము.

తా. పోయి రాజును జూచి రాజా! నీయానగొని తీవలు సైకతములుగల సెలయేళ్లు గుహలు తిరిగితిరిగి యొకానొక యేలకీలతల కునికియగు ప్రదేశమునందు-

శా. నాళీకాకరతీరసారకదళీనారంగపూగావళీ
 పాళీవాసిత మైనకోనఁ గని యా♦ బలోత్కనలో గానలో
 లాళిప్రేరకరత్నకోరకమయూ♦ఖాలీసమాలీఢ మౌ
 కేళీధామము గంటి భూరమణ యా♦కేళీనివాసంబునన్. 29

నాళీకాకర=పద్మాకరముయొక్క, తీర = దరియందు, సార = యోగ్యమైన, కదళీ=అరఁటుల యొక్కయు, నారంగ = నారింజచెట్లయొక్కయు, పూగ = పోకచెట్లయొక్కయు, ఆవళీ = సమూహముయొక్క, పాళీ = పొంకముచేత, వాసితమైన = పరిమళింపఁజేయఁబడుచున్న, కోనఁగని=కోనను జూచి, ఆబలోత్కనలోత్=ప్రబలమైన ఆకోనలో, గానలోల=ఝుంకార రూపగానమునం దాసక్తి గలిగిన, అళి=తుమ్మెదలకు, ప్రేరక = ఉల్లాసమును, గల్పించుచున్న, రత్నకోరక=మణిమయములైన మొగ్గలయొక్క, మయూఖాలీ=కిరణసముదాయముచే, సమాలీఢమౌ=వ్యాప్తమైన, కేళీధామమున్=క్రీడాగృహమును, కంటిన్ = చూచితిని, భూరమణ = వసుమహారాజా, ఆకేళీనివాసంబునన్ = ఆ క్రీడాగృహమునందు, ముందరిపద్యముతో నన్వయము.

నాళీకకదళీనారంగవాసిత మగుటచే నటఁ దుమ్మెదలు మెండుగాఁ గలవనుట. అవి రత్నకోరకముల వనితనముఁ జూచి నిజమగు మొగ్గలని తేనియఁ ద్రావి పాటలు పాడుచు వచ్చుచున్నవి. దీనిచే శిల్పాతిశయము సూచితము. అలం. భ్రాంతిమంతము.

తా. సుగంధబంధురమగు నొక కోన గలదు. అట నొక క్రీడాగృహము గలదు. దానికిఁ జెక్కిన రత్నకుట్మలములను నిజముగ మొగ్గలని భ్రమసి తుమ్మెదలు దరియుచున్నవి. రాజా! ఆక్రీడాగృహమునందు-

సీ. వలుదగుబ్బలు ప్రసేవకవృత్తి దగుగుబ్బకాయల కపరంజిచాయ లొసఁగ
లలితాంగుళీదళంబులు సమేళము లైన సారెలపై రాగసంపద లిడఁ
బాణికంకణరుతుల్ ప్రాణానుబంధంబు గల తాళగతి కనుగ్రహము లీన
నాలాపభంగి యత్యక్తసంవాదిసమస్వరంబులకు గ్రామంబు లునుపఁ
తే. బ్రచురతానామృతములమూర్ఛనలచేత, చేతనంబులు చేతనరీతిఁ దనరఁ
జేతనంబు లచేతనభాతి నొనర, వీణ వాయించునొకయలివేణిఁ గంటి. 30

వలుదగుబ్బలు = వట్రువగుబ్బచన్నులు, ప్రసేవకవృత్తికిన్ = ప్రసేవకమనఁగా కరివెయనెడు వీణాంగము, దానివ్యాపారముచేత ననియర్థము (ని. 'కకుభస్తు ప్రసేవకః' అని అమరము.) శ్రేష్ఠుఁడైన సేవకునియొక్క వ్యాపారముచేతనని యర్థాంతరము. తగు=అర్హమవునట్టి, గుబ్బకాయలకున్ = వీణకు వేసినకాయలకు, అపరంజిచాయలొసఁగన్ = అపరంజి బంగారపురంగుల నియ్యగాను, ఇది సాధారణపదము. అనఁగా వీణకాయలు కుచముల నొరయుచుండఁగా కుచములయొక్క శుద్ధసువర్ణచ్ఛాయలు ఆకాయలమీఁద ప్రసరించిన బంగారురంగు చేసినట్టులుగా నున్నవని భావము.

లలిత=ఒప్పుచున్న, అంగుళీదళంబులు=చిగురుటాకులవంటి వ్రేళ్లు, సమేళములైన=మేళమనఁగా నాయారాగమునకు అనుగుణముగా స్వరస్థానములయందు మెట్లు కుదిరికపఱచుట, అట్టిమేళముతోఁ గూడికొనియున్నదని యర్థము. కూడియున్నదని యర్థాంతరము. సారెలపైన్=మెట్లమీఁదను, రాగసంపదలిడన్=అనఁగా రక్తిమయొక్క సమృద్ధులను, లేక రాగములయొక్క సంపదలను కలుగఁజేయఁగా నని యర్థము. అనఁగా నంగుళులచేత వీణమెట్లపై తీఁగెలు వాయించునప్పుడు అంగుళులు తమయొక్క సహజరక్తిమచేత మెట్ల నెఱ్ఱనౌనట్టులు చేసినవనిగాని, లేక అంగుళ్యగ్రములచేత తీగెల మీఁద వాయించఁగా రాగములు పుట్టుచున్నవి గనుక రాగములు గలుగునట్లుగాఁ జేసినవని గాని భావము. అనురాగములయొక్క సంపదల నియ్యఁగా నని యర్థాంతరము.

పాణికంకణ=హస్తకంకణములయొక్క, రుతుల్ = ధ్వనులు, ప్రాణానుబంధంబుగల తాళగతికిన్=ప్రాణము లనఁగా, శ్లో. 'కాలో మార్గః క్రియాఙ్గాని గ్రహో జాతిః కళాలయః, యతిః ప్రస్తారకశ్చైవ తాళప్రాణా దశస్మృతాః' కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము అను నివి పదియును, తాళప్రాణములు=ఆప్రాణములయొక్క, అనుబంధంబు గల=సంబంధము గలిగిన అని యర్థము. ప్రాణమైత్రి గలిగినదని యర్థాంతరము. తాళగతికిన్ = తాళ ప్రచారమునకు, అనుగ్రహములీనన్=అనుగ్రహము లనఁగా, గీతము తాళము సమముగా నడుచునట్టి సమగ్రహములు, అట్టి సమగ్రహములను గలుగఁజేయఁగా నని యర్థము. శ్లో. 'గీతాతీతే త్వతీతస్స్యాత్తాళాతీతే త్వనాగతః, సమ స్సమగ్రశ్చైవ విషమో విషమగ్రహః.' అని సంగీతశాస్త్రము, ప్రసాదముల నిచ్చుచుండఁగా నని యర్థాంతరము.

ఆలాపభంగి=రాగసంచారమార్గము, అత్యక్త=అసంత్యక్తనామకములయిన, శ్లో. 'అసంత్యక్తాస్సమాఖ్యేయా స్సంతక్తా విషమస్వరాః' అని సంగీతశాస్త్రప్రామాణికవచనము. సంవాది=అమాత్యసంజ్ఞగలిగిన, శ్లో. 'వాదీ రాజా స్వరస్తస్య సంవాదీస్యా దమాత్యవత్' అని సంగీతశాస్త్రము. సమ=సమసంజ్ఞగల, స్వరంబులకున్=షడ్జపంచమాదిసప్తస్వరముల కని యర్థము. శ్లో 'శ్రుత్యవస్తరభాపియ

స్స్వరోను రణనాత్మకః, స్వతో రఞ్జయతి శ్రోతృ చిత్తం సస్వర ఉచ్యతే' అనియు, శ్లో. 'స్వయం రఞ్జయతే నాద స్సస్వరః పరికీర్తితః' అనియును, సంగీతశాస్త్రస్వరలక్షణము, అత్యక్త = పరిత్యక్తములు గాని, సంవాది=సమ్యగ్వాదముగల, సమ=వైషమ్యరహితములయిన, స్వరంబులకున్ = కంఠనాదముగల వానికి, అనఁగా నేకరీతిగా సమభావముచేత, మంచిమాటలాడెడువాని కని యర్థాంతరము. గ్రామంబులునున్ = గ్రామములనఁగా స్వరసమూహములు, వానినియ్యఁగా నని యర్థము. శ్లో. 'యథా కుటుంబిన స్సర్వే హ్యేకీ భూతా భవన్తి హి, తథా స్వరాణాం సన్దోహో గ్రామఇత్యభిధీయతే.' అని సంగీతశాస్త్రగ్రామలక్షణము. మొఖాసాగ్రామము లియ్యఁగా నని యర్థాంతరము.

ప్రచుర=బహుళములయిన, తానామృతములన్ = తానములనెడు అమృతములచేతను, మూర్ఛనలచే = సప్తస్వరములయొక్క ఆరోహణావరోహణములచేతను, శ్లో. 'క్రమాత్స్వరాణాం సప్తానామారోహ శ్చావరోహణమ్, మూర్ఛనే త్యుచ్యతే గ్రామ స్తా ఏతా స్సప్తసప్తచ.' అనిసంగీతశాస్త్ర మూర్ఛనాలక్షణము. అచేతనంబులు=చేతనారహితములైన దారుశిలాదులు, చేతనరీతిఁదనరన్ = సచేతనములైన మనుజ పశు పక్షి మృగాదులవలె నొప్పఁగాను, చేతనంబులు = నర పశు పక్షి మృగాదులు, అచేతనభాతినొనరన్ = అచేతనములయిన దారు శిలాదులవలె నొప్పఁగాను, వీణ వాయించు నొక యలివేణిఁగంటిన్ = వీణవాయించునట్టి యొకస్త్రీని జూచితిని. గానమహిమచేత అచేతనములయిన ఱాళ్లు కరఁగుట మోళ్లు చిగురించుటయును, చేతనములయిన నర పశు మృగాదులు పరవశతనుబొంది నిశ్చేష్టితము లగుటయును కవిసంకేతసిద్ధ మని తెలియవలెను. మూర్ఛలవలన చేతనము లచేతనములుగ మాఱుచున్నవనియు (తాన)అమృతవశమున నచేతనములు చేతనము లగుచున్నవనియు గ్రహించునది. అలం. శ్లేషమూలకకావ్యలింగము. సమాసోక్తి.

తా. గుబ్బల మెఱుఁగులు వీణకు వేసిన గుబ్బకాయలపై బంగారుపూతఁ బూయుచుండ, వ్రేళ్ల కాంతులు దంతపుసరికట్లపైఁ బ్రతిబింబింప, కంకణధ్వని తాళగతులతో నేకీభవింప ఆలాపము స్వరములకు స్వరసమూహములఁ బ్రసాదింప నచేతనములను జేతనములుగను జేతనముల నచేతనములుగను మార్చునటుల మనోహరముగ వీణవాయించు నొకసుందరిని గంటిని.

క. నరరాజకన్యలును గి, న్నరరాజకుమారికలు ఫణాధర విద్యా
ధర వీణాధర శోణా, ధరలును నాతరుణిఁ బోల్పఁ దగరు నరేంద్రా. 31

నరరాజకన్యలును=మానవనాథులయిన రాజులయొక్క కొమార్తెలును, కిన్నరరాజకుమారికలు= కిన్నరశ్రేష్ఠులయొక్క కుమార్తెలును, ఫణాధర = పన్నగులయొక్కయు, విద్యాధర = విద్యాధరులనెడు దేవయోనులయొక్కయును, వీణాధర=వీణాగానప్రవీణలయిన, శోణాధరలును = అరుణాధరోష్ఠము గల స్త్రీలును, ఆతరుణిన్=ఆచిన్నదాని, పోల్పన్=పోలికసేయుటకు, తగరు = అర్హులుగారు, నరేంద్రా = వసుమహారాజా యని సంబోధనము.

తా. రాజేంద్రా! ఆచెలువ రూపరేఖావిలాసములందుఁ గిన్నరకాంతలను జిలువచెలువలను విద్యాధరరమణులను మించియున్నది.

తే. మేటిజమ్మేటియసటుఁ గ్రొమ్మించుమించుఁ, బోదివిమదనప్రతాపాగ్నిఁ బుటముపెట్టి
తమ్మిగద్దియదాకటఁ గ్రమ్మియట్టి, కొమ్మఁ గావింపఁబోలు నెత్తమ్మిచూలి. 32

మేటి=శ్రేష్ఠమైన, జమ్మేటి = జంబూనదియొక్క, అసటన్ = బురదచేత అనఁగా బంగారుపు బురదచేత, క్రొమ్మించు=క్రొత్తమెఱుపుయొక్క, మించు = కాంతిని, పొదివి = పొదిగినవాఁడై, మదన ప్రతాపాగ్నిన్=మన్మథునియొక్క ప్రతాపమనెడు అగ్నియందు, పుటముపెట్టి = పుటమువేసి, తమ్మి గద్దియ=తామరపువ్వులోనుండెడు మిద్దెయనెడు, దాకటన్=దాగలిమీఁద, గ్రమ్మి=కమ్మిసాగించి, తమ్మి చూలి=పద్మసంభవుఁడైన బ్రహ్మ, అట్టి=అటువంటి, కొమ్మఁగావింపఁబోలున్ = స్త్రీని నిర్మించఁబోలును. అనఁగా మొదటనే మెఱుపుతీఁగెయొక్క కాంతి యత్యంతప్రకాశమైనది. దాని బంగారుబురదలో పొదిగి పుటము వేయుటచే నతిశయకాంతి గలుగుటయును, దాని సువర్ణచ్ఛాయగల తామరమిద్దె మీఁద కమ్మిసాగించి చేయుటచేత ఆస్త్రీయొక్క దేహకాంతి మేలిమిబంగారు చాయకంటె నతిశ యించియున్న దనియు తాత్పర్యము. అలం. ఉత్ప్రేక్ష.

దేహకాంతియు సౌందర్యాతిశయముగల కాంతల మేనులు లోకోత్తరవస్తుసహాయమున నిర్మి తము లయ్యెనని కవు లుత్ప్రేక్షించుట యాయాతావుల తఱచుగాఁ గాననగును. ఇటులె-

సీ. గీ. నేరటేటియసల్ దెచ్చి నీరజాప్తు
సానఁబట్టిన తాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి జేసెనో పద్మభవుఁడు. మను.

సీ. వనితపాదములు ప్రవాళంబులై మించుఁ గటి యచలాభోగకలనఁ బొదలుఁ
బడఁతిగుబ్బలు మీఱుభద్రకుంభనిరూఢి వదన మబ్జఖ్యాతి వదల కొనరుఁ
గలికిచెక్కులు చంద్రఖండంబులై పొల్చుఁ గన్నులు రాజీవగణనఁ గాంచు
వెలఁదివేనలి నీలవిషధరంబై తోఁచుఁ దను వెల్ల కాంచనం బనఁగ నెసఁగుఁ
తే. బగడ మిగురాకు నిలచుట్టుపసఁటులు కరి
కుంభములు దమ్మినెలనెలకూనఁగపుర
మబ్జములు మీలు మొగులు కాలాహిపసిఁడి
సంపఁగులఁ గూర్చి నలువ నిర్మింపఁబోలు. 33

వనితపాదములు = స్త్రీలయొక్క పాదములు, ప్రవాళంబులై మించున్ = పగడములవంటివి యును, చిగురుటాకులవంటివియును నయి యతిశయించునని యర్థము. పగడములయందలి రక్తిమ యును చిగురుటాకులయందలి మార్దవమును గలిగియున్నవని భావము. ని. 'ప్రవాళో స్త్రీకిసలయే వీణాదణ్డే చ విద్రుమే' అని మేదిని. కటి = పిఱుఁదు, అచలాభోగకలనఁబొదలున్-అచల = భూమి యొక్కయు అచలపర్వతముయొక్కయు, ఆభోగ = పరిపూర్ణతయొక్క, కలనన్ = సంపత్తిచేత, పొదలున్ = ఒప్పునని యర్థము. భూమియొక్క విశాలత్వమును పర్వతముయొక్క యౌన్నత్యమును గలిగియున్నదని భావము. (ని. 'అచలా వసుధాయాం స్యా దచలః శైల కీలయోః' అని మేదిని.) పడఁతిగుబ్బలు=ఆచిన్నదానియొక్క గుబ్బచన్నులు, భద్రకుంభనిరూఢిన్ = భద్రకుంభసువర్ణకలశముల యొక్కయు భద్రగజ కుంభములయొక్కయు. నిరూఢిన్ = ప్రసిద్ధిని, మీఱున్ = అతిక్రమించునని యర్థము. సువర్ణకలశములయందలి కాంతియును భద్రగజకుంభములయందలి సమస్థితియును గలిగి యున్నవని భావము. వదనము = ఆస్త్రీయొక్క ముఖము, అబ్జఖ్యాతివదలకొనరున్-అబ్జ = కమలము

యొక్కయు చంద్రునియొక్కయు, ఖ్యాతిక్ = ప్రసిద్ధిని, వదలక=విడువక, ఒపరుక్ = ఒప్పు చుండును, అని యర్థము. కమలమందలి సౌందర్య పరిమళములును చంద్రునియందలి కాంతిప్రసన్నత లును గలిగియున్నదని భావము.

కలికిచెక్కులు = ఆస్త్రీయొక్క చెక్కిళ్లు, చంద్రఖండంబులై పొల్చుక్ = చంద్రశకలముల వంటివియును కర్పూరశకలములవంటివియును, అయి పొల్చుక్=ప్రకాశించునని యర్థము. చంద్ర శకలములయందలి నిగనిగమెఱయు కాంతియును, కర్పూరశకలములయందలి పరిమళస్నిగ్ధత్వములును గలిగియున్నవని భావము. (ని. 'చన్ద్రః కర్పూర కామ్పిల్ల సుధాంశు స్వర్ణ వారిషు' అని మేదిని.) కన్నులు=ఆస్త్రీయొక్క కన్నులు, రాజీవగణనఁ గాంచుక్-రాజీవ=కమలములయొక్కయు, బెళుకు చేఁపలయొక్కయు, గణనక్=ప్రఖ్యాతిని,ౕ కాంచుక్=పొందు నని యర్థము. కమలదళములయందలి విశాలత్వదైర్ఘ్యములును బెళుకుచేఁపలయందలి తళుకులును గలిగియున్నవని భావము. ని. 'రాజీవం నళినే నాతు భేదే హరిణమీనయోః' అని మేదిని. వేఁడి=ఆస్త్రీయొక్క, వేనలి=జడ, నీల=నల్లనైన, విషధరంబై తోఁచు=మేఘమువంటిదియు, కృష్ణసర్పమువంటిదియును అయి కనుపడునని యర్థము. మేఘమందలి నైల్యమును కృష్ణసర్పమందలి పొడవును ఆదోఁకయును గలిగియున్నదని భావము. (ని. 'విషాత్వతి విషాయాం స్త్రీ విషంతు గరళే జలే' అని నా.) తనువల్లిక్=ఆస్త్రీయొక్క శరీరమంతయును, కాంచనంబనఁగ నెసఁగుక్=బంగారమనునట్లుగాను, సంపఁగి యనునట్లుగాను నొప్పునని యర్థము. బంగారము వంటి పచ్చనికాంతియును సంపఁగిపువ్వుల పరిమళమువంటి పరిమళమును గలిగియున్నదని భావము. బంగారము పేళ్ళన్నియు సంపంగికిఁ బేళ్లగును.

కాఁబట్టి, పగడ మిగురాకును = పగడమును చిగురటాకును, ఇలచట్టు = భూమినిని పర్వత మును, పనఁటులు కరికుంభములుక్=కలశములను గజకుంభములను, తమ్మినెల=పద్మమును చంద్రునిని, నెలకూనఁగపురము=బాలచంద్రునిని కర్పూరమును, అబ్జములుమీలు=కమలములను బెళుకుచేఁపలను, మొగులుకాలాహి=మేఘమును కృష్ణసర్పమును, పసిఁడిసంపంగులక్ = బంగారమును సంపఁగిపుష్పములను, కూర్చి=జతచేసి, నలువ=బ్రహ్మదేవుఁడు, నిర్మింపఁబోలుక్=అనఁగా పైనిఁజెప్పఁబడిన పాదాద్యవ యవములను నిర్మాణము చేయఁబోలును. ఇందులో ప్రవాళాద్యుపమానపదములకును అర్థద్వయము బోధపడునట్లుగా నీగీతిలో గ్రంథకర్త తానే చెప్పినాఁడు. అలం. శ్లేషసంసృష్టోత్ప్రేక్ష.

తే. వదనవనజహృతాంశుస•ర్వస్వుఁ డగుచుఁ
గుందునిందుని దరహాస•కందళమున
మనుపు మని పాదముల వ్రాలి • చననివిధుని
కొమ్మ లన నింతిమృదునఖాం•కురము లమరు. 34

వదన=ముఖమనెడు, వనజ=పద్మముచేత, హృత=హరింపఁబడిన, అంశు = కిరణములనెడు, సర్వస్వుఁడగుచు=యావద్ధనము గలవాఁడై, కుందు=కృశించుచున్న, ఇందునిక్=చంద్రుని, ఇక్కడ పద్మములను జయించిన చంద్రునకు పద్మముచేతనే సర్వధనాపహారణమగుట యత్యంతదుఃఖకరమని తెలియవలయును. దరహాస=చిఱునవ్వుయొక్క, కందళమునక్ = అంకురముచేత, మనుపుమని=వృద్ధిఁ బొందించుమని. అనఁగా దరహాసము వెన్నెలవంటిది గనుక దీనిచేత అంశుహీనుఁడైన చంద్రునిఁ గాంతియుక్తునిఁగాఁ జేయుమని భావము. పాదముల వ్రాలి=కాళ్లమీఁదఁబడి, చనని=లేచిపోకయున్న,

విధునికొమ్మలనన్=చంద్రునికి భార్యలైన నక్షత్రములో యన్నట్లుగా, ఇంతి=ఆస్త్రీయొక్క, మృదు=కోమలములైన, నఖాంకురములు=మొలకలవంటిగోళ్లు, అమరున్=ఒప్పును. అనఁగా నాస్త్రీయొక్క ముఖము చంద్రుని జయించి పద్మముతో సమానమై యున్నదనియును, చిఱునవ్వు వెన్నెలవలె నున్నదనియును, పాదనఖములు నక్షత్రములవలె నున్నవనియును ఫలితార్థము. అలం. అతిశయోక్తి. ఉత్ప్రేక్ష.

కిరణవిభవము పూర్తిగఁ గోలుపోయిన చంద్రునినగవుచేఁ బునరుజ్జీవింపఁజేయుమనక చిఱునగవుచే నుజ్జీవింపఁజేయుమనక చిఱునగవు మొలకచే నుజ్జీవింపఁజేయుమనుటచే ముఖము చంద్రుని పెక్కురెట్లు మించియున్నదనుట. దీనిచే దరహాసధావళ్యాతిశయము సూచితము.

తా. ఆచెలువమోమును బోలఁజాలక చంద్రుఁడు తనకాంతిసమృద్ధిఁగోలుపోయినందుచుండ భర్తృపరిభవముఁగాంపలేక చంద్రునిభార్యలగు నక్షత్రములు చిఱునగవుమొలకచే నుజ్జీవింపఁజేసి పతిభిక్ష పెట్టుమని యాకాంతపాపములపై వ్రాలి లేవనటులఁ బాదనఖము లున్నవి.

ఉ. శ్రీమపదద్వయం బడుగుఁ ♦ బాయక కొల్చుసరోజరేఖలన్
శ్రీ మెఱయన్ భరించి మధు♦జృంభణచే మొనచూపుపల్లవ
స్తోమము సౌకుమార్యమును ♦ శోభయుఁ గైకొనఁబోలుఁ గానిచోఁ
గోమలతారుణత్వములు ♦ గోల్పడునే యవి నాఁడునాఁటికిన్. 35

భామపదద్వయంబు=ఆస్త్రీయొక్క పాదయుగళము, అడుగుఁబాయకకొల్చు=ఒకఅడిగెడైన నెడఁబాయక కొలువుసేయుచున్న, సరోజరేఖలన్=కమలపంక్తులను అనియర్థము. అడుగులయందుండెడు పద్మరేఖలనని భావము. శ్రీమెఱయన్ భరించి=సంపద ప్రకాశించునట్టుగా వహించి యనియర్థము. కాంతి ప్రకాశించునట్టుగా నని భావము. మధుజృంభణచేన్=మద్యపానమదాతిరేకముచేత, మొనచూపు=ప్రతిఘటించుచున్న, పల్లవస్తోమము=విటసమూహముయొక్క. సౌకుమార్యమును=సుకుమారత్వమును, శోభయున్=తేజస్సును, కైకొనఁబోలున్=హరించఁబోలును అనియర్థము. మధుజృంభణచేన్=మధుమాసవిజృంభణముచేత, మొనచూపు=పొడచూపుచున్న, పల్లవస్తోమము=చిగురుజొంపముయొక్క, సౌకుమార్యమును=మృదుత్వమును, శోభయున్=అరుణకాంతిని, కైకొనఁబోలు నని భావము. కానిచోన్=అలాగున హరించకపోయినట్లాయెనేని, అవి=ఆపల్లవములు, నాఁడునాఁటికిన్=నానాటికి, కోమలతా=మార్దవమును, అరుణత్వములు=రక్తిమను, కోల్పడునే=పోఁగొట్టుకొనునా యని యర్థము. చిగురుటాకులు నానాఁటికి ముదిరి కఱకుపాఱి పచ్చఁబడుచున్నవని భావము. అనఁగా ఆస్త్రీయొక్కపాదయుగళము తన్ననుసరించిన పదపంక్తులను ఆదరముచేత నంగీకరించి ప్రతిఘటించిన పల్లవస్తోమముయొక్క గర్వపరిహారము చేసె నని యాశయము. ఎఱ్ఱదామరలను బోలి చిగురుటాకులను దిరస్కరించి యత్యంతకోమలత్వారుణత్వములచేత నొప్పుచున్నదని ఫలితార్థము. భాగ్యముగల స్త్రీలయడుగులందుఁ బద్మరేఖ లుండును. ఇందులకు దృష్టాంతము-

శ్లో. చక్ర స్వస్తిక శంఖాబ్జ ధ్వజ మీనాతపత్త్రవత్
యస్యాః పాదతలే రేఖా సా భవేత్ క్షితిపాంగనా. (సాముద్రికశాస్త్రము)

అలం. శ్లేషమూలక హేతూత్ప్రేక్ష. సమాసోక్తి.

తా. ఆచెలువపాదములు పద్మరేఖలతోఁ దనరారి చివురుటాకులవంటి మెత్తఁదనము గలిగి కోమలతారుణత్వములతో మనోహరముగా నున్నవి.

తే. కలమగర్భహిరణ్యకాహళులు దొరయ
నీఁతలును స్రోఁతలును జూపి యెలమి మకర
లీల లోఁగొని దొనల శరాలి ముంచి
యబలమృదుజంఘికాప్రకాశౌఘ మడరు 36

అబల = ఆస్త్రీయొక్క, మృదుజంఘికా ప్రకాశౌఘము = ఓఘమనఁగా బృందంబును జల ప్రవాహంబును,(ని. 'ఓఘో వేగే జలస్యచ, బృన్దే పరంపరాయాం చ' అని మేదిని.) మృదు = కోమల మైన, జంఘికా = పిక్కలయొక్క, ప్రకాశౌఘము = ప్రకాశబృందమనెడు జలప్రవాహము, కలమ గర్భహిరణ్య కాహళులు దొరయన్ = కలమగర్భము లనఁగా పరిపొట్టలును హిరణ్యకాహళులనఁగా బంగారుబూరలును, అనఁగా తుతారాలును, దొరయన్ = సామ్యమునకు తారసించిరాఁగా, ఈఁత లును స్రోఁతలును జూచి = ఈఁదుటలును స్రోయుటలును గనుపఱచి, అనఁగా నీయవగుణములచేత సామ్యయోగ్యములు గాకపోవుటను దెలియఁజేసియని జంఘాపరమైన యర్థము. ఈఁదులాటలును ధ్వనిచేయుటలును గనుపఱచినదని ప్రవాహపరమయిన యర్థము. ఎలమిన్ = వేడుకచేత, లీలయ నఁగా విలాసంబును క్రియయును, మకరలీలన్ = మకరాకృతియొక్క విలాసమును, లోఁగొని = అప హరించి యని జంఘాపరమయిన యర్థము. మకరములయొక్క చేష్టను లోఁగాఁ జేసుకొన్నదని ప్రవాహపరమైన యర్థము. (ని. 'లీలా విలాస క్రియయోః' అని అమరము.) దొనలనఁగా అంప పొదులును బండలమీఁది జలాశయములును, శరమనఁగా బాణంబును ఉదకంబును, దొనలన్ = అంప పొదులను, శరాళిముంచి = బాణపరంపరలచేత ముంచి యని జంఘాపరమయిన యర్థము. అంప పొదులయందు బాణములు నిండియుండుట ప్రకటమేకదా. జాలిదొనలను జలసమూహములచేత నిండించినదని ప్రవాహపరమయిన యర్థము. అడరున్ = ప్రకాశించును. అనఁగా ఆస్త్రీయొక్క జంఘలు పరిపొట్టలను బంగారు కాహళములను మకరాకృతులను అంపపొదులను తిరస్కరించిన చక్కఁ దనముచేత నొప్పుచుండు నని భావము.

పరిపొట్టలు బంగారుసన్నాయిలు పిక్కలఁ బోలనెంచెదుగాన కలమగర్భముల కీఁతలుగలవు. ఇవి కాంతివిజృంభణమునకు వ్యతిరేకములు. కాహళుల స్రోఁత సోత్కర్షాసూచకము గావున నదియు దోషము. మకరలీల, దొనలు మున్నె లోఁగొనఁబడిన, శరాళి ముంచిగి, యంతరించినవికావనే జంఘా ప్రకాశము అభివృద్ధినొందుట తటస్థించెను. కలమగర్భములు కాహళులు జంఘలసొంపును బోలనెంచి దొరయుటచేఁ దదాకారచిహ్నములంగ నున్నవనియు మకరలీల దొనలు తమంతఁ బరాభవింపఁబడుటచే జంఘాసౌష్ఠవమున కవి యంతగా సామ్యములు గావని భావము.

అలం. శ్లిష్టరూపకము.

తా. ఆయింతిపిక్కలు పరిపొట్టలను, బంగారు సన్నాయిలను నమ్ములపొదులను మకరవైఖ రులను మించి మనోహరముగఁ బ్రకాశవంతముగా నున్నవి.

మ. సలిలయూరుద్యుతిఁ జెందఁ బూని నిజదుశ్చర్యాపనోదక్రియా
రతిఁ బాథోలవపూరితోదరములై రంభేభహస్తంబు లు

న్నతతుల్ వీడె మరుద్విభూతిఁ గదళి త్వగ్దోష మాచంచలో
ద్ధతశుండాతతిఁ బాయ దయ్యె నదె వో తద్వైరమూలం బిలన్. 37

సతి = ఆస్త్రీయొక్క, ఊరు = తొడలయొక్క, ద్యుతిన్ = శోభను, చెందఁబూని=పొందవలె నని యత్నము చేసి, నిజ = తనయొక్క, దుశ్చర్మ = దుష్టమైన చర్మముయొక్క, అనఁగా నిక్కడ అరఁటియందుండు చొదుమును గజతుండమందు కర్కశత్వంబును తెల్లపొడలును అని తెలియవలెను. అపనోదక్రియా = పోఁగొట్టుకొనెడు కార్యమందలి, రతిన్=ఆసక్తిచేత, అనఁగా తమయందు నీదోషము లుండుటచేత ఊరుసామ్యము సిద్ధించదుగనుక ముందుగా నీదోషములు పోఁగొట్టుకొనవలె నన్నయాసక్తిచేత ననిభావము. పాథః = ఉదకముయొక్క, లవ=లేశమాత్రముచేత, పూరిత=నిండింపఁబడిన, ఉదరములై=కడుపులు గలిగినవై, అనఁగా లోకమం దెవరైనను దోషనివృత్తికొఱకు మితాహారులై తపస్సు చేయవలసినది గనుక నివియు జలకణమాత్రప్రాశనముచేత నుదరపోషణము చేయుచున్నవై యనుట. అరఁటియందును గజతుండమందును నీరునిండియున్నదనిభావము. రంభా = అరఁటిచెట్టును, ఇభహస్తంబులు=గజతుండములును, ఉన్నతతుల్ = దీక్షచేసియుండఁగా, మరుద్విభూతిన్ = దేవతాసంపత్తిచేత ననియర్థము. వాయుసంపత్తిచేత ననిభావము. (ని. 'మరుతౌ పవనామరౌ' అని అమరము.) కదళిన్=అరఁటియందు, త్వగ్దోషము = అనఁగా దుశ్చర్మదోషము, వీడెన్ = వదలిపోయె నని యర్థము. గాలిగొట్టి పైచొదుము వీడిపోయెనని భావము. ఆచంచల = మొదటినుండి చాంచల్యగుణముగలిగిన, ఉద్ధత=ఎగురుపాటుగలిగిన, శుండాతతిన్=గజతుండసమూహమందు, పాయదయ్యెన్= ఆదుశ్చర్మదోషము వదలిపోదాయె నని యర్థము. ఏనుఁగులయొక్క తుండములయందు చపలగుణంబును, పైకియెత్తఁబడుచుండుటయును గలిగియుండుట ప్రకటమేకదా. ఇలన్ = భూమియందు, తద్వైరమూలంబు=ఆయరఁటిచెట్లకును గజతుండములకు నుండెడు విరోధమునకు హేతువు. అదెవో=అదేసుమా. అనఁగా కదళీ గజహస్తములుగూడ తపస్సు చేసినందులకు అరఁటులయందలి త్వగ్దోషము నివారణమై తమయందలి త్వగ్దోషము నివారణము కాకపోయెనుగనుక వాయీర్ష్యచేత గజతుండములు అరంట్లను పెల్లగించి వేయుచున్న వని యాశయము. ఏనుఁగులు అరఁటిచెట్లను బెల్లగించి తినుట ప్రకటమేగదా. అనఁగా నాస్త్రీయొక్క తొడలు అరఁటిబోదెలవలె నునుపుగలిగి గజతుండమువలె ఆఁదోఁక గలిగియున్నవని ఫలితార్థము.

మరుద్విభూతి యన దేవతానుగ్రహముగావున దైవశక్తియే విజయకారణమైనది. తపశ్చర్యకై జలపానము రంభాస్తంభము కరికరము గావించినను మరుద్విభూతి కరికరమునకుఁ ద్వగ్దోషము వారింపలేదయ్యెను. అదియు దైవదుర్నివారముగ నుండెననుట. చంచలము, ఉద్ధతి యీరెండు తపశ్చర్యకు వ్యతిరేకము గావున నీదుర్గుణము మాననంతవఱకుఁ గరికరము త్వగ్దోషము తొలఁగించుకొనఁజాలదు. చంచలతకుఁ గారణము తపోనిశ్చలత లేమి, ఉద్ధతికిఁ గారణ మాత్మలోపము గమనింపక కదళితోఁ బోరాడుట.

అలం. హేతూత్ప్రేక్ష. కావ్యలింగము. అతిశయోక్తి.

తా. ఆయమయూరువులు పైనితొడుపు లూడిన యరఁటిబోదెలవలె నున్నవి. ఏనుఁగుతుండములనుగూడఁ గొంతవఱకుఁ బోలియున్నవిగాని వానియందుఁ జంచలత యుద్ధతి యుంటచే సరిపడ

కున్నవి. అరఁటియూరువులఁబోలెను నేను బోలనైతినను మచ్చరముతో నేనుఁగులు కదళీకాండము లను ద్వేషించుచున్నవి.

చ. అతివనితంబబింబ మఖి • లావనిభాగము నేలి దీవు లం
చితరుచి నాక్రమించి యరి • జృంభణవారణధుర్య మై సువృ
త్తతఁ బరిపూర్ణరాజరమఁ • దాల్చి కదా గజమస్తకోపరి
స్థిత మయి కాంచెఁ గాంచిగుణ • దీపిత కాంచనపట్టబంధమున్. 38

అతివ = ఆ స్త్రీయొక్క, నితంబబింబము = కటిమండలము, అఖిలావనిభాగము నేలి = సమస్త భూవిస్తారమును లోకువపఱచుకొని యనియును సర్వభూభాగమును పాలించియనియును అర్థము. దీవులు = ద్వీపములను, అంచితరుచిన్ = రుచియనఁగా సౌందర్యమును స్పృహయును, ఒప్పుచున్న సౌందర్యముచేతను, ఆక్రమించి = తిరస్కరించి యనియును, సప్తద్వీపములను ఒప్పుచున్న స్పృహ చేత నాక్రమించియనియును అర్థము. అరియనఁగా రథచక్రంబును శత్రుఁడును, అరి = రథ చక్రముయొక్క, జృంభణ = గర్వసమృద్ధియొక్క, వారణ = పోఁగొట్టుటయందు, ధుర్యమై = సమర్థ మైనదై యనియును, అరి = శత్రువులయొక్క, గర్వవారణమందు సమర్థమైనదనియును అర్థము. సువృ త్తతన్ = యోగ్యమైన వర్తులత్వముచేత, పరిపూర్ణరాజరమన్ = సంపూర్ణచంద్రమండలసంపదను, తాల్చికదా = వహించియేకదా యనియును, సువృత్తతన్ = సత్ప్రవర్తనముచేత, పరిపూర్ణరాజరమన్ =సంపూర్ణరాజలక్ష్మిని, తాల్చికదా = వహించియేకదా యనియును అర్థము. గజమస్తకోపరిస్థితమై = గజకుంభముల నధఃకరించినదై యనియును గజస్కంధముపై నెక్కినదై యనియును అర్థము. కాంచి గుణ=బంగారు మొలనూలనెడు, దీపిత = ప్రకాశించుచున్న, కాంచన = సువర్ణమయమైన, పట్ట = రాజ్యాభిషేక సమయమందు నొసటఁ గట్టఁబడెడు పట్టికయొక్క, బంధమున్ = కట్టుటను, కాంచెన్ = పొందినదాయెను. అనఁగా నాస్త్రీయొక్క కటిప్రదేశము భూవిస్తారమునకంటె విశాలమైనదనియు, ద్వీపములకంటె నత్యున్నతమైనదనియు, రథచక్రముకంటె చక్కనైనదనియు, సంపూర్ణచంద్రమండల మునకంటె వర్తులమైనదనియు, గజకుంభములకంటె సమస్థితి గలిగినదనియుఁ, ఉపరిభాగమందు బంగారుమొలనూలుగలిగి యొప్పుచున్నదనియు భావము.

బింబమనుటవలన నితంబము చక్రాకారముగనున్నదనియు అఖిలావనిభాగము లేలెననుటవలన విశాలముగనున్నదనియు రథచక్రాకారముగ నుంటవలననే రాజరమ నొందెననియు పట్టపుటేనుంగు నెక్కి కాంచనపట్టబంధము నలంకరించుకొనఁగలిగె ననుటవలనఁ గరికుంభసమాకారముగఁ గాంచీసమ లంకృతముగా నుండెననియు భావము.

అలంకారము సమాసోక్తిరూపకము.

తా. ఆచెలువనితంబమండలము విశాలమై చక్రాకారముగలదై కరికుంభములవలె సమత గలిగి కాంచీసమలంకృతమై దర్శనీయముగ నున్నది.

చ. కలికిముఖేందుకాంతికర • కాంతపయోజలదాంతవేళ వ
ర్తులకుచగండశైలములు • దోఁప వళిత్రయశోషరేఖ లిం
పలరఁగ మధ్యసీమ బయ • లై కటిసైకత మొప్ప బాల్య మ
న్బలునది యింకుచో మెఱసె • నాభిగభీరజలాశయం బనన్. 39

కలికి = ఆస్త్రీయొక్క, ముఖేందు = మొగమనెడు చంద్రునకు, కాంతికర = లావణ్యమనెడు ప్రకాశమును జేయునట్టి, కాంత = మనోహరమైన, వయః = యౌవనమనెడు, జలదాంతవేళన్ = శరదాగమసమయమందు, వర్తుల = వట్రువలైన, కుచ = స్తనములనెడు, గండశైలములు = పెద్దఱాతి గుండ్లు, తోఁపన్ = కానవచ్చునట్లుగాను, వళిత్రయ = మూఁడైన కడుపుమీఁది ముడుతలనెడు, శోషరేఖలు = నీళ్ళు ఎండిపోవుటవలన నేరుపడునట్టి యిసుకరేఖలు, ఇంపలరఁగన్ = చక్కనై కనుపించునట్లుగాను, మధ్యసీమ బయలై = నడు మతిసూక్ష్మమై యని స్త్రీపరమైనయర్థము. మధ్యప్రదేశము ప్రవాహరహితమైయని నదీపరమైనయర్థము, కటి = పిఱుఁదనెడు, సైకతము = ఇసుకతిన్నె, ఒప్పన్ = ఒప్పునట్టుగాను, బాల్యమను = బాల్యప్రాయ మనెడు, బలునది = గొప్పయేఱు, ఇంకు చోన్ = ఎండిపోవుచుండఁగా, నాభి = బొక్కిలి, గభీర = లోఁతైన, జలాశయంబునన్ = మడుఁగోయన్నట్లుగా, మెఱసెన్ = ప్రకాశించెను. అనఁగా ఆవనితయొక్క బాల్యప్రాయము గడిచిపోయి యౌవన ప్రాయమురాఁగానె ముఖకాంతి యతిశయించె ననియు కుచము లున్నతములై కనుపించె ననియును, వళు లేర్పడియె ననియు, నడుము మిక్కిలి సన్నగించె ననియును, పిఱుఁదు గొప్పదాయె ననియును, నాభి లోఁతుగా నుండె ననియును దాత్పర్యము. ఇట్లు చెప్పుటచేత ఆ స్త్రీ యౌవనవంతురాలని సూచన చేయఁబడుచున్నది. ఈ పద్యములో ప్రకృతాప్రకృతములైన యౌవనశరదాగమములయందు వస్తుప్రకాశనము యథాక్రమముచేతఁ జెప్పినాఁడు.

వయోజలదాంతవేళ యనుటవలన జవ్వనము శరత్కాలమువలె దర్శనీయముగ హృదయానందకరముగ నుండెననుట. వయస్సు నెమ్మొగమునకుఁ గాంతిగలిగించును. కాననే ముఖేందుకాంతికర మని చెప్పఁబడెను. శరత్కాలమున నదు లింకినటుల వయోవశమున బాల్యచిహ్నము లంతరించి పోలంతి పోలుపము మనోజ్ఞముగనుండి గుబ్బలవ్రేఁగు, త్రివళులు, మధ్యకార్శ్యము కటిపటుత్వము బొక్కిలి పోలుపు కనవచ్చెను.

అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

తా. బాల్యమనునది యింక జవ్వనమను శరదృతు వాచెలువ నావరించెను. కాననే ముఖచంద్రుఁడు ప్రకాశవంతముగను, కుచగండశైలములు పటువుగను, మధ్యసీమ బయలుగను, కటి సైకతమువలెను, నాభి జలాశయమువలెను నుండెను.

చ. అలికులవేణియారు నవ॥యౌవన మన్వలరాచతోఁటలోఁ
బొలుచునితంబవేదికడఁ ॥ బొక్కిలిడిగ్గియచెంత నీలసం
కలితనవాంబుయంత్ర మగుఁ ॥ గానియెడన్ రసగుంభనంబు సం
ధిలఁ బుట ముబ్బునే నడుమ ॥ నిల్చి ఘనస్తనసూనగుచ్ఛముల్. 40

అలికులవేణి = తుమ్మెదగుంపువంటి జడగల యాస్త్రీయొక్క, ఆరు = నూఁగారు, నవయౌవనమన్ = నూతనతారుణ్య మనెడు, వలరాచతోఁటలోన్ = మన్మథోద్యానమందు, పొలుచు = ప్రకాశించునట్టి, నితంబవేదికడన్ = పిఱుఁదనెడు అరుగుదగ్గరను, బొక్కిలి డిగ్గియచెంతన్ = నాభి యనెడు బొడ్డునబావి సమీపమం దుండునట్టి, నీలసంకలిత = ఇంద్రనీలములతోడఁ గూడుకొనిన, నవ = నూతనమైన, అంబుయంత్ర మగున్ = నీళ్ళుపాఱెడు దోనెపెట్టె యవును. డిగ్గియ అనెడు పదము దీర్ఘి

కాశబ్దమునకు తద్భవము. కానియెడన్ = అదిగాకపోయినపక్షమందు, రస = శృంగారరసమనెడు జలధారయొక్క, గుంభనంబు = కూర్పు, సంధిలన్ = ఘటనపడుచుండఁగా, ఘనస్తన సూనగుచ్ఛముల్ = గొప్పలైనకుచములనెడు పువ్వుగుత్తులు, నడుమనిల్చి = మధ్యభాగమందు నిలుచఁబడి, పుటముబ్బునే = పైకినుబుకునా, అనఁగా, ఉబకకయేపోవుననుట.

ఆస్త్రీయొక్క యౌవనము మన్మథోద్యానమువలె సర్వజనమనోరంజకమయి యున్నదనియు, పిఱుఁదు అరుగువలె నున్నదనియు, నాభి బొడ్డనబావివలె నున్నదనియు, నూఁగారు నీలమణులు చెక్కిన జలయంత్రమువలె నున్నదనియు, కుచములు పువ్వుగుత్తులవలె నున్నవనియు భావము.

అలం. రూపకము.

స్తనములు ఘనగుచ్ఛములుగాఁ జెప్పఁబడుటవలన ఉబ్బునిబ్బరము సూచితము. యౌవనము మన్మథోద్యాన మనుటవలన నుపభోగార్హ్యముగ నుండెననియు, నితంబవేది యనుటవలన విరివియు నున్నతిగొని యుండెననియుఁ బొక్కిలిడిగ్గియ యనుటవలన లోఁతుగనుండెననియు నూఁగారు నీలములు దాపిన జలయంత్ర మనుటవలన నలుపుచేఁ బొలుపారియున్నదనియుఁ దెలియును. మన్మథునియుద్యానమునఁ గల ప్రసూనగుచ్ఛములు రసగుంభనముగ నుండెననుట సెలఁతచనుఁగవ శృంగారభావముల నభివృద్ధిఁ జేయుచు ద్రష్టవ్యములుగ నుండెననుట. మన్మథునకుఁ బొలఁతులచనుఁగవలే రసోదయస్థానములు కావుననే యట రసగుంభనోదయము చెప్పఁబడినది. ఇటులే భర్తృహరి-

శ్లో. కామినీకాయకాంతారే కుచపర్వతదుర్గమే
మాసంచరమనఃపాంథ తత్రాస్తే స్మరతస్కరః.

మ. ఘననాభీగుహచెంత నారుపొగ లేఁగౌ నాని తా నాయనం
గుని మెప్పించి తదాత్మతం బొరయఁ గన్గోఁ జాల కుజ్జృంభిత
స్తనయుగ్మం బతనుత్వ మొందె నధరోష్ఠం బిక్షుధర్మస్థితిం
దనరెం గన్నులు శంబరాహితగతిం దాల్చెం బయోజాస్యకున్. 41

పయోజాస్యకున్ = పద్మమువంటి ముఖముగల యాస్త్రీకి విచారింపఁగా, ఘన=శ్రేష్ఠమైన, నాభీ=పొక్కిలియనెడు, గుహా=బిలముయొక్క, చెంతన్=సమీపమందు, లేఁగౌను = సూక్ష్మమైన నడుము, ఆరుపొగ=నూఁగారనెడు ధూమమును, ఆని=పానముచేసి, అనఁగా ఉగ్రతపస్సుచేసి, తాను= ఆనడుము, ఆయనంగుని మెప్పించి=శరీరవిహీనుఁడైన యామన్మథుని సంతోషింపఁజేసి, తదాత్మతం బొరయన్=అనఁగా తాదాత్మ్యమును బొందఁగా, అనఁగా మన్మథసాయుజ్యమును బొందఁగానని యర్థము. అదృశ్యత్వమును బొందఁగాననిభావము. కన్గోఁజాలక=ఈమేలుచూచి సహింపలేక, ఉజ్జృంభిత=విఱ్ఱవీగుచున్న, స్తనయుగ్మంబు=కుచద్వయము, అతనుత్వమొందెన్=అతనుఁడనఁగా మన్మథుఁడు, మన్మథసాయుజ్యమును బొందెనని యర్థము. ఆధిక్యమును పొందెనని భావము, అధరోష్ఠంబు=మోవి, ఇక్షుధర్మస్థితిందనరెన్=ధర్మమనఁగా విల్లును గుణంబును, చెఱకుతుంటే విల్లుగాఁగల మన్మథునిసాయుజ్యమును బొందెనని యర్థము. ఇక్షువుయొక్కధర్మము మాధుర్యము గనుక మాధుర్యస్థితిచేత నొప్పెననిభావము. కన్నులు=నేత్రములు, శంబరాహితగతిందాల్చెన్=శంబరుఁడనఁగా శంబరాసురుఁడు, శంబరమనఁగా లేడియును, శంబరాసురునకహితుఁడైన మన్మథునియొక్క సాయుజ్యమును బొందె

నని యర్థము. లేడికన్నులను దిరస్కరించినవిధము వహించెనని భావము. (ని. 'శంబరం సలిలే పుంసి మృగ దైత్య విశేషయోః' అని విశ్వము.) అనఁగా ఆస్త్రీయొక్కనాభి గుహవలె నున్నదనియు, నడుము కానరాకయున్నదనియు, నూఁగారు నల్లఁగా ధూమరేఖవలె నున్నదనియు, స్తనయుగళము గొప్పదై యున్నదనియు, పెదవి మధురమై యున్నదనియు, కన్నులు లేడికన్నులఁ దిరస్కరించు చున్న వనియు భావము.

కొనుననుచో కోయను నాదేశము పూర్వకవుల పద్యములందుఁ జూపట్టుచున్నది. తపశ్చర్య గావించువారు ధూమపానము గావించుటయు సుప్రసిద్ధము. ఇందులకుఁ బ్రయోగము.

శ్లో. అథ ధూమాభితామ్రాక్షం వృక్షశాఖావలంబినం
దదర్శకశ్చి ద్దైక్ష్వాక స్తపస్య న్త మధోముఖం
పృష్టనామాన్వయో రాజ్ఞా స కిలాచష్ట ధూమపః
ఆత్మానంశంబుకంనామ శూద్రం సుర పదార్థినం

(రఘువంశము. దశమస్సర్గము.)

అలం. ఉత్ప్రేక్ష. శ్లేషానుప్రాణితపర్యాయోక్తి. సమాసోక్తి.

తా. ఆచెలువ లేఁగౌను నారుకౌఁగ నాని యనంగుని మెప్పించి యనంగత్వము (శూన్య భావము) నొందఁజూచి యోర్వలేక చనులుగూడ నటులె యతనుత్వమును (మన్మథరూపమును పటుత్వ మును) నొందెను. పెదవి యిక్షుధరస్థితి (చెఱకువిలుకానితనము చెఱకురసమువంటి తీయఁదనము) నొందెను. కనులు శంబరాహితత్వము (లేడికన్నులఁ దిరస్కరించుట. మన్మథత్వము) నొందెను. ఆత న్వంగి యంగకములు మన్మథపూర్ణములై యున్నవి

సీ. క్షణవిలాసమె కాని • గజనిమ్మపండులు సరియె దుర్గాధివా•సమున మనినఁ
బైపూఁతరుచి గాక • ప్రతియె కిన్నరకాయ లరిది మేరువు తల•యంపి నిడినఁ
బ్రొద్దువన్నెలె కాని • యుద్దియే తమ్మిమొగ్గలు చక్రములఁ గూడి•దళముకొనినఁ
గాఁకచాయలె కాక • కనకకుంభము లీడె శ్రీకరులశిరోగ్ర•సీమ నున్న
తే. మిళితఘనసారమై నున్ను•మిగిలికదిసి, యంతరము సూత్రమున కీక•యలరిజోడు
వదల కఠితరసప్రౌఢిఁ బొదలి మెఱయు, నన్నుతలమిన్నవలగుబ్బ•చన్నుఁగవకు.

ఈపద్యమున గిరికాదేవియొక్క కుచవర్ణనముఁ జెప్పినాఁడు. ఏలాగనిన, గజనిమ్మపండులు=గజనిమ్మపండ్లు, క్షణవిలాసమెకాని = నిమిషమాత్రపుశృంగారమేకాని, దుర్గాధివాసమునమనినన్ = అనఁగా దుర్గమందలి ఉనికిచేత వర్తించినప్పటికిని అనియర్థము. పర్వతసహవాసము గలిగియున్నప్పటి కిని అనిభావము. సరియె=సమానమా నా? అనఁగా కావనుట. కిన్నరకాయలు=కిన్నరయనెడు వీణెకు వేసెడు గుబ్బకాయలు, పైపూఁతరుచిగాక=పైనబూసినపూఁతరంగేకాక, అరిది=ఆశ్చర్యకరమయిన, మేరువుతలయంపినిడినన్=బంగారుకొండ తలక్రింద నుంచుకొన్నప్పటికిని అని యర్థము. మేరువు ప్రాసతోఁగూడుకొన్నప్పటికిని అనిభావము. ప్రతియె=ఈడౌనా? అనఁగా కావనుట. తమ్మిమొగ్గలు=తామరమొగ్గలు, ప్రొద్దువన్నెలెకాని=వేళవేళగుణములేకాని యనియర్థము. సూర్యునిచేతనైన వికాసములనిభావము. చక్రములఁగూడిదళముకొనినన్=సేనతోఁగూడిబలువుపాటీనప్పటికిని అని యర్థము.

(ని. 'చక్రం చానీక మస్త్రియాం' అని అమరము.) చక్రవాకములతోఁగూడి యున్నప్పటికిని అని భావము. ఉద్దియే=జతయా నా? అనఁగా జతగావనుట. కనకకుంభములు = బంగారుకలశములు, కాఁక చాయలెకాక = కాఁకలవలనవచ్చిన వన్నెలేకాక, శ్రీకరులనఁగా సంపద హస్తమందుఁగలవారు అనఁగా భాగ్యవంతులు-వారియొక్క, శిరోగ్రసీమనున్నన్ = తలమీఁదఁ గూర్చున్నప్పటికిని అని యర్థము. శ్రీ=లక్ష్మీదేవిని స్నానముచేయించునట్టి, కరుల = దివ్యగజములయొక్క, శిరోగ్రసీమనున్నన్ = కుంభములతోఁగూడుకొన్నప్పటికిని అనిభావము. ఈడె = ఈడా నా? అనఁగా కావనుట. ('లక్ష్మీ ర్దిక్షైర్గజేంద్రైర్మణిగణఖచితై స్స్నాపితా హేమకుంభైః' అని ప్రయోగము.)

ఈనాల్గుచరణములయందును జెప్పఁబడిన గజనిమ్మపండు పర్వతములును, కిన్నరకాయలును, వాని మేరువును, తామరమొగ్గలును, చక్రవాకములును, సువర్ణకలశములును, గజకుంభములును ఈ యెని మిదియు ఉపమానములయందుండెడు లోపములచేత నివి సమానములు కావని చెప్పఁబడినవి. వేనికనినఁ జెప్పుచున్నాఁడు. మిళిత=కూడికొనఁబడిన, ఘన = అధికమైన, సారమై = చేవగలదై యనియర్థము. కర్పూరముతోఁగూడినదని భావము. గజనిమ్మపండ్లయితే క్షణమాత్రవిలాసములు గనుక నల్పసారములనుట. ఇక్కడ కుచద్వంద్వమునకు కర్పూరానుకూల్యమును నిమ్మపండ్లకు కర్పూరప్రాతికూల్యమును గనుక నీరీతిగ వ్యతిరేకమును జెప్పవచ్చును. 'కర్పూరప్రతికూలతా యది నచేత్త్వయ్యేవ సర్వే గుణాః' అని జంబీరఫలమునుగూర్చి చెప్పినాఁడు. నున్నమిగిలి = నున్నఁదనముచేత నతిశయించి యని యర్థము. పర్వతములయితే బర్బరములనుట. కదిసి = కదియఁబడి యని యర్థము, కిన్నరకాయలయితే యెడముగా నున్నవనుట. అంతరము సూత్రమునకీక = దారముదూరెడుమాత్రమైనను సందులేక యని యర్థము. మేరువుపూస అయితే దారముచేత గ్రుచ్చఁబడుచున్నదనుట. అలరి=ఉల్లసించి అనియర్థము. తామరమొగ్గలైతే వికాసమును బొందవనుట. జోడువవలక = జోడెడఁబాయక యనియర్థము. చక్రవాకములైతే సాయంకాలముకాఁగానే జోడెడఁబాయుచున్నవనుట. అమితరసప్రౌఢిఁబొదలి = మితములేని శృంగారరసప్రౌఢిమచేత నొప్పుచుండి యనియర్థము. సువర్ణకలశములైతే మితరసప్రౌఢిమచేత నొప్పుననుట, మితజలపూర్ణము లనిభావము. మెఱయు=ప్రకాశించునట్టి యని యర్థము. గజకుంభములైతే ప్రకాశించవనుట. అన్నుతలమిన్న = కాంతాశిరోమణియైన యాస్త్రీయొక్క, వలి = చల్లని, గుబ్బ = గుబ్బలవలెనుండెడు, చన్నుఁగవకున్ = స్తనద్వయమునకు, అని సంబంధము.

గజనిమ్మపండ్లు దుర్గములను, కిన్నరకాయలు మేరువులను, తమ్మిమొగ్గలు చక్రములను, కనకకుంభములు శ్రీకరులకుంభములను దోడ్పుఱచికొనినను పొలఁతిగుబ్బలఁ బోలఁజాలకున్నవి. దుర్గాధివాసము, మేరువుతలయంపి, చక్రములచెలిమి, శ్రీకరులశిరోగ్రసీమ సహాయసంపత్తిగల తత్తదుపమానవస్తువులె పరాభూతములగుట స్తనయుగళ సౌందర్యాతిశయమునకు ననుపమేయతకు దృష్టాంతములు అలంకారము, వ్యతిరేకము. కావ్యలింగమును. *స్తనములటాయిడి ద్రవ్యము సుఖము నొసగూర్చి పతిని సుఖపెట్టునుగాన నీ వాకాంతను బరిగ్రహించిన నన్వర్థవసునామధేయుఁడ వగుదువని సారస్యము. స్తనములకుఁగలవృత్తత్వము, ఘనత్వము, అవిషమత్వము, కఠినత్వము అర్థసుఖావహ మనుటకుఁ బ్రయోగము-(బృహత్సంహితనుండి)

శ్లో. మధ్యం స్త్రియా స్త్రివళి సార్థమలోమశంచ
వృత్తౌ ఘనా వవిషమా కఠినా వురస్యౌ

రోమావపఙ్క్తిత ముదో మృదు చాంగనానాం
గ్రీవాచకంబు నిచితార్థ సుఖానిధత్తే.

చనుగవ సూత్రావకాశమేని లేక హత్తుకొనియుంట యుపభోగార్హము సుఖదాయకమును. కావుననే రసప్రౌఢి పొసరి మన్మథోజ్జీవకములుగా నుండెననుట. ఇటులె కుమారసంభవమునఁ గాళిదాసుఁడు గౌరీస్తనములను వర్ణించెను.

శ్లో. అన్యోన్య ముత్పీడయ దుత్పలాక్ష్యాః స్తనద్వయం పాండు తథా ప్రవృద్ధం
మధ్యే యథా శ్యామముఖస్య తస్య మృణాళసూత్రాంతర మప్యలభ్యం.

తా. ఆబాలంతిచనుగవ గజనిమ్మపండ్లను దుర్గములను మించి ఘనసారవంతముగను, కిన్నర కాయలను మేరువులను మించి నునుపుగను, తమ్మిమొగ్గలను చక్రవాకములను మించి యంతరము లేనట్లుగను, కనకకుంభములను కరికుంభములను మించి జోడు వదలకయు మనోహరముగా నున్నవి.

చ. సతిహృదయాలవాలమునఁ • జవ్వనపుం బెనుకాఁకఁ జేసి య
య్యతనుఁడు గుబ్బపొంబనఁటు•లా రనులోహశలాక నెత్తి యూ
ర్జితరుచి నింపఁగాఁ దుదలఁ • జెందినరాపొడి బాహుమూలజ
ద్యుతి యగుఁ గానిచో నచట • దోర్మయభర్మలత ల్జనించునే. 43

సతి=ఆస్త్రీయొక్క, హృదయ = వక్షస్థలమనెడు, ఆలవాలమునన్ = కుదుటియందు, జవ్వనపుం బెనుకాఁకఁ జేసి = యౌవనమనెడు పెద్దకాఁకచేత నిర్మించి, అయ్యతనుఁడు=ఆమన్మథుఁడనెడు అగసాలెవాఁడు, ఇక్కడ ఏకదేశవర్తిరూపకము, ఇందుకు లక్షణము. క. 'అవయవియు నవయవంబును, వివరింప సమస్తవస్తువిషయంబులలో, నవయవి యవయవగమ్యం, బవునది యేకతలవర్తి యగు నెట్లన్నన్.' అని. గుబ్బ = స్తనములనెడు, పొంబనఁటులు=బంగారుకలశములు, ఆరను=నూఁగారనెడు, లోహశలాక నెత్తి=ఇనుపకడ్డిచేత నెత్తిపట్టి, ఊర్జితరుచినింపఁగాన్ = ఉచితమైన మెఱుఁగువచ్చునట్లు సానఁబట్టఁగాను, తుదలఁజెందినరాపొడి = ఆకుచములనెడు బంగారు కలశములయొక్క చివరలయందు రాలినరజమే, బాహుమూలజ = భుజముల మొదటఁబుట్టిన, ద్యుతియగున్ = కాంతియైయుండును. కానిచోన్=అట్లు కాకపోయిన ట్లాయెనేని, అచట=ఆబాహుమూలప్రదేశములయందు, దోర్మయ= బాహురూపములయిన, భర్మలతల్=బంగారుతీఁగెలు, జనించునే=సంభవించునా, అనఁగా బంగారపుభూమి గనుకనే బంగారుతీఁగెలు పుట్టినవనుట. కారణానుగుణములుగా కార్యములు పుట్టుట ప్రసిద్ధమేకదా.

గుబ్బలు సువర్ణకుంభము లనుటచే వట్రువయుఁ గాంతియుఁ గలిగి సమము ప్రేగుగలిగి యున్న వనియు రాపొడి తుదలఁ జెందెననుటచేఁ గుంభములు మెఱుంగుగనుంటకై సానబెట్టఁబడినవనియుఁ గాననే బాహుమూలకాంతి రాపొడివలె నున్నదనియు భావము. దోర్మయమువలె బాహువుల కుత్పత్తిస్థానములుగావున నట బాహులతలు జనించుటకు బంగారుదుమ్ము విరివిగఁ జల్లఁబడినది. కాన నందు సువర్ణలతలు బాహురూపముగఁ జనించినవనుటచే హస్తములు లతలవలె నుంటచే సువర్ణకాంతుల వెదజల్లుచున్నవని భావము.

అలం, రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

తా. మన్మథుఁడను నగసాలి హృదయమను కుంపటిపైకి ఆరసుకడ్డీతోఁ జనులను బంగారు కుండలనెత్తి మెఱుఁగునకై పైనిజల్లిన సువర్ణరజమువలె బాహుమూలకాంతులును, అందుండి జనించిన బంగారుతీఁగలవలె భుజలతలు తనరార నాకాంత దర్శనీయముగ నున్నది.

చ. విలసితమౌక్తికంబులు సవిభ్రమరేఖలు నున్కి సాటి రాఁ
దలఁచి మహోద్ధతిన్ మొరసి తన్మృదునాదవిలాసకౌశలం
బలవడమిన్ మునింగి దర మై తనలో వివరం బెఱింగి యా
వలమురి డాఁ బ్రదక్షిణము వచ్చెనొ యాసతికంఠలక్ష్మికిన్. 44

విలసిత=మిక్కిలి ప్రకాశించుచున్న, మౌక్తికంబులు=ముత్యాల పేరులును, సవిభ్రమరేఖలు = విభ్రమశబ్దము భ్రాంతియందును విలాసమందును వర్తించుచున్నది. (వి. 'విభ్రమో భ్రాన్తి హావయోః' అని అమరము.) విలాసయుక్తమైన రేఖాత్రయమును అని కంఠపరమైన యర్థము.

శ్లో. 'లలాటే చ గళే చైవ మధ్యే చైవ వళిత్రయం,
స్త్రీపుంసయో రిదం జ్ఞేయం మహాభాగ్యైకసూచకం.' అని సాముద్రికశాస్త్రము.

ముత్యములును తిరుగుడుగల రేఖలును అని శంఖపరమైనయర్థము. ఉన్కిన్ = ఉన్నందువలన, అనఁగా విలసితమౌక్తికంబులు సవిభ్రమరేఖలును కంఠమందును శంఖమందును సాధారణముగా నున్నందున నని యర్థము. ఆవలమురి = శంఖము, సాటిరాఁ దలఁచి = ఆస్త్రీకంఠముతో సామ్యమును బొందఁదలఁచినదై, మహోద్ధతిన్మొఱసి=మహత్తరమైన యొగుపుచేత ధ్వనిచేసి, తత్ = ఆకంఠసంబంధమైన, మృదు=శ్రావ్యమైన, నాద=స్వరముయొక్క, విలాస=సౌష్ఠవమునందలి, కౌశలంబు = నైపుణ్యము, అలవడమిన్=లభించకపోవుటచేత, మునింగి=సంకోచమును బొంది యని యర్థము. నీళ్ళలో మునిఁగిన దని భావము. దరమై=భయమైయని యర్థము. దరమనెడి పేరుగలది యని భావము. తనలోవివరం బెఱింగి = తనలోనుండెడు యాపద్వృత్తాంతమును తెలిసికొని యని యర్థము. రంధ్రము గలిగినదని భావము. ఆసతి = ఆస్త్రీయొక్క, కంఠలక్ష్మికిన్ = గళసౌందర్యలక్ష్మికి, డాన్ = తాను, ప్రదక్షిణము వచ్చెనో = అపరాధక్షమార్థము ప్రదక్షిణము చేసినది కాఁబోలును, ఇక్కడ శంఖగత దక్షిణావర్తత్వమును ప్రదక్షిణాగమనముగా నుత్ప్రేక్షించినాఁడు. శంఖమునందు సతీకంఠమునుబోలఁదగిన పోలికలొకటిరెండున్నను మృదునాదకౌశలము లేదు. మహోద్ధతిన్ మొరయుఁటగలదు. కావున సామ్యమున కవకాశము లేకపోయెను. వలమురియను శబ్దమునకుఁ బూర్వరూపముకై వలపురియనియు గనఁగా కుడి నుండి మెలికలు గలదనియుఁ గ్రమముగా నుచ్చరించుటలో వలమురియను రూప మేర్పడెనని శబ్దవిదులు వాకొందురు. వలమురియోగానఁ బ్రదక్షిణము గావించుచున్నటులన్నది. ప్రదక్షిణము కంఠలక్ష్మికనుటచే శంఖము లక్ష్మీసహజన్మలుగానఁ బోలికలకు వీలుఁ బ్రదక్షిణమునకు సార్థకము గలిగినదనుట. అలం. హేతూత్ప్రేక్ష. సమాసోక్తి.

తా. లోన మౌక్తికములు రేఖలుగల శంఖము చెలువకంఠముతోఁ బోలనెంచి మనోహరధ్వని తనకులేమిచే భయపడి తనగుట్టు తానెఱింగి యపరాధక్షమార్థము కంఠలక్ష్మికిఁ బ్రదక్షిణము గావించి నటుల దక్షిణావర్తముతో నలరియున్నది.

సీ. కొమ్మవాతెరతోఁ గుణమ్ముఁ గైకొనవచ్చి కఠినవిద్రుమము చేకట్టఁబడియెఁ
గోమలియధరంబుతో మొన ల్పచరించి యరుచిబింబఫలమ్ము లవిసిపడియె
మృగనేత్రపెదవితోఁ సొగసుఁబూనఁ గడంగి కెంపునీరసముఁ జెక్కించుకొనియె
సతిమోవితో రసస్థితులు చూపి సుగంధవికలబంధూకమూరకయె విరిసె
తే. డాయుపగడంబునకుఁ బగడంబు బింబ
మునకు బింబంబు మెఱయుకెంపునకుఁ గెంపు
బంధుజీవంబునకుఁ దానబంధుజీవ
మౌర యాకుందరదనరదాంశుకంబు. 45

కొమ్మవాతెఱతోన్ = ఆస్త్రీయొక్క మృదువైన పెదవితోడ, గుణమ్ముఁగైకొనవచ్చి = సమాన ధర్మమును గ్రహింపవచ్చినదై, కఠినవిద్రుమము = కాఠిన్యగుణముగల పగడము, చేకట్టఁబడియెన్ = చేతియందలి కట్టఁబడియెను. అనఁగా చేతులు గట్టివేయఁబడెనని యర్థము. గుణమనఁగా దారము గనుక దారము గ్రుచ్చఁబడి చేకట్లనెడు హస్తాభరణములయందుఁ జేరినదని భావము. కోమలి యధరంబుతోన్ = ఆస్త్రీయొక్క మధురమయినరుచిగల మోవితోడ, మొనల్పచరించి = ఎదిరించినవై, అరుచిబింబఫలంబులు = రుచిలేని దొండపండ్లు, అవిసిపడియెన్ = గుప్పునఁగూలెనని యర్థము. మొనలనఁగా ఫలములయొక్క క్రిందఁగనుపడెడు నగ్రములును గనుక మొనఁజూపి కుళ్లిపడిపోవుచున్నవని భావము. మృగనేత్రపెదవితోన్ = ఆస్త్రీయొక్క రసయుక్తమైన యధరోష్ఠముతోడ, సొగసు పూనఁగడంగి=సొగసనఁగా నిక్కడ కాంతియని చెప్పవలెను. కాంతినివహించుటకుద్యోగించి, కెంపు = రసహీనమైన పద్మరాగము, నీరసముఁ జెక్కించుకొనియె = తేలికగుణమును జెక్కివేయించుకొనెనని యర్థము. కాంతివహించుకొఱకు సానవేయఁబడుచున్నదని భావము. సతిమోవితోన్ = ఆస్త్రీయొక్క సుగంధసహితమైన కెమ్మోవితోడ, రసస్థితులు చూపి = రసమనఁగా నిక్కడ స్నేహము - స్నేహముగలిగి యుండుటను గనుపఱచి, సుగంధవికలబంధూకము = సుగంధరహితమైన మంకెనపువ్వు, ఊరకయె విరిసె = నిష్కారణముగా విచ్చిపోయెనని యర్థము. రసమనఁగా మకరందంబును గనుక మకరందరసస్థితులుచూపి తనకుఁ దానే వికసించుచున్నదని భావము.

ఔర=ఆశ్చర్యము, ఆకుందరదన = ఆస్త్రీయొక్క, రదాంశుకంబు = అధరోష్ఠము, డాయు = తారసించిన, పగడంబునకున్=విద్రుమమునకు, పగ = విరోధముయొక్క, డంబు=అతిశయరూపమైనదియు, బింబమునకు = దొండపండునకు, బింబంబు = ప్రతిపక్షియైనదియు, మెఱయుకెంపునకు=ప్రకాశించెడు పద్మరాగమునకు, కెంపు=కోపప్రయుక్తమైన రక్తిమగలదియును, బంధుజీవంబునకు = మంకెనపువ్వునకు, ని. 'బన్ధూకో బన్ధుజీవకః' అని అమరము. తానబంధుజీవము = తానేజ్ఞాతిజీవమైనదియును, 'అని యర్థము. క్రమాలంకారము. ఇక్కడ మన్మథునకు మన్మథుఁడన్నట్టుగా, పగడంబునకు పగడంబు, బింబమునకు బింబంబు, కెంపునకు కెంపు, బంధుజీవమునకు తానే బంధుజీవము అని సారస్యమును గ్రహించవలెను. అనఁగా నితరవస్తువులకంటె విద్రుమబింబపద్మరాగబంధూకములకు నెట్టి యరుణత్వాతిశయముగలదో యావిద్రుమాదులకంటెను వర్ణనీయమైన యధరమునకు నట్టి యరుణత్వాతిశయముగలదని తెలియఁదగినది. కుందరదన యనుపదము సాభిప్రాయము. పలువరుస

కుందకుసుమములవలె సుంటకతనఁ బెదవి మఱియుఁ గెంపువారి యుండెను. పెదవి యనక యితర పర్యాయపదములు చెప్పక రదాంశుకమనుటచే నొండొకటి యలంకారముగ నుండెనఁట.

అలంకారము - వ్యతిరేకము. శబ్దాలంకారము. ఛేకానుప్రాసము.

తా. ఆపొలంతివాతెర కఠినస్వభావముగల పగడములను మృదుస్వభావముచేఁ దిరస్కరించి, అరుచిగనుండు బింబఫలములను దీయని తనమోవిచే నోటుపుచ్చి నీరసముఁ జెక్కించుకొను కెంపుల సొగసుచే నతిశయించి సుగంధశూన్యమగు బంధూకమును మోవిరసస్థితిచే నోడించి యలరుచున్నది.

ఉ. ఇంతిమృదూక్తిమాధురికి • నిక్షురసం బెన వోలఁ జాల కా
 ద్యంతము నోడి మధ్యమగు•ణాశ్రయ మై నెఱకాఁక నెన్ని జ
 న్మాంతరము ల్వహించియుఁ ద•నంతనె ఖండము లయ్యెఁ గాని యా
 వంతయుఁ బూన దెంత వాడి • యయ్యు నఖండతదీయసంపదన్. 46

ఇంతిమృదూక్తిమాధురికిన్=ఆస్త్రీయొక్క మృదువైనవాక్యమాధుర్యమునకు, ఇక్షురసంబు=చెఱకుపానకము, ఎనవోలఁజాలక=సాటిరిపోలలేక, ఆద్యంతమునోడి=ఆద్యంతములయందు నోడిపోయినదై యని యర్థము. ('ఆదిశ్చ అన్తశ్చ ఆద్యన్తమ్' అని యేకవద్భావము.) ఇక్కడ 'అన్యస్యాపి క్వచిద్భవేచ్చాన్యా' అనెడు సూత్రముచేత సప్తమ్యర్థమందు ప్రథమ వచ్చినది. చెఱకు మొదటికణుపునందును చివరకణుపునందును మధురరసములేనిదని భావము. మధ్యమగుణాశ్రయమై=ఉత్తమగుణము గాక మధ్యగుణాశ్రయమై యని యర్థము. మధ్యభాగమందు మాధుర్యగుణాశ్రయమైనదని భావము. నెఱ=గొప్పదయిన, కాఁకన్=కోపముచేత, (తపముచేతఅనఁదగు.) ననియర్థము. ఘనమైనయగ్ని చేత నని భావము. ఎన్ని జన్మాంతరముల్వహించియున్=అనేకజన్మము లెత్తినప్పటికిని అని యర్థము. గుడశర్కరాదిభావములను బొందుచున్నదని భావము: తనంతనె ఖండములయ్యెఁగాని=తనంతట తానే తునకలై పోయెఁగానియని యర్థము. ఖండశర్కరయగుచున్నదని భావము. ఎంతవాడియయ్యును=ఎంతపాడి పాడియయి నప్పటికి నని యర్థము. చూర్ణాకృతితోడ శర్కరాభేద మగుచున్నదని భావము. అనఁగా, నవాయతు, పంచదార యగుచున్నదనుట. అఖండ=సంపూర్ణమైన, తదీయసంపదన్=ఆస్త్రీయొక్క మృదువచనమాధుర్యసంబంధమైన సమృద్ధిని, ఆవంతయుఁ బూనదు=ఆవగింజంతయైనను వహింపఁ జాలదు, అనఁగా ఆస్త్రీయొక్క వాఙ్మాధుర్యము గుడశర్కరాదులను తిరస్కరించునని భావము. చెఱకు ఖండ మగుటచే నఖండమగు మోవితీయఁదనమును బోలఁజాలదయ్యెను. జన్మాంతర మొందియు సామ్య మొందకపోవుటచేఁ జెఱకున కది యసాధ్య మనుట.

అలం. వ్యతిరేకము. కావ్యలింగము. సమాసోక్తి.

తా. ఆపొలంతిమాటల తీయఁదనముతో సరిపోలనెంచి చెఱకురసము మొదటినుండి తుదివఱకోడిపోయి మధ్యమగుణాశ్రయమున నెన్నిజన్మాంతరములు కాఁకచే శ్రమ నొందినను దనంత ఖండ ఖండములయ్యెఁ గాని శర్కరారూపమునఁ బొడియయ్యు మాధుర్యసమత గడింపలేకపోయెను.

శా. నానాసూనవితానవాసనల నా•నందించుసారంగ మే
 లా నన్నొల్ల దటంచు గంధఫలి బ•ల్కాఁకం దపం బంది యో

షానాసాకృతిఁ బూని సర్వసుమనస్సౌరభ్యసంవాస మై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు నిర్వంకలన్. 47

నానా=సమస్తమైన, సూన=పుష్పములయొక్క, వితాన=సమూహముయొక్క, వాసనలన్=పరిమళములచేత, ఆనందించు=సంతోషించునట్టి, సారంగము=తుమ్మెద, ఏలా న న్నొల్ల దటంచున్=ఎందుకు నన్నొల్లదని, గంధఫలి=సంపఁగిమొగ్గ. (ని. 'అథ చాంపేయ శ్చమ్పకో హేమపుష్పకః, ఏతస్య కలికా గన్ధఫలీ స్యాత్' అని అమరము.) బల్కాఁకన్=బలువైన కోపముచేతననికాని పంచాగ్ని మధ్యమందనికాని చెప్పవచ్చును. తపంబుఁ=తపస్సుచేసి యని యర్థము. తపమనఁగా గ్రీష్మకాలమును గనుక, అధికమయిన ఉష్ణగుణముతోడ, గ్రీష్మర్తువునందుఁ బుట్టుచున్నదని భావము. (ని. ఉష్ణఊష్మాగమ స్తపః' అని అమరము.) యోషా=ఆస్త్రీయొక్క, నాసాకృతిఁబూని=నాసికారూప జన్మాంతరమును వహించి, సర్వ=సమస్తమయిన, సుమనః=పుష్పములయొక్క, సౌరభ్య=సువాసనలకు, సంవాసమై=నివాసస్థానమైయని యర్థము. సకలకుసుమామోదములను గ్రహించుచున్నదని భావము. ప్రేక్షణమాలికా=వీక్షణపంక్తులనెడు, మధుకరీ=ఆఁడుతుమ్మెదలయొక్క, పుంజంబులున్ = సమూహమును, ఇర్వంకలన్=ఉభయపార్శ్వములయందును, పూనెన్=వహించెను. తుమ్మెదలను సేవకులనుగా నేలి యుభయపార్శ్వములయందును నిల్పెనని ప్రకారాంతరము. అనఁగా ఆస్త్రీయొక్క నాసిక సంపఁగి మొగ్గవలె చక్కనై యున్నదనియు, వీక్షణములు తుమ్మెదచాళ్లవలె నున్నవనియును తాత్పర్యము. సారంగము నానాకుసుమవాసనల కానందింపఁగలది. సంపెఁగయో ('గంధమేవఫలం అస్యాః ఇతి గంధఫలీ' అనువ్యుత్పత్తిచే) సుగంధమే ఫలముగాఁ గలది. అట్లయ్యుఁ దుమ్మెదచే నామోదింపఁబడమి కొంతగా నెంచినది. తుమ్మెద పూవుతావుల కానందించుచుండఁ దన్వంగినాసిక సుమనఃసౌరభ్యసంవాసమైనది. అంతతో నూరకయుండక యిరువంకల తుమ్మెదలగుంపులఁ జూపులపేర నిలుపుట తన్నొల్లనందులకు దిరుగు వచించుట. అలం. అతిశయోక్తి. ఉత్ప్రేక్ష.

మ. తనరాజీవశరం బెఱుంగదు నిశాతత్వంబు లేఁగల్వతూ
పునకుం జాలదు వేగలీల యని యాపూవుముల్కు లెగ్గించి క్రొ
న్ననవిల్కాఁడు నవాంబుజోత్పలవితానం బీనుమీనాక్షిలో
చనము ల్వింట ఘటింపఁ బోల్చె నవి నిస్తంద్రాంబకఖ్యాతులన్. 48

తనరాజీవశరంబు=తనయొక్క అరవిందబాణము, నిశాతత్వంబు=వాఁడిగలుగుటను, ఎఱుంగదు=గుర్తెఱుఁగదు. అనఁగా పద్మబాణమునకు వాఁడిలేదని యర్థము. కమలము నిశాస్వరూపము నెఱుఁగదని భావము. లేఁగల్వతూపునకున్=కోమలమైన నీలోత్పలబాణమునకు, వేగలీల=తీవ్రగమన క్రియ, చాలదు=సరిపోలదని యర్థము. కలువకు, వేగన్=తెల్లవారఁగానే, లీల=వికాసరూపవిలాసము చాలదనిభావము. ఈయర్థమందు వేగన్ అనునది భిన్నపదము. (ని. 'లీలావిలాసక్రియయోః' అని అమరము.) అని=ఇట్లనివిచారించి, ఆపూవుముల్కు లెగ్గించి=పురాతనములైన యాపుష్పబాణములను నిరసించి, క్రొన్ననవిల్కాఁడు=ఎఱ్ఱనిచిగురువిల్లుగాఁగలమన్మథుఁడు, నవ = నూతనములైన, అంబుజ = పద్మముల యొక్కయు, ఉత్పల=నల్లకల్వలయొక్కయు, వితానంబు = సమూహమును, అనఁగా నవీనవాంబుజోత్పలబాణములను, ఈను = ఉత్పాదించుచున్న, మీనాక్షిలోచనముల్ = స్త్రీయొక్క నేత్రము

లను, వింటఘటింపన్ = క్రొన్ననవిల్కాఁడని చెప్పినందున క్రొన్ననవింటను సంధించఁగా, ఇక్కడ నేత్రము నంబుజోత్పలవితానమీనుట ధవళనీలకాంతుల నీనుటయే యని భావము. ఇక్కడ రూప కాతిశయోక్త్యలంకారము. ఈ అలంకారముచేత నానావిధానేక బాణసంపాదక కామసాయక సామ్రాజ్యము స్ఫురింపుచున్నది గనుక ఉపమాలంకారధ్వని కలుగుచున్నదని గ్రహించవలెను. అవి = ఆనేత్రములు, నిస్తంద్రాంబకఖ్యాతులన్=నిస్తంద్రశబ్దము ఖ్యాతిశబ్దమునకు విశేషణమయ్యును అర్థ సౌందర్యబలముచేత అంబకశబ్దమునకును విశేషణ మగుచున్నది. తంద్రయనఁగా దోషవిశేషము. అంబకములనఁగా బాణములును నేత్రములును, అనిశాతత్వతీవ్రగమనాది దోషములు లేనిబాణముల యొక్క ప్రసిద్ధులచేత, పొల్చెన్ = ప్రకాశించెను. తంద్రారూపదోషములేని నేత్రములని భావము. అనఁగా ఆస్త్రీయొక్క నేత్రములు తెల్లదామరరేకులకంటెను నల్లగల్వరేకులకంటెను అతిశయించిన చక్కదనము గలిగి మన్మథబాణములవలె నున్నవని తాత్పర్యము.

అలంకారము. రూపకాతిశయోక్తి. ఉపమానధ్వని.

లోచనములు నవాంబుజోత్పలవితాన మీను ననుటవలనఁ గడగంటిచూపులకాంతులు తెల్లగను, కనీనికాకాంతులు నల్లగను బ్రసరించుచున్నవనుట, కనుగ్రుడ్డుకాంతులు తెల్లఁగను కనుపాపకాంతులు నల్లగను నుండుఁ గావున నొకమాఱె తెల్లనినల్లనికాంతులు వెల్లివిరియుచున్న వని భావము. కంటినుండి తెల్లనికాంతులుఁ నల్లనికాంతు లొకమాఱె ప్రసరించుచున్న వనుటకు.

సీ. కర్పూరకస్తూరికాప్రవాహంబులు ప్రసరింప లోచనప్రాంగణముల.

శృంగారనైషధము. ఆ. ౫-౭.

చూపులు నలుపుగా వర్ణించుటకు-

వేశ్యాస్తత్రో నఖపదసుఖాన్ ప్రాప్య వర్షాగ్రబిందూన్
ఆమోక్ష్యన్తే త్వయిమధుకరశ్రేణి దీర్ఘాన్ కటాక్షాన్.

చూపులు తెల్లగా వర్ణించుటకు-

చ. పతి గని లజ్జ నాననము వాయఁగ నల్లన వాంచి సమ్మదా
మృతరసపూరితార్ధవినిమీలితలోలకటాక్షవీక్షణా
యతసితదీధితుల్ కలయ నద్రిజ విచ్చె మహేశుమీఁద రా
జతగిరిమీఁద నున్నతి నిశాకరదీప్తులు గప్పుకైవడిన్.

నన్నెచోడుని కుమారసంభవము. షష్ఠా. ప. ౯౦౧.

**తే. త్రిజగతీసుదతీరూపవిజయకీర్తి, గలుగు నని యింతిఫాలభాగమున వ్రాసి**
**నలువ యాశుభవాచకంబులకు శ్రీల, మొదలఁదుదినిల్పెననఁగర్ణములుదనర్చు.**

నలువ=బ్రహ్మ, త్రిజగతీ = జగత్త్రయమందలి, సుదతీ=స్త్రీలయొక్క, రూప = చక్కదనమును, విజయ=గెలుచుటచేతనైన, కీర్తి=యశస్సు, కలుగునని = కలుగుచున్నదని, ఇంతి=ఆస్త్రీయొక్క, ఫాల భాగమునవ్రాసి = నుదుటవ్రాసినవాఁడై, ఆశుభవాచకంబులకు = ఆవ్రాయఁబడిన శుభవాక్యములకు, శ్రీలన్ = శ్రీకారములను, మొదలఁదుదినిల్పెననన్ = మొదటను చివరనునిలిపినాఁడో యన్నట్లుగానే, కర్ణములు దనర్చున్=చెవులొప్పుచుండును. అనఁగా ఆస్త్రీయొక్క కర్ణములు శ్రీకారములవలె నున్న వని భావము. అలం. ఉత్ప్రేక్ష.

త్రిలోకసుదతీరూపవిజయకీర్తి ఫాలమున వ్రాయఁబడెననుటచే నాకాంత త్రిలోకకాంతాతిశయసౌందర్యవతి యనుట. ఫాలభాగమున శుభవర్ణములు వ్రాసెననుటచే నుదురు విశాలముగ ఫలకమువలె నుండెనని భావము. శుభవాచకములకు శ్రీకారములు వ్రాయుట లోకధర్మము.

తా. నలువ తొలుత నుదుట నీచెలువ ముల్లోకములచెలువలఁ జక్కఁదనముచే గెలువఁగల దని వ్రాసి ప్రక్కల శ్రీకారములఁ జుట్టినటుల కర్ణయుగళి యొప్పుచున్నది.

చ. అనయము నీలకంధరము • నభ్రము నన్న సమాఖ్యవారితో
నొనరియు నింతివేనలికి • నోడి యనిశ్చితరూపధేయ మై
చనియె మొగుల్ నగావళికి • శబ్దగుణంబులు సూపువాని నె
ట్టనఁ బురివిచ్చువానిదరి • డాయుజడాత్మల కెవ్వి నిల్కడల్. 50

అనయమున్ = ఎల్లప్పుడును, నీలకంధరము నభ్రమునన్న సమాఖ్య వారితో నొనరియును = అనఁగా నీలకంధరము, అభ్రము, అనునట్టి తనకు సమానములయిన నామధేయములుగల నెమలితోడను ఆకాశముతోడను గూడుకొని యుండియుఁను అని యర్థము. మేఘము మయూరమునకు ప్రియమయినదియును ఆకాశముతోఁ గూడుకొన్నదియు నని భావము. ఇంతి = ఆస్త్రీయొక్క, వేనలికిన్ = కొప్పునకు, ఓడి = కాంతిచేత సమముగాలేక యోడి, అనిశ్చితరూపధేయమై = తెలియఁబడనిరూపముగలదై యని యర్థము, నానారూపములు గలదని భావము. మొగులు = మేఘములు, నగావళికిన్ = పర్వతసమూహములకై, చనియెన్ = వెళ్లెను. ఎందువలన ననిన, శబ్దగుణంబులు సూపువాని = ఇక్కడ గుణములనఁగా ఆవృత్తులు, శబ్దావృత్తులను గనుపఱచువానియొక్కయు, అనఁగా అడినమాటలే ఆడుచుండెడు వదరుపోతుయొక్కయు నని యర్థము. శబ్దగుణక మాకాశమని భావము. (ని. 'గుణస్త్వావృత్తిశబ్దాదిజ్యేంద్రియాముఖ్యతన్తుషు' అని వైధృతి.) నెట్టనఁ బురివిచ్చువాని = శీఘ్రముగా పురికొనినవానియొక్కయు నని యర్థము. నెమలిపింఛము విప్పుచున్నదని భావము. ఇక్కడ వ్యుత్క్రమము. దరిడాయు = దాపునఁ జేరునట్టి, జడాత్మలకున్ = మందమతులకని యర్థము, జల మాత్మయందుఁ గలిగియున్నదని భావము. (లడయోరభేదః) ఎవ్వినిల్కడల్ = స్థిరభాగములెక్కడివి, అనగా మందమతులకు స్థిరచిత్తములు లేవనుట. అనఁగా ఆస్త్రీయొక్క కొప్పు మేఘమునకంటె నతిశయమయిన నీలకాంతి గలిగి నెమలి పింఛమువలె విప్పు గలిగియున్నదని భావము. అలంకారము. హేతూత్ప్రేక్ష. అర్థాంతరన్యాసము. సమాసోక్తి.

తా. జడాత్మయగు మొగులు నీలకంధరము. అభ్రమను పేరుగలవారితో నలరి యాచెలువ వేనలిని గెలువ నెంచి కడ కోడిపోయి, నామరూపములు కోలుపోయి కొండలపాలయ్యెను. వదరుబోతులను పురివిచ్చువారిని తోడ్పాటుగొను జడాత్ముల కపజయము సహజము.

సీ. కన్నెపాదము లజుఁ • గన్నమేటికి నైన బాలజంఘలు వర • శాలి కైనఁ
బూఁబోఁడిజఘనంబు • భూరివేదికి నైనఁ బోలఁతిపొక్కిలి సర • సులకు నైన
సతికౌను సర్వజ్ఞ • మతి కైన నతివచన్నవ ప్రసన్నాదిత్య • కవుల కైన
రమణినెమ్మోము పూ • ర్ణకళానిధికి నైన వనితవేనలి ఫణి • స్వామి కైన

తే. గుణము లన్నియును గ్రహింప • గోచరింప
వనిన మముబోంట్లకు నుతింప • నలవి యగునె
కువలయాధీశ నీవు గ•న్గొంటివేని
చెలువచెలు వాత్మఁ బాయక • నిలుచునేమొ. 51

కన్నెపాదములు = ఆకన్యకయొక్క యడుగులు, అజుఁగన్నమేటికి నైనన్ = బ్రహ్మనుగన్న విష్ణుమూర్తికైన ననియర్థము. పద్మమునకయిన నని భావము. బాలజంఘలు = ఆస్త్రీయొక్క పిక్కలు, వరశాలికైనన్ = వరములచేత నొప్పుచున్నవాని కయినను, అనఁగా వరములువడసినవానికైన ననియర్థము. వర=శ్రేష్ఠమయిన, శాలికిన్ = వరిపొట్టకైన నని భావము. పూఁబోఁడి జఘనంబు = ఆస్త్రీయొక్క కటిపురోభాగము, భూరివేదికి నయినన్ = మిక్కిలి తెలిసినవానికైన ననియర్థము, సువర్ణమయమయిన వేదికకైనప్పటికి నని భావము. పొలఁతిపొక్కిలి = ఆస్త్రీనాభి, సరసులకునయినన్ = శృంగారరస యుక్తులకైన నని యర్థము. సరోవరములకయిన నని భావము. సతికౌను = ఆవనితయొక్కనడుము, సర్వజ్ఞమతికైనన్ = సర్వజ్ఞుఁడయిన శివునియొక్క బుద్ధికయిన నని యర్థము. ఆకాశమునకయిన నని భావము. అతివచన్గవ = ఆస్త్రీయొక్క స్తనద్వయము, ప్రసన్నాదిత్యకవులకయిన = ప్రసన్నులయిన దేవతలుగల కవులకయిన నని యర్థము. ('కే జలే వయఃపతత్రిణః' అనెడు వ్యుత్పత్తిచేత) కవులనఁగా జలపక్షులు ప్రసన్నుఁడయిన సూర్యుఁడుగల కవులు చక్రవాకములు గనుక చక్రవాకములకైనప్పటికి నని భావము. రమణినెమ్మోము = ఆ సుందరియొక్క సుందరమయినముఖము, పూర్ణకళానిధికి నయినన్=సంపూర్ణవిద్యానిధికైన నని యర్థము. సంపూర్ణచంద్రునకైన నని భావము. వనితవేనలి = ఆస్త్రీయొక్కజడ, ఫణిస్వామి కయినన్ = శేషునకయిన నని యర్థము, సర్పశ్రేష్ఠునకయిన నని భావము. గుణములన్నియును గ్రహింపగోచరింపవు = అనఁగా నిక్కడపాదములు మొదలైనవి అజుఁగన్నమేటి మొదలయినవారికి గుణము లన్నియును గ్రహింప గోచరింప వని యన్వయము. పాదములు మొదలయినవి విష్ణువు మొదలయినవారికి గుణముల నన్నిటిని దెలిసికొనుటకు గోచరించవని యర్థము. పద్మము మొదలయినవానికి గుణములనన్నిటిని స్వీకరించుటకు గోచరించ వని భావము.

అనినన్ = చెప్పుచుండఁగా, మముబోంట్లకు నుతింప నలవియగునె = మావంటివారికి స్తోత్రము సేయుటకు శక్యమా నా, అనఁగా నలవిగాదనుట. కువలయాధీశ = ఓయి వసుమహారాజా, నీవు గన్గొంటివేని = నీవు చూచితివేని, చెలువ చెలువు = ఆస్త్రీయొక్క చక్కఁదనమును, ఆత్మఁబాయక నిలుచునేమొ=అంతఃకరణమున నెడఁబాయక నిలిచి యుండునేమొ, అనఁగా నీవుచూచి తీరవలెఁగాని నేను ఆచక్కఁదనమును కొనియాడను శక్తుఁడను గానని భావము. ఆకాంతచెలువము లోకోత్తర మగుటచే నొక్కొక్కయవయవము నొక్కొక్కవేలుపు వర్ణింపలేకున్నాఁడు. ఒక్కొక్కలోకోత్తరవస్తు వామె యవయవసౌందర్యమును బోలఁజాలకున్నది. కావున నాబోంట్లకు పొగడ నలవి కాదని యాశయము. అలంకా - అర్థాపత్తి - ఉపమాధ్వని.

తా. ఆచెలువపాదములు తామరపూలను, పిక్కలు వరిపొట్టలను, జఘనము అరుగును, పొక్కిలి సరస్సులను, నడుము ఆకాశమును, చనుగవ చక్రవాకములను, ముఖము చంద్రుని వెన్నెతి శేషుని మించియున్నది. ఆకాంతచక్కఁదనము శివుఁడు బ్రహ్మ శేషువు మొదలగు వేలుపులే పొగడఁజాలరు. నీవు కాంచినచో చిత్తమునందు హత్తుకొనునేమొ.

మ. కమనీయాకృతియోగ్యకీర్తనములం గన్పట్టునాశ్యామ యా
సుమబాణాంబక యాయమూల్యమణి యాచొక్కంపుఁబూబంతి యా
సుమనోవల్లరి యాసుధాసరసి యాసొంపొందుడాల్దీవి యా
కొమరుంబ్రాయపురంభ యాచిగురుటాకుంబోఁడి నీకే తగున్. 52

కమనీయ = సుందరమయిన, ఆకృతియోగ్యకీర్తనములన్ = అవయవయోగ్యకీర్తనములతోను, మస్తకాది పాదపర్యంతావయవయోగ్య కీర్తనములతోను అని యర్థము. లేక అవయవయోగ్యమైన శ్యామాదిపదములచేతఁ జేయఁబడిన స్వవిషయకస్తుతులతోడను, కన్పట్టు = కనుపడుచున్న - ఇక్కడ శ్యామాదిపదములకు స్త్రీపరముగాను తత్కబర్యాద్యవయవపరముగాను అర్థము చెప్పవలెను. ఆశ్యామ = ఆయౌవనమధ్యస్థురాలును, లేక శ్యామ యనఁగా ప్రేంకణపుతీఁగెయును గనుక ప్రేంకణపుతీఁగెవలె నున్నట్టిదియును, (ని. 'శ్యామాతు మహిళాహ్వయా' అని అమరము.) ఆసుమబాణాంబకపదము మొదలుకొని రంభాపదము తుదిగానుండెడి ఉపమానపదములచేత నుపమేయమయిన స్త్రీ లక్షిత యగుచున్నది గనుక అభేదరూపాతిశయోక్త్యలంకారము. ఆసుమబాణ = ఆమన్మథునియొక్క, అంబక = బాణములవంటి కన్నులుగలదియును, ఆ అమూల్య = విలువలేని, మణి = పద్మరాగమణివంటి అధరోష్ఠముగలదియును, ఆచొక్కంపుఁబూబంతి = ఆసుందరమయిన పూలబంతులవంటి కుచములుగలది. ఆసుమనోవల్లరి = ఆపూఁదీఁగెలవంటి బాహువులు గలదియును, ఆసుధాసరసి = ఆ అమృతసరోవరమువంటి నాభిగలదియును, ఆసొంపొందుడాల్దీవి = ఆచక్కనైనచున్న కాంతిగల తిన్నెలవంటి పిఱుఁదులు గలదియును, ఆకొమరుంబ్రాయపురంభ = ఆతరుణవయస్సుగల రంభలవంటి అనఁగా నరఁటిబోదెలవంటి తొడలు గలదియఁ నని యర్థము. ఇదియునుం గాక అమూల్యమణివంటిదియు, చొక్కంపుఁబూబంతి వంటిదియు, సుమనోవల్లరివంటిదియు, సుధాసరసివంటిదియు, సొంపొందుడాల్దీవివంటిదియు, కొమరుంబ్రాయపురంభవంటిదియుం అని అవయవపరముగాను చెప్పవలెను. ఆచిగురుటాకుంబోఁడి = ఆచిగురువంటి మార్దవము గలదియును, ఇక్కడ పల్లవసౌందర్యయుక్తమయిన పాదములు గలదియునని చెప్పవలెను. నీకేతగున్ = ఈచెప్పఁబడిన సౌందర్యము గలస్త్రీ నీకే తగును. అనఁగా ఆసుందరికి ఇతరులు తగరని భావము.

శ్యామాలక్షణము-

శ్లో. శీతే సుఖోష్ణసర్వాంగీ గ్రీష్మేతు సుఖశీతలా
తప్తకాంచనవర్ణాభా సాస్త్రీ శ్యామేతికథ్యతే.

ఇందు అవయవములనుబట్టి యవయవికి కమనీయాకృతియోగ్యకీర్తనములు చేర్కొనఁబడెను. ఇటులనుటచే నొక్కొక్కవిశేషణ మొక్కొక్కరీతిగా నవయవిపరముగ సరిపడును. పూబంతియన్నచోఁ జనుగవ వల్లరి యన్నచో బాహులతలు సుధాసరసి యన్నచోఁ బొక్కిలి యిటులె యవయవపరముగా గ్రాహ్యము. అలం. అభేదరూపకాతిశయోక్తి.

తా. చక్కఁదనముల కుప్పయగు నాబాలంతి సర్వవిధముల నీకే తగియున్నది.

తే. చిత్తజాకారయాచెల్వ చెలులచెల్వ,మలవియె నుతింప వారు వామాక్షివలనఁ
గలిగెచూపులునవద్యగతులుకోరియఁ, గదిసినసురాహిరాజన్యకన్యలొక్క.

చిత్తజాకార=మన్మథునివంటి రూపముగల వసుమహారాజా, ఆచెల్వచెలులచెల్వము = ఆస్త్రీయొక్క చెలికత్తియల చక్కఁదనము, అలవియె నుతింపన్=నుతిసేయుటకు శక్యమా, అనఁగా శక్యము గాదనుట. ఏమనిన, వారు=ఆచెలికత్తెలు, వామాక్షివలనన్=సుందరమయిన నేత్రములుగల ఆవనితవలన, కలికిచూపులును = మనోహరములయిన బెళుకుచూపులను, అనవద్యగతులు = తొట్రుపాటులేని నడకలను, బోరయ=నేర్చుకొనుకొఱకు, కదిసిన=కదియవచ్చియున్న, సుర=దేవతలయొక్కయు, అహిరాజన్య=పన్నగులయొక్కయు, కన్యలొక్కొ = కన్నెపడుచులైయుందురేమో, అని క్రమాలంకారము. అనఁగా దేవతాకన్యలు ఱెప్పపాటులేని చూపులు గలవారును నాగకన్యలు పాదప్రచారములు లేనివారును గనుక దేవతాకన్యలు ఱెప్ప ల్లార్చెడు చూపులను నాగకన్యలు పాదములచేత నడిచెడు నడకలను ఆ స్త్రీవలన నేర్చుకొనవలయు నని వచ్చిన దేవ నాగ కన్యలుగాని సాధారణపు మానవ కన్యలు గారుసుమా యని భావము. అలం. ఉత్ప్రేక్ష.

చూపునిలుకడగల వేలుపుకాంతలనుగూడ నాచెలువ కడకంటిచూపుల నేర్చుకొనుటకు శిష్యురాండ్రనుగా బరిగ్రహించుట యోరచూపుల పొంకమును, నడక యెఱుంగని చిలువజవరాండ్రనడల నభ్యసింపఁజేకొనుట విలాసమందయానము సూచించును. దీనిచే నాచెలువ వేల్పుచెలువల నాగలోకకామినుల మించె నని భావము.

శా. ఆలావణ్యవతీమణుల్ గొలువఁగా • నాలేమ యాకోనలో
నాలీలాభవనంబులో ననఘకం•ఠాలప్తిసౌభాగ్యముల్
వ్యాలోలాంగుళిసంజ్ఞచేఁ గఱపు రే•వన్ వీణఁ బల్కించునా
యాలాపంబె గిరిం దరీముఖరమై • యాలింపఁగా నయ్యెడిన్. 54

ఆలావణ్యవతీమణు ల్గొలువఁగాన్ = అట్టిస్త్రీరత్నములు సేవించఁగాను, ఆలేమ = ఆస్త్రీ, ఆకోనలోన్=పూర్వమందుఁజెప్పఁబడిన యాకోనలోను, ఆలీలాభవనంబులోన్ = ఆక్రీడాగృహములోపల, అనఘ=నిష్కల్మషములైన, కంఠాలప్తి = గాత్రసంగతులయొక్క, సౌభాగ్యములు=సౌష్ఠవములను, వ్యాలోల=కదలుచున్న, అంగుళి=వ్రేళ్ళయొక్క, సంజ్ఞచేన్ = సైగచేత, కఱపురేవన్ = నేర్పుచున్నదో యన్నట్టులుగానే, వీణఁబల్కించు = వీణయందుఁ బలికించుచున్న, ఆయాలాపంబె = ఆరాగసంచారమె, గిరిన్ = కైళోలావాల పర్వతమందు, దరీముఖరమై = గుహలయందు మాఱుమ్రోయుచున్నదై, ఆలింపఁగా నయ్యెడిన్=వినవచ్చుచున్నది. చెప్పినంతన గ్రహించునెడ బోధించుటలో శ్రమపడ నవసరముండదు గాననే అంగుళిసంజ్ఞచే బోధింప వీలుకలిగినది. వీణతంతులపైఁగల వ్రేళ్లు గాత్రసంగతులు నేరుపుచున్నటు లున్నవనుట.

తా. సుందరాంగులు పెక్కండ్రు కొలిచియుండఁ గొండలోయలోని విలాసమందిరమునందు నాసుందరి వీణకు సంగీతవిద్య గాత్రమాధుర్యము బోధించునటుల వీణవాయించు చున్నది. ఆరాగ సంచారమె గుహల మాఱుమ్రోఁగి వినఁబడుచున్నది.

ఉ. స్వైరవిహారధీర లగు•సారసలోచన లున్నచోటికిన్
భోరున లాతివారు చొరఁ•బూనినచో రసభంగ మంచు నేఁ
జేరక పువ్వుఁదీవియల•చెంతనె నిల్చి లతాంగిరూపు క
న్నారఁగఁ జూచి వచ్చితి న•వాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్. 55

స్వైరవిహార = స్వేచ్ఛావిహారమందు, ధీరలగు = ప్రౌఢలైన, సారసలోచనలు = స్త్రీలు, ఉన్నచోటికిన్=ఉన్నస్థలమునకు, భోరున = హఠాత్తుగాను, లాలివారు=అన్యులు, చొరఁబూనిన చోన్=చొచ్చిపోఁ జూచినయెడల, రసభంగమంచున్=అసారస్యముగా నుండునని, నేఁజేరక = నేను వారియెదుటికిఁబోక, పుష్పవదీవియలచెంతనె నిల్చి = పుష్పలతలయొక్క చాటుననే యుండి, లతాంగిరూపు = ఆస్త్రీయొక్క చక్కఁదనము, కన్నారఁగఁ జూచి=నేత్రములకు తృప్తియౌనట్టుగాఁ జూచినవాఁడనై, నవ = నూతనమైన, అంబురుహ = తామరరేకులవంటి, అంబక = నేత్రములుగల వసుమహారాజా, నీకుఁదెల్పఁగన్ = నీకుఁ దెలియఁజేయునిమిత్తమై, వచ్చితిన్=వచ్చితిని. ఇక్కడ సారసలోచనలున్నచోటికి, నవసారసలోచనుఁడవైన నీవు పోవుట యుక్తమని అనురూప్యము గ్రహించవలెను, నవాంబురుహాంబక యన్నచోట నవమన్మథుఁ డనియును విచారించవలెను. రూపు అనెడు పదము ఉకారాంతము. (ఇందుకు, శ్లో. 'ధూర్తమూర్ఖౌ నీచవృద్ధౌ వృదన్తావపి సమ్మతౌ, ఉత్వేనైవ భవన్త్యస్యే ప్రయోగస్తత్ర కారణమ్.' అని అథర్వణవచనము.)

వారు సారసలోచనలు. వారితోఁ గలసిమెలసియుంటకు నవసారసలోచనుఁడవు మన్మథాకారుఁడవగు నీవు తగుదువు. నేను లాతినిగాన చాటుననుండి చూచితినని భావము. అటనున్నచెలువలు సారసలోచనలు. లాతి నే నేగిన రసభంగమగును. అనఁగా రసశబ్ద మట లోపించుటచే సాలోచనలగుదురు. పరునిఁ జూచి యాలోచనామగ్నలయ్యెదరు. కావునఁ గార్యభంగమగునని మరలితినని సారస్యము. ఇది శబ్దచిత్రము. అలం. కావ్యలింగము. పరికరాంకురము.

తా. జవరాండ్రు స్వేచ్ఛావిహారములు చేయుతతి నటకుఁ గ్రొత్తవారు పోఁదగదు. పోయిరేని రసభంగమగునుగావున నే నటకుఁజేరక పూవుఁదీఁగలచాటుననుండి యాచెలువ చెలువము చూచి నీకుఁ జెప్పవచ్చితిని.

చ. అని చెలి విన్నవించుటయు ♦ నాహితవాక్యము మున్ను విన్నయ
న్నినదముకన్నఁ దిన్న నయి ♦ నీరజలోచన యున్నకోనకుం
జనఁ దివిరింపఁ దత్ప్రియవ♦చఃస్థితికన్న విరాళి నించె న
జ్జనపతికిన్ మనోజభుజ♦చాపలతాగుణగుంజితార్భటుల్. 56

అని చెలి విన్నవించుటయున్=పైనిఁ జెప్పఁబడినప్రకారముగా ప్రియసఖుఁడు విజ్ఞాపనము సేయఁగాను, ఆహితవాక్యము=అప్రియవచనము, మున్నువిన్న=ముందువిన్నట్టి, అన్నినదముకన్నన్=ఆ సంగీతనాదముకంటె, తిన్ననయి = చక్కనై, నీరజలోచన యున్నకోనకున్=స్త్రీయున్నకోనకు, చనన్= పోవునిమిత్తముగాను, తివిరింపన్ = తీవరపెట్టుచుండఁగా, తత్ప్రియవచస్స్థితికన్నన్ = ఆప్రియసఖుని వాక్యసంగతికంటె, మనోజ = మన్మథునియొక్క, భుజ = బాహువునందలి, చాపలత=తీఁగెవంటి ధనుస్సుయొక్క, గుణ = నారియొక్క, గుంజిత = మ్రోఁతయొక్క, అర్భటులు=అడంబరములు, అజ్జనపతికిన్ = ఆవసురాజునకు, విరాళినించెన్ = విరహమును పూర్ణీభవింపఁజేసెను. ఇక్కడ మధుపఝుంకారములను మన్మథశింజినీటంకారములుగాఁ జెప్పినాఁడు.

హంసముఖమున విన నలునెడ దమయంతి కనురాగోదయమైనట్లు కృష్ణునకు వినికిడివలన రుక్మిణిపై ననురాగోదయ మైనటుల వసురాజునకు నాయికయెడ ననురాగోదయము వినికిడివలన నయ్యెను.

" యత్ప్రేమసంగమా త్పూర్వం దర్శనశ్రవణోద్భవా
పూర్వానురాగ స్సజ్ఞేయ శ్శ్రవణం తద్గుణశ్రుతిః
ప్రత్యక్షచిత్రస్వప్నాదౌ దర్శనం దర్శనం మతం"

అను సాలంకారికసూక్తివలన దర్శనముచే రాగము జనించునటుల గుణాకర్ణనమువలన సైత మనురాగోదయమగునని వ్యక్తమగుచున్నది. చెలియగీతమె మనోహరమైనది. అంతకంటె నాయిక సౌందర్యవర్ణనము మనోహరముగనుండెను. అంతకెక్కుడుగఁ దుమ్మెదలమ్రోఁతలు మనోహరముగనుండి విరాళినించెను. అనఁగాఁ జెలువచెలువముఁగూర్చి విన్నంతన మన్మథుఁడు విల్లెక్కుపెట్టి వసురాజును లోఁబఱచికొనెనని భావము.

తే. కిన్నరవిహంగయుగళిచే ♦ మున్ను విన్న, సన్నుతాసన్నశుభద ప్ర♦సన్న ఫణితి
మదికిసరిదాకముదమునఁ♦బొదలి మేది, నీపతిహితాగ్రణిని ద్రో♦వఁజూపుమనుడు.

కిన్నరవిహంగ యుగళిచేన్ = కిన్నరపక్షి మిథునముచేత, మున్నువిన్న = మునుపు ఆకర్ణించిన, సన్నుత = స్తోత్రముచేయఁబడిన, ఆసన్నశుభద = సన్నిహితశుభము నిచ్చునట్టి, ప్రసన్న = స్వచ్ఛమయిన, ఫణితి = వాక్యరచన, మదికిన్ = తనమనస్సునకు, సరిదాకన్ = తార్కాణకాఁగాను, ముదమునఁ బొదలి = సంతోషముచేత పొదలుకాఁడి, మేదినీపతి = వసురాజు, హితాగ్రణిని = హితులలో శ్రేష్ఠుఁడయిన నర్మసఖుని, త్రోవసూపు మనుడు = మార్గముచూపించు మని పలుకఁగాను, ఇది ముందరి కన్వయము.

తా. తొలుత రాజు కిన్నరవిహంగముల యెఱుపువలన గ్రహించిన యాసన్నశుభము హృదయమునకు స్ఫురింప నానందించి చెలిమికానిని ఆచెలువ లున్నచోటునకుఁ ద్రోవఁజూపు మనెను.

సీ. ఈఱాలఁ బో రాదు ♦ హేరాళము జవాది యీరాలనడుచక్కి ♦ నేగవలయు
నాకాన నేకాల ♦ మడరుఁ దేనియవాన లాకాన నేర్పున ♦ నరుగవలయు
నీవంక నేవంక♦నెనసినతుహినాంబు లీవంకఁ బూఁదెప్ప ♦ నీఁదవలయు
నామూలనునుమూల ♦ తామొత్తములచఱు లామూలముగఁ దీవ♦లంటవలయు
తే. నధిప యిదిమానికపుఁగోన♦యది లతాంత,రజముసారువ యిదికప్పు♦రంపుటనఁటి
చప్పరం బలయది కాంత♦పదన మనుచు, నరపతికిఁ దెల్పె నరుగుచో♦నర్మసఖుఁడు.

ఈఱాలఁబోరాదు = ఱాలనఁగా శిలలు, ఈశిలలమీఁదుగాఁ బోఁగూడదు. ఎందువల్లననిన, హేరాళముజవాది = జవాది బహువిస్తారము, అనఁగా జవ్వాదిపిల్లులు ఆఱాళ్లమీఁద జవ్వాది నింపినందున దానిజిడ్డుచేత జారుచున్న వని భావము. ఇఁకనెటుపోవలెననిన, ఈరాలనడుచక్కి నేగవలయున్ = ఈరాలనఁగా పొదలు, పొదలనడుముగాఁ బోవలెను. ఆకానన్ = ఆ యడవియందు, తేనియవానలు = మకరందవర్షములు, ఏకాల మడరున్ = ఎల్లకాలము నతిశయించుచుండును. కాఁబట్టి, ఆకానన్ = ఆకులడ్డమగునట్టుగా, అరుగవలయున్ = పోవలయును ఈవంకన్ = ఈపార్శ్వమందు, ఏవంకను = ఏదిక్కునను, ఎనసినతుహినాంబులు = కలియఁ బాఱియుండెడు మంచునీళ్లు, కాఁబట్టి, ఈవంకన్ = ఈసెలయేరును, పూఁదెప్పన్ = పువ్వులతెప్పచేత, ఈఁదవలయున్ = దాఁటిపోవలెను. ఆమూలన్ = ఆకోణమందు, నును = నునుపుగలిగిన, మూలరామొత్తముల = వజ్రమణిసమూహమయములైన, చఱులు = చరియలు, కాఁబట్టి, ఆమూలముగన్ = మొదలంటుగా, తీవలంటవలయున్ = తీఁగెలవలంబించవలెను. అనఁగా తీఁగెలుపట్టుకొని దిగవలెననుట.

అధిప=రాజా, ఇది మానికపుఁగోన=ఇది మాణిక్యమయమైనకోన, అది=అకనుపించునదే, లతాంత రజము=పుష్పాపుడియొక్క, సారువ=మేరువ, అనఁగా బరువైనవస్తువులు పైకెక్కించుటకై యున్నత ముగా మంటితోఁబోసిన మేరువకు సారువయని పేరు గనుక నిక్కడ పుష్పాపుడిదిన్నెయని తెలియ వలెను. ఇది కప్పురంపుటనఁటిచప్పరంబు = ఇదే కర్పూరపరఁటిచవికె, అల్లయది=అదిగో ఆ కానవచ్చు నదె, కాంతసదనము=నేను చూచిన స్త్రీయొక్కగృహము, అనుచుఁన్=అని చెప్పుచును, అరుగుచోఁన్ = పోవుచున్నసమయమందు, నర్మసఖుఁడు = ప్రియసఖుఁడు, నరపతికిఁ దెల్పెన్ = వసురాజునకు విశద పఱచెను. శబ్దాలంకారము వృత్త్యనుప్రాసము.

తా. పోవునెడ రాజుతో మంత్రి యిట్లనెను. రాజా! యిచట శిలలపై జవ్వాది పేరి యున్నది, కాలుజారును. అదె తేనియవాన, మెలఁకువగా నడువవలయును. అవి మంచునీటిసెలయేళ్లు, పూవుఁదెప్పలతో నీదవలయును. ఇవి నునుపుబొటికెనవజ్రపుఁజటిములు, దీవలంటి పై నడువవలయును. ఇది మణిలోయ. అదియె యరఁటిచవికె. అదియె కాంతాసదనము.

సీ. ప్రకటితోన్మేష కీఁపద్మిని కినకరకౌతుకావాప్తి వేఁగనె ఘటించుఁ
దతవయోవిభవ కీఁలతకూన కాసన్నపున్నాగవిహృతి గొబ్బుననె యబ్బు
విలసితామోద కీఁకలికికొమ్మకు రాజసారంగయోగ మీక్షణమ కల్గు
భువనాభినంద్య కీఁనవరసపరసికి మానసప్రియలీలఁతోన దొరకు
తే. ననుచుఁ దమలోన లేఁదోఁట ♦ లరయుమగువ
లాడునుడువులు విన నయ్యె ♦ నని యొఱింగి
నృప యుపశ్రుతి వింటివే ♦ యిచట ననుచు
నాప్తుఁ డెఱిఁగింప హర్షించె ♦ నధిపుఁ డపుడు. 59

ప్రకటిత = తెలియంబడుచున్న, ఉన్మేషకున్ = పరువముగలిగిన, ఈపద్మినికిన్=ఈపద్మలతకు, ఇనకర = సూర్యకిరణములచేతనైన, కౌతుక = హర్షముయొక్క, అవాప్తి = ప్రాప్తి, వేగనె=ప్రభాత సమయము కాఁగానే, ఘటించుఁన్=చేకూడుననియర్థము. ప్రకటితోన్మేషకున్=ప్రకటితోల్లాసయైన, ఈపద్మినికిన్ = ఈపద్మినీజాతిస్త్రీకి, ఇనకర=రాజహస్తముయొక్క, కౌతుకావాప్తి=అభిలాషప్రయుక్త మైన ప్రాప్తి, వేగనెఘటించుఁన్ = శీఘ్రముగానే పొందుచున్నదని యర్థాంతరము. (ని. 'కౌతుకం త్వభిలాషే స్యా దుత్సవే నర్మహర్షయోః, పరంపరాసమాయాతమఙ్గళే చ కుతూహలే' అని విశ్వము.) వేగనెడు పదము, కుశాదిగణపతితముగనుక ముపర్ణలోపముఁజేసినాఁడు. తత = విస్తారమైన, వయః= శుకశారికాదిపక్షులయొక్క, విభవకున్ = వైభవముగలిగిన, ఈలతకూనకున్ = ఈలేఁతతీఁగెకు, ఆసన్న = సమీపమందున్న, పున్నాగ = పొన్నచెట్టునందలి, విహృతి=విహారము, అనఁగా పొన్నచెట్టు నలముకొనుట, గొబ్బునసెయబ్బున్=త్వరితముగానే లభించుననియర్థము. ని. 'పున్నాగే పురుష స్తుఙ్గః కేసరో దేవవల్లభః' అని అమరము. తతమైనయౌవనవిభవముగల యీకన్యకకు సమీపాగతుఁడైన పురు షునియొక్క విహారము త్వరగానే లభించునని యర్థాంతరము. విలసిత = ఒప్పుచున్న, ఆమోదకున్ = పరిమళముగల, ఈకలికికొమ్మకున్ = ఈసుందరమైనవృక్షశాఖకు, రాజసారంగయోగము = రాజభృంగ సంయోగము, ఈక్షణమకల్గున్ = ఇప్పుడేకలుగుచున్నదని యర్థము. విలసితమైన సంతోషముగల యీ

చక్కనిస్త్రీకి రాజమంజరునియొక్క అనఁగా రాజశ్రేష్ఠునియొక్క సంబాధ మీాక్షణమందే కలుగుచున్నదని యర్థాంతరము. భువన=ఉదకముచేత, అభినంద్యకన్ = మిక్కిలిస్తోత్రముచేయఁదగిన, ఈనవరస సరసికన్=ఈనూతనమైన మాధుర్యరసముగల సరోవరమునకు, మానసప్రియ = హంసలయొక్క, లీల=క్రీడ, తోనదొరకున్ = వెంటనే కలుగునని యర్థము. జగదభినంద్యమయిన శృంగారసరసికి మనోవల్లభ క్రీడ వెంబడిగానే దొరకునని యర్థాంతరము. ని. 'భువనం విష్టపే పిస్యా త్సలిలే గగనే' అని మే.

అనుచున్=ఇట్లుపలుకుచు, తమలోనన్=పరస్పరము, లేఁదోఁటలరయుమగువలు = లేఁతతోఁటలను బరిశీలించుచున్నస్త్రీలు, ఆడునుడువులు విననయ్యె ననియెఱింగి = ఆడుకొనుమాటలు వినఁబడెనని తెలిసికొన్నవాఁడై, అప్డుడు = ప్రియసఖుఁడు, నృప=రాజా, ఇచటన్ = ఈప్రదేశమున, ఉపశ్రుతి వింటివే=ఉపశ్రుతివాక్యంబు విన్నావుగదా? ఉపశ్రుతి యనఁగా నొక కార్యార్థమై పోవునపు డేనియు మాటాడునపు డేనియుఁ దదనుకూలముగా వినవచ్చునరులమాటల సముదాయము. అనుచున్ = అనిపలుకుచును, ఎఱిఁగింపన్ = తెలియఁజెప్పఁగా, హర్షించి = సంతోషించి, అధిపుఁడు = అవసుమహారాజు, అపుడు = ఆ సమయమందు, ఈపద్యమునకుఁ బైపద్యంబుతో నన్వయము.

ఇందుఁ జెలికత్తియల సంభాషణము భావిశుభసూచనముగాఁ జెప్పఁబడెను. తోఁటనరయుమగువలు తమలోఁదామనుకొనుమాటలు తమకుఁ గలసివచ్చుటనే యుపశ్రుతి. మన్మథచాపగుణగుంజితార్భటులచే వివశుఁడైయుంటచే రాజా ప్రసంగభావము తానుగ్రహింపలేఁడయ్యెను. కావున నే మంత్రి రసికావతంస మగురాజునకు నెఱుంగఁజేయవలసివచ్చినది.

క. కుతుకమున నచలసుత యగు, సతిఁ గనఁజనురాజమౌళి•చాడ్పున నపు డా
క్షితిపతి సతిఁ జూచుతమిన్, హితసూచితసరణిఁ గోన • కేతెంచునెడన్. 60

కుతుకమునన్=సంతోషముచేత, అచలసుతయగు = హిమవత్పర్వతపుత్రియైన, సతిన్ = యువతిని అనఁగాఁ బార్వతీదేవిని, కనఁజను = చూచునిమిత్తమైపోవునట్టి, రాజమౌళిచాడ్పునన్ = చంద్రశేఖరుఁడైన హరునివలె, అనఁగా హరుఁడో యన్నట్టుగానే, ఇక్కడ అచలసుతయగు సతియనఁగాఁ గోలాహలపర్వత పుత్రియైన గిరికాదేవి యనియును, రాజమౌళియనఁగా వసురాజనియును అర్థాంతరము. ఇక్కడ నవీనమతమందు ఉపమాలంకారము. రాజమౌళిత్వము సమానధర్మమని గ్రహించవలెను. రాజమౌళిపదము ఉపమానవాచకంబును రాజమౌళిత్వరూప సమానధర్మవాచకంబును నౌచున్నదిగనుక నుభయథా చెప్పవలెను. అచలసుతాదిపదములకు సమానధర్మవాచకత్వముస్పష్టమే. ప్రాచీనులు విశేషణశ్లిష్టతయందు శబ్దమాత్రసాధర్మ్య మంగీకరించి ధర్మసామ్యము లేదుగనుక శ్లేషాలంకార మని చెప్పిరి. అపుడు=ఆ సమయమందు, ఆక్షితిపతి=అవసురాజు, సతిఁజూచుతమిన్ = గిరికాదేవిని జూచెడు నభిలాషముచేత, హిత=నర్మసఖునిచేత, సూచిత = తెలుపఁబడిన, సరణిన్=మార్గముననే, కోనకేతెంచునెడన్ = కోనకుం జేరవచ్చెడు సమయమందు, ముందరిపద్యముతో నన్వయము.

ఈపద్యము బ్రౌనుదొరగారి వ్యాఖ్యావసుచరిత్రమునఁగానరాదనిరి. (రాశే వ పద్యముగఁగలదు) సోమకవియు వ్యాఖ్యగావించియే యున్నాఁడు కావునఁ బ్రక్షిప్తమన వీలులేదు. ఇందు గిరికకచలసుతాత్వాదులు శ్లేషచే స్థాపింపఁబడి యుంటచేఁ గథాపటుత్వమునకు రామరాజభూషణుని రచనాసంప్ర

డాయమునకు భిన్నము గావునఁ గథారామణీయకమును గుందించుచున్నదనుట సత్యము. ప్రత్యంతరము లలోఁ బరిశీలించి పద్యము ప్రక్షిప్తమే మొ తెలిసికొనవలసియున్నది.

తే. తొలుదొలుత భద్రకుంభముల్ దోఁపఁ బిదపఁ
బచ్చటామానికపునిచ్చఁ బచ్చతోర
ణంబు వొడసూప వరుసఁ గన్యాగృహంబు
నరపతి కమూల్యకల్యాణగరిమఁ దెలిపె. 61

తొలుదొలుతన్ = ముందుముందుగా, భద్రకుంభముల్దోఁపన్ = పూర్ణకలశంబులు గనుపడఁగా ననియర్థము. బంగారుకలశంబు లని భావము. (ని. 'భద్రస్స్యా న్మఙ్గళే హేమ్ని మస్తకే కరణాన్తరే' అని వి.) పిదపన్ = తర్వాత, పచ్చటామానికపునిచ్చఁబచ్చతోరణంబు వొడసూపన్ = పచ్చతోరణంబు గనుపింపఁగా నని యర్థము. మరకతమణిమైన బహిర్ద్వారమనిభావము. (ని, 'తోరణో స్త్రీ బహిర్ద్వారమ్' అని అ.) వరుసన్ = క్రమంబుగా, కన్యాగృహంబు = ఆకన్యకయొక్క మందిరము, నరపతికిన్ = వసురాజునకు, అమూల్య కల్యాణగరిమఁ దెలిపెన్ = అనర్ఘ్యమైన శుభాతిశయమును దెలియఁబఱిచెనని యర్థము. అనర్ఘ్యమగు కాంచనాతిశయంబు నెఱింగించెనని భావము. ని. 'కల్యాణం మఙ్గళే స్వర్ణే' అని నానార్థరత్నమాల.

ఈపద్యమునందలి నిచ్చ యనుపద మన్వయమునఁ గలియకున్నది. నిచ్చ అవ్యయము. వికృతిని సమాసమధ్యగతమగుట పొసఁగదు. కవియాశయ మిట మృగ్యము. తొలుత భద్రకుంభములు తోఁచె ననుటవలన మందిరాగ్రస్థాపితములగుటచేఁ గనఁబడెననియు మందిరము సమీపించినఁగాని పచ్చలతోరణము కనఁబడలేదనియు భావము. కళ్యాణము శుభమునకు వివాహమునకు సూచనము. కళ్యాణమప్రయత్నలభ్యముగాన నమూల్యము.

అలం. శ్లేషము. అనుమానము.

శా. ఆలోఁ గాంచనమందిరంబు నవరత్నాలోక ముల్లోకమై
యాలోకోత్సవ మాచరింపఁ బతి డాయం బోయి ప్రాచీనపుం
జాలుందీవెలచాటున న్నిలిచి వాచాలాళిపక్షానిలా
లోలత్పల్లవజాలమార్గముల నాలోలాక్షి నీక్షించినన్. 62

ఆలోన్ = అంతలోన, కాంచనమందిరంబు = సువర్ణమయమైన గృహముయొక్క, నవరత్న = నవవిధ రత్నములయొక్క, ఆలోక = ప్రకాశము, ఉల్లోకమై = లోకాతీతమై, ఆలోకోత్సవమాచరింపన్ = నేత్రోత్సవము సేయఁగా, (ని. 'ఆలోకౌ దర్శనోద్యోతౌ', అని అ.) పతి = వసురాజు, డాయంబోయి = సమీపముగాఁబోయి, ప్రాచీనపుంజాలుందీవెలచాటునన్నిలిచి = ప్రాచీనమనఁగా నింటికిఁ జుట్టు వార నుండెడు కంచెకుఁబేరు. (ని. 'ప్రాచీనం ప్రాన్తతోవృతిః' అని అ.) ప్రాచీన = అట్టి కంచెకోటసంబంధమైన చాలుపుగానున్న తీఁగెలయొక్క మరుగుననుండి, ఇక్కడఁ జా ల్ననెడుపద ముకారాంతముగనుక సమాసమందు నుమాగమము వచ్చినది. (శ్లో. 'సరళే పరుషేచైవ సమాసే నుమతో భవేత్' అని యథర్వణవచనము.) వాచాల = ఝుంకారధ్వనిసేయుచున్న, అళి = తుమ్మెదలయొక్క, పక్ష = ఱెక్కలవలనఁబుట్టిన, అనిల = వాయువుచేత, ఆలోలత్ = అంతటఁ జలించుచున్న, పల్లవ = చిగురటాకులకొదు, జాలమార్గములన్ = గవాక్షరంధ్రములనుండి, ఆలోలాక్షిన్ = ఆగిరికా

దేవిని, ఈక్షించినన్=చూడఁగా అనఁగా గిరికాదేవిని వసుమహారాజు పొంచుండి చూచె నని భావము. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

కంచెగానున్న తీవియలచాటుననున్న మందిరమంజరి జవరాలు కానరాకుండ వలసిన జెకాసి తుమ్మెద ఱెక్కలచేఁ జివుళ్ళకదలుటవలన పన్నింప పీలుచిక్కెనది. తుమ్మెదలఝంకారములు వసురాజు రాకవలనఁ గలిగిన చప్పుడు మరుగుపఱచెను. తుమ్మెదలు అంతట చరించుటచేతఁ గంచెకు జాలపూర్ణము లేర్పడెననుట.

తా. అంతలో వసురాజు నవరత్నస్థగితమై ప్రకాశమున కాటపట్టుగానున్న యాదివ్యమందిరము జూచి కంచెచాటున నిలిచి తుమ్మెదలఱెక్కలచేఁ గదల్పఁబడు చివుళ్ళసందునుండి సతీమణిని సందర్శించెను.

చ. కనుఁగవ పూర్ణకామ మగుఁ ◆ గన్గవకన్నను బూర్ణకాము మై
మన మతిచిత్రవృత్తి యగు◆మానసవృత్తికి మున్న చిత్రమై
తనువు రసోత్తరంగ మగుఁ ◆ దత్తనువైఖరికన్న సంభ్రమం
బెనసి రసోత్తరంగమగు ◆ నీప్సిత మానగమానభేదికిన్. 63

ఆనగమాన భేదికిన్=కోలాహలపర్వత గర్వభంగము చేసిన యావసురాజునకు, కనుఁగవ=నేత్రయుగళము, పూర్ణ=సంప్రాప్తమయిన, కామమగున్ = మనోరథముగలది యగును, మనము=మనస్సు, కన్గవకన్నను=పూర్ణకామమయిన నేత్రయుగళమునకంటె మిక్కిలియుఁను, పూర్ణకామమయి=సంప్రాప్తమనోరథమయి యని యర్థము, పూర్ణుఁడయిన మన్మథుఁడుగలదై యని భావము. (శ్లో. 'కామః స్మరేఽభిలాషేచ' అని వి.) అతిచిత్రవృత్తియగున్=అత్యద్భుతవృత్తియగునని యర్థము. తనువు=శరీరమును, మానసవృత్తికిమున్న=అతిచిత్రవృత్తియయిన మనస్సుకంటెముందుగా, చిత్రమై=అత్యంతచిత్రవృత్తియయి యని యర్థము. చిత్రప్రతిమవలెఁ జేష్టారహితమయి యని భావము. (ప. 'చిత్రం స్యా దద్భు తాలేఖ్య తిలకేషు' అని వి.) రసోత్తరంగమగున్=రసమనఁగా స్వేదజలము, దానిచేత సాంద్రమగునని యర్థము. ఈప్సితము=అభిలాషము, తత్తనువైఖరికన్నన్=రసోత్తరంగమయిన యాశరీరమునకంటె మిక్కిలియుచు, సంభ్రమంబెనసి=తొట్రుపాటుఁ జెంది, రసోత్తరంగమగునని యర్థము. రసమనఁగా నిక్కడ ననురాగము. దానిచేత నతిశయించెనని భావము. (వి. 'శృఙ్గార ముఖ్యమధురాది సువర్ణరేతో నిర్యాసరాగగరళద్రవపారదేషు, ఆస్వాదనధ్వని సుధాంబురసాఖ్య ధాతుష్విష్టో రసోధరసపాధరణీరసాస్యాత్' అని నా.) అనఁగా గిరికాదేవిని జూడఁగానే వసురాజునకు నేత్రద్వయము పొందఁబడిన కోరిక గలదాయెననియును మనస్సు మన్మథాధీనమయి యద్భుతవ్యాపారయుక్తమాయె ననియును శరీరము చిత్రప్రతిమవలెఁ జేష్టారహితమయి స్వేదజలసాంద్రమాయె ననియును నభిలాషము తొందరపాటుఁ జెంది యనురాగాతిశయముతోఁ గూడినదాయె ననియును భావము. ఇటఁ జక్షుఃప్రీతి, మనస్సంగము లోనగుననంగదశలు వివరింపఁబడెను. చక్షుఃప్రీతియన దర్శనేచ్ఛ; రసగంగాధరమునందలి 'తత్ర స్త్రీపుంసయోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషో రతిః స్థాయిభావః' అను వాక్యమువలన స్త్రీపురుషులకుఁ బరస్పరాలంబనమై ప్రేమయని చెప్పఁబడు చిత్తవృత్తివిశేషము రతి. అదిస్థాయిభావమగును. అనంగదశలు పదియని కొందఱు పండ్రెండని కొందఱు అలంకారికులు నిర్వచించియున్నారు. పదియనుపక్షమే బహుజనగణనీయము.

"చక్షుః ప్రీతి ర్మనస్సంగః సంకల్పోథ ప్రజాగరః
అరతిః స-జ్వరః కార్శ్యం లజ్జాత్యాగో భ్రమోమృతిః
దశావస్థాభవం త్యేతే విప్రలంభేభిలాషజే."

తా. ఆచెలువరూపు చూచినంతనె కనులకు దర్శనోత్సుకత్వము మెండయ్యెను. మనస్సు చిత్ర వృత్తులకు నెలవయ్యెను. మేన స్వేదజలమూరెను. అన్నిటికంటె నతిశయముగా ననురాగము జనించి వసురాజును లోఁగొనెను.

మ. జననాథోత్తముఁ డింతిఁ జూడ ననిమేషత్వంబుఁ గాంక్షించు న
య్యనిమేషత్వము కాంత కాంతముఖచంద్రాసేవనానంద వా
సనఁ బ్రాపించినఁ గోరు నప్పు డనిమేషస్వామిభావంబుఁ గ
న్గొన నెందుఁ న్నృపు లుత్తరోత్తరపదాన్యూనస్పృహాచంచలుల్. 64

జననాథోత్తముఁడు=వసురాజు, ఇంతిఁజూడన్=ఆగిరికాదేవిని చూచుటకు, అనిమేషత్వంబుఁ గాంక్షించున్=దేవత్వమును గోరునని యర్థము. ఱెప్పపాటులేకయుండుటను గోరునని భావము. అయ్యనిమేషత్వము=ఆదేవత్వమును, కాంత=సౌందర్యవతియయిన, కాంత=గిరికాదేవియొక్క, (శ్లో. 'కాన్తం చారౌ స్త్రీతు యోషి త్ప్రియస్త్రీ వృషలే పివా' అని. నా.) ముఖ=వదనమనెడు, చంద్ర=చంద్రకళామృతముయొక్క, ఆసేవన=సమగ్రసేవనమువల్లనయిన, ఆనంద=సంతోషముయొక్క, వాసనన్=సంస్కారముచేత, ప్రాపించినన్=పొందఁగాననిని యర్థము. (శ్లో. 'ప్రథమాంపిబతే వహ్ని ర్ద్వితీయాంపిబతే రవిః' అను నిత్యాదివచనములవలన దేవతలకుఁ జంద్రకళామృతపానము స్వభావ ధర్మము.) గిరికాదేవిముఖము నిత్యాదరముచేతఁ జూచుచుండుటవలన ఱెప్పపాటులేకయుండుట సిద్ధింపఁగా ననిభావము. అప్పుడు=ఆసమయమందు, అనిమేషస్వామిభావంబు=దేవాధిపతిత్వమును, అనఁగా నింద్రత్వమునని యర్థము. వేయికన్నులు గలిగియుండుట నని భావము. కోరును=కాంక్షించును, కన్గొనన్=విచారించిచూడఁగా, ఎందున్=ఎచ్చోటను, నృపులు=రాజులు, ఉత్తరోత్తరపద=అంతకంతకు హెచ్చైనస్థానములందలి, అన్యూన=అధికమయిన, స్పృహా=అపేక్షయందు, అచంచలుల్=చలింపనివారుగదా యని యర్థము. ఏమనిన, వసురాజు మనుజుఁడైయుండి ముందుగా దేవత్వముఁగోరి యది సిద్ధింపఁగానే యింద్రత్వముఁ గోరినాఁడు గనుక రాజు లంతకంతకు హెచ్చైనయధికారమునే కోరుచుందురనుట. (శ్లో. 'అసంతుష్టా ద్విజానష్టా స్సంతుష్టా ఇవ పార్థివాః, సలజ్జాగణికానష్టా నిర్లజ్జేవకులాఙ్గనా' అనియున్నది.) అనఁగా వసురాజు గిరికాదేవిని జూచునెడల ముందుగా ఱెప్పపాటు లేని చూపులు గలుగుటను గోరి గిరికాముఖవీక్షణాత్యాదరముచేత నది సిద్ధింపఁగా నంతటఁ దనివితీరక వేయిగన్నులు గలుగుటకుఁ గోరెనని భావము. అలం. పరికరము. అర్థాంతరన్యాసము.

తా. ఆచెలువ చక్కఁదనము చూచుటకు ఱెప్పపాటు ఆటంక మగునేమొ యని వసురా జని మేషత్వము కోరును. ఆచెలువమోము జాబిల్లిని సేవించుటచే ననిమేషత్వము సిద్ధింప నంతతోఁ దనివి నొనక నిలువెల్లకన్నులైన నాసుందరరూపరేఖ లింకఁ దృప్తిదీఱఁగఁజూడవచ్చుగదా యని యనిమేషస్వామి భావము కోరెను. రాజులు అంతకంతకు హెచ్చగు పదవి కోరువారుగదా!

తే. కాంతపద మొంది యటయూపఁ గ్రమ్మి కాంచి, సీమ నెనసి పయోధర శిఖరిదుర్గ
సంగతికి లాచు నృపదృష్టి చక్రశాస, నోన్నతస్థాన మపుడుగా నొదవుఁ దనకు.

నృపదృష్టి=వసురాజుచూపు, కాంతపద మొంది=గిరికయొక్క పాదముఁ జేరి యనియర్థము. రమ్యమయిన స్థానమును బొందియని యర్థాంతరము. అటయూపఁ గ్రమ్మి = ఆపిమ్మట తొడ లావరించియని యర్థము. గ్రామము నాక్రమించి యని యర్థాంతరము. కాంచిసీమ నెనసి=కటిప్రదేశము గలిసికొని యని యర్థము. మేఖలాసీమ నెనసియని యర్థాంతరము. వెంటనే ముందర శిఖరిదుర్గ మని చెప్పినాఁడు గనుకఁ గాంచీపదము మేఖలాశబ్దార్థకమని గ్రహింపవలయును. మేఖలయనఁగాఁ బర్వతనితంబము. (ని. 'మేఖలా ఖడ్గబన్ధే స్యాత్కాఞ్చీ శైలనితమ్బయోః' అని వి.) పయోధరశిఖరి దుర్గసంగతికిన్ = కుచగిరులయొక్క దుర్గమయిన సంగతికి, అనఁగాఁ బొంద శక్యముగానిసంగతికి' లాచున్ = వెనఁగులాడుచున్నదియని యర్థము. మేఘయుక్తపర్వత దుర్గసంగతికి లాచుచున్నదని యర్థాంతరము. తనకున్ = అనఁగా నృపదృష్టియయిన తనకు, అపుడుగా=అనఁగాఁ బయోధరశిఖరిదుర్గ సంగతి గలిగినప్పటికిఁగదా, చక్రశాసన = చక్రవాక నిరాసకమయిన ఉన్నతస్థానము. కుచప్రదేశము అని యర్థము. రాష్ట్రప్రతిపాలకమయిన యున్నతస్థాన మని యర్థాంతరము. (ని. 'చక్రం చ యే జలావర్తే రథాఙ్గే రాష్ట్రసైన్యయోః, ఘటసాధనభేదేపి క్లీబే కోకేతు పుంస్యయమ్' అని నా.) ఒదవున్ = లభించును అని యర్థాంతరము.

అనఁగా వసురాజుయొక్క దృష్టి ముందుగా గిరికాదేవి పాదములయందుఁ బ్రసరించి తర్వాతఁ దొడల నావరించి యాపిమ్మటఁ గటిప్రదేశమును గలిసికొని యక్కడనుండి గమింప శక్యముగాని కుచగిరులతోఁ గూడుకొనుటకుఁగా నధికప్రయత్నము సేయుచుండెనని తాత్పర్యము. అనఁగా నంత పర్యంతము నొకలాగున వచ్చినదై యక్కడనుండి కుచములు దాఁటి పోఁజాలకుండెనట. అర్థాంతర మందలి భావము. ఎవఁడైన నొకానొకఁడు నిరాశ్రయముగా నున్నవాఁడై ముందుగాఁ గొంచెము యుక్తమయినస్థలమును సంపాదించుకొని యాపిమ్మట నొకగ్రామ మాక్రమించుకొని యావెంబడి నొకసీమను, అనఁగాఁ దాలూకాను స్వవశము చేసికొని యక్కడనుండి పర్వతదుర్గము నవలంబించుటకుఁ దగినయత్నము సేయుట యుక్తమని తెలియవలయును. అలం. శ్లేషమూలకమగు సమాసోక్తి.

మ. నిరతిన్ నాభిసురంగ మీఁగియు వళీనిశ్రేణికన్ హత్తియు
న్వరరోమావళివల్లరీగుణము నంటం బ్రాకియుం దత్పయో
ధరదుర్గంబుల నాక్రమించె నచలేంద్రద్వేషిచూపౌర సం
గరసామోదవినిద్రవృత్తికి నశక్యం బెద్దియుం గల్గునే. 66

అచలేంద్ర=పర్వతశ్రేష్ఠుఁడైన కోలాహలునికి, ద్వేషి = శత్రువైన, లేక (ని. 'అచలో ద్రౌభు వ్యచలా' నా.) అనియుండుటవలన నచలశబ్దము పర్వతమందును, అచలాశబ్దము భూమియందును వర్తించును గనుక అచలేంద్రులనఁగా భూమీంద్రులైన శత్రురాజులు, వారికి ద్వేషియైన వసురాజు యొక్క, చూపు=దృష్టి, నిరతిన్ = అధికాసక్తిచేత, నాభిసురంగ మీఁగియున్ = గిరికాదేవియొక్క బొక్కిలియనెడు సొరంగములో దూరియును, వళీ = ముత్తరులనెడు అనఁగా కడుపుమీఁద నుండెడు మూఁడుమడతలనెడు, నిశ్రేణికన్ = నిచ్చెనను, (ని. 'నిశ్రేణి స్త్వధిరోహిణీ' అని అ.) హత్తియున్ =

హత్తుకొనియును, వర = శ్రేష్ఠమయిన, రోమావళివల్లరీ = వల్లరియనఁగాఁ దీఁగెవలెనున్న నూఁగారనెడు, గుణమును = లగ్గపట్టుత్రాడును, అంటంబ్రాకియుఁన్ = చివరముట్టనల్లుకొనియుఁను, తత్ = ఆ గిరికయొక్క, పయోధర = కుచములనెడు, దుర్గంబులన్ = పర్వతదుర్గములను, ఆక్రమించెన్ = స్వవశము చేసికొనెను. చోర = ఆశ్చర్యము, సంగరస=సంభోగానురాగమందలి, ఆమోద = సంతోషముచేతనైన, వినిద్రవృత్తికిన్ = నిద్రారహితవ్యాపారము గలవానికి, అనఁగా జాగరూకత గలవానికని యర్థము. సంగర = యుద్ధమందు, సామోదవినిద్రవృత్తికిన్ = సంతోషయుక్తమైన జాగరూకతగలవానికని యర్థాంతరము. అశక్యం బెద్దియుం గల్గునే = శక్యముగానిపని యేదైననున్నదా, అనఁగా లేదనుట.

రాజుయొక్క దృష్టి సంభోగానురాగసమ్మోదముచేత హెచ్చరికగలదై గిరికాదేవియొక్క నాభీబిలములోఁ జొచ్చి వళిత్రయమును హత్తుకొని రోమావళివెంటఁ బ్రాకి కుచములమీఁదఁ బ్రసరించెనని యర్థము. అర్థాంతరమందలి భావము. ఎవఁడైన నొకఁడు యుద్ధమందలి యుత్సాహముతోఁ గూడిన జాగ్రత్తగలవాఁడై నేలసొరంగముఁ ద్రవ్వించి దానినుండి దూరిపోయియైనను లేక నిచ్చెనయొక్క సహాయముచే నెక్కియయినను లగ్గపట్టుత్రాళ్ళవెంటఁ బ్రాకి యయినను దుర్గము సాధించి యాక్రమించుకొనుట యుక్తము గదా. అలం. సమాసోక్తి. అర్థాంతరన్యాసము.

ఉ. ఆమనుజేంద్రుచూపు తిల♦కాంచిత మై నెఱదావి చల్లునా
రామముఖంబునన్ నెరయ♦వ్రాలును హాస మరంద చిక్కణం
బై మెఱుఁ గారుగండఫల♦కామృతభానుశిలాతలంబుల
న్వేమఱు జారి యూతఁ గొను♦నిద్దపుఁ బెన్నెఱితీవజొంపముల్. 67

ఈపద్యమం దంతటను రూపకమున్నందున రాజుదృష్టిని తుమ్మెదగా నిరూపణము సేయఁజనును. (కావుననే యేకదేశవర్తిరూపకము.) ఆమనుజేంద్రుచూపు = ఆవసురాజుదృష్టి, తిలకాంచితమై= కస్తూరీతిలకముచేత నొప్పుచున్నదై, నెఱదావిచల్లు = నిండువాసనను వెదచల్లుచున్న, వ్యాపింపఁజేయుచున్న, ఆ రామ ముఖంబునన్ = ఆ గిరికాదేవియొక్క ముఖమందని యర్థము. తిలకవృక్షాంచితమయి పుష్పవాసనలను వ్యాపింపఁజేయుచున్న యుద్యానవనాగ్రమం దని యర్థాంతరము. ఆరామముఖంబున నన్నచోట రామయొక్క ముఖమనియు, నారామముయొక్క ముఖమనియును విచారింపవలయును. నెరయ వ్రాలుచున్ = అంతటఁ గలయవ్రాలుచు, హాస = నవ్వనెడు, మరంద= పూఁదేనియచేత, చిక్కణంబై = నునుపువారినదై, మెఱుఁగారు = మెఱయుచున్న, గండఫలక = పలకలవంటి చెక్కిళ్ళనెడు, అమృతభానుశిలాతలంబులన్ = చంద్రకాంత శిలాప్రదేశములయందు, వేమఱుజారి = పలుమాఱును జారి పడఁబోవుచు, నిద్దపుఁ బెన్నెఱితీవజొంపముల్ = స్నిగ్ధములైన గొప్ప తలవెండ్రుకలనెడు తీఁగెగుంపులను, ఊఁతఁగొనున్ = గట్టిగాఁ బట్టుకొనును.

తా. వసురాజుయొక్క చూపు గిరికాదేవియొక్క కస్తూరీతిలకముచేత శోభిల్లుచున్న ముఖసౌందర్యము నంతయు గ్రహించుచును నవ్వుచేత దట్టమై తళతళ మెఱయుచును ఇంద్రకాంతమణిశకలములవలె నున్న చెక్కిళ్ళయందు నిబ్బరముగా నిలువలేక బెసికిపోవుచును నిగారమయి సొగసైయున్న తలవెండ్రుకలపై వ్యాపించి నిలిచెను. (అర్థాంతరమందలి భావము.) తుమ్మెదతిలకవృక్షాంచితమయి పుష్పవాసనను గుప్పుచుండెడు నుపవనాగ్రమందంతట వ్రాలుచును మకరందముచేత నునుపు

వారియున్న చంద్రకాంతశిలలయందు వ్రాలి యచ్చోట నిలుచ నవకాశము లేక లేఁగెగుంపుల నవలం బించియుండుట యుక్తంబ కదా.

అలం. శ్లిష్టరూపకము.

సీ. పదములఁ బల్లవింపఁగ నోపుఁ దొడల మంగళమహారంభాప్తిఁ గాంచ నోపుఁ
గటిఁ గరిస్కంధాధిగమలీలఁ గన నోపు నసదుగా నెవసి మిన్నంద నోపు
గుబ్బలసిరికల్మిఁ గొండఁ దాఁకఁగ నోపు నళుత నొక్కనిధాన మరయ నోపుఁ
జక్కెరమోవి నిష్టఫలం బెనయ నోపు శ్రుతుల శ్రీలనె యెదుర్కొనఁగ నోపు
తే. రమ్యవదనాబ్జమునఁ బూర్ణ రాజమండ, లాధిపత్యశుభావాప్తి నలర నోపుఁ
గురుల ఘనసంపదలు చూఱఁగొనఁగ నోపు, నింతి నెమ్మేనఁ బర్వు నుర్వీశదృష్టి.

ఇంతినెమ్మేనఁబర్వు=గిరికాదేవియొక్క దేహమందు వ్యాపించిన, ఉర్వీశదృష్టి = వసురాజు యొక్క చూపు, పదములన్ = పాదములయందు వ్యాపించి, పల్లవింపఁగనోపున్ = ఉల్లసించఁగ నోపునని యర్థము. చిగురువెట్టనోపు నని భావము. పద రూపపల్లవము గలదనుట. తొడలన్ = ఊరువులయందు, మంగళమహారంభాప్తిఁ గాంచనోపున్=శుభారంభప్రాప్తిని బొందనోపుననియర్థము. మంగళార్థమయిన కదళీస్తంభాప్తిని గాంచనోపు నని భావము. ఊరుకాండరూప రంభాస్తంభాప్తిఁ గాంచుననుట. కటిన్=పిఱుఁదునందు, కరిస్కంధాధిగమలీలఁ గననోపున్ = ఏనుఁగునెక్కనోపునని యర్థము. గజమస్తకప్రాప్తిఁ గాంచనోపు ననిభావము. కటిరూపగజమస్తకప్రాప్తిఁ గాంచు ననుట. అసదుగానెవసి=సూక్ష్మమయిన మధ్యప్రదేశమును బొందినదై, మిన్నందనోపున్=మిన్ను ముట్టనోపు నని యర్థము. గగనస్పర్శము సేయనోపు నని భావము. మధ్యరూప గగనమును స్పృశించుననుట, గుబ్బలసిరికల్మిన్=సిరియనఁగా సంపదయనియర్థము. కాంతియనిభావము. స్తనసంపత్సమృద్ధియందు, కొండఁదాఁకఁగనోపున్=కొండతో ఢీకొననోపునని యర్థము. పర్వతస్పర్శ సేయనోపు నని భావము. పయోధరరూప పర్వతములఁ దాఁకుననుట. అళుతన్=కంఠమందు, ఒక్కనిధాన మరయనోపున్ = అనిర్వాచ్యమయిన యొక నిక్షేపమును గననోపు నని యర్థము. శంఖమును గననోపుననిభావము. కంఠ రూపశంఖము నరయుననుట-ఇక్కడ నొక్కనిధానమని చెప్పుటచేత, ని 'మహాపద్మశ్చ పద్మశ్చ శంఖో మకరకచ్ఛపౌ, ముకున్దః కున్ద నీలౌచ వరశ్చ నిధయో నవ' అమరశేషము. అను నీశ్లోక మునఁ జెప్పఁబడిన నవనిధులలో నొకటైన శంఖము లక్షిత మగుచున్నది. చక్కెరమోవిన్=పంచ దారతో సమానమైన మాధుర్యముగల పెదవియందు, ఇష్టఫలం బెనయనోపున్ = అభీష్టఫలమును బొంద నోపు నని యర్థము. మధురఫలమును బొందనోపునని భావము. అధరోష్ఠరూప మధురఫలము నెనయు ననుట. శ్రుతులన్=కర్ణములయందు, శ్రీలనెయెదుర్కొనఁగనోపున్=సంపదల నెదుర్కొననోపునని యర్థము. శ్రీకారముల నెదుర్కొననోపు నని భావము. శ్రవణరూపశ్రీకారముల నెదురుకొనుననుట.

రమ్యవదనాబ్జమునన్ = సుందరమయిన పద్మమువంటి ముఖమందు, పూర్ణ=సంపూర్ణమయిన, రాజమండల=రాజసమూహముయొక్క, అధిపత్య=ప్రభుత్వముయొక్క, శుభావాప్తిన్=శుభప్రాప్తిచేత, అలరనోపున్ = సంతోషింపనోపుననియర్థము. సంపూర్ణచంద్రమండలాధిపత్యముయొక్క శుభావాప్తి నోపునని భావము. వదనరూప సంపూర్ణచంద్రమండలాధిపత్యముయొక్క శుభావాప్తిచేత నలరుననుట. కురులన్=తలవెండ్రుకలయందు, ఘన=అధికులయిన పరరాజులయొక్క, సంపదలు=విభవములను,చూఱ

గొనఁగనోపుఁ గాదె=దోఁచుకొననోపునని యర్థము. మేఘసంపదలు చూఱఁగొననోపునని భావము. కుంతల రూపమేఘసంపదలు చూఱఁగొనుననుట. రాజదృష్టి గనుక రాజోచితకార్యము లాచరింపఁ దగి యుండెనని తెలియవలయును.

ఇందుకుఁ బల్లవించుట మొదలుకొని ఘనసంపదలు చూఱఁగొనుటతుదిగా రాజకీయములయిన యుత్తరోత్తరావస్థలను యథాక్రమముగాఁ జెప్పినాఁడు. పాదాది చికురపర్యంతవర్ణనము స్పష్టము. ఇక్కడ నతిశయోక్త్యనుప్రాణితమయిన సమాలంకారము. కనుఁగవ పూర్ణకామ మగు ననెడి పద్యము మొదలుకొని యీపద్యమువఱకుఁగల యీయుపద్యములయందును వసురాజునకు మన్మథద్వాదశావస్థలలోఁ బ్రథమావస్థయైన నయనోత్సవంబును జెప్పినాఁడు. ఇందుకు, శ్లో. 'ఆదరా ద్దర్శనం చక్షుః ప్రీతి రిత్యభిధీయతే' యని లక్షణము. ఆదరముచేత నాయికం జూచుట నయనోత్సవమనుట. గీ. 'ద్వాదశావస్థ లీక్షణోత్సవము చిత్త, సంగమంబును సంకల్పసంప్రతాప, జాగరము కార్శ్య మరతి లజ్జానిముక్తి, సంజ్వరోన్మాదమూర్ఛనాచరమములును.' ఇవి మన్మథద్వాదశావస్థలు కొందఱు సంప్రతాప సంజ్వరము లనురెండవస్థలు విడిచిపెట్టి మిగులు పదియ యవస్థలని యెంతురు. రతి యంకురపల్లవాద్యవస్థాపంచకముగలది. అందు అంకురావస్థయందుఁ బ్రేమమని పల్లవావస్థయందు మానమని కలికావస్థయందుఁ బ్రణయమని పుష్పావస్థయందు స్నేహమని ఫలావస్థయందు రాగమని భోగావస్థయందు అనురాగమని యాలంకారికులందురు. మొదటివైదును నభిలాషజన్యవిప్రలంభమునందును గడపటిదియగు భోగావస్థ సంభోగశృంగారమునందును జేరియుండును. ఇందులకుఁ బ్రమాణము.

శ్లో. అంకురః పల్లవః కలికా ప్రసూన ఫల భోగభాగియం క్రమశః
ప్రేమామానః ప్రణయస్స్నేహో రాగోఽనురాగశ్చ.
ఇయ మంకురితా ప్రేమ్ణా మానా త్పల్లవితా భవేత్
సకోరకా ప్రణయత స్స్నేహా త్కుసుమితా భవేత్.
రాగా త్ఫలవతీ సేయ మనురాగేణ భుజ్యతే.

తే. వాఙ్మనసగోచరేతర రాఁ•ద్వైతరాగ, జలధి నపు డోలిఁ దేలి రాఁ•జన్యమౌళి
ఘనతరాశ్చర్యశాలియై • వనితరూప, మనితరాయత్త మగునాత్మ • నభినుతించె.

వాఙ్మనసగోచరేతర=వాక్కునకును మనస్సునకు గోచరముగానిదియు, అద్వైత=అద్వితీయమయినదియునగు, రాగ=శృంగారస్థాయిభావమనెడు, జలధిన్=సముద్రమందు, అపుడు=ఆసమయమందు, ఓలిన్=యుక్తమౌనట్టులుగా, తేలి=ఓలలాడి, రాజన్యమౌళి=వసురాజశిఖామణి, ఘనతరాశ్చర్యశాలియై = అధికమయిన యాశ్చర్యముతోఁ గూడుకొన్నవాఁడై, వనితరూపము = గిరికాదేవి యొక్క యాకృతిని, అనితరాయత్తమగు=పరాధీనము గాకయున్నట్టి, ఆత్మన్=తనహృదయములో, అభినుతించెన్=కొనియాడెను.

ఇక్కడ రాగమనఁగా స్థాయిభావము. సజాతీయమయిన నాయికాంతరాసక్తిచేతను విజాతీయమయిన క్రోధాదికముచేతను గొట్టఁబడక నిల్చి సజాతీయవిజాతీయములను స్వస్వరూపములనుగాఁ జేయు రాగము శృంగారస్థాయిభావ మనఁబడును. దీనికి, శ్లో. 'సజాతీయై ర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్, యావద్రసంవర్తమానస్థాయీభావ ఉదాహృతః.' అని లక్షణము, రాగము జలధి

యనుటవలన జనసామాన్యము దానిని తరింపఁజాలరనుట. కావుననే దాని గొప్పతనము వాక్కునకు మనస్సునకు గోచరముకానిది. దానికి సాదృశ్యము లేదు. కావుననే యపూర్వతము. దాగము ౭ నాకవెంపఁ బడుటయే హృదయము పరాధీనమగుటకు హేతువు. లోకాతిశయసౌందర్యము ఆశ్చర్యకరము.

సీ. ఘనలక్ష్మినెసఁగునం♦గనముంగురులపేర భ్రమరకంబులు ధాత్రిఁ♦బ్రబలఁబోలుఁ
గమలావళినదల్చు♦విమలాంగిమోముతో నొనఁగూడిసన్మిత్రుఁ♦డొనరఁబోలు
నమృతసంగత మైన♦యతివచక్కోరమోవి నీడ దై బింబంబు ♦ నెగడఁ బోలు
మేలిమిగట్టు లౌ♦మెలఁతచన్నుల కనుం గై గోత్రవర్గ మిం♦పలరఁ బోలు
తే. సాటి రాఁ బోలు సరులు భుఁ♦జాలతలకుఁ
జక్ర మేల్బడి గాఁబోలు ♦ జఘనరమకుఁ
దమ్ములు పదానుజన్ము లై ♦ తనరఁ బోలుఁ
బ్రసవములు గోళ్లనిసువు లై ♦ యెసఁగఁ బోలు. 70

ఘనలక్ష్మినెసఁగు = అధికసంపదచేత నొప్పుచున్న, అంగనముంగురులపేరన్ = స్త్రీయొక్క నుదుటిపై కురులయొక్క పేరునువహించి, భ్రమరకంబులు=తుమ్మెదలు, ధాత్రిన్ = భూమియందు, ప్రబలఁబోలున్ = వృద్ధిఁబొందఁబోలునని యర్థము. ఇక్కడ భ్రమరకము లనఁగా ముంగురులును దుమ్మెదలును, (శ్లో. 'భృంగాలకౌ భ్రమరకౌ' అని నా.) ముంగురులు ఘనలక్ష్మినెసఁగు ననఁగా మేఘకాంతిచేత నొప్పునని భావము. కమలావళినదల్చు = పద్మపంక్తిని ధిక్కరించుచున్న, విమలాంగి మోముతోన్ = ఈస్త్రీయొక్క ముఖముతోడ, ఒనఁగూడి = జతగలిసి, సన్మిత్రుఁడు = అనఁగా నక్షత్రముల కాప్తుఁడైన చంద్రుఁడు, ఒనరఁబోలున్ = సన్మిత్రుఁడై యొప్పుచుండఁబోలునని యర్థము. అనఁగా శ్రేష్ఠుఁడైన సఖుఁడై యొనరఁబోలుననుట. (శ్లో. 'సక్ సత్యే విదుషి శ్రేష్ఠే సాధౌ భవతి చ త్రిషు, సల్లీకబ మృషే' అని నా.) ఇక్కడ ముఖమునకుఁ జంద్రునకును బద్మనిరాసకత్వము సమానకార్యము గనుక మైత్రి కర్తృత యని తెలియవలయును. అమృతసంగతమైన = సుధాపూరితమైన, అతివచక్కెరమోవి = ఈస్త్రీయొక్కచక్కెరవలెఁ దియ్యనైన పెదవియొక్క, నీడదై = ఛాయదై, బింబంబు = దొండపండును, నెగడఁబోలున్ = బింబమనునట్టులుగాఁ బ్రసిద్ధిఁబొందఁబోలును. బింబ మనఁగా నీడయును దొండపండును, (శ్లో. 'ప్రతిబింబే తత్ప్రకృతౌ ప్రతికృత్యాంచమండలే, వాంఛనే పిచ బింబో స్త్రీ నద్వయో ర్బింబికాఫలే' అని నా.) మేలిమిగట్టులౌ = మేలిమిబంగారుకొండలైన, మెలఁతచన్నులకున్ = ఈస్త్రీయొక్క కుచములకు, అనుంగై = నెనరంటినదై, గోత్రవర్గము = పర్వత సమూహము, ఇంపలరఁబోలున్ = గోత్రవర్గమనునట్టులుగా హితమై యొప్పఁబోలును అని యర్థము. గోత్రవర్గమనఁగా నిక్కడ బంధుసమూహమును, బర్వతసమూహంబును గనుకఁ జన్నులను బంగారు కొండలుగాఁ జెప్పి పర్వతములకు సంబంధము దెచ్చినాఁడు.

సరులు=అనఁగా హారములు, భుజాలతలకున్ = ఈస్త్రీయొక్క తీఁగెలవంటి భుజములకు, సాటి రాఁబోలున్ = సరులనునట్టులుగా, అనఁగా సమానము లనునట్టుగా నీడుపడఁబోలును. సరియనఁగా సమానంబును, హారంబును, చక్రము=బండికల్లు, జఘనరమకున్ = ఈస్త్రీయొక్కకటిపురోభాగసమృద్ధికి, ఏల్బడిగాఁబోలున్ = చక్రమునునట్టులుగా నేలుకోఁదగినదిగాఁ బోలును. చక్రమనఁగా నిక్కడ

గొలుచునట్టి సైన్యము, తమ్ములు = కమలములు, పదానుజన్ములై = ఈస్త్రీయొక్క పాదములకుఁ దోడఁ బుట్టినవై, తనరఁబోలుక్ = తమ్ములనునట్టులుగా నొప్పఁబోలు నని యర్థము. తమ్ములనఁగా నిక్కడఁ గనిష్ఠభ్రాతలు. క. 'తమ్ములు నాఁబెరఁగుఁ బ, ద్మమ్ముల కనుజన్ములకును దరుణేందుధరా' అని యాంధ్రనామసంగ్రహము. ప్రసవములు = పుష్పములు, గోళ్ళనిసువులై = ఈస్త్రీనఖములయొక్క శిశువులై, ఎసఁగఁబోలుక్ = ప్రసవము లనునట్టులుగా వృద్ధిఁబొందఁబోలును. ప్రసవములనఁగా నిక్కడ శిశువులు-ఈపద్యమందు గిరికాదేవియొక్క యాకేశపాదవర్ణనము చేసినాఁడు.

తా. ఆచెలువముంగురులు మేఘములవలెఁ దుమ్మెదలవలె నున్నవి. మొగము తామరపూవువలెఁ జందమామవలె నున్నది. పెదవి యమృతరసమువలె దొండపండువలె నున్నది. చనుదోయి గట్టులవలెను భుజములు పూదండలవలెను పిఱుఁదులు బండికండ్లవలెను పాదములు తామరపూవులవలెను గోళ్లు చివుళ్ళవలె నున్నవి. అలం. కావ్యలింగము. పరికరాంకురము. ఉత్ప్రేక్ష. అంగి.

చ. బొమవిలు చూపుతూపులును • బూని మృగాంకుని గెల్చి యింతిమో
మమృతము మందహాసమునఁ • నచ్ఛపుడాలు కపోలలీల ఫా
లమునఁ గలావిలాస మఖిలంబుఁ గొనం గని వెన్కఁ జొచ్చె న
య్యమృతగభస్తిభీతతిమిరావళి వేనలిపెంపుసొంపునన్. 71

బొమవిలు=కనుబొమ్మయనెడుధనుస్సును, చూపు = వీక్షణములనెడు, తూపులును = బాణములును, బూని=ధరించి, మృగాంకుని గెల్చి-చంద్రునిజయించి, ఇంతిమోము = ఈస్త్రీయొక్క ముఖము, అమృతముక్=చంద్రునిలోనుండు నమృతమును, మందహాసమునక్ = చిఱునవ్వుచేతను, అచ్ఛపుడాలు=నిర్మలమయిన కాంతిని, కపోలలీలక్=చెక్కిళ్ళయొక్క విలాసముచేతను, ఫాలమునక్ = నొసటిచేత, కళావిలాసము=చంద్రఖండముయొక్క డంబము, అఖిలంబుఁగొనక్=సర్వమును హరింపఁగా, కని = చూచినదై, అయ్యమృతగభస్తిభీత = ఆచంద్రునివలన జడిసిన, తిమిరావళి = అంధకారసమూహము, వేనలి పెంపుసొంపునక్ = ఈస్త్రీయొక్క కొప్పనెడు మిషచేత, వెన్కఁజొచ్చెక్ = శరణుఁజొచ్చి వెనుకఁ జేరెను అని యర్థము.

పగవానియొక్క పగవాఁడు బంధువనియున్నది గనుకఁ జీఁకటులు తమకు విరోధియైన చంద్రుని గెలిచిన ముఖమును మిత్రమునుగాఁ దలఁచి వెనుకఁ జొచ్చెననుట. అనఁగా గిరికయొక్క కనుబొమ్మలు వంపఁబడినవిండ్లవలె నున్నవనియుఁ జూపులు బాణములవలె నున్నవనియు ముఖము చంద్రునివలె నున్నదనియు న వ్వమృతమువలె నున్నదనియుఁ జెక్కిళ్లు చంద్రప్రభలవలె నున్నవనియు నొసలు చంద్రకళవలె నున్నదనియుఁ గొప్పు గాఢాంధకారమువలె మిగుల నల్లనై యున్నదనియు ఫలితార్థము.

చంద్రుఁడు మృగాంకుఁడగుటచే నకలంకమగు మొగము గెలువఁజాలినది. గెలుపొందినవారోడినవారి సర్వస్వము వినియోగించుకొందురుగావునఁ జంద్రునియందలి యమృతము చిఱునవ్వునఁ, వెన్నెలనిగ్గు చెక్కులయందును, కళలసొంపు ఫాలముననను నెలకొల్పెను. వేనలి పెంపనుటవలనఁ బెన్నెఱి జంపుగా విశేషముగ నుండెననుట. అలం. అతిశయోక్తి. అపహ్నవము.

చ. బలితపుగుబ్బగుబ్బలులపై నిర వొంది మెఱుంగుదీఁగచే
నలరి హృతాబ్జపూగరుచియై నిరవద్యకలారవామృతం

బులకలిమిం బికాంగనల • మూఁకకు మూకత సంఘటించునీ
చిలుకలకొల్కికంధర భ•జింపఁగఁ జెల్లదె కంధరాంకమున్. 72

బలితపుగబ్బ గబ్బులులపై నిరవొంది = గొప్పవైన చనుఁగొండలమీఁద నొప్పుచున్నదై యని యర్థము. కొండలమీఁదనుండుట మేఘధర్మములని తెలియవలయును. మెఱుఁగుదీఁగెచే నలరి = మెఱుఁగైన బంగారుతీఁగెయనెడు భూషణవిశేషముచేతఁ బ్రకాశించియని కంఠపరమైన యర్థము. మెఱుపుతీఁగెచేత నలరియని మేఘపరమైన యర్థము. హృత = హరింపఁబడిన, అబ్జ=శంఖముయొక్కయు, పూగ = పోఁకప్రాసి కుత్తుకయొక్కయు, రుచియయి = శోభగలిగినదై యని కంఠపరమైనయర్థము. హృతాబ్జపూగ రుచియై యనఁగా హరింపఁబడిన పద్మసమూహశోభగలదై యని మేఘపరమైనయర్థము. కమలమునకు మేఘము ప్రతికూలమగుట ప్రకటముగదా. (ని. 'అబ్జోధన్వంతరౌచంద్రే నిచుళే శంఖ పద్మయోః' అని వి. ని. 'పూగః క్రముక బృన్దయోః' అని అ.) నిరవద్య = అనింద్యమయిన, కల = అవ్యక్తమధురమైన, అరవామృతంబులకలిమిన్ = అమృతప్రాయములైన స్వరములకలిమిచేత నని కంఠపరమైన యర్థము. నిరవద్యమయిన గర్జారవముయొక్కయు జలసందోహములయొక్కయు కలిమి చేతనని మేఘపరమయిన యర్థము. అమృతమనఁగా నుదకమునకును పేరు. ని. 'స్యాద్యజ్ఞశేషాంబు నభో రసాయన క్షీరాజ్య సోమాన్న సుధాసు చామృతమ్' అని నా. పికాంగనలమూఁకకున్ = ఆఁడుకోయిలలయొక్క సమూహమునకు, మూకతసంఘటించు = మూఁగతనము సంపాదించుచున్న, అనఁగా నీకంఠస్వర మాధుర్యముతోఁ దమకంఠనాదము సమానము గాదని సిగ్గుపడి కోయిలలు పలుకకుండునని తాత్పర్యము. వర్షర్తువునందుఁ గోయిలలు కూయుటలేదు గనుకఁ బికసమూహములకు మూకత్వమును సంఘటించుటయు మేఘధర్మంబ యని విచారింపవలయును. ఈ చిలుకలకొల్కికంధర= ఈముద్దుగుమ్మయొక్క కంఠము, కంధరాంకమున్ = కంధరమను మేఘనామమును, (ని. 'గ్రీవాయాం కంధరా మేఘే పుమాన్' అని నా.) భజింపఁగఁజెల్లదె = వహింపఁగూడదా? అనఁగా వృత్తిసామ్యం బును నామసామ్యంబును గలకంధర, కంధరాంకమును వహించుటకుఁ దగుననుట. వృత్తిసామ్యము నామసామ్యమువలనఁ గంధరాంకము తగియున్నది.

అలంకారము. కావ్యలింగము. పరిణామము.

తా. గుబ్బలకుఁ బైనలరి స్వర్ణభూషాలంకృతమై పోఁకబోఁజె చెలువమును మించి కలరవామృత ముచేఁ గోయిలపులుఁగులకు వాకట్టుచు నాసతికంఠ మలరారుచున్నది.

మ. సమదాభంగమనోజసామజ మురో•జగ్రావలీలాధిక
క్లమమైనాభిసరోంతరంబున మునుం•గం బొంగును ద్వేలభం
గము లయ్యెన్ వళు లంతరాళమునఁ ద•ద్గంధానుబంధంబుచే
నమరుందుమ్మెదచాలు నా నొనరె నూఁ•గారింతి లేఁ గౌనునన్. 73

సమద = మదయుక్తమైనదియు, అభంగ = పరాజయములేనిదియునగు, మనోజ = మన్మథుఁ డనెడు, సామజము = ఏనుఁగు, ఉరోజ = స్తనములనెడు, గ్రావ=పర్వతములయందలి, లీలా=క్రీడల చేత-అనఁగాఁ బర్వతములయందుఁ జేయఁబడిన వప్రక్రీడలచేత ననుట. అధికక్లమమై = అత్యంత

మయిన బడలికగలదై, నాభిసరోంతరంబునన్ =పొక్కిలియనెడు కొలఁకులోపల, మునుంగన్ = మునుఁగఁగా, పొంగు = పైకినుప్పొంగిన, వళులు=కడుపుమీఁది మడతలు, ఉద్వేలభంగములయ్యెన్ =ఉత్కటమయిన తరంగము లన్నట్టులుగానుండెను. అంతరాళమునన్ = వళులనెడు తరంగములయొక్కనడుమ, తత్ =ఆనాభీసరోవరమగ్న మయిన మన్మథమదసామజముయొక్క, గంధ = మదసౌరభమందలి, అనుబంధంబుచేన్ = ఆసక్తిచేత, అమరుందుమ్మెదచాలునాన్ = ఒప్పుచున్న భ్రమరపంక్తియేమోయన్నట్టులుగా, ఇంతిలేఁగౌనునన్ = ఈస్త్రీయొక్క యతిసూక్ష్మమయిన నడుమునందు, నూఁగారు= రోమావళి, ఒనరున్ = ఒప్పును.

అనఁగా నీస్త్రీయొక్కకుచములు పర్వతంబులవలె గట్టిగా నున్నవనియును నాభి కొలనువలె లోఁతుగలిగియున్నదనియును గడుపుమీఁది మడతలు తరంగములవలె వెంబడిగానున్నవనియును నూఁగారు తుమ్మెదచాలువలెనల్లనై సోగగా నున్నదనియును ఫలితార్థము. అమరుందుమ్మెదచాలు, అన్నచోట అమరుననెడు ఉకారాంతపదముమీఁదఁ బరుషవర్ణమయిన తకారము పరమగుచుండఁగా నుమాగమువచ్చినది. శ్లో. 'పరుషే సరళే చైవ సమాసే నుముతోభవేత్' అని యథర్వణవచనము.

సామజను మదించినది పరాజయము లేనిదిగావున గ్రావముతో లీలఁ గోరాడఁ దొడంగెను. అక్కడికిఁ బరాజయ మొందక బడలినది. బడలినవారు నీట మునుఁగు టాచారము గావున సరస్సున మునిఁగినది. ఏనుఁగు చాల గొప్పదగుట తరంగము లుద్వేలము లయ్యెను. మదపుటేనుఁగు గావుననే తుమ్మెదచాలు మసరికొనినది. కౌను లేఁతదగుటచే నారుగూడ నూగుగానుండెను. గుబ్బలబింకము నడుముసన్నఁదనము ఆరుపలుచన సౌందర్యచిహ్నములు.

అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

సమదాభంగ యనుచో మదశబ్దము తరుణీయౌవనాతిశయసూచకము. తారుణ్యమదమునకు దృష్టాంతము.

శ్లో. దృష్టిస్స్మేరా ముఖేరాగః స్మితాకుంచితం వచః
లీలావిదగ్ధగత్యాద్యా శ్చేష్టా స్యు స్తరుణే మదే. (రసార్ణవసుధాకరము.)

చ. వనితకుచాద్రులం బొడమి • వాటపుఁబొక్కిలి నిండి యుబ్బి జా
ల్గొని కటిచక్ర మాని మెఱుఁ•గుందొడ లై విరవాసి వచ్చునూ
తనకిరణామృతౌఘముల • దండ హలాంకపదోత్థితంబు లై
మను నుడివోనిగర్భకల•మంబులు గావె లతాంగిజంఘికల్. 74

వనితకుచాద్రులంబొడమి = ఈస్త్రీయొక్క గుబ్బచన్నులనెడు కొండలయందుఁబుట్టి, వాటపుఁబొక్కిలినిండి = కుదురైన నాభియనెడు నేలగుంతయందుఁ బూర్ణీభవించి, పొక్కిలి యనఁగా నాభికిని నేలగుంతకును పేరు. ఉబ్బి = అందులోనుండి పైకినుప్పొంగి, జాల్గొని=జాలుగాఁ బ్రవహించి, కటిచక్రమాని = కటిప్రదేశమనెడు రాష్ట్రమును లోఁగొని, మెఱుఁగుందొడలై = మెఱయుచున్న యూరురూపములై, విరవాసి = రెండుపాయలై, వచ్చు=ఏతెంచుచున్న, నూతన కిరణామృతౌఘముల దండన్, నూతన = అభినవమైన, కిరణ=కాంతియనెడు, అమృతౌఘముల = జలప్రవాహములయొక్క, దండన్ = చేరువ, హలాంక = హలరేఖాంకములైన, పద=పాదములనెడు, హలాంక=నాఁగటిదుక్కి

గల, పద=స్థానములవలన, అనఁగా నాఁగేటిచేత దున్ని వెదవేసిన మడిచేలవలన ననుట. (ని. 'పదం వ్యవసితత్రాణ స్థాన లక్ష్మాఙ్ఘ్రి వస్తుషు' అని అ.) ఉత్థితంబులై=మొలిచినవై, మను = వృద్ధిఁబొందుచున్న, ఉడివోని=ఉడిగిపోకుండెడు, గర్భకలమంబులుగావె=పొట్టతోనున్న వరిపైరులుగావా, లతాంగి జంఘికల్=ఈ చిన్నదానిపిక్కలు, అనఁగా వరిపొట్టలే యవ్వనుట.

సౌందర్యకాంతులు గుబ్బలువలెనున్న గుబ్బలందును లోఁతుగానున్న పొక్కిలియందును గటిచక్రమందును తొడలందును వెల్లివిరియుచున్న వనుటచేఁ బ్రత్యవయవము యౌవనవిలాసములకు నెలవుగానుండెననుట, పదములందు హలాంకములుంట శుభసూచకములు.

ఇక్కడ నుడివోనిపిక్కలను పసివోనివరిపొట్టలుగా నుత్ప్రేక్షించినాఁడు. ఘనలక్ష్మినెసఁగు ననెడి పద్యము మొదలుకొని యీపద్యము తుదిగా నైదుపద్యములలో నవస్థాభేదమయిన ప్రలాపము జెప్పినాఁడు. ఇందుకు, క. 'వెలయఁగ సతిఁ గొనియాడుట, దలఁపఁ బ్రలాపము' అని లక్షణము.

చ. అని వనితాలలామవినుతాంగతరంగితసౌకుమార్యముల్
గని కొనియాడు సమ్మదము గ్రమ్ముకొనం దల యూచు నవ్వు న
వ్వనరుహసూతిచేతి యనివారితచాతురి మెచ్చుఁ గాని య
య్యనఘుఁ డెఱుంగఁ డయ్యె మనసాంతర మాంతరవిస్మయంబునన్. 75

అని=ఈప్రకారముగా, వనితాలలామ=సౌందర్యవతియైన యాస్త్రీయొక్క, (ని. 'లలామం త్రిషు రమ్యే స్యా న్ముఖ్య సామర్థ్య లక్ష్మసు' అని వి.) వినుత=స్తోత్రముచేయఁబడిన, అంగ=అవయవములయందు, తరంగిత=తరంగప్రాయములుగాఁ జేయఁబడిన, సౌకుమార్యముల్ = కోమలత్వములను, కని=చూచి, కొనియాడున్=స్తోత్రముసేయుచు, సమ్మదము గ్రమ్ముకొనన్=సంతోషమావరింపఁగా, తలయూచున్=శిరఃకంపముచేయుచు, నవ్వున్=వెఱ్ఱినవ్వుగా నవ్వుచు, అవ్వనరుహసూతిచేతి=కమలసంభవుఁడైన యాబ్రహ్మచేతియొక్క, అనివారితచాతురి మెచ్చున్=నివారింపఁబడని చాతుర్యమును మెచ్చుకొనుచు, కాని=ఇంతియకాని, అయ్యనఘుఁడు=పాపరహితుఁడైన యావసురాజు, (ని. 'దుఃఖే నోవ్యసనేష్వఘమ్' అని నా.) అంతర=హృదయమందలి, విస్మయంబునన్=ఆశ్చర్యముచేత, మనసాంతరము=మఱియొక యాలోచనను, ఎఱుంగఁడయ్యెన్=గుర్తెఱుఁగఁడాయెను. అనఁగా విభ్రాంతిపడి చూచుచు నూరకుండెననుట.

తా. ఇట్లు వసురాజు వనితాలలామ సౌందర్యాతిశయముఁ గొనియాడుచు సంతోషవశమునఁ దలయూపుచు నవ్వుచు బ్రహ్మసృష్టిని గొనియాడుచు నుండెనేగాని హృదయగతమగు నాశ్చర్యాతిశయమువలన వేఱువిధమగు నాలోచన మెఱుంగఁడయ్యెను.

మ. అపుడా నర్మసఖుండు చేరఁ జని కన్యారత్నముం జూచి తే
తపనీయాచలధీర నాపలుకు తథ్యం బౌఁ గదా యింక నే
జపివేషంబునఁ జేరఁ బోయి లలనాజన్మప్రకారంబు దే
టపడం గాంచెదఁ బంపు మన్నను నఖండప్రేమసామగ్రితోన్. 76

అపుడు=వసురాజేమియు నాలోచనతోఁచక యుఁన్న సమయమందు, ఆనర్మసఖుఁడు=ఆప్రియ సఖుఁడు, చేరంజని=సమీపింపఁబోయి, తపనీయాచలధీర=బంగారుకొండవలె, అనఁగా మేరువువలె ధైర్యయుక్తుఁడవైన యోవసురాజా, కన్యారత్నముం జూచితే = కన్నెపడుచులలో రత్నమువలె నున్న చిన్నదాని లెస్సగాఁ జూచితివా, నాపలుకు తథ్యంబౌఁగదా=నామాట నిజమేకదా, ఇంకన్=ఇఁక మీఁద, నే జపివేషంబునఁ జేరఁబోయి=నేను మునివేషముచేత సమీపముగాఁ బోయి, లలనాజన్మప్రకారంబు=ఈస్త్రీయొక్క పుట్టుపూర్వక్రమమును, తేటపడంగాంచెదన్ = విశదపడునట్టులుగాఁ దెలిసికొనుచున్నాను, పంపుమన్నను=పంపుమనిపలుకఁగా, అఖండ=సంపూర్ణమైన, ప్రేమసామగ్రితోన్= అనురాగభరముచేత-దీనికి ముందరిపద్యముతో నన్వయము.

తేటపడంగాంచెద నన్నచోట తేటయనెడుపద మచేతనార్థకము గనుకను నచేతనార్థకముల మీఁది క చ ట త ప ల కు గ స డ ద వా దేశము వైకల్పికముగనుకను పకారమునను వకారము కలుగంజెప్పఁడయ్యె. శ్లో. 'పరుషావాస్వరూపేణ ప్రథమాంతోపరిస్థితాః, కాకాసంబోధనేచాపి త్వవ్యయే కర్మధారయే, అచేతనార్థకేశబ్దఇతి శృంగారభూషణః' అనియు, గీ. 'సంధిగూర్పంగఁ బ్రథమాంతశబ్దవితతి, హై క చ ట త ప ల కు వికల్పముగఁ జెల్లుఁ, గాకు సంబోధనావ్యయ కర్మధార, యంబుల నచేతనంబుల నజ్జనాథ' అని లక్షణము.

తా. అపుడు వేడుకచెలికాఁడగు మంత్రి రాజును సమీపించి రాజేంద్రా! కన్యకనుగాంచితివి గద, నేను చెప్పినది నిజమేగదా! ఇఁక నేను మునివేషముతో నాచెలువను డాయఁబోయి యాయమ జన్మప్రకారము తెలిసికొనివచ్చెదను. పంపుమా యన వసురాజనురాగాతిశయముగలవాఁడై.

తే. కుంభగతదీపశోభానిఁ గుంభలీలఁ, గుంభకుచమేనఁ జూడ్కులాఁ గుబ్బికొనఁగఁ
గాంచువిభుఁ డంగనాప్రసంఁ గంబుకతన, మంత్రివరు నెట్టకేలకుఁ మఱలిచూచి.

కుంభగత=కుండలో నిమిడియున్న, దీప=దీపముయొక్క, శోభా = కాంతియొక్క, నిగుంభలీలన్=వ్యాపనమువలె, కుంభకుచమేనన్=కలశములవంటిస్తనములుగల యాస్త్రీయొక్క దేహమందు' క. 'కాయము పేళ్ళయి వెలయును, మే యన నొడలనఁగ మేను మెయినాన్' అని యాంధ్రనామ సంగ్రహము. చూడ్కులు ఆగుబ్బికొనఁగన్=చూపులు పిక్కటిల్లినట్టులుగా, కాంచు=చూచుచున్న' విభుఁడు = వసురాజు, అంగనా ప్రసంగంబుకతనన్ = ఆస్త్రీసంబంధమైన ప్రసంగమేయైనందున, మంత్రివరున్=మంత్రిశ్రేష్ఠుని, ఎట్టకేలకున్=కొంతసేపటికి, మఱలిచూచి=తిరిగిచూచినవాఁడై, ఈ పద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

రాజు పరధ్యానమున నుంటచేత ఎట్టకేలకుఁగాని మంత్రివాక్యము వినఁజాలఁడయ్యెను. అంతటి మోహావస్థలోనుండియుఁ దెలివిమై మంత్రివాక్యము వినఁగలుగుట యతఁ డెఱుఁగఁజేయునది లలనాప్రసంగమగుటచేత నే. అలం. ఉపమ.

తా. కుంభమునందున్న దీపపువెలుగు కుంభమునం దంతటను సమగ్రముగా వ్యాపించునటుల రాజుచూపు లాచెలువపైఁ బిక్కటిల్లెను. మంత్రి చేయు ప్రసంగ మాయంగనను గూర్చినదగుటచేఁ గడకు రాజు మంత్రిని చూచి.

ఉ. ఏగతి యోగిరూపము వహించెదొ యేగతిఁ బ్రౌఢి మించెదో
యేగతి వేళఁ గాంచెదవొ యేకత మున్న వధూజనంబు నీ

వేగతిఁ బల్కరించెదవొ • యిష్టసఖా భవదీయనీతికా
ర్యాగతి నేఁడు చూతము గదా యని యంపిన నాక్షణంబునన్. 78

ఏగతి యోగిరూపమువహించెదొ = ఏప్రకారముగా మునివేషధారణము సేయుచున్నావో, ఏగతిఁ బ్రౌఢిమించెదో = ఏప్రకారముగాఁ జతురత్వముచేత నతిశయించుచున్నావో, ఏగతి వేళఁ గాంచెదవొ = ఏప్రకారముగా సమయముఁ గనిపెట్టుచున్నావో, ఏకతమున్నవధూజనంబుల్ = ఏకాంతముగానున్న స్త్రీసమూహమును, (ని. 'జన స్సమూహే లోకేపి' అని నా.) నీవేగతిఁబల్కరించెదవొ = నీవేప్రకారముగా మాటాడించుచున్నావో, ఇష్టసఖా = ఇష్టుఁడవైన చెలికాఁడా, భవదీయ నీతికార్యాగతి = నీసంబంధమైన నీతికార్యప్రచారము, నేఁడుచూతముగదా=ఈప్రొద్దు చూతాముగదా, అనియంపినన్ = అలిపల్కిపంపఁగా, ఆక్షణంబునన్ = తత్క్షణమందే, ఈపద్యమునకు ముందరి పద్యముతో నన్వయము. ఏకతమనుపదము, ఏకాంతశబ్దతద్భవము.

ఇష్టసఖా యనుటచేఁ గోరికల నొడఁగూర్పఁదలఁచువాఁడవనుట. వధూజనము, అందు నేకతము. కావునఁ బరిచయమునకు వేళయుఁ బల్కరించుటకు వెరవు నవసరము. కావునఁ బ్రౌఢి వలయును ఈకార్యము నిర్వహించితివేని నీనీతికౌశలము గణనీయమనుట.

తా. మిత్రమా! ఎటుల యోగివేషముదాల్చెదవో నేరుపు నెటులఁ బ్రచురించెదవో యెటు లవకాశము గలిగించుకొని యొంటరిగానున్న యాచెలువలఁ బలుకరింతువో నీనీతి నేఁడు చూతము. పొమ్మని రాజు నర్మసఖుని బంపఁగా నతఁ డాక్షణమున నే-

సీ. కనకవల్లిమతల్లి•కలపెంపు జడగుంపు పుష్పపరాగసం•భూతి భూతి
కమనీయశాఖాప్ర•కాండంబు దండంబు తరుణపల్లవకోటి • ధాతుశాటి
వల్కలధట్టంబు • వరయోగపట్టంబు జాలకవిసరంబు • జపసరంబు
ఫలరసాసారంబు • పాత్రాంబుపూరంబు కింజల్కములచాలు • మౌంజిమాలు
తే. నేయఁజాలినయమ్మహా•శిఖరిశిఖర, రుచిరసురభూజరాజిచే • నుచితవేష
మెనసినరపాలనిరపాయ•హితవిహార, హారిగడిదేరి యొకజడ•దారియయ్యె. 79

కనకవల్లిమతల్లికలపెంపు = సువర్ణమయములైన లతాశ్రేష్ఠములయొక్క సమృద్ధిని, జడగుంపు = జటాసమూహముగాను, పుష్పపరాగసంభూతి = పుప్పొడియొక్క సమ్యగ్భూతిని, అనఁగా లెస్సగాఁ గలిగియుండుటను, భూతి = భస్మముగాను, కమనీయ = రమ్యమైన, శాఖాప్రకాండంబు = శ్రేష్ఠమై యుండెడు కొమ్మను, దండంబు = యోగవేత్రముగాను, తరుణ = లేఁతయైన, పల్లవ = చిగురుటాకుల యొక్క, కోటి = సమూహమును, ధాతుశాటి = కాషాయవస్త్రముగాను, (ని. 'వసాదయస్స ప్తకఫాద యస్త్రయో భూతానిపంచస్వగుణాశ్చ గైరికమ్, శిలావికారేంద్రియశబ్దయోనయో లోహాంస్వభా వ్యంకనకంచధాతవః' అని నానార్థరత్నమాల) వల్కలధట్టంబు = వల్కలమనఁగాఁ జెట్టుపైతాటు, దానియొక్కబంధమును, వర = శ్రేష్ఠమైన, యోగపట్టంబు = యోగపట్టెడగాను, జాలక = మొగ్గల యొక్క, విసరంబు = పంక్తిని, జపసరంబు = జపమాలికగాను, ఫలరసాసారంబు = పండ్లరసముయొక్క ధారాపాతమును, పాత్రాంబుపూరంబు = కమండలుజల సమృద్ధిగాను, కింజల్కములచాలు=కేసరముల యొక్క పంక్తిని, మౌంజిమాలు=దర్భమొలత్రాఁడును గాను,

చేయఁజాలిన = చేయుసామర్థ్యము గలిగిన, ఆ = పూర్వోక్తమైన, మహాశిఖరి = ఉన్నతమైన కోలాహలాద్రియొక్క, శిఖర=శృంగములయందు, రుచిర = ప్రకాశమానములగుచున్న, సురభూజ= కల్పవృక్షములయొక్క, రాజిచేత్ = సమూహముచేత, ఉచితవేష మెనసి = యోగియనుటకుఁ దగిన వేషమును బొంది, నగపాల = వసురాజుయొక్క, నిరపాయ=ఎడతెగని, హితవిహార = ఇష్టవిహారమందు, హారి=ఒప్పుచున్న, నర్మసఖుఁడు, గడిదేరి =సంకోచములేనివాఁడై, ఒకజడదారియయ్యెన్ = ఒకజటాధరుఁడైన యోగీశ్వరుఁ డయ్యెను. జటాశబ్దతద్భవము జడ. అలం. సమాధి.

తా. కోలాహలపర్వతశిఖరమునందున్న వేల్పుమ్రాకుల మహిమచే రాజసఖుఁడు తీవియల జడగుంపుగను, బుప్పొడి విభూతిగను, శాఖను దండముగను, చివురుటాకులను గాషాయవస్త్రముగను, జెట్టుతాటను యోగపట్టముగను, మొగ్గలను జపమాలికగను, ఫలరసము జలముగను, కేసరములు దర్భ మొలత్రాడుగను గావించి తగినవేషము సంతరించికొని తెగువదారియగు జడదారియయ్యెను.

క. ఆమాయతపసి నియమ, స్థేమాయత నక్షసరముఁ ద్రిప్పుచు నెలమిన్
వామాయతనయనాజన, హైమాయతనంబుఁ జేరనరుగుచు నచటన్. 80

ఆమాయతపసి = అకృత్రిమపుయోగి, నియమస్థేమాయతన్ = నియమస్థైర్యమును బొందిన వాఁడగుటచేత, 'నియమస్థేమానంఏతీతి నియమస్థేమాయః తస్యభావః నియమస్థేమాయతా' అక్షసరముఁద్రిప్పుచున్ =స్ఫటికాక్షమాలికను వ్రేళ్ళమీఁదఁ ద్రిప్పుచును, ఎలమిన్ =ఉత్సాహముచేత, వామ= సుందరమైన, (ని. 'వామా వధ్వాం సవ్య రమ్య ప్రతీపే ష్వేషవాచ్యవత్' అని నా.) ఆయత = విశాలములైన, నయనా=నేత్రములు గలస్త్రీలయొక్క, జన = సమూహముయొక్క, హైమాయతనంబున్ = సువర్ణమయమయిన గృహమును, చేరనరుగుచున్ = చేరునట్టులుగాఁ బోవుచు, అచటన్ = ఆప్రదేశమందు.

తా. ఆమాయాముని జపమాలికను నియమానుసారముగాఁ ద్రిప్పుచు సుందరులగువాల్గంటు లున్న సువర్ణమందిరమునకుఁ జేరఁబోవుచుండ నచట-

తే. గంధగజయానగీతప్రబంధకలన, నలరి యతి లియ్యమైవచ్చు నరిది మగువ
లార కనుఁగొంటిరే యను నాళివాక్య, మొకటివిననైననని దెవేళ యొదవెననుచు. 81

గంధగజయాన=గర్వితగజగమనమువంటి గమనముగల గిరికాదేవియొక్క, గీతప్రబంధకలనన్ = గీతప్రబంధరచనయందు - అనఁగా గీతములు చెప్పుటయందు, అలరి = ఒప్పినదై, యతి = అనఁగా గణాదియైనవిశ్రమాక్షరము. (శ్లో. 'సంగీతకలనాయాంతు గణాదౌ యతిరుచ్యతే, ప్రాసోవా యతి స్సామ్యే నాతిదూరే విధీయతే.' అని సంగీతశాస్త్రము.) లియ్యమయివచ్చున్ = కూడఁగలసికొని వచ్చుచుండును, అరిది = ఇది మిక్కిలివింత, మగువలార కనుఁగొంటిరే యను = చెలులారా చూచి నారఁటే యనునట్టి, ఆళివాక్య మొకటివిననైనన్ = చెలికత్తెయొక్క వాక్యమొకటి వినరాఁగానే, ఇదె వేళ యొదవెననుచున్ = ఇదిసమయము దొరకెనని, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

ఇందులోఁ జెలికత్తె సంగీతవిషయమయిన వాక్యము పలుకఁగా నర్మసఖుఁడు తనకు నిదియ సమయమని తలఁచుట యెట్లనఁగా, గీతప్రబంధకలన నలరి యతి లియ్యమయివచ్చునరిది యనెడిచోట గీతప్రబంధాకర్ణనముచేత సంతోషించి యొకానొక యతీశ్వరుఁ డీపాటతోనే కలిసి-

వచ్చునని చెలికత్తియ పలికినట్టులుగా నర్థముచేసి తనకు నిదియ సమయమని తలఁచె నని యర్థాంతరము. (ని. 'యతి ర్భిక్షౌ పుమాన్ స్త్రీతు నియమే శ్లోక విశ్రమే' అని నానార్థరత్నమాలాకోశము.) ఇది పాత్రప్రవేశసూచక మనునాటకరీతి.

ఉ. మేలు లతాంగి నీపలుకు • మెచ్చితినే యతి వచ్చుజాడ యే
లీల నెఱింగి తమ్మ బహూ•ళీకృతచాతురి మించునీవిపం
చీలలితారవామృతము • చిత్తము సోఁకినవార లీకళా
శాలినిఁ జూచి దీవెన లొ•సంగక పోవరు సుమ్ము నావుడున్. 82

మేలు=బాగుబాగు, లతాంగి = ఓచిన్నదానా, నీపలుకు = నీవుపలికిన వాక్యము, నేన్=నేను, మెచ్చితిన్=మెచ్చుకొంటిని, యతివచ్చుజాడయేలీల నెఱింగితమ్మ = యతీశ్వరుఁడు వచ్చెడుసజ్జ యేలాగున గుర్తెఱింగితివమ్మా, బహూళీకృత = అనేకవిధములుగాఁ జేయఁబడిన, చాతురిమించు = చమత్కారముచేత నతిశయించుచున్న, ఈవిపంచీలలితారవామృతముఁ=ఈవీణయొక్క మనోహరమయిన నాదామృతము-అనఁగా సుధాప్రాయమయిన నాదము, చిత్తముసోఁకినవారలు = మనస్సునం దంటినవారు, ఈ కళాశాలినిఁ జూచి = లావణ్యవతియైన యీచిన్నదానిని జూచినవారై, దీవెనలొసంగక పోవరుసుమ్ము=దీవెనలీయకపోరుసుమీ, నావుడున్=అని యాకపటయతి చాటుననుండి పలుకఁగా.

తా. "సుందరీ! మేలుమేలు నీమాటకు మెచ్చితిని. యతీశ్వరునిరాక నీవెటుల గ్రహించితివి. నేర్పుతో వీణవాయించు నీచెలువ మనోహర గానామృతము హృదయమునకు సోఁకినవార లీ విద్యావతిని గాంచి దీవింపకపోరు" అని విదూషకుఁడనఁగా-

ఉ. అచ్చట నున్న యిందుముఖు•లందఱు నాపలు కాలకించి తా
నెచ్చటనుండియో యొకయ•తీంద్రుఁడు వచ్చెఁ గదమ్మ యంచు లో
నచ్చెరుపాటు సంభ్రమము•నందుచు గద్దియ డిగ్గి రంతలో
వచ్చెఁ దపోధనుండు జన•వల్లభుఁడున్ మది మెచ్చె నెచ్చెలిన్. 83

అచ్చటనున్న యిందుముఖు లందఱున్ = ఆగిరికాగృహమునందున్న స్త్రీలందఱును, ఆపలుకు లాలకించి = యతీశ్వరుండుపలికిన యావాక్యము విని, తా నెచ్చటనుండియో యొక యతీంద్రుఁడు వచ్చెఁగదమ్మ యంచున్ = తా నేప్రదేశమునుండియో యొకమునిశ్రేష్ఠుఁడు వచ్చెఁగదమ్మా యని యనుకొని, లోన్ = మనస్సులో, అచ్చెరుపాటు = ఆశ్చర్యమును, సంభ్రమమున్ = తొందరయును, అందుచున్ = పొందుచు, గద్దియడిగ్గిరి = కూర్చున్న గద్దెపీటలపయినుండి దిగినవారైరి, అంతలోన్ = అనఁగా నాస్త్రీలు లేచునంతలోపల, వచ్చెఁ దపోధనుండు = యతీశ్వరుఁడును నాగృహములోనికి వచ్చెను, జనవల్లభుఁడున్ = తీఁగెలచాటునుండి చూచుచున్న వసురాజును, నెచ్చెలిన్ = తనయొక్క నర్మసఖుని, మదిమెచ్చెన్ = మనస్సున మెచ్చుకొనెను.

తా. ఆమునీంద్రునిపలు కాలకించినంతన నచటనున్న పడంతుక లందఱు ఎచటనుండియో యతీశ్వరుఁడు వచ్చెనమ్మా యని హఠాదాగమనమున కాశ్చర్యము సంభ్రమము నొందుచుఁ బీఠముల నుండి దిగిరి. రాజు నర్మసఖుని నేర్పరితనమునకు మిగుల నానందించెను.

చ. ముని యటు రాఁ దటాలున స•మున్నతపీఠము డిగ్గి నిల్చునం
గననిరువేదశౌను కుచ•గౌరవ మోర్వక కంప మొందఁగా

జనపతి చూడ్కి తోడనె ససంభ్రమసంభరితానుకంప మై
యొనసి వలగ్నముం బొదివె • నీశులు దీనదయాళుదర్శనుల్. 84

మునియటు రాన్ = యతీశ్వరుఁ డాప్రకారము రాఁగా, తటాలునన్ = తెప్పున, సమున్నత పీఠముడిగ్గి = మిక్కిలి యెత్తుగానున్న గద్దెమీఁదినుండిదిగి, నిల్చు = నిలువఁబడిన, అంగన=గిరికాదేవి యొక్క, నిరుపేదకౌను = కేవలమును బీదతనముగలిగియున్న నడుము, కుచగౌరవమోర్వక = స్తనభారమును సహింపలేక, కంపమొందఁగాన్ = వడఁకఁగా, జనపతిచూడ్కి = వసురాజుయొక్క చూపు, తోడనే = ఆవెంబడిగానే, ససంభ్రమ సంభరితానుకంపమై = సంభ్రమమనఁగా నాదరమును సంవేగమును, (ని. 'సంభ్రమ స్సాధ్వసే పిస్యా త్సంవేగా దరయో రపి' అని మే.) ససంభ్రమ = ఆవేగముతోఁ గూడుకొన్నదియు, సంభరిత = లెస్సగాఁ బూర్ణీభవింపఁబడినదియు, అనుకంపమై = వణకుగలదియునై, అని యర్థము. ఆదరముతోఁ గూడుకొన్నదియును భరింపఁబడిన దయగలదియు నై యనియర్థాంతరము. (ని. 'కృపా దయానుకంపా స్యాత్' అని అ.) ఎనసి = మిళితమయి, వలగ్నముం బొదివెన్ = నడుమును బొదిగిపట్టుకొనెను. (ని. (మధ్యమం చావలగ్నంచ మధ్యోస్త్రీ ద్వౌపరా ద్వయోః' అని అ.) 'వష్టివాగురిరల్లోప మవాప్యోరుపసర్గయోః' అను వచనమువలన అవలగ్నమను పదము మొదటనుండు అకారమునకు లోపము గలదు గనుక వలగ్నమని చెప్పఁబడెను. ఈశులు= ప్రభువులు, (ని. 'ఈశ శ్శంభౌ ప్రభౌ త్వత్రి ష్వీశా లాఙ్గలదణ్డకే' అని నా.) దీన = బీదవాండ్ర యందు, దయాళు = దయగలిగిన, దర్శనుల్ = చూపుగలవారు అనఁగా యతిని గిరికాదేవి చూచిన తోడనే గద్దెపీటదిగి నిలుచుండఁగా స్తనభారముచేత నడుము జవజవలాడుచుండఁగా నపుడు చాటుగా నున్న వసురాజు తొందరపాటును జలంబును గల చూపులచేత నానడుముయొక్క విలాసమును జూచె నని భావము. నిరుపేదకౌననుటచే మిగుల సన్నముగా నుండెననుట. కావునసె రాజు చూపులు అనుకంప వహించినది. అనుకంపఁగూడ నిరుపేదలయెడఁ జూపవలసినది గాన 'దుర్బలస్యబలం రాజా' యను ధర్మము ననుసరించి ససంభ్రమసంభరితమైనది. అలం. అర్థాంతరన్యాసము.

తా. మునివచ్చినంతన నంగన పీఠము తటాలునడిగి నిలిచినంతనఁ జనుగవ్రేఁగుచే నిరుపేద నడుము వడఁకసాగెను. రాజుచూపులు తొందరపాటు దయగలవియై కౌనునకు నాధారభూతములై నిలిపెను. రాజులు దీనదయాళురుగదా !

తే. ఇంతియును నంత నంతంత • నెదిగి పొదలు
నిబ్బరపుగబ్బిగుబ్బల•యుబ్బుకతన
నోరగాఁ బాణికంజంబు • లూఁది మ్రొక్కె
మక్కువ సఖీమణులుఁ దాను • మౌనిమణికి. 85

ఇంతియును = గిరికాదేవియును, అంతన్ = అంతట, అంతంత నెదిగిపొదలు = అంతకంతకు వృద్ధిఁబొంది యొప్పుచున్న, నిబ్బరపు = దృఢములైన, గబ్బి = కదలనట్టి, గుబ్బల = స్తనములయొక్క, ఉబ్బుకతనన్ = పొంగరింపువలన, అతిశయమువలన, నిబ్బరమనెడుపదము నిర్భరశబ్దముయొక్క తద్భవము, ఓరగాఁ బాణికంజంబులూఁది = ఒకవైపుగా హస్తకమలములు జోడించి, మక్కువన్ = ప్రీతిచేత, సఖీమణులున్ = చెలికత్తియలును, తానున్ = తానును, మౌనిమణికిన్ = మునిశ్రేష్ఠునికి

మ్రొక్కెన్=దండము సమర్పించెను. జవ్వనులగుబ్బ లంతంతకు ఉబ్బునిబ్బరముతో నొప్పారు ననుట కవిసమయసిద్ధము. చూడుఁడు. బిల్హణీయము-

శ్లో. "ప్రతిక్షణవిజృంభణాదుభయపార్శ్వహలంకషాః
స్తనత్రుటితకంచుకం నమతయౌవనం యోషితాం."

గుబ్బలయుబ్బుతనము తెలుపుట యుపభోగయోగ్యము సూచించుట.

తా. మాటిమాటికిఁ బొంగుచున్న గబ్బిగుబ్బలయుబ్బుచే నెటులో యోరఁగాఁ గేలుదమ్ములను మోడ్చి యాచెలువ సఖీసహితయై మునికి నమస్కరించెను.

వ. అప్పు డప్ప్రతినవతపోనిధి యొప్పులకుప్ప యగు నప్పూఁబోఁడి యనల్పవినయ కల్పనంబులకు నుప్పొంగి యో యనన్యకన్యాసామాన్యలావణ్యప్రభా వసువల్లభుం బెండ్లియాడు మని దీవించి తదీయవివిధపూజావిధానంబులం బ్రమోదమానమానసుం డై యాముద్దియలిడు పసిండిగద్దియ నధివసించె నయ్యెడం దొయ్యలులు నయ్యతిపసుపునం దమతమయుచితాసనంబుల నలంకరించి రంత నాకంజనయనయనుఁగుంజెలులలో సమంజసవచనచాతురీరంజిత యగు మంజువాణి యంజలిపట్టి యతికుంజరునితో నిట్లనియె. 86

అప్పుడు=ఆగిరికాదేవి నమస్కరించిన సమయమందు, అప్ప్రతినవతపోనిధి=సాటిలేనినూతన యతీశ్వరుఁడు, ఒప్పులకుప్పయగు = సౌందర్యరాశియైన, అప్పూఁబోఁడి = ఆగిరికయొక్క, అనల్ప వినయ కల్పనంబులకున్=అధికమైన వినయోత్పాదనములకు, ఉప్పొంగి=సంతోషముచేతఁ బొంగిన వాఁడై, అనన్యకన్యాసామాన్య = ఇతరకన్యలకు సాధారణముగాని, లావణ్యప్రభావ = లావణ్య మనఁగా ముత్యములలోఁ గనుపించెడు కాంతియొక్క బెళుకువలె నవయవములయందుఁ బ్రకాశించెడు కళకుఁ బేరు. అట్టి లావణ్యమహిమగల యోచిన్నదానా, సువల్లభుం బెండ్లియాడుమని దీవించి= మంచి ప్రియపురుషుని వివాహము గమ్మని యాశీర్వదించి యని యర్థము. అనన్యకన్యాసామాన్య లావణ్యప్రభా వసురాజుం బెండ్లియాడుమని దీవించి యనిభావము. తదీయవివిధపూజావిధానంబు లన్=ఆ గిరికాదేవిసంబంధమైన యర్ఘ్యపాద్యాది పూజావిధులచేత, ప్రమోదమానమానసుండై= సంతోషించుచున్న మనస్సుగలవాఁడై, ఆముద్దియలిడు పసిండిగద్దియ నధివసించెన్=ఆ గిరికయొక్క చెలికత్తెలు తెచ్చియుంచిన బంగారు గద్దెపీటమీఁదఁ గూర్చుండెను. గీ. 'పసిఁడి బంగారు బంగరు హైఁడివహొన్ను, జాళువాపుత్తడి యనంగ స్వర్ణ మమరు' అని ఆంధ్రనామసంగ్రహము. అయ్యెడం దొయ్యలులు నయ్యతిపసుపునన్=ఆసమయమం దక్కడి స్త్రీలందఱు నాయతీశ్వరుని యనుజ్ఞచేత, తమతమ యుచితాసనంబుల నలంకరించిరి=వారివారియొక్క యర్హపీఠములను శోభింపఁజేసిరి, అనఁగాఁ దమతమగద్దెలమీఁదఁ గూర్చుండిరనుట, ఆకంజనయన యనుఁగుంజెలులలోన్=ఆగిరికయొక్క ప్రియ సఖులలో, సమంజస=చక్కనైన, వచనచాతురీ = వాక్యచమత్కృతిచేత, రంజితయగు=ప్రకాశింపఁబడు చున్నదైన, మంజువాణి=మంజువాణియనెడు చెలికత్తియ, అంజలిపట్టి=దోసిలిపట్టుకొన్నదై అనఁగాఁ గేలుమోడ్చి, యతికుంజరున కిట్లనియెన్ = యతిశ్రేష్ఠునితో నొక వాక్యము పలికెను.

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి • నేఁగుచు నిచ్చటి కద్భుతంబుగా
వచ్చితి రార్యసన్నుత భ•వచ్చరణాబ్జనఖేందుయుక్తిచే
నచ్చపుఁ దెల్వి వచ్చెఁ దమ • మంతయు విచ్చెఁ గళాకలాపముల్
హెచ్చె మదాళిభాగ్య మిఁక • నింద్రపురంధ్రులకైనఁ గల్గునే. 87

ఎచ్చటనుండి యెచ్చటికి నేగుచు నిచ్చటి కద్భుతంబుగా వచ్చితిరి=ఎక్కడనుండి యెక్కడికిఁ బోవుచు నిక్కడి కాశ్చర్యమగునట్టులుగా విజయముచేసితిరి, ఆర్యసన్నుత=పూజ్యులైనవారిచేత స్తోత్రముచేయఁబడిన మహాత్మా, భవత్ = దేవరవారియొక్క, చరణాబ్జ = పాదపద్మములయొక్క, నఖ=గోరనెడు, ఇందు=చంద్రునియొక్క, యుక్తిచేన్=కూడుకొనుటచేత, అచ్చపుఁదెల్వివచ్చెన్= తెలివియనఁగా వికాసమును వెన్నెలయును గనుక, స్వచ్ఛమైన తెలివియనెడు వెన్నెల వచ్చెను, తమ మంతయువిచ్చెన్=తమమనఁగా నజ్ఞానంబును చీఁకటియును, అజ్ఞానమనెడు చీఁకటి విచ్చిపోయెను, కళాకలాపముల్ హెచ్చెన్ = లావణ్యకళలనెడు షోడశకళాసమూహములతిశయించెను, మత్=నాయొక్క, ఆళి = చెలికత్తెయైన గిరికయొక్క, భాగ్యము = అదృష్టము, (ని. 'దైవం దిష్టం భాగధేయం భాగ్యమ్' అని అ.) ఇఁకన్=ఇఁకమీఁద, ఇంద్రపురంధ్రులకైనఁ గల్గునే=దేవతాస్త్రీలకైనఁ గలుగునా, అనఁగాఁ గలుగనేర దనుట. అలం. శ్లిష్టరూపకము.

తా. మునీంద్రా! తా మెచటనుండి యెటకేగుచు నిచటి కేగుదెంచితిరి. మీరాక మిగుల నచ్చెరువు కలిగించుచున్నది. మీరు మామందిరమునఁ గాలూనుటచే మాకు నూతనవికాసము చేకూరెను. మాయజ్ఞానము నశించెను. మాచెలికత్తియ యదృష్టము వేలుపులచెలువలకేని కలుగునా?

ఉ. అంబురుహాప్తతేజ భవ•దంఘ్రుల వ్రాలఁగఁ గల్గునుత్తమాం
గం బది యుత్తమాంగము జ•గన్మహనీయ భవత్కథావిశే
షంబు నుతింపఁగాఁ గలర•సజ్ఞ రసజ్ఞ భవద్విభావనా
ప్తిం బరిపూర్ణమై జరుగు•దిష్టము దిష్టము శిష్టకోటికిన్. 88

అంబురుహాప్తతేజ = సూర్యునితేజస్సువంటి తేజస్సుగలమహాత్మా, శిష్టకోటికిన్ = పెద్దలైనవారికి, భవత్=దేవరవారియొక్క, అంఘ్రుల వ్రాలఁగఁగల్గు = పాదములయందుఁ జేరఁగల్గిన, ఉత్తమాంగంబు=శిరమనునది యేదిగలదో, అది = అదియ, ఉత్తమాంగము = శిరస్సును నుత్తమమయిన యవయవంబును, (ని. 'ఉత్తమాఙ్గం శిర శ్శీర్షమ్' అని అ.) జగన్మహనీయ=జగత్తులయం దధికుఁడవైనవాఁడా, భవత్కథావిశేషంబునుతింపఁగాఁగల = మీయొక్క చరిత్రాతిశయము గొనియాడఁగలిగిన, రసజ్ఞ = నాలుకయేదిగలదో, రసజ్ఞ = అదియనాలుకయుఁను, సమస్తరసములను గుర్తెఱిఁగినదియును, (ని. 'రసజ్ఞాం రసనా జిహ్వా' అని అ.) భవత్=దేవరవారియొక్క, విభావనాప్తిన్ = ధ్యానప్రాప్తిచేత, పరిపూర్ణమైజరుగు = సంపూర్ణమై గతించునట్టి, దిష్టము = కాలమేదిగలదో, దిష్టము= అదియ కాలంబును శుభకరమయిన యదృష్టంబును, (ని. 'దిష్టం దైవేచ కాలే స్యాత్' అని నిఘంటువు.)

తా. మునీంద్రా! మీపాదములపైఁ జేర్చి మ్రొక్కఁగలిగిన తలయేతల, మీపావనచరిత్రవిశేషము కొనియాడఁగలుగు నాలుకయే నాలుక, మీధ్యానముచేతఁ బూతమైన సమయమే సమయము.

క. లలనాలలామవీణా, కలనాదము మెచ్చి కరుణఁ గమనీయవరా
కలనాదరమున వచ్చిన, యలనాదప్రియుఁడవో మహాత్మ తెలుపవే. 89

లలనాలలామ=కాంతాశిరోమణియైన మాచెలియొక్క, వీణాకలనాదము మెచ్చి = వీణాసంబంధమైన యవ్యక్తమధురధ్వని నంగీకరించి, కరుణన్ = దయచేత, కమనీయవరాకలనాదరమునన్-కమనీయ = ఒప్పుచున్న, వరాకలన = వరములిచ్చుటయందలి, ఆదరమునన్ = ఆదరముచేతనని యర్థము. సుందరుఁడైన పెనిమిటిని ఘటనపఱుచు నాదరముచేత నని యర్థాంతరము. (ని. 'దేవప్రసాదే వరణే జామాతరి వరః పుమాన్, క్లీబేతు కుంకుమే శ్రేష్ఠే త్రిష్విష్టే త్వవ్యయం వరమ్' నా.) వచ్చిన = విజయముచేసిన, అలనాదప్రియుఁడవో=ఆగానప్రియుండవైన నారదుఁడవేమో, మహాత్మ = మహానుభావా, తెలుపవే = ఆనతియ్యవే.

తా. ఈకాంతాశిరోమణి వీణాగానమునకు మెచ్చుకొని మనోహరవరములు (వరుని) సమకూర్చుటకు నేతెంచిన నారదమహామునివా? నీవు చెప్పుము.

ఉ. ఓయతులప్రభావయుత యోయతిలోకమణీ యనంతర
త్నాయతతేజ తావకశుభాంకముఁ గన్న సువర్ణరేఖలం
బాయనికూర్మిఁ దెల్పి యనపాయముగాఁగ మదీయకర్ణపా
ళీయుగళీపరిష్కరణలీల ఘటింపఁ గదే ముదంబునన్, 90

ఈపద్యమందు యతిలోకమణీ, అన్నందున మునిపరముగాను మణిపరముగాను నర్థద్వయము విచారింపవలయును. ఏలాగనిన, ఓయతులప్రభావ = సమానరహితమయిన ప్రభావముగలవాఁడాయని మునిపరమైన యర్థము. (ని. 'తులా సాదృశ్య మానయోః' అని మే.) తులయనఁగా మానమును, అతుల = మానము నతిక్రమించినదియు, ప్రభావ = ప్రభావయుతమయినదియు నని మణిపరమయిన యర్థము. ఓయతిలోకమణీ = ఓయతిజనశ్రేష్ఠుఁడా యని మునిపరమయిన యర్థము. అతిలోకమణీ = లోకాతిగమయిన మాణిక్యమని మణిపరమయిన యర్థము. అనంతరత్న = సూర్యునివలె, ఆయతతేజ = విస్తారమయిన తేజస్సుగలవాఁడా యని మునిపరమయిన యర్థము. అసంఖ్యములైన రత్నములయొక్క యాయతమైన తేజముగలదని మణిపరమయిన యర్థము. (ని. 'అనంతం గగనే క్లీబే పుమాన్ కేశవశేషయోః, అనంతా పూర్ణిమా దూర్వా విశల్యా శారిబా మహీ' అని నా.) తావకశుభాంకముఁ గన్న = నీయొక్క శుభమయిన నామముగానేర్పడిన, సువర్ణరేఖలన్ = యోగ్యమయిన యక్షరపంక్తుల నని మునిపరమయిన యర్థము. మాణిక్యాంకిత కాంచనరేఖలని అనఁగాఁ గర్ణాభరణవిశేషములని యర్థాంతరము. పాయనికూర్మిఁదెల్పి = ఎడతెగని ప్రేమచేత నానతిచ్చి, అనపాయముగాఁగన్ = అపాయరహితమగునట్టులుగా, మదీయ = నా సంబంధమయిన, కర్ణపాళీయుగళీ=కర్ణద్వయమునకు, పరిష్కరణలీలన్=అనఁగాఁ గర్ణసంతుష్టిని, ముదంబునన్=సంతోషముచేత, ఘటింపఁగదే=ఘటన పఱుపఁగదే యని మునిపరమయిన యర్థము. కర్ణాలంకారమును జేయఁగదే యని మణిపరమయిన యర్థము. అనఁగా గిరికాదేవియొక్క ప్రియసఖియైన మంజువాణి యతిని స్తోత్రము చేసి మీ నామధేయ మానతిచ్చి శ్రవణానంద మగునట్టులుగాఁ జేయవే యని యడిగెనని తాత్పర్యము. ఇది ప్రకృతాప్రకృతశ్లేషాలంకారము.

చ. అన మునిరాజు పల్కు వనితా జనతావినుతాభిధేయుఁ డై
యొనరినగౌతముక్ మునికులో త్తముఁ జెప్పఁగ విందువే కదా
యనఘతదన్వవాయకలశాంబుధిఁ బుట్టినవాఁడ గౌతమా
ఖ్య నెసఁగువాఁడ నేఁ బరమహాసరసప్రతిభానుభావుఁడన్. 91

అనక్ =మంజువాణి యిట్లడుగఁగా, మునిరాజుపల్కుక్ = మునిశ్రేష్ఠుఁడు పలుకుచున్నాఁడు. ఏమనియనిన, వనితా=ఓచిన్నదానా, జనతా=జనసమూహాముచేత, వినుత = స్తోత్రముచేయఁబడిన, అభిధేయుఁడై =పేరుగలవాఁడై, ఒనరిన=ఒప్పిన, మునికులో త్తముక్=మునికులశ్రేష్ఠుఁడయిన, గౌతముక్ = గౌతముని, చెప్పఁగవిందువేకదా = చెప్పుకొనఁగా వినియుందువేకదా, అనఘ = దోషరహితమైన, తత్ =ఆగౌతమునియొక్క, అన్వవాయ = వంశమనెడు, కలశాంబుధిక్ = క్షీరసముద్రమందు, పుట్టినవాఁడక్ = సంభవించినవాఁడను, గౌతమాఖ్య నెసఁగువాఁడక్ = గౌతముఁడను పేరుచేత నొప్పుచున్నవాఁడను, నేక్ =నేను, పర =పరమపురుషునియందు, మహాసరస=అధికస్వారస్యముగల, ప్రతిభా=అప్పటప్పటికి వికాసమును బొందుచుండెడు బుద్ధియొక్క, అనుభావుఁడక్ = ప్రభావము గలవాఁడను అని యర్థము. పరమ=ఉత్కృష్టమయిన, హాసరస = హాస్యరసమందలి, ప్రతిభా = ప్రభావముగలవాఁడనని యర్థాంతరము. (ని. 'ప్రజ్ఞాం నవనవోన్మేషశాలినీం ప్రతిభాంవిదుః') హాసరసము గలవాఁడనఁగా నాయికానుకూల్యమందు సహాయుఁడైన విదూషకుఁ డని తెలియవలయును. 'సంధానకుశల శ్చేటో హాస్యకారీ విదూషకః.' ఈపద్యపు మొదటిపాదమున తా అనునక్షరముమీఁది సంభోధనవిశిష్టమయిన యాకారము యతిగాఁ జెల్లినది. ఇది కాకుస్వరయతిగాని ప్లుతయతిగాని యనంబడును. దీనికి లక్షణము, ని.

క. 'పలుకులతలగలవ్రాలకు, వలనగుచోఁ బ్లుతము నిల్పి వానికి రెండుక్
వళులుగఁ జెప్పినఁ గావ్యం, బుల నది కాకుస్వరంబు ప్లుతవళియు నగుక్.'

ఇదిమొదలుకొని నర్మసచివునివాక్యములు గుణీభూత వ్యంగ్యములుగ నున్నవి.

తల్లక్షణము:—

శ్లో. కావ్యం ధ్వనిర్గుణీభూత వ్యంగ్యం చేతి ద్విధామతం
వాచ్యాతిశయిని వ్యంగ్యే ధ్వని స్తత్కావ్యము త్తమం.
అపరంతు గుణీభూత వ్యంగ్యం వాచ్యా దను త్తమే వ్యంగ్యే
తత్రస్యా దితరాంగం కాక్వాక్షి ప్తంచ వాచ్యసిద్ధ్యంగం.
సందిగ్ధ ప్రాధాన్యం తుల్యప్రాధాన్య మస్ఫుటమగూఢం
వ్యంగ్య మసుందరమేవం భేదా స్త స్యోదితా అష్టౌ. సాహిత్యదర్పణము.

తా. అని మంజువాణి పలుకఁగా మునిరాజు తనవృత్తాంతము నిటులఁ దెలిపెను. సుప్రసిద్ధుఁడగు గౌతముని వినియుందువుగదా! నే నాతనివంశమునఁ బుట్టినవాఁడను. నాపేరు గౌతముఁడు. (మహాప్రభావ సంపన్నుఁడను. హాస్యరసనిపుణుఁడ నని యర్థాంతరము.)

ఉ. ఓవలమానమీనమిథునోపమలోలవిలోచనాంత కాం
తా వసునాథు నున్న తనగాహితపాదసనాథు నాత్మసం

సేవకసేవధిం దగ భజించి తదీయరహస్యమంత్రసం
భావనచే ననాదిమునిమార్గముఁ గాంచితి నద్భుతంబుగాన్. 92

వలమాన=బెళకుచుండెడు, మీనమిథున = వాలుగచేఁపలజోడుతోడ, ఉపమ=సామ్యముగల, లోల=చలించుచున్న, విలోచన=నేత్రములయొక్క, అంత=కొనలుగల, కాంతా=ఓసుందరీ, ఉన్నత=పొడవైన, నగ=వృక్షములయందు, ఆహిత=ప్రసరింపఁజేయఁబడిన, పాద=కిరణములతోడ, సనాథుఁన్=కూడుకొన్నయని సూర్యపరమైన యర్థము. ఉన్నతనగ=మిక్కిలిపొడవైన కోలాహలపర్వతమునకు, (ని. 'శైలవృక్షౌ నగావగౌ' అని అ.) అహిత=ప్రతికూలమైన, పాదసనాథుఁన్=పాదముతోఁ గూడు కొన్న యని రాజపరమైన యర్థము. (ని. 'పాదా రశ్మ్యఙ్ఘ్రితుర్యాంశాః'అని అ.) సంసేవక = లెస్సగా సేవించినవారికి, సేవధిన్=నిధియైన, (ని. 'నిధి ర్నా సేవధిః' అని అ.) ఈవిశేషణ ముభయసామాన్యము. వసునాథుఁన్ = సూర్యుని ననియర్థము. వసురాజునని యర్థాంతరము. ఆత్మన్=మనస్సునందు, తగభజించి=యుక్తమగునట్లులుగాఁ గొలిచి, తదీయ = ఆసూర్యసంబంధమైన, రహస్యమంత్ర=గోప్యమైన మంత్రముయొక్క, సంభావనచేన్ = సమ్యగ్భావనచేత, అనఁగా ననుష్ఠానముచే ననియర్థము. ఆరాజుయొక్క రహస్య కార్యాలోచనమందలి యూహచేత నని యర్థాంతరము. (ని. 'మన్త్రో వేదభేదే స్యా ద్దేవాదీనాంచ సాధనే, గుప్తవాదే' అని అ.) అద్భుతంబుగాన్ = ఆశ్చర్యమగునట్లులుగా, అనాదిమునిమార్గముఁ గాంచితిన్=అనఁగా ('నవిద్యతే ఆదిర్యస్మాత్సః అనాదిః అనాదిశ్చాసౌ మునిశ్చ అనాదిమునిః') అనెడువిగ్రహమువలనఁ బురాతనమునులయొక్క మార్గమును బొందితివని యర్థము. 'ఆదిశ్చాసౌమునిశ్చ ఆదిమునిః, ఆదిమునిర్నభవతీత్యనాదిమునిః' అనెడు విగ్రహమువలన నూతన మునిమార్గమును బొందితివని యర్థాంతరము. ఈపద్యపు రెండవపాదమునందును గాకుస్వరయతి యని గ్రహించునది.

తా. ఓబేడిసమీలవంటి చలియించు కడగంటి చూపులుగలపోలంతీ! వసునాథుని (సూర్యుని) సేవించి తన్మంత్రశక్తిచే నచ్చెరువు గలుగఁజేయునీయనాది (ఆదినుండియుఁలేని) మునిభావము గడించి నాఁడను.

తే. నాఁతి విను మేను బిన్నటనాఁటనుండి
యును దదంఘ్రిసేవావృత్తి నున్నకతన
నిచ్చె నాకుఁ బ్రసన్నుఁడై యినుఁ డతండు
సకలపదములనాత్మానుసరణ మహిమ. 93

నాఁతి=ఓమగువా, వినుము=ఆలకింపుము. పిన్నటనాఁటనుండియు=నేను చిన్ననాఁటనుండియును, నేను చిన్ననాఁటంగోలె, తత్=ఆసూర్యునియొక్క, అంఘ్రిసేవావృత్తిన్ = అంఘ్రియనఁగాఁ గిరణము, కిరణాస్వాదనవృత్తిచేత, అనఁగాఁ గిరణపానతపోవృత్తిచేత, ఉన్నకతనన్ = ఉన్నందుచేతనని సూర్యపరమయిన యర్థము. తత్=ఆవసురాజుయొక్క, అంఘ్రిసేవావృత్తినున్నకతనన్=పాదసేవావ్యాపారమున నున్నందుచేతనని రాజపరమయినయర్థము. ప్రసన్నుఁడై=ప్రత్యక్షమయినవాఁడై యనియును, అనుగ్రహించినవాఁడై యనియును నర్థద్వయము. ఇనుఁడతండు=ఇనుఁడనఁగా సూర్యుఁడును ప్రభువును, (ని. 'ఇనో భూషే రవౌ పుంసి ధనిక స్వామినో స్త్రీషు' అని. నా.)

సూర్యుఁడైన యతఁడనియును ప్రభువైన యతఁడనియును నర్థద్వయము. సకలపదముల నాత్మానుసరణ మహిమన్ = పదమనఁగా స్థానము నధికారమును, అనుసరణమనఁగా ననుగమనంబును ననుకృతియును, మేరుకైలాసమందరాది స్థానములయందుఁ దనతోడ సంచరించు ప్రభావమునని సూర్యపరమయిన యర్థము. సకలాధికారములయందును స్వతంత్రప్రవర్తనముసేయుటనని రాజపరమయిన యర్థము. (ని. 'పదం వ్యవసిత త్రాణ స్థాన లక్ష్మాం ఘ్రి వస్తుషు' అని అ.) నాకు నిచ్చెన్ = నాకు దయచేసెను.

తా. ఓపడంతీ! పసితనమునుండి యీమహానుభావుని యంఘ్రిసేవ గావించుటవలన నాయెడఁ బ్రసన్నుఁడై యీయినుఁడు తన్ననుసరించు (చుందిరుగు) శక్తి నొసంగెను.

సీ. కావున నుద్యాన◆గతుఁ డైనమత్స్వామితోన మేరుసమేధ◆మానమంజు
లచ్ఛాయలఁ గరంబ◆లరుచు నీలగ్రీవనిలయాభిరామసీ◆మలఁ దెలియుచు [చు
సుమనోమనోజ్ఞ ధా◆మములు మెచ్చుచుఁ బుష్కరసరోవరోర్మిసం◆భ్రమముఁగను
రంభాదిలాస్యసం◆రంభము ల్దిలకించుకొనుచుఁ గిన్నరమృదు◆ధ్వనులు వినుచు
తే. శిశిరశిఖరిస్థలంబు లీ◆క్షించికొనుచుఁ, జంపకారణ్య మరయుచు ◆ జగతి నద్భు
తం బయినపుండరీకకే◆దారసేతు, వైఖరికి నిచ్చగించుచు ◆ వచ్చివచ్చి. 94

కావునన్ = అట్లగుటవలన, ఉద్యానగతుఁడైన మత్స్వామితోన = ఊర్ధ్వయానమునుబొందిన నాస్వామితోఁగూడ, అనఁగా సూర్యునితోఁగూడ, మేరు = మేరుపర్వతమందు, సమేధమాన = లెస్సగా వృద్ధిఁబొందుచున్న, మంజుల = మనోహరములయిన, ఛాయలన్ = కాంతులచేత, కరంబలరుచున్ = మిక్కిలియు సంతోషించుచును అని సూర్యపరమైనయర్థము. ఉద్యానగతుఁడైనమత్స్వామితోన్ = ఉద్యానవనవిహారము నంగీకరించిన మాప్రభువుతోఁగూడ, నమేరు = పొన్నచెట్లయొక్క, సమేధమాన = వృద్ధిఁబొందుచున్న, మంజుల = చల్లఁదనముచేత సంతోషపఱుచుచున్న, ఛాయలన్ = నీడలయందు, కరంబలరుచున్ = మిక్కిలి సంతసమునొందుచున్న, అని రాజపరమైనయర్థము. ని. 'ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబింబ మనాతపః' అని అ. నీలగ్రీవ = శివునికి, నిలయ = గృహమైన కైలాసమందు, అభిరామ = ఒప్పుచుండెడు, సీమలన్ = ప్రదేశములను, తెలియుచున్ = కనుపఱుచుకొంచు అని యర్థము. నీలగ్రీవములనఁగా నెమళ్లను, వానికి స్థానభూతములైన ప్రదేశములను జూచుచు అని యర్థాంతరము. సుమనః = దేవతలయొక్క, మనోజ్ఞ = సుందరములైన, ధామములు = మేడలు మొదలైన గృహములను, మెచ్చుచున్ = మెచ్చుకొనుచు అనియర్థము. సుమనః = పుష్పములచేత, మనోజ్ఞ = మనోహరములగుచున్న, ధామములు = గృహములను, అనఁగాఁ బూఁబొదరిండ్లను-మెచ్చుకొనుచునని యర్థాంతరము. పుష్కరసరోవర = పుష్కరమనెడు తీర్థమందలి, ఊర్మిసంభ్రమము గనుచున్ = తరంగసంవేగమును జూచుచునని యర్థము. పుష్కరశబ్దము కమలమందును వర్తించును. పుష్కరసరోవర = తామరకొలఁకులయందలి తరంగసంచలనమును జూచుచు నని యర్థాంతరము. రంభాది = రంభ మొదలుగాఁగల అప్సరస్త్రీలయొక్క, లాస్యసంరంభములు = నాట్యవిజృంభణములను, తిలకించుకొనుచున్ = చూచుకొనుచు నని యర్థము. రంభాది = అరంట్లు మొదలైన వృక్షములయొక్క, లాస్యసంరంభములు = చలనసంరంభములను జూచుకొనుచునని యర్థాంతరము. కిన్నర = కిన్నరులనెడు దేవయోనులయొక్క, అనఁగాఁ

దురంగవక్త్రులయొక్క; మృదుధ్వనులువినుచున్ = సౌమ్యములైన సంగీతనాదముల నాకర్ణించుచు నని అర్థము. కిన్నరపక్షినాదములను వించునని అర్థాంతరము.

శిశిరశిఖరిస్థలంబు లీక్షించికొనుచున్ = హిమవత్పర్వతముయొక్క ప్రదేశంబులను జూచుకొనుచు నని యర్థము, శిశిరశిఖరిస్థలంబులు = చల్లనైన వృక్షప్రదేశములను, జూచుకొనుచునని యర్థాంతరము. (ని. 'తరుశైలౌ శిఖరిణౌ' అని అ.) చంపకారణ్య మరయుచున్ = చంపకారణ్యమనెడు పుణ్యభూమిని జూచుచు నని యర్థము. సంపఁగితోఁటలు చూచుచు నని యర్థాంతరము. జగతి నద్భుతంబయిన=లోకమందాశ్చర్యకరమైన, పుండరీక కేదార సేతువైఖరికి నిచ్చగించుచున్ = పుండరీక కేదార, సేతువులనెడు పుణ్యక్షేత్రములయొక్క రీతికి నిష్టమును బొందుచు, అనఁగా సేవించుచు నని యర్థము. పుండరీక కేదార = పద్మములుగల మళ్ళపట్టులయొక్క, (ని. 'పుణ్డరీకం సితచ్ఛత్రే కుష్ఠభేదే సితాంబుజే, నా త్వామ్రే రజతే వ్యాఘ్రే దిగ్గజే కుఞ్జరే స్వరే' అని నా.) సేతువైఖరికిన్ = కట్టలుండెడు పొందికకు, ఇచ్చగించుచున్ = మెచ్చుకొనుచునని యర్థాంతరము. వచ్చివచ్చి = వచ్చుచు వచ్చుచు నున్నవాఁడనై. అలం. శ్లేషాలంకారము.

తా. వనవిహారతత్పరుఁడగు మారాజుతోఁగూడ బయలుదేరి సురపొన్నలు నెమిళ్లు పూలగుత్తులు సరోవరతరంగములు అరటిచెట్లులయందములు దిలకించుచుఁ గిన్నరపక్షులగానము లాలించుచుఁ జల్లని చోటుల మెలఁగుచు సంపంగితోఁటలు తమ్మికొలఁకులుఁ జూచుచు వచ్చి (అర్థాంతరము) ఆకాశయానముగావించు మాయజమానితోఁగలసి మేరుపర్వతభాగము కైలాసము మానససరోవరము రంభాద్యప్సరోనృత్యములు జూచుచుఁ గిన్నరగానము లాలించుచు, మంచుకొండ వేల్పులకూటములు గాంచుచుఁ జంపకారణ్యముఁ జూచి సేతుకేదారాది క్షేత్రదర్శనమునకు వచ్చి.

చ. సరసదరీఝరీవికచ◆సారససౌరభసారపూరితాం
బర మగునిమ్మహానగము◆పజ్జనె యానవపద్మినీమనో
హరుఁడు వెలుంగ నాయన కు◆పాయన మిచ్చుటఁ గూర్చువాఁడనై
యరయుచుఁ బద్మినీసముద◆యం బని వచ్చితి నమ్మ నెచ్చెలీ. 95

సరస=యోగ్యమయిన, దరీ = గుహాప్రాంతములయందలి, ఝరీ=ప్రవాహములయందు, వికచ = వికసించిన, సారస = కమలములయొక్క, సౌరభసార = శ్రేష్ఠమైన పరిమళముచేత, పూరిత=నిండింపఁబడిన, అంబరమగు = ఆకాశముగలదై, ఇమ్మహానగముపజ్జనె = ఈమహత్తయిన కోలాహల పర్వతము యొక్క ప్రాంతమందే, ఆనవపద్మినీ మనోహరుఁడు వెలుంగన్ = పద్మిని యనఁగాఁ బద్మలతయును బద్మినీజాతిస్త్రీయును, (ని. 'పద్మినీ కరిణీ శ్రీస్త్రీ సరోఽబ్జ నళినీషు చ' అని నా.) ఆ, నవపద్మినీ మనోహరుఁడు = నూతనమయిన పద్మలతకుఁ బ్రియుఁడైన సూర్యుఁడు, ప్రకాశింపఁగా ననియర్థము. నూతన పద్మినీజాతిస్త్రీలకుఁ బ్రియుఁడైన వసురాజు విలసిల్లఁగానని యర్థాంతరము. ఆయన కుపాయన మిచ్చుటఁ గూర్చువాఁడనై = ఉపాయనమనఁగాఁ గానుక, ఆసూర్యునకుఁ గానుక సమర్పించుటకు ఘటన పఱుచువాఁడనై యనియును నావసురాజునకుఁ గానుక యియ్యఁదలఁచినవాఁడనై యనియును నర్థద్వయము. అరయుచుఁ బద్మినీసముదయంబనివచ్చితినమ్మ=పద్మలతాసమూహమును వెదకుచుఁగాక యని యే తెంచితినమ్మా యనియర్థము. పద్మినీజాతి స్త్రీసముదాయమును వెదకుచుఁగాక అని వచ్చితినమ్మా అని అర్థాంతరము. నెచ్చెలీ = సఖీమణీ అని సంబుద్ధి.

తా. ఇచటి కొలఁకులయందలి విచ్చిన తామరపూవు లాకాశమంతటను దావు లొలయించుచుండ మాపద్మినీమనోహరుఁడు (రాజు-సూర్యుఁడు) ఇట నిలిచెను. ఆతని కుపాయనముగఁ బద్మినీ సముదయమును (తామరకాడలను-పద్మినీజాతిస్త్రీలను) సమకూర్చుట కరుగుదెంచితిని.

క. అని తెలిపి మఱియు నిట్లను, వనితా యీకన్య ననఘ•వైభవధన్యం
గనుఁగొన వాత్సల్యంబును, ననుకంపయు నద్భుతంబు • నయ్యెడు మాకున్. 96

అని తెలిపి = ఇట్లని తెలియఁజెప్పి, మఱియునిట్లనున్ = మఱల నీలాగనెను. ఏమనిన, వనితా = ఓమగువా, అనఘ = దోషరహితమైన, వైభవ = విభవముచేత, ధన్యన్ = కృతార్థురాలైన, ఈకన్యన్ = ఈకన్నియను, కనుఁగొనన్ = చూడఁగా, మాకున్ = మాకు, వాత్సల్యంబును = ప్రేమయును, అనుకంపయున్ = కరుణయును, (ని. 'కారుణ్యం కరుణా ఘృణా, కృపా దయా నుకంపా స్యాత్' అని అ.) అద్భుతంబున్ = ఆశ్చర్యంబును, అయ్యెడున్ = అవుచున్నది.

తా. చెలువా! విభవముచేఁ గృతార్థురాలుగనున్న యీకన్నియను జూచినంతన మాకుఁ గరుణ ప్రేమ యాశ్చర్యము జనించుచున్నది.

చ. అనుపమభాగ్యలక్షణస•మన్విత యీరమణీలలామ యీ
మనసిజరాజరాజ్యరమ • మానసవీథిఁ దలంప సింధునం
దన యచలేంద్రనందన య•నం గన నయ్యెడి నీలతాంగిపా
వనకులగోత్రభూతి చెలు•వా చెలువారఁగఁ దెల్పవే యనన్. 97

అనుపమ భాగ్యలక్షణ సమన్విత = సమానరహితములయిన భాగ్యచిహ్నములతోఁ గూడిన, ఈరమణీలలామ = ఈసుందరీశిరోభూషణమైనదియు, ఈమనసిజరాజరాజ్యరమ = మన్మథరాజరాజ్యలక్ష్మియైనదియు నగు నీకన్య, మానసవీథిఁదలంపన్ = మనస్సునందు విచారింపఁగా, సింధునందన = లక్ష్మీదేవియును, అచలేంద్రనందన = గౌరీదేవియును, అనంగననయ్యెడిన్ = అన్నట్టులుగాఁ జూడఁదగియున్నది అని అర్థము. (ని. 'సింధుస్తు వారిధౌ, దేశే నదే గజమదే నా నద్యాంతు స్త్రియా మయమ్.' అని నా.) సింధుశబ్దము నదియందును వర్తించుచున్నదిగనుక శుక్తిమతీనదీపుత్రిక యనియును నచలేంద్రనందన అనఁగాఁ బర్వతశ్రేష్ఠుఁడైన కోలాహలుని పుత్రిక అనియును గిరికాపరమైన ధ్వనితార్థము. ఇక్కడ నప్రకృతవాచకములయిన సింధునందనాదిపదములందు సూచనావ్యాపారమని గ్రహింపవలయును. చెలువా = ఓమగువా, ఈలతాంగి = ఈచిన్నదానియొక్క, పావనకులగోత్రభూతి = కులగోత్రములనఁగా వంశంబును, నామంబును పవిత్రకుల గోత్ర వైభవ మని అర్థము. పావనమనఁగా నుదకంబును, (ని. 'పావనం తు జలే కృచ్ఛ్రే' అని వి.) కులగోత్రమనఁగాఁ గోలాహలపర్వతంబును, వీనివలన సంభవమని అర్థాంతరము. చెలువారఁగఁదెల్పవే అనన్ = చక్కనగునట్టులుగాఁ దెలియఁజెప్పవే అని అడుగఁగా.

సాటిలేని భాగ్యలక్షణములు కలదిగావుననే లక్ష్మియనుకొనుట తటస్థించినది. మనసిజరాజరాజ్యరమ యనుటచేఁ జక్కదనములకు నెలవనుట. లచ్చియో గౌరియో కాదగును కావుననే యామె కులగోత్రములు పావనమైనవనుట. సింధునందనయనుటచే నదీపుత్రియని అచలేంద్రనందన యనుటచేఁ గోలాహలపుత్రియని యర్థశక్తిచే భావము సంతరించి పలికెననుట పొసఁగదు. ఇతఁడీకన్నెకొలము గోత్రము నెఱుఁగఁడు. కాననే యాదృచ్ఛికము నూటిపడెనని కవిచెప్పినాఁడు.

తా. సుందరియగు నీచెలువ సింధుపుత్త్రియో శైలపుత్త్రియో యైయుండును. ఈయమకుల గోత్రాదులను దెలుపుము.

మ. అతుల ప్రౌఢవచోనుభావములప్రౌ ♦ ఢైవై మించునావంచనా
యతియాదృచ్ఛికసూక్తి సూటిపడ న♦న్యోన్యాననాలోకనా
యతనానాద్భుతలీలఁ దేలి మునిమా♦హాత్మ్యంబు వర్ణించి రా
శతపత్త్రేక్షణ లెల్ల నుల్లముల వి♦శ్వాసంబు సంధిల్లఁగన్. 98

అతుల=అసమానములైన, ప్రౌఢవచః=ప్రగల్భవచనములయందలి, అనుభావముల = ప్రభావములకు, ప్రౌఢైవై = దాశియై, మించు = అతిశయించుచున్న, ఆవంచనాయతి = అకృత్రిమమునియొక్క, యాదృచ్ఛికసూక్తి = తనంతనేపలికిన గిరికాదేవి వృత్తాంతసూచకమయిన వాక్యము, (ని. 'వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః' అని అ) సూటిపడక్ = వాస్తవముగఁ దార్కాణపడఁగా, అన్యోన్యాననాలోకన=పరస్పరముఖ వీక్షణముతోఁగూడిన, ఆయత=అతిశయమయిన, నానా = బహువిధములైన, అద్భుతలీలఁదేలి = ఆశ్చర్యమందు మునిఁగి తేలినవారై, ఆశతపత్త్రేక్షణలెల్లక్=ఆక్కడి స్త్రీలందఱును, విశ్వాసంబు సంధిల్లఁగక్=అప్రత్యక్షజ్ఞాని యనెడు నమ్మకముచిక్కఁగా, మునిమాహాత్మ్యంబు=ఆఋషియొక్క సామర్థ్యమును, వర్ణించిరి = స్తోత్రముచేసిరి. ఇచట రెండవపాదమం దన్యోన్యశబ్ద ముభయవళులలోనిదిగావున, 'య' అనుదానితోసంబంధించినది. ఇది యుభయయతి. అన్య+అన్య, 'అనుచోసంధిగత మగుననోన్యశబ్దమునకుఁగల పూర్వరూపానుకూలముగ యతికూర్పఁబడినది. 'అన్యోన్యవిరుద్ధభాషణములాడిన తత్ఫల మాతఁడందెడిక్'' భారతము. మాట సూటివడుట విశ్వాసము కలుగుటకు హేతువు. ఇది మునిమాహాత్మ్యమనుకొనుటయే యద్భుతలీలకు, ఒకరిమొగము నొకరు చూచుకొనుటకుఁ గారణము.

తా. మాటలాడుటలో నేర్పరియగు నామాయాతపసి పలికినపలుకు సూటిపడినంతన నీముని మహత్త్వము గలవాఁడని కొనియాడి యాకాంత లందఱు మునియెడ నమ్మకము గలవారైరి.

ఉ. అయ్యెడ మంజువాణి వినఁ♦యమ్మున నమ్మునిరాజుఁ బల్కు నో
యయ్య సమస్తలోకభర♦ణాభరణాత్మమహామహోజ్జ్వలుఁ
నెయ్యము మీఱఁ గొల్చి మహ♦నీయశుభోన్నతిఁ గాంచి యున్న నీ
కియ్యఖిలప్రపంచకథ♦లెల్ల నెఱుంగు టెఱుంగు చోద్యమే. 99

అయ్యెడక్ = ఆసమయమందు, మంజువాణి = మంజువాణియనెడు చెలికత్తియ, వినయమ్మునక్ = నమ్రభావముచేత, అమ్మునిరాజుఁ బల్కుక్ = ఆమునిశ్రేష్ఠునిఁగూర్చి పలుకుచున్నది-ఏమనిన, ఓయయ్య=ఓితండ్రీ, సమస్తలోక=సకలభువనములయొక్క, భరణ = భరించుటయే, ఆభరణ = భూషణముగాఁగల, ఆత్మ=స్వకీయమయిన,మహాల్ = అధికమయిన, మహా = ఉత్సవములచేత, ని. 'మహ ఉద్ధవ ఉత్సవః' అని అ. ఉజ్జ్వలుక్=వెలుఁగుచున్న సూర్యుని, నెయ్యముమీఱఁగొల్చి = అప్తభావమతిశయించునట్టులుగా సేవించి, మహనీయ శుభోన్నతిఁగాంచియున్ననీకుక్ = ఒప్పిదమయిన శుభాతిశయమును బొందియున్న నీకు, ఇయ్యఖిలప్రపంచకథలెల్లక్ = ఈసమస్తప్రపంచమందలి వృత్తాంతములన్నియును. ఎఱుంగుటెఱుంగు చోద్యమే=గుర్తెఱిఁగియుండుట యాశ్చర్యమా?-

అనఁగా దేవరవారికి నీ ప్రపంచములోఁ గలవారివృత్తాంతములన్నియుఁ దెలిసియే యున్నవి గనుక నీ కన్యయొక్క వృత్తాంతంబును దెలిసియుండునని భావము. నాలవచరణమందు - ఇయ్యఖిల ప్రపంచకథ లన్నచోట, ఇదమ్ శబ్దార్థమయిన ఈశబ్దమునకు హ్రస్వంబును నుపర్యక్షరమునకు ద్విత్వంబును జేసి ద్విత్వవిశిష్టమయిన యుపర్యక్షరమును ప్రాసముగాఁ జెప్పినాఁడు - ఇందుకు, ని. 'ఇతమద సేతద్య త్తచ్ఛబ్దాశ్చబ్దాంతరాన్వయేబహుళమ్, హ్రస్వం ప్రపద్యదీర్ఘాద్విత్వ ముపర్యక్షరస్యజనయంతి.' అని న. ని. 'ఊష్మ రేఫాన్వినాద్విత్వ మయుక్తస్య హాలోమతమ్' అను నథర్వణవచనము. ప్రథమచరణ మందు తచ్ఛబ్దార్థమైన అశబ్దమునకు నిట్లె.

చ. అనుపమభాగ్యలక్షణసమన్విత యీరమణీలలామ యీ
మనసిజరాజరాజ్యరమ మానసవీథిఁ దలంప సింధునం
దన యచలేంద్రనందన యనం గన నయ్యెడి నంచు నిట్లు పే
ర్కొనియును గ్రమ్మఱం దెలియఁ గోరుట కూరిమి పెంపునం గదా. 100

అనుపమ=సరిలేని, భాగ్యలక్షణ=భాగ్యలక్షణముతో, సమన్విత=కూడిన, ఈరమణీలలామ = ఈ సుందరీ శిరోభూషణమును, ఈమనసిజ రాజ రాజ్యరమ = మన్మథరాజ రాజ్యలక్ష్మియు నైనయీకన్యక, మానసవీథిఁ దలంపఁగ=మనస్సునందు విచారింపఁగా, సింధునందన = శుక్తిమతీనదీపుత్రికయును, అచలేంద్రనందన = కోలాహలాద్రిపుత్రికయును, అనంగనయ్యెడినంచున్ = అనునట్టులుగాఁ గనుపడుచున్న దనుచు, ఇట్లు=ఈప్రకారముగా, పేర్కొనియును = పేరువాడినవారై యుండియు. క్రమ్మఱం దెలియఁ గోరుట = మరలఁ దెలిసికొనవలయు నని యిచ్ఛయించుట, కూరిమి పెంపునంగదా = ప్రేమాతిశయము చేతనే కదా. అనుపమయనెడు-97 వ పద్యమందు మాయామౌని వాక్యమున నర్థద్వయము గలుగు నట్టులుగాఁ జెప్పఁబడిన సింధునందన, అచలేంద్రనందన యనెడుపదములకు మంజువాణి శుక్తిమతీ నదీపుత్రియనియుఁ గోలాహలాద్రి పుత్రియనియును నర్థమును గ్రహించి యీపద్యమందు నీరీతిగాఁ గపటమునితోఁ బలికె నని తెలియవలయును.

కూరిమి పెంపునకుఁ దార్కాణ తెలిసికొనినయంశము తెలియనటుల నటించిచెప్పుట, మీరు చెప్పినశుభలక్షణములతోఁ గూడిన యీచెలువ మీరు నిశ్చయించినటుల సింధునందనయే(నదీపుత్రియే) అచలేంద్రపుత్రియే (కోలాహలుని తనూజాతయే) ఇది మీరలే పేర్కొనిన యంశమనిభావము.

క. కావున నీవనజానన, పావనజననక్రమంబు భవదీయదయా
శ్రీవలన విన్నవించెద, నే విను మని యవ్విలాసినీమణి వలికెన్. 101

కావునన్=కాఁబట్టి, ఈవనజానన = ఈకన్యకయొక్క, పావనజననక్రమంబు = అనఁగాపవిత్రమైన జన్మప్రకారమని యర్థము. వనజాననపావనజననక్రమంబు అనుచోటఁజెను గు షష్ఠీసమాసము గావున వనజాననాశబ్దమునకు హ్రస్వముగలిగినది. పావనమనఁగా నుదకంబును గనుక జలమయశుక్తిమతియందలి జననప్రకారమని యర్థాంతరము. భవదీయదయాశ్రీవలనన్ = దేవరవారియొక్క కృపాసంపత్తిచేత, నేన్=నేను, విన్నవించెదన్=విన్నపముసేయుచున్నాను, వినుమని=చిత్తగింపుమని, అవ్విలాసినీమణి=ఆమంజువాణి, పలికెన్=(వక్ష్యమాణప్రకారంబుగా) వచించెను. విజ్ఞాపనశబ్దమునకుఁ దద్భవము విన్నపము.

తా. సుగమము.

మ. కలఁ డుల్లోకమహోమహోగ్రహుతభుగ్జ్వాలావళీనిర్జల
స్థలదంభోనిధిలక్ష్యహైమవతపక్షక్షోదదక్షోరుది
గ్వలభీదుర్భరభేరికాభయదభాంకారైకసంప్రీణితా
చలవైరిస్తుతకీర్తిసాంద్రుఁడు వసుక్ష్మాపాలచంద్రుం డిలన్. 102

ఉల్లోక=లోకాతీతమైన, మహః = ప్రతాపమనెడు, మహోగ్ర=అత్యంతతీక్ష్ణమైన, హుతభుక్=అగ్నియొక్క, జ్వాలావళీ = జ్వాలాసమూహముచేత, నిర్జరస్థలత్ = జలశూన్యప్రదేశముగా నాచరించుచున్న, అంభోనిధి = సముద్రమందు, లక్ష్య=చూడఁదగినది, అనఁగాఁ గనఁబడుచున్న, హైమవత = హిమవత్పర్వత పుత్త్రుఁడైన మైనాకునియొక్క, పక్ష=ఱెక్కలయొక్క, క్షోద = చూర్ణీకరణమందు, దక్ష=సమర్థమైనదియు, ఉరు = అధికమయినదియునగు, దిగ్వలభీదుర్భర=దిగంతములచేత భరింపశక్యముగానట్టి, భేరికా = రణభేరియొక్క, భయద = శత్రుభయప్రదమయిన, భాంకార=భాం అనునట్టి యనుకరణధ్వనిచేత, ఏక=ముఖ్యమగునట్టులుగా, సంప్రీణిత=సంతోషపెట్టఁబడిన, అచలవైరి=పర్వతద్వేషియైన యింద్రునిచేత, స్తుత=స్తోత్రముచేయఁబడిన, కీర్తి=యశస్సుచేత, సాంద్రుఁడు=పూర్ణుఁడైన, వసుక్ష్మాపాలచంద్రుఁడు=వసురాజశ్రేష్ఠుఁడు, ఇలన్=భూమియందు, కలఁడు=ఉన్నాఁడు. అనఁగాఁ దనయొక్క ప్రతాపాగ్నిజ్వాలలచేత సముద్రోదకము నింకింపఁ జేయఁజాలిన శౌర్యముగల వసురాజనెడు రాజశ్రేష్ఠుఁడు కలఁడని యర్థము. (హైమవతపక్షచ్ఛేదదక్షత్వస్య విశేషణగత్యా భేరీభాంకరణజనితసంప్రీణనే హేతుత్వాత్కావ్యలింగమలంకారః.)అలం-అతిశయోక్తి. కావ్యలింగము.

తా. వసురాజను నృపాలుఁడు కలఁడు. లోకాతీతమగు నాతని పరాక్రమాగ్నిచే సముద్రమంతయు నింకుటచే నందుఁ దలదాఁచుకొను మైనాకుఁడు బయటఁబడి భేరీభాంకారధ్వనిచేఁ బక్షశూన్యుఁడగుటవలన దేవేంద్రుఁడు శైలపక్షచ్ఛేదరూపమగు తనపని నెరవేర్చినందులకుఁ గొనియాడుచుండును.

శా. స్వారాజ్యంబునుబోలె నింద్రున కధిష్ఠానం బధిష్ఠానమై
యా రాజన్యున కింపుసొంపెసఁగు నిత్యశ్రీలతావాలమై
యారామస్స్మయమానసూనమకరందాసారశైవాలినీ
ధారావర్ధితమాధురీగుణలసత్కాంతారకాంతారమై. 103

ఇంద్రునకున్=దేవేంద్రునికి, స్వారాజ్యంబునుబోలెన్=స్వర్గరాజ్యమువలె, అధిష్ఠానంబు=అధిష్ఠానమనెడు పట్టణము, అధిష్ఠానమై=నివాసస్థానమై, ని. 'అధిష్ఠానం పూః ప్రభావ చక్రేష్వధ్యాసనేపిచ' అని నా. నిత్య=శాశ్వతమైన, శ్రీ=సంపదయనెడు, లతా=తీఁగెను, ఆవాలమై=పాదై, ఆరామ=ఉద్యానవనములందు, స్మయమాన=వికసించుచున్న, సూన=పుష్పములయొక్క, మకరంద=పూఁదేనెయొక్క, ఆసార = ధారాసంపాతమువలనఁ బుట్టిన, శైవాలినీ=నదియొక్క, (ని. 'తరఙ్గిణీ శైవలినీ తటినీహ్రాదినీ ధునీ' అని అ.) శైవలినీశబ్దము శైవాలినీశబ్దమునకు రూపాంతరము. ధారా=అల్పప్రవాహముచేత, వర్ధిత=వృద్ధిఁబొందింపఁబడుచున్న, మాధురీగుణ=మాధుర్యముచేత, లసత్=ఒప్పుచున్న, కాంతార=చెఱకుయొక్క, కాంతారమై = తోఁటలుగలదై, ఆరాజన్యునకున్ = ఆవసురాజునకు,

ఇంపుసొంపెసఁగున్=మనోహరమయి యొప్పుచుండును. కాంతారశబ్దమునకు (ని. 'ఇక్షుదణ్డప్రభేదే స్యాత్కాన్తారః' అని వి. ని. 'కాన్తారో స్త్రీవనే దుర్గవర్త్మ న్యక్షాంతరేతునా' అని నానార్థరత్నమా ల.) అలం. రూపకము.

తా. సమస్తసంపదల కాటపట్టయి సొంపలరు అధిష్ఠాననగర మతనిరాజధాని. స్వర్గము నింద్రుఁ డేలినటుల నతఁడు భూచక్రమును బాలించును. అధిష్ఠానపురమందలి యారామములోని పూదేనియ సోనచే మధురరసావృతములగు చెఱకుఁదోటలు పెంపఁబడుచున్నవి.

తే. రత్నభూషిత యైనయా•రాజధాని, యఱుత నురుతరముక్తాఫ•లాభిరామ
దామకంబనఁ జాలి ని•ద్దంపుఁజవులఁ, బరఁగు శుక్తిమతీనామ•భవ్యతటిని. 104

రత్న=మణినిబద్ధమైన, భూ=భూమితోడ, ఉషితయైన = ఉండినదియు, రత్నాలంకృతయైన దియునగు, రాజధాని=ఇక్కడ స్త్రీలింగసారస్యముచే నొకానొకస్త్రీ స్ఫురించుచున్నది గనుక రాజ ధానియనెడు స్త్రీయొక్క, అఱుతన్ = కంఠమందలి, ఇది అఱుతశబ్దపు సప్తమ్యంతము. ఉరుతర = మిక్కిలి గొప్పలైన, ముక్తాఫల=ముత్యములతోడ, అభిరామ = ఒప్పుచున్న, దామకంబనన్ = హార మోయనునట్టులుగా, చాలి=అర్హమై, శుక్తిమతీనామభవ్యతటిని=శుక్తిమతియనెడుదివ్యనది, నిద్దంపుఁ జవులన్=స్నిగ్ధమయిన మధురరుచులచేతను, మౌక్తికములచేతను, పరఁగున్=ఒప్పుచుండును.

చవులనఁగా రుచులకును మౌక్తికములకును పేరు. ఇందుకుఁ బ్రమాణము. ని. క. 'చవులనఁగా నభిధానము లవు సద్రుచులకును ముత్తియంబుల కభవా' అని యాంధ్రనామసంగ్రహము. అనఁగా నధిష్ఠానమనెడు పేరుగల రాజధానియనెడు స్త్రీయొక్క కంఠమందుఁ బ్రకాశించు ముత్యాలహారమో యన్నట్టులుగా జలమాధుర్యముచేతను ముత్యములచేతను నొప్పుచున్న శుక్తిమతీనదిపట్టణ ప్రాంతమం దుఁ బ్రవహించుచుండునని తాత్పర్యము. శుక్తిమతియందు ముత్యపుచిప్పలుండుటయు, వానియందు ముత్తియములు పుట్టుటయుఁ బ్రకటంబకదా. దీనికిం బ్రమాణము-

క. 'ఒప్పెసఁగుఁ బలుదెఱంగులఁ, జిప్పలలో స్వాతివానచినుకులు మున్నే
-చొప్పనఁబడు నప్పరుసున, నొప్పాదవును మౌక్తికంబు లొక్కొకభంగిన్'

అని రత్నపరీక్షయందుఁ జెప్పంబడియున్నది.

"అఱుతన్" అనునది యఱుతశబ్దమునకుఁ గలసప్తమ్యేకవచనరూపము. ఔపవిభక్తికము. "అఱుతన్" అనుటవలన శుక్తిమతి పట్టణమున కుపకంఠమునఁ బ్రవహించుచున్న దనుట.

అలం-రూపకోత్థాపితోత్ప్రేక్ష.

ఉ. జీవన మెల్ల సత్కవిని•షేవిత మాశయ మెల్ల నచ్ఛతా
పావనతాగభీరతల•పట్టు ప్రచారము లెల్ల విశ్వధా
త్రీవలయత్రికాలఫల•దేశికము ల్నవకంబు లెల్ల ము
క్తావళివిభ్రమాస్పదము • లానదిపెంపు నుతింప శక్యమే. 105

ఈపద్యమునందు శుక్తిమతీనది ధార్మికురాలగు స్త్రీగను నదిగను నర్థద్వయముచే వర్ణింపఁ బడుచున్నది.

జీవనమెల్లసత్కవినిషేవితము = జీవనమనఁగా నుదకంబును బ్రతుకును, (ని. 'సలిలేపిచ జీవ నమ్' అని నా.) కవులనఁగా జలపక్షులును కవిజనులును, ఉదకమంతయుఁ శ్రేష్ఠులయిన జల

పక్షులచేత ననుభవింపఁబడుచున్నదని యర్థము. బ్రతుకంతయును శ్రేష్ఠులయిన కవిజనులచేత ననుభవింపఁబడుచున్నదని యర్థాంతరము. ఆశయమెల్ల నచ్ఛతాపావనతాగభీరతలపట్టు = ఆశయమనఁగా మడుగును మానసంబును, మడుగంతయును నిర్మలత్వముయొక్కయుఁ బావనత్వముయొక్కయు నగాధత్వముయొక్కయును స్థానమని యర్థము. మానసము నిష్కల్మషత్వముయొక్కయుఁ బవిత్రత్వముయొక్కయు గంభీరత్వముయొక్కయు స్థానమని యర్థాంతరము. ప్రచారముల్లెల్ల విశ్వధాత్రీవలయత్రికాలఫలదేశికముల్ = ప్రచారములనఁగాజలప్రవాహములును ప్రవర్తనములును-జలప్రవాహములన్నియు, విశ్వధాత్రీవలయ = సమస్త భూవలయములకును, త్రికాలఫలదేశికముల్ = ముక్కారుపంటలు గలుగఁ జేయుచున్నవని యర్థము. ప్రవర్తనములన్నియు సమస్తభూజనులకును గాలత్రయఫలంబులను దెలియఁ జేయునట్టి వని యర్థాంతరము. అనఁగా భూతకాలపుణ్యసూచకంబులును, భవిష్యత్కాలశుభహేతుకములును; వర్తమానకాల దురితభంజకములును నని యాశయము. నవకంబులెల్ల ముక్తావళివిభ్రమాస్పదములు, నవ=నూతనమయిన, కంబులెల్లన్=శంఖములన్నియు, ముక్తావళి = మౌక్తికసముదాయములకును, విభ్రమ = చుట్టురేఖలకును, ఆస్పదంబులు=ఆధారములనియర్థము. ఇక్కడ విభ్రమశబ్దము భ్రమణాశ్రయములయిన ఆరేఖలఁ జెప్పుచున్నది. నవకంబులు = కోమలత్వములు, అనఁగాఁ జక్కఁదనములు, నవకమనునది దేశ్యశబ్దము. ముక్తావళి = ముక్తులైనవారికిని, విభ్రమాస్పదములు = మోహాస్పదములని యర్థాంతరము. (ని. 'పరిత్యక్తేపి ముక్తస్స్యాన్ముక్తౌ ముక్తాఫలే స్త్రియామ్' అని నా.) ఆనదిపెంపు నుతింపశక్యమే = కాఁబట్టి యాశుక్తిమతీనదియొక్క ఘనత కొనియాడ నలవియగునా, అనఁగా నలవిగా దనుట. అలం-శ్లేషము.

శంఖములలోఁగూడ ముత్తెములు జనించును.

శ్లో. "కరీంద్రజీమూతవరాహశంఖ మత్స్యాహి శుక్త్యుద్భవవేణుజాని
ముక్తాఫలాని ప్రథితాని లోకే."

తా. ఆనదియందలి జలము నీటిపక్షులకు సేవాపాత్రము. అందలిమడుగులు నిర్మలములు. పవిత్రములు. లోతుగలవి. నదీగమనము భూచక్రమున సస్యరూపఫలప్రదములు. శంఖములు ముత్తెపుఁబుట్టువుల కాటపట్టులు. నదిపెంపు కొనియాడ వశమా ? (అర్థాంతరము) బ్రతుకు కవిసేవితము. హృదయము పరిశుద్ధము. పవిత్రము గంభీరము. గమనము భూతభవిష్యద్వర్తమానఫలబోధకము. చక్కదనము ముక్తులకుఁగూడ భ్రమాస్పదము.

సీ. అనుకూలఖేలనా॰యత్తజీవనమైత్రి నడరి నర్మద బోటి ॰ యై భజింప
నూర్మికాకంకణ॰న్యుతికలాపము దోఁప బాహుద కైదండఁ ॰ బరిఢవింప
సముదితారావసం॰భ్రమసాంద్ర యై సారెసారె వేత్రవతి హె॰చ్చరికఁ దెల్ప
గంభీరరసగుంభ॰సంభృతప్రౌఢిమతో సరస్వతి పల్కు॰దోడు గాఁగ
తే. గులములోఁ బెద్దయు నమూల్య॰గుణమణిప్ర
కాండపరిపూర్ణయును గాన ॰ గారవమున
నఖిలనదులునుఁ దనుఁ గొల్వ ॰ ననుదినంబు
నలువకొలువున కేఁగు న॰న్నది యతీంద్ర. 106

ఈపద్యమునందును నదీపరముగను స్త్రీపరముగను నర్థద్వయము చెప్పఁబడుచున్నది.

యతీంద్ర=ఓమునీంద్రుఁడా, అనుకూల=ఇష్టమైన, ఖేలన=క్రీడయందు, ఆయత్త=అధీనమయిన, జీవనమైత్రిన్=ప్రాణస్నేహముచేత, అడరి=ప్రకాశించి, నర్మద = నర్మదానదియనెడు నర్మప్రదయైన, చెలికత్తియ, బోటియైభజింపన్=పరిచారికయై కొలువఁగాననియర్థము. అనుకూలఖేలనాయత్త = కూల మనఁగాఁ దీరము, తీరములనానుకొని విహరించుటయం దధీనమైన, జీవనమైత్రిన్ = జలమైత్రిచేత, అడరి=ప్రకాశించి యనిభావము. బాహుద యనఁగా బాహుదానదియును గైదండ యొసంగుస్త్రీయును, ఊర్మికా=ఉంగరములయొక్కయు, (శ్లో. 'అఙ్గుళీయకమూర్మికా' అని అ.) కంకణ = బంగారుగాజుల యొక్కయు, (శ్లో. 'కంకణం కరభూషణమ్' అని అ.) ద్యుతికలాపము = కాంతిసముదాయము, తోఁపన్ = ప్రకాశింపఁగా, బాహుద = బాహుదానదియనెడు కైదండయిచ్చెడు చెలికత్తియ, కైదండఁ బరిఢవింపన్ = చేయూఁతయిచ్చుటయం దొప్పుచుండఁగా నని యర్థము. ఊర్మికా=తరంగ సంబంధములైన, కంకణ=జలబిందువులయొక్క, ద్యుతికలాపముదోఁపన్=కాంతిసమూహము విలసిల్లఁగా ననిభావము. వేత్రవతియనఁగా వేత్రవతీనదియును వెండిబెత్తము పట్టుకొని కొలువుచేసెడు స్త్రీయును గనుక వేత్రవతీనదియనెడు వేత్రహస్తురాలయినస్త్రీ, సముదితారావ = యోగ్యమయిన వాక్యధ్వనుల యొక్క, సంభ్రమ = తొట్రుపాటుచేత, సాంద్రయై = పూర్ణయై, సారెసారె = మాటిమాటికిని, హెచ్చరికదెలుపన్ = పరాకుదెలుపఁగాను అనియర్థము. ప్రవాహసముదితధ్వని సంభ్రమముగలది యని భావము. సరస్వతియనఁగా సరస్వతీనదియును, వాగ్వతియును, సరస్వతియనెడు మాటకారియగు చెలికత్తియ, గంభీర = నిగూఢమయిన, రస=శృంగారరసముయొక్క, గుంభ = పూర్తిచేత, సంభృత = భరింపఁబడిన, ప్రౌఢిమతోన్ = ప్రాగల్భ్యముతోడ, పల్కుఁదోడుగాఁగన్ = సహోక్తిప్రత్యుక్తులు జరిగించునదియగుచుండఁగానని యర్థము. గంభీర=అగాధమయిన, రస=ఉదకముయొక్క, గుంభసంభృతి ప్రౌఢిమతోన్ = పూర్తిభరితప్రాగల్భ్యముతోనని భావము. నర్మదాదిపదములు నర్మప్రదానాది యోగ్యతాభిప్రాయగర్భితములయిన విశేష్యములు గనుకఁ బరికరాంకురాలంకారము. (ని. 'సాభిప్రాయే విశేష్యేతు భవేత్పరికరాఙ్కురః' అని లక్షణము.)

కులములోఁ బెద్దయున్ = వంశశ్రేష్ఠురా లని యర్థము. స్వజాతిగణములో గొప్పది యని భావము. అనఁగాఁ బెద్దనదియనుట. అమూల్యగుణమణి ప్రకాండపరిపూర్ణయునుగానన్ = ప్రకాండ శబ్దము శ్రేష్ఠవాచకంబును సమూహవాచకంబును, అమూల్య = విలువలేని, మణిప్రకాండ = మణి శ్రేష్ఠములవంటి, గుణ=గుణములచేత, పరిపూర్ణయునుగానన్ = సంపూర్ణమయినదియును గాఁబట్టి యని యర్థము. అనర్ఘ్యగుణములుగల రత్నసమూహముచేతఁ బరిపూర్ణ యని భావము. గారవమునన్=ప్రేమ చేత, అఖిలనదులును దనుఁగొల్వన్=సమస్తనదులును దన్నుఁగొలిచిరాఁగా, అనుదినంబు = ప్రతిదినము, అన్నది=ఆశుక్తిమతీనది,నలువకొలువునకేఁగున్=బ్రహ్మదేవునిసభకుఁ బోవుచుండును.అనఁగా నాశుక్తిమతీ నది స్త్రీరూపధారణముచేసి నర్మదాదినదులును స్త్రీరూపముచేత మీఁదఁజెప్పినప్రకారముగాఁ బరిచర్య సేయుచుఁ గొలిచి వెంటరాఁగాఁ బ్రతిదినంబును బ్రహ్మసభకుఁ బోయి వచ్చుచుండు నని యర్థము.

ముగ్ధిమ ప్రౌఢిమ ఇత్యాదులకు ఇమనిచ్ప్రత్యయమువిచార్యమని వామనునిమతము. శబ్దరత్నా కరమున నీపదము గలదు. 'గంభీర వాక్ప్రౌఢిమన్' అని శ్రీనాథుఁడును, 'పాటలీచంపకోత్పల ప్రౌఢి మములు' అని ముక్కుతిమ్మనయుఁ బ్రయోగించియున్నారు. సాధుత్వమునకాధారములుమృగ్యములు.

క. ఆలీల నమ్మహానది, నాళీకజుఁ గొల్చి యొక్కనాఁడు ప్రియాళీ
కేళీసంభ్రమవినుతము, రాళిగతు లడర మరలిరా నొకచోటన్. 107

ఆలీలన్ = ఆప్రకారముగా, అమ్మహానది=ఆగొప్పనదియైన శుక్తిమతి, నాళీకజుఁగొల్చి = కమలజుండైన బ్రహ్మదేవుని సేవించి, ఒక్కనాఁడు = ఒకానొకదినమందు, ప్రియాళీ = ప్రియసఖులతోడి, కేళీ=క్రీడయందలి, సంభ్రమ = తొట్రుపాటుతోఁగూడిన, వినుత = స్తోత్రముచేయఁబడిన, మరాళీగతులు = ఆఁడు హంసనడుపులవంటి నడుపులు, అడరన్=ప్రకాశింపఁగా, మరలిరాన్ = తిరిగివచ్చుచుండఁగా, ఒకచోటన్ = ఒకస్థలమందు, ముందఱిపద్యముతో నన్వయము.

తా. ఈవిధముగా శుక్తిమతీనది చెలికత్తియలు గొలువ విలాసగమనముతో బ్రహ్మకొలువున కరిగి తిరిగి వచ్చుచుండ నొకానొక ప్రదేశమునందు,

సీ. సుమనోధివాసభాసురశిఖోన్నతివాఁడు ఘనసారతిలకవాసనలవాఁడు
ఘనసంకుమదసాంద్రగండభాగమువాఁడు నవపద్మరాగదంతములవాఁడు
కలితోపకంఠనక్షత్రమాలికవాఁడు హరిచందనచ్ఛాయ నమరువాఁడు
తపనీయమేఖలాధాళధళ్యమువాఁడు మణిపాదవలయధామంబుహాఁ డ

తే. నర్ఘ్యరత్నావళీవిచిత్రాంబరాభి
రామశృంగారములవాఁడు హైమగర్భ
గేహమున కేఁగువాఁడు కోలాహలాఖ్యుఁ
డొకధరాధీశుఁ డెదు రయ్యె నువిద కపుడు. 108

ఈపద్యమునందుఁ గోలాహలవర్ణనము పర్వతపరముగను పురుషపరముగను గావింపఁబడుచున్నది.

అధివాసమనఁగా గంధమాల్యాదులచేతఁ జేయఁబడు సంస్కారము. (ని. 'సంస్కారో గంధమాల్యాద్యై ర్యస్స్యా త్తదధివాసనమ్' అని అ.) సుమనోధివాస = పుష్పాధివాసముచేత, భాసుర = ప్రకాశించుచున్న, శిఖోన్నతివాఁడు = సిగముడియొక్క హెచ్చుగలవాఁడును అనియర్థము. సుమనోధివాస =దేవతానివాసముతోడ, (ని. 'సుమనాః పుష్పమాలత్యోః స్త్రీదశే' అని వి.) భాసుర = ప్రకాశించుచున్న, శిఖోన్నతివాఁడు = అగ్రభాగముయొక్క యున్నతిగలవాఁడును అని భావము. ఘనసారతిలకవాసనలవాఁడు = కర్పూరతిలకముయొక్క పరిమళములు గలవాఁడును అనియర్థము. కర్పూరపరఁటులయొక్కయుఁ దిలకవృక్షములయొక్కయు సౌరభముగలవాఁడును అని భావము. ఘన = అధికమయిన, సంకుమద=జవ్వాదిచేత, సాంద్ర=దట్టమయిన, గండభాగమువాఁడు=చెక్కిళ్లుగలవాఁడును అని యర్థము. జవ్వాదిచేత నిండిన గండశిలలు గలవాఁడును అని భావము. నవ = నూతనమయిన, పద్మరాగ=పద్మరాగమణులవంటి, దంతములవాఁడు = రదనములు గలవాఁడును అని యర్థము. పద్మరాగమణిమయములయిన సానువులు గలవాఁడును అని భావము.

పద్మరాగములవంటి దంతములనుటవలనఁ బెదవికెంజాయచే ముత్యములవంటి దంతములు కెంజాయచే నొప్పారె ననిభావము. దృష్టాంతము-

శ్లో. తామ్రోదరేషు పతితం ద్రుమపల్లవేషు నిర్ధౌతహారగుళికావిశదం హిమాంభః
ఆభాతి లబ్ధపరభాగతయాధరోష్ఠే లీలాస్మితం సదశనార్చి రివత్వదీయం. రఘు-సం-౨౦ శ్లో.

(ని. 'దంతో ద్రికటకే కుజ్ఞే రదనే ప్యున్నతోపలే' అని నా. 'దంత స్సానుని కథ్యతే' అని వి.) నక్షత్రమాలికయనఁగా నిరువదియేడు ముత్యాలు గూర్చినహారము. (ని. 'సైవ నక్షత్రమాలాస్యా త్సప్తవింశతిమౌక్తికైః' అని అ.) కలిత = కూడుకొనఁబడిన, ఉపకంఠ = కంఠప్రాంతమందలి, నక్షత్ర మాలికవాఁడు = నక్షత్రమాలిక కలవాఁడును అని యర్థము. సమీపమందలి నక్షత్రసమూహము గల వాఁడును అని భావము. (ని. 'ఉపకణ్ఠాన్తి కాభ్యర్ణా భ్యగ్రాః' అని అ.) హరిచందనచ్ఛాయ నవరు వాఁడు=పీతవర్ణముగల చందనానులేపన కాంతిగలవాఁడు, అని అర్థము హరిచందన వృక్షచ్ఛాయచేత నొప్పుచున్నవాఁడును అని భావము. (ని. 'హరిచందన మాఖ్యాతం గోశీర్షే సురపాదపే' అని వి.) తప నీయ = సువర్ణమయమయిన, మేఖలా = మొలనూలుయొక్క, ధాళధళ్యమువాఁడు = ధళధళయను కాంతిగలవాఁడును అని యర్థము. కనకమయమయిన నితంబప్రదేశము గలవాఁడును అనిభావము. ఇక్కడ మేఖలాశబ్దము శైలనితంబపరము. (ని. 'మేఖలా ఖడ్గబంధేస్యా త్కాఞ్చీశైలనితంబయోః' అని వి.) మణి=రత్నఖచితములైన, పాదవలయ=కాళ్ళయందెలయొక్క, ధామంబువాఁడు = కాంతిగల వాఁడును అని యర్థము. రత్నమయమయిన ప్రత్యంతపర్వతావరణముగలవాఁడును అని భావము. (ని. 'పాదాః ప్రత్యంతపర్వతాః' అని అ.)

అనర్ఘ్య=విలువలేని, రత్నావళీ = రతనములసమూహముచేత, విచిత్ర=వింతగానున్న, అంబర = వస్త్రములవలన, అభిరామ=ఒప్పుచున్న, శృంగారములవాఁడు = సింగారములుగలవాఁడును అని యర్థము. అనర్ఘ్య=అమూల్యములైన, రత్నావళీ=నానావిధ రత్నకాంతులచేత, విచిత్ర=నానావర్ణమైన, అంబర= గగనభాగముగలిగిన, అభిరామ=సుందరములైన, శృంగ=శిఖరములయొక్క, అరములవాఁడు=అంచులు గలవాఁడును అని భావము. హైమగర్భ=బ్రహ్మదేవుని సంబంధమైన, గేహమునకుఁ=సభామందిరమునకు, ఏగువాఁడు = పోవుచున్నవాఁడును, కోలాహలాఖ్యుఁడు = కోలాహలుఁ డనెడు పేరుగలవాఁడునగు, ఒకధరాధీశుఁడు = ఒకరాజు అని యర్థము. పర్వతాధీశ్వరుఁడు అనిభావము. ఉవిదకుఁ = స్త్రీరూప ధారిణియయిన శుక్తిమతికి, అపుడు = ఆసమయమందు, ఎదురయ్యెఁ = ఎదురుపడెను.

అలం. శ్లేషము.

చ. అనుపమభాగ్యశాలి కచలాధిపమౌళికిఁ బుత్త్రుఁడై జగ
జ్జనని కనుంగుఁదమ్ముఁ డయి శంకరుముద్దుమఱందికుఁడై
మను తనభాగధేయమహిమంబున మిన్నులు ముట్టి వచ్చుధ
న్యుని నతనిఁ భజించి నదియుఁ వినయంబున నోరయై చనన్. 109

అనుపమ భాగ్యశాలికిఁ = సమానరహితమయిన భాగ్యములచేత నొప్పుచున్న, అచలాధిపమౌళి కిఁ=పర్వతరాజశ్రేష్ఠునికి, అనఁగా హిమవంతునికి భూపతిశ్రేష్ఠునకనియును నర్థము గ్రహింపవచ్చును. పుత్త్రుఁడై = కుమారుఁడై, జగజ్జననికిఁ=లోకమాతయైన పార్వతికి, అనుంగుఁదమ్ముఁడయి=ప్రేమాస్పదుఁ డైన తమ్ముఁడై, శంకరుముద్దుమఱందికుఁడై = శివునియొక్క ముద్దులపిన్నమఱఁదియై, మను = వృద్ధిఁ బొందుచున్న, తన=తనయొక్క, భాగధేయమహిమంబునఁ =భాగ్యాతిశయ ప్రభావముచేత, మిన్నులు ముట్టివచ్చు=ఉప్పొంగిమిన్నుముట్టివచ్చుచున్న, ధన్యునిఁనతనిఁ భజించి = కృతార్థుఁడైనయాకోలాహ లుని సేవించి, నదియుఁ =శుక్తిమతీనదియును, వినయంబునఁ =నమ్రత్వముచేత, ఓరయైచనఁ =ఓరగాఁ

దొలఁగి పోవఁగా, ఇందులో మిన్నులు ముట్టివచ్చుచున్నచోటఁ బర్వత మత్యున్నతమగుటచేత మిన్ను ముట్టుటయును, ఓరయయిచన నున్నచోట నది పర్వతప్రాంతముల నోరసిల్లి ప్రవహించుటయును స్వభావమని గ్రహింపవలయును. అలం. సమాసోక్తి.

తా. ఐశ్వర్యవంతుఁడును హిమవంతునకుఁ గుమారుఁడును, పార్వతీసహోదరుఁడును, శంకరుని బావమఱఁదియునగు కోలాహలుఁడు మిన్నుముట్టివచ్చుచుండ శుక్తిమతి యోరఁగాఁ దొలఁగెను. ఇట్లు తొలంగ-

సీ. బాలకూర్మ విలాస•పదములు కాంతరంభా ప్రతిబింబోరు•భవ్యరుచులు
సరసనైకతసార•జఘనసౌభాగ్యంబు నతనాభిరూపవ•నభ్రమంబు
బెడఁగారుదరులయొ•ప్పిదమును నామీఁదఁ జనుజక్కవలనిక్కు•చక్కఁదనము
కమలకోమలముఖ•కామనీయకము నుత్పలమంజులాలోక•విలసనంబు

తే. ఘనఘటానీలవేణియుఁ • గలతరంగిణీరమణినిత్యనిర్మలా•కారకాంతి
ధార ధారున నెదిరినం•తనె నగేంద్రు,గాఢతరధైర్య ముప్పొత్తు•గా హరించె.

నదీపరముగ స్త్రీపరముగ నీపద్యమున కర్థద్వయము కలదు.

బాలకూర్మ = చిన్నతాఁబేళ్లయొక్క, విలాసపదములు = విలాసయుక్తములైన స్థానములును, బాలకూర్మవిలాసములవంటి విలాసములుగల మీఁగాళ్లును, కాంత = మనోహరములైన, రంభా=అరఁటి చెట్లయొక్క, ప్రతిబింబ=ప్రతిచ్ఛాయలయొక్క, ఉరు=అధికమయిన, భవ్య=యోగ్యమైన, రుచులు= కాంతులును, రంభాస్తంభప్రతిరూపములైన యూరువులయొక్క భవ్యకాంతులును, సరస = జల యుక్తములైన, సైకతసారజ = సారములైన అనఁగా శ్రేష్ఠములైన యిసుకదిన్నెలవలనఁ బుట్టిన, ఘన= అధికమైన, సౌభాగ్యంబు = సౌష్ఠవమును, శృంగారరసయుక్తమును సైకతసారసదృశమును నైన జఘ నముయొక్క సౌభాగ్యంబును, (ని. 'సారో బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషు' అని అ.) నత = గంభీరమయిన, నాభిరూప = నాభిసదృశమయిన, వనభ్రమంబు=నీళ్లసుడిగుండమును లేక గంభీర మయినదియును, నాభిరూప = సుందరముగానిదియు, అనఁగా భయంకరమయిన నీళ్ళసుడిగుండమును గంభీరనాభ్యావర్తనమును, బెడఁగారు = మెఱుఁగారుచున్న, దరుల = తీరములయొక్క, ఒప్పిదమును= చక్కఁదనమును, తరులనఁగావళులు, మెఱుఁగారుచున్న వళులయొక్క చక్కఁదనమును బెడఁగారు దరులన్నచోటఁ గర్మధారయసమాసమును గనుక వికల్పముచేత తకారమునకు దకారము వచ్చినది. ఆమీఁదన్ = ఆతీరముమీఁద, చను = సంచరించుచున్న, జక్కవల = చక్రవాకములయొక్క, నిక్కు చక్కఁదనము = నిక్కడపుఁ జక్కఁదనమును, ఆమీఁదన్ = ఆవళుల మీఁదనున్న, చనుజక్కవల = చక్రవాకములవంటి కుచములయొక్క, నిక్కు చక్కఁదనము, నిక్కడపు సౌందర్యంబును, కమల = పద్మముయొక్క, కోమలముఖ = కోమలమైన యగ్రభాగములయొక్క, కామనీయకమును=సౌందర్య మును, కమలమువలెఁ గోమలమైన వదనముయొక్క సౌందర్యమును, ఉత్పల = నల్లగలువలయొక్క, మంజుల = మనోహరమైన, ఆలోక = ప్రభయొక్క, విలసనంబు = విలాసంబును, ఉత్పలములవలె మనోహరములైన వీక్షణప్రభలయొక్క విలాసంబును, (ని. 'ఆలోకో దర్శనద్యోతౌ' అని అ.) వేణీ శబ్దము నదీప్రవాహమందును గచోచ్చయమందును వర్తించును. (ని. 'వేణీ నదీప్రవాహేచ కచో చ్చయే' అని వి.) .

ఘనఘటా=జలపానాగతమేఘమాలికచేత, నీల = నల్లనైన, వేణియుఁక్ = ప్రవాహంబును, ఘనఘటా=మేఘమాలికవలె, నీల=నల్లనైన, వేణియుఁక్=జడయును, కల = కలిగియున్న, తరంగిణీరమణి = నదీకాంతయొక్క, నిత్యనిర్మలాకార కాంతిధార=నిరంతరనిర్మలస్వరూప కాంతిగల సలిలధారయును, నిత్యనిర్మలమయిన యాకారముయొక్క కాంతిధారయును, ధారునసెదిరినంతనె = హఠాత్తుగా నెదురైనంతమాత్రముచేతనే, నగేంద్రు = పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలునియొక్క, గాఢతరధైర్యము= మిక్కిలి దృఢమయిన ధైర్యమును, ఉవ్వెత్తుగా హరించెక్ = బొత్తిగా హరించెను. నదీప్రవాహధారలు, పర్వతములను దెగఁగోయుచున్నవని భావము.

శుక్తిమతీనది స్త్రీసహజములగు తనసుందరావయవములచేతఁ గోలాహలుని నిలుకడను దొలంగించి మోహితుని గావించెననియు,శుక్తిమతీ ప్రవాహధారలు కోలాహలపర్వతము దిట్టతనము చెడునటులొరసి ప్రవహించెననియు భావము. అలంకారశ్లేషోపమానుప్రాణితమగు కావ్యలింగము.

క. ఆకరణిఁ దరంగిణి నగ, లోకేశ్వరుధైర్య మెల్ల • లోఁగొనిరా నీ
రాకరగభీర! యాసు, శ్లోకుఁడు నాచెలువచెలువు • లోఁగొని చనియెన్. 111

ఆకరణిక్=ఆప్రకారముగా, తరంగిణి = శుక్తిమతీనది, నగలోకేశ్వరుధైర్యమెల్లక్ = పర్వతరాజైన కోలాహలుని ధైర్యమంతయును, లోఁగొనిరాక్ = తనలోఁ జేర్చుకొనిరాఁగా, నీరాకర గభీర= సముద్రునివలె గంభీరుఁడవైన యతీంద్రా, ఆసుశ్లోకుఁడును = యోగ్యమయిన కీర్తిగల యాకోలాహలుఁడును, (ని. 'పద్యే యశసి చ శ్లోకః' అని అ.) ఆచెలువచెలువు లోఁగొనిచనియెక్ = ఆశుక్తిమతియొక్క చక్కఁదనమును దనలోఁ జేర్చుకొనిపోయెను. అనఁగాఁ గోలాహలుఁడు శుక్తిమతియొక్క సౌందర్యావలోకనమువలన ధైర్యహీనుఁడై యాసౌందర్యమును మనస్సునందు నిలుపుకొనిపోయె నని యర్థము. నదులు గట్లను దెగఁదీయుటయును గట్లు నదీజలము లోఁగొనుటయును స్వభావము లని గ్రహింపవలయును.

తా. మునీంద్రా! ఆశుక్తిమతి కోలాహలుని దిట్టతనము నంతయు లోఁగొనిపోవఁ గోలాహలుఁడా చెలువ చెలువు లోనఁ దలంచుచుఁ జనెను.

మ. అలఘుశ్రీనిధి యానగేంద్రతనయుం • డాసైకతశ్రోణియొ
ప్పులు తెప్పార్పక చూచి చన్నమొదలుం • బొంగారి పైపై రసం
బులు జృంభించు భ్రమించు నాశయము కూర్చుల్మించ దీపించు ను
త్కలికాచాపలము ల్మనోనిబిడచింతాతన్మయత్వంబునన్. 112

అలఘు = అధికమైన, శ్రీ=ఐశ్వర్యమునకు, నిధి = స్థానమయినదని యర్థము. గురుత్వనిధియని భావము. ఆనగేంద్రతనయుండు=పర్వతరాజపుత్త్రుఁడైన యాకోలాహలుఁడు, ఆసైకతశ్రోణియొప్పులు= ఆయిసుకతిన్నెలవంటి పిఱుఁదులుగలవానియొక్క చక్కఁదనములని యర్థము. శ్రోణివంటిసైకతముగలదని భావము. తెప్పార్పకచూచి చన్నమొదలుక్ = తెప్పవాల్పక చూచిపోయినది మొదలుకొనియును, మనః=మనస్సునందు, నిబిడ=సాంద్రమయిన, చింతా=చింతచేతనైన, తన్మయత్వంబునక్ = శుక్తిమతీమయమయిన యంతఃకరణవృత్తి గలుగుటచేత ననియును, శుక్తిమతీస్వరూపత్వముచేత ననియును నర్థద్వయము. అర్థద్వయమునకు నభేదాధ్యవసాయము చేసి శుక్తిమతీధర్మములైన

జలాశయములు మొదలైనవి పొడఁజూపిన వని చెప్పవలయును. ఇక్కడఁ జింతయనెడు సంచారిభావము. ('ఇష్టావధిగమాద్ధ్యానంచింతాశూన్యత్వతాపకృత్') పొంగారిపైపైరసంబులు జృంభించుక్ = ఇక్కడరసములనఁగా ననురాగములు, అతిశయద్యోతనార్థము బహువచనము. పొంగారి=ఉప్పొంగి, పైపైన్=మీఁదమీఁదను, రసంబులు=అనురాగములు, జృంభించుక్=విజృంభించుచునిండును, ఉప్పొంగి మీఁదమీఁద రసములనఁగా జలములు వెల్లువవెట్టుననియును నర్థద్వయము. భ్రమించునాశయము= ఆశయమనఁగా మానసంబును, (ని. 'ఆశయ స్స్యా దభిప్రాయే మానసాధారయో రపి' అని మే.) మానసము, భ్రమించుననఁగా మోహితమగునని యర్థము. భ్రమణమనఁగా వైచిత్ర్యము గనుక మోహమనెడి సంచారిభావము. (ని. 'మోహస్తు మూర్ఛనం భీతి దుఃఖావేశానుచింతనైః' జలాధారస్థలము సుళ్ళఁబడుననియును నర్థము. కూర్మిల్మించుక్ = ప్రేమలతిశయించుచు, ఇక్కడఁ జెప్పఁబడిన ప్రేమలకును లోపలఁ జెప్పఁబడిన యనురాగములకును నవస్థాభేదమువలన భేదమని తెలియవలెను. ఏలాగనిన, (శ్లో. 'రాగోఽనువృత్తోఽవిచ్ఛిన్నమనురాగముదాహృతమ్, స ప్రేమాయన్మిథోయూనోర్నిరూఢంభావబంధనమ్.') ఉత్కలికాచాపలముల్ = ఔత్సుక్యంబును చాపల్యంబును, దీపించుక్ = ప్రకాశించునని యర్థము. ఇక్కడ నౌత్సుక్యచాపల్యములనెడు సంచారిభావద్వయము, ('కాలాక్షమత్వమౌత్సుక్య మప్రాప్తేరిష్టవస్తునః, చాపల్యమనవస్థానం రాగద్వేషాదిసంభవమ్.') కూర్మిల్మించక్ = అఁడు తాఁబేళ్లుల్లసిల్లఁగా, ఉత్కలికాచాపలముల్ = తరంగచాంచల్యములు, దీపించుక్=ప్రకాశించుననియు నర్థము. (ని. 'కథితో త్కలికో త్కణ్ఠా హేలా సలిలవీచిషు' అని మే.) ఈపద్యమునఁ జింతామోహౌత్సుక్యచాపల్యము లనెడు నాలుగుసంచారిభావములు చెప్పఁబడినవి.

కోలాహలుఁడు తన్నుఁ గాంచి పోయినదాది శుక్తిమతియుఁ జంచలము దాల్చె నని భావము. నిమేషశూన్యదర్శనము (ఱెప్పలార్పని చూపులు) లోకోత్తరవస్తుదర్శనమువలనఁ గలిగినవిస్మయమునకు సూచన. విస్మయలక్షణముల నాలంకారికు లిటుల నిర్వచించి యున్నారు-

శ్లో. లోకోత్తరపదార్థానా మపూర్వాలోకనాదిభిః
 విస్తార శ్చేతసోయస్తు విస్మయ స్సనిగద్యతే.

తా. కోలాహలుఁడు వలపుచే ఱెప్పలార్పక తన్నుఁ జూచినదాదిగ శుక్తిమతియుఁ జింత మోహములోనగు మనోవికారములకు లోనయ్యెను.

సీ. తనకూటములఁబ్రోదిఁ•దాల్చురంభాదులు సరసభావముఁ దప్పి • శిరము వంపఁ
 దనలోలతలఁ బెంపుఁ • గనుకలకంతులు చేరి పైవ్రాలక • చెదరి పలుకఁ
 దనవంక నలరుప•క్షిను లెల్లఁ దమిఁగానకయవాడిమోములు•గ్గలము ముడువఁ
 దనమహా•భోగంబు•ల నెసంగుభోగినుల్ దెరలి నిట్టూరుపు•దెరలు నెఱప
తే. నకటకట మంచుమలపట్టి • యతను తాప
 వహ్నిపా లయ్యె ఝరబాష్ప•వారి యగుచు
 నిత్యశుక్తిమతీధ్యాన•నిశ్చలాత్ముఁ
 డగుచు నంచితగహనరో•మాంచుఁ డగుచు. 113

ఈపద్యమునందు శైలములందుఁ గల దావాగ్నిపరముగను మోహాగ్నిపరముగను నర్థద్వయము గలదు.

కూటమియనఁగాఁ గలయిక, తనకూటములన్ = తనయొక్క కలయికలచేత, ప్రోదిఁదాల్చు= పెంపువహించుచున్న, రంభాదులు = రంభ మొదలయిన దేవకాంతలు, సరసభావముఁదప్పి=సరసత్వము మాని, శిరము వంపన్=తలవంచుకోఁగానని యర్థము. కూటమనఁగా శిఖరము, తనశిఖరములయందుఁ బెంపువహించుచున్న రంభాదితరువు లార్ద్రత్వముదక్కి వాడుచూపిన యగ్రభాగములను వంపఁగా నని భావము. (ని. 'శిరోఽగ్రం శిఖరం వా సా' అని అ.) తనలోలతలన్=తనయొక్క యాసక్తులచేత, పెంపుగను = ఘనతఁబొందుచున్న, కలకంఠులు=అవ్యక్తమధురమైన కంఠనాదముగల స్త్రీలు, (ని. 'కలకణ్ఠస్తు కోకిలే, హంసే పారావతే చాపి త్రిషు త్వేషకలస్వరే.' అని నా.) చేరి పైవ్రాలక= దగ్గరవచ్చి పైకొనక, చెదరిపలుకన్=తొలఁగి మాటాడఁగానని యర్థము. తనయందలి లతలయందుఁ బెంపుఁగను కోకిలలు చేరి తనపైవ్రాలక తొలఁగి కూయఁగా నని భావము. తనవంకన్ = తనవలన, అలరు=సంతోషించునట్టి, పద్మినులెల్లన్ = పద్మినీజాతి స్త్రీలందఱును, (ని. 'పద్మినీ కరణీ శ్రీస్త్రీ సరోజ్జ్వలినీషు చ' అని నా.) తమిఁగానకయ=తనవలని తమకము నెంతమాత్రము గనుపఱుచు కొనలేకయే, వాడి=వికాసముదప్పి, మోము లగ్గలము ముడువన్ = ముఖములు మిక్కిలి ముడిచిపెట్టు కొనఁగాను అని యర్థము. వంకయనఁగా నేఱు. తనవంకన్=తనసంబంధమయిన సెలయేటియందు, అలరు=వికసించియుండెడు, పద్మినులెల్లన్=పద్మలతలన్నియును, తమిఁగానకయ=రాత్రిని జూడకయే అనఁగా రాత్రి కాకమునుపే, (ని. 'రజనీ యామినీ తమీ' అని అ.) వాడి మోము లగ్గలము ముడువన్=వాడుదేరి యగ్రములు ముకుళింపఁగా నని భావము. తనమహాభోగంబులన్=తనయొక్క యధికమయిన సంభోగములచేత, ఎసంగు=ఒప్పుచున్న, భోగినులు=పట్టపుదేవిగాక యితరలైన రాజభార్యలు, (ని. 'కృతాభిషేకా మహిషీ భోగిన్యోఽన్యా నృపస్త్రియః' అని అ.) తెరలి=చంచలించి, నిట్టూరుపు దెరలు నెఱపన్=నిశ్వాస పరంపరల నింపఁగా నని యర్థము. తన=తనయొక్క, మహాత్=అధికములయిన, ఆభోగంబులన్=విస్తారములయందు, ఎసంగు = ఒప్పుచున్న, భోగినులు=ఆఁడుపాములు, తెరలి నిట్టూరుపుదెరలు నెఱపన్=సంచలించి ఫూత్కారములు నింపఁగా నని భావము.

అకటకట=అయ్యయ్యో, మంచుమలపట్టి=హిమవత్పర్వతపుత్త్రుఁడైనకోలాహలుఁడు, అతనుతాపవహ్నిపాలయ్యెన్=మన్మథతాపమనెడు నగ్నిపాలయ్యె ననియర్థము. అతనుశబ్దము అనంగశబ్దపర్యాయపదము. (ని. 'కందర్పో దర్పకోఽనఙ్గః కామః పంచశరః స్మరః' అని అ.) పర్వతముగనుక నధికతాపదావాగ్నిపాలగుచున్నదని భావము. ఇక్కడ మంచుమలపట్టి యయ్యును దాపముపాలయ్యె నని విరోధము గ్రహింపవలయును. ఝర=జలప్రవాహమువలె నుల్బణించుచున్న, బాష్పవారియగుచున్=అశ్రుజలధారలు గలవాఁడగుచు ననియర్థము. బాష్పమనఁగా నూష్మంబు, ప్రవాహములయందలి యూష్మయుక్తజలములు గలవాఁ డగుచున్నాఁ డని భావము. (ని. 'బాష్పో నేత్రజలోష్మణోః' అని వి.) ఈపైఁజెప్పఁబడిన యతనుతాపవహ్నిపాలయ్యె ననెడిచోటనున్న భావార్థ మిప్పుడు చెప్పఁబడిన భావార్థమునందును మీఁదఁజెప్పఁబడిన భావార్థములయందును హేతువుగా గ్రహింపవలయును. నిత్య=ఎడతెగని, శుక్తిమతీధ్యాన = శుక్తిమతివిషయమయిన చింతచేత, నిశ్చల=క్రియారహితమయిన, ఆత్ముఁడగుచున్ = గాత్రము గలవాఁడగుచు నని యర్థము. పర్వతుఁడుగనుకఁ జలింపఁడని భావము. అంచిత=ఒప్పుచున్న, గహన=విపినరూపమయిన, రోమాంచుఁ డగుచున్=గగురుపాటు గలవాఁడగుచు నని యర్థము.

(ని. 'రోమాఞ్చో రోమహర్షణమ్' అని అ.) ఈచెప్పఁబడిన వికారములు గలవాఁడగుచు నతనుతాపవహ్ని పాలయ్యెనని వెనుక కన్వయము. బాష్పవారియు, నిశ్చలాత్మకత్వంబును, రోమాంచంబును నీమూఁడును సాత్త్వికభావములు.

శ్లో. 'అశ్రు నేత్రోద్భవం వారి దుఃఖ రోష ప్రహర్షజమ్,
స్తంభస్స్యా న్నిష్క్రియాఙ్గత్వం రాగభీత్యాదిసంభవమ్,
సుఖాదలిశయా జ్జాతో రోమాఞ్చో రోమవిక్రియా.' అని చెప్పఁబడియున్నది.

తా. కోలాహలుఁడు శుక్తిమతిని గాంచినదాది వలపునకు లోనై మన్మథవహ్నిచేఁ గ్రాగుచుఁ గన్నీరు విడచుచు మాటిమాటికి శుక్తిమతిని దలంచుకొనుచు గగురుపాటు గలవాఁ డగుచుండెను.

అలం. శ్లేషానుప్రాణితరూపకము.

చ. కులగిరి రాజనందనుఁడు ♦ కూరిమి నాభువనాభినందితం
దలఁపఁ దలంపులోపలనె ♦ దర్పక కేతనవల్గనంబు లం
చలయెలగోలు నంబుజవి♦శాలశిలీముఖతాండవంబు లు
త్పలదళమండలాగ్రములు ♦ పైఁ గొను నెట్టివో తత్ప్రభావముల్. 114

కులగిరిరాజనందనుఁడు = కులపర్వతశ్రేష్ఠుఁడైన హిమవంతుని కుమారుఁడగు కోలాహలుఁడు, కూరిమిన్ = ప్రేమచేత, అభువనాభినందితన్ = లోకసన్నుతయైన యాశుక్తిమతి నని యర్థము. జలాభినందితయైన నదినని భావము. ('భువనం ఖాంబు లోకేషు' అని నా.) తలఁపన్ = తలఁపఁగా, తలంపులోపలనె = తలఁచుకొన్నంతలోపలనె, దర్పక కేతన వల్గనంబులు = మన్మథునియొక్క ధ్వజచలనము లని యర్థము. దర్పకకేతనము మీనముగనుక మత్స్యచలనము లని భావము. అంచలయెలగోలుల్ = హంసరూపములైన మన్మథుని యెలగోలుమూఁకలని యర్థము. హంసలయొక్క కోలాహలములని భావము. అంబుజవిశాలశిలీముఖతాండవంబులు = అరవిందరూపబాణపతనములని యర్థము. (ని. 'అరవింద మశోకంచ చూతంచ నవమల్లికా, నీలోత్పలం చ పఞ్చైతే పఞ్చబాణస్య సాయకాః.' అమర శేషము.) అంబురుహవిహారి షట్పద నటనములని భావము. శిలీముఖశబ్ద మిక్కడ మధువ్రతపరము. (ని. 'అళి బాణౌ శిలీముఖౌ' అని అ.) ఉత్పలదళమండలాగ్రములు = ఉత్పలదళరూపఖడ్గములని యర్థము. ఉత్పలదళమండలముయొక్క యగ్రభాగములని భావము. పైకొనున్ = కమ్ముకొనును, ఎట్టివో తత్ప్రభావముల్ = ఆశుక్తిమతిమహిమలెట్టివో అనఁగా విచిత్రాస్పదము లనుట. కోలాహలుఁడు శుక్తిమతిని దలఁచుకొనినమాత్రముచేతనే మన్మథావిర్భావముగలవాఁ డవు నని యర్థము. మీనవల్గనాది నదీధర్మములను మన్మథకేతనచలనాది ధర్మములుగా నధ్యవసించినాఁడు.

నాయకుఁడు కులగిరిరాజనందనుఁడు నాయిక భువనాభినందిత యనుటవలన పేరిదాంపత్య మాను కూల్యమును ఆనురూప్యమునని భావము. మదనుతాపవహ్నిపాలయ్యెనని చెప్పఁబడుటచేఁ గోలాహలుని దిట విడివడికె తొలంగెననియుఁ గావుననె తలంపులోననే దర్పకబలముచుట్టుముట్ట నవకాశము చిక్కినదని యాశయము. తొలుత మన్మథునిటెక్కెము గనిపించెననియుఁ బిదపఁ బరివారకలకలము ఆవల ధనుష్టంకారములు ఆవిదప నాయుధహస్తు లగుభటులు నాయకుని దరిసిరని భావము.

అలం. శ్లేషానుప్రాణితరూపకము.

తే. మరునినాళీకసాయకోత్కరము కరము
ధరముఁ దరమిడి మెరయు టేయరిది సొరిది
నురిది నవి మెట్లు తెగఁ గోయు నురునదీఝ
రంబుల జనింపవో శతారములు గావొ. 115

మరుని = మన్మథునియొక్క, నాళీకసాయకోత్కరము = పద్మరూపబాణపరంపర, కరము = మిక్కిలి, ధరమున్ = కోలాహలపర్వతమును, తరమిడి మెరయుట = అంటి మర్మభేదనముసేయుట, ఏయరిది=ఏమి యాశ్చర్యము, అనఁగా నాశ్చర్యము గాదనుట. ఏమనిన, సొరిదిన్ = యుక్తమగునట్టు లుగా, అవి = ఆపద్మబాణములు, ఉరిదిన్ = ఉరుపడిచేత, మెట్లుతెగఁగోయు నురునదీఝరంబుల జనింపవో = కొండలుతెగునట్టులుగాఁ బాఱునట్టి గొప్పనదీప్రవాహములయందుఁ బుట్టినవి కావా, శతారములుగావో = పర్వతములను భేదించెడు నూఱంచులుగల వజ్రాయుధములు గావా, కాఁబట్టి కోలాహలపర్వతభేదనము సేయుట యాశ్చర్యముగాదని యర్థము. వజ్రాయుధము నూఱంచులది యనుటకు, (ని. 'శతకోటి స్స్వరు శ్శమ్బో దమ్భోళి రశని ర్ద్వయోః' అని అ.) శతారమనఁగాఁ బద్మము నూఱుఱేకులుగలదనుట. (శ్లో. 'సహస్రపత్రం కమలం శతపత్రం కుశేశయమ్' అని అ.) మరుని సాయకములనక సాయకోత్కరమనుటచే నసంఖ్యాకబాణములచే మర్మభేదనము కలిగి తీరు ననుట. బాణములు శతారములు గావుననే పర్వతక్షోభకారణములయ్యెను. బాణములె గాదు. బాణ జన్మస్థలములగు ఝరులు సైతము శైలములనోరయుచు మెట్లుతెగఁగోయుట సహజము. అలం. కావ్య లింగము. అర్థాపత్తి. శ్లేషము.

చ. కపురపుఁగమ్మతావిఁ జలిగ్రమ్మెడుగొజ్జఁగిపువ్వునీట న
చ్ఛపునెలఱాలవెల్లువలఁ జందనవాసన నేమిటన్నగా
ధిపు నతితీవ్రతాపశిఖి దీరకపోయె గతాగతక్రియా
నిపుణఘనాళినీతతటినీలలితామృతధారఁ దక్కఁగాన్. 116

కపురపుఁగమ్మతావిన్ = కర్పూరముయొక్క మనోహరమైన పరిమళముచేతను, చలిగ్రమ్మెడు గొజ్జఁగిపువ్వునీటన్ = చల్లఁదనము గ్రమ్ముచుండెడు గొజ్జంగిపూనీటిచేతను, అనఁగాఁ జల్లని పన్నీటి చేతను, అచ్ఛపు=స్వచ్ఛమైన, నెలఱాలవెల్లువలన్=చంద్రకాంతశిలలుగరఁగి ప్రవహించు ప్రవాహము చేతను, చందనవాసనన్ = శ్రీచందనపువాసనచేతను, ఏమిటన్ = వీనిలో దేనిచేతను, నగాధిపున్ = కోలాహలపర్వతశ్రేష్ఠునియొక్క, అతితీవ్రతాపశిఖి = అత్యంతతీక్ష్ణమైన విరహతాప మనెడు నగ్ని, తీరకపోయెన్ = శమింపకపోయెను. కర్పూరపరఁటులును, గొజ్జంగులును, జంద్రకాంతశిలలును, శ్రీచందనవృక్షములును నివి పర్వతమందుఁగల వస్తువులని గ్రహింపవలయును. ఇఁక నేమనిన, గతా గత=పోవుచువచ్చుచునుండెడు, క్రియానిపుణ = కార్యసఫలీకరణమందు నేర్పుగల, ఘనాళి = ప్రౌఢ సఖిజనములచేత నని యర్థము. మేఘపంక్తిచేత నని భావము. నీత = పొందింపఁబడిన, తటినీ = శుక్తి మతీనదియొక్క, లలిత = మనోహరమైన, అమృతధారఁ దక్కఁగాన్ = అమృతమనఁగా నుదకంబును గనుక నుదకధార యనెడు సుధాధారచేతఁదప్ప మఱియొకదానిచేత శమింపకపోయె నని సంబం ధము. అనఁగా శుక్తిమతీనదీవిషయమైన కోలాహలపర్వతునియొక్క విరహతాపానలము

కేవల శైత్యప్రదములైన కర్పూరాదులచేత శమింపక మేఘము శుక్తిమతీజలములను ద్రావి వచ్చి యాజలములను గోలాహలునిపై వర్షింపఁగా నందువలనఁ గొంత యుపశమించుచుండె ననుట. కమ్మ తావి యన్నందుకు,

గీ. 'జగతిఁ జప్పనికూరకుఁ జప్పకూర, చనుచు జక్కనిచాయకుఁ జక్కచాయ
హెచ్చు పచ్చనితోఁటకుఁ బచ్చతోఁట, గరిమఁ గమ్మనితావికిఁ గమ్మతావి.' అని అప్పకవి.

విరహవేదనను తాపమనక అతితీవ్రతాపశిఖి యనుటచే దుర్భరముగ నుండెననియు గావుననే సామాన్యశైత్యోత్పాదకములగు శిశిరోపచారములు తగ్గింపఁజాలవయ్యెననియు భావము. తొలుతఁ జలి గ్రమ్ము గొజ్జఁగిపూవునీరు పిదప చంద్రకాంతశిలాజలప్రవాహము చందనకర్దమము నిరుపయోగము లయ్యె ననుటవలనఁ దాపాతిశయము సూచితము. సామాన్యప్రతిక్రియలవలనఁ దీఱనియీతాప మమృతసేవనమునఁ దీఱె ననుటవలన నమృతరూపిణియగు శుక్తిమతియే తాపనివారిణి యనుట.

అలం. సమాసోక్తి. శ్లేషానుప్రాణితము.

ఉ. శైలకులేంద్రుఁ డిట్లు మదశాలిశుకాళిపికాళిశారికా
జాలకనీలకంఠరవసంగతిఁ దాలిమి నిల్పఁ జాల కు
ద్వేలకరాళకంతుశరవేదన దీర నదీరసోర్మికం
దేలక యేల కల్గు మహనీయసుఖం బని నిశ్చితాత్ముఁ డై. 117

శైలకులేంద్రుఁడు=కోలాహలపర్వతశ్రేష్ఠుఁడు, ఇట్లు= ఈచెప్పఁబడిన ప్రకారముగా, మద శాలి=మదముచేత నొప్పుచున్న, శుక=చిలుకలయొక్క, అళి=తుమ్మెదలయొక్క, (ని. 'ద్విరేఫ పుష్పలిడ్భృంగ షట్పద భ్రమరాళయః' అని అ.) పిక=కోకిలలయొక్క, ని. 'వనప్రియః పరభృతః కోకిలః పిక ఇత్యపి' అని అ.) ఆళి = సమూహములయొక్క, శారికాజాలక = గోరువంకపిట్టల గుంపులయొక్కయు, నీలకంఠ = నెమళ్ళయొక్కయు, (ని. 'నీలకణ్ఠౌ శిఖీశ్వరౌ' అని నా.) రవ=కలకలధ్వనులయొక్కయు, సంగతిన్ = కూడికచేత, తాలిమి నిల్పఁజాలక=ధైర్యము నిలుపలేక, ఉద్వేల=అతిశయించుచున్న, కరాళ = భయంకరమైన, కంతు శర=మన్మథబాణ సంబంధమయిన, వేదన=తాపము, తీరన్ = శమించునట్టులుగా, నదీ=శుక్తిమతియొక్క, రసోర్మికన్=సంభోగశృంగార రసతరంగమందు నని యర్థము. సలిలతరంగమం దని భావము. తేలక=ఓలలాడక పోయినపక్షమందు, మహనీయసుఖంబు=అతిశయమయిన సౌఖ్యము, ఏలకల్గున్=ఎట్లుగలుగుచున్నది, అని నిశ్చితాత్ముఁడయి=అనుకొని నిశ్చయింపఁబడిన యంతఃకరణముగలవాఁడై, దీనికి ముందఱిపద్యముతో నన్వయము.

తా. కోలాహలుఁడు మన్మథోద్దీపకకరములగు కోకిల గోరువంక నెమిలి లోనగు పక్షులకలకలములవలనఁ దమినిలుపఁజాలక మన్మథవేదనఁ దీఱుటకై నదీవతంసమగు శుక్తిమతిని గవయ నిశ్చయించి-

క. రుచిరాజితమణిభూషా, రుచిరాజి వెలుంగ దివ్యరూపోజ్జ్వలుఁ డై
యచలాధీశ్వరుఁ డొకనాఁ, డచలామణిహార మగుమహానదిఁ జేరెన్. 118

రుచిర=ప్రకాశమానములైన, అజిత = విలువకులోఁబడని, అనఁగా ననర్ఘ్యములైన, మణి= రత్నమయములైన, భూషా=ఆభరణములయొక్క, రుచిరాజి=కాంతిపుంజము, ని. 'రుచిస్తు కిరణేకాంతా

వభిషఙ్గాభిలాషయోః' అని నా. వెలుంగన్=ప్రకాశింపఁగా, దివ్య=సౌందర్యయోగ్యమైన, రూప=ఆకృతిచేత, ఉజ్జ్వలుఁడై=ప్రకాశమానుఁడై, అచలాధీశ్వరుఁడు = కోలాహలుఁడు, ఒకనాఁడు=ఒకానొకదినమందు, అచలా=భూమికి, మణిహారమగు=ముత్యాలహారమువలె నున్నట్టి, మహానదిన్=గొప్పనది యైన శుక్తిమతిని, చేరన్=సమీపించిపోయెను. శబ్దా. యమకము.

తా. వివిధభూషణముల నలంకరించుకొని కోలాహలుఁ డొకనాఁడు శుక్తిమతిని సమీపించెను.

శా. చేరన్ రా నదియుం దటోద్గతఝరీసీమాధికోదగ్రసం
చారశ్రీ నెదు రేఁగి యూర్మిమయహస్తన్యస్తరాజీవరా
జీరాజన్మణిభాజనంబుల రజశ్శ్రీగంధకింజల్కరే
ఖారక్తాక్షతము ల్వహించి వరుసం గావించెఁ బూజావిధుల్. 119

చేరన్ రాన్=కోలాహలుఁడు సమీపమునకు రాఁగా, నదియున్=శుక్తిమతినదియును, తటోద్గత=తీరమున తిక్రమించి పైకివచ్చిన, ఝరీ=ప్రవాహముయొక్క, సీమాధికోదగ్రసంచారశ్రీన్=సీమయనఁగా నిక్కడిమర్యాద, (ని. 'సీమసీమే ఇమే క్షేత్రే కూల మర్యాదయో రపి' అని నా.) మితిమీఱి యుత్కటమగుచున్న సంచారసంపత్తిచేత, ఎదురేఁగి=ఎదురుగాఁ బోయియని యర్థము. సీమయనఁగాఁ బొలిమేర, పూజ్యులైనవారు తనయొద్దకు వచ్చుచుండఁగాఁ బొలిమేర దాఁటి యెదురుగాఁ బోవలసినది న్యాయమైనందున సీమాధికోదగ్రసంచార మనఁగాఁ బొలిమేర దాఁటిపోవుట యని యర్థాంతరము. అర్థద్వయమునకు నభేదాధ్యవసాయము. ఊర్మిమయ = తరంగరూపములైన, హస్త=చేతులయందు, న్యస్త=ఉంపఁబడిన, రాజీవరాజీ=పద్మసమూహమనెడు, రాజన్మణిభాజనంబులన్=ప్రకాశించుచున్న రత్నపాత్రములయందు, (ని. 'భాజనం యోగ్యపాత్రయోః' అని. నా.) రజః=పుప్పొడియనెడు, శ్రీగంధ=శ్రీచందనమును, కింజల్కరేఖా = కేసరశ్రేణులనెడు, రక్తాక్షతములు=ఎఱ్ఱనియక్షతలను, అక్షతశబ్దము కుశాదిగణములోఁ జేరినదయ్యు, (ని. 'లుగ్ఫవే తుక్కాశాదే ర్ష్ణోః' న.) అను సూత్రముచే రావలయు మువర్ణలోపము. 'చరితాదికశబ్దానాం స్వరూపంచ యథా భవేత్' అని యథర్వణుఁడు చెప్పుటచేత హంసాక్షతాదిశబ్దములకు వికల్పముగాన నిచట అక్షతములని ప్రయోగింపఁ బడియెను. వహించి ఉంచుకొని, వరుసన్=అర్ఘ్యపాద్యాదిక్రముముచేత, పూజావిధులు=అర్చావిధానములను, కావించెన్ = చేసెను. అనఁగా లోకమందుఁ బూజ్యులైనవారు తన యింటికి వచ్చుచుండఁగాఁ దెలిసికొని పొలిమేర కవతలికి నెదురుగాఁబోయి వెంటఁబెట్టుకొని వచ్చి పళ్ళెరములయందు గంధాక్షత లుంచుకొని యర్ఘ్యపాద్యాదివిధులచేతఁ బూజచేయవలయునది మర్యాద గనుక నాప్రకారముగాఁ గోలాహలునికి శుక్తిమతీనది పూజ చేసె నని యర్థము.

అల. రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

తే. గిరియునుదదంతికోత్తుంగతరచిరత్న, రత్నతటపీఠిఁ జెందె గౌరవము వఱల
వరలలితవాహినీవైభవంబుఁ గాంచి, గాంచె బహుపద్మనిధిలాభకౌతుకంబు.

గిరియును=కోలాహలాద్రియును, తత్=ఆశుక్తిమతియొక్క, అంతిక=సమీపమందలి, ఉత్తుంగతర=ఉన్నతమైన, చిరత్నరత్న = ప్రాచీనరత్నమయమైన, తట = తీరమనెడు, పీఠిన్ = పీఠమును,

చెందెన్ = అధిష్ఠించెను. ఏలాగుననినిన, గౌరవము పఱలన్ = ఘనత మీఱునట్టులుగా నని యర్థము. దుర్ధరత్వ మొప్పఁగా నని భావము. వర = శ్రేష్ఠమును, లలిత = ఒప్పిదమును నైన, వాహినీవైభవంబు = శుక్తిమతీనదియొక్క వైభవమును, కాంచి = చూచి, కాంచెబహుపద్మనిధిలాభకౌతుకంబుల్ = అనేకములైన పద్మనిధులయొక్క ప్రాప్తివలని సంతోషమును బొందెనని యర్థము. అనేకపద్మాకరలాభకౌతుకమును బొందెనని భావము. ఈపద్యము ముక్తపాదాంత్యగ్రస్తముగాఁ జెప్పఁబడియె.

లలితశబ్దము సౌకుమార్య సౌందర్యద్యోతకము. వర, వైభవములను విశేషములవలన సౌకుమార్య సౌందర్యముల యతిశయము సూచితము. రత్నమయమగు నొడ్డు సింహాసనమున గోలాహలుఁడు కూర్చుండి నదీసౌందర్యమును గాంచి యానందించెనని భావము. లలితము నాలంకారికు లిట్టుల నిర్వచించిరి.

శ్లో. విన్యాసభంగిరంగానాం భ్రూవిలాసమనోహరా
సుకుమారా భవే ద్యత్ర లలితం తదుదీరితమ్. (రసార్ణవసుధాకరము.)

వ. అప్పు డప్పుణ్యతరంగిణి యన్నగాగ్రణితో ని ట్లనియె. 121

అప్పుడు = ఆసమయమునందు, అప్పుణ్యతరంగిణి = పుణ్యనదియైన యాశుక్తిమతి, అన్నగాగ్రణితో నిట్లనియెన్ = పర్వతశ్రేష్ఠుఁడైన యాకోలాహలునితో నీరీతిగాఁ బలికెను. ఏమని యనిన,

సీ. అతులశైవలవతీశతములీనెడుమీకు నాయిచ్చు విమలార్ఘ్యతోయ మెంత
ప్రాలేయనిలయసంభవముఁ గాంచినమీకుఁ బన్నీట నొనరించుపాద్య మెంత
సరసమందార మంజరుల రంజిలుమీకుఁ బెనఁచి పూదండ లర్పించు టెంత
గోరత్నదోహన గురులక్ష్మిగల మీకు సుపదగామణివర్గ మొసఁగు టెంత
తే. యనఘ యెవ్వారలైనఁ గొండంతవారి కవనిఁ గొండంతపూజ సేయంగఁగలదె
భక్తి నే నిచ్చునీపుష్పపత్రతోయ, మాత్రములు గైకొనుటె కాక గోత్రతిలక.

ఈపద్యమునకు నున్నతవంశసంభవునిపరముగఁ గోలాహల పర్వతపరముగా నర్థద్వయము గలదు.

అతుల = సమానరహితమయిన, శైవలవతీశతములు = నదీశతములను, ఈనెడుమీకున్ = ఉత్పాదనము చేయుచుండెడు మీకు, నాయిచ్చు = నేనుసమర్పించునట్టి, విమలార్ఘ్యతోయమెంత = నిర్మలమయిన యర్ఘ్యజల మెంతమాత్రము, అనఁగా నెక్కువలోనిది గాదనుట. ప్రాలేయనిలయ = హిమజలములకు నివాసమయిన పర్వతమువలన, అనఁగా హిమవంతునివలన, (ని. 'ప్రాలేయం మిహికా చాథ హిమానీ హిమసంహతిః' అని అ.) సంభవముఁ గాంచిన = జన్మించిన, మీకున్ = మీకు, పన్నీట నొనరించు పాద్యమెంత = పరిమళయుక్తమయిన స్వల్ప హిమజలముచేత నిచ్చునట్టి పాద్య మెంతలోనిది, సరస = మకరందయుక్తమయిన, మందారమంజరులన్ = కల్పవృక్ష సంబంధములైన పువ్వుగుత్తులచేత, రంజిలుమీకున్ = రక్తిమఁ జెందుచుండెడు మీకు, పెనఁచి పూదండ లర్పించుటెంత = కలియఁబెనఁచి పుష్పమాలిక లర్పించుట యెంతలోనిది, గోరత్నదోహనగురులక్ష్మిగలమీకున్ = గోశబ్దము గోవునందును భూమియందును వర్తించును. ని. 'స్వర్గేషు పశువాగ్వజ్రదిఙ్నేత్ర ఘృణిభూజలే, లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి గౌః' అని అ. గో = గోరూపధరయైన భూమివలన, రత్నదోహన = రత్నములను పితుకుట

గలిగిన, గురు = తండ్రియైన హిమవంతునియొక్క, లక్ష్మిగలమీకుఁ = సంపదగలమీకు, ఉపదగా మణివర్గ మొసఁగుటెంత = కానుకగా రత్నసమూహము నిచ్చుట యెంతలోనిది. 'ని. 'ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్తథోపదా' అని అ. భూదేవి గోరూపిణియైనదనియు, హిమవత్పర్వతము వత్సరూపం బయినదనియు, రత్నాదులు పితుకఁబడిన వనియును బ్రసిద్ధము.

అనఘ=నిష్కల్మషుఁడవైన యో కోలాహలాద్రీ, ఎవ్వారలైనఁ = లోకములో నెవ్వరైనప్పటికిని, కొండంతవారికిఁ = కొండపొడుగు ఘనతగలవారి కని యర్థము. పర్వతమున కని భావము. అవనిఁ=భూమియందు, కొండంతపూజ సేయఁగఁ గలరె=కొండపొడుగుపూజ సేయఁగలరా, అనఁగాఁ జేయలేరుగదా యనుట. ఇంక నేమనిన, భక్తినేనిచ్చు = భక్తిచేత నేనిచ్చునట్టి, ఈ పుష్ప పత్ర తోయ మాత్రములు = ఈపుష్పము పత్రము ఉదకము ఇంతమాత్రములు, కైకొనుటె కాక=గ్రహింపవలయు నదియన్యాయముకాక, నే సమర్పించినవి మీ కెంతమాత్రమని యర్థము. గోత్రతిలక=వంశశ్రేష్ఠుఁడా యని యర్థము. పర్వతశ్రేష్ఠుఁడా యని భావము. ఈపద్యమునఁ గోలాహలపర్వత పరిహాసపరముగను నొక యర్థము స్ఫురించుచున్నది. అలం. విభావన.

తా. ఓకోలాహలేంద్రా! నీవు మిగుల గొప్పవాఁడవు. నేనొసంగు పాద్యము అర్ఘ్యము పుష్పము కానుకను ప్రీతితో స్వీకరింపుము. కొండంతవారి కెవ్వరు కొండంతపత్రి పెట్టఁజాలరు గావున భక్తిసూచకముగ నే నొసంగు నీస్వల్పములగు పుష్పములు పత్రములు తోయము పరిగ్రహింపుము.

చ. విలసితరత్నకూటములు • వేలుపుకన్నెలకూటము ల్సుధా
కలితసరఃకృపీటములు • కామితనూతనవస్తుజాలదో
హలసురభూజవాటము లొ•కప్పుడు వాయక కల్గునీకు న
వ్వల నొకయర్థనీయ మగు•వస్తువు గల్గునె ముజ్జగంబులన్. 123

విలసిత = మిక్కిలియు నొప్పుచున్న, రత్నకూటములు = మణిమయములైన శిఖరములును, ని. 'కూటోస్త్రీ శిఖరం శృఙ్గమ్' అని అ. వేలుపుకన్నెల కూటముల్ = దేవతాస్త్రీలయొక్క సాంగత్యములును, సుధా=అమృతమువలె, కలిత = మాధుర్యముచేత నొప్పుచున్న, సరఃకృపీటములు = సరోవరజలములును, (ని. 'వాతూలే విష్వైద్యేచ కృపీట ముదరే జలే' అని నా.) కామిత = కోరఁబడిన, నూతనవస్తుజాల = అభినవ పదార్థసందోహములను, దోహల = ఇచ్చునట్టి, సురభూజవాటములు=కల్పవృక్షసమూహములును, ఒకప్పుడు వాయకకల్గునీకుఁ = ఏకాలమందును నెడఁబాయక కలిగియుండెడు నీకు, అనఁగా నీచెప్పఁబడిన వస్తువులుగలవాఁడు దేవేంద్రుఁడు గనుక నింద్రవైభవముగల నీకు, అవ్వల= అవతల, ముజ్జగంబులఁ = మూఁడులోకములయందును, ఒక యర్థనీయమగు వస్తువు గల్గునె=ఒకకోరఁదగిన పదార్థము గలుగ నేర్చునా, అనఁగాఁ గలుగ నేరదనుట, ఇక్కడఁ గోలాహలపర్వతమందు నింద్రవ్యవహార సమారోపణమువలన సమాసోక్త్యలంకారము.

తా. నీకు మణిమయములగు శిఖరములుగలవు గావున సంపన్నుఁడవు, దేవకాంతల చెలిమిగలవాఁడవుగావున భోగపూరుషుఁడవు, కోరినవస్తువు లొసంగు కల్పవృక్షములు నీకుఁ గలవు గాన నిష్కామివి. ఇట్టి నీకుఁ బరులను యాచింపఁదగిన వస్తువు లీమూఁడులోకములలో లేదు.

క. ఏతాదృశగుణగరిమస, మేతాత్ములు మీరలిచటి • కేతెంచుట మా
శీతాద్రితనయ మదుపరి, జాతాభినవానురాగ•సంపత్తిఁ గదా. 124

ఏతాదృశ = ఇటువంటి, గుణ గరిమ సమేతాత్ములు = గుణశ్రేష్ఠత్వముతోఁగూడిన యంతఃకరణము గలవారని యర్థము. దుర్భరత్వముతోఁ గూడిన మూర్తిగలవారని భావము. మీరలు = మీరు, పూజ్యార్థమందు బహువచనము ప్రయోగార్హము. ఇచటికేతెంచుట = ఇక్కడికివచ్చుట, ఓశీతాద్రితనయ=ఓహిమత్పర్వతకుమారా, మదుపరి = నామీఁద, జాత=పుట్టిన, అభినవ = నూతనమయిన, అనురాగసంపత్తిఁగదా = వాత్సల్యసమృద్ధిచేతఁగదా యని యర్థము. నామీఁద నుదయించిన స్త్రీవిషయానురాగ సమృద్ధిచేతఁగదా యని భావము.

మదుపరిజాతాభినవానురాగ సంపత్తియనుచోఁ గొందఱు వ్యాఖ్యాతలు నాపయిఁగల స్త్రీ మీఁదఁదేలు కోరికయని యర్థమని శుక్తిమతీవాక్యమునుండి యబుద్ధిపూర్వార్థముఁ జెప్పియున్నారు. "నిజంబ పల్కితి వవుర్" అను పద్యభాగముచే నీయంశము నిర్ధారణ చేయుచున్నారు. ఇందు భావము క్లిష్టముగ నుంటచే నెంతవఱకుఁ గవ్యభిప్రాయమొ నిర్ణయింప వీలుగాదు. అనురాగ మన స్త్రీ విషయికమగు ప్రేమయు వాత్సల్యముగాన నిట శుక్తిమతి యబుద్ధికృతముగ భాషించెను.

చ. అన విని గట్టురాకొమరుఁ • డాననగహ్వరరోచమాననూ
తనతరదంతహీరరుచి•ధారలు వెల్వడ నొక్కలేఁతన
వ్వు నగి నిజంబ పల్కితి వ•వుర్ భువనాశయసన్నివేశ వే
దిని సరసాగ్రగణ్యవు గ•దే యని యన్నదిఁ బల్కు వెంబడిన్. 125

అనవిని=శుక్తిమతి యీలాగునఁ బలుకఁగా నాలకించి, గట్టురాకొమరుఁడు = పర్వతరాజునందనుఁడైన కోలాహలుఁడు, (గీ. 'ఒప్పు గిరి పేళ్ళు మల గట్టు తిప్పు మెట్ట, కొండ గుబ్బలి నా మేరుకుధర చాప' అని యాంధ్రనామసంగ్రహము.) ఆననగహ్వర = గుహవంటిముఖమందు, రోచమాన=ప్రకాశమాన మగుచున్న, నూతనతర=మిక్కిలి నూతనమైన, దంతహీర = వజ్రమణులవంటి దంతములయొక్క, రుచి=కాంతియొక్క, ధారలు = అల్పప్రవాహములు, (ని. 'ధారా పూఃకాపి సేనాగ్రం పతదంబ్వాది సంతతిః, ఖడ్గాదినిశితప్రాంతే తురఙ్గగతిపఞ్చకే.' అని నా.) వెల్వడన్ = బయలుదేరఁగా ననియర్థము. ఆననగహ్వర = ముఖసదృశమయిన గుహయందు, (ని. 'గుహా దంభ గహ్వరేషు తు, గహ్వరమ్' అని నా.) రోచమాన=ప్రకాశించుచున్నవియు, నూతనతర = మిక్కిలి నూతనమయినవియునగు, దంత శబ్దమిక్కడ సానువునందు వర్తించుచున్నది. (ని. 'దంతస్సానుని కథ్యతే' అని వి.) దంతహీర = సాను సముత్పన్నములైన వజ్రమణులయొక్క, కాంతిధారలు వెల్వడఁగానని భావము. ఒక్క లేఁతనవ్వు నగి=ఒక చిఱునవ్వునవ్వి, నిజంబపల్కితివవుర్ = అగును యథార్థమే పలికినదానవు, భువన = జగత్తులయొక్క, ఆశయసన్నివేశ=అభిప్రాయస్థితిని, వేదిని = గుర్తెఱిఁగినదానాయని యర్థము. భువనాశయ = జలాశయమందలి, సన్నివేశ = సత్పురుష ప్రవేశముచు, వేదిని = గుర్తెఱిఁగినదానా యనిభావము. సారసాగ్రగణ్యవుగదే యని = సరసమయిన హృదయముగలవారిలోఁ శ్రేష్ఠురాలవుగదే యనియర్థము. సరసా = జలసహితములైననదులలోఁ, నగ్రగణ్యవుగదే = ముందుగా స్తుతిసేయఁ దగినదానవుగదే యని

భావము. అని = ఇట్లువచించినవాఁడై, అన్నదిఁ బల్కు వెండియుఁ = అనదినిగూర్చి మరల నొక్క వాక్యమును బలికెను. అలం. శ్లేషము.

అనురాగము స్త్రీవిషయికరాగము వాత్సల్యముగావున స్త్రీవిషయిక రాగముగనే యర్థముఁ జేసికొని కోలాహలుఁడు శుక్తిమతిని భువనాశయ సన్నివేశినివి సరసాగ్రగణ్య వనెను. అనఁగాఁ బశేంగితగ్రాహిణివి రసికురాలవనుట. లేఁతనవ్వు ఉత్తమత్వసూచకము. గట్టురాకొమరుఁడు గాన నాయకుఁ డుత్తముఁడు.

> శ్లో. శ్రేష్ఠానాం స్మితహాసితే మధ్యానాం విహసితావహసితేచ
> నీచానా మపహసితం తథాతిహసితంచ షడ్భేదాః. (సాహిత్యదర్పణము.)

మ. పరమామోదముతో నశేషతటినీపద్మాస్యలం గూడి నీ
వరవిందోద్భవుఁ గొల్చి యేఁగుతఱి నీయచ్ఛాచ్ఛభావంబు నీ
సరసత్వంబును నీగభీరతయు నీసర్వంకషప్రౌఢి నీ
పరిపూర్ణత్వము గాంచి మెచ్చి మదిలో భావింతు నిన్నెప్పుడున్. 126

పరమామోదముతోఁ = ఉత్కృష్టమయిన సంతోషముతోడ, అశేష తటినీ పద్మాస్యలం గూడి = సమస్త నదీకాంతలను గూడుకొని, నీవు=నీవు, అరవిందోద్భవుఁగొల్చి = బ్రహ్మదేవుని సేవించి, ఏఁగుతఱిఁ = పోవుచుండెడు సమయమందు, నీయచ్ఛాచ్ఛభావంబుఁ = నీయొక్క యత్యంతస్వచ్ఛమయిన హృదయము నని యర్థము. నిర్మలత్వమునని భావము. (ని. 'భావః పదార్థే సత్తాయాం క్రియాచేష్టాత్మయోనిషు, విద్వల్లీలా సభావేషు భూత్యభిప్రాయ జంతుషు' అని నా.) నీసరసత్వంబును = నీయొక్క రసికత్వమునని యర్థము. జలసహితత్వము నని భావము. నీగభీరతయుఁ = నీయొక్క గాంభీర్యగుణము నని యర్థము. లోఁతు నని భావము. నీసర్వంకషప్రౌఢిఁ = నీయొక్క సర్వసంగ్రహప్రౌఢిమ నని యర్థము. సర్వవ్యాపకసామర్థ్యము నని భావము. నీపరిపూర్ణత్వముఁ=నీయొక్క సంపూర్ణభావమునని యర్థము. ప్రవాహపరిపూర్ణత్వముని భావము. కాంచి = చూచి, మెచ్చి = మెచ్చుకొని, మదిలోఁ = మానసమందు, భావింతునిన్నెప్పుడుఁ = ఎల్లప్పుడును నిన్ను ధ్యానము సేయుచుందును, భావింతునిన్నెంతయుఁ-అని పాఠాంతరము. నిన్నుఁ=నిన్ను, ఎంతయుఁ=మిక్కిలి, భావింతుఁ=తలంతును, అనియర్థము.

అచ్ఛభావము సరసత్వము గభీరత సర్వంకషప్రౌఢి పరిపూర్ణత్వము ఉత్తమస్త్రీధర్మములు. నదీధర్మములు. అశేషతటినీసహితముగా నేఁగుచుంటి వనుటచే నదీగణమునందుఁ బ్రధానత్వము సూచితము. మదిలో భావింతుననుటచే నీగొప్పతనమును జిరకాలమునుండి యెన్నుచుంటిననియు నీవది యింత వఱ కెఱుంగవనియుఁ భావము. అలం. శ్లేషము.

శా. ఆపద్మోద్భవునోలగంబునకు దివ్యద్వీపినుల్ వచ్చు రా
రో పోరో మఱి యెందఱేనియును వారుఁ మేము సంధింపమో
యేపద్మాననఁ జూచినం దెలియ నీ వీక్షించినట్లుండ దే
ళా పల్మాటలు పూర్వజన్మకృతముల్ గాఁబోలు నీనెయ్యముల్. 127

ఆపద్మోద్భవు=ఆబ్రహ్మదేవునియొక్క, ఓలగంబునకున్ = కొలువునకు, దివ్యద్వీపినుల్ = దివ్య నదులు, (ని. 'స్రోతస్వినీ ద్వీపవతీ' అని అ.) నిచ్చ=నిరంతరమును, (గీ. 'ఎప్పుడు నెడపక యుండుగక యెల్లపు డన, నిచ్చ యనయంబు నాఁగను నిచ్చ లనఁగ, దనరు నాఖ్యలు సంతతం బనుట కభవ' అని యాంధ్రనామసంగ్రహము.) మఱియెందఱేనియును = ఇంకనెందఱైనను, రారో పోరో=వచ్చుచుండ లేదా పోవుచుండలేదా, వారు మ్మేముసంధింపమో=వారును మేమును నెదురుకొనలేదా, ఏపద్మాననఁజూచినన్ = పద్మమువంటి ముఖముగల యేస్త్రీని జూచినప్పటికి నని యర్థము. ఆననమువంటి పద్మములుగల యేనదిని జూచినప్పటికిని నని భావము. నిన్నీక్షించినట్లుండదు = నిన్నుఁజూచినట్లుగా నుండదు, విలాపల్లాటలు = బహుభాషలెందుకు, ఈనెయ్యములు = ఈమక్కువలు, పూర్వజన్మకృతము ల్గాఁబోలున్=క్రిందటిజన్మమందుఁ జేయఁబడినవి కాఁబోలును. మేము అనుపదము పూజ్యార్థమందుఁ బ్రయోగింపఁబడియెను.

పైపద్యమున సమస్తనదీకాంతలు బ్రహ్మదర్శనమునకు వత్తురని చెప్పఁబడెను. ఇప్పుడు దివ్యనదీ కాంతలుగూడ వత్తురని చెప్పుచున్నాఁడు. వారలఁ గోలాహలుఁ డెదుర్కొనుచున్నాఁడు. సౌందర్యాతి శయము లటుండ నెవ్వరినిజూచినను శుక్తిమతిని గాంచినటు లుండకపోవుటకు హేతువు ఈనెయ్యము పూర్వజన్మకృతమగుటయే. పూర్వజన్మవాసనావాసితమగునెయ్యము తొలఁగించుట యసాధ్యమనియుఁ దాని బలిమి తెలుపుట యసాధ్యముగాన పలుమాటలేల యనియు భావము.

ఉ. నావలనం బ్రియం బెఱిఁగి • నన్నొకమాఱును బల్కరింప కీ
వే వెస నోరఁ జేసికొని • యేఁగుదు గాని సరిల్లలామ ని
న్నే వగఁ జేర వత్తు మది • కింపగునీదునవోదితామృతం
బే వగఁ గ్రోలఁ గాంతు నని • యే నెపుడుం దలపోయుచుండుదున్. 128

నావలనంబ్రియంబెఱిఁగి = నావలననుండెడు నీవిషయమైన ప్రేమను దెలిసికొని, నన్నొక్క మాఱును బల్కరింపక = నన్నొకసారియైన మాటాడక, ఈవే వెసనోరఁజేసికొని యేఁగుదుగాని = నీవే త్వరితముగాఁ దొలఁగుపాటుచేసికొనిపోదువుగాని - ఇంతపర్యంతము నదీస్వభావపరముగాను జెప్పవలయును. సరిల్లలామ = నదులకు భూషణమవైన శుక్తిమతీ, నిన్నేవగఁజేరవత్తున్ =నిన్ను నేవిధముచేత సమీపించివత్తును మదికింపగు = మనస్సునకు హితమగుచున్న, నీదు=నీసంబంధమైన, నవ=నూతనమైన, ఉదితామృతంబు=వచోమృతమును అనియర్థము. అభినవోదితమైన సలిలము నని భావము. ఏవగఁ గ్రోలఁ గాంతున్ =ఏవిధముగాఁ బానముచేతును, అని = అనుకొని, ఏనెపుడుం దలపోయుచుండుదున్ = నేనెల్లప్పుడును విచారించుచుందును. అనఁగా నామీఁద నీకుమాత్రమే మక్కువలేదు కాని నాకెల్లప్పుడును నీమీఁదనే మక్కువ గలిగియున్నదని యర్థము. ఏఁగుదు, చేరవత్తున్ అను పదములు క్రమముగా మధ్యమోత్తమపురుషైకవచనంబులు కాన, (ని. 'ఉత్వ యుఁతౌ వనకారౌ స్యాతాం మధ్యోత్తమైకవచనానామ్' న. అనుసూత్రముచే వువర్ణక నువర్ణకములు కలుగఁ బ్రయోగింపవలసియుండియు, ని. 'భూతేతరయోర్వికల్పత్వ మితి కేచిద్బభాషిరే' అనునథర్వణ వచనము ననుసరించి యీపదములును భూతార్థకద్యోతకములు గాన వువర్ణక నువర్ణక విరహితములుగా గ్రంథకర్త ప్రయోగించెను.) అలం. శ్లేషము.

తా. ఓనదీమణీ! నేను నీపయి వలపుఁగొనియుండుట నీవెఱింగియు నన్నెపుడు పలుకరింపక తొలఁగి పోవుచుంటివి. నిన్నెటులఁ జేరనగును. నీమాట తేనియలు (నీజలము) ఎటులఁ గ్రోలఁ గలుగునని చిరకాలమునుండి యువ్విళులూరుచుంటిని.

తే. విమలమధురమనోహర♦వృత్తి వెలయు
వారిఁ గొనియాడ బుధు లెంత♦దూర మైనఁ
బోవుదురు గాన నేను నీ♦పొందుఁ గోరి
ద వ్వనక వచ్చితి నశేష♦తాపశమని. 129

విమల=నిర్దోషమును, మధుర=ప్రియమును, మనోహర=చక్కనిదియునయిన, వృత్తిన్=వర్తనముచేత, వెలయువారిన్ = ప్రకాశించెడువారిని అని యర్థము. నిష్కలుషంబును మాధుర్యయుక్తంబును మనోహరంబును నైనస్థితిగలవారి ననఁగా నుదకముననిభావము. (ని. 'స్వాదు ప్రియౌచ మధురౌ' అని అ.) కొనియాడన్=వర్ణించుకొఱకని యర్థము. కొని=గ్రహించి, ఆడన్ = స్నానముసేయుకొఱకనిభావము. బుధులు = తెలిసినవారు, అనఁగాఁ బెద్దలు, ఎంతదూరమయినఁ బోదురుగానన్ = ఎంతదూరమయిన నరుగుదురు గనుక, నేను నీపొందుఁగోరి=నేనును నీయొక్క సాంగత్య మభిలషించి, దవ్వనకవచ్చితిన్ = దూరమని విచారింపక వచ్చినవాఁడనయితిని, అశేష = నిశ్శేషమగునట్టులుగా, తాప=మన్మథతాపమును, శమని=శమింపఁజేయఁగలదానా అని అర్థము. దాహము మొదలయిన తాపములను శమింపఁజేయఁగలదానా అని భావము.

తాపమన దప్పియని మోహతాపమని యర్థము గావున నీసమస్తతాపములు శమింపఁజేయఁదగినదానవు నీవు. కానఁనే నీవృత్తి విమలము, మధురము, మనోహరమును,—విమలమనుట జలపరముగ నిర్మలమనియు నదీపరముగఁ బుణ్యాశీలము గలదానవనియు మధురమనుటచే నీజలము మాధుర్యమనియు నీనడవడి ప్రియము గూర్చునదియనియు మనోహరమనుటచేఁ జక్కనిదానవనియు నెదుటివారి మనసు లోఁగొనెదవనియు భావము. అలం. కావ్యలింగము. శ్లేషానుప్రాణితము.

ఉ. చెప్పెడి దేమి నాకుఁ గల♦జీవన మంతయు నీకుఁ గూర్చి యె
ల్లప్పుడు నిన్నుఁ బాయక ప్రి♦యాచరణం బొనరింప నేర్తునీ
చొప్పున కీవు నియ్యకొని ♦ చొక్కపుజక్కవగుబ్బలాఁడి మేల్
దప్పక యంతరంగమునఁ ♦ దారిచి నన్ను నదీనుఁ జేయవే. 130

చెప్పెడిదేమి=ఇఁకమీఁద జెప్పఁగలదియేమియున్నది. అనఁగా వేఱొకమాట లేదనుట. నాకుఁ గలజీవనమంతయు నీకుఁగూర్చి=జీవనమనఁగా బ్రతుకు, ఉదకమును, నాకుండెడు బ్రతుకుబండాలము యావత్తును నీకేయొప్పగించి అని అర్థము. నాయందుండెడు నిర్ఝరోదకముల నీయంద చేర్చి యని భావము. ఎల్లప్పుడు నిన్నుఁబాయక=ఎల్లకాలమును నిన్నెడఁబాయక, ప్రియాచరణంబొనరింప నేర్తున్= ప్రియ మాచరింపనేర్తునని యర్థము. ప్రియుఁడు చేయుకార్యముఁ జేయనేర్తునని భావము. ఈ-చొప్పున కీవునియ్యకొని=ఈ మార్గమునకు నీవును సమ్మతించి, చొక్కపుజక్కవగుబ్బలాఁడి=చక్కని చక్రవాకములవంటి కుచములుగలదానా యని యర్థము. చక్కనికుచములవంటి చక్రవాకములు గలదానా యనిభావము. మేల్దప్పక=మేలు చెఱుపకయని యర్థము. మోహముదీర్పక యని భావము. (గీ. 'వలపు

ఘోరిమి మేలు నా నలరుఁ జేల్లె, మోహమునకును శారదాంబుదనిభాంగ' అని యాంధ్రనామ సంగ్రహము.) అంతరంగమునఁ దారిచి = హృదయమందుఁ జేర్చి, నన్నునదీనుఁజేయవే = నన్ను దీనుఁడుగానివానిఁగాఁ జేయవేయని యర్థము. నదీనాథునిఁగాఁ జేయవేయనిభావము. అనఁగా నన్ను వరించి శుక్తిమతీనదీనాథుఁ డనునట్టులుగాఁ జేయవే యనుట. నాయకుఁడు నాయికకుఁ బ్రియాచరణ మొనరించుట సహజముగావున నాజీవనమునే నీకిత్తునని కోలాహలుఁడనెను. అనఁగా శైలజలాధారను ననే నదులుల్లసిల్లునసుట. కాననే నదీనునిఁగాఁ జేయఁగోరెను. నదీజననమునకుఁ గొంతవఱకు శైల ములె కారణముగాన నదీనాయకత్వము సార్థకముఁజేయ శుక్తిమతిని గోలాహలుఁడు కోరెను. అలం. శ్లేషము.

క. అన విని నగరాజుఘన, ధ్వనిగరిమకుఁ గలఁగి ముకుళి•తకరాంబుజ యై
వినయమునయంబుభయమును, మనమునఁబెనఁగొనఁగశు క్తి•మతియిట్లనియెన్.

అన విని=ఈలాగనిపలుకఁగా నాలకించి, నగరాజు = కోలాహలపర్వతునియొక్క, ఘన=అధిక మైన, ధ్వని = వాక్యధ్వనియొక్క, గరిమకున్=అతిశయత్వమునకు, కలఁగి=వ్యాకులపడి యనియర్థము. మేఘధ్వనియొక్క గరిమకుఁ గలుషితమయిన జలములుకలదై యనిభావము. వినయము = నమ్రభావం బును, నయంబు = నీతియును, భయమును = భీతియును, మనమునఁ బెనఁగొనఁగన్ = మనస్సునందు సంకలితము కాఁగా, శుక్తిమతి యిట్లనియెన్=శుక్తిమతీనది యొకవాక్యముఁ బలికెను.

శుక్తిమతి తొలుతఁ గోలాహలుని నతిథియని పూజించెనుగాని వానివాక్యములు ధ్వనిరూప ములై వలపుసెఱింగింప వెఱపుజనించెను. తప్పకొన నుపాయముగానరామి తనజీవితము మిగులహేయ మైనదనియు నీవు మహానుభావుఁడవుగాన నన్నుఁగలిసి కలుషమతిని గాకుమని ప్రార్థింపఁ దొడఁగెను.

సీ. నిలు వెల్ల నీచాతి•నీచోపసరణంబు ప్రకృతి యెల్లను జాడ్య•పరిణతంబు
పెం పెల్ల నియతగాం•భీర్యమానవిహీన మంతరం బెల్లఁ బం•కావిలంబు
జీవనం బెల్ల నం•చితబుద్బుదప్రాయ ముదయ మెల్లను దుర్ది•నోన్ముఖంబు
గతు లెల్లఁ గుటిలప్ర•కారకారణము లుత్సేకంబు లెల్లభం•గాకులములు
తే. నిలుకడ హుళిక్కి తావులు • పొలసు వల్చు
నిట్టిమాబోంట్లతోఁ జెల్మి • యెట్లు పొసఁగు
నచలితోత్తుంగధైర్యన • కలఘుమతికి
ననఘగతికి నభంగశీ•లునకు నీకు. 132

నిలువెల్లన్=స్వరూపమంతయును, నీచాతినీచోపసరణంబు = హీనాతిహీన ప్రవర్తనముగలది అని యర్థము. నిమ్నాతినిమ్నస్థలసరణముగలది, అనఁగాఁ బల్లమునకంటెఁ బల్లముగా నుండుచోటికిఁ బాఱునది యని భావము. ప్రకృతియెల్లను = స్వభావమంతయు, జాడ్యపరిణతంబు = మాంద్యముచేతఁ బరిపక్వమయినదని యర్థము. శైత్యముచేతఁ బక్వమయినదని భావము. (ని. 'జడో మూర్ఖే హిమ గ్రస్తే' అని అ.) పెంపెల్లన్ = అభివృద్ధియంతయు, నియత=నియమయుక్తమయిన, గాంభీర్య=గంభీర భావముతోడను, మాన = చిత్తసమున్నతితోడను, విహీనము = తక్కువయైనది, అనఁగా గాంభీర్య మానములు లేనిదని యర్థము. పెంపెల్లన్ = జలాధిక్యమంతయు, నియత = నియతమైన, గాంభీర్య =

లోఁతుయొక్క, మానవిహీనము = ప్రమాణములేనిదని భావము. అంతరంబెల్లఁ =హృదయమంతయు, పంకావిలంబు = పాపముచేతఁ గలుషితమయినదని యర్థము. జలాంతరభూమి యంతయును బురదతో సంకలిత మగుచున్నదని భావము. జీవనంబెల్లఁ = బ్రతుకంతయు, అంచితబుద్బుదప్రాయము = నీరుబుగ్గవంటిది, అనఁగా క్షణభంగురమని యర్థము. జీవనమనఁగా నుదకము, అది బుద్బుదబాహుళ్య మైనదనిభావము. ఇక్కడఁ బ్రాయశబ్దము తుల్యార్థమందును వర్తించుచున్నది. ని. ప్రాయ స్త్వనశనే మృత్యౌ తుల్య బాహుళ్యయో రపి' అని వి. ఉదయమెల్లను=అభ్యుదయమంతయు, దుర్దినోన్ముఖంబు= దుష్టదినమునకు మీఁదు చూచునదియని యర్థము. ఉదయమెల్లను=ఉత్పత్తియంతయు, దుర్దిన = మేఘచ్ఛన్నదినమునకును, ఉన్ముఖంబు = మీఁదుచూచుచున్నదని భావము. (ని. 'మేఘచ్ఛన్నే హ్ని దుర్దినమ్' అని అ.) అనఁగా సూర్యుండు గనుపడకుండ మేఘము పట్టి వర్షించుటచేత నదులు జలపూరితము లగుచున్నవనుట. గతులెల్లఁ = నడకలంతయు, కుటిలప్రకార = కుటిలభావమునకు, కారణములు= హేతువులైనవని యర్థము. గమనములు వక్రములై యుండుననిభావము. అనఁగా నదులు వంక వంకలుగాఁ బ్రవహించుననుట. ఉత్సేకంబులెల్లఁ = ఉద్రేకములన్నియు, భంగాకులములు = అపజయసంకులములని భావము. (ని. 'భఙ్గ స్తరఙ్గే రుగ్భేదే భేదే జయవిపర్యయే' అని వి.)

నిలుకడహుళిక్క=మతి స్థిరత్వములేదని యర్థము. నిలిచియుండుట యెన్నటికిని లేదని భావము. (గీ. 'బద్దు నా బొంకు నాఁగ దబ్బర యనంగఁ, గల్లనాఁగ హుళిక్కి నాఁ జెల్లుఁ బేళ్ళు, ధర నసత్యంబునకును' అని యాంధ్రనామసంగ్రహము.) తావులు = దేహవాసనలు, పోలసువల్చుఁ = నీచువాసన వాసించునని యర్థము. స్థానములు నీచువాసించునని భావము. (క. 'తావులన స్థలములొప్పును, దావులు నా వాసనలకుఁ దగుఁబేరు శివా' అని యాంధ్రనామసంగ్రహము.) ఇట్టిమాబోంట్లతోఁ=ఇట్లుండెడు మావంటివాండ్రతోడ, అచలిత = చలింపని, ఉత్తుంగ = ఉన్నతమైన, ధైర్యునకుఁ = ధైర్యముగలిగిన, అలఘుమతికిఁ = ఘనమైన మనస్సుగలిగిన, అనఘగతికిఁ = పాపరహితమైన నడవడికగలిగిన, అభంగశీలునకుఁ = భంగములేని సద్వృత్తిగలిగిన, నీకుఁ = నీకు, చెల్మియెట్టుపొసఁగుఁ = సహవాస మేరీతిగా యుక్తపడును. అనఁగా యుక్తపడదనుట. ఇక్కడఁ గ్రమాలంకారము ప్రథమచరణమునకును జతుర్థచరణమునకును బ్రతిద్వంద్విగాఁ జెప్పిన అచలితోత్తుంగధైర్యాదికము గాంభీర్యాదులకుఁ బ్రతిద్వంద్విగాఁ జెప్పఁదగినవానికి నుపలక్షణమని గ్రహింపవలయును.

తా. ఓ యచలేంద్రా! మేము చలించువాండ్రము, నీవు చలింపనివాఁడవు. మేము మహానీచులము, నీవు గొప్పవాఁడవు. మేము పాఱిపోవువాండ్రము, నీవు ధైర్యముచెడనివాఁడవు. మేము మందబుద్ధులము, నీవు గొప్పబుద్ధిగలవాఁడవు. మేము కుటిలప్రవర్తనముగలవాండ్రము, నీవు కుటిలప్రవర్తనము లేనివాఁడవు. మేముభంగముతోఁగూడిన శీలముగలవాండ్రము, నీవు భంగములేని శీలముగలవాఁడవు. కాఁబట్టి యీలాటి దుర్గుణములుగల మాతోడ నిట్టిసుగుణగరిష్ఠుఁడవైన నీ కేలాగున సాంగత్యముపొసఁగును, అనఁగాఁ బొసఁగ నేరదని శుక్తిమతి చెప్పెను.

క. పుడమి నచలేంద్ర లెచ్చుట, జడవాహిను లెచట నైచటిసఖ్యము వినఁ జో
ప్పడదు ప్రౌఢ వడరుమీఁయెడ, నేడపుక మారసము లెచటి కెక్కుమహాత్మా.

పుడమిన్ = భూమియందు, అచలేంద్రులెచ్చట = పర్వతశ్రేష్ఠులెక్కడ, జడవాహినులెచట = జలమయములైన నదులెక్కడనని యర్థము. భూదేవేంద్రులైన రాజులెక్కడ నీళ్లకడవలు మోయు దాసీజనము లెక్కడ నని యర్థాంతరము. ఎచటిసఖ్యము = ఎక్కడిస్నేహము, వినఁజొప్పడదు = వినుటకే యుక్తముకాదు, పొడవడరు మీయెడన్ = అతిశయత్వముచేత నొప్పుచున్నమీవిషయమై, ఎడపక = ఎడపడక, మారసములు = మాయనురాగములు, ఎచటికెక్కున్ = ఎక్కడికంటుచున్నవి అనియును బొడవుచేత నొప్పుచుండెడు మీయందుఁ గ్రిందనుండెడు మాజలము లెక్కడికెక్కుఁ గలవనియును నర్థము. మహాత్మా = పూజ్యుఁడవైనవాఁడా యని యర్థము పృథులమయిన నేహముగల కోలాహలుఁడా యని భావము.

సమానులయెడ నెయ్యము పొసఁగును గాని యసమానులయెడఁ బొసఁగదు. మీరచలేంద్రులు, పొడవడరువారు. మేము జడవాహినులము. మన నెయ్యము వినఁదగినదికాదు. మీయెడ మా కనురాగము కలుగదని శుక్తిమతి కోలాహలునితో ననెను. అలం. విషమము.

ఉ. నా విని గట్టుఱేఁడు వద♦నంబున విన్నఁదనంబు దోఁప నో
 శైవలినీశిఖామణి ని♦జంబు భవత్కమనీయకాంతిధా
 రావళిలో మునింగితి ద♦యామతిఁ బ్రోవక సుళ్ళఁ బెట్టెదో
 నీ విఁకఁ గ్రుచ్చి యెత్తి ఘన♦నిర్వృతిఁ దెప్పలఁ దేల్చెదో యనన్. 134

నావిని = శుక్తిమతి యీలాగని పలుకఁగా నాలించి, గట్టుఱేఁడు = పర్వతనాథుఁడైన కోలాహలుఁడు, వదనంబున విన్నఁదనంబుదోఁపన్ = ముఖమందు దీనత్వము గనుపడఁగా, ఓశైవలినీశిఖామణి = నదీశిరోమణివైన యోశుక్తిమతీ, నిజంబు = నీమాటసత్యమే, అయినను, భవత్ = నీసంబంధమయిన, కమనీయ = ఒప్పుచున్న, కాంతిధారావళిలో మునింగితిన్ = కాంతియొక్క ధారాప్రవాహపరంపరయందు మునిఁగితినని భావము. దయామతిఁ బ్రోవక = కృపామతిచేత రక్షింపక, సుళ్లఁ బెట్టెదో = నడుసుళ్ళలోఁ బెట్టుచున్నావో, లేక, నీవిఁకఁ గ్రుచ్చియెత్తి = నీవిఁకమీఁదఁ గ్రుచ్చి కౌఁగిలించుకొని, ఘననిర్వృతిన్ = అధికమయిన సౌఖ్యమందు, తెప్పలఁదేల్చెదో = తెప్పఁదేలునట్టులుగాఁ జేయుచున్నావో, అనన్ = అని కోలాహలుఁడు పలుకఁగా నని యర్థము. సుళ్ళఁబెట్టెదో అన్నచోట సుడిగుండములలోఁ బడవైచుచున్నావో అనియు, తెప్పలఁదేల్చెదో అన్నచోట తెప్పలమీఁదఁ దేలునట్టులుగాఁ దేలఁ జేయుచున్నావో అనియును సారస్యము గ్రహింపవలయును. అనఁగా నీయొక్క ధారాప్రవాహరూప మయిన లావణ్యమునకు మోహితుఁడనై యున్నాను గనుక నన్నవలంబించి సుఖింపఁజేయుచున్నావో లేక నిరసించి వ్యాకులపడఁ జేయుచున్నావో నీకే తెలియు నని కోలాహలుఁడు శుక్తిమతినిగూర్చి పలికె నని భావము.

కాంతిధారావళిలోఁ దెలిసియో తెలియకయో మునింగితిని. ఇది నిజము. నాకై నే నిఁక నుత్తీర్ణుఁడ కాఁజాలను. రక్షింపనెంచవేని సుడిగుండములలోఁ బడవేయుము. లేదా తెప్పలఁదేల్చి యుద్ధరింపుము. అనఁగా ముంచినను దేల్చినను నీవె దిక్కు. కర్తవ్యము నిశ్చయింపఁదగినది నీవే యనుట.

చ. వెలవెలఁ బారి శుక్తిమతి ♦ వెండియుఁ గొండలఱేనిఁ బల్కు న
 గ్గల మగుపంచ సాయకవి♦కారముఁన్ నిజగౌరవోన్నతు

ల్లలఁపవు గాని మాదృశజ•డస్థితిఁ దెప్పలఁ దేలుచున్న మీ
కులగిరికోటిలోఁ గడుల•ఘుత్వము గాదె తలంచి చూడుమా. 135

వెలవెలఁబారి = వెలవెలపోయి, అనఁగా వివర్ణతనుబొంది, శుక్తిమతి వెండియుఁ గొండలఱేనిఁ బల్కుక్ = శుక్తిమతీనది తిరుగాఁ బర్వతనాథుఁడైన కోలాహలునిఁగూర్చి పలుకుచున్నది ఏమనియనిన, అగ్గలమగు = మిక్కుటమయిన, పంచసాయకవికారమునన్ = మన్మథవికారముచేత, నిజ = స్వకీయమయిన, గౌరవోన్నతుల్ = గౌరవంబును నౌన్నత్యంబును, తలఁపవు గాని = విచారించుకొనవుగాని, మాదృశజడస్థితిఁ దెప్పలఁదేలుచున్న మీకులగిరికోటిలోఁ గడులఘుత్వముగాదె తలంచి చూడుమా = మావంటిజడులచేత నుద్ధరింపఁబడుట మహోత్కృష్టకులపర్వతసమూహములో మిక్కిలి లాఘవము గాదా విచారించి చూడుమా యనియును నీయొక్క గౌరవోన్నతులనఁగాఁ బృథులత్వమును బొడవును విచారించుకొనక మాదృశజలస్థితిచేతఁ దెప్పలమీఁదఁ దేలుచు నుండుట పర్వతశ్రేణిలోఁ ఖులకఁదనముగాదా విచారింపుమా యనియును నర్థము.

నిన్ను సుళ్ళఁబెట్టనుగాని యెటులనో తెప్పలఁ దేల్చెద ననుకొమ్ము. దాన నీకుఁ దేలికతనము వచ్చును. నలుగురిలో నీకుఁ జిన్నతనమగును. మేము జడాత్ములము. మాకలయిక తెప్పలఁదేలుట నీగౌరవోన్నతులకు భంగము. 'కామాంధో నైవ పశ్యతి' యనునటులఁ బంచసాయకవికారమున నీవు హితాహితము లెఱుంగకున్నాఁడవని కోలాహలునితో శుక్తిమతి యనెను. అలం. శ్లేషమూలాభేదాధ్యవసాయము.

మ. మతిఁ గ్రీడారతి గల్గెనేని సకల•క్ష్మాపుణ్యదేశాళిఁ గాం
చి తపస్స్ఫూర్తిమెయిం గృశించి వనరా•శిం జెందుమాబోంట్ల ను
ద్ధతిచేఁ గ్రమ్మఁగ నేల నీకుఁ గఱవే • తారుణ్యలావణ్యజృం
భితరంభాదినిలింపభామ లన భూ•భృన్మౌళి రాగాంధుఁ డై. 136

మతిన్ = బుద్ధియందు, క్రీడారతిగల్గెనేని = సంభోగక్రీడలయందలి యాసక్తిగలిగినట్టులాయెనేని, సకలక్ష్మాపుణ్యదేశాళిఁ గాంచి = సమస్త పుణ్యక్షేత్ర సమూహమును జూచి యని తపస్వీపరమయిన యర్థము. సమస్తపుణ్యభూమిప్రదేశములయందు వ్యాపించి యని నదీపరమయిన భావము. తపస్స్ఫూర్తిమెయిం గృశించి = తపస్సుయొక్కస్ఫురణముచేత సన్నగించి యని యర్థము. గ్రీష్మర్తువుయొక్క విజృంభణముచేత శుష్కించి యనిభావము. వనరాశిం జెందు = అరణ్యసమూహమును బొందుచున్న యని యర్థము. జలరాశిని బొందుచున్న యని భావము. (ని. 'వనే సలిల కాననే' అని అ.) మాబోంట్లన్ = మావంటి తపస్వినులనని యర్థము. మావంటి నదులనని భావము. ఉద్ధతిచేఁ గ్రమ్మఁగనేల = ఔద్ధత్యముచేతఁ బైకొననేల, తారుణ్య = యౌవనముచేతను, లావణ్య = ముత్యపునీరువలెఁ బ్రకాశించెడు దేహకాంతిచేతను, జృంభిత = విజృంభించుచున్న, రంభాది నిలింపభామలు = రంభమొదలయిన దేవతాస్త్రీలు, నీకుఁగఱవా = నీకులేకయున్నారా, అనఁగా నున్నారుగదా, అనన్ = అని శుక్తిమతి పలుకఁగా, భూభృన్మౌళి = పర్వతశేఖరుఁడైన కోలాహలుఁడు. రాగాంధుఁడై = కామాతురత్వముచేతఁ గన్ను గానని వాఁడై. అలం. శ్లేషమూలాభేదాధ్యవసాయము.

మేము తపస్వినులము. మమ్ముద్ధతిచేఁ గ్రమ్ముట సాహసము. క్రీడావతి నీకున్న వయసుపొంకముచేఁ జక్కఁదనముచే విఱ్ఱవీగురంభాద్యప్సరఃకాంతలు లేరా? తపోనియమములతోఁ గృశించు తపస్వినుల కంటెఁ గ్రీడారతులకు వయసుపొంకములతో నలరు వేల్పువెలఁదులే తగినవారు. సౌందర్య తారుణ్యాదులచే శోభించు నీ కారంభాదులు కలవు కారు!

సీ. అతనుభూతి ఘటింప♦దయ్యెనే చదలేఱు సిగఁ దాల్చునింధాన♦చిత్రకునకు
వరవంశవైఖరి ♦ వదలెనే రవిసుతాపతి యైనదైతేయ♦భంజనునకు
వసులాభసంపత్తి ♦ మసలెనే జాహ్నవిఁ జేకొన్న శంతను♦క్షితిపమణికిఁ
గమలోదయఖ్యాతి♦ దెమలెనే నానానదీకాంతుఁ డైనర♦త్నాకరునకు
తే. వారికేలాఘవమువచ్చె♦వనితయెంత, మారుమసలెదు వట్టినే♦మములు చాలు
నేలు నన్నని సతికమ♦లాలిపట్టు, ప్రబలతరదీర్ఘభుజశాఖఁ ♦ బట్టుటయును. 137

చదలేఱుసిగఁ దాల్చు=ఆకాశగంగను జటాజూటమందుధరించి, ఇంధానచిత్రకునకున్=అగ్నియే తిలకముగాఁగల శివునకు, (ని. 'తమాలపత్ర తిలకచిత్రకాణి విశేషకం' అని అ.) అతను=అధికమైన, భూతి=ఐశ్వర్యము, ఘటింపదయ్యెనే = కూడకపోయెనా, అనఁగాఁ గూడినదిగదాయని యర్థము. అతను=మన్మథునియొక్క, భూతి=భస్మము, ఘటింపదయ్యెనే=ఘటింపకపోయెనా, అనఁగా ఘటించిన దని భావము. రవిసుతాపతియైన = సూర్యునికొమార్తెయైన కాళిందికి భర్తయగు, దైతేయభంజనునకున్=శ్రీకృష్ణమూర్తికి, వర=శ్రేష్ఠమయిన, వంశవైఖరి = వంశవిస్ఫూర్తి, వదలెనే=వదలిపోయెనా, అనఁగా వదలిపోలేదుగదా యనియర్థము. శ్రేష్ఠవేణుగానవైఖరి గలవాఁడని భావము. జాహ్నవిఁ జేకొన్న=జహ్నుకన్యకయైన భాగీరథిని బరిగ్రహించిన, శంతనుక్షితిపమణికిన్=శంతనుఁడనెడు భూపతి శ్రేష్ఠునకు, వసులాభసంపత్తిమసలెనే = ధనలాభసంపత్తి గలుగకపోయెనా, అనఁగాఁ గలిగినదికదా యని యర్థము. అష్టమవసువైన భీష్ముఁడు గలిగినాఁడని భావము. నానానదీకాంతుఁడైన = సమస్త నదులకును బెనిమిటియైన, రత్నాకరునకున్=సముద్రునకు, కమలోదయఖ్యాతి దెమలెనే=సంపదుదయ ప్రఖ్యాతి చలించెనా, అనఁగా జలించిపోలేదుగదా యని యర్థము. లక్ష్మీదేవి పుట్టినదనెడు ఖ్యాతి యనికాక లేక కమలమనఁగా జలముగనుక జలపూరితోదయఖ్యాతి యున్నదనిగాని భావము.

వారికేలాఘవమువచ్చెన్=అనఁగా నదులైన యాకాశగంగను గాళిందిని భాగీరథిని ఇది యది యనక సమస్తనదులను బరిగ్రహించిన శివుఁడు శ్రీకృష్ణుఁడు శంతనుఁడు సముద్రుఁడు వీరి కేచిన్న తనము వచ్చినది, అనఁగాఁ జులుకందనమురాలేదుగదా యనుట వనిత=ఓశుక్తిమతీ, ఎంతమారుమస లెదు=ఎంతగాఁ బ్రతికూలభావము వహించుచున్నావు, వట్టినేమములుచాలున్=పనికిమాలిన నియమము లింతటితోఁ జాలును, ఏలునన్నని=నన్నేలుకొమ్మని, సతి=శుక్తిమతియొక్క, కమలాళి=పద్మసమూహ మనెడు, పట్టు=పట్టువస్త్రమును, ప్రబలతర=మిక్కిలియు బలిష్ఠమయిన, దీర్ఘభుజశాఖన్ = శాఖా సదృశమైనదీర్ఘబాహువుచేత, పట్టుటయును=పట్టఁగా అని యర్థము. శుక్తిమతీనదియొక్క కమలము లేటి స్థానము గలవి యనియును కోలాహలపర్వతము ప్రబలతరదీర్ఘబాహుసదృశశాఖలు గలదని యును భావము.

జడస్థితిఁ దప్పలఁదేలు నదీకాంతలఁ దొల్లి పలువురు పెండ్లాడిరి. వారి కేలాఘవము రాలేదు. శివుఁడు గంగను, విష్ణువు కాళిందిని శంతనుఁడు జాహ్నవిని సముద్రుఁడు సమస్తనదులను బెండ్లా

డిరి గాన లాఘవము కల్ల. తపస్విని గా నుంటి ననుట వట్టి నేమములు. ఇట్లు పరిహారముఁ జెప్పి కోలాహలుఁడు శుక్తిమతిఁ గొంగు పట్టుకొనెను. భుజశాఖన్ అనుచో తృతీయకు ద్వితీయ వికల్పము. అలం. శ్లేషమూలకమగు విశేషోక్తి.

ఉ. వేణి చలింపఁ గంపితన•వీనమృణాళభుజాగ్రకంకణ
శ్రేణి నటింప లోలశఫ•రీనిబిరీసకటాక్షకాంతి వి
న్నాణము చూప హంసకగ•ణక్వణనంబులు మీఱ సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖ•శోభిత యై కడు సంభ్రమించినన్. 138

వేణిచలింపన్=వేణియనఁగా నేటిపాయకును సర్పాకారముగా నల్లిన స్త్రీలయొక్క జడకును పేరు. (ని. 'వేణీ ప్రవాహే సరితాం మేళనే కేశబంధనే, దేవశాఖ్యే' అని నా.) జడ కదలియాడఁగా, కంపిత=చలించుచున్నదియు, నవీన = నూతనమయినదియునగు, మృణాళ = తామరతూఁడులనెడు, భుజ=బాహువులయొక్క, అగ్ర=కొనలయందు, కంకణ=జలబిందువు లనెడు, కంకణ=హస్తాభరణముల యొక్క, (ని. 'స్యాత్కంకణం హస్తసూత్రే శిఖరే కటకే జలే' అని నా.) శ్రేణి=పంక్తి, నటింపన్=వర్తింపఁగా, లోల=కదలుచున్న, శఫరీ=మత్స్యవిశేషములనెడు, (ని. 'ప్రోష్ఠీ తు శఫరీ ద్వయోః' అని అ.) నిబిరీస=నిబిడమయిన, (ని. 'నిబిడం నిబిరీసం చ దృఢం గాఢం ప్రచక్షతే' అని వై.) కటాక్ష=క్రేఁగంటి చూపులయొక్క, కాంతి=ప్రకాశము, విన్నాణముచూపన్=ఓప్పిదము గనుపఱుపఁగా, హంసకము లనఁగా హంసలును గాళ్ళయందెలును, (ని. 'హంసకః పాదకటకః' అని అ.) హంసక = హంసలనెడు కాళ్ళయందెలయొక్క, గణ=స్తోమముయొక్క, క్వణనంబులు = అనుకరణధ్వనులు, మీఱన్=అతిశయింపఁగా, సైకతశ్రోణి = ఇసుకదిన్నెలనెడు నిసుకదిన్నెలవంటి పిఱుఁదులుగల శుక్తిమతి, వివర్తిత=త్రిప్పఁబడిన, అబ్జ = కమలమువంటి, ముఖ=నెమ్మొగముచేత, శోభితయై=ఒప్పుచున్నదై, కడుసంభ్రమించినన్=మిక్కిలి తొందరపాటు నొందఁగా, ఈపద్యమునకు ముందరి పద్యముతో నన్వయము. విన్నాణమనున విజ్ఞానశబ్దమునకుఁ దద్భవము. ఇందుకుఁ బ్రమాణము. సీ. 'విజ్ఞానమునకు భావింప విన్నాణంబు విజ్ఞాపనమునకు విన్నపంబు, సంజ్ఞకు సన్న యజ్ఞమునకు జన్నంబు నాజ్ఞప్తి కానతి యాజ్ఞ కాన' అని అప్పకవి.

కోలాహలపర్వతము నది నడ్డగించుటచే నీటిపాయ చెదరె ననియుఁ దామరతూండ్లుఁ గలఁగెననియు జలకణములు చిందెననియు బేడిసమీ లెగిరిపడెననియు అంచలు ధ్వనిచేసెననియుఁ దామరపూవులు కలఁతనొందెననియు శుక్తిమతిఁ గొంగు కోలాహలుఁడు పట్టుకొన జడ కదిలెననియు భుజములు వణఁకుటచేఁ గంకణములు మ్రోఁగెననియు ఓరగంటిచూపు లొప్పారెననియుఁ గాలియందెలు మ్రోసె ననియుఁ దొట్రుపాటుచే మోము ద్రిప్పెననియు భావము.

అలం. శ్లిష్టరూపకము. స్వభావోక్తి.

మ. నిలువెల్లన్ నిరపాయశంబరమయో•న్మేషంబునం బొంగురాఁ
గలకూలంకషగాఢగర్వనిధులం • గాంతానుకూల్యంబుచేఁ
దలమే నిల్పఁగ బ్రాతికూల్యపరుషో•ద్యత్ప్రౌఢిఁగా కంచు న
య్యచలఘ్నుం డాస్యము జేవురింప నిజరూ•పాటోపసంరంభి యై. 139

నిలువెల్లన్ = స్వరూపమంతయును, నిరపాయశంబరమయోన్మేషంబునన్ - శంబరమనఁగా మాయయును జలమును గనుక, నిరపాయ=అపాయములేని, శంబరమయ=శంబరాసురునియొక్కయు

మయునియొక్కయు, ఉన్మేషంబునన్ = వికాసముచేత, అనఁగా వాంద్రమాయవంటి మాయచేత, పొంగురాఁగల = ఉద్రేకించెడు, కూలంకష = పరిపూర్ణమును, గాఢ=సాంద్రమునయిన, గర్వ = దర్పమునకు, అనఁగా నిర్లజ్యభావమునకు, నిధులన్ = స్థానభూతలయిన, ధూర్తస్త్రీలను, కాంత= పురుషులయొక్క, అనుకూల్యంబుచేన్ = అనుకూలభావముచేత, నిల్పఁగన్=అతిక్రమించిపోక నిలుపుటకు, తలమే = శక్యమగునా, అనఁగాఁ గాదనుట. ఇఁకనేమన్నను, ప్రాతికూల్య = ప్రతికూలభావముతోడ, పరుష = కఠినమయిన, ఉద్యత్ప్రౌఢిఁ గాక = ప్రకాశమానమయిన ప్రాగల్భ్యముచేత శక్యమగునుగాక, అంచున్ =అనివిచారించుచు నని యర్థము. నిలువెల్లన్ =స్వరూపమంతయు, నిరపాయ= నిర్నిరోధకమయిన, శంబరమయ = జలమయమయిన, ఉన్మేషంబునన్ = వికాసముచేత, పొంగురాఁగల = వెల్లువపెట్టఁజాలిన, కూలంకష = ఒడ్డురాచికొను ప్రవాహముయొక్క, గాఢ = దృఢమయిన, గర్వ = అహంకారమునకు, నిధులన్ = స్థానములయినవానిని, అనఁగా వేగాతిశయముగల నదులను, కాంత = అర్హమయిన, అనుకూల్యంబుచేన్ = కూలానుసరణముచేత, నిల్పఁగన్ = నిలుపఁబట్టుటకు, తలమే = శక్యమగునా, ఇఁకనేమన్నను, ప్రాతికూల్యపరుషోద్యత్ప్రౌఢిఁగాకంచున్ =అడ్డకట్టుటయందుఁ గఠినమయిన యతిశయప్రౌఢిమచేతనే శక్యమగునుగాక యని విచారించుచును, అని నదీపరమయిన యర్థము. అయ్యలఘుండు = అయధికుఁడనియును అపృథులమయిన శరీరముగల కోలాహలుఁడనియును నర్థము. ఆస్యము జేవురింపన్ = ముఖము క్రోధారుణితమగుచుండఁగా, నిజ = స్వకీయమయిన, రూప = పర్వతరూపమున కర్హమయిన, ఆటోప = ఉద్దేశకార్యజాతవ్యగ్రతయందలి, సంరంభియై = త్వరితముగలవాఁడయి.

"జాఁగలన్ గూలంకష" యనుచో ధూర్తస్త్రీలనని శకటరేఫరూపముగను, రాఁగల = వెల్లువ రాఁగలయని నదీరూపముగను నర్థద్వయముఁ జెప్పుచున్నారు. ద్వ్యర్థికవితలో నీరేఫశకటరేఫనియమము గ్రాహ్యము గాదు గావున నీనిర్బంధము పాటింపఁజనదు. పొంగుజాఁగలన్ గూలంకషగాఢగర్వనిధులన్ అనుచో స్త్రీపరముగ సమగ్రగర్వశాలినులై పొంగుగయ్యాళులనను నర్థమును, పొంగురాఁగల కూలంకషగాఢగర్వనిధులన్ అనుచో నదీపరముగ వెల్లువరాఁజాలిన యొడ్డుల రాచికొను ప్రవాహపుగర్వనిధుల ననునర్థమును కొందఱు వ్యాఖ్యాతలు చెప్పుచున్నారు. రాఁగల కూలంకష యనుచోఁ గొందఱు పూర్వవ్యాఖ్యాతలు పొంగురాఁగలనది యను నర్థముమాత్రము చెప్పిరి. శ్లేషమునకు రేఫసాంకర్యముచేసి కూలంకషయనుపాఠము గ్రహింపవలెనని కొందఱు నూతనవ్యాఖ్యాతలందురు. స్వల్పమగు శ్లేష కాసించి వ్యాకరణనియమములను రామరాజభూషణుఁడు తొలంగించె ననఁజాలము గాన ప్రకృతపాఠమె గ్రాహ్యము.

వ. నెట్టన నాగట్టువోరపట్టి యొట్టకేలకు మట్టుమీఱి గుట్టునం బట్ట రానితమకంబునం దట్టువడి కట్టలుకం గట్టలు వడ నేయఁకట్టడిమరునియంపసెలకట్టియల బెట్టునం బుట్టుబెట్టిదపునొప్పి దట్టి దట్టంపునిట్టూరుపుపొగలు నిగుడుసొగసునం దగులు మొగఁలుతెగల రచ్చల నచ్చటం బెచ్చుపెరుఁగుజాంబూనదాంబుజకదంబకాలంబకాదంబకాడంబరఁబులు వారించుచు రాకరాకలంబై కొనుకో కారిసెకసోఁకులం బ్రాఁకినయాకారపాండిమంబునలువునం జెలువలరుకలువచెలిచలుపవన్నెల నెలకొన్న వెన్నెలవెల్లువల నుల్లోలకల్లోలమాలికా

డోలికాకేళికాచతురచక్రబాలికాజాలంబులమేలంబులఁ దూలించుచుం దమిఁ గొలుపునగ్గలపువలపునం గలయలపునం బొడముడగ్గుత్తికఁ దడఁబడ నుడువు నుడువులవడువున మెఱయుసరయచంక్రమణచలదుపలఫలక మిళదలఘుతర ఘుమఘుమార్భటి నికటతటవిటపివిటపచ్ఛటారటదపారకీరకిన్నరమిథునాదులం జదల మెదలం జేయుచుఁ దనయహార్య్యభావగౌరవంబు కల్లోలినీరయనివారణం బునుం గామోపభోగసమయసముచితవిజనతాకారణంబునుం గందర్పబలసం బాధబాధావధీరణంబునుం గాఁగ మాటిమాటికిం గూటములం బాటింపు మని యబ్భ్యటిపదంబులం బడినవడువున నడుగున వ్రాలి యడ్డగించి యలముకొని చెంగల్వతావులు చెదర వేణిఁ దెమలించుచు మకరికలు నులియ గండపాళి నొక్కుచు మధురామృతంబులు వడయం బలుదెరసొబగు లానుచు మౌక్తికం బులు జడియం బయోధరంబులం బట్టుచు విశదాంశుకాంతస్థితి దొరలంగ నతి విపులపులినజఘనారోహంబుల నుత్పలపత్త్రంబుల నెరపుచుం దనివి లేక తద్దయు నాగద్దరి యమ్ముద్దరాలిం బెద్దయుం బ్రొద్దు నిరోధించుసమయంబున.

నెట్టనక్ = త్వరితముగా, ఆగట్టుదొరపట్టి = పర్వతరాజుకొమారుఁడయిన కోలాహలుఁడు, ఎట్టకేలకుక్ = కొంతసేపటికి, మట్టుమీఱి=మితిమించినదయి, గుట్టునంబట్టరాని=గోప్యముగా నిలుపఁ బట్టఁ గూడకయున్న, తమకంబునక్ = అభిలాషయందలి తొందరచేత, తట్టువడి = తిరస్కరింపఁబడి, కట్టలుకం గట్టలువడసేయు = అతిశయక్రోధముచేత మోపులయి పడునట్టులుగా చేయుచున్న కడు+అలుక, కట్టలుక అనిసంధి. కట్టడిమరుని = కఠినుఁడయిన మన్మథునియొక్క, అంపసెలకట్టియల = అంపకోలలయొక్క, అనఁగా శరకాండములయొక్క, బెట్టునంబుట్టు = పటిమచేత సంభవించుచున్న, బెట్టిదపునొప్పిదట్టి = మిక్కుటమయిన వ్యథ సంప్రాప్తించి, దట్టంపునిట్టూరుపు పొగలునిగుడు పొగసునందగులు=సాంద్రమయిన నిశ్వాసధూమములు వ్యాపించినవో యన్నట్టులుగానున్న, మొగులు తెగలరచ్చల = తనయందలి మేఘసమూహములయొక్క సమ్మర్దములచేత, అచ్చటం బెచ్చుపెరుఁగు= అక్కడ అనఁగా శుక్తిమతియం దతిశయించుచున్న, జాంబూనదాంబుజ = సువర్ణకమలములయొక్క, కదంబక = సమూహమందు, ఆలంబ = అవలంబముగలిగిన, కాదంబక = కలహంసలయొక్క, ఆడంబరంబులు = విజృంభణములను, వారించుచుక్ = నివారించుచును, అనఁగా గోలాహలుఁడు తనకు విరహోద్రేకమును జేయుచున్న శుక్తిమతీ సువర్ణకమల విహారమాణ హంసాడంబరములను దననిశ్వాసధూమములో యన్నట్టులుగానున్న తనయందలి మేఘమాలికలచేత నివారించినాఁ డనుట. ఇక్కడ మేఘములకును హంసలకును విరోధమని తెలియవలయును. అలం. ఉత్ప్రేక్ష.

రాకరాకలం బైకొను = రాకయనఁగాఁ బున్నమ, (ని. 'రాకస్తు పూషణి, రాకా నవరజోనార్యాం పూర్ణచన్ద్రతిథా వపి' అని నా.) పున్నమనాఁటి వచ్చుటలచేతను గ్రమ్ముచున్న, కోకారి = చంద్రునియొక్క, సెక = సెగయొక్క, సోఁకులంబ్రాఁకిన = అంటుకొనుటవలన వ్యాపించిన, ఆకార పాండిమంబు నలువునం జెలువలరు = విరహతాపసంజనిత శరీరపాండిమయో యన్నట్టులుగా నొప్పుచున్న, కలువచెలిచలువ = చంద్రకాంతశిలలయొక్క, వన్నెలక్ =కాంతులచేత, నెలకొన్న = సంభవిం

చిన, వెన్నెలవెల్లువలన్=చంద్రికాప్రవాహములచేత, ఉల్లోల=ఉప్పొంగుచున్న, కల్లోలమాలికా=శుక్తిమతీతరంగశ్రేణులనెడు, డోలికా=తొట్లయందలి, కేళికా=క్రీడయందు, చతుర=ప్రవీణలయిన, చక్రబాలికా=చక్రవాకస్త్రీలయొక్క, జాలంబుల=సమూహములయొక్క, మేలంబులన్ = పరిహాసములను, తూలించుచున్=భంగపఱుచుచు, అనఁగా శుక్తిమతీ జలతరంగమాలికలయందుఁ దూఁగుచున్నవై, తనకు విరహోద్రేకమును జేయుచున్న చక్రవాక స్త్రీలను, పూర్ణిమాచంద్రునియొక్క కాఁకలు సోఁకుటచేత వ్యాపించిన తనయొక్కవిరహపాండిమమో యన్నట్టులుగా నున్నచంద్రకాంత శిలాకాంతులనెడు వెన్నెలలచేతఁ దిరస్కరించినాఁడనుట. ఇక్కడ వెన్నెలకును జక్రవాకములకును విరోధమని తెలియవలయును. అలం. ఉత్ప్రేక్ష.

తమిగొలుపు=అభిలాషపుట్టించుచున్న, అగ్గలపువలపునంగల=మిక్కుటమయిన మోహమువలన సంభవించిన, అలపునంబొడము = ఆయాసముచేతఁబుట్టిన, డగ్గుత్తికన్ = గద్గదస్వరముచేత, తడఁబడ నుడువు=వ్యత్యయముగాఁ బలికెడు, నుడువులవడువునన్=పలుకులోయన్నట్టులుగా, మెఱయు=ప్రకాశించుచున్న, సరయ = వేగముతోఁ గూడుకొన్నట్టులుగా, చంక్రమణ = చెంగలింపులచేత, చలత్=దొరలుచున్న, ఉపలఫలక=పలకలవంటి రాళ్ళతోడ, (ని. 'పాషాణ ప్రస్తర గ్రావో పలాశ్మాన శ్శిలా దృషత్' అని అ.) మిళత్=కూడుకొనుచున్న, అలఘుతర=అధికమయిన, ఘుమఘుమార్భటీ=ఘుమఘుమయనెడు ననుకరణధ్వనిచేత, నికట=సమీపమందలి, తటవిటపి=శుక్తిమతీ తీరస్థిత వృక్షములయొక్క, విటపచ్ఛటా=తరువిస్తారసముదాయమందు, (ని. 'వృక్షో మహీరుహ శ్శాఖీ విటపీ పాదప స్తరుః' అని అ.) అనఁగా శాఖామండలమందు, రటత్=రొదసేయుచున్న, అపార=అంతములేని, కీరకిన్నరమిథునాదులన్=శుకదంపతులు కిన్నరపక్షిదంపతులు మొదలయినవాని, చదలమెదలం జేయుచున్=మింటికెగసి తిరుగునట్టులుగాఁ జేయుచు, అనఁగా శుక్తిమతీతీర వృక్షశాఖలయందు రొదసేయుచును విరహోద్రేకమును గలుగఁ జేయుచున్న కీరకిన్నరపక్షిమిథునము మొదలయినవాని, శుక్తిమతియందలి మోహాతిరేకముచేత డగ్గుత్తికపడి పలికెడు తనపలుకులో యన్నట్టులుగానున్న దొర్లిపడు రాళ్ళచప్పుడులచేత బెదరుకొని పైకెగిరిపోవునట్లు చేసినవాఁడనుట. ఇక్కడ శిలాపతనజాత ఘుమఘుమార్భటికిని బక్షులకును బ్రతికూలమని తెలియవలయును. అలం. ఉత్ప్రేక్ష.

తనయహార్యభావగౌరవంబు=తనయొక్క పర్వతభావముచేతనైన దుర్భరత్వము నని యర్థము. (ని. 'అహా ర్యధర పర్వతాః' అని అ.) హరింపఁదగినది హార్యము, హార్యముగానిది యహార్యము. అనఁగా సజాతీయములచేతఁ దిరస్కరింపఁబడని దనుట. ఈవిధమయిన దని భావము. దానియొక్క గౌరవ మనఁగా నతిశయము. (ని. 'సజాతీయై ర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్, యావ ద్రసం వర్తమాన స్థాయీభావ ఉదాహృతః' అని యున్నది గనుక స్థాయిభావమని యర్థాంతరము.) కల్లోలినీ=శుక్తిమతీనదియొక్క, రయ=ప్రవాహవేగముయొక్క, నివారణంబును=నివారకమయినదియును, కామోపభోగసమయ=సంభోగకాలమునకు, సముచిత=అర్హమయిన, విజనతాకారణంబును=ఏకాంత స్థితికి హేతువైనదియును, కందర్పబల=మన్మథబలముయొక్క, సంబాధ=సమ్మర్దమువలననైన, బాధా=వ్యథకు, అవధీరణంబును=తిరస్కారకమయినదియును, కాఁగన్=అవుచుండఁగా, మాటిమాటికిన్=సారెసారెకును, మాటములంబాటింపుమని=కలయికలయందు మన్నింపుమని, అబ్బోటిపదంబులం బడిన వడువునన్=ఆశుక్తిమతియొక్క పాదములయందుఁ బడినటులుగా, అడుగున వ్రాలి=జలాధఃప్రదేశము

నందుప్రాలి, అడుగనఁగాఁ బాదంబు గనుక నిక్కడ చమత్కారము గ్రహింపవలయును. అడ్డగించి యలముకొని=నిరోధించికౌఁగిలించుకొని, చెంగల్వతావులుచెదర వేణిఁదెమలించుచున్=చెంగల్వపువ్వుల వాసనలు చెదరిపోవునట్లుగా జడఁబట్టి కదలించి యని యర్థము. (గీ. 'ఎనఁగఁ జెందొగ చెంగల్వ యెఱ్ఱకలువ, యనఁగ రక్తోత్పలంబు' అని యాంధ్రనామసంగ్రహము.) చెంగల్వలుండెడు స్థలములు నలిగిపోవునటులుగాఁ బ్రవాహము పారఁజేసినాఁడని యర్థాంతరము. అలం. శ్లేషానుప్రాణితరూపకము.

మకరికలునులియన్=మకరికాపత్రరచనలు చెదరిపోవునటులుగా, గండపాళికలనొక్కుచున్=చెక్కులు నొక్కుచు నని యర్థము. మొసళ్లు లొత్తుడుపడునటులుగా గండశిలల నొక్కినాఁడని యర్థాంతరము. మధురామృతంబువడయం బలుదెరసొబగులానుచున్=అనఁగా మధురమయిన సుధారసప్రాప్తికొఱకు నధరపానము చేయుచును అని యర్థము. పలుతెరయనఁగా దంతాంశుక శబ్దార్థము. ఇక్కడఁ దత్పురుషసమాసము. మధురామృతమనఁగా మధురజలంబును, ఆజలము లభింపఁజేసికొనుకొఱకుఁ బలుదెరసొబగులానుచు ననఁగా బహుప్రకారములైన తరంగములయొక్క సౌష్ఠవములను గ్రహించినాఁ డని యర్థాంతరము. ఇక్కడః గర్మధారయసమాసము. మౌక్తికంబులుజడియఁ బయోధరస్థలులటంచున్=ముత్యములు చిట్లిపడునటులుగాఁ గుచప్రదేశములంటుచు నని యర్థము. శుక్తిమతీ మౌక్తికంబులు చెదరునటులుగా జలధరస్థలములంటినాఁడని యర్థాంతరము.

అలం. శ్లేషమూలరూపకము.

విశదాంశుకాంతస్థితిదొరలంగ నతివిపులపులిన జఘనారోహంబుల నుత్పలపత్రంబులు నెరపుచున్-విశద=శుభ్రమయిన, అంశుక = వస్త్రముయొక్క, అంతస్థితి = లోపలనునికి, దొరలంగన్=కలుగునటులుగా, అతివిపుల=అత్యంతవిశాలమయిన, పులిన=ఇసుకదిన్నెలవంటి, జఘన=కటిస్థలముందలి, ఆరోహంబులన్=ఆరోహణములతోడ, ఉత్పలపత్రంబులు నెరపుచున్=ఉత్పలపత్రములనెడు నఖక్షతవిశేషములను సంఘటించుచు అని యర్థము.

ఉత్పలపత్రములనఁగా సంభోగకాలమున నితంబముపైఁ గూర్చునఖక్షతములు. 'భవే దుత్పల పత్రం తద్దళే స్త్రీనఖక్షతే' యని విశ్వము. 'కంఠేతు మణిమాలాస్యాత్ కపోలే చంద్రరేఖకా, నితంబే చోత్పలంపత్రం స్థానే శంఖపదం స్మృతం' అని రతిరహస్యము.

విశదాంశు=శుభ్రాంశుఁడైన చంద్రునియొక్కవతె, ని. 'విధు స్సుధాంశు శ్శుభ్రాంశురోషధీశో నిశాపతిః' అని అ. కాంత=రమ్యమయిన, స్థితి=ఉనికి, దొరలంగన్=కలుగునటులుగా, అతివిపుల=అతివిస్తృతమైన, పులినజఘన=జఘనసదృశమైన యిసుకదిన్నెలయందలి, ఆరోహంబులన్ = ఎక్కుటలచేత, ఉత్పలపత్రంబులనెరపుచున్=నల్లకలువఱేకులను వ్యాపింపఁజేయుచు నని యర్థాంతరము. తనివిలేక=తృప్తిదీరక, తద్దయున్=మిక్కిలియు, అగద్దరి=ధూర్తుఁడైన యా కోలాహలుఁడు, ఆముద్దరాలిన్=ఆశుక్తిమతిని, పెద్దయుంబ్రొద్దు = తడవుసేపు, నిరోధించుసమయంబునన్=అడ్డగించియున్న సమయమందు, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. అలం. పైనిదే.

తిర్యగాదిరతియు ననుభయనిష్ఠరతియునగు శుక్తిమతీకోలాహలుల సమాగమవర్ణనము రసాభాసమనియుఁ గావ్యమున వర్ణింపఁదగదనియుఁ జెప్పుచున్నారు. శృంగారానౌచిత్యలక్షణము.

శ్లో. "అనౌచిత్య ప్రబంధత్వే అభాసో రసభావయోః
ఉపనాయకసంస్థాయాం మునిగురుపత్నీ గతాయాంచ
బహునాయక విషయాయాం రతౌ తథానుభయనిష్టాయాం
ప్రతినాయకనిష్టత్వే తద్వదధమపాత్రతిర్యగాదిరతే
శృంగారేఽనౌచిత్యం..." సాహిత్యదర్పణము.

ఇది కథానాయక విషయికమైనదుష్టము. మూలకథలోని దగుటవలనను కథానాయకేతర మగుట వలనను గ్రాహ్యము.

ఉ. ఓవసుధామహేంద్ర కరుణోదధి యీతడ వేల ప్రోవ రా
వే వసుభూప యంచు నెలుఁగెత్తి వెసన్ మొఱ వెట్టుచాడ్పునన్
శైవలినీరవం బెసఁగె శైవలినీనినదంబుకన్న ము
న్నావిలభూరివారివిహగారవగౌరవ మెచ్చె నెల్లెడన్. 141

ఓవసుధామహేంద్ర=భూమిలోనింద్రు నివంటివాఁడవగు, కరుణోదధి=దయాసముద్రుఁడవగు నయినట్టి, వసుభూప = ఓవసుమహారాజా, ఇందులో వసుధామహేంద్ర యనెడు వసురాజవిశేషణము కోలాహలపర్వతభంజనము కర్తవ్యమను నభిప్రాయగర్భము. ఈతడవేల = ఈయాలస్యమెందుకు, ప్రోవరావే=రక్షించుకొఱకు నరుగుదేవే, అంచున్ = అని పలుకుచు, ఎలుఁగెత్తి=పెద్దగొంతుఁ జేసికొని, వెసన్మొఱవెట్టుచాడ్పునన్ = శీఘ్రముగా మొఱపెట్టుచున్నట్టులుగా, శైవలినీరవంబెసఁగెన్=శుక్తిమతీ నదియొక్కధ్వని యతిశయించెను, శైవలినీనినదంబుకన్న మున్ను = నదియొక్క ధ్వనికంటె ముందుగా, ఆవిల=కలఁకనొందిన, భూరి=అనేకములైన, వారివిహగ = జలపక్షులయొక్క, ఆరవ = ధ్వనులయొక్క, గౌరవము = అతిశయము, ఎల్లెడన్ = అన్నిదిక్కులయందును, ఎచ్చెన్ = అధికమాయెను. అలం. ఉత్ప్రేక్ష.

తా. ఓరాజేంద్రా! వసుభూపాలకా! ఆలస్యము చేయక నన్ను రక్షింపుము అని మొఱవెట్టు నటుల నదీఘోషము మిన్నుముట్టెను. అంతకుమున్నె జలపక్షులు సైతము కలఁత నొంది రొద చేయు చుండెను.

మ. కలగుం డై నెల వేది యిట్లు వరటాకారండవాదిద్విజా
వళి ఘోషించుటకన్న మున్న గిరిరాడ్వ్యావిద్ధకల్లోలినీ
సలిలోపప్లుతభూజను ల్నిజనివాసస్థేమసంశూన్యు లై
కలఁకన్ ఘూర్ణిలుఘోష మొక్క మొగి దిక్చక్రంబులం గ్రమ్మినన్. 142

కలగుండై=గజిబిజిపడి, నెలవేది=నివాసస్థలమువిడిచి, ఇట్లు=ఈప్రకారముగా, వరటా = ఆఁడు హంసలును, (ని. హంసస్యయోషి ద్వరటా అని అ.) కారండవ = కన్నెరేడుపక్షులును, ఆది = మొదలుగాఁగల, ద్విజ = పక్షులయొక్క, (ని. 'శకున్తి పక్షి శకుని శకున్త శకున ద్విజాః' అని అ.) ఆవళి=సమూహము, ఘోషించుటకన్న మున్న = రొదసేయుటకంటె ముందుగా, గిరిరాట్ = పర్వతాధీశ్వరుఁడైన కోలాహలునిచేత, వ్యావిద్ధ = మళ్ళింపఁబడిన, కల్లోలినీ = శుక్తిమతియొక్క, సలిల=ఉదకముచేత, ఉపప్లుత=ముంపఁబడిన, భూజనులు=భూమియందలి మనుజులు, నిజ=స్వకీయమైన, నివాస =

గృహములయందలి, క్షేమసంశూన్యులై = ఉనికిలేనివారై, కలఁకన్ = భయవిహ్వలత్వముచేత, ఘూర్ణిలుఁ=గుబ్బటిల్లునట్టి, ఘోషము=కోలాహలధ్వని, ఒక్కమొగిన్ = ఒక్కసారిగా, దిక్చక్రంబులం గ్రమ్మినన్=దిగ్వలయములయందు వ్యాపింపఁగా, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. అలం. శ్లేషమూలరూపకము.

శుక్తిమతీఘోషము వసురాజు వినినటులఁ జెప్పమికిఁ గారణము స్త్రీస్వరముగావున స్ఫుటముగా లేమియో అంతకెన్నియోరెట్లుగొప్పదియగు పక్షిసంఘఘోషము వినఁబడవలసినదిగాని నివాసశూన్యులగు జనులఘోషము దిక్చక్రము లాక్రమించుటచే వినరాదయ్యెను. సలిలోపప్లుతి జనక్షోభ గూర్చుటచే నన్నిటికంటె జనక్షోభమె మెండయ్యె ననిభావము. ఒక్కమొగి దిక్చక్రంబులన్ జనఘోషము పర్వె ననుటవలనఁ బ్రవాహ మన్నిదెసల వెల్లిగొనెనని యాశయము.

మ. విని యాఱంతు దురంతశైలమథనా॥విర్భూతసింధూద్ధత
ధ్వనియో కాక మహోదకప్రళయసం॥త్రాసంబు లోకాళిఁ బై
కొని కారించెనొ యీసుదుస్సహమహా॥కోలాహలోద్వృత్తి కే
మి నిమిత్తం బని భర్త లోకభరణో॥న్మేషంబు వాటింపఁగాన్. 143

విని=విన్నవాఁడై, ఆఱంతు = ఆరొద, దురంత = అంతములేని, శైల = మందరపర్వతముచేత, మథన=మథించుటవలన, ఆవిర్భూత = సంభవించిన, సింధు = సముద్రముయొక్క, ఉద్ధత = అతిశయమైన, ధ్వనియో = ఘోషమో, అని యర్థము. కోలాహలుని బాధవలన నావిర్భవించిన శుక్తిమతీధ్వనియని యర్థాంతరము. కాక = లేక, మహోదక=మహాజలమందలి, ప్రళయ = నాశనమునుగూర్చి వచ్చిన, సంత్రాసంబు = మహత్తరమయినభయము, లోకాళిన్ = జగజ్జాలమును, పైకొని = ఆక్రమించి, కారించెనో = బాధించెనో యని యర్థము. శుక్తిమతియొక్క మహోదకముసేయు ప్రళయమువలన వచ్చిన భయము జనసమూహము నాక్రమించి బాధించెనేమో యని యర్థాంతరము. సుదుస్సహ = మిక్కిలి సహింపనలవిగాని, మహత్ = అత్యధికమైన, కోలాహల = ఈకలకలధ్వనియొక్క, ఉద్వృత్తికిన్ = ఉద్రేకమునకు, ఏనిమిత్తంబు = ఏమిహేతువు అని యర్థము. కోలాహలుని యుద్వృత్తికేమినిమిత్తమని యర్థాంతరము. అని = ఈలాగని విచారించి, భర్త = ఆవసురాజు, లోకభరణోన్మేషంబువాటింపఁగన్ = జనసంరక్షణమందలి యుల్లాసముదయింపఁగా, ఇక్కడఁ గోలాహలపర్వతవృత్తాంతము దెలియని వసురాజుయొక్క వచనమందు శ్లేషభంగిచేతఁ దద్వృత్తాంతద్యోతకమైన సత్యవాక్యత్వము స్ఫురించుచున్నది. అలం. సమాసోక్తి.

తా. మందరపర్వతముతోఁ దఱచునాఁటి సముద్రధ్వనియో ప్రళయసంబంధమగు జనులయాక్రందనమో కాకున్న యీసహింపరాని కోలాహల విజృంభణమునకుఁ గారణ మేమై యుండునని వసురాజు లోకసంరక్షణోత్సాహియై యుండ-

క. నానాజనపదకటక, స్థానాశ్రయు లాక్షణంబ॥ చనుదెంచి వసు
క్ష్మానాథుఁ గాంచి పలికిరి, దీనానూనానులాప॥దీపితభయులై. 144

నానా=సమస్తమైన, జనపద = గ్రామములయొక్క, ని. 'జనే గ్రామే జనపదః' అని నా. కటక = పట్టణములయొక్కయు, స్థానాశ్రయులు = స్థలముల నాశ్రయించి యున్నవారు, అనఁగాఁ

గాపురమున్నవారు, ఆక్షణంబ=అప్పుడే, చనుదెంచి=వచ్చి, వసుక్ష్మానాథుఁ గాంచి=వసురాజునుజూచి, దీన=దైన్యముతోఁగూడిన, అనూన=అధికమయిన, అనులాప=మువూఁర్భాషణములచేత, అనఁగా నాడిన మాటలే యాడుటలచేత, దీపిత=ప్రకాశితమగుచున్న, భయులై=భయముగలవారై, పలికిరి=ఈప్రకారముగా వచించిరి. ఏమని యనిన, పల్లెలనుండియుఁ బట్టణములనుండియు వచ్చిన ప్రజలు వసురాజును గాంచి దీనాలాపములతో నిటులఁ బలికిరి.

సీ. ఇష్టకృత్యము నిర్వ♦హించుఁ గాని దినంబు శుచిమలీమసగతుల్ ♦ సూపవెఱచు
దాక్షిణ్యము వహించి ♦ తనరుఁగాని సదాగతి రజోభరభ్రాంతిఁ ♦ దిరుగ వెఱచు
జగతికిఁ దేజంబు♦సమకూర్చుఁగాని మిత్త్రుఁడు చండకరశక్తిఁ ♦ దోడర వెఱచుఁ
గొలుచునాయమె చూపి ♦ నిలుచుఁ గాని ధరిత్రి జీవనదంబు గర్జింప వెఱచు
తే. దేవ తావకకరుణాసు♦ధావిశేష, పోషితాశేషసద్వీప♦భూతలమున
నేఁటితుదకీక్షణంబున ♦ నాటుకొనిన, పాటుమదిఁ జిత్తగింపవే♦పార్థివేంద్ర. 145

దేవ=దేవరా, తావక=నీ సంబంధమైన, కరుణాసుధావిశేష=కృపయనెడు నమృతవిశేషముచేత, పోషిత=పోషింపఁబడిన, అశేష=సమస్తమయిన, సద్వీప=ద్వీపములతోఁ గూడుకొన్న, భూతలమునన్ = భూమియందు, అనఁగా నీవు పాలించుచున్న సప్తద్వీపములతోఁగూడిన ధరాతలమందనుట. శుచి=అగ్నిహోత్రుఁడని యర్థము. పరిశుద్ధుఁడని యర్థాంతరము. (ని. 'శుచి ర్గ్రీష్మాగ్ని శృఙ్గారే ష్వాషాఢే శుద్ధమన్త్రిణి, జ్యేష్ఠే చ పుంసి ధవళే శుద్ధే నుపహతే త్రిషు' అని మే.) దినంబున్ = ప్రతిదినమును, ఇష్టకృత్యమునిర్వహించుఁగాని = హితమయినకార్యమే చేయునుగాని, మలీమసగతుల్సూపవెఱచున్ = కుత్సితమార్గములను జూపవెఱచునని యర్థము. యజ్ఞకార్యమే నిర్వర్తించునుగాని గృహారణ్యాదుల కుపద్రవము సేయఁడని భావము. అనఁగాఁదా నిష్టకార్యనిర్వాహకుఁడును గృష్ణవర్త్ముఁడును గనుక గుణ మవలంబించి దుర్గుణము విడిచినాఁడనుట. (ని. 'ఇష్టమాశంసితే పిస్యా త్పూజితే ప్రేయసి త్రిషు' సప్తతన్త్రా పుమాన్ క్లీబే సంస్కారే క్రతుకర్మణి' అని మే.) సదాగతి=వాయువు అని యర్థము. శుభాగమనము గలవాఁడని యర్థాంతరము. దాక్షిణ్యమెవహించి=మోమోటమేవహించి, తనరుఁగాని=ఒప్పునుగాని, రజోభరభ్రాంతిఁ దిరుగవెఱచున్=రజోగుణప్రయుక్తమైన చాంచల్యముచేతఁ దిరుగఁడని యర్థము. దక్షిణదిగ్భవత్వము బొందియుండునుగాని, అనఁగా మలయమారుతమై యుండునుగాని సుడిగాలియై తిరుగఁడని భావము. మిత్త్రుఁడు=సూర్యుఁడని యర్థము. స్నేహితుఁడని యర్థాంతరము. (ని. 'మిత్త్రం సుహృది మిత్త్రోఽర్కః' అని అ. జగతికిన్=జగజ్జనులకు, తేజంబుసమకూర్చుఁగాని=జయప్రయుక్తమైన తేజమునే యిచ్చునుగాని, చండకరశక్తిఁ దోడరవెఱచున్=తీక్ష్ణమైన భుజశక్తిఁ జూపి నిర్జితులఁజేయఁడని యర్థము. అంధకారనివారణముచేసి ప్రకాశింపఁ జేయును గాని కిరణములవేఁడిమి చూపఁడని భావము.

జీవనదంబు=జలదమని యర్థము. జీవనప్రదాయకమని యర్థాంతరము. ని. 'జీవనం వర్తనే నీర ప్రాణ ధారణయోరపి' అని మే. ధరిత్రిన్=భూమియందు, కొలుచునాయమెచూపి నిలుచుఁగాని=కొలువుగొలిచెడుమర్యాదనే కనుపఱచి నిలుచునుగాని, గర్జింపవెఱచున్ = ప్రతిభటత్వముచేత ధిక్కరించి పలుక వెఱచునని యర్థము. కొలుచనఁగా ధాన్యము - ధాన్యసంపద గనుపడఁజేయుఁగాని వ్యర్థ

మఁగానుఋమదని భావము. గుణావలంబనమును దోషత్యాగమును నంతటను జెప్పవలయును. అనఁగా సన్న్యప్రభృతులు నీయొక్క రాజ్యములో స్వకీయశుచ్యాది సామానుగుణ్యముగా వర్తించినారనుట. ఈలాగునయుండఁగా, నేఁటితుదకున్ = ఈదినమువఱకు వెలచునని యన్వయము. ఈక్షణంబునన్ = ఈ సమయమునందు, నాటుకొనినపాటు=తగులుకొన్న యుపద్రవము, పార్థివేంద్ర = రాజాగ్రణీ, మదిఁ జిత్తగింపవే=మనసున్నన నవధరింపుము. (ని. 'అత్ర గుణావలమ్బనేన దోషపరిత్యాగేనచాగ్న్యాదే స్స్వకీయసామానుగుణ్య ప్రవృత్త్యానువర్ణనీయరాజప్రతాపాతిశయస్యగమ్యత్వా త్ప్రస్తుతాంకురాలంకారః' శ్లో- ప్రస్తుతే నాప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాంకుర' ఇతి లక్షణాత్,)

అలం. ప్రస్తుతాలంకారము.

తా. రాజా! నేఁటివఱకు నీపరిపాలనమున నెట్టికష్టము నెఱుంగక సురక్షితముగా నుంటిమి. నేఁటి కొక శ్రమ సంభవించెను. చిత్తగింపుము.

ఉ. అక్కట మిక్కుటంబగు రయంబున నెక్కడనుండి వచ్చెనో
యొక్కనగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట దిక్కటాహము
ల్పిక్కటిలంగఁ బెల్లున గుభిల్లున శుక్తిమతీస్రవంతి పే
రక్కున వ్రాలి యాఁగె భువనావళి నుద్భటవింధ్యవైఖరిన్. 146

అక్కట=అయ్యయో, మిక్కుటంబగు=అతిశయమైన, రయంబునన్ = వేగముచేత, ఎక్కడనుండి వచ్చెనో=ఏస్థలమునుండి విచ్చేసెనో, ఒక్కనగంబువచ్చి = ఒకపర్వతమువచ్చి, నినదోద్ధతిన్= ధ్వనితోఁగూడుకొన్న యొగుపుచేత, (ని. 'శబ్దే నినాద నినద ధ్వని ధ్వాన రవ స్వనాః' అని. అ.) ఒక్కటన్=ఏకకాలమందు, దిక్కటాహముల్పిక్కటిలంగన్=కటాహమనఁగాఁగర్పరము, అనఁగా ముండ బొచ్చె, అన్నిదిక్కులు పూర్ణీభవించినట్టులుగా, పెల్లునన్=ఉద్రేకముచేత, గుభిల్లునన్ = గుభిల్లుమనునట్లుగా, శుక్తిమతీస్రవంతి = శుక్తిమతీనదియొక్క, (ని. 'స్రవంతీ నిమ్నగాపగా' అని అ.) పేరక్కున వ్రాలి=విశాలమయిన ఱొమ్ముమీఁద వ్రాలి, భువనావళిన్ = లోకసమూహమునని వింధ్యగిరిపరమైన యర్థము. ఉద్భటు=హెచ్చైన, వింధ్యవైఖరిన్=వింధ్యపర్వతమువలె, భువనావళిన్=జలసమూహము నని కోలాహలపర్వతపరమైన యర్థము. ఆఁగెన్=అడ్డగించెను.

శైలము ఒక్కటన్ వ్రాలెననుటచే హఠాత్సంభవమగుటచే గుఱుతింపఁజాలమైతిమని యుఁగావుననే యీయాపదఁ దొలంగించుకొనలేకపోతిమనియు భావము. శుక్తిమతి పేరక్కున వ్రాలెననుటచే నదియందలి విశాలమగుప్రవాహభాగము నడియడ్డగింపుచే సర్వతోముఖముగ వెల్లువఁగొనె ననుట.

క. గోత్రాజనవిత్రాసద, గోత్రార్భటి కోర్వ లేక ఘూర్ణిలి నదియున్
మాత్రాతీతభయభ్రమ, పాత్రాశయ యగుచు ధాత్రిఁ బదపడి యలమెన్.

గోత్రాశబ్దము భూమియందును గోత్రశబ్దము పర్వతమందును వర్తించును (ని. 'గోత్రం నామ్ని కులే క్షేత్రే గోత్రా భువి గవాం గణే, గోత్ర శ్శైలే' అని నా.) గోత్రాజన=భూజనులకు, విత్రాసద=మిక్కిలి భయప్రదమైన, గోత్ర=కోలాహలాద్రియొక్క, ఆర్భటికిన్=ఆర్భాటమునకు, ఓర్వలేక=సహించలేక, ఘూర్ణిలి=గిరగిరఁదిరిగి, నదియున్ = శుక్తిమతీనదియును, మాత్రాతీత = మితిమీఱిన, భయ=భయంకరమగుచున్న, భ్రమ = సుడిగుండములకు, పాత్ర = భాజనమయిన, ఆశయ

యగుచుక్ = జలోపరప్రదేశములుగలిగినదై అని అర్థము. అతిమాత్రమైన భయభ్రమములకు భాజన మయిన మానసముగలదై అని అర్థాంతరము. ధాత్రిం బడపడి అలమెక్ = ధాత్రి అనఁగా భూమి యును దల్లియును, భూమిని బ్రత్యాసక్తిచేత నప్పళించెనని అర్థము. తల్లిని గౌఁగిలించుకొనె నని అర్థాంతరము. (ని. 'ధాత్రీ జన న్యామలకీ వసుమ త్యుపమాతృషు' అని వి.)

ఇక్కడ శుక్తిమతీనదియందు, భయగ్రస్తబాలికావ్యవహారారోపము చేసినాఁడని గ్రహింప వలయును. అనఁగా భూజనులకు భయప్రదమయిన కోలాహలపర్వతముయొక్క పటువేగమును సహింపఁజాలక శుక్తిమతీనది తిరుగుడుపడి వెల్లువపెట్టి భూమి నాచ్ఛాదించిన దని అర్థము. కఠినుఁడగు జారుఁడు బలవంతముగఁ బైకొనుటచేఁ దొట్రుపాటున శుక్తిమతి తల్లిని గౌఁగిలించుకొనెనని భావము. అలం. సమాసోక్తి.

ఉ. ఏ మని చెప్ప వచ్చు ధరణీశ్వర యాబలు సేగి తన్మహా
భూమిధరోపరోధమునఁ బొంగునభంగసరిజ్ఝరంబు పై
పై మహి యెల్ల నల్లుకొనఁ బల్విడి నం దనుబింబితాభ్రరే
ఖామహిమంబు గాన నగు గ్రక్కున మిన్నులు వడ్డకై వడిన్. 148

ధరణీశ్వర = వసుమహారాజా, ఆబలు సేగి = ప్రబలమైన యాకీడు, ఏమనిచెప్పవచ్చుక్ = ఎంతని చెప్పఁగూడును, అనఁగాఁ జెప్పనలవికాదనుట. ఏమనిన, తన్మహాభూమిధర = మహత్తరమయిన యా కోలాహలాద్రియొక్క, ఉపరోధమునక్ = అడ్డగింపుచేత, పొంగు = ఉప్పొంగిన, అభంగ = నిస్తరంగమయిన, సరిజ్ఝరంబు = నదీప్రవాహము, పైపైక్ = మీఁదమీఁద, మహియెల్లనల్లుకొనక్ = భూమినావత్తును వ్యాపింపఁగా, బల్విడిక్ = త్వరితముగా, అందుక్ = ఆవెల్లువయందు, అనుబింబిత = ప్రతిఫలించిన, అభ్రరేఖా = ఆకాశస్వరూపముయొక్క, (ని. 'నభ స్స్వర్గాంబుదే ష్వభ్రమ్' అని నా.) మహిమంబు = అతిశయము, మిన్నులువడ్డకైవడిక్ = ఆకాశమువచ్చి దానిలోఁ బడినట్టులుగా, కానసగుక్ = చూడనొప్పును. అనఁగా భూమియు నాకాశము నేకమైనట్టులుగా వెల్లివరదపెట్టినది గనుక నందువలన సంభవించిన యుపద్రవము చెప్ప నలవిగాదనుట. అలం. ఉత్ప్రేక్ష.

తా. రాజా! ఆమహాపర్వతమువలనఁ గలిగిన మహాపాయము నేమని విన్నవింపఁగలము. శైలా వరోధమునఁ బ్రవాహజలము భూమండలమునిండ నాక్రమించుటచే నందుఁ బ్రతిబింబితమగు నాకా శము మిన్నులు విఱిగి జలములోఁ బడినటులఁ గనఁబడుచున్నవి.

సీ. సర్వసర్వంసహాచక్రంబు జడ మయ్యె గ్రామముల్ భంగసంగతము లయ్యె
నాలయవ్రాతంబులవనశూన్యము లయ్యె సాలము ల్కాండ శేషంబు లయ్యె
వివిధజంతువితానవిహృతి వారిత మయ్యె వస్తుజాతము లెల్లవంక లయ్యె
నరలోక మెల్లఁ గంఠగతజీవన మయ్యెఁ గలమంబు లప్రాప్తఫలము లయ్యెఁ
తే. దోఁటచేనుకొటారంబువొడ్డియనెడు, నాసలన్నియు సిసుమంతలయ్యె స్వామి
పాదపద్మంబు లీక్షించుభాగ్యమునికిఁ, దప్పివచ్చితి మేము గోత్రాతలేంద్ర. 149

సర్వ = సమస్తమయిన, సర్వంసహాచక్రంబు = భూవలయము, జడమయ్యెక్ = స్తబ్ధమయ్యెను, అనఁగా నడఁగియున్నదాయెనని యర్థము. ఉదకమాయెనని యర్థాంతరము. గ్రామముల్భంగ

సంగతములయ్యెన్ = తోళ్ళన్నియుఁ పైకల్యముతోఁ గూడినవాయెనని యర్థము. తరంగసహితములాయెనని యర్థాంతరము. ఆలయవ్రాతంబులు = గృహసమూహములన్నియు, అవనశూన్యములయ్యెన్ = అవన మనఁగా రక్షణము. రక్షాశూన్యము లాయెనని యర్థము. వనమనఁగా నుదకము. వనశూన్యములు గానివి యవనశూన్యములు. అనఁగా జలయుక్తములాయె నని యర్థాంతరము. సాలముల్ = వృక్షములు, ని. 'అనోకహః కుట స్సాలః' అని అ. కాండశేషంబులయ్యెన్ = స్కంధశేషములాయెను, అనఁగాఁ గొమ్మలు విరిగి మోళ్ళయ్యెనని అర్థము. జలశేషములాయె నని అర్థాంతరము. వివిధ = నానా విధములయిన, జంతువితాన = ప్రాణిసమూహముయొక్క, విహృత = విహారము, వారితమయ్యెన్ = నివారింపఁబడిన దాయెనని అర్థము. సంజాతవారియయ్యె నని అర్థాంతరము. వస్తుజాలములెల్లన్ = సమస్తవస్తువులును, వంకలయ్యెన్ = నానావగీగతములాయెనని యర్థము. వంకరయనఁగా నదికిఁ బేరు గనుక వస్తువులన్నియు నదులై ప్రవహించెనని యర్థాంతరము. నరలోకమెల్లన్ = జనసమూహమంతయు, కంఠగతజీవనమయ్యెన్ = కంఠగతప్రాణమాయె నని యర్థము. జీవనమనఁగా జలము గనుకఁ గుత్తుకబంటినీరుగలదయ్యెనని యర్థాంతరము. కలమంబులు = వరిపైరులు, అప్రాప్తఫలములయ్యెన్= నష్టమయిన ఫలముగలవయ్యె నని యర్థము. అప్పులనఁగాఁ జలములు, జలప్రాప్తఫలములయ్యెను. అనఁగా జలప్రాప్తిచే మునిఁగిపోయెనని యర్థాంతరము. అ+ప్రాప్తము, అప్+ప్రాప్తము, అను రెండు విగ్రహములు అప్రాప్త యను శబ్దమునుండి గ్రహింపవలయును. (అచః పరస్యయరోర్ద్వేవాస్తోనత్వచి) యనుపాణిని సూత్రమువలన అప్ప్రాప్తయనురూపము సిద్ధించినను శ్లేషకార్యమునం దాద్విత్వము వికల్పమగును.

తోఁట చేను కొటారంబు దొడ్డి యనెడు = ఇదితోఁట ఇదిచేను ఇది కొటారు ఇదిదొడ్డి అనునట్టి, ఆసలన్నియున్ = ఆశలన్నియు, ఇసుమంతలయ్యెన్=కించిన్మాత్రములయ్యె నని యర్థము. స్వామి పాదపద్మంబు లీక్షించుభాగ్య మునికిన్ = దేవరవారి పాదారవిందదర్శనముచేసెడు భాగ్యముగలిగియున్నందున, గోత్రాతలేంద్ర = భూలోకదేవేంద్రుఁడవైన వసురాజాగ్రణీ, తప్పివచ్చితి మేము = మేమా యాపదకుఁదప్పి జీవముతో వచ్చినారము. ఇక్కడ రెండర్థములును బ్రకృతము లగుటవలనఁ బ్రకృతశ్లేషాలంకారము.

కోలాహలావరోధమున నది వెల్లివిరిసెను. మాసర్వస్వము నాశనమైనది. మీపదముల దర్శింపవలసిన ప్రాప్తముంటచే నెటులో బ్రతికివచ్చితిమని పౌరులు రాజున కెఱిఁగించిరి.

మ. అనుచున్ వారలు విన్నవించుటయు లోకానీకరక్షాకళా
కనదుత్సాహరసచ్ఛవిస్ఫురణమై కన్దోయిఁ గెంపెక్క దా
ర్కొన సుర్వీజనదైన్యభంజనఘనభ్రూభంగభంగివినూ
తనశక్రధ్వజ ముద్భవిల్ల ఖలగోత్రధ్వంసనోదగ్రుఁడై. 150

అనుచున్వారలు విన్నవించుటయున్ = పైఁ జెప్పినప్రకారము వారు విన్నపముసేయఁగా, లోకానీక = జనసమూహముయొక్క, రక్షాకళా = సంరక్షణమందు, కనత్ = ప్రకాశించుచున్న, ఉత్సాహరస = వీరరసస్థాయిభావమయిన యుత్సాహరసముయొక్క, ఛవి = అరుణవర్ణముయొక్క, స్ఫురణమై = స్ఫూర్తియో యన్నట్టులుగా, ఇక్కడ నుత్సాహము వీరరసమునకు స్థాయిభావము

గనుక వీరరసముయొక్క యరుణవర్ణమే యుత్సాహవర్ణమని తెలియవలయును. కన్దోయిన్ = నేత్రయుగళమందు, కట్టెఱ్ఱదారొక్కనన్ = కేవలరక్తిమ వ్యాపింపఁగా, ఊర్వీజన = భూజనముయొక్క, దైన్యభంజన = దీనత్వమును బోఁగొట్టుటయందు, ఘన = సాంద్రమయిన, భ్రూభంగభంగి = బొమముడియొక్క రీతియనెడు, నూతనశక్రధ్వజము = శక్రధ్వజమనఁగా చుత్సవకాలమందు వస్త్రము కట్టి నిలుపునట్టి ధ్వజముపేరు-అట్టి యభినవశక్రధ్వజము, ఉద్భవిల్లన్ = ఆవిర్భవింపఁగా-ఇంద్రధ్వజ రఘువంశమందుఁ జెప్పఁబడినది.

శ్లో. 'పురుహూత ధ్వజస్యేవ తస్యో న్నయనపఙ్క్తయః,
నవాభ్యుత్థాన దర్శిన్యో ననందు స్సప్రజాః ప్రజాః.'

ఖల=దుర్మార్గుఁడైన, గోత్ర = కోలాహలునియొక్క, ధ్వంసన = నశింపఁజేయుటయందు, ఉదగ్రుఁడై = ఉద్యుక్తుఁడై, ముందరిపద్యముతో నన్వయము.

కనులు కట్టెఱ్ఱదనము వహించి ధ్వజపటమువలె నున్నవనియుఁ గనుబొమలు ధ్వజదండములవలె నున్నవనియు భావము. ఇంద్రధ్వజము నెత్తునపుడు ప్రజలు శత్రుపరాజయప్రాప్తికిని శుభప్రాప్తికిని నిరీక్షించునటుల రాజు కనుబొమ్మలు ముడివైచి కనులెఱ్ఱఁజేయఁగాఁ గోలాహలబాధానివారణరూపమగు సంతోషము ననుభవించిరని భావము.

వీరరసము ఎఱ్ఱఁగానుండుననుట కవిసమయసిద్ధము గాన వీరరసస్థాయిభావమగు నుత్సాహము సైతము కట్టెఱ్ఱగాఁ జెప్పఁబడెను. వీరరస మెఱుపనుటకు-

అసతోపి నిబంధేనా నిబంధేనసతోపిచ,
నియమేనచ జాత్యాదేః కవీనాం సమయస్త్రిథా.

అసతోపి నిబంధోయథా—

రత్నాని యత్రకుత్రాద్రౌ హంసాస్స్వల్పజలాశయే,
... ... ... ...
శుక్లత్వం కీర్తిహాసాదౌ కార్ష్ణ్యం చాకీర్త్యఘాదిషు,
ప్రతాపే రక్తతోష్ణత్వే రక్తత్వం క్రోధరాగయోః. కవికల్పలత.

క. నరవరుఁ డభయం బొసఁగుచు, హరిరథనిరసనమనోరయంబున నరిగెం
గరిభరణకరణపరిణత, కరుణాపరిణాహి యగుజగత్పతిలీలన్. 151

నరవరుఁడు = వసురాజు, అభయంబొసఁగుచున్ = ప్రజలకభయప్రదానముచేయుచు, హరిరథ = విష్ణుదేవునిరథమైన గరుత్మంతుననిగాని లేక హరియనఁగా నింద్రుఁడు గనుక నింద్రరథమైన మేఘముననిగాని లేక హరియనఁగాఁ గుఱ్ఱముగనుకఁ గుఱ్ఱమే తురంగముగాఁగల వాయువుననిగాని లేక హరియనఁగా సూర్యుఁడు గనుక సూర్యరథముననిగాని నాలుగర్థములు చెప్పవచ్చును. (ని. 'హరి ర్యమానిలేన్ద్రేన్దు విష్ణు సింహాంశువాజిషు, శుకాహి కపిభేకేషు కపిలే చ...' నానా.) నిరసన=తిరస్కరించునట్టి, మనోరయంబునన్ = మనోవేగముచేత, అరిగెన్=కోలాహలపర్వతోత్పాటనార్థమై పోయెను.-ఎటులనిన, కరి=గజేంద్రునియొక్క, భరణకరణ=రక్షణచేయుట

యందు, పరిణత=సిద్ధమయిన, కరుణా=కృపయొక్క, పరిణాహి=విశాలతగలవాఁడు, అగు = అయినట్టి, జగత్పతిలీలన్ = నారాయణమూర్తివలె అరిగెనని యన్వయము. జగత్పతియన రాజునకు విష్ణువునకును నర్థమగును. కరిరక్షణమున విష్ణువు త్వరితగతి వెడలినట్టులఁ బ్రజారక్షణమున వసురాజు త్వరితగతి నేఁగెను. ఆర్తత్రాణపరాయణత్వమున వసురాజు శ్రీవిష్ణువువలె నప్రమత్తుఁడని భావము. మనోరయమున వసురాజేఁగెననుటచేఁ బ్రజాబాధానివారణరూపమగు క్రియాచరణమునకుఁ జూపు నుత్సాహము సూచితము. అలం. ఉపమ. శబ్దా. యమకము.

సీ. దశనశంబముల దు♦ర్ధరమహీధరకూటకోటి నుగ్గులు సేయు♦కుంజరములు
ఖురధూతగురుధూళి♦శరధిలీననగాళి గుట్టు ఘట్టించునా♦రట్టజములు
పటుచక్రచంక్రమా♦ర్భటిఁగొండ లవియించు సమిదభంగశతాంగ♦శతశతంబు
లెత్తు పడ్డమహాకు♦భృత్తుల నతులితధృతిఁ జిరికిఁ గొనఁ♦ధీరభటులు
తే. తడయ కప్పుడు పతివెంటఁ ♦ దవిలి నడువ
సమరుబృంహిత హేషిత♦ఘుమఘుమితభు
జాసమాస్ఫాలితంబులఁ♦జడికి నడికి
కులకుధరమండలము గలఁ♦గుండు వడియె. 152

దశన=దంతములనెడు, (ని. 'రదనా దశనా దంతాః' అని అ.) శంబములన్ = వజ్రాయుధములచేత, (ని. 'శతకోటి స్స్వరు శ్శంబో దంభోళి రశని ర్ద్వయోః' అని అ.) దుర్ధర = ధరింపశక్యము గాని, మహీధర = పర్వతములయొక్క, కూటకోటిన్ = శిఖరసమూహములను, నుగ్గులుసేయు = పొడిపొడిగాఁ జేయఁజాలిన, కుంజరములు=ఏనుఁగులును, ఏనుఁగులు శైలములదరిసి కోరాడుట సహజము. ఏనుఁగులదంతములు వజ్రాయుధములవలె నుంటచే శైలభేదనసమర్థములై యుండెనని భావము. (ని. 'మతఙ్గజో గజో నాగః కుఞ్జరో వారణః కరీ' అని అ.) ఖుర=గిట్టలచేత, (ని. 'శఫం క్లీబే ఖురః పుమాన్' అని అ.) ధూత = ఎగురఁగొట్టఁబడిన, గురు = అతిశయమయిన, ధూళిన్ = పరాగముచేత, శరధి=సముద్రమందు, లీన=డాగియున్న, నగాళి=పర్వతసముదాయముయొక్క, గుట్టుఘట్టించు = మర్మమును భేదించునట్టి, ఆరట్టజములు = ఆరట్టదేశసంభవములయిన గుఱ్ఱములును, అనఁగా నాగుఱ్ఱములగిట్టలవలన నెగసిన ధూళి సముద్రములోఁబడి నీళ్లనింకింపఁగా నీళ్ళలో డాగియున్న పర్వతములన్నియు బయిటఁబడుచున్నవని తాత్పర్యము. పటు=సమర్థమయిన, చక్ర=బండికండ్లయొక్క, చంక్రమార్భటిన్ = దూఁకుడువలనఁబుట్టిన ధ్వనిచేత, కొండలవియించు=పర్వతములను బ్రద్దలుసేయఁజాలిన, సమిత్=యుద్ధమందు, అభంగ=పరాజయములేని, శతాంగ = రథములయొక్క, శతశతంబులు = శతసహస్రములును అనఁగా నసంఖ్యములును, రథములు యుద్ధమునందు నభంగములనుటచే మిగుల దృఢతరముగా నిర్మింపఁబడినవనుట. కావుననే చంక్రమణములలోఁ జెడక కొండలనుగూడఁ బ్రతిధ్వనిరూపమున నవియించుచున్నవని భావము. శతశతములనుటచే రథము లసంఖ్యాకము లనియుఁ గోలాహల గర్వభంగసూచనముగఁ దోలుతఁ డాపె కొండల నవయించుచుంటవలన వసురాజురథబలసంపత్తి యనుపమానము నసంఖ్యమునని యాశయము. ఎత్తుపడ్డమహాకుభృత్తులన్ = లేవలేక యెత్తువడిన మహాపర్వతములను, అతులిత

ధృతిన్ = నిరుపమానమయిన స్థైర్యముచేత, చిక్కిరాడనని = గణనసేయని, ధరణీధరములు=స్థైర్యవంతులయిన కాలిబంట్లును, ఎత్తువడ్డమహాకుభృత్తులనన్నచోట పర్వతములురాజులు గూడ నన్నచోటనుండి లేవనేరవని భావము.

తడయక=జాగుసేయక, అప్పుడు=ఆసమయమందు, పతిపెంటన్ = వసురాజువెంబడిగా, తవిలి నడువన్=అంటినడువఁగా, అమరు=ఒప్పుచున్న, బృంహిత=ఘీంకారముల యొక్కయు, హేషిత= సకిలింపులయొక్కయు, (ని. 'అశ్వానాం హేషా హ్రేషా చ నిస్వనే' అని అ.) ఘుమఘుమిత= ఘుమఘుమధ్వనులయొక్క, భుజాసమాస్ఫాలితంబుల=భుజములయందుఁ జేసెడు మల్లచరచలయొక్కయు నని క్రమాలంకారము. జడిశిన్=అంతునను, అడిశి=భయపడి,కులధరమండలము = కులపర్వత సమూహము, కలుగుండువడియెన్=ఆకులత్వమును బొందెను. ఇందులకు, (ని. 'హస్త్యశ్వరథ పాదాతం సేనాఙ్గంస్యా చ్చతుష్టయమ్' అని అ.) చెప్పఁబడిన చతురంగబలమును జెప్పి చతురంగబలమునకును పర్వత నిర్భేదన నిపుణత్వము గలుగఁజెప్పినాఁడు గనుక ముందరఁజెప్పఁగల కోలాహలపర్వత నిర్భేదనము సూచింపఁబడినదని తెలియవలయును. ఇది ముద్రాలంకారము. (శ్లో. 'సూచ్యార్థ సూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః' అని లక్షణము.)

తా. వసురాజు కోలాహలుని దర్ప మడంచుటకుఁ జతురంగబలసహితుఁడై బయలుదేఱల సైన్య కలకలమునకుఁ గులశైలములు కలఁతనొందెను.

ఉ. అంత ననంతవేగభుజ•గాంతకుఁ డమ్మహికాంతుఁ డాశ్రిత
స్వాంతము సంతసిల్ల సుర•చారణసన్నుతి పర్వ నవ్వనా
భ్యంతరరోధకం బగుమ•హాద్రి నఖంబున మీఁటె నభ్రవి
భ్రాంతముగాఁగ దుందుభిక•బంధము మీఁటినరాముకై వడిన్. 153

అంతన్=అంతట, అనంత=అపరిమితమయిన, వేగ=గమనత్వరయందు, భుజగాంతకుఁడు=గరుత్మంతుఁడైన యని రాజపరమయిన యర్థము. అనంతవేగముగల్గిన వాహనభుజగాంతకుఁడు గలవాఁడని శ్రీరామపరమయిన యర్థము. అమ్మహికాంతుఁడు=ఆవసురాజని యర్థము. విష్ణుదేవుఁడని యర్థాంతరము. ఆశ్రితస్వాంతము సంతసిల్లన్ = ఆశ్రితజనహృదయములు సంతోషింపఁగా నని యర్థము. ఆశ్రయించిన సుగ్రీవుని హృదయము సంతోషింపఁగా నని యర్థాంతరము. సురచారణసన్నుతిపర్వన్= దేవతలయొక్కయుఁ జారణులయొక్కయు స్తోత్రము వ్యాపింపఁగా, అవ్వనాభ్యంతరరోధకం బగు= వనమనఁగా నుదకంబును నరణ్యంబును, (ని. 'వనే సలిల కాననే'అని అ.) ఆశుక్తిమతీజలాభ్యంతరమున కవరోధకమయిన, అనఁగా జలముల కడ్డకట్టయిన యని యర్థము. అరణ్యమున కడ్డకట్టయిన యని యర్థాంతరము. మహాద్రిన్=మహత్తయిన కోలాహలపర్వతమును, అభ్రవిభ్రాంతముగాఁగన్= మింటికెగసి తిరుగునట్లులుగా, దుందుభియనెడు రాక్షసునియొక్క, కబంధమున్ = మొండెమును, మీఁటిన=చిమ్మిన, రాముకైవడిన్ = రఘురామునివలె, నఖంబునమీఁటెన్ = కాలిబొటనవ్రేలిగోటిచేతఁ జిమ్మినవాఁడాయెను. అలం. శ్లేషానుప్రాణితమగు నుపమ.

తా. వనాంతరసంచారమున కాటంకముఁ గలుగఁజేయు దుందుభికాయమును శ్రీరాముఁడు బొటనవ్రేలుతో దూరముచిమ్మినటుల నదీజలమునకు నిరోధము కలిగించిన కోలాహలపర్వతమును

వసురాజుమింటికెగసి తిరుగనటుల నెగఁజిమ్మెను. సురలు సంతోషించిరి. ప్రజలందఱు వసురాజుచేసిన పనికి మిగుల నానందించిరి.

క. వసురా జయ్యెడ బలవ, ద్విసృమరపాదప్రసారదీర్ణాచలుఁడై
యెసఁగఁగ వసుధాపరికీ, ర్ణసరిన్నిర్ఝరము తత్క్షణంబునఁ దిగిచెన్. 154

వసురాజు=వసుభూపాలుఁడని యర్థము. రశ్మిపటలమునకు రాజైన సూర్యుఁడని యర్థాంతరము. అయ్యెడన్=ఆసమయమందు, బలవత్=బలిష్ఠమయిన, విసృమర=వ్యాపనశీలమయిన, పాద=చరణముయొక్క, ప్రసార=విక్షేపణముచేత, అనఁగా జిమ్ముటచేత, దీర్ణ=బ్రద్దలుగాఁజేయఁబడిన, అచలుఁడై=కోలాహలపర్వతముగలవాఁడయి యని రాజపరమయిన యర్థము. బలవత్=బలిష్ఠమయిన, విసృమర=వ్యాపనశీలమయిన, పాదప్రసార=కిరణప్రసారణముచేత, (ని. 'పాదారశ్మ్యఙ్ఘ్రి తుర్యాంశాః' అని అ.) దీర్ణ=నెరియలు విచ్చునట్టులుగాఁ జేయఁబడిన, అచలుఁడయి=అచలయనఁగా భూమి, భూమిగలవాఁడై యని సూర్యపరమయిన యర్థము. ఎసఁగఁగన్=ఒప్పుచుండఁగా, వసుధా=భూభాగమందు, పరికీర్ణ=వ్యాపించిన, సరిత్=శుక్తిమతీనదియొక్క, నిర్ఝరము=ప్రవాహము, తత్క్షణంబునన్=ఆక్షణమందే, దిగిచెన్=తీసిపోయెనని యర్థము. భూచక్రవ్యాపిరైన నానానదీప్రవాహము తీసిపోయెనని యర్థాంతరము. ఇక్కడఁ బ్రాచీనులు శబ్దశక్తిమూలధ్వనియనియు నవీనులు ప్రకృతాప్రకృత శ్లేషాలంకార మనియును జెప్పినారు.

వసురాజు పాదప్రసారమువలనఁ గోలాహలుని యవయవములు నలినలియయ్యెననియు భూమియంతయు వెల్లివిరిసిన శుక్తిమతీప్రవాహము వెంటనే తీసెననియుఁ బ్రకృతార్థము. సూర్యుఁడు తనవేఁడికిరణములఁ బ్రసరింపఁజేయ భూమి నెఱియలు బాఱెననియు నదీప్రవాహములన్నియుఁ దీసెననియు నర్థాంతరము.

శా. ముక్కల్ వోయినతెక్కముక్కగమితోఁ మూర్ఛాలసత్వంబుతోఁ
జిక్కుల్ వడ్డలతాద్రుమావళులతోఁ శీర్ణోపలశ్రేణితో
నక్కోలాహల ముర్విఁ ద్రాలియును నెయ్యం బొప్ప నయ్యేటికే
గ్రుక్కిళ్ళు మ్రింగుచు నుండె నండనె వసుక్షోణీధవత్రస్తమై. 155

ముక్కల్వోయిన = తునుకలయిన, తెక్కముక్కగమితోన్ = మొలకలవంటి తెక్కల గుంపులతోడను, మూర్ఛాలసత్వంబుతోన్ = మూర్ఛవలనఁబుట్టిన దుర్బలత్వముతోడను, చిక్కుల్వడ్డలతాద్రుమావళులతోన్=వ్యత్యాసముగాఁ బెనుచుకొన్న తీఁగెలయొక్కయుఁ జెట్లయొక్కయు సమూహములతోడను, శీర్ణ=జారిన, ఉపల=పాషాణములయొక్క, శ్రేణితోన్=సమూహముతోడను, ఆకోలాహలము=ఆకోలాహలపర్వతము, ఉర్విఁద్రాలియును=భూమిమీఁద నొరఁగియును. నెయ్యంబొప్పన్ = ప్రేమయొప్పఁగా, అయ్యేటికే = ఆశుక్తిమతినిమిత్తమే, గ్రుక్కిళ్ళు మ్రింగుచున్=గుటకలుమ్రింగుచు, వసుక్షోణీధవత్రస్తమై = వసురాజుచేత భయపెట్టఁబడినదై, అండనె = సమీపమందే, ఉండెన్ = నిలిచియుండెను.

బహువచనంబు పరంబగునపుడాదేశంబగు ద్విత్వరూపక ళవర్ణకోకారము క్రియాపదములు పరంబగునపుడు ఉకారలోపము నొందుట కవిప్రయోగములందు దఱచుగాఁ గానవచ్చెడిని. 'వసివాళ్వాడుచువచ్చుచున్నయది కర్ణాటాంగనంగంటిరే' వీథినాటకము. 'ఇటులె గ్రుక్కిళ్లు+మ్రింగు

అనుచో గ్రుక్కిళ్ + మ్రింగుననురూపమును రామరాజభూషణుఁడు గ్రహించెను. ప్రయోగములను బట్టిచూడ నీరూపము సాధువు.

తా. వసురాజు కాలితో నెగఁజిమ్మబిట్టెగసిపడుటవలన కోలాహలునిచెక్కులు తునుకలయ్యెను. మూర్ఛజనించెను. తీఁగలు వృక్షములు తలక్రిందయ్యెను. జాస్లజాఱెను. ఇటులాగిరిపడియుఁ ప్రేమ వశమున శుక్తిమతిగొఱకె గ్రుక్కలుమ్రింగుచు వసుభూపతికి భయపడి పడియుండెను.

ఉ. పోటనబంతి మీటుగతి • భూవరుఁ డంఘ్రినఖాంచలంబునన్
మీటిన గట్టు బిట్టెగసి • మేదిని వ్రాలుఘనస్వనంబునన్
హాటకశైలకూటకట•కాళిఁ బ్రతిధ్వని పర్వె నా నభో
వాటి నెసంగె నంత సుర•వారవధూమురవారవార్భటుల్. 156

పోటనబంతిమీటుగతిన్ = పూలచెండు నెగమీటినట్టులఁగా, భూవరుఁడు = వసురాజు, అంఘ్రినఖాంచలంబునన్ = కాలిగోటికొనచేత, మీటినన్ = ఎగమీటఁగా, గట్టు = కోలాహలాద్రి, బిట్టెగసి = మిక్కిలియు నెగసినదై, మేదినివ్రాలుఘనస్వనంబునన్ = భూమిమీఁదఁబడెడుసమయమం దైన గొప్పధ్వనిచేత, హాటకశైల = మేరుపర్వతముయొక్క, కూట = శిఖరములయొక్క, కటక=చరుల యొక్కయు, (ని. 'కటకో స్త్రీ నితంబోద్రేః' అని అ.) ఆళి = సమూహమందు, ప్రతిధ్వనిపర్వెనాన్ = మాఱుమ్రోఁత పుట్టినదో యన్నట్టులుగా, అంతన్ = ఆమీఁదట, సురవారవధూ = దేవతావేశ్యల యొక్క, అనఁగా రంభాదులయొక్క, మురవ = మృదంగములయొక్క, ఆరవ = ధ్వనియొక్క, (ని. 'ఆరవా రావ సంరావ విరావాః' అని అ.) ఆర్భటులు = ఆర్భాటములు, నభోవాటినెసంగెన్ =గగనా వరణమందు నతిశయించెను. అలం. ఉత్ప్రేక్ష.

వసురాజు నఖాంచలమున బంతిని మీటినటుల శైలమును మీటుటవలన వసురాజుబలాతిశ యము సూచితము. సామాన్యపర్వతము కాదు కావున ఘనస్వనముకలుగుటయు నాధ్వని మేరుపర్వతపు గుహలయందు మాఱుమ్రోఁగుటయు జరిగెను. దీనిచే శైలోన్నతి వైశాల్యము సూచితము. దేవకాంత లానందించిమంగళవాద్యములు మ్రోఁగించిరనుటవలన మేరుశైలవిహారిణులగునచ్చర లాధ్వని నాలించి రనిభావము. మేరువు సురాలయముగావున శైలపతనధ్వని శిఖరముల చరియలలోనుండి యాలించిరని భావము.

క. నా విని పరమాద్భుతకల, నావినివేశమున మించి • నవముని యవధా
నావళితనేత్రుఁడై చెలి, నావలికథఁ దెలుపు మనియె • నధికప్రీతిన్. 157

నా విని = ఇట్లుమంజువాణిచెప్పఁగా నాలకించి, పరమ=ఉత్కృష్టమయిన, అద్భుతకలనా = ఆశ్చర్యసంపదయొక్క, వినివేశమునన్ = ఆవేశముచేత, మించి = అతిశయించి, నవముని=వేషధారి యైన నూతనయతి, అవధాన = అప్రమత్తతచేత, ఆవళిత = వికసితములైన, నేత్రుఁడయి = కన్నులు గలవాఁడయి-అనఁగా వినుటయందలి యత్యాదరముచేతఁ గన్నులు లెస్సగాఁ దెఱచి చూచుచున్న వాఁ డయి యనుట. చెలిన్ =మంజువాణిని, అధికప్రీతిన్ =అత్యంతప్రేమచేత, ఆవలికథఁ దెలుపుమనియెన్ = తరువాతికథ చెప్పు మని యడిగినవాఁ డాయెను.

ఆశ్వాసాంతము.

శా. వర్షిష్ఠప్రతిభాపరాశర శర స్వర్ధేనువాణీసుధా
వార్ధిస్పర్ధియశోధురంధర ధర ధ్వంసిస్వరుశ్రీమహా
దోర్ధామర్ధివిశేషభాసుర సుర స్తోమస్తుతాజిక్షమా
దుర్ధర్షధ్వజినీసముత్కర కరాఘాతేందు ధారాధరా. 158

వర్షిష్ఠ = వర్షనశీలమయిన, ప్రతిభా = అప్పటప్పటికి వికాసముచేత నొప్పెడుబుద్ధియందు, పరాశర = పరాశరమునివైనవాఁడా, శర = జెల్లుతోడను, స్వర్ధేను = కామధేనువుతోడను, వాణీ=సరస్వతితోడను, సుధావార్ధి = క్షీరసముద్రముతోడను, స్పర్ధి = వివాదము గలిగియుండెడు, యశోధురంధర=కీర్తిభారమును వహించినవాఁడా యనియర్థము. ధరధ్వంసి = పర్వతగర్వహారుఁడైన మహేంద్రునియొక్క, స్వరు = వజ్రాయుధసమానమయిన, (ని. 'శతకోటిస్స్వరు శ్శంబః' అని అ.) శ్రీ=శోభాయుక్తమయిన, మహత్ = అత్యధికమయిన, దోర్ధామ = బాహుప్రతాపముయొక్క, ఋద్ధి విశేష = సమృద్ధివిశేషముచేత, భాసుర = ప్రకాశించుచున్నవాఁడా, సురస్తోమ = దేవతాసమూహము చేత, స్తుత = స్తోత్రముచేయఁబడిన, ఆజిక్షమా = యుద్ధభూమియందు, దుర్ధర్ష = జయింపఁగూడని, ధ్వజినీ = సేనలయొక్క, (ని. 'ధ్వజినీ వాహినీ సేనా' అని అ.) సముత్కర=సమూహము గలవాఁడా, కరాఘాత = కరాగ్రదానమహిమచేత నిరసింపఁబడిన, ఇందు=చంద్రుఁడును, ధారాధర=మేఘములును గలవాఁడా, అని కృతినాయకునిఁ గూర్చి సంబోధనము.

క. లజ్జావతీమనోజ దళజ్జాతిసుగంధిగుణ కళానళినీఖే
లజ్జాలపాద సమరమి, ళజ్జాంగలఖానహాలహల త్రిపురహరా. 159

లజ్జావతీ = స్త్రీలకు, మనోజ = మన్మథుఁడవైనవాఁడా, దళత్ = వికసించుచున్న, జాతి = జాజిపువ్వులవలె, సుగంధి = పరిమళించుచున్న, గుణ = సుగుణములు గలవాఁడా, కళా=విద్యలనెడు, నళినీ=తామరతీఁగెలయందు, ఖేలత్ = క్రీడించుచున్న, జాలపాద = రాజహంసవైనవాఁడా, సమర= యుద్ధమందు, మిళత్=తారసించిన, జాంగలఖాన=జాంగలదేశాధిపుఁడైన మ్లేచ్ఛుఁడనెడు, హాలహల= కాలకూటమునకు, త్రిపురహరా = రుద్రుండవైనవాఁడా, అనఁగా రుద్రుఁడు కాలకూటమును హరించినట్టుగా జాంగలప్రభువును సంహరించినవాఁడా యనుట.

పంచచామరము.

వరాహవావదాతవాహ వాహరాజగర్వశా
ర్వరాహరీశ దోర్విటంక వజ్రపీఠలాలితో
ర్వరా హరీశవైభవాభి రామభూమభూమహా
వరాహ వారణాధిరాజ వారిరాశిమందరా. 160

వర = శ్రేష్ఠమైన, ఆహవ=యుద్ధమందు, అవదాతవాహ=శ్వేతవాహుఁడవైనవాఁడా, అనఁగా అర్జునుఁడవైనవాఁడాయనుట. వాహరాజ = అశ్వపతియొక్క, గర్వ=దర్పమనెడు, శార్వర=అంధకారమునకు, అహరీశ = సూర్యుఁడవైనవాఁడా యనుట, దోర్విటంక=భుజప్రదేశమనెడు, వజ్రపీఠ=వజ్ర

పీఠమందు, లాలిత=లాలనముచేయఁబడిన, ఉర్వరా=భూమిఁగలవాఁడా, హరీశ = హరిహరులయొక్క, వైభవ=ఐశ్వర్యమువంటి ఐశ్వర్యముచేత, అభిరామ = ఒప్పుచున్న, భూమ=మహత్త్వము కలవాఁడా, భూ = భూచక్రమునకు, మహావరాహ = ఆదివరాహమవైనవాఁడా, అనఁగా ఉద్ధారకుఁడవైనవాఁడా యనుట. వారణాధిరాజ=గజపతియనెడు, వారిరాశి=సముద్రమునకు, మందరా = మందరపర్వతమవైన వాఁడా, అనఁగా గజపతిని మథించినవాఁడా యనుట.

గద్యము. ఇది శ్రీరామచంద్రచరణారవిందవందనపవననందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకష చతుర్విధకవితానిర్వాహకసాహిత్య రసపోషణరామరాజభూషణప్రణీతం బైనవసుచరిత్రం బనుమహాప్రబంధంబు నందు ద్వితీయాశ్వాసము.

ఇది శ్రీమదాత్రేయకులకలశాంభోనిధిసంపూర్ణసోమసోమాభిధానమంత్రి వరపౌత్రుఁడును సోమ సుతసిద్ధేశ్వరమంత్రీశ్వరపుత్త్రుఁడును శ్రీమత్పార్వతీరాజేశ్వరవరప్రసాదసమాసాదితవ్యాఖ్యానపద్యనిఖిల విద్యావిశారదుండును నగుసోమకవిచేత విరచితం బయినవిద్వజ్జనరంజనినామకప్రతిపదటీకాసహితం బగు వసుచరిత్రనామకాంధ్రకావ్యరత్నవ్యాఖ్యానమునందలి ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు

# వసుచరిత్రము, సవ్యాఖ్యానము

## తృతీయాశ్వాసము



శ్రీక్షితిరక్షాదక్షణ
వీక్షాదక్షిణభుజాగ్ర వివిధారిపురీ
శిక్షణఫాలేక్షణ శుభ
లక్షణధౌరేయ తిరుమలమహారాయా. 1

శ్రీ=లక్ష్మీదేవియొక్కయు, క్షితి=భూదేవియొక్కయు, రక్షా=రక్షణమందు, దక్షణ=సమర్థమైన, వీక్షా = వీక్షణంబును, దక్షిణభుజాగ్ర = కుడిభుజముయొక్క యగ్రభాగంబునుగలవాఁడా, యథాసంఖ్యాలంకారము. అనఁగాఁ జూపులయందు మహాలక్ష్మియును భుజాగ్రమందు భూమియును గలవాఁడాయనుట. వివిధారిపురీ=సమస్త శత్రురాజ పట్టణములనెడి త్రిపురములయొక్క, శిక్షణ = శిక్షించుట యందు, ఫాలేక్షణ = లలాటేక్షణముగల రుద్రుఁడవైనవాఁడా, విరోధిపురములను దహనముగావించిన వాఁడా యనుట. శుభలక్షణధౌరేయ = శుభప్రదములయిన సాముద్రికలక్షణములను ధరించినవాఁడా, తిరుమలమహారాయా=తిరుమలమహారాయరాజాగ్రణీ-అని కృతిపతింగూర్చి సంబోధనము. దీనఁ బద్యపాదాంత్యానుప్రాసము చెప్పంబడియెను.

తే. అవధరింపుము శౌనకాద్యఖిలసన్ము
నీంద్రులకు రోమహర్షణి యిట్లు వలుకు
మఱియు నమ్మాయతపసితో మంజువాణి
మంజువాణీవిలాససంపదల ననియె. 2

అవధరింపుము = చిత్తగింపుము, శౌనకాద్యఖిలసన్మునీంద్రులకున్ = శౌనకుఁడు మొదలుగాఁగల సమస్తమునిశ్రేష్ఠులకును, రోమహర్షణి = రోమహర్షణపుత్రుఁడయిన సూతుఁడు, ఇట్లువలుకున్ = ఈ వక్ష్యమాణప్రకారముగా వచించెను. ఏమనియనిన, మఱియున్ =మరల, అమ్మాయతపసితోన్ = ఆకపట సన్యాసితోఁడ, మంజువాణి = మంజువాణియనెడు గిరికాదేవియొక్క చెలికత్తియ, మంజు = మనోహరమయిన, వాణీవిలాస=వాగ్విలాసముయొక్క, సంపదలన్ =సమృద్ధులచేత, అనియెన్ = పలికెను. మంజువాణిగావున నే మనోహరములగు వాగ్విలాససంపదలొప్ప భాషింపఁగల్గెనని భావము.

క. మందారవర్షవర్ధన, బృందారకబృందదుందుభిధ్వని గర్జా
సందోహ మపుడు నృపజయ, నందితశక్రోపసర్పణం బెఱిఁగించెన్. 3

మందారవర్షవర్ధన = పారిజాతకుసుమవర్షమును వృద్ధిఁబొందించునట్టి, బృందారకబృందదుందుభిధ్వని - బృందారకబృంద = దేవసమూహములయొక్క, దుందుభి = దుందుభులయొక్క, ధ్వని =

చప్పుడు, నృప=వసురాజుయొక్క, జయ = కోలాహలపర్వత భంజనరూపమయిన విజయముచేత, నందిత=సంతోషపెట్టఁబడిన, శక్ర = ఇంద్రునియొక్క, ఉపసర్పణం = సమీపించుటను=రాకను తెలియఁ జేసెను. అనఁగా వసురాజు కోలాహలపర్వతమును గోటమీటినసమయమందు పారిజాత పుష్ప వర్షము గురిసెననియును దేవదుందుభులు మ్రోసె ననియును అవి యింద్రుఁ డక్కడికి వచ్చుట సూచించె ననియును భావము.

వర్షము నభివృద్ధినొందించునవి యుఱుములెకాన దేవతలు మఱియు పూవులవానకు దేవతలు మ్రోఁగించు భేరులమ్రోఁతయే యుఱుములుగ నుండెను. వర్షసమయమున నుఱుములమ్రోఁత విశేషముగ నుండుగావున భేరులుమ్రోఁగించువారు బృందారకులు కారు. బృందారకబృందమని చెప్పఁబడెను. ఇది పాత్రప్రవేశ సూచనము. ఇంద్రుఁడు పర్వతగర్వభంజనుఁడు గానఁ దనవలెఁ బర్వతభంజన మొనరించిన వసురాజును గౌరవింప నరుగుదెంచెనని భావము.

సీ. గోత్రవర్గము పాదు•కొల్పిననయశాలి, కరమున శతకోటి•గలుగుమేటి
కల్యాణమయధామ•గరిమఁ గాంచినధన్యుఁ, డహితబలచ్ఛేది • యైనజోదు
భూరిసంపదఁ దల•పువ్వు వాడనిభోగి, వరసుధర్మావాప్తిఁ • బరఁగుసుకృతి
సకలభారము పూను•నైదోడు గలపెద్ద, విద్యాధరుల నేలు•వినుతకీర్తి
తే. వేయికన్నులవేల్పు భూ•విభుని మెచ్చి
యుచిత మగుపారితోషికం • బొసఁగ వచ్చె
ననలుఁ డర్కుఁడుఁ డసురేశుఁ • డబ్ధిరాజు
ననిలుఁ డర్థేశుఁ డలికలో•చనుఁడు గొలువ.

ఈపద్యమునందు రాజపరముగను దేవేంద్రపరముగను అర్థద్వయము గలదు.

గోత్రమనఁగాఁ గులంబును పర్వతంబును, (ని. 'గోత్రం కులే బలేనామ్ని గోత్రస్తు ధరణీధరే' అని వి.) గోత్రవర్గము = బ్రాహ్మణక్షత్రియాదికులసమూహమును, పాదుకొల్పిన=సంకరము కాకుండ స్వస్థానములయందు నిలిపిన, నయశాలి = నీతిశాలియనియర్థము, పర్వతసమూహమును టెక్కలు తెగఁగొట్టి స్వస్థానములయందు నిలిపినవాఁడని భావము. కరమున శతకోటి గలుగుమేటి=చేత ననేక కోట్లధనముగల గొప్పవాఁడని యర్థము, హస్తమందు వజ్రాయుధము గలవాఁడని భావము. కల్యాణ మనఁగా మంగళంబును - బంగారంబును, కల్యాణమయ=సకల మంగళరూపమైన, ధామ=గృహము యొక్క, గరిమఁగాంచిన ధన్యుఁడు = గౌరవమునుబొందిన కృతార్థుఁడని యర్థము. కల్యాణమయ= సువర్ణమయమైన మేరుపర్వతమే, ధామగరిమ గాంచినవాఁడు = గృహముగాఁగలవాఁడని గౌరవముఁ బొందినవాఁడని భావము. అహితబలచ్ఛేదియైనజోదు=శత్రుసైన్యచ్ఛేదియైన శూరుఁడని యర్థము, అహితుఁడైన బలాసురుని ఖండించినవాఁడని భావము. భూరిసంపదన్ = అధికసంపదచేత, తల పువ్వు వాడనిభోగి=తలనున్నపువ్వు వాడునంతమాత్రపు శ్రమమైనను లేనిభోగము గలవాఁడని యర్థము, అధి కైశ్వర్యముతోడ నెప్పుడును వాడకుండెడు పారిజాతపుష్పము తలను ధరించినవాఁడని భావము. వర= శ్రేష్ఠమైన, సుధర్మావాప్తిన్=శోభనమైన ధర్మప్రాప్తిచేత, పరఁగుసుకృతి=ప్రవర్తించెడు పుణ్యాత్ముఁడని యర్థము, శ్రేష్ఠమైన సుధర్మయను పేరిటి సభయొక్క ప్రాప్తిగలవాఁడని భావము. సకలభారముపూను

నైదోడుగల పెద్ద=సకలరాజ్యభారము వహించునట్టి తమ్ముఁడుగలవాఁడని యర్థము, సమస్తభువనభార ధురంధరుఁడైన యుపేంద్రుఁడు అనఁగా విష్ణుదేవుఁడు తమ్ముఁడుగాఁ గలవాఁడని భావము. విష్ణుదేవుఁడు దేవేంద్రునకుఁ దమ్ముఁ డౌనట్టులుగా నదితిగర్భమందు వామనుఁడై పుట్టుట ప్రసిద్ధము. విద్యాధరులనేలు వినుతకీర్తి=విద్యావంతుల నేలెడు నెన్నికకెక్కిన కీర్తిగలవాఁడని యర్థము. విద్యాధరులనెడు దేవ యోనుల నేలుచున్నవాఁడని భావము అత్ర తావదభేదాధ్యవసాయం వినా నఘటత ఇత్యతిశయోక్త్యను ప్రాణితకి కావ్యలింగాలంకారః.

వేయికన్నుల వేల్పు=సహస్రాక్షుఁడైన యింద్రుఁడు, భూవిభుని మెచ్చి=వసురాజును మెచ్చు కొన్నవాఁడై, ఉచితమగు=తగ్గినదైన, పారితోషికంబు=బహుమానమును, ఒసఁగవచ్చెన్ = ఇచ్చు నిమిత్తముగా వచ్చెను. ఏలాగునసిన, అనలుఁడు = అగ్నిహోత్రుఁడును, అర్కజుఁడు=యముఁడును, అసురేశుఁడు=నిరృతియును, అబ్ధిరాజు=వరుణుఁడును, అనిలుఁడు=వాయువును, అర్థేశుఁడు=కుబేరుఁ డును, అలికలోచనుఁడు=ఈశానుఁడును, కొలువన్ = పరివేష్టించికొలిచిరాఁగా-వచ్చెనని సంబంధము.

తా. వర్ణాశ్రమధర్మపాలకుఁడును వజ్రధారియు మేరుశైలవిహారియు బలాసురునిఁ జంపిన వాఁడును కల్పకుసుమములఁ దాల్చువాఁడును సుధర్మసభయందు మెలఁగువాఁడును ఉపేంద్రున కగ్రజుఁ డును విద్యాధరాదిదేవతలకు ఱేఁడునగు నింద్రుఁడు తక్కిన దిక్పాలకులు గొలువ వసురాజుదర్శనము నకు వచ్చెను.

తే. వచ్చి యభివాదన మొనర్చు♦వసునృపాలుఁ
గరము లాలించి కన్నులఁ ♦ గప్పికొని య
మందమందారమకరంద♦మధురవచన
రచన లిరవొందఁ బలికెఁ బు♦రందరుండు. 5

పురందరుండు = దేవేంద్రుఁడు, వచ్చి=విచ్చేసినవాఁడై, అభివాదన మొనర్చువసునృపాలున్ = తనకు నమస్కరించుచున్న వసురాజును, కరములాలించి = మిక్కిలి గారవించి, కన్నులఁగప్పికొని = ఇక్కడఁ గన్నులఁ బెట్టికొనియె నను లోకోక్తి ననుసరించి కన్నులఁ గప్పుకొని యని యర్థము, వేయి కన్నులు గలవాఁడుగనుక నాఁటగన వ్యాజముచేతఁ గన్నుల నలముకొని యని యర్థాంతరము. ఒడలి నిండఁ గనులుకలవాఁడు గావున వసురాజుప్రశస్తి విని సాదరము మెయి కాంచవచ్చినవాఁ డగుటచే వేయికనులు విప్పిచూచెనని భావము.

అమంద=అతిశయమైన, మందారమకరంద = పారిజాతపుష్పరసమువలె, మధుర = మనోహర మైన, వచనరచనలు=వాక్యగుంభనములు, ఇరవొందన్=ఒప్ప గా, పలికెన్=సంభాషించెను. ఏమని యనినఁ జెప్పుచున్నాఁడు.

కనులు విప్పుట యెదుటివానిని జూచుట యుత్సాహమునకు సూచనము. ఇటులె శృంగారనైషధ మునఁ జెప్పఁబడెను.

తే-గీ. ఇందుబింబాస్య నారాక కెదురుచూచు, నయనములు వేయు విరియించి నాకభర్త.
శృంగారనైషధము.

అలం. ఛేకోక్తి.

మ. వివిధోర్వీపతులన్ జగన్నుతుల మున్ • వీక్షింపమో వారిపెం
పు పరీక్షింపమొ నింపమో చెలిమి యే • భూపాలునం దైన నీ
భువనత్రాణపరాయణోద్భటభుజా • భూరిప్రభావంబు నీ
జవనాతిక్షీణబలంబుఁ గంటిమె వసు • క్ష్మామండలాఖండలా. 6

వసుక్ష్మామండలాఖండలా = భూమండలమున కింద్రుఁడవైన వసురాజా, జగన్నుతులన్ = జగజ్జనులచేత స్తోత్రము చేయఁబడిన, వివిధోర్వీపతులన్ = సమస్తభూపతులను, మున్వీక్షింపమో = ముందు చూచినవారము గామా, వారిపెంపుపరీక్షింపమొ = ఆరాజులయొక్క మాహాత్మ్యము విచారించినవారము గామా, నింపమోచెలిమి = వారియందు మైత్రి నిండించినాము గామా, అనఁగా వారియందు స్నేహభావ ముంచినా మనుట. ఏభూపాలునం దైనన్ = ఏరాజునం దైనను, ఈ = ఇటువంటి, భువనత్రాణ = భువనమనఁగా లోకంబును జలంబును గనుక లోకరక్షణమందనియర్థము, శుక్తిమతీజల రక్షణమందని యర్థాంతరము. పరాయణ = ఆసక్తి గలిగిన, ఉద్భట = ఉద్దండమయినయు, భుజా = భుజ సంబంధమయిన, భూరి = అతిశయమయినట్టి, ప్రభావంబున్ = సామర్థ్యమును, నీ = నీయొక్క, జవన = వేగ ముతోఁగూడుకొన్న, అతిక్షీణ = తక్కువగాని, బలంబున్ = పర్వతము నెగమీటుటయనెడిశరీరబలమును, కంటిమె = చూచినామా, అనఁగాఁ జూడలేదనుట.

పెంపుపరీక్షింపమొ యన్నచోట పెంపనెడుపదము జడవాచకము గనుక,

క. 'జంగమపదములు దక్క థిరం గలపదములు ద్వితీయప్రథమయును గు రా
జంగదము లూడ్చెఁ బతినా, త్సాంగదములు దాల్చె నా నుదాహరణంబుల్.'

అను లక్షణోక్తిచే నీద్వితీయకుఁ బ్రథమ వచ్చినది. దీనికిఁ బ్రమాణము. 'ఇతరత్రచద్వితీయాతస్యాః ప్రథమాచజడపదానాంస్యాత్' అని న.

క. 'శాసగఁగఁ బస్కొడునెడఁ బెం, పెసఁగిన ప్రథమాంతములపయిం గలసి కడుం
బసమీఱు క చ ట త ప లకు, గ స డ ద వ లొగిచి వచ్చుఁ గవిజనమిత్రా.'

అన్నందుచేతఁ బెంపనెడుపదముపైనున్న పరీక్షాశబ్దాదిమ పకారమునకు వకారము వచ్చినది. 'నవికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాంభవంతి గ స డ ద వాః' న. అను సూత్రముచేతఁ బెంపనెడు వికృతిశబ్దమునకంటెఁ బరమయిన సంస్కృతసమమయిన పరీక్షాశబ్దముయొక్క పకారమునకు వకారా దేశము రాదని విచారింపవలదు. ఎందువల్లననఁగా,

గీ. "సంధిగూర్పంగఁ బ్రథమాంతశబ్దవితతి, పైఁ గ చ ట త ప లకు వికల్పంబు సెల్లుఁ
గాకు సంబోధనావ్యయకర్మధార, యంబుల నచేతనంబుల నబ్దరాభ'."

అని యీ యర్థవిశేషములయందు సంస్కృతాసంస్కృత సాధారణ్యముచేతఁ జెప్పఁబడి యున్నది గనుక నచేతనార్థకమైన పెంపనెడు పదముపైనున్న పకారమునకు వకారాదేశము వచ్చి నది. ఉక్తార్థవిశేషములయందు వికల్పము చెప్పుటచేతఁ దక్కినస్థలములయందు నిత్యముగా రావలసి నప్పటికిని సర్వత్ర యతిస్థానమునందు రాదనియుఁ బ్రాసస్థానమందు వచ్చుననియును గ్రహింప వలయును.

క. 'భిన్నపదప్రథమలపై, నున్నపకారంబు వత్వ మొందును వరుసన్

మున్ని జరూపము ప్రాసము; నన్నవరూపంబుఁ దాల్చు నాళీకాక్షా.' అని
యాంధ్రభాషాభూషణము.

అని తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గ స డ ద వాదేశము వైకల్పికమని సాధించి యున్నాఁడు. సోమకవి తనవ్యాఖ్యలో 'చెంపు విరక్కించవలె' యనుపాఠమును జూపియున్నాఁడు. బహుగ్రంథములందుఁ జెంపు వరీక్షింపవలె యనుపాఠ ముంటవలన దానినే గ్రహించితిమి. ద్వితీయాశ్వాసములోని 25-వ పద్యముచెంత ఒకదన్ని యను పాఠసాధుత్వము విచారించుచుఁ దెనుఁగుల మీఁది సాంస్కృతికపరుషములకువచ్చు గ స డ ద వాదేశమునకుఁ బ్రయోగములిచ్చియుంటిమి. మహాకవిప్రయోగములందుఁ బ్రాసములందుమాత్ర మీప్రయోగము గనవచ్చెడిని. ప్రయోగాధారమును బట్టి యిది సాధువు. చిన్నయసూరి దీనిని నిషేధించెను.

ప్రపంచమున జగన్నుతు లగురాజులు లేకవోలేరు. వారు మాకుఁ జెలికాండ్రే గాని లోకములకు గాపాడఁదగిన మహాప్రభావముగాని అక్షీణమగు జనబలముగాని వారికి లేదు. నీవు భూలోకదేవేంద్రుఁడవు గావున నీయందు దీనపోషణగుణములు గలవు. కావున నీతో స్నేహముగోరి వచ్చితి నని భావము.

చ. సరయసఖాపసారితర•సాధర యీధరణీంద్రకోటిలో
నరయుదుఁ బెద్దగాఁ బృథున•రాధిపుఁ గొంత తదీయశక్తి నీ
చరణనఖాంచలంబునకు • సాటియె వేయును నేల మద్భుజాం
తరపవిరేఖ నీయడుగు•నం బడదే శుభలక్షణాకృతిన్. 7

సరయ = వేగముతోఁ గూడుకొన్నట్టులుగా, నఖ = కాలిగోటనప్రేలిగోటిచేత, అపసారిత = చిమ్మఁబడిన, రసాధర = కోలాహలపర్వతముగల వసురాజా, ఈధరణీంద్రకోటిలోన్ = భూమియందు నింద్రులనిపించుకొన్న యీరాజసమూహములో, పృథునరాధిపున్ = పృథుమహారాజును, కొంత = ఒకమాత్రముగా, పెద్దగాన్ = గొప్పవాఁడనునట్టులుగా, అరయుదున్ = విచారింతును, ఇక్కడఁ బెద్దయనెడు పదము పృథుశబ్దార్థకమనియును విచారింపవలయును. ('పృథుః స్యాన్మహతి త్రిషు, త్వక్పర్ణ్యాం కృష్ణజీరే స్త్రీ పుమాన్ నగ్నౌ నృపాంతరే' అని మే.) తదీయశక్తి = ఆపృథుమహారాజు యొక్క సామర్థ్యము, నీచరణనఖాంచలంబునకు సాటియె = నీకాలిగోటికొనకు సమానమగునా, అనఁగా గాదనుట. వేయునునేల = బహుభాషలెందులకు, మత్ = నాసంబంధమయిన, భుజాంతర = బాహుమధ్యమండలి, పవిరేఖ = రేఖాకృతిగల వజ్రాయుధము, శుభలక్షణాకృతిన్ = మహారాజపురుషలక్షణమయిన వజ్రరేఖరూపముచేత, నీయడుగునం బడదే=నీపాదమునందుఁ బ్రవేశించినదిగాదా, నీకాలికి నమస్కరించలేదా యనియు భావము.

గీ. 'చరణమునకు నఖప్రదేశమునకును సమాఖ్య యై యొప్పు నడుగు నా నలిననేత్ర' అని యాంధ్రనామసంగ్రహము. దీనికి శ్లో. 'చక్రాసి చాప వజ్రాభా రేఖాః కుర్వంతి భూపతిమ్' అని సాముద్రికశాస్త్రము. అనఁగా నావజ్రాయుధము వేయఁనట్టి పర్వతభంజనక్రియను నీయడుగు చేసి నది గదా యని భావము.

పర్వతభంజనవిద్య నాహస్తమునందలి వజ్రాయుధమునకంటె నీపదనఖాంచలమునకు బాగుగాఁ దెలియును గావున శుభలక్షణాకృతిచే నా వజ్రరేఖ యడుగునఁ బడుచున్నది. అనఁగా మున్నత విద్యాభ్యసనము పాదసేవ యొనర్చి చేయుట ప్రసిద్ధముగాన పర్వతగర్వభంజనశక్తి నీనఖాంచలమువద్ద నావజ్రాయుధము నేర్వఁదగియున్నదని భావము.

తే. ప్రబలఖలగోత్రహృతికినీ•పదనఖంబె
చాలు శతకోటిసాధనం • బేల మాకు
నేఁడుగా సౌమనస్యంబు • నివ్వటిల్లె
నెల్లసురలకు నీయంత•హితుఁడు గలుగ. 8

ప్రబల = మిక్కిలియు బలవంతులును, ఖల = దురాత్ములునయిన, గోత్ర = పర్వతాధిపతుల యొక్క, హృతికిన్ = గర్వాపహరణమునకు, నీపదనఖంబెచాలున్ = నీ కాలిగోరేచాలును, శతకోటి సాధనంబేలమాకున్ = మాకువజ్రాయుధమెందుకు, అనఁగా దానితోనిమిత్తములేదనియర్థము. ప్రబలులయిన దుర్జనులయొక్క వంశనిర్మూలనము సేయుటకు నీయొక్క యల్పావయవమైన కాలిగోరే చాలును. శతకోటిసంఖ్యాకములయిన సాధనము లెందులకు మా కని యర్థాంతరము. ఇక్కడ సాధన శబ్దముచేత సాధనసముదాయము గ్రహింపఁబడుచున్నది. శతకోట్యవయవ సాధనసముదాయమనుట. ఎల్లసురలకున్ = సమస్తమయిన దేవతలకును, ('స్త్రీత్వబహుత్వే సురాదేరసమాసే' న.) అను సూత్రముచే నీ సురశబ్దమునకు స్త్రీత్వమును బహుత్వమును వచ్చినది. నీయంతహితుఁడుగలుగన్ = నీవంటి గొప్పవాఁడయిన యిష్టుఁడు గలుగుటచేత, నేఁడుగా = నేఁటికిఁగదా, సౌమనస్యంబు నివ్వటిల్లెన్ = చిత్తస్వాస్థ్యముగలిగెనని యర్థము. దేవత్వముగలిగెనని భావము. (సుమనసాంభావః సౌమనస్యం.') నేఁడుగా అనుశబ్దమందలి 'గా' అవధారణార్థము.

తా. దుష్టుల దండించుటకు (శైలదండనమునకు) నీకాలిగోరె చాలును. ఇఁక శతకోటితోఁ (బెక్కుసాధనములతోఁ) బనిలేదు. నేఁడు నీయంతహితుఁడు కలుగుటవలన దేవతలకు దేవత్వము (మనసుకుదురుబాటు) చేకూరెను.

చ. హితసుమనోమనోరథము • లెల్ల ఘటింపఁగఁ జాలులోకస
న్నుతునకు నీకు నిత్తు సుమ•నోరథ మొక్కటి గొ మ్మటంచు దై
వతపతి రాజవర్యున క•వార్యమహార్ఘ్యమహార్ఘ్యభీశుసం
యుతమణిభాసమాన మగు•నొక్కవిమానము చూపి యిట్లనున్. 9

హిత=ఇష్టులయిన, సుమనః = దేవతలయొక్క, మనోరథములెల్లన్ =కోరికలనన్నిటిని, ఘటింపఁగఁజాలు = సమకూర్పఁగలిగినట్టి యని యర్థము. హిత = హితులయినరాజులయొక్కయు, సుమనః = పండితులయొక్కయు, మనోరథములెల్ల ఘటింపఁగఁజాలు = కోరికలను సమకూర్పఁగలిగినట్టి యని యర్థాంతరము. (ని. 'సుమనాః పుష్పమాలత్యోః స్త్రియాం నా ధీరదేవయోః' అని మే.) లోకసన్నుతునకునీకున్ = లోకములవారిచేత స్తుతిచేయఁబడిన నీకు, సుమనోరథమొక్కటియిత్తున్, గొమ్మటంచున్ = సుమనోరథమనఁగా మంచికోరికయును దేవతావిమానంబును గనుక, ఒకమంచి కోరిక నిచ్చెదను గ్రహింపుమనియును ఒకదివ్యవిమానమును ఇచ్చెదను గ్రహింపుమనియును నర్థద్వయము. ఇక్కడ

సూచ్యార్థమని గ్రహింపవలయును. లేనియెడల నర్థద్వయమునకును నభేదాధ్యవసాయము సేయవలయును. దైవతపతి = దేవేంద్రుఁడు, రాజవర్యునకున్ = రాజశ్రేష్ఠునకు, అవార్య=నివారింపశక్యము గాని, మహత్ = ఉత్కృష్టమయిన, అర్యమ = సూర్యునివలె, (ని. 'సూరసూర్యార్యమాదిత్య ద్వాదశాత్మ దివాకరాః' అని అ.) హారి = మనోహరములైన, అభీశు = కిరణములతోడ, ('అభీశుః ప్రగ్రహే రశ్మౌ' అని నానార్థము.) సంయుత = కూడుకొన్న, మణి = రత్నములచేత, భాసమానమగు=ప్రకాశమానమగుచున్న, ఒక్కవిమానముఁజూపి = ఒక దివ్యవిమానమును గనుపఱిచి, ఇట్లనున్ = ఈప్రకారముగాఁ జెప్పెను.

సుమనోమనోరథములు దీర్చుట సామాన్యకార్యము గాదు. అది లోకసన్నుతులపని. అట్టి వానికిఁ బ్రతిఫలముగా నీయఁదగినది సుమనోరథమే. ఇది యొసంగఁదగినవాఁడు సుమనఃపతియె! సుమనోరథము మణిభాసమానమైనది. ఆమణికాంతులు సూర్యకిరణములవలెఁ బ్రకాశించునవి. రాజవర్యుఁడు గాన వసురాజు పరిగ్రహణయోగ్యుఁడు.

చ. జలనిధిసార్వభౌమతనుజా దనుజారులయేఁగుపెండ్లినాఁ
డలఘుఁడు విశ్వకర్మ యభవాబ్జభవాదులు మెచ్చఁ జేసెఁ గౌ
శలమున దీని దీనిపయిఁ జారురమాపరమానుషంగుఁడై
యలరెఁ గదా గదాధరుఁ డహస్కరుపై నొఱపైనకైవడిన్. 10

జలనిధి = సముద్రములకు, సార్వభౌమ=చక్రవర్తియయిన క్షీరసముద్రునియొక్క, తనుజా = కొమార్తెయయిన లక్ష్మీదేవియొక్కయు, దనుజారుల = రాక్షసవిరోధియైన విష్ణుదేవునియొక్కయు అనఁగా లక్ష్మీనారాయణులయొక్క, ఏఁగుపెండ్లినాఁడు = పెండ్లియూరేఁగింపునాఁడు, అలఘుఁడు = మహాత్ముఁడైన, విశ్వకర్మ = విశ్వకర్మయనెడు దేవశిల్పి, అభవాబ్జభవాదులు, మెచ్చన్=శివబ్రహ్మాదులు మెచ్చుకొనునట్టులుగా, దీనిన్ = ఈవిమానమును, కౌశలమునన్ = శిల్పమందలి ప్రవీణతచేత, చేసెన్ = నిర్మించెను. దీనిపైన్ = ఈవిమానముమీఁద, చారు = మనోహరమయిన, రమా=లక్ష్మీదేవియొక్క, పరమ = ఉత్కృష్టమయిన, అనుషంగుఁడయి = సాంగత్యముగలవాఁడయి, అనఁగా లక్ష్మీదేవితోఁ గూడియున్నవాఁడయి, గదాధరుఁడు = శ్రీమహావిష్ణువు, అహస్కరుపైన్=సూర్యమండలముమీఁద, (ని. 'భాస్కరాహస్కరా బ్రధ్న ప్రభాకర విభాకరాః' అని అ.) ఒఱపైనకైవడిన్ = ప్రకాశించునట్టులుగా, అలరెఁగదా = ఒప్పుచుండెనుగదా.

'ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తీనారాయణః' అనియున్నది గనుక విష్ణుదేవుఁడు సూర్యమండలమధ్యవర్తి యగుట ప్రకటంబకదా! ఈవిమానము లక్ష్మీనారాయణుల పెండ్లినిమిత్తము సృజింపఁబడిన దని చెప్పుటచేత గిరికావసురాజవివాహహేతుత్వము స్ఫురించుచున్నది. (వృత్త్యనుప్రాసాలంకారము.)

విమానము అవార్యసూర్యమనోహరకిరణసంయుతమణిభాసమానము గావున సూర్యబింబమువలె నుండెను. విమానము నెక్కిన విష్ణువు సూర్యమండలమం దున్నటులఁ దోఁచెను. చేసినవాఁడు కౌశలియగు విశ్వకర్మ. పనితనమునకు మెచ్చినవారు శిల్పనిపుణులగు బ్రహ్మాదులు గాన విమానయాన మమానుషలభ్య మనుట.

ఉ. శ్రీసతిఁ బ్రేమ మించఁగ వరించి విరించిగురుండు కౌతుకా
వాసములోఁ సురాళి గొలువం గొలువై రవికోటిబింబసం
భాసిత మైనయీశుభవిమానముఁ దప్పక చూచునాఁడు పే
రాస యెఱింగి సైంధవగజాదులతోఁ నొసఁగెం బ్రియంబునన్. 11

శ్రీసతిన్=లక్ష్మీకాంతను, ప్రేమమించఁగవరించి=అనురాగ మతిశయించునట్లుగాఁ బరిగ్రహించి, విరించిగురుండు=బ్రహ్మకుఁ దండ్రియైన విష్ణుదేవుఁడు, కౌతుకావాసములోన్=కల్యాణమండపమందు, సురాళిగొలువంగొలువై=దేవతాసమూహము సేవింపఁగాఁ గొలువుదీరికూర్చున్నవాఁడై, రవికోటిబింబ=అనేకసూర్యబింబములవలె, సంభాసితమయిన = మిక్కిలి ప్రకాశించుచున్న, ఈశుభవిమానమున్ = శుభాస్పదమయిన యీవిమానమును, తప్పకచూచు = విడువక చూచుచున్న, నాఁడు = నాయొక్క, పేరాసయెఱింగి=అధికమైన యభిలాషమును దెలిసికొని, సైంధవ గజాదులతోన్ = సైంధవములనఁగా సింధుదేశమందుఁ బుట్టినగుఱ్ఱములు - అట్టిసైంధవములు, ఏనుఁగులు మొదలయినవానితోఁగూడ, ప్రియంబునన్=నాయందలిప్రీతిచేత, ఒసఁగెన్=ఈవిమానము నా కిచ్చెను.

ఈపద్యపు మూఁడవపాదమున మొదటియక్షరంబగు బిందుపూర్వక భాకారంబునకుఁ బదియవ వర్ణమయిన మాకారము యతిగాఁ జెల్లినది. ఇది బిందుయతి యనంబడును. దీనికిం బ్రమాణము.

క. 'పంచమవర్గాక్షరములు, పంచమవర్ణములఁగూడి పరఁగ నటించుం
బంచశరజనక వెఱనా, ల్గంచితముగఁ బిఱుఁద సున్న లంటినచోటన్.'

అని యనంతునిఛందంబునందు.

శుభవిమానమని చెప్పుటవలన గిరికా కళ్యాణరూపమగు శుభప్రాప్తికిది సాధనమని యూహ్యము. తప్పక (ఱెప్పయార్పక) చూచుట యత్యంతాభిలాషమునకు సూచకమగుటకు.

ఉ. ఱెప్పలువాల్ప కప్పుడమిఱేని మనోహరమూర్తినిచ్చలున్
దప్పకచూచిచూచి విబుధప్రమదల్. శృంగారనైషధము. ప్రథ.

క. భూనాయక యీదివ్యవి, మానం బసమానదివ్యమణిశకలశలా
కానీకనిర్మితం బిది, నానాఁటి కనంతకాంచనంబులు గురియున్. 12

భూనాయక = వసురాజా, ఈదివ్యవిమానంబు = దేవతాసంబంధమయిన యీవిమానము, అసమాన=సమానములేని, దివ్యమణి=చింతామణిరత్నముయొక్క, శకల=తునుకలయొక్కయు, (ని. 'భిత్తం శకల ఖణ్డే వా' అని అ.) శలాకా=కమ్ములయొక్కయు, అనీక=సమూహముచేత, నిర్మితంబు=నిర్మింపఁబడినది. కాఁబట్టి, ఇది=ఈవిమానము, నానాఁటికిన్=ప్రతిదినమును, అనంతకాంచనంబులు గురియున్=అపరిమిత సువర్ణములను వర్షించును.

ఈవిమానము దివ్యము. ఇందుఁ జెక్కినమణులు దివ్యములు గావున విమానము యజమానికి మితములేని సువర్ణప్రాప్తి కలుగఁజేయును.

మణులను జెప్పక మణిశకలములను జెప్పుట కాంత్యతిశయము దెలుపుటకు. మణిశకలములె మణులకంటె బాగుగాఁ బ్రకాశించుననుటకు,

శ్లో. ప్రభిన్నవైదూర్యనిభై స్తృణాంకురైః,
సమంచితాప్రోత్థితకందళీదళైః. ఋతుసంహారము.

సీ. పటుగాత్ర యీచిత్ర•భానూజ్జ్వలమఖర్వ, సర్వలోకాలోక•సౌఖ్య మొసఁగు
ధాత్రీశ యీదివ్య•ధామోన్నత మనంత, వాహినీవిభవంబు • వరలఁ జేయు
నరవరోత్తమ యీఘ•నప్రకాశ మభంగ, మణిచాపశరపరం•పరలు గురియు
సురమిత్ర యీశర•జ్జ్యోతిస్వరాకృతి, శార్వరగర్వభం•జన మొనర్చు
తే. నిది యశేషదోషాంతకం•బిది నితాంత, కాంతకల్యాణనిధి యిది• కామరూప
రమ్యమిదియమ్మ హాన్న సాం•ద్రప్రదంబు, దీనిఁ గొనియాడఁదరమె వా•గ్జానికైన.

పటుగాత్ర=ఆరోగదృఢగాత్రుఁడవైన వసురాజా, ఈచిత్రభానూజ్జ్వలము = చిత్రభానూజ్జ్వలమయిన యీచిత్రభానూజ్జ్వల మని యన్వయము. అంతటను నీరీతిగానే యన్వయింపవలయును-అనఁగా, చిత్రభాను=సూర్యునివలె, (ని. 'చిత్రభాను ర్విరోచనః విభావసు ర్గ్రహపతిః' అని అ.) ఉజ్జ్వలము=ప్రకాశమానమగుచున్న, చిత్రభాను=విచిత్రమణికిరణములచేత, (ని. 'భానుః కరో మరీచిః స్త్రీ పుంసయో ర్దీధితిః స్త్రియాం' అని అ.) ఉజ్జ్వలము=ప్రకాశించుచున్న యీవిమానము. అఖర్వ=అధికమయిన, సర్వలోక=సమస్తజనులయొక్క, (ని. 'లోకస్తు భువనేజనే' అని అ.) ఆలోకసౌఖ్యమొసఁగుఁగ్=అక్షిసాఫల్యము నిచ్చునని యర్థము. (ని. 'ఆలోకా దర్శనోద్యోతౌ' అని అ.) అఖర్వమయిన సర్వభువనవిలోకనసౌఖ్యము నిచ్చునని భావము. గీతమునందలి నాలుగువిశేషణములు వరుసగా నాలుగుపాదములకుఁ దీసికొనవలయును. అశేషదోషాంతకమనుటవలనఁ జిత్రకిరణకాంతులచే సమస్తరాత్రులను నాశనము చేయుననియు సమస్తపాపములు తొలంగఁజేయుననియు భావము.

ధాత్రీశ=భూమీశ్వరా, ఈదివ్యధామోన్నతము=దివ్యధామోన్నతమయిన యీదివ్యధామోన్నతము, అనఁగా, దివ్య=దేవతలకు, ధామ=ఆలయమయిన మేరుపర్వతమువలె, ఉన్నతము=పొడవైన, దివ్యధామ=దివ్యమయినప్రభచేత, ఉన్నతము=అధికమయిన యీవిమానము (ని. 'ధామ జన్మప్రభాస్థాన ప్రభావసుఖ పద్మసు' అని నా.) అనంతవాహినీవిభవంబు వరలఁజేయుఁగ్=అనంతవాహిని యనఁగా నాకాశగంగ-ఆకాశగంగయొక్క విభవముఁ బొందునట్టులుగాఁ జేయునని యర్థము. అనంత=అపరిమితమయిన, (ని. 'అనంతం గగనే క్లీబే పుమాన్ కేశవ శేషయోః, అనంతా పూర్ణిమా దూర్వా విశల్యా శారిభా మహీ.' అని నా.) వాహినీ=సేనయొక్క విభవము పొందునట్టులు చేయునని భావము. (ని. 'వాహినీ స్యా త్తరఙ్గిణ్యాం సేనా సైన్య ప్రభేదయోః' అని వి.) విమానము దివ్యధామము గావున మేరువు. మేరువును సురాలయ మనుట సుప్రసిద్ధము. కావున నిది నితాంతకళ్యాణనిధి అనఁగా శుభముల కునికిపట్టనియు బంగారమును నొసంగుననియు భావము. ఈవిమానము సువర్ణము వర్షించుననుట యుక్తోక్తమె!

నరవరోత్తమ = రాజోత్తమా, ఈఘనప్రకాశము=ఘనమనఁగా మేఘము, మేఘప్రకాశము వంటి ప్రకాశముగల ఘనప్రకాశమయిన యీవిమానము, అభంగ=అఖండమయిన, మణిచాప=ఇంద్రధనుస్సును, శరపరంపరలు=జలసందోహములను, కురియుఁగ్=వర్షించునని యర్థము. అభంగములయిన రత్నమయధనుస్సులను బాణసమూహములను నుత్పాదించునని భావము. విమానము ఘనప్రకాశము కావున మేఘము. కావునఁ గామరూపరమ్యము. విమానముపైఁ గామరూపములు సంచరింప

వచ్చుననియు మేఘము శరత్తునందు వసంతమున వర్షర్తువున నిచ్చవచ్చినటుల వన్నెలచే మనోహర ముగఁ గనవచ్చునటుల రత్నస్థగితమగు నీవిమానమును రమ్యముగ నుండునని భావము.

సురమిత్ర = దేవసఖుఁడవయిన వసురాజా, ఈశరజ్జ్యోతిర్వరాకృతి = జ్యోతిర్వరుఁ డనఁగాఁ దారాధిపతియయిన చంద్రుఁడు, ఈశరచ్చంద్రాకృతియైనవిమానము, శార్వరగర్వభంజన మెనరృన్ = అంధకార నివారణసేయునని యర్థము, ఘాతుకభంజనము సేయునని భావము. (ని. శార్వరం త్వంధ తమసే ఘాతుకే భేద్యలిఙ్గకమ్' అని అ.) విమానము జ్యోతిర్వరాకృతియనుటవలనఁ జంద్రునివలెఁ బ్రకాశించి యంధకారమును బోనాడుననియు దుష్టశిక్షణమున కుపయోగించుననియు భావము. అమృతాన్నసారప్రదమనుటవలన దేవతలకుఁ గళల ప్రసాదించుననియు దేవతలబలమువంటి బలము నొసంగుననియు భావము.

ఇది యశేషదోషాంతకంబు, అనఁగా నీవిమానము సర్వరాత్రి నిరాసకమని యర్థము. సకల దోషాపహారి యని భావము. ఇది = ఈవిమానము, నితాంత = ఎల్లప్పుడును, కాంత = మనోహరమైన, కల్యాణ = కాంచనమునకు, నిధి = స్థానమైనదని యర్థము. శుభాస్పదమని భావము. ఇది కామరూప రమ్యము = ఈవిమానమనేకరూపములచేత మనోజ్ఞమైనదని యర్థము ఇది=ఈవిమానము, అమృతాన్న= అమృత మశనము గాఁగల దేవతలకు, సారప్రదంబు = బలప్రదాయక మని యర్థము. ఇవి రెండును సాధారణ విశేషణములు. కాఁబట్టి, దీనిన్ = ఈ విమానమును, కొనియాడన్ = స్తుతిచేయుటకు, వాగ్జానికైనన్ = బ్రహ్మకైనను, తరమె = శక్యమగునా-అనఁగా శక్యము గాదనుట. అలంకారము శ్లేషము. పరికరము.

తే. ప్రకటితామోదదివ్యపుష్పకసహస్ర, మాలికాధార మైనయీమణివిమాన
రాజమున కెట్లు సరి వసురాజు సారె, పుణ్యజనభర్తఁ బాసినపుష్పకంబు. 14

ప్రకటిత = ప్రసిద్ధమైన, ఆమోద=ఆనందముగల, (ని. 'సౌగన్ధ్యే హర్షావామోదో' అనినా.) దివ్య = యోగ్యమైన, పుష్పక=పుష్పకమనెడు పేరుగలవిమానములయొక్క, సహస్రమాలికా = సహస్రశ్రేణులకు, ఆధారమైన = ఆకరమైన యని యర్థము. ప్రకటిత = ప్రసిద్ధమగుచున్న, ఆమోద = సౌరభముగలిగిన, దివ్యపుష్పక = పారిజాతపుష్పములుగల, సహస్రమాలికా = అనేకమాలికలకు స్థానమయినదని భావము. ఈమణివిమానరాజమునకున్=ఈరత్నమయమయిన విమానశ్రేష్ఠమునకు, వసురాజ= ఓ వసురాజ, సారె = మాటిమాటికిని, పుణ్యజనభర్తఁ బాసిన = కుబేరునెడఁబాసిన, పుష్పకంబు=పుష్పకాఖ్యవిమానము, ఎట్లుసరి = ఏరీతిగా సమానమగును-అనఁగాఁ గాదనియర్థము. పుణ్యజనభర్తఁ బాసిన పుష్పకము = పుణ్యుఁడవును జనభర్తవు నైననిన్నుఁ బొందుచున్న యీవిమానముతో సరిగాదనియు నర్థము స్ఫురించుచున్నది. (ని. 'పుణ్యజన స్సుజనే స్యా ద్రక్షసి యక్షే' అని నానార్థరత్నమాల.) పుష్పకసహస్రములమాలికలుగాఁ దాల్చిన యీవిమానమునకుఁ బుష్పకము సాటిగాదు. పుణ్యజనభర్తను బొందిన యీవిమానము పుణ్యజనభర్తను బాసి పుష్పకముకంటెఁ బెక్కువిధములఁ బ్రశస్తమైనది. పుష్పకమును రావణుఁడు గైకొనెను. అదియు నొకమాటె గాన సారె యనువిశేషణములో సామ్యములేదనియుఁ బలుమారు కుమారుఁడు పుష్పకమును గొనిపోయినటుల హేతుదృష్టాంత[illegible] [illegible] లరదురు. అలం. శ్లేషమూలకావ్యలింగము,

సీ. మానసీయానంత•మణికాంతధామ మై, యిది హిమానీవేళ • నింపునింపు
శోణప్రవాళమం•జులతానిశాంత మై, యలరించు నిది వసం•తాగమమునఁ
దరళముక్తాదీప్తి•ధారాధివాస మై, వేసవి నిది మహో•ల్లాస మొసఁగుఁ
బ్రబలవజ్రోపల•ప్రాసాదభాస మై, తొలుకరి నిది కుతూ•హలము నిలుపు
తే. జనవరోత్తమ యిది సర్వ•సమయసౌఖ్య, జనక మిందలి యాలేఖ్య•సాధ్యసిద్ధ
కిన్నరాంగనల విగీత•గీతనృత్య, వాద్యములు సూపి నిలుతురు•వలయు నెడల. 15

మానసీయ = మన్నింపఁదగిన, అనంతమణి = సూర్యునియొక్క, కాంత = మనోహరమైన, ధామమై = కాంతివంటి కాంతిగలదై యని యర్థము. మానసీయ = అంగీకరింపఁదగిన, అనంత = అపరిమితము లైన, మణి = పద్మరాగమణులచేత, కాంత = సుందరములగుచున్న, ధామమై = గృహములుగలదై యని భావము. (ని. 'ధామదేహగృహే రశ్మౌ' అని హలాయుధము.) ఇది = ఈవిమానము, హిమానీ వేళన్ = శిశిరర్తువునందు, (ని. 'హిమానీ హిమసంహతిః' అని అ.) ఇంపునింపున్ = ఇష్టపరిపూర్తిని జేయును.

శోణప్రవాళ = అరుణపల్లవములచేత, మంజు = మనోహర మగుచున్న, లతానిశాంతమై = లతా గృహములుగలదై యని యర్థము. శోణప్రవాళ = ఎఱ్ఱనిపగడములయొక్క, మంజులతా = మనోహరత్వ మునకు, నిశాంతమై = ఆస్పదమైనదై యనిభావము. (ని. ప్రవాళో వల్లకీదణ్డే విద్రుమే నవపల్లవే అని వి.) ఇది = ఈవిమానము, వసంతాగమమునన్ = వసంతర్తువునందు, అలరించున్ = సంతోషింపఁ జేయును. శోణప్రవాళములనుటవలన మిక్కిలి లేఁజివురాకు లని తెలియును. కెంజివుళ్లతో నుండు పొదరిండ్లు వసంతర్తువున నుపభోగయోగ్యములు. వసంతర్తువున వనవిహారమునకు బదు లీవిమానసంచా రము చాలును. సుఖదాయకముగ నుండుననుట.

తరళ = భాసురమయిన, ముక్తా = మౌక్తికములయొక్క, దీప్తిధారా = కాంతిధారలనెడు, ధారా = జలధారలకు, అధివాసమై = స్థానమై, ఇది = ఈ విమానము, వేసవిన్ = గ్రీష్మర్తువునందు, మహోల్లాస మొసఁగున్ = మహత్తరమైన యుత్సాహము నిచ్చును. వేసవిని ధారాగృహములు సౌఖ్యదాయక ములు. తుంపురులు ధారాగృహమునుండి పడుచుండునపుడు వేసవితాపము తీరును. ధారాగృహములు గ్రీష్మతాపహరములనుటకు,

శ్లో. నిశాశ్శశాంకక్షతనీలరాజయః క్వచిద్విచిత్రం జలయంత్రమందిరం,
మణిప్రకారాః సరసంచచందనం శుచౌ ప్రియేయాంతి జనస్య సేవ్యతాం.

ఋతుసంహారము, గ్రీష్మర్తువు.

ప్రబల = బలిష్ఠములైన, వజ్రోపల = వజ్రమణిమయములైన, ప్రాసాద = మేడలతోడ, భాసమై = ప్రకాశమానమయిన, ఇది = ఈవిమానము, తొలుకరిన్ = వర్షర్తువునందు, కుతూహలము నిలుపున్ = సంతోషమును బొందించును. తొలుకరిమెఱుపులు మనోహరముగఁ బ్రకాశించుచుండును. ఆప్రకాశ ము వలె కనుపించునట్లుగ నుండు వజ్రోపలప్రాసాదములు తొలుకరికాలమున నివాసయోగ్యములు.

జనవరోత్తమ = రాజోత్తమా, ఇది = ఈ విమానము, సర్వసమయసౌఖ్యజనకము = అనఁగా నుక్తా వశిష్టములైన హేమంత శరదృతువులయందు యథాయోగ్యమయిన సౌఖ్యము నుత్పాదకమని యర్థము. ఇందలి = ఈవిమానమందున్న, ఆలేఖ్య = చిత్తరువునందలి, సాధ్యసిద్ధకిన్నరాంగనలు = సాధ్యసిద్ధకిన్నరస్త్రీలు

వలయునెడలన్ = కావలసినసమయములందు, అవిగీత = అనిందితమయిన, గీత నృత్య వాద్యములు చూపి = గానము నాట్యము వాద్యము వీనిఁగనుపఱిచి, నిలుతురు = నివసించియుందురు-అనఁగా నీ విమానప్రభావముచేత నిందలి చిత్రప్రతిమలు సచేతనములయిన నృత్త గీత వాద్య క్రియలను జరిగించు నని భావము.

శ్లో. 'హిమ శిశిర వసంత గ్రీష్మ వర్షా శరత్సు స్తన తపన వనాం భో హార్మ్యగోశీరపానైః,
సుఖ మనుభవరాజన్ త్వద్ద్విషోయాంతినాశం దివసకమలలజ్జా శర్వరీరేణుపంక్తైః.'

అను నీశ్లోకార్థము ననుసంధించి గ్రంథకర్త చెప్పినాఁడు.

రాజా ! ఈవిమానము అన్నిఋతువులయందును తత్కాలానుకూలసుఖములకు నెలవుగ నలరారు చున్నది. కావున సర్వసమయసౌఖ్యజనకము. ఇందలి విచిత్రవిగ్రహములందలి వేల్పుచెలువలు గీతాదిక ములచే జనుల నానందపఱిచెదరు.

చ. అరుదుగ నీవిమానము ప్రజాధిపుఁడుం బురుషోత్తముండు శం
కరుఁడును దక్క నన్యులకుఁగా దధిరోహ మొనర్ప వారసు
స్థిరకరుణావిశేషమున జిష్ణుఁడ వై కయికొంటి దీని నే
నరవర సర్వసద్గుణగణంబుల ప్రోవగు నీకొసంగితిన్. 16

అరుదుగన్ = అద్భుతమగునట్లుగా, ఈవిమానము = ఈవ్యోమయానమును, ప్రజాధిపుఁడున్ = బ్రహ్మయును, పురుషోత్తముండున్ = విష్ణువును, శంకరుఁడును = మహేశ్వరుఁడును, తక్కన్ = వినా, అన్యులకున్ = ఇతరులకు, కాదధిరోహమొనర్పన్ = ఎక్కుటకుఁ దగదు, వారి సుస్థిరకరుణావిశేష మునన్ = ఆబ్రహ్మ విష్ణు మహేశ్వరులయొక్క శాశ్వతమయిన కరుణాతిశయముచేత, జిష్ణుఁడవై = జయశీలుఁడవై యని యర్థము. జిష్ణునామము గలవాఁడవై యని భావము. (ని. 'జిష్ణు శ్శక్రే ధన ఞ్జయే జిత్వరే చ' అని అ, దీనిం గైకొంటివి = ఈ విమానమును సంగ్రహించుకొంటివి, నేన్ = నేను, నరవర = వసురాజా, సర్వసద్గుణగణంబుల ప్రోవగునీకున్ = సకలసద్గుణసమూహములకు రాశివైననీకు, (గీ. 'ప్రోగు కుప్ప వామి ప్రోవు తిట్ట యనంగ, రాశి కాఖ్య లగు ధరాశతాఙ్గ' అని యాంధ్రనామ సంగ్రహము.) ఒసంగితిన్ = ఇచ్చినవాఁడనైతిని.

ఇందులో వసురాజును సర్వసద్గుణగణంబుల ప్రోవని చెప్పుటచేత నావసురాజును ప్రజాధిప పురు షోత్తమ శంకర జిష్ణుత్వములుగలవాఁడని గ్రహింపవలయును. ప్రజల కధిపతిగావున ప్రజాధిపుఁడు. (ప్రజానామధిపః) పురుషులయం దుత్తముఁడుగావునఁ బురుషోత్తముఁడు, పురుషాణాముత్తమః పురు షోత్తమః.) సుఖమును జేయువాఁడుగావున శంకరుఁడు, (శం సుఖం కరోతీతి శంకరః.) జయశీలుఁడు గావున జిష్ణుఁడును అనిభావము. (జయశీలో జిష్ణుః.) ఇందఱియందున్న యిన్నిగుణములు నీయొక్కని యం దుంటచే నీవందఱను మించినవాఁడవనుట కావుననే నీవు సర్వసద్గుణంబుల ప్రోవుగఁ జెప్పఁబడెను. విమాన గ్రహణమువలన నీవును విష్ణువు బ్రహ్మశంకరుఁడు నింద్రుఁడువలె సమస్తగుణపూర్ణుఁడవని స్పష్ట పడెననిభావము. అలం-తుల్యయోగితాలంకారము.

మ. నలినీబాంధవతేజ యీశుభవిమానం బెక్కి వేడ్కన్ వివి
ధస్థలసుస్థానవిహారవారి వసుచున్ మహీపీఠికిన్ రాకపో

కలు గావింపు మటంచు నిచ్చిన వసుక్ష్మాజాని యావ్యోమయా
నలలామంబుఁ బరిగ్రహించె భువనానందం బమందంబు గాన్. 17

నలినీబాంధవతేజ=సూర్యుని తేజస్సువంటి తేజస్సుగలవసురాజా, ఈశుభవిమానం బెక్కి=శుభాస్పదమయిన యీవిమానముపై నెక్కి, వేడ్కన్ = వేడుకచేత, వినిర్మల=మిక్కిలియు స్వచ్ఛమయిన, సన్మార్గ=ఆకాశమందలి, (సతాంనక్షత్రాణాంమార్గఃసన్మార్గః) విహార = సంచారముచేత, హారివగుచున్ = ఒప్పినవాఁడవై, సన్మార్గ మనఁగా సజ్జనమార్గం బనియును గ్రహింపవలయును. ఇక్కడ నలినీబాంధవతేజునకు నాకాశవిహారము యుక్తంబ యని తెలియవలయును. మాపీటికిన్ = మాపట్టణమయిన స్వర్గమునకు, రాకపోకలుగావింపుమటంచున్ = వచ్చుటలనుబోవుటలను జరిగించుచుండుమని, ఇచ్చినన్=ఇంద్రుఁడియ్యఁగా, వసుక్ష్మాజాని=వసురాజు, ('క్ష్మాభూమిఃజాయాభార్యాయస్యసః క్ష్మాజానిః') ఆవ్యోమయానలలామంబున్=ఆవిమానశ్రేష్ఠమును, (ని. 'వ్యోమయానం విమానో స్త్రీ' అని అ.) భువనానందం బమందంబుగాన్ = జగజ్జనానందమతిశయించునట్లుగా, పరిగ్రహించెన్ = పుచ్చుకొన్నవాఁ డాయెను.

నలినీబాంధవతేజ యనుటచే సూర్యునివలెఁ బ్రకాశవంతమగు నీవిమానము నీకుఁ దగియున్నదనుట. సన్మార్గసంచారులకు స్వర్గగమనము పలుమాఱు సలుప నవకాశము కలుగుఁగాన సన్మార్గసంచారివి కమ్మనిభావము. వసురాజు కోలాహలగర్వ భంజనరూపమున భువనక్షేమము సంతరించెఁ గావున విమానప్రాప్తికి భువన మంతయు నపరిమితానంద మొందెను.

వ. ఇట్లు జంభారి కుంభినీపతి కప్రతిమానవిమానంబు సమర్పించి సుఖం బుండుమని చనుటయు నపరిమితకుతూహలంబున నచటితపసు లానృపతి కపుడు
పరిచరనామధేయం బంకించి సంకీర్తనంబు గావించి రనంతరంబ యనంత
విజయకీర్తిలాభసౌభాగ్యధన్యుం డగునారాజన్యుం డనన్యాదృశప్రమోద
భరంబునఁ బురంబునకు మరలి వచ్చి యఖిలజగజ్జేగీయమానవిమానమహి
మంబునం బ్రతిదివసజాయమానంబు లగుజాతరూపమణికలాపంబుల భూదేవ
తాపరులకు సపర్యలు గావించుచు నిష్టాపూర్తంబులు నిర్వర్తించుచు
నొక్కొక్కయెడ నవ్విమానంబు నెక్కి నాకలోకాదిలోకంబులు నానానగవ
నానీకంబులు నవద్వయద్వీపసారంబులు నదీనదప్రచారంబులు నీక్షించుచు
శుక్తిమతీమహానది విహారదీర్ఘికయును గోలాహలంబు లీలాచలంబునుం గా
మెలంగుచు నుండె నంత నిచ్చట. 18

ఇట్లు=ఈప్రకారముగా, జంభారి = ఇంద్రుఁడు, కుంభినీపతికిన్ = వసురాజునకు, అప్రతిమానవిమానంబు సమర్పించి=సమానరహితమైన విమానము నిచ్చి, సుఖంబుండుమని చనుటయున్=సుఖముగా నుండుమని పలికిపోఁగా, ఇచట సుఖశబ్దమునకు సుఖముకలది యని యర్థము. అపరిమితకుతూహలంబునన్ = మితములేనిసంతోషముచేత, అచటితపసులు = ఆశుక్తిమతీ తీరవాసులైన మునులు, ఆనృపతికిన్ = ఆవసురాజునకు, అపుడు = ఆసమయమందు, ఉపరిచరనామధేయంబంకించి = ఉపరిచరుఁ డనెడు నామముగుఱుతుచేసి, (ని. 'అంకో నాటకవిచ్ఛేదే సంఖ్యాయాం చిహ్నభూషణే, సమీపే రూపకే స్థానే మతా పుత్సంగ చిహ్నయోః' అని నా.) అనఁగా నుపరిచరుఁ డనుపేరు పెట్టి; సంకీర్త

నంబుగావించిరి = స్తోత్రముచేసిరి. అనంతరంబ = ఆతరువాత, అనంత = అంతములేని, విజయ=జయప్రయుక్తమయిన, కీర్తి=యశస్సుయొక్క, లాభ = ప్రాప్తియొక్క, సౌభాగ్య=సౌష్ఠవముచేత, ధన్యుండగు = కృతార్థుఁడైన, ఆరాజన్యుండు = ఆవసురాజు, అనన్యాదృశ = నిరుపమానమయిన, ప్రమోదభరంబునన్ = సంతోషాతిశయముచేత, పురంబునకు మఱలివచ్చి=పట్టణమునకుఁ దిరిగివచ్చినవాఁడై, అఖిలజగజ్జేగీయమాన విమానమహిమంబునన్ = సమస్తజగత్తులచేతను మిక్కిలి కొనియాడఁబడుచున్న విమానముయొక్క ప్రభావముచేత, ప్రతిదివసజాయమానంబులగు = అనుదినమును సంభవించుచున్న, జాతరూప మణి కలాపంబులన్ = సువర్ణ రత్న సముదాయములచేత, (ని. 'చామీకరం జాతరూపం మహారజత కాఞ్చనే.' అని అ.) భూదేవ దేవతావరులకున్ = బ్రాహ్మణశ్రేష్ఠులకును, దేవతాశ్రేష్ఠులకును, సపర్యలుగావించుచున్=పూజలు సలుపుచు, (ని. 'సపర్యార్చార్హణాస్సమాః' అని అ.) ఇష్టాపూర్తంబులు నిర్వర్తించుచున్=ఇష్టాపూర్తములనఁగా, (శ్లో. 'అగ్నిహోత్రంతప స్సత్యం వేదానాం చానుపాలనమ్, ఆతిథ్యం వైశ్వదేవంచ ఇష్టమిత్యభిధీయతే.') వాపీ కూప తటాకాది దేవతాయతనాని చ, అన్నప్రధాన మారామాః పూర్తమిత్యభిధీయతే.'అని యున్నదిగనుక నట్టియిష్టాపూర్తములనాచరించుచు, ఒక్కొక్కయెడ నవ్విమానం బెక్కి=ఒక్కొక్క సమయమందు నింద్రుఁడిచ్చిన యావిమానము నెక్కి, నాకలోకాదిలోకంబులు=స్వర్గలోకము మొదలైనలోకములను, నానానగవనానీకంబులు = సకలపర్వతారణ్యసమూహములను, నవద్వయద్వీపసాగరంబులు = అష్టాదశద్వీపములను సముద్రములను, నదీనదప్రచారంబులన్=నదులనఁగా దూర్పుసముద్రములోఁ బ్రవేశించునట్టి యేఱులు, నదములనఁగాఁ బశ్చిమసముద్రములోఁ బ్రవేశించునట్టి యేఱులు, అట్టి నదీనదములయొక్క గమనవిశేషములను, ఈక్షించుచున్=చూచుచు, శుక్తిమతీమహానది=శుక్తిమతీనది, విహారదీర్ఘికయును=క్రీడాసరోవరంబును, కోలాహలంబు = కోలాహలపర్వతము, లీలాచలంబునుంగాన్=క్రీడాపర్వతంబును నగు నట్టులుగా, మెలంగుచునుండెన్=ప్రవర్తించుచుండెను. అంతన్=అంతట, ఇచ్చటన్=ఇక్కడ, ఈ పద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ద్వీపములకు సప్తసంఖ్యవలెనే యష్టాదశసంఖ్యయు సుప్రసిద్ధము. ఇందులకు-

సీ. వితతనవద్వయద్వీపనానాజయ శ్రీవధూటీసమాశ్లిష్టభుజుఁడు. — శృంగారనైషధము.

సంగ్రామ నిర్విష్ట సహస్రబాహుః, అష్టాదశ ద్వీపనిఖాత యూపః
అనన్య సాధారణరాజశబ్దో, బభూవ యోగీ కిల కార్తవీర్యః. — రఘువంశము.

వసుచరిత్రమునందు వసురాజునకు ఉపరిచరవసు వనునామము మునులు పెట్టినటులున్నది. భారతమున నటులగాక దేవేంద్రుఁడే యాతని నుపరిచరవసువనినటు లున్నది. చూడుఁడు.

శ్లో. దైవోపభోగ్యం దివ్యత్వ మాకాశే స్ఫాటికం మహత్
ఆకాశగంత్వాం మద్దత్తం విమాన ముపపత్స్యతే
త్వమేకః సర్వమర్త్యేషు విమానవరమాస్థితః
చరిష్యస్యుపరిస్థోహి దేవో విగ్రహవానివ. — మహాభారతము.

తే. అఖిలభువననిరోధకా•హార్యరాజ, గంధనిర్గంధనునిరాక•కలిమి నలమి
కొన్నయలజడియుడుగఁ బ్ర•సన్నయైన, యేటికొయ్యనగర్భంబు • దేటపడియె.

అఖిల=సమస్తమైన, భువన=ఉదకములకు, నిరోధక=నిర్బంధకుఁడైన అనఁగా నుదకముల నడ్డఁగట్టిన, ఆహార్యరాజ=కోలాహలపర్వతాధిపునియొక్క, గంధ=గర్వమునకు, నిర్గంధనుని=పరిహారకుఁడైన

వసురాజుయొక్క, రాకకలిమిఁగ = వచ్చుటచేతననియర్థము. సమస్తలోక నిరోధక వింధ్యాచలగర్వాపహారకుఁడైన యగస్త్యునియొక్క యుదయముచేత నని యర్థాంతరము. అలమికొన్న యలజడియుండుగఁ=తనగాఁ బొందిన యాందళఖము దీరఁగా నని యర్థము. (క. 'అలజడి నెంజిలి బిమ్మటి, సిలుగుత్తలపాటు వంత సేగి నెగు ల్కాం, జల మలమట దరు గోడు, మ్మలిక మనఁగఁ గుందు నా నమరు దుఃఖాఖ్యల్.' అని యాంధ్రనామశేషము.) అలమికొన్న=వ్యాపించిన, అలజడియుండుగఁ = అజడివాన యుండుగఁగా నని యర్థాంతరము. ప్రసన్నయైనయేటికిఁ=కలఁకదేఱిన శుక్తిమతీనదికి, ఒయ్యనఁ=తిన్నఁగా, గర్భంబు లేటపడియెఁ=గర్భ మేర్పడెనని యర్థము. నడియేఱు గానవచ్చెనని యర్థాంతరము. అగస్త్యోదయము చెప్పుటచేత శరత్కాలము చెప్పఁబడుచున్నది. అనఁగా శుక్తిమతీనదికిఁ గోలాహలపర్వత సంయోగముచేత గర్భ మేర్పడెననియు నప్పుడు శరత్కాలసమాగమమైనందుననిర్మలభావంబును జలశోషణంబును సంభవించెననియుఁ దాత్పర్యము.

అగస్త్యోదయము శరత్కాలసూచక మనుటకు-

తే. మలయ దర్దరగిరి గుహామందిరుండు, తామ్రపర్ణీజల స్నానధౌతవులుండు
కలుషితాంభఃప్రవాహైకకతకఫలము, కోమలియుఁ దాను నేతెంచెఁ గుంభభవుఁడు.

భీమఖండము.

మ. స్ఫుటభూయో వ్యతిశంక వార్ధి నిరశ్మల్ మిన్నుఁ జేర్పం దటి
చ్ఛట లార్వంబుగఁ గారుగొంచు ఘనమై త్నా దీర వర్షింప న
చ్చోటనుం దోఁచి గ్రసింపఁ బోలుకలశీసూనుండు గాకున్న నో
క్కొటఁ దారాగ్రహ భాస్కరేందు మణిశక్తుల్ వ్యక్తమై తోఁచునే.

విష్ణుచిత్తీయము ఆశ్వా ౪. ౧౪౫

సీ. నాళీకముఖికి నె•న్నడుము గానఁగ నయ్యెఁ, దనరు నెత్తళులబి•త్తరము దరలె
శఫరాక్షి కున్నత•స్థలు లగమ్యము లయ్యెఁ, బడిబడి నడ లెల్ల • జడనుపడియెఁ
జారువేణికి వింత•చవుల నింపులు మీఱెఁ, గనుపట్టె విశద మై • గండరేఖ
కంబుకంఠికి సాంద్ర•కంకణంబులు జాఱె, నాదంబు మందమం•దత వహించె
తే. హంసయానకు నలిమేచ•కాంచలముల
గుబ్బపొందమ్మిమొగ్గలు • కొమరు మిగిలెఁ
బ్రకటితావర్తనాభి కే•ర్పడియె నంత
రుచిరతరశైవలశ్యామ•రోమరాజి. 20

ఈపద్యమందు గర్భిణీస్త్రీపరముగాను శరత్కాలనదీపరముగాను నర్థద్వయముఁ గలుగఁ జెప్పినాఁడు. ఎటాగనిన, నాళీకముఖికిఁ = పద్మమువంటిముఖముగలదానికి, నెన్నఁడుము గానఁగ నయ్యెఁ=నెఱి+నడుము నెన్నడుము అని సంధి వచ్చినది. నడుము దొడ్డుపాటి కనఁబడియెనని గర్భిణీపరమయిన యర్థము. ముఖమువంటి పద్మముగలదానికి నడియేఱు గానవచ్చెనని శరత్కాలనదీపరమయిన యర్థాంతరము. తనరు నెత్తళులబిత్తరము దరలెఁ = తళులనఁగా వళులు వళిత్రయవిలాసము వదలెనని యర్థము; వళిసదృశతరంగవిలాసము వదలెనని యర్థాంతరము. శఫరాక్షికిఁ =

శఫరమనఁగా మీనము - మీనములవంటి కన్నులుగలదానికి, ఉన్నతస్థలులు = ఉన్నతప్రదేశములు, అగమ్యములయ్యెన్ = పొందశక్యముగాని వాయెనని యర్థము. కన్నులవంటి మీనములుగలదానికి నున్నతప్రదేశము లగమ్యములాయెనని యర్థాంతరము. బడిబడి నడలెల్ల జడఁబడియె = క్రమక్రమముగా నడకలు మందగించెనని యర్థము. ప్రవాహవేగము మందగించెనని యర్థాంతరము. చారువేణికిన్ = సుందరమయిన జడలగలదానికి, వింతచవుల నింపులుమీఱెన్ = ఆహారద్రవ్యములయందలి క్రొత్తరుచులయం దిష్టము లతిశయించెనని యర్థము. సుందరమయిన ప్రవాహముగలదానికి మాధుర్యరుచులచేత నింపులుమీఱె నని యర్థాంతరము. కనుపట్టె విశదమై గండరేఖ = కపోలపాళిక తెల్లనై కనుపించె నని యర్థము. గండశిలలయొక్క సమూహము ప్రకటమయి కనుపడియె నని యర్థాంతరము. (ని. 'గణ్డో వ్రణే కపోలే పిటకే గర్వే మృగాన్తరే యోగే, మహాదిమస్తభాగే హయభూషణే బుద్బుదే వ్యూహామే చ.' అని నా.) కంబుకంఠికిన్ = శంఖమువంటి కంఠముగలదానికి, సాంద్రకంకణంబులుజాఱెన్ = బిగువైన హస్తకంకణములు వదులై జాఱెనని యర్థము. కంఠమువంటి శంఖముగలదానికి సాంద్రజలబిందువు లుడిగిపోయెనని యర్థాంతరము. (ని. 'స్యాత్కఙ్కణం హస్తసూత్రే శిఖరే కటకే జలే' అని నా.) నాదంబు మందమందతవహించెన్ = సస్వరము గద్గదికవహించెనని యర్థము. ప్రవాహధ్వని సన్నగించెనని యర్థాంతరము.

హంసయానకున్ = హంసనడకలవంటినడకలుగలదానికి, అలి = తుమ్మెదలవలె, మేచక = నల్లనైన, అంచలములన్ = అగ్రములచేత, గుబ్బశొందమ్మిమొగ్గలు = బంగారుతామర మొగ్గలవంటి గుబ్బచన్నులు, కొమరుమిగిలెన్ = ఒప్పెనని యర్థము. హంససంచారములు గలదానికిఁ దుమ్మెదలచేత నల్లనైన యగ్రములచేత గుబ్బలవంటి బంగారుతామరమొగ్గలు కొమరుమీఱె నని యర్థాంతరము. ప్రకటితావర్తనాభికిన్ = ప్రసిద్ధమయిన యావర్తముతోఁగూడిన నాభిగలదానికి, అంతన్ = ఆమీఁదట, రుచిరతర = మిక్కిలి ప్రకాశమానమైన, శైవల = నాచుతీఁగెవలె, 'జలనీలీతు శైవాల శైవలే' అని అ.) శ్యామ = నల్లనైన, రోమరాజీ = నూఁగారు, ఏర్పడియెన్ = స్ఫుటముగాఁ గనుపడియెనని యర్థము. స్త్రీలకు నాభియొక్క బిల మావర్తయుక్తమై యుండవలయునని శాస్త్రము. (శ్లో. 'గంభీరా దక్షిణావర్తనాభి స్స్యాత్సుఖసంపదే' అని సాముద్రికశాస్త్రము.) నాభి యనఁగా మధ్యప్రదేశంబును ప్రకటితమయిన యావర్తయుక్తమధ్యప్రదేశముగలదానికి శ్యామరోమరాజివంటి రుచిరతరశైవల మేర్పడియె నని యర్థాంతరము. (ని. 'నాభిర్ముఖ్యే ప్రధానాఙ్గే కస్తూర్యాం క్షత్రియే నృపే' అని నా.)

గుబ్బశొందమ్ములన్నచోట స్త్రీపరమయిన యర్థమం దుపమిత సమాసమును, నదీపరమయిన యర్థమందు మధ్యమపదలోప సమాసంబును జెప్పవలయును. ఆంధ్రభాషయందు సకలసమాసములు గలవు. 'ద్విగుకర్మధారయాతత్పురుషద్వంద్వాబహువ్రీహిః, అన్యేచ కేచిదుపమానోత్తరపదలోపరూపకాఖ్యాద్యాః. పరిదృశ్యాఇహ' అని నన్నయభట్టీయము. నాళీకముఖి, శఫరాక్షి, చారువేణి, కంబుకంఠి, హంసయాన ఆవర్తనాభియను నామములు నదీపరముగ స్త్రీపరముగ వ్యవహృతములు. అలశ్లేషము.

క. ఆపన్నసత్త్వ యాపగ, యాపగిదిన్ నీరుమోసి • యధిగతసేవా
వ్యాపారద్విజమహిళ, ల్గాపాడఁగ నొక్కపుణ్య•లగ్నమునందున్.

సత్త్వమనఁగా జీవుఁడు (శుక్రశోణితసంయోగేసత్త్వసంస్కారకర్మణాస్తైశచోదితః, గర్భస్సంపద్యతే యుక్తి వశాదగ్నిరివారణౌ.' అని యున్నది.) ఆపన్నసత్త్వ యనఁగా గర్భిణియని యర్థము. (ని. 'ఆపన్నసత్త్వా స్యాద్గుర్విణ్యన్తర్వత్నీ తు గర్భిణీ' అని అ.) సత్త్వములనఁగా జంతువులుగనుక నాపత్ప్రాప్తమైన జలజంతువులు గలదని యర్థాంతరము (ని. 'ఆపన్న ఆపత్ప్రాప్త స్స్యాత్' అని అ. 'సత్త్వమస్త్రీ తు జంతుషు' అని అ.) ఆపగ యనఁగా నది, (ని. 'స్రోతస్వినీ ద్వీపవతీ స్రవంతీ నిమ్నగాపగా' అని అ.) అనఁగా గర్భిణి యైనకుక్షిమతీనది, ఆపగ యెన్నిరమోపి = ఆప్రకారముగా నీరువట్టియని యర్థము. జలస్వరూపమునవలంబించి యని యర్థాంతరము. అధిగత = పొందఁబడిన, సేవావ్యాపార = పరిచర్యావృత్తి గల, ద్విజమహిళలు = బ్రాహ్మణస్త్రీలు, కాపాడఁగన్ = రక్షణము సేయఁగా నని యర్థము. ద్విజమహిళ లనఁగా హంసాంగనలు గనుక పొందఁబడిన యుపచరణవృత్తిగల హంస లను ద్విజాంగనలు కాచు చుండఁగా నని యర్థాంతరము. (ని. 'అథ ద్విజో విప్రే ఖగే దంతే ద్విజా భార్ఙ్గీ రేణుకయోః' అని నా.) ఒక్కొక్కమాసములు గడవఁగన్ = ఒకదానికొక్కటైన మూఁడుమాసములందు, కొలువద్యముకు ముంచిన పద్యముతో సమానము. అఖిలమునకు నిరోధకారిపద్యములనుబట్టి సభేదాధ్యవసాయమని గ్రహింప వలయును.

చ. గురుతరనవ్యవేతసనికుంజము రంజిలుచోట హల్లకో
త్కరకరదీపదీధితులు క్రమ్మెడుచోట నవారవిందబం
ధురమకరందతైలములు నూల్కొనుచోటఁ బరాగరక్షచేఁ
గర మరుదైనచోట నది గాంచెఁ గుమారుఁ గుమారికామణిన్. 22

గురుతర = అధికతరమును, నవ్య = నూతనమును నైన, వేతసనికుంజము రంజిలుచోటన్ = ప్రబ్బలిపొద యొప్పుచుండునదియు, (ని. 'ద్వౌ పరివ్యాధ విదులౌ నాదేయీ చాంబువేతసే' అని అ.) హల్లక = ఎఱ్ఱగలువలయొక్క, (ని. హల్లకం రక్తసంధ్యకమ్' అని అ.) ఉత్కర = సమూహము నెడు, కరదీప = దివిటీలయొక్క, దీధితులు = కాంతులు, క్రమ్మెడుచోటన్ = వ్యాపించుచుండునదియు, నవారవింద = నూతనమైన కమలములయందు, బంధుర=రమ్యమగుచున్న, మకరంద=పూఁదేనె యనెడు, (ని. 'మకరందః పుష్పరసః' అని అ.) తైలములు = చమురులు, నూల్కొనుచోటన్ = సంఘటితమై యుండునదియు, పరాగ = పుప్పొడి యనెడు, రక్షచేన్ = విభూతిచేత, (ని. 'భూతిర్భసిత భస్మని క్షారో రక్షా చ' అని అ.) కరమరుదైనచోటన్ = మిక్కిలి వింతగానుండునదియునగు నొకానొక స్థలమందు, నది = శుక్తిమతి, కుమారున్ = ఒకకుమారుని, కుమారికామణిన్=ఒకచక్కని కొమార్తెను, కాంచెన్ = కనియెను.

నదీగర్భమునఁ బ్రబ్బలిదుబ్బులు విశేషముగానుండును గాన వేతసనికుంజము ప్రసూతిగృహముగఁ జెప్పఁబడెను, గురుతరము, నవ్యము అను విశేషణములవలనఁ బొదరిల్లు దట్టముగఁ గ్రొంజివుళ్లచే నలరారుచుండెననుట. దీపములు ఎఱ్ఱకలువ మొగ్గలు, తైలము క్రొత్తగావిచ్చిన తమ్మిపూఁదేనియ. రక్షాద్రవ్యము పరాగము. ప్రకృతిసహజములగువస్తువు లప్రయత్నముగా సూతికాగృహముగ నుపయుక్త మగుటవలననే యాచోట కరుదైనదని చెప్పఁబడెను.

తే. ఆనదీనందన జనించు • ననఘువేళ, నిందుతారాప్రసాదంబు • లెన్నఁదరమె
తారకాభర్తసుముఖత • వాల్చెఁదారకలు శుభాంఘ్రులనఖరశ్మి • ఖరివహించె. 23

ఆనదీనందన=ఆశుక్తిమతి కొమార్తె, జనించు ననఘువేళన్ = పుట్టిన పుణ్యసమయమందు, ఇందు తారాప్రసాదంబు లెన్నఁదరమె = చంద్ర తారాద్యగ్రహముల మెచ్చ శక్యమా, అనఁగా శక్యముగా దనుట. అదేమనిన, తారకాభర్త చంద్రుఁడు. సుముఖతన్ దాల్చెన్ = సుముఖత్వముచే వహించెనని యర్థము. ముఖాకృతిని వహించినాఁడనిభావము. తారకలు = నక్షత్రములు, (సం. 'నక్షత్రమృక్షం భం తారా తారకా ప్యుడు వా స్త్రియామ్' అని అ.) శుభాంఘ్రులన్ = శుభకరమైన పాదములచేత, అఖరరశ్మిపై ఖరివహించెన్ = ఖరమనఁగా తీక్ష్ణము, (సం. 'తిగ్మం తీక్ష్ణం ఖరం తద్వత్' అని. అ.) అది గానిది యఖరము అనఁగా ననుగ్రహము, అనుగ్రహమై ఖరిని వహించెనని యర్థము. శుభలక్షణాస్పదము లైన పాదములయందలి నఖాకృతిని వహించెనని భావము. ముఖము చంద్రునివలె నుండుటయు నఖములు తారకలవలెనుండుటయు సౌభాగ్యాతిశయమునకు సూచనము. బాలజన్మకాలమునందు నక్షత్రములు చంద్రుఁడు ననుకూలస్థానములందుండి శుభదాయకులుగ నొప్పిరని తాత్పర్యము. అలం. శ్లేషము.

ఉ. అయ్యెడ శీతశైలతన • యాగ్రణియుం ముద మంది నెయ్యపుం
దొయ్యలియందుఁ గల్గినత • నూభవసంపద పేర్మిఁ బావనం
బయ్యె మదన్వయంబు కృతి • నైతి న టంచు వసుక్షితీంద్రుచే
ప్రయ్యలు వడ్డనెవ్వగ ల • వంబుఁ దలంపక యుండె నెమ్మదిన్. 24

అయ్యెడన్ = ఆసమయమందు, శీతశైలతనయాగ్రణియున్ = హిమవత్పర్వత పుత్రులలో శ్రేష్ఠుఁడైన కోలాహలుఁడును, ముదమంది = సంతోషమునుబొంది నెయ్యపుందొయ్యలి యందున్ = ప్రేమాస్పదురాలైన శుక్తిమతియందు, కల్గినతనూభవసంపద పేర్మిన్ = సంభవించిన సంతానసంపత్తి యొక్క ఘనతచేత, మదన్వయంబు = నా యొక్క వంశంబు, పావనంబయ్యెన్ = పవిత్రమాయెను, కృతి నైతిన్ =కృతార్థుఁడనైతిని. అటంచున్ =అనితలంచుచు, వసుక్షితీంద్రుచేతన్ =వసురాజుచేత, ప్రయ్యలు వడ్డ నెవ్వగ=బ్రద్దలు చేయఁబడిన మహావ్యధ-బ్రద్దలగుటచేతనైన మహావ్యథయనుట. ఇట్టిప్రయోగము లాంధ్రమునఁగలవు. నెఱ+వగ-నెవ్వగ అని సంధి. లవంబు దలపక = లేశమాత్రమయినను దలఁచుకొనక, నెమ్మదిన్ = స్వస్థచిత్తతచేత, నెఱ+మది నెమ్మది, ఉండెన్ = ఉన్నవాఁడాయెను. అనఁగా నీ సంతానలాభజనిత మయిన సంతోష మావ్యథను బోఁగొట్టె నని భావము.

శీతశైలతనయాగ్రణియనుటచేఁ గోలాహలుఁ డుత్తమపురుషుఁ డనుట సువ్యక్తము. ఉత్తముఁ డవమానము సహింపఁజాలకపోయినను అన్వయపావనత విచారమును బోఁదోలినది. ప్రయ్యలువడ్డ నెవ్వగలవంబు దలంపకయుండెననుటచే మేనిగాయములుమానకున్నను సంతోషాతిశయమున బాధారూపమగు విచారము మఱపునకు వచ్చెనని భావము. నెయ్యపుందొయ్యలి యని శుక్తిమతినిగోలాహలుఁడు తలంచుట యసమంజసమని కొందఱందురు. శుక్తిమతి ప్రేమింపకున్నను శైలరాజు ప్రేమించెఁగాన శైలరాజునకు శుక్తిమతి నెయ్యపుం దొయ్యలియనుట యుక్తమె.

మ. అమితానందరసద్విజారవము చె • న్నారం గుమారోదయ
ప్రమదారంభవిజృంభమాణ యగుచుం • బద్మాస్య శైలావరో

ధము వారించి తనుఁ ధరించె వసుపా • దంబంచు నూహించి నె
యుమ్యు దైవార నొనర్చెఁ దద్వసుపదా • ఖ్యానంబు తొల్పాలికిన్. 25

అమితః=మితములేని, ఆనందరసః=సంతోషముగలిగిన, ద్విజారవము = బ్రాహ్మణాశీర్వాదనాదము, చెన్నారన్=ఒప్పుఁగా నని యర్థము. అమితానంద=అధికానందముగలిగిన, రసద్విజారవము చెన్నారన్= జలపక్షి కోలాహల మొప్పుఁగా నని యర్థాంతరము. కుమారోదయ = పుత్త్రజననమువలనఁ బుట్టిన, ప్రమదారంభ=సంతోషప్రారంభముచేత, విజృంభమాణయగుచున్=విజృంభించుచున్నదై అని యర్థము. ఉప్పొంగినదై యని యర్థాంతరము. పద్మాస్య = పద్మమువంటి ముఖము గలిగినదని యర్థము. ఆస్యము వంటి పద్మములు గలది యని యర్థాంతరము. శైలావరోధమువారించి = పర్వతమువలననైన నిర్బంధముఁ బోఁగొట్టి, (ని. 'అవరోధో రాజగృహే శుద్ధాంతే ప్యవరోధనే' అని నా.) వసుపాదంబు=వసుమహారాజుయొక్క కాలు, తనున్ ధరించెన్=తన్నురక్షించెను, అంచును+ఊహించి = అని విచారించి, నెయ్యము దైవారన్=భక్తిస్నేహము మతిశయింపఁగా, తొల్పాలికిన్ = తొలుతఁబుట్టినకుమారునికి, తద్వసుపదాఖ్యానంబు = ఆవసుపద నామకరణమును, ఒనర్చెన్ = చేసెను. అట్లుగా వసుపదుఁడని పేరుపెట్టె నని భావము.

బ్రాహ్మణాశీర్వాదసహితముగ నామకరణము సలుపుట యాచారముగావున శుక్తిమతి పుత్త్రోదయానందమునఁ గృతజ్ఞతాసూచకముగ వసుపదుఁడని పేరిడెను.

క. గిరిరాజతనయకైవడి, సిరి రాజిల వెలయు నీసు • శీల యనుచు నా
గిరికన్య కచటిమౌనులు, గిరికాశుభనామ మిడి ర • కిల్బిషఘణితిన్. 26

గిరిరాజతనయకైవడిన్ = హిమవత్పర్వతరాజ పుత్త్రియైన పార్వతివలె, సిరిరాజిలన్ = ఐశ్వర్యము ప్రకాశింపఁగా, ఈ సుశీల = మంచిస్వభావముగల యీచిన్నది, వెలయున్ = ప్రసిద్ధురాలగుచు, అనుచున్ = అనిపలుకుచు, ఆగిరికన్యకున్ = కోలాహలపర్వతుని కూఁతురైన యాచిన్నదానికి, అచటి మౌనులు=శుక్తిమతీ తీరవాసులైన మునీశ్వరులు, అకిల్బిషఘణితిన్=నిర్దోషవాక్యముచేత, (ని. 'కిల్బిషం త్వఘే, అపరాధేపి' అని నా.) గిరికాశుభనామ మిడిరి = గిరికయనెడు శుభయుక్తమయిన పేరు పెట్టిరి. ఈయమయు గిరిరాజతనయగావున గిరికానామ మొప్పు యున్నదని భావము. శివుఁడణిమాద్యష్టైశ్వర్యశోభితుఁడు గావున గిరితనయ భర్తృసాహచర్యమున సిరిచే భాసిల్లునటుల నైశ్వర్యశోభితుఁడగు ననుకూలవరప్రాప్తిచే గిరిక శోభిల్లఁగలదని భావము.

చ. జలకము లార్చి పాండుజల • జచ్ఛదపాళికఁ గప్పి తమ్మిపం
కులఁ దెలిదేనె లుగ్గు లిడి • క్రొందరఁగల్ గదలించుకల్వతొ
ట్టెలలఁ గుమారుఁ గూఁతును ఘ • టించి భజించు నదీలలామ కో
మలకుముదాగశాళికుల • మంజురవంబున జోల వాడుచున్. 27

జలకములార్చి=స్నానములుచేయించి, పాండుజలజ= తెల్లతామర పువ్వులయొక్క, ఛదపాళికఁ గప్పి=పత్త్రశ్రేణి యనెడువస్త్రశ్రేణిని గప్పి, (ని. 'పత్త్రం ఫలాశం ఛదనం దళం పర్ణం ఛదః పుమాన్' అని అ.) తమ్మి = కమలములనెడి, పంకులన్ = శంఖపాత్త్రలచేత, తెలిదేనెలు = స్వచ్ఛమయిన

మకరందముల నెడు తెల్లదేసియలు, ఉగ్గులిడి = ఉగ్గులు పెట్టి, ప్రొంపరులగన్ గరించుచు ప్రొంపరలన్ లనఁగాఁ గ్రొత్తతరంగములుగాన నవియ నెడు దాదు లగుచున్న, కల్హారతొట్టెలన్ =కలువపువ్వుల నెడు నుయ్యెలలయందు, కుమారుఁ గూఁతును ఘటించి=కొడుకును గూతును బరుండఁబెట్టి, నదీలలామ=నదీ భూషణమయిన శుక్తిమతి, కోమల=లేఁతలయిన, కుముద=తెల్లగలువలను గాంచి, (ని. 'సితే కుముద కైరవే' అని అ.) ఆగతాళికుల-ఆగత=వచ్చిన, అళికుల = తుమ్మెదగుంపుల నెడు, అళికుల=సఖీ సమూహముయొక్క-ఇచట అకారము ఆకారమును సవర్ణదీర్ఘ మువలన ప్రశ్లేషించినది. మంజురవంబునన్ = మధురమయిన ఝుంకారధ్వని యనెడు లాలిపాటచేత, (ని. 'సుందరం రుచిరం చారు సుషమం సాధు శోభనమ్, వల్గు వామం హారి శాలి రమణీయం మనోహరమ్, కాంతం మనోహరం రుచ్యం మనోజ్ఞం మఞ్జుమఞ్జులమ్' అని అ.) జోలపాడుచున్ =జోలలు పాడుచును, భజించున్ =సేవించునట్లు కాపాడు చుండును. ఈపద్యమందు శ్లిష్టాశ్లిష్టవ్యధికరణైక దేశవర్తిరూపకములు తెలియఁదగినది.

శుక్తిమతి తనకూతును గొమరుని తెలిదమ్మి జేకు పొత్తులలోనుంచి తెలిదేసియ నుగ్గుపెట్టి తరఁగలచేఁ గదలుకలువపూవు టుయ్యెలల నూపుచుఁ దేటిపాటలతో జోల పాడుచుండెను.

సీ. మందయానము నేర్పు • నిందిందిరాజీవ, రాజీవ రాజత్ • మరాళరాజ
కలికిపల్కులు నేర్పు • లలితనానావాస, నావాసనికట • కాననశుకాళి
గొనబుపాటలు నేర్పుఁ • గుముదరసామోద, సామోదమధుప • శుద్ధాంతసమితి
నటనలీలలు నేర్పుఁ • దటరూఢకల్పాగ, కల్పాగచర నీల • కంఠవితతి
తే. యన్నదీకన్య కఖిలభా • గ్యములు గలుగ, మునిపురంధ్రీజనంబు దీ • వనలొసంగు
నతివసైరంధ్రులై దాదు • లై వయస్యలై విపినదేవతలు ప్రోతు • రనుదినంబు.

అన్నదికన్యకున్ =శుక్తిమతీనదీ పుత్రికయైన యాగిరికాదేవికి, ఇందిందిర=తుమ్మెదలయొక్క, ఆజీవ = జీవికలైన అనఁగా జీవనోపాయములైన, ని. 'ఆజీవో జీవికావార్తా' అని అ. రాజీవ= కమలములయందు, రాజత్ =ప్రకాశించుచున్న, మరాళరాజ=హంసశ్రేణి, మందయానము నేర్పున్ = మెల్లని నడక నేర్పును, లలిత = మనోహరమయిన, నానావాసనా=సమస్త పరిమళములకును, వాస = స్థానమయిన, నికటకానన=సమీపవనమందలి, శుకాళి=శుకశ్రేణి, కలికిపలుకులు నేర్పున్ =ముద్దు మాటలు నేర్పును, కుముద=కలువపువ్వులయందలి, రస=మకరందమందును, ఆమోద = పరిమళమందును, సామోద = సంతోషయుక్తము లగుచున్న, మధుపశుద్ధాంత = ఆఁడుతుమ్మెదలయొక్క, సమితి= సమూహము, ఇక్కడ శుద్ధాంతశబ్ద మంతఃపురస్త్రీలయందు వర్తించుచున్నది. గొనబుపాటలు నేర్పున్ = ఒప్పిదమయిన పాటలను నేర్పును, తట=శుక్తిమతీతీరమందు, రూఢ=మొలిచిన, కల్పాగ కల్ప = కల్ప వృక్షసమానములైన, అగ = వృక్షములయందు, చర = సంచరించునట్టి, నీలకంఠవితతి=మయూరశ్రేణి, (ని. 'మయూరో బర్హిణో బర్హీ నీలకణ్ఠో భుజఙ్గభుక్' అని అ.) నటనలీలలు నేర్పున్ =నాట్యవిలాస ములు నేర్పును, మునిపురంధ్రీజనంబు = తాపసస్త్రీజనము, (ని. 'స్యాత్తు కుటుంబినీ, పురంధ్రీ' అని అ.)

అఖిలభాగ్యములు గలుగన్ = సమస్తైశ్వర్యములును గలుగునట్లుగా, దీవనలొసంగున్ = ఆశీర్వాదముల నిచ్చును అనఁగా దీవించుననుట. విపినదేవతలు = వనదేవతలు, సైరంధ్రులై, (ని.

విశిష్టతమయిన హారము వేయఁగా, పెద్దపుకన్ = కూఁతునకు, బరువాయనో = భారమగునేమో, ఇవేల కర్ణశాలాంకృతులాంచుకన్ = ఇవెందుకుఁ గరినపుసొమ్ములని పలుకుచు, నదీలలామయున్ = శుక్తిమతి యును, హల్లక = ఎఱ్ఱగలువలయొక్క, (ని. హల్లకం రక్తసంధ్యకమ్' అని అ.) కలాపములు = సొమ్ము లను, ఉంచున్ = అలంకరించును. గిరికతండ్రి శైలకులాగ్రణియు: దల్లి నదీలలామయు నగుటచే నాభిజాత్యము సూచితము. కర్ణశాలాంకృతులఁ దొలఁగుట సౌకుమార్యాతిశయము సూచితము. హల్లక కలాపము లలంకరించుటవలనఁ బుష్పకోమలావయవములకుఁ బూవులే యలంకారము లగు నని భావము.

మ. అనుఁగుంగ్రీడల నెల్లవారలకు ని ట్లాహ్లాదము ద్దైనకూఁ
తునకున్ వాహిని వాణిఁ దాల్చుసుకవిస్తోమంబు రప్పించి త
ద్ఘనవిద్యామహిమల్ కరామలకము ల్గావించె నాత్మీయనూ
తనపద్మోపచయం బశేషమును దత్పాత్రంబు గావించుచున్. 32

అనుఁగుంగ్రీడలన్ = ప్రియకరమైన యాటలచేత, ఎల్లవారలకున్ = సమస్తులకును. ఇట్లు = ఈ ప్రకారముగా, ఆహ్లాదముద్దైన = గారాబముగానున్న, కూఁతునకు = కూఁతురైన గిరికాదేవికి, కూఁతుశబ్దపు ప్రథమయందుఁదప్ప రువర్ణకము తక్కిన విభక్తులయందు రాదు. కూఁతురులు; కూఁతుల్లు, కూఁతురులకున్, కూఁతుల్లకున్, మొదలగు ప్రయోగంబులు సత్ప్రబంధములయందు మృగ్యంబులు. వాహిని = శుక్తిమతి, వాణిఁదాల్చు = సరస్వతిని వహించుచున్న అనఁగా విద్వాంసులైన, సుక విస్తోమంబున్ = సత్కవులయొక్క సమూహమును, రప్పించి = పిల్వనంపించి అనియర్థము. వాణిఁ దాల్చు = మధురవాక్యములను వహించుచున్న యనియైనను, సరస్వతీదేవికి వాహనములై వహించు చున్న యని యైనను జెప్పవలయును. సుకవిస్తోమంబున్ = కవులనఁగా నిక్కడ జలపక్షులు, సుకవులనఁగా జలపక్షిశ్రేష్ఠములైన రాజహంసము, వానియొక్క సమూహమును, రప్పించి యని యర్థాంతరము. తత్ = ఆవిద్వత్కవులయొక్క ఘనవిద్యామహిమలు = ఘనమయిన విద్యా ప్రభావము లను, కరామలకముల్గావించెన్ = కరతలామలకము లగునట్టులుగా అనఁగా సర్వము బోధపడునట్టులుగాఁ జెప్పించెనని యర్థము. ఆరాజహంసలయొక్క మధురవాక్యరూపము లైన విద్యాప్రభావములను జెప్పించెనని యర్థాంతరము. గిరికాదేవి పద్మినీజాతిస్త్రీ గనుకఁ బద్మినికి హంసపలుకు లర్హములని విచారింపవలయును.

పద్మినీజాతి లక్షణము.

శ్లో. 'వ్రజతిమృదుసలీలారాజహంసీవతన్వీ త్రివళిలలితమధ్యా హంసవాణీసువేషా,
మృదుశుచిలఘుభుక్తే మానినీ గాఢలజ్జా ధవళకుసుమవాసావల్లభా పద్మినీస్యాత్.

అనియున్నది. మఱియుం గళాశాస్త్రమున నీసభాగము.

రాజీవగంధి నద్రాకేందుబింబాస్యనీలోత్పలశ్యామనిర్మలాంగి,
సద్గుణచారిత్ర సత్యవ్రతాచార తరుణఖరంగాబ్జధవళనేత్ర,
పాటలాధరరక్తపల్లవమృదుపాణిగానవిద్యాలోలదానవిభవ,

హంసభాషిణిమణిహార విభూషితమదమదావళయానమధురభుక్తి,
విమలవస్త్రంబుఁ బద్మినివేడ్కఁబట్టు'

అని చెప్పంబడియున్నది. ఆత్మీయ=తనసంబంధమైన, నూతన = అభినవమైన, పద్మోపచయంబు = పద్మయనఁగా లక్ష్మి, (ని. 'క్రమాత్సఙ్ఖ్యాహస్తిబిన్ద్వో శ్చిఖి ఫృష్ఠ్యాహస్తరాహిషు, అబ్జే శార్ఙ్గి శ్రీయోః పద్మః క్లీబే పుంస్యస్త్రియాం స్త్రీమాప్.' అని అ.) లక్ష్మీసమృద్ధిని - అనఁగా సంపత్సమృద్ధిని, అశేషము = సమస్తంబును, తత్ప్రాప్తంబు గావించుచుఁ = ఆసక్కఁవిప్రాప్తముగాఁజేయుచును అని యర్థము. తన సంబంధమైన నూతనకమలస్తోమమును రాజహంసప్రాప్తముగాఁ జేయుచుననిని యర్థాంతరము. తద్ఘనవిద్యామహిమ లక్కరామలకము గావించెనని సంబంధము. వాణివాల్చు సుకవిస్తోమము గిరిక కుపాధ్యాయులగుటచే వివిధవిద్యలను బోధించుటకుఁ జెక్కుండ్రుకవులను శుక్తిమతి నియోగించెనని భావము. కావుననే సర్వవిద్యలు అరచేతియుసిరికపండువలె సాధ్యమయ్యెనపుట. రక్షించెననుటచే విద్యాబోధమునకు శుక్తిమతి యుత్తమోత్తములను వారివారి ప్రఖ్యాతులవిని రావించెనని యాశయము. వారిశ్రమకుఁదగినట్లు సంపదనంతయు వారికి స్వాధీనపఱచుచుండెననుటచే స్వయముగఁ గుమారివిద్యా పరీక్షజేసి యెప్పటికప్పుడె సత్కరించుచుండెనని భావము. నదియంచల రక్షించి వానికిఁ దనయొందలి తమ్మిసిరి కైవసముచేసి నడబెడంగు నేర్పించెనని యర్థాంతరము.

సోమకవిమతమున అలంకారము. అభేదాతిశయోక్తి.

శబ్దశక్తిమూలధ్వని యనియుఁ బ్రకృతాప్రకృతశ్లేషమనియుఁ గొందఱు.

ఉ. అన్నగశేఖరుండును మహామణికూటసమర్పణంబుచేఁ
గిన్నరకోటులన్నిలిపి గేయవిశారదఁ జేసెఁ గూఁతునుం
గిన్నర మీఁట వీణఁ బలికింపఁగ గీతములుం బ్రబంధము
లన్నియుఁ బాడఁ జెప్ప ననివారితచాతురి గల్గునట్లుగాన్. 33

అన్నగశేఖరుండును = పర్వతశిఖామణియైన యాకోలాహలుఁడును, మహామణికూట సమర్పణంబుచేఁ = కూటశబ్దము రాశియందును బర్వతశృంగమందును వర్తించుచున్నది గనుక, మహాత్ = అధికములయిన, మణికూట=రత్నరాసులయొక్క, సమర్పణంబుచేఁ = ఈవిచేత నని యర్థము. మహత్తరములయిన, మణిమయ శృంగములయొక్క సమర్పణంబుచేతనని యర్థాంతరము. కిన్నరకోటులన్ని లిపి = కిన్నరులనఁగా దేవయోనివిశేషులు వారిని గొలువుంచి, కూఁతునుఁ = కొమార్తెయైన గిరికా దేవిని, కిన్నరమీఁటఁ = రెండుతీఁగెలుగట్టి వాయించునట్టి కిన్నరమీటుటకును, వీణఁ బలికింపఁగఁ = వీణను వాయించుటకును, గీతములుం బ్రబంధము లన్నియుఁ బాడఁ = గీతప్రబంధములు శృంగారముగాఁ బాడుటకును, చెప్పఁ = మఱియొకరికి శిక్ష చెప్పుటకును, అనివారితచాతురి గల్గునట్లుగాఁ = అడ్డములేని చాతుర్యము గలుగునట్లుగా, గేయ = సంగీతవిద్యయందు, విశారదఁజేసెఁ = ప్రగల్భ యగునట్లుగాఁ జేసెను.

అనఁగా గిరికాదేవిని పూర్వపద్యములోఁ దల్లి సాహిత్యకవిత్వ విద్యాప్రవీణురాలిగాఁ జేయించెననియును నీపద్యములోఁ దండ్రి సంగీతవిద్యాప్రవీణురాలిఁగా జేయించెననియును దాత్పర్యము. ఈరెండుపద్యములయందును నభేదరూపాతిశయోక్త్యలంకారము.

ప్రబంధలక్షణము సంగీతచూడామణియం దిట్లు చెప్పఁబడెను.

శ్లో. చతుర్భి ర్ధాతుభి ష్షడ్భి శ్చాంగై ర్యస్మాత్ప్రయుజ్యతే
 తస్మాత్ ప్రబంధః కథితః.

తన్మి పద్మోపచయము సమర్పించి సాహిత్యవిద్య చెప్పింపఁ దండ్రి మణిసమూహము సమర్పించి కిన్నరులచే సంగీతము నేర్పించెను. శిఖరములు కిన్నరనివాసయోగ్యములగుటచేఁ గిన్నరకోటులు బోధకులగు నవకాశము చిక్కెనది. సాహిత్యము కరతలామలకమైనట్లు గిరికకు సంగీతమున ననివారితచాతురి కలిగెను. దీనిచే గిరిక సంగీతసాహిత్యములలో నేర్పరియని తెలియును.

శా. వీణావాదనవేళలన్ ఘుమఘుమా♦విర్భూతి నింపన్ జగ
 త్ప్రాణాచంచలతైలశూన్యనవదీ♦పశ్రేణి కాపాది యై
 రాణింపన్ ముఖలక్ష్మికిన్ ముకుర మై ♦ రంజిల్ల లేఁబట్టికిన్
 మాణిక్యాయతనం బొనర్చి గిరి యా♦త్మశ్రీప్రభావంబునన్. 34

వీణావాదనవేళలన్ = వీణవాయించు సమయములయందు, ఘుమఘుమావిర్భూతి నింపన్ = ఘుమఘుమయనెడు ఘుంకారముయొక్క యావిర్భావమును నిండించుకొఱకును, జగత్ప్రాణ=వాయువువలన, అచంచల=చంచలములుగాని, తైలశూన్య=తైలాపేక్షలేని, నవ=నూతనములయిన, దీప = దీపములయొక్క, శ్రేణికిన్=పఙ్క్తికి, ఆపాదియయి = సంపాదకమయినదై, రాణింపన్ = ప్రకాశించుటకొఱకును, ముఖలక్ష్మికి న్ముకురమయి రంజిల్లన్=ముఖశోభకు అనఁగా ముఖము గనుపడుటకు నద్దమయి యొప్పుచుండెడు కొఱకును, లేఁబట్టికిన్ = లేతప్రాయముగల ముద్దుకూఁతునకు, గిరి = కోలాహలుఁడు, ఆత్మశ్రీప్రభావంబునన్=తనయొక్క సంపత్ప్రభావముచేత, మాణిక్యాయతనంబొనర్చెన్ = పద్మరాగమణి మయమయిన గృహమును గల్పించెను.

గిరిక వీణాదికములతో గానము చేయుచుంటకుఁ దండ్రి తనసంపత్ప్రభావమున మణిగృహము నిర్మించెను. అందుఁ జెక్కఁబడిన పద్మరాగములు గాలికారిపోని దీపములుగనున్నవి. ఆమందిరము గిరికముఖలక్ష్మికి దర్పణముగానున్నది. రత్నములు పాషాణజాతులగుటచేఁ బ్రతిధ్వనించుటవలన గానము ఘుమఘుమావిర్భూతి నించుచుండె నని భావము. ముఖలక్ష్మియనుటచే ముఖసౌందర్యాతిశయము సూచితము.

ఉ. అనగజాత యీాతరుణి ♦ యావనదేవత లీవయస్యలా
 మానవనాథపాదనఖ♦మర్దితభూధర మీానగోత్తమం
 బీనగమౌళిపై నెసఁగు ♦ నీమణిధామము లీకొలంకు లీ
 కోనలు నీనికుంజములు♦కుంజరయానవిహారరంగముల్. 35

అనగజాత యీాతరుణి = అకోలాహలాద్రివలన జన్మించినదియ యీాచిన్నది. అవనదేవత లీవయస్యలు=ఆవనదేవతలే యీాచెలికత్తియలు, ఆమానవనాథ = ఆవసురాజుయొక్క, పాదనఖ = కాలిగోటిచేత, మర్దిత=పీడింపఁబడిన, భూధరము=పర్వతమే, ఈనగోత్తమంబు = ఈపర్వతశ్రేష్ఠము, ఈనగమౌళిపైనెసఁగు = ఈపర్వతశ్రేష్ఠముపై నొప్పుచున్న, ఈమణిధామములు = ఈపద్మరాగమణిమయములయిన గృహములును, ఈకొలంకులు=ఈతామరగుంటలును, ఈకోనలు=ఈలోయలలోనున్న వనప్రదేశ

ములును, కానికుంజములు=కాపొదరిండ్లును, (ని. 'నికుఞ్జ కుఞ్జౌ వాక్లీబే లతాదిపిహితోదరే' అని అ.) కుంజరయానవిహారరంగములు=ఏనుగు నడుపులవంటి నడుపులుగల గిరికాదేవియొక్క విహారస్థలములు. (ని. 'మతఙ్గజో గజో నాగః కుఞ్జరో వారణః కరీ' అని అ.)

తరుణికుంజరయానయనువిశేషణమువలన గిరికా ద్వితీయయౌవనము సూచితము. ద్వితీయ యౌవన ముపభోగ్యార్హము. ద్వితీయ యౌవనలక్షణము చనుగవయొక్కయుఁ బిఱుదులయొక్కయు వ్రేఁగుచే మందముగ నడుచుటయుఁ దరుణీపదప్రయోగము సూచించును.

క. అని వనిత యుపరిచరవసు, జననాయకుకథయుఁ గన్యజననాగతియుఁ
వినయంబున వినుపింపఁగ, విని యమ్ముని సమ్మదాబ్ధివీచికిఁ దేలెన్. 36

అని=ఈప్రకారముగా, వనిత=మంజువాణి, ఉపరిచరవసు జననాయకు కథయుఁన్=ఉపరిచర నామముగల వసురాజుయొక్క వృత్తాంతమును, కన్యజననాగతియుఁన్ = గిరికాదేవియొక్క జన్మపు రాకయు, వినయంబున వినిపింపఁగన్=నమ్రభావముచేత వినుపింపఁగా, అమ్ముని=ఆకపటయతి, విని= ఆలకించినవాఁడై, సమ్మదాబ్ధి=సంతోషసాగరముయొక్క, (ని. 'ముత్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమోదామోద సమ్మదాః' అని అ.) వీచికన్=తరంగమందు, (ని. 'భంగ స్తరంగ ఊర్మిర్వా స్త్రియాం వీచిః' అని అ.) తేలెన్=ఓలలాడెను.

తనకథయుఁ గన్యకాజననకథ విని వసురాజు నానందించెనని భావము.

మ. లతికాసంవృతగాత్రుఁడై నిజకథాలాపంబు లాలించుభూ
పతి యచ్చో హితునేర్పు బోటివచనప్రాగల్భ్యముం గన్యయు
న్నతగోత్రోద్భవవైభవంబును మది న్వర్ణించి యూహించె ధ
న్యత నాశుక్తిమతీఝరీజనితరత్నం బాత్మవిత్తంబుగాన్. 37

లతికా=తీఁగెలచేత, సంవృత=లెస్సగా నావరింపఁబడిన, గాత్రుఁడై = దేహముగలవాఁడై- అనఁగాఁ దీఁగెలచాటునఁ గనుపడక యున్నవాఁడై, నిజకథాలాపంబు లాలించు=తనయొక్క వృత్తాంత వాక్యములను వినుచున్న, భూపతి=వసుమహారాజు, అచ్చోహితునేర్పు=అక్కడ నర్మసఖునియొక్క చాతుర్యమును, బోటి వచనప్రాగల్భ్యముఁన్=మంజువాణియొక్క వాక్ప్రౌఢిమయును, కన్యయున్నత గోత్రోద్భవ వైభవంబును=గోత్రమనఁగా వంశంబును బర్వతంబును గనుక ఆచిన్నదాని యుత్తమ వంశసంభవముయొక్క విభవమునని యర్థము. ఉత్తుంగపర్వతమువలని సంభవమని యర్థాంతరము. మదిన్వర్ణించి = తనమనస్సునందు మెచ్చుకొని కొనియాడి, ధన్యతన్ = కృతార్థతచేత, ఆశుక్తిమతీ ఝరీ జనితరత్నంబు = ఆ శుక్తిమతీనదివలన జన్మించిన కన్యారత్నమును, ఆత్మవిత్తంబుగాన్=తన స్వామ్యముగా, ఊహించెన్=భావించెను. అనఁగా శుక్తిమతీనది తనయధీనమయి యుండినదిగనుక దాని యందుఁ బుట్టిన యోగ్యవస్తువు లన్నియును దనసొమ్ములగుటచేత గిరికాదేవియును దనసొమ్మని యూహించెనని తాత్పర్యము.

కన్యయున్నతగోత్రజననము చెలిమికత్తె మాటలనేర్పు మిత్రునినైపుణ్యము తలంచినంత గిరి కను తనధనముగా వసురాజు భావించెనని భావము. హితుఁడు నేర్పుచే గిరికను సమకూర్పఁగలఁడు. చెలికత్తె నేర్పరిగాన నెటులేని యనుకూలపఱుపఁగలదు. గిరికయాభిజాత్యము వరిణయయోగ్యము

గాన వసురాజు గిరిక నాత్మవిత్తముగ భావించెను. తనరాజ్యములోనున్న శుక్తిమతీజనితరత్నములు తనవిత్తములె. "రత్నహారీతు పార్థివః" యన్నట్లు ప్రశస్తవస్తువులన్నియు రాజువేగాన తనవిత్తమని రాజూహించెను.

శా. మాయామానియు నంతఁ గొంతతడ వాత్మధ్యానవిజ్ఞానము
ద్రాయత్తంబున నున్నయ ట్లలరి కాంతారత్నముం బల్కు. లే
మా యేమాంతరదృష్టిఁ జూచితిమి భామాభావిభాగ్యోదయం
బీయబ్జాననఁ బెండ్లియాడు వసురాజేంద్రుండు వాలాయమున్. 38

మాయామానియున్=కపటమునీశ్వరుఁడును, అంతన్=ఆమీఁదట, కొంతదడవు=కొంతసేపు, ఆత్మధ్యాన=పరమాత్మధ్యానమందలి, విజ్ఞానముద్రా=చిన్ముద్రయొక్క, ఆయత్తంబునన్ = అధీనతచేత, ఇది భావప్రధాననిర్దేశము. ఉన్నయట్లు=ఉన్నవానివలె, అలరి=ఒప్పినవాఁడై-అనఁగాఁ జిన్ముద్రపట్టి యోగసమాధియందు నున్నవానివలె నుండి యనుట. కాంతారత్నముంబల్కున్=మంజువాణినిగూర్చి పలికెను. ఏమనియనిన, లేమా=ఓమంజువాణీ, భామా=గిరికయొక్క, భావి=భవిష్యత్కాలమందలి, భాగ్యోదయంబు=అదృష్టముయొక్క యున్నతిని, ఏమాంతరదృష్టిఁ జూచితిమి=మేము జ్ఞానదృష్టిచేతఁ జూచితిమి. అస్మచ్ఛబ్దమునకు బహువచనమున 'ఏతయోర్బహుత్వేమః' న. అనుసూత్రముచే మువర్ణకము రావలసియుండియు, (ప్రథమాయామేదస్మదః' న.) అనుసూత్రముచేఁ బ్రాతిపదికమయిన నా అను నక్షరమునకు సర్వాదేశముగా ఏకారమువచ్చినది. గాన ఏము అని యయినది. వసురాజేంద్రుండు=వసురాజశ్రేష్ఠుఁడు, వాలాయమున్=సిద్ధముగా, ఈ యబ్జాననఁ బెండ్లియాడున్=ఈగిరికాదేవిని వివాహము చేసికొనఁగలఁడు అని పలికెనని సంబంధము.

ముని కొంచెముసేపు ధ్యానముద్రతో నున్నటుల నటించి నేనంతరంగదృష్టితోఁ గాంచితిని. ఈ బాలికను వసురాజేంద్రుఁడు పెండ్లియాడునని చెలికత్తెలకుఁ దెలిపెను.

తే. రమణి యిట్టికాంతాలోకరత్న మమరఁ, జేసినవిధాత వసువుతోఁ జేర్పఁడేని
నాతనినిసర్గమధురసర్గానుభావ, మఖిలభువనప్రసాధనం బగుట యెట్లు. 39

రమణీ=ఓమంజువాణీ, ఇట్టి=ఇటువంటి, కాంతాలోకరత్న మమరఁజేసినవిధాత = స్త్రీజనరత్నమయిన గిరికాదేవిని నొప్పిదమగునట్టులుగా సృజించిన బ్రహ్మ, వసువుతోఁ జేర్పఁడేనిన్=వసురాజుతోఁ గూర్పకపోయినట్టు లాయెనేని అని యర్థము. కాంత=మనోహరమయిన, ఆలోక=ప్రకాశముగల, రత్న మమరఁజేసిన విధాత=మాణిక్యము నొప్పిదమగునట్టులుగాఁ బుట్టించినబ్రహ్మ, వసువుతోఁ జేర్పఁడేనిన్=కాంచనముతోఁ గూర్పకపోయినట్టు లాయెనేని అని యర్థాంతరము. అతని=ఆబ్రహ్మయొక్క, నిసర్గ=స్వభావముచేత, మధుర సర్గానుభావము=మంజులమైనసృష్టి ప్రభావము, అఖిల భువనప్రసాధనం బగుట యెట్లు=సకల జగదలంకార మగుట యేరీతిగా నని యర్థము. అనఁగాఁ గావేరదని భావము.

వి. 'అనర్ఘ్యమపి మాణిక్యం హేమాశ్రయ మపేక్షతే' అని యున్నది గనుక మాణిక్యము బంగారముతోఁ జేరక యలంకారము కాదని చెప్పినాఁడు. కావున నీకాంతా(లోకరత్నము) వసువుతో (బంగారముతో) బ్రహ్మ చేర్పఁడేని 'స్వభావమధురమగు బ్రహ్మ సర్గప్రతిభ' వ్యర్థమగును: ఉత్తమవస్తు

వును ఉత్తమవస్తువుతోఁ గూర్చుటయే సమస్తజగదలంకారము. నేర్పరియగు బ్రహ్మ గిరికను వసురాజుతోఁ జేర్చుటకు వేఱు తార్కాణ లవసరము లేదు. తనశక్తి జగదలంకారము గావించుకొనలేని యిరవురసమకూర్చుననిభావము. అతని నిసర్గ ఆపచో 'లోపశ్చవిభక్త్యాదే శ్చశ్లేషస్యా త్సమాసకాఙ్క్షేషు' న. అనుసూత్రముచే యొక్క యనువిభక్తికి లోపమువచ్చినది.

చ. నెలఁతలలోఁ ద్రిలోకనుత•నిర్మలరూపకలాపధన్య యీ
కులగిరిరాజకన్య నృప•కోటులలో వసురాజు మేటి య
య్యలఘుఁడు నీలతాంగియు ల•తాంతముఁ దావియుఁ బోలి యేకమై
వెలయఁగఁ గన్నులారఁ గను•వేడుక వేగమ మీకుఁ గల్గెడిన్. 40

నెలఁతలలోన్=స్త్రీలలోపల, ఈకులగిరిరాజకన్య = ఈకోలాహలపర్వత రాజపుత్త్రియయిన గిరికాదేవి, త్రిలోకనుత=లోకత్రయముచేతను కొనియాడఁబడిన, నిర్మల = కళంకరహితమయిన, రూప=రూపమనఁగా, (శ్లో. 'ఆలేప్యారోప్య నిక్షేప్య బంధనీయై రభూషితమ్, యద్భూషిత మివా భాతి తద్రూప మితికథ్యతే.') అని యున్నదిగనుక నాప్రకారముగా వస్త్రాభరణ గంధమాల్యములచేత నలంకరింపఁబడక యలంకరింపఁ బడినట్లుండుట-అట్టిరూపమనెడు, కలాప = భూషణముచేత, ధన్య= కృతార్థురాలైనది. ఇక్కడ రూపంబ యలంకారము గాఁగలది గనుక నలంకారాపేక్ష లేనిదని స్ఫురించుచున్నది. నృపకోటులలోన్=రాజసమూహములలో, వసురాజు మేటి=వసురాజు సర్వోత్తముఁడు కాఁబట్టి, అయ్యలఘుఁడున్=ఘనుండైన యావసురాజును, ఈలతాంగియున్ = ఈగిరికాదేవియును, లతాంతముఁ దావియుఁబోలి=పువ్వుంబును బరిమళంబును నేలాగున నుండునో యాలాగున, ఏకమయి=భేదములేక, వెలయఁగన్=ప్రకాశింపఁగా, కన్నులారఁగను వేడుక=కన్నులనిండఁ జూచెడు వేడుక, వేగమమీకుఁ గల్గెడిన్=మీకు శీఘ్రముగాఁ గలుగఁబోవుచున్నది. (వ్యా. 'నెలఁతలలోన్, నృపకోటులలోన్') అను నీరెండుపదములును నిర్ధారణోద్భవషష్ఠీవిభక్త్యంతరూపములు, దీనికిం బ్రమాణము. 'లోపల నిర్ధారణోద్భవాషష్ఠీ'అని నన్నయభట్టీయము. లోపలవర్ణకము లోవర్ణకమున కుప లక్షణము.

గిరిక త్రిలోకనుతనిర్మలరూపకలాపధన్యగాన స్త్రీలలో నుత్తమురాలు, వసురాజు మేటి, అలఘుఁడు గాన నతఁడు పురుషులలో నుత్తముఁడు. తావిచేఁ బూవువన్నె కెక్కినట్లు వసురాజును జెట్టఁబట్టి గిరికయుఁ బూవుచేఁదావి వన్నెకెక్కినట్లు గిరికను జెట్టఁబట్టి వసురాజు నేకీభావముగఁ దావిని బూవును విడదీయరానటు లేకాభిప్రాయముతో నలరఁగలరనిభావము. వేగముగ నీవేడుక చేకుఱు ననుట వసురాజుసమీపమున నుండెనని సూచించుట. అలం. ఉపమ. సమము.

వ. అనిన నమ్మందయాన సందియంబునఁ నిట్లనియె. 41

అనినన్=కపటయతి యీలాగని పలుకఁగా, అమ్మందయాన=ఆమంజువాణి, సందియంబునన్=సందేహముచేత, ఇట్లనియెన్=ఈలాగనిపలికెను.

ఉ. ఇన్నగరాజుఁ జూడ వసు•ధేశ్వరుఁ డెన్నఁడు వచ్చు వచ్చి యీ
క్రొన్ననతీవఁ జొంపములఁ•గోనకు నెన్నఁడు డిగ్గు డిగ్గి యీ
కన్నియఁ గన్నులారఁ గుతు•కంబున నెన్నఁడు గాంచుఁ గాంచి తా
నెన్నఁడు గారవించుఁ జెలు•లెన్నఁడు గాంతు రభీష్టసంపదల్. 42

ఇన్నగరాజుఁ జూడఁగ=పర్వతశ్రేష్ఠుఁడయిన యీకోలాహలునిఁ జూచుటకు, వసుధేశ్వరుఁ డెన్నఁడు వచ్చుఁగ=వసురా జెన్నఁడు విచ్చేయును, వచ్చి=విచ్చేసినవాఁడయి, ఈ క్రొన్నవతీవ జొంపముల కోనకు నెన్నఁడు డిగ్గుఁగ=క్రొత్తపూఁదీఁగె గుంపులుగల యీకోనకు నెన్నఁడు దిగును. తే. 'తీఁగె తీవియ లత కూన తీవ యనఁగఁ, దనరులతపేళ్లు పూవులు ననలు విరులు, పువ్వులలరులు నాసుమంబులగు సొంబ' అని సాంబనిఘంటువు. డిగ్గి=దిగినవాఁడయి, ఈకన్నియఁగ=ఈగిరికాదేవిని, కన్నులారఁగ=నేత్రానంద మగునట్టులుగా, కుతుకంబున నెన్నఁడు గాంచుఁగ=హర్షముచేత నెన్నఁడు చూచును. కాంచి=చూచినవాఁడయి, తా నెన్నఁడు గారవించుఁగ=తా నెన్నఁడు మన్నించును. చెలు లెన్నఁడు గాంతు రభీష్టసంపదల్=చెలికత్తియ లిష్టప్రాప్తి నెన్నటికిఁ బొందుచున్నారు. అనఁగా నిది యలభ్యమయిన కార్యముగదా యని భావము. మహారాజగు వసువు పెక్కుక్రీడాశైలములుగలవాఁడు. అన్నిఁటిని విడి యిట కెప్పుడు వచ్చును. వచ్చుఁగాక యీమహాశైలముననున్న యీ కొదరింటికి వచ్చినఁగదా దర్శనప్రాప్తి. వివిధములగు గిరివిశేషముల వదలి యీకన్నెను జూచుట యెటుల సమకూరును. శుభదర్శనోత్సుకలగు చెలిమికత్తెలకోర్కులు తీరుట యెపుడు.

చ. అని జవరాలు వెండియుఁ బ్రియమ్మున నమ్మునిఁ జూచి యోతపో
ధనమణి యీలతాంగి వసుధావరు నెన్నఁడు చెట్టవట్టునో
యని యనురక్తి పెంపుమెయి నాడితిఁ గాక శుభప్రసంగ మం
గనకు నొసంగఁ గొంగుముడి గాదె భవద్వచనంబు నావుడున్. 43

అని=యిట్లని, జవరాలు=మంజువాణి, వెండియుఁగ=తిరుగా, ప్రియమ్మునఁగ=ప్రీతిచేత, అమ్మునిఁజూచి=ఆకపటయతిని వీక్షించి, ఓతపోధనమణి=ఓమునిశ్రేష్ఠుఁడా, ఈలతాంగి=ఈగిరికాదేవి, వసుధావరుఁగ=భూనాయకుఁడయిన వసురాజును, ఎన్నఁడు చెట్టవట్టునోయని=ఎన్నఁడు పాణిగ్రహణము సేయునో కదా యని, అనురక్తిపెంపుమెయి నాడితిఁ గాక=అనురాగాతిశయముచేత నంటినిగాని, భవద్వచనంబు=దేవరవారియొక్క వాక్యము, అంగనకుఁగ=గిరికాదేవికి, శుభప్రసంగము=శుభసంగతిని, ఒసంగఁగ=ఇచ్చుటకొఱకు, కొంగుముడిగాదె=కొంగుముళ్లిగాదా. అనఁగా సిద్ధమయియున్నదియ కాదా యనుట. నావుడుఁగ=అనిపలుకఁగా, ఈపద్యమున వసుధావరుఁడెన్నఁడు అనుపాతముఁజేసి లతాంగిఁగ అని ద్వితీయ చేసినచో స్త్రీ, పురుషునిఁ జేపట్టుట యనువ్యుత్క్రమము పోవును. తపోధనమణివాక్యము కొంగుముడి. అనినంతన సాధ్యమగునదనుట. కాని యెన్నఁడు జరుగునో యనుట మునిపైన విశ్వాసమునఁ గాదు. అనురక్తి పెంపుగ 'అతిస్నేహః పాపశంకీ' యన్నటుల స్నేహాతిశయము సంశయములచేటు గావున నిటులంటిని. చెలికత్తియ మునికి క్షమార్పణము చెప్పినది.

మ. లలనా యీయెలనాఁగఁ బెండ్లి యగు వాలాయంబు చేదిక్షమా
తలనాథుం డిది నమ్మవేని నిజమంత్రప్రౌఢి రప్పింతు నా
నల నాసత్యసమానుఁ జూడు మని పంతం బొప్ప మాయాజపా
కలనాదంభము పూని మౌని దిశ లాకర్ణించి మజ్ఝా యనన్. 44

లలనా=ఓమంజువాణీ, ఈయెలనాఁగఁగ=ఈగిరికాదేవిని, చేదిక్షమాతలనాథుండు=చేదిభూమిశ్వరుఁడయిన వసురాజు, వాలాయంబు=సిద్ధముగా, పెండ్లియగుఁగ=వివాహముగాఁగలఁడు. ఇది

నమ్మపేనిన్ = ఈమాట నమ్మకపోయినట్టులాయెనేని, నల = నలచక్రవర్తితోడను, నాసత్య=అశ్వినీదేవతలతోడను, (ని. 'స్వర్వైద్యా వశ్వినీసుతౌ, నాసత్యా వశ్వినౌ దస్రా వాశ్వినేయౌ చ తావుభౌ' అని అ.) సమానున్=సౌందర్యమందు సమానుఁడయిన యావసురాజును, నిజమంత్రప్రౌఢిన్బ్రింతున్= నాయొక్క మంత్రప్రభావముచేత రక్షించుచున్నానని యర్థము. రహస్యాలోచన ప్రౌఢిచే రక్షించుచున్నానని యర్థాంతరము. చూడుమని = నాసామర్థ్యముచూడుమనుటకై, పంతంబొప్పన్ = శపథ మొప్పినట్టులుగా, మాయాజప = అబద్ధపుజపముయొక్క, ఆకలనా=చేయుటయనెడు, దంభముపూని= వ్యాజముపెట్టుకొని,(ని. 'కపటోఽ స్త్రీ వ్యాజ దమ్భో పధయ శ్ఛద్మ కైతవే, కుసృతి ర్నికృతి శ్శాఠ్యమ్' అని అ.) మౌని=ఆమునీశ్వరుఁడు, దిశలాకర్ణించి = దిక్కులాలించి, మజ్ఝాయనన్ = మజ్ఝా యనెడు నాకర్షణోపయోగియయిన శబ్దమును బలుకఁగా.

ఇక్కడ శ్లో. 'సంధానకుశలశ్చేటః' అని యున్నది గనుక సంధానకుశలత్వము చేతఁ గ్రీడాసఖునికిఁ జేటత్వము సిద్ధించుచున్నది.

మ. ఇది సంధింపఁగ వేళ యంచు వసురాజేంద్రుండు నీరంధ్రనీ
రదవారప్రతిసీర వెల్వడినతారాభర్తలీలన్ లతా
చ్ఛదసంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగభ్రమ
న్మదభృంగీరుతివందిమాగధకథామాధుర్యముం దెల్పఁగన్. 45

ఇది సంధింపఁగ వేళయంచున్=ఇది కలియుటకు సమయమని విచారించి, వసురాజేంద్రుండు= వసురాజశ్రేష్ఠుఁడు, నీరంధ్ర = దట్టమయిన, నీరదవార=మేఘసముదాయమనెడు, (ని. 'స్తోమౌఘ నికర వ్రాత వార సఙ్ఘాత సఞ్చయాః' అని అ.) ప్రతిసీర = తెరనుండి, (ని. ప్రతిసీరా యవనికా స్యాత్తిరస్కరణీ చ సా' అని అ.) వెల్వడిన = నిర్గమించిన, తారాభర్తలీలన్=చంద్రునివలె, లతాచ్ఛద= తీఁగెలయొక్క యాకులవలన నయిన, సంఛాదికన్ = ఆవరణమును, పాసి - వదలి - అనఁగా మునుకను విడిచిపెట్టి, నిల్చె నెదుటన్=స్త్రీలయొక్కయెదుట వచ్చి నిలిచెను. ఎలాగుననిన, సారంగ= మగతుమ్మెదలవిషయమయిన, రాగ = అనురాగముచేత, భ్రమత్ = తిరుగుచున్న, మద = మత్తుగొని యున్న, భృంగీ = ఆఁడుతుమ్మెదలయొక్క, రుతి = ఝుంకారమే, సారంగరాగ = సారంగనామక రాగమందు, భ్రమత్ = సంచారముచేయుచున్న, మదభృంగీరుతి=మదించిన యాఁడుతుమ్మెదలయొక్క నాదమువంటినాదముగలిగిన - ఈరెండర్థములకు నభేదాధ్యవసాయము. వందిమాగధ = గేయములయిన, కథా = చరిత్రలయొక్క, మాధుర్యముందెల్పఁగన్ = మధురభావమును దెలియఁజేయుచుండఁగా నిలిచెనని సంబంధము.

సంధింపఁదగిన వేళయని వసురాజు మాయామౌని పంతముచేయఁగనే నిశ్చయించెను. అంతకు మున్ను చివురులతోఁ బెనఁగొన్న తీవగుంపుచాటున వసురాజుండెను. సమయముగనిపట్టి తీవలనిటునటు త్రోసి ముందునకువచ్చెను. మేఘములమరుగునుండి బయటికివచ్చినచంద్రునివలె రాజు ప్రకాశించెను. రాజు తీవలఁగదల్చుటచేఁ గోడెతుమ్మెదలపై మరులుగొనియున్న మదించినయాఁడుతుమ్మెదలు ధ్వని చేయసాగెను. ఈధ్వని రాజునకప్రయత్నముగ వంధిమాగధస్తోత్రములయ్యెను.

సీ. తలిరుఁబ్రాయమువానిఁ బలరాజు నలరాజు నలరాజుఁ దెగడుసోయగమువానిఁ
బసిఁడిఛాయలవానిఁ బగడంబుజగడంబు జగడంబు గలమోవిసొగసువానిఁ

దళుకుఁజెక్కులవానిఁ దులకింపుఁబలుకెంపుఁబలుకెంపులొలయు నవ్వొలుకువానిఁ
జికిలిచూపులవానిఁ సిరిమించుదొరయించు దొరయించు కాంచనాంబరమువాని

తే. నొఱపుగలవాని మకుటకేయూర హారకటకకుండలచాకచక్యములవాని
నమ్మహీజానిఁ గని లేచి యమితవినయసంభ్రమముదోఁప నిలిచి రబ్జాతముఖులు.

తలిరుఁబ్రాయమువానిన్ = లేతవయస్సుగలిగినవాఁడును, వలరాజున్ = మన్మథుని. (గీ. 'మీసు మొసలిసిడంబుల మేటిచంద, మామయల్లుఁడు వలరాజు మరుఁడులచ్చి, కొమరుఁడను పేళ్ళవిలసిల్లుఁగుసుమ ధ్వని, వికతభవహాళ కాళిని వేళయాళ' అని యాంధ్రనామసంగ్రహము.) నలరాజున్ = నలచక్ర వర్తిని, అలరాజున్ = ఆచంద్రుని, తెగడు = తిరస్కరించునట్టి, సోయగమువానిన్ = చక్కఁదనము గలిగినవాఁడును, పసిఁడిచాయలవానిన్ = బంగారపుఁగాంతివంటి కాంతులు గలిగినవాఁడును, పగడంబు = పగడముయొక్క, జగ = శ్రేష్ఠమైన, డంబు = కాంతితోడ, జగడంబుగల = స్పర్థకలిగిన, మోవిసొగసు వానిన్ = అధరోష్ఠముయొక్క సొగసుగలిగినవాఁడును, జగమనుపదమునకుఁ బ్రయోగము. (గీ. 'జగ మెఱుంగుదాని జగమెఱుంగు' అని విజయవిలాసము ప్రథమాశ్వాసమందు ౪౪ వ పద్యము.) తళుకుఁ జెక్కులవానిన్ = తళతళమని మెఱయు చెక్కిళ్లుగలిగినవాఁడును, తులకింపు = సొగసైన, పలు కెంపు = దంతపురువిందములయొక్క, పలు = అపరిమితములైన, కెంపులు = అరుణకాంతులు, (గీ. 'కెంపు తొగరు తొవరు కెంజాయ యెఱు పెఱ్ఱ, యనఁగ నరుణకాంతి కాఖ్యలయ్యె' అని యాంధ్రనామ సంగ్రహము.) ఒలయు = వ్యాపించుచున్న, నవ్వొలుకువానిన్ = నవ్వుచిందుచుండువాఁడును, చికిలి చూపులవానిన్ = తేటగలచూపులుగలిగినవాఁడును, సిరిమించుదొర అనఁగా లక్ష్మీదేవిచే నతిశయించు చున్న శ్రీమహావిష్ణువు, ఆయనయొక్క, ఇంచు = న్యూనత్వమును, దొరయించు = పొసఁగఁజేయుచున్న, కాంచనాంబరమువానిన్ = బంగారపువస్త్రము గలిగినవాఁడును, అనఁగా విష్ణుదేవుని పీతాంబరమువంటి కాంచనాంబరము గలిగినవాఁడును ననియర్థము.

ఒఱపుగలవానిన్ = తేజస్సుగలిగినవాఁడును, మకుట = కిరీటముయొక్కయు, (ని. 'అథమకుటం కిరీటం పున్నపుంసకమ్' అని అ.) కేయూర = భుజకీర్తులయొక్కయు, (ని. 'కేయూర మఙ్గదం తుల్యే, అని అ.) హార = ముత్యాల హారముయొక్కయు, (ని. 'హారో ముక్తావళీ దేవచ్ఛందో సౌ శతయష్టికః' అని అ.) కటక = కడియములయొక్కయు, (ని. 'కటకం కరభూషణమ్' అని అ.) కుండల = కర్ణాభర ణములయొక్కయుఁ, (ని. 'కుణ్డలం కర్ణవేష్టనమ్' అని అ.) చాకచక్యములవానిన్ = చక చకాయమా నములైన కాంతులుగలిగినవాఁడును, అమ్మహీజానిన్ = ఆవసురాజును, కని = చూచి, లేచి = కూర్చున్న చోటనుండి లేచినవారై, అబ్జాతముఖులు = స్త్రీలు, అమిత వినయ సంభ్రమముదోఁపన్ = అపరిమితమైన వినయమును దొందరపాటును గనుపింపఁగా, నిలిచిరి = నిలుచుండిరి.

ఈపద్యమునఁ బెద్దపాదములయందు వాని యనుపదము నంత్యప్రాసముగా నుంపంబడియెను ఆ పాదములు పాదార్థము క్తపదగ్రస్తములుగాఁ జెప్పంబడియెను. అలం. ఉపమ.

మ. క్షితిపాలోత్తముఁ డంత సంతసమునం జేరంగ నేతెంచి 'చిం
తితకల్యాణసమృద్ధిరస్తు' నుచు సున్నిత్యుండు దీవింపఁగాఁ
గుతుకస్మేరముఖారవిందుఁ డయి కోర్కుల్మీఱ నారీజనా
ర్పితజాంబూనదపీఠిఁ బొల్చె జలజప్రేంఖన్మరాళం బనన్. 47

క్షితిపాలోత్తముఁడు=వసురాజు, ఆంతన్ = ఆమీఁదట, సంతసముసంధిలంగ నేతెంచి = సంతోషముచేత దగ్గఱకువచ్చి, చింతితకల్యాణసమృద్ధిరస్తు యటన్-చింతిత=తలంచుకొనఁబడిన, కల్యాణ=శుభములయొక్క, సమృద్ధిః = పరిపూర్తి, అస్తు=అవుఁగాక అని అర్థము. తలంపఁబడిన వివాహ సమృద్ధి యగుఁగాక యని భావము. అనుచున్=పలుకుచు, ('అనుకృతే స్త్రీవాక్యం తు' న. అనియుండుట చేత ననుకరణమందు సంస్కృతవాక్యము ప్రయోగింపఁబడియె.) సన్మిత్రుండు దీవింపఁగాన్ = మునివేష ధారణము చేసియున్న ప్రియసఖుఁడాశీర్వదింపఁగా, కుతుక = సంతోషయుక్తమైన, స్మేర = నవ్వుచున్న, ముఖారవిందుండై = కమలసదృశమైన ముఖముగలవాఁడై, కోర్కులొలయన్ = కోరికలతిశయించుచుండఁగా, నాళీజన = గిరికాదేవి చెలికత్తెలచేత, అర్పిత=సమర్పింపఁబడిన, జాంబూనదపీఠిన్ = సువర్ణమయమైన పీఠమందు, (ని. 'రుక్మం కార్తస్వరం జాంబూనదమష్టాపదోస్త్రియామ్, అని అ.) జలజ = తామరపువ్వుమీఁద, ప్రేంఖత్ = తూఁగియాడుచున్న, మరాళంబనన్ = రాజహంసమో యనునట్టులుగా, పొల్చెన్ = ప్రకాశించెను. అనఁగా సువర్ణపీఠముమీఁద సుఖాసీనుఁడై యుండె ననుట.

రాజుతనమిత్రుని నైపుణ్యమునకుమెచ్చి సంతోషముతోఁజేరవచ్చెను. మిత్రుఁడు "చింతిత కల్యాణ సమృద్ధిరస్తు" అని దీవించెను. తలంచినవివాహము నెరవేరుఁగాక యనియుఁ దలంచినశుభము నెరవేరుఁగాకయనియుఁ నర్థమొసంగుదీవన పద్మమువలె సుందరమగు రాజు ముఖమునఁ జిఱునవ్వును జనింపఁజేసెను.

చ. అనుపమకాంతివైభవసమన్వితు నావసురాజుఁ గాంచుప
ద్మిని సరసాంతరంగమున • మించె వినూతనరాగకందళం
బొనరె నఖండవాసనలు • నుత్కలికల్ విలసిల్లె నల్లన
ల్లన నిగిడెం బ్రమోదతరళస్థితులై తమిఁజొప్పుతుమ్మెదల్. 48

అనుపమకాంతివైభవసమన్వితున్ = కాంతి యనఁగా లావణ్యంబును బ్రకాశంబును, (ని. 'కాంతి శ్శోభా వరేణ్యయోః' అని అ.) ముత్యములోఁ దిరిగెడు నీరువలె నవయవములందుఁ బ్రకాశించునది లావణ్యమనిపించుకొనును, అనుపమ = సమానరహితమైన, కాంతివైభవ = లావణ్యసంపదతోడ, సమన్వితున్ = కూడుకొనిన, ఆవసురాజున్ = ఆ వసురాజనెడు అనుపమప్రకాశసంపదతోఁ గూడిన యా వసురాజు నన఼గా సూర్యుని ఇక్కడ వసువు లనఁగాఁ గిరణములు. (ని. 'వసుర్నా దేవభేదేషు యోక్త్రాగ్ని ధనదాంశుషు, మధురే తు త్రిషుక్లీబే సలిలే ధనరత్నయోః.' అని నా.) వానికి రాజుగావున వసురాజని సూర్యపరముగా విచారింపవలయును. కాంచు = చూచుచున్న, పద్మిని=పద్మినీజాతిస్త్రీ యయిన గిరికాదేవియనెడు పద్మలతయొక్క, సరసాంతరంగమునన్ = సరసమయిన హృదయమనెడి జలయుక్తమయిన యంతఃస్థిత కందమందు అనఁగా మూలదుంపయందు, వినూతన = అభినవమయిన, రాగకందళంబు = అనురాగాంకురమనెడు నభినవారుణాంకురము, మించెన్ = అతిశయించెను. అఖండ = సంపూర్ణములయిన వాసనలు-అనఁగా సాత్త్వికభావములైన రోమాంచకంపస్వేదాదికములనెడు నఖండసౌరభములు, ఒనరెన్ = ఒప్పెను. ఇక్కడ నఖండవాసనా జన్యములైన సాత్త్వికభావముల నఖండవాసనలని చెప్పినాఁడుగనుక జన్యజనకముల కభేదోపచారమని తెలియ

వలయును. ఉత్కలికల్విలసిల్లెన్ = ఉత్కలికలనఁగా శంకాసూయాది సంచారిభావములని చెప్ప వలయును.

ఉత్కలిక యనఁగా నౌత్సుక్యమనెడి సంచారిభావము గనుక బహువచనమువలన శృంగార రసమందుఁ బ్రయోగింపఁదగిన సంచారిభావములు తెలియఁబడుచున్నది.

శ్లో. 'శఙ్కాసూయా భయగ్లాని ర్వ్యాధి శ్చింతా స్మృతిర్ధృతిః
ఔత్సుక్యవిస్మయా వేగా వ్రీడో న్మాదో మ్మదా స్తథా.
విషాదో జడతా నిద్రా వహిత్థా స్వాపబం మృతిః
ఇతిభావాః ప్రయోక్తవ్యాః శృఙ్గారే వ్యభిచారిణః'

అసూచివి భావములులేక ఉత్కలికలనఁగాఁ దరంగములుగనుకఁ దరంగసదృశములైన సంచారి భావములు నుత్కలిక లనఁబడుచున్నవని విచారింపవలయును. అట్టి యుత్కలికలనెడు నుత్కలికలు అనఁగా నుద్గతములైనమొగ్గలు విలసిల్లెను. ఇక్కడ నుత్కలికలవలెనే యుత్కలికలు అనఁగాఁ దరంగ ములవలెనే సంచారిభావములు చూడఁబడుచున్నవి. ఏలాగననిన, సముద్రమందుఁ దరంగములుద్గ మించుచు లీనమగుచుండినవై యాసముద్రమునకు నుత్కర్షమును జేయుచును మఱలఁ దత్స్వరూ పత్వమును బొందుచు నేప్రకారముగా వర్తించునో యాప్రకారముగానే స్థాయిభావమైన రతియందు సంచారిభావములైన శంకాసూయాదులు వర్తించుచును ఆస్థాయిభావమును దమ్ము బోషించుచున్నవై రసాత్మకత్వమును బొందుచున్న వని విచారింపవలయును. ఇందుకు,

శ్లో. 'మజ్జంతశ్చనిమజ్జంతఃకల్లోలా స్తేయథార్ణవే
తస్యోత్కర్షం వితన్వంతి యాంతి తద్రూపతామపి.
తథాస్థాయినినిర్మగ్నాఉన్మగ్నా వ్యభిచారిణః
పుష్యంతి స్థాయినం స్వాంశ్చ తత్రయాంతి రసాత్మతామ్.'

అని చెప్పఁబడియున్నది. అల్లనల్లన నిగిడెం బ్రమోదతరళస్థితులై తమిఁ జూపుతుమ్మెదలు-ప్రమోద తరళస్థితులై - ప్రమోదమనఁగా హర్షమనెడు సంచారిభావము. శ్లో. 'హర్షోమనస్సముల్లాసో దేవీ గురుమహీభుజామ్, ప్రసాదాత్ప్రియసంగాచ్ఛభవేదిష్టార్థలాభకః' అని యున్నదిగనుక హర్షముచేతఁ జంచలస్థితి కలిగినవై, తమిన్ = తమకముచేత, చూపుతుమ్మెదలు=వీక్షణములనెడు భ్రమరములు, అల్ల నల్లననిగిడెన్ = అంతటంతటఁ బ్రసరించెను. నల్లనల్లన యనఁగానీలప్రకారమనిచెప్పవచ్చును. 'ప్రకారేగుణవచనస్య) యనెడు పాణినీయసూత్రముచేత ద్విర్భావము. 'ప్రకృతివద్వికృతిః' అని నన్నయ భట్టారకుఁడు.

తా. మనోహరస్వరూపుఁడగు నావసురాజునుగాంచినంతనఁ బద్మినీజాతి చెలువయగు గిరకా దేవి కనురాగము హృదయమున జనించెను. పిదప రోమాంచాదులగు సాత్త్వికభావములు శంకాది సంచారి భావములు కలిగెను. చూపులువసురాజుపైఁ బ్రమోదతరళస్థితిమైనొప్పెను. సూర్యుఁడుదయింపఁ దమ్మితీవియ దుంపయందు నెత్తినిమొలకత్రొత్తగాఁబుట్టెను. తావులచేనలరి యందు మొగ్గలుతలసూపఁ దుమ్మెదలు పంతసముతోఁ బైవ్రాలుచుండెనని యర్థాంతరము.

అలం. శ్లిష్టావయవరూపకము.

## రసవిచారము

ఇక్కడ రసవిచారము చేయఁబడుచున్నది. భావమనఁగా మనోవికారము. (శ్లో. 'వికారో మానసో భావః' అని అ. భావము.) సజాతీయమైన హాస్యశాంతరాసక్తిచేతను, విజాతీయమైన భీత్యాదికముచేతను గొట్టఁబడక సజాతీయవిజాతీయముల స్వస్వరూపముగాఁ జేయుచు సముఖపర్యంతము నిలిచియుండెనేని స్థాయిభావ మనిపించుకొనును.

శ్లో. 'సజాతీయై ర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్
యావద్రసం వర్తమానస్థాయీభావ ఉదాహృతః.
విరుద్ధైరవిరుద్ధైర్వా భావై ర్విచ్ఛిద్యతేనయః
ఆత్మభావంనయత్యన్యాన్ స్థాయీలవణాకరః.'

రతియనఁగా సంభోగవిషయమైన యిచ్ఛావిశేషము. ఇందుకుఁబద్యము,

క. 'తరుణులుఁ బురుషులు నితరేతరసంబంధేచ్ఛ నెలమిఁ దలకొనఁగాఁ ద
త్పరమతిఁ దివురుట శృంగార రసజ్ఞులమతమునందు రతియనఁబరఁగున్.'

రతియనెడుస్థాయిభావమునకు సముత్పత్తికారణము విభావమనిపించుకొనును. శ్లో. 'విభావకః కథ్యతే తత్ర రసోత్పాదనకారణమ్' రసమనఁగా రతియని తెలియవలెను. ఆవిభావ మాలంబనమనియు, నుద్దీపనమనియు రెండుతెఱంగులై యుండును. ఆలంబనమనఁగా రత్యాదులకు విషయీభూతులైన నాయికానాయకులు.

ఉద్దీపన కారణములు మలయానిల చంద్రాదులు
తత్ప్రబోధాయ మాల్యర్తుచందనేందూదయాదయః
ఉద్దీపన విభావాస్తే స్వతైస్సరతిగచ్ఛతి
మాల్యవస్త్రవిభూషణాదయో మాల్యాదయః
ఋతువయోమదాదయో ఋత్వాదయః
చందనస్నాన రూపాదయ శ్చందనాదయః
చంద్రోదయో ఘనధ్వని రుపకోస్మరణ
మిత్యాద్యా శ్చంద్రోదయాదయః. భోజుని సరస్వతీకంఠాభరణము.

ఉద్దీపనమనఁగా రూప యౌవన లావణ్యాది గుణములును హావభావాదిచేష్టలును నూపురాంగదాద్యలంకారములును మలయానిలచంద్రచందనాది తటస్థములును నిట్లు నాలుగువిధములుగలవై యుండును. శ్లో. 'ఆలంబనంతురత్యాదేర్విషయానాయకావిహ, ఉద్దీపనంతదుత్కర్ష హేతుస్తచ్చ చతుర్విధమ్. ఆలంబనగుణాశ్చైవ తచ్చేష్టాతదలంకృతిః, తటస్థాశ్చేతివిజ్ఞేయా శ్చతుర్థోద్దీపనక్రమః.' ఆలంబనగుణోరూపయౌవనాదిరుదాహృతః, తచ్చేష్టాయౌవనోద్భూత హావభావాదికామతాః.' శృంగారచేష్టలు పదునెనిమిదివిధములై యుండును.

శ్లో. 'హావోభావశ్చ హేలాచ మాధుర్యం ధైర్య మిత్యపి
లీలా విలాసో విచ్ఛిత్తి ర్విభ్రమః కిలికించితమ్.
మోట్టాయితం కుట్టమితం బిబ్బోకో లలితం తథా,

కుతూహలంచ చకితం విహృతిస్త్రాపి ఇత్యపి,
ఏవంశృంగారచేష్టాస్స్యురష్టావకపిధామతాః'

హృదయస్థితమైనరతి నభివ్యక్తము సేయుచున్న భ్రూవిక్షేపకటాక్షాదిక మనుభావ మనిపించుకొనును. శ్లో. 'భ్రూవిక్షేపకటాక్షాది వికారో హృదయస్థితమ్, భావంవ్యనక్తి యస్సోయ మనుభావ ఇతీరితః' పరగతములయినసుఖదుఃఖములయొక్క భావనచేతనయిన యంతఃకరణముయొక్క తన్మయీభావము సత్త్వ మనిపించుకొనును. 'సత్త్వేనసివృత్తా స్సాత్త్వికాః'

క. 'పరగతసుఖదుఃఖాదుల, నరయఁగ భావించి యట్టు లరుట సత్త్వ
స్ఫురణము తద్భవభావము, లరయఁగ సాత్త్వికము లయ్యె నది యెట్లన్నన్.'

శ్లో. 'స్తంభ ప్రళయ రోమాంచా స్స్వేదో వైవర్ణ్య వేపథూ
అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః.'

రతికి సహకారులయిన నిర్వేద గ్లాని శంకాదులు వ్యభిచారిభావము లనిపించుకొనును.

శ్లో. 'ఏకత్ర నియతాభావా రజ్యంతే వ్యభిచారిణః
తఏవాన్యత్ర సంచారా త్సంచారిణ ఇతిస్మృతాః.'

క. 'అహరహము రసోత్పత్తికి, సహాయభావంబు లెలమి సంచారులగున్
మహి నవి ముప్పదిమూఁడై, మహితములగు వీనికిం గ్రమము లేర్పఱతున్.'

నిర్వేద శ్రమ దైన్య జాడ్య నిద్రాశంకా ర్తిరుగ్గర్వాసంగ చపలతాదులైన సంచారిభావములు ముప్పదిమూఁడని తెలియవలయును. ఇది స్థాయిభావభావాదుల నిరూపణము. రతియనెడు స్థాయిభావము. కారణములైన యాలంబనోద్దీపన విభావములచేత నుత్పత్తినొందినదయి కార్యములయిన యనుభావములచేతను సాత్త్వికభావములచేతను నభివ్యక్తినొందినదయి సహకారులయిన సంచారిభావములచేతఁ బుష్టినొందినదయి యాస్వాద్యమానమగుచున్న శృంగార మనిపించుకొనును. భరతసూత్రము,

'విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః
విభావానాం రసస్యచ కార్యకారణ భావలక్షణ సంబంధః,
తథానుభావానాం రసస్యచ జ్ఞాప్యజ్ఞాపక భావలక్షణసంబంధః
ఏవం చైతాదృ శాత్యంత యోగాద్యథాక్రమ ముత్పత్తిర్జ్ఞప్తి పుష్టిశ్చభవతీతితదర్థః'

శ్లో. 'విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమాన స్స్వాదుత్వం స్థాయిభావో రసస్స్మృతః.'

క. పులకండంబులు గలిపిన, నలువగుసలిలము రసాయనం బగుపగిదిన్
లలితవిభావాదులచే, నలఘుతరస్థాయిభావ మమరున్ రసమై.

విభావము. అనుభావము సాత్త్వికము వ్యభిచారులచే నిర్భరానందరూపము నొందింపఁబడునది యగుస్థాయిభావమెరసము. కలకండ కలిపినతీయనినీరు మధురమగు పానకమగునటుల స్థాయిభావములు రసములగును. (రతిశృంగారమగును, హాసముహాస్యమగును, శోకముకరుణమగును, క్రోధము రౌద్రముగను ఉత్సాహము వీరమగును, భయము భయానకమగును, జుగుప్సబీభత్సమగును, విస్మయ మద్భుతమగును శమము శాంతమగును మాఱును.)

శ్లో. 'యథాహి తంతవో వేమ తురీయాద్యైః సమన్వితాః
పటాత్మనా పరిణతాః పటవాచ్యా భవంతి తే.
తథైవ స్థాయినో భావా విభావాదిభి రన్వితాః
రసాత్మనా పరిణతా రసవాచ్యా భవంతి తే'

ఇక్కడ అనుపమకాంతియను నీపద్యములో గిరికావరమునకు యుద్ధమందు సంపూర్ణమయిన శృంగారరసమును జెప్పినాడు. కాంతియుద్దీపనభావము. వసురాజాలంబనవిభావము. సరసాంతరంగమున మించె వినూతనరాగకందళం బనఁగా ననురాగయుక్తమయిన యంతరంగమునం దాయనురాగము పూర్ణమయ్యెననుట. అనురాగమనఁగా రతియనెడు స్థాయిభావము. కందళపదంబు పరిపూర్ణత్వమును దెలుపుచున్నది. వినూతనపదము స్పష్టార్థము. మించె ననెడిపదము పూర్ణత్వమును జెప్పుచున్నది. అపరిపూర్ణమయిన స్థాయిభావమనియుఁ బరిపూర్ణమయిన రసమనియును గ్రహింపవలయును. అఖండవాసన లనఁగా సాత్త్వికభావములు. ఉత్కళిక లనఁగా సంచారిభావములు. మోహములనఁగా ననుభావములు. ఈరీతిగా విభావానుభావ సాత్త్వికసంచారి సముల్లసితమయి స్థాయిభావమయిన యనురాగకందళము సంపూర్ణమయిన శృంగారరసమని గ్రహింపవలయును. ఇక్కడ రసప్రకారముఁ దెలియఁజేయనియెడలఁ బద్యార్థము స్పష్టముగాఁ దెలియదుగనుక గ్రంథవిస్తరమగునని తలంపక విపులముగా వ్రాయఁబడెను.

చ. తొలుదొలుతన్ విలోలగతిఁ • దొంగలిఱెప్పల నాని కర్ణకుం
డలరుచిధాళధళ్యములఁ • దాపున నల్లనఁ బొంచి మించులై
వెలువడి పూర్ణచంద్రుపయి • వెన్నెలపుల్గులచాలు వ్రాలులీ
లల విభుమీఁద వ్రాలె నవ•లానవలాలితదృష్టిజాలముల్. 49

నవలా=గిరికాదేవియొక్క, నవలాలితదృష్టిజాలముల్ = నూతన విలాసముగల వీక్షణసమూహములు, తొలుదొలుతన్ = ముందుముందుగా, విలోలగతిన్ = ఆసక్తిచేతను చపలత్వముచేతను అని యర్థము. (ని. 'లోల శ్చ లస తృష్ణయోః' అని వి.) తొంగలిఱెప్పలనాని - విప్పుగలకనుఱెప్పలయందుఁ గొంచెముసేపునిలిచి, కర్ణకుండల = చెవులకమ్మలయొక్క, రుచిధాళధళ్యముల = ఫళఫళయను కాంతులయొక్క, దాపున నల్లనఁబొంచి = చెంతను దిన్నఁగాఁ గొంతసేపు నిలిచి, ఈచెప్పుటచేతఁ గర్ణాంతవిశ్రాంతనేత్రాంతత్వము స్ఫురించుచున్నది. మించులయి = అతిక్రమించినవయియనియును మెఱుపు తీఁగెలవంటివయి యనియును అర్థము. వెలువడి = బయలుదేరి, పూర్ణచంద్రుపయి వెన్నెలపుల్గుల చాలు వ్రాలులీలన్ = సంపూర్ణచంద్రునిమీఁదఁ జకోరపక్షిశ్రేణి వ్రాలినట్టులుగా, విభుమీఁద వ్రాలెన్ = వసురాజుమీఁదఁ బ్రవేశించెను.

ఈ పద్యార్థమందు లజ్జాతిశయము స్ఫురించుచున్నదిగనుక నాయిక ముగ్ధయని తెలియవలయును. శ్లో. 'ఉదయద్యౌవనాముగ్ధాలజ్జావిజితమన్మథా' లజ్జయనునది సంచారిభావము. శ్లో. 'చేతస్సంకోచనంవ్రీడా వజ్ఞరాగస్తవాదిభిః' అని చెప్పఁబడియున్నది. దాపుశబ్దమునకు దత్వమువచ్చుటకుం బ్రమాణము.

తే. 'దంభడిండీర డోలికా డాడిమాది, శబ్దముల కాదివర్ణము ల్సంస్కృతమున

మపరివర్గతృతీయమైన యొప్పునట్లు, తెనుఁగున దకారము డవర్ణ మొనరుచుండు.'

తే. 'దాక దగ్గరి దిగ్గియ దాయఁబోయి, దాఁపలకు దిగ్గమను వైకృతముల మొదల
డాక డగ్గరి డిగ్గియ డాయఁబోయి, డాపలకు డిగ్గమని డాకదంగి నిల్చు.'

అప్పకవీయము.

నవలాశబ్దము దేశ్యమగుటవలన 'వర్గాణాంప్రథమస్యాంస్యాత్' అనుసూత్రము వర్తింపదు. 'నచదేశ్యపదే' యని చెప్పఁబడెనుగాన నీనియమము దేశ్యములందు వర్తింపదని భావము.

ప్రమోదదశస్థితులైన గిరికచూపులు విప్పగల ఱెప్పలలోఁ బరించుచుఁ గొంచెమునేపుండి యపాంగాంతములకు కనుల కొనలకుఁ జేరి కర్ణకుండల ధవళకాంతుల దరిపొంది వెన్నెలపులుఁగులు చంద్రుని పయి వ్రాలినటుల రాజువ్రాలెను.

వెన్నెలపుల్గులును జూపులును శ్వేతగణములోనివి. (చూపులను నలుపుగఁ జెప్పుపక్షముగూడఁ గలదు. దాని నన్యత్రచూడఁదగును) చూపులు తెల్లగా నుండుననుటకు.

శ్లో. శుభ్రాణి భారతీధర్మ శేషేశహరుణేందవః
రేణుః కేతక ఖర్జూరోక్తి కటాక్షాహాసకీర్తయః. కావ్యకల్పలత.

చంద్రికల్, దనుకంజూచెలతాంగి భూసురప్రఫుల్లనేత్రపద్మంబులన్. మనుచరిత్రము.

క. వసుధాసుధాంశుఁ బొదవుచు, వెస మఱలుచు మరలి మగుడ • వెడలుచు లలనా
లసమానదృష్టిజాతము, లసమాంబకు చిత్రశరము • లై విలసిల్లెన్. 50

వసుధాసుధాంశుఁబొదవుచున్ = భూలోకచంద్రుఁడయిన వసురాజును గ్రమ్ముచును, వెస మఱలుచున్ = వెంటనే మళ్ళుచును, మరలి = మళ్లినవయి, మగుడవెడలుచున్ = తిరుగా రాజుమీఁదికిఁ బోవుచును, లలనా = గిరికయొక్క, లసమాన = ఒప్పుచున్న, దృష్టిజాతములు = వీక్షణసమూహములు, అసమాంబకు = మన్మథునియొక్క, చిత్రశరములయి విలసిల్లెన్ = గమనాగమనములు సేయు బాణములయి ప్రకాశించెను.

చ. వనజదళాయతాక్షీనిడు • వాలికచూ పనిమేషవృత్తి నా
ఘనునవకంబుపైఁ బొలసి • కాంతతదీక్షణజాలకంబు పై
కొనినఁ ద్రపాబ్ధిఁ గ్రుంకియును • గోరికఁ గ్రమ్మఱఁ గూడఁ బారు. మో
హనగుణశక్తి నివ్వటిలు • నవ్వలరాయని నేర్పు పెంపునన్. 51

వనజదళాయతాక్షి = తామరఱేకులవలె విశాలములయిన నేత్రములుగల గిరికాదేవియొక్క, నిడువాలికచూపు = మిక్కిలియు సోగయయిన వీక్షణము, అనిమేషవృత్తిన్ = ఱెప్పపాటులేని వృత్తిచేత ననియును, అనిమేష మనఁగా మీనముగనుక మీనవృత్తిచేననియు నర్థము. ఆఘనునవకంబుపైఁబొలసి = ఆవసురాజుయొక్క చక్కఁదనముమీఁదఁ బ్రసరించియనియును, ఘనుఁడనఁగా మేఘుఁడును, కం = అనఁగా నుదకంబును గనుక నామేఘునియొక్క యభినవోదకముమీఁద వ్యాపించి యనియును నర్థము. కాంత = మనోహరమయిన, తత్ = ఆవసురాజుయొక్క, ఈక్షణజాలకంబు—ఈక్షణ = వీక్షణము లనెడు, జాలకంబు = వల, (ని. 'జాలం సమూహ ఆనాయో గవాక్షక్షారకా వపి' అని అ.) జాలజాలకశబ్దములు సమానములు, పైకొనినన్ = మీఁద నావరింపఁగా

అని యర్థము. త్రపాద్భిః గృహీకియయుచు=లజ్జయనెడు సముద్రమందు మునింగినదయ్యును, మోహన గుణశక్తిఁ = సమ్మోహనగుణసామర్థ్యముచేత, నివ్వటిలు = అతిశయించుచున్న, అవ్వలరాయని = అమన్మథునియొక్క, నేర్పు పెంపునన్ = నిపుణత్వాతిశయముచేతనని యును, మోహనగుణశక్తినివ్వ టిలు=గుణమనఁగా వ్రాఁడుగనుక మోహపుచ్చునట్టి వలత్రాఁటియొక్క సామర్థ్యముతోడ నతిశ యించుచున్న, అవ్వలరాయని=వలకు రాయఁడయిన యా శ్రేష్ఠహారియొక్క, నేర్పు పెంపునఁ = నిపుణత్వముచేత ననియును నర్థము. కోరికగ్రమ్మఁ గూడఁబాఱున్=అభిలాషచేతఁ దిరుగఁ బరి గొనునని యర్థము.

గిరికాదేవియొక్క చూపు వసురాజు చక్కఁదనముమీఁద వ్యాపించుచుండఁగా వసురాజు చూచునప్పుడు గిరికాదేవి సిగ్గుపడి చూపు త్రిప్పినను మన్మథోద్రేకముచేతఁ దిరుగఁ జూచెనని భావము. ఇందులో గిరికాదేవియందు లజ్జయును మదనవికారంబును సమానంబులుగాఁ జెప్పుటవలన మధ్యాత్వము స్ఫురించుచున్నది. శ్లో. 'సమాన లజ్జా మదనామధ్యా' అని లక్షణము. గిరిక తొలుత వసురాజును నిడువాలు చూపులతోఁ జూచెను. వసురాజాయమను జూచెను. అప్పుడు గిరికచూపులు లజ్జగొని వెనుదిరిగియు మన్మథుని నేర్పుపెంపుచే వలపుఁగొని వసురాజుముఖము పైకిఁగూడఁ బాఱె నని భావము. అలం. శ్లేషము.

తే. కౌతుకము వూని యొండొరుఁ • గాంచఁ దివురు
చంచలాక్షికిఁ బతికి నేత్రాంచలములు
గూర్చె వలరాచయొజ్జ కోర్కులు దలిర్ప
నది గదా భావిశోభన•వ్యంజకంబు. 52

కౌతుకమువూని = అభిలాషపడి, ఒండొరుఁగాంచఁ దివురు = పరస్పర విలోకనముసేయుట కుద్యుక్తులగుచున్న, చంచలాక్షికిన్=గిరికాదేవికిని, పతికిన్ = వసురాజునకును, వలరాచయొజ్జ= మన్మథుఁడనెడు నుపాధ్యాయుఁడు, కోర్కులుదలిర్పన్=కోరికలు చేకూరునట్లుగా, నేత్రాంచల ములు గూర్చెన్ = క్రీఁగంటిచూపులను జతకూర్చెను, అదిగదా=అదియకదా, భావిశోభనవ్యంజ కంబు=భావికాల శుభసూచనము.

నేత్రశబ్దము వస్త్రమందును వర్తించుచున్నది గనుక నేత్రాంచలమును గూర్చుట యన్నది వస్త్రాంచల సంయోజనరూపమయిన భావికాలశుభసూచకమని గ్రహింపవలయును. ని. 'నేత్రం వస్త్రే క్షి వైశాఖ గుణ భూరుహ మూలయోః' అని నా వస్త్రాంచల సంయోగమనఁగా బెండ్లి కాలమందు వధూవరుల యుత్తరీయపుఁ జేఁగులు రెండునుకూర్చి వేయు బ్రహ్మముడి-అనుపమ కాంతి యనెడి పద్యము మొదలుకొని యీపద్యము తుదిగాఁగల యనుమపద్యములలో గిరికాదేవికిఁ బ్రథమావస్థయయిన నయనోత్సవమును జెప్పినాఁడు. అలం. రూపకము.

సీ. కను గలవింటఁ జొక్కపుఁజవు ల్వట్టించి, నారిచేవిభ్రమోన్నతలు పెనచి
తమ్మితూఁపున రసోదగ్రత సవరించి, కంకేళిఁ బ్రబలరాగంబు నించి
యెలమావిఁ గేలంటి•యెలమి మిరాఁటగఁ జేసి, విరవాది నూష్మాభి•వృద్ధి నెఱపి
కలువచేఁదమి పెంపు•వెలయించిచిగురాకు, మొనలనాకులపాటు•మొనయఁజేసి

తే. యసమశరవీరపుంగవుఁ • డాత్తసాధ, నముల నన్నింటిచేఁ జూపి • కమిచి పోటు
గంటి దూరినరీతి వాఁ • ల్గంటిమనము, నవనిపతిచిత్తమును దూరె • నాక్షణమున.

కనుగలవింటఁ జొక్కుపుఁజవుల్పుట్టించి = కనుగలవిల్లనఁగాఁ గణుపులయొద్దనుండెడు గుంటలకుఁ గన్నులని పేరుగనుక నవిగల చెఱుకువిల్లు ఆచెఱకువింటిచేతను చవుల్పుట్టించి యనఁగాఁ బ్రేమఁ బుట్టించియని యర్థము. ప్రేమలక్షణము. (శ్లో. 'సప్రేమాయస్మిథోయూనోర్నిరూఢంభావబంధనమ్.) అని బహువచన మతిశయద్యోతనార్థము. అనఁగాఁ జవుల కాస్పదమైన సాధనముచేతఁ జవులు పుట్టించినాఁ డనుట. చెఱకుతుంటలు తీపిగలవని భావము. కనుగలవిల్లనఁగా జాగరూకమైన విల్లని యును విచారింపవలయును. నారిచే విభ్రమోన్నతులు పెనచి=తుమ్మెదనారిచేత భ్రాంత్యతిశయములను బెనఁగొనఁజేసి యని యర్థము, భ్రాంతియనునది మోహమను సంచారిభావమున కనుభావము. (శ్లో. 'మోహస్తు మూర్ఛనం భీతి ర్దుఃఖ శేషా నుచింతనైః') విభ్రమోన్నతులుగల సాధనముచేత విభ్రమోన్నతులు పుట్టించినాఁడనుట. తుమ్మెదలు భ్రమణముగలవని భావము. తమ్మితూఁపున రసోద్రగ్రత నవరించి, రసమనఁగా ననురాగము, అరవిందబాణముచేత ననురాగాతిశయము గలుగఁజేసి యనియర్థము. రసోద్రగ్రతగల సాధనముచేత రసోద్రగ్రత్వము గలుగఁజేసినాఁ డనుట. అరవిందము మకరందరసముగలదని భావము. కంకేళిఁ బ్రబలరాగంబు నించి=కంకేళి యనఁగా నశోకము. అశోకపుష్పబాణముచేత రాగాతిశయమును బూరించి యని యర్థము. ప్రబలరాగముగల సాధనముచేతఁ బ్రబలరాగమును నిండించినాఁడనుట. రక్తాశోకపుష్పము మిక్కిలి రక్తిమగలదని భావము. రక్తాశోకము మన్మథవృద్ధికరమని శాస్త్రము. (శ్లో. 'ప్రసూనకైరశోకస్తు శ్వేతో రక్త ఇతిద్విధా, బహుసిద్ధికరశ్శ్వేతో రక్తస్తు స్మరవర్ధనః.' అని.) ఎలమావిఁ గేలంటి యెలమిమీఱఁగఁ జేసి = చూతకుసుమబాణముచేత హస్తమును స్పృశించి యుత్సాహ మతిశయించునట్టులుగాఁ జేసి యని యర్థము. కేలంటి యెలమిమీఱఁజేయు సాధనముచేతఁ గేలంటి యెలమిమీఱఁ జేసినాఁడనుట. చూతము కేలనంటిన పుష్పించుచున్నదని భావము. విరవాది నూష్మాభివృద్ధి నెఱపి=విరవాదియనఁగా నవమల్లిక నవమల్లికబాణముచేత సంతాపాతిశయము ఘటింపఁజేసి యనియర్థము. సంతాపమనునది చింతయనుసంచారిభావమున కనుభావము. ('ఇష్టానధిగమాద్ధ్యానంచింతాశూన్యత్వతాపకృత్') ఊష్మాభివృద్ధిగల సాధనముచేత నూష్మాభివృద్ధిని ఘటింపఁజేసినాఁ డనుట. (ని. 'గ్రీష్మ ఊష్మకః' అని అ.) విరవాదులు గ్రీష్మర్తువందు వృద్ధిఁబొందుచున్నవని భావము. కలువచేఁ దమిపెంపు వెలయించి=తమియనఁగా నౌత్సుక్యము నీలోత్పలబాణముచేత నౌత్సుక్యాతిశయమును బ్రకటముచేసి యని యర్థము, ఇది ద్వంద్వసమాసము. ఇక్కడ నౌత్సుక్యమనునది సంచారిభావము. (శ్లో. 'కాలాక్షమత్వమౌత్సుక్యం మనస్తాపత్వరాదికృత్.') తమిపెంపుగల సాధనముచేతఁ దమిపెంపు వెలయించినాఁడనుట. తమి యనఁగా రాత్రి, (ని. 'రజనీ యామినీ తమీ' అని అ.) కలువలు రాత్రియందు వికసించునట్టివని భావము. ఇక్కడ మిశ్రసమాసము. చిగురాకు మొనల నాకులపాటు మొనయఁ జేసి=చిగురాకులనెడి మొనలుగల యాయుధములయొక్క మొనలచేత నాకులపాటనఁగా వ్యాకులత్వమును బొందించి యని యర్థము. వ్యాకులత్వ మనఁగాఁ జాపల్యమనెడి సంచారిభావము. (శ్లో. 'చాపలంత్వనవస్థానం రాగద్వేషాదిసంభవమ్') ఆకులపాటునకు హేతువైన సాధనముచేత నాకులపాటు నొందించినాఁ డనుట. చిగురాకులు మొనలు మాఁపువేళఁ బండుటాకులు రాలుచున్న వని భావము.

అసమశర వీరపుంగవుఁడు=మన్మథుఁడనెడు వీరపురుషశ్రేష్ఠుఁడు, ఆత్మసాధనముల నన్నింటిచేఁ జూపి=తనయాయుధము లెన్నికలవో యన్నిటిచేతను సారళ్యము గనుపఱచి, కమిచి=ఆక్రమించి, పోటుగంటి దూరినరీతిన్=పొడిచితీసి పోటుగంటిలోఁ దూరినట్టులుగా, వాల్గంటిమనము = గిరికాదేవి యొక్క మనస్సును, అవనిపతి చిత్తమును = వసురాజుయొక్క మనస్సును, దూఱె నాతఃణమునన్= తత్క్షణమునందే ప్రవేశించెను.

అనఁగా గిరికాదేవియును వసురాజును నొకరినొకరు జూడఁగానే మన్మథుఁడు తనసాధనము చైత్ర సద్దీపనమును బుట్టించి వెంటనే తానును వారి హృదయములయందుఁ బ్రవేశించెనని ఫలితార్థము. మదనవీరుఁడు తనబలమును బూర్తిగ నుపయోగించి తొలుతప్రేమ పిదపమోహము ఆవలననురాగము తరువాత ననురాగాతిశయము అపైని ఉత్సాహము సంతాపము ఔత్సుక్యాతిశయము వ్యాకుల భావము గిరికకు వసురాజునకుఁ గలిగించెను. తనయలరు బాణములచే నాయికానాయకులను గట్లు గూర్చి యిరువురి హృదయములందును బ్రవేశించెను. అలం - అతిశయోక్తి - సమము.

క. ఆరాజవదన హృదయము, నా రాజవరేణ్యు తలఁపు • నారసి మృదుగం
భీరతర వచనరచనా, పారీణత మంజువాణి • పలికెం బ్రేమన్. 54

ఆరాజవదన హృదయము = ఆ చంద్రముఖియగు గిరికయొక్క మానసంబును, ఆరాజవరేణ్యు తలఁపున్ ఆ వసురాజుయొక్క సంకల్పంబును, ఆరసి=విచారించి, మృదు=చల్లనైన, గంభీరతర = గూఢార్థయుక్తమైన, వచనరచనా పారీణతన్ = వాక్యరచనయందలి సామర్థ్యముచేత, మంజువాణి= మంజువాణియనెడు గిరికాదేవిచెలికత్తియ, ప్రేమన్=ప్రీతిచేత, పలికెన్=వచించెను. ఏమనియనిన- చిరకాల పరిచయమువలన గిరికహృదయము మంజువాణి యెఱుంగును. ముఖలక్షణాదులచే వసురాజు తలంపు నెఱుంగును. గావున పరస్పరదాంపత్యసంఘటనమునకు గంభీరతరవాక్య రచనా పారీణతమై పలికెను.

సీ. నేఁడు గా మాకనిం•దితపర్వసామగ్రి, సవరించె నీరాక • కువలయేశ
నేఁడు గా మాతమో•నివహంబు లడఁచె నీ, యాలోకమహిమ లో•కైకమిత్ర
నేఁడు గా మాకు స•న్నియుఁ గూర్చు నభిమతార్థములు నీసన్నిధి• రాజరాజ
నేఁడు గా మాకు మా•నితసౌమనస్యంబు, లొసఁగె నీసావాప్తి • వసుధరేంద్ర
తే. సురభిచరితుని నిన్ను ని•చ్చో భజింపఁ
గాఁ గలిగెఁ గాన సఫలతా•కలిత లైయె వె
లలె మదీయకాంతా రాగ•లక్ష్మి యింకఁ
దరమె మానాతిచిరభాగ్య•గరిమఁ బొగడ.

కువలయేశ = కువలయమనఁగా భూవలయము, భూవలయమున కీశుఁడైనవాఁడా, నీరాక=నీ యొక్క యాగమనము, నేఁడుగా మాకున్ = నేఁడుగదా మాకు, అనిందిత పర్వసామగ్రి=నిందితము గాని యుత్సవసామగ్రిని, సవరించెన్=చక్కపఱిచె నని యర్థము. అనఁగా నీరాక మాకు యోగ్య మైనపండుగయగునట్టులుగాఁ జేసెననుట. కువలయ మనఁగాఁ గలువ, కలువలకు రాజవైన చంద్రుఁడా నీరాకయనఁగా ఉన్నమం. మాకు ననిందితమయిన పర్వకాలమును ఘటింపఁజేసె నని యర్థాంతరము.

లోకైకమిత్ర=ఓయి సర్వజనముఖ్యాప్తుఁడా, నీ యాలోకమహిమ = నీయొక్క దర్శనప్రభావము, నేఁడుగా=నేఁడుగదా, మాతమోనివహంబు లడఁగించెన్ = మాయొక్క యజ్ఞాన సమూహములను పోఁగొట్టెనని యర్థము. లోకైకమిత్ర యనఁగా లోకబాంధవుఁడవైన యో సూర్యుఁడా నీయాలోకమహిమ యనఁగా నీప్రకాశమహత్త్వము అంధకారపటలము నణఁచెనని యర్థాంతరము. రాజరాజ= ఓరాజరాజ, నీసన్నిధి=నీసన్నిధానము, నేఁడుగా మాకున్ = నేఁడుగదా మాకు, అన్నియుఁ గూర్చె నభిమతార్థములు=అభీష్టవస్తువుల నన్నిఁటిని సమకూర్చెనని యర్థము. రాజరాజనఁగాఁ గుబేరుఁడు. (ని. 'రాజరాజో ధనాధిపః' అని అ.) ఓయి కుబేరుఁడా నీ సన్నిధి యనఁగా శ్రేష్ఠమయిన నిధి కనకాద్యర్థముల నన్నిఁటిని సమకూర్చెనని యర్థాంతరము. (ని. 'అర్థోఽభిధేయ రైవస్తు ప్రయోజన నివృత్తిషు' అని అ.) వసుధరేంద్ర = వసునామధేయుఁడవైన-భూమీంద్రుఁడా, నీపాదాప్తి= నీచరణప్రాప్తి, నేఁడుగామాకున్=నేఁడుగదామాకు, మానితసౌమనస్యంబు లొసగెన్=కొనియాడఁబడిన స్వస్థచిత్తతల నిచ్చెనని యర్థము. వసు ధరేంద్ర మనఁగాఁ గాంచన గిరీంద్రము. ఇక్కడ వసువనఁగాఁ గాంచనంబును ధరేంద్ర మనఁగాఁ బర్వతేంద్రంబునని తెలియవలయును. (ని. 'మహీధ్రే శిఖరి క్ష్మాభృ దహార్య ధర పర్వతాః' అని అ.) ఓయి కాంచనగిరీంద్రుఁడా, నీపాదాప్తి యనఁగా నీప్రత్యంతపర్వత ప్రాప్తి, (ని. 'పాదాః ప్రత్యంతపర్వతాః' అని అ.) మానితసౌమనస్యంబు లొసఁగె ననఁగా పూజితమయిన దేవత్వముల నిచ్చెనని యర్థాంతరము. ఇంతమట్టునకు నాలుగు పాదములయందును ప్రకృతాప్రకృతశ్లేషము.

సురభిచరితుని నిన్ను నిచ్చోభజింపఁగాఁ గలిగెఁ గానన్=పరిమళించుచున్న చరిత్రములు గల నిన్ను నిక్కడను సేవింపఁగలిగెను గనుక, (ని. 'సురభి ర్ఘ్రాణతర్పణః' అని అ.) మదీయ కాంతా రాగలక్ష్మి=మాగిరికాదేవియొక్క రాగలక్ష్మియనఁగా ననురాగసంపద. సఫలతాకలితయయి వెలసెన్= సఫలమయినదై ప్రకాశించె నని యర్థము. సురభిత యనఁగా వసంతర్తువు, (ని. 'వసంతే పుష్పసమయ స్సురభిః' అని అ.) వసంతసమయచరితము గలవాఁడవయిన నిన్ను భజింపఁ గలుగుటచేత మాయొక్క కాంతారమందలి యగలక్ష్మీయనఁగా వృక్షసమృద్ధి ఫలసహితమాయెనని యర్థాంతరము. కాంతార మనఁగా వనము. ఇఁకఁదరమె మానాతి చిరభాగ్యగరిమఁబొగడన్ = ఇఁకమీఁద మాగిరిక యొక్క శాశ్వతమయిన భాగ్యాతిశయమును గొనియాడ శక్యమా. మాన+అతిచిర = మిక్కిలిత్వరలో సమకూరనున్న యనియర్థాంతరము. రాజా! నీరాక మాకుఁబండు వెన్నెలరాకవలె హృదయమున కానందకరమయ్యెను. నీవుదయతోఁజూచుటచే మమ్మావరించిన తమోనివహము తొలంగెను. నీసన్నిధాన ప్రభావమువలన మాకభిమతార్థములు సమకూరెను. నీపాదప్రాప్తి మామనస్సులకు నిలుకడఁగూర్చెను నిన్నుఁజూచుటచే మాచెలిరాగము సఫలమయ్యెను. నీసందర్శనమువలన మేము గడించిన భాగ్యగరిమ పొగడఁజాలము.

చ. అనయము నీమహావనము ♦ నందినవారము గాని సజ్జనా
వనగుణధుర్య యేము కడ♦వారము గాము సుమయ్య నీవినూ
తనవిజయాంకగేయములఁ ♦ దావక చాటుకథా సుధారసం
బున నలరింతు మీభువన♦మోహినిఁ జిన్నటనాఁటనుండియున్, 56

సజ్జనావన గుణధుర్య = సుజనసంరక్షణరూపమైన గుణముయొక్క భారమువహించిన రాజా, అనయముఁ=నిరంతరమును, నీ మహావనము నందినవారముగాని = నీయొక్క మహత్తరమైన యవనమును, అనఁగా సంరక్షణమును బొందియున్నవారమేకాని, ఏము = మేము, కడపారముగాము సుమయ్యా=దూరమున నున్నవారము గాము సుమా స్వామీయని యర్థము. ఈకొప్పడియగు వనమునుబొంది యున్నవారమేకాని మఱియొకచోట నున్నవారముగామని యర్థాంతరము. ఇదియునుంగాక, నీ వినూతన విజయాంకగేయములఁ = నీయొక్క యభినవ జయచిహ్నములతోఁగూడిన గానములచేతను, తావక=నీసంబంధమయిన, చాటుకథా=స్తుతియోగ్యమయిన చరిత్రమనెడు, సుధారసంబులఁ = అమృతరసముచేతను, ఈభువనమోహినిఁ=జగన్మోహినియయిన యీగిరికాదేవిని, చిన్నటనాఁటనుండియుఁ= చిన్ననాఁటినుండి, అలరింతుము = సంతోషింపఁజేయుచుందుము, ఇక్కడ గానంబును గథాకథనంబును దటస్థోద్దీపనవిభావములని తెలియవలయును. గిరిక చిన్నతనమునుండి నీవిజయాంకగీతములఁబాడ నేర్చినది. మేముగూడ నీమనోహర కథాసుధాధారలఁ జవిజూపినారము కాన ననురక్తురాలగు గిరిక నీకుఁ దగియున్నది. భువనమోహిని గావున రూపవైభవసమృద్ధితో వెలయునీపాలంతి పరిగ్రహణయోగ్యరాలు. మేము గిరికకు నీపైవలపుఁ జనింపఁజేయుట నీసంరక్షణమునం దున్నందులకుఁ గృతజ్ఞత సూచకముగాననుట-

మ. అనఘామూల్యమణిప్రరోహముల నీకర్పించు నేదివ్యవా
హిని గౌరీపతికిన్ హిమాచలమునట్లేగట్టు నీకున్ విహా
రనగం బై తగు నట్టిశుక్తిమతియుం బ్రాలేయశైలేంద్రనం
దనుఁడుం గాంచిన కన్యఁగా నధిప యీతన్వంగి నెన్నం దగున్. 57

అనఘ=నిర్దోషములయిన, అమూల్య = విలువలేని, మణిప్రరోహములన్ = రత్నాంకురములను- అనఁగా మొలక ముత్తియములను, నీకర్పించు నేదివ్యవాహిని = ఏదివ్యనది నీకు సమర్పించుచుండునో- ఈయర్థమందు శుక్తిమతియనెడు పదము సాభిప్రాయము. ఇక్కడ రత్నాంకుర సమర్పణ యని శుక్తిమతికిఁ జెప్పుటచేతఁ దజ్జన్యమయిన గిరికాదేవిని రత్నాంకురముగా నధ్యవసించి యుత్తరత్ర రత్నాంకురసమర్పణిగాఁ గలదనెడి యభిప్రాయము సఖీవాక్యమున నభివ్యక్తమగుచున్నదని గ్రహింపవలయును. గౌరీపతికిన్ = పార్వతీనాథుఁడయిన శివునకు, హిమాచలమునట్లు = హిమవత్పర్వతమువలెనే, ఏగట్టు=ఏపర్వతము, నీకు న్విహారనగంబై తగున్ = నీకుఁ గ్రీడాపర్వతమయి యొప్పుచుండునో-ఇక్కడ గౌరీపతితో వసురాజునకును హిమవత్పర్వతముతోఁ గోలాహలపర్వతమునకును సాదృశ్యము చెప్పినాఁడు గనుక నీసాదృశ్యముచేత వసురాజునకు గౌరీసమానురాలయిన గిరికాదేవి పరిగ్రహణయోగ్యురా లని స్ఫురించుచున్నది. అట్టిశుక్తిమతియున్ = అట్టి శుక్తిమతీనదియును, ప్రాలేయశైలేంద్రనందనుఁడుం గాంచిన = హిమవత్పర్వత రాజపుత్రుఁడయిన కోలాహలుఁడును గన్నట్టి, కన్యఁగాన్ = కొమార్తెనుగా, అధిప = రాజాగ్రణీ, ఈతన్వంగిన్ = ఈచిన్నదానిని, ఎన్నం దగున్ = విచారింపఁదగును.

అనఁగా నీకు ముక్తామణుల నిచ్చుచుండెడు శుక్తిమతీనదియును నీకుఁ గ్రీడాపర్వతమయి యున్న కోలాహలుఁడును గన్నకొమార్తె యగుటచేత నీచిన్నది నీకు స్వకీయయయినదేకాని యన్యకా

రాలు కాదని భావము. మంచుమలపట్టియు దివ్యవాహినియగు శుక్తిమతియుఁ గన్నశిశు వీగిరిక. జననీ జనకు లాభిజాత్యులు. తనయందలి యమూల్యరత్నముల నీకర్పించు శుక్తిమతి నీకీ కన్యారత్నము నర్పింపఁగలదు. గౌరీపతికి హిమాద్రివిహారశైల మైనటుల నీకు కోలాహలశైలము విహారనగమై యున్నది. కావునఁ గోలాహలుఁడు పుత్రి నీకొసంగి బాంధవ్యము నెఱపునని భావము. అలంకారము. వస్తుధ్వని.

సీ. అడుగు వెట్టదు నవ్య • హరిచందనలతాంత, సరణిపైఁ గాని యీ • యరుణచరణ
కేల నంటదు కోర • కితపారిజాతవల్లరిఁ గాని యీ • యతి • లలితబాహ
తనువుఁ జేర్పదు నవో • దారమందారమంజులశయ్యఁ గాని యీ • సురభిళాంగి
పెదవిఁ జేర్పదు కల్ప • వృక్షవీజఫలసంతతియె కాని, యీ మోవి • తేఁపులాడి
తే. గురుకులక్రమాయాత మీ • గిరిజవల్లిఁ, దనము జననైకరయాఢ్య మీ • తటినిపట్టి
సరసగంభీరభావంబు • సహజసిద్ధ, మీనలినసోదరీమణి • మేనితావి. 58

ఈయరుణ చరణ=ఎఱ్ఱనైన పాదములుగల యీచిన్నది, నవ్య=నూతనమయిన, హరిచందన = హరిచందనమనెడు పేరుగల దేవతా వృక్షములయొక్క, లతాంత = చిగురుటాకులతోఁగూడిన, సరణి పైఁగాని=మార్గముమీఁదనేకాని, అడుగువెట్టదు = అడుగు మోపదు-అనఁగాఁ జిగురుటాకులకంటెనతిసుకుమారము లయిన పాదములు గలది గనుకఁ జిగురుటాకులమీఁదనే కాని నడువఁ జాలదని తాత్పర్యము. లతాంతశబ్దము పల్లవపరమయినందుకు,

శ్లో. 'నవపలాశపలాశ వనంపురస్స్ఫుట పరాగపరాగత పఙ్కజమ్
మృదులతాంత లతాంత మలోకయత్'

అని మాఘకావ్య షష్ఠసర్గమునందుఁ బ్రయోగము.

ఈయతిలలితబాహ=అత్యంతసుందరములయిన భుజములుగల యీచిన్నది, కోరకిత = మొగ్గయెత్తిన, పారిజాతమనెడు దేవవృక్షముయొక్క, వల్లరిఁగాని = తీఁగనేకాని, కేలనంటదు = చేతముట్టదు, ఈసురభిళాంగి=పరిమళించుచున్న దేహముగల యీచిన్నది, నవోదార=నూతనాతిశయముతోఁ గూడిన, మందార=మందారమనెడు దేవతరుపుష్పమయమైన, మంజులశయ్యఁగాని = మృదువయిన పానుపునందే కాని, తనువుఁజేర్పదు = పవ్వళింపదు, ఈమోవితేఁపులాడి = అధరమాధుర్యముగల ఈచిన్నది, కల్పవృక్షవీజ = కల్పవృక్షముయొక్క, ఫలసంతతియె కాని = ఫలసమూహమునేకాని, పెదవిఁజేర్పదు = పెదవి మీఁదఁబెట్టుకొనదు. అనఁగా మఱియొకఫలముల ననుభవింపఁ దనుట. నాలుగుపాదములయందును సమృద్ధిమద్వర్ణన చేసినాఁడుగనుక నుదాత్తాలంకారము.

ఈనాల్గుచరణములలో హరిచందనాది దేవతరువులయొక్క - పల్లవకోరకిత వల్లరీ పుష్పఫలములకును గిరికాదేవియొక్క పాద బాహు గాత్రాధరోష్ఠములకును సంబంధము సాదృశ్య పర్యవసాయి యగుచున్నది గనుక నుపమాలంకారము-సాదృశ్యమునందు అరుణచరణాంబుర, అతిలలితబాహ, సురభిళాంగి, మోవితేఁపులాడి యనెడు గిరికానామము సాభిప్రాయము లగుచున్నవి గనుకఁ బరికరాంకురాలంకారము. (శ్లో. 'సాభిప్రాయే విశేష్యేతు భవే త్పరికరాఙ్కురః' అని లక్షణము.) పల్లవిత కోరకిత పుష్పిత ఫలితత్వరూపములయిన నాలుగవస్థలను గ్రహించి నాలుగు దేవతరువులతో చెప్పినాఁడు.

కాగిరిజ = పర్వతపుత్రియయిన యీచిన్నదానియొక్క, చల్లఁదనము=సౌమ్యభావము, గురుకుల క్రమాయాతము=శ్రేష్ఠమయిన వంశక్రమమువలన వచ్చినదని యర్థము. చల్లఁదనము=శైత్యము, గురు= తండ్రియయిన కోలాహలునియొక్క, కులక్రమ = వంశపరంపరవలన, ఆయాతము = వచ్చినదని యర్థాంతరము. హిమవంతుని నాఁటనుండివచ్చినదనుట. కాకటకిపట్టి = శుక్తిమతీనదీ పుత్రికయయిన యీ చిన్నదానియొక్క, సరసగాంభీరభావంబు = సరసత్వంబును గాంభీర్యంబునుబుట్టఁగానే పుట్టినవని యర్థము. సజలత్వంబును లోఁతును దర్లియయిన శుక్తిమతీనదివలన జన్మించుటచేత వచ్చినవని యర్థాంతరము. కానలినసోదరీమణి = పద్మములకుఁ దోఁబుట్టినదయిన యీచిన్నదానియొక్క, మేనితావి = శరీరసువాసన, సహజసిద్ధము = స్వభావసిద్ధమయినదని యర్థము. సహజములయిన-అనఁగాఁ దోఁబుట్టినపద్మములవలన సిద్ధమయినదని యర్థాంతరము. అర్థాంతరములయందు గిరిజ-శుక్తిని పట్టి-నలినసోదరీమణి యనెడి గిరికాదేవి నామములు సాభిప్రాయములని తెలియవలయును.

చరణము లరుణములనియు మేను సురభిళమనియు బాహువులు మృదువులనియుఁ జెప్పుట వలన గిరిక పద్మినీజాతిస్త్రీరత్న మని యెఱుంగనగును. మోవితీపులాడి యనుటచే నధరము చుంబన యోగ్యమనియు సురభిళాంగియనుటచే మేను పరిరంభణయోగ్యమనియు భావము. ఇటులె పదప్రయోజనము గుర్తించునది.

నడచినహరిచందన ప్రవాళములమైననే! కోసినఁబారిజాతకోరకములనే! పరుండినమందారశయ్యయందే! రుచిచూచిన కల్పతరుఫలములనే! ఇవియాభిజాత్యసూచనములు.

అరుణచరణ, లలితబాహా, సురభిళాంగియను విశేషణములవలన గిరికాద్వితీయయౌవనము సువ్యక్తము. తల్లక్షణము.

శ్లో. స్తనాపీనా తనుర్మధ్యః పాణౌ పాదే చ రక్తిమా
ఊరూకరికరాకారా వక్త్రంవ్యక్తాంగసంధికం
నితంబో విపులో నాభిర్గభీరా జఘనంఘనం
వ్యక్తారోమావళీ సైష్ఠగ్ధ్యీ మంగకే లలితాక్షిణి
ద్వితీయే యౌవనే. రసార్ణవసుధాకరము.

మ॥ పద మెత్తం గలహంసలీల యధరస్పందంబు సేయన్ శుభా
స్పద మై రాగకదంబకంబు శ్రుతి చూపన్ శ్రీవిలాసంబు కే
ల్గదలింపన్ సుకుమారపల్లవనవైలాలక్ష్మి వీక్షింప న
ట్పదియుం బొల్పుఁ దనంబె కన్నెఁ గొనియాడన్ గేయవాక్ప్రౌఢిమన్. 59

పదమెత్తన్ = పదసంజ్ఞగల గీత మారంభింపఁగానే, కలహంసలీల = రాగవిశేషవిలాసము, నడువఁగానే రాజహంసవిలాసము అని యర్థాంతరము. అధరస్పందంబు సేయన్=పలుకఁగానే, శుభాస్పదమౌ = శుభముల కాధారమైన, రాగకదంబకంబు = స్వరసమూహము, పెదవి గదపఁగానే యొప్పుగాన్పించు నని యర్థాంతరము. పొల్చున్ = ప్రకటమగును. కాపొల్పు ననెడిపదము సర్వత్ర సంగతము సేయఁబడుచున్నది. హంసలీల యన్నచోట నిదర్శనాలంకారము. చరణాధరోష్ఠగక్తిమ పొలుచు నని భావము. శ్రుతిచూపన్ శ్రీవిలాసంబు = శ్రుతియనెడు స్వరావయవము గనుపఱుపఁగానే శ్రీరాగము పొలుచునని యర్థము; చెవిచూపఁగానే శ్రీకారవిలాసము పొలుచునని భావము. కేల్గదలింపన్ =

చెయి కవలింపఁగానే, సుకుమార = కోమలమైన, కల్లవ = పల్లవమను గీతావయవముగల, నవ=నూతన మైన, వీలాలక్ష్మీ=వీలానామకగీతసమృద్ధి పొలుచునని యర్థము. వీలకితేఁగెలయొక్క శోభ పొలుచునని భావము. ఇక్కడ నుభయత్ర భావములయందు నిదర్శనాలంకారము. వీక్షింపక = చూడఁగానే, షట్పదియుఁబొల్చుక=షట్పది యనెడు గీతవిశేషము పొల్చునని యర్థము. అఁడుతుమ్మెద స్ఫురించునని భావము. ఇక్కడ దృష్టిప్రభను భ్రమరీరూపముచేత నధ్యవసించినాఁడుగనుక రూపకాతిశయోక్త్యలంకారము. తరంబె కన్నెఁ గొనియాడక గేయవాక్ప్రౌఢిమక = గేయవాక్ప్రౌఢిమ యనఁగా సంగీతవాక్ప్రౌఢిమ, దాసియందు, కన్నెఁగొనియాడక = ఈచిన్నదానివర్ణించుటకు, తరంబె = శక్య మగునా-అనఁగా శక్యముగాదనుట. ఇచటఁ బాదన్యాసాదులవలననే గానసమృద్ధి గాన్పించుచున్నది యని యాశ్చర్యము ధ్వనించుచున్నది.

పదము పాడ మొదలిడెనేని కలహంసరాగవిశేషము, పెదవికదలించినంతన స్వరసమూహము, శ్రుతిజూచినంత శ్రీరాగసంపద, హస్తముగదలింపఁ బల్లవి చూచినంత షట్పదిగీతావిశేషము పొసఁగును. ఇది గిరికా సంగీతవిద్యాప్రౌఢికిఁ దార్కాణములు. గిరికగమనము మరాళయానము. పెదవి కెంపు వలెనున్నది. కేలు చివురు, చూపులు తుమ్మెదలు. ఈయమరూపముపొగడ నెంతవారికేని దరముగాదని యర్థాంతరము.

క. శ్రీనిధి భవదభినివిశన్మానస యీసింధుతనయ • మహనీయగుణ
శ్రీనుతికి నెక్కె నేఁడీ, మానిదయామందరాగ•మహిమము కలిమిన్. 60

శ్రీనిధి = సంపదలకు నాస్పదమైనవాఁడా యనియును, లక్ష్మీదేవికి స్థానమైనవిష్ణుమూర్తి యనియును, అర్థము. భవత్ = నీయందు, అభినివిశత్ = అభినివేశముగలది యగుచున్న, మానస = మనస్సు గలిగిన, ఈసింధుతనయ = సింధుశబ్దము నదియందును సముద్రమందును వర్తించునుగనుక నదీనందనయైన యీగిరికాదేవి యనియును సముద్రనందనయైన లక్ష్మీదేవియనియును నర్థము. నేఁడు = ఈప్రొద్దు, ఈమాని = మునీశ్వరుఁడైన యీయనయొక్క, దయా=కృపయనెడు, మందరాగ = మందర గిరియొక్క, మహిమముకలిమిక్=ప్రభావము గలుగుటవలన, మహనీయ = అతిశయమైన, గుణశ్రీ= గుణసంపదచేత, నుతికెక్కెక్=ఎన్నికకెక్కెను.

గుణమనఁగాఁ ద్రాడునుగనుక వాసుకిరూపమైన యాఁకత్రాటియొక్కకలిమిచేతఁ బ్రసిద్ధికెక్కెననియును నర్థము. ఈపద్యము మొదటి చరణమందు భవభభినివసన్మానసయని కొన్ని ప్రతులలోను భవదభినవసన్మానసయని కొన్ని ప్రతులలోను నున్నది. అయిన నిందుకు సోమనకవి చేసిన విద్వజ్జనరంజనీ వ్యాఖ్యయందు, భవదభినివిశన్మానసయనఁగా-నీయం దభినివేశము గలమనస్సుగలదని యర్థము వ్రాసినాఁడు గనుక నావ్యాఖ్యానప్రకారముగానే టీక రచియింపఁబడినది. నీవు శ్రీనిధివిగావున సింధుతనయయగు నీశ్రితగును. భవదభినివసన్మానసగావునఁ బరిగ్రహణయోగ్యురాలు. కావునఁ బరిగ్రహింపు మని భావము.

అలం. శ్లిష్టరూపకము.

చ. అన జనభర్త పల్కు ముదితా విధితాతనుమంత్రజాలు ని ✓
మ్మునిఁ గొనియాడ శక్యమె సుమహంజ్జ్వలరూపకలాప రైనవిరా

యనుఁగువయస్యఁ గాంచుసుకృతాతిశయం బవలీలఁ గూర్చె నీ
యనఘుఁ డితండు మాకుఁ బరమాప్తుఁడు గాక మునీంద్రమాత్రుఁడే. 61

అనన్=మంజువాణి యిట్లని పలుకఁగా, జనభర్తవల్కెన్ = వసురాజు పలికెను. ఏమనియనిన, ముదితా=ఓమంజువాణీ, విదిత=తెలియఁబడిన, అతను = అధికమైన, మంత్రజాలకున్ = మంత్రసముదాయము గలిగినవాఁడని యర్థము. విదితమైన యతనుమంత్రజాలమనఁగా మన్మథమంత్రకలాపము గలవాఁడని యర్థాంతరము. ఇమ్మునిఁ గొనియాడశక్యమె = ఈమునీశ్వరుని స్తోత్రముసేయ నలవియగునా-అనఁగా నలవిగాదనుట. ఏమనిన, ఈయనఘుఁడు = ఈపుణ్యాత్ముఁడు, సముజ్జ్వలరూపకలాపమైన-సముజ్జ్వల=మిక్కిలి ప్రకాశించుచున్న, రూప = ఆకృతియే, కలాపమైన = భూషణముగాఁ గలదైన, మీయనుఁగువయస్యఁ గాంచు = మీయొక్క ప్రియసఖియైన యీచిన్నదానిని జూచునట్టి, సుకృతాతిశయంబు = పుణ్యాతిశయమును, కూర్చెన్ = మాకు ఘటనపడునట్లుగ చేసెను. కాఁబట్టి, ఇతండు = ఈమహానుభావుఁడు, మాకుఁ బరమాప్తుఁడుగాక మునీంద్రమాత్రుఁడే = మాకుఁ గేవలము నిష్టుఁడును మునీంద్రుఁడునునే కాక సాధారణపు మునీంద్రుఁడా యని యర్థము. మాకు విశ్వసనీయుఁడైన స్నేహితుఁడేకాక మునీంద్రమాత్రుఁడా-అనఁగా మునీంద్రుఁడు గాఁడని యర్థాంతరము.

వసురాజు సత్యసంధుఁడగుటచే నబద్ధము చెప్పఁగూడదుగనుక నాతనియుక్తియగు నీపద్యమున యథార్థవిషయముగ నొకయర్థమును పరభావానుకూలముగ నొకయర్థమును స్ఫురించుచున్నది. సముజ్జ్వలరూపకలాపయగు కాంతను గాంచుట సుకృతాతిశయము. అట్టి సుకృతము సామాన్యప్రయత్నలభ్యము కాదు. దానినవలీలగాఁ గూర్చుటకు అధికమంత్రశక్తికావలయును. (మన్మథతంత్రము తెలియంగవలయును) ఇట్టి మాహాత్మ్యముగలవాఁడగు నిమ్ముని నాకుఁ బరమాప్తుఁడని భావము.

వ. మఱియు నీతనిమంత్రప్రభావంబున భవాదృశ దివ్యభామినీ మృదుమధురకోమలాలాపంబు లాలింపఁ గలిగె నని మనుజపతి బహూకరించుటయు నవ్వుకొని సమ్మదమ్మునఁ గొమ్మనెమ్మోముఁ జూచి తమ్మికంటి యకుంఠిత భువననిర్మాణచాతురీధురీణుం డగుపితామహుం డేతాదృశ యోగ్యవస్తుయోజనంబునం బొగడు వడసి యపారపరీవాదపారావారభంగంబుల మునుంగఁడు సుమీ యదియునుంగాక తదీయఘటనావైభవాభంగరంగప్రసంగంబునకుం బూర్వరంగంబు రసోత్తరంగం బగుట యెఱింగితివి గదా యింక సందియంబు వలవ దని వీడ్కొని యవ్వసుంధరాధరునకు నవ్వరారోహకు నమూల్యకల్యాణకౌతుకసమృద్ధియుం గావలయు నని దీవించి వారలవినయసంవిధానంబుల నానంద మొందుచు మణిమందిరంబు వెడలి చని యనతిదూరంబునం దోరంబు లగు మందారతరువాటంబులయాలంబులలో సారం బగుతపోధనాకారంబు డించి యథాపూర్వవేషంబుతో రాజు నన్వేషించు క్రమంబునం గ్రమ్మఱ నేతెంచి యమ్మహీమండలాఖండలుం గాంచి యద్భుతంబు నటించి పరిసరంబున నిల్చు నవసరంబున.

మఱియును=వెండియును, ఈతని మంత్రప్రభావంబునన్ = ఈమునియొక్క మంత్రసామర్థ్యము చేత నని యర్థము. రహస్యాలోచనముచేత నని యర్థాంతరము. భవాదృశ=నీవంటి, దివ్యభామినీ =

దేవతాస్త్రీలయొక్క, మృదు=పరుషాక్షరవిరహితములును, మధుర=గంభీరార్థయుక్తములును, కోమల=సౌకుమార్యములతోఁ గూడుకొనినవియు నగు, ఆలాపంబులు=వాక్యములు, ఆలింపఁగలిగెనని=వినఁగలిగెనని, మనుజపతి = వసురాజు, బహూకరించుటయున్ = మన్ననసేయఁగా, అమ్మౌని=ఆకపటమునీశ్వరుఁడు, సమ్మదమునన్=సంతోషముచేత, కొమ్మనెమ్మోముఁ జూచి = మంజువాణియొక్క మొగమువంకఁజూచి, తమ్మికంటీ=పద్మములవంటి కన్నులుగల యోమంజువాణీ, అకుంఠిత=మొక్కవోని, భువననిర్మాణచాతురీ=జగత్తులయొక్క కల్పనమందలి కుశలత్వమునందు, ధురీణుండగు = ధురంధరుఁడయిన, పితామహుండు=బ్రహ్మదేవుఁడు, ఏతాదృశ=ఇటువంటి, యోగ్యవస్తు=శ్రేష్ఠద్రవ్యయుగళముయొక్క, యోజనంబునన్ = కూర్పుటచేత, పొగడువడసి = మెప్పువడసి, అనఁగా నీగిరికా వసురాజులవంటి యుత్తమ స్త్రీపురుషలను గూర్చి పొగడికఁ గనినవాఁడయి, అపార = అంతములేని, పరీవాద = నిందయనెడు, పారావార = సముద్రముయొక్క, భంగంబులన్ = తరంగములయందు, మునుఁగఁడు సుమీ=మునిఁగిపోఁడు సుమా. అనఁగా నుత్తమస్త్రీపురుషులయిన యీగిరికావసురాజులను దంపతులనుఁగాఁ గూర్చి లోకమందు స్తోత్రమునే పొందుచున్నాఁడు సుమా యనిభావము. అదియునుంగాక = అంతియకాక, తదీయ ఘటనావైభవ = ఆబ్రహ్మకూర్పుటయొక్క సంపత్తియనెడు, అభంగరంగప్రసంగంబునకున్ = వైకల్యరహితమయిన నాట్యప్రస్తావమునకు, పూర్వరంగంబు = పూర్వరంగమనఁగా నాట్యమునకుఁ బూర్వమందు విఘ్నోపశాంతికొఱకుఁ జేసెడు వినాయకతాళము. అనఁగా ప్రథమ కార్యమనుట. ఇందును,

శ్లో. 'యన్నాట్యవస్తునః పూర్వం రఙ్గవిఘ్నోపశాన్తయే,
కుశీలవాః ప్రకుర్వన్తి పూర్వరఙ్గ స్సకీర్త్యతే.'

అని చెప్పఁబడియున్నది. రసోత్తరంగంబగుట = భావసూచకమగుట, ఎఱింగితివికదా = తెలిసికొన్నదానవైతివికదా, ఇంకసందియంబు వలదని = ఇఁకమీఁద సందేహింపఁబనిలేదని, వీడ్కొని=సెలవు దీసికొని, అవ్వసుంధరాధరునకున్ = ఆవసురాజునకు, అవ్వరారోహకున్ = ఆగిరికాదేవికిని, అమూల్యకల్యాణ=అనర్ఘమయిన శుభముయొక్కయు, కౌతుక=సంతోషముయొక్కయు, సమృద్ధియుంగావలయునని=పరిపూర్తిగావలయునని, దీవించి = ఆశీర్వదించి యని యర్థము. కల్యాణమనఁగా వివాహంబును గౌతుకమనఁగా గంకణంబుగనుక వివాహదీక్షా కంకణసంపత్తి గలుగుఁగాక యని దీవించి యనియర్థాంతరము. వారల = ఆగిరికావసురాజుల, వినయసంవిధానంబునన్ = వినయాచరణమువలన, ఆనందమొందుచున్=సంతోషించుచును, మణిమందిరంబు వెడలిచని=మణిమయమయిన గిరికాగృహము బయలుదేఱిపోయి, అనతిదూరంబునన్=కొంచెమయినదూరమందు, తోరంబులగు = విస్తారములైన, మందారతరువారంబుల యారంబులలో = మందారములనెడు దేవతావృక్షసమూహములయొక్క పొదలలోపల, పారంబగు = శ్రేష్ఠమయిన, తపోధనాకారంబు = మునివేషము, డించి = సడలించి, అనఁగాఁ దీసివైచి, యథాపూర్వవేషంబుతోన్ = పూర్వపుమంత్రివేషముతోడ, రాజునన్వేషించు క్రమంబునఁ గ్రమ్మఱనేతెంచి=రాజునువెదకుచు వచ్చినరీతిగా మరలవచ్చి, అమ్మహీమండలాఖండలుం గాంచి = భూమండలమునకింద్రుఁడైన యావసురాజునుజూచి, అద్భుతంబునటించి = ఆశ్చర్యపడినవానివలెఁ జేష్టలు గనబఱచి, పరిసరంబునన్నిల్చినయవసరంబునన్=పార్శ్వభాగమందు నిలుచున్న సమయమునందు, ఈపద్యమునకు ముందరి పద్యముతో నన్వయము.

తే. పడఁతు లారాజసచివుని పలుకుఁబడియు
మోముచాయయుఁ గని తొంటిముని యె కాఁగ
నరసి మందాక్షమందమందాక్షు లగుచు
నగుచు భావించి రతని వాఙ్నైపుణములు. 63

పడఁతులు = గిరికాదేవిచెలికత్తెలు, ఆరాజసచివుని=ఆరాజమంత్రియొక్క, పలుకుఁబడియుఁ = మాటకవళికయును, మోముచాయయుఁ = ముఖముకవళికయును, కని = చూచి, తొంటిమునియె కాఁగ నరసి=మునుపువచ్చిన మునీశ్వరుఁడుగానే విచారించి, మందాక్ష = సిగ్గుచేత, ని. ('మందాక్షం హ్రీ స్త్రపా వ్రీడా' అని అ.) మందమంద=సూక్ష్మప్రకారమయిన, అక్షులగుచుఁ = ఇంద్రియములుగలవారగుచును, ('మందాని అక్షాణి యాసాం తాః' అని విగ్రహము.) చూపులని యర్థము చెప్పినట్లైన, (మందాని అక్షీణి యాసాం తాః=మందాక్ష్యః - దీనికిఁ దత్సమరూపము) మందాక్షులు అని యగును, నగుచుఁ = నవ్వుచును, అతని వాఙ్నైపుణములు = అతనియొక్క వాక్యనిపుణత్వములను, భావించిరి = ఊహించినవారైరి.

తొలుత పలుకుఁబడియుఁ బిదప మోముచాయయుఁ జూచి రాజసచివుని తొల్లిటిముని యనుకొనిరి. తమపొరపాటు గుర్తెఱింగి లజ్జనొందిరి. మాయామునిగ వచ్చి భాషించిన మాటలయందలి నేర్పరితనమునకు నందఱు నవ్వుకొనిరి.

క. కోలాహలశైలాధిప, లీలాగతుఁ డైనపతి యలీకయతీంద్రుం
నీలాలకావలోకకళాలోలత ననిపె నని తలంచిరి ముదితల్. 64

కోలాహలశైలాధిప = కోలాహలపర్వతశ్రేష్ఠమందలి, లీలా = విహారార్థముగా, ఆగతుఁడైన = వచ్చిన, పతి=ఈరాజు; నీలాలకా = ఈగిరికాదేవియొక్క, అవలోకకళా = దర్శనక్రియయందలి, లోలతన్=ఆసక్తిచేత, అలీకయతీంద్రుం = కపటమునీశ్వరుని, అనిపెనని=పంపించినాఁడని, ముదితలు=ఆ స్త్రీలు, తలంచిరి=భావించినవారైరి. చూపులు నలుపుగను తెలుపుగను వర్ణించుటగలదు. చూపులు తెలుపనుటకు నుదాహరణము లీయఁబడెను. నలుపనుటకు.

సీ. ఇందీవరంబుల నీనుక్రాల్గన్నుల శరదిందుముఖులు చామరలు వీవ. (మనుచరిత్రము)

చ. అపు డొకబాల మేలమున నల్లనఁ బల్కుచు నింతులార యీ
నృపమణిరాకచే నలరి యీగిరికానన మిప్పు డెంత చొ
క్కపుసిరిఁ దాల్చెఁ జూడుఁ డనఁ గన్నియ మో మెదఁ జేర్చి సిగ్గు రా
గపుఁదమియుం బెనంగఁ బ్రియుఁ గాంచెఁ గుచాంచలహారధారలోన్. 65

అపుడొకబాల=ఆసమయమం దొకచిన్నది, మేలమునన్ =కోడిగముచేత, అల్లనఁ బల్కుచున్ = తిన్నఁగాఁ జతురోక్తులు పల్కుచును, ఇంతులార = ఓచెలులారా, ఈనృపమణిరాకచే నలరి = ఈ రాజశ్రేష్ఠునియొక్క యాగమనముచేత వికాసమును బొంది, ఈగిరికాననమిప్పు డెంతచొక్కపుసిరిఁ దాల్చెఁ జూడుఁడు=ఈకోలాహలపర్వతారణ్య మిప్పు డెంత చక్కని శోభవహించినదో చూడుఁడు అని యర్థము. ఈగిరికాదేవియొక్క ముఖ మిప్పు డెంత చక్కని కళవహించినదో చూడుఁడు అని యర్థాంతరము. గిరి+కాననమని అరణ్యపరముగను గిరికా+ఆననమని కథానాయిక పరముగను బదవిభాగము చేయవలయును.

అనక్ = ఇట్లుపలుకఁగా, కన్నియ=గిరికాదేవి, మోమెదఁజేర్చి=ముఖము అ్రొమ్ముపైఁ జేర్చుకొని - అనఁగాఁ దలవంచుకొని, సిగ్గు రాగప్రదమియుం బెనంగక్ = లజ్జయును ననురాగముయొక్క కమకంబును బెనఁగులాడఁగా, కుచాంచల = స్తనపార్శ్వములయందలి, హారధారలోక్ = ముత్యాల హారముయొక్క కాంతిపూరమందు, ప్రియుఁగాంచెక్ = మనోహరుఁడైన వసురాజును జూచెను. అనఁగా హారమౌక్తికకాంతియందుఁ బ్రతిబింబించిన రాజుయొక్క రూపమును జూచెనని భావము.

సిగ్గు రాగప్రదమియుం బెనంగ ననిచెప్పినందున గిరికాదేవి లజ్జామన్మథమధ్యస్థురాలైన మధ్యమ నాయికయని తెలియవలయును. శ్లో. 'లజ్జామన్మథమధ్యస్థామధ్యమా' అని లక్షణము. గిరిక మొకమెత్తిన యెడలఁదాల్చిన చొక్కపుసిరి రాజునకుఁగానవచ్చును. లజ్జాహేతువుగాననటులఁ జూడఁజాలదు. రాగప్రదమి యూఅపండనీయదు. కానఁదలవంచెను. బాహుకూలంకషములగు నుబ్బుచనుల ప్రక్కనున్న ముక్తాహారకాంతియందు గిరిక వసురాజునుగాంచి రాగప్రదమి నడంచుకొనెను. అలం. సూక్ష్మ.

తా. గిరికచెంతనున్న యొకబాలిక పరిహాసమునకుఁ జెలిమికత్తెల గాంచి చెలులారా? రాజు రాకచే గిరికాననము (గిరికముఖము. అటవీప్రదేశము) మిగులశోభవహించెననెను. గిరికలజ్జనొంది తల వంచఁగాఁ గుచాంచలహారమునందుఁ బ్రియునిప్రతిబింబముగానవచ్చుటచే రాగప్రదమి తీఱెను.

చ. అలికులవేణి కీ లెఱిఁగి ♦ యాచెలి వెండియు నేకతంబునం
బొలఁతుకలార యీచిగురుఁ♦బోఁడికుచార్పిత హారనాయకో
జ్జ్వలరుచిఁ గంటిరే యనినఁ ♦ జంద్రముఖుల్ చిఱునవ్వుఁ బూని రా
లలనలఁ జూచి కిన్కయుఁ గలంకయుఁ గొంకులు నంకురింపఁగన్. 66

అలికులవేణి = గిరికాదేవియొక్క, కీలెఱిఁగి=మర్మము దెలిసికొని, ఆచెలి=మేలమాడుచున్నయా చెలికత్తియ, వెండియుఁక్=తిరుగ, ఏకతంబునక్ = ఏకాంతముగా, పొలఁతుకలార = చెలియలారా, ఈచిగురుఁబోఁడి=ఈగిరికయొక్క, కుచార్పిత=స్తనములయందుఁబూన్పఁబడిన, హార = ముత్యాలహారము నందలి, నాయక - నాయకమణియొక్క, ఉజ్జ్వలరుచిక్=విస్ఫుటమయినకాంతిని, కంటిరే = చూచినారటే యనియర్థము. కుచార్పిత రత్నహారమందుఁ బ్రతిఫలించిన వసురాజుయొక్క యుజ్జ్వలమయిన లావణ్యమును జూచినారటే యని యర్థాంతరము. నాయకశబ్దము హారమధ్యమణి యందును నధిపతి యందును వర్తించును. (ని. 'నాయకో నేతరిశ్రేష్ఠే హారమధ్యమణావపి, అని వి.) అనినక్ = అనిపలుకఁగా, చంద్రముఖుల్ చిఱునవ్వుఁ బూనిరి=తక్కిన స్త్రీలందఱును ముసిముసినవ్వును వహించిరి, ఆలలనలఁ జూచి=ఆరీతిగాఁ బరిహాసభావము వహించిన స్త్రీలనుజూచి, కిన్కయుఁక్-అనఁగా నమర్షమనెడు సంచారి భావంబును, (ని. 'అమర్షస్స్యాత్పరాక్షేపచేతఃప్రజ్వలనమ్' అని అ.) కలంకయుఁక్=తదనుభావమయిన మనఃకాలుష్యమును వ్రీడయనెడు సంచారిభావమును, (ని. 'చేత స్సంకోచనంవ్రీడా' అని అ.) అంకురింపఁగక్ = పొటమరింపఁగా, ఇందుకు ముందుపద్యముతో నన్వయము,

పొలఁతుకలార యన్నచోటఁ బొలఁతియనెడునామమునకు స్వార్థమందుఁ గప్రత్యయమును నాక ప్రత్యయము పరమగుచుండఁగా నుకారంబును వచ్చినది. ఇందులకు 'నామ్నఃకవర్ణకస్స్యాత్స్వార్థే స్యాదుత్వ మపిహరేఠస్మిక్' అని నన్నయభట్టీయము.

గిరిక అమర్షాది భావములొందుట శృంగారమగ్నకను మనుగనబడుచుండుటచేఁ జెలికత్తె యేకాంతముగ నన్నమాటగావునఁ జెలులందఱు చిఱునవ్వునవ్విరి. ఇది గిరిక కోపమునకుఁ గల పకఁ గొంతునకుఁ గారణమయ్యెను.

చ. సొలసి తటిల్లతాంగి జిగిఁజూపువెలుంగులచేఁ గలధ్వను
ల్గలకలకంఠులం గదిమిఁగాటపునెమ్మి నటింప హంసకం
బులు జడియం బయోధరసమున్నతి భంగురమధ్యపుష్కరాం
చల మరదోఁపఁగా నరిగెఁ జారుఘనప్రతిసీర చెంతకున్. 67

ఇక్కడ గిరికను దటిల్లతాంగియనుటవలన నిటనాయికాపరముగను దటిల్లతాపరముగను నర్థ ద్వయము చెప్పవలయును.

సొలసి = కస్తిపడి, తటిల్లతాంగి=మెఱుపుతీఁగెవంటిదేహముగల గిరికాదేవి-జిగి = కాంతిగలిగిన, చూపువెలుంగులచేక్ = దృష్టిప్రభలచేత, కలధ్వనుల్గల = కంఠధ్వనులంగలిగిన-అనఁగా గొణగొణలాడు చున్న, కలకంఠులక్ = సఖులను, కదిమి=అదలించినదై యని గిరికాపరమయిన యర్థము. జిగిసూపు వెలుంగులచేక్=కాంతిని గనుపఱుచుచున్నప్రకాశముచేత, కలధ్వనుల్గల=అవ్యక్త మధురధ్వనులుగల, కలకంఠులక్ = ఆఁడుకోయిలలను, కదిమి = పోఁదోలి యని తటిత్పరమయిన యర్థము. గాటపు నెమ్మి నటింపక్=గాఢమయిన ప్రీతి విజృంభింపఁగా నని యర్థము. మయూరమునటింపఁగా నని యర్థాంతరము. హంసకంబులు జడియక్ = కాళ్ళయందెలు మ్రోయఁగా నని యర్థము. హంసలు భీతినొందఁగానని యర్థాంతరము. పయోధరసమున్నతిక్ = కుచభారముచేత, భంగుర = కృశీభూతమగుచున్న, మధ్య పుష్కరాంచలము = పుష్కరమనఁగా నాకాశము గనుక నాకాశ సదృశమయిన నడుముయొక్క యగ్రభాగము, అరదోఁపక్ = సగముగనుపింపఁగా నని యర్థము. పయోధరసమున్నతిక్ = మేఘా వరణముచేత, భంగుర = కనుపడకయున్న, మధ్య=నడిమిభాగము గలిగిన, పుష్కర=ఆకాశముయొక్క, అంచలము = అగ్రభాగము, అరదోఁపక్ = సగముగనుపడఁగానని యర్థాంతరము. చారు = సుందర మయిన, ఘన = గొప్పదైన, ప్రతిసీర = తెరయొక్క, చెంతకుక్=దాపునకు, అరిగెక్ = పోయెనని యర్థము. (చారుఘన మనఁగా వర్షాకాలము గనుకఁ దెరవలెనున్న నీలమేఘము చెంతకుఁ బోయెనని యర్థాంతరము.)

గిరికాదేవిసఖులు సేయుచున్న పరిహాసములను సహింపక తెరచాటునకుఁ బోయెననుట. ఇక్కడ శ్లేషకృత సాధర్మ్యమూలమయిన యుపమాలంకారము. జిగిసూపు వెలుంగులన్నచోటఁ జూపనెడు పదము మొదటిచకారమునకు రెండర్థములయందును సకారాదేశము వచ్చినది. గిరికాపరమయిన యర్థ మందు జిగిగలచూపులని కర్మధారయసమాసము గనుకను దటిత్పరమయిన యర్థమందు 'తస్యాః ప్రథ మాచజడపదానాంస్యాత్' న. అనెడు సూత్రముచేత జిగిననెడు పదమందు ద్వితీయకుఁ బ్రథమ వచ్చినది గనుకను సకారాదేశము వచ్చినది. వెలుంగుల్చేఁ గలధ్వనులన్నచోట వెలుంగులచే ననెడు పదము కొననున్నచకారము గిరికాపరమయిన యర్థమందు గకారము పరమగుచుండఁగా లోపమును బొందినది-తటిత్పరమయిన యర్థమందుఁ గకారమా పరమగుచుండఁగా నర్థబిందు వగుచున్నది. సఖండ నిర్ఖండువులకు శ్లేషయందు మేళనముగలదు. ఇందుకుఁ బ్రమాణము. 'శ్లేషేసఖండనిర్ఖండౌ శ్లేషణంస్మృత చిహ్నతః' అని యథర్వణవచనము.

వర్షాకాలమున మెఱపులఁ గాంచి కోకిలములు బెదరికూయకుండుటయు నెమిళ్లు నాట్యము చేయుటయు అంచలు బెదరి మానసమునకేగుటయు మేఘములవ్యాప్తిచే నాకాశము సగము కాన వచ్చుటయుఁ బ్రసిద్ధములు.

తా. చెలులుగావించు పరిహాసములకు గిరిక కోపగించి వారలనందఱను జూపులచే బెదరించి రాజుపైమనస్కావ పిక్కటిల్ల నంజలుమ్రోయుచుండ గుబ్బలవ్రేగుచే నడుము జవ్వాడఁ దెఱమాటున కేఁగెను.

తటిల్లత నిజప్రకాశముచేఁ గలకంఠములబెదరించి నెమిళ్లు నటన మొనరించుచుండ నంచలు వెఱపునొంద మేఘవ్యాప్తిచే నాకాశము సగముగానిపింప నీలమేఘమును దరియనేఁగెనని యర్థాంతరము.

క. పరమాణుమధ్య యాగతిఁ, దెరమాటున కరుగఁ దనివిదీరనిచూడ్కిం
బరమానురాగసూచన, పరమానసుఁ డగుచు ధరణిపాలకుఁ డంతన్. 68

పరమాణుమధ్య=(పరమాణు వనఁగా నున్నదనెడిప్రతీతి గలదై దృష్టిగోచరముగాక యుండెడు రేణువు.) నలుసువంటి నడుముగల గిరికాదేవి, ఆగతిన్ = పైనఁజెప్పఁబడిన ప్రకారము, తెరమాటున కరుగన్ = తెరచాటునకుఁ బోవఁగా, తనివిదీరనిచూడ్కిన్=తృప్తిఁబొందనిచూపుచేత; పరమానురాగ = ఉత్కృష్టమైన ప్రేమయొక్క, సూచన = కనుపఱుచుటయందు, పర=ఆసక్తమైన, మానసుఁడగుచున్ = మనస్సుగలవాఁడై, ధరణిపాలకుఁడు = వసురాజు, అంతన్ = అమీఁదట-ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఈపద్యము ద్విప్రాసముగలదిగాఁ జెప్పఁబడియెను.

సీ. మెఱుఁగొప్పునెఱిగొప్పు నెఱగప్పు తఱిగప్పు జలదమ్మాలికచొప్పు దెలుప లేదొ
బలువాలుగల నేలు తెలివాలుగనుడాలు కలువపూదెరమేలు దెలుప లేదొ
నలు వైనకళ లీనఁగలలేనగవుసోనక్కలశాబ్ధితెరమేన నిలుప లేదొ
కనకంపునసొంపుకడ నుంపురుచిపెంపు పసిఁడితీఁగలగుంపు మెసఁగ లేదొ
తే. ప్రాణసఖులార నెయ్యంపుఁటలుకఁబూని, యేల యీబాలయీవేళ నీవిశాల
యవనికాభ్యంతరంబునకరిగెననఁగ, ననుఁగునెచ్చెలి మఱియునెయ్యమునఁ జేరి.

మెఱుఁగొప్పు = (అనఁగాఁగొప్పుపక్షమందు నైగనిగ్యముచేతనొప్పుటయును, జలదమాలికాపక్షమందు మెఱుపుతీఁగెచేత నొప్పుటయును గనుక నుభయత్రసమానధర్మము-) నైగనిగ్యముచేత నొప్పుచున్న, నెఱిగొప్పు=గొప్పయయిన కొప్పుయొక్క; నెఱగప్పు = సంపూర్ణమైన నీలకాంతి, తఱిగప్పు= తఱియనఁగా వర్షాకాలము-దానియందు నావరించునట్టి, జలదమాలికచొప్పు = మేఘపంక్తియొక్క రీతిని, తెలుపలేదొ = కనుపఱుపలేదా-అనఁగాఁ గొప్పుయొక్క నీలకాంతి కాలమేఘముగ్రమ్మినట్టులు గ్రమ్మి తన్నుఁగనుపడకుండఁజేయుచుండ జెలువ తనంతటఁ దానె కానరాకున్నది. ఇట్టిచోఁజాటుచేసి పోవలసివచ్చెనో యనిభావము.

బలువాలుగలనేలు=వాలుగలనఁగా మీనవిశేషములు-వాని నేలుటయనఁగా .. నేత్రపక్షమందుఁ దిరస్కరించుటయుఁ గుముదపక్షమందుఁ గ్రిందుపఱుచుటయు జేయుటయును గనుక నుభయత్ర సమానధర్మము. గొప్పలైన వాలుగచేఁపలను దిరస్కరించుచున్న, తెలి = ధవళకాంతిగలిగిన, వాలు = సొగసైన, కను

నేత్రములయొక్క, డాలు=ప్రభ, కలువపూజెరమేలు జెలువపలేదో=కలువపువ్వుల తెరయొక్క సొగసును బొందింపలేదా-లేదా అనఁగానేత్రప్రభలు కలువపువ్వుల తెర గ్రమ్మినట్లులు గ్రమ్మి తమ్ముఁగనుపడకుండఁ జేయుచుండలేదా యనుట. కనులు తెల్లఁగానుంటచేఁ దెల్లకలువ పూతెరవలె నుండెనని భావము. చూపులను దెలుపుగావర్ణించుటగూడఁ గవిసమయమైయున్నది. చూడుఁడు.

ఉ. నీకనుదోయివెన్నెలలు నిండక కోడ్కఁ నాప నిండునే. హరివంశము. ఆ. ౧

చ. పతిగనిలజ్జనాననము పాయఁగ నల్లన వాంచి సమ్మదా
మృతరసపూరితార్ధ వినిమీలితలోల కటాక్షవీక్షణా
యతసితదీధితుల్ గలయ నద్రిజ విచ్చెమహేశుమీఁద రా
జతగిరి మీఁదనున్నతి నిశాకర దీప్తులు గప్పనొప్పుగన్.

నన్నెచోడుని కుమారసంభవము, షష్ఠాశ్వాసము.

క. వాలికలై వెలిదమ్ముల, బోలికలై చందమామ పుఱుఁగులకుం దా
మేలికలై నరసభూపాలీయము.

నలువైన కళలీనగల లేనగవుసోఁస=(కళలీనుటయనఁగా మందహాసపక్షమందుఁ దళతళయను కాంతుల నుత్పాదించుటయును, క్షీరసముద్రపక్షమందుఁ జంద్రకళల నుత్పాదించుటయును గనుక నుభయత్ర సమానధర్మము.) ఒప్పిదమయిన తళతళ కాంతుల నుత్పాదింపఁ జాలినమందహాసమనెడు సోనవాన, కలశాబ్ధితెర=క్షీరసముద్ర తరంగమనెడు తెరను, మేననిలుపలేదో=శరీరమందు వ్యాపింపఁ జేయలేదా. అనఁగాఁ జిఱునగవు సోనవాన క్షీరసముద్రతరంగము గ్రమ్మినట్టులు గ్రమ్మి నన్నుఁ గనుపడకుండఁ జేయలేదా యనుట. చిఱునగవు తరంగములకు నేనావలనుంటినిగావున నాయమను నేను జూడఁజాలకుంటినిగదా! చాటునకేల యేగవలసివచ్చెనని భావము.

కనకంపు ననసొంపు కడచుంపురుచి పెంపు = కనకమనఁగా సంపఁగిచెట్టు ననయనఁగా పువ్వు గనుక సంపఁగిపువ్వుయొక్కసాదృశ్యము శరీరలావణ్యమునకును బంగారుతీఁగెలకును సమానధర్మము. సంపఁగిపువ్వుయొక్క సౌష్ఠవమును దిరస్కరించుచున్న శరీరలావణ్యాతిశయము. పసిఁడితీఁగెలగుంపు మెసఁగలేదో = బంగారుతీఁగెలగుంపు తెరను గలుగఁ జేయలేదా-అనఁగా శరీరలావణ్యాతిశయము బంగారుతీఁగెలగుంపు గ్రమ్మినట్టులు గ్రమ్మితన్నుఁ గనుపడకుండునట్లు చేయుచుండలేదా యనుట.

ప్రాణసఖులార = గిరికయొక్క ప్రాణపదమైన చెలికత్తియలారా, నెయ్యంపుటలుకఁబూని = ప్రణయకోపమును వహించి, ఏల = ఎందునిమిత్తము, ఈబాల = ఈగిరికాదేవి, ఈవేళన్=ఈసమయమందు, ఈవిశాల యవనికాభ్యంతరంబున కరిగెన్=విస్తారమయిన యాతెరలోపలికిఁ బోయెను. (ని. 'ప్రతిసీరా యవనికా స్యాత్తిరస్కరణీ చసా' అని అ. అనఁగన్ = అనివసురాజు పలుకఁగా, అనుఁగు నెచ్చెలి=ప్రియసఖియైన మంజువాణి, నెఱచెలి-నెచ్చెలి-అని సంధివచ్చినది. మఱియు, నెయ్యమునఁ జేరి=మిక్కిలి మైత్రిచేత గిరికాసమీపమునకుఁ బోయినదై, కనకమనఁగా సంపఁగిచెట్టు, (ని. కపోతం కాఞ్చనే నాతు దుత్తూరే నాగకేసరే, చంపకే కాఞ్చనా గేచ' అని నా.) ముందరిపద్యముతో నన్వయము.

అలంకారము, ఉపమాధ్వని, సవాధి.

గిరిక నెఱిగుంపు జలదమాలికవలెను, తెలిచూపులు కలువపూవుఁదెరవలెను, లేనగవు క్షీరసముద్రతరంగములవలెను మేనుడీప బంగారుతీవలవలెను నుండెనని భావము. ఆయాయవయవములే ప్రతిసీరవలెనుండఁ జాటునకుఁ బోనేలనని వసురాజు చెలికత్తియల నడుగుచున్నాఁడు.

తే. అభినవాలోకనోత్కంఠ • నధిపుఁ డలర
నలరుఁబోఁడి సమగ్రల • జ్జానుభావ
భావ యై తెరమాటునఁ • బగటు చూపఁ
జూపఱకుఁ దోఁచెఁ బరిణయ • స్ఫూర్తి యనుడు. 70

అభినవాలోకనోత్కంఠన్=తిరిగిచూచుట యందలి యౌత్సుక్యముచేత ననియర్థము. (క్రొత్తగాఁ జూచుట యందలియుల్లాసముచేత నని యర్థాంతరము.) అధిపుఁడలరన్ = అధిపుఁ డనఁగా రాజని యర్థము. (పెండ్లికుమారుఁడని యర్థాంతరము.) అలరన్ = ఒప్పుచుండఁగా, అలరుఁబోఁడి= ఈగిరికాదేవి, సమగ్ర=పరిపూర్ణమైన, లజ్జానుభావ = ముఖము వంచుకొనుట యనెడు లజ్జయొక్క యనుభావముతోఁగూడిన, భావయై=రతియనెడు స్థాయిభావముగలదై, తెరమాటునఁ బగటుచూపన్= తెరచాటున మరిపెముగనుపఱుపఁగా, చూపఱకున్=చూచువారికి, పరిణయస్ఫూర్తి = వివాహస్ఫురణము, తోఁచెన్=కనుపడెను, అనుడున్=అని యాదృచ్ఛికముగాఁ బలుకఁగా. అలం.—స్మరణము.

తా. మరలమరల గిరికను గాంచుటకు వసురాజుత్సాహపడుటయు గిరిక లజ్జాభావముతోఁ దెరచాటున కేఁగుటయు వివాహ స్ఫురణమును గలుగఁ జేయుచున్నదని చెలిపలుకఁగా (ముందఱిపద్యముతో నన్వయము)

చ. విని కలకాకుఘోష మొద • వించుమదాళిని బక్షగౌరవం
బెనయ నదల్చి మంజుగతి • నీవనజాతములో మదీయఖే
లనముల కెల్లఁ దోడయి మె • లంగఁగ నాకలహంసి రాదొకో
జననివయస్య యంచు నగ • జాత మదిం దలపోయు చున్నెడన్. 71

విని=ఆలకించి, కల=అవ్యక్తమధురమయిన, కాకు = వికారస్వరముగలిగిన, ఘోష మొదవించు= అంతు సేయుచున్న, మదాళినిన్ = మదయుక్తమైన తుమ్మెదను, పక్షగౌరవం బెనయనదల్చి=తన ఱెక్కలయొక్క యతిశయము ప్రకాశించునట్లుగా నదలించి యని యర్థము. మదాళిని=నాచెలికత్తెను అనఁగా మంజువాణిని, పక్షగౌరవంబెనయన్ = సహాయగురుత్వ మొప్పునట్లుగా - కసరుకొని యని యర్థాంతరము. (ని. 'పక్ష స్సహాయేపి' అని అ.) అదల్చుటకుఁ గలహంసికర్త్రి) యని గ్రహింపవలయును. మంజుగతిన్ = మృదుగతిని, ఈవనజాతములోన్=ఈవనసమూహములో, ఈ తామర యందని యర్థాంతరము.

మదీయ ఖేలనములకెల్లన్ = నాయొక్క యాటల కన్నిటికిని, తోడయి=సహాయమై, మెలంగఁగన్=సంచరించుటకు, జననివయస్య = మాతల్లియైన శుక్తిమతియొక్క సఖియయిన, ఆకలహంసి= ఆకలహంసస్త్రీ, రాదొకో=రాదాయేమి, అంచున్=అనుకొనుచు, నగజాత=గిరికాదేవి, మదిం దలపోయుచున్నెడన్=మనస్సున విచారించుచున్న సమయమునందు-జననివయస్య యనుపదమునకు జననవయస్య యనుపాఠాంతరము గలదు. ఆపదమునకుఁ బుట్టిన నాఁటనుండి సఖియయిన యాకలహంసి యని యర్థము. ఈపద్యము [illegible] విద్వజ్జనరంజనీవ్యాఖ్యాత యగుపోఁచుకవిజ్ఞాపనయము.

కలహంసి నాజనని చెలికత్తె, అయమవచ్చెనేని నాపక్షమూని చెలినదలించి నావనవిహారము సార్థకమొనరించును గదాయని గిరికాదేవి దలంచెననుట ప్రకృతార్థము.

కలహంసి నాజననియగు శుక్తిమతికిఁ జెలికత్తె. అదియిటవచ్చి విశృంఖలస్వైరముఁజేయు తుమ్మె దలనదలించి యీతమ్మికెలఁకులలో విహరించుటలో సాయపడుఁగదా యని యర్థాంతరము.

ఉ. ఆకలహంసి వచ్చి యచలాత్మజఁ గాంచి కుమారి తాపసా
నీకము నీ కమూల్యశుభనిర్వహణంబు ఘటిల్లఁ గల్పకా
నోకహసూనరాజము లనూనమనూక్తులతో నొసంగినం
గైకొని తల్లి నిన్బిలువఁ గాఁ బనిచెన్ విరులిచ్చు వేడుకన్. 72

ఆకలహంసివచ్చి = గిరికాదేవి యేకలహంసిని గూర్చి రాకపోయె నని విచారించుచుండెనో యాకలహంసి వచ్చినదై, అచలాత్మజ గాంచి = గిరికాదేవినిజూచి, కుమారి = ఓచిన్నదానా, తాప సానీకము = మునిసమూహము, నీకున్ = నీకొఱకు, అమూల్యశుభనిర్వహణంబుఘటిల్లన్ = అనర్ఘ మైన కల్యాణకార్యసిద్ధి సమకూడునట్టులుగా, కల్పకానోకహ సూనరాజములు = కల్పతరుపుష్ప శ్రేష్ఠములు, అనూన = పరిపూర్ణమయిన, మనూక్తులతోన్ = ఆశీర్మంత్రవాక్యములతోఁ గూడ, ఒసం గినన్=ఇయ్యఁగా, కైకొని = గ్రహించి, తల్లి=మీతల్లియైన శుక్తిమతి, విరులిచ్చువేడుకన్ = ఆపుష్ప ములు నీకియ్యవలెనను సంతోషముచేత, నిన్బిలువఁగాఁ బనిచెన్ = నిన్నుఁబిల్వ నంపించెను-ఇచ్చట సంశ్లేషమువచ్చినది. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. అలం-శ్లేషము.

అమూల్యశుభనిర్వహణము కల్యాణము. మంజువాణియనిన పరిణయసూక్తి క్రియారూప ముఁదాల్చెను. మునిబృందము ఆశీఃపురస్సరముగాఁ గల్ప ప్రసూనరాజములను శుభ నిర్వహణము ఘటిల్లుట కొసంగిరి. కాన శుభప్రాప్తి యచిరమున నుండెను. కావునఁ బిలువఁబంపెనని భావము.

క. రా రమ్మనఁ గోమలి కుచభారమ్మున నడుము వడఁకఁ బదకటకరఝణ
త్కారమ్ము లెసఁగఁ గుసుమాసారమ్ములు కబరిఁ దొరఁగ జనఁదివురుటయున్. 73

రారమ్మనన్ = రమ్మురమ్మని పిలువఁగా, కోమలి=గిరికాదేవి, కుచభారమ్మున నడుమువడఁకన్ = స్తనగౌరవముచేత నడుము జవజవలాడఁగా, పదకటక = కాళ్ళయందెలయొక్క, ఝణత్కార మ్ములు = ఝణఝణధ్వనులు, ఎసఁగన్ = అతిశయింపఁగా, కుసుమాసారమ్ములు = పువ్వులవానలు, కబరిఁదొరఁగన్ = కొప్పునుండి విడివడి కురియఁగా-అనఁగా కొప్పులోఁ దురిమిన పూవులు రాలఁగా ననుట. చనఁ దివురుటయున్ = పోవ నుద్యోగింపఁగా అనఁగాఁ బోఁజూడఁగాననుట. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఈపద్యము ద్విప్రాసముగలదిగాఁ జెప్పఁబడియెను. పదకటకము లనఁగాఁ గాళ్ళయందెలు (ని. 'హంసకః పాదకటకః అని యమరము.)

చ. నెనరునఁ జెయ్యి వట్టి తరుణీ ధరణీసరణీపురందరుం
డనుపక పోవు టెట్లు తగ వా నగ వారడి వెట్ట నంచు జ
వ్వని చెలు లెల్ల నిల్పి మహీవల్లభ మాచెలిమీఁదిప్రేమ నీ
మనమునఁ బాయ కుండు మని మానినిఁ దోడ్కొని పోవునంతటన్. 74

నెనరునఁ జెయ్యివట్టి = ప్రేమచేత హస్తముఁ బట్టుకొని, తరుణీ = ఓగిరికాదేవీ, ధరణీ సరణీ పురందరుఁడు = భూమార్గగతుఁడైన భూదేవేంద్రుఁడయిన వసురాజు, రాజుకు పురందరుఁడనుటవలన వసురాజునన్యసామాన్యుఁడనియు నతనిని బోలువారు వేల్పులెగాని నరులు గారనుట.

అవునక = సెలవిచ్చి పంపకయుండఁగా, పోవు టెట్లు = పోవుటయెట్టిది, తగవా నగ వారడివెట్టక్ = హాస్యాపకీర్తులఁ బెట్టుట మర్యాదయే, అంచుక్ = అనిపలుకుచు, జవ్వనిఁ జేలుతెల్లనిల్పి = గిరికాదేవిని కెలికత్తియలందఱును బోనీయక నిరోధించి, మహివల్లభ = రాజా, మాచెలిమీఁదిప్రేమ నీమనమునఁ బాయకుండుమని = మాచిన్నదానిమీఁది యనురాగము నీమనస్సునందు వదలకయుండుమని పల్కి, మానినిఁ దోడ్కొనిపోవునంతటక్ = గిరికాదేవిని వెంటఁబెట్టుకొని పోయినమీఁదట, నెనరనఁగాఁ బ్రియము.

తే. 'పేర్మి యక్కిలి మక్కువ కూర్మి నెమ్మి, నెనరు గాదిలి గారము నెయ్య మింపు,
ప్రేముడి యనుఁగు ముద్దనఁ బ్రియములకును, నామధేయంబులయ్యెఁ బినాకపాణి.'
అని యాంధ్రనామశేషము.

ఈ పద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

మ. శతపత్రేక్షణ వెంట నంటినవసుక్ష్మాపాలకాలోకముం
బ్రతిరోధింపఁగఁ జాల దయ్యె భవనప్రాంతోరుకాంతారవే
ల్లిత వల్లీవలయంబు తచ్చికురపాళీనీరదాళీమిళ
న్నృతికేళీరసకేకిలోకగరుదున్మీలన్మరుల్లోల మై. 75

శతపత్రేక్షణ వెంటనంటిన = తామరఱేకులవంటి కన్నులుగలగిరికాదేవిని వెనుతగిలిన, వసుక్ష్మాపాల కాలోకముక్ = వసురాజు దృష్టిని, భవన = గిరికామణి మందిరముయొక్క, ప్రాంత = సమీప మందలి, ఉరు = అధికమైన, కాంతార = అరణ్యమందు, వేల్లిత = వక్రములైన. (ని. 'వేల్లితంవక్రమిత్యపి)' అని అ.) వల్లీవలయంబు = తీఁగెలగుంపు, తత్ = గిరికాదేవియొక్క, చికురపాళీ = తలవెండ్రుకలయొక్క గుంపనెడు, నీరదాళీ = మేఘపంక్తితోడ, మిళత్ = కూడుకొనుచున్న, నృతికేళీరస = నాట్యక్రీడారతిగల, కేకిలోక = మయూర సమూహముయొక్క, గరుత్ = ఱెక్కలవల్లనుండి, ఉన్మీలత్ = ప్రసరించుచున్న, మరుత్ = వాయువుచేత, లోలమై = చలించుచున్నదై, ప్రతిరోధింపఁగఁ జాలదయ్యెక్ = అడ్డగింప లేదాయెను.

తా. గిరికాదేవిని హంసాంగన వెంటఁ బెట్టుకొనిపోఁగా మిక్కిలి ప్రేమచేత గిరికాదేవికై చూచుచున్న వసురాజు దృష్టికి నాగిరికామందిర సమీపమందలి వృక్షముల నవలంబించియున్న తీఁగెలగుంపు లడ్డముగా నుండిన వయినను గిరికాదేవియొక్క తలవెండ్రుకలవలన మేఘభ్రాంతి జనియించి నాట్యము సేయుచున్న నెమలిగుంపులయొక్క ఱెక్కలగాడ్పులచేతఁ జెదరిపోవుచు సందిచ్చుచు నుండుటచేత వసురాజుయొక్క దృష్టి నివారింపఁ బడనిదై గిరికాదేవి వెంటనే సాగిపోయెను.

అలంకారము-సమాధి. భ్రాంతిమంతము. వ్యంగ్యము.

చ. వనతరువల్లికాకుసుమవాసన లొల్లక శైలకన్యకా
ఘనఘనవేణికాభరముకమ్మని తావికిఁ జిక్కి మ్రోయుచుక్

వెనుచనియెన్ ద్విరేఫములు ♦ వేమఱు భావివియోగచింతచే
వనరుచు వెంటఁ బోవుమహీ♦వల్లభుచూపుల ప్రోవులో యనన్. 76

వన = అరణ్యమందలి, తరు = వృక్షములయొక్కయు, వల్లికా = తీఁగెలయొక్కయు, కుసుమ = పుష్పములయందలి, వాసనలొల్లక = పరిమళములయం దిష్టములేక, శైలకన్యకా = గిరికాదేవియొక్క, ఘన = మేఘసమానమగు, ఘన = గొప్పదియు నయిన, వేణికాభరము = జడయొక్క, కమ్మనితావికిఁ జిక్కి = మనోహరమయిన పరిమళమునకు లోఁబడి, మ్రోయుచున్ = ఝంకారము సేయుచు, ద్విరేఫములు = తుమ్మెదలు, వెనుచనియెన్ = వెంటనంటిపోయెను. ఏలాగున్నవనిన, వేమఱున్ = మాటిమాటికిని, భావి వియోగ చింతచేన్=ముందు సంభవింపఁబోవు నెడబాటుకలని విచారముచేత, వనరుచున్= విలపించుచు, వెంటఁబోవు = గిరికాదేవివెంబడిగాఁ బోవుచున్న, మహీవల్లభు చూపుల ప్రోవులో యనన్ = వసురాజుయొక్క దృష్టిసమూహములో యనునట్టులుగాఁ దుమ్మెదలు వెనుచనియెనని సంబంధము.

ఇందులో భావివియోగమనఁగా నభిలాషనామక మయిన విప్రలంభ శృంగారము. ఇందుకు.

చ. 'కలయకమున్న రాగ మధికంబగునే నభిలాష యిద్దఱుం
గలసినమీఁదఁ బాయుట తగ న్విరహంబు నిజేశుఁ డొందుతో
య్యలిఁ గవయంగ నవ్వనిత యల్గుట యీర్ష్య విదేశవాసులై
నిలుచుట దాఁ బ్రవాసము గణింపఁగ నిన్నియు విప్రలంభముల్.

నరసభూపాలీయము.

అలంకారము. ఉత్ప్రేక్ష.

వనమునందలితరువులు లతలు విరియఁబూచినను దుమ్మెదలు వానితావులొల్లక వేణికాభరమును ముసరియుండుటకుఁగారణము వేణికాభరమునఁ గమ్మనితావు లొలయుటయే, ఘనవేణిగావునఁ దుమ్మెదలగుంపులకు సేవనీయమయ్యెను. తావికిఁ జిక్కిన తేఁటులు మ్రోయుచుఁ జెన్నెరివెంట నేగినట్టుల రాజుచూపులు భావివియోగచింతచే వనరుచు గిరికవెంట నేగెను.

తే. ఆళిహస్తావలంబనం ♦ బడర నడుచు, కన్యఁ దదధీనవృత్తినై ♦ కాంచునట్టి
వసుపతినిరంతరాలోక♦వైభవంబు, సాగనీ దయ్యెఁ గన్నీటి♦జడి గడంగి. 77

ఆళి = చెలికత్తియయొక్క, హస్తావలంబనంబడరన్ = కైదండయొప్పఁగా, నడుచు = నడిచి పోవుచున్న, కన్య=గిరికాదేవిని అనియర్థము. ('ఉత్తరాయాంత్రయః పాదాః హస్తచిత్తార్థం కన్యా') అనియున్నది గనుక హస్తానక్షత్రముయొక్క యవలంబన మొప్పఁగా వర్తించు కన్యారాశియని యర్థాంతరము. తదధీనవృత్తియై = గిరికావశమయిన మనోవ్యాపారము గలవాఁడై, కాంచునట్టి= చూచుచున్న, వసుపతి = వసురాజుయొక్క, నిరంతరాలోక వైభవంబున్ = ఎడతెగని దృష్టిసంపద నని యర్థము. కన్యారాశి కధీనమయిన వ్యాపారముగలవాఁడై ప్రాపించుచున్న సూర్యునియొక్క యెండ తెగని తేజస్సంపదయని యర్థాంతరము. సాగనీదయ్యెఁ గన్నీటిజడి గడంగి = కన్నీటిజడియనఁగాఁ గన్నీ రనెడు ముసురువాన, గడంగి = ఉద్రేకించి, సాగనీదయ్యెన్ = ప్రసరింపనీయదాయె నని వసురాజు దృష్టిపరమయిన యర్థము.

ముసురువాన ప్రసరింప నీయదాయె నని సూర్యతేజః పరమయిన యర్థాంతరము.

సూర్యుఁడు కన్యారాశియందు 'హస్తానక్షత్రగతుఁడైన ముసురుపట్టి వానగురియుట ప్రసిద్ధము గదా? ఇక్కడ వసురాజున కభ్రసముద్గమముఁ జెప్పినాఁడు గనుక నిది సాత్త్వికభావోదయ మని విచారింపవలయును. ఇందుకులక్షణము,

క. 'సంతోషరోషదుఃఖా, క్రాంతస్వాంతులకుఁ బొడమకన్నులనీళ్ళం
జింతింప నభ్రులని వర్ణింతురు భావవిమలగు మనీషులు కృతులన్.'

అలంకారము. శ్లేషము.

భావవిమోహచింతచేఁ జూచుటయే తదధీనవృత్తిగాంచుట, కావుననే యాలోకనములు నిరంతరముగనుండుట, గిరికాసందర్శనలాలసములగు చూపులను నిఁక యేదియు నాపఁజాలదయ్యెను. అని వార్యమగుకన్నీటి జడిచేఁ జూపులు సాగవయ్యెను.

చ. కలికియు నానృపాలకునిఁ • గ్రమ్మఱఁ జూచుచు నేగె నేర్పుతో
నలఘుపదాంగదధ్వనికి • నంచలు మూఁగిన నిల్చి నెయ్యపుం
జెలువలఁ గూడఁ బిల్చుగతిఁ • జిల్కకుఁ బార్శ్వలతాంచలంబులన్
ఫలము దెమల్చురీతి నళిపం క్తికి మోము మలంచుకై వడిన్. 78

కలికియున్ = గిరికాదేవియును, నేర్పుతోన్ = ఉపాయముతోడ, అనృపాలకునిన్ = ఆ వసురాజును, క్రమ్మఱఁజూచుచు నేగెన్=తిరిగిచూచుచుఁ బోయెను. ఏలాగుననగిన, అలఘు పదాంగద ధ్వనికి నంచలు మూఁగిన నిల్చి = అతిశయమయిన కాళ్ల యందెలమ్రోఁతకు స్వజాతి పక్షికల కలధ్వని భ్రాంతిచేత హంసలు కాళ్లఁ జుట్టుకోఁగా నిలిచినదై, నెయ్యపుంజెలువలఁ గూడఁబిల్చుగతిన్=ప్రియ సఖులను గూడరమ్మని తిరిగిచూచి పిలుచునట్టులుగాను, చిల్కకుఁ బార్శ్వలతాంచలంబులన్ ఫలము దెమల్చురీతిన్ = చేతప్రాలియున్న చిలుకకుఁ దనపార్శ్వభాగములనున్న శాఖాగ్రములయందలి పండును దిరిగి కోయుచునట్టులుగను, అళిపం క్తికి మోము మలంచుకై వడిన్ = కమల భ్రాంతిచేత వ్రాల వచ్చెడు తుమ్మెదచాలునకు ముఖము ద్రిప్పినటులుగను-అనఁగా నీచెప్పఁబడిన మిషలచేత వసురాజును దిరిగిచూచుచుఁబోయె నని సంబంధము. గిరిక వసురాజును దిలకించుటకు మెలకువమెయి మెలఁగెను. కాలియందెలు మిగులమ్రోయుచుండ నంచ లడ్డమువచ్చెను. వానిని వారించునట్లును, వెనుకనున్న చెలిమికత్తెలను గలుపుకొనుటకుఁ బిలుచునట్లును, ప్రక్కకొమ్మనున్న ఫలముగోసి చిలుకనోటి కందించు నట్లును నటించి తిరిగిచూచుచు నేగెను. చూచిపోవుటకాక చూచుచుఁబోవుట యనురాగాతిశయ మునకు హేతువు.

ఉ. అనగరాజభేదియును • నానఁగ రానిమనోరథంబుతో
మానిని నాత్మ నిల్పి ధృతి • మాని నిరంతరబాష్పవారిఁ గ
న్గోనల వాని మానికపుఁ • గోనలలో నెలమావి కానలో
నానవవిల్తుఁ దేప నళినానన యేగినజాడ నేగుచున్. 79

అనగరాజ భేదియునున్ = కోలాహలపర్వత రాజభంజనుఁడైన యావసురాజును, ఆనఁగరాని మనోరథంబుతోన్=ఆపశక్యముగాని యభిలాషముతోడ, మానిని నాత్మనిల్పి=గిరికాదేవిని హృదయమందుఁ

బాదుకొల్పి, ధృతిమాని = ధైర్యమువిడిచి, నిరంతర = ఎడతెగక క్రమ్ముచున్న, బాష్పవారిన్ = కన్నీటిని, కన్గొనలనాని = నేత్రకోణములయందు నాఁటఁబట్టి, మానికపుఁగోనలలోను = మాణిక్యమయములైన చరియలలోను, ఎలమావికానలోన్ = లేఁతమామిడి యడవిలోను, ఆ నవవిల్తుఁడేసిన్ = ఆమన్మథుఁడు వేధింపఁగా, నలినానన యేగినజాడ నేగుచున్ = పద్మమువంటిముఖము గల గిరికాదేవి పోయిన త్రోవ వెంటనే పోవుచు, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఇందులో మానిని నాఁటనిల్పి యని చెప్పినందున వసురాజునకు ద్వితీయావస్థ యైనమనస్సంగ మారబ్ధమాయెనని తెలియవలెను. నగరాజ భేదిగావున వసురాజు ధైర్యశాలి. అట్టిరాజు ధృతిమానుట మానిని నాఁటనిల్పుటవలననే. అతఁడు దిట్ట గావున వలపుచే వాపోవక దట్టమైనకన్నీటిని గన్గొనలలో నాఁపఁగలిగెను. నవవిల్తుఁడేచుటచే మనసుచెదరి చెంతనున్న మానికపుఁగోనలకు నెలమావి తోఁటలకు నేగెను. అవియు మన్మథోద్దీపనములయ్యెను.

నెత్తము లుపభోగయోగ్యములనుటకు-

శ్లో. ఆమేఖలం సంచరతాం ఘనానాం, ఛాయా మధస్సానుమతాం నిషేవ్య,
ఉద్వేజితావృష్టిభిరాశ్రయంతే, శృంగాణి యస్యాతపవంతి సిద్ధాః.

ఎలమావికాన శృంగారోద్దీపనమనుటకు-

శ్లో. పాంథస్త్రీ విరహానలాహుతి కలా మాతన్వతీ మంజరీ
మాకందేషు పికాంగనాభిరధునా సోత్కంఠమాలోక్యతే. భర్తృహరిసుభాషితము

సీ. కాఁబోలు నివి బాల♦కమనీయపదలీల,లిచటఁ బల్లవజాల ♦ మినుమడించెఁ
గాఁబోలు నిది బోఁటి♦గనుఁగొన్న వనవాటి,యిచటభృంగీకోటి♦రుచులనెఱసెఁ
గాఁబోలు నీవంక ♦ కలికి పల్కినపొంక,మిచటఁ దేనియవంక ♦ లింక కోదవెఁ
గాఁబోలునీచాయ♦కాంత నవ్వినచాయ లిచట సూననికాయ♦మింపుమెఱసెఁ
తే. జూచితె వయస్య యనుచు న♦శోక తిలక, కర్ణికార నమేరు సం♦ఘాతలతల
నలరునారామసరణిలో ♦ నరసి యరసి, సరసిజాననఁ గానక ♦ సంభ్రమించి. 80

ఇవి = ఈకనుపడునట్టివి, బాల కమనీయ పదలీలలు = గిరికాదేవియొక్క సుందరమైన పాదవిన్యాసములు, కాఁబోలున్ = అయి యుండవచ్చును. ఎందువల్లననిన, ఇచటఁ బల్లవజాల మినుమడించెన్ = ఇక్కడఁ జిగురుటాకులగుంపు రెట్టింపైనది - అనఁగా గిరికాదేవి పాదములును జిగురుటాకులవంటివి యయినందునఁ జిగుళ్లినుమడించిన వని భావము. ఇంతియకాక యీపద్యగీతిలో నశోకతిలక కర్ణికార నమేరు సంఘాతలతల నలరు నారామసరణిలో నని చెప్పుటచేతఁ గ్రమానుసారముగా నీచరణమందుఁ బాదవిన్యాసరూప దోహదవిశేషముచేత నశోకము చిగిరించుటవలనఁ బల్లవసముదాయ మినుమడించె నని చెప్పినాఁ డనియును భావము. ఇది = ఈకనుపడునట్టిది, బోఁటికనుఁగొన్నవనవాటి = గిరికాదేవి చూచిన వనశ్రేణి, కాఁబోలున్ = అయియుండవచ్చును. ఎందువల్లననిన, ఇచట భృంగీకోటిరుచులు నెఱసెన్ = ఇక్కడ నాఁడుతుమ్మెదగుంపులయొక్క కాంతులు వ్యాపించెను. అనఁగా గిరికాదేవిచూపులు తుమ్మెదలవంటివి గనుక వానియొక్క వ్యాప్తి తుమ్మెదలుగాఁ గనుపడు చున్నదని భావము. ఇదిగాక యీచరణమందు వీక్షణరూప దోహదవిశేషముచేతఁ దిలకవృక్షము పుష్పించినదని చెప్పినాఁడనియును భావము.

ఈవంకన్ = ఈపార్శ్వమందు, కలికి వల్కా సహాంకము=గిరికాదేవి సల్లాపము జరిగించిన సంగతి, కాఁబోలున్ = అయి యుండవచ్చును. ఎందువల్లననిన, ఇచటఁ దేనియవంకలింకకొదవెన్ = ఇక్కడఁ బూఁదేనెకాలువ లిగిరిపోక యొప్పుచున్నవి. అనఁగా గిరికాదేవి పలుకులును దేనియలవంటివి గనుక వానివలనఁ బూఁదేనెకాలువలు మకరందసమృద్ధిని బొందిన వనిభావము. ఇంతియకాక యాచరణ మందు సల్లాపరూప దోహదవిశేషముచేతఁ గొండగోఁగుచెట్టు పుష్పించి మకరందము గురియించిన దని చెప్పినాఁడనియును భావము. ఈచాయన్ = ఈప్రైపున, కాంతనవ్వినచాయలు=గిరికాదేవి నవ్విన జాడలు, కాఁబోలున్ = అయియుండవచ్చును. ఎందువల్లననిన, ఇచట సూననికాయ మింపుమెఱ సెన్ = ఇక్కడఁ బువ్వుసముదాయము చూడ నింపుగా నున్నది. అనఁగా గిరికాదేవి నవ్వులును బువ్వ ములవంటివి గనుక వానివలన నిక్కడిపువ్వుసముదాయ మింపగుచున్నదని భావము. పువ్వుసామాన్య మును శ్వేతగణములోఁ జేర్చుట కవిసమయసిద్ధము.

శ్లో. సామాన్య గ్రహణేవారి ముచాంకృష్ణత్వమేవహి
రక్తత్వమేవ రత్నానాం పుష్పాణాం శౌక్ల్యమేవచ. కావ్యకల్పలత.

దోహదవిధులు-

శ్లో. ఆలింగ నాత్కురవక శ్చంపకో ముఖదర్శనాత్
చూతో యోషిత్కరస్పర్శాత్ తిలకో దృక్ప్రసారణాత్
ఆకర్ణ నా త్కర్ణికార స్త్వశోకః పాదతాడనాత్
దాడిమీధూమసందోహాత్ ప్రియాటస్థాన దర్శనాత్.

ఇంతియకాక యాచరణమందు హసనరూప దోహదవిశేషముచేతఁ బొన్నచెట్టు పుష్పించినదని చెప్పినాఁడనియును భావము.

చూచితె వయస్య యనుచున్ = చూచినావా స్నేహితుఁడా యని పలుకుచు, అశోకతిలకకర్ణి కార నమేరు సంఘాతలతల నలరు=అశోకము, బొట్టుగు, కొండగోఁగు, సురపొన్న అనువాని సమూ హములయొక్క శాఖలచేత నొప్పుచున్న, ఆరామసరణిలోన్ = వనమార్గమందు, అరసియరసి=మాటి మాటికివెదకి, సరసిజాననఁ గానక=గిరికాదేవిని జూడక-అనఁగా నామె కాన్పించక, సంభ్రమించి= తొందరపడినవాఁడై, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఈపద్యము పెద్దపాదములు త్రిప్రాసముగలవిగను నన్ప్రాసముగలవిగను జెప్పంబడియెను.

చ. కళికలు లేఁజిగుళ్లు నవకంపుటనంటులు కప్పురంపుఁ ది
ప్పలు ననగుత్తులున్ లతలు ♦ పద్మములు న్సమచాళిజాలము
ల్వెలయ మనోజరాజభుజవీర్య మవార్య మొనర్చుకానలోఁ
గలయఁ జరించుభూపతికిఁ ♦ గన్నియరూపమె తోఁచు నెల్లెడన్. 81

కళికలు=పూమొగ్గలును, లేఁజిగుళ్లు = లేఁతచిగురుటాకులును, నవకంపుటనంటులు = కోమల మయిన యరఁటులును, కప్పురంపుఁదిప్పలు=కర్పూరపుఁ దిన్నెలును, ననగుత్తులున్ = పువ్వుగుచ్ఛములును, లతలు=తీఁగెలును, పద్మములున్ = కమలములును, సమదాళిజాలములు = మదయుక్తములయినతుమ్మెద గుంపులును, వెలయన్ = ప్రకాశించుచుండఁగా, మనోజరాజభుజవీర్యము=మన్మథుఁడనెడురాజుయొక్క బాహు పరాక్రమమును, అవార్యము ఒనర్చు = నివారింప నలవిగానిదానిఁగాఁ జేయుచున్న, కానలోన్ = [illegible]

లోపల, కలయఁజరించు = అంతటఁ గలయఁదిరుగుచున్న, భూపతికిన్ = వసురాజునకు, ఎల్లెడన్ = ఏ స్థలమందును, కన్నియరూపమె తోఁచున్ = గిరికాదేవియొక్క రూపమే కనుపడును. ఇక్కడ వనమందలి కోరక పల్లవాద్యుపమానములచేత గిరికాదేవియొక్క నఖ పాదాద్యుపమేయములు స్ఫురించుచున్నవి గనుకఁ గన్నియరూపమైతోఁచు నెల్లెడన్ - అని గ్రంథకర్త చెప్పినాఁడు. ఇందు గిరికాదేవి నఖాది కేశ పర్యంతావయవములకు నుపమానములు చెప్పఁబడెను. రాజు వనములోఁ గలయఁ జరింప సాగెను. పూర్వోక్తములగు నుపమానవస్తువులు కన్నియరూపమునె స్ఫురింపఁజేయుచుండెను. కానన మసామాన్యమయినది. మన్మథుని భుజవీర్య మవార్య మెయిన్నది. కావున నెల్లెడ సతిరూపు కన్పించెను.

సీ. కనుఁగొంటి లతకూన • నని డాయఁ గాకున్న నభినవతరలతా•వాప్తిఁ దెలుపుఁ
గంటిఁ బద్మిని నని • గమకించుఁ గాకున్నఁ బరితాపగరిమఁ దా•మరలఁ జూచుఁ
జూచితిఁ గొమ్మ నం•చు నటించుఁ గాకున్న నలయు శాఖోపశా•ఖానురక్తిఁ
దమిఁ జూడఁ గంటి నూ•తనరంభ ననియేగుఁ గాకున్నఁ గదళిచెం•గటఁ భ్రమించు
తే. నయ్యెడ ననంగశరశర•వ్యాంతరంగ
కలితభావతరంగమ్ము•ల్లప్పికొనఁగ
విభుఁడు చెలిమ్రోల నాత్మీయ•విభ్రమములు
దేటపడకుండ నేర్పున • మాటుపఱుచు. 82

కనుఁగొంటి లతకూననని డాయన్ = లతకూన యనఁగాఁ గన్నెపడుచును, లేఁతతీఁగెయును, లేఁతతీఁగెను జూచి గిరికాదేవి పొదకట్టినట్లుండఁగాఁ జూచితినని దగ్గరకుఁ బోవును, కాకున్నన్ = గిరికాదేవి కాకపోఁగా-సఖునికిఁ దనవిభ్రాంతి దెలియకుండునట్టులుగా, అభినవతరలతావాప్తిఁ దెలుపున్ = అత్యంతనూతనమైన లతాప్రాప్తిని గనుపఱుచును. అనఁగా నొక లేఁతతీఁగెను గ్రహించినవానివలెఁ దెలియఁజేయునని యర్థము. అభినవమైన తరళత్వముయొక్క యనఁగా జాంచల్యముయొక్క ప్రాప్తిని దెలియఁజేయునని యర్థాంతరము. కంటిఁబద్మినినని గమకించున్ = పద్మిని యనఁగాఁ బద్మినీజాతి స్త్రీయును బద్మలతయును గనుకఁ బద్మలతను జూచి పద్మినీజాతిస్త్రీయైన గిరికాదేవిని జూచితినని యుత్సహించును. కాకున్నన్ =గిరికాదేవిగాకపోఁగా, పరితాపగరిమఁ దామరలఁజూచున్ = వేదనాతిశయముచేతఁ బద్మములఁ జూచును. అనఁగాఁ బద్మములకై చూచినవానివలెఁ గనుపడునని యర్థము. పరితాపాతిశయముచేతఁ దాను దిరిగి చూచునని యర్థాంతరము.

చూచితిఁ గొమ్మనంచునటించున్ = కొమ్మయనఁగా స్త్రీయును శాఖయును గనుకఁ బుష్పశాఖను జూచి గిరికాదేవిని జూచితినని నటనముసలుపును, కాకున్నన్ =గిరికాదేవిగాకపోఁగా, శాఖ = కొమ్మల యొక్కయు, ఉపశాఖా = చేరువకొమ్మలయొక్కయు, అనురక్తిన్ =అనురంజనముచేత, అలయున్ = అలఁతనొందును. అనఁగాఁ గొమ్మలనుబట్టి విడుచుటయందలి యుల్లాసముచేత నలసినవానివలెఁ గనుపడునని యర్థము. బహుంవిధజాతానురాగముచేత నలయునని యర్థాంతరము. తమిఁజూడఁగంటి నూతనరంభ ననియేగున్ =నూతనరంభయనఁగా రంభాసమానమైన స్త్రీయును నభినవకదళీవృక్షమును గనుక నభినవకదళీవృక్షమును గనుక నభినవకదళీవృక్షమును జూచి యాసక్తిచేత గిరికాదేవిని జూచితినని పోవును, కాకున్నన్ =గిరికాదేవి గాకపోఁగా, కదళిచెంగటభ్రమించున్ = కదళికొరకు. [illegible]

సంచరించును. అనఁగా వినోదార్థమయిన కదళీవృక్షసమీపమందుఁ దిరుగుచున్న వానివలెఁ గనుపడునని యర్థము. చలించిచెంగట భ్రమనొందునని యర్థాంతరము.

అయ్యెడన్ = గిరికాదేవి గనుపడకయున్న యాసమయమందు, అనంగశర = మన్మథబాణములకు, శరవ్య = గుఱియైన, అంతరంగ = అనఁగా రతియనెడి స్థాయిభావమందు, కలిత = కూడుకొన్న, భావతరంగములు = సంచారిభావపరంపరలు (అని యయినను భావములనఁగా సంచారిభావము లనెడు తరంగములని రూపకము చెప్పి యీ రూపకమున కనుగుణముగా నంతరంగమనెడి సముద్రమని రూపకాంతరముగా నైనను జెప్పవచ్చును. ఏలాగనిన).

శ్లో. 'మజ్జంతశ్చ నిమజ్జంతః కల్లోలాశ్చ యథార్ణవే,
తస్యోత్కర్షంవితన్వంతి యాంతిత ద్రూపతామపి.
తథాస్థాయిని నిర్మగ్నా ఉన్మగ్నావ్యభిచారిణః,
పుష్యంతి స్థాయిసంస్థాశ్చ తత్రయాంతి రసాత్మతామ్.'

అని స్థాయిభావమునకు సముద్రసామ్యమును సంచారిభావమునకుఁ దరంగసామ్యమును జెప్పఁబడినది గనుక నీపద్యమందు మూఁడుసంచారిభావములు చెప్పినాఁడు. అవియెవ్వియనిన, గిరికాదేవిని జూచితినని డాయఁబోవుట యున్మాదమనెడి సంచారిభావము.

శ్లో. 'ఉన్మాదస్తుల్యవర్తిత్వం చేతనాచేతనేష్వపి' అనిలక్షణము.

భ్రాంతిగోపనముసేయుట యవహిత్థయనెడి సంచారిభావము.

"శ్లో. వార్షాద్యాకారసంగుప్తిరవహిత్థేతికథ్యతే" అనిలక్షణము.

తరళత్వాది చతుష్టయము చాపల్యమనెడి సంచారిభావము.

శ్లో. 'చాపలంత్వనవస్థానంరాగద్వేషాదిసంభవమ్' అనిలక్షణము.

ఈసంచారిభావములు, కప్పికొనఁగన్ = ఆవరించుకొనఁగా, విభుఁడు = వసురాజు, చెలిమ్రోలన్ = నర్మసఖునియెదుట, ఆత్మీయవిభ్రమములు = తనయొక్క విభ్రాంతివికారములు, తేటపడకుండన్ = తెలియఁబడకుండునటులుగా, నేర్పునమాటుపఱుచున్ = ఉపాయముచేత మఱుఁగుపఱుచును.

అలంకారము-శ్లేషము.

వసురాజు లతకూనను, పద్మినిని, పూఁగొమ్మను, అరఁటిచెట్టును గాంచి మదనతాపవశంబున గిరికయని తలంచి సమీపించి తనభ్రాంతిని దానే మాటుపఱచి కొనసాగెను. రాజు ప్రమాదమును నేర్పున మాటుపఱచి కొన్నవిధము కవి యపూర్వార్థఘటనారూపమగు శ్లేషముచే సమర్థించిన విధము మనోహారముగ నున్నది.

శా. ఆరామామణిమీఁదిప్రేమమున ని ట్లారామసీమాసరో
వారంబు ల్దిలకించి యందు నతిదుర్వారంబు లై మీఁఱుభృం
గారావంబులచే ననంగరుజ వాంగారం గురంగాక్షిశృం
గారాగారముఁ జేరి తాల్మి నిలుపంగా రాక గారామునన్. 83

'ఆరామామణిమీఁది ప్రేమమునన్' = ఆగిరికాదేవిమీఁది యనురాగముచేత, ఇట్లు = పూర్వోక్తప్రకారముగా, ఆరామసీమా = ఉద్యానవన ప్రదేశములయొక్కయు, సరః = కొలఁకులయొక్కయు,

వారంబులు = సమూహములను, తిలకించి=విమర్శించి, అందున్ = ఆయాస్థలములయందు, అతిదుర్వారంబులై = మిక్కిలియు నివారింపఁబడనివై, మీఱు = అతిశయించుచున్న, భృంగారావంబులచేన్ = తుమ్మెదలయొక్క ఝుంకారధ్వనులచేత, అనంగరుజశాంగారన్ = మన్మథవ్యాధి పరిపూర్ణమగు చుండఁగా, కురంగాక్షీ శృంగారాగారముఁజేరి = గిరికాదేవియొక్క శృంగారగృహముఁ దిరుగాఁ బ్రవేశించి, తాల్మిసిలుపంగారాక = ధైర్యము నిలుపఁగూడక, గారామునన్ = ప్రేమచేత-ఈపద్యము నకు ముందరిపద్యముతో నన్వయము.

ఈపద్యములో ననంగరుజ యనఁగా వ్యాధి యనెడి సంచారిభావము.

శ్లో. 'మనస్తాపాద్యభిభవో జ్వరాది ర్వ్యాధిరిష్యతే' అని లక్షణము.

రాజు వనమందెల్లెడఁదిరిగి గిరికమీఁదిప్రేమచే నామె సంచరించిన సరోవరప్రాంతము, ఆరామము చూచెను. తుమ్మెదలద్ద మాకలేక రొద లొనర్చెను. దాన ననంగరుజ రేకెత్తెను. ఏకాంత ప్రదేశమున విశ్రమింతమని రాజు గిరికాశృంగారమందిరమున కేగెను. ప్రియాసదనము తాల్మిని ఛేదించెను.

మ. అవనీనాథుఁడు వల్కుఁ జూచితె వయస్యా యీమణీధామ మా
ధవళాక్షీమణి యేగ శూన్యగతి నై తద్రూపచిత్రాహితో
త్సవ మేతన్మృదుగాన గుంభిత రసార్ద్రం బై తదీయాంగరా
గ వరామోదము పూని మామకమనఃకంజాతముం బోలెడిన్. 88

ఈపద్యములో మణీధామము మామకమనఃకంజాతముంబోలెడిన్ అనిచెప్పుటచేత మణి ధామ పరముగాను వసురాజు మానసపరముగాను నర్థద్వయమును విచారింపవలయును. ఏలాగున ననిన, అవనీనాథుఁడు వల్కున్ = వసురా జీలాగని పలుకుచున్నాఁడు. చూచితెవయస్యా = ఓయిస్నేహితుఁడా చూచినావా, ఈమణీధామము = ఈ రత్నమయమందిరము, ఆధవళాక్షీమణియేగన్ = ఆగిరికాదేవి పోఁగానే, శూన్యగతినై = పాడుపడిన రీతిగలదై, తద్రూప చిత్రాహితోత్సవమై-తత్ = ఆగిరిక యొక్క, రూప = ఆకృతిగా వ్రాయఁబడిన, చిత్ర = చిత్తరువులచేత, ఆహిత = పొందింపఁబడిన, ఉత్సవమై = కనులపండువుగలదై యని మణిధామపరమైన యర్థము. తత్ = ఆగిరికయొక్క, రూప చిత్ర = చిత్తరువుబొమ్మవలె నిశ్చలముగా నిలిచియున్న రూపముచేత, ఆహితోత్సవమై = కూర్పఁబడిన వేడుక గలదయియని మానసపరమయిన యర్థము, తన్మృదుగానగుంభిత రసార్ద్రంబై = తత్ = ఆగిరిక యొక్క, మృదుగాన = సవురైన సంగీతముచేత, గుంభిత = రచింపఁబడిన, రస = జలముచేత, అనఁగా సంగీతరసముచేతఁ, గరఁగిన రత్నకందళజలముచేత ననుట. ఆర్ద్రంబై = తడుపఁబడినదై యని మణిధామ పరమయినయర్థము. ఆగిరికయొక్క మృదుగానముచేతఁ బూరింపఁబడిన శృంగారరసముచేత స్తిమితమయిన దని మానసపరమయిన యర్థము. తదీయాంగరాగవరామోదముపూని - తదీయ = ఆగిరికా సంబంధమై, అంగరాగ = మైపూఁతయైన, వర = కుంకుమపువ్వుయొక్క, (ని. వరం కాశ్మీరజం మతమ్' అని వి.) ఆమోదము = పరిమళమును, పూని = వహించియని గృహపరమయిన యర్థము. తదీయ = ఆ గిరికాసంబంధమయిన, అంగ = అవయవ విషయమయిన, రాగ = అనురాగజనితమయిన, ఆమోదము = సంతోషమును, పూని=వహించి యని మానసపరమయిన యర్థము. మామకమనఃకంజాతముంబోలెడిన్ = నాయొక్క హృదయకమలమును బోలుచున్నది-చూచితె వయస్యా యని వెనుక నన్వయము.

ఇక్కడ మానసపరమయిన యర్థమందు శూన్యగతియైనదనఁగా చింతయనెడు సంచారిభావమున కనుభావము. గిరికాస్వరూపము నిశ్చలముగా నిలిపియుండుట చింతాఖ్యసంచారిభావము. గాన ముద్దీపనవిభావము. రసమనఁగా బూర్ణమయిన శృంగారరసము. అంగమాలంబనవిభావము. రాగము రతి యనెడి స్థాయీభావము. ఆమోదమనఁగా శృంగారరసానుభావమయిన ప్రమోదము. వీనికి లక్షణములు అనుపమకాంతివైభవసమన్విత యనెడు పద్యముయొక్క వ్యాఖ్యయందుఁ దెలియఁ జేయఁబడియున్నవి. మఱియు విశేషముగాఁ బ్రతాపరుద్రీయాదులయందుఁ జెప్పఁబడియున్నవి. అలంకారము-శ్లేషానుప్రాణితమైన యుపమ.

సీ. శుచివృత్తి నెన్నాళ్లు ♦ పచరించెనో తీర్థసంవాస మిచటిహం♦సవ్రజంబు
సురసాలముల నెన్ని ♦ వరఫలంబులఁ జెంది నిలిచెనో యిచటి రాచిలుకచాలు
సుమనోనురక్తి నె♦ట్టిమహా♦సవంబుల నందెనో యిచటిమ♦త్తాళిసమితి
యదన నెంతతపంబు ♦ తుదిమీఱ నోచెనో యిచటిగంధాంధబ♦ర్హిణగణంబు
తే. లతివవెనువెంటఁదిరుగగ♦బ్జాక్షిముద్దు, మోవిచవిగోనసతిమోము♦దావిగోసరఁ
గనవ్యఘనకంకణనినాద♦గర్జనలరఁ, గాంచెనని యుస్సురను మహీ♦కాంతుఁడపుడు.

ఇచటి హంసవ్రజంబు = ఇక్కడి మరాళసమూహము, శుచివృత్తి నెన్నాళ్లు పచరించెనో తీర్థసంవాసము = శుచియనఁగా బరిశుద్ధంబును, గ్రీష్మర్తువును, (ని. 'శుచి శ్శుద్ధే నుపధాతే శృఙ్గారాషాఢయోః స్సితే, గ్రీష్మే హుతవహేపి స్యా దుపధా శుద్ధమంత్రిణి' అని వి.) తీర్థమనఁగాఁబుణ్యక్షేత్రంబును జలంబును గనుకఁ బరిశుద్ధవ్యాపారముతోడఁ బుణ్యక్షేత్రనివాస మెన్నాళ్లుచేసెనో యని యర్థము. గ్రీష్మసమయ ప్రవర్తనముచేతఁ గాసారజలసంవాసముసేయుచున్నదని భావము.

ఇచటిరాచిలుకచాలు = ఇక్కడిరాజకీరశ్రేణి, సురసాలముల నెన్ని వరఫలంబులఁ జెంది నిలిచెనో=సురసాలము లనఁగా దేవతావృక్షములు. అనఁగాఁ కల్పవృక్షములు. మంచివైన రసాలములు. అనఁగాఁ దియ్యమామిడిచెట్లు. దేవతావృక్షములవలన నెన్ని వరరూపములైన లాభములను బొంది యుండెనో యని యర్థము. మంచితీయమామిడిచెట్లవలన శ్రేష్ఠమైన పండ్లను గ్రహించియుంచున్నవని భావము. (సు+రసాలమనుచో మంచితీయమావియని యొకయెడను సుర+సాలమనుచో వేల్పుమ్రానని యొకయెడను నర్థద్వయము గ్రహించునది.)

ఇచటి మత్తాళిసమితి = ఇక్కడి మదయుక్తమైన తుమ్మెదలగుంపు, సుమనోనురక్తి నెట్టిమహాసవము నందెనో-సుమనశ్శబ్దము దేవతలయందును బుష్పములయందును వర్తించును. సవమనఁగా యజ్ఞము ను ఆసవమనఁగా మకరందమునుగనుక దేవతలయందలి యనురాగముచేత నెట్టి మహాయజ్ఞము నాదరించెనో యని యర్థము. (ని. యజ్ఞః స్సవోఽధ్వరో యాగః' అని అ.) పుష్పానురక్తిచేత మకరందాస్వాదనము చేయుచున్నదని భావము.

ఇచటి గంధాంధ బర్హిణగణంబులు=ఇక్కడి గర్వగ్రస్తమయూర సముదాయములు, అదనన్ = కాలమందు, ఎంతతపంబు తుదిమీఱనోచెనో = తపమనఁగాఁ దపస్సును గ్రీష్మర్తువును-ఎంతతపస్సు తుది ముట్టువట్టులుగాఁ జేసెనోయని యర్థము, తపంబు తుదిన్ = గ్రీష్మర్తువుయొక్క చివరదైన వర్షర్తువు నందు, మీఱనోచెనో = అతిశయముగా నోచినవని భావము. (ఈలాగునఁ జెప్పుట యెందు కనిన),

అలివవెనువెంటఁ దిరుగను=గిరికయొక్క వెంటవెంటఁ దిరుగుటకును, అబ్జాక్షిముద్దుమోవి చవి గొనక్=గిరికయొక్క మనోహరమయిన యధరోష్ఠము రుచిఁ జూచుటకును, చవిక్=కాంతిని, గొనన్=పొందుటకు అనినైనను చెప్పవచ్చును. సతిమోముతావిఁ గొసరక్ = గిరికయొక్క ముఖవాసనను మాటిమాటి కాస్వాదించుటకును, కన్యకరకంకణవినాద గర్జనలరక్ =గిరికయొక్క యధికమయిన కంకణధ్వనియనెడు సుమములవలన సంతోషించుటకును, కాంచెనని = అర్హత్వవహించెనని, మహీకాంతుఁడు=వసురాజు, అపుడు=ఆసమయమందు, ఉస్సురనుక్=ఉస్సురనెడు పసుకరణముతోడ నిట్టూర్పు వుచ్చును.

ఇక్కడ గిరికాదేవియొక్క గమనాధర ముఖామోద కంకణధ్వనులయందలి సజాతీయ గమనారుణ ఫలకమలామోద గర్జా భ్రాంతిచేతఁ పదపసరణాదికము జేయుచున్న హంసలు మొద లైనవానికి నభేదాధ్యవసాయముచేత లభింపఁబడిన తపశ్శాలిత్వరూప స్తుతిచేత హంసాదులు ధన్యము లైనవి యని స్తుతియుచు దదనుసరణాద్యభావమువలన నేనుధన్యుఁడఁ గాకపోతి ననెడు నిందయును దోఁచుచున్నదిగనుక వ్యాజస్తుత్యలంకారము. శ్లో. 'ఉక్తిర్వ్యాజస్తుతిర్నిందాస్తుతిభ్యాం స్తుతినిందయోః' అని లక్షణము.

ఉ. మించినవేడ్కతో నచట ♦ మీనవిలోచన మున్ను వీణవా
యించినచోటు బోటు లల♦యింపఁగ మాటున నున్నచోటు న
య్యంచితగాత్రి యేగఁ జెలు ♦ లాఁగినచోటును గాంచి రాగముల్
గాంచుఁ దమోమయావృతులు ♦ గాంచు భజించుఁ జలాచలత్వముల్. 86

మించిన వేడ్కతోక్ = అతిశయించిన వేడుకతోడ, అచటక్ = ఆమణిమందిరమందు; మీనవిలోచన = గిరికాదేవి, మున్ను వీణవాయించిన చోటు=మునుపు వీణవాయించిన స్థలమును; బోటు లలయింపఁగ మాటున నున్నచోటుక్=చెలికత్తియలు కోడిగములాడి వేసటఁ బొందింపఁగాఁ జెరచాటునకుఁ బోయియున్న స్థలమును, అయ్యంచితగాత్రి యేగక్ = ఆగిరికాదేవి పోఁజూడఁగా, చెలులాఁగినచోటును=సఖులడ్డగించిన స్థలమును, కాంచి=చూచినవాఁడై, రాగముల్గాంచుక్ =శ్రీరాగాదిరాగములను స్మృతికిఁ దెచ్చుకొనునని యర్థము. అనురాగాతిశయమును బొందుననియర్థాంతరము. ఇక్కడ బహువచన మతిశయద్యోతనార్థమని తెలియవలయును. తమోమయావృతులు గాంచుక్ = అనఁగాఁ దిమిరప్రచురావరణములను గాంచుననియర్థము. మోహరూపములైనయావరణములను గాంచునని యర్థాంతరము.

ఇక్కడఁ దమస్సదృశ మగుటవల్ల మోహమునకుఁ దమోవ్యపదేశము, భజించుఁ జలాచలత్వములు మట్టిమల్లాడుట నూహించుననియర్థము. చాంచల్యమును బొందునని యర్థాంతరము. ఇక్కడ వీణావాదనాదిస్మృతిని చెప్పినాఁడు గనుక స్మృతియనెడు సంచారిభావము. చలాచలత్వమనఁగాఁ జాపల్యమనెడిసంచారిభావము. అర్థద్వయములకు నభేదాధ్యవసాయము. గానాదినివృత్తిస్థానమందు రాగాదినివృత్తి యుపయుక్తమని తెలియవలయును.

అలంకారము. శ్లేషము.

గిరిక వీణవాయించినచోటఁ జేరి వసురాజు రాగములు (అనురాగలీలలు శ్రీరాగాదిరాగములు) తలంచుకొనియు, బోటులు వేసటఁగూర్చ గిరిక మాటునకేగినచోట తమోమయావృతులు (చీకటితో

నిండిన యావరణములు మోహావరణములు) పొంది గిరిక యేగుచుండఁ జెలికత్తియ లావినచోట చలాచలభావము) (చాంచల్యము చపలమనుసంచారిభావము) నొంది పరితపించెను.

చ. జనపతి యిట్లు పంచశర◆శాతశరాహతిఁ జంచలింపఁగాఁ
గని హితమంత్రి వల్కు మహీ◆కాంత నిరంతరచింత నింతవిం
తనెగులు పూన నేల లల◆నానలినాస్త్రుఁడ వీవు నిన్నుఁ గ
న్గొనినలతాంగియీలువు మనో◆భవుఁ డింతకుఁ గొల్లలాడఁడే. 87

జనపతి=వసురాజు, ఇట్లు = ఈప్రకారముగా, పంచశర = మన్మథునియొక్క, శాత=వాడిగలిగిన, శర=బాణములయొక్క, ఆహతిన్=దెబ్బ తాఁకుడుచేత, చంచలింపఁగాన్=కంపింపఁగా, కని=చూచి, హితమంత్రి పల్కున్ = ఇష్టసచివుఁడు పలికెను. ఏమనియనిన, మహీకాంత = భూమీశ్వరా, నిరంతరచింతన్=ఎడతెగనివిచారముచేత, ఇంతవింత నెగులుపూన నేల=ఇటువంటి యద్భుతవ్యథను బొంద నేటికి, ఈవు=నీవు, లలనానలినాస్త్రుఁడవు=రమణీమన్మథుఁడవు, నిన్నుఁ గన్గొనినలతాంగియీలువు=నిన్నుఁజూచిన మగువయొక్క ధైర్యమును, మనోభవుఁ డింతకుఁ గొల్లలాడఁడే=మన్మథుఁడు ముఖ్యముగాఁ జూఱఁగొనఁడా-అనఁగా నభిమానముఁ దక్కనియ్యఁడనుట.

మన్మథపర్యాయపదములు చెప్పక పంచశరుఁడనుటచే నాతనిబాణములతాఁకిడి గాటమైనదనియుభావము. నీవు లలనానలినాస్త్రుఁడవుగాన నీరూపము స్త్రీలకు మోహజనకము. అట్టిచో నన్యోన్యసంధాతయగు మనోభవుఁడు సంకల్పసంభవుఁడుగానఁ జెలువయభిమానమును గూడఁగొల్లలాడుచుండును. తుల్యావస్థలోనున్న మీరిరువుర కామనోభవుఁడె దాంపత్యము సమకూర్పఁగలఁడని యాశయము.

చ. అతివగురుండు తావకప◆దానతుఁ డంగనఁ గన్నతల్లి య
ద్భుతభవదీయశౌర్యరస◆పోషితజీవన కొమ్మనెచ్చెలు
ల్సతతము నీకథ ల్వొగడ◆ జాణలు బాల భవద్విలాసమో
హిత హితకార్యసంగతికి◆ నియ్యెడ సందియ మంద నేటికిన్. 88

అతివగురుండు=గిరికాదేవితండ్రియయిన కోలాహలుఁడు, తావకపదానతుఁడు=నీయొక్క పాదాక్రాంతుఁడని యర్థము. నీయొక్క పాదాహతి నొందినవాఁడని యర్థాంతరము. అంగనఁగన్నతల్లి=గిరికాదేవిని గన్నతల్లియైన శుక్తిమతి, అద్భుత=ఆశ్చర్యకరమయిన, భవదీయ=నీసంబంధమైన, శౌర్యరస=శూరత్వముచేత, పోషిత=వృద్ధిఁబొందింపఁబడిన, జీవన=బ్రతుకఁగలిగినదనియర్థము. జలములకు జలములవలనఁ బ్రాబల్యము గనుక శౌర్యరసమనెడి రసముచేతఁ బోషింపఁబడిన రసముగలదని చమత్కారాతిశయమును గ్రహింపవలయును. రసజీవనశబ్దములకు జలమర్థము. కొమ్మనెచ్చెలులు=గిరికాదేవియొక్క ప్రియసఖులు, సతతము=ఎల్లప్పుడును, నీకథల్వొగడజాణలు=నీయొక్క గుణకథనము సేయుటకుఁ బ్రౌఢలు, బాల=గిరికాదేవి, భవద్విలాసమోహిత=నీయొక్క విలాసములచేత మోహింపఁబడినది కాఁబట్టి, హితకార్యసంగతికిన్=అభీష్టకార్యసిద్ధియగుటకు, ఇయ్యెడన్ = ఈసమయమందు, సందియమందనేటికిన్=సంశయింపనేటికి, అనఁగా నెవరిసంగతివిచారించినను గేవలము స్వాధీనమయియున్నది గనుక గిరికాదేవిని నీవు పరిగ్రహించుటకు సందేహ మెంతమాత్రమును లేదని తాత్పర్యము.

గిరికారాజసతుఁడు నీకుఁ బాదాసతుఁడు. ఆయమకన్నె నీపరాక్రమముచే బడయ దగ్గినది. కొమ్మ చెలికత్తెలు నీగుణప్రశంసగావించునేర్పరులు. గిరిక నీసొంపుఁజూచి వలచినది. కావున నవనవాలకార్యమునకుఁ గొంకుగొననేలయని భావము. అల. అర్థాపత్తి.

క. బాలాపాణిగ్రహశుభ, వేళానిర్ణీతి కిప్రుడ ♦ విచ్చేయుము భూ
పాలావతంస యన విని, శైలారి యలీకధైర్య♦చాతుర్యమునన్. ౬౯

బాలా=గిరికాదేవియొక్క, పాణిగ్రహ=వివాహనిమిత్తమయిన, శుభవేళా=శుభముహూర్తము యొక్క, నిర్ణీతికిన్ = నిశ్చయమునకు, ఇప్రుడ = ఇప్పుడే, విచ్చేయుము = పట్టణమునకు విజయము సేయుము, భూపాలావతంస = రాజశిఖామణీ, అనన్ = అని నర్మసఖుఁడు పలుకఁగా, విని=విన్నవాఁడయి, శైలారి=కోలాహలపర్వత భంజకుఁడయిన వసురాజు, అలీక ధైర్యచాతుర్యమునన్=లేనిధైర్యము యొక్క-అనఁగాఁ దెచ్చుకోలుధైర్యముయొక్క పటుత్వముచేత, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. (ని. 'అలీకం త్వప్రియే నృతే' అని అమరము.)

మనము యత్నింపవలసిన దింక వివాహముహూర్తమునకే. ఆలస్యమున కెడము లేదు. రాఁడగినం దిందుల కిప్పుడ! అని యిష్టసఖుఁడు చెప్పఁగా నేరుపుగఁ దెచ్చికోలుధైర్యముతో నుండెను.

మ. అగకూటాగ్రము డిగ్గి సంభ్రమసమ♦గ్రాధోరణానీతగం
ధగజోత్తంసము నెక్కి చూడ్కి కెలమిం ♦ దత్కుంభహస్తద్యుతు
ల్నగజాచారుకుచోరువైఖరులు దె♦ల్పం బుట్టుఘర్మంబు నే
ర్పుగఁ దత్కర్ణవిశీర్ణ చామరమరు♦త్పోతంబులం దీర్చుచున్. ౭౦

అగ=కోలాహలపర్వతముయొక్క, కూట = శిఖరముయొక్క, అగ్రము=అగ్రభాగమును, డిగ్గి= దిగినవాఁడై, సంభ్రమ సమగ్ర = సంపూర్ణమైన త్వరతోఁగూడుకొన్న, ఆధోరణ = మావటీనిచేత, (ని. 'ఆధోరణా హస్తిపకాః' అని అ.) ఆనీత = తేఁబడిన, గంధగజోత్తంసమున్=గర్వితగజశ్రేష్ఠమును, ఎక్కి=ఆరోహణముచేసి, చూడ్కి కెలమిన్ = నేత్రముల కానందమగునట్టులుగా, తత్=ఆగజశ్రేష్ఠము యొక్క, కుంభ = కుంభములయొక్కయు, హస్త = తుండముయొక్కయు, ద్యుతులు = శోభలు, నగజా = గిరికాదేవియొక్క, చారు = సుందరములైన, కుచ = స్తనములయొక్కయు, ఊరు=తొడల యొక్కయు, వైఖరులు = రీతులను, తెల్పన్ = తెలియఁజేయఁగా, పుట్టు = ఉద్భవించుచున్న, ఘర్మంబు = సాత్త్వికభావజనితమయిన చెమటను, ఇందుకు -

క. 'సమరతిఘర్మాదులచే, విమలశరీరములయందు విస్ఫుటమగు న
చ్చెమటను నభిధానము స్వేదముగాఁ బలుకుదురు సమ్మదమున నభిజ్ఞుల్.'

అని లక్షణము.

నేర్పుగన్ = ఉపాయముగా, తత్=ఆగజశ్రేష్ఠముయొక్క, కర్ణ=చెవులనెడు, విశీర్ణచామర= అక్షీణ చామరములయొక్క, మరుత్పోతంబులన్ = పవనాంకురములచేత-అనఁగాఁ చిల్లవాయువుల చేత, తీర్చుచున్ = పోఁజేసికొనుచును-ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఈపద్యములో శరీరమందుఁబుట్టిన స్వేదమును నేర్పుగా గజకర్ణచామర వాయువులచేతఁ బోఁగొట్టుకొన్నాఁడు గాని

వ్యాజవాదులచేతఁ బ్రకటము చేసినవాఁడు గాఁడు. కనుక ధూర్తాకార గోపనరూపమయిన యవహిత్థ యనెడి సంచారిభావము చెప్పఁబడినది.

వనమంతయుఁ గాంతారూపముగాఁ గనిపించిన కామార్తునకు నుపమేయవస్తువు లన్నియుఁ గాంతావయవములను స్ఫురింపఁజేయుటలో వింతలేదు. కావున సామాన్యగజము కాని తానెక్కిన గంధగజోత్తంసము కుంభములద్యుతులచేఁ జెలువగుబ్బలను తొండపుఁగాంతులచేఁ బోలఁతి యూరువులను దలఁపించెను. దానసాత్త్వికభావజనితమగు చెమటజనించెను. గజములకుఁ గర్ణచాలనము సహజముగానఁ దానజనించు చిఱుగాడ్పులు చెమటఁబోకార్చెను. అలం. వ్యాజోక్తి.

మ. అవనీభర్తవినూతనాతనుపతాకాలోకసంప్రేక్షణీ
యవిలాసంబు గజాధిరాజగమనోదారంబుఁ గాశ్మీరప
త్రవిచిత్రంబుఁ దటిద్విభాసిరుచి యాతద్వాహినీజాతవై
భవమున్ లో వెలిఁ గాంచుచుం జనియె సంపత్పేటికిన్ పీటికిన్. 91

ఈపద్యమునందు వాహిని జాతవైభవమనుటచే నదీజాతయగు గిరికాపరముగను నర్థద్వయము గలదు.

అవనీభర్త = వసురాజు, వినూతన = అభినవమైన, అతనుపతాకా = మన్మథాంకములైన మీనములవంటి, ఆలోక=చూపులయొక్క, ప్రేక్షణీయ=చూడఁదగిన, విలాసంబు = విలాసముగలిగినట్టిదియును-అని గిరికావైభవపరమైన యర్థము. వినూతన = మిక్కిలినూతనమయిన, అతను = అస్తోకములయిన, పతాకా = ధ్వజములయొక్క, ఆలోక = కాంతులయొక్క, సంప్రేక్షణీయవిలాసంబు = చూడఁదగిన విలాసము గలిగినట్టిదియును - అని సేనావైభవపరమయినయర్థము. (ని. 'పతాకా వైజయంత్యాం చ సౌభాగ్యేంకే ధ్వజేఽపిచ' అని వి.) ('ఆలోకా దర్శనోద్యోతౌ' అని అ.) గజాధిరాజ = గజశ్రేష్ఠముయొక్క, గమన = నడకవంటినడకచేత, ఉదారంబున్ = అతిశయమయినదియు అని యర్థము. మత్తగజేంద్ర గతులచేత నతిశయమయినదియును అని యర్థాంతరము. కాశ్మీరపత్రవిచిత్రంబు-పత్రశబ్దము మకరికాపత్రములయందును అశ్వములయందును వర్తించుచున్నది. (ని. 'పత్రం స్యాద్వాహనేపర్ణే పక్షేచశరపక్షిణోః' అని వి.) కుంకుమపత్రరచనలచేత విచిత్రమయినదియును అని యర్థము. కాశ్మీరదేశతురంగములచే విచిత్రమైనదియును అని యర్థాంతరము. తటిత్ =మెఱుపుతీఁగెవలె, విభాసి=ప్రకాశించుచున్న, రుచి = లావణ్యము గలదియును అని యర్థము. తటిద్విభా=మెఱుపుతీఁగెయొక్క కాంతివంటి కాంతిగల, అసి = కత్తులయొక్క, రుచి = ధాగధగ్యముగలదియును అని యర్థాంతరము. ఔ=అయినట్టి, తద్వాహినీ జాతవైభవమున్=శుక్తిమతీ నదీసంభవయైన యాగిరికాదేవియొక్క, వైభవము నని యర్థము. సేనాసమూహ వైభవమునని యర్థాంతరము. లోవెలిఁ జూచుచున్ = లోపలను వెలుపలనుం జూచుచును - అనఁగా గిరికావైభవమును హృదయమందును సేనావైభవమును బాహ్యమందును జూచుచు, సంపత్పేటికిన్ = సంపదలకుఁ బెద్దమందసపుఁబెట్టెయైన, పీటికిన్ = పట్టణమునకు, చనియెన్ = పోయెను.

వసురాజు మీలవంటి చూపులసొంపు మదపుటేనుంగువంటి నడకపెంపు, మకరికాదిపత్ర సౌభాగ్యము, మెఱుపుఁదీఁగవంటి మేనినిగ్గుగల గిరికాసౌందర్యము హృదయమునందును బలాకములు

విలాసము, మదపుటేనుఁగుల పొలుపు, తురంగముల యొప్పు, గత్తుల మెఱుపులు, సైన్యవైభవము బాహ్యదృష్టిని దిలకించుచుఁ దన నగరమున కేగెను. అలం. శ్లేషము.

తే. నగరిపుసమానుఁ డీరీతి • నగరి కరిగి, సింధురము డిగ్గి గాంధార • సింధు కుకుర
కాశ ముఖ్యుల ననిపి ప్ర • కాశవృతది, శాంత మగు నాత్మకేళీని • శాంత మొందె.

నగరిపుసమానుఁడు=ఇంద్రసమానుఁడైన వసురాజు-ఇక్కడ నగరిపుశబ్దము సాభిప్రాయము. ఈరీతి నగరికరిగి=ఈచెప్పఁబడిన ప్రకారముగాఁ బట్టణమునకుఁబోయి, సింధురము డిగ్గి = ఏనుఁగును దిగి, గాంధార సింధు కుకుర కాశ ముఖ్యులననిపి = గాంధార సింధు కుకుర కాశ అను దేశాధిపతులను సెలవిచ్చి పంపించి, ప్రకాశవృతదిశాంతమగు = మణికాంతులచేత నావరింపఁబడిన దిగంతములుగలదైన, ఆత్మకేళీ నిశాంతమొందె=తనయొక్క క్రీడామందిరమును బొందినవాఁడై.

చ. అలివలు ద్రిప్పునారతుల • యట్ల మనంబు భ్రమింపఁ గుంభినీ
పతి జలకంబువేళ యని • భామలు దెల్పఁగఁ బళ్లెరంబు పె
ట్టితి మని తొయ్యలుల్ బడిబడి • దడతేర ననాస్థతో యథో
చితవిధు లాచరించి పువు • సెజ్జకు నొయ్యన మేను దార్చుచున్. 93

అలివలు ద్రిప్పునారతులయట్ల మనంబు భ్రమింపన్ = స్త్రీలిచ్చుచున్న నీరాజనము తేలీయగాఁ దిరుగునో యాతీరుగా మనస్సు తిరుగుచు నుండఁగా, కుంభినీపతి = వసురాజు, జలకంబువేళయని భామలు దెల్పఁగన్ = స్నానసమయ మని కొందఱు స్త్రీలు విన్నపము సేయఁగాను, పళ్లెరంబు పెట్టితిమని తొయ్యలు ల్బడిబడి న్నడతేరన్ = భోజనపాత్రము సిద్ధపఱిచినామని కొందఱు స్త్రీలు వెంబడి వెంబడిగా వచ్చి మనవి చేయఁగాను, అనాస్థతోన్ = దేనియందును నాసక్తిలేక, యథోచితవిధు లాచరించి=అప్పటికిఁ దగినకృత్యములు నిర్వర్తించి - అనఁగా నొకమాత్రముగా మజ్జన భోజనాదులు జరిగించినవాఁడై, పువుసెజ్జకు నొయ్యన మేనుదార్చుచున్ - పుష్పశయ్యకుఁ దిన్నఁగా శరీరము హత్తించుచును-అనఁగాఁ బూఁబాన్పుమీఁద నొరుగుచును. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఇందులో ననాస్థతో నన్నచోట నాలస్యమనెడి సంచారిభావము. ఇందుకు లక్షణము. (శ్లో. 'మందోద్యమత్వ మాలస్యం కర్తవ్యేషు ప్రకీర్త్యతే') అని ఇంతపర్యంతము వసురాజునకుఁ జింతాసంగమును జెప్పినాఁడు. జలకంబు వేళయనియుఁ బళ్లెము పెట్టితిమనియుఁ గాంతలెఱింగించినను దేనియందును నాసక్తిలేమిచే రాజు చాలసేపూరకుండెను. వెంటవెంటనే రాఁదొడఁగిరి. మనస్సు చెలులు త్రిప్పుచున్న యారతిపళ్లెరమువలె మదనసంతాపజ్వాలాకులముగ నున్నను, అనాస్థపీడించుచున్నను యథోచితవిధుల నాచరింపక తప్పినది కాదు. భోజనానంతరము జరుగవలసిన తాంబూల చర్వణాదుల మాని బూలసెజ్జపై మేను మెల్లగాఁ జేర్చుటయు నీరసమునకుఁ జిహ్నము.

సీ. గిరికన్య మేన సే • కీభవించినఁ గాని, తియ్యవిల్తుని నిరో • ధింప గాదు
సింధుజ నెద నుంచి • సిరులమించినఁ గాని, మిహికాంశుఁగనుసన్న • మెలప రాదు
శుభ్ర వాణియభిముఖ • స్ఫురణఁజూపినఁగాని, పఱచుటంచలఁ గ్రిందు • పఱుప రాదు
పద్మినిఁ గరముఖ • ప్రాప్తిఁ దేల్చినఁ గాని, ‧‧శేల ముమ్మరము • వారింపరాదు

తే. నేర్పున నటంచు నృపతి యానెలఁతఁ దలఁచి
తలఁచి సగ మగు సాత్త్వికోదయదశాను
భావములఁ జెందు నున్మద ప్రసవబాణ
బాణమగ్నతఁ గాంచుఁ దాపము వహించు. 94

నేర్పునన్ = ఉపాయముచేత, గిరికన్యమేన నేకీభవించినఁగాని = గిరికాదేవియొక్క శరీరమం దొక్కటిగా మిళితమైనఁగాని యని యర్థము. ఇక్కడషష్ఠీతత్పురుషసమాసము, పార్వతీదేని తనశరీరమం దేకీభవించినఁగాని - అనఁగా హరుఁడనైనగాని యని యర్థాంతరము. ఇక్కడ గిరికన్య యనునది కర్తృపదము. తియ్యవిల్తుని నిరోధింపరాదు=మన్మథోద్రేకనివారణముసేయనలవి గాదని రాజపరమయిన యర్థము, మన్మథసంహారము సేయఁ బోసఁగదని శివపరమైన యర్థము.

సింధుజ నెదనుంచి సిరుల మించినఁ గాని = నదీసంభవయైన గిరికాదేవిని ఱొమ్మునఁ జేర్చుకొని వైభవములచేత నతిశయించినఁగాని యని యర్థము. క్షీరాబ్ధిసంభవయైన లక్ష్మిని వక్షఃస్థలమందు నిలిపినఁ గాని-అనఁగా విష్ణుఁడనైనఁగాని యని యర్థాంతరము. మిహికాంశుఁగనుసన్న మెలపరాదు = చంద్రుని వశవర్తిగాఁజేసికొన నలవి గాదని రాజపరము. చంద్రుని నేత్రరూపముగాఁ బ్రవర్తింపఁ జేయఁ గూడ దని విష్ణుపరము. చంద్రసూర్యులు విష్ణుదేవునికి నేత్రములౌట ప్రకటము.

శుభవాణి యభిముఖస్ఫురణఁ జూపినఁగాని=శుభవాక్కులుగల గిరికాదేవి ముఖమిచ్చి మాట్లాడు టను గనుపఱచినఁ గాని యని యర్థము. శుభాస్పదురాలైన వాణీదేవి ముఖమందు నిలిచినఁగాని అనఁగా బ్రహ్మనైనఁ గాని యని యర్థాంతరము. పఱచుటంచలఁ గ్రిందుపఱుప రాదు = ధూర్తమరాళ ములయొక్క యుద్రేక మణఁప నలవికాదని రాజపరము. హంసలను వాహనములుగాఁ జేసికొని క్రిందుపఱుపఁ గూడదని బ్రహ్మపరము.

పద్మినిఁ గరముఖప్రౌఢిఁ దేల్చినఁ గాని = పద్మినీజాతిస్త్రీయైన గిరికాదేవిని గరనఖరనైపుణ్యము చేత నుల్లసింపఁ జేసినఁగాని - అనఁగా స్తన జఘనాదులయందు నఖక్షతములు చేసినఁగాని యని యర్థము. పద్మలతను గిరణప్రసారణము నుల్లసింపఁజేసినఁ గాని-అనఁగా సూర్యుఁడు నైనఁగాని యని యర్థాంతరము. రేలముమ్మరము వారింపరాదు=రాత్రులసముద్రేకమును నివారింప నలవి గాదని రాజపరము. రాత్రులను నిరసింపఁ గూడదని సూర్యపరము.

అటంచున్=ఈలాగని పలుకుచును, నృపతి=వసురాజు, ఆనెలఁతఁ దలఁచి తలఁచి = ఆగిరికా దేవిని బలుమాఱు దలఁచుకొని, సగమగున్ = కృశత్వమును బొందునని రాజపరమయిన యర్థము. అర్ధ నారీశ్వరత్వమును వహించినాఁడని శివపరమయిన యర్థము. సాత్త్వికోదయదశానుభావములఁ జెందున్= కంప స్వేదాది సాత్త్వికోదయభావములను మన్మథావస్థలఁ బదింటిని బొందునని రాజపరము. సత్త్వ గుణోదయ దశాప్రభావములనుగాని, లేక సత్త్వగుణోదయమును, దశానుభావము లనఁగా దశావ తారములనుగాని బొందునని విష్ణుపరము. ఉన్మద ప్రసవబాణ బాణ మగ్నతఁగాంచున్ = మదో ద్ధతుఁడైన మన్మథునియొక్క బాణములయందు మునిఁగిపోవుటఁ గాంచునని రాజపరము. ఉన్మదప్రసవ మనఁగాఁ బద్మము. అది బాణముగాఁ గలవాఁడు గనుక ఉన్మదప్రసవబాణుఁడు, మన్మథుఁడు. అతని బాణ మున్మదప్రసవము. అనఁగాఁ బద్మము, దానియందు నిరంతరనివాసము సేయు వాని బ్రహ్మపర

ముగాఁ జెప్పవలయును. తాపమువహించుక్=చింతాధికములవలనఁబుట్టిన వేదనను వహించునని రాజ పరము. ఆతపతాపమును వహించునని సూర్యపరము. ఇందులో వసురాజునకు మొదటి నాల్గుచరణముల యందును సంకల్పావస్థయును గీతి మొదటిచరణమందుఁ గృశత్వావస్థయును జెప్పఁబడియె.

గిరికన్య, సింధుజ, శుభవాణి, పద్మినియను విశేషణములందలి యర్థాంతరములచే నాయిక లోకోత్తరభావము ద్యోతకమగును. వసురాజు గిరికను శివుఁడు గౌరివలెనే మేనసగభాగముఁ జేకొనవల యుననియు విష్ణువు లక్ష్మివలె నెదనుంచుకొనవలయుననియు బ్రహ్మ సరస్వతివలె ముఖమునందుంచు కొనవలయుననియు లేదా యాత్రిమూర్త్యాత్మకుఁడగు సూర్యునివలెఁ గరములచే నలరింపవలయునని తలంచుట మన్మథచంద్రాదులవలని బాధమాన్పుటకని యూహింపనగు. తొలినాలుగు పాదములలో వసురాజు సంకల్పావస్థయు గీతమునఁ గృశత్వావస్థయుఁ జెప్పఁబడెను. అలం. శ్లేషము.

మ. అనిశధ్యాతనదీసుతావయవుఁడై యమ్మేటి యయ్యేటిశో
భనముక్తావళులన్న నన్నదినవాబ్జం బన్న గోరంతనం
టును నొక్కింతముఖానురాగమును బూనుం గాని యేసొమ్ము గై
కొనఁ డేకానుక లిచ్చినం గొనఁడు గోర్కుల్నిండ దైవారఁగాన్. 95

అనిశ=ఎల్లప్పుడును, ధ్యాత = ధ్యానముసేయఁబడుచున్న, నదీసుతావయవుఁడై = నదీసుతయైన గిరికాదేవియొక్క సకలావయవములు గలవాఁడై, అమ్మేటి=ఆవసురాజు, అయ్యేటి=ఆశుక్తిమతీసంబంధ మయిన, శోభనముక్తావళులన్=మనోహరములైన మౌక్తిక సమూహములని చెప్పినను, అన్నదినవాబ్జం బన్న = ఆశుక్తిమతీనదీసంబంధమయిన పద్మమనిచెప్పినను, గోరంతనంటును = ఇసుమంత స్నేహమును, ఒక్కింతముఖానురాగమును = ఇంచుకంత ముఖప్రసాదమును, పూనుంగాని = వహించునేకాని అనఁగా ధ్యానము సేయఁబడుచున్న గిరికాదేవియొక్క యవయవముల యందలి నఖవదనసాదృశ్యముచేత గిరికామాతయైన శుక్తిమతియందుఁ బుట్టిన మౌక్తికాబ్జముల నర్ధాంగీకార మయినప్పటికిని జేయును గాని అని యర్థము. అక్కడ గిరికానఖవదన సాదృశ్యమును గిరికామాతృ సంబంధమును మౌక్తికాబ్జాంగీకరణమందు హేతువులని తెలియవలయును. గోరంతయన్నపదములోను ముఖానురాగ మన్నపదములోను జెప్పఁబడిన గోరు, ముఖము అనెడి పదములు మౌక్తికాబ్జోపమేయ భూత నదీసుతావయవస్ఫూర్తిని జేయుచున్న వని గ్రహింపవలయును. ఏసొమ్ముఁగైకొనఁడు = పైనఁజెప్పఁబడిన మౌక్తికములుగాక మఱియేభూషణమును గ్రహింపఁడు. ఏకానుకలిచ్చినం గొనఁడు=పైనఁ జెప్పఁబడిన యబ్జముగాక యేకానుకలిచ్చినఁ బుచ్చుకొనఁడు. ఎందువలన ననిన, కోర్కుల్నిండ దైవారఁగాన్= గిరికా విషయమయిన యభిలాషములు పూర్ణీభవించుచుండఁగా ననిసంబంధము.

ఇందులో అనిశధ్యాతనదీసుతావయవుఁడై యని చెప్పినాఁడు గనుకఁ జింతయనెడి సంచారి భావము. ఏసొమ్ముఁగైకొనక పోవుటయును, నేకానుకలిచ్చినం బుచ్చుకొనక పోవుటయును అరతియనెడు నవస్థయని తెలియవలయును. ఇందుకు, శ్లో. 'అన్యత్రాప్రీతి రరతిః' అని లక్షణము.

గిరికపై వసురాజునకుఁ గోర్కులునిండి నిబిడీకృతములు కాఁదొడఁగెను. కావుననే నదీసుతావయవముల ననిశము ధ్యానము చేయుచుండెను. అవయవచింత దప్ప నితరము లేమి యనురాగాతిశయ సూచితము. వసురాజు నానందపఱచు వస్తువులులేవు. గిరికాజన్మభూమి యగు శుక్తిమతియందు జని

చిన మౌక్తికములు తామరపూవులనుమాత్రము సామ్యముగాఁ గానుకగాఁ గైకొనుచున్నాఁడు. నవాబ్జములనుటచే నపుడుగోసి తెచ్చిన తమ్మిపూవులనుట. మౌక్తికములను గిరికానఖసాదృశ్యమును బట్టియుఁ దామరపూవులను ముఖసాదృశ్యమునుబట్టియు గ్రహించుచున్నాఁడు. గిరికావయవధ్యానమునఁగోర్కులునిండినవై వారు వానికిఁగావలసినవి యవయవోపమానవస్తువులెగదా! అవియు సామ్యముగాఁ గానుకగా వచ్చినవగుటచేఁ బరిగ్రహింపఁగలిగెను. నదీసుతావయవస్మరణగల వసురాజునకు గిరికాసహజములగుట వలనను ఉపమానములగుటవలనను మౌక్తికములపై గోరంత నెయ్యము. తమ్ములపై మొగమోటము చూపుచున్నాఁడని భావము,

తే. కన్యలావణ్యరససుధా◆గాహనమున
విభునినయనము లస్వప్న◆వృత్తిఁ జెంద
మనసు తదురోజహేమాద్రి◆మనికి మరగి
మహితసురతానుభూతికై◆మలయుచుండు. 96

కన్య=గిరికాదేవియొక్క, లావణ్యరస సుధాగాహనమునన్ = కాంతియనెడు నమృతమందలి స్నానముచేత, విభునినయనములు=వసురాజుయొక్క నేత్రములు, అస్వప్నవృత్తిఁజెందన్ = దేవత్వమును బొందఁగా నని యర్థము. నిద్రలేకుండుటకుఁ బొందఁగాఁ నని భావము. మనసు=మానసము, తత్-ఆగిరికాదేవియొక్క, ఉరోజ = కుచభారమనెడు, హేమాద్రి = కాంచనాచలమందలి - అనఁగా మేరుపర్వతమందలి, మనికిన్=ఉనికి, మరగి = అభ్యాసము చేసికొని, మహిత = ఒప్పుచున్న, సురతా= దేవత్వముయొక్క, అనుభూతికై=అనుభవమునకుఁగాను, మలయుచుండున్=యత్నము సేయుచుండు నని యర్థము. సంభోగానుభవమునకై యుద్రేకించునని యర్థాంతరము. ఇక్కడ వసురాజునకుఁ జతుర్థావస్థయైన జాగరమును జెప్పినాఁడు.

వసురాజు హృదయమున గిరికారూపముఁ జూడఁదొడఁగెనుగాన నయనములు ఆయమలావణ్యాతిశయసుధారసముల నాప్లావము గావింపసాగెను. దేవత్వసిద్ధి అమృతమువలనఁ జేకూరుటచే నస్వప్నభావముకూడ గలిగెను. అనఁగా వసురాజు గిరికను దలంచుచుఁ గనుకూర్కుమానెను. మనసుగూడ సురతానుభావము వలచి గుబ్బలను బంగరుకొండను మరగెను. దేవతలకు హేమాద్రివాసము సుప్రసిద్ధము. అనఁగా వసురాజు గిరికగుబ్బలపై నిలిచి సురతసౌఖ్యమునకై యుద్రేకింప సాగెనని భావము. అలం. రూపకము.

సీ. శ్రమమునొందింపఁడో◆జగదద్భుతాఖండ, కాండప్రయోగలా◆ఘవముఁ దెలిపి
సాత్త్వికగుణసార◆సామగ్రి సవరింపఁ, డోసుమనోధన్వ◆ మొనరఁ దాల్చి
సంకల్పసిద్ధియో◆సంగఁడో తగువేళ, నమితప్రతాపసా◆హాయ్య మొంది
సవ్యసాహిత్యచిం◆త వహింపఁ జేయఁడో, నవరసభావవై◆భవముఁ జూపి
తే. యతనుఁ డతనికిఁ సహృదయుఁ◆డై యమేయ
శక్తి నేమేమి గావింపఁ◆జాలఁ డయ్యోఁ
బతియు నితరప్రసంగసం◆భావనమునఁ
దవులక తదేకపరవశుఁ◆ డవుట యరుదె. 97

ఈపద్యమున వసురాజునకు మన్మథుఁ డుపకారములఁ జేసినటుల శ్లేషముచేఁ జెప్పి రాజునకుఁ గల తదేకపరతంత్రభావము సమర్థించుచున్నాఁడు.

జగదద్భుత = జగదాశ్చర్యకరమును, అఖండ = అప్రతిహతమునైన, కాండప్రయోగ=బాణ ప్రయోగమందలి, లాఘవముఁ=కుశలత్వమును, తెలిపి=తెలియ నుపదేశించి, శ్రమము నొందింపఁడో= పరిశ్రమమును బొందించినాఁడు కాఁడా, అనఁగా నభ్యాసమును బొందించినాఁడు కాఁడాయని యర్థము. జగదాశ్చర్య కరములయిన యఖండబాణము లనఁగాఁ బుష్పబాణములు, వానియొక్క ప్రయోగనైపుణ్యమును గనుపఱిచి, అనఁగాఁ బ్రయోగించి వ్యథ నొందించినాఁడని భావము.

సుమనోధర్మ మొనరఁదాల్చి = విద్వద్ధర్మము నొప్పెనమగునట్లుగా వహించి, సాత్త్వికగుణ సారసామగ్రిఁ = శమదమాది గుణములయొక్క యోగ్యమైన సంపూర్ణత్వమును, సవరింపఁడో = చక్కఁపఱచినాఁడు కాఁడా యని యర్థము. పుష్పకోదండము ధరించి సాత్త్వికభావసామగ్రిని సవరించినాఁడని భావము. సాత్వికభావ సామాన్యలక్షణము.

క. పరగత సుఖదుఃఖాదుల, నరయఁగ భావించి యట్ల యలరుట సత్వ
స్ఫురణము తద్భవభావము, లరయఁగ సాత్వికములయ్యె నవియెట్లన్నన్.

కావ్యాలంకారసంగ్రహము.

అమిత = మితములేని, ప్రతాప = పరాక్రమముయొక్క, సాహాయ్యమొంది = సహాయతను బొందినవాఁడై, తగువేళఁ = యుక్తకాలమందు, సంకల్పసిద్ధి యొసంగఁడో = మనోరథసిద్ధి గలుగఁ జేసినాఁడు కాఁడా యని యర్థము. అమితప్రతాపుఁ డనఁగా వసంతుఁ డనిచెప్పవలయును. వసంత సాహాయ్యమునుబొంది విరహకాలమందు సంకల్పాఖ్య మన్మథావస్థను బుట్టించినాఁడని భావము. మన్మథదశావస్థలలో సంకల్పము గూడ నొకటి యనుటకు,

శ్లో. చక్షుః ప్రీతిః ప్రథమంచింతాసంగస్తతోఽథ సంకల్పః
నిద్రాచ్ఛేదస్తనుతా విషయనివృత్తి స్త్రపానాశః
ఉన్మాదోమూర్ఛామృతి రిత్యేతే స్మరదశాదశైవస్యుః
దృఙ్మనస్సంగసంకల్పా జాగరః కృశతారతిః
హ్రీత్యాగోన్మాద మూర్ఛాన్తా ఇత్యనంగదశాదశ
అభిలాషచింతనాను స్మృతిగుణ సంకీర్తనోద్వేగాః.

నవరసభావవైభవముచూచి=శృంగారాది నవరసములయొక్కయుం వాని భావములయొక్కయుం వైభవమును దెలియఁజెప్పి, నవ్య సాహిత్యచింత వహింపఁజేయఁడో = నూతనమైన సాహిత్య విద్యా చింతను వహింపఁజేసినాఁడు కాఁడాయని యర్థము. నవరస = అనురాగమనెడి స్థాయిభావము యొక్కయు, భావ = నిర్వేదగ్లానిశంకాది సంచారిభావములయొక్కయు, వైభవముఁ జూపి = అనఁగా వైభవము నుదయింపఁజేసి, నవ్యసాహిత్యచింతయనఁగా నూతనసంభోగచింతను వహింపఁజేసినాఁడని భావము. సంచారిక్రమభావములు.

శా. నిర్వేదశ్రమదైన్యజాడ్యములు గ్లానిత్రాసశంకార్తి రు
గ్గర్వావేగ ధృతిస్మృతుల్ చపలతోగ్రత్వావహిత్థా త్రపాం
తరైవక్ష్యమదోత్సుకత్వ మతినిద్రా మోహాబోధాంతము

త్సర్వాలస్య వితర్కాసుత్యపహాతాధ్యానభ్రమాపస్మృతుల్. కావ్యాలంకారసంగ్రహము.

ఎవఁడనిన, అతనుఁడు = మన్మథుఁడు, అతనికిన్ = ఆవసురాజునకు, సహృదయుఁడై = అనఁగా నాప్తుఁడై యనియర్థము. హృదయసంగతుఁడై యనిభావము. అమేయశక్తిన్ =ఎన్నశక్యముగాని సామర్థ్యముచేత, ఏమేమి కావింపఁ జాలఁడయ్యెన్ = ఏమిచేయుటకుఁ జాలకపోయినాఁడు-అనఁగా నన్నికార్యములు చేయఁజాలినవాఁడైనాఁ డనుట. కాఁబట్టి, పతియును వసురాజును ఇతరప్రసంగసంభావమునఁ దవులక = మన్మథేతరప్రసంగాదరమునందుఁ దగులుకొనక, తదేకపరవశుఁడవుట = మన్మథైకపరాధీనుఁ డగుట, అరుదె = ఆశ్చర్యమా-అనఁగా నాశ్చర్యముగాదనుట.

అలంకారము. ఉభయశ్లేషము.

క. సుమనోమార్గణవశుఁడై, క్షమ యెల్లను దద్గతంబుఁ ♦ గావించిన భూ
రమణునిసాంగయశోజా,లములీలం బాండిమం బ♦లరె నెమ్మేనన్. 98

సుమనః = మంచిమనస్సుగల, మార్గణ=యాచకులకు, వశుఁడై=స్వాధీనుఁడై, క్షమయెల్లను= భూభాగమంతయును, తద్గతంబుఁ గావించిన = వారలకు సమర్పించిన, భూరమణుని=వసురాజుయొక్క యని యర్థము. సుమనోమార్గణుఁ డనఁగాఁ బుష్పములు బాణములు గాఁగల మన్మథుఁడు, అతనికి వశుఁడై=ఓర్పుగుణము నంతయు నతనిపాలు చేసినవాఁడనిభావము. (ని. 'మార్గణో యాచకేశరే అని వి.) 'క్షితిక్షాంత్యోః క్షమాప్రోక్తా' అని వి.) సాంగయశోజాలములీలన్ = సాకారమైనకీర్తిసముదాయమో యన్నట్టులుగా, నెమ్మేనన్ = శరీరమందు, పాండిమం బలరెన్ = ధావళ్య మొప్పుచుండెను. ఇక్కడ సాత్త్వికభావమైన వైవర్ణ్యమును జెప్పినాఁడు. యాచకులు సామాన్యులుగాక పండితులగుటవలనను దానము గూడ నటులె సామాన్యముగాక క్షమయంతయు నొసంగుటగావున భూరమణుని కీర్తిసాంగమయినది. మఱియు యశస్సు విస్తృతముగానజాలము. కావున నె మేనినిండఁ బాండుభావము కీర్తివలె నిండారెను. వసురాజు పూవుబాణములకు లోనై యోర్పుకోలుపోయి తెల్లబారెనని భావము. అలంకారము. శ్లేషమూలకోత్ప్రేక్ష.

సీ. పెనుగట్టు గోటమీఁ♦టినమేటి కిపు డెంత, యరు దయ్యెఁ గన్యాకు♦చాద్రిగరిమ
గగనఘంటాపథ♦క్రమణశీలున కెంత, గగన మయ్యె లతాంగి♦కౌనుచదలు
బలువెల్లి కిల యెల్ల ♦ నిలిపినఘను నెంత, సుడివెట్టు సతిహృగం♦భస్స్రవంతి
యనుదినవ్యయితన♦వ్యసువర్ణరాశి నెం, తాసఁ గొల్పె వధూవి♦భాసువర్ణ
తే. మనుచు విస్మితహృదయుఁడై ♦కనికరించి,యువనిపతి కాంతరంగికుఁ♦డగు ననంగుఁ
డనుపమోజ్జ్వలగాత్రిస♦ఖ్యచలరాజ, పుత్రిఁ దదధీనమానసాం♦బుజనొనర్చె.

పెనుగట్టు గోటమీటిన మేటికిన్ = మహాత్తయిన కోలాహల పర్వతమును బదనఖముచేత నెగమీటిన పురుషశ్రేష్ఠునికి, కన్యాకుచాద్రిగరిమ = గిరికాదేవి చనుగొండలయొక్క గౌరవము, ఇపుడు = ఈసమయమందు, ఎంతయరుదయ్యెన్ =ఎంతయాశ్చర్యమాయెను - అనఁగా గిరికాస్తనపర్వతములం గోటమీటశక్యముగాని వాయెననుట. గగన = ఆకాశమనెడు, ఘంటాపథ = రాజమార్గమందలి, క్రమణ = సంచారమే, శీలునకున్ = స్వభావముగాఁ గలవానికి - అనఁగా దివ్యవిమానారూఢుఁడై యాకాశమార్గమందు సంచరించువానికి ననుట. లతాంగి కౌను చదలు=గిరికాదేవియొక్కమధ్య

ప్రదేశాకాశము, ఎంత గగనమయ్యెన్ = ఎంతదుర్లభమాయెను, ఆకాశము గగననామముగలదౌట స్వభావమే.

బలువెల్లికిన్ =బలిష్ఠమైన శుక్తిమతీనదియొక్క పరపను, ఇలయెల్లచిక్కుపడకున్ = భూమియంతయుఁ జెడకుండనిలిపిన మహాత్ముని, సతి = గిరికాదేవియొక్క, దృగంశు = చూపులయొక్క కాంతి యనెడు, స్రవంతి=నది, ఎంతసుడివెట్టెన్ = ఎంతసుళ్ళఁబెట్టెను, అచుడిన=ప్రలిడినమందును, వ్యయిత = వ్యయముచేయఁబడిన, నవ్య = నూతనమైన, సువర్ణరాశిన్ = బంగారపు రాసులుగలవానిని, వధూ = గిరికాదేవియొక్క, విభా=కాంతియనెడు, సువర్ణము = బంగారము, ఎంతాసఁగొల్పెన్ = ఎంతయాశ పెట్టెను.

అనుచున్ =ఈలాగనిపలుకుచు, విస్మిత హృదయుఁడై = ఆశ్చర్యావిష్టమానసుఁడై, కనికరించి = దయదలఁచినవాఁడై, అవనిపతికిన్ = వసురాజునకు, అంతరంగికుఁడగు = మనస్సుగలిసినవాఁడైన యని యర్థము. అంతరంగమందుఁ బుట్టినవాఁడనిభావము. అనంగుఁడు = మన్మథుఁడు, అనుపమోజ్జ్వలగాత్రిన్ =ఉపమానరహితమై ప్రకాశమానమయిన దేహముగలిగిన, అయ్యచలరాజపుత్త్రిన్ = కోలాహల పర్వత రాజపుత్త్రికయయిన యాగిరికాదేవిని, తదధీన మానసాంబుజ నొనర్చెన్ = వసురాజున కధీనమైన మనస్సుగలదానిఁగాఁ జేసెను-అనఁగా వసురాజునందు గిరికాదేవికి ద్వితీయావస్థయయిన చిత్తసంగమమును బుట్టించెనని యర్థము.

వసురాజు సామాన్యుఁడుకాఁడు. గట్టుగోట మీటినవాఁడు, ఆకాశయానముగలవాఁడు, నదీ వ్యాప్తినిర్వహించినవాఁడు. దాత, ఇట్టివాఁడు, మోహముచెలిని గలసికొనుటకె యశక్తుఁడయ్యెను. ఇదియె అంతరంగికుఁడగు ననఁగున కాశ్చర్యహేతువు. కావున నింతగొప్పవాని కిట్టిసిలుగువాటిల్లెనేయని కనికరము. అంతరంగికునకుఁ గనికరము కలుగుటలో నచ్చెరువులేదు. అనంగుఁడిపుడు తనయపూర్వశక్తి నుపయోగించి గిరికను వసురాజు పై వలపుగలదానినిగాఁ జేయవలయునుగాన నామెను దదధీనమానసను జేసెను.

మ. లలనారత్నము నొయ్యనొయ్య మొనవ్రేలఁ న్నేల వ్రాయించి ని
శ్చలవృత్తిన్ పరవర్ణపూర్ణ ఫలకాసంగంబు నొందించి మి
న్కులు వేమాఱుఁ దదర్థచింతనలతో నూల్కొల్పి నెయ్యంపుటా
జ్ఞలు పైపై నెనయింప సాగెఁ బటుశాస్త్రశ్రేణికాభ్యాసమున్. 100

ఈపద్యమునందు గిరికను విద్యార్థినిగను మన్మథుని దేశికునిగను రూపించి చింతావేగము మొదలు పారవశ్యమువఱకుఁగల యవస్థలు అక్షరాభ్యాసము మొదలుకొనిగల శిక్షాక్రమముగా నిరూపించి చెప్పుచున్నాఁడు.

లలనారత్నమున్ =స్త్రీరత్నమైన గిరికాదేవిని, ఒయ్యనొయ్యన్ = లెన్నలెన్నఁగా, మొనవ్రేల న్నేల వ్రాయించి=పాదాంగుష్ఠముయొక్క యగ్రముచేత భూతలముమీఁద వ్రాయించి యని యర్థము. అనఁగాఁ జింతపుట్టించి కాలవ్రేలిచేత నేలవ్రాఁతలు వ్రాయించియని యర్థాంతరము. నిశ్చలవృత్తిన్ = చేష్టారహిత వృత్తిచేత నని యర్థము. స్థిరవృత్తిచేతనని యర్థాంతరము. వర్ణశబ్దము రూపమందును శ[illegible]మందును వర్తించుచున్నది. (ని. 'వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ స్తుతౌ రూపయశాక్షరే [illegible])

పర=వరుఁడైనవసురాజుయొక్క, వర్ణ = రూపముచేత, పూర్ణ = నిండింపఁబడిన, ఫలకా = చిత్తరువు పలకయొక్క, సంగంబునొందించి = సాంగత్యమును బొందించి యనియర్థము. వర=గొప్పలైన, వర్ణ = అక్షరములచేత, పూర్ణ=నిండింపఁబడిన, ఫలకా = పలకలయొక్క, సంగంబునొందించి = సాంగత్యమును బొందించి అనఁగాఁ బలకలుపట్టించి యని యర్థాంతరము. మిన్కులు=పలుకులు, వేమాఱు = పల్మాఱును, తదర్థచింతనలతోఁ = రాజప్రాప్యర్థమైన యాలోచనలతోడ, నూల్కొల్పి = సందర్భపఱిచి యని యర్థము. మిన్కులనఁగాఁ జదువులును గనుక, చదువులు పలుమాఱును దదర్థచింతనలతో నూల్కొల్పి యనఁగా నాశబ్దార్థములయొక్క వల్లనలతో సందర్భపఱిచి యనియర్థాంతరము, నెయ్యంపుటొజ్జలు = ప్రణయోపాధ్యాయులైన మన్మథుఁ డనియర్థము. ప్రేమగల యుపాధ్యాయులని యర్థాంతరము. పటు= సమర్థమైన, శాస్త్రశ్రేణికా = శాస్త్రమనఁగా నిక్కడ నాదేశము. అనఁగా నాజ్ఞ. (వి. 'నిదేశ గ్రంథయోశ్శాస్త్రమ్' అని అ. (స్వకీయమైన యాజ్ఞాపరంపరయొక్క, అభ్యాసముఁ = పరిచయము ననియర్థము. వ్యాకరణాది శాస్త్రాభ్యాసమునని యర్థాంతరము. పైపై నెనయింప సాగెఁ=అంతకంతకుఁ బొందింప సాగెను. ఇందులో నిశ్చలవృత్తియనఁగా స్తంభమనెడి సాత్త్వికభావము.

ఇందును,

క. 'తలఁకొనినరాగభీత్యా, దులకతమునఁ జేష్టలెల్లఁ దొరఁగి శిలాదా
రులఁ జేసినయట్లుండిన, కలితస్తంభాఖ్యసాత్త్వికంబై వెలయున్.' అని లక్షణము.

గిరికాదేవిని మన్మథుఁడు లోఁగొని చింతాపరవశము వ్రేలునేల వ్రాయునట్లును, మ్రాన్పాటు నొందునట్లును బ్రియునిచిత్తరువు వ్రాయునట్లును, బ్రియచింతనము పలుమాఱు చేయునట్లును నొనరించి పలు త్రిప్పులఁ బెట్టసాగెనని ప్రకృతార్థము.

గురువుతోలుత దిద్దఁబెట్టి అక్షరములు వ్రాయించి చదువునేర్పినపిదప శబ్దార్థములు మాటిమాటి కనుకొని పఠించునట్లు చేసి యర్థగ్రహణానంతరము శాస్త్రాభ్యాసము చేయించునని శ్లేషార్థము.

అలం. శ్లేషము.

శా. ఆతన్వంగి యనంగఝాంకరణవజ్జ్యాముక్తచూతాస్త్రని
ర్ఘాతం బోర్వక తమ్ములంచుఁ దటినీగర్భైకసంజాతకం
జాతవ్రాతముమాటుఁ జెందఁ దవి యేఁచఁ సాగె మున్మున్నుగా
'జ్ఞాతిశ్చే దనలేన కి' మ్మనెడివాచారూఢి సత్యంబుగన్. 101

ఆతన్వంగి=ఆగిరికాదేవి, అనంగ = మన్మథునియొక్క, ఝాంకరణవత్ = ఝాం అనెడిధ్వని తోఁగూడిన, జ్యా=నారివలన అనఁగాఁ దుమ్మెదనారి వల్లనుండి, ముక్త = విడువఁబడిన, చూతాస్త్ర= చూతపుష్పాస్త్రముయొక్క, నిర్ఘాతంబు = ప్రహారమును, అనఁగా దెబ్బతాఁకుడును, ఓర్వక = సహింప లేక, తమ్ములంచుఁ = తమ్ములనఁగాఁ దోడఁబుట్టినవారును బద్మములును, తోడఁబుట్టినవారిని, తటినీ = జలదేవతయైన తంత్రిమతియొక్క, గర్భ=గర్భమువలన, ఏక = ముఖ్యముగనట్టులుగా, సంజాత = పుట్టిన, కంజాతవ్రాతము=పద్మసముదాయముయొక్క, మాటుఁ జెందఁ = చాటునకుఁబోఁగా, అవి=పద్మములు, మున్మున్నుగా=ముందుముందుగా, ఏఁచఁ సాగెఁ = వేధింపసాగెను. ఏలాగనిన, 'జ్ఞాతిశ్చే దనలేనకి' మ్మనెడి వాచారూఢి సత్యంబుగన్ = జ్ఞాతియయిన పక్షమందు-అనఁగా దాయాది యున్నపక్షమందు అగ్నితో నేమి ప్రయోజనము అనునట్టి యనఁగా నగ్నిచేసెడుకార్యము : జ్ఞాతివలన నెరవేరు నని

భావము. వాచారూఢి=వాక్యనిరూఢి, సత్యంబుగన్=యథార్థముగునటులుగా, గిరికాదేవిని బద్మములు వేధింపసాగె నని సంబంధము. ఇక్కడఁ గన్యకు వివాహమగుటకుఁ బూర్వము జ్ఞాతిత్వముగలదని శాస్త్రసిద్ధము గనుక శుక్తిమతియందు గిరికాదేవితోఁ గూడఁబుట్టిన హేతువ్రజలన సంప్రాప్తమైన జ్ఞాతిద్వేషముచేతఁ బద్మములు గిరికాదేవిని వేధింపసాగె నని యర్థము.

"ఝూం" అని సారిమ్రోగుట బాణనిర్ఘాతాతిశయమును సూచించును. కన్యాగి (కృశించిన మేనుగలది) గావున నాగాటపు దెబ్బ కోరువలేక తాపశాంతికిఁ దమ్ములను గప్పుకొనెను. తమ్ములు తనవలెనె తటినీగర్భజాతములుగాన క్రమముగాఁ బాలుపంచుకొందు రనుకొనెను. పెండ్లికిముందు స్త్రీలకు సోదరులతో జ్ఞాతిత్వముండును గాన జ్ఞాతివైరముచేఁ దమ్ములు మఱియుఁ దాపము గూర్చెను.

మన్మథబాధావారణార్థము గిరికతమ్ములఁ జేరుట యనౌచిత్యమని కొందఱందురు. తమ్ములనుటది శ్లేషమాత్రమె గావున నట్టిదోషమున కవకాశములేదు. మఱియుఁ దమ్ము లచేతనములగుటచే నట్టిదోషావకాశము లేదు.

చ. ఎఱుపుగఁ జూడ సాగె హరిణేక్షణ పిన్నటనాఁటనుండియుం
బరిచితిఁ బూని మంజుగతిమాధురియున్ మృదువాగ్విభూతియు
న్వరుసనె తెల్పి తల్లికడవారును దండ్రి భజించువారు నై
గరిమముఁ గన్నసద్ద్విజశిఖామణులన్ వసులుబ్ధచిత్తయై. 102

హరిణేక్షణ=గిరికాదేవి, పిన్నటనాఁటనుండియున్=చిన్నప్పటినుండి, పరిచితిఁబూని = మచ్చికపడి, మంజు=మనోహరమయిన, గతిమాధురియున్=నడకలయొక్క మురిపెమును, మృదువాగ్విభూతియున్=మృదువాక్యసంపదను, వరుసనె తెల్పి = వెంబడివెంబడిగా నేర్పి యని హంస శుకపరమయిన యర్థము. సత్ప్రవర్తనమును దిన్ననివాక్యములను నేర్పినవారని విప్రపరమయిన యర్థము. తల్లికడవారును దండ్రిభజించువారునై గరిమముఁ గన్న సద్ద్విజశిఖామణులన్ = ద్విజశబ్దము పక్షులయందును విప్రులయందును వర్తించుచున్నది. తల్లియైన శుక్తిమతీనదియొక్క యుభయతీరములయందును నివసించినవియును దండ్రియైన కోలాహలపర్వతుని సేవించినవియును నై గౌరవమును బొందిన పక్షిశ్రేష్ఠము లయిన హంసకీరములని యర్థము. తల్లివంకవారును దండ్రియొక్క పోష్యవర్గములోని వారును నై పెద్దఱికమువహించిన విప్రశ్రేష్ఠు లని యర్థాంతరము. (ని. 'దంత విప్రాండజాద్విజాః' అని అ.) వసులుబ్ధచిత్తయై=వసురాజునం దభిలాషగల మనస్సుగలదై యని యర్థము. ధనలుబ్ధచిత్తయై యని యర్థాంతరము. ఎఱుపుగఁ జూడసాగెన్ = అన్యథా బుద్ధిచేతఁ జూడసాగెను. ఉద్దీపనవిభావము లైనహంసకీరములు గాఢానురాగజనకములై యసహ్యము లాయెను. కనుక నెఱుపుగఁ జూడసాగె ననుట.

వసులుబ్ధచిత్త (వసురాజునందాసగలది) గావున గిరికకు సద్ద్విజశిఖామణుల (అంచల చిలుకల)ను వెగటుగాఁ జూడసాగెను. మోహతాపవశమున నంటచేఁ జిరపరిచితములైనను హంసలనడలు చిలుకలపలుకులు సంతాపకరములయ్యెనని భావము. ద్విజశిఖామణులెంతవారైనను (లోభులు) వసులుబ్ధుల నాదరముగఁ గాంచుట సహజమని శ్లేషార్థము అలం. శ్లేషమూలక కావ్యలింగమని కొందఱు. శ్లేషోత్థాపిత—సమాసోక్తియని కొందఱు.

తే. ఆకులాహార్యనందన • యలసపవన
జాలములఁ దూలగతిఁ జాలఁ • దూలఁ దోడఁగె
గరిమఁ దా నెంతయచలేంద్ర • కన్య యైనఁ
బలచ నగుఁ గాదె ఘనవసు • ప్రార్థనమున. 103

ఆకులాహార్యనందన = కులపర్వతపుత్త్రియైన యాగిరికాదేవి, అలసపవనజాలములన్ = మంద మారుత సముదాయములచేత, తూలగతిన్ = దూదివలె, చాలఁదూలఁదోడఁగెన్ = మిక్కిలి తూలి పోసాగెను. అదియుక్తమే. ఎట్లనిన, గరిమన్ = శ్రేష్ఠత్వముచేత, తానెంత యచలేంద్రకన్యయైనన్ = అచలేంద్రుఁడనఁగా రాజుగనుకఁ దానెంత రాజకన్య యైనప్పటిని, ఘనవసుప్రార్థనమునన్ - ఘన = అధికమయిన, వసు = అర్థవిషయమయిన, ప్రార్థనమునన్ = యాచనచేత, పలచనగుఁగాదె = చులుకఁదన మును బొందుచున్నదేకదా యని యర్థము. గరిమన్ = దుర్భరత్వముచేత, తానెంత యచలేంద్రకన్య యైనన్ = తానెంత పర్వతరాజనందన యైనప్పటికిని, ఘనవసుప్రార్థనమునన్ = ఘనుఁడైన వసురాజువిష యమయిన యాచనచేత, పలచనగుఁగాదె = కృశత్వము నొందుచున్నదేకదా యని యర్థాంతరము.

ఈపద్యమందు నర్థాంతర న్యాసాలంకారము. ఇదియునుంగాక, పూర్వమందుఁ గులాహార్య నందనకు నలస పవనజాలములచేతఁ జలన మయుక్తమని విరోధము కనుపడుచున్నది యగుచుండఁగా ఆకులయైన యహార్యనందనయనెడు సమాసాంతరాశ్రయముచేతఁ దత్పరిహార మగుటవలన విరోధా భాసాలంకారమని చెప్పఁదగినది. తానచలేంద్రకన్యగదా! కొండకూఁతున కించుకేని తండ్రిగుణముండక పోదు. ఇట్టిచోఁ దూలగతియెటులగలిగిన దన వసుప్రార్థనమునఁ (అర్థవిషయిక ప్రార్థనముచే) బలుచ నయ్యెను. ఆప్రార్థనము ఘనముగాన మఱింతపలుచనయయ్యెను. యాచకుఁడు దూదికంటెఁ దేలిక యందురు.

శ్లో. తృణాదపిలఘుస్తూలః, తూలాదపిచయాచకః
వాయునాకింననీతోసౌ, మామయం యాచయేదితి.

అలంకారము. అర్థాంతరన్యాసము.

చ. చెలితెలిఱెప్పముత్తియపు • జిప్పల నొప్పుగు బాష్పవారి చి
ప్పిలి చనుగట్టుపైఁ దొరఁగు • పెంపు నుతింపఁగ నయ్యె నయ్యెడ
న్వెలఁదిమనోగతం బరసి • వెల్వడి శుక్తిమతీప్రవంతి యా
యలికులవేణిఁ గాంచినమ • హాద్రికిఁ దెల్పఁగ నేగుకైవడిన్. 104

చెలి = గిరికాదేవియొక్క, తెలిఱెప్ప = తేటగల కనుఱెప్పలనెడు, ముత్తెపుచిప్పలన్ = ముత్తెపు చిప్పలచేత, ఒప్పుగు = ఒప్పుచున్న, బాష్పవారి = కన్నీరు, చిప్పిలి = వెల్లివిరిసి చనుగట్టుపైఁ, దొరఁగుపెంపు = స్తనశైలముమీఁదఁ బ్రవహించునట్టి యతిశయము, అయ్యెడన్ = ఆసమయమందు, నుతింపఁగనయ్యెన్ = కొనియాడఁదగి యుండెను. ఏలాగనిన, శుక్తిమతీప్రవంతి = శుక్తిమతీనది, వెలఁది మనోగతం బర సి వెల్వడి = కోమాత్రైయైన గిరికాదేవియొక్క యాంతర్యమును దెలిసికొని వెడలివచ్చి, అయలికులవేణిఁ గాంచిన మహాద్రికిఁ దెల్పఁగ నేగుకైవడిన్ = ఆగిరికాదేవిని గన్న కోలాహల పర్వతునికిఁ దెలియఁ జెప్పఁడి కొఱకుఁ బోవుచున్నదో యన్నట్టులుగా, నుతింపఁగనయ్యెనని సంబంధము. కనుఱెప్పల

నెడు ముత్తెపుఁజిప్పలచేత నొప్పుచున్న బావ్పవారి పూరముసు ముత్తెపుఁజిప్పలుగల శుక్తిమతీ నదీజల పూరమునుగా నుత్ప్రేక్షించినాఁడు.

బావ్పవారి చిప్పలుటచేఁ గన్నీ రవ్వారిగాఁ గార సాగెనుట. కన్నీటిధారను శుక్తిమతీప్రవంతిగ నుత్ప్రేక్షించుటచే బాష్పధారాతిశయము సూచితము. ఉబ్బుచన్నులు కోలాహలమను సాటిగఁ జెప్పుటచేఁ బటువుగను గట్టిగనుండెననుట. తావ్రననే అస్రుప్రలటనుండి తొరఁగుట. ఆలం. ఉత్ప్రేక్ష.

చ. కొమిరె మనోవ్యథం బొగలఁ గ్రుచ్చి కవుంగిటఁ జేర్చి తల్లి శు
క్తిమతి తదీయతాపశిఖికీలల నింకఁగఁ బోలుఁ గానిచోఁ
రమణిమెయిం బిసాంకురపరంపరలుం ఘనసారవాలుకా
సముదయముం సుజాతజలజాతదళంబులు నుల్లసిల్లునే. 105

కొమిరె = కూఁతురైనగిరికాదేవి, మనోవ్యథంబొగులం = హృదయవేదనచేతఁ బరితపింపఁగా, గ్రుచ్చి కవుంగిటఁ జేర్చి=గట్టిగాఁ గౌఁగిలించుకొని, తల్లి శుక్తిమతి=జననియైన శుక్తిమతీనది, తదీయ= ఆగిరికాసంబంధమయిన, తాప=విరహవేదనమనెడు, శిఖి=అగ్నియొక్క, కీలలం=జ్వాలలచేత, ఇంకఁగఁ బోలుం = ఇగిరిపోయియుండవచ్చును, కానిచోం = అలాగునఁ గాకపోయినట్లులయిన, రమణి మెయిం =గిరికాదేవిదేహమందు, బిసాంకుర పరంపరలుం = లేతతామర తూఁడులయొక్క సమూహములును, ఘనసార = కర్పూరమనెడు, వాలుకాసముదయముం = ఇసుకతెరయును, సుజాత=లెస్సగా సంభవించిన, జలజాత = కమలములయొక్క, దళంబులుం = రేకులును అనఁగా సుకుమారములయిన కమల గర్భదళములననుట, ఉల్లసిల్లునే = ఒప్పుచుండునా.

ఇక్కడ గిరికాదేవికి శైత్యోపచారార్థముగా శరీరమందు నిల్పిన బిసాంకుర కర్పూరపరాగ పద్మదళములను గిరికాలింగనమందుఁ దద్విరహతాపానల జ్వాలచేత శోషించిన శుక్తిమతి సంబంధము లయిన బిసాంకురవాలుకా పద్మదళములనుగా నుత్ప్రేక్షించినాఁడు. ఈచెప్పుటచేత గిరికాదేవి విరహ తాపాతిశయము ప్రకటమగుచున్నది. ఇచ్చట బిసాంకురాదులవలన శుక్తిమతి శోషము నూహించుట వలన ననుమానాలంకారము.

చ. ప్రసవశరాఖ్యయోగి బహుభంగుల భావన లిచ్చి మర్దనం
బెసఁగఁగ ధాతు వేర్చి బలియించి రసంబు నిశాంత మంతయు
న్వసువుగఁ జేయ మైమఱచి నాతి దళన్మణిభూష లెన్న దా
ప్తసఖులు చేరి పల్కినను బల్కదు చూచియుఁ జూడ దెంతయున్. 106

ఈపద్యమునందు మన్మథపరముగను యోగిపరముగను నర్థద్వయము చెప్పఁబడుచున్నది.

ప్రసవశరాఖ్య యోగి = మన్మథుఁడనెడు రసవాదముసేయుం యోగీశ్వరుఁడు, బహుభంగుల భావన లిచ్చి=అనేకవిధములుగా సంకల్పమును బుట్టించి యని మన్మథపరమయిన యర్థము. పృథురస ములచేత భావనలుచేసి యని యోగిపరమయిన యర్థాంతరము. మర్దనం బెసఁగఁగ ధాతువేర్చి = పీడన మొప్పుచుండఁగా నింద్రియ మూర్ఛనమును బుట్టించియని యర్థము. నూరుటయతిశయించుచుండఁగా నభ్రకాది గైరికధాతుయోగముచేసి యని యర్థాంతరము, (వి. 'ధాతు ర్శ్లేంద్రియేషుచ, శబ్దయోవి మహాభూత తద్గణేషు రసాదిషు, మనశ్శిలానాం ష్టాష్టాదౌ విశేషా ద్గైరికే స్త్రిష్వచ.' అని మే.) బలియిం

చిరసంబు=అనురాగము సుస్థిరముగా నిలిపియని యర్థము. పాదరసమును బద్ధముచేసి యని యర్థాంతరము. (ని. 'రసో గంధరసే జలే, శృఙ్గారాదౌ విషే వీర్యే తిక్తాదౌ ద్రవరాగయోః, దేహధాతు ప్రభేదేచ పారదస్వాదయోఃపుమాన్.' అని మే.) నిశాంతమంతయు న్వసువుగఁజేయన్ = గృహమందంతట వసురాజు పొదకట్టినట్టులు చేయఁగానని యర్థము. గృహమంతయును బంగారమగునట్టులు చేయఁగానని యర్థాంతరము. మైమఱచి = శరీరస్థితి యెఱుఁగనిదై యని యర్థము. మదముచేత శరీర స్మరణ లేనిదై యని యర్థాంతరము. నాతి = గిరికాదేవి, గళస్మణిభూషలెన్నదు = జారిపోవుచున్న రత్నాభరణములను సవరింపదని యర్థము. ఆప్తసఖులు చేరి పల్కినను బల్కదు = ఇష్టసఖులు దగ్గరఁ జేరి మాటలాడినను బల్కదని యర్థము. ఇష్టసఖులు పల్కరించిన మారుత్తరమిచ్చి యాదరింపదని యర్థాంతరము. చూచియుఁ జూడదెంతయున్ = సన్నిహితవస్తువులనుగూడఁ జూడదని యర్థము. కన్ను మిన్నుగానదని యర్థాంతరము.

ఈపద్యములో బహుభంగుల భావనలనఁగా సంకల్పమనెడి యవస్థావిశేషము. మర్దనమనఁగా నంజళికరణ ద్రవీభవనము, ధాతు వేర్పుటయనఁగాఁ బ్రళయమనెడి సాత్త్వికభావము. శ్లో. 'ప్రళయ స్సుఖదుఃఖాద్యై ర్గాఢమింద్రియమూర్ఛనమ్' అని లక్షణము. బలియించిన రసమనఁగా రతియనెడి స్థాయిభావము. వసురాజును సర్వత్ర చూచుట యున్మాదమనెడి సంచారిభావము. ని. 'ఉన్మాదశ్చిత్త విభ్రమః.' అని. అ. మైమఱచుటయును గళద్భూషణము సవరింపకపోవుటయును సఖులకు మారుత్తర మియ్యకపోవుటయును మోహమనెడి సంచారిభావము, వీనికి లక్షణములు, అనుపమకాంతియనెడు పద్యపు వ్యాఖ్యయందు వ్రాయఁబడినవి. అలం. శ్లేషానుప్రాణితమగురూపకము.

ఉ. కొంచక యంబుధిం బడిన•కొండల పత్త్రము లూడ్చ దయ్యె నూ
అంచులకత్తి దానియుదు • టంతయు నెంతని కంతుచేతినూ
అంచులకత్తి హత్తి జవ•రాలికుచాద్రుల ముంచెఁ బత్త్రరే
ఖాంచితవైభవం బెడల • నాతతబాష్పమహాపయోనిధిన్. 107

నూఱంచులకత్తి = అనఁగా శతకోటియైన వజ్రాయుధము, కొంచక = భయపడక, అంబుధిం బడిన = సముద్రమందుఁబడిన, కొండల = పర్వతములయొక్క, పత్త్రములూడ్చదయ్యెన్ = ఱెక్కలు గొట్టివైప దాయెను, దాని యుందుటంతయు నెంతని = ఆశతకోటియొక్క బాగరెల్లయు నెంతలోనిది యని, కంతుచేతి నూఱంచులకత్తి=అనఁగా మన్మథునిచేతనుండెడు శతకోటియని యర్థము. శతపత్త్ర మని భావము. హత్తి = తగిలినదై, పత్త్రరేఖాంచితవైభవం బెడలన్ = ఱెక్కలయొక్క చక్కఁదనము వీడిపోవునట్టులుగా నని యర్థము. మకరికాపత్త్ర రచనలయొక్క సొగసు చెడిపోవునట్టులుగా ననిభావము. జవరాలి కుచాద్రులన్=గిరికాదేవియొక్క చన్నులనెడు కొండలను, ఆతత = విస్తారమైన, బాష్ప=కన్నీరనెడు, మహాపయోనిధిన్ = మహాసముద్రమందు, ముంచెన్ = ముంచివైచెను.

అనఁగాఁ బత్త్రములూడ్చక మైనాకాది పర్వతములను సముద్రమాత్రమందు మునుఁగునట్టులు చేసిన యింద్రునిచేతి నూఱంచులకత్తికంటెఁ బత్త్రములు వీడిపోవునట్టులుగా గిరికాకుచ పర్వతములను బాష్ప మహాసముద్రమందు ముంచిన కంతుచేతి నూఱంచులకత్తి యెక్కువది యని యర్థము. అతిశ

యోక్తి రూపకానుప్రాణితమైన వ్యతిరేకాలంకారము. ఇక్కడ మూఁడవచరణమందు జవరాలన్న చోటనుండు ఆలనెడు పదము మొదట శేషాగమము వచ్చినది గనుక విశ్రమము చెప్పినాఁడు. ఇందుకు,

తే. 'ఆలనుపదంబు మొదలనురాగమంబు, వచ్చుసంధికి యతియంబు వడికిఁ జెల్లు
నతివ జవరాలు జాలింతరాలు ముద్దు, రాలు ధర్మాత్మురా లన రాజసాని.'

అని యప్పకవీయపు లక్షణము. ప్రయోగము 'వికాంతమునందునున్న జవరాండ్ర' మనుచరిత్రము.

బొమ్మమాతకమగుటవలన మహోదధియని చెప్పఁబడెను. సముద్రమునందున్న యొక కొండ ఱెక్కల నూఱుంచుల కత్తితో నింద్రుఁడు నఱుకఁజాలఁడయ్యెను. వీరాధిపుఁడగు మన్మథుఁడో యట్టి నూఱుంచుల కత్తితోనే కన్నెటిసముద్రమునందు మునుఁగుచున్న కుచాద్రులను రెంటిని బత్త్రచ్ఛేదన మొనరించి మించెను.

క. కంజనయనావిలోకన, ఖంజనయుగ మెదకు వ్రాలఁ గని వసు వాలో
రంజిలుట దెలిసి శంబర, భంజనుఁ డతినిశితవిశిఖపంక్తి నగల్చెన్. 108

కంజనయనా=గిరికాదేవియొక్క, విలోకన = వీక్షణములనెడు, ఖంజనయుగము = కాటుకపిట్టల యొక్క జోడు, (ని. 'ఖఞ్జరీటస్తు ఖఞ్జనః' అని అ.) ఎదకువ్రాలన్=హృదయప్రదేశమందు వ్రాలఁగా నని విలోకనపరమైన యర్థము. సంభోగార్థమై వ్రాలఁగా నని ఖంజనపరమైన యర్థము. కని=చూచి, వసువాలో రంజిలుట దెలిసి=వసువనఁగా వసురాజును ధనంబును గనుక వసురాజాగిరికాహృదయ ములోఁ బ్రకాశించుట దెలిసినవాఁడై యని మన్మథపరమైన యర్థము. ధనము కాటుకపిట్టలు సంభోగార్థమై వ్రాలినభూమిలో నుండుట దెలిసినవాఁడై యని కిరాతపరమైన యర్థము. శంబర భంజనుఁడు=శంబరశబ్దము శంబరాసురునియందును లేడియందును వర్తించుచున్నది గనుక శంబరాసుర భంజకుఁడైన మన్మథుఁడని యర్థము. మృగభంజకుఁడైన కిరాతుఁడని యర్థాంతరము. (ని. 'శంబరో దైత్య హరిణ మత్స్య శైల జలాంతరే' అని వి.) అతినిశితవిశిఖపంక్తినగల్చెన్=మిక్కిలి వాఁడిగలిగిన బాణపంక్తిచేత భేదించెనని యుభయత్ర యన్వయము.

కాటుకపిట్టలు సంభోగార్థమై వ్రాలినచోట ధనముండునని చెప్పినందులకు, గద్య. 'ఖంజరీట మిథుననిధువనసంచారోపజ్ఞాతనిధిగ్రహణ కౌతుకితమతికిరాతఖన్యమానస్థపుటీతాఖ్యాశజలాశయా కస్మి న్నిధిర్భవతి మైథునమేతియస్మిన్ (బృహత్సంహిత)

గిరికాదేవి విచారాతిశయముచేఁ దలవ్రాల్చ నాయమదృక్ఖంజనములు వక్షస్థ్సలమున నలరెను. కాటుకపిట్టల జంటయున్నచో నిధులుండును. గిరికాహృదయము వసువుంటయొఱింగి మన్మథుఁడు బొమ్మగాఁడ ములుకు లేసెను. వసువన సువర్ణమని విధిపరమగునర్థము.

అలం. శ్లేషమూలకరూపకము.

తే. పూఁటపూఁట శరత్కోటి పోడముకతన, విన్నవై యన్నదీకన్య వేణి దూల
సన్నగిలియున్నగతినెన్న జనునె యకట, యూర్మికలుకంకణాకృతినొనరె నపుడు.

పూటపూట శరత్కోటి పోడముకతనన్=ప్రతిదినమందును సంవత్సర కోటి యుండ్నవించు చున్న హేతువువలన, అనఁగా నొకదినము కోటి సంవత్సరములుగా నుండుటవల్ల ననుట. శరత్కాల

కోటి పుట్టుటవల్ల-ఇక్కడఁ గోటియనఁగా భాగమని తెలియవలయును. విన్నదైయున్న దీకన్య=చిన్నఁబోయినదై యాగిరికాదేవి, వేణిదూలన్ = జడ తూలి పోఁగాననియు ప్రవాహము తీసిపోఁగాననియు నర్థము. సన్నగిలియున్నగతిన్=కృశించియున్న విధమును, ఎన్నఁజనునె=తలంపఁగూడునా, అనఁగా నెన్నశక్యము గాదనుట. అకట = అయ్యయో, అపుడు = ఆసమయమందు, ఊర్మికలు కంకణాకృతి నొనర్చెన్=ఉంగరములు కంకణములాయె ననియు, తరంగములు జలబిందుప్రాయము లయ్యె ననియు నర్థము. ఇందులోఁ గార్శ్యావస్థను జెప్పినాఁడు. ఇది సమాసోక్త్యలంకారము. శ్లేషానుప్రాణితము.

గిరికకుఁ బూఁట కోటి సంవత్సరములగుటచేఁ జిన్నఁబోయి పెన్నెఱి సవరింపక కృశించి యుండెను. ఆయమసంతాపస్థితి తెలుపఁ దరముగాదు. చిక్కుటచే నుంగరములు కంకణములయ్యెను. ఇట్లనుటకు "చ. చిటికెనవ్రేలియుంగరము సీతకుఁ గంకణమాయె రాఘవా" యను ఆంజనేయుని వాక్యము సరిచూచునది. శరదాగమముచే నదీప్రవాహము సన్నగిలుటచేఁ దరంగములు జలబిందువులుగా నుండెనని శ్లేషార్థము.

సీ. మదినున్న మరుఁడు వంపమహోగ్రగతివచ్చు, కమ్మఁదెమ్మెరలనఁగద నెనూర్పు
లూర్పుగాడ్పులరాకఁ గులికి పాండుమృణాళకుండలిపైఁ బూనెఁ ♦ గుచసురాద్రి
కుచసురాద్రిగరంగె ఘోరతాపార్చినాఁ, బడనెఁబువ్వాడితోఁడి వలపుఁజెమట
చెమటవెల్లువకు ఫేనము లయ్యెఁ బెనుగాక, నవసి నీరుగఁ బొంగు హారమణులు
తే. హారమణివారతారాపసారమును గ
ఠోరమూర్ఛాంధకారవిస్తారమును న
పారమై రేయుఁ బగలు నేర్పులుపకునికి
మగువకనుదమ్ము లరమోడ్పు ♦ మరువవయ్యె. 110

మదినున్న మరుఁడు వంపన్=మనస్సునందున్న మన్మథుఁడు వంపఁగా, మహోగ్రగతివచ్చు=మహారౌద్రముగా వచ్చుచున్న, కమ్మదెమ్మెర లనన్=మలయమారుతములో యన్నట్టులుగా, కదనెనూర్పులు=నిట్టూర్పులు తటస్థములాయెను. ఊర్పుగాడ్పుల రాక కులికి=ఆనిట్టూర్పులనెడు వాయువులయొక్క యాగమనమునకు భయపడి, కుచసురాద్రి=స్తనమనెడు సురాద్రియనఁగాఁ గాంచనాచలము, పాండుమృణాళి=తెల్లని తామరతూఁడనెడు, కుండలి=శేషాహిని, పైఁబూనెన్ = తనపైధరించెను. తొల్లివాయువు ఆదిశేషువు నేను బలాధికుఁడను నేను బలాధికుఁడనని వివాదించిరి. ఆదిశేషువు పడగవిప్పి మేరుపర్వతముపైనుండి కదలింపుమని వాయుదేవుఁడు తనసర్వశక్తులు వినియోగించి యోడిపోయిన పురాణకథ నిట ననుసంధించునది.

ఊర్పులు తెమ్మెరలుగా గాడ్పులుగాఁ జెప్పుటచేతను మహోగ్రగతి వచ్చుచున్న వనుటచేతను దట్టము తెంపులేమి సూచితము. సర్పము వాయువును భుజించును గావునఁ జనుగట్టులు మృణాళకుండలిని ధరించెను. విరహతాపము ఘోరతాపాగ్ని కావుననే చనుగట్టులు కరిగి నీరయ్యెను. ఈపద్యమందు గిరికావిరహతాపాతిశయము చెప్పఁబడినది.

అలం. ఉత్ప్రేక్షాలంకారము. రూపకానుప్రాణితకావ్యలింగము.

ఘోర=భయంకరమయిన, తాప=విరహతాపమనెడు, అర్చిః=అగ్నిజ్వాలచేత, వసురాడ్రి=స్తనమనెడు కాంచనాచలము, కరంగెనాఁ = కరఁగినదో యనునట్లులుగా, పడసెఁ బుష్పాడితోడి వలపుఁ జెమట, పుష్పాడితోడి = పుష్పపిశంగపరాగముతోడ, వలపుఁజెమట = పరిమళయుక్తమయిన శ్రమజలము, పడసెఁ = స్రవించెను, చెమటవెల్లువకుఁ = ఆశ్రమజలముయొక్క వెల్లివరదకు, పెను కాకఁ = మహత్తరమైన విరహతాపముచేత, ఆవిసి = కుమిలి, నీరుగఁబొంగు=నీళ్లుగాఁ బొంగుచున్న, హారమణులు = హారముక్తికములు, ఫేనములయ్యెఁ = నురుగులుగా నేర్పడియెను.

హారమణివార=హారముక్తిక సమూహమనెడు, తారా=నక్షత్రములయొక్క, అపసారమును = పోవుటయును, కఠోర=కఠినమయిన, మూర్ఛా=పరవశత్వమనెడు, అంధకార = కాఱుచీఁకటియొక్క, విస్తారమును = ఆధిక్యంబును, అపారమై=పరిమితిలేనిదై, రేయుఁ బగలు నేర్పఱుపకునికిఁ = రాత్రి యగుటయుఁ బగలగుటయు నేర్పాటుగాకయున్నందున, మగువకనుదమ్ములు = గిరికాదేవియొక్క నేత్రములనెడు కమలములు, అరమోడ్పు మరువవయ్యెఁ = అర్ధనిమీలనముచు మానకయుండెను.

గిరికాదేవికి వసురాజ విషయమైన విరహాతిశయముచేత నిట్టూర్పు లుదయించెను; స్తనములు తామరతూండ్లచేతఁ గప్పఁబడియెను; శరీరమంతయుఁ జెమటపట్టెను; తాపముచేత హారసంబంధము లైన ముత్యములు పెటిలిపోయెను; మూర్ఛగ్రమ్మి కన్ను లరగన్నులు పడియెను అని యర్థము. ఈ పద్యపుఁ బాదములఁ ముక్తాంత్యపదగ్రస్తములుగాఁ జెప్పంబడియెను.

సీ. వరగుణజాలసం • వననసామగ్రితోఁ, బాశంబు లాశలఁ • బాదుకొల్పి
చటులతాపానల • జ్వాలిక ల్వెలిపి జీవన మంతయుఁ గలంచి • వనచరాళి
నిస్వనంబులు రేచి • నిగుడు కాతరనేత్ర, శంబరంబులు వాడు • శరభగండ
కములుదూలెడుచిత్ర • కాయలీలలుసోయగములువీడ్కొనుభద్ర • గతులుజడియ ||
తే. నాతత స్తబ్ధరోమంబు • లలసి వ్రాలు, ఘనసితాపాంగములుగాఁగ • గాండవృష్టిఁ
బఱపి వేఁటాడఁదొడఁగె శం • బరవిరోధి, కాంతయావనరేఖలోఁ • గలయ మెలఁగి.

ఈపద్యగీతియందుఁ జెప్పఁబడిన శంబరవిరోధి యనెడువిశేష్యపదమునకు మన్మథుఁడనియును గిరాతుఁడనియును బ్రకృతాప్రకృతశ్లేషఁ గల్పించి యంతట నర్థద్వయము గలుగఁ జెప్పినాఁడు. ఏలాగనిన, వర = వరుఁడైన వసురాజుయొక్క, గుణజాల=రూపయౌవనాది గుణ సముదాయ రూపమయిన, సంవననసామగ్రితోఁ = వశక్రియాసామగ్రితోడ నని మన్మథ పరమయిన యర్థము. వర=దృఢతరమైన, గుణ=ఉరిత్రాళ్లయొక్కయు, జాల = వలలయొక్కయు, సంవనన=వశక్రియలయొక్క, సామగ్రితోఁ=సాధనములతోడనని కిరాతపరమైన యర్థము. (ని. 'వశక్రియా సంవననమ్' అని అ.) పాశంబులాశలఁ బాదుకొల్పి = పాశము లనఁగా నిక్కడ బంధనములు, వానినాశలచేత నాపాదించి, అనఁగా నాశాబంధములు గలుగఁజేసియని యర్థము. ఉరిత్రాళ్ల నానాదిక్కుల నాటించి యని యర్థాంతరము.

చటుల = తీవ్రమైన, తాప = సంతాపరూపమైన, అనలజ్వాలికలు=అగ్నిజ్వాలలను, వెలిపి= వ్యాపింపఁజేసి యనియర్థము, తీవ్రతాపములైన యగ్నిజ్వాలలను వెలిపియని యర్థాంతరము. జీవనమంతయుఁ గలంచి=బ్రతుకంతయును గలతఁబొందించి యని యర్థము. జీవనమనఁగా నుదకము గవుల

సరోవరోదకములను దుష్టవస్తువులు గలిపె కలుషితములుగాఁ జేసియని యర్థాంతరము. వనచరాళిని స్వనంబులు రేచి=వనచరము లనఁగా శుకపికాదులును వనచరులనఁగా నెఱుకువాండ్రును, శుకపికాదిపక్షి సమూహముయొక్క కలకలధ్వనులు మిాఱునట్టులుగాఁజేసి యనియర్థము. ఎఱుకువాండ్రయొక్క కూకలు బొబ్బలు నతిశయించునట్లు చేసి యని యర్థాంతరము.

నిగుడు కాతరనేత్ర శంబరంబులు = ఉల్బణించుచున్న చంచలనేత్ర జలములును అని యర్థము. బయలుదేరుచున్న దీనదృష్టులైన యెఱ్ఱజింకలును అని యర్థాంతరము. వాదు=వదలిపోవుచున్న, శరభ= శరమనఁగా తెల్లువెన్ను గనుక దానియొక్క, భ = కాంతివంటికాంతితోఁగూడుకొన్న-అనఁగా విరహ పాండురములైన, గండకములు=కపోలములును అని యర్థము. అలయుచున్న శరభగండకనామమృగము లని యర్థాంతరము. శరభమనఁగా నెనిమిది కాళ్లుగల మృగంబును గండకమనఁగా గెండామృగంబును, తూలెడుచిత్రకాయలీలలు = తూలిపోవుచున్న చిత్రములైన గాత్రవిలాసములును అని యర్థము. తూలియాడుచున్న వ్యాఘ్రలీలలును ,అని యర్థాంతరము. (ని. (ద్వీపీ వ్యాఘ్రశ్చిత్రకాయః' అని యమరశేషము.) సోయగముపీడ్కొను భద్రగతులు = సొంపుచెడిన శుభయానములును అని యర్థము. మందత్వమువిడిచిన వనగజవిశేషములయొక్క సంచారములును అని యర్థాంతరము. (ని. 'భద్రో మంద్రో మృగ శ్చేతి విజ్ఞేయా స్త్రివిధా గజాః' అని యమరశేషము.

జడియు=సమయుచున్న, ఆతత = విస్తారములైన, స్తబ్ధ = నిట్టపొడిచిన రోమములును అని యర్థము. భయపడుచున్న యాతతములైన వరాహములును అని యర్థాంతరము. (ని. 'దంష్ట్రిఘోణీ స్తబ్ధరోమా' అని అ.) అలసి వ్రాలు ఘనసితాపాంగములు = అలసతచేత వ్రాలుచున్న యధికధవళము లైన క్రేగంటిచూపులును అని యర్థము. గమన పటుత్వము లేక వ్రాలుచున్న గొప్ప నెమళ్ళును అని యర్థాంతరము. సితాపాంగములనఁగా శుక్లాపాంగములని గ్రహింపవలయును. కాఁగన్ = అగు నట్టులుగా, కాండవృష్టిఁబఱపి = బాణవర్షము గురిపించి, శంబరవిరోధి = మన్మథుఁడని యర్థము. కిరాతుఁడని యర్థాంతరము. కాంత యౌవనరేఖలోఁ గలయ మెలఁగి = గిరికాదేవియొక్క యౌవన సౌష్ఠవములోఁ గలయ దిరిగి యని యర్థము. కాంతయౌ = రమ్యమయిన, వనరేఖలోన్ = అరణ్య శ్రేణిలో, కలయమెలఁగి = కలయఁదిరిగి యని యర్థాంతరము. వేటాడఁ దొడఁగెన్ = వేటాడఁ జొచ్చెను.

మన్మథుఁడు గిరికాదేవిని విరహపరితాపాప్తిని బొందించె నని ఫలితార్థము. ఈపద్యములో నాలంబనోద్దీపన విభావ సాత్త్వికసంచారిభావములు గ్రంథవిస్తారభయమువలన వ్రాయలేదు.

మన్మథుఁడు వసురాజు గుణాదిసామగ్రి నాధారముఁ జేసికొని గిరికామనోహరయౌవనరేఖలోఁ గలయఁదిరుగుచు నాయమకుఁదాపముగూర్చి శుకశారికాది ధ్వనులచే వలపు నినుమడింపఁజేసి కలఁత పఱచి కనులనీరూరఁ, జెక్కులు తెల్లఁబాఱ, మేనిజిగితొలంగ నడలమురువుచెడ, గగుర్పాటు తలసూపఁ దెల్లనికడగంటి చూపులొలయ ములుకులు నాటవేసి వేటాడఁ దొడంగెనని ప్రకృతార్థము.

అలం. ప్రకృతా ప్రకృత శ్లేషయని సోమకవి. శబ్దశక్తిమూలధ్వని యని యాధునికులు.

చ. అలికులవేణి యిట్లు వలయాంకబిసాంకురపన్నగాళికిం
జలమరిచల్లఁగాలికిని • జక్కొరకాణ్పుఁ దేఱఁ దోలువ్రా

విలుతువయాళికిం జిగురుఁబిండులనీలిగయాళికిన్ హాలా
హాలగుళికాభదుర్మదఘనాళికి నాళికి లోఁగి యాత్మలోన్. 112

అలికులవేణి=గిరికాదేవి, ఇట్లు = ఈచెప్పఁబడినప్రకారముగా, వలయాంక = కంకణాకారచే చిహ్నముగాఁగల, బిసాంకుర=తామరతూఁడులనెడు, పన్నగాళికిన్ = సర్పశ్రేణికిని, చలమరి చల్లగాలికిని = చలపాదియైన మలయమారుతమునకు, చక్కెరఖాణపుఁ దేజీవోలు ప్రాపించు వయాళికిన్ = చక్కెరఖాణపు తేజీయనఁగా బంచదారయే దాణాగాఁగల గుఱ్ఱము - అనఁగాఁ జిలుక. దానినడిపించునట్టి మన్మథునియొక్క, వయాళికిన్=అనఁగా వాహ్యాళికిని, వయాళియనెడు పదము వాహ్యాళిశబ్దమునకుఁ దద్భవము. వాహ్యాళియనఁగా వినోదార్థమయిన సపరివార బలవిహారము. ఇందుకు,

తే. 'ప్రమదనిష్యందతరనేత్రపద్మ లగుచుఁ, బౌరజనులు విలోకింపఁ బ్రమదలీల
సముచితానల్పపరివారసహితుఁ డగుచు, నవనినాథసుతుండు వాహ్యాళి వెడలె.'

అని శృంగారనైషధమందును,

ఉ. పాలును నీరు నేఱుపఱుపంగల మావుల వేదవీథి వా
హ్యాళి యొనర్చు నేయలికులాలకతాసితవర్ణ యయ్యునే
బాలసువర్ణదేహమున భాసిలు నానలుమోము వేల్పు ప్రో
యాలు ప్రవీణమామకమహాకృతినాథుఁ గృతార్థుఁ జేయుఁతన్.'

అని రామాభ్యుదయమునందును బ్రయోగింపఁబడియెను.

చిగురువిందులనీలిగయాళికిన్=చిగురే విందుభోజనముగాఁగల నల్లనిగయ్యాళికి, అనఁగాఁ గోకిలకును, హాలాహలగుళికాభ=కాలకూటపుముద్దతో సమానమయిన, దుర్మద=దుష్టమయిన మదముగల, ఘన=గొప్పదైన, అళికిన్=తుమ్మెదకును, ఆళికిన్=చెలికత్తియకును, లోఁగి=జడిసినదై, ఆత్మలోన్= తనమనములో - ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

దేశ్యమయిన తేజీయనెడిపదమునకు, 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్' న. అను సూత్రముచే హ్రస్వముప్రాప్తించి, 'నచదేశ్యపదే' న. అనెడుసూత్రముచే హ్రస్వప్రాప్తి లేకున్నను, 'నైకవర్ణే న దేశ్యేపి హ్రస్వో దేశ్యేతు వా క్వచిత్' అనెడు నథర్వణవచనమువలన హ్రస్వమువచ్చినదని తెలియవలయును. గయ్యాళి, గయాళి అని ద్విత్వాద్విత్వ రూపభేదముచేత రెండువిధములుగను గలదు ఇందుకుఁ బ్రమాణము. 'అద్విత్వంచ భవేద్ద్విత్వం దీర్ఘోహ్రస్వశ్చ కేషుచిత్' అని యథర్వణ వచనము. ఈపద్యములోఁ దటస్థోద్దీపనములను జెప్పినాఁడు. తామరతూండ్లను సర్పములతోఁ బోల్చుట కవుల కాచారము.

తాపోపశమనార్థము చేతికిఁగట్టఁబడిన కంకణరూపములగు తమ్మితూఁడుమొలకలు సర్పసదృశము లయ్యెను. చల్లగాలిచలపాది. దానిసంగతి తెలుపఁబనిలేదు. పూవిలుతుఁడే తాపముగూర్చువాఁడు, వానివారువము చక్కెరదాణాగల చిలుక. దానిపలుకులు చెలికములుకులె. కోయిలగయ్యాళి, చెవులు చిందరఁబోవఁ జివురులమేసి కూయఁదొడఁగును. తుమ్మెదవిషపుగుళిక. చెలిగుట్టు గ్రహించుటచే లజ్జ నొందఁగనుగ్గానఁ [illegible]! అన్నియుఁ [illegible]

ఉ. అమ్మక చెల్ల ధైర్యవిభవాతిశయంబునఁ గండ్రి పెంపు లే
శమ్మును గాన నైతి జడజన్మమునన్ జనయిత్రిఁ బోలి పైఁ
గ్రమ్మునిదాఘతాపహతిఁ గ్రాఁగుచుఁ జిక్కితి లోఁతు దక్కి ని
క్కమ్ముగఁ దండ్రిచాయ గలకన్యలు ధన్యలుగా వసుంధరన్. 113

అమ్మకచెల్ల=అనఁగా నేనేమిసేతునను. ఇది సంతాపవాక్యము. ధైర్య విభవాతిశయంబునన్= నిశ్చలత్వాతిశయముచేత, తండ్రి పెంపు లేశమ్మును గాననైతిన్ = తండ్రియైన కోలాహలపర్వతుని యొక్క యతిశయమును లేశమాత్రమయినను బొందఁజాలనైతిని. అనఁగా నెంతమాత్రమును దండ్రిని బోలనైతిననుట. జడజన్మమునం జనయిత్రిఁ బోలిపైఁ గ్రమ్మునిదాఘతాపహతిఁ గ్రాఁగుచుఁ జిక్కితి లోఁతుదక్కి=జడమనఁగా స్తబ్ధత్వంబును జలంబును, ఇచట ల డ ల క భేదము. నిదాఘమనఁగా నుష్ణంబును గ్రీష్మంబును, లోఁతనఁగా గాంభీర్యమును నిమ్నత్వంబును, జడజన్మమునన్=జడమయిన జన్మముచేత, జనయిత్రిఁ బోలి=తల్లియైన శుక్తిమతినిబోలి, పైఁగ్రమ్ము=పైని వ్యాపించుచున్న, నిదాఘతాపహతిన్=ఉష్ణమయిన విరహతాపముయొక్క తాఁకుడుచేత, క్రాఁగుచున్ = తపించుచు, లోఁతు దక్కి=గాంభీర్యముచెడి, చిక్కితిన్=కృశించితినని యర్థము. తల్లినిబోలియన్నందునఁ దల్లి నదిగనుక జలజన్మమును బైఁగ్రమ్ముచున్న గ్రీష్మకాలాతపహతిచేతఁ గ్రాఁగుచును, నిమ్నత్వముమాని సన్నగిలుట యును నదీధర్మములని గ్రహింపవలయును. (ని. 'నిదాఘో గ్రీష్మకాలేస్యాత్ ఉష్ణే స్వేదాంబునోరపి' అని వి.) వసుంధరన్ = భూమియందు, నిక్కమ్ముగన్=యథార్థముగా, తండ్రిచాయగలకన్యలు= తండ్రిపోలికగల కన్యలు, ధన్యలుగా = కృతార్థలుగదా. ని. 'ధన్యాపితృముఖీకన్యా ధన్యామాతృముఖ స్సుతః' అనఁగాఁ దండ్రినిబోలిన కొమార్తె ధన్యురాలనియును దల్లిని బోలినకుమారుఁడు ధన్యుఁడనియును నున్నదికనుక నేను దండ్రిని బోలక తల్లినిబోలినందున నింత వ్యథపాలైతి నని యర్థము. అలం. అర్థాంతరన్యాసము.

మ. నయిదోర్జైనసువృత్తపాండురమణీజాలంబు ముమ్మున్నుగా
భయకృత్పల్లవసూచికాస్థితిఁ దపఃప్రౌఢిఁ జేరై నృపా
న్వయచూడామణి వేరురం బెనసె నే నట్లయ్యుఁ బ్రాపింపలే
నయితిం దాదృశవైభవం బకట భాగ్యాయత్తము ల్గా సిరుల్. 114

పాండురమణీజాలము అనుపదమువలన రమణీజాలమునకు మణీజాలమునకు నర్థద్వయము కవి సంఘటింపఁజేసెను.

నయిదోర్జైన=తోఁడఁబుట్టిన, సువృత్త=మంచివర్తులములైన అని యర్థము. సద్వృత్తిగల అని యర్థాంతరము. పాండురమణీజాలంబు=శ్వేతమణిసమూహము, అనఁగా ముత్తియములు అని యర్థము. సువృత్త=మంచివృత్తిచేత, పాండు=నిర్మలమైన, రమణీజాలంబు=స్త్రీసమూహము అనియర్థాంతరము. ముమ్మున్నుగన్=ముందుముందుగా, భయకృత్=భయమును జేసెడు, పల్లవ=చిగురువంటి, సూచికా= సూదియందలి యని యర్థము. సూదులవంటి మన్మథ బాణములయందని యర్థాంతరము. స్థితిన్=ఉనికిచేత సాధ్యమయిన, తపః=తపస్సుయొక్క, ప్రౌఢిన్=నిశ్చయభావముచేత-ఇక్కడ ముక్తాఫలములు సూదులచేతఁ గ్రువ్వఁబడుఁ గనుక ముత్యములకు సూచికాగ్రస్థితి సంభవించుచున్నది. చేరై=

హారమై యని యర్థము. ప్రసిద్ధికెక్కినయది యర్థాంతరము. నృపాన్వయ = రాజకులమునకు, చూడామణి=శిరోరత్నమయిన వసురాజుయొక్క, పేరురంబు = విశాలవక్షస్థలమును, పడెక్ = పొందినదాయెను, ఏను=నేను, ఆట్లయ్యెక్=అముత్యములకు గలిగినసువృత్తాదిగుణములు గలదాన నయ్యును; తాదృశ = అటువంటి, అనగా ముత్యములు గలుగజేసికొన్న, వైభవంబు=విశేషాలికయమును, ప్రాపింపలేనయితిక్ = పొందలేకపోతిని, అకట = అయ్యో, సిరులు = సంపదలు, భాగ్యాయత్తముల్గా = పుణ్యస్వాధీనములైనవి గదా, అనగా పూర్వజన్మసంబంధమగు సుకృతమూల భాగ్యవశమునగా సంపత్తులు గలుగుచున్నవి.

మణిహారములు ముక్తాహారములు గ్రీష్మతాపోపశమనము లనుటకు బ్రయోగము.

శ్లో. నిశాశ్శశాంక క్షతనీలరాజయః, క్వచిద్విచిత్రం జలయంత్రమందిరం
మణిప్రకారాః సరసంచచందనం, శుచౌ ప్రియా యాంతిజనస్య సేవ్యతాం.

శ్లో. నితంబ బింబైస్సుదుకూల మేఖలైః, స్తనైస్సహారా భరణైః సచందనైః
శిరోరుహైః స్నానకషాయవాసితైః, స్త్రియోనిదాఘం శమయంతికామినాం.

ఋతుసంహారము.

అలంకారము. వ్యతిరేకము. శ్లేషోత్థాపితము.

ఉ. తల్లియుఁ దండ్రియుఁ బహువిధంబులఁ గామితము ల్ఘటింపఁగా
నుల్లము చల్లనై సిరుల నొందుసుపర్వనరాహిరాట్పురీ
వల్లకపాణులం దొకతెనై జనియింపక నొడ్లనొంచు పె
న్వెల్లికి రాతికిం బొడమి వేఁకడినై తిఁ దలంపు లేటికిన్. 115

తల్లియుఁ దండ్రియుఁ = తల్లిదండ్రులు, బహువిధంబులక్=అనేక విధములచేత, కామితము ల్ఘటింపఁగాక్=కోరికలను సమకూర్చుచుండఁగా, ఉల్లముచల్లనై = మనస్సు చల్లఁబడి, సిరులనొందు = సంపదలను బొందుచున్న, సుపర్వ=దేవతలయొక్కయు, నర = మనుష్యులయొక్కయు, అహిరాట్ = సర్పశ్రేష్ఠులయొక్కయు, పురీ = పట్టణములయందలి, అనఁగా స్వర్గమర్త్య పాతాళలోకములందలి, వల్లక పాణులందుక్ = స్త్రీలయందు, ఒకతెనై జనియింపక = ఒకదాననై పుట్టక, ఒడ్లనొందు = పరులను వంచన సేయుచుండెడు అని యర్థము. తీరముల నురలఁ దీయుచుండు నదియని భావము. పెన్వెల్లికిక్ = పెద్దవెల్లి వరదపెట్టెడు నదికిని, రాతికిక్ = పాషాణమయ మగునగొండకును, పొడమి = జన్మించి, వేఁకడినైతిక్=గోలుమాలిన దాననైతిని. తలంపులేటికిక్ = నాయొక్క తలంపులతో నేమి నిమిత్తము.

తా. స్వర్గమర్త్య పాతాళములయందు సాధారణముగాజన్మించెడు స్త్రీలలో నొకదాననై జన్మించిన ట్లయిన వసురాజు విషయమైన నాకోర్కను దల్లిదండ్రులు ఫలింపఁ జేయుదురుగదా! అలాగునఁగాక యేటికిని గొండకును జన్మించినందున నాకోర్కి సఫలముచేయువారు కనుపడరుగనుక నెందుకును గొఱగాని జన్మముగలదాన నైతిని.

తల్లి యొడ్ల నొంచునది. తండ్రి ఱాయి. ఈయిరువురకుఁబుట్టిన వారు వేఁకడి యగుటలో నాశ్చర్యములేదు. కానసే తలంచిలాభములేదు. సుపర్వనరాహిరాట్పురీసతులు తల్లిదండ్రుల తోడ్పాటుగల

వారుగానసే వారియుల్లము చల్లనగుట, సిరులొందుట తటస్థించినది. అలం. శ్లేషమూలక కావ్యలింగము.

పేటేఁడి రూపాంతరము వేటఁడి. ఇందులకుఁ బ్రయోగము భారతోద్యోగపర్వతృతీయాశ్వాసమునందు.

"పేటేఁడిరైన మానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే"

సీ. సోయగంబున వీణ ♦ వాయింప మాయంపు, జటిలుఁ డచ్చటికి నే ♦ మిటికి వచ్చె
వచ్చుఁగా కేమి య ♦ వ్వసుమహీపాలు బాలామనోభవుని నే ♦ లా తలంచెఁ
దలఁచుగా కేమి మి ♦ థ్యాజపప్రౌఢి నా, పృథివీశు నేల ర ♦ ప్పించి చూపెఁ
జూపుఁగా కేమి మా ♦ యాపారికాంక్షిదర్శితవసుభ్రాంతిఁ జెం ♦ దితి ని దేల
తే. తల్లికౌటిల్య మెన్నఁడు ♦ దలుగుఁ దండ్రి
హృదయ మెన్నఁటికిఁ గరంగు ♦ నీవియోగ
నీరనిధి నెట్లు గడతు శృం ♦ గారవనికి
నరుగ నన్నియుఁ జక్కనౌ ♦ నచట ననుచు. 116

సోయగంబునన్=విలాసముచేత, వీణవాయింపన్ = వీణవాయించుచుండఁగా, మాయంపుజటిలుఁడు=కృత్రిమపు మునీశ్వరుఁడు; అచ్చటికి నేమిటికి వచ్చెన్ = ఆమణిమందిరమునకు నేలవచ్చెను. వచ్చుఁగాకేమి=వచ్చిన నేమాయెను, బాలామనోభవునిన్=రమణీమన్మథుఁడైన, అవ్వసుమహీపాలున్= ఆవసురాజును, ఏలాతలంచెన్ = ఎందుకుఁ దలఁచెను, తలఁచుఁగా కేమి = తలఁచిన నేమాయెను, మిథ్యాజప ప్రౌఢిన్ = అబద్ధపు జపసామర్థ్యముచేత, అపృథివీశున్ = ఆవసురాజును, ఏలరప్పించిచూపెన్= ఎందుకు రప్పించి కనుపఱిచెను, చూపుఁగాకేమి = చూపించిన నేమాయెను, మాయాపారికాంక్షి = కపటమునీశ్వరునిచేత, (ని. 'తపస్వీ తాపసః పారికాంక్షీ వాచంయమో మునిః' అని అ.) దర్శిత = చూపఁబడిన, వసు=బంగారమందలి, భ్రాంతిన్ = భ్రమను, చెందితి నిదేల=ఈతీరుగా నెందుకుఁ జెందితిని అని యర్థము. వసురాజునందలి భ్రాంతి నెందుకుఁ జెందితినని భావము.

తల్లికౌటిల్య మెన్నఁడు దలుగున్=తల్లియైన శుక్తిమతియొక్క కుటిలబుద్ధి యెన్నఁటికి నశింపఁగలదు అని యర్థము. కుటిలప్రచార మని భావము. అనఁగా నదిగనుక వంకవంకలుగాఁ బ్రవహించుట యనుట. తండ్రిహృదయ మెన్నఁటికిఁ గరంగున్ = తండ్రియైన కోలాహలునియొక్క నిర్దయహృదయ మెన్నఁటికిఁ గరఁగుచున్నది అని యర్థము. పాషాణమయహృదయ మని భావము. ఈవియోగనీరనిధి నెట్లుగడతున్=ఈవిరహ సముద్రము నేలాగు దాఁటుదును, శృంగార వనికినరుగన్=శృంగారవనమునకుఁబోయిన, అచటన్ = అక్కడ, అన్నియుఁ జక్కనౌను = అన్నికార్యములును జక్కపడును, అనుచున్ = అని తలంచినదై, ఈ పద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

వసురాజు బాలామనోభవుఁడు కావుననే తనవలపుఁ జూఱఁగొనఁగలుగుట. తల్లి నది గాన సహజకుటిలగమనముగలది. తండ్రి కొండ గాన నెంతకుఁ గరఁగనివాఁడు. విరహమో యంతులేని సముద్రము. శృంగారవని కేగి కాలక్షేపము చేయనగునని గిరికాదేవి యుపవనమున కేగెను.

అలం. శ్లేషము.

క. సకియఁ గను మొఱఁగి మధుకర, చికుర నిజారామవాటిఁ • జేరి ప్రసూనాం
బక ఘాటీశుకఘోటీ,నికరాటీకనము మనము•నివ్వెఱపఱుపన్.

సకియఁ గను మొఱఁగి = చెలికత్తియను వంచనచేసి, అనఁగా దప్పించుకొని, మధుకరచికుర = తుమ్మెదలవంటి తలవెండ్రుకలు గల గిరికాదేవి, నిజారామవాటిఁ జేరి=తనయొక్క యుద్యానవనప్రదేశ మందుఁ బ్రవేశించి, ప్రసూనాంబక = పుష్పములు బాణములుగాఁ గలమన్మథునియొక్క, ఘాటీ = దవుడునందలి, శుక ఘోటీనికర = చిలుకగుఱ్ఱపు గుంపులయొక్క, ఆటీకనము = ఆగమనము, అనఁగా రాక, ('టీకృగతౌ'మనము నివ్వెఱ పఱుపన్ = మనస్సు నాశ్చర్యమును బొందింపఁగా, నిండువెఱ నివ్వెఱ, అని సంధివచ్చినది. ఈపద్యమునకు ముందరిపద్యములో నన్వయము. ఘాటీలక్షణము.

శ్లో. 'శత్రుసేనావమర్దాయ సద్య స్సభిలఘోటకైః,
విజిగీషాప్రవృత్తి ర్యా సా ఘాటీతి నిగద్యతే.' అని చెప్పఁబడియున్నది.

ఎటులో మన్మథునిబారినుండి తొలఁగి బ్రతుకవచ్చునని యుపవనమునకుఁ బోఁగా గిరికాదేవికి వనమంతయుఁ నుద్దీపనదాయకముగ నుండెను.

సీ. పవమానమానవ•ప్లవమానకైరవ,చ్యవమానరజము మైఁ•నంటఁ దివురుఁ
గరసారసాగ్రతా•మరసాతిసాంద్రసీ,ధురసాప్తిఁ గన్నీరుఁ • దుడువఁగోరు
మదనానలప్రభా•సదనామ్రకోమల,చ్ఛదనార్చిపైఁ జూపు • జరపఁ జూచు
సలయాహతలతాకి•సలయాగమలయాగ,నిలయానిలునకూర్పు • దెలుపఁదలఁచుఁ

తే. గుంజపుటగుంజదళిపుంజ•శింజితంబు, వెగ్గలం బైనఁ జెవి యొగ్గి • వినఁ గడంగుఁ
బంచశరభూతపరిభూత•పంచభూత,ములఁ దదీయస్థలంబులఁ గలుపుకరణి.

పవమానమానవ = నివాతపోతముచేత-అనఁగా మందమారుతముచేత, ప్లవమాన=తూఁగియాడుచున్న, కైరవ = కలువల వల్లనుండి, చ్యవమాన=జారుచున్న, రజము=పుప్పొడిని, మైనంటఁదివురున్ = శరీరముచేత స్పృశింపవలయు నని యుద్యుక్తపడును. ఇందులో మానవ మనఁగా మాణవకము. నణల కభేదవాటవలన మానవమయిన దని తెలియవలయును. (శ్లో. 'రలయో ర్లడయో స్తద్వల్లళయో శ్శసయో రపి, వబయో ర్నణయో శ్చాంతే సవిసర్గా విసర్గయోః, సబిందుకా బిందుకయో స్స్యా దభేదేనకల్పనమ్.' అని భోజరాజీయము. దేహము పృథ్వీభూతము గావునఁ బృథ్వీభూతజన్యమగు పరాగముతోఁ బృథ్వీభూతమగు మేనును గలుపఁ జూచెనని భావము.

కరసారస=కమలమువంటి హస్తముయొక్క, అగ్ర=చివరయందలి, తామరస=లీలాపద్మమందు, అతిసాంద్ర = మిక్కిలి దట్టముగానున్న, సీధురస=మకరందముయొక్క, ఆప్తిన్=వ్యాప్తిచేత, కన్నీరుఁ దుడువఁ గోరున్ = బాష్పజలములను గడుగఁగోరును, జలవికారమగు బాష్పములను జలవికారమగు పూవుదేనియయందుఁ గలుపఁజూచెనని భావము. మదనానలప్రభా = మన్మథాగ్ని ప్రభలకు, సదన = ఆలయమైన, ఆమ్ర=మామిడియొక్క, కోమలచ్ఛదన = చిగురుటాకుల నెడు, అర్చిపైన్=జ్వాలికమీఁద, చూపుజరపఁ జూచున్ = వీక్షణమును బ్రసరింపఁజేయఁ జూచును, మదనానల ప్రభాసదన మని చెప్పుటచేత నామ్రకోమలచ్ఛదనమందు నగ్నిత్వము తెలియఁబడుచున్నది. లయమనఁగా నృత్యగీతవాద్య రహిత తాళసామ్యము (ని. 'తాళః కాలక్రియామానం లయ స్సామ్యమ్, అని అ. మాని చిన్త

మండుచున్నయగ్నివలెఁ బ్రజ్వరిల్లుసు గావున మామిడిచివురు మదనానలప్రభాసదనము. చూపుకాంతుల కునికి పట్టుగాన తేజోవికారము. చూపులు తేజఃప్రకృతిగానఁ బ్రవాళకాంతి యను తేజస్సుతోఁ గలుపఁజాచెనని భావము.

సలయ = లయతోఁ గూడుకొన్నట్టులుగా, ఆహత=కొట్టఁబడుచున్న, లతాకిసలయ = శాఖా పల్లవములగల, అగ=వృక్షముగలిగిన, మలయాగనిలయ=మలయాచలమే నివాసముగాఁగల, అనిలునకున్= వాయువునకు-అనఁగా మలయమారుతమునకు, ఊర్పుఁజెలుపఁ దలఁచున్ = నిట్టూర్పును గనుపఱుపఁ దలఁచును, ఊర్పువాయువికారముగాన మందమారుతముతోఁ గలుపఁజూచునని భావము. కుంజపుట= పొదరిండ్లయందు, గుంజత్ = మ్రోయుచున్న, అళిపుంజ=తుమ్మెదగుంపులయొక్క, శింజితంబు=ఝుంకార ధ్వని, వెగ్గలంబైనన్ = మిక్కుటముగాఁగా, చెవియొగ్గివినఁగడంగున్ = చెవినోరగిలఁ బెట్టుకొని వినఁ జూచును, తుమ్మెదలరవళిశబ్దముగాన నాకాశవికారము. చెవి శబ్దేంద్రియముగాన నాకాశవికారము. కెంటిసిఁగలిపెనని భావము.

ఎట్లన్న, పంచశర=మన్మథుఁడనెడు, భూత=పెనుభూతముచేత, పరిభూత = పరాభవమొందిన, పంచభూతములన్=నిజదేహస్థిత పంచభూతాంశములను, తదీయస్థలంబులన్ = పంచభూతములయందు, కలుపుకరణిన్ = కలుపురీతిగా అని సంబంధము.

ఇక్కడఁ బుష్పపరాగము పృథివీతత్త్వము, మకరందరసము జలతత్త్వము, 'మదనానల ప్రభాసదనామ్రకోమల చ్ఛదనార్చి' తేజస్తత్త్వము, మలయానిలము వాయుతత్త్వము, శబ్దగుణక మాకాశమని యున్నది గనుక మధుకర ఝుంకారధ్వను లాకాశతత్త్వము వీనియందుఁ దనయందున్న పంచమహాభూతాంశములను గలుపుకరణినని యర్థము. ఇక్కడ మరణమనెడి వ్యభిచారిభావము. 'మరణం మరణార్థస్తు ప్రయత్నః పరికీర్తితః' అని యున్నది. అలం. సమము. ఉత్ప్రేక్ష. కెంటి సంకరము.

క. ఈరీతిఁ బొదల మెదలుచు, నారీతిలకంబు మేనినచ్చిక యిచ్చం
గోరక నవసహకారక, కోరక మూరుకొని వడి నిగుడ గమకించెన్. 119

ఈరీతిన్ = పైనిఁ జెప్పఁబడినప్రకారము, పొదల మెదలుచున్ = పొదరిండ్లయందుఁ దిరుగుచు, నారీతిలకంబు = గిరికాదేవి, మేనినచ్చిక=శరీరపునమ్మకమును, ఇచ్చంగోరక = మనస్సునం దభిలషింపక, అనఁగా దేహధారణమం దాసక్తిలేకయనుట, నవ=నూతనమైన, సహకారక=తియ్యమామిడిచెట్లయొక్క, కోరకము = మొగ్గను, మూరుకొని = ఆఘ్రాణించి, వడి నిగుడగమకించెన్ = శీఘ్రముగా నంతమును బొందుట కుద్యోగించెను. ఈపద్యమందును గ్రంథకర్త మరణాఖ్యభావమునే చెప్పినాఁడు. సహకారకుసుమగంధము విరహిణులకపాయదాయకమనుటకు.

శ్లో. సహకారకుసుమకేసర నికరభరామోదమూర్ఛితదిగంతే. భర్తృహరి శృంగారశతకము.

ఉ. అత్తఱి బిత్తరిన్ మణిగృహంబునఁ గానక బోటికత్తియ
ల్లత్తర మంది హా గిరిసుతామణి యెచ్చటికేఁగితే కడుం
గ్రొత్త యటంచుఁ గేలివనకుంజము లారయ వచ్చి యచ్చటం
జిత్తజభల్లభగ్న యగుచెల్వఁ గనుంగొని సంభ్రమంబునన్. 120

అత్తఱిన్ = ఆసమయమందు, చిత్తరిన్ = గిరికాదేవిని, మణిగృహాంబున గానక = మణిమందిర మందుఁ గానక, బోటికత్తియలు = చెలికత్తెయలు, ప్రత్తరమంది = తొందరపడి, హా హంసగామణీ = అయ్యయో గిరికాదేవి, ఎచ్చటికేఁగితే = ఎక్కడికిఁబోతివే, కడుంగ్రొత్త = మిక్కిలి వింతగా నున్నది, అటంచున్ = అనిపలుకుచు, కేళివనకుంజము లారయవచ్చి = ఉద్యానవనమందలి పొదరిండ్లయందు వెదకునిమిత్తముగా వచ్చి, అచ్చటన్ = అక్కడక్కడ, చిత్తజభిల్లభగ్నయవ = మన్మథబాణముల చేత భంగపడిన, చెల్వఁ గనుంగొని = గిరికాదేవిని జూచి, సంభ్రమంబునన్ = తొట్రుపాటుచేత, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ములుకులు నాటుచున్న మన్మథునిచే బాధింపఁబడున్న నతఁడు చిత్తజుఁడు. ఆమె గిరిక బాణభగ్నమై యున్నది. కావననే సంభ్రమము. చెలువయనుటచే గిరికాలోకోత్తరసౌందర్యము ద్యోతకము.

చ. కటకట మమ్ము నొక్కత్రుటికాలముఁ బాయనిదాన వొంటివై
నెటువలె వచ్చి తమ్మ చెలి యచ్చటిప్రేంకపుఁ దేనెవాఁక లీ
వెటువలె నీది తమ్మ తెరు వెల్లను బుష్పొడి నీపదాంబుజం
బెటువలె నోర్చె నమ్మ తరుణీ తగు నమ్మ కడింది చెయ్దముల్. 121

కటకట = అయ్యయో, మమ్ము నొక్కత్రుటికాలముఁ బాయనిదానవు = మమ్ము నొకత్రుటిమాత్రకాలమయిన నెడఁబాయనిదానవు, ఒంటివైన్ = ఒంటిగా, ఎటువలెవచ్చితమ్మ = ఓగిరికాదేవీ! ఏలాగువచ్చితివమ్మ, చెలి = ఓగిరికాదేవీ, ఇచ్చటి = ఇక్కడనున్న, ప్రేంకపుఁదేనెవాఁకలు = అశక్యమయిన పూఁదేనెయేఱులను, ఈవెటువలె నీదితమ్మ = నీవేలాగున నీది దాఁటితివమ్మా, తెరువెల్లను బుప్పొడి = మార్గమంతయుఁ బుప్పొడిమయము, నీపదాంబుజం బెటువలెనోర్చెనమ్మ = కమలమువంటి నీపాదమేలాగున సహించెనమ్మ, తరుణీ = ఓచిన్నదానా, తగునమ్మ కడింది చెయ్దముల్ = తగునటమ్మా యిట్టిసాహసపుఁజేష్టలు. అనఁగాఁ గూడవుగదా యనుట.

ఎపుడు నెడబాయని చెలువ యొంటిగావచ్చుటయే కడిందిచెయిదము. ప్రోవకడ్డముగాఁ దేనెవాఁకలున్నవి. అవియో ప్రేంకమైనవి. పుప్పొడియో తెరువంతయు నావరించినవి. కాన నీ రెంటిని దాఁటివచ్చుట సాహసముగాన గిరికను జెలులు తగునమ్మా యని మందలించిరి.

ఉ. ఇచ్చ హితాహితంబు గణియింపనిగోలవు గాన గానకున్
వచ్చితి గాక యయో పథికవర్గము నొంటిఁ జరింప నిచ్చునే
యిచ్చటియన్యపుష్టచయ మిచ్చటిమత్తమధువ్రతవ్రజం
బిచ్చటిపల్లవోత్కరము లిచ్చటిపాంసులపంకజావళుల్. 122

ఇచ్చన్ = మానసమందు, హితాహితంబు గణియింపని = ఇష్టమును ననిష్టమును నెంచుకొనలేని, గోలవుగానన్ = ముద్దరాలవుగనుక, కానకున్ వచ్చితిగాక = వనమునకు వచ్చినావే కాక, అయో = అయ్యయ్యో, ఇచ్చటి యన్యపుష్టచయము = ఈవనమందలి కోకిలసమూహమును అని యర్థము. ధూర్త సమూహమని యర్థాంతరము. అనఁగాఁ దలిదండ్రులకంటె నన్యులైనవారిచేతఁ బోషింపఁబడిన బిడ్డకాయలమట్టు, ఇచ్చటి మత్తమధువ్రతవ్రజంబు = ఈవనమందలి మకరందపాన మత్తమధుకర సమూహము అని యర్థము. మత్తులైన మద్యపాన పరాయణులయొక్క సమూహమని యర్థాంతరము.

ఇచ్చటి పల్లవోత్కరములు=కేవనమందలి చిగురుటాకుల గుంపులును అని యర్థము. విట సమూహము లని యర్థాంతరము. (ని. 'పల్లవో స్త్రీకిసలయే షిడ్గే' అని వి.) ఇచ్చటి పాంసుల పంకజావళులు= ఈవనమందలి పరాగభరిత పద్మపంక్తులని యర్థము. పాంసుల=జారులయొక్కయు, ని. (పాంసులః పుంశ్చలే' అని వి.) పంకజ=పాపసంభవులయొక్కయు, (ని. 'అ స్త్రీ పంకం పుమాన్ పాప్మా' అని అ.) ఆవళులు=సమూహములని యర్థాంతరము. పథికవర్గమున్=వియోగి జనసమూహము నని యర్థము. మార్గస్థులనని యర్థాంతరము. ఒంటిఁ జరింపనిచ్చునే = ఒంటిగా సంచరింప నిచ్చునా-అనఁగా సంచరించిన బ్రతుకనీయదనుట.

బాటసారులకు ధూర్తులవలనను బొనరతులవలనను జారులవలనను బాపాత్ములవలనను సిలుగులు గలుగును గాన నొంటిఁ బోఁజనదని శ్లేషార్థము. వియోగినికిఁ గోయిలలు, తుమ్మెదలు, చిగురులు, తమ్మికొలఁకులు నుద్దీపనహేతువులు గాన నొంటి రాఁజనదని ప్రకృతార్థము.

సీ. ఫలభంగములు సేయు♦చిలుకకు సాంగమై క్రోధరసంబు ము♦క్కునసెయుండుఁ
గాలభేదికి మహా♦కాలమూర్తికి దంటకోయిల♦కెఱమంట ♦ గురియుఁ గంట
మదమరాళికి సదం♦భస్థితి యుడి వోదు ముఖరాగమును గళంబున విసంబు
నలరుఁగొమ్మల తావు♦లార్చి యాసవపూర్తి నెడలించునళికి మేఁ♦నెల్ల మలిన
తే. మట్టియిటకేల వచ్చి తీ♦యధరబింబ, మీతలిరుఁగేలునీభుజా♦మృదుమృణాళి
కలును నీపుష్పకోమలాం♦గములుపూని, గట్టుదొరపట్టి వగుటెల్లఁ♦గంటిమబల.

ఫలభంగములుసేయు చిలుకకున్=ఫలమనఁగా లాభంబును, రసాలాదిఫలంబును, (ని. 'ఫలం జాతఫలే సస్యే హేతూత్థే వ్యుష్టి లాభయోః' అని మే.) లాభవైకల్యములను జేయు చిలుకకని యర్థము. రసాలాది ఫలభంగంబులును జేయు నని భావము. సాంగమయి క్రోధరసంబు ముక్కునసె యుండున్=సంపూర్ణమయిన కోపము ముక్కునసె యుండునని యర్థము, ఇక్కడ లోకోక్తి నను సంధించి క్రోధరసంబు ముక్కునసె యుండునని చెప్పినాఁడు, చంచుగతారుణిమను నిగీర్ణముచేసి సాంగ క్రోధరసరూపముచేత నధ్యవసించినాఁడు, క్రోధరసమునకు ఫలభంగమును భావమని తెలియ వలయును.

కాలభేదికిన్=ఇక్కడఁ గాలశబ్దము మృత్యుభేదియైనదియు, మహాకాలమూర్తికిన్=మహాకాలుఁ డనఁగా రుద్రుఁడుగనుక రుద్రమూర్తియైనదియునగు, దంటకోయిలకున్ = ప్రౌఢకోకిలమునకని యర్థము. వసంతకాలభేదియును మహానీలమూర్తియును అని భావము. (ని. 'కాలో మృత్యౌమహాకాలే సమరే యమ కృష్ణయోః' అని వి.) ఎఱమంటగురియుఁగంటన్ = కంటియం దెఱ్ఱనైన వహ్నిజ్వాలను వర్షించుచుండునని యర్థము. ఇక్కడఁ గోకిలయొక్క నేత్రారుణకాంతిని నిగీర్ణముచేసి వహ్నిజ్వాలా రూపముచేత నధ్యవసించినాఁడు.

మదమరాళికిన్ = మదించినయాఁడుహంసకు, సదంభస్థితి = కపటయుక్తమయినయునికి, ఉడివోదు=మానదు. ఇదియునుంగాక, ముఖరాగమును గళంబున విసంబు=ముఖమందుఁ గోపప్రయుక్తారుణిమయును గంతమందుఁ బరుషవాక్యరూపమయినవిషమును, ఇక్కడఁ బరుషవాక్యమును విషరూపము చేత నధ్యవసించినాఁడు. విసమనునది విషశబ్దతద్భవము, అనఁగా పెంగ మెట్టచేసికొని విషము గ్రక్క

చుండుననుట. హంసలకు శ్రేష్ఠమయినయట్టి స్వలయందలి యనఁగా జలములయందలి యాసక్తియును ముక్కులయందు రక్తిమయును కంఠమందు విశదత్వము గలవని భావము. వబల కభేదమని యున్నది గనుక బిసము విసమని చెప్పినాఁడు. విసమనఁగా దామరతూఁడు, (చి. 'మృణాళం బిస మబ్జాది కదంబే' అని అ.)

అలరుఁగొమ్మలతావులార్చి యాసవప్రాప్తి నెడలించుచుండ్లికిన్=కొమ్మలనఁగా స్త్రీలును శాఖలును, తావులనఁగా నివాసములును బరిమళములును, ఆసవప్రాప్తి యనఁగా ప్రాణసంబంధిప్రాప్తియును మకరంద పూర్ణత్వమును, అలరుఁగొమ్మల = సంతోషించుచున్న స్త్రీలయొక్క, తావులార్చి = ఇండ్లను గూల్చి, ఆసవప్రాప్తి నెడలించు = ప్రాణప్రాప్తిని వదలించుచున్న, అళికిన్ = తుమ్మెదకు, మేన్వెల్లమలినము = శరీరమంతయు నపవిత్రమని యర్థము. పుష్పశాఖలయొక్క పరిమళములను బోఁగొట్టి మకరందప్రాప్తత్వ మును దొలఁగఁజేయుచున్న దనియును భావము.

అట్టి=అనఁగా నట్టిశుక పిక హంసికా మధుపము లుండునట్టి, ఇటువనన్=ఈవనమునకు, ఈయధర బింబము = దొండపండువంటి యీమోవియును, ఈలలితఁగేలును = చిగురువంటి యీహస్తంబును, ఈభుజా మృదుమృణాళికలును=మృదుమృణాళికలవంటి యీభుజములును, కోమలపుష్పకోమలాంగములు = పుష్పములవలెఁ గోమలములయిన యీయవయవములును, పూని = ధరించి యని క్రమాలంకారము, ఏలవచ్చితివి=ఎందుకువచ్చితివి, అబల = ముగ్ధవైన యోగినికాదేని, గట్టుదొరపట్టివకాల్లఁ గంటిమి =, నీవు శైలరాజపుత్రివైన లక్షణమంతయుఁ దెలిసికొంటిమి.

అనఁగాఁ గొండకు జన్మించినదానవు గనుక నింత గట్టి గుండె గలదానవైనా వనిభావము. తలిరుఁగేలు అన్నచోట, 'స్తనాదౌ ద్విత్వవిశిష్టాజాతిః' అనెడు వామనవచనమువలనఁ గేలుశబ్దమునకు ద్విత్వమే చెప్పవలయునని శంకింపఁగూడదు. ఎందువల్లననిన నిది నిత్యైకవచనాంతశబ్దము. దీనికిం బ్రమాణము. ('బహుత్వం క్వచిదేకత్వం బహుత్వం ప్రత్యయేక్వచిత్' అని యథర్వణోక్తి.)

మొదటిపాదము అతిశయోక్త్యను ప్రాణితలోకోక్తియనియుఁ గడమమూఁడుపాదములు అతిశయోక్త్యలంకారమునని యెఱుఁగునది.

చిలుకలు ఫలభంగము చేయునవి; నీపెదవి దొండపండని గంటుపెట్టునవియే. కోయిలలు కాలభేదులు; నీకేలుచివురని తినునవియే. మరాళిపదంధస్థితిగలది, నీభుజములు తమ్మితూండ్లని మెసవునదె. అళికొమ్మల తావులార్చునది; నీకోమలాంగముల గుట్టునదియే. ఇట్టియెడకు నొంటిగారానగునా? మఱచితిమి, నీవుగట్టుబిడ్డవుగాన నింతకుఁ దెగించితివని గిరికతోఁ జెలులు భాషించిరి.

మ. గురువిద్వేషికి విప్రయోగిహరణక్రూరుండు మారుండు దాఁ
బరమాప్తుండు తదీయభృత్యులు దలంపం గాంచన స్తేయత
త్పరగంధానిలము ల్మహామధుపము ల్దన్మైత్రిఁ గాంచెం బిక
స్వరముం బంచమశబ్దమిందుకు సుహృద్వర్గాలంబు రాఁ జెల్లునే. 124

గురువిద్వేషికిన్=గురుతల్పగుఁడయిన చంద్రునకు, విప్రయోగి = విప్రుఁడైన యోగియొక్క-- అనఁగా బ్రాహ్మణజాతియైన వానియొక్క, హరణ = సంహారణముచేత, క్రూరుండు = కఠినుఁడైన, మారుండు=మన్మథుఁడు, తాఁ బరమాప్తుండు = తాను ముఖ్యస్నేహితుఁడు అని యర్థము, విప్రయోగ

మనఁగా విరహముగాన నడిగలవాఁడు విప్రయోగి. తదీయహరణమందుఁ గ్రూరుఁడైనవాఁడనిభావము. తదీయభృత్యులు దలంపక = అమన్మథుని కొలువుఁడుగాం(డ్రను విచారింపఁగా, కాంచనస్తేయ తత్పర గంధానిలములు=స్వర్ణస్తేయమం దాసక్తిగల మలయమారుతములును, మహామధుపములు=అత్యంత సురాపానతత్పరములయిన తుమ్మెదలును అని యర్థము. కాంచనమనఁగా సంపంగియును గనుక మలయమారుతములు సంపంగిపువ్వులను రాల్చుచున్నవనియును దుమ్మెదలు తేనెలు గ్రోలుచున్న వనియును భావము. (ని. 'మధు మద్యే పుష్పరసే క్షౌద్రే' అని అ.) పికస్వరముక్ = కోకిల స్వరమును, తత్సత్రిక్ = ఆపంచమహాపాతకి సంయోగముచేత, పంచమశబ్దము = అయిదవదియైన మహాపాతకిశబ్దమును, కాంచెక్ = పొందెను అని యర్థము.

శ్లో. 'బ్రహ్మహా చ సురాపశ్చ స్తేయాచ గురుతల్పగః
మహాపాతకిన శ్చైతే తత్సంయోగీచ పఞ్చమః'

పికస్వర మీచెప్పిన నాల్గింటికి నయిదవదాయెనని భావము. పంచమస్వర రూఢిని గాంచెనని యఁనుభావము. (ని. 'పికకూజతిపఞ్చమమ్' అని అ.) ఇందుకు-అనఁగా నీపంచమహాపాతకు లున్న చోటికి సద్భృగ్జాలంబు రాఁజెల్లునే=వివేకి జనము రాఁజెల్లునా యని యర్థము. సు = శ్రేష్ఠములయిన, దృక్ = కన్నులుగల స్త్రీలయొక్క, జాలంబు=సమూహము, రాఁజెల్లునే=రావచ్చునా-అనఁగా స్త్రీజన సమూహమురావచ్చునాయని భావము.

ఇందుకు-

చంద్రుఁడు, మారుఁడు, మలయమారుతము, తుమ్మెదలు, పికము ఇవి పంచమహాపాతకులు, వీరి చెలిమి యుక్తాయుక్త వివేచనగలవారికిఁ (స్త్రీలకు) దగదు. కాననిటకొంటిమై రాఁజెల్లదని భావము.

అలం. శ్లేషమూలక కావ్యలింగము.

చ. అని చెలు లెల్ల దూరి ధవళాంబుజభాజనరాజి నావటిం
చినకుసుమాన్న రాశిపయిఁ ♦ జక్కని చెందొవజోతి నిల్పి య
వ్వనితకుఁ జుట్టు రా బడసి♦వైచి సగంధపలాశవాటిఁ బా
యనియశరీరిబంటులకు ♦ నామితఁ జేసి రనేకభంగులన్. 125

అని = ఈలాగని, చెలులెల్ల దూరి = సఖులందఱును నిందించి, ధవళాంబుజ= తెల్లతామరపువ్వులనెడు, భాజన=పళ్లెరములయొక్క, రాజిక్ =సమూహమందు, ఆవటించిన=వడ్డించిన, కుసుమాన్నరాశిపయిక్ =పువ్వులనెడు నన్నపురాశిమీఁద, చక్కని చెందొవ జోతినిల్పి = చక్కనైన యెఱ్ఱకలువపువ్వనెడు జ్యోతి నునిచి, అవ్వనితకుక్ =ఆగిరికాదేవికి, చుట్టురాక్ = చుట్టుతిరిగి వచ్చునట్లులుగా, బడసివైచి = దిగఁదుడిచివైచి, సగంధ పలాశవాటిఁబాయని యశరీరిబంటులకుక్ = అనఁగా సౌరభయుక్త వృక్షవాటిఁ బాయని శుక పికాది మన్మథభృత్యు లనెడు గర్వయుక్తమాంసాశివీథి నెడఁ బాయని బేతాళభృత్యులకు అనఁగాఁ బిశాచములకు, (ని. 'పలాశీ వృక్ష రక్షసోః' అని వి.) అనేకభంగులక్ = బహువిధములుగా, ఆమితఁ జేసిరి = ఆహారము నొసర్చిరి.

పిశాచాదులావేశించినవారికిఁ దెల్లనిపాత్రలో నన్నముంచి నడుమ దివ్వెబెట్టి దిగదుడుచుటయుం బావలబాయాహారము దూరముగ భూతములకుఁ బాఱవైచుటయుం నాచారము. అట్టులె చెలులు గిరికకు

మనఁగా పసపుఁగిపువ్వు, విడిచిపెట్టఁబడిన సంపఁగిపువ్వుగలదైన, మాధుకరకులంబు = భృంగసముదాయ మని భావము.

వర్ణిత్వమునన్ = బ్రహ్మచారిత్వముచేత, (ని. 'వర్ణీ స్యా ల్లేఖకే చిత్రకారేపి బ్రహ్మచారిణి' అని వి.) వృథావాప్తి = వృథమగునట్టులుగా, సయమముఁలై = జోడుగూడినవై, శారిఁ జేరో్కను = రామ రామ యని పలుకుచుండెడు, శుకసంతతులును, చిలుకగుంపులని భావము. ఈయర్థమందు, (ప్రశస్తావర్ణా వారి శారుణావేషాం స్తఇతివర్ణినః') అని మతుబర్థమందు ఇని ప్రత్యయము. (శ్లో. 'భూమనిందా ప్రశంసాసు నిత్యయోగేతిశాయినే, సంబంధేస్తి వివక్షాయాం భవంతిమతుబాదయః' అని వచనము.) కన్ను పెంచిన వారిఁ గలయక = కన్నవారిని పెంచినవారిని - అనఁగాఁ దల్లిదండ్రులు మొదలైనవారిలోఁ గలసి యుండక, మాధవార్పితసూక్తిపను = వాసుదేవునియందుసమర్పింపఁబడిన సద్భాషణములచేత జీవించు చున్న, వనప్రియచయంబు = వనవాసప్రియసమూహములును, అనఁగా వానప్రస్థులును అని యర్థము. కన్నకోయిలలను పెంచినకాకులను గలయక, మాధవార్పితసూక్తి ననఁగా వసంతర్తువునందు వినియోగ పఱుపఁబడిన మధురవాక్కులచేత మనుచున్నకోకిలసమూహ మని భావము. (వి. 'మాధవస్తు వసంతే స్యా ద్వైశాఖే గరుడధ్వజే' అని వి.) ('వనప్రియః పరభృతః కోకిలః పిక ఇత్య పి' అని. అ.)

పద్మాసనాభ్యాస పారవశ్యమునన్ = యోగవిహితమయిన పద్మాసనముయొక్క యభ్యాస పరవశత్వము చేత, బ్రహ్మాధీనగతులైన=బ్రహ్మాధీనములైన చిత్తవృత్తులుగలిగిన, హంసతతులు=యోగులును అని యర్థము. పద్మముల యందుఁ గూర్చుండెడు నభ్యాసమువలని పరవశత్వముచేత బ్రహ్మాధీనమయిన గమనములు గలవైన, అనఁగా బ్రహ్మకు వాహనములయిన రాయంచలనిభావము. పుష్పఫలపత్ర జలమాత్రములన్ = పుష్పములు పండ్లు చిగురుటాకులు ఉదకము, ఇంతమాత్రపు స్వల్పాహారముచేత, ఇక్కడఁ గ్రమాలంకారము. శరీరయాత్రగడపుచున్ = శరీరవర్తనమును జరిగించుచు, సన్మార్గ మధిగమించి = సద్వృత్తిని బొంది యనియర్థము. ఆకాశము నవలంబించి యని భావము. ఎనఁగు= ఒప్పుచుండునట్టి, ఇవియెల్లన్ = ఈచెప్పఁబడినవి యన్నియును, నీకేల యెగ్గొనర్చున్ =నీకెందుకుఁ గిట్టమి సేయును. కాఁబట్టి, వనిత = ఓగిరికాదేవీ, ఆవంత = అవిచారము, ఆవంత = అవగింజంతయయినను, వలవదమ్మ = అక్కఱలేదమ్మా-అనఁగా మన్మథ భృత్యులగు తుమ్మెదలు చిలుకలు కోకిలలు హంసలు నీచెప్పఁబడిన సన్మార్గావలంబకు లనుట.

తుమ్మెదలు భిక్షుకత్వ మవలంబించి తావిమాత్రముచేతను, చిలుకలు బ్రహ్మచర్యమునూని ఫల మాత్రమునను, కోయిలలు వానప్రస్థమునుండి పత్రమాత్రమునను, హంసములు యతిత్వము నొంది జలమాత్రముచేతను దృప్తినొందుచున్నవి కాన నివి సన్మార్గము నొందినవి. ఇవి నీకు ఆవగింజంతయేని యెగ్గుచేయఁజాలవు. కాన వీనివలనిభయము మానఁదగినది. అలం. కావ్యలింగము. రత్నావళియు.

ఉ. సారసమై రవంబులకుఁ • జంద్రదినేంద్రవిరోధ మంచకుం
బారము లేనిమందగతి•భారము దెమ్మరకున్ ఫణిగ్రహ
క్రూరవిఘాత మంగజున•కుం గడ తేరనిభీమపీక్షణాం
గారకవైర మింత తలఁ•కం బని లేదు మనోజుఘాటికిన్, 129

సారస కైరవంబులకున్ = పద్మములకును కలువలకును, చంద్రదినేంద్ర విరోధము=చంద్ర సూర్యులయొక్క ప్రాతికూల్యము-అనఁగా పద్మములకుఁ జంద్రుఁడును కలువలకు సూర్యుఁడును వైరులని యర్థము. పద్మములు రాత్రియందు ముకుళించుచున్నవనియును కలువలు దివాభాగమందు ముకుళించుచున్నవనియును భావము. హంసకున్=హంసకు, భారము లేని మందగతిభారము = ఎన్నటికిని గడముట్టని శనిగ్రహగతియొక్క భారము-అనఁగా హంసకు శని చాలఁడని యర్థము. ఎప్పటికిని మందయానముయొక్క యతిశయము గలదని భావము. తెమ్మెరకున్=మలయమారుతమునకు, ఫణిగ్రహక్రూరవిఘాతము=రాహుగ్రహముయొక్క కఠినమైన విరోధము-అనఁగా మలయమారుతమునకు రాహువు చాలఁడని యర్థము. వాయువు సర్పములచేత భక్షింపఁబడుచున్నదని భావము. అంగజునకున్=మన్మథునకు, కడలేని = అంతముచిక్కని, భీమనేత్ర = ఉగ్రదృష్టిగలిగిన, అంగారక వైరము=అంగారకవిరోధము-అనఁగా మన్మథున కంగారకుఁడు చాలఁడని యర్థము భీమనేత్రము హరునియందును వర్తించుచున్నది గనుక హరనేత్రానల భస్మీకృతుఁడని భావము. కాఁబట్టి, వనిత= గిరికాదేవి, మనోజుఘాటికిన్=మన్మథునియొక్క దాడికి, తలఁకంబనిలేదు=భయపడ నక్కఱలేదు-అనఁగా గ్రహచారబలము చాలకయున్న మన్మథునివలనను నతని పరివారమువలనను నీకు భయము లేదని తాత్పర్యము.

మన్మథుని బలగమంతయుఁ గడలేని యాపదలలో మునిఁగియున్నది. పద్మములకుఁ జంద్రుఁడు కలువలకు దినకరుఁడు వైరులు. అంచలు నడువఁ జేతగానివి. తెమ్మెరకుఁ బామువలనిభయము. ఇది కాక మన్మథుఁడు శివునికంటి చిచ్చునకు బూదియైనవాఁడు గాన భయమున కెడమే లేదు. అలం. విరోధాభాసము.

ఉ. నమ్మిక మీఱ నెత్తు వదనమ్మున నింక నెమ్మది కోర్కి నెమ్మితో
నిమ్మని యేము నీదయకు నిమ్మని కమ్మనివింటిజోదుపా
దమ్ములు మెట్ట కెంపువిరిదమ్ములు చేర్చి భజింతు మమ్మరో
రమ్మని బోటి కోమలికరమ్మనివార్యగతిం దెమల్పఁగన్. 120

నమ్మికమీఱన్=నమ్మక మతిశయ మగునట్లుగా, ఎత్తువదనమ్ము = వంచిన ముఖమెత్తుము, ఇఁకన్=ఇఁకమీఁద, నెమ్మదికోర్కిన్ = మనస్సునఁ గలవాంఛితమును-అనఁగా వసురాజు పరిగ్రహమును, నెమ్మితో నిమ్మని=ప్రేమతోడఁ గలుగఁ జేయుమనియును, ఏము నీదయకు నిమ్మని=మేము నీకృపకు స్థానమనియును-అనఁగా నీకృపకుఁ బాత్రులమనియును, కమ్మనివింటి జోదుపాదమ్ములు=మన్మథుని చరణములు, మెట్టకెంపువిరిదమ్ములు చేర్చి=మెట్ట కెందామరపువ్వులర్పించి, భజింతుము = సేవించుచున్నాము, అమ్మరో రమ్మని=ఓతల్లి రావేయని, బోటి=చెలికత్తియయైన మంజువాణి, కోమలి = గిరికా దేవియొక్క, కరమ్ము=హస్తమును, అనివార్యగతిన్=విడిపించుకొనఁ గూడనట్లుగా, తెమల్పఁగన్ = పట్టితీయఁగా, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

విరిదమ్ము లన్నచోటఁ గర్మధారయ సమాసమగుటను వర్గతృతీయ వర్ణమును జెప్పినాఁడు. ఎత్తు వదనమ్ము అనుచో, ('ప్రార్థనార్థే మురేకత్వే కథ్యతే మధ్యమార్థకః, విభాషాశంవదస్త్యేకే నప్రాణేతు కదాచన' అని మువర్ణకమునకు వికల్పత్వము చెప్పఁబడియెఁ గాన నిక్కడ ఎత్తుము అని మువర్ణము గలుగఁ బ్రయోగింపఁడయ్యె.

మన్మథుని పరివారము సన్మార్గసంగతము. ఇంక నాపదలో మునిఁగియున్నదిగాన నీవు మఱఁదు కీడు తలంపఁకు. మేము మన్మథుని పూజించి సుముఖుని గావింతుము. సంశయము మానుమని మధురవాణి గిరికాదేవి హస్తముఁ బట్టుకొనెను. అలం. పర్యాయోక్తము.

క. సోలుచుఁ జెలి కెదు రాడక, తూలుచుఁ గైదండ యొసఁగు • తొయ్యలి మేనన్
వ్రాలుచుఁ జింతాజలనిధిఁ, దేలుచుఁ గైసేయుసఖులఁ • దెగడుచుఁ గంటన్. 131

సోలుచున్ = సొటసొటలాడుచును, చెలికెదురాడక = చెలికత్తియకు నడ్డుమాటచెప్పక, తూలుచున్=తూలిపడుచును, కైదండయొసఁగు తొయ్యలిమేనన్ వ్రాలుచున్ = చేయూఁత యిచ్చుచున్న చెలికత్తెయొక్క దేహముమీఁద నొరఁగుచును, చింతాజలనిధిన్ దేలుచున్ = విచారమనెడు సముద్రమందుఁ దేలియాడుచును, కైసేయుసఖులన్ = అలంకరింపవచ్చునట్టి చెలికత్తియలను, కంటన్=కనుసంజ్ఞచేత, తెగడుచున్ = అదలించుచును. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

ఇందులో సోలుటయును దొయ్యలి మేనవ్రాలుటయును గ్లానియనెడి సంచారి భావమున కనుభావము. 'గ్లానిర్బలస్యాపచయో వైవర్ణ్యారతి కారణమ్' అని లక్షణము. చెలికెదురాడక పోవుట ముగ్ధాలక్షణము. తూలుట యున్మాదానుభావము. శ్లో. 'వినావిచారమాచార ఉన్మాద ఇతి లక్షణమ్' కంటఁదెగడుట యమర్షానుభావము. శ్లో. 'అమర్ష స్స్వపరాధేషు మనః ప్రజ్వలనం మతమ్' అని లక్షణము.

సీ. నిబిడదుస్సహదీర్ఘ • నిశ్వాసపవనంబు, పఱచు తేఁటులఁ బరా • బరులు సేయ
నుజ్జ్వలావయవతా • పజ్వాలికల వేఁడి, చివురుజొంపములపై • నవఘళింప
లలితాననేందుమం • డలపాండురచ్ఛాయ, వనరుహావళివళా • వళి యడంప
శ్రమజలాభివ్యక్త • సహజ సాంకవమహా, మోదంబు చిలుకల • మూల కొత్త
ఆ. నెసఁగుభసలములను • గిసలములను నీర, జాతములను గీర • జాతములను
విగ్రహింపనీని • విరహంబె తోడుగా, వెలఁది వెడలె విపిన • వీథులకును. 132

నిబిడ=దట్టమును, దుస్సహ=సహింప నలవిగానిదియు, దీర్ఘ=పొడవునైన, నిశ్వాసపవనంబు=నిట్టూర్పువాయువు, పఱచుతేఁటులన్=పరుగెత్తి పయికివచ్చెడు దుండగపుఁ దుమ్మెదలను, బరాబరులు సేయన్=పార్శ్వములకుఁ దొలఁగఁ ద్రోయఁగాను, ఉజ్జ్వల=ప్రజ్వరిల్లుచున్న, అవయవతాపజ్వాలికల వేఁడి=అవయవములయందలి విరహతాపాగ్ని జ్వాలలయొక్క వేఁడిమి, చివురుజొంపములపై నవఘళింపన్=చిగురుటాకుల గుత్తులమీఁద వ్యాపింపఁగాను, లలిత=ఒప్పుచున్న, ఆనన=ముఖమనెడు, ఇందుమండల=చంద్రమండలముయొక్క, పాండురచ్ఛాయ=విరహపాండిమయనెడు చంద్రిక, వనరుహావళి=పద్మసమూహముయొక్క, వళావళియడంపన్=అడావడి నడంపఁగాను, శ్రమజల=చెమటనీరువలన, అభివ్యక్త=ప్రకటమయిన, సహజ=స్వభావసిద్ధమయిన, సాంకవమహామోదంబు=సాంకవ మనఁగా జవ్వాదిగనుక జవ్వాదివాసన, చిలుకలమూలకొత్తన్=చిలుకలను బరాభవ మొందింపఁగాను, ఇక్కడ జవ్వాదిపిల్లికిఁ జిలుకలు భయపడుచున్నవని యాశయము. స్త్రీలశరీరమందు సాంకవామోదము గలదనుట ప్రసిద్ధము. ఇందుకుఁ బ్రయోగము.

కనకగంధములెఱుంగనివాని క్లిష్టాప్తి = కనకమనఁగా సువర్ణంబును జంపకంబును, గంధమనఁగా లేశంబును సౌరభంబును, (ని. 'గంధో గంధక ఆమోదే లేశే సంబంధగర్వయోః' అని వి.) సువర్ణలేశము నెఱుఁగనివాని క్లిష్టవస్తుప్రాప్తియును అని యర్థము. చంపక సౌరభములను గుర్తెఱుఁగని తుమ్మెదలకు మకరంద రసప్రాప్తియనిభావము. కాయహీనునకును గరణపటిమ = కరణశబ్దము గాత్రమందును సాధనమందును వర్తించుచున్నది. (ని. 'కరణం సాధకతమక్షేత్ర గాత్రేంద్రియేష్వపి' అని అ.) అశరీరికి గాత్రపటిమయును అని యర్థము, మన్మథునకుఁ బుష్పపల్లవరూప నానాసాధన పటిమయని భావము. పెక్కుకాలపు మూఁగకెక్కుడువాక్ప్రౌఢి = బహుకాలమునుండి మాటలులేక యున్న మూఁగవానికి నతిశయమయిన వాక్ప్రౌఢియును అని యర్థము. పదినెలల పర్యంతమును బలుకుట లేని కోయిలకుఁ గల స్వర మనిభావము. అతి చంచలాత్మున కలఘువృత్తి = అత్యంతచపలస్వభావము గలవానికి స్థైర్యవృత్తియును అని యర్థము. వాయువునకు వేగరహితవృత్తి - అనఁగా మందవృత్తియని భావము. ఇలన్ = భూమియందు, పుట్టుగ్రుడ్డులకున్ = జాత్యంధులకు, హితదర్శన ప్రీతి=హితజనదర్శనమువల్లనైన సంతోషమును అని యర్థము. ఇలఁబుట్టు గ్రుడ్డనఁగా భూమియందు మొదట గ్రుడ్లుగాఁ బుట్టునవి గనుక పక్షులని చెప్పవలయును. శుకపికాది పక్షులకు ఫలపల్లవా ద్యభీష్ట వస్తులాభజనిత ప్రీతి యని భావము.) అగమకోటికిఁ బల్లవాభివృద్ధి=పల్లవమనఁగాఁ బౌదవిలాసము - అనఁగా సంచారమనుట. (ని. 'లవో లేశే విలాసేచ' అని వి.) అగమకోటి యనఁగా గమనశక్తిలేని కుంటివాండ్ర యొక్క సమూహములును వృక్షలతాదులయొక్క సమూహమును, కుంటివాండ్రకు సంచారసమృద్ధి యును అని యర్థము. వృక్షలతాదులకుఁ గిసలయాభివృద్ధి యని భావము.

జడజాతమునకు శాశ్వతబోధసామగ్రి=జడజాతమనఁగా నజ్ఞులయొక్క సమూహమును, జలజాతంబును అనఁగా బద్మంబును, డలల కభేదముగాన జలము జడము అని రెండు రూపములు గలవు. అజ్ఞ జనసమూహమునకు సంతత జ్ఞానసామగ్రియు నని యర్థము. పద్మమునకు సమ్యగుత్పన్నవికాస సంపూర్ణత్వమని భావము. (ని. 'పున స్సదార్థయో శ్శశ్వత్' అని.అ.) కోపనావళికి భావోపశమము= కోపశీలురైనవారికిఁ జిత్తశాంతియని యర్థము. కోపనలనఁగాః గోపముగల స్త్రీలుగనుక వారికిఁ గోపశాంతియని భావము. (ని. 'కోపనా సైవభామినీ' అని అ.) నెఱపు = ఘటనపఱుచుచున్న, నిరుపమ = సమానరహితుఁడయిన, మాధవ = విష్ణుమూర్తియొక్క, నిత్యసన్నిధానమునన్ = ఎడతెగని సాన్నిధ్యముచేత, పొల్చు = ఒప్పుచున్నయని యర్థము. వసంతునియొక్క నిత్యసాన్నిధ్యముచేత నొప్పుచున్న యని భావము. (ని. 'మాధవస్తు వసంతే స్యాద్వైశాఖే గరుడధ్వజే' అని వి.) భవదీయతాత=నీతండ్రియైన కోలాహలునియొక్క, పాదసన్నిహిత = చరణసన్నిహితులైన, సద్గుణారామ - సద్గుణ = మంచి గుణములచేత, ఆరామ = అంతట మనోహరు లైనవారియొక్క, సరణియిదె = మార్గమిదే సుమా యని యర్థము. కోలాహలాద్రియొక్క ప్రత్యంతపర్వత సన్నిహితమును సద్గుణసంపన్నమయిన యారామసరణియు నిదేసుమా యని భావము. లతాంగి=ఓగిరికాదేవీ, ఇచటి శోభాతిశయము = ఇక్కడనుండెడు వైలక్షణ్యాతిశయమును, కనుఁగొనుము = చూడుము.

ఈప్రదేశము మాధవసాన్నిధ్యమునఁ బొల్చు నీతండ్రిచెంతనుండు మత్తమోత్తముల కునికిపట్టు. ఈమాధవుఁడు సామాన్యుఁడు కాఁడు. దరిద్రులకుసువర్ణప్రాప్తి, దేహవిహీనునకు గాత్రపటిమ, మూఁగలకు

మాటలాడునేరుపు, చంచలులకు స్థిరభావము, స్త్రీలకు పురుషశక్తి, కుంటివారికి పాదవిలాసము, మందమతులకు జ్ఞానము, కోపకీలురకు కోర్కె ప్రసాదించును. శుష్కలప్రభావము కంటకవేసుని భావము. తుమ్మెదలు మకరందపానము చేయుచున్నవి. మన్మథుఁడు జీటపవయనవసంపన్నుఁడై యున్నాఁడు. కోయిలలు గూయుచున్నవి. మారుతము మందమందముగా వీచుచున్నది. చెట్లు చివురులతో నలరుచున్నవి. వసంతసౌభాగ్యము చూచితివాయని యర్థాంతరము. అలం. శబ్దశక్తిమూలధ్వని.

చ. పరిమిళితప్రవాళనవపట్టపటధ్వజచూతనూతన
స్మరరథరాజముల్ భ్రమరజాలగుణాంచితపాంసుచక్రము
ల్గెరల మహాబలంబు దరలింప లతావనితాళి యుర్వ్వలే
మరువపుబంతులట్లు శుకమండలి యాడెడిఁ గంటె పైపయిన్. 135

ఈపద్యమునందుఁ జాతవర్ణనమునందు రథోత్సవము సంపాదించి చెప్పుచున్నాఁడు.

పరిమిళిత = కూడుకోఁబడిన, ప్రవాళ = అరుణపల్లవములనెడు, నవపట్ట పటధ్వజ=నూతనమైన పట్టువస్త్రపు టెక్కెములుగల, చూత=మామిడిచెట్లనెడు, నూతన = క్రొత్తదైన, స్మరరథరాజముల్ = మన్మథ దేవతయొక్క రథశ్రేష్ఠములు, భ్రమరజాల = తుమ్మెదబారులనెడు, గుణ = మోకుత్రాళ్లచేత, అంచిత = ఒప్పుచున్న, పాంసుచక్రములు = సుస్పష్టముగాఁ దిరుగుచుండెడు పుష్పపరాగపటలములనెడు రథచక్రములు, కెరలన్ = దొర్లుచుండఁగా, మహాబలంబు దరలింపన్-మహాబలంబు = వాయువనెడు జాతరకువచ్చిన ప్రజలు, తరలింపన్ = తరలింపఁగాను, లతావనితాళియుర్వ్వ-తీఁగలనెడు స్త్రీసమూహము మీఁద ఉర్వ్వచున్న, లేమరువపు బంతులట్లు = లేఁతమరువముచేతఁ గట్టఁబడిన బంతులో యన్నట్టుగా, పైపయిన్=మీఁదమీఁద, శుకమండలి యాడెడిఁగంటె = చిలుకలగుంపు దిరుగుచున్నది చూచితివా. చివురుటాకులతో మావిచెట్లరిపట్టువలువటెక్కెముగాఁగల క్రొత్తరథములై నుండెననియుఁ, దుమ్మెదలబారు రథములాగు పగ్గములవలెను, సుళ్లుగా రాలుపుష్పరజములు రథచక్రముల రీతిగను, గాలి రథయానము నమకూర్చుచుండ లతలపైనుండి లేచి మావిపైవ్రాలు చిలుకలగుంపులు రథోత్సవసమయమున రథముపైనుండు మరువపుబంతులవలెనుండెనని భావము. అనఁగా దీయమావులు చివిరింప నందుఁ దుమ్మెదలువ్రాలుచున్నవనియు, బరాగము రాలుచున్నదనియు, గాలివీచుటచేఁ జెట్లు కదలుచున్నవనియుఁ జిలుకలు లతాదికములవీడి రసాలముపై కేగుచున్నవనియుఁ ఫలితార్థము. అలం. ఉత్ప్రేక్ష.

చ. మరునకుఁ జైత్రమంత్రి వనమండలరాజ్యఫలైకకాంచనో
త్కరము కరం బొసంగుటయుఁ దావుల బచ్చులు చేరి తచ్ఛదా
వరణముఁ బాయ విప్పి పరువంబుగ నెన్నిక కెక్కఁ జేయుచున్
దొరయఁగనీవు గంటె చెలి ధూర్తవతంసమలీమసాళులన్. 136

మరునకున్=మన్మథుఁడనెడు రాజునకు, చైత్రమంత్రి = వసంతుఁడనెడు మంత్రి, వనమండల రాజ్యఫలైక కాంచనోత్కరము = వనమండలమనెడు రాజ్యమనియైనను, వనమనెడుమండలరాజ్యమనియయినం జెప్పవచ్చును. వనమండలరాజ్య = వనమండలరాజ్యముయొక్క, ఫలైక = ఫలములలో ముఖ్యఫలమయిన, (వి. ఏకేముఖ్యాన్య కేవలాః' అని అ.) కాంచనోత్కరము=సంపఁగిమొగ్గగుంపనెడు సువర్ణస్తోమమును, కరంబొసంగుటయున్ = అప్పనమీయఁగా, (వి. 'భాగధేయః కరో బలిః' అని అ.) దావులబచ్చులుచేరి = దావులనఁగా వాసనలును స్థానములును, బచ్చులనఁగా [illegible]

సరాబులును, తావులబచ్చులనఁగా వాసనల నాణెము తెలిసిన వాయువులనెడు నాస్థానమందుండెడు సరాబులును, చేరి = వచ్చినవారై, తత్ = ఆసంపఁగులయొక్క, ఛదావరణము = పత్త్రావరణ మనెడు వస్త్రావరణమును, పాయవిప్పి = తొలఁగఁదీసి-యనఁగా ముళ్లలువిప్పి యనుట. పరువంబుగ నెన్నిక కెక్కఁజేయుచుఁ = అనఁగా వాయువులను పట్టునఁ బరువము కలుగునట్లుగా సుతికెక్కఁ జేయుచు ననియును, బచ్చులపట్టున నుత్సుక మగునట్టులుగా లెక్కపెట్టుచుననియును నర్థము. ధూర్తమనఁగా నుమ్మెత్తపువ్వు, (ని. 'ఉన్మత్తః కితవో ధూర్తో ధుత్తూరః కనకాహ్వయః' అని అ.) ధూర్తవతంస = ఉమ్మెత్తపువ్వులయొక్క యగ్రములయందుండునట్టి, మలీమస = మలినములయిన, అళులఁ=తుమ్మెదల నని యర్థము. ధూర్తాగ్రేసరులయిన మలినజనులను, అనఁగాఁ జోరులని యర్థాంతరము. దొరయఁగ నీవు=చేరనిచ్చువవిగావు, చెలి=ఓగిరికాదేవి, కంటె=చూచితివా.

బచ్చనెడు పదమునకుఁ బ్రయోగము. తే. 'వసుధఁ జెల్లింపఁ దరమె యెవ్వారికైన, మెచ్చు వాఁ డౌరవలరాచబచ్చువాఁడు, అనియున్నది. (దొరయఁగనీవు అనుచోట దొరయఁగనీరు అని పాఠముఁజేసిన బచ్చులను కర్తృపదమునకు మహదర్థక క్రియతో సంబంధము బాగుగ నుండును.)

మన్మథరాజునకు వసంతసచివుఁడు కాంచనముఁరాశి కట్నమొసంగెను. అనఁగా వికసితములగు సంపంగి పూవులను వసంతుఁడు మన్మథప్రీతికరముగా వికసింపఁ జేసెను. కాంచనము రాశి బాగోగులు పరిశీలించువారు బచ్చులు. వారాపరిశీలనముచేయుతఱి దుష్టులను జేరనీయక పోవుట సాజమెకదా! అనఁగా నాసంపఁగి పూవులతావు లరయునవి మారుతములు, సంపంగిపూవులపై మలయుగాడ్పులు తుమ్మెదల దరిచేరనీయమి సహజముగదా యని భావము. అలం. సమాసోక్తి.

సంపంగి పూవును దుమ్మెద మూర్కొన దనుటకు.

శ్లో. చరస్వనాంతే నవమంజరీషు నషట్పదీగంధ ఫలీమజిఘ్రత్,
సాకిన్నరమ్యా స చకిన్నరంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా.

చ. రతిపతిధర్మకర్త ఋతుఁరాజబలావళి నొంచి యేఁగుదు
ర్మతుల మథించి కైకొనినఁమానధనంబుల ముద్ర వెట్టుచోఁ
బ్రతినవదీపికాశిఖఁ గఁరంగెడులక్కయుఁ బోలె వంజుల
స్థితమయి తేఁటి వెగ్గలపుఁదేనియ గ్రాయుటఁ గంటివే చెలీ. 137

రతిపతిధర్మకర్త = మన్మథునియొక్క ధర్మస్థాపకుఁ డైన, ఋతురాజు = వసంతుఁడు అని యర్థము. వసంతుఁడు మన్మథునికి విల్లయిన పువ్వులకుఁ గర్తయని భావము. లేక మన్మథధర్మమైన రాగమును బోషించువాఁడని యయినను భావము. ఈయర్థమందు రతిపతియనెడు మన్మథనామము అనురాగపర్యాయమైన రతికిఁ బతియని యర్థాంతర క్రోడీకారముచేత నుపయుక్త మగుచున్నది. (ని. 'రతిస్స్మరప్రియాయాంచ రాగేపి సురతేపిచ' అని వి.) అబలావళినొంచి యేఁగుదుర్మతుల మథించి= స్త్రీజనమును విరహావ్యథ పాలుచేసి యెడఁబాసిపోవుచున్న పాంథులను మర్దించి, కైకొనిన మానధనంబులఁ=పుచ్చుకొన్న మానమనెడి ధనములను, అనఁగా వారి ప్రణయకోపము లనెడు ధనములను, ముద్రవెట్టుచోఁ = ముళ్లలుగట్టి సికాముద్ర చేసెడు సమయమందు, అబలాశబ్దము దౌర్బల్యాభిప్రాయ గర్భమనియును దుర్మతి శబ్దము దౌర్జన్యాభిప్రాయగర్భమనియును గ్రహింపవలయును. ప్రతి [illegible] గరంగెడులక్కయుఁ బోలెఁ = ప్రతిదీపపుఁగొడిమీఁదను గరఁగినదియుఁ గరఁగినదై

యించుకంత జాడచున్నదియునగు [illegible], పంజులను — [illegible]. [illegible]. (పి. 'పంజులోన్నెర్రే' అని క.) పంజుల్ప్రేలను [illegible] ప్రఫుల్లములు [illegible], [illegible]=తుమ్మెద, వెగ్గలపుఁ దేనియగ్రోయుటన్=వెక్కసమైన లేత తేనెలఁ గ్రక్కుచు, [illegible]=[illegible], [illegible] తివా, ఇక్కడ దిసళిఖక్కిని [illegible] ప్రఫుల్లములగు [illegible] [illegible] జాడచున్న ఆక్కడ సమునకు దుమ్మెద తేనెలఁ గ్రక్కుచున్న [illegible] [illegible]. [illegible].

మన్మథుఁడు [illegible], స్త్రీప్రపంచమున [illegible]. అతని [illegible] [illegible] వాఁడు ఋతురాజు. కావునే రాజపత్రాను[illegible] [illegible] [illegible]. [illegible] (చెలువలను, దుర్బలులను) [illegible] [illegible] ([illegible] [illegible]). వారి [illegible] ధనము హరించి బొక్కసమునఁ జేర్చి పైఋతురాజు [illegible] మంత్రి [illegible] [illegible] [illegible] బూచిన యెఱ్ఱయశోకమునుండి [illegible] భావము. [illegible] [illegible] వానిపైఁదుమ్మెదలు చేరియుండెనవియు నివి ప్రణయ[illegible] [illegible] [illegible] [illegible] బ్రోషితభర్తృకలకు విచారకరముగను నుండెనని భావము.

ఉ. తుమ్మెదదిమ్మరీఁడు పయిఁదోఁచుపిశంగిమఁబద్మినీనిశాం
కమ్మది తాఁ బరాగపటిఁ గప్పి మధువ్రతిఁ జేరఁ బోవుచుక్
నమ్మిక కంగజప్రహారణమ్ముల ముట్టెడుఁ జూడవమ్మ ప
ల్లొమ్మలఁ జెందువారలు తగు ల్విరియాటలు నేరకుందురే. 133

తుమ్మెదదిమ్మరీఁడు=దిమ్మరీఁ డనఁగా మిక్కిలి సంచరించువాఁ డని యర్థము. ఇక్కడఁ దుమ్మెద యనెడు ననేక స్త్రీ విహారముగలవాఁడు, పయిఁదోఁచు పిశంగిమ = పైని గనపించునట్టి పసుపువన్నె మనెడు, పద్మినీనిశాంకమ్ము=పద్మినియనఁగాఁ బద్మలతయును స్త్రీవిశేషంబును, నిశాంకమనఁగా రాత్రి ప్రాప్తమయిన చిహ్నమని యుభయత్ర చెప్పవలయును. పద్మలతాపక్షమందుఁ దుమ్మెదలు రాత్రి పద్మములయందుఁ జిక్కుపడుచున్నవి గనుక నిశాప్రాప్తమయిన పద్మపరాగాంక మని విచారింపవలయును. స్త్రీపరమయిన యర్థమందుఁ బరపురుషునికి రాత్రిసంభోగము గలుగుచున్నది గనుక నిశాప్రాప్తమయిన చిహ్నమని విచారింపవలయును. ఇక్కడ నిశాశబ్దము హరిద్రా వాచకంబును గనుక నిశాంక మనఁగా హరిద్రాసదృశాంకమును అని యుభయత్ర చెప్పవలయును. రాత్రి పేళ్లన్నియుఁ బసపునకుఁ జెల్లును. అది=ఆపద్మినీనిశాంకమును, తాన్ = తాను, పరాగపటిఁగప్పి = తెల్లని పుప్పొడియనెడు వస్త్రముచేతఁ గప్పి, మధువ్రతిఁ జేరఁబోవుచున్ = మధువ్రతి యనఁగా వాఁడు తుమ్మెద గనుక, మధువ్రతియనెడు నాయికను గలయఁ బోవుచును, నమ్మికకున్=ఆనాయికకు నమ్మికపుట్టెడుకొఱకు, అంగజప్రహారణమ్ముల ముట్టెడున్=మన్మథునియొక్క యాయుధములను ముట్టి బాసచేయుచున్నది యని యర్థము. మన్మథాయుధములు పుష్పములుగనుకఁ బుష్పముల నంటుచున్నదని భావము. చూడ వమ్మ=వీక్షింపవమ్మ, అయిన నిది వింత గాదు. ఏమనిన, పల్లొమ్మలఁ జెందువారలు = అనేక స్త్రీలను బొందువారని విటపరమయిన యర్థము. అనేక తరుశాఖలను బొందువారని భృంగపరమయిన యర్థము. తగు ల్విరియాటలు నేరకుందురే = తగులును విరియాటలు అని పదవిభాగము. తగులన్నది యుభయత్ర సాధారణపదము. విరియాట లన్నది శ్లిష్టపదము. విరియాటలనఁగా స్వేచ్ఛావిహారములని విట

పరమయిన యర్థము. పుష్పక్రీడయని భృంగపరమయిన యర్థము. అనఁగా బహుస్త్రీలతోఁ బొందు పట్టి పిటులు తగులాటమును స్వేచ్ఛావిహారములును నేరకుందురా యనియును ననేక తరుశాఖలను బొందెడు భృంగమును తగులాటమును బుష్పక్రీడలును నేరకుండునా యనియును నర్థము.

తుమ్మెద త్రిమ్మరీఁడు కానసే పద్మినితోఁ రేయిఁగడుపుటచేఁ గలిగిన పచ్చనిచిన్నెలు పుప్పొడి వలువతోఁ గప్పుకొనెను. ఎందుల కింతయాయాస మన మధుప్రతిని గలయఁబోవలయు నని, మధుప్రతి నప్పనపుడు బాసచేయవలయునుగదా! అందులకె మన్మథాయుధములగు పూవుల నంటుచున్నది. అదియె బాసచేయుట. మేలుబుద్ధి గలచెలువలయెడల విరియాటలు సాగును. పద్మపరాగము పసపు రంగుగా నుండును. ఇది పద్మినీ నిశాంకముగ మధుప్రతి యనుమానింపఁ దగియున్నది. సామాన్యపుష్ప రజము తెల్లగానుండుఁగానఁ బుప్పొడివలువతోఁ గప్పెనని భావము.

చ. వెడలు మిళిందబృందములు వీపుపిశంగిని కైతవంబునన్. (మనుచరిత్రము)

అలం. రూపకము. అర్థాంతరన్యాసము.

చ. అనిలకుమారకుండు మరుదధ్వనిరోధిపలాశిమండలీ
ఘనవనరాశిలోఁ బుడమికానుపుపద్మిని చిక్కి స్రుక్కఁగా
నినకరముద్రఁ జూపి వెలయించి తదంబుజరాగపాళిఁ గై
కొనుచుఁ బ్రవాళతేజమునఁ గూరిచెఁ గంటె పలాశవీథులన్. 139

ఈపద్యమునందు అనిలకుమారుఁడని కర్తృపదముచెప్పఁబడుటచే నాంజనేయుని పరముగాను జిఱుగాడ్పుపరముగను నర్థద్వయము కలిగియున్నది.

అనిలకుమారకుండు=పిన్నవాయువని యర్థము. హనుమంతుఁడని యర్థాంతరము. మరుదధ్వనిరోధి=ఖేచరమార్గమునడ్డగించిన, పలాశిమండలి=వృక్షమండలముచేత, ఘన=అధికమగుచున్న, వనరాశిలోన్=ఉద్యానవన సమూహములోనని యర్థము, మరుదధ్వనిరోధి = దేవతామార్గ నిరోధకమయిన, పలాశిమండలీ=రాక్షసమండల మనెడి, ఘనవన రాశిలోన్=అధికమయిన సముద్రములోనని యర్థాంతరము. పుడమికానుపు పద్మినిచిక్కి స్రుక్కఁగాన్=పుడమికానుపైన అనఁగా భూమియందుఁ బుట్టిన పద్మిని యనఁగా మెట్టతామరతీఁగ చిక్కుకొని వాడఁగా నని యర్థము. భూపుత్రియును బద్మినీజాతియు నయిన సీతాదేవి చిక్కుపడి వ్యథపడఁగా నని యర్థాంతరము. ఇనకరముద్రఁ జూపి వెలయించి=సూర్యకిరణ ప్రసారణమును గనుపఱిచి, వికసింపఁజేసి యని యర్థము. పెనిమిటియైన శ్రీరాముని చేతియుంగరము గనుపఱిచి సంతసింపఁజేసి యని యర్థాంతరము. తదంబుజ రాగపాళిఁ గైకొనుచున్=తదీయ కమలరాగపంక్తిని గ్రహించుచు నని యర్థము. ఇక్కడ రాగపదముచేత రాగాశ్రయమయిన పరాగమని చెప్పవలయును. సీతాదేవియొక్క పద్మరాగమణిపాళిని గ్రహించునని యర్థాంతరము. ఇక్కడఁ బాలియనఁగాఁ జిహ్నము అనఁగా నానవాలనుట. ప్రవాళతేజమునఁ గూరిచెఁ గంటె పలాశవీథులన్= వృక్షవాటికలను, ప్రవాళతేజమున గూరిచెఁగంటె = చిగురుటాకులయొక్క కాంతితోడఁ గూర్చెను వీక్షించితివా యని యర్థము. పలాశవీథులన్ = రాక్షసవీథులను, ప్రవాళతేజమునఁ గూరిచె ననఁగాఁ బ్రకృష్టమయిన వాలగతివహ్నితోఁ గూర్చెఁ జూచితివా యని యర్థాంతరము. ('లళయో రభేదః') అని యున్నది గాన వాలము వాళము అని రెండురూపములు గలవు.

శా. అంచల్లీల హరించెఁ గొంచక యయుక్తౌఘక్ష్మాభోగముల్
పంచాస్త్రుం డని యాకు లెత్తఁ గని పైపైఁ గాంచనస్నాన మా
డించెన్ మాధవుఁ డీసదాగతిని గంటే కన్నె పున్నాగ మె
క్కించెం గోకిలకాహళుల్ మొరయ నేగించెన్ వనీవీథులన్. 140

పంచాస్త్రుండు = మన్మథుఁడు, అయుక్తులనఁగాఁ దనతోఁ గలియనివారు - అనఁగా శత్రులనుట. అయుక్తౌఘ = శత్రుసమూహముయొక్క, క్ష్మాభోగములు=భూమిని భుజించుటను, కొంచక = సంకోచింపక, అంచల్లీలన్ = ఒప్పిదమగునట్టులుగా, హరించెన్ = పుచ్చుకొనెను, అయుక్తులనఁగా విరహివిరహిణీజనులు, వారి క్ష్మయనఁగా సహనము, వానియొక్క యాభోగము అనఁగా బరిపూర్ణతలు, వాని హరించినాఁడని భావము. ఆని యాకు లెత్తఁగని = కొలాఁగని పత్రికలెత్తఁగాఁ జూచి అనియర్థము. పర్ణములు లేనట్టులుగా పీఁచుటయని భావము. మాధవుఁడు = విష్ణుదేవుఁడు, ఈ సదాగతిని = ఈశుభాగమనము గలవానిని, కాంచనస్నాన మాడించెన్=కనకస్నాన మాడించెనని యర్థము. ఇక్కడ సదాగతి యనఁగా, సత్=యోగ్యమయిన, ఆగతి = ఆగమనము గలవాఁడు, సదాగతి-అనఁగాఁ బుత్రవిజయ వార్తాహారి గనుక సదాగతియనుట. మాధవుఁడనఁగా వసంతుఁడును సదాగతియనఁగా వాయువును గాంచనమనఁగాఁ జంపకంబును గనుక వసంతుఁడు మలయవాయువును జంపకపుష్పవ్యాప్తము గావించె నని భావము. కన్నె = ఓ కిరికాదేవి, పున్నాగ మెక్కించెన్ = పురుషగజము నెక్కించెను, కంటే = చూచితివా యని యర్థము, కన్నెపున్నాగ మెక్కించెన్ = లేఁతపొన్న చెట్టెక్కించెను చూచితివా యనిభావము. కన్నెపున్నాగమన్నది యిక్కడ సమాసపదము. 'సంస్కృతపదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి' యని స. కోకిల కాహళుల్ మొరయ నేగించెన్ వనీవీథులన్=కోకిలధ్వనులనెడు తుతారాలు మ్రోయఁగా వనవీథు లనెడు వీథులయందు నూరేగించెను, చూచితివా యని సంబంధము. తమ కుమారులు దిగ్విజయమున కేగినపుడు విజయవార్త దెచ్చినవానిని రాజులు మిగుల గౌరవించుట ప్రసిద్ధము. మాధవుఁడు సదాగతునివలనఁ బంచాస్త్రుఁడు విరోధిబృందమును జయించిన వారి సమస్తైశ్వర్యములు లోఁగొనుట పత్రికారూపమునఁ గాంచి స్వర్ణాభిషేకము వాద్యములతోఁ గూడిన గజోత్సవము సదాగతున కొసరించెనని శ్లేషార్థము.

వియోగినుల యోరిమిసంపదనంతయు వసంతమున మన్మథుఁడు లోఁగొని వారికి వలపుఁగూర్చెననియుఁ బండుటాకులు రాలసాగెననియు, సంపంగి పూఁదావులచే మారుతము మనోహరముగ వీచుచున్నదనియు పున్నాగములు కోకిలకూఁతలు మనోహరములుగా నుండెనని ప్రకృతార్థము.

తే. కానఁ గడుమానినై పెద్దకాల ముండి, వాక్యసంసిద్ధి మాధవువలనఁ గన్న
మత్తకోకిలకవివాక్సమాజ మెల్లఁ, బంచమశ్రుతి వింటివే చంచలాక్షి. 141

కానన్ = అరణ్యమందు, కడుమానినై పెద్దకాలముండి=మిక్కిలి మౌనవ్రతముచేతఁ జిరకాల ముండి యని యర్థము. పదినెలలమట్టుకుఁ బలుకుట లేక యుండి యని భావము. వాక్యసంసిద్ధిమాధవువలనఁగన్న = వాక్యపరిపాకమును విష్ణుదేవునివలనఁ బొందిన యని యర్థము. పలుకుట వసంతునివలనఁ బొందఁ బడినదని భావము. మత్తకోకిలకవి = మదించిన కోయిల యనెడు కవియొక్క, కోకిల = చిన్నికోయిలయును, వి=పక్షియనియుం జెప్పవచ్చును. వాక్సమాజమెల్లన్ = వచస్సముదాయ మంతయు,

పంచమశ్రుతి = పంచమవేదమయిన భారతమనియర్థము. పంచమస్వర మని భావము. వింటివే చంచలాక్షీ=ఓగిరికాదేవీ వింటివా యని యర్థము.

పంచమస్వరముచు గోయిల పలుకుచున్నదని శాస్త్రము. పంచమశ్రుతియనఁగా స్వరారంభకావయవమయిన శబ్దవిశేషము. శ్లో. 'ప్రథమశ్రవణాచ్ఛబ్దశ్శ్రూయతే హ్రస్వమాత్రకః, సాశ్రుతి స్సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా.' అని సంగీత శాస్త్రమునఁ జెప్పంబడియున్నది. చిరకాలము తపము చేయుటవలననే మాధవానుగ్రహమున వాక్యసంసిద్ధి చేకూరినది. కావునఁ బలికినపలుకులు ఐదవ వేదములైనవనియు వసంతానుగ్రహమునఁ గోయిలలు పంచమశ్రుతితోఁ బలుకుచున్నవనియు భావము. అలం. కావ్యలింగము.

మ. నునుగప్రంపుటనంటివిప్పుఁబొర యన్ఁదో కెక్కి మాధ్వీమహా
వనధిం బుష్పాడిదీవికిన్ మధుకరవ్యాపారు లేతేరఁ ద
ద్ఘనకర్పూరపటంబు లందుకొని వేడ్కం గోరకవ్యూహమో
హనముక్తావళి దార్చె నీతరగుగాడ్పు ల్జాక్షి వీక్షించితే. 142

నును గప్రంపుటనంటివిప్పుఁబొరయన్ఁదో కెక్కి = జోకనఁగా దోనెగనుక నున్ననికర్పూరపరఁటి విచ్చు పొర యనెడుదోనెపై నెక్కి, మాధ్వీమహావనధిన్=మకరందరస మనెడు గొప్పసముద్రమందు, పుష్పాడిదీవికిన్ = పుష్పాడి తిప్పయనెడి ద్వీపమునకు, మధుకరవ్యాపారు లేతేరన్ = తుమ్మెదలనెడు బేరగాండ్రు రాఁగా, తద్ఘనకర్పూరపటంబులందుకొని = వారలయొక్క కర్పూరములనెడి వస్త్రములను దీసికొని, ఈతరగుగాడ్పు = ఈతరగరివాయువు, వేడ్కన్ = వేడుకచేత, కోరకవ్యూహ = మొగ్గల యొక్క సమూహమనెడు, మోహనముక్తావళి = మనోహరములైన ముత్తియములను, దార్చెను = పొందించెను. అనఁగా వస్త్రములను దీసికొని వానికి బదులుగా ముత్యాలిచ్చె ననుట. అబ్జాక్షి = ఓగిరికా దేవీ, వీక్షించితే=చూచితివా. ఉపవనమునందు తేనియ సముద్రమువలెనుండెను. పుష్పాడిద్వీపమువలెను గప్పురపుటనంటి విచ్చుపొరదోనెవలెను గాలి తరఁగరిగనునుండెను. ఆదోనె నెక్కినతుమ్మెద బేరగాండ్రు కప్పురపుటనంటి పలువలనిచ్చి మొగ్గ లనుముత్తెములఁ బుచ్చుకొని రనిభావము. తేనెసోనపైన నఁనటి పొరలు దోనెలవలెఁ దేలియాడుచుండ నందు దుమ్మెదలు మెలంగుచున్నవనియు ననంటిపొరదోనెలు పుష్పాడితిన్నెకడకేఁగి యాఁగుచున్నవనియుఁ బుష్పాడిమఱుఁగున మొగ్గ లలరారుచున్నవనియుఁ దెలియవలెను.

అలం. రూపకము.

మ. అలినీలాలక కంటె చిల్కభవదీయాలాపలీలాప్తి నిం
పలరం గోరి విపక్వ దాడిమ తరువ్యాలంబి శాఖాఫల
జ్వలనావాఙ్ముఖమై తపంబు సవరింపన్ సాగె నే లబ్ధ్బడిం
దలక్రిందైన ననూనవాగ్గ్రిహణమేధాళిక్తి బింబాశికిన్. 143

అలినీలాలక = ఓగిరికాదేవీ, కంటె=చూచితివా, భవదీయ=నీసంబంధమైన, ఆలాపలీలాప్తిన్ = వాగ్విలాసప్రాప్తిచేత, ఇంపలరంగోరి = ఇంపొందవలెనని కోరి, అనఁగా నీయొక్క వాగ్విలాసము తనకు లభింపవలయు నని కోరినదై యనుట. విపక్వ = మిగులఁబండినట్టి, దాడిమతరు వ్యాలంబిశాఖా

ఫల = దానిమ్మచెట్టుయొక్క ప్రేలుడుకొమ్మయందలి ఫలముకరకట్టి, జ్వలన = అగ్నికి, అవాఙ్ముఖమై=అధోముఖమై, తపంబు నవరింపక సాగెన్ = తపస్సుచేయసాగెను. అయినను, బింబాళికిన్ = దొండపండ్లు దినుదానికి, తలక్రిందైనను = తలక్రిందుగా తపస్సు చేసినప్పటికిని, కమాన = సంపూర్ణమయిన, వాగ్గ్రహణ = వాక్యగ్రహణమందలి, మేధాశక్తి=బుద్ధిబలము, ఫలన్బడిన్ =పండుకులభించుట-అనగా లభింపదనుట.

శ్లో. 'సద్యోబుద్ధిహరంబింబం సద్యఃప్రజ్ఞాకరీవచా' అని చెప్పఁబడియున్నది గనుక, దొండపండు తిన్నవారు బుద్ధిహీనులగుదురనుట ప్రసిద్ధము. అందుచేఁ దలక్రిందుగాఁదపముగావించినను ఫలములేక పోయెను. ఘోరతపముచేయువారు తలక్రిందుగనుండుట ప్రసిద్ధము. తపస్సనగ నగ్ని పరిపక్వదానిమ్మలోని యెఱ్ఱనిపిత్తులు. విపక్వఫలముగావున బీజములుగనుబడుచుండును. గాననే శుక మవాఙ్ముఖముగ రసాస్వాదనము చేయుచుండుట. వాగ్గ్రహణశక్తి దొండపండు తిన్నవారికిఁ గలుగదుగానఁ జిలుక కష్టము వృథాయయ్యెను. గిరికాదేవి పలుకులు చిలుకపలుకులకంటె ప్రతిహతముగా నుండెననుట.

అలం. ఉత్ప్రేక్ష. పరిణామము.

మ. అసితాబ్జేక్షణ చూడు కేతకి శివత్యాగాపవాదంబు దీ
ర్ప సముద్ధూళితధూళికాభసిత యై బద్ధాళిరుద్రాక్ష యై
యసిపత్రాసికఁ బూని నిల్చుటయు నయ్యష్టాత్మత్రైలోక్యజీ
వసముజ్జీవిక యైనమూర్తి దరియన్వచ్చెన్ సదాక్షిణ్యతన్. 144

అసితాబ్జేక్షణ = నల్లకలువలవంటి నేత్రములుగల యోగిరికాదేవి, చూడు = వీక్షింపుము. కేతకి = మొగలిపువ్వు, శివత్యాగాపవాదంబుఁ దీర్పన్ = సాంబమూర్తిచేతఁ బరిహరింపఁబడుటవల్ల సంభవించిననిందను బోఁగొట్టుకొనెడుకొఱకు, ('న కేతక్యా సదాశివం' అనియున్నది.) సముద్ధూళిత= లెస్సగాఁ బూయఁబడిన, ధూళికా భసితయై = ధవళపరాగమనెడి భస్మముగలదై, బద్ధ = కట్టబడిన, అళి = తుమ్మెదబారులనెడు, రుద్రాక్షయై = రుద్రాక్షమాలికలుగలదై, అసిపత్రాసికఁబూని = అసిపత్రమనఁగా మొగలియాకు గనుక నదియనెడు ఖడ్గలతనుబూనుకొని, నిల్చుటయున్ = నిలువఁగా- అనఁగాఁ బ్రమాణము చేసికొనుటకు సిద్ధపడఁగా నని భావము. అయ్యష్టాత్మ = అష్టమూర్తియైన యాసదాశివునియొక్క, త్రైలోక్య = మూఁడులోకములయందలి, జీవ = జంతువులకును, సముజ్జీవిక= ఉజ్జీవనకరమైన, మూర్తి = అనఁగా నష్టమూర్తులలో నొక మూర్తియైన వాయువు, సదాక్షిణ్యతన్ = మోమోటముతోడ నని యర్థము. దక్షిణుఁడనఁగా దక్షిణపుదిక్కునం దుండెడువాఁడు, వాని భావము దాక్షిణ్యము. దాక్షిణ్యసహితుఁడు సదాక్షిణ్యుఁడు, వానిభావము సదాక్షిణ్యత, గనుక సదాక్షిణ్యతతోడ నని భావము. దరియన్వచ్చెన్ = సమీప మగునట్టులుగా వచ్చెను. ప్రత్యక్ష మాయె నని భావము.

శివుఁడు తను బరిగ్రహింపలేదను వాదుఁ బోఁగొట్టుకొనుటకై మొగలి పుప్పొడియను విభూతి మేనఁదాల్చి తుమ్మెదలను రుద్రాక్షలఁదాల్చి రేకనుకత్తిగొని ప్రాణత్యాగమునకు సిద్ధపడఁగా శివుఁ డనుగ్రహించి తనయష్టమూర్తులలో నొకటియగు దక్షిణానిలమును బ్రోఁబోలయించెనని భావము. వసంతమునందు మొగలిరేకులు పుప్పొడిచే నలరి తుమ్మెదకదుపులతోనుండి దక్షిణానిలస్పర్శచే సుగంధము నలరఁజొలుచున్నదనుట. అలం. హేతూత్ప్రేక్ష. పరికరము.

తే. కన్నె మరునకుఁ బూఁదూపు♦లెన్ని లేవు, కన్నె గేదంగి విరి కేన♦గావు గాక
సూనబాణాభియాతికి ♦ దీనిగాలి, సోఁకినను గాదు తలయేఱు♦సోఁకు నెప్డుడు.

కన్నె = ఓగిరికా, మరునకుఁ = మన్మథునకు, పూఁదూపు లెన్ని లేవు=పుష్పబాణము లెన్ని లేవు, అనఁగా ననేకము లున్నవనుట. అవియన్నియు, కన్నె గేదంగివిరి కేనగావుగాక = లేఁత మొగలిపువ్వునకు సమానముగావుగాక - అనఁగాఁ బుష్పబాణము లనేకములున్నను లేఁత మొగలిపువ్వుతో సరిగావనుట. అదేమనిన, సూనబాణాభియాతికిఁ = మన్మథవిరోధియైన హరునికి, దీనిగాలి సోఁకినను గాదు= దీనిగాలి హాఁకినప్పటినికిని గొఱకాదు - అనఁగా గాలియును విరోధించుచున్నదనుట. తలయేఱు సోఁకు నెప్డుడు = దీనిగాలిసోఁకెనేని నెప్పుడును దలనొప్పి కనుపించునని యర్థము. శిరోగంగ యలముకొనుననిభావము.

మన్మథునకుఁ బెక్కుబాణములున్నను నందు ననమానమైనది చివురు మొగలిరేకు. శివుఁడు తక్కినములుకులను లెక్కింపఁడు. మొగలిగాలిసోఁకినంతన గంగయలముకొనుననిభావము. శిరోబాధ కలుగుననుట. అలం. కావ్యలింగము.

చ. కనఁ బద మూనఁ బాడఁ బలు♦కన్మొగ మెత్తుకొన న్మధింపఁ జే
య నలమఁ జల్ల నూర్చ నగ♦నంటను జాలవు గాక కాకచే
ఘనకుచ పువ్వు తీవె తిల♦కంబు నశోకము ప్రేంకణంబు గోఁ
గును కనకంబు కేసరము ♦ క్రోవియు వావిలిపొన్న మావియున్. 146

ఘనకుచ = ఓగిరికాదేవీ, కాకచేఁ = విరహతాపముచేత, కనఁ = చూచుటకును, పదమూనఁ = కాలుమోపుటకును, పాడఁ = గానము సేయుటకును, పలుకఁ = సంభాషించుటకును, మొగమెత్తుకొనఁ = ముఖరాగముఁ గనుపఱుచుటకును, మదింపఁజేయఁ = ముఖసీధువు నిచ్చుటకును, అలమఁ = కౌఁగిలించుకొనుటకు, చల్లనూర్చఁ = చల్లనిముఖవాయువును గూర్చుటకును, నగఁ = నవ్వుటకును, అంటఁ = కరస్పర్శము సేయుటకును, చాలవుగాక = ఓపక యున్నావు గాని, తిలకంబుఁ = బొట్టుగుచెట్టును, అశోకము = అశోకవృక్షంబును, ప్రేంకణంబు = మంకెనఁజెట్టును, గోఁగును=కొండగోఁగుచెట్టును, కనకంబు = చంపకమును, కేసరము = పొగడచెట్టును, క్రోవియుఁ = కోవిదారమును, వావిలి= సింధువారమును, పొన్న = సురపొన్నయును, మావియుఁ = తియ్యమామిడియును, పువ్వుతీవె = పుష్పములను సమర్పింపవా - అనఁగా నీవు పైనిఁ జెప్పఁబడిన వీక్షణాది దశవిధ దోహదవిశేషములను జరిగించినట్టులయినఁ దిలకము మొదలైన వృక్షములు పుష్పింపవా యని యర్థము. దీనం గ్రమాలంకారము చెప్పంబడియెను. వృక్షదోహదములు కొంతవఱకు వెనుకఁ జెప్పఁబడెను.

సీ. కలికి నీచేష్టు♦గలది మాకందంబు సతి నీవు గనునది ♦ సరసతిలక
మబల నీయెదఁజేరు♦నది తావిక్రోవి తొయ్యలి నీవు పదముంచు♦నది యశోక
మతివ నీయిర వొందు♦నది దగుఁ బొగడ బిత్తరి నీవు నగునది ♦ దా నమేరు
వమలాంగి నీదు రా♦గము గన్నది ప్రియాళు వగజ నీ వెదిరించు♦నది సువర్ణ
తే. మింతినీచే గృతాశ్వాస♦మింద్రసుపన, మళికచభవన్ముఖదూ♦ర్తికర్ణాభరణమ్ముఁ
గాంచునది కర్ణికారంబు♦గానఁ గాన, నేరవునేయక చెలి వీని♦విరులు గొనుము.

కలికి = ఓగిరికా, నీచేపట్టుగలది మాకందంబు = నీయొక్క కరస్పర్శము గలది రసాలవృక్షమని యర్థము. నీయొక్క హస్తావలంబమైన వస్తువే మాకు సంపదయ్యెడునని యర్థాంతరము. లేక మా యనఁగా లక్ష్మిగనుక లక్ష్మీస్థానమని యైనను జెప్పవచ్చును. (ని. 'ఇందిరా లోకమాతా మా రమా మఙ్గళదేవతా' అని అ.) సతి=ఓగిరికా, నీవు గనునది సరసతిలకము = నీచూచునది తిలకవృక్షమని యర్థము, నీచేతఁ జూడఁబడువస్తువే సరసశ్రేష్ఠమని యర్థాంతరము. అబల = ఓగిరికా, నీయొడఁ జేరునది తావిగ్రోవి=నీబొమ్మునఁ జేసినట్టిది పరిమళయుక్తమైన కోవిదార వృక్షమని యర్థము. నీవక్షస్థలమందుఁ జేరి యాదరింపఁ బడుచున్న వస్తువే పరిమళములకు స్థానమని యర్థాంతరము. లొయ్యలి= ఓగిరికా, నీవు పదముంచునది యశోకము=నీవు పాదము తన్నఁగలది యశోకవృక్షమని యర్థము. నీచేత నడుగు మోపఁబడిన వస్తువే శోకరహితమైన దని యర్థాంతరము.

అతివ=ఓగిరికా, నీయిరవొందునది దగఁబొగడ=నీయొక్క సురాగండూషము బొందునది యర్హమైన పొగడచెట్టని యర్థము. ఇక్కడ ఇరాశబ్దము సురయందు వర్తించుచున్నది. (ని. 'గండోత్తమా ప్రసన్నేరాకాదంబర్యః పరిస్రుతా' అని అ.)

బిత్తరి=ఓగిరికా, నీవు నగునది దానమేరువు=నమేరువనఁగా పొన్న, నీవు దరహాసము సేయఁదగినది పొన్నచెట్టని యర్థము. నీచేత మందహాసమును గూర్పఁబడువస్తువు తానే మేరువు అని యర్థాంతరము. అమలాంగి=ఓగిరికా, నీయనురాగము గన్నది ప్రియాళువు=నీయొక్క గానమును గన్నదియ ప్రేంకణమని యర్థము. నీయనురాగమును బొందినది హృదయంగమ మని యర్థాంతరము. ఇక్కడ 'ప్రియగతౌ' అనెడు ధాతువువలన హృదయమునుగూర్చి గమించునది గనుకఁ బ్రియాళువని విచారింపవలయును. అగజ=ఓగిరికా, నీవెదిరించునది సువర్ణము=నీవు ముఖరాగమును నించునది చంపకమని యర్థము. నీచేత నెదిరింపఁ బడువస్తువే బంగారమని యర్థాంతరము.

ఇంతి=ఓగిరికా, నీచేఁ గృతాశ్వాసము=నీచేతఁ జేయఁబడిన ముఖవాయువు గలది, ఇంద్రసురసము=వావిలి చెట్టని యర్థము. నీచేతఁ జేయఁబడిన యూఱడింపు గలవస్తు వింద్రప్రియ మని యర్థాంతరము. అళికచ = ఓగిరికా, భవన్మృదూక్తి = నీయొక్కమృదువైన సల్లాపముచేత, కర్ణాభరణము గాంచునది=కర్ణావతంసములై పుష్పముల నుత్పాదించునది, కర్ణికారంబు=కొండగోగుచెట్టని యర్థము. (ని. (అథ ద్రుమోత్పలః, కర్ణికారః పరివ్యాధః' అని అ.) నీభాషణమును కర్ణభూషణము గాంచినవస్తువే కర్ణికాయుక్తమని యర్థాంతరము. అనఁగా నలంకృతములైన కర్ణముగలదనుట. 'కర్ణికాం కర్ణభూషణమియర్తీతి కర్ణికారః' అని సమాసము. 'ఋగతౌ' ని. 'కర్ణికా కర్ణభూషణే' అని అ. కాంచుటయనఁగా బ్రసూతియగుటయును బొందుటయును, కానక=కాంచక, కాననము=ఈవనమును, ఎరవుసేయక=భేదముగా విచారింపక, చెలి=ఓగిరికా; ఏనివిరులు గొనుము=ఈవృక్షముల యొక్క పుష్పములను సంగ్రహింపుము. అనఁగాఁ గరస్పర్శాది దోహదక్రియలు జరిగించి రసాలాది వృక్షముల పుష్పములను గ్రహింపు మని భావము.

('ఇతరత్రచద్వితీయా తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్' అనెడు శబ్దానుశాసన సూత్రముచేత నిరాశబ్దము జడవాచకము గనుక ద్వితీయకుఁ బ్రథమవచ్చినది, ప్రథమకంటెఁ బరముగుటచేత బొందు నొకటిపదము వెండటి బకారమునకు వకారాదేశము వచ్చినది. ఇరవఁగా గలవు.

నీయొక్క సెలవును బొందుచున్నవస్తువే పొగడఁ దగినదని యర్థాంతరము. తగుఁబొగడ యనునది క్రియాజన్య విశేషణసమాసము. పకారము క్రియాపదావయవము గనుక నిక్కడ లుగ్విషయము గాదయ్యెను. కాఁబట్టి పరమందున్న పకారమునకుఁ బకారమువచ్చినది మించు గ్రొమ్మించు ఇత్యాది పదములయందు వలెనని గ్రహింపవలయును.

ఈవనమును వేఱుగాఁ దలంపకుము. నీయనుగ్రహపాత్రమైనది. కావున నుత్సాహము దీఱ విరులను గోసికొనుము. అనుచుఁ జెలులు గిరికకుఁ దెలిపిరి. అలం. శ్లేషానుప్రాణితకావ్య లింగము.

క. అని వనితలు జవ్వని క, వ్వనివిభవముఁ దెల్పి కమ్మ♦వలపులు గొనుగా
డ్పెనయమికి ఫణులఁ బెనచిన, యనువున జడలడరఁ గుసుమ♦హరణోత్సుకలై.

అని=ఈలాగని, వనితలు=స్త్రీలు, జవ్వనికిన్ = గిరికాదేవికి, అవ్వనివిభవముఁ దెల్పి=ఆయు ద్యానవన వైభవమును దెలియఁ జెప్పి, కమ్మవలపులు గొనుగాడ్పు = మనోహరమయిన పరిమళమును హరించునట్టి మలయమారుతము, ఎనయమికిన్ = సోఁకక యుండుకొఱకు, ఫణులఁ బెనచిన యను వునన్=వాతాశనములయిన సర్పములను జత చేసికొన్నారో యన్నట్టులుగా, జడలడరన్=వేణీబంధ మును ప్రకాశింపఁగా, కుసుమహరణోత్సుకలై=పువ్వులు గోయుటయం దుద్యుక్తలై — ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

వనము వసంతావృతమగుటచేఁ గమ్మవలపుగాడ్పు లవ్వారిగా వీవసాగెను. విరహిణికి సుగంధ వాయుప్రసారము గ్రమాకరముగావున వాయునిరోధమునకుఁ దగినవి పాములు. కాన పాములవలె జడలు పైచికొని పూలుగోయ నేగిరని భావము.

వృషభగతిరగడ.

బాల బాలరసాల మిది పిక♦పాలిపాలిటియమరపాలము
గేలిఁ గేలిడి గ్రుచ్చఁ గడు రా♦గిల్లు గిల్లుము తత్ప్రివాళము
కొమ్మ కొమ్మఁ గదల్చి ననగై♦కొనక కొన కదియేల నిక్కడు
ర మ్మురమ్మున మోపఁ గురువక♦రాజి రాజిలు నెంత పొక్కడు
నాతి నాతిచిరప్రసూత న♦నంటి నంటి కదల్ప నేటికి
నీతి నీతిలకంబు వలపులు♦నించు నించుక చూచుబోటికి
నోమి యోమితమధ్య నీపద♦ముంచు ముంచు నశోకవాసన
లేమ లేమరువములు నీ కవ♦లీల లీలల వీఁకలోఁ జన
రామ రా మన కొనరఁ గూర్చు స♦రాలు రాలుతు ననలు వైళము
భామ భామహనీయ మగు నీ♦పాట పాటవమునఁ బ్రియాళము
నింతు నింతులకంటెఁ బుష్పాడి♦నెరసు నెరసులు పల్క నింతయుఁ
గాంత కాంతముఖానురాగము ♦ కనక కనకము పూయ దెంతయుఁ
గ్రొవ్వి క్రొవ్విరిమొగ్గ మరుబరి♦గోల గోల యి దేల దాఁటితి
నవ్వి నవ్వనవాటిఁ గొన్నలు ♦ ననుచు ననుచు నెఱుంగఁ జాటితి

ముదిత ముదితమనోజ్ఞమై తెలి•మొల్ల మొల్లము మెచ్చె మాటికి
మదిర మది రహిఁ జూసి వకుళము•మన్న మన్నన మధుపకోటికి
చెలువ చెలువపుఁబావి యారుపు•సిందు సిందుర మింపు మీఱఁగ
వలదు వలదురుమధుమధుప్రతి•వాసవాసంతికలు దూరఁగ
వసిత వని తరు లతల యలరుల•వాడి వాడితి కొప్పుప్రేఁగుల
మనము మనమునఁ గోరి చెలుఁగకు • మాట మాటలు వచ్చుఁగోఁగుల
వెలయ వెల యని మాపెవప్రు కుసు•వేస వేసఁగఁ జల్కుఁ బగుసునె
యలసి యల సిరిగంధ మదరెడు•వాడ నాడ భుజంగి నగుసునె
వాసి వాసి తెమల్తురా శిర•వాడి వా పెడ వత్తురింతులు
గాసిగా సిర మంట్లై నలపక•కప్పు కప్పుర మేల జంతులు
లతిక లతికమనీయకరకిస•లయముల యమున నాడె నిత్తఱి
నతనునతనుయశోభరం బస • నలరు నలరుల మూడ బిత్తరి
తావితా విది గంధవహాకం•దళము దళముగ వీచు నెప్పుడు
కావ కావలిజాజు లిపు డవి • ఘనము ఘనములు మించు నప్పుడు
మాలమాలల మల్లె లెంతటి•మోహమో హరిణాక్షి దాచితి
యేల యేలకిపొదలు వెదకెద • వింత వింతలె యొందుఁ జూచితి
గోర గోరఁట నించితివా కలి•గొట్టు గొట్టుగఁ గోయఁ బోసఁగవు
నారి నారికడంపుబాలెలు • నాకు నాకులవృత్తి నోసఁగవు
కలయ కలయకలంకకేతకి • కళిక కళికచ పఱచెఁ బిత్తమె
యళిక యళికి వడంకె నీయిభ•యాన యానవిల్తుఁ గొత్తమె. 149

ఈరగడలో వనితలు పువ్వులు గోయు సమయమందుఁ బల్కు వాక్యములు చెప్పఁబడి యున్నవి గనుకఁ బ్రత్యేకముగా నన్వయము. వీలాగనిన, బాల=ఓచెలియా, బాలరసాలమిది = లేఁతదైన యీ తియ్యమామిడిచెట్టు, పికపాలిపాలిటి యమరసాలము = కోకిలసమూహము పాలిటి కల్పవృక్షము- అనఁగాఁ జిగురుటాకులచేత నభీష్టసిద్ధి సేయునని భావము. కేలిఁ గేలిడి గ్రుచ్చఁ గదురాజిల్లుక్ = క్రీడ చేతఁ జేయిపెట్టి గ్రుచ్చఁగానే మిక్కిలి రంజిల్లును గనుక, తత్ప్రవాళము గిల్లుము = దానిపల్లవము త్రుంచుమనియర్థము. ('శ్లో. 'కరస్పర్శేనమాకందః') అని యున్నదిగనుక హస్తస్పర్శరూపమైన దోహదముచేత రసాలము రంజిల్లుచున్నదని భావము. ఇక్కడఁ బరణాంతమందున్న యమరసాలశబ్దము ప్రథమాంతముగనుకఁ దత్పరమందున్న కేళిశబ్దాది కకారమునకు గకారాదేశము వచ్చినది. నకారాంత పదమునకుఁ బరమందున్నదిగనుక రెండవ కకారమునకు గకారము వచ్చినది. కొమ్మ = ఓ చెలియా, కొమ్మఁ గదల్చి = పువుగొమ్మను గదలించి, నన నైకొనక = పుష్పమును సంగ్రహింపక, కొన కదియేల నిక్కెదు = శాఖాగ్రమున కేల ప్రాఁకుచున్నావని యర్థము. రమ్ము=ఇటురమ్ము. ఊరమ్మున చోఁకక్ = వక్షస్థలమందు నానించుకొనఁగానే, కురువకరాజి రాజిలుక్ = ఎఱ్ఱపువ్వులుగల పెద్దగోరంటచెట్టు ప్రకాశించును, వీలపొక్కెదు=ఎందుకుఁ జింతించుచున్నావు అని యర్థము. ('అలిఙ్గనా త్కురువకః'

అని యున్నది గనుక నాలింగన రూపమైన దోహదముచేతఁ గురవకవృక్షములు ప్రకాశించుచున్నవని భావము.

కొమ్మ కొమ్మ ననుచోట వర్గప్రథమవర్ణములుగాని వర్గతృతీయవర్ణములుగాని రెండును జెప్ప వచ్చును. చరణాంత సంధియును సంబుద్ధ్యంతసంధియును వైకల్పికము. 'నస్యాద్వాక్యవిరామేతు సంధిర్వాచాపి దోషకృత్' అను వచనముచేత సంధి రాదయ్యె. ఇక్కడ వాక్యమనఁగాఁ బదంబు.

గీ. 'సంధిగూర్పంగఁ బ్రథమాంత శబ్దవితతి, పైకచటతపలకు వికల్పంబుసెల్లుఁ
గాకు సంబోధ నావ్యయ కర్మధార, యంబుల నచేతనంబుల నబ్జనాభ.' అని యున్నది.

నాతి = ఓచెలియా, నాతిచిరప్రసూతను = కొద్దిదినములవాఁడు గెలవేసిన, అనంటికిన్=అరఁటి చెట్టును, అంటి కదల్పనేటికిన్ = ముట్టి కదలింపనేల యని యర్థము. నీతిన్=నియమముతోడ, ఈతిల కంబు = ఈ బొట్టుగుచెట్టు, ఇంచుకచూచుబోటికిన్ = కొంచెముగాఁ దనవంకఁజూచిన స్త్రీకి, వలపులు నించున్ = వాసనలను నిండించును అని యర్థము. (శ్లో. 'తిలకో వీక్షణేనచ') అనియున్నది గనుక వీక్షణరూపమైన దోహదముచేతఁ దిలకవృక్షము పుష్పించుచున్నదని భావము. ఓమితమధ్య = సూక్ష్మమైన మధ్యప్రదేశముగల యో చెలియా, ఓమి=పోషించి, నీపదముంచు = నీయొక్క పాదప్రాప్తిఁ గలుగఁ జేయుము. అలాగునఁ జేయఁగానే, ముంచు నశోకవాసన = అశోకపుష్ప పరిమళము గ్రమ్ము చున్నదని యర్థము. (శ్లో. 'అశోకశ్చరణాహత్యా') అనియున్నది గనుకఁ బదతాడన రూపమయిన దోహదముచేత నశోకము పూయుచున్నదని భావము.

లేమ = ఓచెలియా, లేమరువములు=లేఁత మరువములు, లీలలవీఁకలోఁ జనన్ = లీలావిహారము సేయుచెడల, నీకవశీల = నీకు సులభముగా లభింపఁబడునని యర్థము. రామ = ఓచెలియా, రా=రమ్ము, రాలుతునసలువైశము=శీఘ్రముగాఁ బువ్వులు రాల్చుచున్నాను, మనకొనరఁ గూర్పుసరాలు = మనకు సరిపోవునట్టులుగా దండలు గ్రుచ్చుము అనియర్థము. భామ = ఓచెలియా, నీపాట పాటవమునన్ = నీయొక్కగాన నైపుణ్యముచేత, ప్రియాళము = ప్రేంకణము, భా మహనీయమగు = కాంతిచేత ఘన మవును అనియర్థము. ('గీత్యాప్రియాళుః') అని యున్నది గనుక గానరూపమైన దోహదముచేతఁ బ్రేంకణము ప్రకాశించుచున్న దని భావము. ప్రియాళుశబ్ద మకారాంతమును గలదన్నందుకు, ('చూతైః ప్రియాళైః పనసైః) అని శ్రీభాగవతమందుఁ బ్రయోగము. ఇంతుల కంటన్ = సఖులయొక్క కన్నులయందు, పుప్పొడినెరసు = పుష్పపరాగపు నెరసులు, నింతున్ = నిండించుచున్నాను, నెరసులు పల్కనింతయున్ = ఇంతైనను దప్పులు పల్కనని యర్థము. కాంత = ఓచెలియా, కాంత ముఖాను రాగము కనక = గిరికాదేవియొక్క ముఖరక్తిమను గాంచక, కనకము = సంపఁగి, పూయదెంతయున్= ఎంతమాత్రమును బుష్పింపదు అనియర్థము. (శ్లో 'ముఖరాగేణ చంపకః') అనియున్నది గనుక ముఖ రక్తిమ రూపమయిన దోహదముచేతఁ జంపకము పుష్పించుచున్నదని భావము. అనురాగపద మచేత నార్థకము గనుకఁ దత్పరమయిన కకారమునకు గకారాదేశము చెప్పినవాఁడు గాఁడు.

గోల = ముగ్ధవైన యో చెలియా, క్రొవ్వి=మదించి, ఇది=ఈకనుపడునట్టి, క్రొవ్విరి=క్రొత్తగా వికసించిన పువ్వము, మరు బరిగోల = మన్మథుని బాణముగదా, విలదాఁటితి=ఎందుకు దాటితివే యని యర్థము. ఇక్కడఁ జరణాంత సంధిసేయఁగూడదు. నవ్వక్ = నవ్వఁగాను, అవ్వనవాటిన్=అవనవీథి

వచ్చినది. గాసిగా సిరమం టెక్=బాధకమగునట్టులుగాఁ దలకెక్కెను, కప్పురము = కర్పూరమును, నలపక=నలిపి పొడిచెయ్యక, కప్పు = కప్పిపెట్టు, ఏలఱంతులు = కోలాహలము లెందుకు అని యర్థము. ఇత్తఱిక్ = ఈసమయమందు, లతికలు = పువ్వుతీఁగెలు, అతికమనీయ = అత్యంత సుందరమైన, కర కిసలయము = కరసదృశకిసలయముయొక్క, లయమునక్ = లయప్రకారముచేత, ఆడెను = వర్తించెను అని యర్థము.

బిత్తరి=ఓచెలియా, అతను=మన్మథునియొక్క, ఆరయ = అధికమైన, యశోభరంబునక్=కీర్త్యతిశయ మగునట్టులుగా, అలరులు=పుష్పములు, అలరుక్=ఒప్పును, చూడక్=చూడఁగా నని యర్థము. 'షష్ఠ్యాదితో౽చిరుమ్సేచ' అనెడు శబ్దానుశాసన సూత్రముచేత మొదటిదైన యతను శబ్దాంతమందు నుమాగమము వచ్చినది, ఇది=ఈప్రదేశము, తావి = పరిమళముయొక్క, తావు=స్థానము, కాఁబట్టి, గంధవహాకందళము=పవనాంకురము-అనఁగా మందమారుతము, దళముగక్=తఱుచుగా, వీచునెప్పుడు= ఎప్పుడును విసరుచుండును అని యర్థము. ఇక్కడఁ జరణాంతసంధి చేసి గసడదవాదేశము చెప్పఁ గూడదు, ఆవలిజాజులు=ఆవలిజాజితీఁగలను, ఇపుడు = ఈసమయమందు, కావకు = కనిపెట్టకుము, ఘన ములు మించునప్పుడు=మేఘములతిశయించెడు సమయమందు-అనఁగా వర్షకాలమందు, అవి = ఆ జాజులు, ఘనము=అతిశయము-అనఁగా నావలిజాజితీఁగలు వర్షాకాలమందుఁ బూయుచున్నవి గాని యిప్పుడు పుష్పింపవు గనుక వానిఁ గాచియున్నను వినియోగము లేదని యర్థము. జాజి వానకాల మునఁ బూయు ననుట కవి సమయసిద్ధము.

ఓహరిణాక్షీ=ఓచెలియా, ఎంతటి మోహము=ఎంత మోహమో కాని, మల్లెలు=మల్లెపువ్వులను, మూలమూలలక్=కనుపడకయుండునట్లు చాటుచాటులను, దాఁచితి=దాఁచిపెట్టుకొంటివి అనియర్థము. ఏలయేలకిపొదలు వెదకెదవు = ఎందుకొఱకు నేలకి పొదలు వెదకుచున్నావు, ఇంతవింతలె=అనఁగా నీలాటివింత లెక్కడనైనను గలవా, ఎందుఁజూచితివి=ఎక్కడఁజూచి నేర్చితి వని యర్థము. గోర గోరఁట నించితివా=గోళ్ళను గోరంటాకు పెట్టుకొంటివా యేమి, గోరంటాకునూరి గోళ్ళకుఁబెట్టు కొనుట ప్రకటము, అయిన, కలిగొట్టు = పాటలీపుష్పములను, గొట్టుగక్ = అశక్యమగునట్టులుగా, కోయఁబోసఁగవు=కోయఁజాలవు అని యర్థము. అనఁగా గోరంటాకు పెట్టుకొన్న గోళ్లెఱ్ఱగా నుండుట చేతను గలిగొట్టుపువ్వులు నెఱ్ఱగానే యుండుటచేతను భ్రాంత్యవరోధము కలుగును గానఁ గోయఁ జాలవని భావము. నారి=ఓచెలియా, నారికడంపుఁబాళులు=కొబ్బరిబోండ్లాలు, నాకు నాకులవృత్తి నొసఁగవు=నాకు వ్యాకులము నియ్యవని యర్థము. అనఁగా నవి యెంతపొడవున నున్నప్పటికిని ననా యాసముగా నెక్కి కోయఁగలుగుదునని భావము. కలయక = నాతోఁగలయక, అల యకలంకకేతకి కళికకుక్ = కలంకరహితమయిన యామొగలి పూమొగ్గయున్న దిక్కునకు, అళికచ = గిరికాదేవి, పఱ చెక్ = పరుగెత్తెను, పిల్తమె = ఆహ్వానముచేయుదమా యని యర్థము. అనఁగా మరణోద్యోగముచేసి యసిపత్రములుగల మొగలిపూ మొగ్గకై పఱచెను గనుకఁ బిలుతమని యనుట.

ఈయిభయాన = గిరికాదేవి, అళికి = భయపడి, అళికెక్ = తుమ్మెదకు, వడంకెక్ = కంపించెను, అనవిల్తుఁ గొల్తమె=ఆమన్మథునిఁ బూజింతమా యని యర్థము.

ఇది వృషభగతిరగడయనంబడు, దీనికి నిరువది యెనిమిది మాత్రలుండవలయు, లఘు వొక మాత్రగలదియు గురువు రెండుమాత్రలు గలదియుఁ గాన నట్టిమాత్ర లిరువది యెనిమిదియనుట, షడి

యేనవమాత్ర మొదట యతి యుండవలయును. రెండురెండుపాదంబు లాద్యంతప్రాసయుక్తంబులై యుండవలయును, ఇది సంఖ్యారహిత పాదవృత్తములందు నొకటి గనుక నిష్పదుల్పినన్ని పాద ద్వయములు గలుగఁజెప్పవచ్చును. ఈరగడయందు కావ్యగుణములలో నొకటి యగు కాంతిగుణము చెప్పంబడియెను. కావ్యగుణములు పది, అవి యెయ్యవనఁగా శ్లేష, ప్రసాదము, మాధుర్యము, సౌకు మార్యము, సమతార్థము, దీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి అనునవి. అందు కాంతి యనఁగాఁ జిత్రవర్ణ క్రమస్థితులచు మెండుగఁ గూర్చుట.

చ. అని వనకేళి సల్పి లలి♦తాంగు లతాంతలతాంతకోటిలో
వనపవనానుషంగమున ♦ వాసన వోవనివానిఁ దేనియ
ల్దొనుకనివానిఁ బుప్పొడులు ♦ దూలనివాని మదాళిమాలిక
ల్చెనకనివాని భావభవ♦సేవకు నేర్పున నేర్పరించుచున్. 150

అని = పైనిఁజెప్పిన ప్రకారముగా సల్లాపములుసల్పి, వనకేళిసల్పి = వనవిహారముచేసినవారై, లలితాంగులు = స్త్రీలు, అతాంత = వాడని, లతాంతకోటిలోన్ = పుష్పసముదాయములో, వన పవ నానుషంగమునన్ = వనవాయు సంపర్కముచేత, వాసన వోవనివానిన్ = పరిమళము పోకయున్న వియు, తేనియ ల్దొనుకనివానిన్ = పూఁదేనియలు చిందిపోక యున్నవియు, పుప్పొడులు దూలని వానిన్ = పుప్పొడులెగిరిపోకయున్నవియు, మదాళిమాలిక ల్చెనకనివానిన్ = మదించిన తుమ్మెద గుంపులు ముట్టకయున్నవియు నైన పుష్పములను, భావభవసేవకున్ = మన్మథపూజార్థముగా, నేర్పున నేర్పరించుచున్=మెలఁకువచేత నేర్పఱచి సంగ్రహించుచును. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వ యము. తావిపోనివి, తేనియతొలంగనివి, పుప్పొడిరాలనివి, తుమ్మెదలంటనివియగు పూవులు మన్మథ పూజ కుపయుక్తములు. అట్టివానిని సమకూర్చుటలో నేర్పుకావలయును. విరులఁగోయఁదగిన వేసము వేసికొని చెలువలు మెలఁకువతోఁ బూజాకుసుమములు సమకూర్చిరని భావము.

సీ. కుసుమవాసన లెల్లఁ♦గొల్లలాడితిమింకఁ, బఱచుటామని యెంత♦పర్వులిడునొ
చివురుజొంపములెల్లఁ♦జిదిమివైచితిమింకఁ, బగఱకోయిలయెంత♦యెగసిపడునొ
ఫలపరంపర లెల్ల♦నులిచివైచితి మింకఁ, గొదరుచిల్కలవెంత♦వదరుకొనునొ
కమ్మఁదేనియ లెల్లఁ♦గ్రుమ్మరించితి మింకఁ, గట్టల్కనళు లెంత♦చుట్టుకొనునొ
తే. యెఱుఁగ రా దింతులార యీ♦తెఱవ నిచట
మసలఁగానీక తోతెండు♦మనము గొనిన
కుసుమ కిసలయ ఫల నవ♦ప్రసవరసము
లసమశరునకు నర్పింత♦మనుచు వెడలి. 151

కుసుమవాసనలెల్లఁ గొల్లలాడితిమి = పుష్పవాసనల నన్నిటిని జూఱపుచ్చితిమి, ఇంకన్ = ఇఁక మీఁదట, పఱచుటామని = ప్రల్లదపు వసంతుఁడు - పఱచు అనునది యుకారాంతశబ్దము గనుక టుగాగమము వచ్చినది. ఎంత పర్వులిడునో = ఎంత పరుగులెత్తునో యని యర్థము. చివురుజొంపము లెల్లఁ జిదిమివైచితిమి = చిగురుటాకు గుత్తు లన్నిటిని త్రుంచివైచితిమి. ఇంకన్ = ఇఁకమీఁదట, పగఱకోయిల యెంత యెగసిపడునో = విరోధియై యున్న కోకిల యెంత యెగసిపడునో యని

యర్థము. ఫలపరంపరలెల్ల నలిచివైచితిమి = పండ్లగెలల నన్నిటిని నలిపివేసితిమి, ఇంకన్ = ఇఁకమీఁదట, కొదమచిల్కలవెంత వదరుకొనునో = తరుణవయస్సుగల యాచిల్కలెంత తప్పుకూఁతలు కూయునో యని యర్థము. కమ్మఁదేనియలెల్లఁ గ్రమ్మరించితిమి = మధురమయిన మకరందములనన్నిటిని నొలకఁబోసితిమి. ఇంకన్ = ఇఁకమీఁద, కట్టల్కనళులెంత చుట్టుకొనునో = మిక్కిలి కోపముచేతఁ దుమ్మెదలెంత చుట్ట వేసికొనునో అని యర్థము. ఇక్కడ వసంతుఁడు సర్వత్ర వ్యాపించు ననియును గోయిల పక్షి గనుక నెగసి ప్రాలుచున్న దనియును జిలుకలు పరిపరివిధములుగాఁ బలుకుచున్నవనియును దుమ్మెదలు గుంపుగట్టి ముసురుకొనుచున్నవనియును భావము.

ఎఱుఁగరా దింతులార = ఓచెలియలారా తెలియ శక్యముగాదు, ఈతెఱవన్ = ఈగిరికాదేవిని, ఇచట మసలఁగానీక = ఇక్కడ నాలస్యముగా నుండనియ్యక, తోతెందు = వెంటఁబెట్టుకొనిరండు, మనము గొనిన = మనము సంగ్రహించిన, కుసుమ = పువ్వులును, కిసలయ = చిగురుటాకులును, ఫల= పండ్లును, నవప్రసవరసములు=నూతనమైన పూఁదేనియలును, అసమశరునకు నర్పింత మనుచున్=మన్మథునకు సమర్పింతమని పలుకుచు, వెడలి = ఆవనములోనుండి బయలుదేరి, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఈపద్యములో శంకయనెడి సంచారిభావము చెప్పంబడియె. శ్లో. 'అనిష్టాభ్యాగమోత్ప్రేక్షా శంకారోషాదికారణమ్' అని లక్షణము.

క. మందారముకుళకుహళీ, కందళితమరందతుందిలకమిళిందవధూ
బృందాభినందితం బగు, మందానిల మొలయ విజితమార్గశ్రమ లై. 152

మందార = దేవతావృక్షభేదములయొక్క, ముకుళ = మొగ్గలయొక్క, కుహళీ = గుత్తులయందు, కందళిత = ఉత్పన్నమగుచున్న, మరంద = మకరందమువల్ల, తుందిల = బలిసిన, మిళిందవధూ = ఆఁడు తుమ్మెదలయొక్క, బృంద = సమూహముచేత, అభినందితంబు=మిక్కిలి స్తుతిచేయఁబడుచున్నది, అగు= అయినట్టి, మందానిలము = మందమారుతము, ఒలయన్ = విసరఁగా, విజితమార్గశ్రమలై=జయింపఁబడిన మార్గాయాసముగలవారై, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

కుహళీశబ్దము పూగుత్తియందు వర్తించినందుకుఁ బ్రయోగము.

చ. 'ప్రతివనచారు కేసరపరాగశలాటు మిళింద బృందచి
త్రితకుహళీయుగంబు గలిఁ గ్రేవలఁ గర్ణకలాపరత్నని
ర్గతరుచిమంజరు ల్దనరఁగాఁ గ్రముకద్రుమ కంఠలక్ష్మికిం
బ్రతిఘటవృత్తిఁ జూపెడును భామిని కంఠము'

అని సూరపరాజు చెప్పినాఁడు.

చ. వనజముఖు ల్గనుంగొని రవారితవారితరంగరంగన
ర్తనసలిలభ్రమభ్రమణసంగదభంగరథాంగధామముం
మనసిజహోమకుండనిభమంజులకంజగతాళిధూమముం
ధనదసరోజధామసమధామము నొక్కసరోలలామమున్. 153

వనజముఖులు = గిరికాదేవిచెలికత్తియలు, అవారిత = నివారింపఁబడని, వారితరంగ = జల తరంగములనెడు, రంగ = నాట్యస్థానమందలి, నర్తన = నాట్యమందు, సలిలభ్రమభ్రమణ = నీళ్లసుడి

యందలి తిరుగుటయనెడు నుడివలెఁ బరిగెడు చక్రనాట్యముచేత, రంగత్ = రంగత్తములగుచున్న, అభంగ = భంగములేని, రథాంగ = చక్రవాకములకు, ధామయుక్ = స్థానమునైనదియు, మనసిజ = మన్మథునియొక్క, హోమకుండ = హోమాగ్నికుండములతోడ, సమ=సమానములైన. మంజుల కంజ= మనోహరములయిన యెఱ్ఱదామరలకు, గేహ = పొంచినయట్టి, అళి ధామయుక్ = పొగలవంటితుమ్మెదలు గలిగినదియు, ధనద=కుబేరునియొక్క, సరోజధామ=పద్మినియను మానససరోవరముతోడ, సమ = సమానమయిన, ధామయుక్=ప్రభగలిగినదియునగు. ఒక్కసరోజధామయుక్=ఒకసరోవరమును, కనుంగొనిరి = చూచిరి. ఈపద్యము వృత్త్యనుప్రాసము గలదిగాఁ జెప్పఁబడు.

వారితరంగము లవారితములు, అందుండెడుగుండములు చక్రవాకములకు నాట్యరంగములవలె నుంటచే సరస్సు చక్రవాకముల కునికిపట్టై యందముగ నున్నది. తామరపూవులు మన్మథుని హోమకుండమువలెను దుమ్మెదలచాలు పొగవలె నున్నది. అనఁగా సరోవరము చక్రవాక క్రీడాసౌఖ్యము పద్మగత భ్రమరవాసమునై మానససరస్సువలె నుండెను.

శబ్దాలంకారము. వృత్త్యనుప్రాసము.

వ. కనుంగొని కురంగట మెలంగువనదేవత లాత్మీయచిత్రపత్రలతాతిలకజాలకాలోకంబు లాలోకింపం గోరి గమలాకరముకురంబు వేమఱు మెఱుంగిడఁ గ్రేవలం దొరఁగురాపొడికై వడిం దటకటకరూఢప్రాఢతరుపటలపరిపతితపరాగబృందంబులు నెరయునంగంబున కానందంబు నొందుచు, నందనారామసీమావిహారపరిశ్రాంత లగుతమకు నుపభోగ్యంబుగా వినమ్రశాఖాంచలప్రవాళతాళవృంతంబుల విసరివిసర్జిమృదులపవనచలనగళితకుసుమసముదయంబులం బువ్వుగట్టి యబ్జాకరవారిపూరంబు నదీతుషారంబు నపారసౌరభోదారంబునుం జేయు శిశిరకిరణశిలాఫలపాళికాస్థాపితసోపానోపాంత కల్పితాలవాలమూల సలిలసేకసంవర్ధితసేవంతికామల్లికాదివల్లికలయల్లికల కుల్లసిల్లుచుఁ బైతామహాశ్రమంబునం గిరణమాలిసాహాయ్యరంజితకింజల్కకీలికీలామధ్యంబునం బెక్కుకాలంబు నిల్చినకతంబున నాత్మమాలిన్యంబు దొలంగి యభినవసువర్ణతేజోవిరాజమానంబు లగుతెఱంగునఁ దరంగితతటీయరజోపుంజపిశంగితాంగంబు లగుభృంగంబులం గని యుప్పొంగుచుఁ దరుణతరణికిరణచ్ఛటాచ్ఛాదితంబును దపనీయవర్ణకర్ణికాధివాసంబును దామ్రకేసరవ్రాతజాతరూపస్తంభసంభార సంభృతంబును దటిద్రాగ పరాగ పరభాగ పరంపరితపట్టాంబరవితానసందీపంబును నగునిందిరామహాదేవి యొక్కనశోణారవిందస్యందనంబు క్రిందటం బటికంపుటిరుసున సంఘటించినభర్మరథాంగయుగ్మంబుల భంగి నంగీకృతైకమృదుమృణాళకాండమండితతుండంబు లగురథచరణదంపతులసొంపున కింపు మీఱుచుఁ ద్రిభువనయువలోకమోహప్రపంచనిర్మాణచుంచుం డగుపంచశరవిరించునకుఁ బడివాగె పట్టినకలధౌతఖలీనసూత్ర మంకలితకింఖాణరాజంబు లై సంచరితచంచూపుటకోరకితసరసబిసఖండసుతాయ

మానతంతుసందానితాంసంబు లగుహంసంబులం బ్రశంసించుచుఁ దరళతరంగ మాలికాస్ఫాలననటత్కమలకఁపుటసరయసముత్పతనపతనబంధుర గంధాంధ పుష్పంధయ స్తనంధయసంభంబుల జంభరిపుశిలాసంఘటితఘటికావినోదంబులు సలుపు సరోవరలక్ష్మీజలభ్రమతాటంకచక్రంబులం దళుకుక్కరను తిర్యక్ప్రసాదితకటాక్షచాకచక్యంబుఁపగిది నెగడుమగబేడిసమొత్తంబుల బిత్తరంబులు చిత్తగించుచు జలాధిదేవత తనకు నఖర్వసార్వకాలికసర్వతోముఖసమృద్ధికై వరలక్ష్మి నావహింపం జేసి కింజల్కపుంజరక్తాక్షతంబులుం గీర్ణపరాగహారిచందనంబులుం గిలితాగ్రశైవలపలాశంబులుం గ్రీడదళిధూపధూమంబులుం బరిఢవిల్ల నోమినసుధాధౌతనూతనపూర్ణకలశంబులసొంపు సంపాదించు నమందమకరందపూరితోదరదర వికస్వరపుండరీకషండంబుల మెండునకు నిండు వేడుక నెఱపుచుఁ జంచరీకకుటుంబినీఝుంకారమంగళసంగీతనాదంబులతోఁ జలాచల క్రౌంచకారండవమండలీపక్ష పటపటత్కార పటహారవంబులతోఁ జపలతరతరంగభుజోత్క్షిప్తశీకరాచారలాజంబులతో విహారదీర్ఘిక యనతి దూరమ్మున వచ్చుతమ్మునెదుర్కొనం గతుల్యాంతరంబులు గడచి యేతెంచు సొంపు దెలుపునిజవదనచంద్ర చంద్రికావృత ప్రతీక చంద్రకాంతజాతనూతన స్రోతోభరంబులయుబ్బునకు నబ్బురపాటు దొరయుచు మఱియుఁ దత్కాసారం బపరిమితపాండుపక్షవిశేషభూషితంబు గావునఁ బ్రదర్శితధార్తరాష్ట్రముఖశ్యామికం బై బహులహరివిలాసభాసురంబు గావునం బ్రథమానమీనకూర్మాద్యవతారధారకం బై యూర్మిలాభాసమానంబు గావున లక్ష్మణోపభోగభవనం బై మానసజయమహనీయంబు గావున నంతరుస్మీలితనాళీకోపరివికస్వరకమలకర్ణికానిర్నిరోధబోధమాధురీధురీణం బై రాణించుట కుదంచిత రోమాంచకంచుకితదేహ లై యవ్వరారోహలు ముదంబునం దదంబుఖేలనాయత్తచిత్త లై.

కనుంగొని = చూచినవారై, కురంగటమెలంగు వనదేవతలు=సమీపమందు సంచరించు వనాధిదేవతలు, ఆత్మీయ = స్వకీయమయిన, చిత్ర = విచిత్రమయిన, పత్ర = ఆకులయొక్కయు, లతా = తీగలయొక్కయు, తిలక=తిలకవృక్షములయొక్కయు, జాలక=పూమొగ్గలయొక్కయు, ఆలోకంబులు =ప్రకాశములను, ఆలోకింపంగోరి = చూడనిచ్ఛయించి యని వనపరమయిన యర్థము. స్వకీయమైన చిత్రిత మకరికాపత్ర లతారచనలయొక్కయుఁ గుంకుమాది రచిత తిలక జాలములయొక్కయుఁ బ్రకాశములను జూడఁగోరియని దేవతాస్త్రీపరమయిన యర్థము. కమలాకరముకురంబుక్ = సరోవరమనెడి యద్దమును, వేమఱుమెఱుంగిడక్ = పలుమాఱును మెఱుఁగుపెట్టఁగా, క్రేవలందొరఁగురాపొడికైవడిక్ = పార్శ్వమునయందు రాలిన రాపొడియో యన్నట్టులుగా, తటకటక=వలయాకారతీరమందు, రూఢ = మొలిచినవియును, ప్రౌఢ=ప్రవృద్ధములైన, తరు=వృక్షములయొక్క, పటల=సమూహామువల్లనుండి, పరిపతిత = అంతటరాలిన, పరాగబృందంబులు = పుప్పొడులకుప్పలు, నెరయునందంబుతక్ = వ్యాపించియున్న శృంగారమునకు, ఆనందంబు నొందుచుక్ =సంతోషమును బొందుచును,

నాఁడు. పెక్కుకాలంబు నిల్చినకతంబునన్=అనఁగాఁ బైతామహాశ్రమంబునఁ బంచాగ్ని మధ్యమందుఁ దడవుకాలము నిలిచి తపస్సు చేసినహేతువువల్ల ననియర్థము. పద్మమందుఁ గింజల్కములనడుమఁ దడవుకాలము నివసించుచున్నవనిభావము. ఆత్మమాలిన్యంబు దొరంగి=మనోమాలిన్యమును విడిచి యని యర్థము. దేహమాలిన్యమును బోఁగొట్టుకొని యని యర్థాంతరము. అభినవసువర్ణ తేజోవిరాజమానంబులగు తెఱంగునన్=సువర్ణము బ్రహ్మవర్ణముగనుక బ్రహ్మతేజోవిరాజమానములైనట్టులుగా ననియర్థము, బంగారపుఁ గాంతివంటి కాంతిచేత విరాజమానములైనట్టులుగా ననియర్థాంతరము. తరంగిత = తెర తెరలుగా వ్యాపించుచున్న, తదీయరజః = ఆపద్మసంబంధమైన పరాగముయొక్క, అనుషంగ = సంపర్కముచేత, పిశంగితాంగంబులగు = పసపుచాయగాఁ జేయఁబడిన శరీరములుగలిగిన, భృంగంబులంగని యుప్పొంగుచున్ = తుమ్మెదలనుజూచి మిక్కిలి సంతోషించుచు, పద్మకింజల్కములలోఁదడవు నివసించిన కతంబున మేనిమాలిన్యముతొలంగి సువర్ణకాంతితో విరాజిల్లినటుల మేనఁబసిమిరంగుల్లసిల్ల మెలంగు తుమ్మెదలనుగాంచి గిరికయుఁ జెలిమికత్తె లుల్లసిల్లిరని భావము. అలం. రూపకసంకీర్ణమగు నుత్ప్రేక్ష.

తరుణతరణి=బాలసూర్యునియొక్క, కిరణ=కిరణములనెడు, ఛద = వస్త్రములయొక్క, ఛటా= సమూహముచేత, ఆచ్ఛాదితంబును = కప్పఁబడినదియును, తపనీయవర్ణ = సువర్ణచ్ఛాయగల, కర్ణికా= మిద్దెయనెడు రథకర్ణికను, అధివాసంబును = స్థానమైనదియును, తామ్రకేసర = అరుణకింజల్కములయొక్క, వ్రాత=సముదాయమనెడు, జాతరూపస్తంభ సంభార=కాంచనస్తంభ సమూహముచేత, సంభృతంబును=లెస్సగ భరింపఁబడినదియును, తటిద్రాగ = మెఱుపుతీఁగెవలె నెఱ్ఱగానున్న, పరాగ = పుష్పాదియొక్క, పరభాగ = గుణోత్కర్షము లనెడు, (ని. 'పరభాగో గుణోత్కర్షే') అని కోశము. పరంపరిత = పరంపరగా నాచరింపఁబడిన, పట్టాంబరవితాన = పట్టువస్త్రపు మేల్కట్లచేత (ని. 'అస్త్రీవితానముల్లోచః' అని అ.) సందీపితంబును = లెస్సగాఁ బ్రకాశించుచున్నదియును, అగు = అయినట్టి, ఇందిరామహాదేవి యెక్కిన లక్ష్మీదేవి యారోహణము సేసిన, శోణారవింద స్యందనంబుక్రిందటన్ =అరుణకమలమనెడు రథముక్రింద, పటికంపుటిరుసున సంఘటించిన=స్ఫటికమయమగు నిరుసునఁ బూన్చిన, శర్మరథాంగ యుగ్మంబులభంగిన్ = సువర్ణరథచక్రములో యన్నట్టులుగా, అంగీకృత = స్వీకరింపఁబడిన, ఏక=ఒక్కటైన, మృదు = కోమలమైన, మృణాళకాండ = తామరతూఁడుచేత, మండిత = అలంకరింపఁబడిన, తుండంబులగు=చంచువులుగలిగిన, రథచరణదంపతుల = చక్రవాకమిథునములయొక్క, సొంపున కింపుమీఱుచున్ = చక్కదనమునకు నిష్టమువహించుచు, లక్ష్మీదేవి యెఱ్ఱతామర తేరెక్కెను. ఆ తేరునకుఁ గింజల్కసమూహము కాంచనస్తంభములు, పుష్పాదిమేల్కట్టులగుపట్టువలువలు నోటఁ దమ్మితూడుగొనియున్న యంచజంటచక్రములు. నోటఁగల తూ డిరుసు. రథకర్ణికతమ్మిగద్దియ. సూర్య కిరణములు పట్టువస్త్రములుగా నున్నవనిభావము. దానిని గాంచి యానందించిరనుట.

అలం. రూపకము.

త్రిభువన=స్వర్గమర్త్యపాతాళములయందలి, యువలోక = యౌవనపురుషసమూహముయొక్క, మోహప్రపంచ=మోహవిస్తారమనెడు ప్రపంచముయొక్క, నిర్మాణ=సృష్టియందు, చుంచుండగు=ప్రసిద్ధుఁడైన, (నిర్మాణచుంచుం డనికలిపి యర్థము వ్రాయవలెను. చుంచుండని విడఁదీసినచో 'చుంచు' అను నది ప్రత్యయముగావునఁ బ్రకృతినివిడచి ప్రత్యయమున కర్థముఁ జెప్పరాదు.) ('తేనవిత్తశ్చుంచుప్చణపౌ') అని ప్రసిద్ధార్థమందుఁ జుంచుప్ప్రత్యయము. పంచశరవిరించునకున్ = మన్మథుఁడనెడుబ్రహ్మకు

'విశిఖ్యః విశిఖ్యాః విశిఖ్యాసః' అని మూఁడువిధములుగాఁ బ్రయోగములు గలవు. పడివాగెపట్టిన=జిల్లు లీలఁబట్టిన, కలఘోత = పెంపితోఁజేసిన, ఖలీనసూత్ర = కళ్లెపుత్రాడులతోడ, సంకలిత=కూడుకొన్న, కంఖాణరాజంబులై = హయశ్రేష్ఠములై, సంచరిత = సంచరించుచున్న. చంచుపుట = కొక్కులవంటి ముక్కులయందు, కంచుకిత = కట్టఁబడియున్న, నవనవిసఖండ = పచ్చితామరతూఁడులయొక్క, సంతాయమాన = దీర్ఘములగుచున్న, తంతు = సూత్రములచేత, సంఘాటిత = కట్టఁబడిన, అంచంబు లగు = మూపులుగలిగినవైన, హంసంబులకు = మరాళములకు, ప్రకటించుచుఁ = కొనియాడుచును, మన్మథప్రపంచము=మోహప్రపంచము, ఇతనియశ్వంబులు హంసలవలె నని తెలియవలెను. హంసము తనయంసమువఱకు వ్రేలుచున్న పచ్చితామరతూఁడు తోఁటఁ గాన్పించును. పెంపెక్లెము తోఁటఁబట్టి పొడవైన కళ్లెపుఁబగ్గములు వీపుపై వైచిన మన్మథాశ్వములవలె నంచలు నటించుచున్నవని భావము. అలం. రూపకసంకీర్ణోత్ప్రేక్ష.

తరళ = చంచలించుచున్న, తరంగ = కెరటములయొక్క, మాలికా=పంక్తులయొక్క, ఆస్ఫాలన= తాఁకుడులచేత, నటత్ = కదలియాడుచున్న, కమల = పద్మములనెడు, కరపుట = దోయిలివల్లనుండి, సరయ = వేగముతోఁ గూడుకొన్నట్టులుగా, సముత్పతత = పైకెగయుటచేతను, పతత=వ్రాలి తిరుగాఁ బడుటచేతను, బంధుర = సుందరములగుచున్న, గంధాంధ = మదాంధములైన, పుష్పంధయ=తుమ్మెదల యొక్క, స్తనంధయ = పిల్లలనెడు, దంభంబునన్ = వ్యాజముచేత, జంభభిత్ = ఇంద్రసంబంధమైన, శిలా = రాళ్ళచేత-అనఁగా నింద్రనీలమణులచేత, సంఘటిత = రచింపఁబడిన, ఘుటికా=గుండ్లయొక్క, వినోదంబులుసలుపు = ఆటలాడుచున్న, సరోవరలక్ష్మీ=పద్మాకర లక్ష్మియొక్క, జలభ్రమ=సలిలావర్తము లనెడు, తాటంక చక్రంబులన్ = చక్రాకారములైన కాఁజులకమ్మలయందు, తళుక్కుమను=తళుక్కురని మెఱయుచున్న, తిర్యక్ప్రసారిత = అడ్డముగాఁ బ్రసరించుచున్న, కటాక్ష=క్రేఁగంటి చూపులయొక్క, చాకచక్యంబులపగిదిన్ = చకచకాయమానములో యున్నట్టులుగా, నెరయు = ప్రకటమగుచున్న, మగబేడిసమొత్తంబుల = గండుబేడిస చేపగుంపులయొక్క, బిత్తరంబులు = విలాసములను, చిత్తగించుచున్ = మనస్కరించుచును, సరోవరలక్ష్మి యాడుకొను బాలిక, తరంగముల తాకిడిచేఁ గదలు తమ్మిపూలామె కరపుటములు, అందుండి యెగురుచు వ్రాలుచున్న తుమ్మెదలు ఇంద్రనీలశిలాకల్పితము లగు నచ్చనగండ్లు, ఎగసిపడుచున్న బేడిసమీలు చెవిరిగల వజ్రాలకమ్మలపైఁ దళుక్కురను క్రేఁగంటి చూపులుగ నిందుఁ జెప్పఁబడెను.

అలం. రూపకసంకీర్ణోత్ప్రేక్ష.

జలాధిదేవత = సలిలాధిదేవత యనెడు దేవకాంత, తనయన్ = తనను, అఖర్వ=ఉన్నతమును, సార్వకాలిక = శాశ్వతమునైన, సర్వతోముఖ = అంతటవ్యాపించునట్టి, సమృద్ధికై = సంపదకొఱకని యర్థము. అధికమును సర్వకాలస్థితము నైన సర్వతోముఖముయొక్క, అనఁగా నుదకముయొక్క సమృద్ధికొఱకని భావము. వరలక్ష్మి నావహింపఁజేసి = వరలక్ష్మీదేవిని నావాహనముచేసి యని యర్థము. పద్మములు లక్ష్మీదేవికి విహారస్థానములని భావము. కింజల్కపుంజరక్తాక్షతంబులన్ = పద్మకేసరముల నెడి యెఱ్ఱనియక్షతలును, కీర్ణపరాగ హారి చందనంబులన్ =వ్యాప్తమైన పుప్పొడియనెడుపచ్చని శ్రీచందనంబులను, కీలితాగ్రశైవలపలాశంబులన్ = అంతర్నిక్షిప్తము లైనమొదళ్లు గల శైవలముల నెడు అనఁగా నాచుతీఁగెలనెడు నాకులును, క్రీడత్ =విహరించుచున్న, అళి=తుమ్మెదలనెడు, ధూపధూమం

బులున్=అగరు సాంబ్రాణి ధూపములయొక్క పొగలును, పరిధవిల్లన్ = ఒప్పుచుండునట్టులుగా, నోమినన్=నోచినట్టి, సుధాధౌత=సున్నముచేతఁ దెల్లనైన, నూతన = నవీనములైన, పూర్ణకలశంబుల = జలపూరితములైన కలశములయొక్క, సొంపుసంపాదించు=శృంగారమును గలుగఁజేయుచున్న, అనఁగా వానివలెనే యున్నట్టివనుట. అమంద = అతిశయమయిన, మకరంద=పూఁదేనియచేత, పూరిత=నిండింపఁబడిన, ఉదర = గర్భములుఁగలిగిన. దరవికస్వర = కొంచెముగా వికసించిన, దరవికస్వరములు గనుకఁ గలశములవలె నున్నవని చెప్పినాఁడు. అటువంటి, పుండరీక షండంబుల=శ్వేతపద్మసమూహములయొక్క, మెండునకున్ = బాహుళ్యమునకు, నిండువేడుక నెఱపుచున్ = పూర్ణోత్సాహమును బ్రకటించుచు, కొంచెమువిచ్చి తేనెనిండిన తామరపూలు జలదేవత లక్ష్మి నాహ్వానముఁజేసి పూజించుపాత్రములటు లున్నవనియుఁ గింజల్కము లక్షతలవలెను, పరాగము గందమువలెను, నాచు పాత్రాంతమందుంచిన యాకులవలెను, తుమ్మెదలు ధూపమువలెను, లోనితేనియ పాత్రాంతరమునఁగల జలమువలెను నుండెనని భావము. అలం. రూపకసంకీర్ణ నిదర్శన.

చంచరీకకుటుంబినీ = ఆఁడుతుమ్మెదలయొక్క, ఝుంకార=ఝుంకారములనెడు, మంగళ సంగీత నాదంబులతోన్ = మంగళార్థకములైన సంగీతరవములతోడను, చలాచల = చలితములైన, క్రౌంచ= కొంగలయొక్కయు, కారండవ = కన్నెలేడు పులుఁగులయొక్కయు, మండలీ=సమూహములయొక్క, పక్ష = ఱెక్కలయొక్క, పటపటత్కార = పటపట యను ధ్వనులనెడు, పటహారవంబులతోన్ = తప్పెటలయొక్క నాదములతోడను, చపలతర = మిక్కిలి చలించుచున్న, తరంగ = కరుళ్ళనెడు, భుజ = హస్తములచేత, ఉత్క్షిప్త=ఎగఁజల్లఁబడుచున్న, శీకర=తుంపురులనెడు, ఆచారలాజంబులతోన్= మంగళాచారలాజములతోడను, ఇందుకు, (శ్లో. 'ఆచారలాజైరివ పౌరకన్యాః') అని రఘువంశమందుఁ బ్రయోగము. లాజములనఁగా వరిపేలాలు. విహారదీర్ఘిక = క్రీడాసరోవరము, అనతిదూరమ్మునన్ = సమీపమందు, వచ్చు = వచ్చుచున్న, తమ్మునెదుర్కొనన్=తమ్ము నెదురుకొనెడుకొఱకు, కక్ష్యాంతరంబులు గడచి యేతెంచుసొంపుదెలుపు = బలవంతులయొక్క యంతరములు దాఁటివచ్చునట్టి యొయ్యారము గనుపఱుచుచున్న, కక్ష్యయనఁగా బవంతి. (ని. 'కక్ష్యా ప్రకోష్ఠే హర్మ్యాదేః' అని అ.) నిజ = తమయొక్క, వదన = ముఖములనెడు, చంద్ర=చంద్రులయొక్క, చంద్రికా=వెన్నెలచేత, ఆవృత= ఆవరింపఁబడిన, ప్రతీర చంద్రకాంత=తీరమందలి చంద్రకాంతమణులవల్ల, (ని. 'కూలం రోధశ్చ తీరఞ్చ ప్రతీరఞ్చ తటం త్రిషు' అని అ.) జాత = పుట్టిన, నూతన=నవీనములయిన, స్రోతః=జలప్రవాహముల యొక్క, భరంబుల=అతిశయములయొక్క, ఉబ్బునకున్=హెచ్చునకు, అబ్బురపాటు దొరయుచున్= ఆశ్చర్యమును బొందుచు, పొలఁతుకలమోము జాబిల్లిచలువచే సరోవరపుగట్టునఁ గల చంద్రకాంత శిలలనుండి నీరుబుకుట చెలువల నెదుర్కొనవచ్చునట్లుగను, తేటిమ్రోఁతలు సన్నాయిగను పక్షిరవములు మద్దెలలుగను, దరంగములనుండి లేచుతుంపురులు లాజములుగను నుండి స్వాగతవస్తుసంతతివలె నలరెనని భావము. ముఖచంద్రునివలనఁ జంద్రకాంతశిలలు స్రవించుట, కలువలు వికసించుట లోనగునవి కవి సమయసిద్ధములు.

అలం. రూపకసంకీర్ణోత్ప్రేక్ష.

మఱియుఁ దత్కాసారంబు = మఱియు నాకొలను, అపరిమిత = మితములేని, పాండురాజ సంబంధులైన యుధిష్ఠిరప్రభృతులయొక్క, పక్ష = బలముచేత, విశేష భూషితంబుగావునన్ = మిక్కి-

ఁడయు నలంకరింపఁ బడినది గనుక, ప్రసస్పిత=కపటముగుబడిన, భాస్కరాస్త్ర=మత్స్యకూర్మాదులయొక్క, ముఖశ్యామికంబై = ముఖమైనట్టి శ్యామము గలదై యని యర్థము. హంసపక్షములనఁగా శుక్లపక్షములు గలహంసలు, (ని. 'హంసాస్తు శ్వేతగరుతః' అని అ.) భాస్కరాస్త్రములనఁగా మిక్కిలివక్రమైన ముక్కులును పాదములునుగల హంసలు, (ని. 'భాస్కరాస్త్ర సితచ్ఛదః' అని అ.) ఇట్టి యపరిమితములైన హంసభేదములచేత శోభితమైనదియు భాస్కరాస్త్రములనెడు హంసలయొక్క చంచు చరణ వైశ్యముగలదియునని భావము. శ్లేషమూలక వ్యతిరేకాలంకారము. బహుల = అనేకవిధము లయిన, హరివిలాస = నారాయణునియొక్క విలాసములచేత, భాసురము గావునన్ = ప్రకాశమాన మయినదిగనుక, ప్రధాన = ప్రసిద్ధములగుచున్న, మీనకూర్మాద్యవతారభారకంబై = మత్స్యకూర్మా ద్యవతారయుక్తమయినదై యనియర్థము. బహు = అనేకములయిన, హరి=మహావిష్ణువుయొక్క, విలాసభాసురంబు = విలాసముచేతఁ బ్రకాశమానమయినదియును, మత్స్యకూర్మాదులయొక్క యావిర్భావముల చేత భారాళమయినదియు నని భావము. ఊర్మిశాఖాసమానంబు గావున లక్ష్మీభోగభవనంబై = ఊర్మిశయనఁగా లక్ష్మీదేవిభార్య. ఊర్మిశాఖచేఁ బ్రకాశమానమయినది గనుక లక్ష్మణునకుఁ గేళీగృహమయినదై యని యర్థము. ఊర్మి = తరంగములయొక్క, శాఖ = ప్రాప్తితోడ, అసమానంబు=అసమానమయినదియు, లక్ష్మణా = ఆఁడుపెద్దపక్షులకు, ఉపభోగభవనంబై = భోగాస్థ మయినదియు నని భావము. లక్ష్మణాశబ్దము సారసములనెడు పేరుగల పెద్దపక్షులయొక్క యాఁడు పక్షులకుఁ బేరు. (ని. 'హంసస్యయోషి ద్వరటా సారసస్య తు లక్ష్మణా' అని అ.) మానసజయమహనీయంబుగావునన్ = మనోజయముచేత మహనీయమయినది గనుక, అంతరుస్మితి=అంతస్స్మితమయిన, నాళికోపరి = షట్కమలోపరిస్థితమయినట్టి, ఇక్కడ నాళికశబ్దము కమలపరము. వికస్వర కమలకర్ణికా= సహస్రారపద్మ కర్ణికాకార చంద్రమండలమువల్లనుండి, నిర్నిరోధ = నిరర్గళమగునట్టులుగా, బోధ = ఉద్భవమయిన, మాధురీ = సుధామాధురికి, ధురీణంబై = ధురంధర మయినదై యని యర్థము. ఈ యర్థము సాంబభుజంగమందుఁ జెప్పఁబడినది.

శ్లో. 'తమో మోచకై రేచకైః పూరకాద్యై స్సమిద్ధీకృతాధారవహ్నిప్రభద్భిః,
హఠాల్లంబికారాజయోగప్రభావా ల్లుఠత్కుండలివ్యక్తముక్తావకాశామ్,

సహస్రారపద్మస్థితాపారవారాం సుధామాధురీం సాధురీత్యాపిబన్మే.'

అని సాంబభుజంగమునఁ గలదు గనుక నీశ్లోకార్థ మనుసంధింపవలయును. మానససరోవర జయముచేత మహనీయ మయినదియు నంతరుస్మితనాళికములును అనఁగా లోపల నుత్పన్నమగు చున్న నాళములును, ఇక్కడ నాళికశబ్దము నాళపరము. ఉపరివికస్వరకమల = ఉపరిభాగమందు వికసించుచున్న కమలములును, కర్ణికానిర్నిరోధబోధమాధురి యనఁగా, కమలములయందలి మిద్దెల యొక్క నిరోధాభావమయిన వికాసమును, వీనిః, ధురీణంబు అనఁగా భారవాహమైనదియు నని భావము. మధురసంబంధమయినది మాధురి, మాధురి యనఁగా నిక్కడ మనోహరత్వమని తెలియవల యును. రాణించుటకున్ = ఒలాగంటినై యొప్పుటకు, ఉదంచిదరోమాంచ=ఉత్కృష్టమయిన గగ్గురు పాటుచేత, కంచుకిత = వ్యాప్తములయిన, దేహులై = శరీరముగలవారై, అప్సరారోహులు = అప్సరస్త్రీలు, ముదంబునన్ = సంతోషముచేత, తదంబుఖేలనాయత్తులై=ఆసరోవరజలక్రీడాధీనములైన మానసములు గలవారై, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

సీ. తనయిల్లు దామర♦తంపమై మెఱయ సంపన్నలినాక్షి గా♦పున్నచోటు
వలరాజు ముజ్జగం♦బులు గెల్చి దర్ప మేర్పడ నిజాంకశరంబు♦ లిడినచోటు
వలిగాలి పన్నగా♦వలిగాహితగరాగ్ని ఘోరసంజ్వరము వీ♦డ్కొనినచోటు
తొగకొమ్మదమిగ్రమ్మ♦దగురాజుకరమంటి యెండకన్నెఱుగక♦యొసఁగుచోటు
తే. ఇందుముఖులార యిది సుఁడీ♦ యిందుఁ గ్రుంకి
మదనుఁ బూజింపఁ గోర్కులు♦ పొదలు ననుచుఁ
దొడవు లటు వెట్టి వలిపెపా♦వడలు గట్టి
శృంగములు పట్టి నీరాడఁ♦ జేరునపుడు. 155

తనయిల్లు దామరతంపమై మెఱయన్ = తనయొక్క యిల్లు పుత్రపౌత్రాభివృద్ధి గలదై ప్రకాశించునట్టులుగా, సంపన్నలినాక్షి (సంపత్ +నలినాక్షి)=లక్ష్మీదేవి, కాపున్నచోటు=కాపురమున్న స్థలము అని యర్థము. తామర యిల్లుగాఁ గలదైయున్నదని భావము. అభివృద్ధి విషయమై తామరతంప మనుట లోకోక్తి. అర్థద్వయమునకు నభేదాధ్యవసాయము. తనయిల్లు దామర తంపమై మెఱయ నని చెప్పుటచేత నభివృద్ధికరత్వంబును సంపన్నలినాక్షి కాపున్నదని చెప్పుటచేత నిశ్చలసంపత్ప్రదత్వంబును జోటునకుఁ దెలియఁ బడుచున్నది. వలరాజు = మన్మథుఁడు, ముజ్జగంబులు గెల్చి = మూఁడు లోకము లను జయించి, దర్పమేర్పడన్ = గర్వము తేటపడునట్టులుగా, నిజాంకశరంబు లిడినచోటు = అంక మనఁగా ధ్వజంబును, శరములనఁగా బాణములును గనుకఁ దనయొక్క ధ్వజబాణములను బెట్టియుంచిన స్థలమని యర్థము. మీనములును బద్మములును గలిగియున్నదని భావము. త్రిభువనజయసాధనాశ్ర యత్వము చోటునకుఁ దెలియఁబడుచున్నది. వలిగాలి = చల్లగాలి – అనఁగా మలయమారుతము, పన్న గావలి = మలయాచలమందలి సర్పసమూహమువల్ల, గాహిత = ప్రవేశించిన, గరాగ్ని = విషానలము యొక్క, ఘోర = భయంకరమయిన, సంజ్వరము = సంతాపమును, వీడ్కొనిన చోటు = పోఁగొట్టు కొనిన స్థలమని యర్థము. శీతలోదకములు గలదని భావము. ఉపద్రవనివర్తకత్వము చోటునకుఁ దెలియఁబడుచున్నది. తొగకొమ్మ = కుముదినీకాంత, దమిగ్రమ్మన్ = తమకము గ్రమ్మఁగా, తగురాజుకర మంటి=తగినరాజుయొక్క పాణిగ్రహణమువడసి, ఎండకన్నెఱుగక యొసఁగుచోటు = కష్టలేశమును గుర్తెఱుఁగక యొప్పుచున్న స్థలమని యర్థము. తమిగ్రమ్మన్ = రాత్రి కాఁగానే, తగురాజు కరమంటి = యుక్తుఁడైన చంద్రునియొక్క కిరణస్పర్శగలదై, ఎండకన్నెఱుఁగక యొసఁగు = సూర్యరశ్మిని గుర్తెఱుఁ గక యున్నదని భావము. తగురాజుకరమంటియని చెప్పుటచేత శుభహేతుత్వంబును, ఎండకన్నెఱుఁగక యొసఁగుట యని చెప్పుటచేత సుఖసంపాదకత్వమును జోటునకుఁ దెలియఁ బడుచున్నది.

ఇందుముఖులార యిదిసుఁడీ = ఓచెలులారా యీపైనిఁ జెప్పఁబడిన గుణములుగల స్థలముసుండీ యిది, ఇందుఁగ్రుంకి=కోనేటిలో స్నానము చేసి, మదనుఁ బూజింపఁ గోర్కులు పొదలు ననుచున్ = మన్మథునిఁ బూజింపఁగాఁ గోరికలు సిద్ధించునని యొకరి కొకరు చెప్పుకొనుచు, తొడవులటు వెట్టి = ఆభరణములు తీసి యొక్కచోటనుంచి, వలిపెపావడలుగట్టి = సన్నపుబట్టలుదొడిగి, శృంగములుపట్టి = చిమ్మఁగ్రోవులుచేతఁబట్టుకొని, నీరాడఁజేరునపుడు=జలక్రీడసలుపునిమిత్తమై చేరినసమయమందు.

లక్ష్మీగృహము తామరతంపర యగుటయు, వలరాజు మూఁడులోకములు గెలుచుటయు, వలి గాలి ఘోరసంజ్వరము తొలంగుటయుఁ, గలువకన్నె యెండయెఱుంగక బ్రతుకుటయు సరోవర

ప్రశస్తిహేతువులు. ఇన్నియు మదనస్త్రీతిరకములైనగాన మన్మథపూజార్థము మును స్నానముచేయుట యొప్పియున్నదని భావము. అలం. అతిశయోక్తి. కావ్యలింగము.

చ. కరముల మూఁపు లూఁదుకొని • కన్నెలు చన్నులబంటి నీట నొండొరుల్
బరిగొని నిల్వఁ దత్పరిధి • ప్రాంశుదృగంశుకలాపపూరితాం
తర మయి పొల్చె భావభవ • దైవతభావితహేమకుంభసం
భరితమృణాళమండలిత • పద్మమయప్లవమండలంబనన్. 156

కరములమూఁపులూఁదుకొని = హస్తములచేత భుజములఁబట్టుకొని, కన్నెలు = పడుచులందఱును, చన్నులబంటిన్ = కుచములపర్యంతమైన నీటియందు, ఒండొరుల్బరిగొనినిల్వఁగన్ = పరస్పరము జుట్టుకొని నిలువఁగా, తత్పరిధి = ఆకన్నెలయొక్క పరివేషాకారమండలము, ప్రాంశు = పొడవైన, దృగంశు కలాప = నేత్రకాంతి స్తోమముచేత, పూరిత = నిండింపఁబడిన, అంతరము = మధ్యప్రదేశముగలదై, భావ భవ = మన్మథుఁడనెడు, దైవత = దేవునిచేత, భావిత = కల్పింపఁబడిన, హేమకుంభసంభరిత = సువర్ణ కుంభములచేత లెస్సఁగా భరింపఁబడినదియు, మృణాలమండలిత = తామరతూఁడులచేత మండలా కారముఁ జేయఁబడినదియునగు, పద్మమయప్లవ = తామరపువ్వుల తెప్పయొక్క, మండలంబనన్ = వల యమో యన్నట్టులుగా, పొల్చెన్ = ప్రకాశించెను.

ఇక్కడఁ గుచయుక్తమైనదియు భుజావలయిత మయినదియునగు మండల మధ్యప్రదేశ మందుఁ బ్రసరించిన నేత్రకాంతిస్తోమమును హేమకుంభ సంభరితంబును మృణాళమండలితము నైన మండలాకార పద్మపల్లవమునుగా నుత్ప్రేక్షించినాఁడు. బరియనెడు పదమందలి రేఫము శకటరేఫ మని సంశయింపఁ జనదు. గుబ్బలు పయికిఁ గానుపింపఁ జెలులు చక్రాకారముగా నీటిలోఁ దిరుగ సాగిరి. వారిగుబ్బలు కుండలవలెను, వారిచూపులు పద్మములవలెనుంటచేఁ జెప్పయుత్సవము నాఁటి పడ వలవలెఁ జెలులు కాన్పించిరి. కాని జరుగవలసినది భావభవుని తెప్పయుత్సవము గాన గుబ్బలు తమ్మి మొగ్గలవలెను జూపులు తమ్మితూఁడులవలెనుండి వానితోఁ గట్టిన పడవవలె వారియునికి యుండెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

చ. నెలఁతలు బంతి గట్టుకొని • నీ రెగఁ జల్లఁ దదీయమంజులాం
జలికలితోదకం బెగయు • జాడ నుతింపఁగ నయ్యెఁ దత్కుచాం
చలజఘనాభిఘాతములు • సైఁచక మ్రోయుచుఁ బద్మయుక్తమై
కొలను సరోజబాంధవున • కున్ మొఱ వెట్టఁగ నేఁగుకైవడిన్. 157

నెలఁతలు బంతిగట్టుకొని = స్త్రీలు చుట్టుకైవారముగాఁ బంక్తిగట్టుకొని, నీరెగఁజల్లన్ = నీరుపై కెగఁజల్లఁగా, తదీయ = స్త్రీలసంబంధమైన, మంజుల = మనోహరములైన, అంజలి = దోసిళ్లయందు, కలిత = ఒప్పుచున్న, ఉదకంబు = నీరు, ఎగయుజాడ = ఎగసెడురీతి, నుతింపఁగనయ్యెన్ = కొనియాడఁ దగి యుండెను. ఏలాగుననఁగా, తత్ = ఆస్త్రీలయొక్క, కుచాంచల = స్తనాగ్రములయొక్కయు, జఘన = కటిపురోభాగములయొక్కయు, అభిఘాతములు = తాఁకుడుదెబ్బలను, సైఁచక = సహింపలేక, మ్రోయుచున్ = ధ్వనిచేయుచు, పద్మయుక్తమై = కమలములతోఁ గూడుకొన్నదై, కొలను = సరోవరము, సరోజ బాంధవునకున్ మొఱవెట్టఁగ నేఁగుకైవడిన్ = కమలములకాప్తుఁడైన సూర్యునకు మొఱవెట్టుకొనుటకు బోవుచున్నదో యన్నట్టులుఁగా, నుతింపఁగనయ్యె నని సంబంధము.

ఇక్కడ నంజలియుక్తములైన సరోవరసలిలములయొక్క సముత్పతనమును సరోజయుక్తమయిన సరోవరము సరోజబాంధవునితో మొఱపెట్టఁబోవుటగా నుత్ప్రేక్షించినాఁడు. అనఁగా సరోవరము దనయందుఁ బుట్టిన సరోజములతోఁ గూడుకొని యాసరోజములకు బాంధవుఁడైన సూర్యుని యొద్దకు మొఱపెట్టఁ బోవుచున్నట్లుండెననుట. నెలఁతలు బాలిగట్టుకొని కుచాంచలాభిఘాతములు జఘనాభిఘాతము లొనర్చుట దుస్సహ మయ్యెను. కాన మ్రోయుటయే మొఱపెట్టుకొనుట. పద్మములతోఁ గలసి సరోవరము మొఱపెట్టుకొనఁబోవుట పద్మబాంధవుని సహాయముఁ బడయుటకు. అనఁగా సరోవరమందు సతులు జలక్రీడ గావింప జలము కల్లోలమయ్యెననియు వినోదమునకై సతులు జలమెగఁజిమ్ముచు జలక్రీడలు గావించిరనియు భావము. అలం. ఉత్ప్రేక్ష.

మ. చిగురుంజిమ్మనగ్రోవిలో నొకతె రాజీవాసవం బుంచి పై
నిగిడింపన్ గమకింప నొక్కనవలా నెమ్మోము వేఁ ద్రిప్పిన
న్జగజంపై నెఱిగుంపు గప్పుకొనియె న్దత్క్షిప్తమాధ్వీరసం
బు గొనం బంచినచంచరీకపృతనాపుంజంబుచందంబునన్. 158

చిగురుంజిమ్మనగ్రోవిలోన్ = చిగురుటాకులచేత రచింపఁబడిన చిమ్మనగొట్టములో, ఒకతె = ఒకస్త్రీ, రాజీవాసవంబుంచి = పద్మసంబంధమైన మకరందమునునింపి, పైనిగిడింపన్ గమకింపన్ = పైనఁ జిమ్ముట కుద్యుక్తపడఁగా, ఒకనవలా = ఒకస్త్రీ, నెమ్మోము వేఁ ద్రిప్పినన్ = ముఖమును శీఘ్రముగా నవతలికి మళ్లింపఁగా, జగజంపై నెఱిగుంపు = సొగసుమించి తలవెండ్రుకల యొక్క గుంపు, కప్పుకొనియెన్ = ముఖమును గ్రమ్ముకొనియెను. అనఁగా ముఖము ద్రిప్పఁగానే కొప్పువీడి వెండ్రుకలు పరవంజె నని యర్థము. ఏలాగనిన, తత్ = ఆమొదటిస్త్రీచేత, క్షిప్త = చిమ్మఁబడిన, మాధ్వీరసంబు = మకరందమును, కొనన్ = హరించుకొనుటకు, పంచిన=పంపఁబడిన, చంచరీక పృతనాపుంజంబు చందంబునన్=భ్రమర సేనాసమూహమో యన్నట్టులుగా కప్పుకొనియె నని సంబంధము.

నెఱిగుంపుసొంపు నెఱపెన్ అని సోమకవిపాఠము. అనగాఁ గొప్పువీడ్పి వెండ్రుకలఁబఱచె ననుట. పెన్నెఱిజగజంపు (మిక్కిలిజాపు)గానుంటవలనఁ జంచరీకములనక చంచరీకపృతనాపుంజమని చెప్పఁబడెను. తుమ్మెదసేనలగుంపులు గానఁ జివురాకుగ్రోవిలోని తేనెఁ గ్రోలుట సామాన్యకార్యమె. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. కొందఱుమందగామినులకోమలపాణితలంబు లొక్కయిం
దిందిరనీలవేణితెలినెమ్మొగ మంబుల ముంచునొప్పు నె
న్నం దగుఁ దావుబల్మి నళినమ్ములు దొమ్ములు గూడి క్రమ్మి పూ
ర్ణేందుని ముచ్చు గొన్నరుచు లిమ్మని నీటికిఁ దార్చుకైవడిన్. 159

కొందఱు మందగామినుల = కొంతమంది స్త్రీలయొక్క, కోమలపాణితలంబులు = మృదువైన హస్తతలములు, ఒక్కయిందిందిరనీలవేణి = ఒకానొక స్త్రీయొక్క, తెలినెమ్మొగము = తేటగల చక్కని ముఖమును, అంబులన్ ముంచునొప్పున్ = జలములయందు ముంచుచున్న సొగసును, ఎన్నందగున్ = కొనియాడఁదగును. ఏలాగని, తావుబల్మికిన్ = స్థానబలముచేత, నలినమ్ములు = కమలములు, దొమ్ములు గూడి క్రమ్మి = దొమ్మిచేసిచుట్టుకొని, పూర్ణేందునిన్ =సంపూర్ణచంద్రుని, ఇక్కడ ముఖచంద్రుని నని

ల్గాసిలఁ జేసి కైకొనియెఁ గర్ణికఁ దత్కమలాధివాససిం
హాసనముం హరించి నిజహస్తగతంబుగఁ జేయుచాడ్పునన్. 161

ఓర్తు=ఒకవనిత, హాసవిలాసచంద్రికలకున్ = నాయొక్క చంద్రికాసదృశమయిన నవ్వుయొక్క విలాసములకు, అబ్జిని మోము ముడుంచున్ = కమలము ముఖము ముడిచిపెట్టుచున్నది-అనఁగా సహింపక యున్న దనుట. దీనికిన్ = ఈకమలమునకు, ఉద్భాసి = మిక్కిలి ప్రకాశించుచున్న, రమా = సంపద్విషయమయిన, అవలేపముగదాయని = గర్వముగదా యని యర్థము. కమలము లక్ష్మీస్థానమని భావము. ఓర్తు = ఒకస్త్రీ, దళప్రకాండముల్గాసిలఁజేసి = దళములనఁగా దామరఱేకులును సేనలును, శ్రేష్ఠమయిన ఱేకులనెడు సేనాసమూహములు గాసిపడునట్లుచేసి, తత్కమలాధివాససింహాసనమున్ హరించి నిజహస్తగతంబుగఁ జేయుచాడ్పునన్ = ఆలక్ష్మీవాసమయిన సింహాసనమును దీసికొని తన హస్తగతము చేసికొన్నట్టులుగా, కైకొనియెఁ గర్ణిక = ఆకమలమందలి మిద్దె చేతిలోకిఁ దీసికొనెను. తమ్మిపూవు చెలులనగవు వెన్నెలఁగాంచి యోరువక మూతి ముడుచుచున్నది. దీనికి రమావలేపముగలదని కినుకనొంది యొకచెలి దళములుగిల్లి కమలాసింహాసనమును వశపఱచికొనినటుల తమ్మిలోనిగద్దియఁ జేకొనెను. అలం. ఉత్ప్రేక్ష. సమాసోక్తి.

శా. ఓలోలాంబక యోల యోల యన నోలో లంచు మేలంబునన్
లోలంబాలక యోర్తు గ్రుంకి బిసవల్లు ల్దున్మితూఁటాడి కెం
గేలం బట్టి తటాలునన్ నెగసె నక్షీణాంబునాథాంబుజా
క్షీలోకంబు జయించి వారలయశశ్శ్రీఁ దెచ్చుచందంబునన్. 162

ఓలోలాంబక = చంచలనేత్రములుగల యోచెలియా, ఓలంబాలకయని పాఠాంతరముగలదు. అపక్షమున, లంబ = వ్రేలుచున్న, అలక = ముంగురులుగల యోచెలియాయని యర్థమగుచున్నది. ఓల యోలయనన్ = మీఁద నీరుచల్లుచు ఓలయోలయని యొకస్త్రీచెప్పఁగా, ఓలోలంచుమేలంబునన్ = ఓలయోలయని తిరిగిపలుకుచుఁ గోడిగముచేత, లోలంబాలకయోర్తు = లోపలవ్రేలుచున్న ముంగురులు గలయొక్క స్త్రీ, రలయోరభేదః అని యున్నది గనుక లోలంబాలక రోలంబాలక యగును. అనఁగాఁ దుమ్మెదలవంటి ముంగురులుగల స్త్రీయని యయినను జెప్పవచ్చును. (ని. 'ఇందిందిర శ్చంచరీకో రోలంబో బంభరోపిచ' అని అ.) రోలంబాలకయనెడు అహోబలపత్యంగీకృతపాఠమందును దుమ్మెదలవంటి ముంగురులుగల యొకస్త్రీయని యర్థము. క్రుంకి=నీటిలోమునిఁగి, బిసవల్లుల్దున్మితూఁటాడి = తామర తూండ్లను ద్రుంచి తునుకలుచేసి, కెంగేలంబట్టి = చేతఁబట్టుకొని, తటాలునన్నెగసెన్=గుప్పునఁ బైకి లేచెను. ఏలాగనిన, అక్షీణ = సంపూర్ణమయిన, అంబునాథ = జలాధినాథుఁడైన వరుణునియొక్క, అంబుజాక్షీ లోకంబున్=స్త్రీజనసమూహమును, జయించి=సౌందర్యముచేత గెలిచి, వారల యశశ్శ్రీఁ దెచ్చుచందంబునన్ = వారియొక్క కీర్తిసంపదను దీసికొని వచ్చినట్టులుగా, తటాలున నెగసె నని సంబంధము. తటాలున నెగసె నన్నచోట న్నెగసె ననెడిపదము నకారాదిపదమేకాని న్వరాది పదముగాదని గ్రహింపవలయును.

ఈపద్యమునందలి రెండవచరణము మొదట రోలంబాలక యను నహోబలపత్యంగీకృతపాఠ మయుక్తము. రేఫమునకును లకారమునకును విశ్రమము చెల్లదు గనుక లోలంబాలక యనెడి పాఠమే

టించి, అజురాణిఁ బోలెన్ = సరస్వతీదేవిని బోలినదాయెను. ఒకతె = మఱియొకస్త్రీ, వెలిదమ్మిఱేకు= తెల్లదామరపువ్వుయొక్క ఱేకు, వేనలినంటన్ = కొప్పునందంటుకొనఁగా, లేనెలపువ్వుఁదాల్పు = బాలచంద్రరూపమయిన పుష్పము ధరించిన, భవానిన్=పార్వతీదేవిని, పోలెన్=పోలినదాయెను. ఒకతె= మఱియొకస్త్రీ, కలువపుప్పొడిరాల్చి = కలువపువ్వులయందలి పుష్పపరాగము దులిపి, కాయజాస్త్రముల తుప్పులుడుల్చు = మన్మథబాణములయొక్క తుప్పువదలించుచున్న, రతిదేవిన్ = మన్మథభార్యయైన రతిదేవిని, పోలెన్ = పోలినదాయెను.

ఒకతె = ఒకస్త్రీ, సార=శ్రేష్ఠమయిన, కాసార = సరోవరమనెడు, సాగర = సముద్రమువలన, జనిత = పుట్టిన, జలజకుండ = కమలమనెడు కలశమందలి, మాధ్వీ=మకరందమనెడు, సుధాధార=అమృతపూరమును, గ్రోలఁదివురు = పానము సేయుటకు యత్నపడుచున్న, ప్రబలరోలంబమాలికా=బలిష్ఠమయిన మధుకరపఙ్క్తియనెడు, రాహున్ = రాహుగ్రహమును, పఱపి=వెడలఁగొట్టి, దంభనారాయణి యనంగఁదనరెన్ = దంభనారాయణి యనఁగా నమృతము పంచిపెట్టునెడల రాక్షసులను వంచించుకొఱకు నారాయణుఁడు మోహినీరూపముఁ దాల్చినాఁడు గనుక నట్టి మోహిని యనునట్టులుగా నొప్పినదాయెను. ఒకచెలువ తేనెనిండియున్న తమ్మిమొగ్గను గొనివచ్చుచుండఁ దుమ్మెదలు ముసరెను. వానిని మోసగించి తమ్మిమొగ్గను చేతనుంచుకొనుట సముద్రజన్యమగు నమృతము దేవతలకుఁ బంచుతఱి రాహువు రాఁగా వానిని జక్రాహతిని వధించి యమృతరక్షణ మొనరించినటు లుండెను. అలం. ఉపమ.

ఉ. ఆటకొలఁకునం గరఁగి • యంబుజగంధులగంధసారము
ల్గాటుకయున్ హరిద్రయును • గానఁగ నయ్యె నితాంతధన్య ల
జ్జోటులు మున్గువేళఁ బరి•శుద్ధసితాసితనిర్ఝరంబు ల
న్నీటఁ బిశంగవర్ణతటి•నీమణితోఁ దలచూపెనో యనన్. 164

ఆటకొలంకునంగరఁగి = క్రీడాసరోవరమందుఁ గరఁగినవై, అంబుజగంధుల = ఆస్త్రీలయొక్క, గంధసారములు = చందనములు, (ని. గంధసారో మలయజః' అని అ.) కాటుకయున్ = కన్నులకాటుకయును, హరిద్రయును = పసపును, కానఁగనయ్యెన్ = చూడనొప్పెను. ఏలాగనిన, నితాంతధన్యలు = మిక్కిలి పుణ్యవతులైన, అజ్జోటులు = ఆస్త్రీలు, జోటియనునది యోషిచ్ఛబ్దతద్భవము. మున్గువేళన్ = స్నానము సేయుచున్న సమయమందు, పరిశుద్ధ = పవిత్రములైన, సితా సిత నిర్ఝరంబులు = గంగా యమునా సంబంధములైన తెల్లనివియు నల్లనివియునగు ప్రవాహములు, అన్నీటన్ = ఆసరోవరజలమందు, పిశంగవర్ణ తటినీమణితోన్ = పచ్చని వర్ణముగల నదితోడ - అనఁగా సరస్వతీనదితోఁ గూడ,

శ్లో. 'సరస్వతీ రజోరూపా తమోరూపా కళిందజా,
సత్త్వరూపాచ గంగాత్ర త్రితయం బ్రహ్మనిర్గుణమ్'

అని చెప్పఁబడియున్నది గనుకఁ బిశంగవర్ణతటినీమణి యనఁగా సరస్వతీనది యని తెలియవలయును. తలచూపెనోయనన్ = పొడచూపినదో యన్నట్టులుగా, చూడనొప్పె నని సంబంధము. కరఁగిన గంధసార కజ్జల హరిద్రలను గంగా యమునా సరస్వతులనుగా నుత్ప్రేక్షించుటచే ధన్యలగు నాకన్యలు స్నానము చేయునపు డీ పుణ్యనదులు పొడచూపె నని యర్థము.

సీ. నారంగములు వాస•నారంగములు గొన్ని, యళినాదమంత్రము•ల్దెలుపుచోటఁ
దిలకంబు లవనీజ•తిలకంబు లవి గొన్ని, ప్రసవాసవార్ఘ్యంబు • లొసఁగుచోటఁ
గాంచనంబులు వనై•కాంచనంబులు గొన్ని, కళికాప్రదీపము • ల్నిలుపుచోట
సహకారములు చైత్ర•సహకారములు గొన్ని, తలిరాకుటారతు•ల్దాల్చుచోట
తే. ముప్పిరిఁ బెనంగి ద్రాక్షలు•గప్పికొనిన, గొప్పకప్రంపుటనఁటుల•చప్పరాల
నొప్ప రాలినకప్పురా•లుప్పరాలఁ, బెనచువలిగాడ్పుధూప మ•ర్పించుచోట.

వాసనారంగములు = సౌరభస్థానములైన, నారంగములుగొన్ని = కొన్నినారంజిచెట్లు, అళినాద మంత్రము ల్దెలుపుచోటన్=తుమ్మెదలయొక్క ఝుంకారములనెడు మంత్రములు చెప్పుచుండునదియు, అవనీజతిలకంబులు=భూరుహశ్రేష్ఠములైన, తిలకంబులు = బొట్టుగుచెట్లు, అవిగొన్ని = కొన్నియైనయవి, ప్రసవాసవార్ఘ్యంబులొసఁగుచోటన్ = ప్రసవాసవము లనఁగా బుష్పమకరందములు, అవియనెడు నర్ఘ్యములిచ్చుచుండునదియు, వనైకాంచనంబులు = వనమునకు ముఖ్యప్రకాశకములైన, కాంచనంబులు=సంపఁగిచెట్లు, గొన్ని = కొన్ని, కళికాప్రదీపము ల్నిలుపుచోటన్ = మొగ్గలనెడు దీపములు నిలుపుచుండునవియు, చైత్రసహకారములు = వసంతునకుఁ దోడుపాటైన, సహకారములు = తియ్య మామిడిచెట్లు, గొన్ని = కొన్ని, తలిరాకుటారతు ల్దాల్చుచోటన్ = పల్లవనీరాజనములు వహించు చుండునదియు,

ముప్పిరిఁ బెనంగి = ముప్పేటగాఁ బెనఁగొని, ద్రాక్షలు = ద్రాక్షతీఁగెలు, కప్పికొనిన = అల్లు కొన్న, గొప్ప కప్రపుటనఁటుల చప్పరాలన్ = గొప్పలైన కర్పూరపుటనఁటి చప్పరములవల్ల, ఒప్పరాలిన కప్పురాలు=ఒప్పిద మగునటులుగా రాలినకర్పూరమును, ఉప్పరాలఁ బెనఁచు=ఊర్ధ్వభాగములను బొందు చున్న, వలిగాలి = మలయమారుతము, ధూపమర్పించుచోటన్ = ధూపసమర్పణము సేయుచున్న దియుం నగు నొకానొకస్థలముం దని యర్థము.

పూజావిధానమునకు వలయుచోటు నిశ్చయింపవలసియున్నది. తుమ్మెదలరవళియే మంత్రములు. తిలకకుసుమాసవము అర్ఘ్యము. సంపంగిమొగ్గలు దీపములు. తీయమావిచివురు లారతులు. కర్పూరపుట నంటులపైనుండి వచ్చి శీతపవమానము ధూపముగా నలరి మన్మథపూజకు స్వతస్సిద్ధముగాఁ దగియున్న కొలువును గన్గొనిరి. అలం. అతిశయోక్తి. వృత్త్యనుప్రాసము.

ఉ. గొజ్జఁగిమంచునం గలపి • కూర్చినపుష్పాడితిన్నె మీఁద లా
మజ్జకకాయమాన లస•మానవిమానము క్రింద నొక్కపూ
సెజ్జ ఘటించి యం దొకకు•శేశయకర్ణిక నిల్పి యందు సం
పజ్జలజేక్షణాసుతుని•భావము వ్రాసి కురంగనాభికన్. 163

గొజ్జఁగిమంచునంగలిపి = గొజ్జంగిపువ్వులమీఁదనుండి కురిసినమంచు అనఁగాఁ బన్నీరు, దాని చేతఁ గలయఁగలపి, కూర్చిన = సంఘటించిన, పుష్పాడితిన్నెమీఁదన్ = పుష్పపరాగవేదికమీఁద, లామజ్జక=వట్టివేళ్లయొక్క, (ని. 'అభయం నళదం సేవ్య మమృణాళం జలాశయమ్, లామజ్జకం లఘు లయ మవదాహేష్టకాపథే.' అని అ.) కాయమాన = పందిటియందు అనఁగా వట్టివేళ్లపందిటియందు, లసమాన=ఒప్పుచున్న, విమానము క్రిందన్ = పువ్వుచప్పరము క్రింద, ఒక్కపూసెజ్జఘటించి = ఒకపువ్వు

శయ్యనునిర్మించి, అందొకకుశేశయకర్ణికనిల్పి=ఆశయ్యయం దొకతామరమిద్దెనిలిపి, అందుక్ = ఆమిద్దెయందు, సంపజ్జలజేక్షణాసుతుని = లక్ష్మీపుత్రుఁడైన మన్మథునియొక్క, భావము వ్రాసి=యథాస్థితమైన రూపమును లిఖించి, కురంగనాభిఁజేక్ = కస్తూరిచేత, కురంగనాభిఁజేక్ అనెడు నీపదము కాకాక్షిన్యాయమున పూర్వమునకు నుత్తరమునకును నన్వయింపవలయును. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. పట్టివేళ్ళపందిరియందు గొజ్జంగినీటిచేఁ బుప్పొడి గలిపి వేదిక యొనరించి యందుఁ బూవులతో శయ్య నమర్చి యొకతమ్మిగద్దియ శిలగఁజేసి దానిపై మన్మథస్వరూపమును గస్తూరితో వ్రాసి చెలులు నిలిపిరి. మన్మథునిభావము వ్రాయుటగాన మసివలయును కస్తూరియే మసి.

తే. అతనివామాంకమున రతి ♦ నావహించి
మ్రోల నుడురాజు ఋతురాజుఁ ♦ గీలుకొల్పి
క్రేవల సగంధపవన కో♦కిల మరాళ
కీరసారంగముల వ్రాసి ♦ చేరి చెలులు. 169

అతనివామాంకమునక్ = ఆమన్మథునియొక్క యెడమ తొడమీఁద, రతినావహించి=రతీదేవిని నిలిపి, మ్రోలక్=సన్నిధియందు, ఉడురాజుక్ = చంద్రుని, ఋతురాజుక్ = వసంతుని, కీలుకొల్పి= సంఘటించి, క్రేవలక్ = పార్శ్వములయందు, సగంధపవన = సౌరభయుక్తమగు వాయువును-అనఁగా మలయమారుతమును, కోకిల=కోయిలను, మరాళ = రాజహంసమును, కీర=చిలుకను, సారంగములక్=తుమ్మెదలను, వ్రాసి = లిఖించి, చెలులు = స్త్రీలు, చేరి = సన్నిధికిఁ జేరినవారై-ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. మన్మథునకుఁ జుక్కలఱేఁడు, వసంతుఁడు, మలయమారుతము, హంసములు, చిలుకలు, గొరువంకలు పరిజనము. భార్య వామాంకస్థాయిని గాన వామభాగమున వ్రాసిరి. ఆజ్ఞాపాలకుఁడగు వసంతుఁడు మ్రోల, పరివారము ప్రక్కల నుంట ప్రసిద్ధముగాన వలఱేనిబలగమునటులె లిఖించిరని భావము.

సీ. ధ్యానంబు హృదయవా♦స్తవ్యకుటుంబికి నావాహనము జగ♦ద్వ్యాపకునకు
నర్ఘ్యపాద్యములు నా♦రాయణప్రియసూతి కభిషేక మబ్ధిక♦న్యాంకశాయి
కలరుదోయిళ్లు పు♦ష్పవ్వలవింటిదొరకు గంధము గంధగిరిమరు♦ద్బాంధవునకు
ధూప మప్రతిమప్ర♦తాపోష్మ సురభికి దీపంబు తిమిరభ♦యాపహునకు
తే. మధురసఫలోపహారంబు ♦ మధుపకీర
పరిజనపరాయణున కంచు ♦ భక్తి నొసఁగి
మానమథనాయ మదనాయ ♦ మధుసఖాయ
మనసిజాయ నమో నమో ♦ యనుచు మ్రొక్కి. 170

హృదయవాస్తవ్యకుటుంబికిక్ = హృదయమందుఁ గాపురమున్న గృహమేధికి, ధ్యానంబు = ధ్యానమనియర్థము. హృదయమందయున్నవాని హృదయమందు నిల్పి ధ్యానముసేయుట స్థితస్థాపనతుల్యము. అనఁగా హృదయమంద యున్నవాని హృదయమందు నిలుపుటయే యని యాశయము. ఉత్తరత్ర యీలాగుననే యాశయమును గ్రహింపవలయును. జగద్వ్యాపకునకుక్ = జగత్తు నావహించి యున్నవానికి, ఆవాహనము = ఆవాహనమని యర్థము. నారాయణప్రియసూతికిక్ = నారములనఁగా జలములు-నారములే స్థానముగాఁ గలవాఁడు నారాయణుఁడు.

శ్లో. 'ఆపో నారా ఇతిప్రోక్తా ఆపోవై నరసూనవః,
తాయదస్యాయనం పూర్వం తేన నారాయణ స్స్మృతః'

అని మనుస్మృత్యాదులయందుఁ జెప్పఁబడియున్నది. ఉదకములు స్థానముగాఁగల నారాయణు నకుఁ బ్రియనందనుఁడగువానికి, అర్ఘ్యపాద్యములు = ఉదకముచేత నియ్యఁబడెడు నర్ఘ్యమును పాద్యమును అని యర్థము. అబ్ధికన్యాంకశాయినే = జలధికన్యయైన లక్ష్మీదేవియొక్క తొడలపై శయనించువానికి, అభిషేకము = జలాభిషేకమని యర్థము.

పువ్వులవింటిజోదునకున్ = పుష్పధనుస్సు గలవానికి, అలరుదోయిళ్లు = పుష్పాంజలులని యర్థము. గంధగిరిమరుద్బాంధవునకున్ = గంధగిరిమారుతము-అనఁగా మలయమారుతమునకు బాంధవుఁడైన వానికి, గంధము గంధమనియర్థము. అప్రతిమ ప్రతాపోష్మసురభిణే-అప్రతిమ = సమానరహితమైన, ప్రతాపోష్మ=ప్రతాపముయొక్క వేఁడిమిచేత, సురభిణే=పరిమళించుచున్న వానికి, ధూపము = ధూప మనియర్థము. ఇక్కడ సౌరభ్యము గలవానికి ధూపముచేత నేమని యాశయము. లేక ప్రతాపోష్మ యనఁగా ధూపోష్మ, దానిచేతఁ బరిమళించుచున్నవానికి ధూపమనియర్థము. ధూపజనిత సౌరభ్యము గలవానికి ధూపముచేత నేమి ప్రయోజనమని యాశయము. తిమిరభయాపహునకున్=అంధకార భయ నాశకుఁడైనవానికి, దీపము = దీపమని యర్థము. రాగయుక్తులకు నంధకారభయము లేకపోవుట ప్రకటముకదా.

మధుపకేరపరిజనపరాయణునకున్=మధురసఫలము భక్షించునట్టి మధుపకేరములనెడు పరిజనము నం దాసక్తుఁడైనవానికి, మధురసఫలోపహారంబునుచున్ = మధురసమనఁగాఁ దేనెగనుకఁ దేనెయును ఫలములును గానుకయని పలుకుచు, భక్తినొసఁగి = భక్తిచేత సమర్పించినవారై, మానమథనాయ=స్త్రీ పురుషులయొక్క ప్రణయకోపములను బోఁగొట్టువాఁడును, మదనాయ = స్త్రీపురుషులను మదింపఁజేయు వాఁడును, మధుసఖాయ = వసంతునికి మిత్రుఁడైనవాఁడును నగు, మనసిజాయ=మనస్సునందుఁ బుట్టిన వానికొఱకు, నమోనమః=నమస్కారము నమస్కారము, అనుచు మ్రొక్కి=అనిసేవించినవారై,

నమోయనుచు మ్రొక్కియన్నచోట 'లోపోనమ ఆదికేవిసర్గస్య' అనెడు శబ్దానుశాసన సూత్రముచేత నమయనుచు నని చెప్పవలసినను, 'నమశ్శబ్దవిసర్గస్య లోపఓత్వ మపీష్యతే' అనెడు నథర్వణ వచనమువలన నమోయనుచు ననియును జెప్పవలయును. 'అనుకృతే స్తి వాక్యంతు' న. అను సూత్రముచే నచట ననుకరణమందు సంస్కృతవాక్యము ప్రయోగింపఁబడియెను. హృదయనాస్తవ్యమని ధ్యానము చేయుట జగద్వ్యాపకుని నావాహనము చేయుట, పూలవింటివానికిఁ బుష్పాంజలి యొసంగుట, అభిషేక మబ్ధికన్యాంకశాయి కొసంగుట వస్తుసమృద్ధిగలవానికి వస్తువుల నొసంగుటనంటివి. భక్తియె ప్రధానము గాన నటుల నతు లర్పించిరని భావము. అలం, సమాలంకారము.

క. కాముఁ కమలాస్త్ర కమలా, కాముకసుత కామనీయకనిధీ యనుచుం
గామినులు విన్నవించిరి, కోమలకోకూయమానకోకిలఫణితిన్. 171

కామ = కాముఁడనెడు పేరుగలవాఁడా, కమలాస్త్ర=పద్మబాణముగలవాఁడా, కమలాకాము కసుత=లక్ష్మీకాముకుఁడైన విష్ణుదేవునికి కుమారుఁడవైనవాఁడా, కామనీయకనిధీ = సౌందర్యమునకుస్థాన భూతుఁడవైనవాఁడా, అనుచున్=అనిపలుకుచు, కోమల=మృదువైన, కోకూయమాన = కుహూ కుహూ

అనెడు ధ్వని గలుగుచున్న, కోకిలపలుకులన్ = కోకిలలయొక్క పలుకులవైఖరిచేత, కామినులు=గిరికాదేవి చెలికత్తియలు, విన్నవించిరి = విజ్ఞాపనము చేసిరి. విన్నపము అనునది విజ్ఞాపనశబ్దముయొక్క తద్భవము.

శా. వాతాందోళితచందనాగరులతా•వ్యాలీఢకేళీవనీ
జాతంబు ల్భవదీయనర్మగృహము•ల్చైత్రుండు నీబంటు నీ
కేతత్కాననజాతవస్తునిచయం•బే మిచ్చి పూజించుటల్
'శీతాంశో రమృతార్పణ' మ్మనుక్రియం•జేకొమ్ము చేతోభవా. 172

చేతోభవా = చిత్తసంభవుఁడయిన యోమన్మథుఁడా, వాత = వాయువుచేత, ఆందోళిత=ఊచఁబడుచున్న, చందన=శ్రీగంధముయొక్కయు, అగరు = కృష్ణాగరుయొక్కయు, లతా = శాఖలతోడ, వ్యాలీఢ = కూడుకొన్న, కేళీవనీజాతంబులు = క్రీడావనసమూహములు, భవదీయనర్మగృహములు = నీయొక్క కేళికామందిరములు-అనఁగా సేకాందోళిత డోలాస్థానీయము లని భావము. చైత్రుండు నీ బంటు=వసంతుఁడు నీయొక్క భృత్యుఁడు, నీకున్=కేళీలాటివాఁడవైననీకు, ఏతత్కానన = ఈవనమందు, జాత = పుట్టిన, వస్తునిచయంబు = పుష్పఫలాది వస్తుసముదాయమును, ఏమిచ్చుటలు = మేమిచ్చుట యన్నది, శీతాంశోరమృతార్పణ మ్మనుక్రియన్=చంద్రున కమృతసమర్పణ మనునట్టులుగా విచారించి, చేకొమ్ము=గ్రహింపుము.

అమృతమయుఁడయిన చంద్రున కమృతనివేదనము సేయుట యెక్కువలోనిది గాదుగనుక నాలాగుననే మేము సమర్పించిన పుష్పఫలాదికము లెక్కలోనివి కాకపోయినను నీ వనుగ్రహించి కైకొనవలయునని తాత్పర్యము. నీవు అనుపదమును చేకొమ్ము అను క్రియకుఁ గర్తగా గ్రహింపవలయును.

మ. బలవన్మేరుశరాసనంబును బర•బ్రహ్మాస్త్రముం గల్గుబ
ల్విలుకానిం దృణ మైనచాపమున గా•లిం బోవు లేయల్గులం
జల మూనించి సగంబు చేసి తవు నో•సంకల్పసిద్ధు ల్గొనం
బలుమేరుల్ నిరసింప లేఁజిగురుఁగో•మ్మం జేవ గా కుండునే. 173

బలవన్మేరుశరాసనంబున్ = బలవత్తరమయిన మేరుధనుస్సును, పరబ్రహ్మాస్త్రమున్ = పరబ్రహ్మమయిన విష్ణురూపాస్త్రమును, కల్గు = కలిగియుండునట్టి, బల్విలుకానిన్ = మేటివిలుకాఁడయిన హరుని, తృణమయినచాపమునన్ =గడ్డిపోచవలె లఘువైనవింటిచేతను, గాలింబోవులేయల్గులన్ =గాలి కెగిరిపోవు మృదుతరబాణములచేతను, చలమూనించి = చలమాపాదించి, సగంబుచేసితవునో = కృశించి సగమగునట్టులుగాఁ జేసితివి మేలుమేలు అని యర్థము. తృణమయిన చాపమనఁగాఁ జెఱకు తృణవృక్షములలోనిది గనుకఁ జెఱకువిల్లనియును గాలింబోవు లేయల్గు లనఁగాఁ బుష్పబాణము లనియును సగమవుట యర్ధనారీశ్వరత్వ మనియును భావము. తృణశబ్దమునకు, (ని. 'నడాదయ స్తృణం గర్ము చ్ఛ్యామాక ప్రముఖా అపి' అని అ.) సంకల్పసిద్ధుల్గొనన్ = సిద్ధసంకల్పులు చేపట్టిన, బలుమేరున్నిరసింపన్ = బలిష్ఠమయిన మేరుపర్వతమును జయించుటకు, లేఁజిగురుఁగొమ్మం జేవ గాకుండునే = లేఁతచిగురుకొమ్మయందే చేవ పుట్టకపోవునా-అనఁగాఁ బుట్టుచున్నదియనుట. సంకల్పసిద్ధుఁడనఁగామన్మథుఁడని భావము. సంకల్పముచేత సిద్ధుఁడనుట. సంకల్పసిద్ధుఁడనినను సంకల్పసంభవుఁడనినను మన్మథుఁడనుట సిద్ధము

సీ. సంకల్పసంభవాస్థానపీఠికవోలె నెడఁదయై కనుపట్టు వీనియురము. (మనుచరిత్రము)

వెండియుఁ వెండిఁ ఉండియుఁ ఉండిఁ వలెఁ గొమ్మయుఁ అనుచోఁ గవి కొమ్మఁ జేవ యని ప్రయోగించెనని యొకసంస్కర్త యూహించుచున్నాఁడు. ఇది యసమంజసము. 'కొమ్మఁ' అని సప్తమ్యంతముగా గ్రహించుటయే యుక్తము. వ్యాకరణవిరుద్ధముగా కొమ్మఁ అనుదానికి కొమ్మయునని చెప్పి దోషము నెట్లో సరిపుచ్చుకొనుటలోన రసతర మేమాత్రము లేదు. ఇది కవిమతమునకుఁ బూర్వవ్యాఖ్యాతల మతమునకు వ్యతిరేకము. ఆధునికులు కొమ్మఁ అనుచో సముచ్చయార్థయుపర్ణము లోపించె నని వాదించుచున్నారు.

ఉ. కొండఁట విల్లు వేదలలకుండలిరాజఁట నారి యమ్మనం
తుండఁట బైటిపల్లియలు దున్మినవాఁడఁట యొండురెండు భ
ర్గుం డిది నిండుపౌరుషమొకో యని గెల్వవె ముజ్జగంబు లు
ద్దండత నొక్కతుంటవిలుఁ దాలిచి యంటినఁ గందుతూఁపులన్. 174

కొండఁటవిల్లు=విల్లువిచారించిన మేరుపర్వతమఁట, వేదలల కుండలిరాజఁట నారి=అల్లెత్రాడు విచారించిన వేయితలలుగల శేషాహియఁట. అమ్మనంతుండఁట = అమ్ము అనఁగా బాణము విచారించిన విష్ణుమూర్తియఁట. ఇట్టి ప్రబలసాధనములు గలిగియుండియును, భర్గుండు = శివుఁడు, ఒండురెండు = ఒకటిరెండు-అనఁగా బహు స్వల్పమయిన, బైటిపల్లియలు = చాటులేక బట్టబైట నున్నపల్లెలను, తున్మినవాఁడఁట = సంహరించినవాఁడఁట. ఇది నిండుపౌరుషమొకోయని = ఇది నిండారైనపరాక్రమమాయని, (వి. 'పౌరుషం పురుషస్యోక్తం భావే కర్మణి తేజసి' అని వి.) ఉద్దండతన్ = పరాక్రమముచేత, ఒక్కతుంటవిలుఁదాలిచి=ఒకవింటితునుకను జేకఁబట్టి, అంటినఁ గందుతూఁపులన్ = చేతస్పృశించినఁగంది పోవు బాణములచేత, ముజ్జగంబులు = లోకత్రయములను, గెల్వవె=జయించినావుగావా, కాఁబట్టి నీదే సామర్థ్యముగాని శివుని దేమి సామర్థ్యమని యర్థము.

బైటిపల్లియ లనఁగా నంతరిక్షమం దున్న వనియును ఒండురెం డనఁగాఁ ద్రిపురము లనియును పౌరుషమనఁగా బురుషత్వమనియును నర్ధనారీశ్వరుఁడుగనుక సంపూర్ణపురుషత్వము లేదనియును తుంట యనఁగాఁ జెఱకుతుంట యనియును నంటినఁ గందుతూపులనఁగాఁ బుష్పబాణములనియును భావము. శివుఁడు కొండ విల్లు జేసికొని యాదిశేషుని నారిగానలంకించి విష్ణుని బాణముగా నొనర్చిచేసిన పని బైటి పల్లెలు రెండుమూడు తునుముట, నీవో తుంటవింటితో నంటగందు పూదూపులతో మూఁడులోకములు గెలిచితివిగాన మన్మథుఁడా నీవె నేర్పరివని చెలులు ప్రశంసించిరి. అలం. విభావనము. వ్యతిరేకము.

ఉ. సూనశరాస నీశరముసొచ్చినధాతకు నీమహోభరం
బానక రౌప్యభూధరగుహాగృహమీఁగినకాలికిం ద్వదీ
యానఘశౌర్యకీర్తిహృదయంబునఁ బూనురమావిలాసికిన్
మానదు వో రజంబును దమంబును సాత్త్వికముం గ్రమంబునన్. 175

సూనశరాస = పుష్పధనుస్సుగల మన్మథుఁడా, నీశరము సొచ్చినధాతకున్=నీబాణము నాఁటిన బ్రహ్మకును అనియర్థము. మన్మథబాణము పద్మము గనుకఁ బద్మమందుఁ జొచ్చియున్నాఁడని భావము. నీమహోభరంబానక రౌప్యభూధరగుహాగృహ మీఁగినకాలికిన్ = నీయొక్క తేజోతిశయ

మున కాగలేక కైలాసాచలగుహా యనెడు గృహమందు డాగియున్నహరునకు అని యర్థము. కైలాసనిలయుండని భావము. భరమనఁగా నతిశయమున్నందుకు, వి. 'అథాతిశయో భరః' అని అ. త్వదీయానఘశౌర్యశక్తి హృదయంబునఁ బూనురమావిలాసికిన్ = నీయొక్క యవ్యాజపరాక్రమశక్తిని మనస్సునఁ బూనిన విష్ణుదేవునకును అనియర్థము. లక్ష్మీదేవిని వక్షస్థ్సలమందు ధరించినాఁడని భావము. (ని. 'హృదయం మానసో రసోః' అని వి.) లక్ష్మీదేవి నిగరణముచేసి యనఘశౌర్యశక్తి రూపముచేత నధ్యవసించినాఁడు. ఈభావార్థమందు రమావిలాసి యనెడుపదము సాభిప్రాయము. క్రమంబున్ = వరుసవెంబడిగా, రజంబును = రజఃకార్యమయిన యనురాగమును, తమంబును = మోహమును, సాత్త్వికమున్ = సాత్త్వికభావమును. మానదువో = మానిపోదుగదా యని యర్థము. రజోగుణంబును దమోగుణమును సాత్త్వికగుణమును మానదనిభావము. త్రిమూర్తులను స్వవశులనుగాఁజేసికొన్నవాఁడవుగదా యని తాత్పర్యము. నీశరమునొచ్చినధాతకు అన్నచోట శరమందుఁ జొచ్చిన యనెడు సప్తమ్యర్థమందు, శ్లో. 'అన్యస్యాకిన్వచిద్భవేచ్చాన్యా' న. అనెడు సూత్రముచేతఁ బ్రథమ వచ్చినది గనుక రెండర్థములయందును బ్రథమాంతమయిన శరమనెడు పదమునకంటెఁ బరంబైన చకారమునకు పకారాదేశము వచ్చినది. మన్మథునిధాటికిఁ ద్రిమూర్తులు లోనైరనుటకు-

శ్లో. శంభుస్స్వయంభుహరయోహరణేక్షణానాం, యేనాక్రియంతసతతం గృహకుంభదాసాః
వాచామగోచరవిచిత్రచరిత్రితాయ, తస్మై నమో భగవతే కుసుమాయుధాయ.

భర్తృహరిసుభాషితము.

అలం. ఉత్ప్రేక్ష. పర్యాయోక్తము.

క. మొన యంగనకా కటకట, మొనయం గనకాద్రిధరుఁడె మదిత నుపవనా
తనుపవనాహతి కొసఁగక, తనుపవనా మదన నీయుదంచితకరుణన్. 176

మదన = ఓయిమన్మథుఁడా, మొనయంగనకా = మొనయనఁగా బాణదీపటగనుక నట్టిమొన, అంగనకా = ఈయాఁడు చిన్నదానికొఱకా, అనఁగా నిది యేమి ఘనకార్య మనుట. కటకట = అయ్యయో, మొనయన్ = తారసించుటకు, కనకాద్రి ధరుఁడె= మేరు విల్లుగా ధరించినవాఁడుఁడా యేమి? ముదితన్ = గిరికాదేవిని, ఉపవన = ఉద్యానవనమందలి, అతను = అధికమయిన, పవన=మలయమారుతము యొక్క, ఆహతికిన్ = తాఁకుడునకు, ఒసఁగక = ఒప్పగింపక-అనఁగా మలయమారుతవేధకుఁ బాలుపఱుపక, నీయుదంచితకరుణన్ = నీయొక్క ఘనమయిన దయారసముచేత, తనుపవనా = తనియునట్టులు చేయవన్నా, తనుపవు అనా యని పదవిభాగము. అనఁగా నీదయాపాత్రురాలినిఁగా జేయవమ్మా యనుట. అలం. యమకము.

మన్మథా నీవు మూఁడులోకములు జయించిన జగజెట్టివి. ఈచెలువ నీముందెంత. ఈయమ యీలువు మలయమారుతము పాలుపఱుపక నీదయచేఁ గాపాడుమని భావము.

సీ. లోకత్రయీజయోత్సేకంబుఁ దెల్పునీపడగ నారాయణప్రథమమూర్తి
రెండంటఁ జేయునీకొండచాతురికి స్వాదృనిదర్శనంబు వాఙ్మూర్ధజాని
గాఢనాళీకసంగ్రస్తుఁడై నేఁడున్న నీడాఁగువాఁడు వాక్షేవిలాసి
యెక్కి త్రొక్కనిచోటు ద్రొక్కించునీయాజ్ఞ గడువఁడు పద్మినీకాముకుండు

తే. కాంత లన నెంత నీయంత•ఘనున కింక
నళిచికురఁ బ్రోవవయ్య పద్మాక్షిఁ గావ
వయ్య శుకవాణిఁ గరుణింప•వయ్య పూర్ణ
చంద్రముఖి నేచకయ్య యో•చక్కనయ్య. 177

లోకత్రయీజయోత్సేకంబుఁ దెల్పు = లోకత్రయీజయమనఁగాఁ బురాణవేదత్రయీజయమని యర్థము. లోకశబ్దము పురాణవాచక మైనందునకు-

శ్లో. 'నాశీర్వరం భవితు మర్హతి విశ్వమేత ద్వహ్నీశ్వరంతు నితరామయథాప్రమాణమ్,
తల్లోకవేదవిదితేశ్వరపర్జనేన కోయం ప్రభుః కలిచిదీశ్వరమన్యమాహుః."

అని శివసూక్తిమాలయందుఁ బ్రయోగము. భువనత్రయజయమని భావము. దానియొక్క, ఉత్సేకంబుఁ దెల్పు = విజృంభణమును దెలుపుచున్న, నీపడగ = నీయొక్క ధ్వజము, నారాయణప్రథమమూర్తి = నారాయణునియొక్క ప్రథమమూర్తియైన మత్స్యమని యర్థము. రెండంటఁ జేయునీకాండ చాతురికిఁ = రెండువస్తువు లొకటిగాఁ గలిసికొనునట్లు చేయునట్టి నీబాణచాతుర్యమునకు, వామార్ధజాని = అనఁగా నెడమపార్శ్వము సగమును భార్యగాఁగల సాంబమూర్తియే, ఆద్యనిదర్శనంబు= మొదటిసాక్షి. ఇక్కడ, శ్లో. 'ఏకమేవద్విధాకర్తుం బహవస్సంతిధన్వినః, మారఏకోమహాధన్వీద్వయమేకం కరోత్యసౌ' అనుశ్లోకార్థ మనుసంధించి భావము గ్రహింపవలయును.

గాఢ = దృఢముగా, నాళీకసంగ్రస్తుఁడై = నాళీకమనఁగా బాణమును బద్మమును గనుక బాణరూపపద్మముచేత గ్రహింపఁబడినవాఁడై, నేఁడును = ఇప్పటికిని, వాణీవిలాసి = బ్రహ్మదేవుఁడు, నీడాగువాఁడు = నీయొక్క లాంఛనము గలవాఁడై యున్నవాఁడని యర్థము. మన్మథుఁ డరవిందబాణుఁడగుటయును బ్రహ్మ నిరంతరమును బద్మమంద యుండుటయును బ్రకటముగదా. ఎక్కి త్రొక్కనిచోటు ద్రొక్కించు నీయాజ్ఞ = ఎక్కి త్రొక్కరానిచోటు నెల్లఁ గాముకులచేతఁ ద్రొక్కించునట్టి నీయాజ్ఞను, పద్మినీకాముకుండు = అనఁగా స్త్రీకాముకుఁడైన సూర్యుఁడు, గడువఁడు = అతిక్రమింపఁడని యర్థము. అనఁగా నెక్కి త్రొక్కరానిచోటుఁ ద్రొక్కుచున్నాఁడనుట. నలినీప్రియుఁడనియును గగనాగ్రభాగమున నెక్కి సర్వత్ర కిరణప్రసారణము సేయుచున్నాఁ డనియును భావము.

కాఁబట్టి, నీయంతఘనునకుఁ = నీయంతగొప్పవానికి, కాంతలన నెంత = స్త్రీలనఁగా నెంతమాత్రము, ఇంకఁ = ఇఁకమీఁద, అళిచికురఁ బ్రోవవయ్యా = తుమ్మెదలవంటి తలవెండ్రుకలుగల యీచిన్నదాని రక్షింపవయ్యా, పద్మాక్షిఁ గావవయ్యా = పద్మములవంటి నేత్రములుగల యీచిన్నదానిం గావవయ్యా, శుకవాణిఁ గరుణింపవయ్యా = చిలుకపలుకులవంటి పలుకులుగల యీచిన్నదాని దయఁజూడవయ్యా, పూర్ణచంద్రముఖి నేచకయ్యా=పూర్ణచంద్రునివంటి ముఖముగల యీచిన్నదాని బాధ పెట్టకుమయ్యా, ఓచక్కనయ్యా = సుందరుఁడవైన యోమన్మథుఁడా యని యర్థము.

అళి పద్మ శుకపూర్ణచంద్రులు నీకు మౌర్వీ, బాణ, వాహన, బంధువులు గనుకఁ దత్సదృశములైన చికురనేత్రవాణీవదనములుగల గిరికాదేవి నీచేత సంరక్షణీయురాలుసుమీ యని భావము. త్రిమూర్తులును ద్రిమూర్తిస్వరూపుఁడగు సూర్యభగవానుఁడు నీకు లోనైరి. కాన నీవు ఘనుఁడవు. కావున నీముందుఁ గాంత లెంతవారు? అలం, విభావనము. వ్యతిరేకము,

"డాఁగు" అనఁగా గుఱుతనుటకుఁ బ్రయోగము.

చ. విరహిజనంబులన్ మరుఁడు వీపుల డాఁగులు వేయఁబూని ని
ష్ఠ్కరుణ నిజప్రతాపశిఖిఁ గ్రాఁచఁగఁ గ్రాఁగుసలాకలో యనన్
ధరపయి నెల్లెడన్ దరుల దట్టములై చిగురాకుజొంపముల్
నిరుపమలీలఁ బొల్చెఁ దరుణీ కనుఁగొంటె మిటారిచూపులన్. చంద్రభానుచరిత్రము.

క. వలదు కొల దాఁకు సుమ్మని, చెలువలు మరుఁ గొసర విసరు॰ జిలిబిలిగాడ్పు
ల్జలజల నలరులు రాలెను, గలకల మనుశుకపికాళి॰కలకల మెసఁగెన్. 178

వలదు = వద్దువద్దు, కొలదాఁకుసుమ్మని = స్త్రీహత్య దగులును సుమా యని, చెలువలు మరుఁ గొసరన్ = స్త్రీలు మన్మథుని వేడఁగా, విసరె జిలిబిలి గాడ్పులు=మలయమారుతములు విసరెను, జల జల నలరులురాలెను = పువ్వులు జలజల రాలెను, కలకలమను = కలకలగూయుచున్న, శుకపికాళి కల కల బొసఁగెన్ = చిలుకలయొక్కయుఁ గోయిలలయొక్కయుఁ దుమ్మెదలయొక్కయుఁ గోలాహల మతిశయించెను.

చ. అఱిమి రమాకుమారుఁ డపు॰ డగ్రతలంబున వచ్చి నిల్చిన
ట్లఱిముఱిఁ దోఁచినం గువల॰యాక్షి వడంకి కడంకఁ దూలి మై
మఱచి సగంధగంధగిరి॰మారుతపాతితవల్లి కాభ యై
యొఱఁగిన సంభ్రమించి చెలు॰ లుద్గతబాష్పతరంగితాక్షు లై. 179

అఱిమి=అనఁగా గదమాయించి, రమాకుమారుఁడు = మన్మథుఁడు, అపుడు = ఆసమయమందు, అగ్రతలంబున వచ్చి నిల్చినట్లు = ఎదుటవచ్చి నిల్చినట్టులుగా, అఱిముఱిదోఁచినన్ = నిశ్చయముగాఁ గనుపడఁగా, కువలయాక్షి = గిరికాదేవి, వడంకి=కంపించి, కడంకఁదూలి = ధైర్యముచెడి, మైమఱచి= శరీరస్మృతిదప్పి, సగంధ = గర్వసహితమైన, గంధగిరిమారుత = మలయవాయువుచేత, పాతిత = పడ వేయఁబడిన, వల్లికా = తీఁగయొక్క, అభయై = కాంతివంటి కాంతిగలదై, ఒఱఁగినన్ = మూర్ఛఁ గొనివ్రాలఁగా, సంభ్రమించి = తొందరగొని, చెలులు = గిరికాదేవియొక్క చెలికత్తియలు, ఉద్గత = బయలువెడలుచున్న, బాష్ప = కన్నీళ్ళచేత, తరంగిత = సంజాతతరంగములైన, అక్షులై = కన్నులు గలవారై, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

ఈపద్యములో వడంకి యన్నది। వేపథు వనెడి సాత్త్వికభావము. (క. 'మోదమునైన రోష భయాదులనేనియును గంప మధికం బగుఁ దా, నేదేహిదేహమున నది, మేదిని వేపథు వనంగ మెఱయుచునుండున్' అని లక్షణము. మైమఱచియన్నది మొదలుకొని మోహామనెడిసంచారిభావము. శ్లో. 'మోహాస్తుమూర్ఛనంభీతి దుఃఖావేశానుచింతనైః' అని లక్షణము. కువలయాక్షి యనుటవలన గిరికావయసు బింకము సూచితము. జవ్వనులకనులు నల్లగలువలతో సమముగఁ గవులు చెప్పుదురు. మన్మథుఁడు కనఁబడక గిరికకుఁ దోఁచుటకుఁ గారణము అతఁ డనంగుఁడు గాన నే. తొలుత వణఁకుట, పిదపఁ దాలిమి దూలుట, అవల మైమఱచుట, ఒఱగుట ఇవి భయవశమునఁ గ్రమముగా జరుగునవి. చెలులు కారణ మెఱుంగరు గాన సంభ్రమించిరి. మఱియు బాష్పతరంగితాక్షు లైరి.

సీ. మోహాపదేశత • మోముద్రితములైన కనుదమ్ముల హిమాంబు • లునుప రాదు
శ్రమబిందుతారకా • గమఖిన్నకుచకోరకములఁ జంద్రనామంబుఁ • దలఁప రాదు
శీర్యదాశావృంత • శిథిలితాసులతాంత, మసియాడ వీవన • ల్విసర రాదు
పటుతాపపుటపాక • పరిహీనతనుహేమ, మింకఁ బల్లవపుటా • ర్చిడఁగ రాదు
తే. లలన కానంగకేలికే • లాకలాప, సంతతాలీఢహృదయపా • త్రాంతరాళ
పూరితస్నేహపూరంబు • పొంగి పొరలఁ, జల్లనిపటీరసలిలంబుఁ జల్ల రాదు.

మోహ = మూర్ఛాదికమనెడు, అపదేశ = వ్యాజముగల, (ని. 'వ్యాజోపదేశో లక్ష్యశ్చ' అని అ.) తమః = అంధకారముచేత, ముద్రితములైన = ముకుళింపఁబడిన, కనుదమ్ములన్ = నేత్రపద్మములయందు, హిమాంబు లునుపరాదు = పన్నీరుంచరాదని యర్థము. తుషారోదక మునుపరాదనియును నర్థము. అర్థద్వయమునకు నభేదాధ్యవసాయము. ఉత్తరత్ర యర్థద్వయ మున్నచోట నభేదాధ్యవసాయము సేయవలయును. కనులు మోహాంధకారముచే ముకుళించినవి గావున శైత్యోపచారములగు హిమాంబుసేకనము లిట తగదు. మంచునీరు సోఁకుటచే మఱింత ముకుళించును. చల్లఁదగిన హిమాంబువులు చల్లరాదనుట శబ్దశ్లేషచేఁ గవి సాధించెను.

శ్రమబిందు = శ్రమజలబిందూదయమనెడు, తారకాగమ = నక్షత్రోదయమువలన, ఖిన్న = ఖేదయుక్తములైన, కుచకోరకములన్ = చనుజక్కవలవిషయమైన, చంద్రనామంబుఁ దలఁపరాదు = చంద్రనామమనఁగాఁ గర్పూరము గనుకఁ గర్పూరమును దలఁపఁగూడదని యర్థము. (ని. 'ఘనసారశ్చంద్రసంజ్ఞః' అని అ.) చంద్రునిపేరు దలఁపరాదనియును నర్థము. చెమ్మటబొట్టు లను చుక్కలరాకకుఁ గుచచక్రవాకములు విచారపడుచున్నవి. ఇఁకఁ జంద్రునినామము తలంచుట మఱియు విచారకారణము. విరహిణులకు గుబ్బలపైఁ గప్పురపుఁబూఁతఁ బూయుట యాచారము. దానికి శ్లేషమహిమచే ననుపపత్తి యధ్యవసింపఁబడినది.

శీర్యత్ = జాఱుచున్న, ఆశా = వసురాజవిషయమయిన యాశయనెడు, వృంత = తొడిమెవల్ల నుండి, (ని. 'వృంతం ప్రసవబంధనం' అని అ.) శిథిలిత = సడలిన, అసులతాంతము = ప్రాణమనెడు పువ్వము, అసియాడన్ = (ఎప్పుడో పడిపోయెడుదానివలె నుండుచుండఁగా) ఇంచుక కదలునటుల, వీవనల్విసరరాదు = విసనకఱ్ఱలచేత విసరరాదని యర్థము. గిరికప్రాణ మనుపూవు తొడిమనుండి సడలినది. జాఱుటకు సిద్ధముగా నున్నది. కావున నించుకేని కదలునటుల వీవనతో వీచుట ప్రమాదకరము. పోను సిద్ధముగనున్న ప్రాణము లాసచే నెటులో పోకున్నవి. వీవనగాడ్పు అసులతాంతమున కపాయకరమని యధ్యవసితము.

పటు = సమర్థమయిన, తాప = చింతాదికృతసంతాపమనెడి, పుటపాక = పుటములయొక్క పచనముచేత, పరిహీణ = తరిగి కడపన్నెమట్టుకు నిలిచిన, తనుహేమము = దేహరూపసువర్ణము, ఇంకన్ = ఇగిరిపోవునట్టులుగా, పల్లవపుటార్చిడఁగ రాదు = కిసలయశయ్యారూపమయిన యగ్నిజ్వాల వెట్టరాదనియును బల్లవపుటమనెడి పుటవిశేషముయొక్క యర్చి నిడరా దనియును నర్థము.

పుటపాకలక్షణము—

శ్లో. పుటపాకస్య పాకోయం లేపస్యాంగారవర్ణతా
లేపంచ ద్వ్యంగుళం స్థూలం కుర్యాద్వ్యంగుళిమాత్రకం

కాశ్మీరపటజంబ్వాదిపత్త్రైర్వేష్టన ముత్తమం.

పల్లవపుటార్చియనఁ జిగురుసెజ్జయని పుటభేదమని భావము.

లలనకున్=గిరికాదేవికి, అనంగకేలి=మన్మథాగ్నియొక్క, కీలాకలాప = జ్వాలాసమూహముచేత, సంతత=ఎల్లప్పుడును, ఆలీఢ=వ్యాప్తమయిన, హృదయ = డెందమనెడు, పాత్ర=పాత్రయొక్క, అంతరాళ = లోపల, పూరిత = నిండియున్న, స్నేహపూరంబు = స్నేహమనెడు చమురు, పొంగిపొరలన్ = పొంగునట్లుకాగి తెర్లుచుండఁగా, చల్లనిపటీర సలిలంబు చల్లరాదు = చల్లనైన చందనసలిలమనెడు సలిలము చిల్కరింపరాదని యర్థము. ఈపద్యమందుఁ జెప్పఁబడిన కనుదమ్ములు మొదలైనవానికిని హిమాంబులు మొదలైనవానికిని సహజవిరోధమని భావము. అలం. రూపకానుప్రాణిత కావ్యలింగము.

క. ఏ మంద మేమి సేయుద, మేమం దని మందలింత • మే మందమొ యిం
దేమందయాన నడుగుద, మే మందఱ మనుచుఁ దరళ•హృదయాంబుజలై.

ఏమందము = ఏమనిచెప్పుదుము, ఏమిసేయుదము = ఏమిక్రియచేయుదము, ఏమందనిమందలింతము=ఏయోషధమని మనము మందలింతము, ఏమందమొ = ఏమిచందమో, ఇందేమందయాననడుగుదము = ఇక్కడ నేస్త్రీనినడుగుదము, ఏమందఱమనుచున్ = మేమందఱమునని పలుకుచు, తరళహృదయాంబుజలై = చంచలమయిన హృదయకమలములు గలవారై. ఈపద్యమందు విషాదమనెడు సంచారిభావము చెప్పంబడియెను.

మందలించుట యనఁ దలంచుట.

సీ. ముక్తకంచుక సక్తముక్తాఫలంబుల మందలింతురు గురుపెందలట్టు.

కాళహస్తిమాహాత్మ్యము.

సీ. జవరాలియడుగులఁ•జివురాకు లంటించి, పొలఁతియూరులనంటి•పొరలఁ బొదివి
కొమ్మచేదోయి చెం•దమ్ముల హత్తించి, లేమబాహులుమృణా•ళికలఁ బెనచి
యతివగుత్తపుగుబ్బ•లలరుగుత్తులఁగూర్చి, కాంతచెక్కులఁజంద్ర•ఖండ మలఁది
కలికిక్రేగన్నులఁ•గలువఱేకులఁ గప్పి, లలనపెన్నెఱుల వా•లంబు ముడిచి
తే. నవనవగుణానుబంధబాం•ధవములైన, చలువలెన్నేనిఁగావించి•చెలువచెలులు
నెలఁతకీవసులాభంబు•నించుమంచు, నించువిల్కాని మఱిఁబ్రా•ర్థించుటయును.

జవరాలియడుగులఁ జివురాకులంటించి = గిరికయొక్క పాదములయందుఁ జిగురుటాకులనంటించి, పొలఁతియూరులనంటి పొరలఁబొదివి=గిరికయొక్కతొడల నరఁటిచెట్టు పైపొరలచేతఁబొదిగి, కమ్మచేదోయి చెందమ్ములహత్తించి=గిరికయొక్క హస్తద్వయము నెఱ్ఱదామరపువ్వులయందుఁ గదియించి, లేమబాహులు మృణాళికలఁ బెనచి=గిరికయొక్క భుజమును దామరతూఁడులతోఁ బెనచి, అతివగుత్తపుగుబ్బలలరుగుత్తులఁగూర్చి = గిరికయొక్క బిగిచన్నులు పూగుత్తులతో జోడించి, కాంతచెక్కులఁ జంద్రఖండమలఁది = గిరికయొక్క చెక్కులయందుఁ గర్పూరముఁ బూసి, ఇక్కడ సాదృశ్యమందుఁ జంద్రశకల మని చెప్పవలయును.

కలికిక్రేగన్నులు కలువఱేకులఁగప్పి = గిరికయొక్క నేత్రపార్శ్వములు కలువఱేకులచేతఁ గప్పి, లలనపెన్నెఱుల వాలంబు ముడిచి = గిరికయొక్క గొప్పతలవెండ్రుకలయందుఁ గురువేరు ముడిచి, ఈ

యర్థమందు వాలమనఁగాఁగురుఁ పేరనియును సాదృశ్యార్థమందుఁ జమరీవాల మనియును జెప్పవలయును. (ని. 'వాలః కచే శ్వాదిపుచ్ఛే స్త్రీబేరేతు నపుంసకమ్' అని నా.) నవనవగుణానుబంధబాంధవము లైన = నవమనఁగా నభినవమును భిన్నభిన్నార్థమును, అభినవములైన రక్తిమాదగుణానుబంధముచేత సదృశములైన వని యర్థము. ఏతీరుగుణము గలవారికి నాతీరు గుణముగలవారు బంధువులని యర్థాంతరము. చలువలెన్నేని గావించి = శైత్యోపచారము లెన్నెన్నియో చేసి, చెలువచెలులు = గిరికాదేవి చెలికత్తియలు, నెలఁతకున్ = గిరికాదేవికి, ఈవు = నీవు, అసులాభంబు నించుమంచున్ = ప్రాణలాభము గలుగఁజేయుమని పలుకుచు అనియర్థము. నెలఁతకు నీవసురాజలాభము గలుగఁ జేయుమని యును అర్థము. ఇంచువిలుకాని మఱలఁ బ్రార్థించుటయును = ఇంచనఁగా నిక్షుశబ్దతద్భవము అనఁగా జెఱకు గనుకఁ జెఱకువిలుకాఁడైన మన్మథుని మఱలఁ బ్రార్థింపఁగా.

అడుగులకుఁ జివురులు, చేదోయి కెంజాదామరలు, గుబ్బలకుఁబూవులగుత్తులు, పెన్నెఱులకు వాలములు గుణానుభావబాంధవముగలవి. మార్దవరక్తిమావర్తులాదిగుణములందు నెయ్యము లని భావము. ఏతీరు గుణముగలవారి కాతీరుగుణములవారె తగినబాంధవులుగాన నవయవముల కనుగుణములగు శిశిరవస్తుసమృద్ధిని జతపఱచిరని భావము.

శా. ఆవాక్యంబులలో సుధామయశుభైకాయత్తచిత్తేశసం
జ్ఞావర్ణంబు లొకింత వీను లెనయన్ సంజాతచైతన్య యై
పూవుంబోడి సుధాంశుబింబసుషమాపూర్ణాభిషేకప్రమీ
లావీతోత్పలవల్లి వోలెఁ గనుగల్వల్ విప్పె నాళీజనుల్. 183

ఆవాక్యంబులలోన్ = చెలికత్తెలు పలికిన యావాక్యములలో, సుధామయ=అమృతప్రాయములైన, శుభైకాయత్త = శుభాధీనములైన, చిత్తేశసంజ్ఞావర్ణంబులు = హృదయేశ్వరుఁడైన వసురాజుయొక్క పేరిటియక్షరములు, వీను లెనయన్ = చెవులుసోకఁగా, సంజాతచైతన్యయై=పుట్టినచైతన్యము గలదై, పూవుంబోడి = గిరికాదేవి, సుధాంశుబింబ = సంపూర్ణచంద్రబింబముయొక్క, సుషమాపూర = శ్రేష్ఠకాంతి పూరముయొక్క - అనఁగాఁ జంద్రికాపూరముయొక్క, అభిషేక = తడుపుటచేత, ప్రమీలావీత = సంకోచరహితమయిన, ఉత్పలవల్లివోలెన్ = కలువతీఁగవలె, కనుగల్వల్విప్పున్ = కలువలవంటి కన్నులుదెఱవఁగా, ఆళీజనులు = సఖీజనులు. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

ఈపద్యమందు బోధమనెడి సంచారిభావము చెప్పంబడియెను. అందుకులక్షణము-

క. 'జగతిం జిత్తనిమీలన, మగునిద్ర యనంగ మూర్ఛ నందుటె మోహం
బగుబోధ మెఱుకఁ జెందుట, యగధృతమృతియత్నమంత మగునెట్టన్నన్'

అని నరసభూపాలీయమునఁ జెప్పఁబడియున్నది.

వసుశబ్దము గిరిక చెవులకు సుధామయమై సోకుటవలన సంజాతచైతన్య యయ్యెను, ఉపచారములు నిరర్థకములగుట. పూవుంబోడియనుచోఁ బోడిశబ్దముతోఁ బూవుశబ్దము సమసించునపుడు "సరశేఃఁ షేచై వసుమాపేసముతో భవేత్" అను నాథర్వణసూత్రానుసారముగ నుగాగమము వచ్చి వకారమునకు సరళాదేశము మకారమునకు బింద్వాదేశము సిద్ధించెనని తెలియనగును.

అపూర్వపుంబోడులు ముప్పురతో. మను. ఆ. 6

చిగురుంబోడి యెఱుంగుదే. కళాపూ.

ఉ. కొందల మేల బాల మనకూర్చుసపర్యకు మెచ్చి యిందిరా
నందనుఁ డిందు సన్నిధి యొనర్చె సుమీ సుమనఃప్రసాదముం
జెందె సుమీ శుకోక్తిఁ గలనేమము దెల్పె సుమీ సమీహితం
బందెడు సందియంబు వలదమ్మ యటం చభయంబు దెల్పుచున్. 184

కొందలమేల = విచారమెందుకు, బాల = ఓగిరికాదేవి, మనకూర్చుసపర్యకు మెచ్చు=మనము చేసినపూజకు హర్షించినవాఁడై, ఇందిరానందనుఁడు=మన్మథుఁడు, ఇందుసన్నిధియొనర్చెసుమీ=ఇక్కడ సాక్షాత్కరించినాఁడుసుమా, సుమనఃప్రసాదముం జెందెసుమీ = అనఁగాఁ బుష్పప్రసాదమునుబొంది నాఁడుసుమా, శుకోక్తిఁ = శుకవాక్యమనెడు వాక్యముచేత, కలనేమముమ్ము దెల్పెసుమీ=సిద్ధముగాఁగల కుశలమును దెలిపినాఁడుసుమా! కాఁబట్టి, సమీహితంబు అందెడున్ = కోరికసిద్ధించుచున్నది. సందియంబు వలదమ్మ=సందేహపడ నక్కరలేదమ్మా, అటంచున్ = అనిపలుకుచు, అభయంబు దెలుపుచున్ = భయము లేకపోవుటను దెలియఁజెప్పుచు. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

మన్మథుఁడు ప్రత్యక్షమగుటవలనఁ దా మర్పించు సుమనఃప్రసాదముఁ జెందినట్లును, చిలుకల పలుకులవలనఁ గలనేమము నెఱింగించినట్లును, నిశ్చయించికొని చెలిమికత్తెలు గిరికాదేవి కభయమును దెలిపిరనిభావము. అలం. శ్లిష్టాశ్లిష్టసంకరము.

క. కేళికమనీయకానన, పాళిక వెలువడి కురంగపాళికళాబిం
బాళికలు బాళికడిమిన్, బాలికఁ దెచ్చిరి విహారభవనంబునకున్. 185

కేళి=క్రీడచేత, కమనీయ = సుందరమగుచున్న, కాననపాళికన్ = వనప్రదేశమును, వెలువడి= బయలువెడలి, కురంగపాళి=మృగలాంఛనుఁడైన చంద్రునియొక్క, కళా = కళకు, బింబ = ప్రతిబింబ మైన, అళికలు = ఫాలభాగములు గలవగువలు, (ని. 'లటాటమలికంగోధిక' అని అ.) ఇక్కడఁ జతుర్థి నాఁటి చంద్రునితోడను విదియచందురునితోడను అష్టమినాఁటిచంద్రునితోడను చెలులఫాలమునకు సాదృశ్యముగలదు గనుకఁ గళాబింబాళికలని చెప్పినాఁడు. బాళికడిమిన్ = చింతాతిశయముచేత, బాలికఁదెచ్చిరి. విహారభవనంబునకున్ = క్రీడాగృహమునకు గిరికాదేవిని వెంటఁబెట్టుకొని వచ్చిన వారైరి. ఈపద్యము ద్విప్రాసము గలదిగాఁ జెప్పంబడియెను.

ఆ శ్వా సాం త ము.

శా. పశ్యత్ఫాలవిలోచనానలశిఖాభాస్వన్మహోమిత్ర మి
త్రశ్యామారమణేక్షణ ప్రవణచేతగసద్మపద్మాంగభూ
దృశ్యాగద్యుతిసంగ సంగరమదోద్వృత్తారిరావాహుత్తరా
ద్వేశ్యాలోకభుజంగ జంగమనగద్వేదండపూర్ణాంగణా. 186

పశ్యత్ఫాల = చూచుచున్న నొసలుగలరుద్రునియొక్క, విలోచనానల = నేత్రాగ్నియొక్క, శిఖా = జ్వాలికవలె, భాస్వత్ = ఉజ్జ్వలమగుచున్న, మహః = ప్రతాపమే, మిత్ర = సుహృత్తుగాఁ గలవాఁడా, మిత్ర=సూర్యుఁడును, శ్యామారమణ=నిశాపతియైన చంద్రుఁడును అనఁగా సూర్యచంద్రులు.

ని. 'శ్యామా యౌవనమధ్యస్థా త్రివృతా శారిబా నిశా' అని నా. ఈక్షణ = నేత్రములుగాఁ గల విష్ణుదేవునియందు, ప్రవణ=ఆసక్తమైన, చేతఃపద్మ=చిత్తకమలము గలవాఁడా, పద్మాంగభూ=మన్మథుని యొక్కవలె, దృశ్య = చూడఁదగిన, అంగద్యుతి = దేహకాంతితోడ, సంగ = కూడుకొనినవాఁడా, సంగర = యుద్ధములయందు, మదోద్వృత్త = ఉత్సాదముచేత సముద్ధతులైన, అరి = శత్రుసంబంధులైన, రాహుత్తరాట్ = యోధాగ్రేసరుల నెడు, వేశ్యాలోక=వేశ్యాజనమునకు, భుజంగ=విటుఁడవైనవాఁడా, జంగమనగత్ = సంచరించెడు పర్వతములవలె నాచరించుచున్న, వేదండ=ఏనుఁగులచేత, పూర్ణ=నిండిన, అంగణ = ముంగిలి గలవాఁడా యని కృతిపతింగూర్చి సంబోధనము. ఈపద్యము ముక్తపదగ్రస్తము గలదిగాఁ జెప్పంబడియెను.

క. శంబరనయనానూతన, శంబరహర విమతకుధర•శంబ రణజయా
డంబరపీతాంబర యెం, తెంబరగండాంక యతుల•ధృతినిశ్శంకా. 187

శంబరనయనా = లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలకు, నూతనశంబరహర = అభినవమన్మథుఁడవైనవాఁడా, విమత = శత్రువుల నెడు, కుధర = పర్వతములకు, శంబ = వజ్రాయుధమయినవాఁడా, ని. 'శతకోటి స్వరు శ్శమ్బః' అని అ. రణజయాడంబరపీతాంబర = యుద్ధజయసంరంభమందు విష్ణుఁడవైనవాఁడా, ఎంతెంబరగండాంక = ఎంతెంబరుఁడ నెడు రాజునకు మగఁడవుగనుక నెంతెంబరగండఁడ నెడు బిరుదుగలవాఁడా, అతులధృతినిశ్శంకా = సమానరహితమయిన ధైర్యముగలవాఁడవుగనుకనే శంకారహితుఁడవయినవాఁడా అని సంబోధనము. ఈపద్యము ద్విప్రాసముగలదిగాఁ జెప్పంబడియెను.

కవిరాజవిరాజితము. అనయనిషూదన శశ్వదసాదన•య ప్రతిపాదన దివ్యఝరీ
వనమదనోదనకీర్తివినోదన•వైరివనాదనమత్తకరీ
ఘనఘననాదనటజ్జయవాదన•గాఢనినాదనతేంద్రగిరీ
వినమదసూదన మ్లేచ్ఛవినోదన•వీరబరీదనరాదహరీ. 188

అనయ = నీతిరహితులైనవారికి, నిషూదన = సంహారకుఁడవైనవాఁడా, శశ్వత్ = ఎల్లప్పుడును, అసాద = క్షీణింపని, నయ=నీతియొక్క, ప్రతిపాదన=ప్రతిపాదకుఁడవైనవాఁడా, సాదశబ్దము కార్శ్య వాచకము. ఇందుకు రఘువంశమందు, శ్లో. 'శరీరసాదాదసమగ్రభూషణా' అని ప్రయోగము. దివ్యఝరీ = ఆకాశగంగయొక్క, వన = ఉదకముయొక్క, ని. 'వనే సలిల కాననే' అని అ. మదనోదన = మదాపహారియైన, కీర్తివినోదన = కీర్తివినోదకుఁడవైనవాఁడా, ఇక్కడ నాకాశగంగయొక్క యుదకము తెల్లనిదని తెలియవలయును. వైరివనాదన = శత్రువుల నెడు వనములయొక్క భక్షణమందు - అనఁగా భంజనమందు, మత్తకరీ = మదపుటేనుఁగు వైనవాఁడా, ఘన = అధికమయిన, ఘననాద = మేఘగర్జనమువలె, నటత్ = ప్రవర్తించుచున్న, జయవాదన = జయభేరియొక్క, గాఢనినాద = నితాంతధ్వనికి, నత = వంగిన, ఇంద్రగిరీ = మహేంద్రపర్వతము కలవాఁడా, వినమత్ = మిక్కిలి నమ్రులగుచున్నవారికి, అసూదన = సంహారకుఁడవు గానివాఁడా-అనఁగా రక్షకుఁడ వైనవాఁడా, మ్లేచ్ఛవినోదన = మ్లేచ్ఛులను సంహరించువాఁడా, వీర = పరాక్రమవంతుఁడయిన, బదరీ = బెడదకోటనవాబు సంబంధు లనెడు, నరాద=రాక్షసులకు, హరీ=నారాయణుఁడవైనవాఁడా యని సంబోధనము. ఈవృత్త

మిదపదిమూఁడవ ఛందంబగు వికృతిచ్ఛందంబునం బుట్టినది. దీనికి నజజజజజజ వ గణము లుండవలయును. పదునాలవయక్షరము యతిస్థానము. ఈవృత్తము వృత్త్యనుప్రాసాంత్యప్రాసములు గలదిగాఁ జెప్పంబడియెను.

గద్యము. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందవందనపవననందనప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకషచతుర్విధకవితానిర్వాహకసాహిత్యరసపోషణ రామరాజభూషణప్రణీతం బైన వసుచరిత్రం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

ఇది శ్రీమదాత్రేయకులకలశాంభోనిధి సంపూర్ణసోమ సోమాభిధానమంత్రివరపౌత్రుండును సోమసుతసిద్ధేశ్వరమంత్రీశ్వరపుత్రుండును శ్రీమత్పార్వతీరాజేశ్వరవరప్రసాదసమాసాదితవ్యాఖ్యానవ్యసిఖిలవిద్యావిశారదుండును నగుసోమకవిచేత విరచితం బయినవిద్వజ్జనరంజనీ నామక పూర్వవ్యాఖ్యానమునందలి విశేషవిషయసహితముగాఁ బరిష్కృతం బయి యొప్పారు ప్రతిపదటీకారూపంబగు వసుచరిత్రనామకాంధ్రకావ్యరత్నవ్యాఖ్యానమునందుఁ దృతీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# వసుచరిత్రము, సవ్యాఖ్యానము

## చతుర్థాశ్వాసము



రంగరాయకలశాం
భోరాశినిశాసహాయ భూభువనధురా
ధౌరేయ వీరగోష్ఠీ
ధీరాద్భుతసాంపరాయ తిరుమలరాయా. 1

శ్రీరంగరాయ = శ్రీరంగరాయఁ డనెడు, కలశాంభోరాశి=క్షీరసముద్రమునకు, నిశాసహాయ= చంద్రుఁడ వైనవాఁడా, భూభువన = భూలోకముయొక్క, ధురా=భారమునకు, ధౌరేయ = ధురంధరుఁడ వైనవాఁడా, వీరగోష్ఠీ=వీరులయొక్క సభకు, (ని. 'సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితి సంసదః') అని అ. ధీర = మనోహరమును, అద్భుత = ఆశ్చర్యకరమునైన, సాంపరాయ = యుద్ధముగలవాఁడా, తిరుమలరాయా = తిరుమలరాయఁడను పేరుగలవాఁడా అని సంబోధనము. (ని. 'సాంపరాయో స్త్రియాం ద్వంద్వం యుద్ధం' అని యమరశేషము.) ఈపద్యము వృత్త్యనుప్రాసము గలదిగాఁ జెప్పంబడియెను. అలం. రూపకము.

తే. అవధరింపుము శౌనకా ద్యఖిలసన్ము, నీంద్రులకు రౌమహర్షణి యిట్లు పలుకుఁ
జెలులకై దండఁ బూనియా చిగురుఁబోఁడి, చారుమణిధామ మల్లనఁ జేరఁ జనుడు.

అవధరింపుము = చిత్తగింపుము. శౌనకా ద్యఖిల సన్మునీంద్రులకున్ =శౌనకుఁడు మొదలుగాఁగల సమస్త మునిశ్రేష్ఠులకు, రౌమహర్షణి = రోమహర్షణ పుత్త్రుఁడైన సూతుఁడు. ('రోమహర్షణస్యాపత్యంపుమాన్ రౌమహర్షణిః' అని.) ఇట్లుపలుకున్ = ఈచెప్పఁబోవు ప్రకారముగా వచించెను. ఏమనియనిన, చెలుల కైదండఁ బూని = సఖులయొక్క చేయూఁత నవలంబించి, ఆచిగురుఁబోఁడి = ఆగిరికాదేవి, చారుమణిధామము = సుందరమైన మణిమందిరమును, అల్లనఁ జేరఁ జనుడున్ =తిన్నగాఁ జేరఁబోఁగా.

సీ. పతి వంచనామానిఁ బంచి మించినవేడ్కఁ బొంచియుండినపువ్వుఁబోఁదలు సూచి
సమయానుగుణ సమాగమలీలఁ గాంచిన నరనాథు చరణాంకసరణిఁ జూచి
రమణీకృతోపచారము లిచ్చుఁ గైకొన్న ప్రియుఁ డున్న సౌవర్ణపీఠిఁ జూచి
రమణానుబింబభాగ్యములు నోఁచిన చకచకితమాణిక్యభిత్తికలు సూచి
తే. హైమగృహవాటి నాఁటివసారావలోక, కౌతుకం బప్పు డటుగన్నకరణిఁ దోఁప
వలసి సొలసి ప్రవాళశయ్యాతలమున, నల సితాపాంగ మై సేర్చియడలునంత.

పతి వంచనామానిఁ బంచి = వసురాజు కపటయతిని బంపించి, మించిన వేడ్కన్ =అతిశయించిన వేడుకచేత, పొంచియుండిన = డాఁగియున్న, పువ్వుఁబోదలఁ జూచి=పూఁబోదలను జూచియును, సమయానుగుణ సమాగమలీలఁ గాంచిన=సమయమున సిద్ధమగునట్టులుగా వచ్చిన రాకడయొక్క విలాసమును బొందియున్న, నరనాథు=వసురాజుయొక్క, చరణాంక=పాదములచేఁ జిహ్నితమైన, సరణిఁ జూచి = మార్గమును జూచియును, రమణీకృతోపచారము లిచ్చఁగైకొన్న = స్త్రీలచేతఁ జేయఁబడిన యుపచారముల నాసక్తిచేత నంగీకరించిన, ప్రియుఁడు = మనోహరుఁడు వసురాజు, ఉన్న = కూర్చున్న, సౌవర్ణపీఠిఁ జూచి = సువర్ణమయమయిన పీఠము జూచియును, రమణ = రమణుఁడైన వసురాజుయొక్క, అనుబింబ = ప్రతిబింబముయొక్క, భాగ్యములనోచిన = భాగ్యములు గలుగునట్టులుగాఁ బూర్వజన్మమునందు నోములునోచిన, చకచకిత మాణిక్య భిత్తికలు సూచి=చకచకాయమానము లగుచున్న రత్నకుడ్యములను జూచియుచు,

హైమగృహవాటిక్ = సువర్ణమయమైన గృహప్రదేశమందు, నాఁటివరాపలోక కౌతుకంబు=నాఁడుపొందిన వసురాజ దర్శన జనితమైన సంతోషము, అప్పుడటులస్పష్టకరణిఁ దోఁపన్ = అస్పష్టత్వ పొందినట్టుగాఁ దోఁచుచుండఁగా, అలసి సొలసి = వ్యథనొంది అలసి, ప్రవాళశయ్యాతలమునన్= చిగురుటాకుల పాన్పునందు, అలసితాపాంగ = ధవళములైన క్రేగన్నులుగలయాగిరికాదేవి, మైసేర్చి= దేహమును హత్తించి, అడలఁనంతన్ =విచారపడుచున్న మీఁదట.

ఈపద్యమందు భూతార్థసాక్షాత్కారవర్ణనము చేసినాఁడు గనుక భావికాలంకారము. ని. 'భావికం భూతభావ్యర్థసాక్షాత్కారస్య వర్ణనమ్' అని లక్షణము.

చ. భవదనుజాత్మజన్ వసున్నృపాలుఁడు గైకొను నెల్లి నేఁట న
యవ్వవనిపప్రసాదమున నంటదువో భవదీయజాతికిం
బవిభయ మంచు మంచుమలపట్టికి భావిశుభంబు లోకబాం
ధవుఁ డెఱిఁగింపఁ బోయినవిధంబున నేఁగెఁ బయోధిచెంతకున్. 4

భవత్ =నీయొక్క, అనుజ= తమ్ముఁడైన కోలాహల పర్వతునియొక్క, ఆత్మజన్ = కూఁతురైన గిరికాదేవిని, వసున్నృపాలుఁడు=వసురాజు, కైకొను నెల్లినేఁటన్ = రేపటనేఁటఁ బరిగ్రహించుచున్నాఁడు-అనఁగాఁ బాణిగ్రహణము సేయుచున్నాఁడు. అయ్యవనిపరప్రసాదమునన్ = ఆరాజుయొక్క యనుగ్రహముచేత, భవదీయజాతికిన్ = నీసంబంధమయిన పర్వతకులమునకు, పవిభయము = వజ్రాయుధ సంబంధమయిన భయము, అంటదువో = తగులదుసుమీ, అంచున్ =ఇట్లని, మంచుమలపట్టికిన్ = హిమవత్పర్వత పుత్త్రుఁడయిన మైనాకునికి, భావిశుభంబు = ముందుఁగాఁగల శుభమును, లోకబాంధవుఁడు = సూర్యుఁడు, ఎఱిఁగింపఁబోయినవిధంబునన్ = తెలియఁజెప్పెడుకొఱకుఁ బోవునట్టులుగా, పయోధిచెంతకున్ = పశ్చిమసముద్ర ప్రాంతమునకు, ఏగెన్ = పోయెను. అనఁగా సూర్యుఁడస్తమించు సమయమాయెనని తాత్పర్యము. ఇందులో లోకబాంధవశబ్దము సాభిప్రాయము. తాను లోకబాంధవుఁ డగుటచే హితము దెలుప వలచి గిరికను వసురాజు పెండ్లాడు ననియు శైలజాతి కింక మీఁదట వసురాజానుగ్రహవశమున వజ్రభయ ముండదని మైనాకున కెఱింగించుటకుఁ బోవునటుల భాస్కరుఁ డస్తంగతుఁ డయ్యెను. మైనాకుఁడు వజ్రపాతభయమున సముద్రమున నుండెఁ గాన నటకుఁ బోయినటుల నస్తమించెను. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. కాలవశంబునం దనయ ఖండితచండిమ దూలి హేళి య
స్తాలయవాటికిం జనుచు నాత్మకరావృతదుర్గపాళి నా
ప్తాళి నమర్చి నాఁ బరిణ తాతపము ల్గిరు లెక్క నిక్కెఁ ద
న్మూలములం దనాతపస మూహము పేరిటియిర్ల వేలముల్. 5

ఈపద్యమునందు దొల్లింటివిభవము గోల్పోయిన రాజుపరముగను సూర్యునిపరముగను నర్థద్వయము గలదు.

కాలవశంబునన్ = సంధ్యాకాలాగమముచేతనని యర్థము. కాలవిపర్యయముచేత నని యర్థాంతరము. తన యఖండిత చండిమ దూలి = తనయొక్క సంపూర్ణమైన తీక్ష్ణత్వము చెడిపోయి యని యర్థము. తనయొక్కయాఢ్యత్వము చెడిపోయి యని యర్థాంతరము. హేళి = సూర్యుఁడు, అస్త = అస్తాచలమనెడు, ఆలయవాటికిం జనుచున్ = గృహప్రదేశమునకుఁ బోవుచు, ఆత్మ = స్వకీయమయిన, కర = కిరణములచేత, ఆవృత = ఆవరింపఁబడిన, దుర్గపాళికిన్ = పర్వతసమూహములయం దని యర్థము. నిజహస్తావృతగిరిదుర్గపాళియం దని యర్థాంతరము. అనఁగా దనకు హస్తగతములైన దుర్గములయం దనుట, ఆప్తాళినమర్చినాన్ = ఆప్తజనసమూహమును గావలి పెట్టినాఁడో యన్నట్లులుగా, పరిణతాతపము ల్గిరులెక్కన్ = పండఁబారిన యెండలు పర్వతాగ్రముల కెక్కఁగా, తన్మూలములందున్ = ఆపర్వతములయొక్క యడుగుమట్లయందు, అనాతప సమూహము పేరిటి-అనాతప = నీడలయొక్క, సమూహము పేరిటి = గుంపులనెడు, ఇర్ల వేలముల్ = చీఁకటులయొక్క దండ్లు, నిక్కెన్ = విజృంభించెను.

కాలవశమున సూర్యుఁడు తనబీరము గోలుపోయి యస్తాచలము దరియ నేగుచుఁ దొల్లి తాను కరములచే నలరించిన దుర్గములం దుంచిన యాప్తులవలె సంధ్యారాగారుణప్రభలు శైలాగ్రములఁ గనుపించెను. శైలము ముట్టడింపవచ్చిన విరోధిసమూహమువలె నీడలను చీఁకటిగుంపులు విజృంభింపసాగెను. సూర్యుఁ డస్తంగతుఁడు కానుండ శైలాగ్రములసంజకావి మించె ననియు నీడలు చీఁకటులవలె శైలమూలముల నలరె ననియు భావము. అలం. ఉత్ప్రేక్షారూపకసాంకర్యము. సమాసోక్తి.

తే. అప్పు డపరానుషంగ లబ్ధాంగరాగ, మేర్పడఁగ నతిగతుఁడైన యినునిఁ జూచి
పద్మినిముడించెనెమ్మోము ప్రభదలిర్ప, దయ్యె వెంబడిఁ జనక ఛాయయునుమఱలె.

అప్పుడు = ఆసమయమందు, అపరా = అపరదిశయొక్క, అనుషంగ = సంగతివలన, లబ్ధ = ప్రాప్తమైన, అంగరాగము = ఆకారముయొక్క రక్తిమ, ఏర్పడఁగన్ = ప్రకటమగునట్లులుగానని యర్థము. అన్యకాంతాసంభోగమువలనఁ బ్రాప్తమయిన మయిపూఁత ప్రకట మగునట్లులుగా నని యర్థాంతరము. అతిగతుఁడయిన = దృగ్గోచరుఁడయినయని యర్థము. ద్వేష్యుఁడైన యనియర్థాంతరము. (ని. 'ద్వేష్యే త్వతిగతః' అని అ.) ఇంతపర్యంతము నభేదాధ్యవసాయము సేయవలయును. ఇనునిఁజూచి = సూర్యుఁడనెడు పెనిమిటినిఁ జూచి, పద్మినిముడించెనెమ్మోము = పద్మలతయనెడు పద్మినీజాతిస్త్రీ ముఖము ముడిచి పెట్టుకొనె నని యర్థము. ఇక్కడఁ బద్మముకుళనమును మోము ముడుచుటనుగా నధ్యవసించినాఁడు. ప్రభదలిర్పదయ్యెన్ = ప్రభయనెడుస్త్రీ దలిర్పదయ్యె నని యర్థము. తలిర్పకపోవుట ప్రభాపక్షమందు మందమగుటయును, స్త్రీపక్షమం దుల్లసిల్లక పోవుటయును నని తెలియవలయును. వెంబడిఁ జనక ఛాయయును మఱలెన్ = ఛాయయనెడు స్త్రీ వెంటఁ బోవక మఱలెనని యర్థము.

వెంబడిఁ జనకపోవుట యనఁగా ఛాయాపక్షమందు వెనుకకు సాగుటయును, స్త్రీపక్షమందు ననుసరణము మాని మఱలుటయును. ఇక్కడ నుభయత్ర మేకదేశవర్తిరూపకము.

ఇక్కడ ఖండితయనెడు నాయికను జెప్పినాఁడు. ఇందుకు లక్షణము-

క. 'ఇతరదిశ రాత్రి రతిచి, హ్నితుఁడగు పతిరూపు గని సహింపనియది ఖం
డితయగుఁ గలహాంతరితయుఁ, బతి నవమానించి పిదపఁ బరితప్తయగుర్.'

అని నరసరాజీయమునందుఁ జెప్పఁబడియున్నది.

ఇందులో ముఖముకుళనభావమాత్రముచేత, పద్మలతాస్త్రీని ముగ్ధ యనియును వలర్వకపోవుట చేతఁ బ్రభాస్త్రీని మధ్యయనియును వెంబడిఁ జనక మఱలుటచేత ఛాయాస్త్రీని ప్రౌఢయనియును దెలియవలయును. పద్మినియందు ముగ్ధాచేష్టయును బ్రకటము సేసినాఁడు గనుకఁ బ్రభాస్త్రీయందు మధ్యాచేష్ట చెప్పవలయును. ముగ్ధాదులకు లక్షణము-

శ్లో. 'ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జా విజితమన్మథా
లజ్జామన్మథమధ్యస్థా మధ్యమోదితయౌవనా
స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా.'

నాయకుఁడు ధృష్టుఁడని తెలియవలయును. 'వ్యక్తాపరాధో గతభీ స్సధృష్ట ఇతికథ్యతే' అని లక్షణము.

సూర్యబింబము అస్తంగత మగుచుండ సంజకావి విస్తరిల్లెననియుఁ, దామరలు ముకుళించెననియుఁ, బ్రకాశము మందగించెననియు, నీడలు వెనుమఱలి నిడుదలుగా సాగుచుండె ననియు భావము.

అలం. రూపకము. శ్లేషమూలకసమాసోక్తి.

సీ. వనజాలయము మూసి ♦ యినుజాడఁ దిలకించు లలితాబ్జినీ రాగ♦లక్ష్మి యనఁగ
ఘనపచాయసపట్టి♦కఁ దమోంజనము పట్ట నపరాశ యిడిన దీ♦పార్చి యనఁగఁ
గప్పు చూపుచుఁ బాంథ♦గణము నేచు ప్రదోషకరిమేని ధాతుశృం♦గారమనఁగ
ద్విజసూక్తిఁ బతిరాక♦దెలిసి మోమెత్తి రాత్రిసహించు కాశ్మీర♦తిలక మనఁగ
తే. సమయమృగవ్యాత రవిరఘూ♦త్తమునిసతిఁ బ్ర
భామయిఁ దమోనిశాటుండు ♦ పఱవకుండ
ననలధామంబులో డాఁచి ♦ యమరు లిడిన
వంచనాగౌరగాత్రి నా ♦ వరలె సంధ్య. 7

వనజాలయముమూసి = కమలములనెడు నిల్లుకలుపుమూసి, ఇనుజాడఁదిలకించు=('సాయంకాలే త్వయం విష్ణుః') అని యున్నది గనుక విష్ణుస్వరూపుఁడయిన సూర్యునిజాడఁ జూచుచున్నదియు, లలిత = ఒప్పుచున్నదియు నగు, అబ్జినీ=పద్మలతయొక్క, రాగలక్ష్మియనఁగన్=అనురాగలక్ష్మియోయన్న ట్టులుగా నని యర్థము. రాగలక్ష్మి యన్నచోట సామ్రాజ్యలక్ష్మీత్యాది స్థలములయందుంబలె విచారింపవలయును. ఈచరణమందు నభిసారిక యనెడునాయికను జెప్పినాఁడు. ఇందుకు లక్షణము-(శ్లో. కాంతాభి సరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా'. అని తామరపూవులు ముకుళించె ననియు సంధ్యా

రాగము వ్యాపించెననియు భావము. తమ్మిమొగ్గలు పైకెత్తికొనియుండుట గాన నిశని బిలకించుచున్నట్టు లుండెననుట. అలం. రూపకోత్థాపితోత్ప్రేక్ష.

ఘనపదాయసపట్టికన్ = ఆకాశమనెడు నినుపరేకునందు, తమోంజనము పట్టన్ = చీఁకటి యనెడు కాటుక పట్టెడుకొఱకు, అపరాశ [illegible] దీపార్చియనఁగన్ = పశ్చిమదిశయనెడు స్త్రీ పెట్టిన దీపజాలమో యన్నట్టులుగా ననియర్థము. ఈచరణమందు వాసకసజ్జిక యనెడు నాయికను జెప్పినాఁడు.

శ్లో. 'ప్రియాగమనవేళాయాం మండయంతీ ముహుర్ముహుః
కేళీగృహం తథాత్మానం సాస్యా ద్వాసకసజ్జికా.'

అని లక్షణము. దీపార్చి యపరాశ నిడినటులఁ జెప్పఁబడుట పశ్చిమదిక్కునుండి సంధ్యారాగము బయలుపడలుచున్నదనియు నాకాశము ఆయసపాత్రమువలె నున్నదనుటచేఁ జీఁకటు లావరించి మిగిలిన దిశలఁ నల్లగానున్నవనియుఁ భావము. అలం. ఉత్ప్రేక్ష.

కప్పుచూపుచున్ = నైల్యము గనుపఱచుచు, పాంథగణము నేచు = విరహులనెడు తెరువరులను ఛేదించుచున్న, ప్రదోషకరిమేనిన్=ప్రదోషకాలమనెడు నేనుఁగుశరీరమందిన్, ధాతుశృంగార మనఁగన్= రాజుచేత రచింపఁబడిన రేఖాలంకారమో యన్నట్టులుగా నని యర్థము. శృంగారమనఁగా గజమండన మనఁబడు. ('శృఙ్గార స్సురతే నాట్యే రసేపి గజమణ్డనే' అని వి.) ఏనుఁగుదేహమందు జాజు రేఖలువ్రాయుట ప్రసిద్ధము. ప్రదోషకాలమున చీఁకటులు పిక్కటిల్లసాగెను చీఁకటులు సంధ్యయను నేనుఁగువలెనుండెననియు, సంధ్యారాగ మాయేనుఁగు మేనఁగల ధాతువర్ణమువలె నుండెననియు భావము. అలం. రూపకమిశ్రోత్ప్రేక్ష.

ద్విజసూక్తిన్ = పక్షికలకలమనెడు బ్రాహ్మణవాక్యములవలన, (ని. 'దంత విప్రాణ్డజా ద్విజాః' అని అ.) పతిరాకఁదెలిసి = చంద్రుఁడనెడు పెనిమిటియొక్క రాకడనెఱింగి, మోమెత్తి=ప్రదోషమనెడు ముఖమెత్తి, మోమనఁగా రజనీముఖము. అనఁగాఁ బ్రదోషమును, వక్త్రంబును, ('ప్రదోషో రజనీముఖమ్' అని అ.) రాత్రి = ఇక్కడ స్త్రీలింగమహిమముచేత నొకానొకస్త్రీ స్ఫురించుచున్నది గనుక రాత్రియనెడుస్త్రీ, వహించు కాశ్మీరతిలక మనఁగన్ = ధరించిన కుంకుమపుబొట్టో యన్నట్టులుగా నని యర్థము. ఈచరణమందు ద్విజసూక్తిఁ బతిరాకఁ దెలిసి యనెడు పర్యంతము ప్రోషితభర్తృకావస్థను జెప్పినాఁడు. ఇందుకు 'దేశాంతరగతేకాంతే ఖిన్నా ప్రోషితభర్తృకా' అని లక్షణము. పక్షులు కలకలము గావించుచుండెను. రాత్రికాంత మోమునఁ దీర్చిన సిందూరతిలకమువలె సంజకావి యలరెను. చీఁకటులు దిగంతముల వ్యాపించెననియు సంధ్యారాగవిస్తృతి తగ్గెననియు భావము. అలం. ఉత్ప్రేక్ష.

మోమెత్తి రాత్రి వహించు కాశ్మీరతిలకమనఁగా ననెడుపర్యంతము వాసకసజ్జికను జెప్పినాఁడు. సమయ = సాయంకాలమనెడు, మృగ = మాయామృగముచేత, హృత = తీసికొనిపోఁబడిన, రవి = సూర్యుఁడనెడు, రఘూత్తముని = శ్రీరామునియొక్క, ప్రభామయిన్ = ప్రభయనెడు, సతిన్ = భార్యను, తమోనిశాటుండు = చీఁకటియనెడు రాక్షసుఁడు-అనఁగా రావణుఁడు, పఱవకుండన్ = ఎత్తుకొనిపోకుండునట్లుగా, అనలధామంబులోన్ = అగ్నితేజమునందు, ఉభయత్ర తుల్యము. డాఁచి = దాచి

పెట్టి, అమరులు = దేవతలు, ఇడిన=ఎదుట నిలిపిన, పంచనాగౌరగాత్రినాన్ =పసపుచాయ శరీరముగల మాయాసీతయో యన్నట్టులుగా, సంధ్య = సంధ్యారాగము, వఱలెన్ = ప్రకాశించెను.

సూర్యునికాంతి దినాంతమందు నగ్నినిం జెందుట శ్రుతిప్రసిద్ధము. మాయాసీతావృత్తాంతము అధ్యాత్మరామాయణమునందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో. 'అథరామోపి తత్సర్వం జ్ఞాత్వా రావణచేష్టితమ్
ఉవాచ సీతాం మేకాంతే శృణు జానకి మద్వచః
రావణో భిక్షురూపేణ హ్యాగమిష్యతి తేఽంతికమ్
త్వంతుచ్ఛాయాం త్వదాకారాం స్థాపయిత్వోటజే విశ
అగ్నౌ వదృశ్యరూపేణ వర్షం తిష్ఠ మమాజ్ఞయా
రావణస్య వధాంతే మాం పూర్వవ త్ప్రాప్స్యసే శుభే.'

అని చెప్పంబడియున్నది.

సూర్యకాంతి దినాంతమునం దగ్నిని చెందు ననుట సుప్రసిద్ధము.

ఉ. అంబుజినీపురంధ్రి హృదయాధిపుఁ డౌనక సృక్కి యబ్జవ
క్త్రంబునఁ దేఁటియూరుపుపొగ ల్వెడలం గడు మూర్ఛ వోవఁ గో
కం బది హేళికిం దెలుపఁ గాదె ప్రియప్రమదావియోగశో
కంబు గణింప కేఁగె నిజకార్యము లెంతురె మిత్రతత్పరుల్. 8

అంబుజినీపురంధ్రి=పద్మలతయ నెడుస్త్రీ, హృదయాధిపుఁ డౌనక=హృదయేశ్వరుఁడైన సూర్యుఁడు గానక, సృక్కి = వాడుదేరి, అబ్జవక్త్రంబునన్ = పద్మమనెడు ముఖమందు, తేఁటియూరుపుపొగ ల్వెడలన్ = తుమ్మెదలనెడు నిశ్వాసధూమములు బయలుదేరఁగా, కడుమూర్ఛవోవన్=మిక్కిలిమూర్ఛ పోఁగా, కోకంబు = చక్రవాకము, అది=అనఁగా ఆపద్మలత మూర్ఛవోవుట, హేళికిం దెలుపఁగాదె= సూర్యునికిఁ దెలియఁ జేయుటకో అకేకదా, ప్రియప్రమదా వియోగ శోకంబు గణింపక = ప్రియాంగనావియోగమువలని దుఃఖమును లెక్కసేయక, ఏఁగెన్ = పోయెను. (అది యుక్తమేగదా.) ఎట్లనిన, మిత్రతత్పరుల్ = సుహృత్ప్రపక్షపాతముగలవారు, నిజకార్యములెంతురె = తమకార్యములను విచారించి చూతురా - అనఁగా విచారింపరని యర్థము. చక్రవాకములు సూర్యునియం దాసక్తి గలిగినవని భావము.

మిత్రశబ్దము మిత్రత్వముగలవానియందును సూర్యునియందును వర్తించుచున్నది. ఈపద్యమందు విరహోత్కంఠిత యనెడునాయికను జెప్పినాఁడు. ఇందుకు లక్షణము-

క. 'విరహోత్కంఠిత యనునది, పరునితడవు సైఁపలేక వగ నొందున దీ
శ్వరుఁ డిక్కకు రాకుండిన, భరపడునది విప్రలబ్ధ భావజుకాఁకన్.'

అని నరసరాజీయమునఁ జెప్పఁబడియున్నది.

తామరపూవులు సూర్యుఁ డస్తగతుఁ డగుచుండ ముకుళించెను. తుమ్మెదలు తమ్ములను వీడి పోవుచుండెను. చక్రవాకము కవవీడి వియోగావస్థలోఁ దపించుచుండెను.

తుమ్మెదలు ముకుళింపనున్న తమ్ములను వీడిపోవు ననుటకు-

చ. బుగబుగ తావులం బొదలు పుప్పొడిచే మకరందధారచే
నొగిఁ దమఁ బ్రోచినంత వడియున్ గడు నక్కిలిఁ జేరి కొల్చి మా
పగుటయుఁ దుమ్మెదల్ జలరుహంబుల తొల్లిటిరూపు దప్పినన్
దగఁ గొగల న్వసించెడు కృతఘ్నుల నెందును నమ్మవచ్చునే. విప్రనారాయణచరిత్రము.

చ. మొగము మొగంబుఁ గూర్చి బలు♦ముచ్చటఁ బక్షపుటాంతరంబులన్
బిగియఁ గవుంగిలించి తన♦ప్రేయసి ముంగలఁ జంచుపాళికా
విగళితనాళదంభమున ♦ వేగనె రాఁ గత మిచ్చి యేగె లో
నొగులుచు నొక్కజక్కవ యి♦నుండు సనం దదధీనవృత్తి యై. 9

మొగము మొగంబుఁగూర్చి = ముఖమునందు ముఖముచేర్చి, బలుముచ్చటన్ = అధికమయిన ప్రేమచేత, పక్షపుటాంతరంబులం బిగియఁ గవుంగిలించి = ఱెక్కలయొక్క లోపలిపార్శ్వములచేత గాఢమగునట్టులుగాఁ గౌఁగిలించుకొని, తనప్రేయసిముంగలన్ = తనభార్యముందర, ఇక్కడఁ ప్రేయసీశబ్దముచేతఁ బ్రోషితభర్తృక యనెడు నాయిక స్ఫురించుచున్నది. చంచుపాళికా = ముక్కునుండి, విగళిత=జారిన, నాళ=మృణాళనాళమనెడు, దంభమునన్=మిషచేత, వేగనెరాఁగతమిచ్చి=కతమనఁగా హేతువు, ఇక్కడ గుఱుతని చెప్పవలయును. ప్రాతఃకాలము కాఁగానే వచ్చుటకుఁగాను గుఱుతిచ్చి యని యర్థము. పద్మవికాసము ప్రాతఃకాలలక్షణము గనుకఁ బద్మనాళము ప్రాతఃకాలాగమనజ్ఞాపకమని తెలియవలయును. శీఘ్రముగా వచ్చుటకు గుఱుతిచ్చి యని యర్థాంతరము. వేగ ననెడుపదము కుశాదిగణపఠితము గనుక మువర్ణకమునకు లోపము వచ్చినది. లోనొగులుచున్=లోపల వ్యసనపడుచును, ఒక్కజక్కవ = ఒకానొకచక్రవాకము, ఇనుండుసనం దదధీనవృత్తియై=సూర్యుఁ డస్తాద్రికిఁ బోవఁగా సూర్యానుగమనము గలదై యని యర్థము. ప్రభువు చైత్రయాత్ర పోవఁగాఁ దదధీనజీవనముగలదై యని యర్థాంతరము. ఇక్కడ వృత్తియనఁగా జీవనము. (ని. 'ఆజీవో జీవికావార్తా వృత్తి ర్వర్తన జీవనే' అని అ.) ఏఁగెన్ = వెంటనెడఁబాసిపోయెను.

ప్రోషితభర్తృకాలక్షణము-

క. 'ఒకదేశమునకుఁ దననాయకుఁ డేగినఁ జిన్నవోవునది ప్రోషిత భ
ర్తృక నిలుపోపక ప్రియునొద్దకుఁ జనునభిసారికాభిధాన దలంపన్.'

. అని నరసరాజీయము.

మ. నటదీశానశిరస్తటత్రుటితర♦త్నచ్ఛాయఁ గల్లోలినీ
విటమధ్యంబున వ్రాలె నభ్రమణి త♦ద్వేగాభిపాతోన్నమ
త్పటుపాథోలవధార తార లెగసెం♦ దద్బిందుసంధానితో
త్కటసంధ్యానలధూమకందళము లై ♦ కన్పట్టెఁ గ్రొంజీఁకటుల్. 10

నటత్ = సంధ్యాకాలమందు నాట్యము సేయుచున్న, ఈశాన = శివునియొక్క, శిరస్తట=శిరఃప్రాంతమువలననుండి, త్రుటిత = తెగిపడిన, రత్నచ్ఛాయ = మాణిక్యమో యన్నట్టులుగా, కల్లోలినీవిటమధ్యంబునన్ = నదీనాథుఁడయిన సముద్రునియొక్క మధ్యప్రదేశమందు, అభ్రమణి = సూర్యుఁడు,

వ్రాలెన్ = పడినవాఁడాయెను, తద్వేగపాత = ఆమణియొక్క వేగముతోఁగూడిన పతనముచేత, ఉన్నమత్ =మీఁది కెగయుచున్న, పటు=సమర్థమయిన, పాథోలవధార = సముద్రజలబిందుపఙ్క్తియన్నట్టులుగా, తారలెగసెన్ = నక్షత్రములెగసెను, తద్బిందు = ఆజలబిందువులతోడ, సంధానిత = సంగతమైన, ఉత్కట=అతిశయమయిన, సంధ్యానల=సంధ్యారాగమనెడు నగ్నివలనఁ బుట్టిన, ధూమకందళములై = ధూమాంకురములో యన్నట్టులుగా నున్నవై, క్రొంజీఁకటుల్ = తొలుతటిచీఁకటులు, కన్పట్టెన్=కానఁబడియెను-అనఁగా ముందుగా సూర్యాస్తమయమాయెను. ఆవెంబడిగాఁ జుక్కలు గనుపడెను, ఆవెంబడిగా సంజచీఁకటులు గనుపడియె నని తాత్పర్యము.

“రక్తత్వమేవరత్నానాం” అను కావ్యకల్పలతాసూక్త్యనుసారము రత్నములు రక్తవర్ణగణములుగా నెంచుట కవిసమయము. అభ్రమణిశబ్దము సాభిప్రాయము. శివుఁ డభ్రకేశుఁడు గావున సూర్యుఁడు శివశిరోరత్నమని భావము. నటదీశానుఁడు గాన శిరోరత్నము త్రుటితమగుట సంభవించెను. అట్టి రత్న రక్తకాంతులే సంధ్యారుణకాంతులు. అపుడు సంద్రమునుండి లేచినతుంపురులే నక్షత్రములు. సంధ్యారాగ మగ్నిగాన నందుండి పొగ లెగయుట సాజము. మొలకచీఁకటు లాయగ్నినుండి బయలు వెడలిన పొగవలె నుండెను.

అలం. ఉత్ప్రేక్ష. రూపకము.

మ. అరవిందోదరమూర్తి భానుఁ డపు డూష్మాంతంబుగా సంకుచ
త్సరసీజేక్షణుఁ డై పయోనిధిఁ జొరన్ • సంధ్యాతటిత్పూర్వ మై
నెరసెం జీఁకటి కాఱ్మొగు ల్జగతిపై • నిమ్నోన్నతాభోగము
ల్సరి గావించుచు సర్వతోముఖమహాసార ప్రసారంబులన్. 11

ఈపద్యమునకు విష్ణుపరముగను సూర్యపరముగను నర్థద్వయము గలదు.

అరవిందోదరమూర్తి=అరవింద ముదరమందుఁగలవాఁడు గనుక నరవిందోదరుఁడు అనఁగా విష్ణువు యొక్కమూర్తిగలవాఁడు గనుక నరవిందోదరమూర్తి యనఁగా సూర్యుఁడని యర్థము. (శ్లో. ‘సాయంకాలేత్వయంవిష్ణుః’ అని ప్రమాణము.) అరవిందోదరసదృశమైన యరుణమూర్తిగలవాఁడని యర్థాంతరమును విచారింపవలయును. భానుఁడు = అట్టిసూర్యుఁడు, అపుడు=ఆసమయమందు, ఊష్మాంతంబుగాన్ = ఊష్మ యనఁగా నెండయును గ్రీష్మర్తువును గనుక నెండయొక్క తాపము తీరిపోఁగానని సూర్యపరమైన యర్థము. గ్రీష్మర్తువుయొక్క యంతముకాఁగా నని విష్ణుపరమైన యర్థము. (‘గ్రీష్మ ఊష్మకః’ అని అ.) అనఁగా వర్షర్తువు రాఁగానేయనుట, సంకుచత్ =ముకుళించుచున్న, సరసీజేక్షణుఁడై= ఈక్షణములవంటి సరసిజములు గలవాఁడై యని సూర్యపరమైన యర్థము. మూఁతపడుచున్న పుండరీకసదృశేక్షణములు గలవాఁడై యని విష్ణుపరమయిన యర్థము. పయోనిధిఁజొరన్ = (ని. ‘పయః క్షీరం పయోంబు చ’ అ.) అనియుండుటవలనఁ బయశ్శబ్దము జలమందును క్షీరమందును వర్తించుచున్నది గనుకఁ బశ్చిమజలధిలోఁ బ్రవేశింపఁగానే యని సూర్యపరమైన యర్థము. క్షీరసముద్రమందుఁ బవ్వళింపఁగానే యని విష్ణుపరమైన యర్థము. విష్ణువు వర్షర్తువు రాఁగానే క్షీరసముద్రశాయి యగుట ప్రకటముగదా, సంధ్యాతటిత్పూర్వమై = సంధ్యారాగమనెడు మెఱపు తొలుతఁగాఁ గలిగినదై, చీఁకటికాఱ్మొగుల్=అంధకారమనెడునీలమేఘము, జగతిపైన్ = భూమిమీఁద, నిమ్నోన్నతాభోగముల్సరిగావించుచున్ = పల్లమును మెరకను సమమగునట్టులుగాఁజేయుచు, సర్వతోముఖ మహాసార ప్రసా

రంబులన్-సర్వతోముఖ = సర్వదిగ్వ్యాపియైన, మహాసార = అధికబలయుక్తమయిన, ప్రసారంబులన్ = ప్రసరణములచేతనని యంధకారపరము. సర్వతోముఖ = జలములయొక్క, (ని. 'కబంధముదకం పాథః పుష్కరం సర్వతోముఖమ్' అని అ.) మహాసార = అధిక ధారాసంపాతములయొక్క, (ని. 'ధారాసంపాత ఆసారః అని అ.) ప్రసారంబులన్ = ప్రచారములచేత నని మేఘపరము, నెరసెన్ = వ్యాపించెను.

ఇట్లు గాఢాంధకారము సర్వదిక్కులయందు వ్యాపించె నని తాత్పర్యము. సూర్యమండలము భేదించిపోవుటకు-'ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ' ... విశ్వంభరులు, ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ" యను వాక్యములు ప్రమాణములు. వర్షర్తువున శ్రీవిష్ణువు క్షీరసాగరమున శయనించుట కేగ మెఱుపులు నీలమేఘములు మించెనని మిట్టపల్లము లేకమగునట్టుల వర్షముకురిసె నని శ్లేషార్థము. సూర్యుఁ డస్తమింప దామరపూవులు ముకుళించెననియు సంధ్యారాగము పెచ్చరిల్లె ననియుఁ, జీకటి యావరించెననియుఁ బ్రకృతార్థము. అలం. ప్రకృతాప్రకృతశ్లేషము.

సీ. హరిహయవాహనా॰హంకారము హరించి వేఁడివేలుపుజాడ ॰ వెంట నంటి
తపనజాయసదండ॰తాండవం బెడలించి దనుజఘోరాకార॰దర్ప మడఁచి
కడలితేఁబిడార ॰ మడుగుముట్టఁ గలంచి గాలి రజోవ్యాప్తిఁ ॰ గాకు చేసి
ధనరాజనిధిముద్రఁ ॰ దనవశం బొనరించి యిభదైత్యహరునిపు॰ట్టిల్లుఁ జెఱిచి
తే. యవనిఁ గబళించి నభమెల్ల॰నాక్రమించి, కమలజాండకటాహంబు॰గడవఁ బెరిగెఁ
జాలితాదిత్యసంధ్యాభి॰చారహోమ, వీతిహోత్రభవాభీల॰వృత్రమూర్తి. 12

ఈపద్యము నంధకారపరముగను వృత్రాసురపరముగను నర్థద్వయ మెఱుంగునది.

చాలితాదిత్యసంధ్యాభిచారహోమవీతిహోత్రభవాభీలవృత్రమూర్తి = ఆదిత్యశబ్దము సూర్యుని యందును దేవతలయందును వర్తించును. (ని. 'ఆదిత్యౌ భాస్కరే దేవే' అని మే.) వృత్రశబ్దమంధకారమందును వృత్రాసురునియందును వర్తించును. (ని. 'ధ్వాంతారి దానవా వృత్రా' అని అ.) చాలిత = చలింపఁజేయఁబడిన, ఆదిత్య = సూర్యుఁడుగల - చలింపఁజేయఁబడిన దేవతలుగల అనియు, సంధ్యా=సంధ్యారాగమనెడు, అభిచారహోమ = పరహింసాహోమనిమిత్తమైన, వీతిహోత్ర = అగ్నియందు, భవ = పుట్టిన, ఆభీల = భయంకరమయిన, వృత్రమూర్తి = గాఢాంధకారమనెడు వృత్రాసురమూర్తి, (ని. 'హింసాకర్మాభిచార స్స్యాత్' అని అ.) హరిహయ వాహనాహంకారము హరించి-హరిహయ=ఇంద్రునియొక్క, వాహన=వాహనములైన మేఘములయొక్క, అహంకారముహరించి= గర్వము నపహరించి యని యంధకారపరమైన యర్థము. ఇంద్రాశ్వగర్వమడఁచి యని వృత్రాసురపరమయిన యర్థము. ఈరీతిగానే యుభయపరముగా సర్వత్ర చెప్పవలయును. వేఁడివేలుపుజాడ వెంట నంటి=అగ్నియొక్క మలినమార్గము నాక్రమించి యనియును నగ్నిదేవుని వెనుదగిలి యనియునునర్థము.

తపనజాయసదండ తాండవం బెడలించి-తపనజ = సూర్యపుత్త్రుఁడైన యమునియొక్క, అయస దండతాండవం బెడలించి = ఇనుపకాలదండము నాక్రమించి యనియును, కాలదండసముద్దండత్వము పోఁగొట్టించి యనియును నర్థము. దనుజ ఘోరాకారదర్ప మడఁచి = నిర్ఋతియొక్క భయంకరమగుచున

నీలాకృతి నాక్రమించి యనియును, అతనిభయంకరత్వ మడఁచి యనియును నర్థము. కడలిఱేని = వరుణునియొక్క, విడారము = సేనాస్థానమనఁగా జలము, దానినడుమను ముట్టఁగలంచి యనఁగా నడుగుననుండెడు నీలపంకము నాక్రమించి యనుట. అతనివైభవము నడుగుమట్టఁ గలఁతపెట్టి యనియును నర్థము. గాలి రజోవ్యాప్తిఁ గానుపెసి=వాయువుదేవునియొక్క పరాగవ్యాప్తి నాక్రమించి యనియును, అతనిరాజసవ్యాప్తి నణఁచి యనియును నర్థము. దుమ్ము నలఁపనుట కవిసమయసిద్ధము. దృష్టాంతము-

సీ. ద్యుమణిరథాంగహత్యుత్థఘనాఘనా శరతీశసృష్టశాంబరిక యనఁగ

... ... ... ...

గీ. ఔర యలినీలదీప్తిజాలానుపూర్తి, నమరె నవ్వేళ నిర్వేలతిమిరరాశి.

చంద్రికాపరిణయము. ఆశ్వా. ౪.

మ......సురిసిటలభాగన్యస్తకస్తూరితో
నవనీరేణువు సాటియై పరఁగె నాశాకాశసీమంబులన్. విక్రమార్కచరిత్రము.

ధనరాజ నిధి ముద్రఁ దనవశంబుగఁ జేసి = కుబేరునియొక్క నిధులయందలి ముద్రికానీలాంకము లాక్రమించి యనియును, అతని పెన్నిధులు తనవశము చేసికొని ముద్రించి యనియును నర్థము. (ని. 'సాక్షరాంగుళిముద్రా సా' అని అ.) ఇభదైత్యహరుని పట్టెల్లఁ జెఱిచి = గజాసుర సంహారకుఁడైన యీశానునియొక్క, పట్టనఁగా గజచర్మరూపమైన వస్త్రము, దానినాక్రమించి యనియును, అతఁడు పట్టినపట్టెల్లఁ జెడఁగొట్టి యనియును నర్థము. ఈనాలుగుచరణములయందును నంధకారమునకు నష్టదిగ్వ్యాపనమును వృత్రాసురున కష్టదిక్పాలభంజనమును జెప్పినాఁడు. అంధకారపరమై యుపమాలంకారము స్పష్టము. అవని గబళించి = భూమిని దిగమ్రింగి, నభమెల్ల నాక్రమించి=ఆకాశమంతయు నావరించి, కమలజాండకటాహంబు గడవన్ = బ్రహ్మాండభాండమును మించునట్టులుగా, పెరిగెన్ =ఎదిగెను.

ముద్రికాంకము నీలముగాఁ జెప్పుట ప్రసిద్ధము. చూ. వసుచరిత్రమునందలి ఆ ౩. ౧౩౭ వ పద్యము. మఱియు-

మ. పురిశేషుండు పయోధియుం గని జనంబుల్ రెంటికిన్ భేద మే
ర్పఱుపం జాలకయున్న బ్రహ్మ విపరింపంజూసి వారాశిపైఁ
గరమొప్పన్ మసిముద్ర వేసె నదియాఁ గాకున్న నీలచ్ఛవిన్
ధరియింపం గత మేమి? యేటికి సముద్రఖ్యాతి మున్నీటికిన్. ఉత్తరరామాయణము.

ఇం దష్టదిక్పాలకులను వృత్రాసురుఁడు జయించె ననియుఁ జీకటి యష్టదిక్పాలసంబంధములగు నీలాంకముల నతిశయించి భూమ్యాకాశములు బ్రహ్మాండము వ్యాపించెననియు భావము. ఇప్పద్యమున నంధకారవ్యాప్త్యతిశయము చెప్పఁబడినది అలం. ఉపమ. శ్లేషాలంకారము.

సీ. తమి నహల్యాజార•తారతాశయుఁ డైన జంభారి కిది రత్న•జాల మయ్యె
వల్లవీతతిఁ గూడి•మల్లాడు మాయగొల్లని కిది చూడాక•లాప మయ్యె
దారుకావన మానిదార కాముకుఁ డైన పశుపతి కిది గళా•భరణ మయ్యెఁ
దారాభిసార సాదరతఁ ద్రిమ్మరిన తమ్ములదాయ కిది యురో•ముద్ర యయ్యె

తే. నభిమత నవీన వరనిధానాప్తిహేతు
దివ్యసిద్ధాంజనం బైన దీనివంటి
యనుఁగుఁ గనుఁగవ నొత్తు టేయరుదటంచుఁ
గులటలు నుతింపఁ దిమిరంపుఁగుంపు లెసఁగె. 13

తమిన్ = రాత్రియందు, (ని. 'రజనీ యామినీ తమీ' అని అ.) లేక తమకముచేత, అహల్యా = గౌతమభార్యయైన యహల్యయొక్క, జారతారత = జారత్వరతికార్యమునందలి, ఆశయుఁడైన = అభిప్రాయము గలవాఁడై, జంభారికిన్ = ఇంద్రునికి, ఇది = ఈయంధకారము, రత్నజాలమయ్యెన్ = ఇంద్రనీలమణిమాలికారూపమైన యలంకార మాయెను. వల్లవీతతిఁ గూడి = గోపికాసమూహమును గూడి, వల్లాడు = క్రీడించునట్టి, మాయగొల్లనికిన్ = కపటగోపుఁడైన శ్రీకృష్ణమూర్తికి, ఇది = ఈయంధకారము, చూడాకలాపమయ్యెన్ = మయూరపింఛరూపమైన శిరోభూషణమాయెను. (ని. 'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతా వపి' అని అ.) నెమిలియీఁకలను మిగుల నలుపుగాఁ జెప్పుట కవిసమయము.

ఇందులకు దృష్టాంతము చూడుఁడు—

సీ. నవపింఛమయభూష లవధరించి నటించు పంకజాక్షునికెల్వ సుంకమడిగి...
కటికి చీఁకటి రోదసిగహ్వరమున. మనుచరిత్రము.

దారుకావనమాని దారకాముకుఁడైన = దారుకావనమందలి మునిపత్నులకుఁ గాముకుఁడైన, పశుపతికిన్ = శివునికి, ఇది = ఈయంధకారము, గళాభరణమయ్యెన్ = కంఠాభరణమాయె నని యర్థము. కంఠకాళిమ యని భావము. తారా = బృహస్పతిభార్యయైన తారయొక్క, అభిసార = అభిసరణమందలి, సాదరతన్ = ఆదరసహితత్వముచేత, త్రిమ్మరిన = ప్రవర్తించిన, తమ్ములదాయకున్ = కమలవిరోధియైన చంద్రునకు, ఇది = ఈయంధకారము, ఉరోముద్రయయ్యెన్ = ఉరస్స్థలాలంకార మాయెనని యర్థము. కళంకమని భావము. ఇక్కడ రాత్రియం దహల్యాది కాంతాభిసార మందాదరసహితులైన యింద్రాదులకు సమయానుకూలమయిన తదలంకార చతుష్టయమే తద్గమనోపయోగియై యహల్యాది స్త్రీలకుఁ దదాప్తి హేతువయ్యెనని తెలియవలయును. చంద్రునియందలి కళంకము మిక్కిలి నలుపుగా బిల్హణీయమునందు వర్ణింపఁబడియున్నది.

"ఇందో యద్గళితేంద్రనీలశకలశ్యామం దరీ దృశ్యతే
తత్సాంద్రం నిశిపీత మంధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే"

ఇదియునుంగాక, అభిమత = మిక్కిలియిష్టమైన, నవీన = అప్పటప్పటికి నూతనమైన, వర = ప్రియులనెడు, నిధాన = నిక్షేపములయొక్క, ఆప్తి = ప్రాప్తికి, హేతు = కారణమయిన, దివ్యసిద్ధాంజనంబైన = దివ్యమైన సిద్ధులచేతఁ గల్పింపఁబడిన యంజనమయిన, దీనివంటి = ఈయంధకారమువంటి, అనుఁగున్ = చుట్టమును, కనుఁగవ నొత్తు టేయరుదటంచున్ = కన్నులఁ గప్పుకొనుట యేమియాశ్చర్యమని పలుకుచు అని యర్థము. అంజనపక్షమందుఁ గన్నులధరించుటయనియును చుట్టముపట్టునఁ గన్నులఁ గప్పుకొనుట యనియును ప్రేమకార్యముగను, దిమిరముపట్టున దృష్టిప్రతిరోధకత్వ మనియును వర్థత్రయము గ్రహింపవలయును. కులటలునుతింపన్ = జారస్త్రీలు స్తోత్రము చేయఁగా, తిమిరంపుగుంపు లెసఁగెన్ = అంధకారసమూహము లతిశయించెను.

తే. తపనుఁ దఱిమి దురంతసంతమసము మఱల, సంతతులఁ బట్టి తెచ్చి శీర్షములపై ని
జాంక మిడి కాచివిడిచెనా నగ్రకలిత, కజ్జలము లైనగృహదీపకళిక లమరె. 14

తపనుఁ దఱిమి = సూర్యుని వెడలఁ దఱిమి, దురంతసంతమసము = అంతములేని కటికచీఁకటి, (వి. 'విష్వక్సంతమసమ్' అని అ.) అతని సంతతులఁ బట్టితెచ్చి = ఆసూర్యునియొక్క సంతానములను బట్టి తీసికొనివచ్చి, శీర్షములపైన్ = తలలమీఁద, నిజాంక మిడి = తనయొక్క లాంఛనము నిలిపి, అనఁగాఁ దననిషానీచేసి, కాచివిడిచెనాన్ = క్షమించి విడచిపెట్టినదో యన్నట్టులుగా, అగ్రకలిత కజ్జలములయిన = అగ్రభాగములయందుఁ గూడుకొన్నకాటుకగల, గృహదీపకళికలమరెన్ = గృహములయందలి దీపములు ప్రకాశించెను.

సంతమసము దురంతమైనది గావున దానిచే [illegible]. కాననే సూర్యుని దఱుముటతో శాంతింపక యాతనిసంతతులగు దీపములను బట్టితెచ్చి నెత్తిపైఁ దనముద్ర వైచెను. అదియె దీపముపైఁ గాననగు[illegible] యని భావము. అలం. ఉత్ప్రేక్ష. సమాసోక్తి.

సీ. నటదీశహాసవిస్ఫుటితవేధోండరేఖలఁ దోఁచువరణాంబుకణిక లనఁగఁ
పెల్లుబ్బునిర్లపెన్వెల్లి నెల్లపదార్థములు మున్గఁ బొడముబుద్బుదము లనఁగ
రవికి మందేహనిర్మథనసాధనము లై వచ్చిన ద్విజమంత్రవర్ణము లన
హరిపదంబున నిశాశిరము నై నభంబున నభోగతులు నించునన లనంగఁ
తే. చరమగిరి యనుమరకాడు జలధిసరణిఁ, దరణి డించిననతఁడు తత్సలిలమగ్న
విమలముక్తాఫలంబులు వెలికిఁ జోరిపె, ననఁగ నవతారకానికాయంబు లడరె.

నటదీశహాస విస్ఫుటితవేధోండరేఖలఁ దోఁచు-నటదీశహాస విస్ఫుటితాబ్జజాండరేఖ లనియును పాఠాంతరము. నటత్ = సంధ్యాకాలమందు నాట్యముసేయుచున్న, ఈశ = రుద్రునియొక్క, హాస = అట్టహాసముచేత, విస్ఫుటిత = పగిలిన, వేధోండరేఖలన్ = బ్రహ్మాండముయొక్క పగుళ్లయందు, తోఁచు = కనుపడుచున్న, వరణాంబుకణికలనఁగన్ = ఆవరణజలబిందువులో యన్నట్టులుగా, బ్రహ్మాండమున కన్నివైపుల జల మావరించియున్నటులఁ బురాణప్రసిద్ధము. మహాశబ్దవశమున నెంతటి దృఢవస్తువేని పగిలిపోవుటకలదు. శివుఁడు నృత్యము గావించుచుఁ బెనుబొబ్బలు గావించుటచే బ్రహ్మాండము పగులుబాయుటచే నాపగుళ్ళనుండి కాఱు నావరణజలబిందువులవలెఁ జుక్కలలరారుచుండెనని భావము.

ధ్వనివలన బ్రహ్మాండము పగులుననుటకు-

మ. తలఁపం జొప్పడి యొప్పె నప్పుడు తదుద్యజ్జైత్రయాత్రాసము
త్కలికారింఖదసంఖ్యసంఖ్యజయవత్కంఖాణరింఖావిశృం
ఖలసంఘాతధరాపరాగపటలాక్రాంతంబు మిన్నే రస
ద్గళభేరీరవనిర్గళద్గగనరేఖాలేపపంకాకృతిన్. (రాఘవపాండవీయము.)

అలం. ఉత్ప్రేక్ష.

పెల్లుబ్బునిర్లపెన్వెల్లిన్ = మిక్కిలియు నుల్బణించుచున్న చీఁకటి వెల్లువయందు, ఎల్లపదార్థములు=సకలవస్తువులును, మున్గన్=మునుంగఁగా, పొడము=పుట్టుచున్న, బుద్బుదములనఁగన్=నీటిబుగ్గలో

యున్నట్టులుండుగా, అలం. ఉత్ప్రేక్ష. రవికిన్ = సూర్యునకు, మందేహ నిర్మథన సాధనమ్ముల్ = మందేహరాక్షస సంహారమునకు సాధనములగు. వచ్చిన ద్విజమంత్రపక్తిమయలనన్ = వచ్చిన బ్రాహ్మణమంత్రాక్షరములో యన్నట్టులుగా, సూర్యునియొక్క యుదయాస్తమయ కాలములందు మందేహాదిరాక్షసులు వచ్చి నిరోధింపఁగా నాసమయములయందు బ్రాహ్మణోత్తములచేత నియ్యఁబడిన మంత్రార్ఘ్యజలబిందువులు వజ్రాయుధప్రాయములై యారాక్షసులను వధించుచున్న వని ప్రసిద్ధము. ఇందుకుఁ బ్రమాణము స్కాందమునందు-

శ్లో. 'మందేహదేహనాశార్థ ముదయే సముదేరవిః,
సమాహతే ద్విజోత్సృష్ట మంత్రతోయాంజలిత్రయమ్'

అని చెప్పఁబడియున్నది. అలం. ఉత్ప్రేక్ష.

హరిపదంబను నీతుతరమ్మునైన నభంబునన్ = విష్ణువునకుఁ బాదమును హరునకు శిరస్సునునయిన యాకాశమునందు, (ని. 'వియ ద్విష్ణుపదమ్' అని అ. 'వ్యోమకేశో భవో భీమః' అని అ.) నభోగతులు నించు-దేవతలుపూజచేసిన, ననలనంగన్ = పుష్పములో యన్నట్టులుగా, అలం. కావ్యలింగానుప్రాణితము. చరమగిరియను మరకాఁడు = అస్తాద్రియనెడు నోడసరంగు, జలధిసరణిన్ = సముద్రములోని మార్గమందు, తరణిడించినన్ = సూర్యునిడింపఁగా, అతఁడు = సూర్యుఁడు, తత్సలిలమగ్నవిమలముక్తాఫలంబులు=ఆసముద్రోదకమందు మునిఁగియున్న నిర్మలమౌక్తికములను, వెలికిఁ జొరివెన్నఁగన్= బయటికిఁ దెచ్చెనో యన్నట్టులుగాను, నవతారకానికాయంబు లడరెన్ = నూతనములయిన నక్షత్రసమూహములు ప్రకాశించెను.

చ. ఘనతరగాఢసంతమసకల్పమహోదధి సన్న లోకముల్
తనయుదయారుణద్యుతివితానము పేరి రజోగుణంబుచే
ననువుపడన్ సృజింపఁ గమలాసనుఁడై ద్విజరాజు తా నమ
ర్చిన ధవళాబ్జపీఠ మనఁ జెన్నలరెం దొలితెల్వు తూర్పునన్. 16

ఘనతర=అత్యధికమైన, గాఢ = దట్టమైన, సంతమస = కటికిచీఁకటియనెడు, కల్పమహోదధి సన్నన్ = ప్రళయసముద్రము తీసిపోయినపిమ్మట, (ని. 'సంవర్తః ప్రళయః కల్పః' అని అ.), లోకముల్ = భువనములను, తనయుదయారుణద్యుతివితానము పేరి రజోగుణంబుచేన్ = తనయొక్క యుదయకాల రక్తిమయనెడు రాజసగుణముచేత, అనువుపడన్ సృజింపన్ = ఒప్పిదమగునట్టులుగా సృజించుకొఱకు, రజోగుణ మరుణవర్ణమని ప్రసిద్ధము. కమలాసనుఁడై ద్విజరాజు తాన్ = బ్రహ్మయై చంద్రుఁడు తాఁగానని యర్థము. కమలములను దిరస్కరించినవాఁడని భావము. ద్విజరాజునకుఁ గమలాసనుఁడైనాఁడని స్వారస్యమును గ్రహింపవలయును. అమర్చినధవళాబ్జపీఠమనన్ = అమర్చిపెట్టిన తెల్లదామరగద్దెయో యన్నట్టులుగా, తూర్పునన్ = పూర్వదిక్కునందు, తొలితెల్వు = ప్రథమధవళిమ, చెన్నలరెన్ = ఒప్పుచుండెను. చీఁకటి లోకమునం దంతటను వ్యాపించుటచే సమస్తలోకము లగోచరముగ నుండెననియుఁ జంద్రుఁడు తన యుదయకాలమునందలి రక్తకాంతులచేఁ బ్రపంచమునంతయు వెలిగించుటకై తూరుపునఁ దెలిదామరం దోఁప నుదయించెనని భావము. చీఁకటియను ప్రళయసముద్రము లోకములను ముంచివేయ చంద్రుఁడను బ్రహ్మ రజోగుణవశమున మఱల సరాసరిగ సృజింప నరుదెంచ నమర్చిన

తెలిదమ్మి గద్దియవలెఁ దూరుపుదిక్కునఁ దెల్లనిచాయ పోఁచెను. చంద్రోదయమునకు ముందు ఆకాశము తెలిచాయతో నలరు ననియు నుదయించుచంద్రుఁడు తెల్లగానుండు ననుటకు-

సీ-గీ. ప్రాచి తెలిచాయ యనుమంచు ప్రబలభాస్వ, దంశుకవిహీనగావున నంబు కోర్వఁ
జాల కూన్చిన నవకీలిప్రక్రమనఁగ, నప్పుడు తొలికెంపుతో సారసాకి బొలిచె.

చంద్రికాపరిణయము ఆశ్వా. ౪.

క. అంతటఁ బ్రాచినిశాపతి, యంతికగతుఁ డగుట విని ముఖాలంబితమశి
కుంతలములు దీర్పఁగఁ గొపు, వంకపుదువ్వెనయనంగ ధవళిమ పోఁచెన్.

మ. స్ఫుటసౌగంధికరాగరక్తరుచి సైంబూకెక్ జపానన్నిభ
స్ఫటికంబ ట్లుదయాద్రిగైరికశిరస్స్థానస్థితిన్ జంద్రుఁడు. మనుచరిత్రము. ఆశ్వా-త్రృ

మ. హరిదంభోరుహలోచన ల్గగనరంగాభోగరంగత్తమో
భరనేపథ్యము నొయ్య నొయ్య సడలింపన్ రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతి వొల్చె రేకయి సగంబై బింబమై తూర్పునన్. 17

హరిత్ = దిక్కులనెడు, అంభోరుహలోచనల్ = స్త్రీలు, గగన=ఆకాశమనెడు, రంగాభోగ=నాట్యస్థానపరిపూర్ణతయందు, రంగత్ = ఒప్పుచున్న, తమోభర=చీఁకటియనెడు, నేపథ్యమున్ = తెరను, ఒయ్యనొయ్యసడలింపన్ = తిన్నతిన్నఁగాఁ దగ్గింపఁగా, రాత్రిశైలూషికిన్ = రాత్రియనెడు నాట్యస్త్రీకి, వరుసన్=క్రమముగా, మౌక్తికపట్టమున్ = ముత్యాలపట్టయును-అనఁగా నొసటికిఁదైన ముత్యాలతోఁగూర్చి యడ్డముగాఁ గట్టుకొనెడు పట్టయనుట, నిటలమున్ = నొసలును, వక్త్రంబును = ముఖమును, తోఁచెనాన్=ప్రకాశించెనో యన్నట్టులుగా, హరిణాంకాకృతి = చంద్రునియొక్క రూపము రేకయి = రేఖాకారమై, రేఖాశబ్దతద్భవము రేక, సగంబై = సగపాలై, బింబమై = సంపూర్ణమై, తూర్పునన్ = తూరుపుదిక్కున, పొల్చెన్ = ప్రకాశించెను. దీనఁ గ్రమాలంకారము చెప్పంబడియెను.

నేపథ్యమనఁగాఁ దెరయన్నందుకు విచారము. 'నేత్రరోగః పథ్యం నేపథ్యమ్' అని వ్యుత్పత్తి ఇది పృషోదరాదిగణములోఁ జేరినదిగనుకఁ ద్రకారలోపము వచ్చినది. ఇందుకుఁ బ్రయోగము. శ్లో. 'నేపథ్యాంతరితాభూత్వా నర్తకీనృత్తమాచరేత్' అని నృత్తప్రస్తావమందుఁ జెప్పఁబడియున్నది. అలం. ఉత్ప్రేక్ష.

చ. తనుఁ గడుపారఁ గాంచిన సుధానిధిఁ గ్రాఁచుమహార్వకీలముల్
కనదుదయాంశుదంభమునఁ గైకొని వచ్చి యరిప్రజంబునె
మ్మనమునఁ వైచి పాండురుచిమండలకీర్తికలాప మొందునిం
దునిమెయిఁ గందు దోఁచె నతిదుర్భరతద్భరణప్రసంగతిన్. 18

తనుఁగడుపారఁగాంచిన=తన్ను కడుపారఁగఁగన్నట్టి, సుధానిధిన్=క్షీరసముద్రుని, క్రాఁచు=ఉడికించుచున్న, మహార్వకీలముల్ = మహత్తరములయిన బడబాగ్నిజ్వాలలను, జ్వాలకీలశబ్దములు స్త్రీపుంలింగంబులు గలవు. ని. 'ద్వయోః జ్వాలకీలౌ' అని అ. కనత్ = ప్రకాశించుచున్న, ఉదయాంశు= ఉదయకాలారుణకిరణములనెడు, దంభమునన్ = వ్యాజముచేత, కైకొనివచ్చి = తీసికొనివచ్చి, అరి

ప్రజంబు నెత్తినమున్నవైచి=శత్రువర్గముయొక్క హృదయమందు వైచి యని యర్థము. చక్రవాకముల యొక్క హృదయమం దునిచి యని భావము. హృదయమందు బడబాగ్ని వైచుట యనఁగా నత్యంత శోకము పుట్టించుటయని తెలియవలయును. పాండురుచిమండల = చంద్రికాజాలము నెడు, కీర్తికలాప మొందు=కీర్తిసముదాయమును బొందుచున్న, ఇందునిమెయిన్ = చంద్రునిదేహమందు, అతిదుర్భర= మిక్కిలియు భరింప శక్యముగాని, తత్ = ఆబడబాగ్నిజ్వాలలయొక్క, భరణప్రసంగతిన్=భరణప్రసంగమువలన, కందువోఁచెన్ = కమిలి కందు గనుపడియెను. అనఁగా నగ్నిభరణముచేత మాడి మచ్చ యేర్పడియెను.

చంద్రుని క్షీరసముద్రుఁడు కడుపారఁ గనెను. కావునఁ బిత్రాణము దీర్చుకొనుటకుఁ జంద్రుఁడు సుధానిధిని గాచు గొప్పబడబాగ్నిజ్వాలలు శత్రుజనహృదయముల నించెను. కావునఁ జంద్రుఁడు కీర్తికలాపమును గడించెను. కుంచి బిగించు వాడబాగ్నిజ్వాలలు ప్రోయుటచేఁ జంద్రునిమేను కమిలి మచ్చబడెను. అదియె కళంకము. తద్భరణము అతిదుర్భరము గావున మచ్చ గాటముగా నుండె ననుట. అలం. అతిశయోక్తి. సమాసోక్తి. ఉత్ప్రేక్ష.

మ. పటుతారాపటఖండమండితనిజప్రాగంశుధారాపరి
స్ఫుటసూత్రంబులఁ బ్రోఁగువారి వెస నంభోవాహమార్గాఖ్య మా
నటవిం బ్రాక్తనభిల్లమౌళిమణి వేఁటాడన్ మదానేకప
చ్ఛట లోదంబులఁ బడ్డయట్లు తమముల్ జారెన్ బిలశ్రేణికిన్. 19

పటు = దృఢమయిన, తారా = నక్షత్రముల నెడు, పటఖండ = వస్త్రఖండములతోడ, మండిత= ఒప్పుచున్న, నిజ = తనయొక్క, ప్రాగంశుధారా = ధారాసదృశములైన ప్రథమకిరణముల నెడు, పరిస్ఫుటసూత్రంబులన్ = ప్రకాశములయిన నూలుపగ్గములచేత, ప్రోఁగువారి = కూడఁబారినవాఁడై, వెసన్ = శీఘ్రముగా, అంభోవాహమార్గాఖ్యమా = మేఘమార్గమైన ఆకాశమనెడు, అటవిన్=అరణ్యమందు, ప్రాక్తనభిల్ల పురాతనకిరాతుఁడయిన హరునియొక్క, మౌళిమణి=చూడారత్నమయిన చంద్రుఁ డనెడు, ప్రాక్తనభిల్లమౌళిమణి = ప్రాచీనకిరాతశ్రేష్ఠుఁడు, వేఁటాడన్ = వేఁటాడఁగా, మద=మదయుక్తములయిన, అనేకపచ్ఛటలు = గజసమూహములు, ఓదంబులఁ బడ్డయట్లు = ఓదము లనఁగా నడవిలో వేఁటకాండ్రేనుఁగులను బట్టునపుడు వాని మోసపుచ్చెడుకొఱకు నిర్మించునట్టి కపటపుగుంటలు గనుక వానియందుఁ బడ్డట్టుగా, తమముల్ = చీఁకటులు, బిలశ్రేణికిన్ = బిలసమూహములోనికి, జారెన్ = చొచ్చెను. అనఁగా ముందుగాఁ జంద్రకిరణప్రసరమాయెను వెంటనే చంద్రుఁ డుదయించెను. అంతటఁ జీఁకటులు విచ్చిపోయె నని తాత్పర్యము.

ఉదయించుచంద్రునికిరణములు ప్రకాశవంతములగు నూలుపగ్గములవలె నుండెను. తారకారుచులు పగ్గములు మిగులఁ గట్టిగా నుండుటకుఁ జుట్టినగడ్డిపేలికలవలె నుండెను. ఆకసమను నడవిలో శివుఁడను వేఁటకాఁ డాపగ్గములను గట్టెను. ఏనుఁగులు త్రొక్కచెంతనున్న ఓదములలోఁ బడినటులఁ జీఁకటులు గుహాలలోఁ జేరెను. అలం. ఉత్ప్రేక్ష.

మ. ఉదయోలూఖల మెక్కి నిక్కి సహజాంశోపేంద్రసంయుక్తుఁడై
చద లన్బూద శశాంకసీరి కరవిస్తారంబులన్ బట్టి చి

ట్టదమం గారెఁ జకోరగోపతతి పా◆లై చంద్రికాక్షీరముల్
పొదవెన్ ఘూర్ణితదుగ్ధధామనిబిడ◆ప్రోద్భూతసంరంభముల్. 20

శశాంక = చంద్రుఁడనెడు, సీరి = బలరాముఁడు, సహజ = తనతోఁగూడఁ బొడచూపిన, అంక = చిహ్నమనెడు, సహజాంక=కూడఁబుట్టిన శ్రీవత్సలాంఛనముగల, ఉపేంద్ర=కృష్ణునితో నని యయినను లేక తోడఁబుట్టినవాఁ డనెడు సంజ్ఞగల కృష్ణునితో నని యయినను నర్థము. సంయుక్తుఁడై, ఉదయోలూఖల మెక్కి—నిక్కి = ఉదయాచలమనెడు రోటిపై నెక్కి పొడవుగా నిక్కి, చదల న్నూఁదన్ = ఆకాశమనెడు బూదకుండను-అనఁగా నుట్టిపైనున్న పాలకుండను, కరవిస్తారంబులంబట్టి = కిరణవిస్తారములనెడు హస్తవిస్తారములతోఁ బట్టుకొని, బిట్టదమన్ = గట్టిగా నొత్తఁగా, చంద్రికాక్షీరముల్=వెన్నెలలనెడుపాలు, చకోరగోపతతి పాలై=చకోరపక్షు లనెడు సహచరగోపకుల కుపయోగించినవై, కారెన్ = స్రవించెను. ఘూర్ణిత = తిరుగుపడుచున్న, దుగ్ధధామ = క్షీరసముద్రమనెడు పాలుంచెడు గృహమందు, నిబిడ=సాంద్రమగునట్టులుగా, ప్రోద్భూత=ఉద్భవించుచున్న, సంరంభముల్ = జలసంరంభములు-అనఁగాఁ గలకలములు, పొదవెన్ = వ్యాపించెను. అంకశబ్దమునకు, (ని. 'అఙ్కో నాటక విచ్ఛేదే సంఖ్యాయాం యుధి భూషణే, సమీపే రూపకే స్థానే మతా వుత్సఙ్గ చిహ్నయోః.' అని నానార్థరత్నమాల.) ఉదయాచలమెక్కి—కళంకసంకలితమగు చంద్రబింబము కిరణకాంతులు బ్రహ్మాండమునం దంతటను బ్రజ్వలింపఁజేయసాగెను. చకోరము లానందముతో వెన్నెలను భుజించుచుండెను. చంద్రోదయమువలన సముద్ర ముప్పొంగెనని భావము. అలం. రూపకసంకీర్ణోత్ప్రేక్ష.

శా. ఆవేళం బతి సంభ్రమానుగుణ గం◆గాంభోఝరంబుల్వలెన్
ద్యోవీథిం దెలివెన్నెల ల్నిగుడ నిం◆దుం డందుఁ గ్రీడించుదే
వావాసద్విప మయ్యెఁ దన్మథితశు◆భ్రాబ్జంబులై తారెఁ దా
రావర్గంబులు తత్కరోదకములై ◆ రాలెం దుషారాంబువుల్. 21

ఆవేళన్=ఆసమయమందు, పతి=పెనిమిటియైన సముద్రునియొక్క, సంభ్రమ = సంతోషజనిత భ్రమణములకు-అనఁగా నుత్సాహముచేత ఘూర్ణిల్లుటకు, అనుగుణ = అనుకూలమయిన, గంగాంభోఝరంబుల్వలెన్ = ఆకాశగంగాజలప్రవాహములో యన్నట్టులుగా, ద్యోవీథిన్ = ఆకాశవీథియందు, తెలివెన్నెలల్నిగుడన్ = ధవళచంద్రికలు వ్యాపింపఁగా,

'ఆర్తార్తే ముదితా హృష్టే ప్రోషితే మలినా కృశా,
మృతే మ్రియేత యా నారీ సా స్త్రీ జ్ఞేయా పతివ్రతా.'

అని శాస్త్రమున్నది గనుక నిక్కడఁ బతి సంతోషింపఁగాఁ దాను సంతోషించుటవలన గంగానదికిఁ బతివ్రతాధర్మసిద్ధి యగుచున్నది. కావునఁ దనభర్త యగుసముద్రుఁ డానందవశమున వెల్లివిరియఁ బతివ్రతయుఁ బతిసంభ్రమానుగుణయునగు గంగాస్రవంతియు వెల్లివిరిసెననుట. ఇందుండు= చంద్రుఁడు, అందుఁ గ్రీడించుదేవావాసద్విపమయ్యెన్ = ఆచంద్రికారూపమైన యాకాశగంగాప్రవాహమందు విహరించెడు స్వర్లోకగజమో యన్నట్లు - అనఁగా నైరావతమో యన్నట్లుండెను. తారావర్గంబు = నక్షత్రసమూహములు, తత్ = ఆచంద్రరూపమైన యైరావతముచేత, మథిత = పెకలింపఁబడిన, శుభ్రాబ్జంబులై తారెన్ = తెల్లదామరపువ్వులో యన్నట్లు కాంతిహీనమ్ము

లాయెను. తుషారాంబువులు = మంచుతుంపురులు, తత్కరోదకములై రాలెన్ = ఆచంద్రుఁడనెడు నైరావతముయొక్క తుండమువలన జారిన యాకాశగంగాజలశీకరములో యన్నట్టులుగా రాలెను. అనఁగాఁ జంద్రోదయానంతరమందు సముద్ర ముప్పొంగి ఘూర్ణిల్లె ననియు నాకాశమందుఁ దెల్లనివెన్నెలలు గాసెననియుఁ జుక్కలు కాంతిదరిగె ననియు మంచు గురిసెననియుఁ భావము.

సముద్రుఁడు వెల్లివిరియఁగాంచి యాకాశగంగయు వెల్లివిరిసెను. ఆవెల్లియందుఁ జంద్రుఁ డైరావతమువలె నుండెను. తెల్లదామరపూవులను గంగనుండి పెకలించినటులఁ గాంతిహీనములుగఁ జుక్కలొప్పెను. ఏనుఁగుపిల్చి విడుచు జలబిందువులవలె మంచు కురియుచుండెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. మిత్రాధికారంబు ♦ మీఱ రా దని కాక వెసఁ బట్టపగలు గా♦వింప లేదె
మ్రాఁకుల క్రింది సో♦మకు లెంత యని కాక మలసి నీడలరూపు♦మాప లేదె
బాడబాక్షేప పా♦పమున కోపక కాక యౌర్వాగ్ని నైనఁ జ♦ల్లార్ప లేదె
రాజకాంతాకృతి♦ ప్రతిసర్గ మని కాక శిల లెల్ల సరసముల్ ♦ సేయ లేదె
తే. జగతి నిది యని జగములు ♦ వొగడ నెగడె
హారునితల యెక్కి తెలితమ్మి ♦ నడఁగఁ ద్రొక్కి
కలశవారాశినెమ్మేనఁ ♦ గలయఁ బ్రాఁకి
కుముద రుచి నేలి కౌముదీ♦సముదయంబు. 22

కౌముదీసముదయంబు = చంద్రికాస్తోమము, మిత్రాధికారంబు మీఱరాదని కాక=మిత్రుఁడనఁగా నాప్తుఁడును సూర్యుఁడునుగనుక నాప్తజనాధికారము నతిక్రమింపరాదని కాక యనియర్థము. సూర్యాధికారమును మీఱరాదని కాక యని యర్థాంతరము. వెసఁ బట్టపగలు గావింపలేదె = శీఘ్రముగాఁ బట్టపగలుగాఁ జేయఁజాలదా, అనఁగాఁ జేయనేకల దనుట. పగలుగావించుట సూర్యాధికారమని తెలియవలయును. మ్రాఁకులక్రింది సోమరు లెంతయని కాక మలసి నీడలరూపు మాపలేదె = చెట్లక్రిందఁ బడియుండెడు నత్యంతాలసు లెంతటివారని విచారించియే కాక, లేకపోయినం బైకి వ్యాపించి నీడలను నశింపఁజేయఁ జాలదా-అనఁగా నీలవర్ణము ధవళవర్ణముగాఁ జేయఁజాలదా యనుట. ఇక్కడ నీడలనే సోమరులని చెప్పినాఁడు. రూపు అనెడుపదము ఉకారాంతము. ఇందుకు, (ని. 'ధూర్తమూర్తా నీచభ్రష్టావుదన్తా వపి సమ్మతౌ, ఉత్త్వే నైష భవం త్యస్యే ప్రయోగ స్తత్రకారణమ్.' అని యథర్వణవచనము.

బాడబాక్షేపపాపమున కోపక కాక=బ్రాహ్మణాక్షేపదోషమునకు సహింపక కాకయని యర్థము. బడబానలమార్చుట యని యర్థాంతరము. ఔర్వాగ్నినైనఁ జల్లార్పలేదె = సముద్రజలమందుండియును నారనిబడబాగ్ని నైనను దన శైత్యగుణముచేతఁ జల్లారఁజేయఁజాలదా-అనఁగాఁ జేయఁజాలు ననుట. రాజకాంతాకృతి ప్రతిసర్గమనికాక = రాజాంతఃపురస్త్రీలయొక్క యాకారములకుఁ బ్రతిసృష్టియని కాకయని యర్థము. చంద్రకాంతశిలాకార ప్రతిసృష్టియని యర్థాంతరము. శిలలెల్ల సరసముల్ సేయలేదె = రాళ్ళనన్నిటి నీరుగాఁజేయఁజాలదా - అనఁగాఁ జేయఁజాలునే యనుట. జగతినిదియని జగములువొగడన్ = జగత్తునందు నీచంద్రికాస్తోమము పైనఁజెప్పఁబడిన ప్రకారము సేయనేకలదని లోకములో వారు స్తోత్రము సేయునట్టులుగా, హారునితలయెక్కి = ధవళిమచేత హారునితో సమా

నమై యని యర్థము. హరుఁడు చంద్రశేఖరుఁడు గనుకఁ దచ్ఛిరోవ్యాపకమై యని యర్థాంతరము. హరునికి శిర మాకాశము గనుక దానియందు వ్యాపించి యనియును నర్థాంతరము.

తెలిదమ్మి నడఁగఁ ద్రొక్కి = పుండరీకమునకు సమానమై యని యర్థము. పుండరీకమును ముకుళింపఁజేసి యని యర్థాంతరము. స్వకాంతిచేతఁ దిరోహితముచేసి యనియును నర్థాంతరము. కలశవారాశినెమ్మేనఁ గలయఁ బ్రాకి = క్షీరసముద్రసమానమైన యని యర్థము. క్షీరసముద్రములో నేకీభవించి యని యర్థాంతరము. ఆలింగనముచేసి యనియును నర్థాంతరము. కుముదరుచి నేలి = తెల్లగలువల కాంతితో సమానమై యని యర్థము. స్వకాంతిచేఁ బోషించి యని యర్థాంతరము. నెగడెఁ = అభివృద్ధిఁ బొందెను. ఈగీతిలో నుపమా సమాసోక్తి మీలితాలంకారము లూహ్యంబులు. అనఁగాఁ జంద్రికాస్తోమ మత్యంతశుభ్రమై మిక్కిలి చల్లదనము గలదై లోకములయం దంతట వ్యాపించెనని తాత్పర్యము.

వెన్నెల పట్టపగటివలెనుండు ప్రకాశముతోడను నీడలనైనఁ దెల్లఁగఁజేయు వెలుఁగుతోడను, బడబాగ్నినైనను జల్లార్పఁగల చల్లఁదనముతోడను శిలలన్నింటిని జంద్రకాంతములుగ నొనర్చి జలజల జలముగారించు నపూర్వశక్తితోడను దెల్లనివస్తువులయన్నిఁటి తలఁదన్ని యలరారెను. అలం. అతిశయోక్తి.

వ. వెండియు నఖండశశిమండలకుండలితకుసుమకోదండ కాండాసనహిండితకరకుముదకాండప్రకాండతాండవితపాండురపరాగమండలంబున మెండుకొనుచు, నిండారవిరసినబొండుమల్లియలతండంబులం బొదలు మృదులదళపుటాంతరంబుల వడిగొనిన తేటతేనియం దోఁచిన శిశిరకరకిరణాసారంబు లుత్ఫుల్లహల్లకపరాగమధురాచ్ఛమత్స్యండికాపుంజంబులం బొరలించి పుక్కిళ్లకు వెక్కసంబుగా ముఁక్కునబంటి మెక్కి మెడలు నిక్కించు చలచ్చంచుసుందరిబృందంబులయానందబాష్పబిందుసందోహంబులం గ్రందుకొనుచు, జిగి మిగులు తొగలదొర నిగనిగల మిగుల బుగులుకొను నెగులునం దనమగని నగణితవనప్రదేశంబుల నరసియరసి వేసరి యోసరిలి సరసీమధ్యంబునం దననీడఁ జూచి కంటిఁగంటి నంటుకొని ననుచు నంటం బోవ నదియునుం దవుల కవలఁ జననాసన్నుండయ్యు నొల్లండు వల్లభుం డేల యని యుసురుసురనుచు నసురుసురై సొక్కు జక్కవజవరాలిబహువిధావిలవిలాపంబులకుం గనికరించిన తెఱంగునం గరంగుకురంగధరకాంతకందళంబుల జలజలని తెలినీటిజాలునం గ్రాలుకొనుచు నచ్చవెన్నెల విచ్చలవిడిఁ బెచ్చుపెరిగి పచ్చతామానికంపుఁజిప్పలం బరిశుద్ధాసవంబు నించకయ నించినట్లుండఁ జంచలనఖాంచలంబులం బయలు చిందించువారును బూర్ణపాత్రంబులం దోఁచు నిండుచందురుం బిండియమృతం బని వాసితాసవంబుఁ గ్రోలుచుఁ గలంకశంకం గలువతేకు డిగిచివైచువారును బ్రతిఫలితతారకంబులు ద్రాక్షాఫలంబు లని రిత్తచప్పరించువారును నిజాననాంభోజభాజనంబులం బట్టిన మైరేయంబు మగలకుఁ ద్రావించునెడ వారు వాసనార్పితసహకారపల్లవం బని చక్కెరమోవి చుఱుక్కున

నొక్కనం గలక్వణితకంకణాంకితకరంబులు విదుర్చుచుం గనీనికలు రెప్పల
తుదల నప్పళించుచుం గమనీయ సీత్కారకంఠనాదఘోషంబులం గులుకరించుచుం
బానశాలాపురోభాగభాసమాన నలదకాయమానంబులం బొడము పొడ
వెన్నెలలం బువ్వు లని యెత్తి యువ్వంబోవువారును కాదంబరీమదోన్మాదమ్మున
మోదమ్ములు వెరిగి చేదమ్ములు చరచుచుం జిందులుగ నాడుచుం బాడుచుం
దమన్నృత్తంబులకు మెచ్చి నెత్తమ్ములపగఱ పుత్తెంచినయుడుగరలని ముంగిళ్ళ
రంగు మీఱు ముత్యాలయరుంగులచెఱంగులం దుఱంగలించు మెఱుం
గులు కరాంగుళుల విప్పి కప్పుకొనంబోవువారును నై యతిప్రబంధగంధో
త్తమాగంధానుబంధబంధుర లగుసింధురయానల యుదస్తనాసామణిప్రభా
స్తబకంబుల నుల్లసితగల్లసితలోధ్రచూర్ణంబుల నున్న మితావటువిలంబిహా
రంబులం జేరెంబులు వారెనోయనం గొన్ని యెడల నున్నతచంద్రశాలాబహి
రంగణంబుల నడుగులకు మడుంగులు పఱచినారని చరణకిసలయాయాసంబు
లెఱుంగక చందనతిలకంబులు గరంగం జారుహారంబు లెగరం జలకుండలహీర
కోరకంబులు వెలుంగ భావిపుంభావసంభావనాపరిచయంబు సంపాదించు
పెంపునం బింపిళ్లు గూయు కలికికోమిరెలమొలకచనుమోసులం దులకరించిన
తళుకుపిబ్బెంపుందళతళల దళముకొనియెనో యన నొక్కొక్కగడం గడవ
రానితమచేడియల బెడంగునుడుగుల నడుగు లామడలుగా వచ్చి యభినవవిహార
హర్మ్యంబులు సొచ్చి శాతకుంభస్తంభంబుల నత్తమిల్లి యుత్తరీయంబులు
వట్టి తివియ నీడిగిలంబడుచుం దనులతలయడంకువలందరగనివడంకులం దను
కౌన ముడి సడలునిద్దంపువలువ లదరిపాటునం జరణాంగుళిదంశికలం బట్టి
నుసిమిన మిట్టిపడి యిట్టట్టు గదల నేరక పరులహృదయపంజరంబులు దూఱి
యెట్టకేలకుం జిట్టకాలకుం జెవి యొగ్గినసిగ్గరికత్రిపులు వాతాయనంబులడగ్గర
మెలంగుచలినిగ్గులగనిం గని తొంగి చూచుధూర్తసఖిసుస్మితవదనం బని
యదరిపడి పొదవుకొన్న నున్న చేలలం జిన్నారినెరికలం జెన్నారుమిసమిసలం
గన్నంబు వెట్టి కైకొనియెనో యనం గతిపయస్థలంబులం బచ్చి దేరుసంగమచ్చం
బులతో వచ్చి తచ్చనవినయంబులు దెచ్చుకొని మోవి మాటి మాటాడియుం
జేతులు గట్టుక నిలిచియు గట్టువాతనంబున కొడిగట్టినదిట్టవిటులంబట్టి పూదం
డలం గట్టి ప్రేలింపం జాలాగతకిరణదండంబులకుం జేయి సాచుముగుదమగు
వలకరనఖరకాంతిభంగంబులం బొంగిపొరలెనో యన వేఁబొండుచాయలం
గోయక కోయుకాయజునిమాయకత్తుల రాయిడిం బడలేక ధవళాంబరమాల్యా
నులేపననేపథ్యంబులు పూని మునిమాపు చూచివచ్చినకర్పూరకదళికాంకిత
కుంజంబులకు వచ్చి యచ్చట నఖిలకుంజంబులు నట్ల యుండం గొండొకసేపు
వివరింప లేక వలపువలనం దెలిసి నిజసమయనిలయంబు లేఁగ నిత్వరీజనంబుల

మనంబు లరయ వలసి మాఱ్మ్రోఁగలు మాటున కరుగుటయు నవ్వేళ నెవ్వారిం గానక యరణ్యరోదనంబు నిజం బయ్యెనని నిశ్శబ్దంబుగా నేడ్చుచుం జేయునది లేక చేష్టలు దక్కియున్న యన్నెలుఁగులు వారింప సన్నిహితులై వారు కన్నీరు దుడిచి కవుఁగిట మన్నించినం గనుదెఱచి చూచున న్నెలంతలవిస్మయసూచన లోచనప్రభాదట్టంబుల నిట్టవోడి చెనో యన మఱియుం బెక్కునెళవులం గళల యిక్కువలు దెలిసినయదన మదనకదనంబున సరసంబు లగునంగంబుల నంగదట్టంబులు మార్పడ వైచుకొని యుప్పరిగలబయళ్లకు నేఁగుదెంచి చందమామగుటికలు గ్రోలుమందయానలచెక్కుల వెలుంగువలి వెలుంగుం జూపి మీ మొగములమిలమిలలు గిలుబాడ వచ్చెఁ జుమీ వెన్నెలబచ్చు ముచ్చు వీఁ డిచ్చోట మసలుట మనకు నేర ముని నారులం బునారతంబులకు నెలయించి కొనిపోవు వలకారులజారుకొప్పులం దొరఁగువిరిగుత్తులతోఁ బొత్తు గలసెనో యన వెలసి యభివ్యక్తశుద్ధవర్ణబ్రహ్మంబు గావున నుర్విం గలవారి నెల్ల సర్వజ్ఞులం జేయుచుఁ దారవాదధౌరేయంబు గావునఁ గొండల నెల్ల వెండికొండలఁ జేయుచుఁ బద్మాహితపాదప్రభూతనూతనస్తోత్రవిశేషంబు గావున నఖిలభువనమాలిన్యంబులఁ దొలంగింపుచుఁ బంకజభవాండమంటపంబు సంకు చేసినపోంకంబున నంకింపుచు నకలంకమీనాంకనిరంకుశయశోమరీచివీచీసధ్రీచీనం బై విజృంభించుసమయంబున.

వెండియుఁ గ్ = మఱియును, ఆచంద్రికాస్తోమము, అఖండ = సంపూర్ణమైన, శశిమండల = చంద్రబింబమనెడు, కుండలిత = చక్రాకృతిగా నాచరించఁబడిన, కుసుమకోదండ = మన్మథునియొక్క, కాండాసన = పుష్పధనుస్సువలన, హిండిత = బయలుదేఱుచున్న, (హిడిగతౌ అనిధాతువు.) కర = కిరణము లనెడు, కుముదకాండప్రకాండ = కువలయబాణశ్రేష్ఠములయందు, తాండవిత = సంజాతతాండవము లయిన-అనఁగా గాలికి లేచియాడుచున్న, పాండుర పరాగ మండలంబునఁగ్ = తెల్లని పుప్పొడియొక్క సముదాయముచేత, మెండుకొనుచుఁగ్ = దళముపాఱుచును, చంద్రబింబము అఖండముగావున షోడశకళాభిరామమనియుఁ గాననే పాండురకాంతిపుంజములు మెండుకొనెననియు, భావము. కుసుమకోదండము కుండలితమనుటవలన మన్మథుఁ డాకర్ణాంతముగ లాగెననియు నందుండి విడువఁబడిన కలువపూములుకులు మెండుకొనుట సంభవించెననియు గ్రాహ్యము.

నిండారవిరిసిన = సంపూర్ణముగా వికసించిన, బొండుమల్లియల = బొండుమల్లె పువ్వులయొక్క, తండంబులం బొదలు = సమూహములయందు ఒప్పుచున్న, మృదుల నళపుటాంతరంబులఁగ్ = కోమలము లయిన రేకులనడుమనుండి, వడిగొనిన = లోపలికి పడిసిన, తేటతేనియల్ = తేరితేటగానున్న పూఁదేనియలయందు, తోఁచిన = వ్యాపించిన, శిశిరకరకిరణాసారంబులు = చంద్రకిరణధారాసంపాతములను, ఉత్ఫుల్ల = లెస్సగావికసించిన, హల్లక = ఎఱ్ఱగలువలయొక్క, పరాగ = పుప్పొడియనెడు, మధుర = తియ్యనైన, అచ్ఛ = స్వచ్ఛమైన, మత్స్యండికా = ఖండశర్కరయొక్క, (ని. 'మత్స్యండీ ఫాణితం ఖండ వికారే శర్కరా సితా' అని అ.) పుంజంబులఁగ్ = పాళ్ళయందు, పొరలించి = పొరలిచి, ఘుక్కిళ్ళకు

వెక్కసంబుగాన్ = వదడలకు వెక్కసమౌనట్టుగా, ముక్కనబంటిమెక్కి = ముక్కులకుపెళ్ల భక్షించి, ముక్కనబంటి అన్నందుకు, (శ్లో. 'మాత్రాద్యర్థేతు బంట్యాది స్తతః పూర్వేతు నః క్వచిత్' అని యథర్వణవచనము.) మెడలునిక్కించుజసత్తువలు పైకెత్తుకొన్న, చలచ్చంచు సుందరీబృందంబుల=చకోర స్త్రీసమూహములయొక్క, చలచ్చంచువు లనఁగా చకోరము లన్నందుకు, (ని. 'చలచ్చఞ్చు ద్విజ జ్యోత్స్నా ప్రియాశ్చ విషసూచకాః' అని ని.) ఆనందబాష్ప బిందు సందోహంబులన్ = సంతోష బాష్ప జలకణములయొక్క సమూహములచేత, క్రందుకొనుచున్ = సందడిపడుచును - అనఁగా బలిష్ఠ పడుచును. ఇక్కడ నిండారవికసించిన బొండుమల్లెపువ్వులు పండువెన్నెలకుఁ బ్రతియనియును, వానిలో పూఁదేనియ మద్యమునకుఁ బ్రతియనియును, అందువ్యాపించిన చంద్రకిరణములు పాండురభక్ష్య విశేషములకుఁ బ్రతియనియును తెలియవలెను.

జిగిమిగులు = కాంతిచేమించుచున్న, తొగలటారి = చంద్రునియొక్క, నిగనిగలన్ = తళతళల వల్ల, మిగులన్ బుగులుకొను=ఆవరించుచున్న, సెగలునన్ = చింతచేత, తనమగనిన్ = తనయొక్క పెనిమిటియైన పురుషపక్షిని, అగణిత వన ప్రదేశంబుల సరసియరసి = అనేకములయిన జలాశయములందు వెదకివెదకి, వేసరి=విసిగి, ఓసరిలి = ఒత్తిగిలినదై, సరసీమధ్యంబునన్ = నివాసస్థానమయిన కొలంకులో పల, తననీడఁజూచి = తనయొక్క ప్రతిబింబమునుపేక్షించి, పంటికంటి నంటుకానినుచు నంటం బోవన్ = అంటుకొడనఁగా ప్రియుఁడు, ప్రియునిఁజూచితి నని దాపునకుఁ బోవఁగా, అదియును ఎప్పుల కెపలఁ జనన్ = అనీడయును జిక్కక యవతలకుఁ బోఁగా, ఆసన్నుండయ్యున్ = సమీపమునకు వచ్చినవాఁడయ్యును, ఒల్లండు వల్లభుండేలయని = పెనిమిటి నన్నొల్లఁడు దీనికేమి హేతువో యని, ఉసురుసురనుచున్=నిట్టూర్పులువుచ్చుచు, అసురుసురై = బడలినదై, శోకు = వ్యథపడుచున్న, జక్కవజవరాలి = చక్రవాకస్త్రీయొక్క, బహువిధ = అనేకవిధములయిన, ఆవిల=కలఁకనొందిన, విలాపంబులకున్=దుఃఖాలాపములకు, కనికరించిన తెఱంగునం గరంగు = జాలిపడినట్టులుగాఁ గరఁగుచున్న, కురంగ ధరకాంతకందళంబులన్ = మొలకలవంటి చంద్రకాంతమణులవలన, జలజలని=జలజల ప్రవహించుచున్న, తెలినీటిజాలునన్ = ధవళసలిల ప్రవాహముచేత, క్రాలుగొనుచున్ = ప్రకాశించుచు, వెన్నెలవెలుఁగు మెండైనకొలఁది చక్రవాకికి విచారము మెండయ్యెను. అందుచేఁ బ్రియునికొఱకు వెదకివెదకి వేసారి ప్రతిబింబమును బ్రియుఁడని తలంచి చేరఁబోవ నది దూరమయ్యెను. అది గని మగఁడొల్లఁ డయ్యెనని జక్కవ జవరాలు చింతింపసాగెను. దానివిచారముచే కన్నీరు జారిపడినటులఁ జంద్రకాంతములనుండి జలమూరుచుండెను. జక్కవజవరాలు ప్రతిబింబమును భర్తగా నరయు ననుటకు-

సీ. ... ... ... ...

అరసి కన్నీటితో మరలి తామర యెక్కి వదన మెండఁగ సరోవారి నద్దు

నద్ది త్రావఁగ నైప కట్టిట్టు గన్గొని ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుఱుకు

... ... ... ...

గీ. సంజ ప్రియుఁ బాసి వగ నొక్క చక్రవాకి. మనుచరిత్రము. తృతీ.

అచ్చవెన్నెల=స్వచ్ఛమైనచంద్రిక, విచ్చలవిడిఁ బెచ్చుపెరిగి = అడ్డములేనట్టులుగా విజృంభించి, పచ్చతామానికంపుఁ జిప్పలన్ = మరకతమణిపాత్రలయందు, పరిశుద్ధాసవంబు = తెల్లసారా, నించకయె నించినట్లుండన్ = పోయకయే పోసినట్టులుగానుండఁగా, చంచల నఖాంచలంబులం బఖులు చిందించు

వాఁకును = చలించుచున్న గోళ్ళకొనలచేత వెలుపలికిఁ జిందఁగొట్టెడువారుకొందఱును, ఆసవమనఁగాఁ జెఱకురసముతోఁ జేయఁబడిన మద్యము. సంపూర్ణపాత్రంబులం దోఁచు = సంపూర్ణపాత్రములయందుఁ బ్రతిబింబించిన, నిండుచందురుం బిండి = సంపూర్ణచంద్రుని నాపాత్రములలో నలిపి, అమృతంబని= ఆచంద్రునివలన స్రవించిన యమృతమేయని నిశ్చయించి, వాసితాసవంబుఁ గ్రోలుచున్ = కలువలు మొదలయిన పువ్వులచేత వాసనాయుక్తముగాఁ జేయఁబడిన మద్యమును పానముచేసి, కలంకశంకం గలువఱేకు దిగిచివైచువారును = ఆసవములోనున్న నల్లగలువఱేకును బిండఁబడిన చంద్రునివలన జారిన కళంకమని తీసివైచువారు కొందఱును, అపక్వమగు చెఱకురసముతోఁ జేయఁబడునది యాసవమనియుఁ బక్వమగు రసముతోఁ జేయఁబడునది సీధువనియు గేవలవృక్షసారము మద్యమనియుం వ్యవహరింతురు. మరకతపాత్రములలోఁ బండువెన్నెల ప్రసరింప దానినిండఁ దెల్లసారాయము నించినటు లుండఁ దెలియక కొందఱు కొంత గోళ్లతోఁ జిమ్మసాగిరి. మద్యములో సుగంధము కలుగుటకు గలువపూవులు వేయుదురు. పానసమయమునఁ బూవులు తీయుటయందుఁ బ్రతిబింబించిన చంద్రునిలోని యమృతము పిండి కళంకము పాఱవేయునటు లుండె ననుట.

ప్రతిఫలితతారకంబులు=పానముసేయఁబడుచున్న యాసవమందుఁ బ్రతిఫలించిన నక్షత్రములు, తారకశబ్దము నపుంసకలింగంబును గలదు. (ని. 'కనీనికాయాం నక్షత్రే తారకం తారకా పిచ' అని వి.) ద్రాక్షాఫలంబులని = ఆసవములో వైవంబడిన ద్రాక్షపండ్లని భ్రమిసి, రిత్త చప్పరించువారును = వట్టిదే చప్పరించువారు కొందఱును, నిజాననాంభోజభాజనంబులం బట్టిన=తమయొక్క ముఖపాత్రములచేతఁ బట్టిన-అనఁగాఁ దమపుక్కిళ్ళతోఁ బట్టిన, మైరేయంబు = మైరేయమనఁగా ధాతకీ పుష్పమిశ్ర గుడ సహిత ధాన్యాంబుకృతమైన మద్యముపేరు గనుక నట్టిమద్యమును, మగలకుఁ ద్రావించునెడన్ = ప్రియులకుఁ దమపుక్కిళ్లతోడనే త్రాగించుసమయమందు, వారు=ఆప్రియులు, వాసనార్పితసహకార పల్లవంబని = పరిమళయుక్తముగాఁ జేయఁబడిన తియ్యమామిడి చిగురుటాకని, చక్కెరమోవి చుఱుక్కున నొక్కినన్=చక్కెరవలెఁ దియ్యనైన పెదవిని జుఱుక్కుమనునట్లు దంతక్షతముసేయఁగా, కలక్వణిత = సంజాతావ్యక్తమధుర నినాదములైన, కంకణ=హస్తాభరణములచేత, అంకిత=చిహ్నితములైన, కరంబులు=చేతులు, విదిర్చుచున్=విదళించుచును, కనీనికలు = ఱెప్పలతుదల, అప్పళించుచున్ = నల్లగ్రుడ్లు కొనఱెప్పలచేతఁ గ్రమ్ముచును, కమనీయ = ఒప్పుచున్న, సీత్కార=నొప్పిచేత సీయనిపలికెడు సీత్కారములను, కంఠనాదంబును = అనఁగా రతికాలమందు స్త్రీకంఠజనితములైన పారావత నాద సదృశనాదములను, గలుకరించుచున్=మురిపెములుగాఁ బలుకుచును, పానశాలా=మద్యపానముసేయు గృహవిశేషముయొక్క, పురోభాగ = ముందర, భాసమాన=ప్రకాశించుచున్న, నలద = వట్టివేళ్ళచేత నిర్మింపఁబడిన, (ని. 'నళదం స్యాత్పుష్పరసే శిరమాంసీషు నద్వయోః' అని మే.) కాయమానంబులన్=పందిళ్లయందు, పొడము=సంభవించుచున్న, పొడవెన్నెలలన్ = వెన్నెలపొడలను, పువ్వులని = తెల్లనిపువ్వులని భ్రమసి, ఎత్తి ఉవ్వంబోవువారును=వానిం దీసికొని యాప్రియులమీఁద నువ్వఁబోయెడువారు కొందఱును, గుబ్బెతలు పుక్కిలినిండ మైరేయ ముంచుకొని మగలఁ ద్రావించుచుండిరి. మైరేయమునఁ దావికి మావిచివురు లుంతురుగానఁ జెలులపెదవులు మావిచివురులని ప్రియులు చురుక్కుమనటుల నొక్కిరి. చెలులు సీత్కారములతో నావలి కేగి పందిళ్లకుఁ గట్టిన వట్టివేళ్ల తడికలనుండి ప్రసరించు

వెన్నెలపొడలను బువ్వులని ప్రియులపై రువ్వఁబోయిరి. సీత్కారము ప్రియులకు రతిసమయమణితాదుల వలె నానందకరముగ నుండెను.

సీత్కారములు పురుషుల కానందకరము లనుటకు-

శ్లో. 'సీత్కారాంచితలోచనా సపులకం య్యైశ్చుంబితా మానినీ

ప్రాప్తం తై రమృతం శ్రమాయ మథితో మూఢై స్సురై స్సాగరః.' అమరుకావ్యము.

కాదంబరీ మదోన్మాదంబునన్ = మద్యపానజనితమైన యున్మత్తతచేత, (వ్యు. 'కదంబరస్య శక్తితాంబరస్య నీలాంబరస్య ఇయం, కాదంబరీ' అని వ్యుత్పత్తి.) బలరామునికిఁ బ్రియమైనదిగనుకఁ గాదంబరియనఁగా మద్యము, (ని. 'గంధోత్తమా ప్రసన్నేరా కాదంబర్యః' అని అ.) మోదమ్ములు = కి...సంతోషము లతిశయించి, చేదమ్ములుసరచుచున్ = చప్పట్లుగొట్టుచును, చిందులుగ నాడుచుం బొడుచున్ = చిందులుద్రొక్కునట్లుగా నాడుచుపు పాటలుపాడుచును, తమనృత్తంబులకు మెచ్చి = తమయొక్క నాట్యములకు మెచ్చుకొని, నెత్తమ్ముల పగఱ = కమల విరోధియైనచంద్రుఁడు, పుత్తెంచిన = పంపించిన, ఉడుగరలని = కట్నములని విచారించి, ముంగిళ్ళరంగుమీఱు = గృహాంగణములయందు వన్నెమీఱుచున్న, ముత్యాలయరుంగులచెఱంగులన్ = ముత్యాలుగూర్చిన వేదికలయొక్క తుదలను, తుఱంగలించు మెఱుంగులు = ప్రకాశించుచున్న వెన్నెలతళుకులను, కరాంగుళులవిప్పి కప్పుకొనఁ బోవువారును = చేతులతోవిప్పి కప్పుకొనఁబోవువారు కొందఱును, ఐ = అవుచునుండి-అనఁగా నీవైనఁ జెప్పఁబడిన వారి కందఱకు నన్నివిధములుగా వెన్నెల భ్రాంతి పుట్టించుచున్నదని తాత్పర్యము. కాదంబరి మదమును ఉన్మాదమును గలిగించునుగానఁ బానముచేసినవారు వికారనృత్యములు గావించుటయు నొరులు మెచ్చి బహూకృతి పలిపిరని తలంచుటయు సహజము.

అతిప్రబంధ = మిక్కిలివాసనగట్టిన, గంధోత్తమా = మద్యముయొక్క, గంధ = వాసనాస్వాదన మందలి, అనుబంధ = ఆసక్తిచేత, బంధురలగు = ఒప్పుచున్న వారైన, సింధురయానల = స్త్రీలయొక్క, ఉదస్త = మద్యపానార్థమై మీఁదికెత్తఁబడిన, నాసామణి = ముంగరముత్తియములయొక్క, ప్రభాస్తబకంబులన్ = కాంతిపుంజములచేత, ఉల్లసిత = ఒప్పుచున్న, గల్ల = చెక్కిళ్ళయందలి, సితలోధ్రచూర్ణంబులన్ = (అలంకారార్థమై ధరించిన) తెల్లనిలొద్దుగపుప్పొడిచేతను. స్త్రీజన మలంకారార్థమై ముఖమందుఁ దెల్లని లొద్దుగపుప్పొడి ధరించుట కలదు. ఇందుకుఁ గాళిదాసప్రయోగము. శ్లో. 'నీతాలోధ్ర ప్రసవరజసా పాణ్డుతా మాననే శ్రీః' అని యున్నది. ఉన్నమిత = ఎత్తఁబడిన, అవటు = మెడవంపుల యందు, విలంబి = వ్రేలుచున్న, హారంబులన్ = ముత్యాలపేరులచేతను, పేరంబులు వారెనోయనన్ = పసుపులెత్తెనో యనునట్టులుగాను, (తుదవాక్యమందుఁ జెప్పఁబడిన వెలసి, అనెడు క్రియాపదమును నంతట నన్వయింపవలయును.)

కొన్నియెడలన్ = మఱికొన్నిస్థలములయందు, ఉన్నత = పొడవైన, చంద్రశాలా = శిరోగృహములయొక్క, బహిరంగణంబులన్ = బయటి ముంగిళ్లయందు, అడుగులకు మడుఁగులు పఱచినారని = పాదములక్రిందఁ జలువచేసినవస్త్రములు పఱచినారని యనుకొని, చరణకిసల యాయాసంబు లెఱుంగక = చిగురుటాకులవంటి పాదములయొక్క యాయాసములను గుర్తెఱుఁగక, చందనతిలకంబులు కరఁగన్ = చెమటచేత శ్రీగంధపుఁజుక్క బొట్లు కరఁగిపోఁగాను, చారుహారంబు లెగరన్ = సుందరమైన ముత్యాలపేరు లెగయఁగాను, చపల = చలించుచున్న, కుండల = కర్ణాభరణములయందలి, హీరకోరకం

బులు = మొగ్గలవంటి వజ్రములు, వెలుంగన్ = ప్రకాశింపఁగాను, భావి = ముందరఁ జేయఁబోయెడు, పుంభావ=ఉపరిసురతముయొక్క, సంభావనా = విచారములయందలి, పరిచయంబున్ = అభ్యాసముచు, సంపాదించుసొంపునన్ = సంపాదనము చేసికొనురీతిగా, పింపిళ్లగూయు = చిఱుగుడుకూయుచున్న, కలికిగోమెరల=చక్కని చిన్నపడుచులయొక్క, మొలక చనుమోసులన్ = మొలకలవంటిపూపచన్నుల యందు, తులకరించిన = పాటమరించిన, తళుకుసిబ్బెంపుఁదళతళ = తళుకుగలకోభయొక్క తళతళ యనుకాంతులచేత, దళముకొనియెనోయనన్ = సాంద్రమైనదో యన్నట్టులుగాను, ఇందులోఁ జవ్వన తిలకములు గరఁగుటయును జారుహారము లెగురుటయును జవలములైన కర్ణకుండలములయొక్క హీర కోరకములు వెలుఁగుటయును, క్రీడావిశేషమందు నుపరిసురతమందును సంభవించుచున్నవని తెలియ వలయును. పింపిళ్లగూయుంట మణితరచనముగఁ జెప్పఁబడెను. పురుషాయితమునఁ దిలకము కరఁగుట, హారము లెగురుట, కుండలాదులరత్నములు ప్రకాశించుట, గుబ్బలపిస్సలు బ్రబ్బికొనుట సాజము. కలికిగోమెరలుగాననే పుంభావనాభ్యాసమున కలవాటుపడుట. ప్రౌఢలైన నం దాఱితేరియే యుందురు. కలికిగోమెరలుకాననే పూపచన్నులు.

ఉపరిసురతమందలి నాయికావస్థ యిట్లు చెప్పఁబడెను-

శ్లో. అలోలామలకావళిం సకుసుమాం బిభ్రచ్చలత్కుండలం
కించిన్మృష్టవిశేషకం తనుతరైః స్వేదోద్గమైః సీకరైః
తన్వ్యాయత్సురతాంతతాంతనయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతు చిరాయ కిం హరిహరబ్రహ్మాదిభిర్దైవతైః. (అమరుకావ్యము)

కుండలములు కదలుటయుఁ దిలకము కరఁగిపోవుటయు నీశ్లోకమునఁ జెప్పఁబడెను. ఇటులే తక్కినవిశేషములు కవిప్రయోగములవలన గ్రాహ్యములు. విస్తరభీతిచే నుదాహరింపమైతిమి.

ఒక్కొక్కకడన్ = ఒక్కొకదిక్కున, గడవరాని తమచేడియల = త్రోయరాని చెలికత్తియలయొక్క, బెడంగునుడుగులన్ = ప్రౌఢవాక్యములచేత, అడుగు లామడలుగావచ్చి = ఒక్కొక్కయడుగొక్కొక్కయామడ యగునట్టులుగా యత్నాతిశయముచేత వచ్చి, అభినవవిహారహర్మ్యంబులుసొచ్చి= నూతనములైన క్రీడాసౌధములయందుఁ బ్రవేశించి, శాతకుంభస్తంభంబుల నత్తమిల్లి = సువర్ణస్తంభంబులయందుఁ జేరఁగిలబడి నిలిచి, ఉత్తరీయంబులుపట్టితివియన్ = మీఁదనున్నవస్త్రములపట్టి పెనిమిటులు దియ్యఁగా, ఈడిగిలంబడుచున్ = రాకమారుమసలుచును, తనులతల యడంకువలన్ = తీఁగెలవంటి దేహములయొక్క సంకోచములచేతను, తరగని వడంకులన్ = శమింపని కంపములచేతను, తనదాన ముడిసడలు=తనంతట తానే ముడివీడిన, నిద్దంపువలువలు=నునుపుగలవస్త్రములు, అదరిపాటునన్= ఏమరిపాటున, చరణాంగుళీదంశికలఁబట్టి = దంశికయనఁగాఁ బట్టుకారు, పట్టుకారువలె జోడించిన కాలివ్రేళ్ళచేతఁబట్టి, నుసిమిరనన్ = కౌఁగిటిలోనలఁపఁగా, మిట్టిపడి = బెదురుకొని యదరిపడి, ఇట్టట్టు గదలనేరక=కావలావలఁ గదలఁజాలక, వరులహృదయ పంజరంబులుదూఱి = పెనిమిటులయొక్క పంజరములవంటి వక్షస్థలములయం దడఁగియుండి, ఎట్టకేలకున్=కొంతసేపటికి, చిట్టకాలకుఁ జెవియొగ్గిన= సయ్యాటముల కనుకూలించిన, సిగ్గరికత్తియలు = లజ్జావతులు - అనఁగా ముగ్ధాంగనలు, ఇందు ముగ్ధాసంగమ మభివర్ణితము. సిగ్గరికత్తియలుగాన సురతమునందు వెఱపుమెండు కాననే గడుపరాని చెలిమికత్తెయలనేరుపుమాటలే యడుగామడయైనను గమ్యస్థానము జేర్పించినవి. యత్నాతిశయముచే వచ్చినను

జారవ లేకుండుటచే సిగ్గరికత్తియలు బంగరుకంబముమాటునఁ జేరఁగలిగిరి. మీఁదివలువఁ బ్రియులెడలించిలాఁగ కౌఁగిలఁబడుట, మేనుముడుచుట, వడఁకుట ముగ్ధాసహజకృత్యములు. ప్రియులువలువలులాగనవి నునుపువిగానఁ ద్వరలో ముడివీడెను. అప్పు డెటులోఁ బ్రియులు కౌఁగిటఁ దార్చిరి. సయ్యాటములకు విధిలేక యనుకూలించిరి.

వాతాయనంబుల డగ్గరమెలంగు=గవాక్షముల సమీపమునం దిరుగుచున్న, చలినిగ్గులగనిం గని=చలినిగ్గులగని యనఁగా శీతకిరణముల కాకరమయిన చంద్రుఁడు గనుక నట్టిచంద్రునిఁజూచి, తొంగిచూచు ధూర్తసఖీసుస్మిత వదనంబని = గవాక్షములనుండి తొంగిచూచునట్టి దుండగపుఁ జెలికత్తె యొక్క నవ్వుమొగ మనుకొని, అదరిపడి పొదవుకొన్న = సిగ్గుచేత బెదరుకొని కప్పుకొన్న, నున్నచేలలన్ = నునుపుగల వెలివస్త్రములయందును, చిన్నారి నెఱికలన్ = చిఱుత పావడలయందును - అనఁగాఁ దాబందులయందును, చెన్నారు = ఒప్పుచున్న, మిసమిసల = కాంతివిశేషములను, కన్నంబువెట్టి కైకొనియెనో యనన్ = కన్నమునిడి దొంగిలించినదో యన్నట్టులుగా, కతిపయస్థలంబులన్ = కొన్ని ప్రదేశములయందు, పచ్చిదేరు నంగమచ్చంబులతో వచ్చి=పచ్చియారని దంతక్షతాది చిహ్నములతో వచ్చి, తచ్చన వినయంబులు దెచ్చుకొని = కోడిగపువినయములు గల్పించుకొని, మోవి మాటిమాటాడియు = పెదవి గనుపడనియ్యక మాటలాడియును, చేతులుగట్టుక నిలిచియు = చేతులు జోడించుకొని నిలిచియుసు-అనఁగా నతివినయములుచేసియనుట. గట్టువాతనంబున కోడిగట్టిన=ధూర్తత్వమున కాలాయపడిన, దిట్టవిటులఁ బట్టి = గడుగుగాయలైన విటులనుబట్టుకొని, పూదండలఁగట్టి = పుష్పమాలికలచేతఁ గట్టివైచి, వ్రేలింపన్ = వేలాడఁదీసెదుకొఱకు, చెయిసాచు=చెయిచాచుచున్న, ముగుదమగువల = ముగ్ధస్త్రీలయొక్క, నఖరకాంతి భంగంబునన్ = నఖకాంతి తరంగములచేత, పొంగిపొరలెనో యనన్ = పైకిఁబొంగి పొరలినదో యన్నట్టులుగా, ఇక్కడఁ గరనఖరకాంతి తెల్లనిదని తెలియవలయును, విటులు గడుసరులు, చెలువలు ముగ్ధలు. కాన విటుల మేననున్న దంతక్షతాదిచిహ్నములు పరకాంతాభోగమును సూచించుట యెఱింగి ముగ్ధలగు ప్రియురాండ్రదరి మాటుపఱచికొనుచుండిరి. కృత్రిమవినయము, మోవిమాటిడుకొనుట, చేతులుజోడించి నిలుచుట ఇవి యంగమచ్చములు మరుగుపఱచు చేఁతలు. చెలువలిది యెఱింగి శిక్షింపఁబూనిరి. కోపముతో శిక్షించుటకాదు. ప్రణయకోపమున. కానఁ బూదండలతో బంధింపఁ బూనిరి.

వేఱొండుచాయలన్ = మఱియొకవైపులను, కోయకకోయు=కోసినట్టులు గనుపడకయ కోఁతవెట్టునట్టి, కాయజు మాయకత్తుల=మన్మథుని మాయకత్తులయొక్క, రాయిడింబడలేక=శ్రమకు సహింపఁజాలక - అనఁగా మదనవేదనకు సహింపఁజాలక యనుట. ధవళాంబర మాల్యానులేపన నేపథ్యంబులు పూని = తెల్లవస్త్రములు పుష్పమాలికలు మైపూఁతలు వీనితోఁగూడిన వేషములు వహించి, మునిమాపు చూచివచ్చిన = సాయంకాలమందుఁ జూచివచ్చిన, కర్పూరకదళికాంకిత సంకేత నికుంజంబులకు వచ్చి = కర్పూరపరఁట్లచేత గుఱుతుగాఁజేయఁబడిన సంకేతపుఁ బొదరిండ్లకువచ్చి, ఇక్కడ ధవళాంబర మాల్యానులేపనములు ధరించి సంకేతనికుంజములకు వచ్చినారని చెప్పినాఁడు గనుక జ్యోత్స్నాభిసారికలని తెలియవలయును.

శ్లో. 'మల్లికామాల్యధారిణ్య స్సర్వాఙ్గీణార్ద్రచన్దనాః,
క్షౌమావత్యో న లక్ష్యన్తే జ్యోత్స్నాయా మభిసారికాః'

అని చెప్పఁబడియున్నది. అచ్చట నఖిలకుంజంబులు నట్లయై యుండఁగ౯ = ఇక్కడ నన్నిపొదలును నారీతిగానే యుండఁగా - అనఁగా వెన్నెలచేత నన్నిపొదలును గర్పూరకదళికాంకిత సంకేతనికుంజములవలెనే యుండఁగా ననుట. కొండొకసేపు వివరింపలేక = కొంతసేపు తమసంకేతనికుంజముల నేర్పాటు చేసికొని తెలియలేక, వలపులవలనఁ దెలిసి = కర్పూరవాసనలవలనఁ దెలిసికొని, నిజసమయనిలయంబు లీఁగు = తమరు సమయము చేసికొన్న పొదరిండ్లు దూరిన, ఇత్వరీజనంబుల = జారస్త్రీజనముల యొక్క, (ని. 'పుంశ్చలీ తర్షణీ బన్ధక్యసతీ కులటేత్వరీ' అని అ.) మనంబు లరయవలసి = మనస్సులు గనవలసి, మార్మగలు = ఉపపతులు, మాటునకరుగుటయు౯ = చాటునకుఁ బోఁగా, అవ్వేళ నెవ్వరిం గానక = ఆసమయమం దెవ్వరినిఁగానక, అరణ్యరోదనంబు నిజంబయ్యెనని = అడవియేడుపన్న మాట నిజమాయెనని, నిశ్శబ్దంబుగా నేడ్చుచు౯ = అలుకుడుగాకుండ నేడ్చుచు, చేయునది లేక = ఏమియుఁ దోఁచక, చెయ్యులు దక్కియున్న౯ = నిశ్చేష్టితలైయుండఁగా, ఇక్కడ అవ్వేళ నెవ్వరిం గానక నిశ్శబ్దముగా నేడ్చుచున్నారని చెప్పినాఁడు గనుక విప్రలబ్ధ లనెడి నాయికలనియును బరకీయలనియును గ్రహింపవలయును. విప్రలబ్ధలకు-

> శ్లో. 'క్వచి త్సఙ్కేత మావేద్య దయితే నాథవఞ్చితా,
> స్మరార్తా విప్రలబ్ధేతి కళావిద్భిః ప్రకీర్తితా'

అని లక్షణము. అన్నెగులువారింప సన్నిహితులై = అవిచారమును బోఁగొట్టెడు కొఱకు దగ్గర వచ్చినవారై, వారికన్నీరుదుడిచి కవుంగిటమన్నించిన౯ = ఆస్త్రీలయొక్క కన్నీళ్లు దుడిచి కౌఁగిటిలోఁ జేర్చి మన్ననసేయఁగా, కనుదెఱచిచూచు = కన్నులు విచ్చిచూచునట్టి, అన్నెలంతల = అజారస్త్రీలయొక్క, విస్మయసూచనలోచనప్రభాదట్టంబుల౯ = ఆశ్చర్యద్యోతకములైన నేత్రకాంతిస్తోమములచేత, నిట్టవాడిచెనో యన౯ = నిగ్గినదో యన్నట్లుగాను, మఱియుం బెక్కునెళవుల౯ = మఱియు ననేకస్థలములయందు, కళల యిక్కువలఁ దెలిసి = మన్మథకళాస్థానములు గుర్తెఱిఁగి, కలసినయదన౯ = సంభోగముచేసినసమయమందు, మదనకదనంబున౯ = మన్మథయుద్ధమందు, సదమదంబులగు నంగంబుల౯ = బడలి నలినలియైన దేహములయందు, అంగదట్టంబులు మార్పడవైచుకొని = అనఁగా స్త్రీపురుషులొకరిపావడ లొకరు పైనిఁ గప్పుకొని యనుట. ఉప్పరిగల బయళ్ళకు నేగుదెంచి = మేడలయొక్క బయళ్లకువచ్చి, చందమామగుటికలుగ్రోలు = చంద్రకిరణాస్వాదనము సేయుచున్న, మందయానల = స్త్రీలయొక్క, చెక్కుల వెలుంగు = చెక్కిళ్ళయందుఁ బ్రతిఫలించిన, వలివెలుంగుం జూపి = చంద్రునిఁ జూపి, మీమొగంబుల మిలమిలలు గిలుబొడవచ్చెఁజుమీ = మీవదనములయందలి తళతళలను సంగ్రహించుకొనెడుకొఱకు వచ్చినాఁడుసుమా, వెన్నెలబచ్చు = వెన్నెల నాణెగాఁడు-అనఁగా నీచంద్రుఁడు, ముచ్చువీఁడు = వీఁడుదొంగ, కాఁబట్టి, ఇచ్చోట మసలుట మనకు నేరమని = ఇక్కడ నాలస్యము సేయుట మనకుఁ దప్పిద మని పలికి, నారులం బునారతంబులకు నెలయించికొనిపోవు = స్త్రీలను బునస్సంభోగముల కుల్లసిల్లఁజేసి వెంటఁబెట్టుకొని పోవునట్టి, వలకారుల జారుకొప్పులం దొరఁగు = విటులయొక్క జారుసిగలవల్లనుండి రాలుచున్న, విరిగుత్తుల = పువ్వుమంజరులతోడ, పొత్తుగలసెనో యన౯ = జతగూడినదో యన్నట్టులుగా, వెలసి = ప్రకాశించి, అభివ్యక్త = ప్రత్యక్షమయిన, శుద్ధవర్ణబ్రహ్మంబుగావున౯ = పరిశుద్ధాక్షర బ్రహ్మముగనుక, ఉర్విఁ గలవారి నెల్ల౯ = భూమిలోఁగలవారి నందఱను, సర్వ

జ్ఞులఁ జేయుచున్ = సకలవిద్యాపారంగతులఁ జేయుచు ననియర్థము. కళాస్థానములను శాస్త్రానుగుణముగా గుర్తించి కలసినయెడల: జెలువలు త్వరగాఁ బరితృప్తి నొందుదురు. దాన బడలిక పెచ్చరిలి తమ్ముఁ దాము మఱచునంతటి బద్ధకమునకు లోనగుదురు. కాననే యంగదట్టములు మార్పుడుట సంభవించెను.

కళాశాస్త్రమునఁ గళాస్థానములు పదియాఱని యిట్లు చెప్పఁబడెను-

సీ. తల యురస్థ్సలి వామ దక్షిణకరములు పలిదున్న లూరు లావర్తనాభి
ఫాలజాఠరనితంబస్థలంబులు వీపు చంకలు గుహ్యంబు చరణతలము
ఆదిగాఁగల పదియాఱుతానకములఁ బ్రతిదినంబునఁ బంచబాణుఁ డుండు
గావున స్త్రీయంగకంబులు శుక్లపక్షంబుల నెక్కుఁ గృష్ణముల దిగును

తే-గీ. విటులు తలములు పదియాఱు విస్ఫులింగ
భావములుగాఁగఁ జూచి యప్పట్ల దలఁచి
పొందనేర్చిన మోహంబు పొదలుచుండు...

లేక శుద్ధవర్ణబ్రహ్మమనఁగా ధవళవర్ణబ్రహ్మము హరుఁడని చెప్పి యాదేవుఁ డభివ్యక్తుఁడైన తాను సర్వజ్ఞుఁడు గనుక నుర్విఁగలవారి నెల్ల సర్వజ్ఞుల: జేయుచున్నాఁడనఁగా సారూప్య దేదీప్యమానులఁ జేయుచున్నాఁడని యర్థాంతరము. అభివ్యక్త ధవళవర్ణ ప్రవృద్ధ మనియును, ఉర్విఁగలవారినెల్ల సకలపదార్థజ్ఞానము గలవారిని జేయుచున్నదనియును జంద్రికాపరమయిన భావము. బ్రహ్మమనఁగా, 'బృహబృహివృద్ధౌ' అనెడి ధాతువువలనఁ బ్రవృద్ధమయిన వస్తువని తెలియవలయును. తారవాదధారేయంబు గావునఁ గొండల నెల్ల వెండికొండలఁ జేయుచున్=తారమనఁగా రజతము గనుక దానియొక్క వాదము తారవాదము-అనఁగా రజతచ్ఛాయ. లేక తారవాదమనఁగా రసఘుటికకును పేరు. ఏలాగనిన, తరుసంబంధమయినది తారవము-అనఁగా వృక్షరసము దాని భక్షించునది గనుకఁ దారవాదమని తెలియవలయును. తారవాదధారేయము: గనుకఁ గొండల నన్నిటిని వెండికొండలుగాఁ జేయుచు నని యర్థము. తారశబ్దము నక్షత్రార్థక మయినప్పుడును నపుంసకలింగ మవుచున్నది. ఇందుకు శ్రీనాథుని ప్రయోగము-

సీ. 'గ్రహతారనక్షత్రగణము నాస్ఫాలించి విధుకిరీటునిమౌళి వెల్లిఁ గొల్పి'

అని యున్నది గనుకఁ దారవాదధారేయ మనఁగా నక్షత్రములతోడ వాదధారేయమయినది. అనఁగా నక్షత్రకాంతి నడఁగించునది యనియును గొండల నన్నిటిని ధవళములుగాఁ జేయుచున్నదనియును జంద్రికాపరమయిన భావము.

పద్మాహిత పాదప్రభూత నూతన స్రోతోవిశేషంబు గావున నఖిలభువన మాలిన్యంబు లడఁగించుచున్-పద్మా = లక్ష్మీదేవికి, హిత = ప్రియుఁడైన విష్ణుదేవునియొక్క, పాద = పాదమువలన, ప్రభూత= సంభవించిన, నూతనస్రోతోవిశేషంబు గావునన్ = అభినవప్రవాహవిశేషము గనుక, అనఁగా విష్ణుపాదోద్భవయైన భాగీరథి గనుక, అఖిలభువన = సమస్తలోకములయొక్క, మాలిన్యంబు లడఁగించుచున్ = పాతకపటలములను భంగించుచు నని యర్థము. పద్మ=కమలములకును, అహిత = శత్రువైన చంద్రునియొక్క, పాద = కిరణములవలన, ప్రభూత=పుట్టిన, నూతనస్రోతోవిశేషంబు గావున నవఁగా

పూర్ణమైనదనియును సకలభువనాంధకార నివారకమనియుఁను భావము. ఇక్కడఁ జంద్రికయందుఁ జంద్రకిరణ జనిత స్రోతోవిశేషారోపము చేసినాఁడు గనుక రూపకాలంకారము. చంద్రకిరణ జనిత స్రోతోవిశేషము కవికల్పితము గనుక రూపకము గాదనఁగూడదు. అదేమన్నను, (స్వర్గస్త్రావిమనస్కశోకవదనప్రస్తా మృణాళీలతా' అనుచో) స్వర్గంగావిమనస్కశోకవదన ప్రస్తమైన మృణాళీలత కవికల్పితమయినదైనను, ఇది రూపకాలంకారమున కుదాహరింపఁబడియున్నది గనుక నని తెలియవలయును. పంకజభవాండమండపంబు సంకుచేసిన ఫొంకంబున నంకించుచుక్ = బ్రహ్మాండమనెడు గృహవిశేషమును డెల్లరంగు చేసినరీతి నుల్లసిల్లుచును, అకలంకమీనాంక నిరంకుశ యశోమరీచిసధ్రీచీనంబై - అకలంక = నిర్మలమయిన, మీనాంక=మన్మథునియొక్క, నిరంకుశ = అడ్డములేని, యశః=కీర్తియొక్క, మరీచి = కాంతితోడ, సధ్రీచీనంబై = సమానమైనదై - అనఁగా మన్మథయశఃకాంతియో యన్నట్టులుగా నున్నదై యనుట. విజృంభించుసమయంబునక్ = ప్రకాశించుచున్నసమయమునందు.

శా. అచ్ఛంపుం దెలినిండువెన్నెలలతో • నబ్జారి వచ్చెం గదుక్
హెచ్చెం బచ్చనివింటిజోదు చలిగా • ద్పేతెంచె నిచ్చోట ము
చ్చిచ్చుం గూడిన నోర్చునే చెలి యయో • చెల్లంచు నాళీజనం
బిచ్చక్ మెచ్చఁగ మంజువాణి సకలా•భీష్టక్రియాధుర్య యై. 24

అచ్ఛంపుం దెలినిండు వెన్నెలలతోక్ = స్వచ్ఛమైన ధవళకాంతిగల సంపూర్ణచంద్రికలతోడ, అబ్జారివచ్చెక్ = చంద్రుఁడు వచ్చెను. కదుక్ హెచ్చెం బచ్చనివింటిజోదు=మిక్కిలి మన్మథుఁడు పెచ్చుపెరిగెను, చలిగాడ్పేతెంచెక్ = మలయమారుతమువచ్చెను, ఇచ్చోట ముచ్చిచ్చుం గూడినక్= ఇక్కడ నగ్నిత్రయమును గూడినదగుచుండఁగా, ఓర్చునేచెలి = గిరికాదేవి తాళఁగలుగునా, అయోచెల్లంచుక్ = అయ్యయో నేఁజెల్ల నని పలుకుచు, అళీజనం బిచ్చమెచ్చఁగక్ = సఖీజనము మనస్సున మెచ్చుకొనునట్టులుగా, మంజువాణి = మంజువాణి యనెడు చెలికత్తియ, సకలాభీష్టక్రియాధుర్యయై= సమస్తహితకార్యధురంధరురాలై, ముందరిపద్యముతో నన్వయము.

ఒక్కయగ్ని కోర్చుటయే మిగుల కష్టము. ఇపుడు గిరికకు మూఁడు చిచ్చులు ప్రాప్తమైనవి. ఒక చిచ్చు పండువెన్నెల, మఱియొకచిచ్చు మన్మథుఁడు, వేఱొకచిచ్చు మలయమారుతము. మంజువాణి కోరికలొనగూర్చు చెయిదములలో నారితేఱిన నడుసరి. కానఁ జెలులు మెచ్చ సమయోచితకార్యముల కుపక్రమించెను.

సీ. రిక్కరాయనికళ•ల్చెక్కు గీటక మున్న వెడతూపు దృగ్వీథిఁ • బడక మున్న
యెలతుమ్మెదలడిమ్ము • తలఁ గ్రమ్మకయమున్న చిగురు చేపట్లకు • డిగక మున్న
కలికికోయిల గళ•గ్రహము సేయక మున్న రాచిల్కమాటకు • రాక మున్న
నిసువుతెమ్మెరదంట • యసువు లంటకమున్న కలహంస కాళ్లఁ ద•వులక మున్న
తే. యబ్జముఖులార యేఁ బోయి • యచలకన్య
యుత్తలముఁ దెల్పి వసురాజు•చిత్త మరసి
వత్తు నత్యంతశుభవార్తఁ • దెత్తు ననుచుఁ
గొమ్మపోరంబు పూని యేఁ•గుటయు నిచట. 25

అబ్జముఖులారా = చెలికత్తెలారా !, రిక్కరాయనికళ ల్చెక్కుగీటకమున్న = చంద్రునియొక్క కళలు గిరికాదేవియొక్క బుగ్గలు పొడవకమునుపే యని యర్థము. వెడతూపుదృగ్వీథిఁ బడకమున్న= వెడతూపు అనఁగా వెఱ్ఱిఁబుట్టించునట్టి మన్మథునిబాణము అనఁగాఁ గమలము గనుక నది దృష్టిపథమునఁ బడకమునుపే యని యర్థము. ఇటఁ జంద్రకళలకుఁ జెక్కులకుఁ గమలములకుఁ జూపులకు సాదృశ్యము గ్రాహ్యము. ఇందుఁ జంద్రుఁడు తామరపూవులు బ్రతికూలచేష్టితములగు బుగ్గలు పొడుచుట చూపు త్రోపుకడ్డుపడుట యను క్రియలు చెప్పఁబడెను. మన్మథునిబాణము లైదింటిలో మొదటిది తామరపూవు. ఇది యున్మాదకరముగాన వెడదూపని పేరొందెను. ఉన్మదనబాణమనియు నున్మాదబాణమనియు దీనిని వ్యవహరింతురు. ఉన్మదనబాణము మరులుకొన్నవారిని లోఁగొనుననుటకు-

ఉ. ఆవసుధాధినాథుని మహాధృతిశాలి జయించు తెంపునన్
భావజుఁ డప్పు డున్మదనబాణము తియ్యనివింటఁ గూర్చుచోఁ
గేవలసాహసంబు మదిగీల్కొనఁజేసియు ముంచెఁ దాఁ ద్రిలో
కీవిజయార్జితంబులగు కీర్తిభరంబులు సంశయాంబుధిన్. శృంగారనైషధము. ఆశ్వా. ౧.

ఉన్మదనబాణమె వెడబాణము. ఇది మదనునిపంచబాణములలో నొకటి.

శ్లో. ఉన్మాదన స్తాపనశ్చ శోషణ స్తంభన స్తథా,
సమ్మోహనశ్చ కామస్య పంచబాణాః ప్రకీర్తితాః.

మన్మథబాణముల కృత్యములు.

క. కూడుడిగించు నశోకము, వాడించును మల్లెవిరి, వివర్ణతఁ జేయున్
జూడఁగఁ జూతము, తలఁపుల్, జోడించును తమ్మి చంపఁ జూచున్ గలువల్.

ఎలతుమ్మెదలదిమ్ము = కొదమతుమ్మెదలయొక్క రొద, తలఁగ్రమ్మకయమున్న = తలపట్టుకొనక మునుపే యని యర్థము. చిగురుచేపట్లకు డిగక మున్న = చిగురుటాకు చేసరసములకు రాకమునుపే యని యర్థము. కలికికోయిల గళగ్రహము సేయకమున్న = చక్కని కోయిల గొంతు పట్టుకొనక మునుపే యని యర్థము. రాచిల్కమాటకు రాకమున్న = రాజకీరము వాదమునకు రాకమునుపే యని యర్థము. నిసువు తెమ్మెరదంట = బాలసమీర మనెడుగడుసరి, అసువులంటకమున్న=ప్రాణము లంటక మునుపే యని యర్థము. కలహంస కాళ్ళఁ దవులకమున్న = హంసవిశేషము కాళ్ళకుఁ దగులకమునుపే యని యర్థము.

ఏఁబోయి = నే నచ్చటికిఁ బోయి, అచలకన్య=గిరికాదేవియొక్క, ఉత్తలముఁ దెల్పి=వ్యాకులమును దెలియఁజేసి, వసురాజుచిత్తమరసి = వసురాజుయొక్క మనస్సును విచారించి, వత్తున్=వీతెంచుచున్నాను. అత్యంత శుభవార్తఁ దెత్తున్ = అత్యంతమైన శుభవృత్తాంతమును దెచ్చుచున్నాను. అనుచున్ = అని పలుకుచు, కొమ్మహారంబు పూని యేఁగుటయున్ = గిరికాదేవియొక్క మౌక్తికహారము చేకొఁబట్టుకొని పోఁగా, ఇచటన్ = గిరికాదేవి యున్నయీస్థలమందు, మన్మథపరికరములగు చంద్రుఁడు, తమ్మితూపు, తుమ్మెదలు, చిగురులు, కోకిల, రాచిలుక, తెమ్మెరలు, రాజహంస బుగ్గలు పొడుచుట, కంటఁబడుట, తలనుగ్రమ్ముకొనుట, గళము గ్రహించుట, మాటకడ్డుపడుట, ప్రాణములఁ గలంచుట, కాళ్ళకడ్డుపడుట లోనగుచేఁతలు ప్రతికూలచేష్టితములు. చంద్రుఁడు చెక్కులతోఁ బోలుట

లోనగునవి సాదృశ్యములు. ఇందు సదృశసంబంధములు ప్రాతికూల్యవివక్షితములుగఁ గల్పితములు. అలం. అతిశయోక్తి.

ఇక్కడ 'రాయంచకాళ్ళఁ దొలకయమున్న యని పాఠాంతరము. అది యహోబలపత్యంగీకృత పాఠము. ఆ పక్షమందు రేఫలకారములకు విశ్రమము చెల్లవలయును. తద్విచారము తృతీయాశ్వాసములో 162 వదియైన, ఓలోలాంబక యనెడు పద్యపుటీకయందు వ్రాయఁబడినది గనుక నక్కడఁ జూడఁదగినది. ఇంతమట్టుకుఁ జంద్రాదివస్తువులు తటస్థోద్దీపనవిభావములు గనుక విరహవేదనాహేతువులని తెలియవలయును. ఇందులో గిరికాదేవియొక్క కపోలాద్యవయవములకు రిక్కరాయనికళలు మొదలైనవానితో సాదృశ్యసంబంధము స్ఫురించుచున్నది. పసువు తెమ్మెరదంట యసువు లంటక మున్న యన్నచోటఁ బ్రాణవాయులకు సాజాత్యసంబంధము స్ఫురించుచున్నది.

శా. క్రీడామందిరజాలమార్గములచక్కి న్నిక్కి జాబిల్లి తా
గోడ ల్నీరుగ జారఁ ద్రోచి నెలతళ్కు ల్చొచ్చి వెన్నాడి మై
నాడం గోమలి యోర్వ లేక వలవంతం బద్మినీజాతికిం
గీ డౌ నుగ్రశిఖామణిం బలికె నక్షీణానులాపంబులన్. 26

క్రీడామందిర = కేళీగృహముయొక్క, జాలమార్గములచక్కి న్నిక్కి = గవాక్షరంధ్రములనుండి సాగిపోయి, జాబిల్లితాగోడల్ = చంద్రకాంతభిత్తికలను, నీరుగ జారఁద్రోచి = నీరై జారిపోవునట్టులు చేసి, నెలతళ్కుల్ = చంద్రకళలు, చొచ్చి = లోపలఁ బ్రవేశించి, వెన్నాడి = వెంటనుండి, మైనాడన్ = దేహమందుఁ దగులఁగా, కోమలియోర్వలేక = గిరికాదేవి సహింపఁజాలక, వలవంతన్ = విచారముచేత, పద్మినీజాతికింగీడౌ నుగ్రశిఖామణిన్ = పద్మినీజాతిస్త్రీలకు సేగియైన యుగ్రజనశ్రేష్ఠునిఁగూర్చి యని యర్థము. చంద్రుఁడు నలినీజాతికి విరోధియనియును నుగ్రముగల వారునకు శిఖామణియనియును భావము. ఉగ్రుఁడన శివుఁడు. ఉగ్రః కపర్దీ శ్రీకంఠః శితికంఠః కపాలభృత్' అని అ) అక్షీణ = తక్కువగాని, అనులాపంబులన్ = ముహుర్భాషణములచేతను-అనఁగా రెట్టింపుమాటలచేత, (ని. 'అనులాపోముహుర్భాషా' అని అ.) పలికెన్ = వక్ష్యమాణప్రకారముగా వచించెను.

ఉగ్రశిఖామణియన క్రూరులయందు మిన్న. అట్టివాఁడు గవాక్షములనుండి చూచి గోడల దాఁటి వెన్నాడుటకు సాహసింపఁ గోమలు లోర్వలేకపోయిరి. ఇట్టివారిసంపర్కము పతివ్రతామణులగు పద్మినులకుఁ గీడు. కాన వలవంతతో గిరికాదేవి చంద్రునిగూర్చి భాషింపఁ దొడఁగెను. అలం. సమాసోక్తి. పర్యాయోక్తము.

శా. రాజీవాక్షుల నేచుపాతకివి చంద్రా రాజవా నీవు నీ
రాజత్వంబునఁ జక్రము ల్మనియెనో రంజిల్లి సత్సంతతుల్
తేజం బందెనొ డిందెనో యహిభయోద్రేకంబు తాఁ జెల్లరే
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే రాజౌట దోషార్థమే. 27

ఈపద్యమునందు దుష్టుఁడగు రాజుపరముగను చంద్రునిపరముగను నర్థద్వయము గలదు.

చంద్రా = ఓయిచంద్రుఁడా, రాజీవాక్షుల నేచుపాతకివి = కమలాక్షులైన స్త్రీలను బాధించునట్టి పాపాత్ముఁడవు, రాజీవాక్షులనెడు స్త్రీవిశేషణము సాభిప్రాయము. రాజవానీవు = నీవు రాజవేనా

యని యర్థము. రాజనామము గలవాఁడని భావము. నీరాజత్వంబునన్ =నీప్రభుత్వముచేతనని యర్థము. నీచంద్రత్వముచేత నని భావము. చక్రముల్మనియెనో = రాష్ట్రము లేమయిన మనియెనా యని యర్థము. చక్రవాకములు మనియెనా యని భావము. రంజిల్లి=సంతోషించి, సత్సంతతుల్తేజంబుఁజెనో= సత్పురుష సమూహములు ప్రభావమును బొందెనా యని యర్థము. తేజశ్శబ్ద మిక్కడఁ బ్రభావపరము. నక్షత్రసమూహములు ప్రకాశమును బొందెనా యని భావము. డిందెనో యహిభయోద్రేకంబు = అహిభయమనఁగా రాజులకు స్వపక్షమువలనఁ బుట్టిన భయము, అది యేమైనను దక్కువాయెనా యని యర్థము. (ని. 'మహీభుజా మహిభయం స్వపక్ష ప్రభవం భయమ్' అని అ.) సర్పరూపుఁడైన రాహువువలని భయ మడఁగెనా యని భావము. కాఁజెల్లరే = నేఁజెల్లఁబో, రాజైపుట్టుట= లోకమందు రాజై జన్మించుట యని యర్థము. రాజనామముచేతఁ బుట్టుట యని భావము. రశ్మిమాత్రఫలమే=ధనమార్జించుమాత్రపు ఫలమేనా యని అర్థము. కిరణసంపత్తిమాత్రపు ఫలమేనా యని భావము. రాజౌట దోషార్థమే, ('రాజ్యాంతే నరకం ధ్రువమ్') అని యున్నది గనుక రాజవుట పాతకముకొఱకేనా యని యర్థము. రాత్రికొఱకేనా యని భావము. దీనిచే నిశాకరశబ్దార్థము స్ఫురించుచున్నది.

స్త్రీలయభిమానములను గాపాడుట, రాష్ట్రమును జక్కఁగాఁ బాలించుట, పండితుల సంతోషింపఁజేయుట, ఈతిబాధలు తొలంగించుట రాజధర్మము. రాజై పుట్టుట ధనము బొక్కసమునందు నించుటకుఁ గాదని యర్థము. చంద్రుఁడు విరహిణులను జక్రవాకములను సంతాపింపఁజేయు ననియు నక్షత్రములు కాంతిమాయుట, రాహుగ్రహణభయము కలుగుట రాత్రియేర్పడుటదక్క నతనివలన లాభము లేదనియు నర్థాంతరము. అలం. శ్లేషము.

ఉ. ఇంతుల నేచుపాతక మ◆దెంతట నంతటఁ బోదు పాంథలో
కాంతక నిన్ను ఘోరతమ ◆ మై ఘన మై యజహాత్కళంక మై
వంతలఁ బెట్టి యాఱుపది ◆ వ్రక్కలు సేయక పూర్వపక్షపుం
గంతుల కేమి చూచెదవు ◆ గా తుది నీబహుళార్తిఖేదముల్. 28

పాంథలోకాంతక = విరహిజనమారకుఁడవైన యోచంద్రుఁడా, ఇంతులనేచు పాతక మది = స్త్రీలను బాధపెట్టెడు పాప మేది గలదో యది, నిన్నున్ ఘోరతమమై = అతిఘోరమైయని అర్థము. భీకర రాహురూపమై యనిభావము. (ని. 'రాహౌ ధ్వాంతే గుణే తమః' అని వి.) ఘనమై=మహోల్బణమై యని అర్థము. మేఘమై యని భావము. అజహాత్కళంకమై = విడువని యపవాదమయి యని యర్థము. చిహ్నమైయని భావము. (ని. 'కళంకోఙ్కాపవాదయోః' అని అ.) అక్కడ రాహుమేఘ కళంకత్వముల నపహ్నవించి పాతకత్వ మారోపించినాఁడు. పాతకము నీలవర్ణమని కవిసమయసిద్ధము. వంతలఁ బెట్టి = బాధలఁ బొందించి, ఆఱుపదివ్రక్కలు సేయక = పదియాఱు తునకలుగా నొనర్పక, ఇంతటఁ నంతటఁ బోదు=ఊరకే యింత టంతటితోఁ దప్పిపోదని యర్థము. షోడశకళలని భావము. కాఁబట్టి, పూర్వపక్షపుం గంతులకేమి = ముందరికిరాని యిప్పటి గంతుల కేమి వచ్చె నని యర్థము. శుక్లపక్ష దినదినాభివృద్ధి కేమి వచ్చెనని భావము. చూచెదవుగదా తుది నీబహుళార్తిఖేదముల్ = చివరకు నీ మహత్తరమయిన వ్యథవలని దుఃఖములను నీవే చూచెద వని యర్థము. బహుళపక్షమందలి దినదినక్షయము లని భావము. అలం. శ్లేషము, అపహ్నవము.

చంద్రకిరణప్రసారము విరహిణులకు వ్యథాకరము. కాన పాంథాలోకాంతకుండగు చంద్రునకిది పాపము. ఈపాపము విడువరాని ఘోరకళంకమై చంద్రుని పదియాఱుఖండములు చేయుచున్నది. ఈయార్తి యంతయు బహుళపక్షమునం దనుభవమునకు రానే వచ్చుచున్నది.

సీ. కమలించెఁ గాక యంగజవిరోధి శిరోధిఁ దల కెక్కఁ జాలెనే హాలహాలంబు
క్రాచెఁ గాక పయోధికాండప్రకాండంబుఁ బైకిఁ బొంగించెనే బాడబంబు
తూఱెఁ గాక ముకుందతుందప్రఘాణంబు వెడలెనే యెదఁ గాలి విపినకీలి
యడఁచెఁ గాక శిలోచ్చయచ్ఛదాహంకృతుల్ గరఁచెనే నీరుగాఁ సురపహేతి
తే. నీకరణి నిట్లు దయలేక లోక మేర్చు, నీకరణి నైన యలయత్రినేత్రమునకు
ఖరకరాలోకగాఢనిష్ఠురతపోగ్నిఁ, బెటిలిపడ కున్కి భరమె కృపీటజన్మ. 29

కృపీటజన్మ = కృపీట మనఁగా నుదకము, దానివలననైన జన్మము గలవాఁడు, కృపీటజన్మ అనఁగా నగ్నియగును జంద్రుఁడును గనుక, ఓయి యగ్నిహోత్రుఁడా అనియర్థము. చంద్రుఁడా యని భావము. ఈరెండర్థముల కభేదాధ్యవసాయము. హాలహాలంబు = కాలకూటము, అంగజవిరోధి=మన్మథవైరి యైన హరునియొక్క, శిరోధి = కంఠము, కమలించెఁ గాక = కమలి నల్లఁబడునట్టులు చేసెను గాని, నీకరణిక్ = నీవలె, తలకెక్కఁజాలెనే = నెత్తికెక్కఁగలిగెనా యని యర్థము. చంద్రుఁడు హరశిరోభూషణ మైనవాఁడని భావము. ఈపద్యగీతికి మొదటనున్న నీకరణి యనెడుపదము సర్వత్ర అన్వయింపవలయును.

బాడబంబు = బడబానలము, పయోధి = సముద్రముయొక్క, కాండప్రకాండంబుక్ = ప్రశస్తోదకమును, క్రాచెఁగాక = కాలునట్టులు చేసెనుగాని, పైకిఁ బొంగించెనే = నీవలెఁ బొంగి పొరలునట్టులు చేయఁజాలెనా యని యర్థము. చంద్రోదయసమయమునందు సముద్రము పొంగుచున్నదని భావము. నీవు సముద్రమున జనించితివి. నీవలెనే బడబానలముగూడ సముద్రమున జనించినది. బడబానలము సముద్రోదకమును గ్రాచుచున్నది. నీవును సకలజంతూపద్రవకరముగాఁ బూర్ణిమారాత్రులందు సముద్రుని పొంగఁజేయుచున్నాఁడవు. ఇది లోకవిప్లవదాయకము.

విపినకీలి=దవానలము, ముకుందు = శ్రీకృష్ణావతారమును బొందిన విష్ణుదేవునియొక్క, తుంద= ఉదరమనెడు, ప్రఘాణంబు = గృహవిశేషమును, తూఱెఁగాక = దూరియడఁగిపోయెను గాని, ప్రఘాణ మనఁగా దలవాకిటి ముందరనుండు నల్పగృహము, (ని. 'ప్రఘాణ ప్రఘణా లింద బహిర్ద్వార ప్రకోష్ఠకే' అని అ.) వెడలెనేయెదఁగాలి = నీవలె హృదయము దహించి బయలు వెళ్లెనా అని యర్థము. చంద్రుఁడు విష్ణుదేవుని మనస్సువలనఁ బుట్టినాఁ డనుశ్రుత్యర్థ మనుసంధింపవలయును. కృష్ణస్వామి దావానలపానము సేయుట పురాణప్రసిద్ధము. కృష్ణుఁడు గోవులను గోపాలురను గాపాడుటకై దావానలము మ్రింగినకథ భాగవతదశమస్కంధమునందుఁ గలదు.

సురప = సురల కధిపతియైన యింద్రునియొక్క, హేతి=ఆయుధమైన వజ్రము-అనఁగా వజ్రాయుధము, శిలోచ్చయ = పర్వతములయొక్క, ఛద=ఱెక్కలయొక్క, అహంకృతుల్ = అహంకారములను, అడఁచెఁ గాక = అణఁగించెను గాని, కరఁచెనే నీరుగాక్ = శిలలు నీరువునట్టులు కరఁగింపఁజాలెనా యనియర్థము. చంద్రకిరణప్రసారణముచేతఁ జంద్రకాంత శిలలు గరఁగుచున్నవని భావము. అనఁగాఁ గాలకూటబడబానల దవానల వజ్రాయుధములకంటె నీవు తీక్ష్ణమయినవాఁడవని తాత్పర్యము. నిట్లు=

ఈప్రకారముగా, దయలేకలోకమేర్చు = నిర్దయుఁడవై లోకములను దహించుచున్న, నీకున్ = అనఁగా నగ్నిహోత్రుఁడవైననీకు, అరణియైన = జన్మస్థానమయిన, అల అత్రినేత్రమునకున్ = ఆఅత్రిమహాముని లోచనమునకు, ఖరకరాలోక = సూర్యావలోకనరూపమును, గాఢ = దృఢమును, నిష్ఠుర = కఠినమునునగు, తపోగ్నిన్ = తపస్సువల్లఁ బుట్టిన అగ్నిచేత, పెటిలిపడకున్కి = పెట్లిపడిపోకయుండుట, భరమె = అది యొక భారములోనిదా అనఁగాఁ గాదనుట. ఖరకరశబ్దము సాభిప్రాయము.

చంద్రుఁడు కృపీటజన్ము. హాలాహలము, బడబానలము, దావాగ్ని, వజ్రాయుధము చంద్రుని యంత తీవ్ర మయినవి కావు. ఇవి నిర్దయభావముతో లోకమును దహింపలేవు. చంద్రుఁ డిందఱి కంటెఁ దీవ్రుఁడు. కాలకూటాదులకంటెఁ దీవ్రతరుఁడగు శశిని గనెను గాన అత్రి సూర్యాలోకన మొనర్చుచు ఘోరతపము గావించుటలో నచ్చెరువు లేదు. అలం. పరికరము, రూపకము.

మ. విషరాశిన్ జనియింపవో విషసహా • విర్భూతి వాటింపవో
విషభృన్మార్గము నంటవో విషధరు • ల్వేష్టింపఁ గా లూఁదవో
విషభుక్చూళికఁ బిన్ననాఁడె కనవో • విఖ్యాతకౌటిల్యమున్
విషమం బెట్లగు నీకు జీవకృతవి • ద్వేషంబు దోషాకరా 30

దోషాకరా = పాపములకాకరమైన చంద్రుఁడా యని యర్థము. రాత్రిని జేయువాఁడని భావము. దోషాశబ్దము రాత్రివాచక మయినప్పుడు అవ్యయము. ని. 'దోషా న క్తఞ్చ రజనా వపి' అని అ. విషరాశింజనియింపవో = విషపుంజమందుఁ బుట్టినావు కావా యని యర్థము. విషమనఁగా జలంబును గనుక జలరాశియందుఁ బుట్టినాఁడవని భావము. విషసహావిర్భూతివాటింపవో = కాలకూటవిషముతోఁ గూడ నావిర్భవించినావుకావా అని అర్థము. విషభృన్మార్గమునంటవో = విషమును భరించిన వారియొక్క ప్రవర్తనము నవలంబించినావు కావా అని అర్థము. విషమనఁగా జలము దాని భరించినవి మేఘములు వానిమార్గ మాకాశము గనుక నాకాశము నంటియున్నావని భావము. విషధరుల్వేష్టింపఁ గాలూఁదవో విషభుక్చూళికన్ = విషమునుధరించినవారు పరివేష్టింపఁగా విషభోజియైనవాని తలయెక్కియున్నావుకావా అని అర్థము. విషధరులనఁగా సర్పములును, విషభోజిహరుఁడును గనుక సర్పములు పరివేష్టింపఁగా హరునిశిరస్సునం దున్నాఁ డని భావము. (ని. 'సర్పప్రోతకలాపశుక్తిశకలైర్వ్యాకీర్ణసచ్ఛేఖరమ్' అని చెప్పఁబడియున్నది.) పిన్ననాఁడె కనవో విఖ్యాతకౌటిల్యమున్ = బాల్యమందే ప్రసిద్ధమైన కుటిలభావమును బొందినావు కావా అని యర్థము. బాలచంద్రుఁడు వక్రాకారము గలవాఁడని భావము. కాఁబట్టి, నీకున్ = ఇట్టివాఁడవైననీకు, జీవ = ప్రాణులయందు, కృత = చేయఁబడిన, విద్వేషంబు = విరోధము, విషమంబెట్లగున్ = అనర్హమయినది యేలాగగుచున్నది. అనఁగా నర్హమగుచున్నదని అర్థము. జీవశబ్దము బృహస్పతియందును వర్తించుచున్నది గనుక బృహస్పతియందుఁ జేయఁబడిన విరోధము విషము గాలేదని భావము. (ని. 'జీవః ప్రాణిని గీష్పతౌ' అని విశ్వనిఘంటువు.)

నీవు దోషాకరుఁడవు. నీపుట్టువు, విషమునందు- తోఁబుట్టువు విషజన్మయగు కాలకూటము. త్రోవ విషవంతులేఁగునది. నిలుకడ విషధరధారియగు విషభోక్తపైని. నీకుఁ బుట్టుకతోఁ గుటిలము గల్లదు. కావున ప్రాణుల హింసించుటలో నీకు విషమభావము లేదు. అలం. శ్లేషమూలక కావ్యలింగము.

మ. కమలాభర్త భవద్విరోధిపయిఁ జక్రంబుం బ్రయోగింప ను
త్తమశస్త్రంబది యాత్మనామకభిదాదర్పాంధు నిన్నుం గొరం
గి మహారాహువుఁ దున్మియుం దునుమ కేగెం గాక చక్రంబుచేఁ
దుము రై పోవనివారలుం గలరె నీదోషంబు గాదె శశీ. 31

శశీ = ఓయిచంద్రుఁడా, కమలాభర్త = ఇది సాభిప్రాయపదము, లక్ష్మీనాథుఁడైనవిష్ణువు, నీవు లక్ష్మీసోదరుఁడవు గనుక, భవద్విరోధిపయిన్ = నీశత్రువైన రాహువుమీఁద, చక్రంబుం బ్రయోగింపన్ = సుదర్శనచక్రమును బ్రయోగింపఁగా, ఉత్తమశస్త్రంబది = శ్రేష్ఠమయిన, అనఁగా నప్రతిహతమయిన యాచక్రము, ఆత్మనామకభిదాదర్పాంధునిన్నుఁగొరంగి, ఆత్మనామక = చక్రమనెడు తన పేరు వహించిన చక్రవాకములయొక్క, భిదా = భేదనమందు, దర్పాంధున్ = గర్వాంధుఁడవైన, నిన్నుఁగొరంగి=నిన్ను మోసముచేసి, మహారాహువున్ = అధికుఁడయిన రాహువును, తున్మియుం. దునుమ కేఁగెంగాక = చంపినట్టులుగాఁ గనుపఱచి చంపకయె పోయెను గాక అనియర్థము. శిరశ్ఛేదనము చేసియును జీవితునిగాఁ జేసెనని భావము. లేనట్టయిన, చక్రంబుచేఁ దుమురై పోవనివారలుం గలరె = చక్రాయుధముచేతఁ బొడిపొడియై పోనివారునుగలరా? ఇంతయు నేమనిన, నీదోషంబుగాదె = నీవు చేసికొన్న పాపమే కదా.

అనఁగా నీయందలి బంధువాత్సల్యముచేత విష్ణుదేవుఁడు బ్రయోగించినప్పటికిని జక్రమమోఘసాధనమయినప్పటికిని జక్రహతిచేతఁ దలదెగినవాఁడైనప్పటికిని రాహువు బ్రతికియుండుట యతనిచేత నెప్పటికిని బాధపడవలయునట్టులుగా నీవు చేసికొన్న పాపకర్మమేగాని మఱియొకటి కాదని తాత్పర్యము. ఇక్కడ స్వపక్షాభిమానియైన విష్ణుదేవునిచేత నుండునది గనుకఁ జక్రమును స్వపక్షాభిమానము నిలిపినదని యాశయము. ఇక్కడ నుల్లాసాలంకారము. శ్లో. 'ఏకస్య గుణదోషాభ్యా ముల్లాసోఽన్యస్యతౌ యది' అని లక్షణము.

చ. సమధికకాలనేమిగుణశాలివి నీ వుదరస్థలోకసం
ఘములకుఁ గీడొనర్తు వని కైటభదానవభేది యంతరం
గము వెడలించెఁ గాని నిను గండడఁగింపక పోయె నిందిరా
రమణిఁ దలంచి రాత్రిచరరాగనిమగ్నుల కేడ ధర్మముల్. 32

రాత్రిచర = ఓరినిశాచరుఁడా, అనఁగా రాక్షసుఁడా యని యర్థము. చంద్రుఁడా యని భావము. సమధికకాలనేమిగుణశాలివి = కాలనేమియనెడు రాక్షసునియొక్క గుణములవంటి గుణములు గలవాఁడ వనియర్థము. కాలమునకు నేమిగుణశాలి యనిచెప్పుటచేతఁ గాలమునకుఁ జక్రసామ్యము గమ్యమగుచున్నది. నీవుదరస్థలోకసంఘములకుఁ గీడొనర్తువని = నీవు తనకుక్షిలోనున్న లోకసమూహములకుపద్రవముల జేయుదువని, కైటభదానవభేది = విష్ణుదేవుఁడు, అంతరంగము వెడలించెఁగాని = లోనుండి బయటికి వెడలఁద్రోచినవాఁడాయెనుగాని, ఇందిరారమణిఁ దలంచి = నీతోఁడఁబుట్టిన లక్ష్మీదేవిని విచారించి, నిను గండడఁగింపక పోయెన్ = నిన్నుఁ జంపకపోయె నని యర్థము. అంతరంగము వెడలించుటయనఁగాఁ జంద్రుఁడు విష్ణుదేవుని మనస్సువలనఁ బుట్టినాఁడనిభావము. రాగనిమగ్నుల కేడధర్మముల్ = స్త్రీకాముకత్వమునకు లోఁబడి మునిఁగియుండువారికి మర్యాద లెక్కడివి-అనఁగా వారికి మర్యాదయందలి విచారమే లేదనుట. విష్ణునియుదరమునందుఁ బదునాలుగులోకము లున్నవి. నీవు

కైటభరాక్షసునివలె లోకవిద్రోహియని విష్ణుఁడెఱింగియు లక్ష్మివంక నీకుఁగల చుట్టఱికము విచారించి సంహరింపక హృదయమునుండి వెడలఁగొట్టెను. లక్ష్మియందలి యనురాగముచే విష్ణుఁడు తనధర్మమగు దుష్టశిక్షణము వదలెను. కావునఁ రాగమగ్నులు ధర్మము నెన్నఁటికి నిర్వహింపఁజాలరనుటకు చంద్రా! నిన్ను విష్ణుఁ డూఱక వదలుటయే తార్కాణము. అలం. ఉత్ప్రేక్ష. అర్థాంతరన్యాసము.

ఉ. కొండొకసేపు నిన్ను మదిఁ • గూర్చినఁ మాధవునంతవానికిం
బండె వధూవధప్రబల•పాతక జాతకళంక మింక నీ
దుండఁగ మేమి చెప్పఁ దగుఁ • దోయజవైరి శిఖండవీథి నీ
ఖండము పూనుశంకరుఁ డ•ఖండజగన్మథనుండు గాఁడొకో. 33

తోయజవైరి = కమలవిరోధియైన యోచంద్రుఁడా, కొండొకసేపు = కించిత్కాలము, నిన్ను మదిఁగూర్చిన మాధవునంతవానికిన్=నిన్ను సాంతర్యమందుఁ జేర్చుకొన్న విష్ణువంతవాని కనియర్థము. మానసమువలనఁ బుట్టకముందు చంద్రుని విష్ణుదేవుఁడు మానసమందు నిల్పినాఁడని భావము. వధూవధ ప్రబలపాతక జాతకళంకము = నీయందున్న వధూవధ ప్రబలపాతకజాతకళంకము, పండెన్=ఫలించెను. అనఁగా సమకూడె ననియర్థము. ఇక్కడఁ జంద్రపక్షమందు విరహిణీవధవలని ప్రబలపాతక సమూహ రూపమయిన మాలిన్యమని చెప్పవలయును. కలంకత్వము నపహ్నవించి పాతకత్వారోపణము చేసి నాఁడు గనుక నపహ్నవాలంకారము. విష్ణుదేవుని పక్షమందు భృగుపత్నీవధ వలని ప్రబలపాతకసంజాత మైన యపవాదమని చెప్పవలయును. జాతమనఁగా సమూహంబును సంజాతమైనదియును, కళంక శబ్దమంకమందును నపవాదమందును వర్తించుచున్నది. (శ్లో. 'కళం కోంకా పవాదయోః' అని అ.) మాధవుఁడు భృగుపత్నీహననము చేసి భృగుశాపమువలన దశావతారము లెత్తుట దేవీభాగవతములోఁ జతుర్థస్కంధమందు ౧౦-౧౨ వ అధ్యాయములలోఁ జెప్పఁబడి యున్నది. ఇంక నీదుండఁగ మేమి చెప్పఁ దగున్ = ఇంకమీఁద నీయొక్క ధూర్తత్వ మేమని చెప్పవచ్చును. కాఁబట్టి, శిఖండవీథిన్ = లలాటోపరిప్రదేశమందు, (శ్లో. 'కాకపక్షః శిఖణ్డకః' అని అ.) నీఖండముపూను=నీయొక్క అర్ధాకృతిని మాత్రము ధరించిన, శంకరుండు = సుఖకరుఁడైన హరుఁడు. అఖండజగన్మథనుండుగాఁడొకో = నీవలె సమగ్రలోకసంహారకుఁడు గాకపోవునా-అవుచున్నాఁడనుట.

"సంసర్గజా దోషగుణా భవంతి" యను నార్యోక్తి ననుసరించి నీసావాసము కొన్నాళ్లు మాధవుఁడు గావించి వధూవధపాపము నార్జించెను. శివుఁడు తలపై నీయందలి భాగమునే ధరించెను. అతఁ డఖండజగన్మథనుఁ డైనాఁడు. కావునచంద్రా! నీదుండఁగ మింతయన వర్ణింపరానిది. స్వల్పకాలము మాధవుఁడు మదిగూర్చియుఁ, శంకరుఁడు ఖండము దాల్చియుఁ బాపకృత్యములకు లోనగుట నీదుండ గమువలననే. అలం. అతిశయోక్తి. పరికరము.

శా. ఈ వజ్జుండవు నీటఁ బుట్టితి సుమీ • యే నంచు మోమోటపుం
ద్రోవ ల్పెప్పఁగ సిగ్గు గాదె మఱి నీ•తోఁబుట్టు శ్రీదేవిలీ
లావాసంబు సిరుల్ హరింతు వసుచో • నయ్యో కళాదుండు చే
తోవీథిన్ సహజాధనాపహరణో•ద్యోగంబు సెగ్గించునే. 34

తోయజవైరి = చంద్రుఁడా-అని అధ్యాహారము. నీతోఁబుట్టు = నీతోఁడఁబుట్టినదైన, శ్రీదేవి = లక్ష్మీదేవియొక్క, లీలావాసంబు = క్రీడాగృహముయొక్క, సిరుల్హరింతువసుచో=సంపదల నపహరించు

చున్నావని చెప్పుచుండఁగా నని యర్థము. లక్ష్మీనివాసమైన పద్మముయొక్క శోభను హరించుచున్నాఁడని భావము. ఈవజ్జుండవు=నీవు నీటియందుఁ బుట్టినవాఁడవు, నీటఁ బుట్టితివి సుమా నేనుం దమక్=నేనును శుక్తిమతీజలమందుఁ బుట్టినానుసుమా అని, మో మోటుప్రంప్రాపల్నెప్పుడు సిగ్గుగాదె మఱి= చుట్టఱికము కలియఁ దెల్పుకొని నీవు మో మోటముచు బొందునట్టుగాఁ జెప్పు నాకు లజ్జగాదా యనకను, అనఁగా సాక్షాత్తుగాఁ దోడఁబుట్టిన లక్ష్మీదేవియొక్క యింటిసంపద హరించిన నీకు నీవును నేనును నీటియందుఁ బుట్టినవాండ్రముగదా నాయందుఁ బక్ష మవలంబింపుమని యంతలపొంతల చుట్టరికములు దెలుపుకొన్నందువలన దయపుట్టునా అనుట. ఇక్కడ ముఖసామ్యంబును జంద్రునకు స్ఫురించుచున్నది. అయ్యో=అయ్యయో యెక్కడనైనను, కళాదుండు = కంసాలవాఁడు, (ని. 'నాడిన్ధమ స్స్వర్ణకారః కళాదో రుక్మకారకే' అని అ.) చేతోపేథిక్=మనస్సునందు, సహజా = తోడఁ బుట్టినదాని యొక్క, ధనాపహారణోద్యోగంబునక్ = సొమ్ము దొంగిలించునట్టి యత్నమును, ఎన్నించునే = అయుక్తమని విచారించునా-అనఁగా విచారింపఁడనుట, లోకములోఁ గంసాలవాఁడు తోడఁబుట్టినది చేయుమని తన చేతి కిచ్చిన సొమ్ములోఁగూడ దొంగిలించునని ప్రతీతిగలదు గనుక దాని ననుసరించి చెప్పినాఁడు. కళాదుఁ డనఁగా దేవతలకుఁ గళాప్రదానము సేయుచంద్రుఁ డని భావము.

చంద్రా! నీవు నీట జనించినంతన మంచివాఁడవు కాఁజాలవు. తోఁబుట్టువగు లక్ష్మికి మందిరమైన కమలమునే నీవు ముకుళింపఁ జేయుచున్నాఁడవు. కాన నీగుణప్రశంస లజ్జాకరము. అలం-అర్థాపత్తి-అర్థాంతరన్యాసము.

తే. నీరజారాతి నినుఁ దన • నెలవు గూల
నేల సృజియించె విధి సృజి • యించుఁ గాక
యేల జైవాతృకునిఁ జేసె • నేల తప్పుఁ
బుడమిఁ "బాపీ చిరాయు" వ • న్నెడగునుడుగు. 35

నీరజారాతి=ఓ చంద్రుఁడా, విధి=బ్రహ్మదేవుఁడు, తన నెలవుగూలక్=తనయిల్లుధ్వంసముగాను, ఏల సృజియించెక్ = నిన్నేందుకుఁ బుట్టించె నని యర్థము. బ్రహ్మగృహము నీరజముగనుక నది ముడుచుకొని చెడిపోవునట్టులుగా నేల నిన్ను సృజించె నని భావము. నీరజారాతియనెడు సంబోధనము సాభిప్రాయము. సృజియించుఁగాక = పుట్టించిననేమాయెను, ఏలజైవాతృకునిఁ జేసెక్ = జైవాతృకశబ్దము దీర్ఘాయుష్మంతునియందును చంద్రునియందును వర్తించుచున్నది గనుక దీర్ఘాయుష్మంతుఁ డవునట్టులుగా నేల చేసె నని యర్థము. జైవాతృకనామము గలవానినిగాఁ జేసినాఁడని భావము. (శ్లో. జైవాతృకః కృశే చన్ద్రే) భేషజా యుష్మతో రపి' అని యర్థము.) అయిన, పుడమిక్=భూమియందు, పాపీచిరాయువ న్నెడగునుడుగు, శ్లో. 'పాపీచిరాయు స్సుకృతీగతాయుః' అనెడిమాట అనఁగాఁ బాపాత్ముఁడు దీర్ఘాయుష్యము గలవాఁ డగుచున్నాఁ డనెడుమాట, ఏలతప్పుక్ = ఎందుకుఁ దప్పును. నిన్ను సృజించుకతన బ్రహ్మయిల్లు కూలినది. పద్మములు ముకుళించుచున్నవనుట. అట్టి ద్రోహి నిన్ను దీర్ఘాయుష్మంతునిజేయుట బ్రహ్మలోప మన నోరు రాకున్నది. పాపాత్ముఁడు కలకాలము బ్రదుకును గదా ? అలం. శ్లేషము.

సీ. స్వామియై నిగమాతి • భూమియై సురపురో గామియై యబ్ధిజా • కామి యుండ
శూలియై హాలహాలా • హారియై భవనంశు ధారియై ప్రసవాయు • ధారి యుండ

ధాతయై కుశలసంధాతయై భువననిర్మాతయై వాగ్వధూనేత యుండ
మిత్రుఁడై పరమపవిత్రుఁడై విమలచారిత్రుఁడై నలినీకళత్రుఁ డుండఁ
తే. దొలు దొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళ యొసంగి
నంటు గావించు టెల్ల ననాథయువతి
జనతనూదాహసాహాయ్యమునకుఁ గాక
కానవా వారి నెవ్వారిఁ గమలవైరి. 36

కమలవైరి = చంద్రుఁడా, స్వామియైన = సకలమునకు నధినాథుఁడైన, నిగమ=వేదములకు, అతిభూమియై=ప్రతిపాదింప నలవిగానివాఁడై, సురపురోగామియై = దేవతలలో నగ్రేసరుఁడై, అబ్ధిజాకామియుండఁగ=లక్ష్మీకాముకుఁడగు విష్ణుదేవుఁడుండఁగాను. హారియై = సమస్తగుణములచేత నొప్పుచున్నవాఁడై, హాలహలాహారియై = జగదుపద్రవకరమగు కాలకూటము హరించినవాఁడై, భవవంశుధారియై=కేవలము నీయొక్క కళను ధరించియున్నవాఁడై, ప్రసవాయుధారియుండఁగ=మన్మథవిరోధియైన శివుఁడుండఁగాను, ధారయై=జగత్తులను ధరించినవాఁడై, కుశలసంధాతయై=క్షేమమును బొందించువాఁడై, భువననిర్మాతయై = లోకములను నిర్మించువాఁడై, వాగ్వధూనేతయుండఁగ = సరస్వతీనాథుఁడగు బ్రహ్మయుండఁగాను, మిత్రుఁడై = మిత్రత్వము గలవాఁడనియును, మిత్రనామము గలవాఁడనియును నర్థద్వయము చెప్పవలయును. పరమ = ఉత్కృష్ట మగునట్టులుగా, పవిత్రుఁడై=తాను స్వతస్సిద్ధముగాఁ బవిత్రుఁడై, యన్యులను బవిత్రులనుగాఁ జేయువాఁడై, విమలచారిత్రుఁడై = నిర్దుష్టమైన చరిత్రముగలవాఁడై, నలినీకళత్రుఁడుండఁగ=సూర్యుం డుండఁగాను,

తొలుదొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళ యొసంగి, శ్లో. 'ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పిబతే రవిః' అని యున్నది గనుక, ప్రప్రథమమునందు నగ్నిహోత్రునికిఁ గళాప్రదానముచేసి, నంటుగావించుటెల్లఁ = స్నేహముచేసికొనుట యంతయు, నంటు అనెడిపదము నకారాది, అనాథయువతిజనతనూదాహసాహాయ్యమునకుఁగాక = నాథులులేని స్త్రీలయొక్క దేహములను దహించుటయందలి సహాయత్వముకొఱకే, కాక=లేనట్టయిన, కానవావారి నెవ్వారిఁ=ఆవిష్ణువు మొదలయినవారి నెవ్వరిని గానవా-అనఁగా వారిలో నెవరి కయినను ముందుగాఁ గళాప్రదానము సేయరాదా యనుట.

ఇందులో హరిహర హిరణ్యగర్భ కమలాప్తులయొక్క విశేషణములు సత్పాత్రతాభిప్రాయములును గృష్ణవర్త్మకమనెడి యగ్నినామ మపాత్రతాభిప్రాయగర్భము నని తెలియవలయును. పూర్వోక్త పుణ్యమూర్తులు నలువురు లోకోపకారులు దాన యోగ్యులు. వారలయోగ్యతల నించుకేని గమనింపక యగ్నికిఁ గళ లొసంగి చెలిమి గావించుట సహవాసదోషముచే వేఁడియెక్కిన కిరణములచే విరహిణుల మేను కాల్చుటకె. విరహిణులకుఁ జంద్రకిరణములు వేఁడిగానుండుననుటకు-

శ్లో. 'చంద్రః చండకరాయతే మృదుగతి ర్వాతోఽపి వజ్రాయతే
మాల్యం సూచికులాయతే మలయజాలేపం స్ఫులింగాయతే
ఆలోక స్తిమిరాయతే విధివశాత్ ప్రాణోఽపి భారాయతే' (శృంగారతిలకము)

అలం. ఉత్ప్రేక్ష. పరికరము.

ఈపద్య మహకలిపడిసీస మని తెలియవలయును. సీసపద్యములు సమ సర్వతఃప్రాసాక్కలిప్రాస పడిసీసాదకలిపడిసీస విషమసీసంబు లని యేడు తెఱంగులం బరఁగు.

క. అని మఱియుఁ బెక్కుభంగుల, వనజారిని దూఱి నారి ♦ వనితాజనతా
ఘనతాపవజ్రఘనతా, భినుతాంబకధరుని మరునిఁ ♦ జేకొని కినుకన్. 37

అనిమఱియుఁన్ = ఈలాగనిపలికి మఱియును, పెక్కుభంగులన్ = అనేకవిధములచేత, వనజారినిదూఱి=చంద్రునిదూషించి, నారి=గిరికాదేవి, వనితాజనతా = విరహిణీస్త్రీసమూహముయొక్క, ఘనతాప = అధికమయిన తాపమనెడు, వజ్ర = అశనికి, ఘనతా = మేఘమువంటి దగుటచేత, అభినుత = మిక్కిలి కొనియాడఁబడిన, అంబకధరునిన్ = బాణముధరించిన, మరునిన్ = మన్మథుని, చేకొని= చేపట్టుకొని, కినుకన్ = అత్యంతమయిన కోపముచేత.

క. వలదాశుగశిఖికీలల, వల దాశుగతిన్ నిగుడ్ప ♦ వలరాయఁడ చె
ల్వలదాయవె కలదా కే,వలదారుణవృత్తి దయ లవంబును వలదా. 38

వలరాయఁడ = మన్మథుఁడా, వలన్=చుట్టఁబెట్టుచున్న, ఆశుగశిఖికీలలన్=బాణాగ్నిజ్వాలలను, ఆశుగతి న్నిగుడ్పవలదు = తీవ్రగతిచేతఁ బ్రయోగింపవద్దు. ఏమనిన, చెల్వలదాయవె = నీవేమయినను స్త్రీలకుఁ బగవాఁడవా, కలదా కేవలదారుణవృత్తి=కేవలము నింత దారుణవ్యాపార మెక్కడ నయినఁ గలదా, దయ లవంబునుగలదా = దయయన్నది కించిన్మాత్రమైన నుండ నక్కఱలేదా. (సూ. ఎదాతౌ ప్రశ్నే లక్షితౌ భవతః స.) అను సూత్రమువలన, చెల్వలదాయవె = కలదా, కలదా అను నేతత్పదత్రయాంత్యములయందును, ఎ.ఆ అను ప్రశ్నార్థద్యోతకము లగునచ్చు లుపబడుటచే నివి ప్రశ్నార్థకములని తెలియవలయును. ఈపద్యము ద్విప్రాసముగలదిగాఁ జెప్పఁబడియెను. మన్మథుఁడా! నీవు స్త్రీజనమునకు సహజవిరోధివి కావు. స్త్రీలు దయాభావముతోఁ జూడఁదగినవారు. కావున దయా లేశముతో వర్తింపుము.

ఉ. శంబరవైరి వీవు పటు♦శంబరపోషణశాలి యాతఁ డ
బ్జాంబకధారి వీవు మఘ♦తాబ్జుఁ డతండు నిశాటఘాటద
ర్పం బడఁగించుబల్లిదుని♦పట్టివి నీవు నిశాటుఁ డాతఁ డో
యంబుచరాంక నీకుఁ దగు♦నా హరిణాంకునితోటి కూటముల్. 39

ఈవు=నీవు, శంబరవైరివి=శంబరహరణశాలివి, ఆతఁడు=ఆచంద్రుఁడు, పటుశంబరపోషణశాలి= శంబరభరణశాలి యని యర్థము. నీవు శంబరాసుర హరుఁడ వనియు నతఁడు మృగధరుఁ డనియును భావము. (ని. 'శంబరం సలిలే పుంసి మృగ దైత్యవిశేషయోః' అని మేదిని.) అబ్జాంబకధారివీవు = నీవబ్జబాణధరుఁడవును, అతండు = ఆచంద్రుఁడు, మఘితాబ్జుఁడు = అబ్జవిరోధియు నని యర్థము. నిశాటఘాట దర్పం బడఁగించు బల్లిదుని పట్టివి నీవు = నీవు రాక్షససమూహ గర్వాపహారకుఁ డయిన విష్ణుదేవుని కుమారుఁడవును, అతఁడు=ఆచంద్రుఁడు, నిశాటుఁడు = రాక్షసుఁడును అని యర్థము. రాత్రియందు సంచరించువాఁ డని భావము. ఓయంబుచరాంక = జలచరాంకుఁడవయిన యోమన్మథుఁడా, హరిణాంకునితోటి కూటములు = హరిణమనఁగా నిఱ్ఱి, భూమియందు సంచరించునది గనుక భూచరాంకుడైన చంద్రునితో స్నేహములు, నీకుఁ దగునా = అనఁగా నీకు నర్హములుగాదనుట. ఇక్కడ హరిణశబ్దమునకు వలయని యర్థముచెప్పి వల జలచరణమునకు విరోధి గనుక జలచరాంకునకు హరిణాంకునితో స్నేహ మర్హముగాదని చెప్పుచున్నారు. ('హరిణో మృగవారణః' అని యాతరము వినఁబడుచున్నదిగాని యది యేనిఘంటువులోనిదో విచారింపవలసియున్నది.) మారుఁడా! సమానులకె

చెలిమిగుదురుట సాజము. విరుద్ధప్రకృతిగల చంద్రునితో నీకుఁ జెలిమి యెటుల సరిపడినది. నీవు శంబరాసురుని జంపితివి, అతఁడో శంబరపోషణుఁడు. నీకుఁ దమ్ములు ముల్కులు, అతఁడు తమ్ములదాయ. నీతండ్రి రాత్రించరులఁ జంపినజెట్టి, అతఁడు రాత్రించరుఁడు కాన చంద్రునిచెలిమి నీ కనుచితము. అలం. శ్లేషమూలక కావ్యలింగము.

ఉ. అద్దిర జీవయాత్రచరి। తార్థక నీయెడ గాలిపోయె న
స్మద్దయనీయవాక్యములు । శాంభవలోచనవహ్నిఁ గ్రాఁగి పె
న్నిద్దురఁ బూని మే నెఱుఁగ। నేరక యుండెడునీకు మ్రొక్కి వే
సుద్దులు చెప్పినన్ మనసు। సొచ్చునె బోధము పుట్ట నేర్చునే. 40

అద్దిర=ఔరా, జీవమాత్రచరితార్థక = ప్రాణధారణమాత్రముచేతఁ జరితార్థుఁడవయినవాఁడా-అనఁగాఁ బరోపకారశూన్యుఁడా యని యర్థము. దేహములేనివాఁడని భావము. అస్మత్ = నాసంబంధమయిన, దయనీయవాక్యములు = దయపుట్ట నాడినమాటలు-అనఁగా నా దీనవాక్యములు, నీయెడ గాలిపోయెన్ = నీయందు గాలికిఁ బోయెను-అనఁగావ్యర్థమాయెననుట. ఇక్కట గాలిపిశాచమువలెనుండు నీయందు గాలికిఁ బోవలయునని స్వారస్యము. శాంభవలోచనవహ్నిఁ గ్రాఁగి = శంభుదేవుని సంబంధమయిన నేత్రాగ్నిచేతఁ దపించి, పెన్నిద్దురబూని = గాఢనిద్రవహించి, మే నెఱుఁగనేరకయుండెడు = శరీరస్మృతిలేక యుండునట్టి యని యర్థము. దీర్ఘనిద్రను బొందినవాఁడనియు, ననంగుఁడనియును భావము. నీకు మ్రొక్కి=నీకుదండముపెట్టి, వేసుద్దులుచెప్పినన్ = వేయిమాటలు చెప్పినప్పటికిని, మనసుసొచ్చునె = మనస్సునందుఁ జొచ్చునా, బోధముపుట్టనేర్చునే = తెలివి పుట్టనేర్చునా-అనఁగా నీ కెందును లేవనుట. ఇక్కడ నిద్రపోవువానికాళ్ళకు మ్రొక్కినట్లన్నలోకోక్తి ననుసంధింపవలయును. నీవు గాఢనిద్రావస్థలోనుంటవలన మ్రొక్కినను బెక్కుసుద్దులు తెలిపినను నిష్ఫల మయ్యెను. కాననే బోధము జనింపదాయెను. మన్మథుఁడు శివలోచనాగ్నిచేఁ గ్రాఁగి మరణించి యతనుఁ డయ్యెను. దేహము లేని నీ కింతకంటె రానున్న యాపద యేమున్నదని నామనవి యాలకింపకున్నాఁడవని యర్థాంతరము.

అలం. అర్థాంతరన్యాసము.

మ. అణుమధ్యాతతిమీఁద నంతవిరసం। బౌచాపమున్ సీధుపా
రణమత్తాఁ గొని సోలునారి శిఖిమి। త్రంబైనతేరున్ వనాం
గణలుబ్ధానుగకోటిఁ బూని వెడలం। గా నిట్టిదే ధర్మ మే
గుణ మేయెక్కుడి వేబలంబు సుమనః। కోదండ నీకెంతయున్. 41

సుమనఃకోదండ = పుష్పమయమయిన ధనుస్సుగల మన్మథుఁడా, అంత విరసంబౌచాపమున్ = అంతటి విరోధియయినధనుస్సును, సీధుపారణ = సురాపానముచేత, మత్తాఁగొని = మత్తుగొని, సోలు = సోలిపడుచున్న, నారి = మౌర్వియును, మత్తాయనుపద మాకారాంతమైన దేశ్యపదము గనుక హ్రస్వము రాలేదు. ఇందు, (శ్లో. 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాన్న చ దేశ్యపదే' అని శబ్దానుశాసనసూత్రము.) శిఖిమిత్రంబైనతేరున్ = అగ్నికల్పమయిన రథంబును, పూని = వహించి, అణుమధ్యాతతిమీఁదన్ = స్త్రీజనసమూహముమీఁద, వెడలంగాన్ = బయలుదేరుటకు అని యర్థము. విల్లయిన చెఱకుతుంట యంతమందు రసములేని దవియును నారియయిన తుమ్మెదలు మకరందపానముచేత మత్తిల్లి సోలుచుండునవి యనియును రథమయినవాయువు వహ్ని మిత్ర మనియును ననుచరసమూహమయిన శుక

పికాది పక్షిగణము వననివాసలుబ్ధ మనియును భావము. లుబ్ధశబ్దము కిరాతునియందును గాంక్షగల వానియందును వర్తించుచున్నది. (ని. 'లుబ్ధో మృగయు కాంక్షిణోః' అని వి.) నీకెంతయుఁగన్ = నీకెట్లు విచారించినను, ఇట్టి దేధర్మము = అనఁగా నిదియేమి న్యాయమనియును నేమిప్రశస్తమయిన ధనుస్సనియును నర్థము. ఏగుణము=అనఁగా నేమిసద్గుణమనియును నేమిప్రశస్తమయిన నారియనియును నర్థము. ఏయెక్కుడు = అనఁగా నేమియతిశయమనియును నేమిప్రశస్తవాహన మనియును నర్థము. ఇదే బలంబు = అనఁగా నిది యేమిసామర్థ్యమనియును నేమిప్రశస్తమయిన సైన్యమనియును నర్థము. దీనం గ్రమాలంకారము చెప్పఁబడియెను. అలం. శ్లేషమూలకాతిశయోక్తి.

క. అనిదానాగ్రహముం బ్రియోక్తుల నమస్థాధిక్యముం బాంథమ
ర్దన నీకుఁగా మధుమత్తభావమునఁ గాదా కల్గెఁ గాకున్న నీ
యనిలాంకూరము నెక్కి యాడుదువొ వన్యానీడజశ్రేణిచేఁ
బనిపాటల్ గొనఁ జూతువో మఱతువో ప్రఖ్యాతకాయక్రియల్. 42

పాంథమర్దన = విరహిజనమర్దనుఁడా యనియర్థము. త్రోవరులఁ గొట్టెడువాఁడా యని యర్థాంతరము-అర్థద్వయమునకు నభేదాధ్యవసాయము, నీకుఁగా = నీకును, అనిదానాగ్రహముఁగా-అనిదాన= కారణములేని, ఆగ్రహముఁగా = నిగ్రహమును, ప్రియోక్తుల నమస్థాధిక్యముఁగా = ప్రియమయినవాక్యములచేతఁ గోపాధిక్యమును-అనఁగా మంచిమాటలాడినం గోప మతిశయించుటయును, మధుమత్తభావమునఁ గాదా కల్గెఁగా =సురాపానమత్తతవలననేకాదా కలిగెను అని యర్థము. మన్మథుఁడు మధుమాసమందు విజృంభించుచున్నాఁడని భావము. కాకున్న = అలాగుఁగాకపోయిన, నీయనిలాంకూరము నెక్కియాడుదువొ = నీవు లేతవాయువుమీఁద నెక్కి క్రీడింతువా, వన్యానీడజశ్రేణిచేఁ బనిపాటల్గొనఁజూతువో = వనసమూహమందుండైన పక్షిశ్రేణిచేతఁ బనిపాటలు చేయింపఁ జూతువా, మఱతువో ప్రఖ్యాతకాయక్రియల్ = ప్రసిద్ధములైన శరీరచేష్టలు మఱచిపోదువాయని యర్థము.

అనిలారూఢత్వమును బక్షినియామకత్వమును జేష్టారహితత్వమును సురపానమువలనఁ బుట్టెడు గుణము లనియును మన్మథస్వభావగుణము లనియును దెలియవలయును. మద్యపానము గావించి మత్తు గొనియున్నవాఁడు మంచిని చెడుగాఁ దలంచుట, గాలికి సోలుట, జంతువులు పక్షులు మొదలగువానికిఁ బనిపాటలు చెప్పుట శరీరధర్మములు మఱచుట సహజము. మన్మథుని విజృంభణము మధుమత్తుని యున్మాదచేష్టాదికముగా నిందుఁ జెప్పఁబడెను. అలం. శ్లేషము.

సీ. మునుప లేఁడాయెనే మోహకగ్రాహసంగ్రస్తసామజపరిత్రాణమునకు
మనుప లేఁడాయెనే మనుజాశనునిఁ జీరి యనఘనిష్ఠాయుక్తు నాత్మభక్తుఁ
బెనుప లేఁడాయెనే పృథ్విసుపర్వకుమారునిర్గతజీవమారుతముల
నునుప లేఁడాయెనే యుగ్రఘాలాగ్నిఁ దూలినలోక మెల్లఁ బ్రోల్లింటిపగిది

తే. శౌరి యఘటితఘటనావిహారహారి
యేమి గావింపఁగా నేరఁ డామహాత్ముఁ
డసదృశచరిత్రు నినుఁ బుత్త్రుఁ డనక కినుక
గిరిశఫాలాగ్నిఁ బడ నుపేక్షించెఁ గాక. 43

మోహక = వంచనకారియైన, గ్రాహ = మొసలిచేత, సంగ్రస్త = లెస్సగా గ్రహింపఁబడిన,

సామజజగజేంద్రునియొక్క, పరిత్రాణమునకుఁ = సంరక్షణమునకు, మునుపలేఁడాయెనే = ముందుగాఁ దానుసమర్థుఁడు గాకపోయెనా, మనుజాశనుఁజీరి = నరభోజనుఁడైన హిరణ్యకశిపునిఁబట్టి బ్రద్దలుగాఁ జీల్చి, అనఘుఁ=నిష్కల్మషమయిన, నిష్ఠా=భక్తిప్రపత్తినిష్ఠతోడ, యుక్తుఁ=కూడుకొన్న, ఆత్మభక్తుఁ= తనభక్తుఁడైన ప్రహ్లాదుని, మునుపలేఁడాయెనే= బ్రతికింపఁ జాలకపోయెనా,

పృథ్వీసుపర్వకుమారు=బ్రాహ్మణకుమారునియొక్క, నిర్గతజీవమారుతములఁ=లేచిపోయిన ప్రాణవాయువులను, మునుపలేఁడాయెనే = తిరిగి మరల వేయఁ జాలకపోయెనా-అనఁగా మృతినొందిన బ్రాహ్మణకుమారుని మరల జీవంతునిగాఁ జేయఁజాలకపోయెనా, ఉగ్రఫాలాగ్నిఁదూలినలోకమెల్లఁ = రుద్రునియొక్క ఫాలనేత్రానలముచేత సరిగాఁ బ్రళయాగ్నిచేత నశించిపోయిన లోకమునంతయును, తొల్లింటిపగిదిఁ=పూర్వప్రకారముగా, ఉనుపలేఁడాయెనే=ఉండునట్టులు చేయఁజాలకపోయెనా,

అఘటితఘటనా = పొందింపఁబడని కార్యముయొక్క, ఘటనావిహార = పొందించునట్టి సామర్థ్యముచేత, హరి = ఒప్పుచున్న, శౌరి = విష్ణుమూర్తి, ఏమిగావింపఁగానేరఁడు = ఏమి చేయఁజాలఁడు గనుక, ఆవిష్ణుమూర్తి, అసదృశచరిత్రుఁ = లోకవిరుద్ధాచరణ శీలుఁడవయిన, నిన్ను = నిన్ను, పుత్త్రుఁడనక= కుమారుఁడని విచారింపక, కినుకఁ=కోపముచేత, గిరిశఫాలాగ్నిఁబడఁ=రుద్రుని ఫాలనేత్రాగ్నియందుఁ బడఁగా, ఉపేక్షించెఁగాక = దానిచేత నూరకుండెను గాక-లేనిపక్షమునఁ నిన్ను బాగుపఱుపలేక పోయినాఁడా యని తాత్పర్యము. ఈ సీసపద్యముయొక్క ప్రథమచరణమందు గజేంద్రమోక్షవృత్తాంతమును రెండవచరణమందు ప్రహ్లాదచరిత్రమును మూఁడవచరణమందును శ్రీరామస్వామిచేతఁగాని శ్రీకృష్ణస్వామిచేతఁగాని ప్రాణదానము సేయఁబడిన బ్రాహ్మణకుమారుని కథయును నాలుగవ చరణమునందు శ్రీమహావిష్ణుమూర్తికిఁగల సర్వలోక సంరక్షణశక్తియును సూచింపఁబడినవి. ఈపద్య మక్కలిప్రాససీసము. అలం. ఉత్ప్రేక్ష.

తే. అనుచు ననవింటిపెనుదంట ♦ నాడ రాని
గొంటసము లాడి మఱియు నమ్మంటమారిఁ
గలయ నెక్కించుకొని వచ్చు ♦ మలయనగభు
జంగవిషదిగ్ధపవనుపైఁ ♦ జలము వొడమ. 41

అనుచుఁ = ఈలాగనిపలుకుచు, ననవింటిపెనుదంటఁ = పుష్పచాపము గలధూర్తశ్రేష్ఠుని-అనఁగా మన్మథుని, ఆడరానిగొంటసములాడి = ఆడఁదగని కంటకపుమాటలాడి, మఱియు నమ్మంటమారిఁ = మఱియును గోపశీలుఁడైన యామన్మథుని, కలయనెక్కించుకొనివచ్చు = కదియునట్టులుగాఁ దనపై నెక్కించుకొని వచ్చుచున్న, మలయనగ = మలయాచలమందలి, భుజంగ = సర్పములయొక్క, విష = విషముచేత, దిగ్ధ = పూయఁబడిన, పవనుపైఁ = వాయువుమీఁద-అనఁగా మలయమారుతముమీఁద, చలము వొడమఁ = చల ముదయింపఁగా, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

మన్మథుఁడు తాపకారిగావున మంటలమారి. అతని గొనివచ్చువాఁడు దోషిగావున మలయమారుతముపైఁగూడ గిరిజాదేవికిఁ గినుక పొడమెను. పాము విషపుమైపూఁత గలవాఁడుగావున మలయమారుతుండు చలమునకుఁ దగినవాఁడె. అలం. కావ్యలింగము.

ఆ. విరియఁ గువలయంబు • విధిపదంబు చలించు, నెసఁగు భువనభంగ • మీవు వోలయ
మలయవలదుపవన • జలదవేణికలపై, మలయవలదుపవన • వలయభవన. 45

మలయ = మలయాచలమును, వలత్ = పరివేష్టించుచున్న, ఉపవన = ఉద్యానవనములయొక్క, వలయ = ఆవరణమే, భవన = ఆలయముగాఁ గలిగిన, పవన = పవనుఁడా — అనఁగా మలయమారుతమా యనుట. ఈవు వోలయన్ = నీవు వ్యాపించినమాత్రముచేత, విరియఁగువలయంబు = భూవలయము విరిసి పోవునని యర్థము. కలువ వికసించుచున్నదని భావము. (ని. 'కువాలయం కువలయం కువాలం కువలం కువమ్' అని ద్విరూపకోశము.) విధిపదంబుచలించున్ = బ్రహ్మస్థానమైయుండు సత్యలోకము కంపించునని యర్థము. కమలము చలించుచున్నదని భావము. ఎసఁగు భువనభంగము = భువనమనఁగా లోకమును జలమును, భంగమనఁగాఁ బ్రళయమును తరంగమును గనుక లోకప్రళయము సంభవించునని యర్థము. జలతరంగము లతిశయించునని భావము. కాఁబట్టి, జలదవేణికలపైన్ = మేఘసదృశములైన జడలుగల స్త్రీలమీఁద, మలయవలదు = విసరవద్దు. ఇక్కడ జలదవేణికలు గనుక నీకు నాగాంగనాల రని యాశయము.

మారుతమా! నీధాటికి భూవలయమె యవిసిపోవును. సత్యలోకము వణఁకును. ప్రపంచమునకుఁ బ్రళయము కలుగును. ఇట్టిచో సుకుమారాంగులగు చెలువ లోర్వఁగలరా? కాన వారిపైఁ జేగకు మని భావము. గాలివీచఁ గలువలు విరియుటయుఁ బద్మములు కదలుటయు నీటినుండి యలలు లేచుటయు మేఘములు విచ్చిపోవుటయుఁ బ్రసిద్ధము. అలం. శ్లేషమూలకకావ్యలింగము.

ఉ. కీలియు నీవుఁ గూడి యుడి•కింతురు లోక మటంచు నెప్పుడున్
మూలల వైచె మిమ్ము నలు•మోముల వేల్పటు వైచినం జనం
జాలక హవ్యవాహుని•సంగతి నుండి జగంబు గాలుపం
గాలుపదంబు చేరితి ప్ర•కంపన నీ వనుకంప చాలమిన్. 46

ప్రకంపన = లోకములను మిక్కిలి కంపింపఁజేసెడు పవనుఁడా యని సంబోధనము, ఈపదము సాభిప్రాయపదము. కీలియు నీవుఁగూడి = అగ్నిహోత్రుఁడును నీవును గలిసికొని, ఉడికింతురు లోకమటంచున్ = లోకము నుడుకునట్లు చేయుదురని విచారించి, నలుమోములవేల్పు = చతుర్ముఖబ్రహ్మ, ఎప్పుడు మూలలవైచె మిమ్మున్ = ఎల్లప్పుడును మిమ్ము నామూల నొకరిని నీమూల నొకరిని బడవైచె నని యర్థము. వాయవ్యాగ్నేయ కోణములయం దుంచినాఁడని భావము. అటువైచినన్ = ఆలాగున నుంచినప్పటికిని, చనంజాలక = ఒకరినొకరు విడఁబాసిపోలేక, నీవు హవ్యవాహుని సంగతినుండి = నీవు నగ్నిహోత్రుని యండనుండి, జగంబు గాలుపన్ = జగత్తును దహించెడుకొఱకు, గాలుపదంబుచేరితి = యమునియొక్క స్థానమును జేరితివి. ఎందువలనననిన, అనుకంపచాలమిన్ = దయాగుణము లేకపోవుట వలన నని వెనుక కన్వయము. వాయు వగ్నిసఖుఁ డనియును దక్షిణదిశాసంభవమును బొందుచున్నాఁ డనియును భావము.

అగ్నికి గాలి తోడైన ప్రపంచము నిలువదని బ్రహ్మ మీయిరువురను జేరి యొకమూలను బడవైచెను. అటులుండియుఁ నగ్నిపొత్తు వదలక దయాశూన్యుఁడవై ప్రాణిలోకవధకు యమునిస్థానముఁ జేరితివి. ఇవి దయాశూన్యుని చేష్టలు. (అగ్నికి వాయువు తోడైనఁ బ్రపంచవిప్లవమగునని బ్రహ్మ అష్టదిక్కులలో రెంటిని బ్రత్యేకస్థలములలోఁ జేర్చెనఁట. మలయమారుతము యమునిదిశ నుద్భవిం

చును గావున లోకసంహారమునకుఁ బ్రక్కటిన్న యగ్ని చెల్మిచేసి చెలరేఁగెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

క. గోలలనావల్లభుఁ డిదె, గోలలనలయసువు లేసుకొంచు వసి వసీ
బాలానిల నిను మెసవం, గాలాహికి నేండ్లు వేయు గావించె వెసన్. 47

గోలలనావల్లభుఁడు = వాగ్వనితాప్రియుఁడైన బ్రహ్మదేవుఁడు, గోశబ్దము వాక్కునందును వర్తించును. (శ్లో. 'స్వర్గేషు పశు వాగ్వజ్ర దిఙ్నేత్రఘృణి భూజలే, లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి గౌః' అని అ.) ఇదిగో లలనలయసువు లేసుకొనువని=ఇదిగో యీప్రకారముగా స్త్రీలయొక్క ప్రాణములను బుచ్చుకొనుచున్నాఁ డని, వసిబాలానిల = వసనంబంధమైన బాలసమీరణుఁడా - అనఁగా మలయమారుతమా యనుట. నిను మెసవఁగన్ = నిన్నుఁ దినుటకై, కాలాహికిన్ = కాలసర్పమునకు, ఏండ్లు వేయు గావించె వెసన్ = యుక్తమగునట్లుగా, నాయుర్వత్సరములు వేయి యగునట్లుగాఁ జేసెను.

అనఁగా సహస్రసంవత్సరములు సర్పభక్షితుఁడవై నప్పటికిని నశింపక యున్నావు గనుక నీ బ్రతుకు మిక్కిలి మొండిబ్రతుకుగదా యని భావము. శ్లో. 'గృధ్రోలూకశుకధ్వాంక్ష సర్పాణాం తు సహస్రకమ్' అని యున్నది గనుక సర్పములకు వర్ష సహస్ర జీవనము ప్రసిద్ధము. అలం. ఉత్ప్రేక్ష.

మ. అమితోల్లాసిపలాశివృత్తి నయి బాల్యావస్థ నొల్లాడి తా
సుమనస్సంపద నింక నీవతనువిస్ఫూర్తిన్ విజృంభింప లో
కము ధూళిం జనదే ప్రభంజన రమాకాంతుం డనంతావతా
రమహాయత్నము పూని కాని నినుఁ దీర్పం జాలఁ డల్పంబునన్. 48

ప్రభంజన = ఓయుపవనుఁడా యని సంబోధనము. మిక్కిలి భంజించువాఁడు గనుక ప్రభంజనుఁడని సాభిప్రాయము. అమిత = మితము లేకుండునట్లుగా, ఉల్లాసి = వికాసమును బొందిన, పలాశివృత్తివయి=రాక్షసకృత్యము గలవాఁడవై, బాల్యావస్థన్ = పిన్నవాఁడే, కొల్లాడి తా సుమనస్సంపదన్=దేవతలయొక్క సంపదను జూఱగొంటివి యవునుభళా అని గూఢార్థము. పలాశిశబ్దము రాక్షసుని యందును వృక్షమందును వర్తించును. (శ్లో. 'పలాశి వృక్ష రక్షసోః' అని వి.) సుమనశ్శబ్దము దేవతల యందుఁ బుష్పములయందును వర్తించును. (శ్లో. 'సుమనాః పుష్పమాలత్యో స్త్రిదశే కోవిదేపి చ' అని వి.) బాలసమీరము వృక్షములయందలి వర్తనము గలదై పుష్పములను రాల్చునని భావము. ఇంక నీవతనువిస్ఫూర్తి న్విజృంభింపన్ = ఇంకమీఁద నీవధికస్ఫురణముచేత ననఁగాఁ బ్రౌఢత్వముచేత విజృంభించినపక్షమందు, లోకముధూళింజనదే = లోకమంతయును నెగిరిపోదాయని యర్థము. అతనుఁ డనఁగా మన్మథుఁడును గనుక మన్మథవిస్ఫూర్తిచేత నీవు విజృంభించినపక్షమందు లోకమంతయును వ్యాకుల మవునని భావము. పెద్దగాలి విసరి దుమ్ము గప్పుచున్నదనియును దేహవిస్ఫూర్తియొక్క యభావముచేత విజృంభించుచున్నదనియుఁను వాయుస్వభావపరముగాఁ జెప్పవలయును. రమాకాంతుండు = విష్ణుదేవుఁడు, అనంతావతారమహాయత్నముపూనికాని = అసంఖ్యములయిన యవతారములయొక్క యధిక ప్రయత్నమును వహించినమీఁదటఁ గాని, అల్పంబునన్ = కొంచెమున, నినుఁదీర్పంజాలఁడు = నిన్ను సంహరింపలేఁడాయె నని యర్థము. ఆదిశేషావతారముఁ దాల్చియుఁ నిన్ను మర్దింపలేఁడాయె నని భావము. (శ్లో. 'శేషోనన్తః' అని అ.) కథావార్థంబును నన్వయించుచున్నది. శేషుఁడు సహస్ర

ముఖుఁ డని సాభిప్రాయము. చిన్నతనమున నీవు రాక్షసప్రవృత్తితో దేవతలసంపద కొల్లలాడితివి. పెద్దవాఁడవైన లోకముల దుమ్ముచేయుదువని విష్ణుఁడు పెద్ద మహాప్రయత్నము చేసియు సంహరింపఁ జేయలేకపోయెను. రాక్షసులు వేల్పుల బాధింప విష్ణుఁడు వారించుట పురాణప్రసిద్ధము. వాయువు చెలరేఁగుటచేఁ బూవులతావులు వ్యాపక మగుచున్నదనియు నొకను బాగా నాఁటి వివాహవేళ పుష్పరజము దిగంతవ్యాప్త మగుననియు భావము.

క. చలదలఘుచటులకీలా, హాలహాలమున నఖిలభువన • హరణక్రీడా
హాలవాలిక వెలయుబలియునిఁ, గలయం బవమాన నీవ • కాంచితివి గదా. 49

పవమాన = ఓయిసమీరుఁడా, చలత్ = చంచలములగుచున్న, అలఘు = మహత్తరములగు, చటుల = తీక్ష్ణములైన, కీలా = జ్వాలికలచేతను, హాలహాలమునన్ = కాలకూటముచేత, అఖిలభువన హరణక్రీడాహాలవాలికన్ = సమస్తలోకములయొక్క సంహారక్రీడయందలి తొట్రుపాటుచేత, వెలయు = ప్రకాశించుచున్న, బలియునిన్ = అనఁగా ప్రళయాగ్నిని, కలయన్ = కూడుకొనునట్లులుగా, లేక సంతతముగలయునట్టుగా, నీవకాంచితివిగదా = నీవేకంటివిగదా యని యర్థము.

వాయువువలన నగ్నిపుట్టెనని శ్రుతియున్నది గనుక నగ్నిని వాయుకుమారునిఁగాఁ జెప్పినాఁడు. అనఁగా నట్టిప్రళయాగ్నికి జనకుండవైనావు గనుక నతనికంటెఁ గ్రూరుఁడవని తాత్పర్యము. హాలహాల మనుటకు-('హాలాహలో హాలహలో హాలాహల ఇతిశ్రుతః' అని కోశము.) క్రూరునకు జనకుఁడవగు నీవు మిగులఁ గ్రూరుఁడవని భావము.

చ. నిబిడతమోనుబంధమహ • నీయమహామహిజాతమైత్రి మైఁ
బ్రబలుశనైశ్చరుండ వతి • పాంసుల నీ విఁక భీకరాకృతిం
గబళము గొందు గాక త్రిజ • గంబు వడంక బెడంక నిత్తువే
యబలలజీవనానిలము • లన్నియు నాఝషకేతుసంగతిన్. 50

అతిపాంసుల=అతిపాపాత్ముఁడా యని సంబోధనము. పరాగకలితు డని భావము. నీవు = శనివు, నిబిడ = ఎడతెగని, తమః = రాహువుయొక్క, అనుబంధ = సాంగత్యముచేత, మహనీయ = ఒప్పుచున్న, మహాత్ = అధికుఁడైన, మహిజాత = భూపుత్రుఁడైన యంగారకునియొక్క, మైత్రి మైన్ = సఖ్యముచేత, ప్రబలు=అతిశయించుచున్న, శనైశ్చరుండవు=శనిగ్రహమవు అని యర్థము. నిబిడతమోనుబంధ = సాంద్రమయిన యంధకారసాంగత్యముచేత, మహనీయ = మహనీయములైన, మహామహిజాత మైత్రి మైన్=గొప్పవృక్షములయొక్క సంబంధముచేత, ప్రబలుశనైశ్చరుండవు = ప్రబలుచున్న మందగామివని భావము. ఇఁకన్ = ఇంకమీఁద, భీకరాకృతిన్ = భయంకరమయినరూపముచేత, ఆఝషకేతుసంగతిన్ = మీనమందున్న కేతుగ్రహ సాంగత్యమువలన నని యర్థము. ఝషకేతుఁ డనఁగా మీనకేతనుఁడైన మన్మథుఁడు గనుక మన్మథసాంగత్యమువలన నని భావము. త్రిజగంబువడంకన్ = మూఁడులోకములును సంచలనమును బొందునట్లులుగా, అబలలజీవనానిలములన్నియున్ = స్త్రీలయొక్క ప్రాణవాయువులనన్నిటిని, కబళముగొందుగాక = మ్రింగుదువేకాక, బెడంకనిత్తువే = బెణికిపోనిత్తువా. అనఁగా దొలఁగిపోనిత్తువా యనుట. (శ్లో. 'క్రూరా భానుతమశ్శని ధ్వజకుజాః') అని కాలామృతమున నున్నది గనుక నిక్కడఁ బాపగ్రహకూటము గలుగునట్లులుగాఁ జెప్పినాఁడు.

క. అని వనిత నాళిగాలిం, గనలుచుఁ బోనాడి తుహినకరకిరణఝరిన్
మునుఁగఁ జనఁ జెలులు గని హా, యని వనరుచు నడ్డగింప నతిశోకమునన్. 51

అని = ఈలాగని, వనిత = గిరికాదేవి, నాళిగాలిన్ = కుటిలకారియైన మందమారుతమును, కనలుచుఁ బోనాడి = కోపగించుచు నిందించి, తుహినకరకిరణఝరిన్ = చంద్రకిరణ ప్రవాహమందు, మునుఁగఁ జనన్ = మునుఁగవలయునని పోఁగా, చెలులు గని = చెలికత్తియలు చూచి, హా యని వనరుచున్ = అయ్యోయని విచారపడుచు, అడ్డగింపన్ = నివారింపఁగా, అతిశోకమునన్ = అత్యంతదుఃఖముచేత, ముందరిపద్యముతో నన్వయము.

గిరికకు మలయపవమానము, మారుఁడు చంద్రుఁడు తాపకరులగుటచే నోర్వఁజాలక ప్రాణత్యాగమునకు సిద్ధపడెను. జలమందు దుమికి మరణింప నెంచెను. జలమేది. చంద్రకిరణములను నెలయేట మునుఁగ యత్నించెను. విచారహేతువు గానఁ జెలికత్తెలు పరితపింపఁ దొడంగిరి.

శా. ఆజాబిల్లి వెలుంగువెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁ బటాగ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్. 52

ఆజాబిల్లివెలుంగువెల్లికల డాయన్ లేక = ఆచంద్రునియొక్క కాంతిపూరములను డాపలించి పోఁజాలక, రాకానిశారాజశ్రీసఖమైన-రాకా = పున్నమనాఁటి, నిశారాజ = చంద్రునియొక్క, శ్రీ = శోభకు, సఖమైన = మిత్రమయిన-అనఁగా రాకాచంద్రసదృశమయిన, మోమునన్ = ముఖమందు, పటాగ్రంబొత్తి = పైటకొంగుచేర్చి, ఎల్గెత్తి = గొప్పగొంతు చేసికొని, ఆరాజీవాననయేడ్చెన్ = ఆగిరికాదేవి రోదనము చేసెను. ఏలాగనిన, కిన్నరవధూ = కిన్నరస్త్రీలయొక్క, రాజత్ = ప్రకాశించుచున్న, కరాంభోజ = హస్తకమలములయందలి, కాంభోజీమేళ = కాంబోదిరాగమేళముతోఁ గూడిన, విపంచికారవ-వీణాస్వనమనెడు, సుధాపూరంబు = అమృతప్రవాహము, తోరంబుగాన్ = విస్తరించునట్టులుగా-అనఁగాఁ గిన్నరస్త్రీకరకలితకాంభోజీరాగమేళవీణారవతులిత మగునట్టులుగా రోదనము చేసెనని సంబంధము.

కాంభోజీరాగము దీనస్వరమగుట ప్రకటముగదా. ఇక్కడఁ గరుణాత్మక వియోగశృంగారమును జెప్పినాఁడు. ఇందుకు నరసరాజీయమున-

క. 'వనిత పరోక్షంబునఁ బతి, యును బ్రియుని పరోక్షమునఁ బయోజాక్షియు రో
దన మొనరించుట వర్ణించినఁ గరుణాత్మకవియోగశృంగారమగున్.' అని లక్షణము.

విరహాతిశయముచే వెన్నెలవెల్లులు నాయికకు మిగుల వేఁడిగా నుండెను. కాన సమీపింపఁజాలకపోయెను. కాన నెలుగెత్తి యేడ్చెను. ఎలుగెత్తుటవలన విచారాతిశయము సూచితము. కాంభోజి రాగము దీనస్వరము గావున గిరికావిలాపము వినువారికి మిగులఁ జాలి కలిగించుచుండెనని భావము.

ఉ. అప్పుడు ముద్దరాలిఁ జెలు లక్కునఁ జేర్చి ముఖాబ్జ మెత్తి కన్
ఱెప్పలబాష్పము ల్దుడిచి తేపె నృపాలుఁడు గారవింప నీ
వొప్పుల కుప్పవై సిరుల నొందెద వేటికిఁ గుందె దమ్మ మా
యప్పవు గా మదిం దలఁప కమ్మ నినూతనసాహసంబులన్. 53

అప్పుడు = అపుడు, ముద్దరాలిన్ = ముగ్ధయైన గిరికాదేవిని, చెలులు = చెలికత్తెలు, అక్కునఁ జేర్చి = కౌఁగిలించుకొని, ముఖాబ్జమెత్తి = వంచుకొన్న ముఖమును మీఁదికెత్తి, కన్ఱెప్పల బొప్పుముల్దుడిచి = కనుఱెప్పలయందు నిండిన కన్నీళ్లు దుడిచి, ఱేపెన్వృపాలుఁడు గారవింపన్ = నేఁడు లేదు ఱేపటిదినమే వసురాజు మన్నింపఁగా, నీవొప్పులకుప్పవై = నీవ యొప్పుల కన్నిటిని గుప్పవై- అనఁగా సకలశుభములకు నాస్పదురాలవై, సిరులనొందెదవు = సంపదలను బొందుచున్నావు. కాఁబట్టి, ఏటికిఁ గుందెదమ్మ=ఎందుకు విచారపడుచున్నావమ్మా, మాయప్పవుగా=మా నాయనవుగా-ఇది యత్యంత ప్రేమచేతఁ బలికెడు వాక్యము. వినూతన సాహసంబులన్ = క్రొత్తక్రొత్త తెగువలను - అనఁగా మరణోద్యోగముల ననుట. మదిం దలఁపకమ్మ = మనస్సునఁ దలఁచుకొనఁ బోకమ్మా.

చ. అని మన సూఱ నూఱడిల • నాడి యయో మనమంజువాణియుం
జని తడ వయ్యె నేమిటికి • జాగొనరించెనొకో నగేంద్రనం
దనమదిఁ గొందలం బెఱుఁగ•దా తగదా పగడాయవెన్నెలన్
మునిఁగెడుబాల నెత్తి నయ•మున్ బ్రియమున్ దయ మున్నుగాఁ గనన్. 54

అని= ఈలాగని, మనసూఱన్ = మానసము కాంక్షఁ జెందునట్లుగాను, నూఱడిలన్ = నూఱటఁ బొందునట్లులుగాను, ఆడి = పలికినవారై, మనమంజువాణియును జని తడవయ్యెన్ = మనమంజువాణియును వసురాజుసన్నిధానమునకుఁ బోయి చాలసేపాయెను. ఏమిటికి జాగొనరించెనొకో = ఎందునిమిత్తమాలస్యము చేసెనో, నగేంద్రనందన మది కొందలం బెఱుఁగదా = గిరికాదేవి మనస్సున నుండెడు విచారము తాను గుర్తెఱుఁగదా, పగదాయవెన్నెల మ్మునిఁగెడు బాల నెత్తి = ఇప్పుడు పగదాయయైన-అనఁగా శత్రువయిన వెన్నెలయందు మునుఁగుచున్న గిరికాదేవిని లేవనెత్తి, నయమున్ = మన్ననయును, ప్రియమున్ = హితవును, దయమున్నుగాఁగనన్ = దయాపురస్సరముగాఁ జూచుటకు, తగదా = అర్హురాలు కాదా యని అర్థము. ముందరిపద్యముతో నన్వయము.

శా. ఎట్లో కాకని యన్ను లన్నిదెసల • న్వీక్షింప నప్పట్టునం
బుట్టుంగెంపున నింపు మీఱురవి పెం•పుం బెంపి దట్టంపుఁ గెం
బట్టుంబుట్టమురంగు నింగిరమ కా•పాదించు దివ్యప్రభా
ఘట్టం బొక్కటి పుట్టెఁ గట్టెదుర సం•ధ్యాలక్ష్మికిం జుట్టమై. 55

ఎట్లోకాకని = మంజువాణి రాదాయెనేమో కాని యని, అన్నులు = స్త్రీలు-అనఁగా గిరికాసఖులు, అన్నిదెసల న్వీక్షింపన్ = సమస్తదిక్కులను జూచుచుండఁగా అప్పట్టునన్ = ఆసమయమందు, పుట్టుంగెంపుననింపుమీఱు = ఉదయరక్తిమచేత మనోహరుఁడగుచున్న, రవి = సూర్యునియొక్క, పెంపున్ = అతిశయత్వమును, పెంపి = పోఁగొట్టి-అనఁగా నిరసించి, దట్టంపు కెంబట్టుం బుట్టమురంగు = దట్టమయిన యెఱ్ఱపట్టుచీరయొక్క శృంగారమును, నింగిరమకాపాదించు = ఆకాశలక్ష్మికి ఘటింపఁ జేయుచున్న, దివ్యప్రభాఘట్టం బొక్కటి = ఒకానొక దివ్యమయిన కాంతిస్తోమము, సంధ్యాలక్ష్మికిం జుట్టమై = సంధ్యారాగసంపదకుఁ జుట్టమై-అనఁగా సంధ్యారాగసదృశమై, కట్టెదురన్ = సూటిగా నెట్టయెదుట, పుట్టెన్ = సంభవించెను. అనఁగాఁ గనుపడియెననుట. సాంధ్యరాగమువంటి రక్తకాంతి యాకాశమున గాన్పించెను. ఉదయించు సూర్యుని కెంజాయను మించిన యాకాంతిస్తోమము వసుధా

జొసంగిన పద్మరాగాంగుళీయకప్రభయని మీఁదిపద్యమువలనఁ దెలియును.

సీ. ఇది తమ్మికంటిపై • నీసడించిననిశాధవుఁ దోలులోకబాం•ధవునిపొడపు
పొడపు గా దిది తల్లి • పడఁతి కెత్తఁగఁ దెచ్చు రక్తరాజీవనీ•రాజనార్చి
యర్చి గా దిది సహ•జానురక్తి నగాత్మజను బ్రోవఁ గదియునో•షధులచాయ
చాయ గా దిది కూఁతు•చంద మారయ వచ్చు కోలాహలునిరక్త•కూటదీప్తి
తే. దీప్తిమాత్రంబు గా దిది • దివ్యధామ
మనుచుఁ జెలు లాడుకొన వచ్చె • నంత నాన్నృ
పార్పితనవాబ్జరాగము•ద్రాంగుళీయ
రంజితాత్మీయపాణి యై • మంజువాణి. 56

ఇది = కనుపించుచున్నరక్తిమ, తమ్మికంటిపైన్ = కమలములవంటి కన్నులుగల గిరికాదేవి మీఁద, ఈసడించిన=విరోధించిన, నిశాధవున్ = చంద్రుని, తోలు = పలాయనమును బొందించుచున్న, లోకబాంధవుని = సూర్యునియొక్క, పొడపు = ఉదయము-ఇక్కడఁ దమ్మికంటి యనెడుపదము సాభిప్రాయము. తమ్ములకుఁ బ్రియుఁడయిన సూర్యునిచేతఁ దమ్మికంటి రక్షణీయురాలని యభిప్రాయము. లోకబాంధవశబ్దంబును సాభిప్రాయము. లోకములకు బంధువు గనుక నార్తజనరక్షణము కర్తవ్యమని యును నాశయము.

పొడపుగాదిది=ఇది సూర్యోదయముకాదు. ఇంక నేమనిన, తల్లి = గిరికామాతయగుశుక్తిమతి, పడఁతికెత్తఁగఁ దెచ్చు = గిరికాదేవి కర్పించునిమిత్తమై తీసికొనివచ్చుచున్న, రక్తరాజీవ నీరాజనార్చి= అరుణారవిందరూపమయిన నీరాజనదీపజ్వాలిక, అర్చిగాదిది = ఇది యాజ్వాలిక గాదు. ఇంక నేమనిన, సహజానురక్తి = తోడఁబుట్టినదానియందలి యనురాగముచేత, నగాత్మజను బ్రోవఁగదియు = పర్వతపుత్త్రియైన గిరికాదేవిని రక్షించునిమిత్తమై కదియవచ్చుచున్న, ఓషధులచాయ = ఓషధులనఁగా సంజీవసంధాన విశల్య సౌవర్ణ్యకరణులు గనుక వానియొక్క ఛాయ. ఇక్కడ నగాత్మజ యనెడుపదము సహజత్వమును సమర్థించుచున్నది.

చాయగాదిది = ఇది యోషధులయొక్క ఛాయ గాదు. ఇఁక నేమనిన, కూఁతు చంద మారయ వచ్చు=కూఁతురగు గిరికయొక్క వర్తమానము విచారింపవచ్చెడు, కోలాహలుని రక్తకూటదీప్తి = కోలాహలపర్వతునియొక్క గైరికధాతుమయ శిఖరములయొక్క యరుణకాంతి, దీప్తిమాత్రంబుగాదిది= ఇది సాధారణకాంతిమాత్రము గాదు. మఱియేమనిన, దివ్యధామము=ఏదియో యొకదివ్యమైన తేజస్సు, అనుచున్ = ఈలాగనుచు, చెలులాడుకొనన్ = సఖు లనుకొనుచుండఁగా, అంతన్ = అంతట, అన్నృపార్పిత = ఆవసురాజుచేత నియ్యఁబడిన, నవాబ్జరాగ ముద్రాంగుళీయ = అభినవపద్మరాగమణిముద్రాన్వితమైన యుంగరముచేత, రంజిత = ప్రకాశించుచున్న, ఆత్మీయపాణియై = తనయొక్క హస్తముగలదై, మంజువాణి=మంజువాణియనెడు గిరికాదేవియొక్క ప్రియసఖి, వచ్చెన్=ఏతెంచిన దాయెను.

మంజువాణి పద్మరాగముద్రికాంగుళీయకముతో వినుత్రోవను వచ్చునపుడు దూరమందుండ నుదయరాగమువలెఁ దోఁచెను. కొంచెము సమీపింప శుక్తిమతి గిరికాదేవి కొసంగు కెంగలువవాళివలె నుండెను. ఇంకను సమీపింపఁ గోలాహలాగ్రస్థితములగు నోషధులకాంతివలెను, జేరువకు రాగా నెఱ్ఱని చఱియవలెను సమీపింపఁ బద్మరాగనిర్మితదివ్యభవనమువలెను దోఁచెను. సమీపించిన కొలఁది కాంతి యతిశయించె ననుట. అలం. సందేహము.

క. వచ్చి వసురాజశేఖరుఁ, డిచ్చినముద్రిక లతాంగి♦యెదుట నిడి చెలుల్
గ్రచ్చుకొని యడుగ నిట్లను, నచ్చేడియ దనయుదంత ♦ మాద్యంతంబున్. 57

వచ్చి = ఏతెంచినదై, వసురాజశేఖరుఁ డిచ్చినముద్రిక = వసురాజశ్రేష్ఠుఁ డాళ్వాలుగా నిచ్చినయుంగరము, లతాంగియెదుటనిడి = గిరికాదేవియెదుట నుంచి, చెలుల్గ్రచ్చుకొని యడుగన్ = చెలికత్తెలందఱును గ్రమ్ముకొని యడుగఁగా, ఆచ్చేడియ=ఆమంజువాణి, తనయుదంత మాద్యంతంబున్ = తనవృత్తాంతమంతయు, ఇట్లనున్ = ఈలాగనిపలికెను. (వి. 'వార్తా ప్రవృత్తి ర్వృత్తాంత ఉదంతః' అని అ.)

ఉ. అమ్మనుజేంద్రచంద్రుహృద♦య మ్మది యెట్టిదయో యెఱింగి యీ
కొమ్మమనమ్మునం గలుగు♦కొందల మంతయుఁ దెల్పి రమ్ము పో
పో మ్మని మీరు పంపఁ బనిఁ ♦ బూని పొలంతుకలార కార్యవే
గమ్మున నంబరోత్పతన♦కౌశల మందితిఁ దత్క్షణంబునన్. 58

అమ్మనుజేంద్రచంద్రు = ఆవసురాజుయొక్క, హృదయ మ్మది యెట్టిదయో యెఱింగి = చిత్తమేరీతిగానున్నదో తెలిసికొని, ఈకొమ్మమనమ్మునంగలుగు కొందలమంతయుఁ దెల్పిరమ్ము = ఈగిరికాదేవియొక్క మనస్సునఁగల విచారము నంతయుఁ దెలియఁజెప్పిరా, పోపొ మ్మని మీరుపంపన్ = పొపొ అని మీరందఱు పంపింపఁగా, పనిఁబూని = కార్యమువహించి, పొలంతుకలార=ఓచెలియలారా, కార్యవేగమ్మునన్ = పూనుకొన్నపదవియందలి త్వరచేత, తత్క్షణంబునన్ = ఆక్షణమందే, అంబరోత్పతన కౌశలమందితిన్ = ఆకాశమున కెగయునేర్పును బొందితిని - అనఁగా గగనమార్గసంగతురాలనైతి ననుట.

సీ. బడివాయ కిల నగ♦ప్రతతితో జివ్వున నెగిరిన ట్లై తోఁచు ♦ మగువలార
పైపై సమీరణా♦ర్భటి నింగి భోరున నరచిన ట్లై తోఁచు ♦ నతివలార
నిఖిలభూములు జవ♦నిక వాప దారున నెదిరిన ట్లై తోఁచు నింతులార
చనఁజన వెడఁద యై ♦ శశిమేను గ్రక్కునఁ బెరిగిన ట్లై తోఁచుఁ ♦ దరుణులార
తే. గొండ లచ్చనగం డ్లయి ♦ నిండుచెరువు
లెల్ల నద్దంపుబిల్ల లై ♦ యేర్లు ముత్తి
యంపుసరు లై యరణ్యంపు♦గుంపు లెల్ల
నాచు లై తోఁచుఁ బొడవున ♦ నారులార. 59

మగువలార=ఓచెలియలారా, బడివాయక=వెంటనెడఁబాయక, ఇల=భూమి, నగప్రతతితోన్ = పర్వతసమూహముతోఁగూడ, జివ్వునన్ = అతివేగముగా, ఎగిరినట్లై తోఁచున్ = మీఁది కెగసివచ్చినట్లుగాఁ గనుపడును, అతివలార = ఓచెలియలార, పైపైన్ = మీఁదమీఁద, సమీరణార్భటిన్ = వాయువుయొక్క యార్భాటముచేత - అనఁగా వాయువుయొక్క తాఁకుడుచేత, నింగి = ఆకాశము, భోరున నరచినట్లై తోఁచున్ = భోరుమని రొదచేసినట్టులుగాఁ గనుపట్టును, ఇంతులార = ఓచెలియలారా, నిఖిలభూములు = సమస్తలోకములును, జవనికవాపన్ = తెరదియ్యఁగానే, దారున నెదిరినట్లై తోఁచున్ = తెప్పున నెదిరిపడునట్టులుగాఁ గనుపడును, తరుణులార, చనఁజనన్ = అరుగనరుగ,

శశిమేను = చంద్రునిదేహము, వెడఁదయై = విశాలమై, గ్రక్కునఁ బెరిగినట్లై తోఁచుఁ = అతి శీఘ్రముగా వృద్ధిఁబొందినట్లు గనుపట్టును, నారులార = ఓచెలియలారా, కొండలచ్చనగండ్లయి = పర్వతములన్నియు నచ్చనగాయలంతలై, నిండుచెరువులెల్ల నద్దంపుబిళ్ళలై = పూర్ణీభవించియుండెడు తటాకములన్నియు నద్దంపుబిళ్ళలంతలై, ఏర్లు ముత్తియంపుసరులై = నదులన్నియు ముత్యాలపేరులంతలై, అరణ్యంపుగుంపులెల్ల నారులై = వనసమూహములన్నియు నారుపోసిన మొలకలంతలై, తోఁచుఁ= కనుపడును. ఎప్పుడనిన, పోడవునన్ = ఊర్ధ్వభాగమందుఁ బోవుచున్నసమయమందు, ఈపైనిఁ జెప్పఁబడిన ప్రకారముగాఁ గానవచ్చె నని సంబంధము. శైలములు మహోన్నతములు గావున మంజువాణి శైలములపై కెగయువఱకుఁ గొంతకాలము పట్టును. అంతవఱకుఁ గొండలు తనవెంటవచ్చుచున్నటులఁ దోఁచెను. ఊర్ధ్వలోకములు నాటకములోఁ జెఱదీయు వేషధారు లెదురైనటు లెదురుపడెను. ఇంక నెత్తున కేగుటచేఁ బ్రపంచమునందలి జీవనదులు ముత్తెపుసరులుగను కొండ లచ్చనగండ్లుగను దోఁచెనని భావము. అలం. సహజము.

చ. పురములు దుర్గము ల్శిబిర•ము ల్వెలిపేటలు నూళ్లు పల్లియల్
ధరపయిఁ గుప్ప వోసినవి•ధంబున నేర్పడ కున్కిఁ గొంతసే
పరయుట కై వినిశ్చలత•రాకృతి నుండి వసుక్షమాతలే
శ్వరనగరీలలామకము•చాయఁ గనుంగొని సంభ్రమంబునన్. 60

పురములు = పట్టణములును, దుర్గముల్ = గిరిదుర్గములును, శిబిరముల్ = సేనానివేశములును-అనఁగా దండుదిగియుండెడు స్థలములును, వెలిపేటలు = పట్టణముయొక్క బయటిపేటలును. ఊళ్ళు= గ్రామములును, పల్లియల్ = పల్లెలును, ధరపయిఁగుప్పవోసినవిధంబున నేర్పడకున్కిన్=భూమిమీఁద రాశిపోసినట్టులుగా నిదియదియని యేర్పఱుపరాకుండుటచేత, కొంతసేపు = కించిత్కాలము, అరయుటకై = విమర్శచేసెడికొఱకై, వినిశ్చలతరాకృతినుండి = కదలకనిలిచియుండి, వసుక్షమాతలేశ్వరనగరీలలామకము చాయఁగనుంగొని=వసురాజుయొక్క పట్టణశ్రేష్ఠపుజాడఁ దెలిసికొని, సంభ్రమంబునన్ = ఉద్దేశకార్యజనితత్వరచేత, ముందరిపద్యముతో నన్వయము.

మంజువాణి మిగుల నెత్తేగుటవలన జనపదములు గ్రామములు పల్లెలు గుప్పవలెఁ గానరాఁ దొడఁగెను. గమ్యస్థాననిర్ణయ మిందుచే మిగులఁ గష్టసాధ్య మయ్యెను. వసురాజురాజధాని సామాన్య నగరము కాదు. నగరీలలామము. అదియుఁ గుప్పవలెనుంటచేఁ గనుఁగొనుట దుస్తరము గావున నిలుకడగ నిలచి చూచుటచేఁ గనఁబడెను.

సీ. పోవఁబోవఁగఁదోఁచెఁ•బురసమామకుటమాల్యంబులై భర్మహ•ర్మ్యధ్వజంబు
లేఁగ నేఁగ నెదిర్చె • గృహదేవతామాళి కలితాబ్జకళికలై • కలశతతులు
చేరఁ జేరఁ దలిర్చె • వీరలక్ష్మీవాస వనజాతదళములై • వప్రశిఖలు
చనఁ జనఁ దులకించె • జగతిసతీకాంచి హీరపర్వంబులై • తోరణంబు
తే. లరుగ నరుగంగఁ జూపట్టె • సిరియనంత, తనువులై మల్లఖురళికా•భినయవాటి
కాకరితురంగశాలికా•గంధవిపణి, కాముఖార్పితమణిపుత్రి•కాచయంబు. 61

పోవఁబోవఁగన్ = భూమికై దిగి యరుగఁగా నరుగఁగా, పురరమామకుటమాల్యంబులై = పురలక్ష్మియొక్క కిరీటమందలి పుష్పమాలికలో యన్నట్టులుగా, భర్మహర్మ్యధ్వజంబులు = బంగారుమేడల

మీఁదనుండెడు కేతనపటములు, (ని. 'ధ్వజ శ్చిహ్నేపతాకాయామ్' అని వి.) తోఁచెన్ =కనుపడెను, వీగ నేగన్ = మఱియును బోఁగాఁబోఁగా, గృహదేవతా = గృహాధిదేవతయొక్క, వహాళికలిత = శిరస్సునందొప్పుచున్న, అబ్జకళికలై = తామరమొగ్గలో యన్నట్టులుగా, కలశతతులు = గృహోపరిభాగములయందలి కలశసమూహములు, ఎదిర్చెన్ = ఎదురుపడెను, చేరఁజేరన్ = మఱియు సమీపించిపోఁగాఁబోఁగా, పీరలక్ష్మీవాస వనజాతదళములై = పీరలక్ష్మీవాసములైన పద్మములయొక్క రేకులో యన్నట్టులుగా, వప్రశిఖలు = కోటకొమ్మలు, (ని. 'సాను ప్రాకారయో ర్వప్రః' అని వి.) (ని. 'శిఖా శిఖాయాం చూడాయాం జ్వాలాయా మగ్రమాత్రకే' అని వి.)కలిర్చెన్ =చూడనొప్పెను, చనఁజనన్ = మఱియును బోఁగాఁబోఁగా, జగతీసతీ=భూకాంతయొక్క, కాంచి=మొలనూలునందలి, హీరపర్వంబులై=వజ్రగ్రంథులో యన్నట్టులుగా-అనఁగా వజ్రపుకట్లో యన్నట్టులుగాను, (ని. 'పర్వ స్స్యాదుత్సవే గ్రంథౌ' అని వి.) తోరణములు = బహిర్ద్వారములు, (ని. 'తోరణోస్త్రీ బహిర్ద్వారమ్' అని అ.) తులకించెన్ = ప్రకాశించెను.

అరుగనరుగంగన్ = మఱియును జనఁగాఁజనఁగా, సిరియనంతతనువులై = లక్ష్మియొక్క యనేకమూర్తులో యన్నట్టులుగాను, మల్లఖురళికా = సాముగరిడీలయొక్కయు, అభినయవాటికా = నాటకశాలలయొక్కయు, కరితురంగశాలికా = గజాశ్వశాలలయొక్కయు, గంధవిపణికా = పరిమళద్రవ్యములమ్మెడునంగడివీధులయొక్కయు, ముఖ = మొగదలలయందు, అర్పిత = నిలుపఁబడిన, మణిపుత్రికా చయంబు = రత్నప్రతిమలయొక్క సమూహము, చూపట్టెన్ =కనుపించెను. మల్లఖురళిక లనఁగా సాము గరిడీ లన్నందుకుఁ బ్రయోగము-

గీ. 'బహువిరోధిమణిప్రభాపల్లవాగ్ర, మల్లసంగ్రామఖురళికామండలాయ
మాన నానాపరిష్కారమహితగాత్రి, మనుజపుత్రిక యాస్థానమునకు వచ్చె' నని శ్రీనాథుండు.

హర్మ్యములు భర్మమయములు గావునఁ బురలక్ష్మికిరీటమువలెను నందుండు టెక్కెములు కిరీటమునందలి మాల్యములవలెను నుండెను. దీనిని జూచుచుఁ బోవఁబోవ గృహములపైఁగల బంగారు కుండలు, కోటకొమ్మలు, బహిర్ద్వారములు కనిపించెను. లక్ష్మీదేవిస్వరూపాంతరములవలె నాట్యగృహములందు హయశాలలందు సుగంధవస్తువిపణులందు మణివిగ్రహములు లెక్కకు మిగుల గోచరించెను. అలం. రూపకోత్ప్రేక్షలు.

క. అందు ఘనసారమృగమద, చందనకాశ్మీరసార•సౌరభలహరీ
సందోహదోహదానిల, కందళి నుపశమితగగన • గమనశ్రమ నై. 62

అందున్ = అట్టిపట్టణమందు, ఘనసార = కర్పూరముయొక్కయు, మృగమద = కస్తూరియొక్కయు, చందన = శ్రీగంధముయొక్కయు, కాశ్మీర = కుంకుమపూవుయొక్కయు, సార=శ్రేష్ఠమయిన, సౌరభ=పరిమళముయొక్క, లహరీసందోహ = మహాతరంగసమూహమునకు, దోహద = ఉత్పాదకద్రవ్యమయిన - అనఁగాఁ గర్పూరాదులయొక్క పరిమళమును బ్రకటింపఁజేయుచున్న, అనిలకందళిన్ = పవనాంకురముచేత - అనఁగాఁ బిన్నవాయువులచేత, ఉపశమిత = నివారింపఁబడిన, గగనగమనశ్రమనై =ఆకాశగమనజనితమయిన శ్రమగలదాననై -ఈపద్యమునకు ముందరిపద్యములో నన్వయము. విపణులయందున్న సుగంధవస్తువుల తావియే కాదు. తదుత్పాదకమగు ద్రవ్యమగు నని లతందళములు వోలసినవి. మంజువాణి యాకసమునుండి యంగడివీథులచెంతకు దిగెను. మనోహార

సుగంధసంపత్తి యాకాశగమనాయాసము తొలంగించెను. పరిమళము లహరీసందోహముగ నుంటయు మారుతము ఆదోహదములతోఁ బోలయుఁ బురసౌభాగ్యాతిశయమును దెలుపును.

చ. అదె యిదె వింతనీడ యని • యారెకు లూరక సంభ్రమింపఁగాఁ
జెదరి కపోతముల్ గొణిఁగె • చేరక తారకవీథిఁ బోఁగా
నిదురఁ దొఱంగి కేకిరమణీనివహంబు విధూతపక్షమై
రొద లొదవింపఁగా నొకశిరోగృహపాళిక వ్రాలి యున్నెడన్. 63

అదె యిదె వింతనీడయని=అదిగో యిదిగో క్రొత్తనీడ గనుపించుచున్నదని, ఆరెకులు=తలారులు-అనఁగా గస్తుదిరిగెడువారలు, ఊరకసంభ్రమింపఁగాన్ = ఏమో తొందరపడఁగాను, చెదరి = గుంపుచెడి, కపోతముల్ = పావురాలు, తారకవీథిఁబోఁగాన్ = ఆకాశమందు సంచరింపఁగాను, నిదురఁ దొఱంగి = నిద్రనువిడిచిపెట్టి, కేకిరమణీనివహంబు = ఆఁడునెమళ్ళయొక్క సమూహము, విధూతపక్షమై = చలింపఁజేయఁబడిన ఱెక్కలుగలదై, రొదలొదవింపఁగాన్ = రొదలుసేయఁగాను, ఒకశిరోగృహపాళికన్ = ఒకానొక చంద్రశాలాప్రదేశమందు, వ్రాలియున్నెడన్ = ప్రవేశించియున్న సమయమందు.

మంజువాణి మేడపై వ్రాలినది రాత్రికాలము గావున గస్తుదిరుగువారి కది నీడవలెను ండెను. ఆసందడికిఁ జూఱులందు నిదురించు పారావతములు బెదరిపాఱెను. మేడకొనలందు నిదురించుచున్న యాఁడునెమిళ్లు ఱెక్కలు విదిర్చి కూయసాగెను. అనఁగా మంజువాణిరాక యారెకు లెఱుంగరనియు మేడపైఁ జేరెననియు భావము.

ఉ. సాలము యంత్రపీఠము వి • శాలకవాటికఘట్టనంబు దృ
క్కీలన మైందవామృతస • మేతపతాకిక జిహ్వ చంద్రికా
జాలము భూతిపూఁత నవ • చంద్రశిలాంబువు లశ్రుధారగాఁ
బ్రోలు ప్రశాంతఘోష మయి • పూర్ణసమాధిఁ జెలంగె నయ్యెడన్. 64

సాలము=ప్రాకారమే, (ని.'ప్రాకారో వరణ స్సాలః' అని అ.) యంత్రపీఠము=యంత్రమయమయినపీఠమును, విశాలకవాటికఘట్టనంబు=విశాలములయిన తలుపులయొక్క మూఁతయే, దృక్కీలనము=కనుమూఁతయును, ఐందవ=చంద్రునివలనఁబుట్టిన, అమృత=జలముతోడ-అనఁగా హిమజలముతో ననుట. సమేత=కూడుకొన్న, పతాకిక=కేతనమే, ఐందవ=సహస్రారకమలమందలి చంద్రమండలమువలన స్రవించిన, అమృత=అమృతముతోడ, సమేత=కూడుకొన్న, జిహ్వ=జిహ్వయును, అని యైందవామృతసమేతపదము పతాకికకును జిహ్వకును విశేషణము. చంద్రికాజాలము=చంద్రికాసమూహమే, భూతిపూఁత=భస్మలేపనమును, నవచంద్రశిలాంబువులు=నూతనమయిన చంద్రకాంతశిలలవలన స్రవించుచున్నజలములే, అశ్రుధారగాన్=ఆనందబాష్పధారగాను, ప్రోలు=పట్టణము, ప్రశాంత=వినఁబడని, ఘోషమై=శబ్దముగలదై, పూర్ణసమాధిన్=సంపూర్ణమైన లంబికాయోగసమాధిచేత, ఆయ్యెడన్=ఆ నిశీథకాలమందు, చెలంగెన్=ఒప్పుచుండెను.

సమాధిలక్షణము-

శ్లో. 'శబ్దాదీనాంచ-తన్మాత్రా, యావత్కర్ణాదిషు స్థితాః
తావదేవ స్మృతం ధ్యానం స్యా-త్సమాధిరతః పరమ్.

జలసైంధవయో స్సామ్యం యథా భవతి యోగతః
తథాత్మమనసోరైక్యం సమాధి రిహ భణ్యతే.'

ఇత్యాదులు తెలియునది. సమాధియన మనస్సును శబ్దాదులనుండి పూర్తిగాఁ దొలగించి యాత్మతో లయింపఁజేయుట. సమాధినిష్ఠాయుక్తుఁడు యంత్రపీఠముచెంతఁ గనుల మూసికొని సహస్రారకమలమందలి చంద్రమండల సుధాసారము గ్రోలుచు భ్రాంతిపూఁతతో ఆనందబాష్పములతో నిశ్శబ్దప్రదేశమునం దుండును. అటులె ప్రాకారములమధ్యనున్న పురమున జనులు కనుమూసి నిదురించుచుండిరి. చంద్రకాంతములనుండి జలము కారుచుండెను. ప్రశాంతముగా నుండెనని భావము. అలం. రూపకసంకీర్ణోత్ప్రేక్ష.

సీ. పతిగళార్పితభుజా • లతికలై రతికేళి యలపార్చు ముంగిళ్ళ • మెలఁగువారు
అలిగి యేఁగుచుఁ బ్రియు • ల్నిలిపిన నిజభుజంగీభావ మేర్పడఁ • గెరలువారు
వరు లొండుకడ కేఁగఁ • బురుషభూమికఁ బూని తెరువాఁగి భంగింపఁ • దివురువారు
రాకుమారులయిండ్ల • నేకతంబునఁ దదాప్తులవెంట బుడిబుడిఁ • బోవువారు
తే. మదనమంత్రరహస్యము • ల్సదనవలభి, నిభృతపారావతములకు • నేర్పువారు
నైనవెలయాండ్రచే నప్పు • రాధిరాజ, వేశవాటిక చూడ్కికి • వేడ్క యొసఁగె.

పతి=విటులయొక్క, గళ=కంఠములయందు, అర్పిత=చేర్పఁబడిన, భుజాలతికలై = తీఁగెలవంటి బాహువులుగలవారై, రతికేళిన్ = సురతక్రీడలయందలి, అలపార్చున్ = అలయికదీర్చుకొనుకొఱకు, ముంగిళ్ళ మెలఁగువారు = ఇంటిముంగిళ్ళయందు సంచరించుచుండువారు కొందఱును, అలిగియేఁగుచున్ = అలుకవహించి లేచిపోవుచు, ప్రియుల్నిలిపినన్ = ప్రియవిటులు పోకుండ నడ్డగించుకొనఁగా, నిజభుజంగీభావమేర్పడన్ = భుజంగియనఁగా సర్పాంగనయును విటకత్తెయును గనుకఁ దమయొక్క సర్పాంగనాచేష్ట ప్రకటమగునట్టులుగానని యర్థము. తమయొక్క విటకత్తెతన మేర్పడునట్టుగా నని భావము. (శ్లో. 'భుజఙ్గో విట సర్పయోః' అని అ.) (ని. భావ స్సత్తా స్వభావా భిప్రాయ చేష్టాత్మ జన్మసు' అని అ.) కెరలువారు=చిరాకుపడువారు కొందఱును. వరు లొండుకడకేఁగన్=తమయొక్క ననుపుకాండ్రు-అనఁగా లంజెకాండ్రు మఱియొకస్థలమునకుఁ బోఁగా, అనఁగా నన్యకాంతా సంభోగమునకుఁబోఁగా, పురుషభూమికఁ బూని=తాము పురుషవేషము ధరియించి, (శ్లో. 'భూమికా రచనాయాం స్యా న్మూర్త్యంతరపరిగ్రహే' అని వి.) తెరువాఁగి = దారిగాచి, భంగింపఁదివురువారు = భంగపఱుపవలెనని యుద్యుక్తు లయ్యెడువారు కొందఱును, రాకుమారులయిండ్లకున్ = రాచకుమారుల యిండ్లకు, ఏకతంబునన్=రహస్యముగా, తదాప్తులవెంటన్ = ఆరాజకుమారుల కిష్టులైనవారితోఁగూడ, బుడిబుడిఁబోవువారు = తెప్పతెప్పునఁ బోయెడువారు కొందఱును,

మదనమంత్రరహస్యముల్=మన్మథమంత్రములయొక్క రహస్యార్థములను, సదనవలభి = ఇండ్ల చూరుపట్టెలయందు, నిభృత = చలింపకుండునట్టి, పారావతములకున్ = పావురాలకు, నేర్పువారు = ఉపదేశము సేయువారు కొందఱును, ఐన =అయినట్టి, వెలయాండ్రచేన్ = వేశ్యాంగనలచేత, అప్పురాధిరాజవేశవాటిక = ఆపట్టణశ్రేష్ఠమందలి వేశ్యాజనసమాశ్రయము-అనఁగా బోగమువీథి, చూడ్కికి వేడ్కయొసంగెన్ = చూపులకు వేడుక పుట్టించెను. (శ్లో. 'వేశో వేశ్యాజనసమాశ్రయః' అని యమరనిఘంటువు.)

పురమంతయుఁ నిద్రావస్థలో నున్నను వేశ్యలుమాత్రము విటసంపర్కమున రేల జాగరణము గావించుచు వినోదపరాయణలై యుండిరనియు నిద్రావస్థలోనున్న యానగరమున వేశ్యవాటి దర్శనీయముగ మనోహరముగ నుండెను. అలం. స్వభావోక్తి.

సీ. కమనీయకౌముదీ♦కాంతి వారివియోగ గాఢపాండిమపొత్తు ♦ గలయఁ బోలు
వలివెల్గుటావెల్లు♦వలు వారిమదనవహ్ని జ్వాలికల వేఁడి ♦ నిగురఁ బోలుఁ
బ్రతిహట్టరత్నదీ♦పములు వారిదృగంశు యమునోర్మిమాలిక ♦ నడఁగఁ బోలు
యామికారభటీభ♦యంబు వారిమనోజ భూపరాజ్ఞాసిద్ధిఁ ♦ బొలయఁ బోలుఁ
తే. బండువెన్నెల యనక యా♦పయి విధూప
లాంబు వనక యాత్రోవర♦త్నాంకురార్చు
లనక యామీఁద నారెకు ♦ లనక చనిరి
తరుణు లొకకొంద ఱవి యెల్ల ♦ నరసికొనుచు. 66

కమనీయ=ఒప్పుచున్న, కౌముదీకాంతి = చంద్రికయొక్క ధవళకాంతి, వారివియోగగాఢపాండిమపొత్తుగలయఁబోలుఁ-వారి = ఆస్త్రీలయొక్క, వియోగ = విరహమువలనఁబుట్టిన. గాఢపాండిమ= సాంద్రమయిన ధవళిమతోడ, పొత్తుగలయఁబోలుఁ = జతగూడఁబోలును-అనఁగా మిళితమైయుండఁ బోలును. వలివెల్గుటావెల్లువలు-వలివెల్గుటా = చంద్రకాంతశిలలయొక్క, వెల్లువలనఁగా వెన్నెలచేతఁ గరఁగి స్రవించిన జలప్రవాహములు. అట్టి చంద్రకాంతశిలా జలప్రవాహములు, వారి = ఆస్త్రీల యొక్క, మదనవహ్నిజ్వాలికలవేఁడిఁ = మన్మథాగ్నిజ్వాలలయొక్క వేంద్రముచేత, ఇగురఁబోలుఁ= ఇగిరిపోయియుండవచ్చును, ప్రతిహట్టరత్నదీపములు = ప్రతియంగడివీథులయందు నుండెడు రత్నమయదీపములు, వారి = ఆస్త్రీలయొక్క, దృగంశు = దృష్టికాంతులనెడి, యమునోర్మిమాలికఁ = యమునాజలతరంగపంక్తిచేత, అడఁగఁబోలుఁ = అణఁగిపోయియుండవచ్చును, యామికారభటీభయంబు = తలారులయొక్క యార్భాటమువలనిభయము, వారి = ఆస్త్రీలయొక్క, మనోజభూపరాజ్ఞాసిద్ధిఁ = మన్మథమహారాజుయొక్క యాజ్ఞాసిద్ధిచేత, పొలియఁబోలుఁ = నాశనమయి యుండవచ్చును.

కనుకనే, పండువెన్నెలయనక=ముదురువెన్నెలగదాయని విచారింపక, ఆపయిఁ=అటుమీఁదట, విధూపలాంబువనక = చంద్రకాంతశిలాజలపూరమని విచారింపక, ఆత్రోవరత్నాంకురార్చులనక = ఆమార్గమునందు రత్నదీపజ్వాలికలున్నవని విచారింపక, ఆమీఁద నారెకులనక = అటుమీఁదఁ దలారులున్నారని విచారింపక, తరుణలోకకొందఱు = కౌమరువయసుగల స్త్రీలు కొందఱు, అవి యెల్ల నరసికొనుచుఁ = వానినన్నిటినిజూచుచు, చనిరి = పోయినవా రయిరి.

కొందఱు జారస్త్రీలు ప్రియసంకేతములనుగూర్చి పోవునెడలఁ బండువెన్నెలయును జంద్రకాంతశిలాజలపూరమును రత్నదీపకాంతులును దలారులయొక్క యార్భాటములును విరోధములయి నప్పటికిని గామాతురత్వముచేత వాని నెంతమాత్రమును విచారింపకపోయి రని తాత్పర్యము.

చ. హరిహయపోధసన్నిభము ♦ లన్నియు నన్నియు నద్భుతాకృతుల్
హరితమణిప్రకల్పితము ♦ లన్నియు నన్నియుఁ జిత్రకేతువుల్

హరిపదమార్గలంఘనము • లన్నియు నన్నియు హేమవప్రము
ల్పురిభవనంబు లిందు నృప•పుంగవు•మంగళధామ మెద్దియో. 67

పురిభవనంబులు = పట్టణమందలి గృహములు, అన్నియుఁ = సకలములును, హరిహయసౌధ సన్నిభములు = ఇంద్రుని మేడతో సమానము లయి యున్నవి, అన్నియుఁ = అన్నియు, అద్భుతాకృతుల్ = ఆశ్చర్యకరమైన రూపముగలిగియున్నవి, అన్నియుఁ = అన్నియు, హరితమణిప్రకల్పితములు = హరితమణులనఁగాఁ బచ్చలు గాన నాపచ్చలచేత నిర్మింపఁ బడియున్నవి, అన్నియుఁ = అన్నియు, చిత్రకేతువుల్ = విచిత్రములయిన ధ్వజములు గలిగియున్నవి, అన్నియుఁ = అన్నియు, హరిపదమార్గలంఘనములు = హరిపదమనఁగా విష్ణుపదము - అనఁగా నాకాశము గనుక నాకాశమార్గముయొక్క యతిక్రమణము గలిగియున్నవి, అన్నియుఁ = అన్నియు, హేమవప్రములు = సువర్ణప్రాకారములు గలిగియున్నవి. కాఁబట్టి, ఇందుఁ = ఈగృహములలో, నృపపుంగవు మంగళధామ మెద్దియో = వసురాజశ్రేష్ఠునియొక్క శుభాస్పదమైన గృహ మేదో కదా - ముందరి పద్యముతో నన్వయము.

మ. అని చింతించుచు నొక్క•ధామమునకుఁ • యక్షాంగన ల్పుష్కర
ధ్వనితోఁ జారణకన్యక ల్చటులవా•గ్వైచిత్రితోఁ బన్నగాం
గన లుద్యన్మణిదీపమాలికలతో • గంధర్వకాంత ల్సుకం
ఠనినాదాతిశయంబుతోఁ బ్రహరి చు•ట్టం గంటిఁ జిత్రంబుగాన్. 68

అని చింతింపుచుఁ = పూర్వోక్తప్రకారముగా విచారించుచు, ఒక్కధామమునకుఁ = ఒకానొకగృహమునకు, యక్షాంగనల్పుష్కరధ్వనితోఁ = పుష్కరమనఁగా వాద్యభాండముఖము, (నిఁ 'పుష్కరం కరి హస్తాగ్రే వాద్య భాణ్డ ముఖే జలే' అని అ.) యక్షస్త్రీలు పుష్కరమనెడు వాద్యభాండముతోడను, చారణకన్యకల్ = చారణస్త్రీలు, చటులవాగ్వైచిత్రితోఁ = పటుతరమైన వాక్యచమత్కృతితోడను, పన్నగాంగనలు = నాగకన్యకలు, ఉద్యన్మణిదీపమాలికలతోఁ = ప్రకాశించుచున్న రత్నదీపశ్రేణులతోడను, గంధర్వకాంతల్ = గంధర్వస్త్రీలు, సుకంఠనినాదాతిశయంబుతోఁ = యోగ్యమయిన కంఠధ్వనివిశేషముతోడను-అనఁగాఁ బాటతోడను, ప్రహరిచుట్టఁ = అలంగముచిరుగుచుండఁగా, చిత్రంబుగాఁ = ఆశ్చర్య మగునట్టులుగా, కంటిఁ = చూచితిని.

ఇక్కడ యక్ష చారణ పన్నగ గంధర్వ కాంతలకుఁ దత్తదుచితవ్యాపారమును జెప్పినాఁడు. అన్నియు దివ్యభవనములుగాఁ బొడసూపుటచే మంజువాణి రాజమందిరము గుర్తింపఁజాలదయ్యెను. యక్షకాంతలు వాద్యము లొనరించుట, చారణకాంతలు పొగడికపాటలఁ బాడుట, నాగాంగనలు మణిమాలికలతో నివాళుల నిచ్చుట, గంధర్వకాంతలు పాడుట రాజభవన నిశ్చయమునకుఁ దోడ్పడెను. వారందఱు నొకభవనమునఁ బ్రదక్షిణము గావించిరి.

మ. నరలోకంబుఁట సిద్ధసాధ్యఫణిగం•ధర్వాంగనాసేవనా
పరిపాకంబుఁట యెంతవింత యనుచుం • బల్మాఱు వీక్షించి యే
సురరాడ్ధర్త్తవిమానచిత్రమహిమ • ల్వా యంచు నూహించి యా
ధరణీనాథకులావతంసభవన•ద్వారంబు సేరం జనన్. 69

నరలోకంబఁట = లోకము విచారింపఁగా మనుష్యలోకమఁట. సిద్ధసాధ్యఫణి గంధర్వాంగ నాసేవనాపరిపాకంబఁట = పరిచర్య విచారింపఁగా సిద్ధ సాధ్య పన్నగ గంధర్వ స్త్రీలయొక్క పరిచర్యా సిద్ధి యఁట. ఎంతవింతయనుచున్ = ఎంతయాశ్చర్య మిది యని తలంచుచును - అనఁగా మనుష్య లోకములో దేవతాస్త్రీలు సేవసేయుట మిక్కిలి యద్భుతము గదా యని తలంచుచు ననుట. పల్మాఱు వీక్షించి=మాటిమాటికిఁజూచి, ఏన్ = నేను, సురరాట్ = దేవేంద్రునిచేత, దత్త=వసురాజునకొఱకు కియ్యఁ బడిన, విమాన=దివ్యవిమానముయొక్క, చిత్ర=అద్భుతకరములయిన, మహిమల్సాయంచున్=ప్రభావ ములు సుమీ యని, ఊహించి = భావనచేసి, ఆధరణీనాథ కులావతంస భవనద్వారంబు సేరంజనన్ = రాజకులశ్రేష్ఠుఁ డయిన యావసురాజుయొక్క గృహద్వారమును సమీపించి పోఁగా.

మనుష్యలోకమునందలి రాజభవనమునకు వేలుపుఁబ్రోయాండ్రు ప్రదక్షిణము తిరుగుట మిగుల వింత. ఇందులకు సురరాజొసంగిన విమానమహిమయె కారణము. ప్రదక్షిణములు చూడ రాజభవన మిది యని మంజువాణికిఁ దెలిసెను.

క. దానాగతరసికాళిస, దానాహతగీతి చెవుల • నంటఁగ నిదురల్
పూననిబహిరంతరవీ, రానేకపరాజి యచట • నచ్చెరు వొసఁగెన్. 70

దాన=మదజలాస్వాదనముకొఱకు, ఆగత = వచ్చిన, రసిక = సరసములయిన, అళి = తుమ్మెదల యొక్క, సదాఅనాహత=ఎప్పుడు చెడ తెగని, గీతి=ఝుంకారధ్వనియని యర్థము. దాన=అర్థప్రదానము కొఱకు, ఆగత=వచ్చిన, రసికాళి = రసికజన సమూహముయొక్క, సదానాహత = సంతతమును గొట్టు పడకయున్న, గీతి = గానస్వరమని యర్థాంతరము. చెవులనంటఁగన్ = కర్ణములయందు సోఁకఁగా, నిదు రల్పూనని = నిద్రఁజెందక యున్నట్టి, బహిరంతర వీరానేకపరాజి = బాహ్యాభ్యంతరములయందలి మత్త మాతంగశ్రేణి యని యర్థము. జాగరూకులయియున్న బహిరంతరవీరశ్రేష్ఠసమూహమని యర్థాంత రము. అచటన్ = ఆపట్టణమందు, అచ్చెరువొసఁగెన్ =ఆశ్చర్యమును బుట్టించెను.

మదధారల కాసించి తుమ్మెదలు దిమ్ముచేయుటచే మెలఁకువతోనున్న యేనుఁగులును, ఈవి కాసించి స్తోత్రపాఠములు పండితు లొనర్చుటచే జాగరూకులగు వీరోత్తములు రాజమందిరమునందుఁ గనిపించిరి. అలం. శ్లేషము.

సీ. పటుహీరములెచాలుఁ • బొలసున్న మొనర్ప శక్రాశ్మములెచాలు • జాదుపూయ
శశికాంతములెచాలు • జలసేక మొనరింపఁ గలికిపచ్చలెచాలు • నలికివైవ
విద్రుమంబులెచాలు • వింతజాజుఘటింప ముక్తామణులెచాలు • ముగ్గు లిడఁగ
వైదూర్యములెచాలు • వన్నెలతెరలుంపఁ దేటకెంపులెచాలు • దివియ లెత్తఁ
తే. జకచకితపుష్యరాగమాళికలె చాలు
గగనచిత్రవితానసంగతి యొసంగ
నిమ్మహాస్థాని కనఁ దోఁచె • నృపుహజార
మామహామంటపము దాఁటి • యవలఁ జనుచు. 71

ఇమ్మహాస్థానికిన్ = ఈసభామంటపమునకు, పొలసున్న మొనర్పన్ = మెఱుఁగుసున్నము చేయుం టకు, పటుహీరములెచాలున్ = సమర్థమయిన వజ్రమణులేచాలును-అనఁగాఁ జెక్కఁబడినవజ్రములే మెఱుఁగుసున్నము చేసినట్లులాగాఁ గనుపడుచున్న వనుట. సర్వత్రయాలాగుననే గ్రహింపవలయును.

శక్రాశ్మములెచాలుఁ జాదుపూయక్ = చాదనఁగా నల్లరంగు చేసెడు వర్ణద్రవ్యము గనుక నదిపూయుటకు, శక్రాశ్మములెచాలుక్ = ఇంద్రనీలమణులేచాలును. జలసేకమొనరింపక్ = నీళ్లుచల్లుటకు, శశికాంతములెచాలుక్ = చంద్రకాంతమణులేచాలును. అలికివైవక్ = అలుకుటకు, కలికిపచ్చలెచాలుక్ = సుందరమయిన మరకతమణులే చాలును. వింతజాజుఘటింపక్ = వింతగానుండెడు నెఱ్ఱజాజుపట్టెలు తీర్చుటకు, విద్రుమంబులెచాలుక్ = పగడములేచాలును. ముగ్గులిడఁగక్ = రంగవల్లికలు పెట్టుటకు, ముక్తామణులెచాలుక్ = ముత్తెములేచాలును. వన్నెలతెరలుంపక్ = వన్నెవన్నెలతెరలు-అనఁగాఁ బరదాలుంచుటకు, వైదూర్యములెచాలుక్ = వైదూర్యమణులేచాలును. దివియలెత్తక్ = దీపములుపెట్టుటకును, తేటకెంపులెచాలుక్ = తేటగల పద్మరాగమణులేచాలును. గగనవిచిత్రవితానసంగతియొసంగక్ = ఊర్ధ్వభాగమందు విచిత్రమయిన మేలుకట్టు కట్టడమునకు,

చకచకితపుష్యరాగమాలికలెచాలుక్ = చకచకాయమానములయిన పుష్యరాగమణిపంక్తులేచాలును. అనక్ = అనునట్టులుగా, నృపుహజారము = రాజుయొక్క కొలువుకూటము, తోఁచెక్ = కనుపడియెను. ఆమహామంటపముదాఁటి = మహత్తరమయిన యాసభామంటపము నతిక్రమించి, ఆవలఁజనుచుక్ = ఆవతలఁ బోవుచును, ముందరిపద్యముతో నన్వయము. ఇందులో నవరత్నములకును దత్తద్వర్ణోచితక్రియలను జెప్పినాఁడు. మణిమయమైన యామహామండపము సర్వవిధాలంకృతులతో దర్శనీయముగా మనోహరముగ నుండెను. పుష్యరాగములు మాలికలుగాఁ గూర్పఁబడి సభామందిరమున వ్రేలాడఁగట్టఁబడి యుండెను. అవి కదలుచుంటచే కాంతులు వెల్లివిరిసి పైభాగమునం దంతటను బాగుగాఁ బ్రసరించుటచే నాకాంతిపుంజములు పైనిగట్టిన చాందినీవలె నుండెననిభావము.

చ. తళుకుపసిండియోవరులు ♦ దంతపుఁజావడు లర్చనాగృహం
 బులు గుడినీరుమేడలును ♦ భోజనశాలలు గెంపుటోడుబి
 ళ్ళలగరిడీలు శీతలశి♦లాతలము ల్భువనేశ్వరంబు లు
 జ్జ్వలజలయంత్రధామములు ♦ సజ్జలు దాఁటి ధరావతీర్ణనై. 72

తళుకుపసిండియోవరులు = మెఱుపుగలబంగారపు కేళీగృహ విశేషములును, దంతపుఁజావడులు = దంతపుఁజవికలును, అర్చనాగృహంబులు = దేవపూజామందిరములును, గుడినీరుమేడలును = పానీయశాలలును, భోజనశాలలు = భోజనచావళ్లును, కెంపుటోడుబిళ్ళలగరిడీలు = కెంపులచేఁ జేయఁబడిన గూనపెంకులుగప్పిన సాముగరిడీలును, శీతల శిలాతలముల్ = చంద్రకాంత శిలాకుట్టిమములును-అనఁగాఁ గట్టునేలలును, భువనేశ్వరంబులు = చుట్టుబవంతులును, ఉజ్జ్వలజలయంత్రధామములు = ప్రకాశములయిన యాతుఖానాలుండెడు గృహములును, సజ్జలు = గృహవిశేషములును, దాఁటి = అతిక్రమించి, ధరావతీర్ణనై = భూమిమీఁదికి దిగినదాననై-ముందరిపద్యముతో నన్వయము.

సీ. ఒకవంక నిర్మలో♦దకశంక సంకుచత్పరిధాన నైరి త్తఁ ♦ బాఱఁ దలఁతు
 నొకచోట విఘటితో♦రుకవాటగృహవాటమని మిన్నకయతూఱ♦చనఁ దలంతు
 నొకయిక్క నిదివిత♦ర్దిక నిక్కమని పదాగ్రమునిక్క వహినెక్క♦గాఁ దలంతు
 నొకచాయఁజిత్రభి♦త్తికగాయనుచు సోయగముచఁ బాయకడాయ♦గాఁ దలంతు

తే. నిట్లు గృహరాజకీలిత♦నేకరత్న
 వివిధరుచివైభవంబులు ♦ వెగడుపఱుప

నిదియ కాఁబోలు నృపుకేళి•సదన మనుచు
నచట మాయాబలతిరోహి•తాంగి నగుచు. 73

ఒకవంకన్ = ఒకవైపున, నిర్మలోదకశంకన్ = స్వచ్ఛమయిన యుదకమనెడు సందేహము చేత, సంకుచత్పరిధానయై = పైకిముడువఁబడుచున్నవస్త్రముగలదానయై, రిత్తఁబాఱఁదలఁతున్ = ఏమియు లేనిచే వడిగానడువఁజూతును, ఒకచోటన్ = మఱియొకస్థలమందు, విఘటిత = తెరువఁబడిన, ఉరుకవాట = గొప్పతలుపులుగల, గృహవాటమని = గృహపంక్తియనుకొని, మిన్నకయతూఱి చనఁదలంతున్ = ఊరకదూరిపోఁజూతును, ఒకయిక్కన్ = మఱియొకస్థలమందు, ఇది వితర్దిక నిక్కమని=ఇది నిజముగా నరుఁగేకాని మఱియొకటికాదని, (ని. 'స్యా ద్వితర్దిస్తు వేదికా' అని అ.) పదాగ్రమునిక్కన్ = పాదములచివర నెత్తఁబడునట్టులుగా, రహినెక్కఁగాఁదలంతున్ = ఉల్లాసముచేత నెక్కఁజూతును, ఒకచాయన్=మఱియొకవైపున, చిత్రభిత్తికగా యనుచున్ = చిత్తరువువ్రాసిన గోడగదా యనుకొనుచును, సోయగమునన్=విలాసముచేత, పాయక డాయఁగాఁ దలంతున్ = తొలఁగిపోక సమీపించిపోఁ జూతును.

ఇట్లు = ఈప్రకారముగా, గృహరాజ=మందిరశ్రేష్ఠమందు, కీలిత=కూర్పఁబడిన, అనేకరత్న = బహువిధములయిన రత్నములయొక్క, వివిధ రుచివైభవంబులు = నానాప్రకారములైన కాంతిసంపదలు, వెఁగడుపఱుపన్ = విభ్రాంతి పొందించుచుండఁగా, ఇదియకాఁబోలునృపుకేళిసదనమనుచున్ = రాజుయొక్క క్రీడాగృహమిదేకాఁబోలు నని యూహించుకొని, అచటన్ = ఆగృహమందు, మాయాబల తిరోహితాంగి నగుచున్ = మాయాప్రభావముచేతఁ బరులకు దృగ్గోచరముగాని దేహముగలదానవై-అనఁగా నదృశ్యాకారముగలదానవై యనుట. ముందరిపద్యముతో నన్వయము, ఈపద్య మక్కిలి ప్రాసనీసము.

రాజగృహమునందుఁ జెక్కఁబడినరత్నములు లెక్కయిడరానియన్ని కావున వానికాంతులు విచిత్రరుచివైభవములు. మణికాంతు లాయాస్థలములఁ బ్రసరించి మంజువాణిని విభ్రాంతురాలినిగా నొనరించెను. ఇవియన్నియుఁ గ్రీడాగృహచిహ్నములు. వీనిమూలమున నది రాజుమందిరమని గుర్తించి మంజువాణి మాయాబలముచే నదృశ్య మయ్యెను.

చ. అనుపమరత్నసౌధకమ•లాలయవాటిక నొత్తగిల్లి పైఁ
జనుమొన దోఁప నొంటివలి•జక్కవతో నరవిందము ల్మొగి
డ్చినయెలదమ్మితీవియల•తీవిఁ గనుంగవ మూసి యున్నయం
గనల ననంగదేవతలఁ • గాంచితి రాజసమీపభూములన్. 74

అనుపమ = సమానరహితమైన, రత్నసౌధ = రత్నమయమైన మేడయనెడు, కమలాలయవాటికన్=సరోవరప్రదేశమందు, ఒత్తగిల్లి=ఒత్తగిలిపరుండి, పైఁ జనుమొనదోఁపన్=మీఁదిప్రక్కనున్న కుచాగ్రము గనుపడఁగాను, ఒంటివలిజక్కవతోన్=చక్రవాకి నెడఁబాసియొంటిగానున్న చక్రవాకముతోడను, అరవిందముల్మొగిడ్చిన=పద్మములను ముకుళింపఁజేసిన, ఎలదమ్మితీవియలతీవిన్=నూతనపద్మలతలవలెను, కనుంగవమూసియున్న = కన్నులుమూసియున్న, అనంగదేవతలన్ = మదనదేవతలవలె నుండెడు, అంగనలన్=కొందఱుస్త్రీలను, కాంచితి రాజ సమీపభూములన్=వసురాజసమీప ప్రదేశములయందుఁ జూచితి ననియర్థము, చంద్రసమీపప్రదేశములయందని యర్థాంతరము.

వసురాజ కేళీసౌధమం దాయనసమీపస్థలములను గొందఱుస్త్రీ లొకవైపు చనుమొనలు పైకిఁ గనుపడునట్లుగా నొత్తగిలి పరుండి కన్నులు మూసికొని నిద్రింపఁగా వా రేలాగునఁ గనుపడిరనినఁ జంద్రోదపాంతస్థల కమలాకరమందు స్త్రీవియోగముచేత నొంటిగానున్న చక్రవాకముతోఁ గూడు కొనియున్న తామరమొగిడిగల లేఁతతమ్మితూఁడులేమో యనునట్లుండిరి. ఇందు మేడకుఁ దమ్మికొలంకు నకును నిదురించుచెలువ యొంటికుచమునకును గవబాసిన యాఁడుజక్కవకును, ముకుళించిన తామర పూవునకు మోడ్చిన కనులకును లేఁతతామరతూండ్లకును అంగనలమేనులకును గలపోల్కి తెలియు నది. అలం. రూపకోపమల సంకరము.

సీ. ఒకతె చన్నులమీఁది ♦ యుదిరికిన్నరగాలిఁ బలుకవింతచలించి ♦ బయలుమీటు
నొకతె యూరుపుగాలి ♦ నురిలిపూసురటితేనియచిందఁ గనువిచ్చి ♦ బయలువిసరు
నొకతె చంద్రాశ్మవే ♦ దికముఖద్యుతిఁ జల్లఁబడ నుల్కి చేయాకు ♦ బయలుసాచు
నొకతె కప్రపుఁగళా ♦ చిక దేంట్లు సందడింపఁగ మిట్టిపడి కేలు ♦ బయలుపట్టు
తే. నిదురతమి నైన నుడిగంపుఁ ♦ జదురు లిట్లు
వాసనాబలమునఁ బూను ♦ వనజముఖులఁ
గంటిఁ గని తత్ప్రదేశంబు ♦ గడచి చనఁగ
నువిద లిద్దఱు పతియొద్ద ♦ నుండి వచ్చి. 75

ఒకతె=ఒకస్త్రీ, చన్నులమీఁది=స్తనములమీఁదనున్న, ఉదిరికిన్నర=శుద్ధసువర్ణమైన వీణావిశేషము, గాలిన్=వాయువశముచేత, పలుకన్=తనంతట తాను మ్రోయఁగా, ఇంతచలించి=ఇంచుకంత చలనమును బొంది, బయలుమీఁటున్=రిత్తబయలున వ్రేళ్ళతో మీటును, ఒకతె=మఱియొక స్త్రీ, ఊరుపుగాలి నురిలి=నిశ్వాసమారుతముచేత నురలఁబడి, పూసురటిదేనియచిందన్=పువ్వులచేతఁ గట్టఁబడిన విసనకఱ్ఱయందలి తేనియ పైనిఁజిందఁగా, కనువిచ్చి=మెలఁకువదగిలి-కన్నులు తెఱచి, బయలు విసరున్=ఒట్టిబయలువిసరును. ఒకతె=మఱియొక స్త్రీ, చంద్రాశ్మవేదిక = తానునిలుచున్నచంద్రకాంత శిలారచితమయిన యరుఁగు, ముఖద్యుతిఁజల్లఁబడన్=ముఖచంద్రకాంతిచేతఁ జల్లఁబడఁగా, ఇక్కడఁ జంద్రుఁడని చెప్పకపోయినఁ జంద్రకాంతస్రవణము సంభవింపనేరదని తెలియవలయును. ఉల్కి= ఉలికిపడి, చేయాకు బయలుసాచున్=చేతనున్నయాకుమడుపును బయలున కందిచ్చును, ఒకతె= మఱియొక స్త్రీ. కప్రపుఁగళాచిక = కర్పూరసహితమయిన పేటికావిశేషమును-అనఁగా నొకవిధమయిన పెట్టెను, తేంట్లుసందడింపఁగన్=తుమ్మెదలు కదలింపఁగా, మిట్టిపడి=అదరిపడి, కేలుబయలువట్టున్= హస్తమును బయలునకుఁ జాపి పట్టును.

నిదురతమినైనన్ = నిద్రాపరవశత్వముచేతనైనను, ఉడిగంపుఁజదురులు = ఉడిగపుఁబనులయందలి మెలఁకువలు, ఇట్లు = ఈచెప్పఁబడినప్రకారము, వాసనాబలమునఁబూను = పూర్వపరిచితియొక్క దార్ఢ్యముచేత వహించుచున్న, వనజముఖులన్=పరిచారికా స్త్రీలను, కంటిన్=చూచితిని, కని=చూచి, తత్ప్రదేశంబు గడచి చనఁగన్=ఆస్థలము దాఁటిపోఁగా, ఉవిదలిద్దఱు=ఇద్దఱు స్త్రీలు, పతియొద్దనుండివచ్చి= రాజసన్నిధినుండి వచ్చినవారై, ముందరిపద్యముతో నన్వయము. నిద్రాపరవశలైయుండి బయలు మీటుచెలువ వీణావాద్యమునందు నేర్పరి, బయలువిసరుచున్నసతి వీవనతో రాజునకు విసరుపనికత్తియ,

బయలునఁ జేయిసాచుపోలఁతి తాంబూలము నందిచ్చుపరిచారిక, బయలు కేలఁ బట్టుముగుద సుగంధద్రవ్యమిశ్రమగు కళాంచిపట్టుచెలి. పూర్వపరిచితకార్యములు నిదురలోఁగూడ నిర్వహించుట రాజభక్తివిశేషమునకుఁ దార్కాణములు.

శా. ఏమే హేమలతా యటంచుఁ బని యేమే మాధవీ యంచు నీ
భామామన్మథుచంద మెట్లనుచుఁ జెప్పం జాల భూపాలుఁ డా
రామక్షోణికిఁ జన్ననాఁటఁగోలె నిద్రాసౌఖ్యము ల్మానినాఁ
డేమో యంచు వచింప వింటిఁ దమలో నేకాంతలీలాగతిన్. 76

ఏమేహేమలతాయటంచున్=ఓసి హేమలతా యేమే యనియును, పనియేమే మాధవీయంచున్ = ఓసిమాధవీ కార్యమేమేయనియును, ఈభామామన్మథుచంద మెట్లనుచున్=స్త్రీజనమన్మథుఁడయిన యీయనవర్తమాన మేలాగంటివే యనియును, చెప్పంజాలన్=నేఁజెప్పజాలను, భూపాలుండారామక్షోణికిఁ జన్ననాఁటఁగోలె=రాజు క్రీడావనభూమికిఁ బోయినదిమొదలుకొని, నిద్రాసౌఖ్యముల్మానినాఁడేమోయంచున్ = నిద్రాసంబంధములయిన సుఖభావములను మానినాఁడు-అనఁగా నిద్రఁజెందకయున్నాఁ డదెందువల్లనో కాని యనియును, తమలో నేకాంతలీలాగతిన్ = తమలోఁదాము రహస్యప్రకారముగా, వచింపన్=ఇయిద్దఱును సంభాషింపఁగా, వింటిన్ = నేనువింటిని, ఇందులో నుక్తిద్వయమును బ్రత్యుక్తిద్వయమును నని విచారింపవలయును.

క. ఆమాట కొంత చెవులకు, నామెతగాఁ బ్రియము విస్మయము నాదుమనో
భూమిఁ దళుకొత్త నృపమణి, ధామాభ్యంతరము సొచ్చి తడయక యచటన్.

ఆమాట=అనఁగా రాజు వనభూమికిఁ బోయి వచ్చినది మొదలుకొని నిద్రాసుఖము మానినాఁడన్నమాట, కొంతచెవులకు నామెతగాన్=కొంతకొంతచెవులకును విందగునట్టులుగాను, ప్రియము=ఇష్టమును, విస్మయము = ఆశ్చర్యము, నాదుమనోభూమిఁ దళుకొత్తన్ = నామనస్సున హత్తఁగాను, నృపమణి ధామాభ్యంతరము సొచ్చి=రాజుయొక్క రత్నమందిరములోఁ బ్రవేశించి, తడయక యచటన్=ఆలస్యముచేయక యాస్థలమందు, ముందరిపద్యముతో నన్వయము.

చ. మొలక మెఱుంగు కెంపు మొన ముక్కుల నిక్కు కిరీటిపచ్చ టా
చిలుకల కోళ్ళతోఁ జికిలి చెంద్రికవన్నియ పట్టుపట్టెతోఁ
దొలఁకుపసిండి వ్రాఁత తెరతో నెఱితావుల మేలుకట్టుతోఁ
జలువలు చిందు ముత్తియపుఁ జప్పరమంచముపై మహోన్నతిన్. 78

మొలకమెఱుంగు కెంపుమొనముక్కులనిక్కు = పద్మరాగరత్నాంకురములచేతఁ గల్పింపఁబడిన ముక్కులుగలిగి నిక్కుచున్న, కిరీటిపచ్చటాచిలుకలకోళ్ళతోన్ = మరకతమణి నిర్మితములైన చిలుకలుగల కోళ్లతోడను, చికిలిచెంద్రికవన్నియ పట్టుపట్టెతోన్ = తళుకుగల సిందూరవర్ణపు పట్టునవారుతోడను, తొలఁకుపసిండివ్రాఁత తెరతోన్ = తులకించుచున్న బంగారపువ్రాఁతపనిగల తెరతోడను, నెఱితావుల మేలుకట్టుతోన్ = నిండారయిన సువాసనలుగల చందువాతోడను - అనఁగా వితానముతోడను, చలువలు చిందు ముత్తియపుఁ జప్పరమంచముపైన్ = చలువలు ప్రసరించుచున్న ముత్యాలుగూర్చిన

దోమతెర మంచముమీఁద, మహోన్నతిని = అధికౌన్నత్యముచేత, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

సీ. నేసకొప్పున జాఱు • చెంగల్వమొగడలు జాగరారుణకటా • క్షములఁ బెనయ
నిద్దంపుఁగపురంపు • నిడుదయొంటులచాయ గండపాండిమకుఁ గై • దండయొసఁగ
నెత్తమ్మినూలిజ • న్నిదము శయ్యావివ ర్తనలూనహార సూ • త్రములఁ బెనఁగఁ
బలుచనివలిపెదు • వ్వలునతావియ చిక్కఁ బూసినగందంపుఁ • బూఁతఁ బోల
తే. నొప్పుపుప్పొడిపఱపుపై • నొత్తగిల్లి
మోముదమ్మి తలాడపై • మోపి యడుగుఁ
జివురు చిగురాకుబటువునఁ • జేర్చి చిత్ర
ఫలక మీక్షించునాసార్వ • భౌముఁ గంటి. 73

నేసకొప్పునజాఱు = చెంపకొప్పువలన జాఱుచున్న, చెంగల్వమొగడలు = ఎఱ్ఱగలువమొగ్గలు, జాగర=నిద్రవేగించుటచేత, అరుణ = ఎఱ్ఱఁబడిన, కటాక్షములన్ = క్రేఁగన్నులతోడ, పెనయన్ = మిళితమగుచుండఁగాను, నిద్దంపు = తేటగలిగిన, కపురంపు = కర్పూరముతోఁ జేయఁబడిన, నిడుదయొంటులు = సోగలయిన పాలకాయయొంట్లు - అనఁగాఁ గుండలములు; వానియొక్క, చాయ = కాంతి, గండపాండిమకుఁ గైదండయొసఁగన్ = చెక్కులయందలి విరహజనిత ధవళిమకుఁ జేయూఁతయియ్యఁగాను, నెత్తమ్మినూలిజన్నిదము = మృణాలతంతు నిర్మితమైన యజ్ఞోపవీతము, శయ్యావివర్తన = పరపుపైని పొర్లాడుటచేత, లూన=తెగిన, హార = ముత్యాలహారములయొక్క, సూత్రములన్ = దారములతోడ, పెనఁగన్ = పెనచుకొనఁగాను, పలుచని వలిపెదువ్వలువ = తేలికయైన సన్నపుమప్పటి, తావియ చిక్కఁబూసినగందంపుఁబూఁతఁబోలన్ = పరిమళముమాత్రమే నిలుచునట్లుగ పలుచనఁగాఁ బూసిన శ్రీచందనలేపనముతో సమానమై కనుపింపఁగాను,

ఒప్పుపుప్పొడిపఱపుపై నొత్తగిల్లి = ఒప్పుచుండెడు పుష్పపరాగముచేత రచింపఁబడిన శయ్యమీఁద నొత్తగిలి పరుండి, మోముదమ్మి తలాడపై మోపి = కమలసదృశమైనముఖము తలగడమీఁద నానించి, అడుగుఁజివురు = పాదపల్లవము, చిగురాకుబటువునఁజేర్చి = చిగురుటాకులతోఁ జేసిన బటువుబిళ్ళమీఁదను అనఁగా గుండ్రని చిన్నబాలీసుమీఁద మోపి, చిత్రఫలకమీక్షించు = చిత్తరువు వ్రాసిన పలకను జూచుచున్న, ఆ సార్వభౌముఁ గంటిన్ = సర్వభూమిపాలకుఁడైన యావసురాజును జూచితిని. కడగంటి చూపులందుఁ గెంజాయయుఁ జెక్కులందుఁ బాండువర్ణమును జన్నిదములు హారములతోఁ బెనఁగొనుటయు మేన గందపుఁబూఁత యలరుటయుఁ బుప్పొడిపఱపుపైఁ దమ్మితలగడనుపయోగించుటయుఁ జూడ వసురాజు వలపురాయిడిచే నిదుర మానెననియు, విరహవ్యథాభరమున శయ్యపైఁ బొరలుచుండెననియు, వలపుతాపమునకు నైపఁజాలక శిశిరోపచారములు గావించుకొనుచుండె ననియుఁ దోఁచుచున్నది. ఇందులకుఁ గారణము చిత్రపటమును సందర్శించుట.

ఇం దనంగదశావిశేషములగు జాగరణము కృశించుట లోనగునవస్థలు చెప్పఁబడినవి. అనంగదశలు.

శ్లో. "చక్షుః ప్రీతి ర్మనస్సంగ స్సంకల్పోథ ప్రజాగరః
అరతి స్సంజ్వరః కార్శ్యం లజ్జాత్యాగో భ్రమో మృతిః
దశావస్థా భవం త్యేతే విప్రలంభేఖిలా ఇతే"

"అభిలాషచింతనానుస్మృతిగుణసంకీర్తనోద్వేగాః"
"చక్షుః ప్రీతిః ప్రథమం చింతాసంగస్తతోఽథసంకల్పః
నిద్రాచ్ఛేదస్తనుతా విషయనివృత్తిస్త్రపానాశః"

చ. కనుఁగొని యానృపాలకశి◆ఖామణిడెందము శైలకన్యకా
మననమహానురాగఝర◆మగ్నమొ కాక ప్రియాంతరస్పృహా
ఘనరసపోషరూపితమొ ◆ కందము గా కని గంధతైలభా
జనభవనప్రదీపికల◆చాటున నల్లనఁ బొంచి యుండఁగాన్. 80

కనుఁగొని = చూచినదానవై, ఆనృపాలకశిఖామణిడెందము = ఆరాజశ్రేష్ఠునియొక్క హృదయము, శైలకన్యకా = గిరికావిషయమైన, మననమహానురాగ = అనుసంధానయుక్తమైన యధికప్రేమ యనెడు, ఝర = ప్రవాహమందు, మగ్నమొ = మునిఁగియున్నదో - అనఁగా గిరికానురాగాధీనమై యున్నదో, కాక=అట్లుకాక, ప్రియాంతర = మఱియొక ప్రియురాలివిషయమైన, స్పృహా = ఆసక్తి యనెడు, ఘనరసపోష = జలసమృద్ధిచేత, రూపితమొ = వ్యాపింపఁబడినదో - అనఁగా ముంపఁబడినదో, కందముగాకని=చూతముకాక యని, గంధతైల = సంపంగినూనెతోఁగూడిన, భాజన=పాత్రల యందలి, భవనప్రదీపికల = గృహదీపములయొక్క, చాటునన్ = మరుగున, అల్లఁ బొంచియుండఁగాన్=తిన్నగా డాగియుండఁగాను, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. వసురాజు అనురాగముతో వంతనొందుచున్నాఁడని మంజువాణి తెలిసికొనెనుగాని గిరికాదేవి కొఱకా? అన్యకాంత కొఱకా యనునది విచారణీయాంశముగాఁ దెలిసికొనుటకుఁ బొంచియుండెను.

చ. ఉసురనుఁ గన్ను మోడ్చుఁ దల◆యూచుఁ దలంచు నగుం జెమర్చు న
ల్దెసలు గనుంగొనుం బొరలు ◆ లేచు వడంకుఁ జలింపకుండు హా
ప్రసవసుగంధి యంచుఁ బువు◆పాన్పున వ్రాలు నృపాలపుంగవుం
డసమశరప్రవీరనిశి◆తాశుగదుర్దినధూయమానుఁడై. 81

నృపాలపుంగవుండు = నరపాలశ్రేష్ఠుఁడైన వసురాజు, అసమశర = మన్మథుఁడనెడు, ప్రవీర = వీరశ్రేష్ఠునియొక్క, నిశిత=వాఁడిగలిగిన, ఆశుగ = బాణములవలన నయిన, దుర్దిన = ముసురుదినముచేత- అనఁగా వర్షముచేత, ధూయమానుఁడై =కంపింపఁబడుచున్నవాఁడై, ఉసురనున్ = ఉస్సురని నిట్టూర్పు పుచ్చును, కన్నుమోడ్చున్ = కన్నులు మూసికొనును, తలయూచున్ = శిరఃకంపము సేయును, తలంచున్ = తలఁచుకొనును, నగున్ = నవ్వును, చెమర్చున్ = చెమటతోఁగూడుకొనును, నల్దెసలు గనుంగొనున్ = నాలుగుదిక్కులును గలయఁజూచును, పొరలున్ = పొరలుకాడును, లేచున్ = దిగ్గున లేచును, వడంకున్ = కంపించును, చలింపకుండున్ =కదలక యూరకుండును,

హాప్రసవసుగంధియంచున్ = హాపుష్పగంధీయని, పువుపాన్పున వ్రాలున్ =పుష్పశయ్యమీఁదఁ బడును. ఇందులో నుసురనుట పొరలుట చింతయనెడు సంచారిభావమున కనుభావములు.పొరలుట తాపకార్యము, తాపము చింతాకార్యము, తలయూచుట స్మృతియనెడు సంచారిభావమున కనుభావము. తలంచుట స్మృతియనుసంచారిభావము, నగుటయును నల్దెసలు గనుంగొనుటయును లేచుటయును, హా ప్రసవసుగంధియంచుఁ బువుపాన్పున వ్రాలుటయును నున్మాదమనెడు సంచారిభావమున కనుభావములు

చెమర్చుటయును వడంకుటయును జలింపకుండుటయును స్వేదవేపథుస్తంభములనెడు సాత్త్వికభావములు. ఇచటఁ గ్రియాసముచ్చయాలంకారము.

క. భావగతభావనాసం, భావితభావంబు లిట్లు • మల్లడిగొని గో
త్రావల్లభుఁ డిట్లను జి, త్రావేశితవనితఁ గని మ•హామోహమునన్. 82

భావగత=చిత్తగతములైన, భావనా = సంస్కారములచేత, సంభావిత = స్వీకరింపఁబడిన, భావనంబులు=సాత్త్విక సంచారిభావములు, ఇట్లు = ఈపైనిఁజెప్పఁబడిన ప్రకారముగా, మల్లడిగొనన్ = చుట్టఁబెట్టఁగా, గోత్రావల్లభుఁడు = వసురాజు, చిత్రావేశిత వనితఁగని = చిత్తరువులోఁ జేర్పఁబడియున్నస్త్రీనిఁ జూచి, మహామోహమునన్ =అధికమయిన మోహముచేత, ఇట్లనున్ = వక్ష్యమాణప్రకారముగా నొక వాక్యము పలికెను.

ఉ. ఏమిటి కల్గితే కువల•యేక్షణ పల్కవిదేటికే వధూ
టీమణి యేల తా కటికి•డెందము పూనితివే లతాంగి య
య్యో మనసారఁ దావకప•యోధరపాళి దృఢాంకపాళి యీ
వే మృదువాణి నీకు నొక•యెగ్గును జేయఁ గదే తలోదరి. 83

ఏమిటికల్గితే కువలయేక్షణ = కలువఱేకులవంటి కన్నులుగలదానా యొందుకల్గితివే, వధూటీమణి=స్త్రీలలోపల శ్రేష్ఠురాలవైనదానా, పల్కవిదేటికే = మాటలాడవిది యొందుకే, లతాంగి = తీఁగెవంటి దేహముగలదానా, ఏల = ఎందుకొఱకు, తా = తాయివంటి, కటికి = కఠినమైన, డెందము = హృదయమును, పూనితివే = వహించితివే, అయ్యో = అక్కటా, మనసారన్ = మనస్సుదీరునట్టులుగా తావకపయోధరపాళి = నీయొక్క కుచపాళియొక్క, దృఢాంకపాళి = గాఢాలింగనమును, (ని, 'అంకపాళిః పరిష్వఙ్గ స్సంశ్లేష ఉపగూహనమ్' అని యమరశేషము.) ఈవే = ఇయ్యవే, మృదువాణి = మృదువైన వాక్యములుగలదానా, నీకు నొకయెగ్గును జేయఁగదే = నీ కొక్క తప్పిదమైనను జేయలేదుగదే, తలోదరీ = ఓవనితా.

ఇక్కడ ఏమిటి యనెడు పదమునందలి మధ్యమివర్ణము లుప్తమైనదిగనుక ఏటికనియుఁ బ్రయోగింపఁబడినది. ఇందుకు, (శ్లో. 'భూయోపి దేశ్యశబ్దేషు లోపవర్ణాగమశ్రుతిః') అని యథర్వణవచనము.

చ. అళులకు మోము ద్రిప్పుగతి • నంచల రాఁ జెలిఁ బిల్చురీతి రా
చిలుకకుఁ బండ్లు గోయు క్రియఁ • జిత్రగృహంబుననుండి పోవుచున్
సొలపున నీవు నన్నుఁ ఆలి • చూడఁ ద్రిశుద్ధిగ నేలి తంచు నే
నలరితిఁ గాని భావజుని • కగ్గము సేయు టెఱుంగఁ గోమలీ. 84

అళులకు మోముద్రిప్పుగతిన్ = ముఖపద్మవాసనకు ముసురుకొనెడు తుమ్మెదలకుఁగాను ముఖము మళ్ళించినట్టులును, అంచలరాఁ •జెలిఁ బిల్చురీతిన్ = పార్శ్వమందుఁగూడవచ్చెడు నిమిత్తము చెలికత్తియను వెనుకఁదిరిగి పిలిచినట్టులును, రాచిలుకకుఁ బండ్లుగోయుక్రియన్ = రాజకీరమునకుఁ బండ్లు గోయునిమిత్తము వెనుకకు మళ్ళిచూచినట్టులును, చిత్రగృహంబుననుండి పోవుచున్ = రత్నచిత్రితమయిన గృహములోనుండి పోవుచును, సొలపున నీవు నన్నుఁ ఆలిచూడన్ = దీనభావముచేత నీవునన్ను

వెనుకఁదిరిగిచూడఁగాను, త్రిశుద్ధిగ నేలితంచు నేనలరితిఁగాని = త్రికరణశుద్ధియనఁగా మనోవాక్కాయ శుద్ధిగా నన్నుఁ జేకొంటివని నేను సంతోషించితినిగాని యని యర్థము. త్రివారదర్శనమనిభావము. కోమలీ = ఓతరుణీ, భావజుని కగ్గము సేయుటెఱుంగక = మన్మథునికప్పగించుట గుర్తెఱుఁగనైతిని. అళులకు మోముద్రిప్పుటనుబట్టి నాయిక పద్మినీజాతియని ద్యోతకమగును. కావుననే అళులు మూఁగుటయు మోము ద్రిప్పుటయునని యెఱుంగునది. పద్మినీస్త్రీలక్షణము.

శ్లో. "పద్మముకుళమృద్వీప్రఫుల్లరాజీవగంధీ సురతపయసి యస్యాః సౌరభం దివ్యమంగే,
చకితమృగదృగాభే ప్రాంతరక్తేచనేత్రే స్తనయుగళ మనర్ఘం శ్రీఫలశ్రీవిడంబి.
వ్రజతి మృదుసలీలం రాజహంసీవతన్వీ త్రివళిలలితమధ్యా హంసవాణీసువేషా,
మృదుశుచిలఘుభుంక్తే మానినీగాఢలజ్జా ధవళకుసుమవాసా వల్లభా పద్మినీస్యాత్."
(రతిరహస్యము.)

అంచలరాక అనుచో అంచలఁరాక అనుపాఠముకల్పించి యొకవ్యాఖ్యాత హంసలు వెంట వచ్చుచుండ నను నర్థము తెలిపి అంచల = అనఁగాఁ బార్శ్వమున నను నర్థము కనుపింపదని వ్రాసి యున్నాడు. కాని అంచలయనఁ బార్శ్వమం దనుటకుఁ బూర్వకవిప్రయోగములు గలవు.

ద్విపద. జాళువాగిండి యంచలఁ దాల్చి శుకుఁడు. విష్ణుమాయావిలాసము.

ఆ. గురునిగుణముకోజ♦గిరులుగాంచినఁ గాంచుఁ, గాక నీమనంబు ♦ గాంచనేల
తల్లికుటిలవృత్తి ♦ తగుఁ గాక కురులకు, నింత నీదుచెయ్వు ♦ లెనయ నేల. 85

ఇంతి = ఓమగువా, గురునిగుణము = నీతండ్రియైన కోలాహలగిరియొక్క కాఠిన్యమును, ఉరోజగిరులు గాంచినఁ గాంచుఁగాక = నీకుచగిరులు బొందినఁ బొందునుగాక - అనఁగా గిరిగుణము గిరుల కుపయుక్తమనుట. ఇక్కడ గురుత్వవాచకమయిన గురుశబ్దమును బుచ్చుకొన్నాఁడు గనుక గురుఁడయిన కోలాహలుని కాఠిన్యపుగుణము గురువులయిన నీకుచముల కుపయుక్తమనియును' జెప్పవచ్చును. నీమనంబు గాంచనేల = నీ మనస్సును నట్టికాఠిన్యపుగుణము నేల పొందవలయును, తల్లికుటిలవృత్తి = నీకుఁదల్లియై కుటిలగామినియైన శుక్తిమతియొక్క కుటిలత్వము, తగుఁ గాక కురులకుక =నీ తలవెండ్రుకలకుఁ దగుఁగాక-అనఁగాఁ గుటిలగామినియొక్క కుటిలత్వము కుటిలములయిన కురుల కుపయుక్తమనుట. నీదుచెయ్వు లెనయనేల = నీయొక్క చేష్ట లట్టి కుటిలత్వము నెందుకు పొందవలయును.

సీ. కలికిపెన్నెఱులింద్ర♦శిలలయందముఁ జూపుఁ జూపుక్రొన్ననవిల్తు♦తూపుచిలుకు
చిలుకుతేనియల జొ♦బ్బిలుమోవి సురమణి రమణీయవజ్రాళి♦రదనపాళి
పాలిండ్లు పసిఁడిగు♦బ్బలులయి చెన్నారు నారు శాతకృపాణి♦యంద మెఱుఁగు
మెఱుఁగుచక్రమునుమించు♦మించులజఘనము ఘనమూరురుచికరి♦కరముకన్నఁ
తే. గన్నశవుసేయుఁ గచ్ఛపా♦కారగరిమఁ, గరిమరాళికయాన నీ♦చరణమహిమ
మహిమనోభవమణిపుత్త్రి♦మాడ్కినీకు, నీకుటిలకర్కశతమాను♦నేలకలికి. 86

కలికిపెన్నెఱులు = సుందరమైన సోగవెండ్రుకలు, ఇంద్రశిలలయందముఁ జూపుక = ఇంద్రనీలచ్ఛాయలను దెలుపును, చూపు = కనుచూపు, క్రొన్ననవిల్తుతూపు చిలుకు = మన్మథబాణము యొక్క యలుఁగు-అనఁగా ములికి యనుట. చిలుకుతేనియల జొబ్బిలుమోవి = చిందుచున్న తేనియల

చేత జొబ్బిల్లుచున్న యెఱ్ఱని పెదవి, సురమణి = చింతామణి, రదనపాళి = దంతపంక్తి, రమణీయ వజ్రాళి = చక్కని వజ్రమణిశ్రేణి, పాలిండ్లు = స్తనములు, పసిఁడిగుబ్బలు లయిచెన్నారున్ = బంగారు కొండలవంటివై యొప్పును, అరు = నూఁగారు, శాతకృపాణి యందమెఱుఁగున్ = తీక్ష్ణమైన ఖడ్గము యొక్క సౌందర్యమును గుర్తెఱుఁగును - అనఁగా సారీతిగానే యుండు ననుట. జఘనము = కటిపురోభాగము, మెఱుఁగుచక్రముల్ = మెఱుపుగల రథచక్రమును, మించులన్ = కాంతులచేత, మించున్ = అతిక్రమించును, ఊరురుచి = తొడలయొక్కశోభ, కరికరముకన్నన్ = గజతుండమునకంటె, ఘనము = శ్రేష్ఠము.

కరి = ఏనుఁగుయొక్కయు, మరాళిక = హంసాంగనయొక్కయు, యాన = నడకలవంటి నడకలు గలదానా, నీ చరణమహిమ = నీయొక్కచరణోపరిభాగసౌందర్యము, కచ్ఛపాకారగరిమన్ = కూర్మాకృతియొక్క యతిశయమును, కసవుసేయున్ = అగడుసేయును. ఎట్లనిన, మహిన్ = భూమి యందు, మనోభవ మణిపుత్రిమాడ్కిన్ = మన్మథునియొక్క రత్నప్రతిమవలె, నీకున్ = నీకును, ఈ కుటిల కర్కశత మానునేల కలికి = ఈ యసాధ్యమయిన కఠినత్వము-అనఁగా నిర్దయత్వ మెందుకు మానునో సుందరీయని యర్థము.

ఈ పద్యమందుఁ గలికియనెడుపదమును నాద్యంతములయందుఁ జెప్పినాఁడు. 'కలికియొప్పిదంబుకాంతమయ్యె' నని నిఘంటువు. దీనం గాంతియను కావ్యగుణము చెప్పంబడియెను. కరిమరాళిక అనుచోట సమాహారద్వంద్వము గావున నపుంసకము. మరాళిక అని స్వార్థకప్రత్యయముఁ జేసినచో ననుకూలముగా నుండును. కఠినభావమును బట్టి మణిపుత్రియనియు వలపు నెఱపుటంబట్టి మనోభవమణి యనియు భావము. పూర్వపద్యమునందలి కఠినత్వము కుటిలత్వ మిందుఁ జెప్పఁబడినవి.

చ. అని విభుఁ డింతిఁ బల్క విని • యప్రతిమానసుధాపయోధిజీ
వనములఁ దేలినట్లు బహు•వాసరపుణ్యఫలంబు కన్నులం
గనుఁగొనఁ జాలినట్లు త్రిజ•గంబులు నొక్కట యేలినట్లు ప
ద్మనయనలార సంతసముఁ • దాల్చితి మామకమానసంబునన్. 87

అని = ఈ ప్రకారముగా, విభుఁడు = వసురాజు, ఇంతిఁబల్కన్ = గిరికాదేవినిగూర్చి పల్కఁగా, విని = విన్నదాననై, అప్రతిమాన = అసమానమయిన, సుధాపయోధి = అమృతసాగరముయొక్క, జీవనములన్ = జలములయందు, తేలినట్లు = ఓలలాడినట్టులుగాను, బహువాసరపుణ్యఫలంబు = అనేక దినములు చేసిన సుకృతఫలము, కన్నులం గనుఁగొనఁజాలినట్లు = కన్నులఁజూచినట్టుగాను, త్రిజగంబులు నొక్కట యేలినట్లు = మూఁడులోకములు నొక్కసారిగానే యేలినట్టులుగాను, పద్మనయనలార = ఓ చెలులారా, మామకమానసంబునన్ = నామనస్సునందు, సంతసముఁ దాల్చితిన్ = సంతోషమును వహించితిని.

సుధాప్లావనము, తపఃఫలసందర్శనము, త్రిజగత్పరిపాలనము సంతోషకారణములు. వసురాజు గిరికను వలచినటుల నిశ్చయింపఁదగినపలుకులు ఈమాటకంటె మిగుల సంతోషప్రదములు గాన మంజువాణి యానందము నిరుపమానము.

ఉ. వెండియు దూఱుచుండెఁ బృథి•వీపతి యానరలోకపుష్పకో
దండునిఁ బల్కరించి వని•తామణియున్కియుఁ దెల్పి యాత్మకుం
బండు వొనర్తు నంచు నృప•మంచసమంచితయంత్రపుత్రికా
మండలిలోన నొక్కమణి•మండితపుత్రిక నై రయంబునన్. 88

వెండియున్ = మఱియును, దూఱుచుండెఁ బృథివీపతి = వసురాజు గిరికాదేవి నుద్దేశించి నిష్ఠురవాక్యములు పలుకుచుండెను. ఆనరలోక పుష్పకోదండునిఁ బల్కరించి = నేను నానరలోక మన్మథుఁ డయిన వసురాజును మాట్లాడించి, వనితామణియున్కియుఁ దెల్పి = మనగిరికాదేవియున్న యునికియు నాయనకు విశదపఱిచి, ఆత్మకుంబండువొనర్తునంచున్ = ఆయాత్మకు నుత్సవము సేయుదుఁ గాక యని, నృపమంచసమంచిత = రాజుయొక్క మంచముదాపున నొప్పుచున్న, యంత్రపుత్రికా = కీలుబొమ్మలయొక్క, మండలిలోనన్ = గుంపులోపల, ఒక్కమణిమండితపుత్రికనై = నేను రత్నమయమయిన యొక బొమ్మనై, రయంబునన్ = శీఘ్రముగా, ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

రాజు మరల మరల దూషించి గిరిక నగడుసేయుట వలపు పరుసమున, ప్రతిక్రియ చెలియునికి యెఱుఁగఁజేయుట అది భూలోకమన్మథుఁ డగు రాజున కుత్సవకారణము. అందులకు మంజువాణి రాజును మఱియుం సమీపించెను.

చ. పకపక నవ్వి యోవసున్నృ•పాలక బాలిక దూఱె దేల సా
రెకుఁ బరతంత్ర లింతులు వ•రింతురె కాంతులఁ దమ్ముఁ దామ క
న్యకలకు నేరమా యది య•నన్యగతిన్ సుదతిన్ మనోజబా
రికి నెరఁ జేసి లోఁ గనిక•రింపనివారివి కాక నేరముల్. 89

పకపకనవ్వి=పకపకనవ్వినదాననై, ఓ వసున్నృపాలక=ఓ వసురాజా, బాలికదూఱెదేలసారెకున్ = ఆచిన్నపడుచ నెందుకు పలుమాఱును నిందించుచున్నావు, పరతంత్రలింతులు = స్త్రీలు పరాధీనలు, వరింతురె కాంతులఁ దమ్ముఁదామ = కాఁబట్టి తమకుఁదామే పెనిమిటులను వరింతురా - అనఁగా వరింపరుగదా యనుట. కన్యకలకు నేరమాయది = అట్లువరింపకపోవుట పడుచులకు నేరమా - అనఁగా నేరముకాదనుట. ఇఁక నేమనిన, అనన్యగతిన్ =మఱియొక రేలుకొనఁదగినవాడు లేకయున్నట్టి, సుదతిన్ = స్త్రీని, మనోజబారికి నెరఁజేసి = మన్మథబాధకుఁ బాల్పడఁజేసి, లోఁగనికరింపనివారివిగాక నేరముల్ = మనస్సులో జాలిపడకుండెడువారివే తప్పిదములు గాక, కన్యకలు పురుషులను దామై వరింపకపోవుట నేరము గాదని సంబంధము. వసురాజు సంభాషణము పరిహాసపాత్రముగ నున్నది. కావునఁ బ్రోడయగు మంజువాణి పకపక నవ్వినది. ఇంతులు పరాధీనలు. అందు గిరిక కన్యక తనకయి తాను వరింపఁజాలదు. ఈలోపము బాలికను వలపునకు గుఱి యొనరించి కనికరించనిమగవానిది. అట్టిచో వసురాజు గిరికను దూషించుట యయుక్తము.

శా. మాయాశీలురు చంచలాత్ము లనుకం•పాశూన్యు లాత్మైకకా
ర్యాయత్తు ల్సమయానుకూలహృదయ•వ్యాపారగోపాయనో

పాయజ్ఞు ల్మగవార లాపయి మహీపాలు ర్మహావైభవ
శ్రీయోగాంధులు సెప్ప నేల మగవారిన్ నమ్మఁగా వచ్చునే. 90

మాయాశీలురు = కృత్రిమస్వభావులు, చంచలాత్ములు = నిలుకడలేని మనస్సుగలవారును, అనుకంపాశూన్యులు = దయారహితులును, ఆత్మైకకార్యాయత్తుల్ = స్వకార్యపరులును, సమయానుకూల= అప్పటిసమయమునకుఁ దగునట్టులుగా, హృదయవ్యాపార = మనోవ్యాపారముయొక్క, గోపాయన = రక్షణమందలి, ఉపాయజ్ఞుల్ = నేర్పు గుర్తెఱిఁగినవారును, మగవారలు = పురుషులు-అనఁగాఁ బురుష సామాన్యులే యిట్టివారనుట. ఆపయిన్ = అందుమీఁదట, మహీపాలురు = భూపాలకులు, మహావైభవ శ్రీయోగాంధులు = అధికవైభవసమృద్ధియొక్క సాంగత్యముచేతఁ గన్నుగాననివారు కాఁబట్టి, చెప్ప నేల = వారిమాటచెప్ప నేపనిలేదు. మగవారిన్నమ్మఁగావచ్చునే = మగవారినినమ్మవచ్చునా-అనఁగా నెన్ని విధములచేతను బురుషులను నమ్మనేకూడదనుట. అనుకంపయనుటకు- (ని. 'కృపా దయానుకంపా స్యా దనుక్రోశః' అని యమరము.) మగవారే కుటిలురు. అందు రాజులు ఐశ్వర్యయోగముచేఁ గనులు గలిగిన గ్రుడ్డివారు. మగవారిని నమ్మరాదు. ఐశ్వర్యవిశిష్టులగురాజుల నంతకుమున్నె నమ్మరాదనుట. అలం. కావ్యలింగము.

ఉ. అంటి ననంగ నంగజ నిభాంగుఁ డభంగురవిస్మయార్ణవం
బంటినచూడ్కితో విని ప్రియాహృదయానుశయాగ్నిసూచనం
గంటకితాఖిలాంగుఁ డయి కంతువనాటవిపాటఘాటసం
లుంటిత మైనడెందము ఝలుక్కని పెక్కుతలంపు లూరఁగాన్. 91

అంటిన్ = ఈప్రకారముగా నేనంటిని, అనంగన్ = అనఁగానే, అంగజనిభాంగుఁడు=మన్మథాకృతివంటి యాకృతిగల యావసురాజు, అభంగుర విస్మయార్ణవం బంటినచూడ్కితో విని = అవిచ్ఛిన్నమయిన యాశ్చర్యసముద్రముచేత నావరింపఁబడిన చూపుతో విన్నవాఁడై, ప్రియా = ప్రియురాలయిన గిరికయొక్క, హృదయానుశయాగ్ని = హృదయతాపానలముయొక్క, సూచనన్ = సూచనచేత, కంటకిత=గగురుపొడిచిన, అఖిలాంగుఁడయి = సకలావయవములు గలవాఁడై, కంతు = మన్మథుఁడనెడు, వనాట = కిరాతునియొక్క, విపాటఘాట = విదారణార్థమయిన శస్త్రవిశేషముచేత, (ని. 'ఘాటా నికుఞ్జే కాంతారే వ్రణాదీనాం చ మారణే' అని మేదిని.) సంలుంటితమయిన = లెస్సగా భేదింపఁబడిన, డెందము=హృదయము, ఝలుక్కని = ఝల్లుమని, పెక్కుతలంపులూరఁగాన్ = అనేకభావము లుదయింపఁగా-ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

ఉ. చారణకన్యయో ఖచరసారసగంధియొ కాక కిన్నరాం
భోరుహపాణియో చిలువపొల్తుకయో మఱి శైలకన్యకా
ధీరవయస్య యైనవనదేవతయో యొకమంజువాణి యే
తేరఁగఁ బోలు బాలగతిఁ దెల్పఁగ నిచ్చటి కద్భుతంబుగాన్. 92

చారణకన్యయో = చారణస్త్రీయో, ఖచరసారసగంధియొ = దేవతాస్త్రీయో, కాక = లేక, కిన్నరాంభోరుహపాణియో=కిన్నరస్త్రీయో, చిలువపొల్తుకయో = నాగకన్యకయో, మఱి = ఇదియునుంగాక, శైలకన్యకాధీరవయస్యయైన వనదేవతయో = కోలాహలశైలకన్యకయైన గిరికాదేవియొక్క

ప్రౌఢసఖియైన వనదేవతయో, ఒకమంజువాణి = మనోహరమయిన వాక్యములుగల యొకానొక-స్త్రీ, బాలగతిఁ దెల్పఁగన్ = గిరికయొక్క రీతిని దెలియఁజేసెదుకొఱకు, ఇచ్చటికిన్ = ఈస్థలమునకు, అద్భుతంబుగాన్ = ఆశ్చర్యమగునట్టులుగా, ఏ తేరఁగఁబోలున్ = వచ్చియుండవచ్చును. వయస్య యనుటకు- (ని. 'ఆళి స్సఖీ వయస్యా చ' అని యమరము.)

గిరికకు వనదేవతలు దేవతాంగనలు చెలిమికత్తియలు. కావుననే మంజువాణియు బాలికయవస్థ యెఱిఁగింప నరుదెంచి యుండును. మంజువాణి పేరు చెలికత్తెకుఁగూడ సరిపోవుట స్వారస్యము.

మ. అని యూహించి నదీతనూజతలఁ పాహా మామకప్రేమబం
ధనిమగ్నం బని పల్కు వింటి నిఁక నాతాపానలం బాఱెఁ బ్రా
క్తనపుణ్యంబు ఫలించెఁ బంచశరశస్త్రశ్రేణినిం జీరికిం
గొనఁ బో నే నిఁక నొక్కఁ డా ప్రియతమాఘోరార్తికిం గుందెదన్. 93

అనియూహించి = పయినిఁ జెప్పఁబడినప్రకారముగా నూహించి, నదీతనూజతలఁపు = గిరికాదేవియొక్క మనస్సంకల్పము, ఆహా = ఆశ్చర్యము, మామక = నాసంబంధమయిన, ప్రేమ=అనురాగమనెడు, బంధ = బంధనమందు, నిమగ్నంబని = మునిఁగియున్నదని-అనఁగా నా గిరికాదేవియొక్క కోరిక నా యనురాగమందు లీనమైయున్నదని, పల్కువింటిన్ = వచింపఁగా నాలించినవాఁడనైతిని, ఇఁక నాతాపానలం బాఱెన్ = ఇఁకమీఁద నాయొక్క తాపాగ్ని చల్లారెను, ప్రాక్తనపుణ్యంబు ఫలించెన్ = పూర్వసుకృతము ఫలించెను. ఏను=నేను, పంచశరశస్త్రశ్రేణినిం జీరికిం గొనఁబోన్ = మన్మథాయుధపంక్తిని గణ్యముసేయనుగదా, ఇఁకనొక్కఁడు = ఇఁకమీఁద నొకటి గలదు. అదియేమనిన, ఆప్రియతమా ఘోరార్తికిం గుందెదన్ = ప్రియతమురాలయిన యాగిరికయొక్క ఘోరమయిన వ్యథనుగురించి విచారపడుచున్నాను.

శా. నా డెందంబుననుండి కందెనొ కటా నన్నాత్మలో నుంచి తా
వాడం బాఱెనొ నేనె తా ననుట నావర్ధిష్ణుసంతాపచిం
తాడోలాకలనంబు దా నెనసెనో తథ్యంబు నావంకకై
తా డస్సెన్ నవలా యటంచు నొఱగెన్ దల్పప్రఘాణంబునన్. 94

నాడెందంబుననుండి కందెనో = విరహాగ్నితప్తమైన నాహృదయమందు నిలిచి కమలిపోయెనో, కటా = అయ్యో, నన్నాత్మలోనుంచి తావాడంబాఱెనో = లేక తపించుచున్న నన్నుఁ దనహృదయమందు నిల్పుకొని వాడిపోవుచున్నదేమో, లేక, నేనె తాననుటన్ = నేనే తానైయున్నందున-అనఁగాఁ దన్ను ధ్యానముచేసి తనయొక్క తాదాత్మ్యమును బొందియున్న దగుటచేత ననుట, నా=నాయొక్క, వర్ధిష్ణు=వృద్ధిఁబొందుచున్న, సంతాప=పరితాపముగల, చింతా=విచారమనెడు, డోలాకలనంబు=ఉయ్యాలయందలి యాందోళనమును, తానెనసెనో = తానుబొందెనో, తథ్యంబు నావంకకై తాడస్సెన్నవలా యటంచున్ = మీఁదఁజెప్పిన మూఁడువిధములచేత నిశ్చయముగా నానిమిత్తమై గిరికాదేవి తాను శ్రమపడెనుగదా యని పలుకుచు, తల్పప్రఘాణంబునన్ = శయ్యాంగణమందు, ఒఱఁగెన్ = వ్రాలెను. కందుట, వాడఁబారుట, చింతనొందుట, బడలుట విరహావస్థావిశేషములు. ఇవియన్నియుఁ దననుండి కలిగిన యవస్థలుగావున గిరికాస్థితి రాజునకుఁ బరితాపకారణ మయ్యెను. కావుననే శయ్యపై నొరిగి సంతాపాతిశయము ననుభవించెను. కందుట, వాడఁబారుట అనంగదశావిశేషములు.

చ. ఒఱఁగినఁ జూచి యానృపకు•లోత్తము చిత్తము కూర్మి కాత్మ ని
వ్వెఱపడి తాపవారకము • విస్మయనీయము నింతినెయ్యపు
న్గుఱుతును నైనమత్కరవి•నూతనహారము చేరఁ బోయి యా
నెఱదొరకంఠపీఠమున • నిల్పితి నిల్పఁ బ్రఫుల్లనేత్రుఁడై. 95

ఒఱఁగినఁజూచి = ఆరీతిగా శయ్యమీఁద వ్రాలఁగాఁ జూచి, ఆనృపకులోత్తము చిత్తముకూర్మికిన్ = ఆరాజవంశశ్రేష్ఠునియొక్క మనఃప్రేమకు, ఆత్మనివ్వెఱపడి = చిత్తమందాశ్చర్యపడి, తాపవారకమున్ = తాపమును బోఁగొట్టునదియును, విస్మయనీయమున్ = ఆశ్చర్యపడఁదగినదియు, ఇంతినెయ్యపున్గుఱుతును = గిరికాదేవియొక్క ప్రీతిపూర్వకమయిన యానవాలును, ఐన = అయినట్టి, మత్కరవినూతనహారము = నాచేతనున్న నవీనముక్తాహారమును, చేరఁబోయి = దగ్గరగాఁబోయి, ఆనెఱదొర కంఠపీఠమున నిల్పితిన్ = ఆమహారాజుయొక్క కంఠపీఠికయం దుంచితిని, నిల్పన్ = ఆలాగున నుంచఁగానే, ప్రఫుల్ల నేత్రుఁడై = వికసించిన నేత్రములు గలవాఁడై.

ఉ. అబ్బలభిన్నిభుండు మణి•హారముఁ దప్పక చూచి యౌర యెం
తబ్బుర మీయమూల్యమణి•హారము రాఁ గత మెద్ది యొక్కొ యే
గుబ్బెతహార మొక్కొ యిది • కూరిమి నేచెలి దెచ్చె నొక్కొ హా
నిబ్బర మైనతాపము జ•నింపదు వో యిది మేను సోఁకఁగాన్. 96

అబ్బలభిన్నిభుండు = ఇంద్రసమానుఁడయిన యారాజు, మణిహారముఁ దప్పక చూచి = ముత్యాలహారమును జలింపక చూచి, ఔర = భళా, ఎంతబ్బురము = ఎంతయాశ్చర్యము, ఈయమూల్యమణిహారము = విలువలేని యీముత్యాలహారము, రాఁగతమెద్దియొక్కొ = వచ్చుటకుఁ గారణమేమో, ఏగుబ్బెతహారమొక్కొ = ఏజవరాలియొక్క హారమో, ఇదికూరిమి నేచెలిదెచ్చెనొక్కొ = ఈహారము ప్రేమచేత నేస్త్రీ తీసికొనివచ్చెనో, హా = హా, ఇదిసుఖమం దనుకరణము. ఇది మేనుసోఁకఁగాన్ = ఈహారము శరీరము తగులఁగా, నిబ్బరమయిన తాపముజనింపదువో = నిశ్చలమయిన తాపము పుట్టకయున్నదిగదా. బలభిన్నిభుం డనుటవలన వసురాజు సౌభాగ్యాతిశయము సూచితము. తప్పకచూచుట ప్రేమాతిశయమువలన, ముత్తెపు హారములు తాపనివారణములు గావున నిఁక విరహతాపము జనింపదని నిశ్చయించుకొనెను. హారము మణిమయము, అమూల్యము నగుటవలన ఎవతెహారము ఎవరు తెచ్చిరి. ఎటులవచ్చెనని వసురాజు సంశయించెను.

హారములు తాపనివారణము లనుటకు—

శ్లో. 'సచందనాంబువ్యజనోద్భవానిలైః సహారయష్టిస్తనమండలార్పణైః
సవల్లకీకాకలిగీతనిస్వనై ర్విబోధ్యతే సుప్తఇవాద్య మన్మథః.' గ్రీష్మర్తువర్ణనము. ఋ-సం.

శా. ఈహారం బొకమాటు పిమ్మటికి నే • నెచ్చోటనో కన్నయ
ట్లూహం బయ్యెడి నీయమూల్యమణిహారోత్తంసముం జిత్రక
న్యాహారంబు సుదారవైఖరి నొకం • డై తోఁచె నీహారమా
నీహారాద్రిజకన్యహార మగు సం•దేహంబు లే దెంతయున్. 97

ఈహారంబు=ఈముత్యాలహారము, ఒకమాటు = ఒకసారి, పిమ్మటికిన్ =వెనుకటికి-అనఁగా ముందు, నేనెచ్చోటనో కన్నయట్లూహంబయ్యెడిన్ = నేనెక్కడనో చూచినట్టులుగాఁ దోఁచుచున్నది, ఈయమూల్యమణి హారోత్తంసమున్ = విలువలేని యీముత్యాలహారంబును, చిత్రకన్యాహారంబును = చిత్తరువుపలకయందలి చిత్రితగిరికయొక్క ముత్యాలహారంబును, ఉదారవైఖరి నొకండైతోఁచెన్ = అతిశయరీతిచేత నొక్కటిగాఁ గనుపడెను. కాఁబట్టి, ఈహారము = ఈముత్యాలహారము, ఆనీహారాద్రిజకన్యహారమగున్ = హిమాచలనందనుఁడయిన కోలాహలుని కొమార్తెయొక్క హారమే యవును, సందేహంబు లే దెంతయున్ = ఇందు కెంతమాత్రమును సంశయము లేదు.

ఊహాశబ్దమునకు ('సంభావనం యదిత్థం స్యా దిత్యూహో న్యస్య సిద్ధయే') అని చంద్రాలోకమునందుఁ బ్రయోగము. ఒకండనునది యమహత్తయిన హారమునకు విశేషణంబైనను డుజ్జు వచ్చినది. ఇందుకు-శ్లో. 'క్వచిదమహతోపి డుఙ్జ్వ్రైత్' అని శబ్దానుశాసనసూత్రము. ఈసూత్రమందలి యపి శబ్దమువలననే కాదిశబ్దములకును డుజ్జువచ్చునని యర్థము. ఇదిగాక 'ఏకాదేరమహతాంచడావున్న' అనెడు శబ్దానుశాసనసూత్రముచేత డుజ్ వర్ణము పరమమైయుండినను ఉత్వమురాదయ్యెనని గ్రహింపవలయును.

మాలినీవృత్తము. అని విభుఁ డెద నుంచున్ • హార మందందఁ గాంచుం
గనుఁగవఁ గదియించుం • గంఠపీఠిన్ ఘటించుం
దను వఖిలము చేర్చుం • దత్క్షణస్వేదధారా
ఘననయనజలంబుల్ • గాఢతన్మైత్రిఁ జూపున్. 98

అని=ఇట్లనిపలికి, విభుఁడు = వసురాజు, హారము = ముత్యాలహారమును. ఎదనుంచున్=ఱొమ్ము మీఁద నిలుపును, అందందఁ గాంచున్ = మాటిమాటికిని జూచుచు, కనుఁగవఁ గదియించున్=నేత్రయుగళమందుఁ జేర్చును, కంఠపాళిన్ ఘటించున్ = కంఠపీఠికయందుఁ గూర్చును-అనఁగా మెడను ధరించుకొనును, తనువఖిలముచేర్చున్ = శరీరమం దంతట హత్తించును, తత్క్షణ = ఆక్షణమందయిన, స్వేదధారా=శ్రమజలధారలచేత, ఘన = అధికమగుచున్న, నయనజలంబుల్ = బాష్పజలములను, గాఢతన్మైత్రిన్=దృఢమైన యాగిరికాదేవియందలి స్నేహభావమును, చూపున్ = కనుపఱుచును. ఈమాలినీవృత్తమునకు న న మ య య గణము లుండవలయును. తొమ్మిదవయక్షరము యతిస్థానము.

క. ఈగతి నారా జుపకం, ఠాగతనక్షత్రదామ • మభినవకరసం
యోగమున గారవించుచు, రాగోపనిబద్ధబంధురంబుగఁ బల్కెన్. 90

ఈగతిన్=ఈప్రకారముగా, ఆరాజు=ఆవసురాజు అని యర్థము. ఆచంద్రుఁడని యర్థాంతరము. ఉపకంఠాగత నక్షత్రదామము = కంఠప్రాప్తమైన నక్షత్రమాలికయనెడు ముక్తాహారము నని యర్థము. ని. 'సైవనక్షత్రమాలా స్యా త్సప్తవింశతిమౌక్తికైః' అని అ. ఉపకంఠ = సమీపమునుగూర్చి, ఆగత= వచ్చిన, నక్షత్రదామము = అశ్విన్యాది నక్షత్రసమూహము నని యర్థాంతరము. అభినవకరసంయోగమున గారవించుచున్=నూతనహస్తస్పర్శముచేత మన్నించుచు నని యర్థము. కిరణస్పర్శముచేత మన్నించుచు నని యర్థాంతరము. ఇంతపర్యంతమును బ్రకృతాప్రకృత శ్లేషాలంకారము. రాగ = స్వరవిశేషముచేతను ననురాగముచేతను, ఇక్కడ నర్థద్వయంబును బ్రకృతపరముగానే చూడవలయును. ఉప

నిబద్ధ = కట్టఁబడినదై, బంధురంబుగన్ = మనోహర మగుచుండునట్లుగా, పలికెన్ = పచించెను. అనఁగా స్వరభేదము ననురాగమును గనుపడునట్లుగా వచించె ననుట. ఏమనిన,

మ. కమనీయద్యుతిధామమా విమలము♦క్తాదామమా సేమమా
కమలామోదకుఁ దత్సఖీసమితికిం ♦ గల్యాణమా తన్మరా
ళమయూరీశుకశాబశారికల కెల్లన్ భద్రమా తెల్పుమా
ప్రమదారత్నము పేరుగా నెద నినుం ♦ బాటించి ప్రార్థించెదన్. 100

కమనీయ = మనోహరమైన, ద్యుతి = కాంతికి, ధామమా = స్థానమైనదానా, ఇక్కడ ధామశబ్దము ద్యుతివాచకము గాదు. పునరుక్తవదాభాసాలంకారము. విమల = స్వచ్ఛమైన, ముక్తాదామమా = మౌక్తికహారమా, కమలామోదకున్ = పద్మగంధియైన గిరికాదేవికి, సేమమా = కుశలమా, తత్సఖీసమితికిం గల్యాణమా = ఆగిరికయొక్క సఖీసమూహమునకు శుభమా, తత్ = ఆగిరికయొక్క, మరాళ = పెంపుడుహంసలకును, మయూరీ = ఆఁడు నెమళ్ళకును, శుకశాబ = చిలుకపిల్లలకును, శారికలకున్ = గోరవంకలకును, ఎల్లన్ = అన్నిటికిని, భద్రమా = సుఖమా, తెల్పుమా = తెలియఁజెప్పుము. ఏమనిన, ఆ ప్రమదారత్నము పేరుగా నెద నినుం బాటించి ప్రార్థించెదన్ = స్త్రీరత్నమయిన యాగిరికాదేవి హారుగా వక్షస్థ్సలమందు నిన్ను మన్నించి వేఁడుకొనుచున్నాను అని అర్థము. ఆగిరికాదేవియొక్క ముత్యాల పేరుగా నిన్ను వక్షస్థ్సలమందు మన్నించుచున్నానని భావము. కమలామోద యనుటవలన నాయిక పద్మినీజాతియనుట, సఖీజనులు వలపు గొలుపుటలోఁ జెలిమి నెఱపిరి గావున వారి సేమమును దెలిసికొనుట, మరాళమయూరాదులు గిరికనెచ్చెలులు విరహోద్దీపనదాయకములు. కగిరికవలపు మిక్కుటము చేయుటకుఁ దనయందామెను బద్ధానురాగ నొనర్చుటకు నవియె ప్రధానములుగాన వాని సేమమును దెలిసికొనఁ గోరెను.

మ. నిను భాగ్యాక్షరపంక్తిగాఁ దలఁతునో ♦ నిర్వేలమూర్ఛాపనో
దనదివ్యామృతధారగా మనమునం ♦ దర్కింతునో కాక మ
ద్ఘనపుణ్యద్రుమకోరకావళియ కాఁ ♦ గన్గొందునో ప్రేమ నే
మని వర్ణింతుఁ బ్రియాపయోధరవిహా♦రా హారవంశోత్తమా. 101

ప్రియా = ప్రియురాలైన గిరికయొక్క, పయోధర = కుచములమీఁద, విహార = విహరించునట్టి, హారవంశోత్తమా = ముక్తాహార కులశ్రేష్ఠమా, నినున్ = నిన్ను, భాగ్యాక్షరపంక్తిగాఁదలఁతునో = మాయొక్క భాగ్యవర్ణశ్రేణినిగా విచారింతునా, నిర్వేల = అమితమైన, మూర్ఛా = నన్నుఁబొందిన మూర్ఛయొక్క, అపనోదన = పోఁగొట్టుట యందలి, దివ్యామృతధారగాన్ = యోగ్యమైన యమృతధార యగునట్టులుగా, మనమునందర్కింతునో = మనస్సునం దూహింతునా, కాక = అట్లుకాక, మత్ = నాయొక్క, ఘన = అధికమయిన, పుణ్య = సుకృతమనెడు, ద్రుమ = వృక్షముయొక్క, కోరకావళియ కాన్ = పూమొగ్గల యొక్క పంక్తినిగానే, కన్గొందునో = చూతునా, ప్రేమ నేమనివర్ణింతున్ = నాకునీయందుండెడు ప్రేమచేత ఏమనికొనియాడుదును - అనఁగాఁ గొనియాడఁజాల ననుట.

హారవంశోత్తమా యనెడు సంబోధనమందు మువర్ణముచెప్పి తద్విశేషణమయిన ప్రియాపయోధరవిహారా యనెడు సంబోధనమందును మువర్ణకము చెప్పనందుకు నధర్వణవచనము. శ్లో॥ "అద్గ

భృఙ్గాదిశబ్దేభ్యో మ్వాది రామంత్రణేతువా' అని చెప్పంబడియున్నది. హారము సామాన్యమైనది కాదు. హారవంశోత్తమము కావుననే ప్రియాపయోధరప్రాంతవిహారభాగ్యాతిశయమును గడింపఁగలిగెను. హారగత రత్నములు పుణ్యాత్మరపంక్తివలెను, హారమువరుస అమృతధారవలెను, హారమణులు కోరకములవలెను నుండెనని భావము. ప్రియమైనదానిని సౌభాగ్యాక్షరపంక్తిగా వర్ణింతురు. ఇందులకు-

శ్లో. 'సౌభాగ్యాక్షరమాలికేవ లిఖితం పుష్పాయుధేన స్వయం
మధ్యస్థాపి కరోతి తాపమధికం రోమావళిః కేనసా.' (భర్తృహరి.)

చ. వనజముఖీ కుచోపరిని♦వాససుఖోన్నతి నున్కి మాని నా
మనికిత మార్ప వచ్చితివి ♦ మౌక్తికహారమ నీగుణంబు లే
మని వినుతింతు నట్టిద క♦దా యవదాతసువృత్తమూర్తు లెం
దును నిజసౌఖ్యభంగము గ♦నుంగొన రార్తులఁ బ్రోచువేళలన్. 102

వనజముఖీ = గిరికాదేవియొక్క, కుచోపరి= స్తనములయొక్కయుపరిభాగమందలి, నివాస సుఖోన్నతిన్ = నివాసమువలని సుఖాతిశయముచేత, ఉన్కిన్ = ఉండుటను, మాని=విడిచిపెట్టి, నామనికిత మార్పవచ్చితివి = నాయొక్కమనోవ్యథను బోఁగొట్టవచ్చినదానవైతివి, మౌక్తికహారమ = ముక్తామణిహారమా, నీగుణంబు లేమని వినుతింతున్ = నీయొక్క సద్గుణము లేమని కొనియాడుదును - అనఁగాఁ గొనియాడఁజాల నని యర్థము.

ముత్యాలయొక్క ఆణి సుపాణి సుతారము లనెడు మూఁడుగుణము లని భావము. ఇందుకుఁ బ్రమాణము-

క. 'అఱలేని చుక్క తెఱఁగున, మెఱయు సుతారంబు మేలిమిగ వట్రువయై
మెఱుఁగొందు పాణి ఘనమై, నెఱసిరి వట్రువ సుపాణి నిర్మలకాంతిన్.'

అని రత్నపరీక్షయందు, అట్టిదకదా = అదియుక్తమేకదా. ఏమనిన, అవదాత = పరిశుద్ధమైన, సువృత్త=సద్వర్తనముగలిగిన, మూర్తులు=స్వరూపముగల సుజనులని యర్థము. ముత్యములు శుభ్రంబును వర్తులంబునైన మూర్తిగలవని భావము. (శ్లో. 'అవదాత స్సితే పీతే విశుద్ధే ప్రవరే పిచ.' అని వి.) ఎందును = ఎక్కడను, ఆర్తులఁ బ్రోచువేళలన్ = వ్యథపడుచున్నవారిని రక్షించు సమయములయందు, నిజసౌఖ్యభంగము గనుంగొనరు = తమయొక్క సౌఖ్యము చెడిపోవుటను విచారింపరు.

వనజముఖీ కుచోపరినివాసము సుఖోన్నతి. అదిమానివచ్చుట రాజుమనోవ్యథ పోకార్చుటకు, అట్టిరాకగలవానిగుణములు అనిర్వాచ్యములు. నిజసౌఖ్యభంగము పుణ్యాత్ములు పాటింప రనుట కిదియొతార్కాణము. సువృత్తము లనుటవలన హారమణులు వట్రువగను అవదాత యనుటవలనఁ దెల్లగను నున్నవని భావము. హారము శ్వేతగణములోని దనుటకు సరస్వతీప్రార్థనము చూచునది.

చ. చెలుల మొఱంగి నాఁడు మణి♦చిత్రగృహంబున మోము వాంచి తో
య్యలి భవదేకదర్శితమ♦దాకృతిఁ జూచెఁ గదా వినీలకుం
తలహృదయంబు నీకు విది♦తంబు గదా యిఁక దాచ నేటికిన్
వెలఁదిమనంబు దెల్పఁ గద♦వే మణిహారమ నిన్ను వేఁడెదన్. 103

చెలుల మొఱంగి = చెలికత్తియలను వంచన చేసి, నాఁడు = అనఁగా నే నక్కడికివచ్చియున్న నాఁడు, మణిచిత్రగృహంబునన్ =రత్నచిత్రితమయిన గృహమందు, మోమువాంచి=సిగ్గుచేత ముఖము

పంచుకొని, తొయ్యలి = గిరికాదేవి, భవదేకదర్శితమదాకృతి=నీచేత ముఖ్యముగానట్టులుగాఁ గనఁబడిన- అనఁగా నీయందుఁ బ్రతిఫలించిన నాయొక్క రూపమును, చూచెఁగదా = చూచెనుగదా, వినీలకుంతల హృదయంబు నీకు విదితంబుగదా = ఆగిరికయొక్క మనస్సు నీకుఁ దెలియఁబడియున్నదిగదాయని యర్థము. ఆగిరికయొక్క వక్షస్థ్సలము నీకుఁ దెలియఁబడియున్నదిగదా యని భావము. ని. 'హృదయం మానసే రసేః' అని వి. ఇఁకదాచనేటికిక్ = ఇఁకమీఁద దాచిపెట్టవలసిన దేమి, వెలఁదిమనంబు దెల్పఁగదవే = గిరికాదేవియొక్క మనం బేలాగునున్నదో తెలియఁజెప్పఁగదవే, మణిహారమ = ముక్తామణిహారమా, నిన్ను వేఁడెదక్ = నిన్ను బ్రార్థించుచున్నాను. అని వెనుక కన్వయము.

గిరికరాజునుజూచి సిగ్గుపెంపునఁ దలవాల్చినది. కావునరాజదర్శనము హారమణియందుఁ దక్కఁ గనుపింపదుగావున భవదేకదర్శితమని చెప్పఁబడెను. హృదయము విదితమగుటవలన గుబ్బలనొరసియుండు గావున నాయిఁకలంపునెఱింగి యుండుననుట.

ఉ. గ్రావసుతాకుచాగ్ర పరి • రంభ నిగుంభసుఖోపలంభ సం
భావిత భావిమత్కరవి • మర్దన కోడకుమీ విశుద్ధము
క్తావలి బాలికానవస • మాగమయోగ్యమహోపలాలన
శ్రీ వెలయింతుఁ గాని నినుఁ • జిక్కులఁ బెట్టఁ జుమీ రయంబునన్. 104

గ్రావసుతా=పర్వతపుత్రియైన గిరికాదేవియొక్క, ని. 'గిరిగ్రావా చల శైల శిలోచ్చయాః' అని అ. కుచాగ్ర=చనుమొనయొక్క, పరిరంభనిగుంభ=ఆలింగనసంఘటనమువలన నైన, సుఖోపలంభ= ఆనందానుభవముచేత, సంభావిత = పూజితమయినదానా, ఇక్కడ గ్రావసుత యన్నందునఁ గుచముల యందుఁ గాఠిన్యము స్ఫురించుచున్నది. భావిమత్కరవిమర్దన కోడకుమీ = ముందుగలుగఁబోయెడు నాయొక్క హస్తపీడనమునకు భయపడఁబోకుమీ, విశుద్ధముక్తావళి = పరిశుద్ధమైన ముక్తామణిమాలికా యని యర్థము. శుభ్రవర్ణము గలదని భావము. బాలికా = గిరికాదేవియొక్క, నవసమాగమ=ప్రథమ సంగమమునందు, యోగ్య = ఉచితమయిన, మహోపలాలన శ్రీ వెలయింతుఁగాని = మహత్తరమయిన బుజ్జగింపు సంపదచేత నుల్లసింపఁజేయుదునేకాక, నినుఁ జిక్కులఁబెట్టఁజుమీ రయంబునన్=త్వరితముగా నిన్ను మనికితములఁ బెట్టనుసుమా యని యర్థము. చిక్కుపఱుప నని భావము.

ముక్తావలి విశుద్ధమైనది. అనఁగా నిష్కళంకమైనది. కావున నిట్టిదానికిఁ జిక్కులుగూర్పఁ జనదు. గిరికతో జరుగనున్నది నవసమాగమము. అందు యోగ్యములగు మహోపలాలనములుండును. అట్టిచో బుజ్జగించుచుఁ గుచములనంటుట తటస్థించునుగావున ముక్తావలి చిక్కులపాలుగావలసిన యవసరముండదనిభావము.

శా. శుక్తిక్రోడకుటీగుహావసతివై • సూచ్యగ్రసంస్థాయివై
ముక్తాహారమవై భజించితి గదా • ముగ్ధాకుచద్వంద్వసం
సక్తిం దాదృశభూతి తావకకృపా • సంసిద్ధిలే కబ్బునే
ముక్తాహారత సున్నయంతనె తలం • పు ల్నింపు నా కింపుగాన్. 105

శుక్తిక్రోడకుటీగుహావసతివై - శుక్తి = ముత్తెపుఁజిప్పయొక్క, క్రోడ = మధ్యప్రదేశమనెడు, కుటీగుహా = కుటీరమువంటి గుహాయందలి, వసతివై = ఉనికిగలదానవై, సూచ్యగ్రసంస్థాయివై=సూది

మొనమీఁద నిలిచినదానవై, ముక్తాహారమవై = వర్జింపఁబడిన యాహారముగలదానవై యనియర్థము. అనఁగా నీచెప్పఁబడిన గుహావసతియును సూచ్యగ్రసంస్థాయిత్వమును నిరాహారత్వమును దపశ్శాలుర యొక్క ధర్మములుగనుక నట్టి తాపసధర్మములు గలదానవై, తపస్సుచేసినదానవైయనుట. ముత్తియములు ముత్తెపుఁజిప్పయందుండు చున్నవియును సూదిమొనచేత రంధ్రము చేయఁబడు చున్నవియును గనుక వానిచేతఁ గూర్పఁబడిన హారమనిభావము. ముగ్ధా = నవోఢయైన గిరికయొక్క, కుచద్వంద్వ = స్తనద్వయముయొక్క, సంసక్తిః = సంపర్కమును, భజించితిగదా = పొందితివిగదా, ముక్తాహారతయున్న యంతనె=గుహావాసమును సూచ్యగ్రనివాసమును చేయలేక నేను నిరాహారత్వమాత్రముచేత నున్నందువలననే, తాదృశభూతి = అనఁగా నీచేత సంపాదింపఁబడిన గిరికాకుచసంపర్కరూపమయిన వైభవము, తావకకృపాసంసిద్ధిలేకబ్బునే = గుహావాసమును సూచ్యగ్రనివాసమును నిరాహారత్వమును గలిగిన నీ కృపాపరిపాకము లేకయే ప్రాప్తమగునా, కాఁబట్టి, తలంపుల్నింపు నాకింపుగాన్ = నాకిష్టమగునట్టులుగాఁ గోరిక లొనగూర్పుము - అనఁగా గిరికాకుచసంపర్కము గలుగఁజేయుమని యర్థము. నిరాహారత్వమును ముక్తావళిత్వముగా నధ్యవసించి తనయందు ముక్తావళిత్వమాత్రమును దెలిపి నీవలె నేనును ముక్తావళిని గనుక నాకును సంపర్కయోగ్యత యున్నందున దత్ప్రాప్తి నొనఁగూర్పుమని ప్రకారాంతరము.

ముత్తెపుఁజిప్పలయందుఁ జిరకాలము నివసించి సూది బెజ్జములఁ గ్రుచ్చి చేరులుగానుంటచే ముగుదగుబ్బలపై నధివసించుసౌభాగ్యాతిశయము లభించెను. ఇతరసుకృతాతిశయములులేక కేవలముక్తాహారత (ఆహారవిసర్జనము) నొందినరాజున కాయదృష్ట మెట్లు కలుగును? ముత్యములు గుహలలో సూదిపై నిలిచి తపముఁజేసి యాహారాదుల మానుటవలననే పూర్వోక్తసుకృతాతిశయము కలిగెనని భావము. అలం. శ్లేషము.

ఉ. చిన్నటనాఁట నుండియును ♦ జెల్వకుఁ గూర్చినదానవౌట నేఁ
డెన్నిక కెక్కఁ దద్వ్యథకు ♦ నీవును గుందితి గాన సద్గుణా
భ్యున్నతరత్నమాలిక య♦యో నిను మచ్ఛ్రమశీకరార్ద్రయో
షిన్నవగంధసారసుల♦చేఁ దెలి వొందఁగఁ జేయు టెన్నఁడో. 106

చిన్నటనాఁటనుండియును=చిన్నప్పటినుండియుఁ, చెల్వకుఁ గూర్చినదానవౌట = గిరికాదేవికాప్తమయినదానవైనందున నని యర్థము. గిరికాదేవికొఱకు సఖులచేతఁ గూర్పఁబడినదానవని భావము. సఖుల నధ్యాహరింపవలయును. (ఇక్కడ, శ్లో. 'అన్యస్యాః క్వచిదభవేచ్ఛాన్యా' శ్లో. 'కర్త్రాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణకశ్చ తద్వత్స్యాత్' అనెడు శబ్దానుశాసన సూత్రద్వయముయొక్క యర్థమును విచారింపవలయును.) నేఁడెన్నికకెక్క=నేఁడు ప్రసిద్ధికెక్కునట్టులుగా, తద్వ్యథకు నీవును గుందితి = ఆగిరికాదేవియొక్క విరహవ్యథకు నీవును దస్సినదానవయితివి అని యర్థము. గణనకెక్కిన దనియును గిరికాదేహతాపముచేతఁ గందినదనియును భావము. కాన్ = కాఁబట్టి, సద్గుణాభ్యున్నతరత్నమాలిక = సఖ్యపాలనరూప సద్గుణములచేత నతిశయించిన మణిహారమా యని యర్థము. సూత్రమునందు నొకదానిమీఁద నొకటిగాఁగూర్పఁబడి యున్నతస్థితినొందిన రత్నములయొక్క మాలికయని భావము. అయ్యో = అకటా, నినున్ = నిన్ను, మత్ = నాయొక్క, శ్రమ=రతిశ్రమవలనఁ బుట్టిన

శీకర = జలకణప్రవణముచేత-అనఁగాఁ జెమటచేత, ఆర్ద్ర=తడిసిన, రోమాళిక్ = గిరికాదేవియొక్క, నవ = నూతనమయిన, గంధసారములచేన్ = చందనములచేత, తెలివొందఁగఁజేయు టెన్నఁడో = ఉల్లసింపఁజేయు టెన్నటికో కదాయని యర్థము. కందు పోఁగొట్టుట యనిభావము. గంధసారప్రభృతి వస్తుచూర్ణసమేతజలములయందుఁ గందు పోవుట ప్రకటము కదా.

ఆబాల్యస్నేహముచే గిరికాశరీరతాపమును భరించి రత్నమాలిక కందిపోయినది. ఇది సద్గుణాఢ్యున్నత రత్నమాలికకు రాఁదగనియవస్థ. దీనికి ప్రతికృతి తడిసినగంధముతోఁ గలియుతోముట. అటులొనరించినఁ దావియుఁ బూర్వకాంతియుఁ గలుగును. ఇవి వసురాజు గిరికతోఁ దొలికూటమి చేయునపుడు రాజు మేనిచెమట గిరికగుబ్బలపైఁగల గందపుఁబూఁతలోఁ గలిసి రొంపి యగునపుడు తటస్థించునని భావము.

మ. అని రాజేంద్రుఁడు రత్నపుత్త్రిఁ గని యా • హారాధిరాజంబుఁ దె
చ్చిన యోయప్రతిమోపకార సుకృత•శ్రీగణ్య దాక్షిణ్యశా
లిని నీకుం బ్రతిమాపదేశ మిఁక నే•లే పల్కవే సన్నిధిన్
వనితావల్లభజీవితంబులు సఖీ•వాక్యస్థితంబు ల్గదే. 107

అని=ఈలాగని, రాజేంద్రుఁడు = రాజశ్రేష్ఠుడు, రత్నపుత్త్రిఁగని = రత్నమయమైన ప్రతిమను జూచి, ఈహారాధిరాజంబుఁ దెచ్చిన = ఈహారశ్రేష్ఠమును దీసికొనివచ్చిన, ఓయప్రతి మోపకారసుకృతశ్రీగణ్య దాక్షిణ్యశాలిని - అప్రతిమ = సమానరహితమయిన, ఉపకార = ఉపకృతిరూపమయిన, సుకృతశ్రీ = పుణ్యసమృద్ధిచేత, గణ్యా = కొనియాడఁదగిన, దాక్షిణ్యా = పరకార్య నిర్వహణ శక్తిచేత, శాలిని=ఒప్పుచున్నదానా యని యర్థము. అప్రతిమా=ప్రతిమగానిదానియొక్క, ఉపకారసుకృతశ్రీగణ్యదాక్షిణ్యశాలిని యని యర్థాంతరము. నీకున్ = ఈలాటినీకు, ప్రతిమాపదేశ మిఁకనేలే=ప్రతిమయనెడు వ్యాజ మిఁకమీఁద నెందుకు, పల్కవే సన్నిధిన్ = సమ్ముఖమందు మాటాడవే, వనితావల్లభజీవితంబులు = నాయికానాయకులయొక్క బ్రతుకులు, సఖీవాక్యస్థితంబుల్గదే=దూతికావాక్యములయందున్నవే కదే. అలం. కావ్యలింగము.

సీ. అన విని రఘునంద•నుని సన్నిధిఁ బ్రభూతచైతన్య యై నిల్చు•చట్టు పొలఁతి
కరణి రత్నపుబొమ్మ • గతి మాని ధృతి పూని క్షితిజానికి జొహారు • చేసి నిలిచి
పలికితి నోమహా•భాగ తావకమహామహితోక్తి దప్పునే • మంజువాణి
నచలకన్యకబోటి•నగుదుఁ గన్నియయున్కిఁ దెలుపవచ్చితిఁ గదా • తెలియనిట్లు
తే. పంచశర శాతశరహేతి•పాలుచేసి, తిరిగిచూడవు దగునయ్య • దొరలకెందు
మఱపుగలిగిన ననదల•కుఱుతురయ్య, వెలఁది దూఱినదూఱులు•వినఁగదయ్య.

అనవిని=ఈలాగనిరాజుపలుకఁగావిని, రఘునందనుని సన్నిధిన్ = రఘురాముని సన్నిధానమందు, ప్రభూత = పుట్టిన, చైతన్యయై = చేతనభావముగలదై, నిల్చు = నిలఁపఁబడిన, చట్టుపొలఁతికరణిన్ = పాషాణరూపమైన యహల్యవలె, రత్నపుబొమ్మగతిమాని = మణిపుత్త్రికనై యుండుటమాని, ధృతిపూని=ధైర్య మవలంబించి, క్షితిజానికి జొహారుచేసి నిలిచి=భూకాంతునకు దండము సమర్పించి నిలంబడి, పలికితిన్ = సంభాషించితిని. ఏమని యనిన, ఓమహాభాగ = మహాభాగ్యవంతుఁడ వయిన

వాఁడా, తావక మహామహితోక్తి దప్పునే = నీయొక్క ఘనమయిన సత్యవాక్య మబద్ధమగునా, కాఁబట్టి, మంజువాణి నచలకన్యకబోఁటి నగుదుఁ = నేను మంజువాణి యనెడు పేరుగలదానను గిరికాదేవిచెలికత్తియను నవుదును. ఇక్కడ, చారణకన్యకాయనెడి ౯౦వ పద్యమందలి మఱిశైలకన్యకాధీరవయస్యయైన వనదేవతయో, యనెడి వాక్యమును మంజువాణియనెడిపదమును ననుసరించిచెప్పినాఁడు. కన్నియయయ్యుఁ దెలుపవచ్చితినిగదా=గిరికాదేవి యున్నయునికిఁ దెలియఁ జేయవచ్చినాను గదా,

తెఱవన్ =ఆచిన్నదానిని, ఇట్లు=ఈప్రకారముగా, పంచశర = మన్మథునియొక్క, శాత=వాడి గలిగిన, శర = బాణములయొక్క, హేతి = అగ్నిజ్వాలలయొక్క, పాలుచేసి = వశముచేసి - అనఁగా మన్మథబాణాగ్నిజ్వాలల కొప్పగించి, తిరిగిచూడవు తగునయ్య = అటుకై తిరిగిచూడక యున్నావుగదా యిదినీకుఁ దగునటయ్యా, దొరలకెందు మఱపుగలిగినన్ = ప్రభువులకు మఱిదేనియందు మఱపుగలిగినప్పటికిని, అనదల మఱతురయ్య = అనన్యగతికులైన దీనులను మఱచిపోదురటయ్యా, వెలఁదిదూఱిన దూఱులు వినఁగదయ్య = మాగిరికాదేవి నిన్నుగుఱించి నిందించినమాటలు కొన్నిగలవు వాని వినఁగదవయ్యా వసురాజేంద్రా. దుర్బలస్య బలంరాజా యన్నటులఁ ప్రభువు లనదలకాపాడుట ధర్మము. విరహాతాపమునకుఁ జెలిని వైవసముజేసి చూచిచూడనటులుంట తగదు. మన్మథుఁడు కాఁడువాఁడు పంచశరుఁడు. వానిములుకులు సామాన్యములుగావు శాతశరములు. శరకాంతులుజ్వాలలు. ఇంతకుఁ జెలియ యోరువఁజాలదు. వలపుపెంపుసైపలేక నిన్నుదూఱినది. ఆనిందావాక్యములు విన్నయామె మోహాతిశయము ద్యోతకమగును గావున నాపలుకులు వినఁదగినవి.

ఉ. తావకశైలభేదనక•థాబిరుదాంకము లేము పేర్కొనం
దా విని వెచ్చ నూర్చి వని•తామణి నిత్యకఠోరము ల్కుల
గ్రావము లందు వానిఁ బద•ఘట్టనఁ గీ టడఁగించినట్టిగో
త్రావరుఁ డింక నేమిటఁ గ•రంగు నయో యని నించు బాష్పముల్. 109

తావక = నీయొక్క, శైలభేదనకథా = కోలాహలపర్వత భంజనచరిత్రతోఁగూడిన, బిరుదాంకములు=బిరుదావళులు, ఏము పేర్కొనన్ =మేమువచింపఁగా, తావిని=తానువిన్నదై, వెచ్చనూర్చి=వేఁడి నిట్టూర్పులుపుచ్చి, వనితామణి=గిరికాదేవి, నిత్యకఠోరముల్కులగ్రావములందు=ఎప్పటికిని గఠినములు కులపర్వతములని చెప్పుదురు, వానిఁ బదఘట్టనఁ గీటడఁగించినట్టి = అట్టికులపర్వతములను బాదఘట్టనముచేత గర్వభంగముచేసినట్టి, గోత్రావరుఁడు = భూకాంతుఁడు-అనఁగా వసురాజు, ఇంక నేమిటఁ గరంగున్ =ఇఁకమీఁద దేనిచేతఁ గరఁగుచున్నాఁడు - అనఁగా మెత్తఁబడుచున్నాఁడు, అయో యని=అక్కటాయని, నించుబాష్పముల్ =కన్నీరునించును. వెచ్చనూర్చుట విరహాతాపవశమున.

మ. జనలోకస్పృహణీయభవ్యసుషమా•సౌభాగ్యముక్ భాగ్యవ
జ్జనభోగానుగుణత్వముం దదితరా•శానిత్యదైన్యవ్యథా
జనకత్వంబును గల్గఁ జూచియు ధరా•జంభారి కంభోజజుం
డొనరించెన్ వసునాము నుంచు నవలా•యూహించు మోహంబునన్. 110

జనలోక=జనసమూహమునకు, స్పృహణీయ=ఆశింపఁదగిన, భవ్య = యోగ్యమయిన, సుషమా సౌభాగ్యముఁ = ఉత్కృష్టకాంతి సుభగత్వమును, ని. 'సుషమా పరమాశోభా' అని అ. భాగ్యవజ్జన భోగానుగుణత్వముఁ=భాగ్యవంతులకు భోగానుకూలత్వమును, తదితరాణా పిత్యాశైన్యవ్యధాజనకత్వం బును=అభాగ్యులగు నాశాదైన్యక్లేశసంపాదకత్వమును, కల్గఁజూచియు=ఉండఁజూచియే కాఁబోలును, ధరాజంభారికిఁ=భూదేవేంద్రునికి, అంభోజజుండు=బ్రహ్మదేవుఁడు, వసునామము=వసువనెడి నామ ధేయమును, ఒనరించెఁ=చేసెను. అంచుఁ = అని యీప్రకారముగా, నపలా యూహించు మోహం బునఁ=గిరికాదేవి వ్యామోహముచేత నూహించెను. వసువనఁగాఁ గాంచనముగాఁ బైనిఁజెప్పఁబడిన కాంచనసంబంధగుణములు రాజునందుఁ గలిగినందున రాజును గాంచనార్థకమయిన వసునామముగల వానిగా బ్రహ్మదేవుఁడు చేసెనని తాత్పర్యము.

సీ. అనుఁగుఁదమ్ములఁబాసి • కనుసన్నల మెలంగునిందిరఁ దృణముగా • నెంచుననినఁ
కూర్మాసనాభ్యాస•కర్మఠ యై భజించుధరిత్రిఁ జులుకగాఁ • జూచు ననిన
మధురాధరస్పంద•విధివశంవద యైన భాష నొండొకమాఱు • పల్కఁ డనిన
నాత్మపాణిస్పర్శ•నాయత్త మగుకీర్తి నెనసి దిక్కులకడ • నునుచు ననిన
తే. జగతిఁ గోఁఅనోమునోచిన • జలజముఖుల
కూరిమి గణించి యతఁ డేల • గారవించు
వరుని బహువల్లభామనో•హరునిఁ గోరు
ముదిత ముదితయె యని బాల•మోము వాంచు. 111

అనుఁగుఁదమ్ములఁ బాసి = ప్రియానుజుల నెడఁబాసి, కనుసన్నల మెలంగు=ఆజ్ఞావశురాలై ప్రవర్తించుచున్న, ఇందిరఁ = లక్ష్మీకాంతను, తృణముగా నెంచుననినఁ = లాఘవయుక్తముగాఁ జూచు నని చెప్పఁగాను అనియర్థము. ప్రేమాస్పదములయిన తామరలను రాత్రియం దెడఁబాయుచున్నదని యును దృష్టిప్రసారములపై నుదయించుచున్నదనియును నర్థుల కిచ్చు నెడఁ దృణప్రాయముగాఁ జూడఁ బడుచున్నదనియును భావము. కూర్మాసనాభ్యాస కర్మఠయై = కూర్మాసనమనెడు నాసనవిశేషమందలి యభ్యాసమువలనఁ గర్మశూరురాలై, (ని. 'కర్మశూరస్తు కర్మఠః' అని అ.) భజించు=సేవించునట్టి, ధరిత్రిఁ=భూకాంతను, చులుకగాఁ జూచుననినఁ=అగౌరవముగాఁ జూచునని చెప్పఁగాను అని యర్థము. ఆదికూర్మముమీఁద నిలిచియున్నదనియును దన్నుఁ బొందినదనియును, దుష్టనిగ్రహము చేసి భారము లేకుండునట్లు చేయఁబడుచున్నదనియును భావము.

మధురాధరస్పందవిధివశంవదయైన = పెదవిని గదలించినమాత్రముచేత వశ్యురాలైన, భాషఁ = వాణీకాంతనుగూర్చి, ఒండొకమాఱు పల్కఁడనినఁ = రెండవసారి మాటాడఁడని చెప్పఁగాను అని యర్థము. స్వకీయమధురాధరస్పందనిధానమువలన స్వాధీనురాలనియును, గంభీరుఁడుగనుకఁ బలుమాఱు పలుకఁడనియును భావము. ఇక్కడ విధియనఁగా బ్రహ్మదేవుఁడును భాషయనఁగా సరస్వతీదేవియును గనుకఁ బ్రకృతములును సమాపతితములునైన సరస్వతీ బ్రహ్మవాచకపదములఁ జెప్పుటచేత రత్నావళ్యలంకారము. (శ్లో. 'క్రమికం ప్రకృతార్థానాం న్యాసం రత్నావళిం విదుః' అని లక్షణము.) ఆత్మపాణిస్పర్శనాయత్తమగు కీర్తిఁ = నిజపాణిగ్రహణాధీన యైన కీర్తికాంతను, ఎనసి దిక్కులకడ

నుచు ననినన్=కలిసి చేరువనుంచి యాదరింపక దూరముగాఁ జేసినాఁడనిచెప్పఁగాను అనియర్థము. తనయొక్క బాహుపరాక్రమాధీనమై యున్నదనియును దిగంతములయందు వ్యాపింపఁ జేయఁబడుచున్నదనియునుభావము. ఇక్కడఁ గీర్తికిని స్త్రీలింగమహిమచేతఁ బ్రతీయమానయైన నాయికకును నభేదాధ్యవసాయము.

జగతిన్=భూమియందు, కాఁ అనోమునోఁచిన=తక్కువనోములునోఁచిన, జలజముఖుల = తనవంటి స్త్రీలయొక్క, కూరిమిఁగణించి = ప్రేమనువిచారించి, అతఁడేల గారవించున్ = ఆరాజెందుకు మన్నించును, వరునిబహువల్లభామనోహరునిఁగోరు = పెక్కుండ్రగుప్రియురాండ్రకు వల్లభుఁడయినపురుషుని వాంఛ సేయునట్టి, ముదిత=స్త్రీ, ముదితయె = సంతోషచిత్తురాలేనా, అని = ఈప్రకారముగాఁ జెప్పి, బాల = గిరికాదేవి, మోమువాంచున్ = చింతచేత మొగము వంచుకొనును.

కేవలభాగ్యశాలినులును బ్రియురాండ్రునైన శ్రీ భూ వాణీ కీర్తికాంతలనే యాదరింపనివాఁడు భాగ్యహీనురాలనయిన నన్నుమన్నించునా యనియును నట్టిబహుస్త్రీవల్లభుఁ డయినవానిని గోరినందున సంతోషపరిపూర్తి యగునా యనియును తాత్పర్యము.

చ. అనుటయుఁ బిన్ననవ్వు వొలయం బ్రణయంబున సారెసారెకున్
వినుచుఁ దదుక్తికౌశలము వేమఱు నాత్మఁ దలంచి మెచ్చుచున్
జనపతి యాదరాతిశయసాంద్రముగా నుచితోత్తరంబుగా
ఘనరసభావబోధకముగాఁ బలికెన్ గిలికించితంబుగాన్. 112

అనుటయున్=నే నీలాగని పలుకఁగా, పిన్ననవ్వువొలయన్ = మందహాసము వ్యాపించునట్టులుగా, ప్రణయంబున సారెసారెకు న్వినుచున్=ప్రేమచేత మాటిమాటికి నాలకించుచును, తదుక్తికౌశలము = ఆవాక్యనిపుణత్వమును, వేమఱునాత్మఁదలంచి మెచ్చుచున్ = పలుమాఱును మనస్సునందుఁ దలఁచుకొని మెచ్చుచును, జనపతి=వసురాజు, ఆదరాతిశయసాంద్రముగాన్=మన్ననయొక్క యతిశయముచేత నిబిడమగునట్టులుగా, ఉచితోత్తరంబుగాన్=నే నాడినమాటలకు నుచితమయిన ప్రత్యుత్తరమగునట్టులుగా, ఘనరసభావబోధకముగాన్-ఘన=అధికమయిన, రస=అనురాగముగల, భావ = తాత్పర్యమునకు, బోధకముగాన్ = తెలియఁజేయునట్టిది యగునట్టులుగాను-అనఁగాఁ దనయొక్క యనురాగమును తెలియఁజేయునట్టులుగాను, కిలికించితంబుగాన్ = (శ్లో. 'క్రోధాశ్రుహర్షభీత్యాదే స్సంకరః కిలికించితమ్' అని చెప్పఁబడియున్నది గనుక) కోపమును గన్నీరును సంతోషమును భయమును మొదలయినవానియొక్క సంకరము కిలికించిత మనఁబడుగనుక నట్టికిలికించిత యుక్తమగునట్టులుగాను, పలికెన్ = వచించెను. ఏమని యనిన,

శా. ఏమేమీ జగతిం గఠోరములు శైలేంద్రంబు లౌఁగా తదీ
యామేయస్మయభేది యంతకుఁ గఠోరాకారుఁ డౌనే కదా
యా మేటిన్ ధృతి వాపి చూపులనె యాటాడించువా రెంతవా
రో మీనేక్షణ తా నెఱుంగదె తదారూఢప్రభావోన్నతుల్. 113

ఏమేమీ = ఏమిదియేమోయంటివి, జగతిన్ = భూమియందు, కఠోరములు = కాఠిన్యముగలవి, శైలేంద్రంబులౌఁగా=పర్వతములౌనుగదా, తదీయ=ఆపర్వతసంబంధమయిన, అమేయ=అపరిమితమయిన, స్మయము=గర్వమును, భేది=పోఁగొట్టినవాఁడు, అంతకుఁగఠోరాకారుఁడౌనే కదా = ఆపర్వతములకంటెఁ గఠి

నాత్మఁ దేకదా, ఆమేటిక౯ ధృతివాపి = అట్టికఠినుని ధైర్యమును బోఁగొట్టి, చూపులనె యాటాడించువారు = చూచుటచేతనే యుబ్బులాతలూగించువారు, ఎంతవారో = ఎంతటివారో, తత్ = ఆకఠోరవస్తుత్రయములోపల, అరూఢ = కాఠిన్యోత్కృష్టస్థానమేదో దానియొక్క, ప్రభావోన్నతుల్ = మహిమాతిశయములు, మీనేక్షణ = ఆగిరికాదేవి, తానెఱుంగదె = తానుగుర్తెఱుఁగదా-అనఁగాఁ గాఠిన్యోత్కృష్ట స్థానముగనుక గిరికాదేవి యాయుత్కృష్టురాలని తెలియవలయును.

శైలములు కఠినములు. శైలగర్వము వాపినమేటి యంతకంటెను కఠినుఁడు. అట్టికఠినతరుని జూపులచే నాటలాడించుగిరిక యాత్మబలము నెఱుఁగఁజాలకున్నది. చెలువలచూపులు ఇంద్రాదులను గూడ జయించుననుట ప్రసిద్ధము. ఇందులకు-

శ్లో. నూనంహి తే కవివరా విపరీతవాచో, ఏనిత్యమాహు రబలాఇతి కామినీస్తాః
యాభి ర్విలోలతరతారకదృష్టిపాతైః, శక్రాదయోపి విజితా స్త్వబలాః కథం తాః.

ఉ. ఆసలఁ బెట్టి యేచు వసు ♦ వంచు వచింపఁగ నేల సంతతో
ద్భాసినిజాభిజాత్యమునఁ ♦ దద్వసువు ల్వెలఁ గొన్న మోహాసం
వాసపదంబు దా రమణి ♦ వారక శుక్తిమతి౯ జనించె ల
క్ష్మీసముదగ్రమై జగ మశేషము నివ్వెఱ గందఁ జేయఁగాన్. 114

ఆసలఁ బెట్టియేచువసువంచు వచింపఁగనేల = వసువనఁగాఁ గాంచనము వసురాజును గనుకఁ గాంచనమాశగొలిపి శ్రమపెట్టుచున్నదని యేమిటి కనవలెను అని యర్థము. వసురాజని భావము. సంతత = ఎల్లప్పుడును, ఉద్భాసి=మిక్కిలి ప్రకాశించుచున్న, నిజ=స్వకీయమయిన, అభిజాత్యమున౯ = కులీనత్వముచేత నని యర్థము, సౌందర్యముచేత ననిభావము. (ని. 'అభిజాత స్థిషు తే న్యాయ్యో కులీన ప్రాప్తరూపయోః' అని వి.) తద్వసువు ల్వెలఁగొన్న మోహాసంవాసపదంబు = ఆకాంచనము గొనిన మోహనివాసస్థానమయిన, ఉదారమణి = శ్రేష్ఠరత్నము - అనఁగా ముక్తామణియని యర్థము. (ని. 'ఉదారో దాతృమహతోః' అని అ.) ఆవసురాజును గొనిన మోహనివాసస్థానమయినగిరిక యని భావము. ఇక్కడ గిరికాదేవిని నిగరణముచేసి మణిగా నధ్యవసించినాఁడు. వారకశుక్తిమతి౯ జనించి = వాలాయముగా శుక్తిమతియం దుద్భవించి, లక్ష్మీసముదగ్రమై = కాంతిచేతఁ బరిపూర్ణమైయని యర్థము, సంపదచేతఁగాని లావణ్యముచేతఁగాని పరిపూర్ణమై యనిభావము. జగ మశేషము నివ్వెఱగందఁ జేయఁగా౯ = సమస్తప్రపంచమును విభ్రాంతిని బొందునట్లులు చేయఁగా - ఆసలఁబెట్టి యేచువసువంచు వచింపఁగనేల యనిసంబంధము.

ప్రసిద్ధమగు జాతిశ్రేష్ఠతచేఁ గాంచనము లోఁగొన్న మోహనివాసస్థానమైన శ్రేష్ఠత ముక్తారత్నము శుక్తిమతియందు జనించి కాంత్యతిశయముచే సమస్తజగమునకు విభ్రాంతిఁ గూర్చుచుండఁ గాంచనమాసగొల్పి వేధించుచున్నదనుట పొసఁగదని యర్థము.

ఎడతెగని యుత్కృష్ట సౌందర్యముచే వసురాజును లోఁగొన్నసుందరీమణియగు గిరికాదేవి శుక్తిమతియందుజన్మించి సంపదచేతను లావణ్యముచేతను నతిశయించి జగత్తునంతయు భ్రమింపఁజేయుచుండ వసురాజు ఆసగొల్పుచున్నాఁడననేల యనిభావము. అలం. రూపకాతిశయోక్తి.

శా. శ్రీవాణీధరణీముఖాంగనలపైఁ ♦ జిత్తంబు లే కున్కి కే
మీ వేమాఱును దూఱ నిత్యగుణల♦క్ష్మిన్ సంతతావక్రవృ
త్తావిర్భావ నఖండరూపనిధిఁ గ♦న్యం గోరువాఁ డేల సం
భావించున్ సిరిపెంపు వాగ్విలసన♦ప్రౌఢిన్ మహీభోగమున్. 115

శ్రీ వాణీ ధరణీ ముఖాంగనలపైన్ = లక్ష్మియు సరస్వతియు భూమియు మొదలుగాఁగల స్త్రీల మీఁదను, చిత్తంబులేకున్కికిన్ = మనస్సులేకపోవుటనుగురించి, ఏమీ వేమాఱును దూఱన్ = పలుమాఱును నిందింపవలసినదేమున్నది, నిత్యగుణలక్ష్మిన్ = అచంచలమయిన గుణములుగల లక్ష్మియునని యర్థము. అచంచలగుణసమృద్ధి గలదనిభావము. సంతత = ఎల్లప్పుడును, అవక్రవృత్త = అకుటిలవృత్తితోడ, ఆవిర్భావన్ = ఆవిర్భవించిన సరస్వతియును, అఖండరూపనిధి = పూర్ణసౌందర్యమునకు స్థానమయిన భూమియును నయినట్టి, కన్యంగోరువాఁడు = కన్యనుగోరెడువాఁ డని యర్థము. లక్ష్మీదేవి చంచలగుణముగల దనుట, సిరులు నిలుకడలేని వని భావము. సరస్వతియైతే సాతతమును నవక్రవృత్తావిర్భావము లేనిదనుట. వక్రవృత్తావిర్భావము గలదని భావము. అనఁగా గురువులు వక్రాకారములును లఘువు లవక్రాకారములును నగునట్టులుగా వ్రాయఁబడుచున్నవి గనుక గురులఘు యుక్త వృత్తరూపావిర్భావము గలదని తెలియవలయును. భూమి ఖండరూపనిధియనుట - నవఖండస్వరూపము గలదని భావము. సిరిపెంపు = లక్ష్మియొక్క యతిశయత్వమును, వాగ్విలసనప్రౌఢిన్ = సరస్వతియొక్క విలాసప్రౌఢిమను, మహీభోగమున్ = భూమియొక్క సుఖమును, ఏలసంభావించున్ = ఎందుకుమన్నించును-అనఁగా మన్నింపఁడనుట.

గుణశాలియైన గిరికాదేవిని గోరుచున్న తాను శ్రీవాణీధరణీకాంతలయొక్క పెంపును ప్రౌఢిమయును భూసౌఖ్యమును భోగంబును సంభావింప ననియర్థము. సంపదలయొక్క యభివృద్ధియును విద్యాప్రౌఢిమయును భూసౌఖ్యమును దనకు రుచింపకున్న దని భావము. ఇక్కడ నభేదాధ్యవసాయను· ఇందులో నరతి యను నవస్థాభేదంబును జెప్పినాఁడు. శ్లో. 'అన్యత్రాప్రీతి రరతిః' అని లక్షణము. అలం. శ్లేషమూలక కావ్యలింగము.

క. నా విని చతురాస్యుఁడ వరు,దే వచనప్రౌఢి నీకుఁ ♦ దెలివ యిఁక వియో
గావృత్తి కోర్వ దేచెద,వో వెసఁ బ్రోచెదవొ తెలుపు ♦ ముల్లం బనినన్. 116

నావిని = వసురాజీలాగని పలుకఁగా విని, చతురాస్యుఁడవు = అనఁగా బ్రహ్మవని యర్థము. చతురవాక్యములు గలవాఁడవని యర్థాంతరము. అరుదే వచనప్రౌఢి నీకున్ = వాక్ప్రౌఢిమ నీ కొక యాశ్చర్యమా, తెలివ యిఁక వియోగావృత్తి కోర్వదు = గిరికాదేవి యిఁకమీఁద విరహముయొక్క పునఃప్రాప్తికి సహింపఁజాలదు, ఏచెదవో వెసఁ బ్రోచెదవొ = ఈలాగుననే వ్యథపెట్టుచున్నావో లేక యింతట రక్షించుచున్నావో, తెలుపు ముల్లం బనినన్ = నీమానసమును దెలియఁ జేయు మని నేను బలుకఁగా-

ఉ. నామదిలోనఁ బాయనియ♦వారతపారతరానురాగచిం
తామయధామయంత్రపరి♦ణాహము దాహము మోహముం బురం
ధ్రీమణి నీవ చూచితి గ♦దే తగదే జగదేకధన్వి య
శ్కామునియాన సందియము♦గా ననుఁ బల్క యఘంబు గైకొనన్. 117

నామదిలోనఁ బాయని = నామనస్సునం దెడఁబాయని, అనారత = నిత్యమైన, సారతర=బలిష్ఠమయిన, అనురాగ = ప్రేమతోఁగూడిన, చింతామయ = చింతారూపమయిన, దామయాత్ర = ఉరిత్రాఁటియొక్క, పరిణాహము = విశాలతయును, (ని. 'పరిణాహో విశాలతా' అని అ.) దాహము=తాపమును, మోహముఁ = అపేక్షయును, పురంధ్రిమణి = స్త్రీరత్నమవయిన యోమంజువాణీ, నీవ చూచితిగదే = నీవే కంటివిగదా. కాఁబట్టి, జగదేకధన్వి = జగత్తులోపల మేటివిలుకాఁడయిన, అకాముని యాన = ఆమన్మథునితోడు, ఆన యనెడుపద మాజ్ఞాశబ్దమునకుఁ దద్భవము. సందియముగా నుఁబల్కి = సంశయమున్నట్టులుగా నన్నుగురించి వచించి, అఘంబు గైకొనఁ = పాపముగట్టుకొనుటకు, తగదే = నీకు నర్హముగాదే, అనఁగా నాదురవస్థను జూచియును నాయందు సందేహమున్నట్లుగాఁ బల్కి పాపముగట్టుకొనుట నీ కుచితముగాదే యనుట. అనురాగము చింతామయమైనది. అది విశాలమగు నురిత్రాడు. దీనికిఁ దోడు విరహతాపము. మోహము మిక్కుటమైనది. ఇవి యన్నియు మంజువాణి కనులారఁ జూచుచున్న సంగతులు. గిరికను వసురాజు వలచినవిషయము సంశయాస్పదమనుట పాపము కట్టుకొనుటయె.

ఆ. నాతి విను నగేంద్ర•నందన గురుజనా, ధీన గాన మనసు • గాన కుంట
నెసఁగు సందియమున • నిన్నాళ్లు నీఖేద, జలధిఁ గడువఁ దెప్ప•గలిగె నేఁడు.

నాతి విను = ఓమంజువాణీ వినుము, నగేంద్రనందన = కోలాహలపర్వతరాజపుత్త్రి యైనగిరిక, గురుజనాధీన గానఁ = తల్లిదండ్రులయొక్క యధీనురాలు గనుకను, మనసు గానకుంటఁ = ఆగిరికయొక్క మానసము దెలియకపోవుటవలనను, ఎసఁగుసందియమునఁ = అతిశయించుచున్న సందేహముచేత, ఇన్నాళ్ళు నీఖేదజలధి గడువఁ = ఇన్ని దినములపర్యంతమును దుఃఖసముద్రమునందు నీఁదుచుండఁగా, తెప్ప గలిగె నేఁడు = నేటికి నీవనెడు తెప్ప సంప్రాప్త మాయెను.

ఉ. మన్ననబోటి నేఁటిమును•మాపు మహేంద్రభుజిష్య వచ్చి తా
నన్నియుఁ దెల్పె నింద్రుఁడు మ•దాశయ మాత్మ నెఱింగి భక్తిసం
పన్నతఁ బాణిపీడనశు•భం బొనఁగూర్చుటకై నగోత్తముం
గన్నియ వేఁడ వచ్చునఁట • కౌతుకసాంద్రమునీంద్రకోటితోన్. 119

నేఁటిమునుమాపు = నేఁటిసాయంకాలము, మన్ననబోటి = బహుమానపాత్రురాలయిన, మహేంద్ర భుజిష్య వచ్చి = మహేంద్రునియొక్కపరిచారిక వచ్చి, తా నన్నియుఁ దెల్పెఁ = తనంతట తానే యన్నివర్తమానములును జెప్పెను. ఏమనిన, ఇంద్రుఁడు మదాశయమాత్మ నెఱింగి = ఇంద్రుఁడు నాయభిప్రాయమును మనస్సునందుఁ దెలిసికొని, భక్తిసంపన్నతఁ = భక్తిసమృద్ధిచే పాణిపీడనశుభం బొనఁగూర్చుటకై = పాణిగ్రహణరూపమయిన శుభకార్యమును సంఘటనపఱచుకొఱకుఁ గాను, కౌతుకసాంద్ర మునీంద్రకోటితోఁ = సంతోషసమగ్రమయిన మునిసమూహముతోడ, నగోత్తముం గన్నియ వేఁడవచ్చునఁట = కోలాహలపర్వతశ్రేష్ఠునిఁ గన్నెనడిగెడు నిమిత్తమువచ్చునఁట. ముందరిపద్యముతో నన్వయము.

క. ఆచల్లనితియ్యనిశుభ, వాచావిభవంబు విన్న•వాఁడ నయి సుమీ
వాచాల మదనగుణనా, రాచాళ్ళటి కోర్చినాఁడఁ • బ్రాణంబులతోన్. 120

ఆ చల్లనితియ్యనిశుభవాచావిభవంబు = శీతలమయినదియు మధురమయినదియు శుభకరమయినదియు నగు నాయింద్రపరిచారిక పలికిన వాగ్వైభవమును, విన్నవాఁడనయినసుమీ = ఆలకించినవాఁడ నయినందువలన సుమా, వాచాల = మ్రోయుచున్న, మదనగుణ = మన్మథునివింటి నారియొక్కయు, నారాచ = బాణపాతముయొక్కయు, ఆర్భటికిన్ = ఆర్భాటమునకు, ప్రాణములతోన్ = ప్రాణములతోడను, ఓర్చినాఁడన్ = సహించియున్నాఁడను.

ఉ. ఈశుభవార్త మీచెలియ • కిప్పుడ పోయి యెఱుంగఁ జెప్పి కా
మాశుగపీడితంబు లగు•ప్రాణము లూఱడిలంగఁజేయు మో
పేశలవాణి యంచు ననుఁ • బేర్కొని యీమహితాంగుళీయ ము
ర్వీశుఁ డొసంగి వీడ్కొలిపె • నేనును వచ్చితి నీక్షణంబునన్. 121

ఈశుభవార్త = శుభకరమయిన యీవృత్తాంతము, మీచెలియకున్ = మీగిరికాదేవికి, ఇప్పుడ పోయియెఱుంగఁజెప్పి = ఇప్పుడే వెళ్ళి తెలియఁజెప్పి, కామాశుగపీడితంబులగు = మన్మథబాణముల చేత బాధింపఁబడుచున్న, ప్రాణములు = ఆగిరికయొక్క ప్రాణములు, ఊఱడిలంగఁజేయుము = ఊఱటఁ బొందునట్లులుగాఁ జేయుము, ఓపేశలవాణియంచు ననుఁబేర్కొని = ఓమంజువాణీ యని నన్నుఁ జేరఁ బిలిచి, ఈమహితాంగుళీయము = ప్రశస్తమయిన యీముద్రిక, ఉర్వీశుఁడొసంగి = వసురాజు నాచేతికిచ్చి, వీడ్కొలిపెన్ = పంపించెను, ఏనును వచ్చితి నీక్షణంబునన్ = ఈక్షణమందే నేను వచ్చితిని.

ఇది శుభవార్త. శుభస్య శీఘ్రమందురు గానఁ ద్వరగా నెఱింగింపఁ జనును. గిరికప్రాణములు కామాశుగపీడితములు. కాన నూఱడించుట యావశ్యకము. సంతాపస్థితిలో నున్నగిరిక యీమాటలు విశ్వసింపదనుకొందు వేమో! ఇదిగో మహితాంగుళీయకముఁ జూపుమనుటచేఁ గొనివచ్చితినని భావము.

చ. అని యఖిలంబుఁ దెల్పి రమ•ణాంగుళిముద్రిక మంజువాణి యి
చ్చిన నవలా విలాసమునఁ • జేకొని కైశ్యపయోదపద్ధతిం
దనరఁగఁ జేయు నేత్రనలి•నంబుల నొత్తు ఘటించు నున్నత
స్తనయుగళీరథాంగములఁ • దద్రవితేజము నేకతంబునన్. 122

అని యఖిలంబుఁ దెల్పి = ఈలాగని యావద్వృత్తాంతమును జెప్పి, రమణాంగుళిముద్రిక = ప్రియుఁడయిన వసురాజుయొక్క సికాయుంగరమును, మంజువాణి యిచ్చినన్ = మంజువాణి యియ్యఁగా, నవలా = గిరికాదేవి, విలాసమునఁ జేకొని=శృంగారచేష్టచేతఁ గైకొని, తద్రవితేజమున్= సూర్యప్రభలవంటి ప్రభలుగల యా ముద్రికను, ఏకతంబునన్ = ఒంటరిపాటున, కైశ్య = కేశబృందమనెడు, (ని. 'తద్బృందే కైశికం కైశ్యమ్' అని అ.) పయోదపద్ధతిన్ = మేఘమార్గమందు-అనఁగా నాకాశమునందు, తనరఁగఁజేయున్=ఒప్పునట్లులుగా నొనర్చును - అనఁగా మేఘమువంటి కొప్పుపైఁ జేర్చుకొనునుట, నేత్రనలినంబుల నొత్తున్ = కమలములవంటి కన్నులనొత్తుకొనును, ఘటించు నున్నత స్తనయుగళీ రథాంగములన్ = చక్రవాకములవంటి యున్నతకుచయుగళమందు హత్తించుకొనును.

ముద్రికను రవితేజమని చెప్పినాఁడు గనుకఁ గైశ్యపయోదోద్ధతియందును నేత్రకమలముల యందును స్తనచక్రవాకములయందును జేర్చుకొన్నదని చెప్పుట యానుకూల్యమని విచారింపవలయును.

రవితేజమని చెప్పినందుననే ముందరవర్ణింపఁగల సూర్యోదయము సూచింపఁబడుచున్నది గనుక ముద్రాలంకారము (శ్లో. 'సూచ్యార్థసూచనంముద్రా ప్రకృతార్థపరైఃపదైః') అని దీనిలక్షణము. ముద్రికాశబ్దవిశేషణమయిన రవితేజమనెడుపదమునకు, 'ఉభయవిధమహతీనామ్' అనెడు నప్పయసూత్రముచేత, నపుంసకలింగత్వము సమ్మతమని తెలియవలయును. గిరిక ముగ్ధ, కావున సిగ్గరి. తొలుత వసురాజును జూచునపుడె చెలులు పరిహసించిరిగావున ముద్రిక నేకతమునఁ గేశములందుఁ గనులందు గుబ్బలందు నుంచికొనెను. ప్రియుఁడు ప్రేమతోఁ బంపిన వస్తువు గాన గిరిక తనయనురాగము నాముద్రికను గైకొనుటతోఁ గాదు విలాసముగాఁ గైకొనుటతోఁ బ్రకటించెను. విలాసమన శృంగారరసము ల్లాసము. చూపులయందు విలాసముదాల్చెనని భావము. విలాసలక్ష్యమిటులఁ జెప్పఁబడెను-

క. ఇరుగడల వెడలి సుడిగొని, తరళములై వెలికి జెళికి తళతళ మనుచున్
బరఁగురువారపుఁజూపుల, హరిణాక్షి నృసింహవిభున కారతిఁ జేసెన్.

క. పతిఁ గనఁ దాత్కాలికమగు, నతులవికారము విలాసము... నరసభూపాలీయము.

ఉ. మున్నుగ నన్నగాత్మజకు • ముద్రికపైఁ బతిపేరు సూడఁ దోఁ
చె న్నృపుఁ జూచినట్ల నునుసిగ్గు తదూర్మిక వ్రేలఁ బూన భా
గ్యోన్నతిఁ దత్కరగ్రహమ•హోత్సవ మప్పుడె కాంచినట్లు మిం
చె న్నవకాంతివిభ్రమవి•శేషసంభ్రమవైభవోన్నతుల్. 123

మున్నుగన్ = ముందుగా, అన్నగాత్మజకున్ = ఆగిరికాదేవికి, ముద్రికపైఁ బతిపేరుసూడన్ = ముద్రికమీఁదనున్న వసురాజుయొక్క నామధేయమును జూడఁగానే, నృపుఁజూచినట్ల = ఆవసురాజును జూచినట్టులుగా, నునుసిగ్గు = మృదువైనలజ్జ, తోఁచెన్ = ఉదయించెను. తదూర్మిక వ్రేలఁబూనన్ = ఆయంగుళీయకము తనవ్రేలఁ బెట్టుకొనఁగా, భాగ్యోన్నతిన్ = భాగ్యాతిశయముచేత, తత్కరగ్రహమహోత్సవ మప్పుడె కాంచినట్లు = ఆవసురాజుయొక్క పాణిగ్రహణమహోత్సవము నప్పుడే పొందినట్టులుగా, నవకాంతి = నవీనలావణ్యమును, విభ్రమవిశేష = విలాసవిశేషములును, సంభ్రమవైభవ= ఆదరసమృద్ధితోఁగూడిన, ఉన్నతుల్ = ఔన్నత్యములును, మించెన్ = అతిశయించెను. (ని. 'సంభ్రమస్సాధ్వసేపి స్యా త్సంవేగాదరయో రపి' అని విశ్వనిఘంటువు.

సీ. ఒకనాఁడు చూచె బా•లిక నిలాపతి యంచుఁ బతియంచుఁ దనకు న•ప్పార్థివేంద్రు
నతివ గోరఁగ మించె • నంగజానలమంచు నలమంచుచాయవాఁ • డబలనేచ
నుర్వీశుకడ కేఁగె•నొకబోటికొమ్మంచుఁ గొమ్మంచు నతఁడును • గుఱుతొసంగి
చెలియతోఁ దెలిపెఁ దో•య్యలిమీఁదితమి యంచుఁ దమి యంచు ముట్టునం•
[తనె బలారి

తే. వచ్చునఁట విందునకు నిందు • వనిత నడుగ
ననుచు ననుచువయస్యలా•ద్యంతమును నె
ఱుంగఁ జెప్పిన విని మహా•భంగగరిమఁ
బొంగె జనయిత్రి మిన్నందె • భూమిధరము. 124

ఒకనాఁడుచూచె బాలిక నిలాపతియంచున్ = వసురాజొకనాఁడు గిరికాదేవిని జూచెను యనును, పతియంచుఁ దనకు నప్పార్థివేంద్రు నతివ గోరఁగ మించె నంగజానల మంచున్ = తనకుఁ

జెనిమిటి యని యావసురాజును గిరికాదేవి యిచ్ఛయింపఁగా మన్మథాగ్ని యతిశయించె ననియును, అలమంచుచాయవాఁ డబల నేచ నుర్వీశుకడ కేగె నొకబోటికొమ్మంచుఁ = మంచుచాయవాఁడు-చంద్రుఁడు గిరికాదేవిని వేధింపఁగా వసురాజుయొక్కసన్నిధానమునకు నొకబోటికొమ్మ యనఁగాఁ జెలికత్తె పోయె ననియును, కొమ్మంచు నతఁడును గుఱుతొసంగి చెలియతోఁ దెలిపెఁ దొయ్యలిమీఁది తమియంచుఁ = పుచ్చుకొమ్మని యావసురాజు తనయుంగర మానవాలిచ్చి యాచెలికత్తెతో గిరికాదేవి మీఁదఁ దనకుంగల యభిలాషమును దెలియఁ జెప్పె ననియును, తమి యంచుముట్టునంతనె = రాత్రి తుదముట్టఁగానే-అనఁగాఁ దెల్లవాఱఁగానే, బలారివచ్చునఁట విందునకు నిందు వనిత నడుగననుచుఁ = ఇంద్రుఁడు విందునకు ననఁగా నాప్తుఁడయిన వసురాజునకు గిరికాదేవి నడిగెడు నిమిత్తమై యిక్కడికి వచ్చునఁట యనియును,

ననుచువయస్యలు=ననువు అనఁగా నెనరుగాన నెనరుగల గిరికాసఖులు, ఆద్యంతమును నెఱుంగఁ జెప్పినవిని = మొదటినుండి చివరవఱకు జరిగినవృత్తాంతమును దెలియఁజెప్పఁగా విని, మహాభంగ గరిమఁ బొంగె జనయిత్రి-జనయిత్రి = గిరికాదేవితల్లియైన శుక్తిమతి, మహ = ఉత్సవముయొక్క, అభంగ=అవిచ్ఛిన్నమైన, గరిమన్=అతిశయముచేత, పొంగెన్=ఉప్పొంగె నని యర్థము.

మహాశబ్దమునకు నర్థ మిక్కడ నుత్సవపరంబును అకారాంతంబును అని విచారింపవలయును. మహత్తయిన తరంగాతిశయముచేతఁ బొంగెనని యర్థాంతరము. మిన్నందె భూమిధరము = కోలాహల పర్వతము మిన్నుముట్టె నని యర్థము. గగనపర్యంతౌన్నత్యము గలిగియుండె నని యర్థాంతరము.

చ. అపు డరవిందగంధి హృద•యాంబుజఖేద మడంప వచ్చి తో
రపురుచితో వెలుంగు వసు•రాజకరోర్మికఁ గాంచి భీతిమైఁ
జపలవిలోచనం బొదువఁ • జాలక తారభటాలితో నిశా
ధిపునిబలంబు లేఁగినగ•తిన్ రహి వీడెను బాండుచంద్రికల్. 125

అపుడు = ఆసమయమందు, అరవిందగంధి = గిరికాదేవియొక్క, హృదయాంబుజఖేదమడంప వచ్చి = అంబుజమువంటి హృదయముయొక్క ఖిన్నత్వమును నివారింపవచ్చి, వసురాజకరోర్మికన్ = అనఁగా వసురాజు చేతియుంగరమునని యర్థము. వసువులనఁగా రశ్ములు వానికి రాజు సూర్యుఁడును, ఆయన కిరణోర్మిక నని యర్థాంతరము. ఈయర్థమం దూర్మికయనఁగా రేఖయని చెప్పవలయును. తరంగము రేఖాకృతియగుట ప్రకటముగదా. ఇది ప్రకృతశ్లేషము. కాంచిభీతిమైఁ జపలవిలోచనం బొదువఁజాలక = అనఁగా గిరికాఖేదనివారణార్థమై వచ్చిన రాజుచేతియుంగర మనుసూర్యకిరణమును జూచి భయముచేత గిరికాదేవి నాక్రమింపఁజాలక సూర్యోదయము కాఁగానే వివాహప్రసంగ మారబ్ధమగుచున్నది గనుక సూర్యోదయము గిరికాదేవి కానందమగుటచేత సూర్యకిరణప్రసరమును గిరికాఖేదనివారణముకొఱకు వచ్చుటగా వర్ణించినాఁడు, తారభటాళితోన్ = నక్షత్రసదృశులైన భటులయొక్క సమూహముతోడ నని యర్థము. భటులవంటి నక్షత్రములతోడ నని యర్థాంతరము. నిశాధిపుని బలంబు లేఁగినగతిన్ = చంద్రుఁడనెడు రాజుయొక్క సైన్యములు తీసిపోయినవోయన్నట్టులుగా, రహివీడెను బాండుచంద్రికల్ = తెల్లని వెన్నెలలు కాంతిహీనము లాయెను. ఇది యుత్ప్రేక్షాలంకారము.

నాయిక అరవిందగంధి. హృదయము అరవిందము. కావున వసురాజుకరోర్మిక తోరపురుచితోఁ దోడ్పడవచ్చెను. చంద్రుఁడీకఁ దనప్రయత్నములు సాగవని సైన్యబలముతోఁ జెలి నేమట మాని పోయినటుల వెన్నెలలు తెల్లనయ్యెను. అనఁగా ఉంగరము చూచినంత సికిక జింత తొలంగె ననియు నంతలోఁ దెల్లవారెననియు భావము.

మ. ఒకనాఁ డింద్రుని యంతవేలుపు మదీయోక్తి స్వీడంబించి తా
నొకకాలం బెఱిఁగింప వచ్చి మునిశాపోద్వృత్తిపా లయ్యె మా
మకశబ్దం బిది యల్పమే త్రిమునిసంభావ్యత్రికాలీవిబో
ధక మఁకారీతిఁ ద్రిభంగిగా మొరసెఁ జెంతం దామ్రచూడౌఘముల్. 126

ఒకనాఁడు = ఒకానొకదినమందు, ఇంద్రుని యంతవేలుపు=దేవుఁడైన ఇంద్రుని వంటివాఁడు, మదీయోక్తిన్వీడంబించి = నాయొక్క శబ్దము ననుకరించి, తానొకకాలం బెఱిఁగింపవచ్చి = తాను నొకానొకడైన ప్రాతఃకాలమును దెలియఁజేయవచ్చి, మునిశాపోద్వృత్తిపాలయ్యెన్ = గౌతమ మునియొక్క శాపాతిశయమునకు స్వాధీనుఁడాయెను. మామకశబ్దంబిదియల్పమే = నాయొక్క శబ్దం బిది స్వల్పమా - అనఁగా మహాఘనమయినదనుట. వీమనిన, త్రిముని = వ్యాకరణశాస్త్రప్రవర్తకు లైనపాణిని, కాత్యాయనుఁడు, పతంజలి యనెడు మునిత్రయముచేత, సంభావ్య = ఆదరింపఁదగిన, త్రికాలీ=కాలత్రయమునకు, విబోధకము = తెలివిడిపఱుచునట్టిది, అకారీతిన్=అన్నట్లుగానని యర్థము. త్రికాలియనఁగా హ్రస్వ దీర్ఘ ప్లుత కాలములనుట, చెంతన్ = సమీపమందు, తామ్రచూడౌఘ ముల్ = కుక్కుటసమూహములు, ని. 'కృకవాకు స్తామ్రచూడః కుక్కుట శ్చరణాయుధః' అని అ. త్రిభంగిగామొరసెన్ = ప్రకారత్రయవిశిష్టముగా ధ్వనిచేసెను.

ఇంద్రునియొక్క టేకాలము - ఒకమునిచేతనైనను సంభావితమైనదికాదు. (దేవేంద్రునియంత వాఁడె తమయఱపు ననువదించెను. దానికి గౌతముఁడు కినిసి శాపము నొసంగెను.) అటులఁ గాలము చెప్పి యొకమునివలననైతము దేవేంద్రుఁడు గౌరవముపొందలేదు.

తమకు మూఁడుకాలములును మునిత్రయముచేత సంభావితములైన వన్నట్టులుగాఁ గుక్కుట ములు మూఁడు ప్రకారములు గలుగునట్లు మొరసెనని యర్థము. మునిత్రయము గుక్కుటధ్వనియం దున్నట్టి ఉ ఊ ఊ౩ అనెడి హ్రస్వ దీర్ఘ ప్లుత కాలముల ననుకరించి యకారాదిస్వరములకు హ్రస్వ దీర్ఘప్లుతములను జెప్పినారు గనుకఁ గుక్కుటశబ్దమందలి కాలత్రయము మునిత్రయసంభావ్యమని తెలియవలయును.

క. ఆతఱి నొక కాతరనేత్రాతిలకము కలికిఁ బలికెఁ బ్రాభాతికశో
భాతిశయవత్కుశేశయ, నూతనమధుమధురతామనోహరఫణితిన్. 127

ఆతఱిన్ = ఆసమయమందు, ఒకకాతరనేత్రాతిలకము = స్త్రీలలో శ్రేష్ఠురాలైన యొకవెఱపుఁ జూపుల చెలికత్తియ, ప్రాభాతిక=ప్రాతఃకాలసంబంధమైన, శోభాతిశయవత్=కాంత్యతిశయము గలిగిన, కుశేశయ = శతపత్రములయందలి, నూతన = నవీనమైన, మధు = మకరందముయొక్క, మధురతా = మాధుర్యమువంటి మాధుర్యముచేత, మనోహర=ఒప్పిదమైన, ఫణితిన్ =వాగ్వైఖరిచేత, కలికిఁబలికెన్ = గిరికాదేవినిఁగూర్చి యొకవాక్యము పలికెను.

మ. అమృతాంశుండు నిశాసతిం గలసి శీర్యచ్చంద్రికాగంధశి
ల్పముతోఁ బుష్కరశయ్యఁ బాసి చన వేళాదూతి తత్కాలసం
భ్రమసంశీర్ణతరోడుహారమణివారం బేరి తా నొక్కచో
గుమిగాఁ బోసెనొ నా మినుక్కురను వేగుంజుక్కఁ గంటే చెలీ. 128

అమృతాంశుండు = చంద్రుఁడనెడునాయకుఁడు, ఇక్కడ నేకదేశవివర్తి రూపకము, నిశాసతింగలసి = రాత్రియనెడు నాయికను గూడి, శీర్యచ్చంద్రికా గంధశిల్పముతోఁ = విశీర్ణమగుచున్న వెన్నెలయనెడు గంధపుఁబూఁతతోడ, శిల్పమనఁగా రచన, పుష్కరశయ్యఁ బాసి చనఁ = ఆకాశమనెడుపానుపు విడిచిపోఁగా, (ని. 'పుష్కరం పంకజే వ్యోమ్ని పయఃకరికరాగ్రయోః' అని వి.) వేళాదూతి = ఉషఃకాలమనెడు దూతిక, తత్కాల = సద్యస్కాలమనెడు రతికాలమందలి, సంభ్రమ= సంవేగముచేత, సంశీర్ణతర = మిక్కిలివిశీర్ణములైన, ఉడు=నక్షత్రములనెడు, హారమణివారంబేరి=హారమౌక్తికముల నేర్పఱచి, తానొక్కచోఁగుమిగాఁబోసెనొనాఁ = తానొకచోట రాశిగాఁ బోసినదో యన్నట్టులుగా, మినుక్కురను = తళుక్కుమని మెఱయుచున్నట్టి, వేగుంజుక్కఁగంటే = వేగుచుక్కను జూచితివా, చెలీ = ఓగిరికాదేవీ యని యర్థము.

వెన్నెలలు పలుచఁబాఱుచుండెననియు, జంద్రుఁ డస్తంగతుఁడయ్యెననియు జుక్కలన్నియుఁ గాంతిమాసెననియు వేగుచుక్క దోఁచెననియు భావము. వెన్నెలలు పలుచఁబాఱుట చంద్రుఁడు నిశాసతితోఁగవయ మేనిగంధపుఁబూఁత రాలునట్లును, ఆకాశమువదలుట శయ్యవదలుటగను వేగుచుక్క దోఁచుట రతిసంభ్రమమున దెగినముత్తెములను గుప్పగాఁజేయుటగను నుత్ప్రేక్షింపఁబడెను. వేగుచుక్క చుక్కలన్నింటికాంతిని గ్రహించి వెలుఁగుచుండెనని ఫలితార్థము. అలం. ఉత్ప్రేక్ష.

మ. తోవకుం దూరపునంటు రేమగువపొందుం బూర్వపక్షంబు వ
ష్మవుఁ దారారుచి మద్విభూతి నది గా కబ్జారితో వారికే
యవినాభావము నాకుఁ గాక యని చంద్రాపాయవేళం బ్రదీ
పవిపాండుద్యుతి పేరఁ జంద్రిక శిఖం బ్రాపించె నీక్షించితే. 129

తోవకుం దూరపు నంటు = కలువతీఁగెకు దూరపు స్నేహమని యర్థము. చంద్రునకును గుముదములకును ద్విలక్షయోజన వ్యవధానమని భావము. నంటనెడుపదము నకారాదిగాని స్వరాదికాదు. రేమగువపొందుం బూర్వపక్షంబు = నిశాకాంతసంగతియును నిలుకడలేనిదనియర్థము. శుక్లపక్షమందే యోగమనిభావము. (శ్లో. 'అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా.' న.) అనెడుసూత్రముచేత సప్తమ్యర్థమందుఁ బ్రథమవచ్చినది, వష్మవుతారారుచి మద్విభూతిక్ = రుచియనఁగా నభిరతియును గాంతియును గనుక నశ్విన్యాది తారలయందలి యభిరతి నాయొక్క సంపదవలన వ్యర్థమైపోవునని యర్థము. వెన్నెలవలనఁ జుక్కలు కాంతి రహితము లగుచున్నవని భావము. అదిగాక = అదియునుంగాక, అబ్జారితోఁ = చంద్రునితోడ, వారికేయవినాభావము నాకుఁగాక = అవినాభావమనఁగా నెడతెగని కూటమి, కుముదలతకును రాత్రికిని దారలకును గమనాగమనములు సంభవింపవు గనుకను దనకు సంభవించుచున్నవి గనుకను గుముదలతాదుల కవినాభావము లేదనియును దనకుఁ గలదనియును దాత్పర్యము. అని = ఈలాగని, చంద్రాపాయవేళక్ = చంద్రుఁ డపాయమును బొందినసమయమందు, చంద్రిక=

వెన్నెలయనెడునాయిక, ప్రదీపవిపాండుద్యుతిపేరన్ = దీపములయొక్క ధవళకాంతియనెడు మిష చేత, శిఖిం బ్రాపించెన్ = అగ్నిప్రవేశమాయెను, అనఁగా సహగమనము చేసెను, కాంక్షించితే = చూచితివా యని యర్థము.

కలువకన్నెకుఁ జంద్రునకు దూరము. రేమగువకుఁ జంద్రునకు మైత్రి పూర్వపక్షము. చుక్కల కాంతి వెన్నెలవెలుంగుచే నశించుచున్నది. కావునఁ జంద్రునకు వెన్నెలకు అవినాభావసంబంధము కలదు. అట్టియెడ సహగమనము యుక్తమని వెన్నెల యగ్నిని జొచ్చెననియర్థము. చంద్రాస్తమయ సమయమున దీపములు తెల్లబాఱెనని భావము. అలం. శ్లేషమూలక కావ్యలింగము. సమాసోక్తి.

శా. తారాసస్యము పండినన్ గగనకేదారంబునం జంద్రికా
నీరం బారఁగఁ గోసి తద్రుచిఫలానీకంబు ప్రాతర్మహా
సీరిగ్రామణి తూరుపెత్తె ననఁ దోఁచెం దూర్పునం దెల్పు త
ద్దూరన్యస్తపలాలరాశిక్రియ నిందుం డేఁగె నిస్సారుఁడై. 130

తారాసస్యముపండినన్ = నక్షత్రములనెడు వరిపైరుపండఁబారఁగా, గగనకేదారంబునన్ = ఆకాశమనెడు వరిమడియందు, చంద్రికానీరంబారఁగన్ = వెన్నెలయనెడు నీరెండిపోవఁగా, కోసి = కోఁతగోసి, తద్రుచిఫలానీకంబు = ఆనక్షత్రకాంతి పుంజమనెడు ధాన్యరాశిని, ప్రాతర్మహాసీరిగ్రామణి-ప్రాతః = ప్రాతఃకాలమనెడు, సీరమనఁగా నాగలిగాన నది గలవాఁడు, సీరి-అనఁగాఁ గాఁపువాఁడు, మహాసీరిగ్రామణి యనఁగాఁ బెద్దకాఁపువాఁడు, తూరుపెత్తెననఁదోఁచెం దూర్పునందెల్ప = తూరుపుదిక్కునందుఁ దూర్పారఁబట్టెనో యన్నట్టులుగాఁ దూర్పుదిక్కునందుఁ దెలుపు గనుపించెను- అనఁగాఁ దూర్పు తెల్లవారెననుట, తత్ = తూర్పారిన యాధాన్యరాశికి, దూరన్యస్త = దూరముగాఁ దీసిన, పలాలరాశిక్రియన్ = పొల్లురాశియో యన్నట్లు, (శ్లో. 'పలాలో స్త్రీసనిష్ఫలః' అని అ.) నిస్సారుఁడై = కాంతిహీనుఁడై, ఇందుండు = చంద్రుఁడు, ఏఁగెన్ = పడమటదిక్కునకుఁ బోయెను.

వరిపండినపిదప నీరిపురనిచ్చి పంటగోసి ధాన్యమును దూరుపారఁబట్టుదురు. పొల్లంతయు దూరముగాఁ బడును. వెన్నెల లంతరించుట నీరిపురనిచ్చుటవలెను, బడమటివైపుకాంతి శూన్యుఁడై చంద్రుఁడు దూరముగాఁబడిన పొల్లుధాన్యమువలెను నుండెనని భావము. అలం-రూపకము-ఉత్ప్రేక్ష.

మ. సిరి నెత్తామరయింటికిన్ మగుడి రాఁ జెంతన్ ద్విజారావమా
ధురిఁ బుణ్యాహముఁ దెల్పుచున్ గురుతరధ్వాంతోద్ధతిన్ వల్లవో
దరనీహారజలంబు చిల్కఁగ నయుక్తం బొంటిమై నుండ నం
చు రథాంగంబు ద్విజాతిగానఁ గవ యై చూపట్టె నప్పట్టునన్. 131

సిరి = లక్ష్మీదేవి, నెత్తామరయింటికి న్మగుడిరాన్ = విడిచిపెట్టిన కమలగృహమునకుఁ దిరిగిరాఁగా ననియర్థము. ప్రాతఃకాలమందుఁ గమలములు శోభాయుక్తము లగుచున్నవని భావము. చెంతన్ = సమీపమందు, ద్విజారావమాధురిఁబుణ్యాహముఁ దెల్పుచున్ = ద్విజశబ్దము బ్రాహ్మణులయందును బక్షుల యందును వర్తించుచున్నది గనుక బ్రాహ్మణమంత్రఘోషమాధుర్యముచేతఁ బుణ్యాహవాచన మాచరించుచు నని యర్థము. పక్షికలకలస్వనమాధుర్యముచేత మనోజ్ఞమైన దినమును దెలుపుచునని భావము. ఇక్కడఁ బుణ్యమనఁగా మనోజ్ఞము. (ని. 'పుణ్య మనోజ్ఞే విహితం తథాసుకృతధర్మయోః' అని వి,

అహమనఁగా దినమును, గురుతరులు = పెద్దలైనవారని యర్థము. గొప్పవృక్షము లనిభావము.తోడ్తోన్ = పుణ్యాహవాచనము కాఁగానే యనియర్థము. పక్షులు కలకలధ్వనులు సేయఁగానే యనిభావము. నటత్పల్లవ = హస్తవశమువలన నటించుచున్న చిగురుటాకులచేత, ఉదరనీహారజలంబు చిల్కఁగన్ = కలశోదరమందలి పుణ్యాహవాచనసంబంధమైన పన్నీరు చిలుకరింపఁగా ననియర్థము. వాయువశము చేత నటించుచున్న వృక్షపల్లవముచేత నుదరగతమైన మంచునీరును జిలుకరింపఁగా ననిభావము. రథాంగంబు = చక్రవాకము, ద్విజాతిగాన్ = ద్విజాతియనఁగా బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణజాతిగనుక, అయుక్తంబొంటిపై నుండనంచున్ = ఒంటిగా నెదురుపడియుండుట యనుచితమని, అప్పట్టునన్ = ఆలక్ష్మీగృహప్రవేశకాలమందు, కవయైచూపట్టెన్ = జోడై కనుపడె నని యర్థము.

చక్రవాకము పక్షిగనుక జన్మద్వయము గలదనియును బ్రాతఃకాలమున నాఁడుపక్షితో జోడు గూడె ననియును భావము. అనఁగాఁ బ్రాతఃకాలమందు సరోవరకమలములు వికాసమునుబొందెనని యును సరోవరతీరములయందలి గొప్పవృక్షములపైనున్న పక్షిసమూహము కలకలధ్వనులు చేసెనని యును వాయువశముచేతఁ జలించుచున్న యావృక్షపల్లవములవల్లనుండి మంచునీ ళ్ళాకమలముమీఁదఁ బ్రసరించె ననియును జక్రవాకములు రాత్రియెల్ల నెడఁబాసియుండి యప్పుడు తిరుగా జోడు గూడె ననియును దాత్పర్యము. తెల్లవారుతరి పతగము లఱచుటయుఁ జిఱుగాడ్పులు వీచుటయు సహజము. తెల్లవారఁగనె చక్రవాకము జంటపులుఁగును గలసికొనుననుట కవిసమయసిద్ధము. ద్విజాతులగు చక్రవాకములు తెల్లవారఁగనే జోడుగూడెను. బ్రాహ్మణులిద్దఱగపడుట మంగళమని భావము. ఇందులకు-

శ్లో. కన్యాగౌభేరిశంఖం దధిఫలకుసుమం పావకం దీప్యమానం
యానంవా విప్రయుగ్మం...’

చ. ఎలమి మనోజలుబ్ధుఁ డెనయించినజక్కవదీము వెంటి పే
రెలుఁగునఁ బిల్చి చూడ్కిఁ గదియించి యెదుర్కొని మేను మేను ని
శ్చలగుణసంగతిం బెనఁచి చక్రము దామరతెంకిఁ జేర్పఁ ద
త్కలకలశంకఁబోలె విహగంబులు వీడెఁ గులాయకూటముల్. 132

ఎలమిన్ =ఉత్సాహముచేత, మనోజలుబ్ధుఁడు = మన్మథుఁడనెడు కిరాతుఁడు, ఎనయించిన = పొందించిన, జక్కవదీమువెంటి = దీమనఁగా నొకజాతిపక్షులను మోహపెట్టెడుకొఱకుఁ దజ్జాతి స్త్రీపక్షినుంచి యందులో నురులొడ్డియుంచెడు బోనుపెట్టెకుఁ బేరుగనుకఁ జక్రవాకియనెడు దీము వెంటి, పేరెలుఁగునఁబిల్చి = పెద్దయెలుఁగుచేతఁ బిలిచి, చూడ్కిఁగదియించి = ఆలాగునఁ బిలువఁబడి వచ్చునట్టి పురుషపక్షియందు దృష్టినిలిపి, ఎదుర్కొని = అభిముఖమైనిలిచి. ఈమూఁడుచోట్లను బ్రకృతాప్రకృతసాధారణమని విచారింపవలయును. మేను మేను నిశ్చలగుణ సంగతిం బెనఁచి = శరీరములు రెండును నిశ్చలత్వసంగతియనెడు నిశ్చలసూత్రసంగతిచేతఁ బెనవైచి, చక్రము=చక్రవాకమును, తామరతెంకిఁ జేర్పన్ = తామరయనెడు నివాసస్థానమును జేర్పఁగా ననియర్థము. ఈయర్థమందుఁ జక్రమనెడుపదమునందలి ద్వితీయకుఁ బ్రథమవచ్చినది గనుకఁ దామరయనెడిపదమునందలి మొదటి తకారమునకు దకారాదేశము వచ్చినది. దామర యనఁగా నురుగట్టినత్రాడు గనుకఁ దామరతెంకిఁ

జేర్పఁగానే యని యర్థాంతరము. తత్కలకలశంకఁబోలెన్ = ఆయుంచిలోఁబడినపక్షియొక్క కలకల మనెడు సందేహముచేతవలెను, విహగంబులు = పక్షులు, కులాయకూటములు = నివాసస్థానములైన గూళ్లను, వీడెన్=విడిచిపెట్టెను. (ని. 'కులాయో నీడ మస్త్రియామ్' అని అ.)

ప్రాతఃకాలము కాఁగానే రాత్రి చక్రవాకము నెడఁబాసియున్న చక్రవాకి యెలుఁగిచ్చి పిలిచి రాఁగానే చూచి యెదురుకొని తనశరీరము దానిశరీరముతోఁ బెనఁచికొని వాసస్థానమయిన తామరకుఁ బ్రవేశపెట్టెననియును సమస్తపక్షిజాతములును నాహారార్థము గూళ్లవిడిచి పోయెననియును నర్థము. తెంకి యనుపద మిచటఁ దకారాదియేకాని టకారాది కాదు. ఇందుకుఁ బ్రయోగము- ఉ. 'తెంకులువేదము ల్రఘుపతీశరణాగతవజ్రపంజరా' అని వజ్రపంజరశతకమునందు. అలం. రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

ఉ. పంచశిలీముఖుండు తుదబాణమునన్ జగ మెల్ల గెల్చి య
భ్యంచితపుష్పవృష్టి మరుదావళి నింపఁగ నిప్పు డల్లు ము
ద్రించినజాడఁ దెల్పె సుదతీ మధుపంబు పరిచ్ఛదచ్ఛటా
కంచుకితోత్పలంబుతుదకచ్చునఁ జిక్కి యచంచలాకృతిన్. 133

పంచశిలీముఖుండు=అయిదుబాణములుగల మన్మథుఁడు, తుదబాణమునన్ = అనఁగా, ని. 'అరవింద మశోకంచ చూతంచ నవమల్లికా, నీలోత్పలంచ పంచైతే పంచబాణస్య సాయకాః' అని యున్నదిగనుకఁ దుదబాణమనఁగా నీలోత్పలము.

కాఁబట్టి యట్టినీలోత్పలబాణముచేత, జగమెల్ల గెల్చి = అనఁగా రాత్రియందే తనకు నుద్రేకంబును రాత్రియందే నల్లగలువలకు వికాసంబును గనుక నల్లగలువచేతనే ప్రపంచమునంతయు జయించి, అభ్యంచితపుష్పవృష్టిమరుదావళినింపఁగన్ = మరుచ్ఛబ్దము దేవతలయందును వాయువులయందును వర్తించును. ని. 'మరుతౌ పవనామరౌ' అని అ. మిక్కిలియు నొప్పుచున్న పుష్పవర్షమును దేవతాశ్రేణి గురిపింపఁగానని యర్థము. వాయువులు పుష్పములురాల్పఁగా ననిభావము. ఇప్పుడు= ఈ సమయమందు, మధుపంబు = తుమ్మెద, ఉపరిచ్ఛదచ్ఛటా = పైనున్నపత్రస్తోమముచేత, కంచుకిత= ఆచ్ఛాదింపఁబడిన, ఉత్పలంబు = నల్లగలువయొక్క, తుదకచ్చునఁజిక్కి = చివరఱేకులకప్పునఁ జిక్కుపడి-అనఁగాఁ గొంతదేహము పైకిఁ గనుపించునట్లుగాఁ జివరను జిక్కుకొన్నదై, అచంచలాకృతిన్ = చలింపనిదేహముతోడ, అల్లుముద్రించినజాడ, దెల్పెన్ = నీలోత్పలబాణపుటలుగుమీఁద సికాచేసినరీతిని దెలియఁజేసె ననియర్థము. ఇక్కడఁ బైనున్నపత్రస్తోమముచేత నాచ్ఛాదితమైనదని యుత్పలపరమైన యర్థము.

ఉపరిభాగమందు వస్త్రచ్ఛటాచ్ఛాదితమని బాణపరమైన యర్థము. ఛదశబ్దము వస్త్రపరమయినందుకు, శ్లో. 'ఇభేదార్ద్రాజినాచ్ఛచ్ఛదః' అని కాళిదాసప్రయోగము. అలం. పరికరము. నిదర్శనము.

మన్మథుఁ డరవిందము మొదలైన మీఁదినాలుగుబాణములును బ్రయోగించినమీఁదటఁ బ్రయోగించెడు బాణముగనుకఁ దుదబాణమన్నాఁడని తెలియవలయును. ఇందుకుఁ బద్యము-

క. 'కూడుడిగించునశోకము, వాడించును మల్లెవిరి వివర్ణతఁజేయుం

జూడఁగఁ జూతము తలఁపు, ల్జోడించుం దమ్మి చంటఁ జూచుం గలువల్.'
అని చెప్పఁబడియున్నది గనుక సర్వజ్ఞుఁడైన యమరకోశకారుఁడును నీ యభిప్రాయముచేతనే నీలోత్పలమును దుదను జెప్పినాఁడు.

ఉ. తమ్మిపతంగపత్ని తమిఁ ♦ దాల్చినపాండురకోరకాండము
ల్గ్రిమ్మి నిమీలితచ్ఛదప♦రంపరచేఁ బ్రసవాప్తివేళ రా
నిమ్ముగ వాని నొయ్య విరి♦యించిన హేతుగుణాప్తిఁ బాంథవ
ర్గమ్ముల నేచు తేఁటిపిలు♦క ల్వెడలెన్ సహజాసితచ్ఛవిన్. 134

తమ్మి=పద్మలతయనెడు, పతంగపత్ని=పతంగశబ్దము పక్షియందును సూర్యునియందును వర్తించుచున్నది గనుకఁ బక్షికాంతయని యర్థము. సూర్యపత్నియనిభావము. తమిఁదాల్చిన = రాత్రియందుఁ బెట్టిన, (ని. 'రజనీ యామినీ తమీ' అని అ.) పాండురకోరకాండముల్=తెల్లనిమొగ్గలనెడు గ్రుడ్లను, నిమీలితచ్ఛదపరంపరచేన్=ముకుళితపత్రపరంపరయనెడు నాకుంచితపక్షపరంపరచేత, గ్రిమ్మి=పొదిగి, ప్రసవాప్తివేళరాన్ = వికసించి పుష్పములయ్యెడు సమయమనెడు ప్రసవకాలమురాఁగానే, అనఁగా గ్రుడ్లు నవియించునట్టికాలము రాఁగానే, (ని. 'స్యాదుత్పాతే ఫలే పుష్పే ప్రసవో గర్భమోచనే' అని వి.) ఇమ్ముగన్ = యుక్తముగా, వానినొయ్యవిరియించినన్ = ఆమొగ్గలను వికసింపఁజేయఁగా నని పద్మలతాపరమయిన యర్థము. గ్రుడ్లను ముక్కుతోఁ బొడిచి యవియింపఁగానని పక్షిపరమయిన యర్థము. ఉభయత్ర యభేదాధ్యవసాయము. హేతుగుణాప్తిన్ = హేతువైన రాత్రియొక్క గుణప్రాప్తిచేత, పాంథవర్గములనేచు=విరహిజనసమూహములను వ్యథపెట్టునట్టి, తేఁటిపిలుకల్ = తుమ్మెదలనెడుపిల్లలు, సహజాసితచ్ఛవిన్ = స్వభావసిద్ధమయిన నీలకాంతితోడ, వెడలెన్ = బయలుదేరెను. రూపకాలంకారము.

ఇక్కడ రాత్రికారణమును రాత్రియందుఁబెట్టిన కోరకాండములవలనఁబుట్టిన తేఁటిపిలుకలు కార్యములును నవుచున్నవి గనుక, 'కారణగుణాహి కార్యగుణానారభంతే' అనెడు న్యాయముచేతఁ గారణమగురాత్రియొక్కగుణములైన పాంథవర్గబాధకత్వమును నసితచ్ఛవియును గార్యములైన తేఁటిపిలుకలయందుఁ గనఁబడియెనని యెఱుఁగునది. పులుఁగుచెలువ ముడుపఁబడిన ఱెక్కలచే దరుణము వఱకుఁ దెల్లనిగ్రుడ్లను పొదిగి యుచితకాలమున ముక్కుతోఁ బొడిచి పిల్లలను బయటికి వెడలించినట్లు పద్మలత రేయెల్లదళములతోఁ బద్మకుట్మలస్థమగు తుమ్మెదలనుగప్పి తెల్లవారఁగనే విడిచిపెట్టినట్లు తుమ్మెదలు బయలువెడలెనని భావము.

చ. సమయమహర్షి బోధగుణ♦శాలి మహోదయభూమిభృద్వ్రతం
సమునకుఁ బ్రాగ్వధూటియెడఁ ♦ జక్రహితుండు నశేషదేవతాం
శము నగుసూనునిం దలఁచి ♦ సాంధ్యమహామయహోమవహ్ని దీ
ప్తముగ నొనర్చెఁ దారచరు♦భక్తశతాహుతిపూర్వకంబుగాన్. 135

సమయమహర్షి = ప్రాతఃకాలమనెడి ఋషీశ్వరుఁడు, ఆయనయెట్టివాఁడనిన, బోధగుణశాలి= మేలుకొనుటయనెడు పరిజ్ఞానముచేత నొప్పుచున్నవాఁడు, ఆయన, మహోదయభూమిభృద్వ్రతంసమునకున్=మహత్తయిన యుదయగిరీంద్రమనెడు మహాభ్యుదయముగల రాజశ్రేష్ఠునకు, (ని. 'ఉద

యస్తు పుమా న్పూర్వపర్వతే చ సమున్నతౌ' అని మే. (ని. 'భూభృ ద్భూమిధరే నృపే' అని అ.) ప్రాగ్వధూటియెడన్=పూర్వదిశయనెడు ధర్మపత్నియందు, చక్రహితుండున్=చక్రవాకహితుండును అశేషదేవతాంశమునగు = సమస్తదేవతాత్మకుఁడునునయిన, సూనునిన్ = సూర్యుఁడనెడు, చక్రహితుండును = రాష్ట్రహితుండును, అశేషదేవతాంశమునగు = అష్టదిక్పాలకాంశమునయిన, సూనునిన్=కుమారుని, తలఁచి = సంకల్పించి, ఇక్కడ నభేదాధ్యవసాయము. సూనుశబ్దమునకు, (ని. 'సూనుః పుత్రేనుజేరవౌ' అని వి.) సూర్యుఁడు సమస్తదేవతాత్మకుఁ డన్నందుకు నాదిత్యహృదయమందు, (శ్లో. 'ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః, మహేన్ద్రో ధనదః కాలో యమ స్సోమో హ్యపాం పతిః') అని చెప్పఁబడియున్నది. రాజకుమారుఁ డష్టదిక్పాలకాంశ మన్నందుకు, (శ్లో. 'అష్టాభి ర్లోకపాలానాం మాత్రాభి ర్నిర్మితో నృపః') అని చెప్పఁబడియున్నది. సాంధ్యమహోమయ హోమవహ్నిన్= ప్రాతస్సంధ్యారాగమనెడు హోమాగ్నిని, తారచరుభక్తశతాహుతిపూర్వకంబుగాన్-తార = నక్షత్రములనెడు, చరుభక్తశతాహుతి పూర్వకంబుగాన్ = హోమయోగ్యపక్వాన్నభాగశతాహుతిపూర్వకముగాను, దీప్తముగనొనర్చెన్ = ప్రకాశమానమగునట్లుగాఁ జేసెను.

భక్తమనఁగా అన్నము, (ని. 'భిస్సాస్త్రీభక్తమంధోన్నమ్' అని అ.) అనఁగా మేలుకొనుటయనెడు పరిజ్ఞానముచేత నొప్పుచున్న ప్రాతఃకాలమనెడు ఋషీశ్వరుఁడు, మహాత్తయిన యుదయాచలేంద్రమనెడు మహాభ్యుదయముగల రాజశ్రేష్ఠునకుఁ బ్రాగ్దిశయనెడు ధర్మపత్నియందుఁ జక్రవాకహితుఁడును సమస్తదేవతాత్మకుఁడును నయిన సూర్యుఁడనెడు రాష్ట్రహితుఁడును నష్టదిక్పాలకాంశమును నయిన కుమారుఁడు గలుగునట్లుగా సంకల్పించి సంధ్యారాగమనెడు హోమాగ్నిని నక్షత్రములనెడు హోమయోగ్యపక్వాన్నభాగశతాహుతిపూర్వకముగాఁ బ్రకాశమానమగునట్లు చేసెను. అనఁగాఁ బుత్రకామేష్టిహోమము చేసెనని తాత్పర్యము.

మ. కుముదాధారవిహారము ల్కమల కన్గోఁ జాల కంభోజగే
హము మూయం దెఱపింతు వేగ నని వామాలోకము న్మాటి యా
సమయోపేంద్రుఁడు దక్షిణాక్షిఁ దెఱచెన్ ♦ సంజాతరాగానుబం
ధముతో నా విధుఁ డేఁగెఁ బ్రొద్దు వొడిచెన్ ♦ బంధూకబంధుచ్ఛవిన్. 136

కుముదాధారవిహారముల్=కుశబ్దము భూమియందు వర్తించుచున్నది గనుక సవతియైన భూదేవి యొక్క ప్రీతి కాధారములైన విహారములని యర్థము. (ని. 'గోత్రాకుః పృథివీ పృథ్వీ' అని అ.) కుముదముల కనఁగాఁ గలువల కాధారములయిన విహారములనని భావము. కమల = లక్ష్మీదేవి, కన్గోఁజాలక = చూడఁజాలక - అనఁగాఁ జూచి యోర్వలేక యనుట. అంభోజగేహముమూయన్ = తామర యింటివాఁకిలి మూయఁగానే యనియర్థము. రాత్రియందుఁ దామరలు ముకుళించుచున్నవనిభావము. తెఱపింతువేగనని = అనఁగా శీఘ్రముగాఁ దెఱపింతునని యర్థము. తెల్లవారఁగానే తామరలు వికసించుచున్న .వనిభావము. ఆసమయోపేంద్రుఁడు = ప్రాతఃకాలమనెడు శ్రీమహావిష్ణువు, వామాలోకమున్మాటి = ఎడమకన్నుమూసి, సంజాత=పుట్టిన, రాగానుబంధముతోన్=ఎడతెగని యనురాగముతోడ, దక్షిణాక్షిఁ దెఱచెన్ = కుడికన్ను దెఱచినవాఁడాయెనో, నాన్=అన్నట్లుగా, విధుఁడేఁగున్=చంద్రుఁడస్తంగతుఁడాయెను, బంధూకబంధుచ్ఛవిన్ = బంధూకమనఁగా మంకెనపువ్వు గనుక దానితో సమానమయిన కాంతితోడ, ప్రొద్దువొడిచెన్ = సూర్యుఁ డుదయించెను.

అనఁగా ననురాగ మరుణవర్ణమని మహాకవి ప్రసిద్ధము గనుక ననురాగయుక్తమయిన కుడికన్ను తెఱచెనో యన్నట్టులుగా మంకెనపువ్వుతో సమానమైన యరుణకాంతితోడ సూర్యుఁ డుదయించెనని తెలియవలయును. దృష్టికిని ననురాగయుక్తత్వము ప్రతాపరుద్రీయమందుఁ జెప్పఁబడినది. (శ్లో. 'కాకలిత్యాపతేర్దృష్టి రనురాగతరఙ్గితా, లగ్నాకల్హారమాలేవ వధ్వాస్తుఙ్గకుచద్వయే.') అని విష్ణునకు సూర్యుఁడు కుడికన్ను, చంద్రుఁ డెడమకన్ను, కుముదాధారవిహారము సవతి పెంపు గాన నది సైపఁజాలక లక్ష్మి తనగృహము మూసికొనెను. కుడికన్ను విష్ణునకు సూర్యుఁడు గానఁ గుడికన్ను తెఱవఁగనే సవతిపెం పడఁగెను. లక్ష్మీమందిరముఁ దెఱువఁబడెను. అనఁగాఁ గలువలు ముకుళింపఁ దమ్ములు వికసింపఁ దూర్పుకట్టెఱ్ఱవార సూర్యుఁడుదయించెనని తా. అలం. ఉత్ప్రేక్ష.

శా. ఓచామీకరచారుగాత్రి నిను గో◆త్రోత్తంసమున్ వేఁడి నే
డాచేదిక్షితిపాలశేఖరునితో ◆ హత్తింపఁగా వచ్చు త
త్ప్రాచీభర్తకుఁ బట్టుపట్టుగొడుగై ◆ భానుండు దోఁపం బ్రభా
వీచుల్ దద్గతరత్నగుచ్ఛముల తీ◆విం బొల్చెఁ బ్రాంతంబునన్. 137

ఓచామీకరచారుగాత్రి = చామీకరమనఁగా బంగరము, (ని. 'చామీకరం జాతరూపం మహారజతకాఞ్చనే' అని అ.) బంగారపుఁ గణికవంటి దేహముగల యోగిరికాదేవీ, నినుగోత్రోత్తంసమున్వేఁడి = నిన్ను వసురాజుకొఱకుఁ బర్వతశ్రేష్ఠుఁడైన కోలాహలునియాచించి, నేఁడు = ఈదినమందు, ఆచేదిక్షితిపాలశేఖరునితో హత్తింపఁగావచ్చు = చేదిదేశాధీశ్వరశ్రేష్ఠుఁడైన యావసురాజుతోఁ గూర్చుటకై వచ్చుచున్న, తత్ప్రాచీభర్తకున్ = పూర్వదిశానాథుఁడైన యాయింద్రునకు, ఇది సాభిప్రాయపదము. పట్టు=పట్టిన, పట్టుగొడుగై=ఎఱ్ఱపట్టుగొడుగో యన్నట్లుగా నున్నవాఁడై, భానుండుదోఁపన్ = సూర్యుఁడు గనుపింపఁగా, ప్రభావీచుల్=తరంగప్రాయములయిన యరుణకాంతులు, ప్రాంతంబునన్ = సమీపమందు, తద్గతరత్నగుచ్ఛములతీవింబొల్చెన్ = ఆసూర్యుఁడనెడు గొడుగునంటియున్న కెంపుమణులగుత్తులవలెనే ప్రకాశించెను.

సూర్యుఁడు ఇంద్రునకుఁ బట్టిన కెంబట్టుగొడుగువలె నుండెననియు సూర్యకిరణము లా గొడుగునకుఁ గట్టిన జాలరులవలె నుండెననియు భావము. అలం. రూపకోపమలు.

క. అని విన్నవించుటయుఁ గ్రొ,న్ననపానుపు డిగి ప్రసన్న◆నలినానన దా
ననఘదినాననకృత్యము, లొనరించి గురున్ భజించి ◆ యుండెం బ్రీతిన్. 138

అని విన్నవించుటయున్ = ఈలాగని చెలికత్తె విజ్ఞాపనము సేయఁగా, క్రొన్ననపానుపుడిగి = పుష్పశయ్యమీఁదినుండి క్రిందికిదిగి, ప్రసన్ననలినానన = విలాసయుక్తమయిన పద్మమువంటి ముఖము గల గిరికాదేవి, తాన్ = తాను, అనఘదినాననకృత్యములొనరించి - అనఘ = దోషరహితమయిన, దినాననమనఁగా నహర్ముఖము. అనఁగాఁ బ్రాతఃకాలముగనుకఁ బ్రాతఃకాలకృత్యములు జరిగించి - అనఁగా ముఖప్రక్షాళనాదికార్యములు నిర్వర్తించి, గురున్ భజించి=తండ్రియైన కోలాహలుని సేవించి, ఉండెంబ్రీతిన్ = సంతోషముతో నుండెను.

ఆశ్వాసాంతము.

మ. అధరీభూతజయంతకంతుసుకుమా◆రాకార రాకారజ
న్యధిపోత్తేజితరాజబింబరుచిధా◆రాధార రాధారమ

ణ్యధినాథాంఘ్రిసరోరుహద్వితయసే • వాచార వాచారమా
మధురాశేషవిశేషభూషితసుధీ • మందార మందారతా. 139

అధరీభూత=తిరస్కృతులైన, జయంత=ఇంద్రుని కుమారుఁడైన జయంతుఁడును, కంతు=మన్మథుఁడును గల, సుకుమార=మృదులమైన, ఆకార=రూపముగలవాఁడా, రాకారజనీ = పూర్ణిమారాత్రిచేత, అధికోత్తేజిత = అత్యంతమును నట్టుగాఁ బ్రకాశింపఁజేయఁబడిన, రాజబింబ = చంద్రబింబముయొక్క, రుచిధారా=కాంతిప్రవాహములవంటిలావణ్యధారలకు, ఆధార = ఆస్పదమైనవాఁడా-అనఁగాఁ జంద్రబింబమందలి లావణ్యమువంటి లావణ్యముగలవాఁ డనుట. రాధారమణీ = రాధికాదేవియొక్క, అధినాథ = ప్రాణనాథుఁడైన శ్రీకృష్ణస్వామియొక్క, అంఘ్రిసరోరుహద్వితయసేవా = పాదారవిందద్వయసేవయే, ఆచార=ఆచరణముగాఁ గలవాఁడా, వాచారమా = వచోలక్ష్మియొక్క, మధుర=మనోహరములయిన, అశేషవిశేష=సమస్తవిశేషములచేత, భూషిత=అలంకృతులయిన, సుధీ=విద్వాంసులకు, మందార=మందారమనెడు దేవతావృక్షమైనవాఁడా-అనఁగా వారియొక్క వాంఛితార్థముల నిచ్చెడువాఁడ వనుట. మందారతా - మంద=అలసులయందు, అరతా=ఆసక్తిలేనివాఁడా అని యాశ్వాసాంతమందుఁ గృతిపతి సంబోధనము.

క. అబ్ధ్రాశిధీరధీరచిత బ్రాహ్మీధవవివేక • తరుణచరణభా
గిబ్రామశరణ సకలక, కుబ్రామాభరణకరణ • గుణసంభరణా. 140

అబ్ధ్రాశి=జలరాశివలె-అనఁగా సముద్రునివలెనే, ధీర = తొణకనివాఁడా-అనఁగా గంభీరుఁడవైనవాఁడా యనుట. ధీ=స్వకీయమైనబుద్ధిచేత, రచిత=విరచితమైన, బ్రాహ్మీధవ = బ్రహ్మయొక్క, వివేక = యుక్తాయుక్తపరిజ్ఞానముగలవాఁడా-అనఁగా వివేకమందు బ్రహ్మసమానుఁడాయనుట. తరుణచరణభాక్ = కోమలములైన పాదములనుబొందిన-అనఁగాఁ బాదప్రణతుఁడైన, ఇబ్రామ = ఇబరామ నెడు రాజునకు, శరణ=రక్షకుఁడవైనవాఁడా, సకల=సమస్తమయిన, కకుబ్రామా=దిక్కాంతలకు, ఆభరణకరణ = అలంకారములయిన, గుణ = గుణములను, సంభరణ=భరించినవాఁడా అని సంబోధనము. ని. 'దిశస్తు కకుభః కాష్ఠా' అని యమరము.

మాలినీవృత్తము. పరిచితకరహాటీ • ప్రాప్తకర్పూరవీటీ
విరుతకటకలాటీ • విశ్రుతస్వర్ణశాటీ
స్థిరవిజయకిరీటీ • తిమ్మమాగర్భపేటీ
వరమణినిభ ధాటీ • వల్గుధారాటఘోటీ. 141

పరిచిత=పరిచితురాలైన, కరహాటీ=కరహాటదేశస్త్రీచేత, ప్రాప్త = పొందఁబడిన, కర్పూరవీటీ = కర్పూరతాంబూలము గలవాఁడా, విరుతకటక=ఘుణఘుణత్కారముగల కంకణములు గలిగిన, లాటీ=లాటదేశస్త్రీచేత, విశ్రుత = తెలియఁబడిన, స్వర్ణశాటీ = తదీయోత్తరీయ సువర్ణశాటిగలవాఁడా, స్థిరవిజయకిరీటీ = స్థిరమయిన విజయమం దర్జునుఁడవైనవాఁడా, తిమ్మమాగర్భపేటీ వరమణినిభ = తిమ్మాంబయొక్క గర్భమనెడు పెట్టెకు మాణిక్యమువంటివాఁడా, ధాటీవల్గుధారాటఘోటీ - ధాటీ = దాడివెళ్లుటయందు, వల్గు = మనోహరమయినదియు, ధారా=అశ్వగతివంచకముచేత, అట=సంచరించినదియు నగు, ఘోటీ=గుఱ్ఱములుగలవాఁడా, లేక, ధారాట = ధారాటదేశసంభవములయిన, ఘోటీ =

ఆఁడుగుఱ్ఱములుగలవాఁడా - అనఁగా మాదువాను గుఱ్ఱములు గలవాఁడా యనుట. ధారాశబ్దము దేశ విశేషవాచక మైనందుకు నాముక్తమాల్యదయందుఁ బ్రయోగము. ప. 'బాహ్లీకపారసీకశకధారారట్ట ఘోట్టాణముల్' అని చెప్పఁబడియున్నది.

గద్యము. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందవందనపవననందనప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకషచతుర్విధకవితానిర్వాహకసాహిత్యరస పోషణ రామరాజభూషణప్రణీతం బయినవసుచరిత్రం బనుమహాప్రబంధంబు నందుఁ జతుర్థాశ్వాసము.

ఇది శ్రీమదాత్రేయకులకలశాంభోనిధిసంపూర్ణసోమ సోమాభిధానమంత్రివరపౌత్త్రుండును సోమ సుతసిద్ధేశ్వరమంత్రీశ్వరపుత్త్రుండును శ్రీమత్పార్వతీరాజేశ్వరవరప్రసాదసమాసాదితహృద్యానవద్యనిఖిల విద్యావిశారదుండును నగుసోమకవిచేత విరచితం బయిన విద్వజ్జనరంజనీనామకపూర్వ వ్యాఖ్యానమందలి విశేషవిషయసహితంబుగాఁ బరిష్కృతంబయి యొప్పారు ప్రతిపదటీకారూపం బగు వసుచరిత్రనామ కాంధ్రకావ్యరత్నవ్యాఖ్యానమునందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీ ర స్తు

# వసుచరిత్రము, సవ్యాఖ్యానము

## ప ం చ మా శ్వా స ము



సదృశ వెంగళాంబా
భాసురలాక్షారంజితాంఘ్రిశంఖ♦పద్మశుభాంక
ప్రాసాదకేళిరసిక సు
ధీసన్నుతగుణనికాయ ♦ తిరుమలరాయా. 1

శ్రీసదృశ = లక్ష్మీసమానురాలయిన, వెంగళాంబా = వెంగళమ్మయొక్క, భాసుర=ప్రకాశమానమైన, లాక్షా = లత్తుకచేత, రంజిత=రంజింపఁబడిన, అంఘ్రి=పాదములయందలి, శంఖపద్మ=శంఖములను బద్మములను సూచనసేయుచున్న, శుభాంక = శుభచిహ్నములుగల - అనఁగా నెట్టిని శంఖపద్మరంగవల్లికలచేత - అనఁగా ముగ్గులచేత నలంకరింపఁబడినదానివలెనున్న, ప్రాసాద = మేడయందలి, కేళి = క్రీడయందు, రసిక = రసికుఁడైనవాఁడా, ఇక్కడ వస్తువుచేత నలంకారధ్వని. సుధీ = విద్వాంసులచేత, సన్నుత = స్తోత్రముచేయఁబడిన, గుణనికాయ = సుగుణసమూహము గలవాఁడా, తిరుమలరాయా = తిరుమలదేవరాయా, అని యాశ్వాసాదియందుఁ గృతిపతియొక్క సంబోధనము.

తే. అవధరింపుము శౌనకా♦ద్యఖిలసన్ము
నీంద్రులకు రౌమహర్షణి ♦ యిట్టు లనియె
నాత్మకన్యోపలాలనా♦యత్తహృదయుఁ
డై హిమాహార్యసుతుఁ డున్న♦యవసరమున. 2

అవధరింపుము = చిత్తగింపుము, శౌనకాద్యఖిలసన్మునీంద్రులకున్ = శౌనకుఁడు మొదలయిన సమస్తమునిశ్రేష్ఠులకును, రౌమహర్షణి = రోమహర్షణపుత్త్రుఁడైనసూతుఁడు, ఇట్టులనియెన్=ఈలాగని పలికెను, హిమాహార్యసుతుఁడు = హిమవత్పర్వతకుమారుఁ డయినకోలాహాలుఁడు, ఆత్మకన్యా = తన కూఁతురైనగిరికాదేవియొక్క, ఉపలాలన = గారవించుటయందు, ఆయత్త=అధీనమయిన, హృదయుఁడై = చిత్తము గలవాఁడై, ఉన్నయవసరమునన్ = ఉన్నసమయమందు, ఈపద్యమునకు ముందరి పద్యముతో నన్వయము.

సీ. తొలుదొల్తఁ బారిజా♦తలతాంతమాలికాపవనంబు ఘుమ్మునఁ ♦ బరిమళించె
నావెన్క నాకాండ♦కాభ్రగర్జార్భటి బుభుదుందుభు ల్ఘుభు♦ల్ఘుభులు మనియె
నాపిమ్మట విపంచ్యు♦రీపాణివల్లకీగుంభస్వరంబులు ♦ ఘుమ్ము రనియె
నాపిదప నఖండ ♦ మై దండిమై నొక్కదివ్యతేజము ధిగ♦ద్ధిగ వెలింగెఁ

తే. జదల నొకకొంతసేపున•కిదివిమాన, పం_క్తి యనియును వీరు ది•క్పాలురనియు
మునులనియు లేఖభామిను•లనియు నవని,గలజనులకద్భుతంబుగాం•గాననయ్యె.

తొలుదొ_ల్తక్ = ముందుముందుగా, పారిజాత లతాంత మాలికా పవనంబు=పారిజాత పుష్ప మాలికలయొక్క వాయువు, ఘుమ్మునంబరిమళించెక్ = ఘుమ్ముమని వాసనగొలిపెను, అవెన్కక్ = అతరు వాత, అకాండిక = అకాలసంభవమయిన, అభ్ర = మేఘముయొక్క, గర్జార్భటిక్=ఉఱుముల యార్భా టములవంటి యార్భాటములచేత. బుభుదుందుభులు = దేవదుందుభులు, గుభుల్గుభులుమనియెక్ = గుభులుగుభులు మని మ్రోసెను, అపిమ్మటక్=ఆవెనుక, వియచ్చరీ=దేవతాస్త్రీలయొక్క, పాణి=హస్త ములయందలి, వల్లకీ = వీణలవలన, గుంభ = కల్పితములయిన, స్వరంబులు = షడ్జపంచమాదిస్వరములు, ఘుమ్మరనియెక్=ఘుమ్మమని వినఁబడియెను, అపిదపక్ = అపిమ్మట, అఖండమై=అవిచ్ఛిన్నమై, దండి మైక్ = బలమగునట్టులుగా, ఒకదివ్యతేజము = ఒకానొక దివ్యతేజస్సు, ధిగద్ధిగవెలింగెక్ = ధిగధిగ యని ప్రకాశించెను.

చదల నొకకొంతసేపునకుక్ = ఆకాశమందుఁ గొంతసేపటికి, ఇది విమానపం_క్తి యనియును = ఇది విమానశ్రేణియనియును, వీరుదిక్పాలురనియుక్=వీరుదిక్పాలకులనియును, మునులనియుక్ = వీరు మునులనియును, లేఖభామినులనియుక్ = వీరుదేవతాస్త్రీలనియును, అవనిఁగలజనులకుక్ = భూలోక మం దుండెడు జనులకు, అద్భుతంబుగాఁ గాననయ్యెక్ = ఆశ్చర్య మగునట్టులుగాఁ గానవచ్చెను.

పారిజాతసుగంధము మిగుల వ్యాప్తిగలదిగానఁ దద్వాసన లింద్రాగమసూచకముగఁ దొలుతఁ బొలసెను. తరువాత వేల్పులు మ్రోగించు దుందుభుల మ్రోత వినవచ్చెను. సమీపింప వేలుపుఁజేలుల వీణాగానము వినఁబడెను. రత్నఖచిత మగుటచే విమానకాంతి వెలింగెను. చేరువకురాఁగా నందున్నవారి గు_ర్తింప నవకాశము కలిగెను. అలం. సహజో_క్తి.

క. హరిముఖ హరిదీశానులు, హరిహయ సామజ విమాన•హరిహరిణాక్షీ
హరిముఖముఖులును దోఁపఁగ, హరిహరి యంబరము చిత్ర•మై విలసిల్లెన్. 4

హరిముఖ = ఇంద్రుఁడుమొదలైన. హరిదీశానులు=దిక్పతులును, హరిహయ = దేవేంద్రుని యొక్క, సామజ = ఏనుఁగును–అనఁగా నైరావతగజమును, విమాన = విమానమును, హరి=గుఱ్ఱమును–అనఁగా నుచ్చైశ్శ్రవమును, హరిణాక్షీ = అప్సరసలును, హరిముఖ = అశ్వముఖులైన గంధర్వులును, ముఖులును=మొదలుగాఁగలవారందఱును, తోఁపఁగక్ = కనుపడఁగా, హరిహరి = అనఁగా నాశ్చర్య పూర్వకమయిన హరిస్మరణ, అంబరము=ఆకాశము, చిత్రమైవిలసిల్లెక్ = చిత్తరువువ్రాయఁబడినదానివలె నున్నదై ప్రకాశించెను. హరిశబ్దమునకు - (ని. 'హరి ర్వాతా ర్క చం ద్రేంద్ర యమో పేంద్ర మరీచిషు, సింహాశ్వ కపి భేకా హి శుక లోకాంతరేషు చ' అని విశ్వనిఘంటువు.)

మ. ప్రబలాకారముతో గిరీశశిరముం•బ్రాపింపఁ బెఱతాఁగ నాఁ
గ బెడంగయ్యె జనాపవాద మిది యుం•క్తం బౌనె నా కంచుఁ దా
నబలాకారముఁ బూని చయ్యన గిరీ•శావా_ప్తికిఁ వచ్చె న
వ్విబుధేంద్రాపగ పద్మపాదపదవీ•విన్య_స్తభృంగాత్మియై. 5

ప్రబలాకారముతోఁ = ప్రబలమైనరూపముతోడ, గిరీశశిరముఁబ్రాపింపక = కైలాసాధీశ్వరుఁడైన శివునియొక్క తలపై నెక్కనందున, పెద్దాఁగనాఁగ జెడఁగయ్యె జనాపవాదము = పెద్దతాఁగ యనఁగా ధూర్తస్త్రీ యనునట్టులుగా జననింద యతిశయించెను, ఇది = ఈజననింద, యుక్తంబె నాకంచుఁ = నాకుఁదగునా యని, తా నబలాకారముఁ బూని = ప్రబలముగాని యల్పాకారమును వహించి, చయ్యనఁ = శీఘ్రముగా, గిరీశావాప్తికి న్వచ్చెఁ = గిరీశునిఁ జెందుటకు వచ్చెనని యర్థము, స్త్రీరూపము దాల్చి పర్వతశ్రేష్ఠుఁడైన కోలాహలునిఁ జేరవచ్చెనని భావము. ఎవ్వరనిన, అవ్విబుధేంద్రాపగ = ఆదేవనది యనఁగా నాకాశగంగ, ఏలాగునవచ్చెననిన, పద్మపాదపదవిన్యస్తభృంగాక్షియై= పద్మసదృశమయిన పాదపద్ధతియందు నునుపఁబడిన భృంగసమాననేత్రములు గలదై యని స్త్రీపరమయిన యర్థము. పాదములవంటి పద్మములయందు నుంపఁబడిన నేత్రసదృశభృంగములుగలదై యని యాకాశగంగాపరమయిన యర్థము. తాఁగలక్షణము నెత్తినెక్కుట, ఇది జనాపవాదహేతువు. కాన నిది యయుక్తము, సాధ్వీధర్మ మబలాకారధారణము. పరులఁ దిలకింపక నేలను దిలకించుట సాధ్వీధర్మము. గంగ సాధ్వీధర్మమూని కోలాహలునిచెంత కరుదెంచెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

సీ. తవిలి యర్ధపులాయితమున జోడనఁ జూపు నోజ జేజేరాచ తేజి డిగియెఁ
దులకించు మొనవ్రేలఁ దలవంచుకొన్నవన్నియ మీఁఱ వేల్పుకన్నియలు డిగిరి
కరధూతపతదబ్దఘటఁ గొమ్ముకొనఁ జిమ్ముతమి దోనెడొగ్గి చౌదంతి డిగియె
రేచకాభ్యాససంసూచకాత్మీయచాతురిఁ జేసి బాసవాల్దొరలు డిగిరి

తే. గిరిగరుచ్ఛేదిముఖ వియచ్చరులయుచిత
గమనకథనకటాక్షరేఖాగుణముల
వెంబడిన దివ్యరథకంపంబు డిగియె
వసుధ నుద్గ్రీవులై యెల్లవారుఁ జూడ. 6

తవిలి=అంటి, అర్ధపులాయితమునఁ = మండలగతివిశేషమందు, జోడనఁజూపునోజఁ = శ్వారితకగతి గనుపఱచినట్టులుగా-అనఁగా కావాదిరిగినట్టులుగా, జేజేరాచ తేజి డిగియెఁ = ఇంద్రునిగుఱ్ఱము-అనఁగా నుచ్చైశ్శ్రవము క్రిందికి దిగెను, తులకించు మొనవ్రేలఁ దలవంచుకొన్నవన్నియ మీఁఱఁ = ఒప్పుచున్న కాలి బొటనవ్రేలియందుఁ దలవంచి చూచుకొనెడిరీతి యతిశయించునట్లుగా, వేల్పుకన్నియలు డిగిరి = అప్సరసలు దిగిరి, మొనవ్రేలికై తలవంచుకొనుట స్త్రీలకు స్వాభావికమయిన చేష్టావిశేషము.

కర=తుండముచేత, ధూత=కదల్పఁబడినదై, పతత్ = పడుచుండెడు, అబ్దఘట = మేఘమాలికను కొమ్ముకొనఁజిమ్ము = దంతాగ్రముచేతఁ జిమ్మివైచెడి. తమిఁ = కోరికచేత, దోనె డొగ్గి=క్రిందికి మోఁకరించికొని, చౌదంతి డిగియెఁ-చౌదంతి = చతుర్దంతదంతావళము-అనఁగా నైరావతము, డిగియెఁ = దిగెను, రేచకాభ్యాస = రేచకమనఁగాఁ బ్రాణవాయువు నధోముఖము సేయుట గనుక దానియందలి యభ్యాసమును, సూచక= తెలియఁజేయునదియయిన, ఆత్మీయ=స్వకీయమయిన, చాతురిఁ జేసి=చాతుర్యమువలన, బాసవాల్దొరలు డిగిరి = వాక్కులే కత్తులుగాఁగల మునీశ్వరులు దిగిరి-అనఁగా మాటలచేతనే కత్తిచేయుపని చేయుమునులు దిగిరనుట,

గిరిగరుచ్ఛేది ముఖవియచ్చరుల = పర్వతపక్షచ్ఛేదియైన యింద్రుఁడు మొదలైనవారియొక్క, ఉచిత=తగిన, గమన=నడకను, కథన=తెలియఁజేసెడు, కటాక్షరేఖా=క్రేఁగంటిచూపులయొక్క పంక్తుల నెడు, గుణముల = త్రాళ్ళయొక్క, వెంబడిన = వెంటనే, దివ్యరథకదంబంబు డిగియెన్ = దివ్యవిమాన సమూహము దిగియెను. ఏలాగనగనిన, వసుధన్ = భూమియందు, ఉద్గ్రీవులై=ఎత్తఁబడిన కంఠములు గలవారై, ఎల్లవారుఁజూడన్ = సమస్తమైనవారును జూచుచుండఁగా, పైనిఁ జెప్పఁబడిన వారందఱును క్రిందికి దిగిరని సంబంధము. ప్రజలందఱు మెడలు పైకెత్తి విమానములరాక మిగుల నానందముగాఁ జూడసాగిరి. ప్రజలకటాక్షరేఖలు దివ్యరథములకు వేలుపుచెలువలకు, ఐరావతమునకుఁ ద్రోవలుసూపు చున్నటులుండెను. కటాక్షములు రేఖాగుణములు-అనఁగా పగ్గములు. పగ్గములసహాయమున రథములు సూటిగా దిగెను.

రేచకలక్షణము:-

సీ. హృదయగతప్రాణుఁ డేతెంచునాసికావివరంబువలనను వెలికి ద్వాద
శాంగుళపర్యంత మది రేచకంబగు... (సీతారామాంజనేయము.)

మ. సకలామర్త్యభటాళికిన్ భటుల నాఁచౌదంతికిన్ దంతిఁ దే
జికిఁ దేజిన్ మణిబింబదంభమునఁ దాల్చెం గాక పై వచ్చువ
జ్రికి గట్టేమియు నల్కఁ డయ్యె వసుధాభర్తృన్నఖాగ్రంబు వేఁ
తకు బిట్టోర్చినగట్టు దా వెఱచునే దంభోళిభృత్కేళికిన్. 7

సకలామర్త్యభటాళికిన్భటులన్ = సమస్తదేవభృత్యసమూహమునకును నాలాటిభృత్యులను, ఆచౌదంతికిన్ దంతిన్=ఆవెల్లయేనుఁగునకును నాలాటియేనుఁగును, తేజికిఁదేజిన్ =ఉచ్చైశ్శ్రవ మనెడు గుఱ్ఱమునకు నాలాటిగుఱ్ఱమును, మణిబింబదంభమునన్ =తనయందలిమణులయందుఁ బ్రతిఫలించిన ప్రతిబింబములనెడుమిషచే, తాల్చెంగాక = ప్రతిబింబత్వమువహించెనేకాక-అనఁగాఁ బ్రతిఘటించినాఁడే కాని, పైవచ్చువజ్రికిన్ = తనపైకివచ్చుచున్న వజ్రాయుధముగల యింద్రునికి, గట్టేమియునల్కఁడయ్యెన్ = కోలాహలపర్వతుం డెంతమాత్రమును భయపడఁ డాయెను. ఏమనిన, వసుధాభర్తృన్నఖాగ్రంబువేఁతకుబిట్టోర్చినగట్టు=వసురాజుయొక్క పాదనఖాగ్రముచేతి దెబ్బకు మిక్కిలియు సహించిన కోలాహలపర్వతుఁడు, తావెఱచునేదంభోళిభృత్కేళికిన్ = వజ్రాయుధముధరించిన యింద్రునియొక్క యాటలకుఁ దాను వెఱచునా, అనఁగా వెఱవఁడనుట. కోలాహలపర్వతమందున్న మణికూటముల యందు అమర్త్యభటులయుఁ జౌదంతియు, తేజియుఁ బ్రతిబింబము లలరి పైనుండివచ్చు వజ్రి నెదిరింప నలరించిన బలమువలెఁ జూపట్టెను. వజ్రాయుధముకంటె వసురాజునఖము మిగులఁ గఠినమైనది. దాని కోర్చిన మేటిగాన నింద్రునివజ్రమునకుఁ గోలాహలుఁడు వెఱవలేదని భావము. అలం. అపహ్నవము.

చ. అమరసమాగమావిలమృగౌఘవిలంఘనదీర్ణధాతుచూ
ర్ణము బహువర్ణరత్నశిఖరద్యుతితో నపు డభ్రమార్గముం
గమిచె నగేంద్రుఁ డింద్రశుభకార్యసమాగతి కిచ్చ మెచ్చి త
త్సముచితచాపచంచదుపదాధరుఁ డై యెదు రేఁగుకైవడిన్. 8

ఈపద్యమందలి యింద్రశబ్ద మింద్రునితో సమానతను దెలుపుచున్నది. నగేంద్రుఁడు = పర్వత శ్రేష్ఠుఁడైన కోలాహలుఁడు, ఇంద్రశుభకార్యసమాగతికిన్ = ఇంద్రునియొక్క శుభకార్యమును

గురించివచ్చుటకు, ఇచ్చమెచ్చి = ఆత్మయందు మెచ్చుకొని, తత్ = ఆ యింద్రునకే, సముచిత=తగిన, చాప = మణిచాపమనెడు, చంచత్ = ప్రకాశించునట్టి, ఉపదాధరుఁడై = కానుకపట్టినవాఁడై, ఎదురేఁగు కైవడిన్ = ఎదురుగాఁబోయినాఁడో యన్నట్టులుగా, అమర = దేవతలయొక్క, సమాగమ = రాకను గురించి, ఆవిల=కలఁతనొందిన, మృగౌఘ = మృగసమూహముయొక్క, లంఘన = దాఁటుపడుటలచేత, దీర్ణ=ఛేదింపఁబడిన-అనఁగా నలిగిన, ధాతు = గైరికాదిధాతువ్రులయొక్క, చూర్ణము-పరాగము, బహువర్ణ రత్నశిఖరద్యుతితోన్ = అనేకవర్ణములుగల రత్నములచేతఁ బ్రచురములైన శృంగములయొక్క కాంతితోడ, అపుడు=ఆసమయమందు, అభ్రమార్గముం గమిచెన్ = గగనమార్గమును బ్రాపించెను, అభ్రమార్గమనఁగా మేఘమార్గమైన యాకాశమనియైనను జెప్పవచ్చును. (ని. 'అభ్రం మేఘే స్స్వర్ణ వలాహకేషు' అని వి.) ఇక్కడ గైరికాదిధాతుచూర్ణపటలమునకును కోలాహలునకును, బహువర్ణరత్న శిఖరద్యుతికిని మణిచాపమునకును నుపమానోపమేయభావము. అలం. ఉత్ప్రేక్ష.

హరిణములు సహజభయలోలములు. దేవతలరాక కని వెఱచి దుముకుచుండుటచే శైలధాతువ్రులు చెదరి ధాతుచూర్ణము బహువిధరత్నశిఖరకాంతులతోఁ గలసి మిన్నంటెను. ఇది శుభకార్యార్థమువచ్చు నింద్రునెదుర్కొనుటకు సముచితమగు మణిమయ ధనుస్సు గొని కోలాహలుఁ డెదురేఁగుచున్నటు లుండెనని భావము. ధాతుచూర్ణము, రత్నకాంతులు మిన్నంటుచున్న వనుటచే శైలోన్నతి సువ్యక్తము.

సీ. సరసపర్జన్యసం◆జ్ఞాధురంధరుఁడు రా నాఱెఁ గాంతారఘో◆రానలార్చి
శతకోటిదీప్తిదీ◆పితకరుం డరుదేరఁ దరలె గుహాంతర◆ధ్వాంతరాజి
సకలజగన్నియా◆మకుఁడు చెంగట నిల్వ వదలె జంతుజజాతి◆వైరవిహృతి
సతతసర్వర్తుసే◆వితుఁడు చెంతకుఁ జేరఁ జనియెఁ గేకపికాది◆సమయముద్ర
తే. యమరపతి జంగమస్థావ◆రాభివాద, నీయ చరణాంబుజంబు సా◆న్నిధి యొనర్ప
ధరణిధరరాజమునఁ గల్గు◆తరులతావ్రజంబులు మించె బహుఫల◆ప్రసవవృష్టి.

సరసపర్జన్యసంజ్ఞాధురంధరుఁడు రాన్ = పర్జన్యుఁడనఁగా నింద్రుఁడును మేఘుఁడును, (ని. 'పర్జన్యౌ మేఘశబ్దేపి ధ్వనదంబుద శక్రయోః' అని వి.) సరస = రసికుఁడైన, పర్జన్యసంజ్ఞాధురంధరుఁడు రాన్ = పర్జన్యనామము వహించిన యింద్రుఁడు రాఁగానే యని యర్థము. జలసహితుఁడైన మేఘుఁడు రాఁగానే యని యర్థాంతరము. కాంతార = వనసంబంధమైన, ఘోరానల = భయంకరాగ్నియొక్క, అర్చి = జ్వాలిక-అనఁగా దావానలజ్వాలిక, ఆఱెన్ = చల్లారెను, శతకోటి = వజ్రాయుధముయొక్క, దీప్తి=కాంతిచేత, దీపిత=ప్రకాశింపఁబడుచున్న, కరుఁడు = హస్తముగల యింద్రుండు, అరుదేరన్ = రాఁగానే యని యర్థము. శతకోటి = అసంఖ్యములైనవియును, దీప్తిదీపిత = కాంతిచేఁ బ్రకాశమానము లగుచున్నవియునగు, కరుఁడు = కిరణములుగలసూర్యుఁడు రాఁగానే యని యర్థాంతరము. తరలె గుహాంతరధ్వాంత రాజి = గుహలయందలి తిమిరసమూహము విరిసిపోయెను.

సకలజగన్నియామకుఁడు చెంగటనిల్వన్ = త్రిభువననియంతయైన యింద్రుఁడు సమీపమందు నిల్వఁగా నని యర్థము. సమస్తభువననియామకుఁడైన యీశ్వరుఁడు చెంగట నిల్వఁగా నని యర్థాంతరము. జంతుజ జాతివైర విహృతి - జంతుజ = జంతువులవలనఁ బుట్టెడు-అనఁగా మృగపక్షి ప్రభృతులకుఁ గలిగియుండునట్టి, జాతివైరవిహృతి = అనఁగా సాజన్మవైరవిహారము, వదలెన్=విడిచిపోయెను,

సతత=నిరంతరమును, సర్వర్తు=సమస్తమైన ఋత్వధిదేవతలచేత, సేవితుఁడు=సేవింపఁబడిన యింద్రుఁడు, చెంతకుఁ జేరఁ = చేరువకు రాఁగానే, చనియెఁ గేకి పికాదిసమయముద్ర = నెమళ్లు కోయిలలు మొదలైనవానియొక్క వాఙ్నియమము వదలిపోయెను-అనఁగా వర్షర్తువందుఁ గేకారవములు సేయుట నెమళ్ళకును వసంతర్తువందుఁ గుహూకారములు సేయుట కోకిలములకును నియతము గనుక నానియమము వదలి యవియును ధ్వనులు చేసె నని తాత్పర్యము.

జంగమ స్థావరాభివాదనీయ చరణాంబుజుండు = చరాచరభూతలముచేత నమస్కరింపఁ దగిన పాదపద్మములు గలిగిన, అమరపతి = దేవేంద్రుఁడు, సన్నిధియొనర్పఁ=సన్నిధానము సేయఁగా-అనఁగా సమీపస్థుఁడు కాఁగా, ధరణిధరరాజమునఁ గల్గు = కోలాహలపర్వత శ్రేష్ఠమందుఁ గలిగిన, తరులతాపరంపరలు = వృక్షములయొక్కయుఁ దీఁగెలయొక్కయు సమూహములు, బహుఫలప్రసవవృష్టిఁ = అపరిమిత ఫల పుష్ప వర్షముచేత, మించెఁ = అతిశయించెను. అలం. శ్లేషానుప్రాణిత కావ్యలింగము.

మ. పతయాళుప్రబలప్రపాతఝరము ♦ ల్పాద్యంబుగాఁ దిర్యగా
యతమందారతరుప్రసూనఘటనం ♦ బర్చావిధానంబుగా
నతదివ్యోపలకూటదర్శనము నా♦నారత్నపూజాసమా
గతిగా నింద్రున కన్నగేంద్రుఁడు నతు♦ ల్గావించె నత్యున్నతిన్. 10

పతయాళు = పడుచున్న, ప్రబలప్రపాత = బలిష్ఠములైన తటములయందలి, (ని. 'ప్రపాత స్తటో భృగుః' అని అ.) ఝరముల్ = ప్రవాహములు, పాద్యంబుగాఁ = పాదములయందర్పించుసట్టి జలములుగాఁగాను, తిర్యక్ = అడ్డముగా, ఆయత=విస్తరించియున్న, మందారతరు=మందారము లనెడు దేవతావృక్షములయొక్క, ప్రసూనఘటనంబు = పుష్పసంఘటనము, అర్చావిధానంబుగాఁ = పూజావిధానముగాఁగాను, నత = వసురాజు పాదఘట్టనముచేత వంగిన, దివ్యోపలకూట = దివ్యములైన మణిశృంగములయొక్క, ఇక్కడ నుపలశబ్దము మణిపరము. (ని. 'ఉపలః ప్రస్తరే మణౌ' అని వి.) దర్శనము=చూచుట, నానారత్నపూజాసమాగతిగాఁ=నానావిధరత్నసమర్పణ రూపమయిన పూజావిధిగాఁగాను, ఇంద్రునకుఁ = దేవేంద్రునికి, అన్నగేంద్రుఁడు = పర్వతశ్రేష్ఠుఁడైన యాకోలాహలుఁడు, అత్యున్నతిఁ = అత్యధికౌన్నత్యముచేత, నతుల్గావించెఁ = ప్రణామములు చేసెను. అతిథిపూజ యవసరముగాన నాగతుఁడగు నింద్రునకుఁ దొలుత తమంతట తటములనుండి దొరలు సెలయేటినీటితోఁ బాద్యము, వ్రాలియున్న మందారశాఖలయందలిపూలతో నర్చావిధము. ఒరిగియున్న మణికూట సందర్శనముచేఁ బూజావిధి కోలాహలుఁడు నెఱవేర్చెను. తా నున్నతాత్ముఁడు గావున నతు లన్నియు నత్యున్నతిని నెఱవేర్చెను. ఉన్నతుఁడు నతుఁడగువిధము శ్లేషచేఁ బరిహారము.

తే. వెండియు నగేంద్రతనయుండు ♦ వేఁడివేల్పు
మున్నుగా వేఁడి వేల్పుల ♦ మునుల కెరఁగి
గంగ నలరించి క్రమ మెసఁ♦గంగఁ గ్రతుభు
గంగనల నందఱ మృదూక్తి ♦ నాదరించి. 11

వెండియుఁ = మఱియును, నగేంద్రతనయుండు = పర్వతరాజపుత్త్రుఁడైన కోలాహలుఁడు, క్రమ మెసఁగంగఁ = వరుసవడి యొప్పునట్లుగా, వేఁడివేల్పుమున్నుగాఁ = అగ్నిదేవుఁడు మొదలుగా,

వేల్పులన్ = దేవతలను, వేఁడి=ప్రార్థించి, మునులకెరఁగి=మునీశ్వరులకు నమస్కరించి, గంగనలరించి= ఆకాశగంగను వినయసంభాషణములచేత సంతోషింపఁజేసి, క్రతుభుగంగనలను బలున్ = దేవతాస్త్రీల నందఱను, మృదూక్తినాదరించి=మృదువాక్యములచేత మన్నించినవాఁడై, ముందరిపద్యముతో నన్వయము.

ఉ. నాకులదైవతంబు లల•నాకులభూషణ మీలతాంగి మే
నాకులభూధరేంద్రులయ•నాకులనిర్మలభాగ్యరాశి మై
నాకులముద్దుకూఁతురు పి•నాకులకోడ లటంచుఁ దెల్పి నా
నాకులపాలిక ల్పొగడ • నాకుల మ్రొక్కఁగఁ బంపెఁ గన్నియన్. 12

ఈలతాంగి=ఈచిన్నది, నాకులదైవతంబు=నాయొక్కవంశమునకు దేవతయైనదియు, లలనాకుల భూషణము = స్త్రీసమూహమునకు భూషణమైనదియును, మేనాకులభూధరేంద్రుల = మాతలిదండ్రు లయిన మేనకాదేవియొక్కయుఁ గులపర్వతశ్రేష్ఠుఁడైన హిమవంతునియొక్కయు, అనాకుల నిర్మలభాగ్య రాశి=అవ్యాకులమును నిష్కల్మషమునునయిన భాగ్యమునకు నిధియైనదియును, మైనాకులముద్దుకూఁ తురు=మాయన్నగారైన మైనాకపర్వతులయొక్క గారాబపుఁగూఁతురైనదియును, ఇక్కడఁ బూజ్యా ర్థమందు బహువచనమని తెలియవలయును. ఇందుకు, (శ్లో. 'స్యాత్పూజ్యత్వవివక్షాయాం మహ తాం బహుతామతా' అని యథర్వణవచనము.) పినాకులకోడలు = పినాక మనెడు ధనుస్సుగల హరు నకు మేనగోడలైనదియును, ఇక్కడను బహువచనము, పూర్వప్రకారంబ యని యెఱుంగునది. హరు నకు మేనగోడ లేలాగున ననిన కోలాహలుఁడును బార్వతియును దోడఁబుట్టినవారు గనుకఁ గోలా హలుని కూఁతురు పార్వతికి మేనగోడలైనందున నామె పెనిమిటియైన హరునకును మేనగోడలని తెలి యవలయును. అటంచుఁజెల్పి = అని తెలియఁజెప్పి, నానాకులపాలికల్పొగడన్=సమస్తమయిన కుల స్త్రీలు కొనియాడఁగా, కన్నియన్=కూఁతురైన గిరికాదేవిని, నాకులన్=దేవతలను గూర్చి, మ్రొక్కఁగఁ బంపెన్=నమస్కారము చేయుకొఱకు నియమించెను-అనఁగా దేవతల కందఱకును మ్రొక్కించెనుట. కులపాలికాశబ్దమునకు-(ని. 'కులస్త్రీ కులపాలికా' అని యమరము.) మైనాకుల పినాకులని బహువచ నము జెప్పుట పూజ్యార్థము గావున ఇందులకుఁ బ్రయోగము భాస్కరరామాయణమునుండి-

క. ఆకరుణానిధులగు వాల్మీకులకాపాత్రరములు మితసమవర్ణ
శ్రీకరపాదచతుష్క, శ్లోకం బయి జగతిఁ బరఁగె సుశ్లోకంబై.

క. గురుననుమతి గురుకుచభృతి, సరి నవనతిఁ గాంచి నిలుచు•శైలజఁ గనఁగా
సురలయనిమేషభావము, హరిబహులోచనతయుం గృతార్థతఁ జెందెన్. 13

గురుననుమతిన్ = తండ్రియైన కోలాహలుని యాజ్ఞచేత, గురు కుచభృతిన్ = గొప్పలైన కుచ ములయొక్క భారముచేత, సరిన్ = సమానముగా, అవనతిఁ గాంచి నిలుచు=నమ్రత్వమును బొంది నిలుచున్న, శైలజన్ = గిరికాదేవిని, కనఁగాన్ = చూడఁజూడఁగా, సురలయనిమేషభావము = దేవతల యొక్క ఱెప్పపాటు లేమియును, హరి బహులోచనతయున్ = ఇంద్రునియొక్క సహస్రాక్షత్వ మును, కృతార్థతఁ జెందెన్=సార్థకత్వమును బొందెను.

అనఁగా గిరికాదేవి చక్కఁదనము చూచునెడల దేవత లందఱును ఱెప్ప వ్రాల్పక చూచిరి దేవేంద్రుండు వేగన్నులచేతఁ జూచెను. దేవతలకుఁగల ఱెప్పపాటులేమి సహజమైనను నింతవఱకు

సార్థకము గాలేదు. అనితరరూపసౌందర్యవిలాసభాసురయగుగిరికను జెప్పార్పక యదియ చూపుగాఁ జూచుటవలన వేలుపులచూపులు కృతార్థత నొందెను. వేలుపులదొర వేయికన్నులుగలవాఁడు గావున నన్నింటికనుకూలముగ సౌందర్యమును సందర్శింపఁగలిగెనుగాన నాతఁడును గృతార్థుఁ డయ్యెనని భావము.

ఇంద్రుఁ డాదరాతిశయమున వేయికనులతోఁ గాంచుననుటకు-

తే. ఇందుబింబాస్య నారాక కెదురుసూచు
నయనములు వేయు విరియించి నాకభర్త. శృంగారనైషధము. ఆ. ౪.

సీ. తలయెత్త దయ్యెఁ గేవలజడస్థితి రంభ జళుకుచూపులఁ జూడసాగె హరిణి
కుందుకుందునఁ జెంది కొదఁ దెల్పె శశిరేఖ పలపల నై వెల్లవారెఁ దార
యుచితకార్యవివేక ముడిగె మదాలస మానె నుద్ధతభాష మంజుఘోష
మరువక పూనె మైమరువు వరూధిని చెయ్వు లన్నియుఁ దక్కెఁ జిత్రరేఖ
తే. రాపడియెసానుమతిసాంద్రతాపమునఁగ,గంగెహేమాభిధాన నిర్జరలతాంగు
లిట్లు దనుఁ జూచి సిగ్గుపాటొనయ వినయ, వినతయై యున్న నగరాజతనయఁ జేరి.

రంభ = అనఁగా నొకయప్సరసయును నరఁటిచెట్టును - రంభయనెడు నప్సరస. కేవలజడస్థితిఁ = కేవల మందభావముచేత, తలయెత్తదయ్యెఁ = వంచినతల యెత్తదాయె ననియర్థము. అరఁటిచెట్టు కేవలజడస్థితిచేత నగ్రభాగము వంచుకొనియుండె నని యర్థాంతరము. లడల కభేదము. జళుకుచూపులఁ జూడసాగె హరిణి = హరిణియనఁగా నొకయప్సరసయును లేడియును - హరిణియనెడు నప్సరస యెదిరించి చూడఁజాలని చూపులచేతఁ జూచెనని యర్థము. లేడి స్వభావసిద్ధమయిన బెదురుచూపులచేతఁ జూచెనని యర్థాంతరము. కుందుకుందునఁదెల్పె శశిరేఖ = శశిరేఖయనఁగా నొకయప్సరసయును జంద్రరేఖయును - శశిరేఖ యనెడు నప్సరస. కుందు కుందునఁజెంది = కృశించుటయనెడు చింతనుబొంది, కొదఁదెల్పెఁ = లోపము గనుపఱిచెనని యర్థము. చంద్రరేఖ క్షీణభావమునుబొంది తక్కువైపోవుట గనుపఱిచెనని యర్థాంతరము. పలపల నై వెల్లవారెఁదార = తారయనఁగా నొకయప్సరసయును నక్షత్రంబును-తారయనెడు నప్సరస. పలపల నై వెల్లవారెఁ = డిల్లపడి వెలవెలపోయెనని యర్థము. నక్షత్రము పలచబారి కాంతిహీన మాయెనని యర్థాంతరము.

ఉచితకార్యవివేక ముడిగె మదాలస = మదాలసయనఁగా నొకయప్సరసయును మద్యపానమదముచేత నలసురాలయినదియును-మదాలసయనెడు నప్సరస. సౌందర్య పరాభవమువలని చిత్తవిభ్రమముచేత, ఉచితకార్యవివేక ముడిగెఁ = అర్హకృత్యమందలి వివేకమును విడిచిపెట్టెనని యర్థము. మద్యపానమదాలసురాలు, వివేకమునశించి యకార్యము లాచరించె నని యర్థాంతరము. మానె నుద్ధతభాష మంజుఘోష = మంజుఘోషయనఁగా నొకయప్సరసయును మనోహరకంఠనాదము గలదియును-మంజుఘోష యనెడు నప్సరస. మానెనుద్ధతభాష = దృఢసంభాషణ మానెను - అనఁగా మాటలు హీనస్వరము పడియెనని యర్థము. మనోహరకంఠనాదము గలది పరుషభాషణములు మానెనని యర్థాంతరము. మరువకపూనె మై మరువు వరూధిని = వరూధిని యనఁగా నొకయప్సరసయును సేనయును, మైమరువనఁగాఁ బైనిముసుకును గవచంబును, వరూధిని యనెడు నప్సరస మైముసుకు సేన

రక వహించెనని యర్థము. నేన కపచ మేనకక పూనెనని యర్థాంతరము. చెయ్యొలన్నియుఁ దక్కఁ జిత్రరేఖ = చిత్రరేఖయనఁగా నొక యప్సరసయును జిత్తరువును - చిత్రరేఖయనెడు నప్సరస చేష్టలు మానెనని యర్థము. చిత్తరువు నిశ్చలత్వమును వహించెనని యర్థాంతరము.

రాపడియెసానుమతి = సానుమతి యనఁగా నొక యప్సరసయును సానువులు - అనఁగాఁ గొండచరులు అవి గలదియును, సానుమతియనెడు నప్సరస రాయిఁడిపడెనని యర్థము. సానువులు గలది పాషాణమయమాయె నని యర్థాంతరము. సాంద్రతాపమునఁ గరంగె హేమాభిధాన=హేమాభిధాన యనఁగా హేమయను పేరుగల యప్సరసయును బంగారమును-హేమయనెడు నప్సరస గాఢపరితాపముచేత నీరైపోయెనని యర్థము. బంగారము గాఢాగ్నిసంతాపముచేఁ గరఁగెనని యర్థాంతరము. నిర్జరలతాంగులిట్లు = దేవతాస్త్రీలీప్రకారముగా, తనుఁజూచి సిగ్గుపాటెనయన్ = తన్నుఁ జూచి తమయందలి సౌందర్యహీనతచేత సిగ్గుపడుచుండఁగా, వినయవినతయైయున్న = అడఁకువచేతఁ దలవంచుకొనియున్న, నగరాజతనయఁ జేరి = గిరికాదేవి సమీపమునకుఁబోయి - ముందరిపద్యముతో నన్వయము.

గిరికాదేవి సౌందర్యాతిశయము వేలుపు పూవుబోండ్ల సౌందర్యాతిశయమును మించియుండెనని భావము. ఉపమానములగు నాయావస్తువుల స్వాభావికచేష్టలు శ్లేషచే సమర్థింపఁబడినవి.

ఉ. మన్నన నీశమౌళిమణిమండన నైౖ శుచివృత్తిఁ జల్లఁగా
మన్న నదీలలామ గరిమన్ ననబోణిని గౌఁగిలించి యో
యన్నువపట్టి నిన్ గనినయన్ను వసుంధర సింధుజాతిలో
వన్నియ కెక్కె నీవు గలువన్ నియతోన్నతిఁ గాంచెఁ దండ్రియున్. 15

మన్ననన్ = ఆదరముచేత, ఈశమౌళిమణిమండననైౖ = ఈశుఁడనఁగాఁ బెనిమిటియును శివుఁడును - పెనిమిటికి శిరశ్లాఘ్యమై యని యర్థము, శివశిరోభాగమునకుఁ ముత్తెపుదండవలె నున్నదని భావము. శుచివృత్తిఁ జల్లఁగామన్న = పరిశుద్ధవృత్తిచేత సుఖముగా మనిన యనియర్థము. పావనవృత్తిగలదనియును శైత్యప్రకృతియనియును భావము. నదీలలామ = నదులలో భూషణమయిన యాకాశగంగ, గరిమన్ = గౌరవముచేత, ననబోణిని గౌఁగిలించి = గిరికాదేవి నాలింగనము చేసికొని, ఓయన్నువపట్టి = ఓచిన్నబిడ్డా, నిన్ గనినయన్ను = నిన్నుఁగన్నట్టిమగువ, వసుంధరన్ = భూమియందు, సింధుజాతిలోన్ = నదీజాతిలో, వన్నియకెక్కెన్ = ప్రసిద్ధికెక్కెను, నీవు గలువన్ = నీవు గలుగఁగా, తండ్రియున్ = మీజనకుఁడయిన కోలాహలుఁడును, నియతోన్నతిఁ గాంచెన్ = ప్రమాణమయిన యౌన్నత్యమును గాంచెనని యర్థము. పర్వతము గనుక నున్నతమయినదని భావము. ఈపద్యములో నాలవచరణమందు కలుగున నెడి పదమందలి యాద్యగకారమునకు- శ్లో. 'క్వచిద్గకారో౽పః.' అనెడు శబ్దానుశాసనసూత్రముచేత వకారాదేశము వచ్చినది.

మ. చరణాగ్రానమితాచలేశ్వరునిగా సన్మార్గసంచారిఁగా
స్థిరకల్యాణసమాఖ్యుఁగా హరికృపన్ శీఘ్రింబ చేపట్టి యో
గిరికన్యా యరలేక నీ వతఁడు నేకీభావముం జెందుమా
గిరికన్యామణికన్య ధన్య వయి యత్యీశానుమోదంబునన్. 16

చరణాగ్ర = పాదములయొక్క యగ్రభాగమందు, ఆనమిత = నమ్రములై నమస్కరించు చున్న, అచలేశ్వరునిఁగాన్ = భూమీశ్వరులు గలవానిఁగాను అని యర్థము. పాదాగ్రనిహతిచేత లెస్సగావంగిన పర్వతాధీశ్వరుఁడైన కోలాహలుఁడుగలవానిగా నని యర్థాంతరము. సన్మార్గసంచారిగాన్= సజ్జనమార్గప్రవర్తకునిఁగా నని యర్థము. విమానముతో గగనమార్గసంచారముగలవానిఁగా నని యర్థాంతరము. స్థిర = శాశ్వతమైన, కల్యాణ = శుభమును, సమాఖ్య = కీర్తియును గలవానిఁగా ననియర్థము (ని. 'యశఃకీర్తి స్సమాఖ్యా చ' అని అ.) కల్యాణమనఁగా సువర్ణమును సమాఖ్యయనఁగా నామమును గనుకఁ గల్యాణసమాఖ్యయైన వసుసంజ్ఞగలవానిఁగా ననియర్థాంతరము. హఠకృపన్ శీఘ్రంబచేపట్టి = భగవదనుగ్రహముచేతఁద్వరఁగాఁ జెట్టఁబట్టి యనియర్థము. ఇంద్రునియొక్క దయచేత శీఘ్రముగాఁ జేపట్టి యని యర్థాంతరము. ఓగిరికన్యా = పర్వతపుత్త్రివైన యోగిరికాదేవీ, అరలేక= భేదములులేక యనియర్థము. అర్ధశరీరత్వములేక యని యర్థాంతరము. (ఇది పార్వతికంటె ధన్య యనుటకు హేతువు) నీవతఁడు నేకీభావముం జెందుమా = నీవును నీ పెనిమిటియును నేకమగుటను బొందుమా యని యర్థము. ఏలాగుననవిన, గిరికన్యామణికన్న ధన్యవయి = హిమవత్పర్వతపుత్త్రియైన పార్వతికంటెఁ గృతార్థురాలవై, అక్షీణానుమోదంబునన్ = సంపూర్ణమైన సంతోషముచేత, నీవతఁడు నేకీభావముం జెందుమా యని సంబంధము.

రాజులచే నుతు లొందువాఁడును గీర్తిశాలియు సన్మార్గసంచారియునగు వసురాజు శివుఁడు. గిరిక పార్వతి. ఈయిరువురివివాహము పార్వతీ పరమేశ్వరుల దాంపత్యముకంటెఁ బొసఁగియున్నది. పార్వతీపరమేశ్వరుల దాంపత్య మర్ధాంగీకారము. అందుచే అరఁగలది. ఈదాంపత్య మేకీభావము కాఁగలదు గావున నక్షీణానుమోదకరము. కావున గిరికన్యకంటె గిరిక సర్వవిధముల ధన్యురాలని భావము.

క. అని యనిమిషనది వలికిన, విని వినియతహృదయుఁడగుచు ♦ వినయమునఁ బునఃపునరవనతి సలిపి సురేం, ద్రున కవనిధరేంద్రుఁ డిట్లను ♦ఁ గృతాంజలి యై. 17

అని = ఈలాగని, అనిమిషనదిపలికినన్ = దేవతానది యనఁగా నాకాశగంగపలుకఁగా, విని = విన్నవాఁడై, వినియత హృదయుఁడగుచున్ = నియమయుక్తమైన మనస్సుగలవాఁడగుచు, వినయమునన్ = నమ్రభావముచేత, పునఃపునరవనతిసలిపి = మాటిమాటికి నమస్కరించి, సురేంద్రునకున్ = దేవేంద్రునికి, అవనిధరేంద్రుఁడు = పర్వతశ్రేష్ఠుఁడైన కోలాహలుఁడు, కృతాంజలియై= దోసిలిపట్టినవాఁడై, ఇట్లనున్ = వక్ష్యమాణప్రకారముగాఁ బలికెను.

మ. ఘనము ల్వాహనము ల్వదాన్యమణి యా♦కల్పంబు కల్పాగము
ల్వనము ల్వేలుపుగిడ్డి దోడ్డిపసి దే♦వా నీకుఁ బౌహార్ఘ్య మి
త్తునొ రత్నాంజలి యిత్తునో యలరుమొ♦త్తు ల్దివ్యసవ్వస్తు లి
త్తునొ యీ వేమిట మెత్తు వేమి దగ ని♦త్తున్ భక్తపుంజప్రియా. 18

భక్తపుంజప్రియా = భక్తసమూహమున కిష్టుండవైన మహాత్ముఁడా, ఘనముల్వాహనముల్ = సమస్తమైన జంతువులను జలప్రదానము చేసెడు మేఘములు నీయొక్కడు గుఱ్ఱములు, వదాన్యమణి= సకలవస్తువులనునిచ్చు చింతామణి, ఆకల్పంబు = నీయాభరణము, కల్పాగము ల్వనముల్ = అభీష్ట

ఫలదాయకములైన కల్పవృక్షములు నీయుద్యానవనములు, వేలుపుగిడ్డి దొడ్డిపసి = కామధేనువు నీ దొడ్డిలోని పసరము, దేవా = స్వామీ, నీకుఁ = అనఁగా సర్వవస్తుప్రదాతలైన మేఘాదులుగలనీకు, పాదార్ఘ్యమిత్తునో = పాద్యమనియిత్తునా, రత్నాంజలియిత్తునో = రత్నములయొక్క దోసిలి యని యిత్తునా, అలరుటెత్తుల్ = పూదండలును, దివ్యసద్వస్తులు=దివ్యములైన యనఁగా దేవతాసంబంధము లైన శ్రేష్ఠవస్తువులను; ఇత్తునో = ఒసఁగుదునా అని క్రమాలంకారము. ఈవేమిట మెత్తువు = నీవు దేని చేత మెచ్చుకొందువు, ఏమిడగనిత్తుఁ = ఏవస్తువు నీకుఁదగునట్టులుగా నిత్తును - అనఁగా నేను నీకీఁదగు వస్తువులన్నియు నీయధీనములుగాన నేదియును నీకుఁ దగినట్టుగా నీఁజాలననుట.

దేవేంద్రుఁడు మహావైభవశాలి. అతనివాహనము జలోత్పత్తిప్రధానమగు మేఘము. జలములోఁ బాద్యమిచ్చుట యెంత? ఆభరణము చింతారత్నము. రత్నములతోఁ బూజించుటయెంత? కామధేను వులు దొడ్డిపశువులు. సద్వస్తువులనిచ్చుట యెంత? కావున వస్తురాజియొసంగి దేవేంద్రుని సంతృప్తి పఱుచుదమన్నఁ గోలాహలుశక్తి చాలదు. భక్తపుంజప్రియుఁడు గావున భక్తిపూర్వక పరిచర్యా విశేష ములచేఁ బరితృప్తి నొనర్పవలసియున్నది. అలం. పరికరము. పరిశేషము.

సీ. మహనీయ యోగసంన్నహసాధకుండనై యనఘాపగాంబుగాహనముగనుట
వసురాడఖర్వతీవ్రతరాంఘ్రిసహుఁడనై గాఢసంతాపాగ్నిఁ గ్రాఁగుచుంట
బహుదూరగతభూరిపక్షగౌరవుఁడనై పరమనిశ్చలవృత్తిఁ బాదుకొనుట
యనవాప్తగురుబాంధవనిబంధనుఁడ నై గిరికానన రసైకపరత మనుట
తే. యిది మదీయాపదానంబు కృప నపార
తరతపోరచనంబుగాఁ దలఁచి నన్నుఁ
గాన వచ్చితొ యహహా వెంగలికిఁ దోడు
వేల్పు లనుమాట నిజముగా విబుధవర్య. 19

మహనీయ = అతిశయమైన, యోగ = సంభోగముయొక్క, సన్నహ = ప్రయత్నముందు, సాధకుండనై =సాధించినవాఁడనై, అనఘ=నిష్కల్మషమైన, ఆపగాంబుగాహనము గనుట=శుక్తిమతీనదీ జలప్రవేశముగనుట - అనఁగా శుక్తిమతీప్రాప్తిఁగనుట యని యర్థము. అతిశయమయిన యష్టాంగ యోగప్రయత్నసాధకుఁడనై పుణ్యనదీస్నానము సేయుట యని యర్థాంతరము. వసురాడఖర్వ తీవ్ర తరాంఘ్రి సహుఁడనై = వసురాట్టనఁగా వసురాజును సూర్యుఁడును - అంఘ్రిశబ్దము పాదమందును రశ్మియందును వర్తించుచున్నది. వసురాట్ = వసురాజుయొక్క, అఖర్వ = అధికమైన, తీవ్రతర = మిక్కిలి తీక్ష్ణమైన, అంఘ్రి = పాదాహతిని, సహుఁడనై = సహించినవాఁడనై, గాఢసంతాపాగ్నిఁ గ్రాఁగుచుంట = దృఢమైన పరితాపమనెడు నగ్నిచేత వేగుచుంట యని యర్థము. సూర్యునియొక్క యధికతీక్ష్ణకిరణములను సహించినవాఁడనై నాలుగుదిక్కులను గాఢసంతాపమయిన యగ్నిచేత వేగు చుండుటయని యర్థాంతరము.

బహుదూరగత = ఎక్కడనోపోయిన, భూరి = అపరిమితమయిన, పక్షగౌరవుఁడనై = ఱెక్కల యొక్క గౌరవముగలవాఁడనై, పరమనిశ్చలవృత్తిఁ బాదుకొనుట = కేవలము కదలనేరని విధముచేత స్థిరముగా నిలిచియుండుటయని యర్థము. బహుదూరమైపోయిన కాంచనవిషయమయిన గౌరవము

గలవాఁడనై యుత్కృష్టమైన నిశ్చల మనోవ్యాపారముచేత స్థిరీభూతుఁడనైయుండుటయని యర్థాంతరము. (ని. 'భూరిప్రాజ్యసువర్ణయోః' అని వి.) అనవాప్త = పొందఁబడని, గురుబాంధవ=గురువులును బంధువులునునైన పర్వతములయొక్క, నిబంధనుఁడనై = కూడికలుగలవాఁడనై, గిరికాననరసైకపరత మనుట = కొమార్తెయైన గిరికయొక్క, ముఖావలోకనానురాగ పరత్వముచేత బ్రతుకుట యనియర్థము. గురువులయొక్కయు బంధువులయొక్కయు సాంగత్యములు విడనాడినవాఁడనై పర్వతారణ్యముల యందును జలములయందును ముఖ్యాసక్తితోడ మనుట యని యర్థాంతరము.

ఇది = ఇటువంటి, మదీయాపదానంబు=నాచేతఁ జేయఁబడిన కార్యమును, (ని. 'అపదానంకర్మవృత్తమ్' అని అ.) కృపన్ = దయచేత, అపారతరతపోరచనంబుగాఁ దలఁచి=అనంతమైన తపశ్చరణముగా విచారించి, నన్నుఁగావవచ్చితో = నన్నురక్షింపవచ్చితివా యేమి. ఏలాగుననననిన, అహహ= ఆశ్చర్యము. వెంగలికిఁదోడు వేల్పులనుమాట నిజముగాన్ = వెఱ్ఱివానికి సహాయము వేల్పులు అను లోకోక్తి నిజమౌనట్టులుగా, నన్నుఁ గానవచ్చితిగా యని సంబంధము. విబుధవర్య = దేవతాశ్రేష్ఠుఁడా యని సంబోధనము. ఇందులో నర్థాంతరములు తపోరచనపరములని గ్రహింపవలయును.

నిర్మలజలావగాహనము, సంతాపాగ్ని గ్రాఁగుట, నిశ్చలవృత్తినుండుట, గిరికానన ప్రీతిని మెలంగుట కోలాహలుని కర్మవృత్తములు. అర్థాంతరముచే నివి తపోరచనములు. తపస్సంపన్నులకు ఇంద్రుఁడు తోడ్పడుట కలదు. కోలాహలుఁడు నిజముగాఁ దపస్సంపన్నుఁడు కాఁడు. ఇట్టియెడ నింద్రుఁడు తోడ్పడ నరుదెంచుట వెంగలికి వేల్పుతోడనుసామెత సార్థకము చేయుటకువలె నున్నది.

ఉ. ఇచ్చటఁ జేదిరాజనఖహేతిహతిన్ గతి దూలి యున్నయీ
పిచ్చుకగుంటుమీఁదఁ గృపఁ బెంపున నామరలోకవాహినిం
దెచ్చితిగా నగారి జగతిం గృతి నైతి భవత్ప్రసన్నతన్
హెచ్చె మదీయగౌరవ మహీన మహీధరజాతిలోపలన్. 20

ఇచ్చటన్ = ఈస్థలమందు, చేదిరాజ=చేదిదేశాధీశ్వరుండైన వసురాజుయొక్క, నఖ = పాదనఖ మనెడు, హేతి=ఖడ్గముయొక్క, హతిన్ = దెబ్బచేత, గతిదూలి = గతిచెడియనియును, గమనములేక యనియును నర్థము. ఉన్న = ఉన్నట్టి, ఈపిచ్చుకగుంటుమీఁదన్ = పిచ్చుకవలెఁ గుంటివాఁడైన వీని మీఁద - అనఁగాఁ దనమీఁదను, కృపపెంపునన్=దయాసమృద్ధిచేత, అమరలోకవాహినిం దెచ్చితిగా= దేవలోకమందుఁ బ్రవహించునట్టి గంగను దెచ్చితివిగదా. ఇక్కడ పిచ్చుకగుంటుమీఁద భాగీరథి యనెడు లోకోక్తి ననుసంధింపవలయును. నగారి = పర్వతవిరోధివైన యింద్రుఁడా, జగతిం గృతినైతిన్ = గంగవచ్చుటచేత లోకమందుఁ బుణ్యాత్ముండనైతిని. ఇదియునుంగాక, భవత్ప్రసన్నతన్ = నీయొక్క యనుగ్రహముచేత, అహీనమహీధరజాతిలోపలన్ = అధికమైనపర్వతకులములో, మదీయ గౌరవము=నాయొక్క యతిశయమును బృథుత్వమును, హెచ్చెన్=మించినదాయెను. దేవేంద్రుఁడు నగారి. అట్టియ్యది నగమువద్దకు వచ్చుటయు, వచ్చునపుడు గతిదూలియున్నాఁడని పిచ్చుకుంటు ననుగ్రహించి గంగను వెంటగొనివచ్చుటయుఁ గోలాహలుఁడు కృతార్థుఁడగుటకును గౌరవశాలి యగుటకును హేతువులు. ఇట్టిరాకకుఁ గారణము ఇంద్రునకు సహజములగు కృపపెంపు ప్రసన్నభావము,

మ. అన నింద్రుం డను లాఁతిరీతి నచలేంద్రా యేల యిట్లాడ నీ
జనకుం డధ్వరభాగభోక్త యనిమేషశ్రేణిలోఁ బెద్ద త
త్తనయగ్రామణి వైననీకు నరుదే ధాత్రీధరేంద్రాభినం
ద్యనితాంతోన్నతకీర్తిగౌరవము మేనాశుక్తిముక్తామణీ. 21

అననింద్రుండనుఁ = కోలాహలుఁ డీరీతిగాఁ బలుకఁగా విని దేవేంద్రుం డంచున్నాఁడు. ఏమని యనిన, అచలేంద్రా = పర్వతాధీశ్వరా, లాఁతిరీతిఁ = అన్యునివలె, ఏలయిట్లాడఁ = ఈలాగన నేల, నీజనకుండు = నీతండ్రియైన హిమవంతుఁడు, అధ్వరభాగభోక్త = యజ్ఞభాగ మనుభవించువాఁడు. ఇదియుఁనుంగాక, అనిమేషశ్రేణిలోఁ బెద్ద = దేవసమూహములో గొప్పవాఁడు, తత్తనయగ్రామణి వైననీకుఁ = ఆహిమవంతునియొక్క కుమారశ్రేష్ఠుఁడవైన నీకును, ధాత్రీధరేంద్ర = పర్వతశ్రేష్ఠుల చేత, అభినంద్య = కొనియాడఁదగిన, నితాంతోన్నత = మిక్కిలియు హెచ్చైన, కీర్తి = యశస్సును, గౌరవముఁ = అతిశయమును ననియర్థము. ఉన్నతుఁడనెడు కీర్తియును బృహత్త్వమును నని యర్థాంతరము. ఇక్కడ కీర్తిగౌరవము అన్నప్పుడు, ('జాతిరప్రాణినామ్') అనియుండుటచేత నేకవద్భావము వచ్చినది. మేనా = మేనకాదేవియనెడు, శుక్తి = ముత్తెపుఁజిప్పకు, ముక్తామణీ = ముత్తెమవైన కోలాహలుఁడా, అరుదే = ఆశ్చర్యమా-అనఁగా నీకు నీకీర్తిగౌరవములు స్వభావసిద్ధములే కాని యాశ్చర్యము లోనివి కావనుట.

శా. చేదిక్ష్మావరపాదకంజకృతఖంజీభావముం జెందునీ
ఖేదం బార్పఁగఁ గల్గె నీతనయ లక్ష్మిం గన్నదుగ్ధాబ్ధి నా
నాదాక్షాయణిఁ గన్నపెన్నగము నా నర్హాధినాథార్పణా
హ్లాదం బందఁగ రాదె మామకనియోగాయత్తచిత్తుండవై. 22

చేదిక్ష్మావర = చేదిదేశాధిపతియైన వసురాజుయొక్క, పాదకంజ = పదకమలముచేత, కృత = చేయఁబడిన, ఖంజీభావముఁ = కుంటితనమును, చెందు = పొందిన - అనఁగాఁ గుంటివాఁడవైన, నీ = నీయొక్క, ఖేదంబార్పఁగఁ = దుఃఖమును బోఁగొట్టెడుకొఱకు, కల్గెనీతనయ = ఈకొమార్తె నీకుఁ గలిగినది కాఁబట్టి, లక్ష్మింగన్న దుగ్ధాబ్ధినాఁ = లక్ష్మీదేవినిగన్న క్షీరసముద్రునివలెను, ఆదాక్షాయణిఁ గన్న పెన్నగమునాఁ = ఆపార్వతినిగన్న హిమవత్పర్వతునివలెను, అర్హాధినాథార్పణాహ్లాదంబందఁగ రాదె మామకనియోగాయత్తచిత్తుండవై = తగినవరుని కిచ్చుటవలని సంతోషమును బొందరాదా నాయొక్క యనుజ్ఞ నంగీకరించినవాఁడవయి - అనఁగా నా యనుమతి ప్రకారముగాఁ దగినవరుని కిమ్మనుట. గిరికాజననముచే వసురాజు కాలితో తన్నుటవలనఁ గలిగిన విచారము కోలాహలునకుఁ దొలఁగఁ గలదు. ఇందులకుఁ బ్రతిక్రియ అర్హవరునకు గిరిక నొసంగుటయే. దాన క్షీరాబ్ధివలె హిమవంతుని వలెఁ గోలాహలుని పెంపతిశయము కాఁగలదు. ఇందుల కనుమతించెనేని ఇంద్రుని నియోగము నెఱవేర్చుటయే కర్తవ్యము.

క. అగతనయ యగతనయ నిగ, నిగనిగని మెఱుంగు దెగడు నీకన్నియకుఁ
మగనిఁ దగునతని గుణాగరి, మగని న్వెనుపింతు వినుము మత్ప్రాణసఖున్. 23

అగత = అనాగతమైన, నయ=నీతిమార్గము గలిగిన, అగతనయ = పర్వత పుత్త్రుఁడవయిన కోలాహలుఁడా, నిగనిగని మెఱుంగుదెగడు = నిగనిగని మెఱయు మెఱుపుతీఁగెను దిరస్కరించుచున్న, నీకన్నియఁకున్ = నీసుతకు, తగునతనిన్ = తగినవాఁడైన, గుణగరిమగనిన్ = గుణగౌరవమునకు గనియైన, మగనిన్ = పెనిమిటిని, మత్ప్రాణసఖున్ = నాకుఁ బ్రాణస్నేహితుఁడైనవానిని, వినుపింతున్ = తెలియఁ జెప్పుచున్నాను. వినుము = ఆలకింపుము.

మ. చరణాగ్రానమితాచలేంద్రుఁడు సదా♦సన్మార్గసంచారి సు
స్థిరకల్యాణసమాఖ్యుఁడా వసుధరా♦ధీశుండు వో గోత్రశే
ఖర గంగావచనం బపార్థ మగునే ♦ కల్యాణి నీకన్నె న
న్నరనాథాగ్రణిరాణిఁ జేసి కనుమా ♦ నానావిధైశ్వర్యముల్. 24

చరణాగ్ర = పాదాగ్రమందు, ఆనమిత = నమ్రులై నమస్కరించుచున్న, అచలేంద్రుఁడు= భూమీశ్వరులుగలవాఁడును - పాదాగ్రనిహతిచేత లెస్సగా వంగిన పర్వతశ్రేష్ఠుఁడు గలవాఁడును, సదాసన్మార్గసంచారి = ఎల్లప్పుడును సజ్జనమార్గ ప్రవర్తకుఁడును - విమానముతోడ గగనమార్గసంచారము గలవాఁడును, సుస్థిర = శాశ్వతమైన, కల్యాణ = శుభమును, సమాఖ్యుఁడు = కీర్తియును గలవాఁడును - కల్యాణమనఁగా సువర్ణంబును, సమాఖ్యయనఁగా నామమును గనుకఁ గల్యాణ సమాఖ్యయైన వసుసంజ్ఞగలవాఁడును, వసుధరాధీశుండువో = ఆవసురాజేసుమా, గోత్రశేఖర = కులభూషణుఁడా యని యర్థము. పర్వతశ్రేష్ఠుఁడా యని భావము. గంగావచనం బపార్థ మగునే = గంగ యొక్కమాట నిరర్థకమవునా. ఏమనిన, పైనిఁజెప్పఁబడినవిశేషణత్రయముగల వరునిఁ జేపట్టుమని యామె యాశీర్వచనము చేసినది గనుక నావిశేషణములు గలవాఁడు వసురాజేయైనాఁడు. కాఁబట్టి, కల్యాణిన్ = శుభస్వరూపురాలయిన, ఈకన్నెన్ = ఈచిన్నదానిని, అన్నరనాథాగ్రణిరాణిఁ జేసి = ఆరాజశ్రేష్ఠునియొక్క భార్యనుగాఁజేసి, కనుమా నానావిధైశ్వర్యముల్ = సకల వైభవములను బొందుమా.

గంగ గిరికాదేవికి నాశీర్వచనము సేయుట యీయాశ్వాసమునందు చరణాగ్రానమితాచలేశ్వరునిఁగా అనెడు ౧౬ వ పద్యమందుఁ జూడఁదగినది. గంగావచనము సార్థకమగును గావున బుద్ధిపూర్వకముగా నామోదించుట నానావిధైశ్వర్యములకు సాధనము. రాజు సామాన్యుఁడు కాఁడు. నరనాథులలో నగ్రణి. అంతియగాదు. ఇంద్రునకుఁ బ్రాణసఖుఁడు. కాన నీసంబంధ మెంతయు నొప్పియున్నది.

శా. లోకత్రయ్యభినందనీయవిమలా♦లోకుండు సుశ్లోకుఁ డా
లోకాలోకధరాధురీణుఁ డతఁ డ♦ల్లుం డయ్యెడిన్ నీతపః
పాకం బెట్టిదో కాని పాదనిహతిం ♦ బైకొన్నవాఁ డంఘ్రినా
శీకద్వంద్వనతుండుగా నెఱపఁ గ♦ల్గెం గల్మియున్ బల్మియున్. 25

లోకత్రయి = మూఁడులోకములవారిచేతను, అభినందనీయ = మిక్కిలి స్తోత్రముచేయఁదగిన, విమల = స్వచ్ఛమయిన, ఆలోకుండు = ప్రకాశముగలవాఁడు - అనఁగాఁ బ్రతాపము గలవాఁడనుట. సుశ్లోకుఁడు=యోగ్యమయిన కీర్తిగలవాఁడు, ఆలోకాలోకధరాధురీణుఁడు = చక్రవాళపర్వతపర్యంతమయిన

భూమియొక్క భారమును వహించినవాఁడు. ని. 'లోకాలోక శ్చక్రవాళికి' అని అ. ఆతఁడు = అట్టి యావసురాజు, అల్లుండయ్యెడిన్ = నీకల్లుఁ డగుచున్నాఁడు. నీతపఃపాకం బెట్టిదో కాని = నీవు చేసిన తపస్సుయొక్క పరిపాకమెట్టిదో కాని, పాదనిహతింబైకొన్నవాఁడు = చరణాహతిచేత నాక్రమించిన వాఁడు, అంఘ్రినాళీకద్వంద్వనతుండుగాన్ = నీ రెండు కాళ్లకు వంగి మ్రొక్కెడు వాఁడగునట్టులుగా- అల్లుఁడు మామకాళ్లకు మ్రొక్కుట ప్రసిద్ధము. కల్మియున్=ఐశ్వర్యమును, బల్మియున్=సామర్థ్యమును, నెఱపఁగల్గెన్=ప్రకటము సేయఁ గల్గెను.

వసురాజు సమస్తలోకనంద్యకీర్తిశాలి. అట్టివాఁ డల్లుఁ డగుట తపఃపరిపాకవిశేషమే. నాఁటి పాదనిహతి నీహృదయమున నుంటచే ననుమతింపవేమో? పుత్రిక నొసంగెదవేని యల్లుఁడు పాదములపై నొరగి నమస్కరించును. పైకొన్నవాఁడు ప్రణతుఁ డగుట కల్మికి బల్మికిఁ గారణములు.

ఉ. నా వలచుట్టి హర్షకల•నావలమానమనోంబుజంబుతో
నావలవైరిఁ బల్కు నచ•లాగ్రణి మామకశోకవార్ధికిన్
నావ లతాంగి నబ్ధిరశ•నావలయేశ్వరు కేలఁ గూర్చెదే
నావలవంత దీర్చెదె య•నంతకృపారసవాస వాసవా. 26

నాన్=అనియింద్రుఁడు పలుకఁగా, అచలాగ్రణి=కోలాహలుఁడు, వలచుట్టి = ప్రదక్షిణము చేసి, హర్షకలనా=సంతోషాతిశయముచేత, వలమాన = ఆవరింపఁబడుచున్న, మనోంబుజంబుతోన్ = మనఃపద్మముతోడ, ఆవలవైరిఁబల్కున్=బలాసురవైరియైన యాయింద్రునిఁ గూర్చి పలికెను. వల వైరియన్నచోట వబలకభేదము. మామకశోకవార్ధికిన్నావ = నాయొక్క పరాభవ జనితమయిన దుఃఖ సముద్రమునకు నోడయైన, లతాంగిన్ = తీఁగెవంటిదేహముగల నాకొమార్తెను, అబ్ధి=సముద్రములు, రశనా=మొలనూలుగాఁగల భూమియొక్క, వలయ=ఆవరణమునకు, ఈశ్వరు = ప్రభువైన వసురాజు యొక్క, కేలఁగూర్చెదే = హస్తమందుఁ గూర్చుచున్నావా-అనఁగా వసురాజపాణిగ్రహణము సేయిం చుచున్నావా. నావలవంతదీర్చెదె=ఇంతటితో నాచింత దీర్చుచున్నావా, అనంత = అపరిమితమయిన, కృపారస=కరుణారసమునకు, వాస = నివాసస్థానమయిన, వాసవా = ఇంద్రుఁడా యని సంబోధనము. వసురాజు సముద్రముచే నావరింపఁబడిన సమస్తభూవలయమున కధిపతి. అట్టివాఁ డల్లుఁ డగుట శోక వార్ధి తరించు నుపాయము. ఇట్టి శుభప్రాప్తికిఁ గారకుఁడని ఇంద్రునకు వసురాజు ప్రదక్షిణము గావించెను. ఇంద్రుఁడు అనంతకృపాశాలి గావునఁ గోలాహలున కిట్టి యల్లునితోడిపొత్తుఁ గూర్చెను.

తే. అవని నొకవేల్పు ప్రత్యక్ష•మైన సిరులు
దొరలు నం డ్రెందఱే వేల్పు•దొరలు గొలువ
నీవ ప్రత్యక్షమై కృప•నింపఁగా ఫ
లింపవె తలంపు లెల్ల ని•లింపరమణ. 27

అవనిన్ = భూమియందు, ఒకవేల్పు ప్రత్యక్షమైనన్ = ఒకానొకదైవము ప్రత్యక్షమయిన మాత్రముచేతనే, సిరులు దొరలునండ్రు = సంపదలు పొందునని చెప్పుదురు, ఎందఱేవేల్పుదొరలు గొలువన్ = అనేకులైన దేవతాధిపతులు సేవింపఁగా, నీవ ప్రత్యక్షమై కృపనింపఁగాన్ = నీయంతట నీవే సాక్షాత్కరించి దయారసము పూర్ణమవునట్టులు చేయఁగా, ఫలింపవెతలంపులెల్లన్ = కోరికలన్నియుఁ ఫలింపవా-అనఁగా ఫలించుచున్నవనుట. నిలింపరమణ = దేవాధిపా యని సంబోధనము.

చ. సతి నడిగించుభవ్యగుణ • శాలి వసుండఁట వేఁడ వచ్చువాఁ
డతులితదేవరాజ్యభర • ణైకధురంధరుఁ డైన యాశత
క్రతుఁడఁట సత్కృపామహిమఁ • గన్నియ నిచ్చుట సర్వదేవతా
హితమఁట యింతకన్న శుభ • మెయ్యది తొయ్యలిఁ గన్నవారికిన్. 28

సతినడిగించు భవ్యగుణశాలి వసుండఁట = కన్యనడుగనంపించిన శుభగుణశాలి వసురాజఁట, సత్కృపామహిమన్ =యోగ్యమయిన కరుణాతిశయముచేత, వేఁడవచ్చువాఁడు = అడుగవచ్చినవాఁడు, దేవరాజ్యభరణైకధురంధరుఁడైన = దేవతారాజ్య భరణమందు ముఖ్యసమర్థుఁడైన, ఆశతక్రతుఁడఁట= శతాశ్వమేధియైన యా యింద్రుఁడఁట, కన్నియనిచ్చుట = కన్యను వసురాజునకిచ్చుట, సర్వదేవతాహితమఁట = సమస్తదేవతలకు నిష్టమయినదఁట, తొయ్యలిఁ గన్నవారికిన్ = ఈ చిన్నదానిఁగన్నవారికి, ఇంతకన్నశుభమెయ్యది = ఇంతకంటె వేఱొండు శుభమేదిగలదు - అనఁగా నిదియె శుభముగాని యింతకంటె మఱియొకటి లేదనుట.

ఉ. ఇమ్మని వేఁడ వేఱొకఁడ • నే భవదీయజనుండఁ గానె నా
సొమ్మన నెద్ది నీయదియ • సుమ్మఖిలమ్మును దేవ యీయదూ
రమ్మున నున్నశుక్తిమతి • రాఁ గరుణించి తదీయబంధుజా
తమ్ము మదాప్తులం బిలిచి • తావకమిత్రున కిమ్ము కన్నియన్. 29

ఇమ్మని వేఁడన్ = కన్యనిమ్మనియడుగుటకు, వేఱొకఁడనే=నేనన్యుఁడనా, భవదీయజనుండఁగానె= నేను నీవాఁడనుగానా - నాసొమ్మనఁగా నేమియున్నది. నీయదియసుమ్మఖిలమ్మును = సమస్తమునీదే సుమా, దేవ = స్వామీ, ఈయదూరమ్ముననున్న శుక్తిమతిరాఁగరుణించి = ఈ సమీపమందేయున్న శుక్తిమతి యిక్కడికి వచ్చునట్లు దయచేసి, తదీయబంధుజాతమ్మున్ = ఆ శుక్తిమతియొక్క బంధుసమూహమును - అనఁగా నదీసమూహమును, మదాప్తులన్ = నాయొక్క బంధువులను-అనఁగాఁ బర్వతసమూహములను, పిలిచి = ఆహ్వానము చేసి, కన్నియన్ = చిన్నదాని, తావకమిత్రున కిమ్ము = నీ స్నేహితుఁడైన వసురాజునకు సమర్పింపుము - అనఁగా వసురాజున కిచ్చి వివాహము సేయు మనుట .

ఇంద్రునిహితులలోఁ గోలాహలుఁ డొకఁడు గాన నతని యంగీకార మనవసరము. కోలాహలుని సర్వస్వము దేవేంద్రునిదె గాన నిట కొంకఁబనిలేదు. శుక్తిమతి, ఇతరబంధువులు ఈ సంబంధము నాలకించుట వారియంగీకృతి పడయుటకడవుగ వసురాజునకుఁ గన్య నిచ్చి పెండ్లిచేయనగును.

చ. అనుటయుఁ దాతపార్శ్వగత • యై తగునాలతకూన దా నతా
నన యయి కేలికేళినలి • నంబు మొనల్ నఖరాంచలంబులం
దునుముచు నుండె వజ్రధర • దోరశనిప్రతిమానమీనలాం
ఛనవిశిఖంబు లింక నఖ • సాధ్యము లంచు గణించుకైవడిన్. 30

అనుటయున్ = కోలాహలుఁడింద్రునితో నీలాగనిపలుకఁగా, తాతపార్శ్వగతయైతగు = తండ్రి పరసనున్నట్టై యొప్పుచున్న, ఆలతకూన = ఆగిరికాదేవి, తాన్ = తాను, నతాననయయి = వంపఁబడ్డ ముఖముగలదై, కేలి = హస్తమందున్న, కేళినలినంబుమొనల్ = లీలాపద్మముయొక్క చివరలను, నఖరాంచలంబులందునుముచు నుండెన్ = గోటికొనలచేతఁ ద్రుంచుచుండెను. ఎటువలెననిన, వజ్రధర =

ఇంద్రునియొక్క, దోః = భుజమండలి, అశని = వజ్రాయుధముతోడ, ప్రతిమాన = సమానమైన, మీన లాంఛనవిశిఖంబులు=మన్మథబాణములైన పద్మములు, ఇఁకకన్ = ఇఁకమీఁద, నఖసాధ్యములంచు గణించు కైవడిన్=గోటఁ జిమ్మివైవఁ దగినవని యెంచినట్టులుగాఁ దునుముచుండె ననిసంబంధము.

గిరిక లజ్జాతిశయమునఁ దలవంచెను. దానిని మఱుఁగుపఱచుటకై కేలనున్న తామరపూవును గోటితో గంట్లు పెట్టుచుండెను. చూచువారి కిది మన్మథబాణము లిఁక గోటఁగిల్లివేయవచ్చునని గిరిక తలంచుచున్నటులుండెను, పార్శ్వగతయనుటచే గిరిక యింద్రునిసంభాషణము కోలాహలుని యంగీకృతి నాలకించెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. అంతకు మున్న సర్వకలు♦షాంతక మానగవైరివాక్యముం
జెంతకు వచ్చునెచ్చెలుల♦చే విని పుణ్యమహాతరంగిణీ
కాంతలు దాను శుక్తిమతి ♦ కౌశికుఁ గొల్వఁగ వచ్చె దేవతా
సంతతి యాత్మ నాత్మశుభ♦సంతతికల్మికి సంతసిల్లఁగాన్. 31

అంతకుమున్న = అంతకుముందుగానే, సర్వకలుషాంతకమా = సమస్తకల్మషాపహారమైన, నగవైరివాక్యమున్ = దేవేంద్రునియొక్క వాక్యమును - అనఁగా వసురాజునిమిత్తమై గిరికనడిగినమాట, చెంతకువచ్చు నెచ్చెలులచే విని = తన సమీపమునకువచ్చిన చెలికత్తియలవలన విని, పుణ్యమహాతరంగిణీకాంతలు దాను = పుణ్యప్రదలయిన మహానదీకాంతలు దానును, శుక్తిమతి = శుక్తిమతీమహానది, దేవతాసంతతి = దేవసమూహము, ఆత్మన్ = మనస్సునందు, ఆత్మశుభసంతతికల్మికిన్ = తనయొక్క శుభసంతానపుఁ గలిమికి, సంతసిల్లఁగాన్ = సంతోషింపఁగా, కౌశికుఁ గొల్వఁగవచ్చెన్ = దేవేంద్రుని సేవింప వచ్చినదాయెను. (ని. 'మహేంద్ర గుగ్గులూ లూక వ్యాళగ్రాహిషుకౌశికః' అని యమరము.)

సీ. అమృతమూర్తివహించు♦హరజటాసంభవ సుమనోమణులఁ బ్రోచు♦సోమకన్య
ధర నుద్ధరించుభూ♦దార రాజతనూజ తమమెల్ల వారించు♦తపనపుత్త్రి
కాలవైషమ్యమ్ము ♦ గడపునద్రాంఘ్రిజ చలువలువెదఁజల్లు ♦ మలయదుహిత
యభవసాధనరత్న ♦ మగుపినాకోత్పన్న యార్యాప్తి నెసఁగుశీ♦తాద్రిజాత
తే. మఱియుఁ దక్కినపుణ్యని♦మ్నగలు మరుద, ధీశభవ్యనిదేశాప♦దేశమున ని
జాప్తశుక్తిమతీతన♦యావివాహ, మహమునకువచ్చి రాత్మీయ♦మహిమ మెఱసి.

అమృతమూర్తివహించు హరజటాసంభవ=అమృతమనఁగా మోక్షము గనుక మోక్షస్వరూపము వహించు నాకాశగంగయును అనియర్థము. హరుఁ డమృతస్వరూపుఁడు గనుక నతని జడలవలనఁ బుట్టిన గంగయుం నమృతస్వరూపమును వహించినదనుట. అమృతమూర్తి యనఁగా జంద్రుఁడు గనుక హరుఁడు చంద్రునివహించినాఁడు గనుక హరజటాసంభవయైన గంగయును చంద్రునివహించినదని ప్రకారాంతరము. అమృతమనఁగా నుదకము గనుక నుదకస్వరూపములు వహించినదని భావము. ఇక్కడ గంగయమృతమూర్తిని వహించినదనఁగా గంగోదకములు సుధామధురము లనియును సూచవుయును తెలియఁబడుచున్నది. సుమనోమణులఁబ్రోచు సోమకన్య = దేవతాశ్రేష్ఠులను బ్రోచెడు నర్మదానదియును అనియర్థము. సోముఁడు దేవతాశ్రేష్ఠులను బ్రోచెడువాఁడు గనుక నతనివలనఁ బుట్టిన

నర్మదయును దేవతాశ్రేష్ఠులను బ్రోచుచున్న దనుట. మంచి మనస్సుగలవారిని రక్షించుచున్నదని భావము.

ధరనుద్ధరించు భూదారరాజతనూజ = భూమి నుద్ధరించెడు భూదారరాజతనూజ యనెడు నది యని యర్థము. ఆదివరాహము భూమి నుద్ధరించినది గనుకఁ దత్సంభవయైన నదియును భూమి నుద్ధరించుచున్నదనుట. భూమి జనుల నుద్ధరించుచున్నదని భావము. తమమెల్లవారించు తపనపుత్త్రి=అంధకారనివారణముసేయు యమునానది యని యర్థము. సూర్యుఁ డంధకారనివారకుఁడు గనుకఁ దత్పుత్త్రియును నంధకారనివారణము సేయుచున్నదనుట. అజ్ఞాననివారణము సేయుచున్న దనిభావము. కాలవైషమ్యమ్ము గడపు రుద్రాంఘ్రిజ=కాలవిపర్యాసమునుగడపుచున్న రుద్రాంఘ్రిజయనెడు నదియును అనియర్థము. రుద్రుఁడు కాలత్రయాబాధ్యుఁడు గనుకఁ దదంఘ్రిజయును గాలత్రయాబాధ్యయనుట యమదండనము లేకుండునట్లుగాఁ జేయుచున్నదని భావము. చలువలు వెదఁజల్లు మలయదుహిత = శైత్యములను వెదఁజల్లునట్టి తామ్రపర్ణీనదియును అని యర్థము. మలయపర్వతము చందనాలయమై చలువలు వెదఁజల్లుచున్నదిగనుకఁ దత్పుత్త్రియును జలువలు వెదఁజల్లుచున్న దనుట. అతిశీతలోదకము గలదని భావము.

అభవసాధనరత్న మగుపినాకోత్పన్న = అభవునికి సాధనశ్రేష్ఠమయిన పినాకినీనదియును అని యర్థము. పినాక మభవునకు నుత్తమసాధనము గనుకఁ దదుత్పన్నయును నభవునకు నుత్తమసాధన మనుట. అభవమనఁగా జన్మరాహిత్యము గనుకఁ దత్సాధనములలో శ్రేష్ఠమగుచున్నదని భావము. ఆర్యాప్తి నెసఁగుశీతాద్రిజాత = గౌరీప్రాప్తిచేత నొప్పుచున్న శీతాద్రిజాత యనెడు నదియును అని యర్థము. శీతాద్రి గౌరీప్రాప్తిచేత నొప్పుచున్నది గనుకఁ దత్సంభవయును గౌరీప్రాప్తిచేత నొప్పుచున్నదనుట. ఆర్యజనప్రాప్తిచేత నొప్పుచున్నదని భావము.

ఇంతవఱకును శ్లో. 'కారణగుణాహికార్యగుణానారభంతే' అనెడున్యాయము ననుసంధించిచెప్పినాఁడు. మఱియుఁ = వెండియు, తక్కినపుణ్యానిమ్నగలుఁ = శేషించినపుణ్యనదులును, మరుదధీశ = దేవతాధిపతియైనయింద్రునియొక్క, భవ్య=ముఖ్యమయిన, నిదేశ=రమ్మనుమని యాజ్ఞాపించుట యనెడు, అపదేశమునఁ=వ్యాజముచేత, నిజాప్త=తనకాప్తురాలైన, శుక్తిమతీ=శుక్తిమతీనదియొక్క, తనయా=కూఁతురైన గిరికాదేవియొక్క, వివాహమహామునకుఁ=వివాహోత్సవమునకును, ఆత్మీయమహిమ మెఱసి= స్వకీయప్రభావముచేతఁ బ్రకాశించి-అనఁగాఁ గామరూపత్వముచేత స్త్రీరూపధారణము చేసి యనుట, వచ్చిరి=ఏతెంచిరి.

నెయ్యురాలగు శుక్తిమతిచేయు పుత్త్రికాపరిణయమున కుత్సాహముతో గంగ, నర్మద, వారాహి, యమున, రుద్రాంఘ్రిజ, తామ్రపర్ణి, పినాకిని, శీతాద్రిజాతయను నదీకాంత లరుదెంచిరి. నదీకాంత లరుదెంచుటకు ఆత్మీయమహిమలు తోడ్పడెను.

శా. ఉత్సాహంబున నిట్లనేకతటినీవ్యూహంబు లేతేరఁగా
  వత్సాళిక్ వెనుకొన్న గోగణముతేఁపక్ వచ్చెఁ దోడ్తో మహీ
  భృత్సందోహ మభంగశృంగమును నాపీనస్నుతాంచన్నితం
  బోత్సేధంబు వృషోపసర్పణవిధాయోగ్యక్రమంబుం దగన్. 33

ఉత్సాహంబునన్ = ఉల్లాసముచేత, ఇట్లు = ఈప్రకారముగా, అనేకతటినీప్రవాహంబులు = బహునదీసమూహములు, ఏతేరఁగాన్ = రాఁగా, వత్సాళిన్వెనుకొన్న = లేఁగదూడలను వెంబడించి వచ్చిన, గోగణముతేవన్ = ఆవులగుంపువలె, తోడ్తోన్ = నదులవెంట, మహీభృత్సందోహము = పర్వత సమూహము, వచ్చెన్ = ఏతెంచెను. ఏతీరుగాననిన, శృంగములనఁగా శిఖరములును గొమ్ములును, (ని. 'శృఙ్గం ప్రభుత్వే శిఖరే చిహ్నే పి జలయంత్రకే, విషాణోత్కర్షయోః' అని వి.) అభంగ= వైకల్యములేని, శృంగములు = శిఖరములు అని పర్వతపరమయిన యర్థము. వైకల్యరహితములై కొమ్ములును అని గోగణపర మయినయర్థము. ఆపీన=అంతట స్థూలములైన, (ని. 'స్నుః ప్రస్థ స్సాను రస్త్రియామ్' అని అ.) స్నుశబ్దము కొండచరులయందు వర్తించును గనుక, స్నుతా = చరులుగలుగుటచేత, అంచత్ = ఒప్పుచున్న, నితంబ = కటకప్రదేశములయొక్క, ఉత్సేధంబు=ఔన్నత్యము అని పర్వత పరమయిన యర్థము. ఆపీనమనఁగాఁ బొదుగు. (ని. 'ఊధ స్తు క్లీబ మాపీనమ్' అని అ.) స్నుతమనఁగా స్రవించునట్టిది. (ని. 'స్యన్నం రీణం స్రుతం స్నుతమ్' అని అ.) ఆపీన స్నుత=స్రవించునట్టి పొదుగుల యొక్కయు, అంచన్నితంబ = ఒప్పుచున్న పిఱుఁదులయొక్కయు, ఉత్సేధంబు=ఔన్నత్యమని గోగణ పరమయిన యర్థము. వృషభానుసరణయోగ్యక్రమంబున్ = వృషశబ్దము నకారాంతమై యింద్రుని యందు వర్తించును గనుక నింద్రానుసరణమందలి యోగ్యమైనరీతియును అని పర్వతపరమైనయర్థము. వృషభానుసరణయోగ్యక్రమ మని గోగణపరమయిన యర్థము. తగన్ = తగియుండఁగా, వచ్చెనని సంబంధము.

ఈపద్యములో 'వత్సాళి న్వెనుకొన్నగోగణముతేవన్' అనిచెప్పుట యెందుకనిన, నదులన్నియుఁ బర్వతములవలనఁ బుట్టినవి గనుక లేఁగదూడలు ముందర నడువఁగా నావులు వెనువెంట నడిచినట్టులు నదులు ముందుపోఁగాఁ బర్వతములు వానివెంటనే పోయె ననుటకు గోగణమునకును బర్వతసమూహమునకు నుపమానోపమేయభావము గల్పించి యర్థద్వయము గలుగఁజెప్పినాఁడు.

పొడవైన శృంగములు, ఎత్తగుచఱియలు ఇంద్రునియాన పాలించురీతితో శైలములు వచ్చెనని ప్రకృతార్థము. విఱుగనికొమ్ములు, పిఱుఁదులపెంపు; పొదుగుస్రేఁగు, ఆఁబోతు అనుసరింపఁదగినసొంపున గోబృందము వచ్చెనని శ్లేషార్థము. అలం. శ్లేషము.

సీ. అజ్ఞాతగోత్ర య♦నాదిశక్తిసుగోత్ర భవ యయ్యె నితని గ♦ర్భమునఁ బుట్టి
యాదిభిక్షుండు దు♦ర్గాధ్యక్షుఁ డయ్యె నీతనిపాదతీర్థ మా♦నల ధరించి
మితతేజుఁ డగుజగ♦న్మిత్రుఁ డుత్కటవసుస్థితి నొందె నీతని♦దిక్కుఁ జేరి
కులమువా రభిరామ♦గో రత్నములు గాంచి రితనిశేషంబున♦ కిచ్చగించి

తే. తన కొకమఖాంశ మొసఁగుని♦ యమిషులకు
ననవరతయాగభాగభో♦జనము లొసఁగి
యితఁ డపర్ణైకగురుఁ డన♦ నెసఁగు ననుచు
నాకులు నుతింప వచ్చె మే♦నాకుటుంబి. 34

ఈపద్యములో హిమవత్పర్వతమును వర్ణించినాఁడు. ఏలాగనిన, అజ్ఞాతగోత్ర = గోత్రమన నెక్కుడఁ గులమని యర్థము, తెలియఁబడని కులముగలదయిన, అనాదిశక్తి = ఆదిలేనిశక్తి,

ఇతనిగర్భమునఁబుట్టి = ఇతని కడుపునఁబుట్టి, సుగోత్రభవయయ్యెన్ =సత్కులప్రసూతురాలాయెనని యర్థము. కులములేనిదనియును హిమవత్పర్వతమునకుఁ బార్వతిగాఁ బుట్టినదనియును భావము.

ఆదిభిక్షుండు = జన్మమెత్తినదిమొదలు భిక్షుకుఁడైనవాఁడు, ఈతనిపాదతీర్థ మాదలధరించి = ఇతని పాదోదకము శిరస్సునధరించి, దుర్గాధ్యక్షుఁడయ్యెన్ = దుర్గాధిపతి యయ్యెనని యర్థము. ఆదిభిక్షుఁడనెడు నామముగల శివుఁడు హిమవంతునియొక్క పాదములయందు - అనఁగాఁ బ్రత్యంతపర్వతములయందుఁ బ్రవహించుచున్న గంగను శిరస్సున ధరించినాఁడనియును దుర్గాదేవికిఁ బెనిమిటి యయినాఁ డనియును భావము. (ని. 'పాదాః ప్రత్యంతపర్వతాః' అని అ.)

మితతేజుఁడగు జగన్మిత్రుఁడు = అల్పతేజుఁడైన లోకోపకారకుఁడు, ఈతనిదిక్కుఁజేరి=ఇతని ప్రాపునఁజేరి, ఉత్కటవసుస్థితినొందెన్ = అపరిమిత ధనస్థితిని బొందెనని యర్థము. జగద్బంధుఁడయిన సూర్యుఁడు దక్షిణాయనమందు మితతేజుఁడగుచున్నాఁడనియును నుత్తరాయణమం దుత్కటతేజుఁ డగుచున్నాఁడనియును భావము. (ని. 'దేవభేదే నరే రశ్మావసూ రత్నే ధనేవసు' అని వి.) హిమవంతుఁ డుత్తరదిక్కునం దుండెడువాఁడు గనుక నీతనిదిక్కుఁ జేరి యని చెప్పినాఁడు. హిమవంతుఁడు భూభాగమునకు ఉత్తరదిశయం దుండు ననుటకుఁ బ్రమాణము.

శ్లో. అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామనగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థితః పృథివ్యాఇవ మానదండః. (కుమారసంభవము.)

కులమువారు = కులమువారందఱును, ఇతనిశేషంబున కిచ్చగించి = ఇతని భుక్తశేష మనుభవించుటకు సమ్మతించి, అభిరామ గోరత్నములు గాంచిరి = మనోహరప్రకాశముగల రత్నములను గాంచిరని యర్థము. ఇక్కడ గోశబ్దము కిరణవాచకము, సమస్తపర్వతములును వత్సాకృతియైన హిమవంతుని యెంగిలి కిచ్చగించి యభిరామములయిన గోరూప భూసంబంధి రత్నములను బొందిన వని భావము. ఇక్కడ గోశబ్దము భూవాచకము. (ని. 'స్వర్గే షు పశు వా గ్వజ్రది జ్నేత్ర ఘృణి భూ జలే, లక్ష్య దృష్ట్యా స్త్రియాం పుంసి గౌః' అని అ.) పూర్వకాలమందు సమస్తమయిన పర్వతములును భూమిని గోవునుగాను హిమవంతుని లేఁగనుగానుం జేసి రత్నములను నోషధులనుం బితికినవని పురాణప్రసిద్ధము. ఈయంశమె కుమారసంభవమునందుఁ గాళిదాసుఁ డీవిధముగాఁ జెప్పియున్నాఁడు-

శ్లో. యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరిదోహదక్షే
భాస్వంతి రత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీం.

తనకొకమఖాంశమొసఁగు = తనకు నొక్క యజ్ఞభాగమిచ్చిన, అనిమిషులకున్ = దేవతలకు, అనవరత యాగభాగ భోజనము లొసఁగి = సంతతమును యజ్ఞభాగభోజనములు పెట్టి యని యర్థము. యజ్ఞాంగములయిన సోమలతాదుల కుత్పత్తిస్థానమనియును నిజోపరిప్రదేశకృత యాగభాగ భోజనము లొసఁగూర్చె ననియును భావము. ఇతఁడపర్ణకగురుఁ డన నెసఁగున్ = అపగతమయిన ఋణముగలవార లపర్ణులు - అనఁగా ఋణములేనివారు. ఇతఁడు ఋణములేనివారికి ముఖ్యగురువు-అనఁగా నన్నృణశ్రేష్ఠుఁ డగునట్టులుగా నొప్పును అని యర్థము. ఋణములేనివాఁడు పరమసంతుష్టుఁడని మహాభారతమునందలి యారణ్యపర్వమందుఁ జెప్పియున్నది.

శ్లో. 'పఞ్చమేహని షష్ఠే వా శాకం పచతి స్వే గృహే,
అనృణో హ్యపరప్రేష్య స్సరాత్రించర మోదతే.'

అని యక్షప్రశ్నలలో, శ్లో॥ మోదతే యన్న ప్రశ్నకు ధర్మరాజు చెప్పినయుత్తరము గౌరీజనకుఁడని భావము. అనుచున్ = అనిపలుకుచు, నాకులుపుతింపన్ = దేవతలుపొగడఁగా, మేనాకుటుంబి = మేనకాదేవికి భర్తయయిన హిమవంతుఁడు, వచ్చెన్ = ఏఁగుదెంచెను. పార్వతి హిమవంతుని గర్భావాసమునఁ బుట్టి సుగోత్రజాత యయ్యెను. ఇతని పాదతీర్థము తలఁదాల్చి శివుఁడు దుర్గాధిపతి యయ్యెను. జగన్మిత్రుఁ డీతని దిశచేరి బాగుగాఁ బ్రకాశించెను. ఇతనియొంగిలి తిని కులమువారు వస్తురాజముల నొందిరి. ఒకయజ్ఞభాగ మొసంగి దేవత లీతనివలన నిత్యము యాగభాగము లొందుచున్నారు. కావున నిట్టి యోగ్యతగలవాఁడని వేలుపులు హిమవంతుని పెంపు పొగడుచుండిరని భావము.

తే. ఆవడఁకుమెట్టదొరకు హస్తావలంబ
మగుచు మేనక వచ్చె భవ్యగుణమంజి
మ నమరాలిమానసమున మన మరాళి
మనమరాలివివాహసంభ్రమముఁ జూడ. 35

ఆవడఁకుమెట్టదొరకున్ = ఆహిమవత్పర్వతరాజునకు, హస్తావలంబమగుచున్ = చేయూఁతయగుచు, మేనకవచ్చెన్ = మేనకాదేవివచ్చెను. ఎందుకనిన, భవ్యగుణమంజిమన్ = సుగుణములయొక్క మంజులత్వముచేత, అమరాళిమానసమునన్ = దేవతాసమూహముయొక్క మానసమనెడు మానససరోవరమందు, మనన్ = మనుటకు, మరాళి = హంసాంగనయయిన, మనమరాలి = కుమారుని కూఁతురైన గిరికయొక్క, వివాహసంభ్రమముఁ జూడన్ = కల్యాణోత్సవమును జూచుకొఱకు, వచ్చెనని సంబంధము. ఈపద్యమునందు మనుమరాలను నెడ మనమరాలని చెప్పఁబడెను. మనమరాలను నకారరూపము లాక్షణికగ్రంథములయందుఁ గానరాదు. మనుమరాలని యందుమనిన ననుప్రాసముభంగమగును గావునఁ గవ్యభిప్రాయము మనమరాలేయనుట స్పష్టము. సుగుణసంపదచే గిరిక, వేలుపుమనస్సులను మానససరోవరమునందు విహరింపఁదగియున్నదని భావము. వచ్చువాఁడు వడఁకుమెట్టదొర, కావుననే మేనక హస్తావలంబనముగా నేతెంచెను. వడఁకుచున్నవాని కెవరేని తోడ్పడవలయును గదా!

సీ. పిడుగుకైదువుపెట్టుతడకట్టుగాఁ బయోధి మహౌషధిరసంబుచమరె ననఁగఁ
గడలికరల్లరాయిడిఁ గీడ్పడి తటాంతవనరాజి మైనంట వ్రాలె ననఁగ
మున్నీటిపెన్నీటి ముదురుచిల్వలయలజడికిఁ బచ్చలజోడు దొడిగె ననఁగఁ
దనకుందనపుఁజాయ పెనునీటికుప్పక ప్పెనసినపసఁ బస రెక్క ననఁగ
తే. సంతతజలాంతరాళసంస్థానమహిమఁ
బ్రాఁచి పట్టినమేనితో బయలు మెఱసి
వచ్చె వలిగట్టుతొలిపట్టి వాసవాధి
వాహితనిజానుజభవావివాహమునకు. 36

పిడుగుకైదువుపెట్టు = వజ్రాయుధపుదెబ్బకు, తడకట్టుగాన్ = స్తంభనమగునట్టులుగా, పయోధి = సముద్రుఁడు, మహౌషధిరసంబు చమరెననఁగన్ = సిద్ధమూలికలయొక్క రసము పూసెనో యన్న

ట్టులుగాను, కదలికరళ్ళ రాయిడిఁ గీడ్పడి = సముద్రతరంగ ఘట్టనముచేత మరలఁబడి, తటాంతవన రాజి=తీరమందలి వనసమూహము, మైనంటవ్రాలెననఁగన్ = దేహ మంటునట్టులు వ్యాపించెనో యన్న ట్టులుగాను,

మున్నీటి=సముద్రముయొక్క, పెన్నీటి ముదురుచిల్వల=పెద్ద నీరుతాఁచుపాములయొక్క, అల జడికిన్ = విషవేధకు-అనఁగా విష మెక్కుచుండునట్టులుగా, పచ్చలజోడు దొడిగెననఁగన్ = గరుడ పచ్చలచేత నిర్మింపఁబడిన కవచము దొడిగినాఁడో యన్నట్టులుగాను, గరుడపచ్చలు విషహరములని ప్రసిద్ధము. గరుడపచ్చలను ధరించినవారికి సర్వవిషభయ ముండ దనుట ప్రసిద్ధము.

శ్లో. విషరోగోపశమనే కర్మస్వార్ధర్మేషుచ, శస్యతే మునిభి ర్యస్మా దయం మరకతోమణిః.

(గరుడపురాణము)

తనకుందనపుఁజాయ = కుందనపుబంగారమువంటి తనదేహకాంతి, పెనునీటికుప్ప=మహాజలరాశి యొక్క, కప్పెనసిన = నీలిమగల-అనఁగా, పసఁబసరెక్కెననఁగన్ = మెఱుపుగల పసరుచాయ యేర్ప డియెనో యన్నట్టులుగాను, కుందనపుఁగాంతి మేనికాంతివలెనుండును.

తే-గీ. కుందనమువంటిమేను మధ్యందినాత, పోష్మహతిఁ గందె వడదాఁకె.

(మనుచరిత్రము, ద్వితీ.)

సంతత=నిరంతరమును, జలాంతరాళ=ఉదకముయొక్క యంతఃప్రదేశమే, సంస్థాన=నివాసముగాఁ గలిగిన, మహిమన్ = ప్రభావముచేత, ప్రాఁచిపట్టిన = పచ్చప్రాఁకుడుపట్టిన, మేనితోన్ = శరీరము తోడ, బయలుమెఱసి = సముద్రపుఁ గుక్షివల్లనుండి బయలుదేరి, వలిగట్టు తొలిపట్టి = హిమవంతుని ప్రథమపుత్త్రుఁడయిన మైనాకుఁడు, వాసవ=ఇంద్రునిచేత, అధివాహిత=పూనుకొనఁబడిన, నిజానుజభవా వివాహమునకున్ = తనతమ్ముని కూఁతురైన గిరికాదేవి పెండ్లికి, వచ్చెన్ = అరుగుదెంచెను.

మైనాకుఁడు ఇంద్రునివజ్రపాతమునకు వెఱచి చిరకాలము సముద్రమునఁ బడియుండెను. అట్టివాఁ డింద్రుఁడు చేయించు వివాహమునకు వచ్చుట యెటులన, జరుగనున్నది తనసోదరునిబిడ్డపెండ్లి. కోలాహలుని పురస్కరించి తనను మన్నించునని.

చ. ఇరువురు దేవసంభరణు • లిర్వురు నబ్జధరోన్నమత్కరాం
తరమహనీయు లిర్వురు న•నంతగుణాఢ్యులు గావునం బర
స్పరసమతాసమగ్రతర•సఖ్యమునం గవగూడి మేరుమం
దరధరణీధరాన్వయవ•తంసులు వచ్చిరి తత్క్షణంబునన్. 37

ఈపద్యమున మందరపర్వత మేరుపర్వతములకు రెంటికిని నర్థద్వయమును గలుగఁజెప్పినాఁడు గనుక సభేదాధ్యవసాయ మని తెలియవలయును. ఎట్లనఁగా,

ఇరువురు దేవసంభరణులు = ఇద్దఱును దేవసంభరణులనంగా దేవతలకు గృహమయి భరించిన వాఁడని మేరుపర్వతపరమయిన యర్థము. దేవతలచేత సముద్రమథనార్థమయి భరింపఁబడినవాఁడని మందరపర్వతపరమయిన యర్థము. ఇర్వురున్ = ఇద్దఱును, అబ్జధరోన్నమత్కరాంతర మహనీయులు= అబ్జశబ్దము చంద్రునియందును శంఖమందును వర్తించుచున్నవి గనుక, అబ్జధర = చంద్రధరుఁడయిన హరునియొక్క, ఉన్నమత్కరాంతర=ఎగచియున్న హస్తమందు, మహనీయుఁడు=చాపమయి యొప్పినో

వాఁడని మేరుపర్వతపరమయిన యర్థము. అబ్జధర = పాంచజన్యధరుండయిన శ్రీమహావిష్ణువుయొక్క, ఉన్నతక్కరాంతరములచేఁ దరువఁబడినవాఁడని మందరపరమయిన యర్థము. (ని. 'అబ్జో ధన్వంతరౌ చంద్రే నిచుళే శఙ్ఖ పద్మయోః' అని వి.) ఇద్దరు ననంతగుణాఢ్యులు = ఇద్దఱును ననంతగుణాఢ్యు లనఁగా శేషరూపశింజినీగుణయుక్తుఁడని మేరుపరమయిన యర్థము. దీర్ఘమయి వాసుకిరూపమైన కవ్వపుఁద్రాటితోఁగూడినవాఁడని మందరపరమయిన యర్థము. కావునన్ = అయినందున, పరస్పర = ఒకరి తోనొకరికైన, సమతా = సమానధర్మములని, సమగ్రతర = సంపూర్ణమయిన, సఖ్యమునన్ = మైత్రిచేత, కవగూడి = జతగూడినవారై, మేరు మందర ధరణీధరాన్వయ వతంసులు = మేరుమందర పర్వతకుల శ్రేష్ఠులు, వచ్చిరి తత్క్షణంబునన్ = ఆక్షణమందె యరుదెంచిరి.

ఉ. రోహణశైలరాజము మరుద్గిరితోడనె వచ్చి నిల్చి వై
వాహికకార్యకర్త మఖవంతుఁ డనంతసువర్ణరత్నసం
దోహము రాశి వోసి విబుధు ల్మనుజు ల్భుజగు ల్నుతింపఁగా
నాహిమవత్కుమారతనయామణి కుంకువ దెచ్చెనో యనన్. 38

రోహణశైలరాజము = రోహణాచలశ్రేష్ఠము, మరుద్గిరితోడనె వచ్చి నిల్చెన్ = మేరుపర్వతముతోఁ గూడ వచ్చి నిలిచెను. ఎటులనినను, వైవాహికకార్యకర్త = పెండ్లికార్యముచక్కపఱుచునట్టి, మఖవంతుఁడు = ఇంద్రుఁడు, అనంతసువర్ణ రత్నసందోహము రాశివోసి = అపరిమితమైన బంగారముయొక్కయు మణులయొక్కయు సమూహము కుప్పఁగాఁ బోసి, విబుధులు = దేవతలును, మనుజులు = మానవులును, భుజగులు = పన్నగులును, నుతింపఁగాన్ = కొనియాడఁగా, ఆహిమవత్కుమారతనయామణికిన్ = హిమవత్పర్వతపుత్రుఁడైన యాశోలాహలునియొక్క పుత్రికారత్నమునకు-అనఁగా గిరికాదేవికి, కుంకువ దెచ్చెనో యనన్ = కుంకువయనఁగాఁ బడుచుగలవారి కిచ్చునట్టియోలి గనుక నట్టియోలిదెచ్చినాఁడో యనునట్టులుగా, సువర్ణరత్నమయములైన మేరు రోహణాచలశ్రేష్ఠములు వచ్చి నిలిచెనని సంబంధము. అలం. ఉత్ప్రేక్ష.

మ. మఱియున్ వచ్చిరి ధాత్రిఁ గల్గునగసామ్రాజ్యైకధౌరేయు లం
దఱుఁ దద్భూరిభరాప్తిఁ గ్రుంగునవనిం దామ్యత్ఫణారాజిఁ బ
ల్మఱు సంధించుచు నుండెఁ గాని వసుకల్యాణంబు వీక్షింప రా
వెఱచెన్ శేషుఁడు శేషవృత్తికగునే విస్రంభసంచారముల్. 39

మఱియున్ = వెండియును, ధాత్రిఁగల్గు = భూమియందుఁగలిగిన, నగసామ్రాజ్యైకధౌరేయు లందఱున్ = పర్వతసామ్రాజ్యమునకు ముఖ్యధురంధరు లైనవారందఱును - అనఁగాఁ బర్వతాధీశ్వరు లందఱును, వచ్చిరి = విచ్చేసిరి. తత్ = ఆపర్వతశ్రేష్ఠులయొక్క, భూరి = అధికమయిన, భర = భారము యొక్క, ఆప్తి = ప్రాప్తిచేత, క్రుంగు = దిగఁబడుచున్న, అవనిన్ = భూమిని, శేషుఁడు = శేషాహి, తామ్యత్ = సుడివడుచున్న, ఫణారాజిన్ = పడగగుంపునందు, పల్మఱుసంధించుచున్ = మాటి మాటికిని గుదురుపఱుచుచు, ఉండెఁగాని = ఉండెనేకాని, వసుకల్యాణంబు వీక్షింపరావెఱచెన్ = వసురాజువివాహము చూచునిమిత్తము వచ్చుటకు జడిసెను. వసుకల్యాణ మన్నచోట కాంచనార్థక మైన శబ్దవ్యయమును బుచ్చుకొన్నాఁడుగనుకఁ బునరుక్తవదాభాసాలంకారము. శేషవృత్తికిన్ =

దానవృత్తిగలవానికని యర్థము. శేమశబ్దవృత్తిగలవానికని భావము. వృత్తియనఁగా నభిధానవృత్తి, విస్రంభసంచారముల్ = ప్రణయసంచారములు-అనఁగా వేడుకకొఱకైన విహారములు. అగునే=అవునా-అనఁగా యుక్తపడ దనుట. అలం. అర్థాంతరన్యాసాలంకారము.

ఉ. వచ్చినసింధుకాంతల న◆వారితసత్కరుణాభివృద్ధిచే
హెచ్చఁగఁజేసి గోత్రశిఖ◆రీంద్రుల నున్నతి గారవించి వై
యచ్చరలోకభర్తయు హి◆మాలయసూతికి నాస్పదంబుగా
నచ్చట నొక్కనూతనమ◆హానగరంబు మదిం దలంచినన్. 40

వచ్చిన సింధుకాంతలకున్=వివాహార్థమై వచ్చిన నదీకాంతలను, అవారితసత్కరుణాభివృద్ధిచే హెచ్చఁగఁజేసి = అనివారితమైన సత్కృపాపారసాభివృద్ధిచేత నతిశయింపఁజేసి, గోత్రశిఖరీంద్రులన్ = కులపర్వతశ్రేష్ఠులను, ఉన్నతిగారవించి = ఔన్నత్యముచేతఁ బెద్దఱికముచేసి, అభివృద్ధి యన్నచోట ఉన్నతి యన్నచోటను స్వారస్యము స్పష్టము. ఏమనిన, ఏధర్మముగలవారియందు నాధర్మ మాపాదించినవాఁడాయె ననుట. వైయచ్చరలోకభర్తయున్ = స్వర్గలోకాధిపతియైన యింద్రుఁడును, హిమాలయసూతికి నాస్పదంబుగాన్ = కోలాహలపర్వతున కాధారమగునట్లుగా, అచ్చట నొక్కనూతన మహానగరంబు మదిందలంచినన్ = అస్థలమందొక నవీనమైన మహాపట్టణమును మనస్సునఁ దలంపఁగా-ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

సింధుకాంతలు నదులు, నదు లభివృద్ధిచే హెచ్చునవి. గోత్రశైలేంద్రులు ఉన్నతిచే గౌరవము నొందఁదగినవారు. కావున నింద్రుఁ డుచితవిధమున గౌరవించెను. వివాహమునకు సామాన్యమందిరముగాని సామాన్యనగరముకాని చాలదు. నదు లభివృద్ధిస్వభావలు. శైలములు ఉన్నతిగలవారు. వీరు పెండ్లిపెద్దలు. వీరలందఱు నివసింపఁ గ్రొత్తనగరము కావలసివచ్చినది. అనుకూలస్థల మా సమావేశప్రదేశమునసే. ఇంద్రుఁడు వియచ్చరలోకభర్త-కావున సంకల్పమాత్రముననే నిర్మించెను.

సీ. నిమ్నప్రపాతాంత◆నిర్ఝరపరిఖతోఁ గనుపట్టెఁ గోట యై ◆ కటకపరిధి
మణిచిత్రకిరణతో◆రణమాలికలతోఁ బ్రకాశించె గృహములై ◆ గవ్హారములు
శుచికరోపలభంగ◆సోపానసరణితోఁ జెలఁగె సౌధాళి యై ◆ శిఖరపాళి
ఘనసారవసుసార◆గంధసారములతో నలరె నంగడు లై తు◆టాజిరములు
తే. కలమధురకోకిలాలాప ◆ కలనతోడఁ, జెన్నలరెఁ గన్నెలై కొన్ని ◆ చిన్నిలతలు
సమధికస్కంధశాఖాభు◆జములతోడఁ, దనరెఁ దరుణాగ్రగణ్యులై ◆తరువులెల్ల.

నిమ్న=లోఁతైన, ప్రపాతాంత=ప్రపాతమనఁగాఁ బర్వతశిఖరముక్రింద నుండెడు నున్నతప్రదేశము. (ని. 'ప్రపాతస్తు తటో భృగుః' అని అ.) అట్టిప్రపాతముల చివరలను బ్రవహించునట్టి, నిర్ఝర = సెలయేఱులనెడు, (ని. ప్రవాహో నిర్ఝరోఝరః' అని అ.) పరిఖతోన్ = అగడ్తతోడను, కటకపరిధి = కటకమనఁగా సానువు, (ని. 'కటకంవలయే సానౌ' అని వి.) పరిధియనఁగా వలయము. (ని. 'పరివేషస్తు పరిధిః' అని అ.) వలయాకారసానువు = అనఁగా వలయాకారముగానున్న నిలువు బండలచాలు, కోటయై = ప్రాకారమై, కనుపట్టెన్ = చూడఁబడియెను. మణి = రత్నములయొక్క, చిత్ర = నానావిధములైన, కిరణ = కాంతులనెడు, తోరణమాలికలతోన్ =తోరణపంక్తులతోడ, గవాక్ష

రములు = గుహలు, గృహములై=మందిరములై, ప్రకాశించెన్ = విలసిల్లెను. వలయాకారముగనున్న శిలలు కోట యయ్యెను. సెలయేళ్లు లగడ్తయయ్యెను. జరుగుచున్నది వివాహశుభకార్యముగాన మణితోరణములతో గుహలు గృహములయ్యెను.

శుచికర = ధవళకిరణుఁడైన చంద్రునియొక్క, ఉపల = శిలలయొక్క - అనఁగాఁ జంద్రకాంత శిలలయొక్క, భంగ = శకలముల నెడు, సోపానసరణిలోన్ = మెట్లచాలుపులతోడ, శిఖరపాళి = శృంగపంక్తి, సౌధాళియై=హర్మ్యశ్రేణియై, చెలఁగెన్ = ఒప్పెను. ఘనసార = కర్పూరపరఁటుల నెడు కర్పూరముతోడను, వసుసార = రత్నశ్రేష్ఠముల నెడు యోగ్యతరమణులతోడను, గంధసార = చందనవృక్షముల నెడు చందనముతోడను, తటాజిరములు=అజిరమనఁగా నంగణము గనుక తటాంగణములు, అంగడులై = ఆపణములై, అలరెన్ = ఒప్పెను. చంద్రకాంతశిలావృతములగు శిఖరములు సౌధములుగను ఘనసారయుక్తములగు నంగణములు సుగంధభాండాగారములుగను మారెను.

కలమధుర=అవ్యక్తమధురములైన, కోకిలాలాప=కోయిలలపలుకుల నెడు, కలనతోడన్ = అవ్యక్తమధురములైన కోయిలపలుకులవంటి పలుకులతోడ, కొన్నిచిన్నిలతలు = కొన్ని లేఁదీఁగెలు, కన్నెలై = కన్నెపడుచులై, చెన్నలరెన్=బాగుమీఱెను, సమధిక = ఉన్నతములైన, స్కంధ = ప్రకాండముల నెడు భుజశిరస్సులుగల, శాఖ=కొమ్మల నెడు, భుజములతోడన్ = బాహువులతోడ, తరువులెల్లన్ = వృక్షములన్నియు, తరుణాగ్రగణ్యులై=తరుణపురుషజనశ్రేష్ఠులై, తనరెన్ = ఒప్పుచుండెను. ఇక్కడ నింద్రానుగ్రహముచేత నిర్ఝరాదులకుఁ బరిఖాదిరూపములు సిద్ధించుటవలన నారోపశంక సేయఁ గూడదు. తీవెలు కన్నెలైరి. వారి మాటలు కోయిలపలుకులు. వృక్షములు సమధికములు, స్కంధశాఖలు భుజములుగ నొప్పుటచే నవి యెల్లఁ దరుణపురుష సముదాయ మయ్యెను.

ఉ. ధాతుపరాగరక్తియును • దంతవిభక్తియుఁ జామరప్రకా
శాతిశయంబు సంకులమ•దాంకనముం గదళీకదంబసం
భూతియుఁ గర్బురాకృతియుఁ • బుష్కరభూతియుఁ బూని భద్రతా
ఖ్యాతి వహించె మించెఁ బృథు•గండము లచ్చట నద్భుతంబుగాన్. 42

ఈ పద్యమందుఁ గోలాహలపర్వతస్థితగండశిలలు పట్టణోచిత భద్రగజత్వఖ్యాతిని వహించినవని చెప్పినాఁడు గనుక గండశిలాధర్మములన్నియును భద్రగజధర్మములుగాఁ జెప్పఁబడుచున్నవి.

ఎట్లాగనిన, ధాతుపరాగరక్తియును=గైరికధాతుపరాగరక్తియును - గైరికరేఖాశృంగారరంజనంబును, దంతభక్తియున్ = దంతశబ్దము సానువునందును వర్తించుచున్నది. (ని. 'దన్తస్సానుని కథ్యతే' అని వి.) సానువిభాగమును = గజదంతవిభాగమును, చామరప్రకాశాతిశయంబు = చమరీమృగసమూహముయొక్క ప్రకాశాతిశయమును - వింజామరలయొక్క ప్రకాశాతిశయమును, సంకులమదాంకమునన్ = సంకులమనఁగా జవ్వాదిపిల్లులు గనుక వానియొక్క మదచిహ్నము నని యర్థము. సంకులమైన గజమదచిహ్నమునునని యర్థాంతరము. కదళీకదంబసంభూతియున్ = కదళీవృక్షములయొక్కయును గదంబవృక్షములయొక్కయును సంభవమును, బతాకాసమూహసంభవమును. (ని. 'కదళీ వైజయన్త్యాం చ రమ్భాయాం హరిణాన్తరే' అని వి.) (కదంబ మాహుః స్సిద్ధార్థే నీపేపి నికురుంబకే' అని వి.) కర్బురాకృతియున్ = [illegible]యొక్క నీలవర్ణమును గజనీలవర్ణమును, పుష్కరమనఁగా

జలమును గజశుండాగ్రమును, (ని. 'పుష్కరం కరిహస్తాగ్రే వాద్య భాండముఖేజలే' అని అ.) భూతి యనఁగా సమృద్ధియును మాతంగశృంగారమును, (ని. 'భూతి ర్మాతఙ్గశృఙ్గారే జాతౌ భస్మని సంపది అని వి.) పుష్కరభూతియుఁ = జలసమృద్ధిని, శుండాదండశృంగారమును, పూని = ధరించి, పృథుగండములు = మహత్తరములైన గండశిలలు, అచటఁ = ఆ స్థలమందు, అద్భుతంబుగాఁ = ఆశ్చర్యమగునట్టులుగా, భద్రతాఖ్యాతివహించిమించెఁ = భద్రశబ్దము భద్రగజమందును శుభమందును వర్తించుచున్నది. గనుక భద్రగజత్వఖ్యాతిని వహించి, అనఁగా భద్రగజములయి మించెనని యర్థము. గండములనఁగా గండదోషములును గనుక గండదోషములు శుభములయ్యెనని యద్భుతార్థము. సంకులన్నచోట, (శ్లో. 'అసంబుద్ధౌభవేద్వాపురస్త్రియాం ల్వాదివర్గకే' అనెడు నథర్వణ వచనముచేత వుప్రత్యయము చెప్పినవాఁడు గాఁడు. సంకులమదాంకమన్నది షష్ఠీతత్పురుష తత్సమసమాసము.) ('షష్ఠీభవే ద్వితీయా తుల్యా తత్పురుషసంస్థితానామ్నామ్' న. అనెడుసూత్రముచేత షష్ఠిస్థానమందు, సంకులఁ అని ద్వితీయవచ్చినది )

ఏనుఁగులపై నలంకారముగాఁ బతాకములు గట్టుటయుఁ జామరములు గట్టుటయుఁ గలదు. ఇటులె యశ్వములకును గట్టుదురు. అశ్వములకుఁ బతాకములు గట్టుదు రనుటకు గ్రంథాంతరములందు దృష్టాంతములు గలవు. ఏనుఁగులపతాకములు గట్టుటకు—

"కదళీకాంచన కక్ష్యలం బొలుచు లేఖస్వామిచౌదంతిపైఁ" మను.

ఉ. జాతికి నెల్ల రాజపరిచర్యయు గాలికి నెక్కుడన్నవి
ఖ్యాతియు రాఁ గురంగములు గట్టున నేమితపం బొనర్చెనో
యాతతశృంగభారరహితాత్మమహాముఖకాంతతాప్తి నౌ
రా తనరారె నన్నియుఁ దురంగములై తదభీష్టసంపదన్. 43

జాతికినెల్లఁ = తమయొక్క కురంగసామాన్యమునకంతటికిని, రాజపరిచర్యయుఁ = నృపసేవయును అని యర్థము. చంద్రసంగతి యని భావము. గాలికి నెక్కుడన్న విఖ్యాతియుఁ=గమనవేగము చేత వాయువునకంటె నధికమనెడు ప్రఖ్యాతియు అని యర్థము. వాయుదేవునకు వాహనమని భావము. రాఁ = ఈ రెండును వచ్చుకొఱకు, కురంగములు= లేళ్లు, గట్టున నేమితపం బొనర్చెనో = కోలాహలపర్వతమందు నెట్టి తపస్సు చేసెనో, తదభీష్టసంపదఁ = వాని కోరికప్రకారముగా, ఆతత = ఒప్పుచున్న, శృంగభారరహిత = కొమ్ములులేనట్టి, ఆత్మమహాముఖ = స్వకీయమహాముఖములయొక్క, కాంతతాప్తిఁ = సౌందర్యప్రాప్తిచేత, ఔరా తనరారెనన్నియుఁ దురంగములై = అన్నియును దురంగములైయొప్పెను భళాయని యర్థము. శృంగమనఁగా ఉకారముగనుక, ఆతతశృంగరభారరహిత=ఉకారరహితమయిన, ఆత్మమహాముఖ = తమకురంగశబ్దముఖవర్ణమయిన, కాంత=కకారముయొక్క యంతము - అనఁగా లోపముగల, తాప్తిఁ = తకారప్రాప్తిచేత, తురంగములై తనరారె ననియును నర్థము.

అనఁగా నుకారరహితమయిన కురంగశబ్దాది కకారము కేవలకకార మని గ్రహింపవలయును. కేవల కకారస్థానమందుఁ దకారము వచ్చి కకారమువీఁది యుకారముతోఁ గూడుకొని తువర్ణ మయినదని యాశయము. అనఁగాఁ గురంగాకారము తురంగాకారమై కురంగశబ్దము తురంగశబ్దమై యాకృతిచేతను నామముచేతను గురంగములు తురంగము లయ్యె ననుట. కురంగములతపఃఫలము శృంగభారము తొలంగుట, ముఖకాంతతాప్తియగుట (కొమ్ములుపోయి చక్కని మొగముతో నలరుట), గమనవేగమునకుఁ గొమ్ము లడ్డుపడకుంటయు మొగ మందముగ నుంటయుఁ దపఃఫలము లయ్యెను.

చ. హారిపరతంత్రవృత్తియు మహామణిచాపశరానుబంధబం
ధురతయు రాజహంసకవినోదనముం బవిఘోషఘుర్ఘుర
స్వరమును జిత్రవిగ్రహవిశంకటభావముఁ బూని శైలరా
ట్పురి నరదంబులై శరదము ల్చపలాంశుసంపదన్. 44

ఈపద్యమందుఁ గోలాహలపర్వతమందలి మేఘములు పట్టణోచితరథము లయ్యెనని చెప్పినాఁడు గనుక మేఘధర్మము లన్నియును రథధర్మములుగాఁ జెప్పఁబడుచున్నవి. ఏలాగనిన,

హారిపరతంత్రవృత్తియున్ = హారిశబ్దము దేవేంద్రునియందును నశ్వమందును వర్తించుచున్నది గనుక నింద్రపరాధీనవృత్తిని నశ్వతరాధీనవృత్తిని, మహామణిచాప శరానుబంధ బంధురతయున్ = మణిచాపమనఁగా నింద్రధనుస్సును రత్నమయచాపంబును, శరమనఁగా జలంబును బాణంబును, గనుక ఇంద్రచాప జలసాంగత్య సౌందర్యమును రత్నమయ చాపబాణ సాంగత్య సౌందర్యమును, రాజహంస = రాయంచలనెడు, కవి = జలపక్షులయొక్క, నోదనమున్ = తిరస్కారమును-లేక, రాజ= చంద్రునియొక్కయు, హంస=సూర్యునియొక్కయు, కవి=శుక్రునియొక్కయు, నోదనమున్=ఆచ్ఛాదనమును, రాజహంస=రాజశ్రేష్ఠులయొక్క, వినోదనమున్ = క్రీడను, పవిఘోషఘుర్ఘురస్వరమును = ఘుర్ఘురస్వరమువంటి యనఁగా నేమిధ్వనివంటి వజ్రనిర్ఘోషమును అనఁగా గర్జితమును వజ్రనిర్ఘోష సదృశమయిన నేమిధ్వనిని, చిత్రవిగ్రహ విశంకటభావమున్ = కామరూపశరీర మహత్త్వమును నద్భుతాకార మహత్త్వమును, (ని. 'విశఙ్కటం పృథుబృహ ద్విశాలం పృథులంమహత్' అని అ.) పూని= వహించి, శైలరాట్పురిన్ =కోలాహలపర్వతరాజ పట్టణమందు, అరదంబులై=రథంబులై, శరదముల్ = మేఘములు, చపలా = మెఱుపుతీఁగెలయొక్క, అంశుసంపదన్ =కిరణసంపత్తిచేత నని మేఘపరమయిన యర్థము, చంచలములయిన కాంతిసంపదలచేత నని రథపరమయిన యర్థము. నెరసెన్ =వ్యాపించెను.

చ. గిరివరఘోరకందరలఁ ♦ గేవలవన్యగజైకవృత్తిచేఁ
దరలక యున్నసత్కృతము ♦ తప్పునె యప్పురికేసరుల్ నృకే
సరు లయి పూర్ణపౌరుషవి♦శాలత మించె మహానృకేసరిం
బరునకు మార్గ్యాగం బిడమి ♦ భక్తునిఁ బ్రోవ నటల్లుటింపమిన్. 45

గిరివర = కోలాహలపర్వతసంబంధములైన, ఘోర=భయంకరమైన, కందరలన్ =గుహలయందు, (ని. 'దరీతు కందరో వాస్త్రీ' అని అ.) కేవల = ముఖ్యమగునట్టులుగా, వనీ=వనమందలి, అగ = వృక్షములవలన, జ=పుట్టిన ఫలాదికములయందైన, ఏకవృత్తిచేన్ =ఒకవృత్తిచేత - అనఁగాఁ గేవలవనవృక్షఫలాద్యాహారనియతవ్యాపారముచేతను అని యర్థము. అడవియేనుఁగులే ముఖ్యాహారముగా నుంచున్న వని భావము. తరలకయున్నసత్కృతము = చలింపకయున్న సత్కార్యము - అనఁగాఁ దపశ్చర్య, తప్పునె = వ్యర్థమవునా, కాదుకనుకనే, కేసరుల్ = సింహములు, అప్పురిన్ =ఆపట్టణమందు, నృకేసరులై = పురుషశ్రేష్ఠులై, పూర్ణపౌరుషవిశాలతన్ =సంపూర్ణపరాక్రమాతిశయత్వముచేత ననియర్థము, పూర్ణపురుషాకృతిచేత ననిభావము. (ని. 'పౌరుషం పురుషస్యోక్తం భావే కర్మణి తేజసి' అని వి.) మహానృకేసరిన్ = మహా నృసింహుని, మించెన్ =అతిక్రమించెను. ఎందువల్లననిన, పరునకు మార్గ్యాగం బిడమిన్ =శత్రువునకు విముఖత్వము వహింపక పోవుటచేతను, భక్తునిఁ బ్రోవ నటల్లుటింపమిన్ =నటల

లనఁగా నసత్యములు గనుక భక్తజనరక్షణమున కసత్యము లాడకపోవుటచేతను, మహానృసింహుని మించెనని సంబంధము. మహానరసింహుఁడు పరునకు మార్గోగము పెట్టినవాఁడును భక్తులకు బ్రోచుట కసత్యములు ఘటించినవాఁడును అని దోషారోపము.

మార్గోగంబిడుట యనఁగా సింహవక్త్రము వహించినవాఁడనియును, సటలుఘటించుట యనఁగా మెడమీఁద వెండ్రుకలు గలవాఁడనియును భావము. కేసరులు నృకేసరులై మహానృకేసరిని జయించిన వన్నందున కేసరు లుత్కృష్టమయిన నృకేసరిజన్మమును బొంది యాజన్మమందుఁ దమకంటె నధికుఁ డయినమహానృకేసరిని జయించిన సర్వోత్కృష్టదశను జెందెనని స్వారస్యము స్ఫురించుచున్నది. సటయన్నపద మసత్యవాచకమన్నందుకు - క. 'పలుపులు సట వావులు నహి' అని సారంగధరచరిత్రమునందుఁ బ్రయోగింపఁబడియున్నది. పూర్వపౌరుషభావములేమియుఁ బరునకు మారుమొగ మిడుటయును సటలు ధరించుటయును నృకేసరియెడఁగల గుణములు. పూర్తిగ మగబీరము లేనివాఁడనియును వేఱొకమోముగలవాఁడనియుఁ గల్లలాడువాఁడనియును నృకేసరి లోపములు తెలుపుచో శ్లేషార్థము. అలం. శ్లేషానుప్రాణితవ్యతిరేకము.

సీ. విపులవప్రంబులు • విప్రవరావాసవాటము ల్కల్యాణ•కూటములును
 భూదారవర్గము • ల్భూరికంచుకిఖడ్గి హరిరాజతతులు యూ•థాధిపతులు
 శ్యామాసమాజము • ల్సామోదవిటపప్రకాండము ల్సరసుల•తండములును
 నిర్జరస్థానము • ల్నిరుపమగణికావినోదము ల్వంశీని•నాదములును
తే. గలుగుఁగాకేమి నగములఁ•గలుగుటరుదె,కలయనివియెల్ల నిజనామ•గరిమవదల
 కచటనుచితార్థగతిఁబూను•టరిదిగాక,యనఁగ హరికృపఁబట్టణం•బయ్యె వనము.

విపులవప్రంబులు = విస్తారములైన సానువులును, విప్రవరావాసవాటముల్ = పక్షిశ్రేష్ఠనివాసవాటములును, కల్యాణకూటములును = కాంచనశృంగములును, (శ్లో. 'కూటోస్త్రీ శిఖరం శృఙ్గమ్' అని అ.) భూదారవర్గముల్ = వరాహసమూహములును, భూరికంచుకి = అనేకసర్పములయొక్కయు, ఖడ్గ = ఖడ్గమృగములయొక్కయు, హరి = సింహములయొక్కయు, రాజ = యక్షులయొక్కయు, తతులు = సమూహములును, (ని. 'రాజా ప్రభౌ నృపే చంద్రే యక్షే క్షత్రియశక్రయోః' అని వి.) యూథాధిపతులు = మృగయూథాధిపతులును, శ్యామాసమాజముల్ = ప్రేంకణపుఁబిట్టగుంపులును, సామోద=పరిమళయుక్తములయిన, విటప=తరువిస్తారములుగల, ప్రకాండముల్=వృక్షస్కంధములును, సరసులతండములును = కొలఁకులయొక్క సమూహములును, నిర్జరస్థానముల్=దేవతాస్థానములును, నిరుపమగణికావినోదముల్ = సమానరహితములయిన యడవిమొల్లలయొక్క వినోదములును, (ని. 'గణికా యూథికాంబష్ఠా' అని అ.) వంశీనినాదములును = బొంగువెదుళ్ళయొక్క నాదములును, కలుగుఁగాకేమి=కోలాహలాద్రియం దుండఁగా నేమాయెను, నగములఁ గలుగుటరుదె = పర్వతములయందుండుట యాశ్చర్యమా-అనఁగా నాశ్చర్యము కాదు.

ఇఁక నేమనిన, కలయనివియెల్లన్ = ఈచెప్పఁబడిన వప్రాదులన్నియును, నిజనామగరిమవదలక = స్వకీయనామధేయ గౌరవమును విడిచిపెట్టక, అచటన్ = ఆస్థలమందు, ఉచితార్థగతిఁబూనుట = పట్టణోచితరీతిని వహించుట, అనఁగా, విపులవప్రంబులు = విస్తారములయినకోటలును, (ని. 'సాను

ప్రాకారయో ర్వప్రః' అని వి.) విప్రవరావాసవాటముల్=బ్రాహ్మణశ్రేష్ఠులయొక్క నివాసశ్రేణులును, కల్యాణకూటములును=శోభనగృహములును, (శ్లో. 'వాసః కూటో ద్వయోః శాలా' అని అ.) భూదారవర్గముల్ = భూపతిసమూహములును, భూరికంచుకి ఖడ్గిహరిరాజితతులు-భూరి = అనేకులయిన, కంచుకి = కవచధారులయొక్కయు, ఖడ్గి = ఖడ్గధరులయొక్కయు, హరి = అశ్వముల యొక్కయు, రాజ=క్షత్రియులయొక్కయు, తతులు = సమూహములును, యూథాధిపతులు = సేనానాయకులును, శ్యామాసమాజముల్ = యౌవనమధ్యస్థలయిన స్త్రీలయొక్క సముదాయములును, సామోదవిటపప్రకాండముల్ = సంతోషయుక్తులయిన విటశేఖరసమూహములును, (శ్లో. 'విటపో నస్త్రియాం స్తంబ శాఖా విస్తార పల్లవే, విటాధిపే నా' అని మేదిని.) సరసుల కందములును = రసికజనులయొక్క సమూహములును, నిర్జరస్థానముల్ = యువజననివాసస్థానములును, నిరుపమ గణికావినోదముల్ = అసమానలైన వేశ్యాంగనలయొక్కవినోదములును, వంశీనినాదములును = పిల్లనగ్రోవులయొక్క సునాదములును, అవ్వట, అరిదిగాక = ఆశ్చర్యముగాక, అనఁగన్ = అనుసట్టులుగా, హరికృపన్ = ఇంద్రానుగ్రహముచేత, వనము = కోలాహలపర్వతారణ్యము, పట్టణంబయ్యెన్ = ఒక పట్టణమాయెను.

వప్రములు, భూదారవర్గము, శ్యామాసమాజము, గణికావినోదములు లోనగునవి నగముల యందు సహజముగాఁ గలవు. ఇవియన్నియుఁ దొల్లిటినామములతోనే యలరి యుచితార్థములచే నగరానుకూలవస్తుసమృద్ధిగా మాఱుట ఆశ్చర్యకరము. హరికృపయున్న నసాధ్యము లేదని భావము.

మ. ఘనఘోషార్భటియున్ సమీరణముఖాఘాతాహితానాహత
స్వననానాసుషిరావళీఘుమఘుమవ్యాపారముం గిన్నరీ
నినదంబుం గలకంఠికారవసుధానిష్ఠ్యూతియున్ ఝర్ఝరా
ఘనినాదంబును నందుఁ గ్రందుకొనుచుం గప్పెం గకుప్పాళికన్. 47

ఘనఘోషార్భటియున్ = మేఘగర్జనయును అనియర్థము. తాళాదికాంస్య వాద్యఘోషమని యర్థాంతరము. (శ్లో. 'కాంస్యం తాళాదికం ఘనమ్' అని అ.) సమీరణ=వాయువుచేత, ముఖాఘాత=ముఖప్రదేశమందలి తాఁకుడుచేత, ఆహిత = కూర్పఁబడినదియు, అనాహత = అప్రతిహతమైనదియు నయిన, స్వన = నాదముగల, నానాసుషిరావళీ = నానావిధ బిలసమూహమందలి, ఘుమఘుమవ్యాపారమున్=ఘుమఘుమాకారమును అనియర్థము. ('సమీరణ సమ్యక్ ఈరణం సమీరమ్' అని వ్యుత్పత్తి.) అనఁగా లెస్సఁగా బలుకుచున్నదైన, ముఖ=ముఖముచేత, ఆఘాత=పూరించుటచేత, ఆహితానాహత=ఆహితమును అనాహతము నైన, స్వన=నాదముగల, నానా = నానావిధములైన, సుషిరావళీ=వంశాది వాద్యములయొక్క ఘుమఘుమవ్యాపార మని యర్థాంతరము. (శ్లో. 'వంశాదికం తు సుషిరమ్' అని అ.) కిన్నరీనినదంబున్ = కిన్నరపక్షికాంతా నినాదమును అని యర్థము. కిన్నరీవాద్యవిశేష నినాద మని యర్థాంతరము. కలకంఠికా = ఆఁడుకోయిలలయొక్క, ఆరవసుధానిష్ఠ్యూతియున్ = నాదామృత విష్ఠీవనము అనియర్థము. అవ్యక్తమధురమైన కంఠనాదముగల స్త్రీలయొక్క మధురారావమని యర్థాంతరము. ఝర్ఝరాఘనినాదంబును = విశీర్ణనదీప్రవాహనినదమును అనియర్థము. వాద్యవిశేషశ్రుత నినదమని యర్థాంతరము. అనఁగా జేగంటలనాదమనుట. (శ్లో. 'వాద్యప్రభేదా డమరు

మద్దు డిండిమ ఝర్ఝరాః' అని. అ.) (శ్లో. 'విలంబితం ద్రుతం మధ్యం తత్త్వ మోఘో ఘనం క్రమాత్' అని అ.) అందుఁ గ్రందుకొనుచుక్ = ఆకోలాహలాచలపట్టణమందు సంకులధ్వని యవుచును, కకుప్పాళికన్ = దిక్సమూహమును, కప్పెన్ = ఆచ్ఛాదించెను, అనఁగా దిక్కులన్నిటిని గ్రమ్మెననుట. (శ్లో. 'దిశస్తు కకుభః కాష్ఠాః' అని యమరము.)

మ. అగురుక్షోదపటీరభేదఘనసారామోదసంభేదము
  ల్మృగనాభిద్రవచర్చికల్ వికచమల్లీమాలికల్ కీరరా
  జగరుద్రాజివిరాజితోరణము లంచచ్చామరంబుల్ ధగ
  ద్ధగితామూల్యమణీవితానకములుం దద్భూమిఁ బొల్చెం దగన్. 48

అగురుక్షోద = అగురువృక్ష చూర్ణముయొక్కయు, పటీరభేద = చందన భేదముయొక్కయు, ఘనసార=కర్పూరపరఁటులయొక్కయు, ఆమోదసంభేదముల్ = పరిమళ మేళములని యర్థము. అగురు చందన కర్పూర మేళములని యర్థాంతరము. మృగనాభిద్రవచర్చికల్ = మృగములయొక్క నాభి రక్తపుపూఁతలని యర్థము. కస్తూరికా కర్దమ చర్చలని యర్థాంతరము. వికచమల్లీ మాలికల్ = వికాసయుక్తములైన మల్లెతీఁగెలయొక్క చాల్పులని యర్థము. వికసించిన మల్లెపూలదండలని యర్థాంతరము. కీరరాజగరుద్రాజి విరాజితోరణములు, ఉరణములు = పొండగొఱ్ఱెలు విరాజితోరణముల వరెసుండెడు రాజకీరములయొక్క ఱెక్కలచాల్పులని యర్థము. కీరరాజగరుద్రాజిసదృశవిరాజితోరణములని యర్థాంతరము. అంచచ్చామరంబుల్ = ఒప్పుచున్న చమరీమృగ సమూహములని యర్థము. వింజామరలని యర్థాంతరము. ధగద్ధగితామూల్యమణీవితానకములుక్ = ధగధగ మెఱయు విలువలేని గనిస్తోమము లని యర్థము. రత్నముల మేలుకట్టులని యర్థాంతరము. (శ్లో. 'అస్త్రీ వితాన ముల్లోచః' అని అ.) తద్భూమిఁబొల్చెందగక్=అస్థలమందు యుక్తమగునట్టులుగాఁ బ్రకాశించెను.

పర్వతమునందలి సుగంధవస్తువులగు అగురుగంధము పచ్చకప్పురము కస్తూరి లోనగు నలంకార వస్తుసమూహము నగరోచితవస్తుసమృద్ధిగా నలరారెనని భావము.

సీ. పద్మినీనవపాత్రపాలికానీతగంధరజంబు లొకవంకఁ దావు లీన
  వరవర్ణినీవర్గపరికల్పితాంగరాగవిశేష మొకచాయఁ గడలుకొనఁగ
  రంభోరుకాండోత్కరపురోముఖన్యస్త ఫలజాత మొకదెసఁబరిఢవిల్లఁ
  బూగీసుకంధరాపుంఖితక్రముకతాంబూలీదళము లొక్కపొంత నెసఁగ
తే. మిత్రకాంతాభిలక్షితారాత్రికములు
  శ్రుతిహితద్విజకామినీసుస్వరములు
  మృగవిశాలేక్షణాదత్తమృగమదములు
  బలసి యందు శుభార్థవైభవము దెలుప. 49

పద్మినీ = పద్మలతచేత, నవపాత్రపాలికా = పాలికాకారనూతనపత్రసమూహముచేత, ఆనీత= స్వీకరింపఁబడిన, గంధరజంబులు = పరిమళయుక్తములయిన పుప్పొడులని యర్థము. పద్మినీ = పద్మినీ జాతిస్త్రీలచేత, నవపాత్రపాలికా = నూతనపాత్రశ్రేణిచేత, ఆనీత = తేఁబడిన, గంధరజంబులు = గంధ పొళ్ళని యర్థాంతరము. ఒకవంకఁదావులీనక్ = ఒకవైపున వాసనలు గుప్పుఁగాను, వరవర్ణినీవర్గ = స్త్రీల

ణపుతీఁగెలయొక్క సమూహముచేత, పరికల్పిత = కల్పింపఁబడిన, అంగ = స్వకీయాకారముయొక్క, రాగవిశేషము = రక్తచ్ఛాయావిశేష మని యర్థము. ప్రేంకణపుతీఁగె లెల్లెడఁగానుండుట. వరవర్ణినీవర్గ= స్త్రీసమూహముచేత, పరికల్పిత = చేయఁబడిన, అంగరాగవిశేషము = మైపూఁతయని యర్థాంతరము. శ్లో. 'స్త్రీరత్నే చ ఫలిన్యాం చ దృశ్యతే వరవర్ణినీ' అని వి.) ఒక చాయఁగడలుకొనఁగన్ = ఒకవైపునఁ బ్రకాశింపఁగాను.

రంభా = అరఁటిచెట్లచేత, ఊరు = గొప్పలయిన, కాండ = సమూహములయొక్క, ఉత్కర = సమూహముయొక్క, పురోముఖ = అగ్రభాగమందు, న్యస్త = ఉంపఁబడిన - అనఁగా గెలవేయఁబడిన, ఫలజాతము = ఫలసమూహ మని యర్థము. రంభోరు = స్త్రీలయొక్క, కాండ = సమూహముయొక్క, ఉత్కర = ఉన్నతకరములయొక్క, పురోముఖ = అగ్రభాగమందు, న్యస్త=ఉంపఁబడిన, ఫలజాతము = నానావిధ ఫలసమూహ మని యర్థాంతరము. ఒక దెసఁబిట్టపిల్లన్ = ఒకవైపున నొప్పుచుండఁగాను, పూగీ = పోఁకచెట్లచేత, సుకంధరా = యోగ్యమయిన కంఠప్రదేశమందు, పుంఖిత = నిండింపఁబడిన, క్రముక = పోఁకచెట్లచేత, తాంబూలీదళములు = తమలపాకుతీఁగెలును అని యర్థము. అనఁగా పోఁక చెట్లును దమలపాకులతీఁగెలును మెలఁగి యున్నవనుట పూగీసుకంధరా = పోఁకపోఁకలవంటి కంఠములుగల స్త్రీలచేత, పుంఖిత = కూర్పఁబడిన, క్రముకతాంబూలీదళములు = పోఁకలును దమలపాకులును అని యర్థాంతరము. ఒక్కచెంతనెసఁగెన్ = ఒకవైపున నతిశయింపఁగాను,

మిత్రకాంత = సూర్యకాంతములచేత, అభిలక్షిత = కనుఁగొనఁబడిన, ఆరాత్రికములు = రాత్రి భావముగల సమయములని యర్థము. అనఁగా సూర్యకాంతమణిదీప్తులచేత రాత్రులును బగళ్ళవలె నుండుచున్నవని భావము. ఇక్కడ రాత్రి యను పదముపై బహువ్రీహియందు కప్రత్యయము. మిత్ర జనులయొక్క కాంతలచేత నివాళింపఁబడిన, మంగళ = శుభనిమిత్తములయిన, ఆరాత్రికములు = ఆరతులని యర్థాంతరము. శ్రుతిహిత = శ్రవణానందకరములయిన, ద్విజకామినీ = పక్షికాంతలయొక్క, సుస్వరములు = యోగ్యమైన కంఠనాదములని యర్థము. శ్రుతిహితద్విజ = వేదాధ్యయనపరులయిన బ్రాహ్మణోత్తములయొక్క, కామినీ = స్త్రీలయొక్క సుస్వరములు = యోగ్యమైన పెండ్లిపాటయొక్క స్వరములని యర్థాంతరము. మృగవిశాలేక్షణా = కస్తూరీమృగకాంతలచేత, దత్త = ఈఁబడిన, మృగ మదములు = కస్తూరికలని యర్థము. మృగములయొక్క నేత్రములవలె విశాలములయిన నేత్రములుగల స్త్రీలచేత నీఁబడిన మృగమదములని యర్థాంతరము. బలసి = ఈ చెప్పఁబడినవన్నియు బలిష్ఠములయి, అందున్ = ఆకోలాహలపర్వతపట్టణమందు, శుభార్థవైభవము దెలుపన్ = శుభనిమిత్తకమైన విభవమును దెలుపుచుండఁగా, ముందరిపద్యముతో నన్వయము.

గంధరజము తావులీనుట, అంగరాగకాంతులు వ్యాపించుట, అనఁటులు ఫలములతో నలరుట, పూగీతాంబూలదళము లొకచో నుండుట, ద్విజకామినీసుస్వరములు ఇవి యన్నియుం వివాహ మంగళసూచకములు. ఆయా ప్రదేశములందు సహజములగు పరికరములు కళ్యాణశుభసూచకముగా నుండెనని తాత్పర్యము.

చ. కనుఁగొని కన్నె నెచ్చెలులు • కాననదేవత లాయపూర్వశా
సనవసువాసవప్రబలసఖ్యము నాత్మమనోరథద్రుమా

తనుఫలపాకరేఖయు ముందంబున నెన్నుచుఁ బుణ్యవాహినీ
వనితలు దారు సామయికవైభవముల్ సమకూర్చునంతటన్. 50

కనుఁగొని = చూచి, కన్నెనెచ్చెలులు = గిరికాదేవియొక్క ప్రియసఖులయిన, కాననదేవతలు = వనదేవతలు, అయహార్యశాసనవసువాసవప్రబలసఖ్యముక్ = పర్వతభంజనులయి యేకకార్యధుర్యులయిన వసుభూమీంద్ర మహేంద్రులయొక్క ప్రబలమైన స్నేహమును, ఆత్మమనోరథద్రుమాతను ఫలపాకరేఖయుఁ = తమకోరికలనెడు వృక్షములయొక్క ఫలపరిణతియును - అనఁగా ఫలించుటయును, (ని. 'పలాశీద్రుద్రుమాగమాః' అని అ.) ఎన్నుచుక్ = కొనియాడుచు, ఇక్కడ నెచ్చెలులు వనదేవతలుగనుక వారికి వృక్షఫల సంబంధము స్ఫురించుచున్నది, పుణ్యవాహినీవనితలుదారు = పుణ్యనదీకాంతలును దామును, సామయికవైభవము ల్సమకూర్చునంతటక్ = సమయసంభవములయిన వైభవములను సిద్ధపఱచుచున్నమీఁదట. ముందరిపద్యముతో నన్వయము. వసురాజును దేవేంద్రుఁడును పర్వతగర్వభంజనులు. సమర్థులగు నీయిరువురిచెలిమి వనదేవతల కుత్సాహకరముగా నుండెను. కావున వారికోర్కి మ్రానులకు వీరిచెలిమి ఫలరేఖవలె నలరెను. సమయసంబంధములగు శుభవస్తువుల సంతరించి శుభకార్యములలోఁ బాల్గొనువారు పుణ్యనదీకాంతలు.

క. ఈరే యొకశుభలగ్నం, బీరే వివరించి వరుస • కింతికిఁ గుశలం
బీరే యన వాచస్పతి, యీరేడుజగంబు లేలు•నేలికఁ బలికెన్. 51

ఈరేయి = ఈరాత్రి, ఒకశుభలగ్నంబు = ఒకమంచిముహూర్తమును, ఈరేవివరించి = మీరే విచారించి, వరునకింతికిక్ = వధూవరులకు, కుశలంబీరేయనక్ = క్షేమమియ్యారే యని పలుకఁగా, వాచస్పతి = బృహస్పతి, ఈరేడుజగంబు లేలునేలికఁబలికెక్ = చతుర్దశభువనపరిపాలకుఁడయిన యింద్రునిఁ గూర్చి యొక్క వాక్యము పలికెను.

శా. సూర్యాదిగ్రహతారకాతదధిప•స్తోమంబుతో నిట్టిస
త్కార్యం బీవు భరింప శోభనముహూ•ర్తధ్యేయపుణ్యాపగా
హార్యస్వాములు పెండ్లిపెద్ద లయిరా • నస్మత్కృతాచార్యకం
బార్యప్రస్తుత మై వధూవరుల క•త్యైశ్వర్య మీఁ జాలదే. 52

సూర్యాదిగ్రహ = సూర్యుఁడు మొదలయిన నవగ్రహములతోడను, తారకా = అశ్విన్యాది నక్షత్రములతోడను, తదధిపస్తోమంబుతోక్ = ఆనక్షత్రముల కధిదేవతలయిన యశ్వినీదేవతలు మొదలైనవారితోడను, ఇట్టి సత్కార్యంబీవుభరింపక్ = ఇట్టి సత్కార్యము నీవు పూనుకొనఁగాను, శోభనముహూర్తధ్యేయపుణ్యాపగాహార్యస్వాములు = సుముహూర్తకాలమందు మహాసంకల్పములోఁ జెప్పఁబడుచున్న గంగాది పుణ్యనదులును మేరు ప్రముఖపర్వతములును, పెండ్లిపెద్దలయిరాక్ = పెండ్లికిఁ దీర్పరులైనవారై వచ్చియుండఁగాను, అస్మత్కృతాచార్యకంబు=నాచేతఁ జేయఁబడిన యాచార్యత్వము, ఆర్యప్రస్తుతమై = పూజ్యులచేత స్తోత్రము చేయఁబడినదై, వధూవరుల కత్యైశ్వర్యమీఁజాలదే = వధూవరుల కత్యంతవైభవము నియ్యఁజాలదా-అనఁగా నియ్యఁగలుగుననుట. నక్షత్రాధిపతులనిర్ణయము కాలామృతగ్రంథమునందు 3 వ శ్లోకమందుఁ జెప్పఁబడి యున్నది.

మహాసంకల్పమునందు గంగాదిపుణ్యనదులు మేర్వాదిమహాశైలములు చెప్పఁబడుచున్నవి. వీరు పెండ్లిపెద్దలుగాఁ జనుదెంచుట, సూర్యాదిగ్రహములు అశ్విన్యాదినక్షత్రములు, వానికధిపతులగు నశ్విన్యాదిదేవతలు వెంటరాఁగ నింద్రుఁడు శుభకార్యమునకుఁ జనుదెంచుట సుకృతవశమున సమకూరినవి. ఇట్టియెడ బృహస్పతిపెట్టులగ్నము స్తోత్రపాత్ర మగుటయో ఐశ్వర్యదాయక మగుటయో సంశయములేదు.

చ. అలిఘటమీనకేసరిశ • రాసనగోమకరంబులం గచం
బులఁ గుచనేత్రమధ్యముల • భ్రూకటిజంఘికలన్ జయించి ని
స్తులత నజాంగనాధికయ•శోనిధి యైనయవక్రవృత్తికిం
గలికికి నియ్యెడ న్మిథున•కల్పన యోగ్య మటంచుఁ బల్కెనన్. 53

అళి ఘటమీన కేసరి శరాసన గోమకరంబులన్ = అళియనఁగా వృశ్చికము దుమ్మెదయును (ని. 'అళి ర్వృశ్చిక భృఙ్గయోః' అని వి.) గోవనఁగా వృషభమును భూమియును, వృశ్చిక కుంభ మీన సింహ ధను ర్వృషభ మకరరాసుల నని యర్థము. కచంబులన్=తలవెండ్రుకలచేతను, కుచ = కుచముల చేతను, నేత్ర=నేత్రములచేతను, మధ్య = నడుముచేతను, భ్రూకటిజంఘికలన్-భ్రూ=కనుబొమలచేతను, కటి = నితంబోపరిభాగముచేతను, జంఘికలన్ = పిక్కలచేతను, జయించి = తిరస్కరించి యనిక్రమాలంకారము. ఇక్కడఁ గచములచేత నళిని జయించినదనఁగాఁ దుమ్మెదను జయించినదనియును గటిచేత గోవును జయించినదనఁగా భూమిని జయించినదనియును భావము. ఘటాదిపదముల కర్థద్వయము స్పష్టము. (ఇచటఁ బ్రాణ్యంగముల కేకవద్భావము చేసి కుచనేత్రమధ్యమున భ్రూకటిజంఘముమున్-అనిపాఠముఁ జేసిన బాగుగా నుండును.) నిస్తులతన్ = అనఁగాఁ దులారాశి నతిక్రమించుటచేత నని యర్థము. సమానరహితత్వముచేత ననిభావము. అజాంగనాధికయశోనిధియైన = అజమనఁగా మేషరాశియును గనుక వీనికంటె నధికురాలనెడికీర్తికి నిధియైన యని యర్థము. అజాంగనయనఁగా సరస్వతి గనుక నాయమకంటె నధికధవళమైనకీర్తికి నిధియైనదని భావము. అవక్రవృత్తికిన్ = కర్కటరాశివలె వక్రవృత్తిలేనిదాని కని యర్థము. చక్కని నడకగలదనిభావము. కలికికిన్ = ఇట్టిగొరికాదేవికి, మిథునకల్పనయోగ్య మటంచుఁబల్కెనన్ = మిథునలగ్ననిర్ణయము యుక్తమనిపలుకఁగా అనియర్థము. మిథునరాశి స్త్రీపురుషయుగ్మరూపము గనుక మిథుననామక లగ్నకల్పనయోగ్యమనియును నర్థము. ముందరి పద్యముతో నన్వయము.

శా. ఆచార్యోదితలగ్నమంగళ మహా•ర్యస్వామికిం దెల్పి యా
ప్రాచీపాలుఁడు చేదిభర్త కెఱిఁగిం•ప న్వచ్చెఁ జంచత్పతా
కాచాంచల్యము కార్యసిద్ధియు సురీ•గానంబు కల్యాణచ
ర్యాచారంబును దూర్యఘోషము వరా•హ్వానంబు సూచింపఁగాన్. 54

ఆచార్య = బృహస్పతిచేత, ఉదిత = చెప్పఁబడిన, లగ్నమంగళము = ముహూర్తరూపమైనశుభమును, అహార్యస్వామికిందెల్పి = పర్వతాధిపతియైన కోలాహలునికిఁ దెలియఁజేసి, ఆప్రాచీపాలుఁడు = తూర్పుదిక్కును బాలించునట్టి యాయింద్రుఁడు, చేదిభర్తకున్ = వసురాజునకు, చంచత్పతాకాచాంచల్యము కార్యసిద్ధియున్ = ప్రకాశించుచున్న ధ్వజపటచలనము కార్యసిద్ధియగుటను, సురీగానంబు

కల్యాణచర్యాచారంబును=దేవతాస్త్రీలయొక్క సంగీతము వివాహమంగళాచారమును, తూర్యఘోషము వరాహ్వానంబుఁ = చతుర్విధవాద్యధ్వని-అనఁగా కాంస్యతాళమృదంగవేణువీణానాదము వరునిఁ బిలుచుటకును, సూచింపఁగాఁ = సూచనసేయఁగా, ఎఱిఁగింపఁ = తెలియఁజేయుటకు - అనఁగా వివాహకార్యసిద్ధిని దెలియఁజేయుటకు, వచ్చెఁ = అరుగుదెంచెను.

అనఁగా నింద్రుఁడు వసురాజునకు వివాహకార్యము సిద్ధపఱిచి వచ్చిన లక్షణములు ధ్వజపటచాంచల్యాదులచేత సూచన సేయుచును దద్వృత్తాంతము వసురాజునకుఁ దెలియఁజేసెడుకొఱకు వసురాజునొద్దకు దేవేంద్రుఁడు వచ్చెనని తాత్పర్యము. కాలోచితయత్నము లందుటకుఁ దొలుతఁగోలాహలుని హెచ్చరింపవలసియున్నది కావున బృహస్పతిచెప్పిన ముహూర్తము దేవేంద్రుఁడు కోలాహలునకుఁ దొలుతఁ జెప్పెను. ఇచటి ప్రయత్నములు త్వరలోఁబూర్తియగునుగావునఁ జేదిభర్తవద్దకింద్రుఁడు స్వయముగా బయలుదేరెను. కేతనచలనము కార్యసిద్ధికి, వేల్పుచెలులగానము శుభాచారమునకు, మంగళవాద్యములు వరాహ్వానమునకు సూచకములుగా నుండెను.

ఉ. నిండుమనంబునన్ దనమ•నీషిత మెల్ల ఘటింప వచ్చునా
ఖండలురాక చారణము•ఖంబున మున్న యెఱింగి చేదిభూ
మండలభర్త గాంచె నతి•మాత్రముదం బది యెందుఁ జిత్రమే
కొండలు పిండి సేయుశత•కోటియుతుండు హితుండు గల్గినన్. 55

నిండుమనంబునన్ = సంపూర్ణభావముచేత, తనమనీషితమెల్ల ఘటింపవచ్చు = తనవాంఛితమంతయు సమకూర్పవచ్చిన, అఖండలురాక = దేవేంద్రునియొక్క వచ్చుటను, చారణముఖంబునన్ = చారణులముఖవచనమువలన, మున్నయెఱింగి = ఇంద్రుఁడురాకముందుగానే తెలిసికొని, చేదిభూమండలభర్త = చేదిరాజ్యాధిపతియైన వసురాజు, అతిమాత్రముదంబు = అతిశయమయిన సంతోషమును, కాంచెన్ = పొందెను. అదియెందుఁజిత్రమే = అలాగునసంతోషించుట లోకములో నాశ్చర్యమా-అనఁగా గాదనుట. ఏమనిన, కొండలుపిండిసేయు=పర్వతములను నుగ్గునుగ్గుచేసెడు, శతకోటియుతుండు= వజ్రాయుధహస్తుఁడు, హితుండుగల్గినన్ = ఆప్తుఁడుగాఁగా నని యర్థము. ఇది వెనుక కన్వయము. అసాధ్యసాధకుఁడైన శతకోటిపదార్థము గలవాఁడు హితుఁడుగాఁగా ననియు నర్థము స్ఫురించుచున్నది. దేవేంద్రునిరాక తనకార్యమును నెఱవేర్చుటకు. శుభకార్యసాధనమున కింద్రుఁడు రానున్నసంగతి ముందుగనె వసురాజు వినెనుగావున నింద్రాగమనమును వసురాజు కోరిక నెరవేర్చుటకుగా నిశ్చయించెను. కార్యసిద్ధి యచిరకాలములో నున్నదనియు నింద్రుఁడంతవాఁడు చెలికాఁడయ్యెననియు వసురాజు మిగుల నానందించెను.

తే. రత్నకూటవిహారగౌ•రవమె కాని
యెందుఁ గుసృష్టి యెఱుఁగని•యింద్రపదము
లపుడు నిజమౌళిరత్నకూ•టాగ్రసరణిఁ
గూర్చె నుచితంబుగా వసు•క్షోణిభర్త. 56

రత్నకూట = రత్నసమూహముమీఁది, విహార=సంచారమందలి, గౌరవమెకాని=ఘనతయేకాని, యెందున్=ఎప్పుడును, కుసృష్టియెఱుఁగని = కుత్సితజన స్పర్శమెఱుఁగని, ఇంద్రపదములు=దేవేంద్రుని

పాదములను అనియర్థము. ఇంద్రునిపాపములు, రత్నకూటమనఁగా మేరుపర్వతముగనుక దానియందు సంచరించునవి యని యును సుస్పష్టియనఁగా భూస్పర్శముగనుక నది యెఱుఁగనిదనియును భావము. అపుడు=ఆసమయమందు, వసుక్షోణిభర్త=వసురాజు, ఉచితంబుగాన్=కర్తవ్యమగునట్లుగా, నిజమౌళి రత్నకూటాగ్రసరణిఁగూర్చెన్ = తనకిరీటమందలి రత్నసమూహముయొక్క యగ్రభాగమందు సందర్భము చేసెను. అనఁగా రత్నకూటవిహారములగల యింద్రుపదములకు రత్నకూటవిహారమే యొసఁ గూర్చినాఁడని యర్థము. అనఁగా నింద్రునిపాదములు తనకిరీటముమీఁద సోఁకునట్లుగా నింద్రునకు వసురాజు నమస్కరించె నని తాత్పర్యము.

క. అడుగుల కెరఁగినఁ బెండిలి, కొడుకవు గమ్మనుచు నలమికొని వజ్రి ముదం
బడర నొడలెల్లఁ గన్నులు, గడలుకొనం జూచి యవనికాంతునిఁ బలికెన్. 57

అడుగులకెరఁగినన్ = పాదములకు నమస్కరింపఁగా, పెండిలికొడుకవు గమ్మనుచున్=పెండ్లి కొడుకవు గమ్మని, అలమికొని = కౌఁగిలించుకొని, వజ్రి = దేవేంద్రుఁడు, ముదంబడరన్ = సంతోష మతిశయింపఁగా, ఒడలెల్లఁగన్నులు గడలుకొనంజూచి = తన గాత్రమంతయును నేత్రమయ మగునట్టు లుగా నతిప్రీతిచేతఁ జూచి యని యర్థము. గాత్రకలిత సహస్రనేత్రుఁడని భావము. అవనికాంతునిఁ బలికెన్ = వసురాజునుగూర్చి యొకవాక్యము పలికెను. ఒడలెల్లఁ గన్నులుగాఁ జూచుటయాద రాతిశయమున నని భావము.

శ్లో. సజానే సమ్ముఖాయాతే ప్రియాణి వదతి ప్రియే
సర్వాణ్యంగాని కిం యాంతి నేత్రతా ముత కర్ణతాం.

తే-గీ. ఎల్ల చిగురాకుబోండ్లకు నెంతవేడ్క, యంతవేడుక తనలోన నతిశయిల్ల
నొక్కగుబ్బలికొమరాలు చక్కవచ్చి, కనియె నొడలెల్లఁ గన్నులై మనుజవిభుని.

శృంగారనై-ఆ. ౩.

ఉ. నిన్నటిమాపు మాపురవధీరమణీయసభావిభాగభా
గున్నతరత్నపీఠిఁ గొలువుండి సురాంగన లాడఁ గిన్నరు
ల్కిన్నర మీఁటి పాడఁ దిలకించుచు నియ్యెడ కేల రాఁడకో
మన్నిరవద్యమిత్రుఁ డని మక్కువ మీఱ నినుం దలంచితిన్. 58

నిన్నటిమాపు = నిన్నటిదినమురాత్రివేళ, మా=మాయొక్క, పురవధీ=పట్టణశ్రేష్ఠమైనస్వర్గమం దలి, రమణీయ = సుందరమైన, సభా=సుధర్మాఖ్య సభయొక్క, విభాగ = ఏకదేశమును, భాక్ =పొంది యున్న, ఉన్నత = పొడవైన, రత్నపీఠిన్ = చింతామణి రత్నమయసింహాసనమందు, కొలువుండి = కొలువుదీరికూర్చుండి, సురాంగనలాడన్ = రంభాద్యప్సరసలు నృత్యము సేయఁగాను, కిన్నరులు కిన్నర మీఁటిపాడన్ = కిన్నరులనెడు దేవయోనులు వీణావిశేషములుమీటుచు గానముసేయఁగాను, తిలకించుచున్ = విమర్శించిచూచుచు, ఇయ్యెడకేలరాఁడకో మన్నిరవద్యమిత్రుఁ డని = నాయొక్క నిర్దోషోత్కృష్టుఁడైన స్నేహితుఁ డిక్కడి కెందుచేత రాఁడాయెనో యని, మక్కువమీఱ నినుం దలంచితిన్ = ప్రేమ యతిశయింపఁగా నిన్నుఁ దలఁచితిని.

క. తల్లుబి భవదీయమానస, తలచింత యెటింగి యెంత తలఁకెనొకో నా

చెలి పేరామనిచెలికిం, గలువలచెలి కనుచు నిదుర కంటికి రామిన్. 59

తలఁచి = తలఁచుకొని, భవదీయమానసతల చింతయొఱిఁగి = నీమనఃప్రదేశమందలి విచారమును దివ్యజ్ఞానసంపత్తిచేతఁ దెలిసికొని, నాచెలి = నా స్నేహితుఁడు, పేరామనిచెలికిన్ = వసంతునికి సఖుఁడయిన మన్మథునికిని, కలువలచెలికిన్ = చంద్రునకును, ఎంతతలఁకెనొకో = ఎంత భయపడెనో కదా, అనుచున్ = అని విచారించుచు, నిదురకంటికిరామిన్ = కంటికి నిద్ర రాకపోవుటచేత అని యర్థము. దేవత లస్వప్నులని భావము. ముందరిపద్యముతో నన్వయము.

ఉ. అంబకపంచకంబుఁ గలయం బచరించుచు నంబకత్రయా
డంబరశాలిచేఁ గడు విడంబితుఁడై నయనంగుఁ డాసహ
స్రాంబకబాంధవుం జెనకి యారడిఁ బెట్టెడివాఁడె యంచుఁ జి
త్తంబునఁ దావకాంగభవతాపనివారణతత్పరుండ నై. 60

అంబకపంచకంబున్ = బాణపంచకమును, కలయంబచరించుచున్ = కలియునట్టులుగాఁ బ్రయోగముసేయుచును, అంబకత్రయాడంబరశాలిచేన్ = బాణత్రయముగలవానిచేత, కడువిడంబితుఁడైన = మిక్కిలి తిరస్కృతుఁడయిన, అనంగుఁడు = అంగరహితుఁడయిన మన్మథుఁడు, ఆసహస్రాంబకబాంధవుంజెనకి యారడిఁబెట్టెడివాఁడెయంచున్ = సహస్రబాణములుగలవానియొక్క స్నేహితునిఁ దగిలి బాధపెట్టెడువాఁడాయెనా యని తలంచుచును అని యర్థము. అంబకశబ్దము నేత్రమందును వర్తించుచున్నది గనుక హరుఁడు త్రిలోచనుఁడు దేవేంద్రుఁడు సహస్రలోచనుఁడును అని భావము. చిత్తంబునన్ = మనస్సునందు, తావకాంగభవతాపనివారణ తత్పరుండనై = నీయొక్క మన్మథతాపమును నివారించుటయందలి యాసక్తిగలవాఁడనై - ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఇందులో ననంగపదమువలన నంగరహితుఁడు గనుక దుర్బలుఁ డని సాభిప్రాయము.

మన్మథుఁడు అయిదు అంబకములు గలవాఁడు. మూఁడంబకములు కలవానిచేఁ దిరస్కరింపఁబడెను. పైగా అనంగుఁడు. అట్టివాఁడు వేయియంబకములుగలవాని చుట్టమును దార్కొని బాధపెట్టుట సాహసము. ఇందులకుఁ బ్రతిక్రియఁ గావించుటకు ఇంద్రుఁడు రానెంచెను. చేయవలసినపని యంగభవతాపనివారణము. అలం. కావ్యలింగము. ఇంద్రునిముందు మరుఁడెంత యనుటకు-

తే-గీ. మూఁడుకన్నులవానితో మోహరించి, నేఁడు దేహంబు లేకయున్నాఁడు దాను
వేయికన్నులవేల్పుతో విగ్రహించి, వనిత యింకేమి కానున్నవాఁడొ మరుఁడు.

శృంగారనైషధము.

ఉ. ప్రొద్దున వచ్చి శీతనగపుత్త్రునిఁ గన్నియ వేఁడి గట్టురా
పెద్దలఁ బుణ్యవాహినులఁ బెండ్లికి రా నియమించి నీకు న
మ్ముద్దులకన్నె నిచ్చునగముఖ్యున కొక్కపురీలలామకం
బుద్దవిడిన్ సృజించి సుముహూర్తము నేఁడె యనన్ రయంబునన్. 61

ప్రొద్దునవచ్చి = నేఁటియుదయకాలమునవచ్చి, శీతనగపుత్త్రునిఁగన్నియవేఁడి = హిమవత్పర్వతపుత్త్రుఁడయిన కోలాహలునిఁ జిన్నదానినడిగి, గట్టురాపెద్దలన్ = పర్వతశ్రేష్ఠులైన మేరుమందరాదులను, పుణ్యవాహినులన్ = పుణ్యనదులను, పెండ్లికిరానియమించి = వివాహోత్సవమునకు వచ్చునట్టులుగా

సాక్షాత్కరించి, నీకు సమ్ముద్దులకన్నెనిచ్చు నగముఖ్యునకున్ = నీకొకచక్కని కన్నెనిచ్చునట్టి కోలాహలునికి, ఒక్కపురీలలామకం బుద్దవిడిన్ సృజించి = ఒకపట్టణశ్రేష్ఠముచు శీఘ్రముగా నిర్మించి, సుముహూర్తము నేఁడెయనన్ = మంచిముహూర్తము నేఁడే యని బృహస్పతిగారు చెప్పఁగా, రయంబునన్ = శీఘ్రగతిచేత-ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

శా. గంధర్వానకదుందుభిధ్వనులతో • గంగాదిసాధ్వీరమా
బంధుశ్రీపరిణీతిగానములతో • భవ్యద్విజాశీర్వచ
స్సంధానంబులతో నగేంద్రతనయా•సాంద్రానురాగద్విప
స్కంధారూఢుని నిన్నుఁ బెండ్లికొడుకుం • గావింపఁగా వచ్చితిన్. 62

గంధర్వ = గంధర్వులచేత వాయింపఁబడునట్టి, ఆనక = నిస్సాణములయొక్కయు, దుందుభి = భేరులయొక్కయు, ధ్వనులతోన్ = నాదములతోడను, గంధర్వానకధుంధుమధ్వనులతో నని పాఠాంతరముగలదు. అప్పుడు ధుమధుమ యని యానకధ్వని కనుకరణ మగుచున్నది. గంగాది = మందాకిని మొదలయిన, సాధ్వీ = పుణ్యాంగనలయొక్క, రమాబంధు శ్రీపరిణీతి గానములతోన్ = లక్ష్మీనారాయణులయొక్క పెండ్లిపాటలతోడను, భవ్యద్విజాశీర్వచస్సంధానంబులతోన్ = యోగ్యులయిన బ్రాహ్మణులయొక్క యాశీర్వాదసంఘటనములతోడను, నగేంద్రతనయా = గిరికాదేవియందలి, సాంద్రానురాగ = దట్టమైన యనురాగమనెడు, ద్విపస్కంధారూఢుని నిన్నున్ = ఏనుఁగునెక్కిననిన్ను, ఇక్కడఁ బెండ్లికొడుకులకు విహితమైన శ్వశురగృహాగమనకాలకర్తవ్యమైన గజారోహణమును సూచించినాఁడని స్వారస్యము గ్రహింపవలెను. దీన ముద్రాలంకారము చెప్పఁబడియెను. పెండ్లికొడుకుం గావింపఁగా వచ్చితిన్ = పెండ్లికొడుకును జేసెడునిమిత్తము వచ్చినాను.

దుందుభిధ్వనులు సాధ్వీగీతములు ద్విజాశీర్వాదరావములు వివాహశుభలక్షణములు. శ్వశురగృహాగమనము కర్తవ్యము. ద్విపస్కంధారూఢుఁడై యరుదెంచుట శ్రుతివిహితముగాన నటులఁ జనుదెమ్మను స్వారస్యము గ్రాహ్యము.

చ. అనిన మహేంద్రు నానతి ము•ఖానతిఁ గాంచుమహీమహేంద్రు నె
మ్మనము నవంబుగా నెఱిఁగి • మంత్రిపురోహితదండనాథశా
సనధరు లాక్షణంబ శుభ•సంభ్రమసన్నహనానులాపముల్
మొనపఁగ నమ్మహానగర•ముం గయిసేయఁగఁ బంచి రెంతయున్. 63

అనిన మహేంద్రు నానతిన్ = ఈలాగనిపలికిన దేవేంద్రుని యనుమతివలన-ఇక్కడ నానతి యనెడుపద మాజ్ఞప్తిశబ్దమునకుఁ దద్భవము. ముఖానతిగాంచుమహీమహేంద్రు = ముఖానతియనఁగా సిగ్గుచేత ముఖమువంచుట గనుకఁ దల్క్రియనుబొందిన ధరాపురందరుఁడయిన వసురాజుయొక్క-ఇక్కడ నానతివలన నానతిఁ గాంచెననియును మహేంద్రునకు వసురాజు ప్రతిమహేంద్రుఁడని యఁను జమత్కారము గ్రహింపవలయును. నెమ్మనము నవంబుగా నెఱిఁగి = మనస్సు సరసమగుటను గ్రహించి, మంత్రి పురోహిత దండనాథ శాసనధరులు = మంత్రులును బురోహితులు సేనానాయకులును వాఙ్మాధారకులును, ఆక్షణంబ = ఆక్షణమే, శుభ = శుభకార్యప్రయుక్తమైన, సంభ్రమ = అత్యాశ్చర్యముతోఁ గూడుకొన్న, సన్నహన = ప్రయత్నమందలి, అనులాపములు = మహాంద్యాషణములు-అనఁగా

మాటిమాటికిని జెప్పఁబడెడువాక్యములు, మొనపఁగన్ = ప్రకటమగునట్టులుగా, అమ్మహానగరముఁ గయిసేయఁగఁ బంచిరెంతయున్ = ఆ యధిష్ఠానమనెడు మహాపట్టణమును శృంగారించుకొఱకు, పుర జనుల కందఱకు నాజ్ఞాపించిరి.

వసురాజు మహీమహేంద్రుఁడు. అట్టిచో మహేంద్రునిగాంచి తలవంచుట సిగ్గుపెంపుననని భావము. రాజు తలవంచుటచే నంగీకారము తెలిపెను. జరుగవలసినది నగరాలంకరణము. కావున శాసనధరులా కార్యము సంభ్రమము, సన్నహనము, అనులాపములు మొనపుచుఁ బరిజనుల కాజ్ఞాపించిరని భావము.

సీ. పన్నిరి మేరువు • ల్బహుసంఖ్యలకొలంది చంద్రసూర్యాకల్ప•శతముతోడ
నాటిరి హరిచంద•నగంబు లెన్నేని నధికాయమానరం•భాళితోడ
సవరించి రింద్రర•త్నవితానములు పెక్కు వజ్రకూటప్రభా•వలులతోడ
నిలిపిరి చిత్రరే•ఖలచాలు మితి మీఱ నతులహేమాకృతి•ప్రతతితోడఁ
తే. గట్టి రగణితపుండరీ•కవ్రజంబు, తగునెడ ననంతకుముదసం•తతులతోడ
వాసవపురస్థితానేక•వస్తుమహిమఁ, జూచి వాసవపురివారు • చోద్యమంద. 64

చంద్రసూర్య = చంద్రసూర్యులనెడు, ఆకల్పశతముతోడన్ = అసంఖ్యాలంకారముతోడను, బహుసంఖ్యలకొలంది = అసంఖ్యములుగాను, మేరువులు = మేరుపర్వతములను, పన్నిరి = అమర్చి రని యర్థము. చంద్రసూర్యరూపచిహ్నములను సారువులకు బన్నిరనిభావము. అధికాయమాన = అధికమగు నట్టులుగా నాచరించుచున్న-అనఁగా నసంఖ్యమైన, రంభాళితోడన్ = రంభానామకలైన యప్సరస్త్రీ సమూహముతోడను, ఎన్నేనిన్ = అసంఖ్యములయిన, హరిచందననగంబులు = హరిచందనసంజ్ఞగల దేవతావృక్షములను, నాటిరి = పాదుకొలిపి రని యర్థము.

అధికాయమాన = కాయమానమనఁగాఁ బందిలి, పందిళ్లనుమించిన, రంభాళితోడన్ = కదళీ వృక్షములతోఁగూడను, హరిచందననగంబు లనఁగాఁ బీతచందనవృక్షములను నాటిరని భావము. (ని. 'హరిచందన ముఖ్యాతం గోశీర్షే సురపాదపే' అని వి.) వజ్రకూట ప్రభావలులతోడన్ = వజ్రాయుధసమూహములయొక్క కాంతిసముదాయములతోడను, ఇంద్రరత్నవితానములు పెక్కు = ఇంద్రనీలసమూహములను దఱుచుగా సవరించిరి = కుదురుకొలిపి రని యర్థము. వజ్రమణి సమూహ కాంతులతో నీలములుగూర్చిన వితానములు-అనఁగా మేలుకట్లు తఱుచుగాఁ గట్టిరని భావము. (ని. 'వజ్రో స్త్రీహీరకే పవౌ' అని అ.) అతుల = సమానరహితమయిన, హేమాకృతిప్రతతితోడన్ = హేమాభిధాన లగునప్సరస్త్రీసమూహముతోడ, మితిమీఱన్ = అధిక మగునట్టులుగా, చిత్రరేఖల చాలు = చిత్రరేఖానామకాప్సరస్త్రీలయొక్క పంక్తిని నిలిపిరని యర్థము. కాంచనపుఁ బ్రతిమలను జిత్రపటములను నిలిపినారని భావము.

అనంత = అపరిమితమయిన, కుముదసంతతులతోడన్ = కుముదనామక దిగ్గజసమూహములతోడను, తగునెడన్ = ఉచితస్థలమందు, అగణిత పుండరీకవ్రజంబు = అసంఖ్యపుండరీకనామక దిగ్గజ సమూహమును, కట్టిరి = బంధించిరనియర్థము. కుముదములనఁగాఁ దెల్లగలువలును, పుండరీకములనఁ గాఁ దెల్లదామరలును గనుకఁ దెల్లగలువలను దెల్లదామరలను దోరణములుగాఁ గట్టిరని భావము.

యేలాగుననినన, వాసవపురస్థితానేకవస్తుమహిమఁ జూచి = వసురాజు సంబంధమయిన పట్టణమందున్న వస్తువులయొక్క మహత్త్వమును జూచి, వాసవపురివారు చోద్యమందక్ = స్వర్గపురసంబంధులయిన వారు. అనఁగా దేవతలు ఆశ్చర్యమును బొందునట్టులుగా అని సంబంధము. అనఁగా నధిష్ఠానపురమును స్వర్గపురమును వాసవప్రకములయినప్పటికిని మేడవు మొదలయిన వస్తువులయొక్క యనేకత్వముచేత నధిష్ఠానపురము స్వర్గనివాసుల కాశ్చర్యకరమాయె ననుట. ఈ భావార్థములయందుఁ జెప్పఁబడిన ప్రకారముగా నధిష్ఠానపురమును శృంగారించిరని ఫలితార్థము. అలం. అతిశయోక్తి - కావ్యలింగము.

చ. పరిణతదివ్యగంధఫల• భారనమత్కదళీపరంపరా
పరివృతకాయమానములఁ • బర్వుఫలావళిఁ జూచి పైపయిం
బరిగొని వచ్చురాజశుక•పంక్తులచొప్పున నొప్పె నప్పు డ
ప్పురవిపణిప్రఘాణముల • భూరిహరిన్మణితోరణావళుల్. 65

పరిణత = కాలపక్వమైన, దివ్యగంధ = యోగ్యపరిమళముగలిగిన, ఫల = పండ్లయొక్క, భార = బరువుచేత, నమత్ = వంగుచున్న, కదళీపరంపరా = అరఁటిచెట్లయొక్క చాల్పులచేత, పరివృత = ఆవరింపఁబడిన, కాయమానములన్ = పందిళ్ళయందు, పర్వు = ప్రేలుచున్న, ఫలావళిఁజూచి=పండ్లగెలలను జూచి, పైపయింబరిగొనివచ్చు = మీఁదమీఁదఁ జాల్పుగట్టివచ్చుచున్న, రాజశుకపంక్తుల చొప్పునన్ = రాచిలుకలయొక్క చాల్పులా యేమి యన్నట్టులుగా, అప్పుడు = అశృంగారించినసమయమందు, అప్పురవిపణిప్రఘాణములన్ = ఆ పట్టణపుటంగడులయొక్క బహిర్ద్వారగృహములయందు, భూరిహరిన్మణితోరణావళుల్ =అనేకములైన మరకతమణితోరణములు, ఒప్పెన్ = ప్రకాశించుచుండెను. అనఁగా నాయధిష్ఠానపురమందలి యంగడులముందరి చోపాలయందుఁ బందిళ్ళువేసి పండ్లగెలలతోనున్న యరఁటిచెట్లు నిలిపి వానిమీఁద మరకతమణితోరణములు గట్టఁగా నవి యేలాగుననుండెననిన నా యరఁటి పండ్ల నిమిత్తముగా బారుగట్టుకొని వచ్చినిలిచిన రాచిలుకచాల్పులో యన్నట్టులుగా నుండెనని తాత్పర్యము. ప్రఘాణశబ్దమునకు (ని. 'ప్రఘాణప్రఘణాళిందా బహిర్ద్వారప్రకోష్ఠకే' అని యమర నిఘంటువు.) అలం. ఉత్ప్రేక్ష.

పందిరులందు శుభసూచనార్థము కదళీతరువులను గట్టిరి. వానికి దివ్యగంధముగల పరిణత ఫలములు గలవు. ఫలభారముచేఁ దరువులు వంగి గ్రహణయోగ్యముగ నుండెను. దివ్యసుగంధము గావున ఫలముల తావి దూరము వ్యాపించెను. రామచిలుకలు గుంపులుగా పరుగునవచ్చుట ఫలసుగంధ మాఘ్రాణించియే. మరకతతోరణములు ఫలగ్రహణార్థము వచ్చిన చిలుకగుంపువలె నుండెనని ఫలితార్థము.

చ. పసిఁడికురుంజులన్ మెలఁగు•బంగరుబొమ్మలఁ జూచు దేవతా
ప్రసవసుగంధులన్ ధ్వజప•రంపరఁ బిల్చి వివాహవీటికా
విసర మొసంగ నెత్తువసు•వీరపురేందిర బోహులో యనన్
లసదహివల్లికావృతఫ•లక్రముకంబులు నాఁటి రెల్లెడన్. 66

పసిఁడికురుంజులన్ మెలఁగు = బంగారుమంచెలమీఁద సంచరించుచున్న, బంగరుబొమ్మలఁజూచు = బంగారపుఁగీలుబొమ్మలను వింతఁగాఁ జూచుచున్న, దేవతాప్రసవసుగంధులన్ = దేవతాస్త్రీలను,

ధ్వజపరంపరఁబిల్చి = కేతనపటాంచలములచేతఁ బిలిచి, వివాహవీటికావిసరమొసంగన్ = పెండ్లి తాంబూలము లిచ్చెదుకొఱకు, ఎత్తు = మీఁదికెత్తిన, వసువీరపురేందిర = వసురాజపురలక్ష్మియొక్క, బాహులోయనన్ = భుజదండములో యన్నట్టులుగా, లసత్ = ఒప్పుచున్న, అహివల్లికా = నాగవల్లీ లతలచేత - అనఁగాఁ దమలపాకుతీఁగెలచేత, (ని. 'తాంబూలవల్లీ తాంబూలీ నాగవల్ల్యపి' అని అ.) ఆవృత = ఆవరింపఁబడిన, ఫల = ఫలసహితములైన, క్రముకంబులు = పోఁకచెట్లను, ఎల్లెడన్ = అంతటను, నాఁటిరి = పాదుకొలిపిరి. కురుజులన బురుజులని లోఁగడవ్యాఖ్యాతలు వ్రాసిరి గాని యీ యర్థమున్నటులఁ గానరాదు. ఎత్తైనమంచెలను కురుంజులందురు.

ఉ. అప్పుడు వారు తీర్పరుల నందులకున్ సమకూర్ప జాళువా
యొప్పులకుప్పలై మెఱయుచుండెడిమేరువులున్ గురుంజులున్
జప్పరముల్ వితానములు సర్వము నాయితపెట్టి. విజయవిలాసము - ఆశ్వా. ద్వి.

మందిరములముందు నాఁటిన యున్నతములగు పోకమ్రాకులు పురలక్ష్మిబాహువులవలెను, పోకలతో నలరుచున్న తమలపాకుదీవియలయాకులు పెండిలికరుదెంచు వేలుపుఁబూవుబోండ్లకొసంగు తాంబూలము వలెను, గాలికిఁగదలు టెక్కెములు దేవకాంతలఁ బిలుచునట్లును నలరారెనని భావము. వేలుపుఁ జెలువలు మంచెలపైనున్న విగ్రహములను దిలకించుటకు వచ్చిరి. చేరువకు వచ్చినవారిని నాహ్వానించుట ధర్మము. ధ్వజము లాపని యొనరించునవి. వివాహావసరముగావునఁ దాంబూలము లొసంగుట యవసరముగాన నవి నాగవల్లీలతాలింగితక్రముకవృక్షము లొనర్చినవి.

చ. హిమసలిలాభిషిక్తయును • హేమపటావృతయుం బటీరకుం
కుమరసలిప్తయుం గుసుమ•గుంభితయు న్నవధూపధూమసం
భ్రమపరిజృంభమాణశిఖి•బర్హశిరోజయు నై యొసంగె భూ
రమణపురాధిదేవత హి•రణ్మయదర్పణదీప్యమాన యై 67

ఈ పద్యములోఁ బురాధిదేవత యని చెప్పినాఁడు గనుక స్త్రీలింగ స్వారస్యముచేత స్ఫురింపఁ బడుచున్న నాయికాపరముగా రెండవయర్థము చెప్పఁబడుచున్నది. ఎట్లనిన,

హిమసలిలాభిషిక్తయును = అనఁగా శీతోదకములచేతఁ దడుపఁబడినదని పట్టణపరమైన యర్థము. పన్నీటిచేత స్నానము సేయింపఁబడినదని నాయికాపరమైన యర్థము. హేమపటావృతయున్ = కనకవస్త్రములచేత నావరింపఁబడినదని యర్థము. కనకపీతాంబరము గట్టుకొన్నదని యర్థాంతరము. పటీరకుంకుమరసలిప్తయున్ = శ్రీచందన కుంకుమ రసములచేతఁ బూయఁబడినదియును, కుసుమగుంభితయున్ = పుష్పములచేతఁ గూర్పఁబడినదియును అని యుభయత్రసమము. నవ = నూతనమైన, ధూప ధూమ = కృష్ణాగరుధూప ధూమముచేత లక్షితమగుచున్న మేఘమందలి, సంభ్రమ = ఆదరముచేత, పరిజృంభమాణ=విస్తీర్ణములగుచున్న, శిఖిబర్హశిరోజయున్ = శిరోజములవలె నుండెడు నెమిలిపింఛములు గలదని యర్థము. నవధూపధూమార్థమయిన యాదరముచేత విస్తీర్ణములైనదియు శిఖిబర్హసదృశములైన శిరోజములు గలదనియు నర్థాంతరము. ఐ=అయినదై, భూరమణపురాధిదేవత = వసురాజుయొక్క పట్టణాధిదేవత, హిరణ్మయదర్పణ దీప్యమానయై = గోడలయందుఁ గూర్పఁబడిన సువర్ణమయదర్పణముల చేతఁ బ్రకాశమానమయినదై యని యర్థము. ఆవలోకనార్థమై తేఁబడిన కాంచనదర్పణమ-

ప్రతిబింబించిన రూపముచేతఁ బ్రకాశించినవై యని యర్థాంతరము. ఎసఁగెన్ = ఒప్పినదాయెను.

అనఁగా వసురాజుయొక్క పట్టణము చల్లనినీటిచేత సంతటఁ దడుపఁబడినదియును సువర్ణమయములైన ధ్వజపటములచేత నావరింపఁబడినదియును శ్రీచందన కుంకుమరసములచేతఁ బూయఁబడినదియుఁ బుష్పమాలికలచేత నలంకరింపఁబడినదియుఁ గృష్ణాగరుధూపధూమములు గలుగుచుండఁగా, వాని యందలి మేఘభ్రాంతివలన నటించు నెమిళ్ళచేత విప్పఁబడినపింఛములు గలదియు గోడలయందుఁ గూర్పఁబడిన సువర్ణమయదర్పణములు గలదియునై ప్రకాశించె నని తాత్పర్యము. అలం శ్లేషము.

ఉ. కాంచనపత్రికావళులఁ • గౌతుకసూచకవాచికంబు వ్రా
యించి సమస్తదేశవసు•ధేశుల కంపిన వారు మౌళి సం
ధించి సువర్ణపట్టభృతి • నేఁడు గదా మన కంచుఁ దెచ్చి ర
భ్యంచితపత్రయోగ్యనవ•హాటకపుష్పఫలోపహారముల్. 68

కాంచనపత్రికావళులన్ = బంగారుపుటాకులయందు, కౌతుకసూచక = వివాహసూచకమైన, వాచికంబు = సందేశవాక్యమును, (ని. 'సందేశవాగ్వాచికం స్యాత్' అని అ.) వ్రాయించి = లేఖనముచేయించి, సమస్తదేశవసుధేశులకంపినన్ = సమస్తదేశముల రాజులకును బంపఁగా, వారు మౌళి సంధించి = ఆరాజులు తలమీఁదఁ బెట్టుకొని, సువర్ణపట్టభృతి నేఁడు గదా మనకంచున్ = సువర్ణపట్టభృతి యనఁగాఁ గాంచనపట్టికాభరణంబును శోభనవర్ణయుక్త పట్టికాభరణంబును - అనఁగా రాజచిహ్నమయిన కాంచనపట్టికాభరణంబును భాగ్యసూచక వర్ణయుక్త పట్టికాభరణంబును మనకు నేఁడు గదా యని, అభ్యంచిత = మిక్కిలియునొప్పుచున్న, పత్ర = వాహనరూపమయినదియును, యోగ్యనవ హాటక పుష్పఫల=యోగ్యమయిన హాటకరూపమయినదియు, నూతనములైన పుష్పఫల రూపములైనదియుఁ నని క్రమాలంకారము. ఉపహారముల్ = కానుకలు, తెచ్చిరి=తీసికొనివచ్చిరి. అనియైనను, లేక అభ్యంచిత=ఒప్పుచున్న, పత్ర = సువర్ణమయశుభలేఖకు, యోగ్య = అర్హమగునట్టులుగా, నవ=నూతనమయిన, హాటక = సువర్ణమయములైన, పుష్పఫల=పుష్పఫల రూపములైన, ఉపహారముల్=కానుకలు, తెచ్చిరి = తీసికొనివచ్చి రని యైనను నర్థము. పత్రయోగ్యములగు నుపహారములు పుష్పఫలములు. పత్రము సువర్ణమయముగావున నుపహారములును నటులెనవహాటకమయములు. కావుననే పత్రయోగ్యములు. వివాహసందేశముగలశుభలేఖలను సమస్తదేశవసుధేశులు మౌళిదాల్చుటవలన వసురాజు సార్వభౌముఁడని తెలియును.

సీ. వైణికవల్లకీ•శ్రేణి నిమ్ముల మీఱె గాయకగాంధర్వ•గమకరేఖ
గాంధర్వగమకరే•ఖఁ బరాహతము చేసె వాంశికవంశికా•వైభవంబు
వాంశికవంశికా•వైభవం బెగ నూఁదెఁ దాళికాధరకర•తాళగరిమ
కరతాళగరిమంబు • కంచుమించుగ నొత్తె నానద్ధచటులతూ•ర్యవ్రజంబు
తే. చటులతూర్యవ్రజము నంటఁ • జరచెఁ బరిణ
యాగతదిగంతనృపతినా•గాశ్వరథప
దాతికోలాహలంబు రో•దసి నఖండ
మగుచు నాదాత్మకబ్రహ్మ • మతిశయిల్ల. 69

వైణిక = వీణవాయించువారియొక్క, వల్లకీశ్రేణిఁ = వీణాసమూహమును, గాయకగాంధర్వగమకరేఖ = గమకమనఁగా, (శ్లో. 'స్వనస్సకంపో గమకస్సచపఞ్చవిధస్స్మృతః') అని యున్నది గనుక సంగీతమందలి కంపము పేరు, గాయక = సంగీతపాఠకులైనవారియొక్క, గాంధర్వగమకరేఖ = సంగీతవిషయమైన స్వరకంపము - అనఁగాఁ గంఠనాదమందలికదలిక, ఇమ్ములమీటెఁ = ఉచితభంగిని నఖవాదము చేసెనని యర్థము. ఇక్కడ మీటఁదగినదాని మీటెనదని యానురూప్యము గాయకులగానగమకము వీణానాదములను మీటెను. అనఁగా నణఁచెననిభావము. గాంధర్వగమకరేఖఁ = అట్టి గాంధర్వగమకమును, వాంశిక = పిల్లనగ్రోవుచువాయించువారియొక్క, వంశికావైభవంబు = వేణుగానము, పరాహతముచేసెఁ = ఆహతానాహతస్వరలక్షణము-

శ్లో. 'ఆహతోఽనాహత శ్చేతి ద్విధా వాదో నిగద్యతే
సోఽయం ప్రకాశతే ఖణ్డ స్సన్తాఖణ్డో విధీయతే
తత్ర చానాహతం నాదం మునయస్సముపాసతే
గురూపదిష్టమార్గేణ ముక్తిదం నతు రఞ్జకమ్
ఆహతః కేవలం లోకరఞ్జకో భవబాధకః
శ్రుత్యాదిద్వారతః' (సంగీతశాస్త్రము)

పర = ఉత్కృష్టమైన, ఆహతముచేసెననఁగా ఖండసంజ్ఞచేఁ గేవలలోకరంజకమయినదానిఁగాఁ జేసెనని యర్థము. ఇక్కడ నాహతస్వరమైనదాని నాహతస్వరముగాఁ జేసినదని యానురూప్యము. అట్టిగాయక గాంధర్వ గమకమును వాంశికులయొక్క వేణుగానము పరాహతముచేసెననిభావము. వాంశిక వంశికావైభవంబు = అట్టివాంశికులయొక్క వేణుగానమును, తాళికాధర = తాళగాండ్రయొక్క, కర= హస్తములయందలి, తాళగరిమ = కాంస్యతాళ గౌరవము, ఎగనూఁదెఁ = నిశ్వాసమారుతముచేతఁ బూరించెననియర్థము. ఇక్కడ నూఁదఁదగినదాని నూఁదినదని యానురూప్యము. ఆవేణుగానమును గాంస్యతాళనాద మెగనూఁదెననఁగా నిలిచి కనుపడకుండఁ జేసెననిభావము. కరతాళగరిమంబు = అట్టి తాళగౌరవమును, అనద్ధ = మృదంగాదికములయొక్క, చటులతూర్యవ్రజంబు = వడిగలవాద్యధ్వని సమూహము, కంచుమించుగానొత్తెఁ = కాంస్యముమించుగ నొత్తెననియర్థము. ఇక్కడఁ గాంస్యమయినదానిఁ గాంస్యముమించుగనొత్తినదని యానురూప్యము. ఆతాళనాదమును మృదంగాదివాద్యరవము చెదరఁగొట్టెనని భావము.

చటులతూర్యవ్రజముఁ = అట్టివడిగల మృదంగాదివాద్యధ్వని సమూహమును, పరిణయాగత= పెండ్లికివచ్చిన, దిగంతనృపతి = దిగంతములయందలి రాజులయొక్క, నాగాశ్వ రథ పదాతి=ఏనుఁగులు గుఱ్ఱములు రథములు కాలిబంట్లు ననునీచతురంగబలముయొక్క, కోలాహలంబు = కలకలధ్వని, అంటఁ జరచెఁ = లెస్సగా వాయించెననియర్థము. ఇక్కడ వాయింపఁదగినదాని వాయించిన దని యానురూప్యము. ఆమృదంగాదివాద్యధ్వనులను జతురంగబలకోలాహల మడఁగఁ గొట్టెనని భావము. ఏరీతిగా ననిన, రోదసి యనఁగా భూమ్యంతరిక్షములు. ని. 'ద్యావాపృథివ్యౌ రోదస్యౌ' అని అ. రోదసిఁ =భూమ్యంతరిక్షములయందు, అఖండమగుచుఁ = సంపూర్ణమయినదై, నాదాత్మకబ్రహ్మము= శబ్దాత్మక బ్రహ్మ, అతిశయిల్లఁ = అధికమగునట్టులుగా, చతురంగబల కోలాహలధ్వని యంటఁబఱచెనని సంబంధము.

ఈపద్యము మొదటినాలుగుచరణములయందు వీణయును, గీతంబును, వేణువును, తాళంబును, మృదంగాదికమును గూడ పంచవిధవాద్యములను జెప్పినాఁడు. ఎత్తుగీతియందుఁ జతుర్విధబలమును జెప్పినాఁడు. ఈచెప్పఁబడిన భావార్థములందుఁ బూర్వవస్తువులకంటె నుత్తరోత్తరవస్తువులయందు నాధిక్య మని తెలియఁబడలయును. ఈసీసపాదములు ముక్తపదగ్రస్తములుగాఁ జెప్పంబడియెను. తొలుత వీణవాయించు గాయకులు పిమ్మట పిల్లనగ్రోవి పాడువారు వారివెనుక తాళములను బ్రయోగించువారు ఆవల వాద్యములను బ్రయోగించువారును బయలువెడలిరి. ఈ సంగీతసంకులధ్వనియంతయుఁ బెండ్లి కరుదెంచిన సమస్తరాజన్యుల చతురంగబలముల కోలాహలమునందు లీనమయ్యెను. బ్రహ్మము సర్వత్ర పెరిగి యుండునది. నాదము నటులెయుంటవలన నాదాత్మకబ్రహ్మమని చెప్పఁబడినది.

క. హరియనుమతి సప్తవ్రతి, హరిమధ్యలు దెచ్చి రరిది•హరివాణములన్
హరితశతపర్వికాఫల, హరిచందనవీటికాశుభ•భాక్షతవితతిన్. 70

హరియనుమతిన్ = ఇంద్రునియనుజ్ఞచేత, సప్తవ్రతిహరిమధ్యలు = సప్తమహర్షులయొక్క భార్యలు, అరిది హరివాణములన్ = గొప్పపళ్లెరములచేత, హరిత = పసరుపచ్చగల, శతపర్వికా = గఱికయును, (ని. 'దూర్వాతు శతపర్వికా' అని అ.) ఫల=ఫలములును, హరిచందన=పీతవర్ణచందనమును, వీటికా = పోఁకలాకులును, శుభాక్షతవితతిన్ = శుభప్రయుక్తమయిన పచ్చనీయక్షతలును, తెచ్చిరి= పట్టుకొనివచ్చిరి.

హరిశబ్దమునకు-

'హరి ర్యమా ర్కా శ్వా గ్నీందు విష్ణ్వం ద్రాంశు శుకేషు నా
వాయు భేకా హి సింహేషు కపౌ చ కపిలే త్రిషు' అని నానార్థరత్నమాలాకోశము.

చ. అకుటిలసౌమ్యమాననిల•యస్ఫురణంబును నాతిమాత్ర తా
రకపరివర్తనంబు శుభ•రాగమిళత్పదపల్లవాంకము
ద్రికయును బెంపు మీఱ నజ•సృష్టులఁ బోలినసింధుకన్యకా
ప్రకటవివాహగీతికలు • పాడిరి పుణ్యపురంధ్రికామణుల్. 71

అకుటిల = నిర్వక్రమును, సౌమ్య = రమ్యమునయిన, మాన = ప్రమాణముగల, ని = నిషాద స్వరముయొక్కయు, లయ = లయలయొక్కయు, స్ఫురణంబును = స్ఫూర్తియును అని గీతికాపర మయిన యర్థము.

నిషాదస్వరమునకు-

'శ్రుతిభ్య స్స్యు స్స్వరాషడ్జర్షభగాంధారమధ్యమాః
పఞ్చమో ధైవత శ్చాథ నిషాధ ఇతిసప్తతే'

తేషాంసంజ్ఞా స్సరిగమపధనీ త్యపరామతాః' అని లక్షణము. లయము-(శ్లో. 'తాళాంతరాను వర్తీయః కాలోసౌలయనాల్లయః' అని లక్షణము.) అకుటిలమును సౌమ్యమును మానసనిలయమునైన స్ఫురణ మని దృష్టిపరమయిన యర్థాంతరము. నాతిమాత్ర = అతిశయముగాని, తారకపరివర్తనంబు= ఉచ్చైస్స్వర సంచారమును అని యర్థము. అతిశయముగాని కనీనికలయొక్క పరివర్తనమని యర్థాం తరము. తారకశబ్ద మిక్కడఁ గనీనికాపరము. శుభరాగ = రాగవిశేషములతోడ, మిళత్ = కూడు కొన్న, పదపల్లవాంకముద్రికయును = పదపల్లవులయొక్క యంకితమును అని యర్థము. శుభ =

శుభకరమయిన, రాగ = రక్తిమతోడ, మిళత్ = కూడుకొనుచున్న, పదపల్లవాంకముద్రికయును=చరణకిసలయమందలి యంకముద్రిక యని యర్థాంతరము. అనఁగాఁ బాదవిన్యస్తదృష్టు లనుట. పెంపు మీఱన్ = అంతకంతకు మిక్కుటముగా, నిజదృష్టులఁబోలిన = తమచూపులనుబోలిన, సింధుకన్యకా=సముద్రునికొమార్తెయైన లక్ష్మీదేవియొక్క, ప్రకట = ప్రసిద్ధములయిన, వివాహగీతికలు = పెండ్లిసంబంధమయిన పాటలు, పుణ్యపురంధ్రీకామణుల్ = పుణ్యాంగనారత్నములు, పాడిరి = అనఁగా లక్ష్మీకల్యాణములు పాడిరనుట. సింధుకన్యకాశబ్దము సాభిప్రాయము.

పృథ్వీవృత్తము. సుపర్వగణికామణిస్ఫురణతోసుధారమ్యపా
త్రపాలికలతోఁ శుభార్థ మగువేలుపున్మ్రానితోఁ
నృపాలగృహసీమఁ జెందె హరిరాణి రామాసుధా
సుపాత్రతరుమాత్రవత్సురపదర్ప మల్పంబుగాన్. 72

సుపర్వగణికామణిస్ఫురణతోన్ = అప్సరస్త్రీరత్నములయొక్క స్ఫూర్తితోడ ననియర్థము. సుపర్వ = మంచికణుపులుగల, గణికా = అడవిమొల్లతీఁగెయొక్కయు, మణి = రత్నముయొక్కయు, ఇది శోభార్థమై తేఁబడెను. స్ఫురణతోననిభావము. సుధారమ్యపాత్రపాలికలతోన్ = అమృతవిశిష్టకలశములతోడ ననియర్థము. సుధయనఁగా సున్నంబును గనుక సున్నముపూసిన జాజాలమూఁకుళ్ళతోలేక కుండలవరుసతో నని భావము. శుభార్థ మగువేలుపున్మ్రానితోన్ = శుభనిమిత్తకమయిన పారిజాతవృక్షముతో ననియర్థము. కులదేవతయగు వృక్షవిశేషముతో ననిభావము. హరిరాణి = లక్ష్మీదేవి యనియర్థము. హరిరాణియనిభావము. అనఁగా నరివేణియనుట. రామాసుధాసుపాత్రతరుమాత్రవత్సురపదర్పమల్పంబుగాన్ = అప్సరఃస్త్రీలను నమృతకుంభములును బారిజాతవృక్షమునుమాత్రము గల యింద్రునిగర్వము క్షీణమగునట్టులుగా, నృపాలగృహసీమఁజెందెన్ = వసురాజుగృహమందుఁ బ్రవేశించెను.

వసురాజుగృహమందు హరిరాణిరాకడ యెక్కువచెప్పినందున నింద్రునిదర్పమడఁగెననుట. సముద్రమథనకాలమందు లక్ష్మీదేవి యింద్రుని వరింపక శ్రీమహావిష్ణువును వరించుట ప్రకటము. రామా సుధాపాత్ర, తరువులు వసురాజునకును ఇంద్రునకును సమానము. హరిరాణిచెందుటచే వసురాజు ఇంద్రుని మించిపోయెననిభావము. ఈవృత్తమునకు జ స జ స య వ గణము లుండవలయును. తొమ్మిదవయక్షరము యతిస్థానము.

ఉ. ముజ్జగ మేలువేల్పు తలుమోసలనుండి వివాహయత్నముల్
సజ్జ మొనర్ప నాతనిప్రసాద మెఱింగి సురాంగనాజనం
బజ్జగతీమహేంద్రశిరసంట నలుం గిడ బుజ్జవంబునన్
మజ్జన మార్పఁ గల్పకుసుమంబులు గూర్పఁ గడంగి రయ్యెడన్. 73

ముజ్జగమేలు వేల్పు = మూఁడులోకము లేలుచున్న దేవుఁడు-అనఁగా మహేంద్రుఁడు, తలమోసలనుండి = తలవాకిటనిల్చి, వివాహయత్నముల్ సజ్జమొనర్పన్ = పెండ్లిప్రయత్నమంతయు సిద్ధపఱచుచుండఁగా, ఆతనిప్రసాద మెఱింగి = ఆయింద్రునియొక్క యనుగ్రహాతిశయమును గుర్తెఱిఁగి,

సురాంగనాజనంబు = దేవతాస్త్రీసమూహము, ఆజ్జగతీమహేంద్రు = భూమియందు మహేంద్రుఁడయిన యావసురాజుయొక్క, శిరసంటన్ = తలయంటుటకును, నలుంగిడన్ = నలుఁగుపెట్టుటకును, ఋజ్జవంబున న్మజ్జనమార్పన్ = లాలనముచేత స్నానముచేయించుటకును, కల్పకుసుమంబులుఁగూర్పన్ = కల్పవృక్షములయొక్క పుష్పము లలంకరించుటకును, కడంగిరయ్యెడన్ = ఆసమయమందుఁ బూనుకొన్నవారైరి. జగతీమహేంద్రపదములోని మహేంద్రపదము రాజునకు నప్సరస్త్రీసేవార్హతఁ దెలుపుచున్నది.

మహేంద్రుఁడు ముజ్జగములను బరిపాలించువాఁడయ్యు వసురాజు మోసాల నాశ్రయించి వివాహయత్నములు గావించుచుండెను. వివాహము జగతీమహేంద్రునిది. కాన నింద్రప్రసాదము గుత్తకుఁగొనిన సురాంగనలు రాజున కుచితసేవలు గావింపసాగిరి. ఇంద్రు నియంతవాఁడు పెండ్లిపెత్తనము చేయుచుండ నింద్రానుగ్రహపాత్రలగు నప్సరఃస్త్రీలు వివాహోచిత రాజసపర్య గావించుటలో విశేషము లేదనిభావము.

మొగసాలరూపాంతరము మోసల. మోసలయనుటకు-

'మో, సలఁ గొల్చె తలవంచి ఖిన్నుఁడయి చాంచల్యంబుతో నుండఁగన్.' మను. తృతీ.

సీ. ఈరాజుఁ గరమొప్పఁ జేరి సేవలుసేయఁ దటితారసిలెఁ గదే తారయనుచు
రాజమాత్రుఁడె ధరేంద్రస్వామి యితనిపై నంటుమైనంటు మేనకయటంచు
నీసర్వమంగళావాసుని శిర సంట శశిరేఖ నీన షోజాణ వనుచుఁ
గమనీయగతిఁ దిలోత్తమనేర్పుఁ గాక నూనియ యంట నెవ్వారు నేర్తనుచుఁ
తే. బరమవసూపంవహాసలీలఁ బరిఢవిల్ల
రత్నమంజరి నీవ నేర్పరి వటంచు
నతిచటులచాటుచతురోక్తు లాడుకొనుచుఁ
గదిసి తత్కాలమున శుభాక్షతము లునుప. 74

ఈ పద్యమందు నప్సరసలు తమలోఁ దాము చతురవాక్యము లాడుకొనుచు వసురాజునకు సేవ సేయ నారంభించిరని చెప్పినాఁడు. ఏలాగనిన,

తార = అనఁగా నొకయప్సరసయును నక్షత్రంబును గనుకఁ దారయనెడు పేరుగల యోమగువా, ఈరాజున్ = ఈ వసురాజును, కరమొప్పఁజేరి = మిక్కిలి యొప్పిదమగునట్టులుగా సమీపించి, సేవలుసేయన్ = పరిచర్యలుసేయుటకు, తటితారసిలెఁ గదే = సమయము తటస్థమాయెను గదా, అనుచున్ = అని పలుకుచును అనియర్థము. తార=ఓనక్షత్రమా, ఈరాజున్ = ఈచంద్రుని, కరమొప్పఁజేరి = కరమనఁగాఁ గిరణంబును గనుకఁ గిరణప్రసారణముచేత నొప్పునట్టులుగాఁజేరి, అని యీయర్థమందు కరమన్నశబ్దము తృతీయచెప్పి యన్వయింపవలయును. సేవలుసేయఁ దటితారసిలెఁగదే యని యర్థాంతరము.

మేనక = అనఁగా నొకయప్సరసయును హిమవంతునిభార్యయైన మేనకాదేవియును గనుక మేనక యనుపేరుగల యోమగువా, ధరేంద్రస్వామి=భూమీంద్రశ్రేష్ఠుఁడయిన యావసురాజు, రాజమాత్రుఁడె = సామాన్యపురాజులవంటివాఁడా-అనఁగా రాజాధిరాజుగదా యనుట, ఇతనిపై = ఈయువ

శరీరమును, నంటుమైన్ = గారాబముచేత, అంటు = చమురంటుము. ఇక్కడఁ బ్రార్థనార్థక మువర్ణకము రాదయ్యె. అటంచున్ = అని పలుకుచు అని యర్థము. మేనక=ఓ మేనకాదేవీ, ధరేంద్రస్వామి=పర్వత శ్రేష్ఠుఁడైన హిమవంతుఁడు, ఇతనిమై = ఇతనిశరీరమును, నంటుమైనంటు = ప్రేమచేతను హత్తుకొనుము అని యర్థాంతరము.

శశిరేఖ = అనఁగా నొక యప్సరసయును చంద్రరేఖయును గనుక శశిరేఖయనెడు పేరుగల యోమగువా, ఈసర్వమంగళావాసుని శిరసంటన్ = సకలశుభాస్పదుఁడయిన యీవసురాజుయొక్క తలయంటుటకు, నీవపోజాణ వనుచున్ = నీవేసుమా చమత్కారముగలదానవు అని పలుకుచు అని యర్థము. శశిరేఖ=ఓ చంద్రరేఖా, ఈ సర్వమంగళావాసుని = సర్వమంగళయనఁగాఁ బార్వతి గనుక నామెను వామాంగమందు వహించిన హరునియొక్క, శిరసంటన్ = శిరస్సునంటియుండుటకు నీవేతగిన దాన వని యర్థాంతరము.

కమనీయగతిన్ = ఒప్పిదమగునట్టులుగా, నూనియయంటన్ = నూనెయంటుటకు, తిలోత్తమ నేర్చుఁగాక=తిలోత్తమయనఁగా నొకయప్సరసయును నుత్తమతిలలుగలదియు గనుకఁ దిలోత్తమయను పేరు గల యప్సరసయే నేర్చుఁగాక, ఎవ్వరునేర్తురనుచున్ = మఱియెవ్వరు నేర్తు రనిపలుకుచును అని యర్థము. ఉత్తమతిలలుగలదే నేర్చుఁగాక మఱెవ్వరు నేర్తు రని యర్థాంతరము. రత్నమంజరి=అనఁగా యప్సరసయును మణిగుచ్ఛమును గనుక రత్నమంజరి యను పేరుగల యోమగువా, పరమ = అంగీకార మగునట్టులుగా, వసుసంవహనలీలఁబరిఢవిల్లన్ = వసురాజుయొక్క శరీరమర్దన క్రియచేత విలసిల్లుటకు, నీవనేర్పరివటంచున్ = నీవేనేర్పుగలదానవని పలుకుచును అని యర్థము. ఓమణిగుచ్ఛమా యుత్కృష్ట కాంచనవహనముచేత విలసిల్లుటకు నీవేతగినదాన వని యర్థాంతరము. వసుశబ్ద మిక్కడఁ గాంచన పరము. ఈలాగున, అతిచటుల = అత్యంతసమర్థములైన, చాటు = ఆదరపూర్వకములైన, చతురోక్తు లాడుకొనుచున్ = చాతుర్యపుమాటలాడుకొంచును, కదిసి = సమీపించి, తత్కాలమునన్ = ఆ వసు రాజు నొసటియందు, శుభాక్షతములునుపన్=శుభప్రయుక్తమయిన పచ్చనియక్షత లుంపఁ గాను.

పద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఈ పద్యమం దప్సర స్త్రీనామములైన తారాది పదములు నక్షత్రాద్యర్థాంతర వాచకములును గనుక నర్థద్వయమునకును అభేదాధ్యవసాయముచేసి యనురూపవ్యాపారముచేయవలసినదిగాఁ జెప్పినాఁడు గనుక నతిశయోక్త్యనుప్రాణితమైన సమాలం కారము.

చ. తఱు లరనిక్కఁ బూఁతనెఱితావియ చిక్క నపాంగమాలికల్
మెఱుఁగులు గ్రక్క నూరుపుల మేలిమిఁ దేఁటులు చొక్క హారముల్
కుఱుచలు ద్రొక్క ముంగురులు గ్రొంజెమటం బద నెక్క వేలుపుం
దెఱవ రొకర్తు చేదిజగతీపతికిన్ శిర సంటె వేడుకన్. 75

తఱులరనిక్కన్ = తఱులనఁగా గడుపుమీఁది మడతలుగనుక నవిసగపాలుపైనిక్కఁగాను, పూఁత నెఱితావియ చిక్కన్ = మైపూఁతయొక్క నిండుపరిమళముమాత్రమే శేషింపఁగాను - అనఁగా గంధపుఁబూఁతరాలిపోఁగా నభిప్రాయము. అపాంగమాలికల్ = క్రేఁగంటిచూపులు, మెఱుఁగులు గ్రక్కన్ = కాంతులు వెదచల్లఁగాను, ఊరుపుల మేలిమిన్ = నిశ్వాసమారుతముల యొక్క వాసనా

సౌష్ఠవముచేత, తేఁటులుంబోక్కన్ = తుమ్మెదలు పారవశ్యమును బొందఁగాను, హారములుక్కుబు చలుద్రోక్కన్ = ముక్తాహారములు తుంపెసలాడఁగాను, ముంగురులు క్రొంజెమటం బదనెక్కన్ = నొసటిపై ముంగురులు క్రొత్తచెమటచేతఁ దడియఁగాను, వేలుపుంజెలువయొక్కర్తు=అప్సరస యొక్కతె, చేదిజగతీపతికిన్ = చేదిభూపతియైన వసురాజునకు, వేడుకన్ = వేడుకచేత, శిరసుంబెన్ = తల యంటెను.

వసురాజును పీఠముపైఁగూర్చుండఁబెట్టి యొకవేలుపుముగుద తలయంటెను. తలయంటువారించుక యెత్తుగనుందురు గావున మేనువంచియంటుటచే వళులు సగముగా నలిగెనని భావము. రాజును దాఁకుటచే వేలుపుఁజెలువకు మేనుపులకించెను. దాని గంధము రాలిపోయి తావిమాత్రము మిగిలెను. తలయంటు టచే హస్తాదులచలనమువలన గుబ్బలపైనున్నహారము లెగిరిపడుచుండెను. అందుచేఁ గుఱుచలుగా హారములు కనిపింపసాగెను. ఇటులే నిశ్వాసస్వేదాదులు గ్రాహ్యములు.

సీ. భ్రమరకంబుల చిక్కు • వాపవే యన నింక భ్రమరకంబులచిక్కు • వాయుననుచుఁ
బృథులకుచంబు లు•బ్బింపకే యనఁ బృథుల కుచప్రకాశ కా•లం బటంచుఁ
గరఁగెఁ బో వరతిల•కం బన సుస్నేహకలనఁ గరఁగు వర•తిలక మనుచుఁ
గడు మొరయింపకే•కటకంబులనమ్రోయుఁగటకములుభయత్న•గరిమ ననుచుఁ
తే. జెలిపలుకుఁ గేరడించుచుఁ ( జికిలిగోళ్ల
సొగసుసోఁకులఁ గళలు నిం•చుచు మెఱుంగు
ముంగురులు గూడ దువ్వను • ముడికిఁ దార్చి
మజ్జనపువేళ తడ వేల • మహిప యనుడు. 76

ఇటఁ గవి తలయంటుచెలువకును నాయకుచెలికత్తెకును గలుగు చతురోక్తి ప్రత్యుక్తిని జెప్పు చున్నాఁడు.

భ్రమరకంబులచిక్కు వాపవేయనన్ = భ్రమరకములనఁగా ముంగురులును దుమ్మెదలును గనుక ముంగురులచిక్కు విడదీయవేయని చెలికత్తెపలుకఁగా, ఇంక భ్రమరకంబులచిక్కు వాయు ననుచున్ = ఇఁకమీఁద ముంగురులచిక్కు వీడిపోవుచున్నది యని పలుకుచు అని యర్థము తుమ్మెదలవలని విరోధ మిఁకమీఁద వీడిపోవుచున్న దని యర్థాంతరము. పృథు = గొప్పలయిన, లకుచంబులు=నిమ్మపండ్లు, (ని. 'లకుచో లికుచో డహుః' అగ అ.) ఉబ్బింపకేయనన్ = పట్టియొత్తకే యని యనఁగా, పృథుల కుచప్రకాశ కాలంబటంచున్=పృథువులైన కుచములయొక్క ప్రకాశకాలమే యిది యని పలుకుచు నని యర్థము. అభ్యంజనకాలమందుఁ దలకు నిమ్మపండ్లరసము పెట్టుటగలదు. పృథులములైన కుచముల యొక్క ప్రకాశకాలమే యిదియని యర్థాంతరము. వలపుగొన్నచెలువలకు స్పర్శమాత్రమున గుబ్బ లుబ్బుట సాజము కావున అచ్చరపొలంతికి నటులె గుబ్బలుబ్బుచూఁడఁ జెలులు పరిహాసింపసాగిరని భావము. గుబ్బలుబ్బుసూపుటకు-

శా. "ప్రాంచద్భూషణబాహుమూలరుచితో పాలిండ్లు పొంగారి పై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప" మను. ద్వి.

శ్లో. "మో క్తుం నైవేచ్ఛతి కుచపటీ మాత్మ నానైవఖిన్నా." బిల్హణీ.

శ్లో. "ప్రాగుత్తుంగఘనస్తనాంగణగళచ్చారూత్తరీయాంచలా" ఉద్భట.

కరఁగెఁబో పరతిలకంబనన్ = వరమనఁగాఁ గుంకుమ, (ని. 'వరం కాశ్మీరజంమతమ్' అని ఆ.) వరుఁడనఁగాఁ బురుషుఁడును-అనఁగాఁ బెండ్లికొమారుఁడును, పరతిలకంబు=కుంకుమతిలకము, కరఁగెఁబో= కరఁగిపోయినదిసుమీ, అనన్ = అని పలుకఁగా, సుస్నేహకలనన్ = స్నేహమనఁగాఁ దైలంబును విశ్వాసంబును మంచితైలస్పర్శచేత, కరఁగుపరతిలకమనుచున్ = కుంకుమతిలకము కరఁగుచున్నది యని పలుకుచును అని యర్థము. విశ్వాసముచేత వరశ్రేష్ఠుఁడు కరఁగుచున్నాఁడని యర్థాంతరము. కడు మొరయింపకేకటకంబులనన్=కటకములనఁగా గాజులును బాదవలయములును గనుక, గాజులు మిక్కిలి చప్పుడుగానీయకే యని చెప్పఁగా, మ్రోయుఁగటకము ల్శుభయత్నగరిమ ననుచున్ = శుభయత్న గరిమయనఁగాఁ బెండ్లిపనులయొక్క బాహుళ్యమును, సంభోగమును గనుక పెండ్లిపనులయొక్క బాహుళ్యముచేత, కటకములు = గాజులు, మ్రోయున్ = మ్రోయుచున్నవి యని పలుకుచును అని యర్థము. సంభోగక్రియచేఁ బాదవలయములు మ్రోయునని యర్థాంతరము.

చెలిపలుకుఁ గెరడించుచున్ = ఈలాగని చెలికత్తెయాడినమాట పరిహాసపర్యవసానముచేయుచు, చికిలిగోళ్లసొగసు సోఁకులన్=వాఁడిగలగోళ్లయొక్క యొయ్యారపు బెణుకులచేత, కళలునించుచున్ = కాంతులను బూర్ణీభవింపఁజేయుచును, మన్మథకళలూరఁ జేయుచును అని యర్థము. మెఱుంగు ముంగురులు గూడదువ్వుచున్ = మెఱపుగల ముంగురులు గూడఁబారునట్టులుగాఁ గలయ దువ్వుచును, ముడికిదార్చి = తలవెండ్రుకలు ముడివైచి, మజ్జనపువేళ=స్నానసమయము, తడవేల=ఆలస్యమెందుకు, మహిప = వసురాజా, అనుచున్ = అనిపలుకఁగా, ముందరిపద్యముతో నన్వయము. తుమ్మెదలబాధ తొలంగుట, గుబ్బలుబ్బుసూపుట, అనురాగాతిశయమునఁ బ్రియుఁడు కరఁగుట, సంభోగమునందుఁ గట కాదులు మొరయుట లోనగునవి సంభోగక్రీడానుకూలక్రియలు. వెండ్రుకలు చిక్కుదీయుట, సిమ్మ పండ్లరసమునించుట, తిలకముకరఁగుట, కంకణాదు ల(భ్యంగవశమున) మొరయుట యభ్యంగనోచిత ధర్మములు. సమయోచితాభ్యంగధర్మములు సంభోగవ్యాపారముల కన్వయించి చెలులు పరిహాసింపఁ దొడఁగిరని భావము.

తే. సింహగతిమీఱువసురాజుచెంతనొక్క, తోయధరవేణిపాదము ల్దుడిచి మెట్లు
వెట్టనొకకన్యహస్తముఁ ర్పింపవచ్చె, సలిలభవనంబునకుఁ బ్రజోత్సవము మెఱయ.

సింహగతిమీఱు వసురాజుచెంతన్ = సింహపరాక్రమముచేత నతిశయించుచున్న వసురాజు చెంతనని యర్థము. సింహరాశి నతిక్రమించుచున్న సూర్యునిచెంత నని యర్థాంతరము. ఒక్కతోయ ధరవేణి=మేఘమువంటి జడగలయొక స్త్రీయని యర్థము. వేణివంటి మేఘమని యర్థాంతరము. పాదము ల్దుడిచి మెట్లువెట్టన్ = అడుగులు దుడిచి పాదుకలుంపఁగానే యని యర్థము. కిరణప్రసారణముగా ఖండఁజేసి నిలుకడపఱుపఁగానే యనియర్థాంతరము. ఒకకన్య హస్తమర్పింపన్ = ఒకమగువ కైదండ యొసఁగఁగా నని యర్థము. కన్యారాశి హస్తనక్షత్రమందుఁ బ్రవేశము సేయింపఁగా నని యర్థాం తరము. ('హస్తచిత్తార్థంకన్యా' యని యున్నదని తెలియవలయును.) ప్రజోత్సవము మెఱయన్ = ప్రజలయొక్కసంతోషము ప్రకాశించునట్టులుగా, సలిలభవనంబునకున్ = మజ్జనగృహమున కని యర్థము, జలరాశికి లేక జలోత్పత్తికని యర్థాంతరము. వచ్చెన్ = వేతెంచెను.

భవనమనఁగా గృహంబును నుత్పత్తియును అని విచారింపవలయును. అనఁగా సింహపరాక్ర మముచేత నతిశయించుచున్న వసురాజుసన్నిధి నొకయప్సరస యాయనయడుగులు దుడిచి పాదుకలు

పెట్టఁగానే మఱియొకయప్సరస కైనందఱ యియ్యఁగా మజ్జనగృహమునకుఁ బ్రజాసంతోషము ప్రకాశింపఁగా వచ్చెనని యర్థము. సింహరాశి నతిక్రమింపుచున్న సూర్యునిసమీపమున నొకనీలమేఘము కిరణప్రసారము గాకుండఁజేసి నిలుకడసేయఁగానే కన్యారాశి హస్తానక్షత్రమందుఁ బ్రవేశము సేయింపఁగాఁ బ్రజానుమోదము ప్రకాశించునట్లుగా సలిలోత్పత్తికి వచ్చె నని యర్థాంతరము.

చ. పతియభిషేకవేళఁ గర♦భావితకుంభకురంగభృన్మణి
ప్రతిమలు నిర్జరీసుముఖ♦భావముఁ గన్గొని నీరు వంచి య
య్యతివలు సిగ్గునం గనలి ♦ యాస్యము వంచిన నూర కుండె న
ప్రతిమరసజ్ఞరత్నపరి♦పాకము లిట్టివి గావె ధారుణిన్. 78

పతియభిషేకవేళన్ = వసురాజుయొక్క స్నానసమయమందు, కరభావిత = కరస్థితములైన, కుంభ = కలశములుగల, కురంగభృన్మణి ప్రతిమలు = చంద్రకాంతరత్నప్రతిమలు - అనఁగా హస్తగత చంద్రకాంత కలశములైన చంద్రకాంత ప్రతిమలనుట, నిర్జరీ = అప్సరసలయొక్క, సముఖభావముఁ=సుముఖత్వమును, కన్గొని = చూచి, నీరువంచి = కలశములవలన నీరుగ్రుమ్మరించి అని యర్థము. ఇక్కడఁ బ్రతిమాహస్తములయందలి కుంభములు కించిదధరములుగా నుండుచున్నవని తెలియవలయును. నిర్జరీముఖములుచూచి చంద్రభ్రాంతిచేత స్రవించినవని భావము. అయ్యతివలు సిగ్గునంగనలి యాస్యమువంచినన్ =ఆయప్సరసలు తమకుఁ బ్రయత్నసాధ్యమైన ప్రయోజన మప్రయత్నముగాఁ బ్రతిమలు చేసినందున సిగ్గుపడి కోపగించి ముఖమువంపఁగానే - అనఁగా వైముఖ్యమును బొందఁగానే, ఊరకుండెన్ =నీరుగ్రుమ్మరించుట మాని యూరకుండె ననియర్థము. చంద్రభ్రాంతిజనకములైన ముఖముల యొక్క వంచుటచేత స్రవింపకపోయెనని భావము. ధారుణిన్ = భూమియందు, అప్రతిమ=అసమానములైన, రసజ్ఞరత్న = రసికజనశ్రేష్ఠులయొక్క, పరిపాకములు = స్వభావములు, ఇట్టివిగావె= ఇలాటివే కావా యని యర్థము.

రసజ్ఞ రత్నములనఁగా జంద్రకాంతములు అప్ప్రిచురములైన ప్రతిమలు అనఁగా జలప్రచురము లైన ప్రతిమలు వేనివల్లనో యవి యప్ప్రతిమములు. అవియ రసజ్ఞరత్నములు, వానియొక్క పరిపాకము లీలాటివే కావా యని యర్థాంతరము. అచ్చరలమోములు నిండుజాబిల్లివలె నుండెను. జాబిల్లినిగాం చినంతన చంద్రకాంతశిలలనుండి జలమూరుట ప్రసిద్ధము. అచ్చరలు మోమెత్తి చూచి నంతన గించిదధరములగు పాత్రములనుండి జలము స్రవించెను. తమసుముఖత రాజుగ్రహించునేమొ యను జంకున మోముత్రిప్ప నూరకుండెను. ముఖచంద్ర సందర్శనమునఁ జంద్రకాంతములనుండి జలము స్రవించుననుట కవిసమయము. అలం. శ్లేషోత్థాపితార్థాంతరన్యాసము.

మ. ఘనచాంపేయకవాసనావివశభృం♦గశ్రేణిఁ జేపట్టి చ
ల్లనిపూఁదేనియ చల్లి తేర్చుమధువే♦ళాలక్ష్మియో నాఁగ సో
గనెఱు ల్పెంపఁగినూనెనిగ్గు సడలం♦గాఁ బైపయిన్ దువ్వి నే
ర్పున గంధామలకంబు వెట్టె నొకయం♦భోజాక్షి భూజానికిన్. 79

ఘన = అధికమైన, చాంపేయక = సంపఁగియొక్క, వాసనా = పరిమళముచేత, వివశ=మూర్ఛఁ జెందిన, భృంగశ్రేణిన్ = తుమ్మెదచాలును, చేపట్టి = చేఁబట్టుకొని, చల్లనిపూఁదేనియచల్లి = శీతలమైన

మకరందము చిల్కరించి, తేర్చు = సేదదేర్చునట్టి, మధువేళాలక్ష్మియోనాఁగన్ = వసంతలక్ష్మియో యన్నట్టులుగా, సోగనెఱుల్సంపఁగినూనె నిగ్గుసడలంగాఁ బైపయిందువ్వి = సోగలైన తలవెండ్రుకలు సంపఁగినూనెయొక్క జిడ్డువదలునట్టులుగా మీఁదమీఁదదువ్వి, నేర్పునన్ = మెలఁకువచేత, ఒకయంభోజాక్షి = ఒకయప్సరస, భూజానికిన్ = వసురాజునకు, గంధామలకంబువెట్టెన్ = పరిమళయుక్తమైన యుసిరికపిండియటకలి శిరస్సుపైఁ బెట్టెను. అనఁగాఁ జమురువదలునట్టులు పులుముటకై గంధపుటటకలి పెట్టె ననుట. గంధామలకము అభ్యంగావసరమున నుపయోగించుట ప్రసిద్ధము.

"వరగంధామలకంబు పెట్టెను సుధావారాశితోల్పట్టికిన్" తారాశశాంకము.

సోగనెఱులకు సంపంగినూనెపూయుట, దువ్వుట, గంధామలకంబు పెట్టుట, వసంతసమయమునందు సంపెంగపూదావికి తుమ్మెదలు సొమ్మసిలుట, వనలక్ష్మి తుమ్మెదల బుజ్జగించుట చల్లనిపూదేనియ చల్లుటగాఁ గవి యుత్ప్రేక్షించెను. అలం. ఉత్ప్రేక్ష.

చ. కరముల నుజ్జ్వలాభినవ•గైరికకుంభము లంటఁ గూర్చి పు
ష్కరములు కంకణప్రకర•సంభ్రమ మొప్పఁగ వంచి రాజకుం
జరునకుఁ గుంభినీభరణ•సమ్మదశాలికిఁ బద్మినీపరం
పర పరమానురాగమున • మజ్జన మార్చెఁ బయోగృహంబునన్. ౬౦

ఈపద్యమునందు రాజకుంజరశబ్దముచే రాజపరముగను గుంజరపరముగను నర్థద్వయము తెలియుచున్నది.

కరములన్ = హస్తములయందు, ఉజ్జ్వల = ప్రకాశమానములయిన, అభినవ = మిక్కిలి నూతనములైన, గైరికకుంభములు = కనకకలశములను, అంటఁగూర్చి = దృఢముగా సంధించి యని యర్థము. కరములన్ = తుండములను, ఉజ్జ్వలాభినవగైరిక = ప్రకాశమానములును నూతనములు నయినజాజురేఖలు గల, కుంభములంటఁగూర్చి = కుంభస్థలములయందు సంఘటించి యని యర్థాంతరము. ని. 'గైరికం కనకే ధాతౌ' అని వి. పుష్కరములు = ఉదకములను, కంకణప్రకర సంభ్రమ మొప్పఁగన్ = హస్తకంకణములయొక్క ఝుణఝుణధ్వను లొప్పఁగా, వంచి = ప్రస్మరించి యని యర్థము. పుష్కరములు = శుండాగ్రములు, కంకణప్రకరసంభ్రమ మొప్పఁగవంచి = జలబిందుసందోహములయొక్క చిందుట యొప్పఁగాఁ గ్రిందికి వంచి యని యర్థాంతరము. పద్మినీపరంపర = పద్మినీజాతిస్త్రీపరంపర యని యర్థము. పద్మములనఁగా బిందుజాలకములు. అనఁగా నెఱ్ఱనిపొడలు గనుక నవిగలవి పద్మిని యనఁగా స్త్రీగజము గనుక స్త్రీగజపరంపర యని యర్థాంతరము. (ని. 'పద్మకం బిందుజాలకమ్' అని అ.) పరమానురాగమునన్ = అతిశయప్రేమచేత, పయోగృహంబునన్ = మజ్జనశాలయం దని యర్థము. సరోవరమందని యర్థాంతరము. కుంభినీభరణసమ్మదశాలికిన్ = భూభరణమందలి సంతోషముచేత నొప్పుచున్న, రాజకుంజరునకున్ = రాజశ్రేష్ఠున కని యర్థము. కుంభినియనఁగా స్త్రీగజము గనుకఁ గరిణీభరణశాలియైన పురుషగజశ్రేష్ఠమునకని యర్థాంతరము. మజ్జనమార్చెన్ = స్నానముచేయించెను. హస్తములందు బంగారుకలశములను ధరించి కంకణములు మాఱుమ్రోయుచుండ వంచుచుఁ బద్మినీజాతి స్త్రీరత్నములు సంతోషముతో వసుభూపాలునకు జలకమార్చిరని భావము. మగయేనుంగులకు ఆడుమాతంగములు కొలంకులందుండి తుండములను గుంభస్థలములంట నెత్తి యంబుకణములు రాలునట్లు జలక మార్చునని యర్థాంతరము.

చ. పడఁతియొకర్తు చెందిరికఁపావడఁ బైఁదడి యొత్తిపైవసు
గ్గడితపుజీబునేత్ర మొకఁగామిని గట్ట నొసంగ సంజకెం
పెడలిచి నిండువెన్నెల పఁహించి పయోనిధిమండలంబు వె
ల్వడునుడురాజు నా నలకఁళానిధి యంబుగృహంబు వెల్వడన్. 81

పడఁతియొకర్తు = ఒక యప్సరస్త్రీ, చెందిరికపావడన్ = చంద్రకావిపావడచేత, పైఁదడి యొత్తివైవన్ = శరీరముపైనుండెడు తడిదుడిచివైవఁగాను, సుగ్గడితపుజీబునేత్రమొకకామినిగట్ట నొసంగన్ = చక్కని సన్నపుతెల్లవస్త్రము నొకయప్సరస కట్టనీయఁగాను, ఇచట సుగ్గడితము, జీబు అనుశబ్దములు విశేషణవిశిష్ట వస్త్రవాచకములైనను నేత్రశబ్ద సాన్నిధ్యమువలన విశేషణమాత్రపర్యవసన్నములగును. (ని. 'నేత్రం వస్త్రే క్షి వైశాఖగుణ భూపహ మూలయోః' అని నా.) సంజకెంపెడలిచి = ఉదయసంధ్యారుణిమను వదలి, నిండువెన్నెలవహించి పయోనిధిమండలంబు వెల్వడు = పూర్వసముద్రమండలమువల్లనుండి బైలుదేరిన, ఉడురాజునాన్ = చంద్రుఁడో యనునట్లుగా, అల కళానిధి = లావణ్యనిధియైన యావసురాజు, అంబుగృహంబువెల్వడన్ = మజ్జనశాలబయలు వెళ్ళఁగా నని యర్థము.

కళానిధియనఁగాఁ జంద్రుఁడనియును నంబుగృహమనఁగా సముద్రమనియును జమత్కారము గ్రహింపవలయును. చంద్రకావిపావడకు నుదయసంధ్యారుణిమకును దట్టమైన సన్నపుఁ దెల్లవస్త్రమునకును నిండువెన్నెలకును మజ్జనశాలలోనుండి బయలుదేరిన వసురాజునకును బయోనిధిమండలము బయలుదేరిన చంద్రునకును నుపమేయోపమానభావమని తెలియవలయును. అలం. ఉత్ప్రేక్ష.

తే. నవనవావర్తమండలోఁన్నమితకద్రు
విద్రుమంబులఁ ద్రిప్పుసాఁముద్రభద్ర
విమలతరవీచికలచంద ♦ మమర నమర
రమణు లెత్తిరి మంగళాఁరాత్రికములు. 82

నవనవ=మిక్కిలినూతనములైన, ఆవర్త = సుళ్ళయొక్క, మండల=సమూహమందు, ఉన్నమిత= పైకిలేచిన, కద్రు = పిశంగవర్ణములైన – అనఁగా నెఱుపుమించిన పసపుచాయగల, (ని. 'కడారః కపిలః పిఙ్గ పిశంగౌ కద్రు పింగళే' అని అ.) విద్రుమంబులన్ = పొగడపుతీఁగెమోసులను, త్రిప్పు=తిరుగునట్లుగాఁ జేయుచున్న, సాముద్ర = సముద్రసంబంధమును, భద్ర=రమ్యమును, విమలతర = మిక్కిలి స్వచ్ఛములు నయిన, వీచికల = తరంగములయొక్క, చందమమరన్ = రీతి గనుపడునట్లుగా, అమర రమణులు = దేవతాస్త్రీలు, ఎత్తిరిమంగళారాత్రికములు = మంగళపుహారతు లిచ్చిరి.

ఇందులో నావర్తమండలమునకు నారతిపళ్లెరములకును, విద్రుమములకును, దీపకళికలకును, తరంగములకును, దేవతాస్త్రీలకును నుపమానోపమేయ భావమని తెలియవలయును. ఆవర్తములు నూతనములుగాన వానితో విద్రుమలతలును బయటికి వచ్చినవి. నూతనములుగానిచో మునిఁగిపోయెడివే. విద్రుమములు ద్రుమములు గావున విస్తృతినిబట్టి రమణులందఱును బట్టుమంగళపుటారతులవలెనుండెనని భావము. అలం. ఉపమాలంకారము.

శా. అంభోజేక్షణువక్షమా యన శుభాంఁకాలంకృతంబున్ జతు
స్తంభశ్రీకరవైభవాన్వితము భంద్రశ్రీకృతామోదమున్

శుంభన్నూతనవైజయంతికము నై • శోభిల్లువైవాహికా
రంభస్థాపితవేదిఁ జెందె వసురా•డ్రత్నంబు భవ్యోన్నతిన్. 83

అంభోజేక్షణవక్షమో యనన్ = శ్రీమహావిష్ణువుయొక్క వక్షస్స్థలమో యనునట్టులుగా శుభాంకాలంకృతంబున్ = శుభచిహ్నములచేత నలంకరింపఁబడినదియును అని వేదికాపరమైన యర్థము. శుభాంకమనఁగా శ్రీవత్సలాంఛనము గనుక దానిచేత నలంకరింపఁబడిన దని విష్ణువక్షస్స్థల పరమైన యర్థాంతరము. చతుస్స్తంభ = నాలుగు స్తంభములయొక్క, శ్రీకరవైభవ = శోభాకరమయిన విభవములతోడ, అన్వితము = కూడుకొన్నదియును అని యర్థము. చతుః=నాలుగైన, స్తంభశోభవంటి శోభగలిగిన, కర = హస్తములయొక్క, వైభవాన్వితము = వైభవముతోఁ గూడుకొన్న దని యర్థాంతరము. భద్రశ్రీ = చందనముచేత, (ని. 'భద్రశ్రీ శ్చందనో స్త్రియామ్' అని అ.) కృత = చేయఁబడిన, ఆమోదమున్ = పరిమళము గలదియును అని యర్థము. భద్ర = శుభాస్పదురాలయిన, శ్రీ = లక్ష్మీదేవికి, కృత = చేయఁబడిన, ఆమోదము = సంతోషము గలదని యర్థాంతరము. శుంభత్ = ప్రకాశించుచున్న, నూతన = నవీనమైన, వైజయంతికము = పతాకలుగల దనియుఁ నని యర్థము. ప్రకాశమానమైన వైజయంతీమాలిక గలదని యర్థాంతరము. ఐ = అయినదై, శోభిల్లు = ప్రకాశించుచున్న, వైవాహికారంభస్థాపితవేదిన్ = వివాహకర్మారంభమందుఁ బ్రతిష్ఠింపఁబడిన వేదికను, వసురాడ్రత్నంబు = వసురాజశ్రేష్ఠుఁడని యర్థము. వసుశబ్దము రత్నపరంబును గనుక, వసురాట్ = రత్నశ్రేష్ఠమయిన, రత్నంబు = మణి-అనఁగాఁ గౌస్తుభమణియని యర్థాంతరము. చెందెన్ = పొందెను.

వసురాజు శుభాలంకారసమన్వితము చతుస్స్తంభవిరాజితము శ్రీచందనవాసితము వివిధపతాకాలంకృతమునగు వివాహవేదికను జేరెనని భావము. రత్నశ్రేష్ఠము కౌస్తుభము. శ్రీవత్సాంకితము చతుర్భుజాభిరామము. లక్ష్మీసమ్మోదకరము వైజయంతీవిరాజితమునగు శ్రీమహావిష్ణుని వక్షస్స్థలము బ్రాపించెనని యర్థాంతరము.

సీ. ఆగిరిజాసక్తు•నౌదలతడి యార్చె నొకశరద్రమ్యరా•జోజ్జ్వలాస్య
యా రాజహంసుపై • నడరించె మృదుజలార్ద్రానిలం బొకమానస•సాభిరామ
యామోహనాగ్రణి•కలరు లందిచ్చె నొక్కొక్క లతానిభాత్యంత•కోమలాంగి
యాజగజ్జీవను • నలరించె వరగంధపరిలేపమున నొక్క•సురభిచరిత

తే. ఘటితఘనకంకణశుభాంక•గరిమఁ దాల్చు
నాయగణ్యలావణ్యర•త్నాకరునకు
బహువిధామూల్యమణికలా•పంబు లునిచె
నిర్మలస్వాతివిఖ్యాతి•నిధి యొకర్తు.

శరత్ = శరత్కాలమందు, రమ్య = ఒప్పుచున్న, రాజ=చంద్రునివలె, ఉజ్జ్వల=ప్రకాశమానమగుచున్న, ఆస్య = ముఖముగల యొకస్త్రీ, ఆగిరిజాసక్తు = పార్వతియందాసక్తుఁడైన యాహరుని యొక్క, ఔదలతడి = శిరోగంగను, ఆర్చెన్ = కాంతిచేత నడఁగించెనని యర్థము. గిరికాదేవియందాసక్తుఁడైన యావసురాజుయొక్క తల తడియార్చెనని భావము. శరద్రాజనిభాస్యయనుట ముఖకాంతి

విశేషము సూచితము. శరచ్చంద్రుఁడు ధావళ్యాతిశయుఁడు గావున నట్టి ముఖముచే నాకాశగంగా ధావళ్య మడంచెనని భావము.

ఒక మానసాభిరామ = మానససరోవరమువలెఁ జక్కనిదైన యొకస్త్రీ, ఆరాజహంసుపైన్ = ఆ రాజహంసమీఁద, మృదు = మందమును, జలార్ద్ర = శీతలమునగు నగు, అనిలంబు = వాయువును, అడరించెన్ = వ్యాపింపఁజేసె నని యర్థము. ఆ రాజశ్రేష్ఠునిమీఁద విసనకఱ్ఱచే నొకసుందరి జలార్ద్రమగు చిఱుగాడ్పులు వీచునట్లు విసరెనని భావము.

ఒకొ్కక = ఒకతెయైన, లతా = తీఁగతోడ, సిథ = సమానమైన, అత్యంతకోమలాంగి = అతి మృదులదేహముగలస్త్రీ, ఆమోహనాగ్రణికిన్ =ఆ మన్మథునకు, అలరు లందిచ్చెన్ =పువ్వు లందిచ్చెనని యర్థము. సుందరపురుషులలో నగ్రణి యైనరాజునకుఁ బువ్వు లందిచ్చెనని భావము. లతా యన ప్రేంకణపు దీవయని యొకానొకరు వ్రాసియున్నారు. మరునకుఁ బూదూపులతుఁ బూవ్రులు రావలయును గావునఁ బూవులందించినది లత. లతను బ్రత్యేకించి ప్రేంకణమనుటకంటె తీఁగయని చెప్పుట యుక్తము. సామాన్యలతాపరముగఁ జెప్పుటయే కవ్యభిప్రాయము.

ఒక్కసురభిచరిత - సురభి = వసంతునియొక్క, చరిత = చరిత్రవంటి చరిత్రగలదని యర్థము. ప్రఖ్యాతమయిన చరిత్రగలదని భావము. అట్టి యొకస్త్రీ, ఆజగజ్జీవనున్ = జగత్ప్రాణుఁడైన యా వాయువును, వరగంధపరిలేపమునన్ = శ్రేష్ఠమయిన సౌరభయోగముచేత, అలరించెన్ = సంతోషింపఁ జేసెనని యర్థము. జగత్ప్రేమకుఁడైన యా రాజును గుంకుమగంధానులేపనముచేత సంతసిల్లఁ జేసెనని భావము. వరశబ్ద మిక్కడఁ గుంకుమ.

ఘటిత = సంఘటింపఁబడిన, ఘన = మేఘముయొక్క, కంకణ = జలకణరూపమయిన, శుభాంక గరిమఁదాల్చు = శుభచిహ్న గౌరవమును వహించిన, ఆ = అట్టి, అగణ్య = అప్రమేయుఁడైన, లావణ్య రత్నాకరునకున్ = లవణసముద్రమునకు, ఇక్కడ లవణమే లావణ్యమని విచారింపవలయును. నిర్మల = స్వచ్ఛమయిన, స్వాతి = స్వాతినక్షత్రమువంటి, విఖ్యాతి = కీర్తికి, నిధి = స్థానమయిన యొక యప్సరస యని యర్థము. స్వకీయమయిన యతివిఖ్యాతినిధి యని భావము. బహువిధ = అణి సుపాణి యనునివి మొదలుగాఁగల యనేకవిధములైన, అమూల్య = విలువలేని, మణి = ముక్తామణులయొక్క, కలాపంబు లునిచెన్ = సమూహముల నునిచె నని యర్థము.

ఘటిత = సంఘటింపఁబడిన, ఘన = ఘనతరమైన, కంకణ = వివాహసూత్రమనెడు, శుభాంకగరిమఁ దాల్చు = శుభచిహ్నగౌరవమును వహింపఁగల, ఆయగణ్యలావణ్యరత్నాకరునకున్ = అప్రమేయమైన లావణ్యమునకు సముద్రుఁడైన యా రాజునకు, బహువిధామూల్యమణికలాపంబులునిచెన్ =అనేకవిధము లైన యమూల్య రత్నాభరణములను ధరింపఁజేసెనని భావము. తాల్చు ననెడుపదము వర్తమానార్థక మును భవిష్యదర్థకము నని గ్రహింపవలయును.

ఈ పద్యములో మూఁడవచరణమందు నొక్కయనెడు పదములోనికకారమందు హ్రస్వమైన క్రమంబుండనగును. ఇందుకు లక్షణలక్ష్యము లప్పకవీయములో వర్ణపరిచ్ఛేదమందుఁ జెప్పఁబడినవి.

ఒక్కయనుటకు మాఱుగా ఒకొ్కయనుటకు-

మ. సమదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్నుకై నేలయు తే

కమనోవృత్తి గడంగి తో నడువ దోర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము సొంపార నిలింపకోటి పొగడన్ రారాజుసైన్యంబు లో
క్కొమ్మొగిన్ జెల్లగిలంగఁ బిట్టడిచె సక్రోధాంతరంగంబునన్. భారతము కర్ణపర్వము.

కం. ఇటఁ బాండవకౌరవు లొ, క్కొట నందఱు గురు ననుజ్ఞగొని. భారత. ఆది. ఆశ్వా. ౫.

చ. ఘనఘనసారచూర్ణతిల•కంబు వహించి నిధీశదత్తనూ
తనమకుటంబుఁ దాల్చె వసు•ధాపతి వక్రవతంసఖండచం
ద్రుని దిగఁ ద్రోచి యక్షయశి•రోమణిభావవిభాసమాను నా
యనుపమభాను భానుఁ దన•యౌదలఁ బూనుమహేశుకైవడిన్. 85

వసుధాపతి = వసురాజు, ఘన=శ్రేష్ఠమైన, ఘనసారచూర్ణ = కర్పూరవిరచితమైన, తిలకంబు= నెలవంకనామమును,. వహించి = ధరియించి, నిధీశ = కుబేరునిచేత, దత్త = ఇయ్యఁబడిన, నూతన మకుటంబున్ = నవీనమయిన కిరీటమును, తాల్చెన్ = ధరించెను. ఎటువలెననిన, వక్రవతంసఖండ చంద్రుని దిగఁద్రోచి = వక్రాకారుఁడైన యవతంసార్ధచంద్రుని దిగువగాఁజేర్చి, అక్షయ = నాశము లేని, శిరోమణిభావ = చూడామణిత్వముచేత, విభాసమానున్ = మిక్కిలి ప్రకాశమానుఁడగుచున్న వాఁడును, ఇక్కడ హరుఁడు వ్యోమకేశుఁడు గనుక వ్యోమమణివ్యవహారముగల సూర్యుఁ డాయనకు శిరోమణి యగుచున్నాఁడని తెలియవలయును. చంద్రుఁడు క్షయిష్ణుఁడు గనుక నక్షయశిరోమణి కాఁడనుట. ఆ=అట్టి, అనుపమభానున్ =సమానరహితములైన కిరణములు గలిగినవాఁడునునగు, భానున్ = సూర్యుని, తనయౌదలఁబూను = తన శిరసునందు ధరించిన, మహేశుకైవడిన్ = హరునివలెనని సంబంధము.

మహేశపదము రాజపరంబును గనుక స్వారస్యము గ్రహింపవలయును. కుబేరుఁడు నిధీశుఁడు గనుక నతనికి రత్నకీలితమకుట ప్రదాతృత్వమును జెప్పినాఁడు. ఉత్తరత్ర దాతృదాతవ్యసంబంధము విచారింపవలయును. వసురాజన్యుఁడు నెలవంకనామమును నొసటతీర్చి కుబేరదత్తమగు మణికిరీటమును శిరమున నలంకరించుకొనెను. ఇది సహజవక్రుఁడు ఖండస్వరూపుఁడగు చంద్రుని దిగువకుఁద్రోసి యనుపమకాంతిసమేతుఁడగు సూర్యుని దలపై మహేశ్వరుఁడు ధరించినటు లుండెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

మ. వసురాజన్యకిరీటవీథి ననఘ•స్వర్లోకవాస్తవ్యభ
వ్యసతీకల్పితకల్పదామఘటితం•బై ముత్తెపుం బాసికం
బెసఁగెం గాంచనశైలరోహణమహా•శృంగంబుపై నుద్భవిం
చుసురద్వీపవతీత్రిరూపవిపుల•స్రోతోవిశేషం బనన్. 86

వసురాజన్యకిరీటవీథికిన్ = వసురాజుయొక్కకిరీటపాళికయందు, అనఘ=నిర్దోషమైన, స్వర్లోక వాస్తవ్య = ఇంద్రునియొక్క, భవ్యసతీ = ప్రియాంగనయైన శచీదేవిచేత, కల్పిత = కట్టఁబడిన, కల్పదామ = కల్పవృక్షకుసుమమాలికలచేత, ఘటితంబై = కూర్పఁబడినదై, ముత్తెపుంబాసికంబు = ముక్తామయమయిన బాసికము, ఎసఁగెన్ = ఒప్పెను. ఎటువలెననిన, కాంచనశైల=మేరుపర్వతమందలి, రోహణ = రోహణమనెడు పేరుగల, మహాశృంగంబుపైన్ = మహత్తరమయిన శిఖరముమీఁద, ఉద్భ

బించు=పుట్టిన, సురద్వీపవతీ = దేవ తానదియొక్క-అనఁగా గంగయొక్క, త్రిరూప = మూఁడువిధము లైన, విపుల = విస్తారమయిన, స్రోతోవిశేషంబనన్ = ప్రవాహవిశేషమోయన్నట్టులుగా, ఏసఁగెనని సంబంధము.

ఈలాగనిచెప్పుటచేత వసురాజు కాంచనశైలమువలె నున్నాఁడనియుఁ గిరీటము రత్నమయమైన రోహణశృంగమువలె నున్నదనియుఁ ముత్తెపుబాసికము మూఁడుమార్గములుగాఁ బ్రవహించిన గంగా ప్రవాహమువలె నున్నదనియును దాత్పర్యము. రోహణము మేరుపర్వతశిఖరము. వసురాజు బంగారు వంటి మేనిచాయగలవాఁడుగావున మేరుగిరివలెనుండెను. రత్నకీలితమగు కిరీటము శిఖరమగు రోహణాద్రివలెనుండెను. కల్పకుసుమమాలికాలంకృతమై స్వచ్ఛకాంతితో నలరారు బాసికము త్రిపథగ యగు గంగవలె నుండెననిభావము. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. క్షోణిబలారికిన్ బలనిషూదనద త్తము లైనగొప్పక
ట్టాణిసుపాణియొంటు లలరారె నగాత్మజలక్షణంబు శ
ర్వాణికి శక్రరాణికిని వాణికిఁ గాన మటంచు నాఘన
శ్రోణివిధంబు దెల్ప గురుశుక్రులు వీనులు సేరిరో యనన్. 87

క్షోణిబలారికిన్ = భూలోకదేవేంద్రుఁడైన వసురాజునకు, బలనిషూదనద త్తములైన=ఇంద్రుని చేత నీయఁబడిన, గొప్పకట్టాణిసుపాణియొంటులు = గొప్పలైన కట్టాణి సుపాణి యనెడు భేదములు గల ముత్యాలుగూర్చిన చెవులయొంట్లు-అనఁగా వంటుపోఁగులు, అలరారెన్ = మిగులనొప్పుచుండెను. ఏలాగుననన్న, నగాత్మజలక్షణంబు = గిరికాదేవియొక్కవైఖరి, శర్వాణికిన్=పార్వతికిని, శక్రరాణికిని= శచీదేవికిని, వాణికిన్ = సరస్వతికిని, కానమటంచున్ = ఉన్నట్టులుగాఁ జూచినవారముగామని, ఆఘన శ్రోణివిధంబుఁదెల్పన్=గొప్పపిఱుఁదులుగల యాగిరికయొక్కలక్షణము తెలియఁజెప్పెడుకొఱకు, గురు శుక్రులు = బృహస్పతి శుక్రులు, వీనులుసేరిరోయనన్ = చెవులయొద్దకువచ్చిరో యనునట్టులుగా, కట్టాణిసుపాణియొంటు లలరారెనని సంబంధము.

బలనిషూదనుఁడు క్షోణిబలారికిచ్చెనన్నచోట బలారి క్షోణిబలారికిచ్చె నని స్వారస్యము గ్రహింప వలయును.

మ. వెలిదీవిం దెలిబావిలో నమృతము న్వేత్రావి దివ్యాంబుదం
బులు వర్షింప సుధాబ్ధిలోఁ బొడముబల్పుప్పుల్ఘటింపన్ సుధా
గుళికానిర్మలహార మయ్యె నిది గైకొ మ్మాయురారోగ్యము
ల్గలుగు న్నీ కని యశ్వినాథుఁ డొకముక్తాహార మర్పించినన్. 88

వెలిదీవిన్=శ్వేతద్వీపమందు, తెలిబావిలోన్ = అమృతపుబావియందలి, అమృతము న్వేత్రావి= అమృతమును శీఘ్రముగాఁ బానముచేసి, దివ్యాంబుదంబులువర్షింపన్=దేవసంబంధములయిన మేఘములు వర్షింపఁగా, సుధాబ్ధిలోఁబొడము = క్షీరసముద్రములోఁబుట్టిన, బల్పుప్పుల్ఘటింపన్ = బలిష్ఠములైన ముక్తామణులు కూర్చుటవలన, సుధాగుళికానిర్మలహారమయ్యెన్ = అమృతగుళికలచేతరచింపఁబడిన మాలిన్యరహితమైన హారమైనది. ఇది=దీనిని, గైకొమ్ము=పరిగ్రహింపుము. ఆయురారోగ్యముల్గలుగు న్నీకన్ = నీకుఁ జిరకాలాయుష్యంబును రోగరహితత్వంబును గలుగుచున్నది. అని యీప్రకారముగాఁ

జెప్పి, అబ్ధినాథుఁడు = సముద్రముల కధినాథుఁడైన వరుణుఁడు, ఒకముక్తాహార మర్పించినన్ = ఒక ముత్యాలహార మియ్యఁగా, ముందరిపద్యముతో నన్వయము. అమృతమును పానము చేయుటవలన మేఘములు దివ్యాంబుదము లయ్యెను. దివ్యాంబుదములు సుధాబ్ధిలో వర్షించుటవలన సుధాగుళికలవంటి రమణీయహారము లయ్యెను. అమృత మాయురారోగ్యకరముగావున సుధాగుళికానిర్మలహారముగూడ నటులె యాయురారోగ్యకరదాయకమనిభావము. సముద్రజన్యమగునిట్టిహార మన్యజనాలభ్యముగావున నబ్ధినాథుఁడు గడించి వసురాజున కర్పింపఁగలిగె ననుట.

ఉ. మానవనాథుఁ డయ్యమృత • మౌక్తికహారము పేరురంబునం
బూనె నగాత్మజాభజన • భూరిసుఖాచిరలాభహర్ష సం
ధానవిశల్యకౌషధము • నన్మది నాటినపంచసాయకా
నూనలతాంతకోరకస • ముత్కరము న్వెలిఁ బర్వెనో యనన్. 89

మానవనాథుఁడు = వసురాజు, అయ్యమృత మౌక్తికహారము = అమృతమయమయిన యా ముత్యాలహారమును, పేరురంబునంబూనెన్ = విశాలవక్షస్స్థలమందు ధరించెను, నగాత్మజా = గిరికాదేవియొక్క, భజన = పొందికవలని, భూరిసుఖ = అధికసౌఖ్యముయొక్క, అచిరలాభ = శీఘ్రప్రాప్తి వలననయిన, హర్ష సంధాన = సంతోష సంఘటనమనెడు, విశల్యకౌషధమునన్ = విశల్యకరణిచేత-అనఁగా నాటిన బాణములను బయటికి వెడలించునట్టి మహౌషధముచేత, మది నాటిన = హృదయమందు నాటుకొన్న, పంచసాయక = మన్మథ సంబంధమైన, అనూన = అధికమయిన, లతాంతకోరక = పుష్పకళికారూపబాణములయొక్క, సముత్కరమున్ = సమూహము, వెలిఁబర్వెనో యనన్ = బయలువెడలెనో యన్నట్టులుగా, పేరురంబునంబూనె నని సంబంధము. హారమును మునుపె పేరురంబునం బూనెనని చెప్పి మరల నిచటఁ జెప్పుటవలనఁ బునరుక్తవదాభాసాలంకారము. తల్లక్షణము-

శ్లో. 'యత్రార్థః ప్రథమే కించి ద్భాసతే పునరుక్తవత్
పునరుక్తవదాభాస స్సోలంకార స్సతాం మతః.'

విశల్యకౌషధమునన్ అనుచో సంధానశబ్ద మోషధీపరముగావున నిట రత్నావళ్యలంకారము. తల్లక్షణము-

శ్లో. క్రమికాం ప్రకృతార్థానాం న్యాసం రత్నావళిం విదుః.'

విశల్యకరణి యెదనాటినములుకులను వెడలించునట్టిది. రత్నహారము గిరికాసంధానవిశల్యకరణి కావున మరుఁడు గాటముగా నెదనాటినములుకుల వెలికిఁ దీయఁగలిగెను.

ఈపద్యమునకే పాఠాంతర మిక్రింద వ్రాసి టీక చేయఁబడుచున్నది.

ఉ. మానవనాథుఁ డయ్యమృత • మౌక్తికహారము పేరురంబునం
బూనె నగాత్మజాపృథుస • ముజ్జ్వలవృత్తకుచోపగూహన
శ్రీనిరవద్యవైభవము • చెంతకుఁ దెచ్చినభాగ్యవర్ణసం
తానము తద్భుజాంతరమ • నం బ్రకటం బయి తోఁచెనో యనన్. 90

మానవనాథుఁడు = వసురాజు, ఆయ్యమృత మౌక్తికహారము=అమృతమయమైన యాముత్తెపు దండను పేరురంబునం బూనెన్ = విశాలమయినవక్షస్స్థలమందు ధరించెను. ఎటువలెననిన.

నగాత్మజా = గిరికాదేవియొక్క, పృథు = గొప్పలైన, సమున్నత=మిక్కిలి యున్నతములైన, వృత్త = వర్తులములయిన, కుచ = స్తనములయొక్క, ఉపగూహనశ్రీ = ఆలింగనసంపత్తియొక్క, నిరవద్య = ఉత్కృష్టమైన, వైభవము = విభవమును, చెంతకుఁ దెచ్చిన = సమీపమునకుఁ దెచ్చిన, భాగ్యవర్ణ సంతానము = భాగ్యాక్షరపంక్తి, తద్భుజాంతరమునం బ్రకటంబుగఁ దోఁచెనో యనఁగ = ఆవసురాజు యొక్క బాహుమధ్యమునందు స్ఫుటమై కనుపించెనో యన్నట్లుగా, పేరురంబునం బూనెన్ = విశాలవక్షస్థలమందు ధరించె నని సంబంధము.

చ. గరుడసమర్పితాభినవ•గారుడరత్నమయాంగదంబు భూ
వరభుజపీఠిఁ బొల్చె నగ•వర్యసుతావరణాభ్యసూయచేఁ
దరలని భూతధాత్రియనఁ • దత్సతిఁ బల్కులు నూరడించువై
ఖరి నడరెం దదీయభుజ•కాండపరిస్ఫురణంబు లయ్యెడన్. 91

గరుడ = గరుత్మంతునిచేత, సమర్పిత = ఈఁబడిన, అభినవ = నూతనమయిన, గారుడరత్నమయ = గరుడపచ్చలుచెక్కిన, అంగదంబు = బాహుపురి, భూవరభుజపీఠిఁ బొల్చెన్ = వసురాజుయొక్క బాహుపీఠమందుఁ బ్రకాశించెను. ఏలాగనిన, నగవర్యసుతా = గిరికాదేవియొక్క, వరణ = పాణిగ్రహణవిషయమయిన, అభ్యసూయచేన్ = అసహిష్ణుత్వముచేత, తరలని = కదలకనిలిచియున్న, భూతధాత్రియనన్ = భూకాంతయో యన్నట్లుగా నని వెనుక కన్వయము.

అయ్యెడన్ = ఆ సమయమందు, తత్సతిఁ బల్కు లనూరడించువైఖరిన్ = ఆభూకాంతను మాటిమాటికి నూరడించుచున్నట్లుగా, తదీయ=ఆవసురాజుయొక్క, భుజకాండ = దక్షిణబాహుదండము యొక్క, పరిస్ఫురణంబులు = అదరుటలు - అనఁగాఁ జలనములు, అడరెన్ = ఒప్పెను.

ఇక్కడఁ బురుషునకు దక్షిణభుజ మదరుట శుభకరమని శాస్త్రసిద్ధము.

శ్లో. 'దక్షిణాక్షి పరిస్పందా ద్దక్షిణస్య భుజస్య చ
మనసశ్చ ప్రసాదేన సానుకూల్యానిలేన చ
ఏవంనిమిత్తై ర్నిశ్చిత్య విజయం భూపతి ర్వ్రజేత్.' అని మానసోల్లాసము.

కాళిదాసుఁడుగూడ నిటులె వామభుజస్పందనము శుభహేతువుగాఁ జెప్పియున్నాఁడు-

శ్లో. 'శాంత మిద మాశ్రమపదం స్ఫురతిచ బాహుః కుతఃఫల మిహాస్య
అథవా భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర.'

అలం. ఉత్ప్రేక్ష.

భూదేవి శ్యామలవర్ణమని మహాకవి ప్రసిద్ధము. ఇందుకు మనుచరిత్రములోఁ బ్రథమపద్యమందు-శా. 'శ్రీ వక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా, దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీతి న్నిల్పినాఁడో యనంగా'నని యల్లసాని పెద్దనామాత్యుండు చెప్పినాఁడు. హరిద్వర్ణము శ్యామలవర్ణమం దంతర్భూతము గనుక గారుడరత్నమయాంగదమును భూదేవిగా నుత్ప్రేక్షించినాఁడు. ఈలాటి వర్ణనము లనేకములు గలవు. సీ. ఊరుభుజశాఖలనుండు తేఁటులఁబోలెఁ గేలఁ బచ్చలకడియాలు దనరె అను నిత్యాదులు.

శా. సుత్రామప్రియమిత్రపాణియుగళిన్ • శోభిల్లెఁ జిత్రప్రభా
పాత్రస్ఫారవిదూరజాభరణము • ల్పర్జన్యరాడ్దత్తముల్
క్షేత్రశ్రీకరసూత్రసన్నహనలక్ష్మిం దన్నృపాగామిస
త్క్షేత్రశ్రీకరసూత్రసన్నహనలక్ష్మీవైఖరుల్ దెల్పుచున్. 92

సుత్రామ=దేవేంద్రునకు, ప్రియమిత్ర = ఇష్టసఖుఁడయిన వసురాజుయొక్క, పాణియుగళిన్ = హస్తద్వయమందు, పర్జన్యరాడ్దత్తముల్ = మేఘశ్రేష్ఠునిచేత నీఁబడిన, చిత్రప్రభా = చిత్రకరములైన కాంతులకు, పాత్ర = భాజనములును, స్ఫార = అధికములును, విదూరజ = వైదూర్యమణిమయములు నయిన - అనఁగా వైదూర్యమణిఖచితములయిన, ఆభరణముల్ = హస్తకంకణములు,

ఇక్కడ మేఘధ్వనివలన వైదూర్యరత్నములు పుట్టుచున్నవి గనుకఁ బర్జన్యరాజు విదూరజాభరణము లిచ్చినాఁడని చెప్పినాఁడు. ఇందుకు-

శ్లో. 'తయాదుహిత్రాసుతరాంచకాశే స్ఫురత్ప్రభామండలయాసవిత్రీ
విదూరభూమి ర్నవమేఘశబ్దా దుద్భిన్నయారత్నశలాకయేవ'

అని కుమారసంభవమందుఁ బ్రయోగము.

క్షేత్ర = ఆవైదూర్యరత్నములయందలి, శ్రీకర = శోభాకరములైన, సూత్ర = నూలుదిరుగుటల యొక్క, సన్నహనలక్ష్మిన్ = ప్రయత్నసమృద్ధిచేత, తన్నృప = ఆవసురాజుయొక్క, ఆగామి = ముందు రాఁగల, సత్క్షేత్ర = ఉత్తమకళత్రమయిన గిరికాదేవికి, (ని. 'క్షేత్రం శరీరే కేదారే సిద్ధస్థాన కళత్రయోః' అని అ.) శ్రీకర = సౌభాగ్యకరమైన, సూత్ర = మంగళసూత్రముయొక్క, సన్నహన = బంధనము చేతనైన, ఈశబ్దము 'ణహబంధనే' యనెడు ధాతువువలన నిష్పన్నమైనది, లక్ష్మీ వైఖరుల్ = శ్రేయో వైఖరులను, తెల్పుచున్ = సూచనసేయుచు, శోభిల్లెన్ = ప్రకాశించెను.

వైదూర్యరత్నమందు సూత్రములు దిరుగుచున్నవి యనుటకు లక్షణము-

గీ. 'పగలు గొందిఁ గానఁబడెడుబిడాలంబు, కన్నుఁబోలి వెలుగుగలిగి నూలు
దిరుగునట్లు మీఁదఁ దెరబారువైదూర్య, రత్నమునకు దీప్రయత్నమునకు.'

అని రత్నపరీక్షయందుఁ జెప్పంబడియున్నది. వైదూర్యమునందు సహజముగా నూలుదిరుగునటులఁ గనిపించును. ఇది గిరికాకంఠమునందుఁ గావింపఁబోవు మంగళసూత్రబంధనమును సూచింపసాగెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

మ. అలకారాజకుమారుఁ డద్భుతముగా • నర్పించుచొక్కంపుఁగెం
పులపెండేరము చేదిరాజచరణాం•భోజంబునం బొల్చె నీ
బలవద్దీప్తిఁ బ్రదీప్తమయ్యె నిదె నా•పార్శ్వద్వయం బంచు నా
వలయగ్రావము వందనప్రవణమై • వర్తిల్లుచందంబునన్. 93

అలకారాజకుమారుఁడు = కుబేరపుత్త్రుఁడైన నలకూబరుఁడు, అద్భుతముగా నర్పించు = ఆశ్చర్యమగునట్టులుగా సమర్పించిన, చొక్కంపుఁగెంపుల పెండేరము = చొక్కమయిన యనఁగా నతిశయ కాంతిసంపన్నములైన కెంపులుచెక్కిన గండపెండేరము, చేదిరాజచరణాంభోజంబునం బొల్చెన్ = వసురాజు పాదమందుఁ బ్రకాశించెను. ఏలాగనిన, నీబలవద్దీప్తిన్ = నీయొక్క బలిష్ఠమైన యరుణకాంతిచే,

ఇదె = ఇదిగో, నాపార్శ్వద్వయంబు = నాయొక్క వెనుకముందరివైపులు, ప్రదీప్తమయ్యెన్ = మిక్కిలియుఁ బ్రకాశించెను, అంచున్ = అని పలుకుచు, అవలయప్రాప్రము=ఆచక్రవాళపర్వతము, పాదన ప్రవణమై = నమస్కారమందలి యాసక్తిగలదై, ప్రవర్తిల్లుచుందంబునన్=ప్రవర్తించుచున్నదో యన్నట్టులుగా, ప్రకాశించె నని సంబంధము. చక్రవాళపర్వతము భూమండలమును జుట్టుకొనియుండుట వలన దానికావలిభాగమునందు సూర్యచంద్రకిరణప్రసారము లుండవు. అందుచే నావలి భాగమంత యును నంధకారబంధురము. చక్రవాళమున కావలఁగూడఁ బ్రకాశము వ్యాపించుటకు వసురాజు ప్రతాపము కారణము. అవలఁ బ్రతాపరూపమునఁ గాంతి ప్రసరింపఁజేయుటచేఁ గృతజ్ఞత నెఱపఁ జక్రవాళము వెండెరముగాఁ బాదముల సేవించుచున్నదని భావము. అలం. ఉత్ప్రేక్ష.

మ. చెఱఁగు ల్పూఁతపసిండిప్రాతమిసిమిం • జిత్రాతిచిత్రంబు లై
మెఱయున్ రత్నపుఁగుచ్చు లంచులబడిన్ • మించు ల్దువాళించుక్రొ
మ్మెఱుఁగుంజెంద్రికకావిపట్టు సురభూ•మీజార్పితం బిచ్చె నా
తఱుచుంగన్నులవేల్పుపట్టి వసుగో•త్రామండలస్వామికిన్. 94

చెఱఁగులప్పూఁతపసిండి ప్రాఁతమిసిమిన్ = అంచులఁ బెులామా బంగారపు ప్రాఁతపనియొక్క కాంతివిశేషముచేత, చిత్రాతిచిత్రంబులై మెఱయన్ = అద్భుతములైన వానికంటె మిగుల నద్భుత ములై ప్రకాశింపఁగాను, రత్నపుఁగుచ్చులు=ముత్యాలకుచ్చులు, అంచులబడిన్=అంచులవెంట, మించు ల్దువాళించు = కాంతులను వెదచల్లుచున్న, క్రొమ్మెఱుఁగుచెంద్రికకావిపట్టు = క్రొత్తమెఱుఁగుగల చంద్రకావిపట్టుతాప్తాను, సురభూమీజార్పితంబు = కల్పవృక్షముచే నర్పింపఁబడిన దానిని, ఆతఱుచుం గన్నుల వేల్పుపట్టి = ఆవేఁగన్నులుగల యింద్రునికుమారుఁడైన జయంతుఁడు, వసుగోత్రామండల స్వామికిన్=భూమండలాధీశ్వరుఁడైన వసురాజునకు, ఇచ్చెన్=సమర్పించెను. అమూల్యము అసమానము నగు నాచంద్రికకావిపట్టువలువచెఱఁగుల బంగారుపూఁత అంచు ముత్తెములకుచ్చులు సమకూర్చినది. ఇట్టియుత్తమవస్త్రము నొసంగినది కల్పభూరుహము. వసురాజున కొసంగినది జయంతుఁడు. ఇతఁడును నీసంబంధము నెడ నభిమాని యని భావము.

ఉ. వ్రీళ వివర్తితాస్య యయి • వేలుపుటింతి యొకర్తు చేదిభూ
పాలమహేంద్రు కట్టెదుటఁ • బట్టె మణీమయదర్పణంబు శో
భాలలితానురూప్యమునఁ • బార్థివ యీముకురంబు మేలొ నా
మేలిమి చెక్కుటద్ద మిది • మేలొ కనుంగొను మన్విథంబునన్. 95

వ్రీళన్ = సిగ్గుచేత, వివర్తితాస్యయయి = అడ్డముగా మరలింపఁబడిన ముఖముగలదై, వేలుపు టింతియొకర్తు = అప్సరస్స్త్రీయొకతె, చేదిభూపాలమహేంద్రు కట్టెదుటన్ = వసురాజునెట్టయెదుట, పట్టెమణీమయదర్పణంబు = రత్నవికారమయిన యద్దమును బట్టినదాయెను. ఏమనియనిన, శోభా = కాంతిచేత, లలిత = ఒప్పుచున్న, ఆభిరూప్యమునన్ = చక్కఁదనముచేత, పార్థివ=ఓయిరాజా, ఈముకు రంబు మేలో=ఈయద్దము బాగో, నా మేలిమి చెక్కుటద్దమిది మేలో=నాయొక్క మేలిమి బంగారము వంటి చెక్కుటద్దము బాగో, కనుంగొనుమన్విధంబునన్ = చూడుమని యన్నట్టులుగా, అద్దము నెదుటఁ బట్టెనని సంబంధము.

వేలుపుటింతి వెనుకనిలిచి వసురాజున కద్దమును జూపుచుండెను. వసురాజు భూపాలమహేంద్రుఁడు. తాను వేల్పుటింతి గానఁ దన ప్రతిబింబము దర్పణగతమగుటకు సిగ్గుపడెను. అపుడు సురకాంత మోమోరఁ జేసెను. మోము త్రిప్పుటచే జెక్కు లద్దమునఁ బ్రతిబింబించెను. ఇదియంతయు వేలుపుటింతి వసురాజును నాచెక్కులు మెఱుంగుగానున్నవా ? దర్పణము మెఱుంగుగానున్నదా యని ప్రశ్నించినటులుండెనని భావము. అలం. ఉత్ప్రేక్ష.

చ. వసువసుధాసుధాంశునకు • వారిదవాహనుఁ డాక్షణంబునం
దసదృశచిహ్న మొక్కటి మ•హామహనీయమహోచితంబుగా
నొసఁగఁ దలంచి దివ్యసరి•దుద్భవరత్నమృణాళినీబిస
ప్రసవసరంబు మంగళక•రంబు గరంబున నెత్తి యి ట్లనున్. 96

వసు వసుధాసుధాంశునకున్ = భూలోకచంద్రుఁడైన వసురాజునకు, వారిదవాహనుఁడు = మేఘవాహనుఁడైన యింద్రుఁడు, ఆక్షణంబునందున్ = తత్క్షణమందు, అసదృశచిహ్న మొక్కటి = సమానరహితమయిన యొకలాంఛనమును, మహాత్ = అధికమయిన, మహనీయ=శ్రేష్ఠమయిన, మహ = ఉత్సవమునకు, ఉచితంబుగాన్ = తగియుండునట్లుగా, ఒసఁగఁ దలంచి = ఈఁదలఁచినవాఁడై, మంగళకరంబు = శుభకరమయిన, దివ్యసరిత్ = ఆకాశగంగయందు, ఉద్భవ = సంభవించిన, రత్నమృణాళినీ = రత్నమయమైన తామరతీఁగయందలి, బిసప్రసవ = పద్మములచే రచింపఁబడిన, (ని. 'బిసప్రసూన రాజీవ పుష్కరాంభోరుహాణి చ' అని అ.) సరంబు = మాలిక, కరంబున నెత్తి = తనహస్తము చేతఁ బైకెత్తి, ఇట్లనున్ = వక్ష్యమాణప్రకారముగా నొకవాక్యము పలికెను.

వివాహశుభోత్సవమునకుఁ దగిన యసదృశచిహ్నమును దేవేంద్రుఁడు వసురాజున కొసంగఁ దలంచెను. అది పద్మమాలిక. దానిజననము ఆకాశగంగయందలి రత్నమయమైన తామరతూడునందు. అది కైకొన నర్హమైనది వివాహశుభోచితమైన వసురాజు. మంగళకరము.

ఉ. కమ్మపసిండిగట్టుపయిఁ • గ్రమ్మెడు వేలుపుటేటిపార్శ్వదే
శమ్ముల నిమ్ములై పొదలు•చాగపుమ్రాఁకులమానికంపుఁబూ
దుమ్ములు రాలఁగా నయిన•తోరపుఁబేరసటం జనించె నీ
తమ్ములు చిత్రదీప్తిమహి•తమ్ము లొసంగు నభీప్సితమ్ములన్. 97

కమ్మపసిండిగట్టుపయిన్ = మనోజ్ఞమైన కాంచనాచలముమీఁద-అనఁగా మేరుపర్వతముమీఁద, క్రమ్మెడు = వ్యాపించుచున్న, వేలుపుటేటి = దివ్యనదియొక్క-అనఁగా నాకాశగంగయొక్క, పార్శ్వదేశమ్ములన్ = రెండువైపులను, ఇమ్ములైపొదలు = గుబురులై యొప్పుచున్న, చాగపుమ్రాఁకుల=చాగమను పదము త్యాగశబ్దతద్భవము గనుకఁ ద్యాగశీలములైన వృక్షములయొక్క - అనఁగాఁ గల్పవృక్షముల యొక్క, మానికంపుఁబూదుమ్ములురాలఁగానయిన = మాణిక్యమయపుష్పపరాగము లాగంగలో రాలినందున నేర్పడిన, తోరపుఁబేరసటన్ = విస్తారమయిన పెద్దబురదయందు, జనించెనీతమ్ములు = ఈకమలములు జన్మించెను. ఇవియెట్టివియనిన, చిత్రదీప్తిమహితమ్ములు = విచిత్రకాంతిచేత నొప్పుచున్నవి, ఇవి, అభీప్సితమ్ములన్ = వాంఛితార్థములను, ఒసంగున్ = ఇచ్చును.

ఇక్కడఁ జిత్రదీప్తిమహితత్వమునను నభీప్సితప్రదాత్వమునను మీఁదఁ జెప్పఁబడిన తమ్ముల యొక్క విశేషణములు హేతువులని గ్రహింపవలయును. ఈపద్మములు లోకోత్తరములు. కావునఁ జిత్రదీప్తి మహితమ్ములు. మేరుపర్వతమునందు ఆకాశగంగాతీరమున గుబురుగానున్న కల్పవృక్షముల నుండి మాణిక్యమయపరాగము రాలి యదియె బురదగాఁ జేరుకొనెను. ఆ పెంటమ్ములు జనించిన వగు టచే నభీప్సితప్రదములై యున్నవి.

ఉ. అవ్యయనవ్యవాసన లొకప్పుడు వీడక వాడకుండు నీ
దివ్యసరోజదామకము దీధితిమాత్రదినేశమిత్రతా
భవ్యము దీనిఁ గన్న నెడఁబాయుఁ బ్రదోషము లన్నచోఁ బ్రదో
షవ్యసనంబు పైకొనఁగఁ జాలునె దీని జగత్త్రయంబునన్. 98

అవ్యయ = నాశనములేని, నవ్య = నూతనములగుచున్న, వాసనలు = పరిమళములు; ఒకప్పుడు వీడక = ఒకానొక సమయమందును వదలక, వాడకుండు=వాడిపోకుండునట్టి, ఈదివ్యసరోజదామకము= దివ్యమయిన యీకమలమాలిక, దీధితిమాత్ర దినేశ మిత్రతా భవ్యము-దీధితిమాత్ర=కాంతిమాత్రము చేత, దినేశ = సూర్యునియొక్క, మిత్రతా = స్నేహమునకు, భవ్యము = యోగ్యమయినది - అనఁగా లోకములోఁ గమలములవలెఁ గాంతి నపేక్షించి సూర్యునకు మిత్రములు గావనియును సమానకాంతిచేత మిత్రములైనవనియును దెలియవలయును. దీనిఁగన్న నెడఁబాయుఁ బ్రదోషములన్నచోన్=దీనిఁజూడఁ గానె ప్రదోషకాలము లెడఁబాయునని చెప్పుచుండఁగా, ప్రదోషవ్యసనంబు పైకొనఁగఁ జాలునె దీని జగత్త్రయంబునన్ = వ్యసనమనఁగాఁ గ్లేశము, ప్రదోషకాలమందు నుదయించెడు స్త్రీవిరహక్లేశము దీనిం బైకొనఁజాలునా మూఁడులోకములయందును అని యర్థము.

ప్రదోషకాలకృతమయిన దృష్టి విరోధత్వము దీనిం బైకొనఁజాలునా యనియును బ్రదోష కాలమందలి ముకుళీభావము దీనిఁ బైకొనఁజాలునా యనియును బ్రకారాంతములు. ప్రదోషమనఁగాఁ బాతకము గనుక నీపద్మమాలికను జూడఁగానే పాతకము లెడఁబాయునని చెప్పుచుండఁగాఁ బాతక జనితక్లేశము దీనిం బైకొనఁజాలునా యనియును జెప్పవచ్చును. ఈ నాలుగర్థములలోఁ బ్రథమ ద్వితీయ చతుర్థార్థములు పద్మమాలికను ధరించినవారికే చెప్పవలయును. తృతీయార్థము పద్మమాలికకుఁ జెప్పవలయును. ప్రదోషశబ్దమునకు - (ని. 'ప్రదోషః కాలభేదే స్యాత్ప్రదోషో దోష ఇష్యతే' అని వి) వ్యసనశబ్దమునకు - (ని. 'వ్యసనం త్వశుభే శక్తౌ పాన స్త్రీ మృగయాదిషు' అని విశ్వ నిఘంటువు.)

కావులు వీడకుండుట, వాడకుండుట, దివ్యసరోజదామకము గావున, దివ్యపద్మము లెప్పుడును వికసించియే యుండును గావున నీదివ్యపద్మములకు సూర్యుఁడు సమానకాంతిచే మిత్త్రుఁడు. దీనిని దాల్చుటవలన లభ్యమగు ఫలము ప్రదోషవ్యసనపరిహారము. అలం. అర్థాపత్తి.

క. ఈశరజాతములకు నెన, యేశరజాతములఁ గాన మివి బవరములో
నాశరజాతము వరపెడు, నాశరజాతముల నడఁచు నభినవమహిమన్. 99

ఈశరజాతములకు నెన యేశరజాతములఁ గానము = ఈపద్మములకు సమాన మేపద్మములను జూడము. ఏమనిన, ఇవి=ఈపద్మములు, బవరములోన్=యుద్ధములో, ఆశరజాతము వరపెడు=రాక్షస

సమూహము ప్రయోగించునట్టి, ఆశరజాతముల నడఁచు నభినవమహిమచే = ఆబాణసమూహములను బ్రతిహతము సేయును నూతనప్రభావముచేత నని యర్థము.

ఆశరులనఁగా రాక్షసులన్నందుకుఁ బ్రయోగము - కంఠదార్థము. దాశరథీ కీశరథీ, యాశర నిర్వపణ వేంకటాచలరమణా' అని యున్నది. ని. 'స్రప ఆశరః' ఈపద్యము పంచప్రాసకందమని యెఱుంగునది. ఈదివ్యాబ్జముల మహిమ యభినవము. యుద్ధమునందు రక్కసులు ప్రయోగించు బాణముల నివి యడంచును. కావుననే యిట్టిపద్మములు లోకమున లేవని చెప్పుట. ఈపద్యము పంచప్రాసము అలం. కావ్యలింగము.

శా. సోఁక న్వచ్చుశిలీముఖంబుల నడం◆చుఙ్ రాజహంసాళి న
త్త్రాఁకం బెట్టు ననంతరత్నరుచి వో◆నాడుం దపశ్శ్రీలకు
న్వ్రేఁకం బై వెలయుఙ్ ఘనోదయమున ◆ న్విప్పారు నిప్పద్మముల్
వీఁకం జిత్రచరిత్రపాత్రములు గా◆వే ధాత్రి నూహింపఁగాన్. 100

సోఁకన్వచ్చుశిలీముఖంబులనడంచుఙ్=శిలీముఖశబ్దము తుమ్మెదయందును బాణమందును వర్తించును. (ని. 'అళిబాణౌ శిలీముఖౌ' అని అ.) ముట్టవచ్చెడుతుమ్మెదల నివారించునని యర్థము. నాటవచ్చెడు బాణములను బ్రతిహతము సేయుఁనని భావము. 'రాజహంసాళి నత్త్రాఁకంబెట్టుఙ్=రాయంచలను రాకుండ నడ్డగించు నని యర్థము. రాజశ్రేష్ఠుల నిరాకరించునని భావము. అనంతరత్నరుచివోనాడుఙ్= అనంతరత్నమనఁగా సూర్యుఁడు గనుక నతనియందలి ప్రీతి నిరసించునని యర్థము. అపరిమితములైన పద్మరాగమణులయొక్క కాంతిని దిరస్కరించు నని భావము. తపశ్శ్రీలకు వ్రేఁకంబై వెలయుఙ్= తపస్సనఁగా గ్రీష్మర్తువందలి యాతపదీప్తుల కసాధ్యమై ప్రకాశించునని యర్థము. తపస్సంపదలకు దుర్లభములని భావము. ఘనోదయమునవ్విప్పారుఙ్ = మేఘాగమమందు - అనఁగా వర్షర్తువందు వికసించునని యర్థము. అధికాభ్యుదయముచేత నుల్లసిల్లునని భావము. ఇప్పద్మములు = ఏతాదృశగుణవిశిష్టములైన యాపద్మములు, ధాత్రిఙ్ = భూమియందు, ఊహింపఁగఙ్ = విచారింపఁగా, వీఁకఙ్= ప్రభావముచేత, చిత్రచరిత్రపాత్రములుగావే = అద్భుతచరిత్రకుఁ దగినవి గావా.

అనఁగా మీఁద నర్థముగాఁ జెప్పఁబడిన భృంగనివారకత్వాది పద్మేతరధర్మములు గలిగినవగుటచేత నీపద్మములు చిత్రచరిత్రములు గలవి యనుట. ఈపద్యము నాల్గవచరణమందుఁ గాకుస్వరయతి. అలం. కావ్యలింగము.

ఉ. కమ్మనివింటిజోదు నెఱి◆కైదువులై నమిటారితమ్ము లీ
తమ్ముల నెట్టు వోలు సత◆తమ్ము లతాంగులమానయుక్తచి
త్తమ్ములఁ గూడఁబాఱు నవి ◆ తమ్ము లసన్మహిళామనోంబుజా
తమ్ములు గూడి మోహాసహి◆తమ్ములుగా నివి మించు మించులన్. 101

కమ్మనివింటిజోదు = మన్మథునియొక్క, నెఱికైదువులైన = ఉత్తమాయుధములైన, మిటారితమ్ములు = చక్కఁదనముగల పద్మములు, ఈతమ్ముల నెట్టు వోలుఙ్ = ఈపద్మముల నేలాగునఁ బోలఁగలవు-అనఁగాఁ బోలలేవనుట. ఎందువల్లననివ, అవి = అమన్మథాయుధములైన పద్మములు, సతతమ్ము = నిరంతరమును, లతాంగుల = స్త్రీలయొక్క, మానయుక్తచిత్తమ్ములఁగూడఁబాఱుఙ్ = అలుకతోఁగూడిన

చిత్తములను వెంబడించును, ఇవి = ఈమాలికలయందలి పద్మములు, తమ్ముల్ = తమ్ము, లసత్ = ఒప్పుచున్న, సన్మహిళా = శ్రేష్ఠలయిన స్త్రీలయొక్క, మనోంబుజాతమ్ములు = మనఃకమలములు, కూడి = కలిసికొని, మోహసహితమ్ములుగాన్ = మోహయుక్తములగునట్లుగా, మించులన్ = కాంతులచేత, మించున్ = అతిశయించును.

మన్మథాయుధములైన పద్మములు స్త్రీలచిత్తముల ననుసరించునట్టివియగుచు, నీపద్మములు స్త్రీల చిత్తములచేతఁ దామనుసరింపఁబడునట్టివియగును గనుక నాపద్మము లీపద్మములకు సరిగావనియర్థము. మన్మథుఁడు సామాన్యపువిలుకాఁడు గాఁడు జోదు. వాని నెఱకైదువులు మిటారితమ్ములు. అయిన నేమి? చెలువలయలుకనిండిన చిత్తముల నివి వెంబడించును. ఇది యొకలోపము. ఇట్టిలోపము లేక పోఁగా నీదివ్యకమలములు లతాంగుల మనోంబుజములను మోహయుక్తము లొనర్చుచున్నవి. కావున నివి యితరతామరసముల మించినవని భావము.

ఉ. తమ్ములకెల్లఁ బెద్ద యగు • తామరసోదరనాభికాసరో
జమ్మది విశ్వము న్విధివ • శమ్మునఁ గాని సృజింపఁ జాల దీ
తమ్ములయొత్తు చిత్రచరి • తమ్ము జగత్త్రయసారవస్తుజా
తమ్ము సృజింప నేర్చు నిర • తమ్ము దలంచినయంతలోపలన్ 102

తమ్ములకెల్లఁబెద్దయగు = కమలములకన్నిటికిని మొదటిదైన, తామరసోదరనాభికాసరోజమ్మది = విష్ణుదేవుని నాభియందలి యా కమలము, విశ్వము న్విధివశమ్మునఁగాని సృజింపఁజాలదు = ప్రపంచమును దైవవశముచేతఁగాని నిర్మింపఁజాలదు అనియర్థము. బ్రహ్మామూలముచేతనని భావము. ఈతమ్ముల యొత్తు = ఎత్తనఁగా నౌన్నత్యంబును బుష్పమాలికయగును గనుక నీకమలమాలిక, చిత్రచరితమ్ము = అద్భుత చరిత్రముగలది. ఎందువలననినన, నిరతమ్ము = నిరంతరమును, తలంచినయంతలోపలన్ = తలఁచుకొన్న మాత్రముననే, జగత్త్రయసారవస్తుజాతమ్ముసృజింపనేర్చున్ = మూఁడులోకములయందుండెడు శ్రేష్ఠ వస్తుసమూహమును గల్పింపనేర్చును.

తమ్ములకెల్లఁ బెద్దయన్నచోట ననుజుల కగ్రజుఁడనియును, తమ్ములయొత్తన్నచోట ననుజుల యౌన్నత్యమనియును జమత్కారము గ్రహింపవలయును. ఈ చెప్పుటవలనఁ దమ్ములకందఱికిఁ బెద్ద యయ్యును దైవవశముచేతనేకాని స్వశక్తిచేతఁ బ్రపంచనిర్మాణము చేయఁజాలని విష్ణునాభి కమలమునకంటెఁ దమ్ముల యౌన్నత్యముచేతనే జగత్త్రయసారవస్తుజాతము సృజింపఁబడుట గలిగిన యీ పద్మమాలిక యధికప్రభావము గలది యనుట. అలం. వ్యతిరేకము.

ఉ. వాసవమాలికాంకమున • వర్తిలునీనిరవద్యవాసనా
వాసవరాసవాభినుత • వారిజదామము ధాత్రిఁ జెందియున్
వాసవమాలికాంకమున • వర్తిలుఁ దావకమై వసుత్వమా
వాసవ చాల నెత్తయిన • వారికి నెందును బేరు దప్పునే. 103

వాసవమాలికాంకమున వర్తిలు = వాసవమాలిక యనెడు నామముచేతఁ బ్రవర్తించుచున్న, ఈ నిరవద్య = ఈయుత్కృష్టమైన, వాసనావాస = పరిమళమునకు వాసస్థానమైన, వరాసవ = శ్రేష్ఠమైన మకరందముచేత, అభినుత = కొనియాడఁబడుచున్న, వారిజదామము = పద్మమాలిక, ధాత్రిఁ జెందియున్ =

...లోకమును బొందియు, వసుక్షమావాసవ = భూలోకదేవేంద్రుఁడైన వసురాజా, తావకమై = నీ సంబంధమైనదై, వాసవమాలికాంకమున వర్తిలుక్ = వాసవమాలికానామముచేతనే వర్తిల్లును, చాల నెత్తయిన...దప్పునే = మిగులనున్నతిగలవారి కెందయినను ప్రసిద్ధి తప్పునా యని యర్థము. (ఎత్తన నున్నతియుఁ బూదండయును.)

ఇక్కడ స్వర్గమందు వాసవుని మాలికగనుక వాసవమాలిక యనియును భూమియందు వసుసంబంధినియైన మాలికగనుక వాసవమాలిక యనియును దెలియవలయును. లేక, వసురాజును క్షమావాసవుఁడని చెప్పినందున వసురాజును వాసవుఁడే గనుక వాసవునియొక్క మాలిక యనియును జెప్పవచ్చును. చాలనెత్తయినవారికి నెందును బేరుదప్పునే = ఎత్తనఁగా నున్నతమగు బువ్వుదండయును, పేరనఁగా నామమును హారమును గనుక మిక్కిలి యౌన్నత్యముగలవారి కెక్కడనైనను బ్రసిద్ధిదప్పునా యని యర్థము. పువ్వుదండకుఁ బేరని చెప్పుటదప్పునా యని యర్థాంతరము. ఈపద్యము ద్విప్రాసముగలదిగాఁ జెప్పఁబడియెను. అలం. శ్లేషమూలకార్థాంతరన్యాసము.

చ ఉరగుల కీసుపర్ణరుచిఁయుక్తము డాయఁ గడింది ధాత్రిపై
నరులకుఁ బోల దీకమలనాయకతేజముఁ దేరి చూడ నీ
పరమమహేంద్రమాలిక సుపర్వులకైన భరింప భార మో
గిరిహర నీవు నే నని సఖిత్వము మీఱఁగ నీ కొసంగితిన్. 104

ఉరగులకుక్ = పాతాళవాసులైన పన్నగులకు, ఈసుపర్ణరుచియుక్తము డాయఁగడింది = సుపర్ణుఁడనఁగా గరుత్మంతుఁడు గనుక గరుత్మంతునియొక్క ప్రతాపముతోఁ గూడుకొన్న యీపద్మమాలికను సమీపించిపోవుటకే కఠినము అని యర్థము. సుపర్ణము లనఁగా శోభనపత్రములు గనుక వానియొక్కకాంతితోఁ గూడుకొన్నదని భావము. ధాత్రిపైనరులకుక్ = భూమిపైనున్న మనుష్యులకు, ఈ కమలనాయకతేజముదేరిచూడక్ = కమలనాయకుఁ డనఁగా సూర్యుఁడు గనుక సూర్యప్రకాశముగల యీపద్మమాలికలను దృష్టినిలిపి చూచుటకే, పోలదు = శక్యముగాదని యర్థము. కమలనాయకము లనఁగా గమలశ్రేష్ఠములు గనుక వానియొక్క తేజము గలదని భావము. ఈ పరమమహేంద్రమాలిక = ఉత్కృష్టమైన యీ యింద్రమాలిక, సుపర్వులకైన భరింపభారము = దేవతలకయినప్పటికిని భరింప నలవిగాదు. అనఁగా స్వర్గ మర్త్య పాతాళవాసు లయినవారి కెవ్వరికిని ధరింప నలవిగాదనుట. అయినప్పటికిని, ఓగిరిహర = పర్వతభంజకుండవైన యో వసురాజా, నీవు నేనని = అనఁగా నీవు బర్వతభంజకుఁడవు నేనును బర్వతభంజకుండను గనుక నీవు నేనుగాని వేఱుగాదని, సఖిత్వముమీఱఁగక్ = మిత్రభావ మతిశయించునట్టులుగా, నీకొసంగితిక్ = నీ కిచ్చితిని.

ఈహారము నాగులకును నరులకును సుపర్వులకును సాధ్యము గాదు. త్రిలోకోత్తరుఁడవుగాన నీకొసంగితిని. ఉరగులు సుపర్ణుని సమీపింపలేరు. ఇదిసుపర్ణరుచిసహితముగావున వారు ధరింపఁజాలరు. మనుజులో పద్మనాయకతేజము సహించి చూడలేరు. ఇదిమహేంద్రమాలికగదా? దేవతలు భరింపలేరు. ధరింపఁదగినవాఁడు గిరిహరుఁడు. ఇరువురము గిరిహరులముగావున సఖిత్వము దలంచి యీదివ్యహారము నీకొసంగితినని భావము. అలం. కావ్యలింగము. పరికరము.

శా. భూనాథోత్తమ యస్మదీయవరసం • భూతామరత్వంబుతో
దీనిం గొమ్మని వాసవుం డొసఁగఁ జే • దిస్వామినెమ్మేన న
మ్లానస్వచ్ఛసరోజమాల్య మది చా • లం బొల్చె నింద్రైక్యదీ
క్షానిర్ణేతృమహాసహస్రనయనీ • సౌభాగ్యముం దెల్పుచున్. 105

భూనాథోత్తమ = రాజాగ్రణీ, అస్మదీయవర = నాయొక్కవరమువలన, సంభూత = సంభవించిన, అమరత్వంబుతోన్ = దేవత్వముతోడ, దీనిం గొమ్మని=దీనిగ్రహింపుమని, వాసవుండొసఁగన్ = ఇంద్రుఁడియ్యఁగా, చేదిస్వామినెమ్మేనన్ = వసురాజుదేహమందు, అమ్లానస్వచ్ఛసరోజమాల్యమది, అమ్లాన = ఎప్పటికిని వాడిపోని. స్వచ్ఛ = నిర్మలమైన, సరోజమాల్యమది = ఆ పద్మమాలిక, చాలంబొల్చెన్ = మిక్కిలియుఁ బ్రకాశించెను. ఏలాగుననిన, ఇంద్ర = ఇంద్రునితోడ, ఐక్యదీక్షానిర్ణేతృ = అభేదదీక్షను నిర్ణయపఱుచుచున్న, మహాసహస్రనయనీ = అధికమయిన సహస్రలోచనములయొక్క, సౌభాగ్యముం దెల్పుచున్ = చక్కఁదనమును దెలియఁజేయుచు, చాలం బొల్చెనని సంబంధము.

కమలములు నేత్రములవంటివి గనుక వసురాజు కమలమాలికను ధరించినవాఁడై సహస్రలోచనుఁడయిన యింద్రునివలె నుండెను. దివ్యకుసుమమాలిక ధరింపఁదగినవారు దివ్యులు. కావునఁ దొలుత వసురాజునకు దివ్యత్వము వరప్రసాదరూపమున నింద్రుఁ డొసఁగెను. సరోజమాల్యము అమ్లానము. వాడుట యెఱుంగనిది. రేకు లెప్పుడు వికసించియుండును. వికసితములగు దళములు సహస్రనయనములవలెనుండెను. గిరిహారరూపముననే కాక సహస్రనయనరూపమునఁగూడ వసురాజు ఇంద్రునివలె నుండెనని భావము. సహస్రనయనీ యనుచో నేకవద్భావిద్విగువు.

క. ఆవేళ దివిజమురజవి, రావము హరిరచితగిరిపు • రప్రాంగణవీ
థీవితతం బై గిరిజా, వైవాహికకలనమునకు • వడిఁ దరు విడియెన్. 106

ఆవేళన్ = ఆసమయమందు, దివిజమురజవిరావము = దేవతాసంబంధమయిన మర్దలధ్వని. హరి = ఇంద్రునిచేత, రచిత = నిర్మింపఁబడిన, గిరిపుర = కోలాహలపర్వతపట్టణముయొక్క, ప్రాంగణవీథీ = ముంగిటియందు, వితతంబై = విస్తరించినదై, గిరిజావైవాహికకలనమునకున్ =గిరికాదేవియొక్క వివాహసంబంధమయిన వ్యాపారమునకు, వడిఁదరువిడియెన్ = త్వరగాఁ దరువు పెట్టెను - అనఁగాఁ దొందర పుట్టించెను.

కోలాహలపర్వతనగరమందు వసురాజునొద్ది దేవతామురజధ్వనులు వినఁబడఁగానే గిరికావివాహసంబంధమయిన వ్యాపారము త్వరగా జరిగింపవలయు నని యక్కడివా రందఱును దొందరపడిరని భావము.

ఉ. ఆయెడ సంభ్రమం బెసఁగ • నాప్తసఖీకుల ముత్సవాకులం
బై యగకన్యఁ జేరి శిర • సంటుఁడు మజ్జన మార్పుఁ డర్థిఁ గై
సేయుఁడు లేశముం దడవు • సేయకుఁ డంచు ముహూర్త మెంతయుం
డాయఁగ వచ్చె నంచు వినుఁ • డా నృపతూర్యము లంచుఁ బల్కఁగాన్. 107

ఆయెడన్ = అనఁగా వసురాజునొద్ద వాయించిన దేవతామురజధ్వనులు వినఁబడునప్పుడు, సంభ్రమం బెసఁగన్ = సంతోషముతోఁ గూడిన తొందర యతిశయింపఁగా, ఆప్తసఖీకులము = గిరికాదేవి

యొక్క యిష్టసఖీజనసమూహము, ఉత్సవాకులంబై = వేడుకచేతఁ దొట్రుపడుచున్నదై, అగకన్యఁ జేరి=గిరికాదేవిని జేరఁబోయి, శిరసంటుఁడు=తలయంటుఁడు, మజ్జనమార్పుఁడు=స్నానము చేయింపుఁడు, అర్థిఁగై సేయుఁడు = చక్కఁగా నలంకరింపుఁడు, లేశముం దడవు సేయకుఁ డంచున్=ఎంతమాత్రము నాలస్యము చేయకుఁ డనియు, ముహూర్తమెంతయుం డాయఁగవచ్చెనంచున్ = పెండ్లిలగ్నము మిక్కిలి సమీపించి వచ్చెననియు, వినఁడాన్నృపతూర్యములంచున్ = వసురాజు తరలివచ్చెడు భేరీమృదంగాది వాద్యధ్వను లాలకింపుఁడీ యనియును, పల్కఁగాన్ = ఒకరితో నొకరు సంభాషించుకొనఁగా, ఈ పద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఇందు వినఁడా యనునది ప్లుతయతి. ఉత్సవాకులముచే సంభ్రమము. శిరసంటుఁడు కైసేయుఁడని తొందరించుట ముహూర్తము సమీపించెనని. నృపతూర్యరవములు రాజాగమన సూచకములు. రాజు వచ్చువఱకు అలంకారములన్నియుఁ బూర్తిచేయవలయునని భావము.

చ. హరికరుణాకటాక్షమహి • మాగతదివ్యవివాహమందిరో
దరకురువిందవేదియెడఁ • దార్చిననిర్మలవజ్రపీఠిపై
ధరసుత నుంచి నెన్నుదుటఁ • దామ్రతరాక్షతము ల్ఘటించి పె
ట్టిరి నలుఁగు ల్సకుంకుమప • టీరరజంబునఁ బుణ్యభామినుల్. 108

హరి=దేవేంద్రునియొక్క, కరుణాకటాక్షమహిమాగత = దయాసహితమైనకటాక్షప్రభావముచేత సంప్రాప్తమయిన, దివ్యవివాహమందిరోదర = యోగ్యమయిన పెండ్లిచవికలోనున్న, కురువిందవేదియెడన్ = కెంపులచేతఁగట్టఁబడిన యరుగునందు, తార్చిన = ఉంచిన, నిర్మలవజ్రపీఠిపైన్ = స్వచ్ఛమయిన వజ్రపుఁబీటమీఁద, ధరసుతనుంచి = గిరికాదేవిని గూర్చుండఁబెట్టి, నెన్నుదుటఁ దామ్రతరాక్షతములు ఘటించి = నొసట నెఱ్ఱని యక్షతలుపెట్టి, పుణ్యభామినుల్ = ముత్తయిదువలు, సకుంకుమపటీరరజంబునన్=కుంకుమపువ్వు గలిపిన శ్రీచందనచూర్ణముచేత, పెట్టిరినలుఁగుల్ = నలుఁగులిడిరి. వివాహమందిరమునందుఁ గురువిందవేదికయు వజ్రపుఁబీఠము నమర్పఁబడెను. ఈపీఠమును హరికటాక్షమహిమాగతము దివ్యముగావున నింద్రకల్పితము. కుంకుమమిశ్రమగు పటీరరజమువలెఁ గురువిందవేదికపై వజ్రపీఠ ముండెనని స్వారస్యము.

సీ. కంకణగోమేధి • కచ్ఛాయ దొలుదొల్తఁ దేటనూనియనిగ్గు • నీటు నెఱపఁ
దరళవత్కోజము • క్తాధార బడిబడి జాళువాబిందెల • జాలుపఱుపఁ
గమనీయనిశ్వాస • కందళం బెడనెడ సురటివట్రువగాలి • సొగసు దెలుపఁ
దరుణారుణాంగుళీ • కిరణము ల్పయిపయిఁ జెంగల్వ రేకుల • చేరు చెరువ

తే. మున్నుగా నాత్మశృంగార • ములె లతాంగి
మంగళస్నానవిభవసా • మగ్రిఁ గూర్ప
గమ్మనఁ బిసాళివలపులు • గ్రుమ్మరించు
కమ్మజవ్వాదిఁ దల యంటెఁ • గలికి యొకతె. 109

కంకణగోమేధికచ్ఛాయ = హస్తకంకణములయందలి గోమేధికరత్నకాంతి, తొలుదొల్తన్ = ముందుముందుగా, తేటనూనియనిగ్గునీటు నెఱపన్ = తేటగలనూనెయొక్క మెఱుపును జక్కఁపఱుపఁగాను,

అనఁగా నూనెను గలుగఁజేయఁగాననుట. ఇక్కడ గోమేధికరత్నములు గోమూత్రచ్ఛాయగలవి గనుక నూనెతోఁ బోలికచేసినాఁడు. ఇందుకు ప్రమాణము-

క. 'గోమేధికమణినిర్మల, గోమూత్రచ్ఛాయఁ జాలఁ గొమరై మేనం
బ్రేమ ధరించిన విజయో, ద్దామంబుగ నలవిఘంఢు దత్ప్రీతుఁడగున్.'

అని రత్నపరీక్షయందుఁ జెప్పఁబడియున్నది.

తరళ=కదాచిచ్చలనముగల, వక్షోజముక్తాధార=కుచాగ్రములమీఁది ముత్యాలహారముయొక్క ధారారూపమయినకాంతివిశేషము, బడిబడి = వెంబడివెంబడిగా, జాళవాబిందెలజాలుపఱుపన్=బంగారుబిందెలనుండి బయలుదేరునట్టి నీళ్ళజాలును గల్పింపఁగాను, బిగువుగుబ్బలమీఁదనున్న ముత్తెపుసరులు గొంచెము కొంచెము చలించుచుండెను. ముక్తాహారకాంతి ధారారూపముగను గబ్బిగుబ్బలకాంతిజాళవాబిందెలవలెను నుండెను. ముత్తెపుసరులు తరళములగుట గుబ్బలుకదలుటవలన, గుబ్బలుకదలుట నీరు పోయుతటి బిందియ వంచుటవలె నుండెనని తాత్పర్యము.

కమనీయ=మనోహరమయిన, నిశ్వాసకందళంబు=నిట్టూర్పువలని మొలకవాయువు, ఎడనెడన్ = అంతటంతట, సురటివట్రువగాలి సొగసు దెలుపన్ = వట్రువగానుండెడు విసనకఱ్ఱగాలియొక్క సొగసును గనుపఱుపఁగాను, తరుణ=కోమలములయిన, అరుణ=ఎఱ్ఱని, అంగుళీ=వ్రేళ్ళయొక్క, కిరణములు= కాంతులు, పయిపయిన్ = మీఁదమీఁద, చెంగల్వఱేకుల చేరుచెరుపన్ = ఎఱ్ఱగలువఱేకులందాఁకటను జేర్పఁగాను, నిశ్వాసములు కందళములుగావున నిశ్వాసమారుతము సురటిగాలివలెఁ దగుమాత్రముగా నుండెను. చిఱుగాడ్పు లెడతెగక వీవవు. అంతటంతట వీచునుగావున నెడనెడయని చెప్పఁబడెను నిశ్వాసములు హృదయరంజకముగాఁ దగువిధముగాఁ బొలయుచున్నవిగావునఁ గమనీయములు.

మున్నుగాన్=ముందరగా, ఆత్మశృంగారములె = తనయొక్క సొగసులే, లతాంగిమంగళస్నానవిభవసామగ్రిఁ గూర్పన్ = గిరికాదేవియొక్క వివాహప్రయుక్తమయిన మంగళస్నానమునకుఁ దగినవైభవసామగ్రిని ఘటనపఱుచుచుండఁగా, గమ్మనబిసాళివలపులు గ్రమ్మరించు = గమ్ముమనునట్టులుంగా దట్టమయిన వాసనలు వెదచల్లుచున్న, కమ్మజవ్వాదిన్ = మనోహరమయిన జవ్వాదిచేత, కలికియొకతె = ఒక సుందరియైన చెలికత్తె, తలయంటెన్ = గిరికాదేవికి శిరసంటెను.

స్నానోచితవ్యాపారములు నూనెయంటుట, నీరుపోయుట, సురటితో వీచుట, కెంగలువలు మేనఁజేర్చుట. ఇవి యన్నియు గోమేధిక కంకణములు, చలించుగుబ్బలపైనిగల ముత్తెపుసరులు, నిట్టూర్పులు రక్తాంగుళులు నిర్వహించెను. అందుచే నచ్చరమిన్న సౌందర్యమె గిరికకు మంగళస్నానమాచరించునటులుండెనని భావము. అలం. సమాధి.

ఉ. మంజులచంద్రకాంతమణిమజ్జనశాలవిశాలహేమపీ
ఠిం జపలేక్షణార్పితపటీరజలోక్షితకేశపాశ యై
కంజనిభాస్య వొల్చె నతిగౌరసుధానిధిమధ్యవీచికా
పుంజితఫేనయుక్త యయి పుట్టుసరోరుహగేహయో యనన్. 110

మంజుల = మనోహరమైన, చంద్రకాంతమణి = చంద్రకాంతమణిమయమైన, మజ్జనశాలన్ = స్నానగృహమందు, విశాలహేమపీఠిన్ = విశాలమయిన బంగారుపీఁటమీఁద, చపలేక్షణా = స్త్రీల

చేత, అర్పిత = అర్పింపఁబడుచున్న, పటీరజల = చందనోదకముచేత, ఉక్షిత = తడుపఁబడిన, కేశపాశయై = తలవెండ్రుకలు గలదై, కంజనిభాస్య = పద్మమువంటి ముఖముగల గిరికాదేవి, పొల్చెన్ = ప్రకాశించెను. ఏలాగుననన, అతిగౌర = మిక్కిలి తెల్లనైన, సుధానిధి=క్షీరసముద్రమందలి, మధ్యవీచికా=నడిమినీటి తెరచేత, పుంజిత=నిండింపఁబడిన, ఫేన=నురుఁగుతోడ, యుక్తయయి=కూడుకొన్నదై, పుట్టు = ఉద్భవించుచున్న, సరోరుహగేహాయోయనన్ = పద్మమేగృహముగాఁగల లక్ష్మీదేవియో యనునట్టులుగా, పొల్చెనని సంబంధము.

ఇందులోఁ జంద్రకాంతమణిమయమజ్జనశాలకును క్షీరసముద్రమునకును, హేమపీఠమునకును నాసనపద్మమునకును, చందనోదక మర్పించుచున్నస్త్రీకిని మధ్యవీచికకును, చందనోదకమునకును ఫేనమునకును, గిరికాదేవికిని లక్ష్మీదేవికిని నుపమానోపమేయభావము. లక్ష్మీకేశపాశము తుమ్మెదల బారువలె నల్లఁగనుండవలసినదేగాని క్షీరసముద్రడిండీరస్పర్శమువలనఁ దెల్లగానుండెను. అటులె చందనద్రవము చేఁ దడుపఁబడుటచేత గిరికాదేవి కేశపాశముగూడఁ దెల్లఁగానుండెనని భావము.

మ. ప్రమదాభ్యున్నతిఁ జెక్కుదోయి చెమరింపం బూర్ణశృంగారతన్
సుమనోదంతులు శాతకుంభకలశీశుద్ధాంబువు ల్నింపఁగాఁ
గమలాభ్యంచితపాణి పొల్చె సురరాట్కారుణ్యలబ్ధానివా
ర్యమహైశ్వర్యకులాద్రిధుర్యగృహసాక్షాల్లక్ష్మిచందంబునన్. 111

ప్రమదాభ్యున్నతిన్ = ఆనందాతిశయముచేతనని స్త్రీపరమైన యర్థము. మదాతిశయముచేతనని దేవతాపపరమైన యర్థము. చెక్కుదోయిచెమరింపన్ = చెక్కులు చెమ్మటిల్లఁగానని యర్థము. గండస్థలములు మదజలార్ద్రములుగాఁగానని యర్థాంతరము. పూర్ణశృంగారతన్ = సంపూర్ణమయిన సింగారముతోనని యర్థము. సిందూరరేఖాశృంగారముతోనని యర్థాంతరము. ఇక్కడ శృంగారమనఁగా గజమండనమునకుఁ బేరు. సుమనోదంతులు = సుమనములనఁగాఁ బుష్పములు-అనఁగా మొల్లలు వానివంటిదంతములుగల స్త్రీలనియర్థము. దేవతాగజములని యర్థాంతరము. శాతకుంభ = సువర్ణమయములైన, కలశీ = కుంభములచేత, శుద్ధాంబువుల్నింపఁగాన్ = నిర్మలోదకములు పైనిబోయుచుండఁగా, కమలాభ్యంచితపాణి = కమలములవలె మిక్కిలియు నొప్పుచున్న హస్తములుగల గిరికాదేవి, కమలాభ్యంచితపాణి = కమలములచేత నొప్పుచున్న హస్తములుగలదైన, సురరాట్ = దేవేంద్రునియొక్క, కారుణ్యా = అనుగ్రహముచేత, లబ్ధ = పొందఁబడిన, అనివార్య = అడ్డములేని, మహైశ్వర్య=మహావైభవముతోఁగూడిన, కులాద్రిధుర్యగృహ = కులపర్వతాధ్యక్షుఁ డయిన కోలాహలుని గృహమందలి, సాక్షాల్లక్ష్మిచందంబునన్ = ప్రత్యక్షలక్ష్మియో యన్నట్టులుగా, పొల్చెన్ = ప్రకాశించెను.

ఇక్కడ, శ్లో. 'లక్ష్మీర్దివ్యై ర్గజేంద్రై ర్మణిగణఖచితై స్స్నాపితా హేమకుంభైః' అనెడు శ్లోకపాదార్థము ననుసంధింపవలయును. గజలక్ష్మీస్నాన మిట ననుసంధింపఁబడినది. లక్ష్మియుఁ గిరిజయుఁ గమలాభ్యంచితపాణులు. ఇరువురిని స్నానముఁ జేయించువారు సుమనోదంతులు. చెక్కుదోయిచెమరుట, శాతకుంభకలశీశుద్ధాంబువులునించుట నుభయత్ర (ఏనుగులు, అచ్చరలయెడ) సమానధర్మములు.

చ. మెలఁతలు శైలరాట్తనయ◆మేతడి యొత్తఁగఁ గూర్చునిండువె
న్నెలపొరవంటి దువ్వలువ ◆ నిద్దపుగుబ్బల వ్రాలుచుం గళం
బలముచుఁ జెక్కు లంటుచు ను◆దంచితరాగరసార్ద్రిమయ్యెఁ బూఁ
పల మెయి సోఁకిన న్విమల◆భావము నిల్చునె యెట్టికట్టునన్. 112

ఈపద్యమందు గిరికాదేవిశరీరము తడిదుడుచుటకై స్త్రీలు సంఘటించిన తెలిపట్టుదుప్పటి యందు నాయకత్వారోపణముచేసి యర్థద్వయము గలుగఁజెప్పినాఁడు. ఎలాగనిన,

మెలఁతలు = స్త్రీలు, శైలరాట్తనయ = గిరికాదేవియొక్క, మేతడియొత్తఁగన్ = శరీరపుఁ దడి దుడుచుటకు, కూర్చు=సంఘటించిన, నిండువెన్నెలపొరవంటిదువ్వలువ = సంపూర్ణమయిన వెన్నెల పొరవలెనున్న దువ్వలువ - అనఁగా వెల్లపట్టు దుప్పటి, నిద్దపుగుబ్బలవ్రాలుచున్ = నిగ్గులచన్నుల మీఁదవ్రాలుచును, గళంబలముచున్ = కంఠము నప్పళించుచును, చెక్కులంటుచున్ = కపోలస్పర్శము సేయుచును, ఈమూఁడు కార్యములు నాయకకృత్యములుగాను గ్రహింపవలయును. ఉదంచిత రాగరసార్ద్రిమయ్యెన్ = ఒప్పుచున్నకుంకుమాదులయొక్క రక్తిమతోఁగూడిన జలముచేతఁ దడుపఁబడిన దాయె నని యర్థము. అనురాగరసార్ద్రిమయ్యెనని నాయకపరమయిన యర్థము పూఁపల మెయి సోఁకినన్ = కొమరుప్రాయముగల పడుచులయొక్క శరీరమునంటినమీఁదట, ఎట్టికట్టునన్ = ఎటువంటి తెలిపట్టువస్త్రమండైనను, విమలభావము నిల్చునె = ధావళ్యము నిల్చునా యనియర్థము. ఎట్టి కట్టునన్ = ఏస్థలమందైనను, విమలభావము నిల్చునె = పరిశుద్ధత్వమునిల్చునాయని నాయకపరమయిన యర్థము. గుబ్బలపైనను గంఠమునందును జెక్కులయందును గుంకుమపూఁత పూయఁబడియుండుటచేఁ దెలిదువ్వలువను గెంజాయ నిండారెను. చెలికత్తెలు స్నానానంతరము గిరిజగుబ్బలను గంఠమును జెక్కులను దువ్వలువతోఁ దడియొత్తిరని భావము. గుబ్బలు కంఠము చెక్కులు కళాస్థానములు. ఉచితకాలములందు వానిని దాఁకిన రాగరసార్ద్రభావము జను లొందుదురు.

చ. కళుకుమెఱుంగుక్రొంబసిఁడి ◆ కాంచిక లై కటి మించఁ జాలు నం
చులమణు లంఘ్రిభూష లయి ◆ శోభిలఁ జాలుఁ జెఱంగుముత్తియం
బులె యెద నుంపఁ జాలు సర◆ముల్పటవాసకసౌరభంబె మైఁ
గలపము నింపఁ జాలు నన◆ గట్టిరి దివ్యదుకూల మింతికిన్. 113

కళుకనఁగా దళుకు, ఇందుకుఁ బ్రయోగము. చ. 'కళుకులు దేరుగండములు గండము లాక శిఖండలక్ష్మికిన్' అనియున్నది. కళుకుమెఱుంగుక్రొంబసిఁడి = తళుకుగలకాంతితోఁగూడిన బంగారపుఁ దగటు, కాంచికలై కటిమించఁజాలున్ = గంటలమొలనూళ్లై పిఱుఁదులయం దతిశయింపఁజాలును, అంచులమణులు = అంచులయందుఁగూర్చిన రత్నములు, అంఘ్రిభూషలయి శోభిలఁజాలున్ = పాద భూషణములయి ప్రకాశింపఁజాలును, చెఱంగుముత్తియంబులె = పైఁటకొంగునందుఁ గూర్పఁబడిన ముత్యములే, ఎదనుంపఁజాలు సరముల్ = వక్షస్థలమందు హారములను గల్పింపఁజాలును, పటవాస= వస్త్రములఁ బరిమళింపఁజేయుం బుక్కాముయొక్క, సౌరభంబె = పరిమళమే, మైన్ = శరీరమందు, కలపమునింపఁజాలున్ = సుగంధద్రవ్యములుగూర్చిచేసిన మెయిపూఁతను గల్పింపఁజాలును, అనన్ = ఈలాగనునట్టులుగా, దివ్యదుకూలము = దివ్యమయిన తెలిపట్టుచీర, ఇంతికిన్ = గిరికాదేవికి, కట్టిరి = కట్టించిరి. గిరికకుఁగట్టినవలువ దివ్యముగావున దానిప్రభావ మనన్యమైనది. ఆచీరెపడుచు మెఱుంగులు

గ్రక్కుజలతారుపనితనములు గలవుగాన గట్టుకొన్నంత మొలకుగంటలుగల యొడ్డాణము వలెను, కొనలందు మణులఁగూర్చియుండుటచేఁ బాదములకు రత్నభూషణములవలెను, జెఱంగులకు ముత్తెములు గూర్పఁబడియుంటచే గుబ్బలపయి ముక్తాహారముగను అవలువ తావిమేనికిఁ గలపమువలె నుండెను.

చ. తమతమతమ్ములం దిగిచి ♦ తన్ముఖలక్ష్మికిఁ ద్రిప్పురీతి ను
త్తమతమపుణ్యసింధువని♦త ల్బహుచిత్రదళంపుటారతుల్
క్రమమున నెత్త నయ్యచల♦కన్యక వచ్చె నమూల్యపద్మమా
ల్యమున నెసంగుచేదిపభు♦జాంతరకల్పవివాహవేదికిన్. 114

ఉత్తమతమ = అత్యంతశ్రేష్ఠముగలిగిన, పుణ్యసింధువనితల్ = గంగాయమునాది పుణ్యనదీకాంతలు, తమతమతమ్ములందిగిచి=తమతమయందుండెడు పద్మములను దీసి, తన్ముఖలక్ష్మికిఁ ద్రిప్పురీతిన్= ఆగిరికాదేవిముఖసౌందర్యసంపత్తికి బడిమి ద్రిప్పినట్టులుగా, బహు = అనేకములయిన, చిత్ర = వింత వింతలైన, దళంపుటారతుల్ = రేకులుగల పద్మమయనీరాజనములను, క్రమమున నెత్తన్=వరుసవెంబడి సమర్పింపఁగా, అయ్యచలకన్యక = ఆగిరికాదేవి, అమూల్య = విలువలేని, పద్మమాల్యమున నెసంగు = ఇంద్రుఁడిచ్చిన పద్మమాలికచేత నొప్పుచున్న, చేదిప = వసురాజుయొక్క, భుజాంతరకల్ప = వక్షస్థ్సలసమానమయిన-అనఁగా నమూల్యపద్మమాలికాలంకృతమయిన, వివాహవేదికిన్ = పెండ్లియరుఁగుమీఁదికి, వచ్చెన్ = విచ్చేసెను.

ఇందు అమూల్యపద్మమాల్యమున నెసంగు ననెడిపదము వక్షస్థ్సలమునకును వివాహవేదికిని సాధారణవిశేషణము. ఆరతులొసంగువారు పుణ్యనదీకాంతలు. వారొసంగునారతులు చిత్రమైనవి. తమ్మిదళము ఆరతిపళ్లెరము. విచ్చినకెందామర యందుంచినదీపము. దళపుటారతులు గిరికాముఖలక్ష్మికి దమయందలి తామరపూవులను దిగదుడిచి వేయుచునటు లుండెనని భావము. వసురాజు వక్షస్థ్సలమును వివాహవేదకయు నమూల్య పద్మరాగాలంకృతములె. అలం - ఉపమా - ఉత్ప్రేక్ష.

క. ఆకల్పలలామకములు, నాకల్పకదామకములు ♦ నపు డగసుత కా
ర్యాకల్ప కనిచె హరిసతి, యాకల్పవిభూతి గలుగు ♦ నాళీతతిచేన్. 115

ఆకల్పలలామకములున్=అలంకారశ్రేష్ఠములును, ఆకల్పకదామకములున్=ప్రసిద్ధకల్పప్రసూన మాలికలును, హరిసతి = ఇంద్రునిభార్యయయిన శచీదేవి, అపుడు = ఆసమయమందు, ఆర్యాకల్పకున్= పార్వతీసమానురాలైన, అగసుతకున్ = గిరికాదేవికి, ఇక్కడ అగసుతయనెడి గిరికానామ మార్యా సామ్యమందుపయుక్త మగుచున్నది. ఆకల్పవిభూతిగలుగన్ = కల్పావధికమయినయైశ్వర్యముగలుగు నట్టులుగా, ఆళీతతిచేన్=సఖీసమూహముచేత, అనిచెన్ = పంపెంచెను. ఈపద్యము ద్విప్రాసముగలదిగాఁ జెప్పఁబడియెను.

సీ. జవరాలినెఱివేణి♦జడవాహములమించఁ దడియార్చి ముడిచెఁ బై♦దలియొకర్తు
తరుణికెంగ్రొవ్విదతుమ్మె♦దలదాఁటుదాఁట సంపఁగిదంటచెరివెఁ గో♦మలియొకర్తు
చెలువ వేనలిచిమ్మ♦చీఁకటిగికురింపఁ జంద్రసూర్యులనుంచెఁ ♦ జామయోర్తు
మగువకొప్పునభంబుఁ ♦ దెగడ నిర్దోషంపుఁజుక్కచేరుఘటించె ♦ సుదతియోర్తు

తే. నెలఁతతుఱుము మహామహానీలరాశిఁ
బకపకహసింప మరకతశకలకలిత
మృదులదూర్వాంకురములలోఁ గదియఁ జేసెఁ
జకితసారంగశాబలోచన యొకర్తు. 116

జవరాలి నెఱివేణి = గిరికాదేవి కేశబంధము, జడవాహములమించక = మేఘముల నతిక్రమించుకొఱకు, తడియార్చి ముడిచెఁ బైదలి యొకర్తు = ఒకచెలికత్తె తడిదుడిచి ముడిచెను, తడిలేకపోవుటయును ముడిగొనుటయును మేఘములకు సంభవింపవని భావము. తరుణికొప్పువ్వెద = గిరికాదేవికొప్పు, తుమ్మెదల దాఁటు దాఁటక = తుమ్మెద గుంపు నతిక్రమించుకొఱకై, సంపఁగిదండచెరివెఁ గోమలియొకర్తు = ఒకచెలికత్తియ సంపఁగిపూదండ చుట్టెను, తుమ్మెదలకు సంపంగిపువ్వులయొక్క సాంగత్యము లేదని భావము. చెలువవేనలి = గిరికాదేవికొప్పు, చిమ్మచీఁకటిఁగికురింపక = కాఱుచీఁకటిని వంచించుకొఱకు, చంద్రసూర్యులనుంచెఁ జామయోర్తు = ఒకచెలికత్తియ చంద్రసూర్యుల నునిచెనని యర్థము. చంద్రసూర్యరూపాభరణముల నుంచినదని భావము చీఁకటి చంద్రసూర్యులురాఁగా విరిసిపోవునని భావము. చామయనెడు పదము శ్యామాశబ్దమునకుఁ దద్భవము.

మగువకొప్పు = గిరికాదేవికచభారము, నభంబు దెగడక = ఆకాశమును దిరస్కరించుకొఱకు, సుదతియోర్తు=ఒకచెలికత్తియ, నిర్దోషంపుఁ జుక్కచేరు ఘటించెక = రాత్రియం దుదయింపని చుక్కచాలును ఘటించెనని యర్థము. ఆకాశమందు రాత్రి లేకపోయినచోఁ జుక్కలు గాన్పించవని భావము. (ని. 'దోషా నక్తఞ్చరజనా' అని అ.) దృశ్యాదిదశవిధదోషరహితమయిన ముత్యాలచేరును అని భావము.

నెలఁతతుఱుము = గిరికాదేవికొప్పు, మహామహానీలరాశిక = గొప్పలయిన మహానీలములయొక్క సమూహమును, పకపకహసింపక = పకపకనవ్వెడుకొఱకు - అనఁగా నపహాస్యము చేసెడుకొఱకు, చకితసారంగశాబలోచనయొకర్తు = భయపడిన లేడిపిల్లకన్నులవంటి కన్నులుగల యొకచెలికత్తియ, మరకతశకలకలిత = మరకతపుఁబచ్చలయొక్క మొలకలవలె నొప్పుచున్న, మృదుల = కోమలములైన, దూర్వాంకురములక = లేఁతగఱికిపోఁచలను, లోఁగదియఁజేసెక = లోపల నడఁగియుండునట్లుగా ముడిచెను - అనఁగా నంతర్లీనము చేసెననియర్థము.

మహానీలములు తృణము నంతర్లీనముగాఁ జేయవనుట. శుభార్థముగా దూర్వలను గొప్పునఁ గూర్చినారని భావము. మహానీలమనఁగా, (శ్లో. 'సింహళే స్యాకరే ద్భూతా మహానీలా స్తు తే స్మృతాః') ఇందుకు లక్షణము-

క. 'కప్పెసఁగు వెన్నవెదిరికి, పుప్పొరవన్నియకు సవతుఁబోలుననఁగా
ముప్పాలికరంగులతో, నొప్పుమహానీల మది శుభోన్నతిఁ జేయున్.

క. కసవుల నిసువులు గరముగ, వెసనిడి నీలంబుమీఁద విడనాడుటయుం
న్వెస సొగసిపోకనిలిచిన, వసుధఁ దృణగ్రాహి యనఁగ వర్ణన కెక్కున్.'

అని రత్నపరీక్షయందుఁ జెప్పఁబడియున్నది.

సూర్యచంద్రులను భూషణవిశేషములను నెఱులందుఁ బూర్వము దాల్చు నాచారము గలదు. ఇటులనుటకు-

చ. తరణిశశాంకు లాభరణదంభమునన్ వదనాత్మకైతవాం
బురడసితోత్పలాగ్రమున ముద్దియ కుంతలదేశ మాక్రమిం
చి రొకఫలంబు గాననగుఁ జివ్వనుచుం బరరూపయుక్తి ని
బ్బరముగ నంతసాంతముగ బ్రహ్మయొనర్చిన సీమవాల్పగున్. సర్వకామదాపరిణయము.

మ. ఘనశృంగారరసోత్తరంగరుచిరంగద్వేణికిం బాసికం
బున దండం బలుగట్టు గట్టి విలసన్ముక్తాకలాపచ్ఛలం
బునఁ దూ మేర్పడఁ బెట్టి బోటి గిరిజాభ్రూపుండ్రసౌభాగ్యము
ల్గనరం గస్తురిరేఖ దీర్చె నవకుల్యావైఖరి న్మించఁగన్. 117

ఘన = అధికమైన, శృంగారరస = శృంగారరసమనెడుర సముచేత-అనఁగా జలముచేత, ఉత్తరంగ = సాంద్రమయిన అని వేణీపరమయిన యర్థము. ఉన్నతతరంగములు గలదని నదీప్రవాహపరమైన యర్థము. రుచిరంగత్ - రుచి = కాంతియనెడు మాధుర్యరుచిచేత, రంగత్ = రంజితమయిన, వేణికిన్ = జడయనెడు నదీప్రవాహమునకు, బాసికంబునన్ = బాసికముచేత, దండన్ = సమీపమందు, బలుగట్టు గట్టి=దృఢమైనకట్టగట్టి, విలసత్ =ఒప్పుచున్న, ముక్తాకలాప=ముత్యాలబొట్టనెడి, ఛలంబునన్ = మిష చేత, తూమేర్పడఁబెట్టి=తూముకట్టి, బోటి=చెలికత్తియ, గిరిజా=గిరికాదేవియొక్క, భ్రూ=కనుబొమ్మల నెడు, పుండ్ర = ఎఱుపుగలిసిననల్ల చెఱకుయొక్క, సౌభాగ్యముల్గనరన్ = సౌష్ఠవము లొప్పునట్లుగా, ఇక్కడ భ్రూసౌందర్యంబును నిక్షుమాధుర్యంబును నని గ్రహింపవలయును. పుండ్రమనఁగా, నెఱుపు గలసిన నల్లచెఱకన్నందుకు - (శ్లో. 'ఇక్షుః పీతః పుండ్రకః కృష్ణరక్తః కాంతారస్స్యాచ్ఛ్వేతపీతస్తథైవ' అని రత్నాకరము వినఁబడుచున్నది.) నవ = నూతనమయిన, కుల్యా = కాలువయొక్క, వైఖరిన్ = రీతిచేత, మించఁగన్ = అతిశయించునట్టులుగా, కస్తురిరేఖదీర్చెన్ = రేఖాకృతిగాఁ గస్తూరిబొట్టు దీర్చెను. ఇందులోఁ జెఱకునకు మంచినీళ్లు పాఱినందునఁ దీపి పుట్టును గనుక రుచిరంగద్వేణి యని చెప్పినాఁడు. అలం. రూపకము. అపహ్నుతి.

శా. శ్యామోజ్జృంభితతారకావరరుచిన్ సంధించి యొంచు న్వసు
స్వామిన్ గన్గొనుచుం బ్రకామశరవర్షస్ఫూర్తిఁ జెన్నొంది ని
త్యామోదంబున మించు మంచుఁ జెలి నేత్రాబ్జంబుల న్వశ్యల
క్ష్మీమూలం బగు గావు నించె, నన నుంచెం గజ్జలం బింతికిన్. 118

ఈ పద్యములో నేత్రాబ్జంబులన్ - అని చెప్పుటచేత నబ్జపరముగాను నేత్రపరముగాను నర్థ ద్వయము విచారింపవలయును. ఏలాగనిన,

శ్యామోజ్జృంభిత తారకా వరరుచిన్ సంధించి-శ్యామా = రాత్రియందు, ఉజ్జృంభిత=ప్రకాశ మానుఁడైన, తారకావర = చంద్రునియొక్క, రుచిన్ = ప్రీతితోడ, సంధించి = కూడుకొనియని యబ్జ పరమైన యర్థము. (ని. 'శ్యామా స్యా చ్ఛారిబా నిశా' అని అ.) శ్యామ = నీలకాంతిచేత, ఉజ్జృంభిత = ప్రకాశమానమయిన, తారకా = కనీనికలయొక్క, వర = శ్రేష్ఠమయిన, రుచిన్ = కాంతితోడ

సంధించి యని నేత్రపరమైనభావము. ఎందుఁ = సకలదిక్కులయందును, వసుస్వామిన్గ్రొచుచుఁ = సూర్యునిఁజూచుచునని యర్థము. వసురాజునుగ్రొచుచునని భావము. ప్రకామశరవర్షస్ఫూర్తిఁజె న్నొందె-ప్రకామ=అధికమయిన, శరవర్షస్ఫూర్తిఁ=జలవర్షస్ఫూర్తిచేత, చెన్నొందె=సొంపు వహించి యని యర్థము. అధికమైన మన్మథబాణ వర్షస్ఫురణముచేతఁ జెన్నొందెనని భావము. నిత్యా మోదంబున మించుము=శాశ్వతమయిన పరిమళముచేత నతిశయించుమని యర్థము. ఆనందముచేత నతిశ యించుమనిభావము. అంచుఁ = అనిపలుకుచు, చెలి = చెలికత్తియ, ఇంతికిఁ=గిరికాదేవికి, నేత్రాబ్జం బులఁ=కమలములవంటి నేత్రములయందు, వశ్యలక్ష్మీమూలంబుగు = అనఁగాఁ జంద్రసూర్యాదిమిత్రా మిత్రవశ్యసంపత్తికి మూలమయిన. కావునించెననఁ = కావలిఁబొట్టుపెట్టినదో యన్నట్టులుగా నని యర్థము. వసురాజవశ్యసంపదమూలమని భావము. ఉంచెంగజలంబు = కాటుకపెట్టెను. శరశబ్దమునకు- (ని.'శరో దధ్యాద్యగ్రసారే బాణే కాణ్డే తృణాంతరే, శరంతుపేనే' అని నానార్థరత్నమాల.) తామర పూవులు చంద్రకాంతిని సహింపఁజాలవు. సూర్యుని దర్శింపఁగలవు. అధికమగు వర్షకాలమునఁ దావులఁ గోలుపోవును. కనుదమ్ములు చంద్రకాంతిని దిలకింపఁగలవు. సూర్యకాంతిని సందర్శింపఁజాలవు. వర్ష కాలమున నామోదము గోలుపోవు. మిత్రులను మిత్రులుగాఁ జేసికొనుట కాదు. శత్రువులనుమిత్రులఁజేసి కొనుట కర్తవ్యము. ఇందులకు వశ్యాంజనముఁ బెట్టుకొనునటుల గిరిక కనులకుఁ గాటుకఁ బెట్టుకొనె నని భావము. అలం. శ్లేషము. ఉత్ప్రేక్ష.

మ. అతితీవ్రాశుగవృత్తిమై నతనుధన్వాభోగసీమ న్గతా
గతము ల్సల్పి భ్రమించులోలతరవీక్షాపాతపాంథాళికిన్
శ్రుతికూపాంతసుధానిపానకము లై శోభిల్లునిత్యప్రభాం
చితవజ్రోపలకుండలంబులు ఘటించెన్ బోటి పూఁబోఁడికిన్. 119

అతితీవ్రాశుగవృత్తిమైన్ - ఆశుగశబ్దము బాణమందును వాయువందును వర్తించుచున్నది. (ని. 'ఆశుగౌ వాయు విశిఖౌ' అని అ.) అతితీవ్ర = అత్యంతతీక్ష్ణమయిన. ఆశుగవృత్తిమైన్=బాణ వృత్తిచేతనని వీక్షాపరమయిన యర్థము. అతివేగముగల వాయువృత్తిచేతను-అనఁగా వడగాలి వేగము చేత నని పాంథపరమయిన యర్థము. అతనుధన్వాభోగసీమన్ - అతను = మన్మథునియొక్క, ధన్వా భోగసీమన్ = ధనుఃపరిపూర్ణత్వసీమయందునని వీక్షాపరమైన యర్థము. ఇక్కడ నుపమానమయిన మన్మథచాపముచేతనే యుపమేయమయిన భ్రూవల్లిని జెప్పినాఁడు. అతను=అధికమయిన, ధన్వాభోగ సీమన్-ధన్వయనఁగా జాంగలదేశంబును గనుక మరుభూప్రదేశమందని పాంథపరమయినయర్థము. (ని. 'ధన్వజాఙ్గలదేశేస్యా ద్ధన్వ చాపే స్థలే ఽపిచ' అని వి.) గతాగతముల్సల్పిభ్రమించు = రాక పోకలుచేయుచుఁ దిరుగుచుండెడు, లోలతరవీక్షాపాతపాంథాళికిన్=లోలశబ్దము చలనమందును తృష్ణ గలవానియందును వర్తించుచున్నది. (ని. 'లోల శ్చలస తృష్ణయోః' అని వి.) లోలతర = మిక్కిలి చంచలములైన, వీక్షాపాత = దృష్టిపాతములనెడు, లోలతర = మిక్కిలి తృష్ణతోఁగూడిన, పాంథాళి కిన్ = పథికసమూహమునకు, శ్రుతికూపాంతసుధానిపానకములై-శ్రుతి=కర్ణములనెడు, కూప = బావుల యొక్క, అంత = సమీపమందలి, సుధానిపానకములయి = సుధయనఁగా సున్నమును నమృతమును, నిపానమనఁగా నీళ్ళకుఁ గట్టించిన ధర్మగాడియును జలాశయమును, (శ్లో. 'ఆపానస్తు నిపానం స్యాదుప

కూపజలాశయే' అని అ.) సున్నపుగచ్చుచేసిన నిపానములయి యని యర్థము. లేక యమృత జలాశయములనియును జెప్పవచ్చును. శోభిల్లు=ప్రకాశించుచున్న, నిత్యప్రభాంచిత=నిత్యమయిన కాంతి చేత నొప్పుచున్న, వజ్రోపలకుండలంబులు = వజ్రమణిమయములయినకమ్మలు, ప్రౌఢబోడికిన్ = గిరికా దేవికి, బోటి = ఒకచెలికత్తియ, ఘటించెన్ = సంఘటనముచేసెను-అనఁగాఁ జెవులఁబెట్టెననుట. కను బొమ్మలు మరునివిండ్లు. ఇందుండివచ్చుములుకులు వీక్షాపాతములు. అవి తీవ్రములు, లోలతరములు. కడకంటిచూపులు కర్ణపర్యంతము ప్రసరించి యటనుండి మఱలుచున్నవి. అంతతో నాగక రాకపోకలు చేయుచున్నవి. ఇదియంతయు వెనుగాలిచే నలసినబాటసారి మరుభూమిలో నిటునటు తిరిగి జలాశయముఁ జేరి నీరుద్రావి విశ్రమించినటు లుండె నని భావము.

చూపులు శ్రవణసీమలను విశ్రమించుచున్నవనుటచే నపాంగముల దైర్ఘ్యము కటాక్షముల దైర్ఘ్యము సూచితము. చూపులు చెవివద్ద నాగుననుట సుప్రసిద్ధము.

తే-గీ. 'శ్రవణపుటకూపవినిపాతసాధ్వసమున, నిగిడి యవ్వలి కటు పోక నిల్చెఁ గాక
యధికచపలస్వభావంబు లైనయట్టి,దీనికన్నులు తలచుట్టు తిరిగి రావె.' శృంగారనై. ఆ. 3

శ్లో. 'శ్రుతేరపి పరం పారంగతే లోచనే.' భర్తృహరి.

మ. శ్రుతికూపామృతము న్వతంసకళికా◆ర్ణోయంత్రసంక్రాంతదీ
ధితిదండోజ్జ్వలవర్తులాభరణపా◆త్రి న్నించి తాటంకక
ల్పితకుల్యాముఖహీరసారకిరణో◆ద్భేదంబు పేర న్వెలా
ర్చి తటిద్దేహకు నవ్యపత్త్రలతికా◆శ్రీ నించి రాళీజనుల్. 120

శ్రుతికూపామృతమున్ = చెవియనెడు బావియందలి యుదకమును, వతంస = కర్ణపూర మైన, కళికా = పూమొగ్గయనెడు, అర్ణోయంత్ర = ఏతపుసిడియందు, సంక్రాంత = తగులుకొన్న, దీధితి = కాంతియనెడు, దండ = దండకాష్ఠముచేత, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, వర్తులాభరణ = రత్నపుబవిరయనెడు, పాత్రిన్ = పాత్రయందు, నించి = నిండించి, తాటంక = కర్ణకుండలమనెడు, కల్పితకుల్యాముఖ = కుల్యాముఖమనఁగాఁ గాలువ మొదటనుండెడు నేతపుబానలో నీళ్లు గ్రుమ్మ రించెడు మోటతొట్టి గనుక కల్పింపఁబడిన కుల్యాముఖముయొక్క, హీరసారకిరణోద్భేదంబు పేరన్ = వజ్రమణులయొక్క శ్రేష్ఠమయిన కిరణప్రసరణమనెడు మిషచేత, వెలార్చి = వెళ్ళఁబోసి, తటిద్దేహకున్ = మెఱుపుతీఁగెవంటి దేహముగల గిరికాదేవికి, ఆళీజనుల్ = సఖీజనులు, నవ్య = నూతనమయిన, పత్త్రలతికా = మకరికాపత్త్రరచనలనెడు, పత్త్రలతికా = పత్త్రయుతములైన తీఁగెలయొక్క, శ్రీ = సమృద్ధిని, నించిరి=కలుగఁజేసిరి.

ఇందులో గిరికాదేవియొక్క కర్ణావతంసమయిన పూమొగ్గ నేతపుసిడిగాను రత్నపుబవిరను నేతపుబానగాను బవిరయొక్క కిరణమును దండకాష్ఠముగాను, ననఁగా నేతపుగడగాను వజ్రకుండల మును బానలో నీళ్లు గ్రుమ్మరించెడు కాలువ మొదటితొట్టిగాను గుండలహీరకిరణప్రసరణమును శ్రుతికూ పోదకనిస్సరణముగాను బత్త్రరచనలను బత్త్రయుతలతలుగాను జెప్పినాఁడు. గిరికకు వజ్రమయము లగు కర్ణభూషణములు, రత్నఖచితములగు బవిరలు నలంకరించిరనియుఁ జెక్కులమకరికాపత్త్రాదిరేఖలు చెవిపువ్వు నలరించిరని భావము. చెవియం దలంకారముగాఁ బూవునో పూమొగ్గనో యలంకరింతురు,

సీ. 'అవతంసకుసుమంబునం దున్న యెలదేటి రుతికించిదంచితశ్రుతులసీన.' మనుచరిత్రము.

చ. సురభికురంగనాభికళ • చొక్కపుఁగుంకుమఁ గప్పి కుంకుమ
స్ఫురితమహోష్మఁ గప్పురపుఁబోఁకుల మాన్పి కప్పురంపుఁజ
ల్లిరి మెఱుఁగుంజవాది నెడలించి కదంబము గూర్చి నెచ్చెలు
ల్దరుణి కలంది రన్నియును • దత్తనువాసనఁ బూవుగట్టుచున్. 121

సురభి=మనోహరమయిన పరిమళముగల, కురంగనాభి=కస్తూరియొక్క, కళ=డాగు, చొక్కపుఁగుంకుమకప్పి=శ్రేష్ఠమయిన కుంకుమపువ్వుచేతఁ గప్పికపఱచి, కుంకుమస్ఫురితమహోష్మన్ = ఆకుంకుమపువ్వునందు స్ఫురించుచున్న యెక్కువకాఁకను, కప్పురపుఁబోఁకులమాన్పి = కర్పూరమేళనముచేత నివారించి, కప్పురంపుఁజల్లిరి = ఆకర్పూరమందలి శైత్యమును, మెఱుఁగుంజవాది నెడలించి = నిగ్గుగల జవ్వాదిచేతఁబోఁగొట్టి, కదంబముగూర్చి=కలపమేర్పఱిచి, అన్నియును దత్తనువాసనఁబూవుకట్టుచున్ = ఈచెప్పఁబడిన పరిమళద్రవ్యము లన్నిటిని నాగిరికాదేవియొక్క శరీరపరిమళముచేత వాసనాయుక్తములనుగాఁ జేయుచును, నెచ్చెలులు = చెలికత్తియలు, తరుణికిన్ = గిరికాదేవికి, అలందిరి = పూసిరి. గిరికమేన సుగంధవస్తువు లందవలయునుగానఁ దొలుతఁ గస్తురి బూసిరి. అది నల్లగ నుండుటచేఁ గుంకుమచే నాకళఁ గప్పిరి. కుంకుమపూవు వేఁడిగాన నావేఁడిని బచ్చకప్పురపుఁబూతతో నివారించిరి. పచ్చకప్పురము చలువగాన నాచలువ జవాదితో నుపశమింపఁజేసిరి. అన్నియుఁ దొలఁగించి కలప మలందిరి. సుగంధవస్తువులకంటె నాయికమేనే సుగంధముగా నుండెననిభావము.

సీ. అధరమాధుర్యభి•క్షాగతం బగుసుధాఘుటిక నా ముంగరఁ • గుదురుపఱిచి
సమయానుగుణమహో•చ్చగతగ్రహాళినాఁ జనుదోయి నవరత్న•సరము వైచి
కిసలకోరకభృంగ•కీరవర్గంబు నా దోర్వల్లి బలువన్నె•తొడవు లునిచి
ఘనకుచాంగజదుర్గ•కల్పితాధరవప్రపరిధి నా నొడ్డాణ • మిరవుకొల్పి
తే. యనఘజఘనానుషంగ మ•ష్టాంగయోగ
కలన నివి గాంచె నన వజ్ర•కాంచిక లిడి
యంగజితరతిబిరుదాంక • మంఘ్రిఁ గట్టు
కరణి మణిమయమకరనూ•పురము దొడిగి. 122

అధరమాధుర్యభిక్షాగతంబగు = అధరోష్ఠమందలి తియ్యఁదనముయొక్క భిక్షమడుగఁగోనునిమిత్తమయివచ్చిన, సుధాఘుటికనాన్ = అమృతగుళికయో యన్నట్లులుగా, ముంగరఁగుదురుపఱచి=ముక్కుముత్తియమును గుదురుగాఁబెట్టి, సమయానుగుణమహోచ్చగతమనెడువిశేషము గ్రహాళికిని నవరత్నసరమునకును నుభయత్ర చెప్పవలయును. ఏలాగనిన,

సమయానుగుణ = వివాహసమయమున కనురూపముగా, మహోచ్చగత=పరమోచ్చము బొందిన అని గ్రహాళిపరముగాఁ జెప్పవలెను. సమ్యక్ = లెస్సయిన, అయ = శుభావహకర్మ దేనియందో యది సమయము. ని 'అయ శ్శుభావహో విధిః' అని అ. అటువంటిదియు, అనుగుణ=గుణమనఁగా సూత్రము గనుక ననుగతమయినసూత్రము దేనికిఁ గలదో యది యనుగుణము, అటువంటిదియు, మహోచ్చగత = కుచరూపమయిన యున్నతస్థానమును బొందినదియు నని నవరత్నసరముపరముగాఁ జెప్పవల

యును. అనఁగా సమయానుగుణ మహోచ్చగతగ్రహపంక్తియో యన్నట్టులుగా సమయానుగుణ మహోచ్చగత నవరత్నసరమును జఘనదోయియందు వైచి యని యర్థము. నవరత్నములను వర్ణసామ్య నిమిత్తముచేత నవగ్రహములనుగా నుత్ప్రేక్షించినాఁడు. గ్రహపరమయిన యర్థమహోచ్చగతులన్నం దుకు సూర్యాదిగ్రహములకు మేషాదిరాసు లుచ్చస్థానములు. మేషాదిరాసులయొక్క ౧౦-౩-౨౮-౧౫-౫-౨౭-౨౦ భాగములు పరమోచ్చభాగములు. ఉచ్చస్థానమున కేడవదినీచస్థానము. ఇందుకు, శ్లో. 'అజవృషభమృగాఙ్గనాకుళీరాఝషవణిజౌచ దివాకరాదితుఙ్గాః, దశశిఖిమనుయుక్తిథీంద్రియాంశై స్త్రినవకవింశతిభస్తదస్తనీచః' అని జ్యోతిశ్శాస్త్రము.

కిసల = ఎఱ్ఱని చిగుళ్లయొక్కయు, (ని. 'కిసాలయం కిసలయం కిసాలం కిసలం కిసమ్' అని ద్విరూపకోశము.) కోరక = తెల్లని పూమొగ్గలయొక్కయు, భృంగ=నల్లని తుమ్మెదలయొక్కయు, కీర= పచ్చనిచిలుకలయొక్కయు, వర్గంబునాఁ=సమూహమో యన్నట్టులుగా, దోర్వల్లిఁ = బాహువనెడు తీఁగెయందు, పలువన్నె తొడవులునిచి = రక్త శ్వేత నీల హరిద్వర్ణములు గల పద్మరాగ మౌక్తిక హరి నీల మరకతమణిమయము లైనభూషణములు పెట్టి, ఘన = గొప్పలయిన, కుచ = స్తనములనెడు, అంగజ దుర్గ = మన్మథగిరిదుర్గములకు, కల్పిత = రచింపఁబడిన, అధరవప్ర = క్రిందికోటయొక్క, పరిధినాఁ= వలయమోయన్నట్టులుగా, ఒడ్డాణమిరవుకొల్పి = ఒడ్డాణము పెట్టి,

అనఘ = రమ్యమయిన, జఘన=కటిపురోభాగముయొక్క, అనుషంగము=సాంగత్యమును, ఇవి= ఈవజ్రకాంచికలు, అష్టాంగయోగకలనఁ = (యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధిరూపాష్టాంగయోగములచేత నని యర్థము.) అష్టధారాయోగముచేత నని భావము. వజ్రమున కష్టధార లుండును.

ఇందుకుఁ బ్రమాణము-

క. 'రూపొందవి చులకనై మెఱుఁగెసారఁగ వానిధార లెనిమిది యగుచుఁ
దా తేల్చు మూలలాఱై, చూపట్టుట వజ్రమణికి శుద్ధగుణంబుల్.'

అని రత్నపరీక్షయందుఁ జెప్పఁబడియున్నది.

కాంచెననఁ = పొందినవోయన్నట్టులుగా, వజ్రకాంచికలిడి = వజ్రమణిమయములైన మొల నూళ్లు పెట్టి, అంగ = శరీరసౌందర్యముచేత, జిత=జయింపఁబడిన, రతి=రతీదేవియొక్క, (ని. 'అథోరతిః, రతీ కామప్రియాప్రీత్యోః' అని నానార్థరత్నమాల.) బిరుదాంకము = మకరాకారమగు బిరుదు టెక్కెమును, అంఘ్రిఁగట్టుకరణిఁ = కాలను గట్టినట్టులుగాను, మణిమయమకరనూపురము దొడిగి = రత్నమయమయిన మకరాకారమంజీరమును దొడిగినవారై, (ని. 'పాదాఙ్గదం తులాకోటి ర్మఞ్జీరో నూపురోస్త్రియామ్' అని యమరము.)

గిరికాదేవి నాసికకు ముంగరయును, గుబ్బలపై రత్నహారములు, బాహువులకు రత్నఖచిత వివిధభూషణములు, నడుమునకు నొడ్డాణము, కటిపురోభాగమునందు వజ్రకాంచికలును, పాదములకు మణినూపురములు చెలికత్తె లలంకరించిరని భావము. అలం. ఉత్ప్రేక్ష.

చ. చెలువలు బాల నిట్లు గయిసేయఁగఁ బైదలి యోర్తు రాగ మం
ఘ్రిల నలరించి చూచితిరె • కొమ్మలు తమ్ము లినాంఘ్రిరాగకం

దళీఁ దగు ధాత్రి నీయరిది • తమ్ము లినోజ్జ్వలమౌళిరంజనా
కలనము లంచుఁ బల్కఁ జెలి • కన్నుల నించుక నించె రాగమున్. 123

చెలువలు=చెలికత్తియలు, బాలనిట్లుగయిసేయఁగన్ = గిరికాదేవి నీప్రకారము శృంగారింపఁగా, పైదలియోర్తు = వారిలో నొకచెలికత్తె, రాగమంఘ్రులనలరించి = లాక్షారసముచే పాదములయం దలంకరించి, చూచితిరే కొమ్మలు = చెలులారా యును జూచితిరా యిది, ధాత్రిన్=భూమియందు, (ని. 'ఉపమాతా చ ధాత్రీ స్యా ద్భూమి రామలకీ చ సా' అని నానార్థరత్నమాల.) తమ్ములు=ప్రసిద్ధములయిన కమలములు, ఇనాంఘ్రిరాగకందళీఁదగు-ఇనశబ్దము పతియందును సూర్యునియందును వర్తించుచున్నది. (ని. 'ఇన స్సూర్యే నృపే పత్యౌ' అని ఐ.) ఇన = పతియొక్క, అంఘ్రి = పాదములయొక్క, రాగకందళిన్ = రక్తిమాంకురములచేత, తగున్ = ఒప్పుచుండును, అని యర్థము. అనఁగాఁ దత్రంజితములనుట. సూర్యకిరణజన్య రక్తాంకురములచేతఁ దగు నని భావము. నీయరిది తమ్ములు = అనఁగా నీగిరికాచరణరూపము లయిన విచిత్రకమలములు. ఇక్కడఁ జరణములను నిగరణముచేసి తమ్ములని చెప్పినాఁడు. ఇన = పతియొక్క, ఉజ్జ్వల=ప్రకాశమానమగుచున్న, మౌళి=కిరీటముయొక్క, ('ని. 'మౌళి స్సంయతకేశేషు చూడాయాం మకుటే ద్వయోః' అని నానార్థరత్నమాల.) రంజన = రంజనమందు-అనఁగాఁ గిరీటమును ప్రకాశింపఁజేయుటయందు, ఆకలనములు = సమర్థములయినవి, అంచున్=కాలాగని, పల్కన్ = వచింపఁగా-అనఁగా సురతబంధవిశేషమందుఁగాని ప్రణయకోపనివారణార్థముగాని, పెనిమిటిచేత శిరసావహింపఁ బడుచున్నవని తాత్పర్యము. చెలి = గిరికాదేవి, కన్నులన్ = నేత్రములయందు, రాగమున్ = రక్తిమను, ఇంచుకనించెన్ = కొంచెముగా నింపెను. అనఁగాఁ జెలికత్తెపలికిన నర్మోక్తికి లజ్జాయుక్తమయిన కోపముచేత నించుకంత కన్నెఱ్ఱఁజేసెననుట.

ఈపద్యమున లళలకభేదప్రాసము. దీనికి లక్షణము-

తే. 'రేఫమునకుఁ బైనుండు మాతృకకుఁ బెద్ద
ళాయభేదాఖ్యయప్రాస మై యెసంగు.' అని యప్పకవీయము.

కమలములు ఇనాంఘ్రిరాగకందళమున రాగవంతము లగుచుండును. గిరికాపాదము లరిదితమ్ములు. కావున ఇనోజ్జ్వలమౌళిరంజనాకలనములు. అనఁగా గిరికాపాదములు సురతవిశేషములందును, ప్రణయకోపమునందును వసురాజుచే శిరసావహింపఁబడనున్నవని భావము. గిరిక కనులందు రాగము (అనురాగము కెంజాయ) నించుట యించుక చెలికారముకొలఁది కోపము సూచించుటకు.

శా. కాంత ల్ముక్తిమతీనగేంద్రభవము • క్తారత్నరాజిం దదే
కాంతస్వచ్ఛశరీరయుక్తి ననుజా • కల్యాణవేళాప్రస
త్కాంతు ల్మించిరి గాక కానియెడ లో • కశ్లాఘ్యసౌభాగ్యవ
త్కాంతాలోకమణి న్మణీశతములం • గై సేయఁగా ముగ్ధలే. 124

కాంతల్ = గిరికాదేవిచెలికత్తెలు, శుక్తిమతీ=శుక్తిమతీనదివల్లను, నగేంద్ర=కోలాహలునివల్లను, భవ = సంభవించిన, ముక్తా=ముత్యములయొక్కయు, రత్న=పద్మరాగాదిమణులయొక్కయు, రాజిన్ = సమూహమందు, ఇక్కడ శుక్తిమతీసంభవములయినవి ముత్యములనియుఁ గోలాహలపర్వతసంభవములయినవి పద్మరాగమణులనియు న క్రమాలంకారము. తత్ = ఆగిరికాదేవియొక్క, ఏకాంతస్వచ్ఛ =

నితాంతనిర్మలమైన, శరీర = దేహముయొక్క, యుక్తిఁ = యోగముచేత, అనుజా = తోఁడఁబుట్టినదైన గిరికాదేవియొక్క, కళ్యాణవేళా = వివాహసమయమునకు, అర్హా = తగిన, సత్కాంతుల్ = శ్రేష్ఠమయిన కాంతులను, నించిరిగాక = నిండఁజేసిరే కాక, ఇక్కడ శుక్తిమతీనగేంద్రభవయనెడు ముక్తారత్నరాజియొక్క విశేషణము గిరికాదేవికి రత్నానుజత్వమును సమర్థించుచున్నది. అనఁగా రత్నముల కనుజయైన గిరికాదేవియొక్క వివాహసమయమునకుఁ దగునట్లులుగా గిరికాదేహకాంతులచేత నలంకరించిరా రనుట. కానియెడన్ = అనఁగా గిరికాదేహకాంతులచేతనే రత్నముల నలంకరించుట గాకపోయినట్టయిన, లోకశ్లాఘ్య = లోకములవారిచేతఁ గొనియాడఁదగిన, సౌభాగ్యవత్ = సౌందర్యముగలిగిన, కాంతాలోక = మనోహరప్రకాశము గలిగిన, మణిన్ = రత్నమును అని యర్థము. (ని. 'ఆలోకాదర్శనద్యుతీ' అని అ.) కాంతాజనరత్నమని భావము. మణీశకలములన్ = రత్నసమూహములచేత, కైసేయఁగాన్ = అలంకరించుటకును, ముగ్ధలే = తెలియనివారా-అనఁగాఁ గారనుట. (ని. 'అథ త్రిషు, ముగ్ధ స్సౌన్యే నవే మూఢే' అని నానార్థరత్నమాల.)

గిరికాదేవికి నలంకరించినరత్నాభరణము లామెయొక్కదేహకాంతిచేతఁ బ్రకాశించుచున్నవే కాని యాభరణము లామెదేహమును బ్రకాశింపఁజేయఁజాలక యుండెనని ఫలితార్థము. ముత్యములు శుక్తిమతీసంజనితములు, రత్నములు కోలాహలసంజాతములు. ఈరెంటికిని గిరిక యనుజ. తోఁబుట్టువు వివాహమున నగ్రజాతు లలంకరించుకొనవలయును గదా! గిరికాదేవియొక్క యేకాంతస్వచ్ఛతను సంపర్కమున ముక్తారత్నము లలంకృతము లయ్యెను. సోదరీవివాహమున నగ్రజాతములగు ముక్తారత్నముల నలంకరించుట జరిగినది. మనోహరాకారములకు భూషణము లలంకరణములు కాఁజాలవు. ఇటు లనుటకు-

శ్లో. 'సరసిజమనువిద్ధం శైవలేనాపి రమ్యం, మలినమపి హిమాంశోః లక్ష్మలక్ష్మీం తనోతి
ఇయ మధికమనోజ్ఞావల్కలేనాపి రమ్యా, కిమివహి మధురాణా మాకృతి ర్మండనానాం.'
అభిజ్ఞానశాకుంతలము.

శా. నానాభూషణరత్నజాలములలోనం బొల్చునాత్మీయ కా
యానుచ్ఛాయలచేఁ గరం బలరె మేనాపత్యసత్పుత్రి, నె
ష్మేను ల్దాల్చి శుభాధిదేవతలు సంప్రీతిం బ్రవేష్టింప ని
త్యానందంబున నంద మొందునరవిందావాసచందంబునన్. 125

నానాభూషణరత్నజాలములలోనన్ = సకలాభరణములయందలి రత్నసమూహములలోపల, పొల్చు = ప్రకాశించుచున్న, ఆత్మీయకాయానుచ్ఛాయలచేన్ = నిజశరీరప్రతిబింబములచేత, మేనా = మేనకాదేవియొక్క, అపత్య = కుమారుఁడయినకోలాహలునియొక్క, సత్పుత్రి = కుమారికయైన గిరికాదేవి, కరంబలరెన్ = మిగుల నొప్పుచుండెను. ఏలాగనిన, నెష్మేనుల్దాల్చి = చక్కని శరీరములు ధరించి, శుభాధిదేవతలు = మంగళాధిదేవతలు, సంప్రీతిం బ్రవేష్టింపన్ = అధికప్రేమచేతఁ బరివేష్టించికొలువఁగా, నిత్యానందంబున నందమొందు = నిత్యమయిన యానందముచేత నొప్పుచుండెడు, అరవిందావాసచందంబునన్ = లక్ష్మీదేవివలె, కరంబలరె నని సంబంధము.

ఇందులో భూషణ రత్నసమూహములయందుఁ బ్రతిబింబించిన గిరికాదేహములను శుభాధిదేవతలనుగాను గిరికాదేవిని లక్ష్మీదేవినిగాను జెప్పినాఁడు. అలం. ఉపమ.

క. ఐదువగాణీలశుభా, పాదనగేయములపేర • భారతి సతిపై
మోదమున ధవళవర్ణ, ప్రాదుర్భావంబు నెఱపెఁ • బలుమఱు నచటన్. 126

ఐదువగాణీల = గాణీశబ్దము గాయనీశబ్దతద్భవము. ముత్తైదువలయిన గాయకులయొక్క, శుభాపాదనగేయముల పేరన్ = మంగళగానముల నెడు వ్యాజముచేత, భారతి = సరస్వతీదేవి - అనఁగా గేయరూపభారతియనుట. సతిపై మోదమునన్ = గిరికాదేవిమీఁది సంతోషముచేత, ధవళవర్ణప్రాదుర్భావంబు నెఱపెఁ బలుమఱు నచటన్ = మాటిమాటికి నివాసస్థలమందు శుభస్వరూపప్రాదుర్భావమును ఘటింపఁజేసెననియును ధవళాక్షరప్రాదుర్భావమును ఘటింపఁజేసె నని యర్థము.

ధవళవర్ణములనఁగా పెండ్లిపాటలయొక్క రాగములని భావము. పెండ్లిలో ధవళము పాడుట ప్రకటము. భారతీశబ్దమునకు, (ని. 'బ్రాహ్మీతు భారతీభాషా గీర్వాగ్వాణీ సరస్వతీ' అని యమరము.) ధవళములు వివాహములలోఁ బాడుట ప్రసిద్ధమనుటకు గ్రంథాంతరములందు నైక మాధారములు గలవు.

క. ఎడలేదు లగనమనుచున్, బడిబడి పిలువంగ నపుడు బలుపాయివముల్
గడలుకొనంగా నచ్చర, పడఁతుల ధవళములు పెండ్లిపాటలు చెలఁగెన్.

యయాతిచరిత్రము. ఆ ౪.

ఆశ్వాసాంతము

శా.సంధాభార్గవ భార్గవహ్నినయన • జ్వాలాభశౌర్యప్రభా
సంధానాదర నాదరక్తిరసిక • శ్యామామనోవారణా
స్కంధారోహణ రోహణప్రతిమదో • శ్చారుక్ష్మాపాలసం
బంధాపాదన పాదవప్రహయరా • డ్భాస్వత్సపాదాంకనా. 127

సంధా = ప్రతిజ్ఞయందు, భార్గవ=పరశురాముఁడవైనవాఁడా, ని. 'సంధా ప్రతిజ్ఞా మర్యాదా' అని అ. భార్గ = భర్గసంబంధియైన - అనఁగా శివసంబంధియైన, వహ్నినయన = అగ్నిమయనేత్రముయొక్క, జ్వాలా = మంటలయొక్క, అభ = ప్రకాశమువంటి ప్రకాశముగల, శౌర్యప్రభా = ప్రతాపప్రకాశముయొక్క, సంధాన = కూర్పుటయందలి, ఆదర = ఆసక్తిగలవాఁడా - అనఁగా ప్రతాపశీలుఁడనుట. నాదరక్తిరసిక = గానమందలి రసికత్వముగల, శ్యామా = యౌవనమధ్యస్థలైన స్త్రీలయొక్క, మనః = మనస్సనెడు, వారణస్కంధ = గజస్కంధమందలి, ఆరోహణ = ఎక్కుటగలవాఁడా యని యర్థము. గానరసికత్వముగల శ్యామలయొక్క, అనఁగా యౌవనమధ్యస్థలైన ప్రేంకణపుఁదీఁగలయొక్క, మనః = మనస్సనెడు, అవారణస్కంధ = అవార్యప్రకాండమందలి, ఆరోహణ = ఎక్కుటగలవాఁడా యనియును నర్థాంతరము. ప్రేంకణమునకు గానము దోహదక్రియ యని ప్రసిద్ధము. శ్యామయనఁగా నప్రసూతాంగనయును ప్రేంకణమును, స్కంధమనఁగా భుజమూలంబును వృక్షప్రకాండంబును, అనఁగా వృక్షమూలము మొదలుకొని కొమ్మలపర్యంతముండెడు మ్రాఁకు, ని. 'స్కంధః ప్రకాండే కాయేచ బాహుమూల సమూహయోః' అని అ. రోహణప్రతిమ = రత్నప్రదానమందు రోహణాచలసమానమయిన, దోః = దక్షిణబాహువుచేత, చారు = ఒప్పుచున్న, క్ష్మాపాల = రాజులతోడ, సంబంధాపాదన = సంబంధముచేసినవాఁడా, పాదవప్ర = పాదప్రణతుఁడయిన, హయరాట్ = అశ్వపతియొక్క, భాస్వత్ = అన్వర్థభాసురమయిన, సపాదాంకనా = సపాదుఁడనెడు నామముగలవాఁడా, అని యాశ్వాసాంతమందుఁ గృతిపతిసంబోధనము. ఈ పద్యము ముక్తపదగ్రస్తము గలదిగాఁ జెప్పంబడియెను.

క. ఖల్యాభయకర హయఖుర, హల్యాహతజన్యజాంగలాంగణఫలసా
కల్యావహ బహుదిగ్జయ, కల్యాణ నిజామగుప్తకల్యాణహరా. 128

ఖల్యా=ఖలసమూహమునకు, భయకర=భయంకరుఁడవైనవాఁడా, ని. 'ఖలానాం ఖలినీ ఖల్యా' అని అ. హయ = గుఱ్ఱములయొక్క, ఖుర = గిట్టలనెడు, హల్యా = హలసమూహముచేత, ని. 'హల్యా హలానాం' అని అ. ఆహత = దున్నఁబడిన, జన్య = యుద్ధమనెడు, జాంగలాంగణ=ని. 'జాంగలః జలనిర్ముక్తదేశే' అని వి. జలనిర్ముక్తప్రదేశమునకు, ఫలసాకల్యావహ = సస్యసమగ్రతాసంపాదకుఁడ వైనవాఁడా యని యర్థము. ఫలమనఁగా బాణాగ్రమని భావము. ని. 'సస్య బాణాగ్రయోః ఫలమ్' అని వి. నిర్జలప్రదేశమందు సంపూర్ణఫలప్రాప్తిచేసినాఁడని యద్భుతార్థము. బహుదిగ్జయకల్యాణ = అనేకదిగ్జయరూపమయిన మంగళముగలవాఁడా, నిజామ=నిజాముచేత, గుప్త=రక్షింపఁబడిన, కల్యాణ=కల్యాణపట్టణమును, హరా = సాధించినవాఁడా యని యర్థము. నిజామునిచేత దాఁచఁబడిన సువర్ణమును హరించినవాఁడా యని యర్థము.

తరల. ద్రమిళలాటకురువరాటదహాళఖోటకుంభినీ
రమణజూటతటకిరీటరత్నపాటలప్రభా
కమలఝాట కలితకూటకనకవాట సంభ్రమ
ద్భ్రమితఘోట బెడదకోటపటుకవాటపాటనా. 129

ద్రమిళలాటకురువరాట దహాళఖోట=ద్రమిళ లాట కురు వరాట దహాళ ఖోట అనెడు దేశములయొక్క, కుంభినీరమణ = రాజులయొక్క, జూటతట = శిరస్సులయందలి, కిరీట = కిరీటములయందలి, రత్న = మణులయొక్క, పాటలప్రభా= తెలుపుగలిసిన యెఱుపుచాయలనెడు, కమలఝాట= పద్మవనముగలవాఁడా, కలిత = ఉన్నతములయిన, కూట = శిఖరములుగల, కనక = కనకగిరియొక్క, ఇక్కడ, ని. 'నామైకదేశే నామగ్రహణమ్' అని యున్నది గనుకఁ గనకశబ్దముచేతఁ గనకగిరి చెప్పఁబడినది. వాట = మార్గమందు, ని. 'వాటోమార్గేవృతిస్థానే' అని మేదిని, సంభ్రమత్ = ధాటీవేగముచేత, భ్రమిత = భ్రమించుచున్న, ఘోట = గుఱ్ఱములుగలవాఁడా, బెడదకోట = బెడదకోటయనెడు పట్టణముయొక్క, పటు = సమర్థములయిన, కవాట = పెద్ద దరవాజాతలుపులయొక్క, పాటనా = భేదనముగలవాఁడా అనఁగా బెడదకోటపట్టణపుఁ దలుపులు బ్రద్దలుచేసి లోపలికిఁబోయి జయించినాఁడనుట, ఈ వృత్తమునకు న భ స న జ ర గణము లుండవలయును. పదునొకండవ యక్షరము యతిస్థానము.

గద్యము. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందవందనపవననందనప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకషచతుర్విధకవితానిర్వాహకసాహిత్య రసపోషణరామరాజభూషణప్రణీతం బయిన వసుచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

ఇది శ్రీమదాత్రేయకులకలశాంభోనిధి సంపూర్ణసోమసోమాభిధానమంత్రి వరపౌత్రుండును, సోమసుతసిద్ధేశ్వరమంత్రీశ్వరపుత్రుండును శ్రీమత్పార్వతీరాజేశ్వరవరప్రసాదసమాసాదితహృద్యానవద్యనిఖిలవిద్యావిశారదుండును నగుసోమకవిచేత విచితం బయినవిద్వజ్జనరంజనీ నామకపూర్వవ్యాఖ్యానమందలివిశేషవిషయసహితంబుగాఁ బరిష్కృతంబయి యొప్పారు ప్రతిపదటీకారూపంబగు వసుచరిత్రనామకాంధ్రకావ్యరత్నవ్యాఖ్యానమునందుఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు

# వసుచరిత్రము, సవ్యాఖ్యానము

## షష్ఠాశ్వాసము



రామచరణవందన
పారీణ యపారరణకృ•పారీణధను
ర్నారాచ నవ్యదీవ్య
ద్వీరాచరితాంక గేయ • తిరుమలరాయా. 1

శ్రీరామ=శ్రీరామస్వామియొక్క, చరణవందన=పాదప్రణామమునందు, పారీణ=తుదముట్టినవాఁడా, అపార = అమితమైన, రణ=యుద్ధమందు, కృపారీణ=దయారహితమైన, (ని. 'స్యాన్నృంరీణమ్' అని అ.) ధనుర్నారాచ = ధనుర్బాణములు గలవాఁడా, నవ్య=నూతనమైన, దీవ్యత్ = ప్రకాశమానమయిన, వీరాచరితాంక = శౌర్యాంకములచేత, గేయ=స్తోత్రము చేయఁ దగినవాఁడా, తిరుమలరాయా = తిరుమలరాయనామధేయుఁడవ యినరాజాగ్రణీ, అని యాశ్వాసాదియందుఁ గృతిపతిని గూర్చి సంబోధనము.

తే. అవధరింపుము శౌనకా•ద్యఖిలసన్ము
నీంద్రులకు రౌమహర్షణి • యిట్లు పలుకు
నితర దిక్పాలకాంతలు • నిగురుఁబోఁడి
కర్హ భూషావిశేషంబు • లనిపి రపుడు. 2

అవధరింపుము = చిత్తగింపుము, శౌనకాద్యఖిలసన్మునీంద్రులకున్ =శౌనకుఁడు మొదలుగాఁగల సమస్తమునిశ్రేష్ఠులకు, రౌమహర్షణి యిట్లు పలుకున్ =రౌమహర్షణపుత్త్రుఁ డయినసూతుఁడు వక్ష్యమాణప్రకారముగాఁ బలుకుచున్నాఁడు. ఏమనియనిన, ఇతరదిక్పాలకాంతలున్ = మున్ను చెప్పినశచీదేవిగాక తక్కినదిక్పాలకులభార్యలును, ఇగురుఁబోఁడికిన్ = గిరికాదేవికి, అర్హభూషావిశేషంబు లనిపి రపుడు= తగినయలంకారవిశేషముల నావివాహసమయమునందుఁ బంపిరి.

శా. పౌలోమీప్రభృతు ల్కుమారి నిటు సం•భావింపఁగా మున్ను ది
క్పాలు ర్భావు నలంకరించి శుభల•గ్నంబుం బ్రతీక్షింపఁగా
నాలోఁ దాను దదర్హవస్తువివి శే•షాన్వేషసన్నద్ధుఁడై
నా లోకాప్తుఁడు చేరె రాగమహిమ • న్రత్నాకరప్రాంతమున్. 3

పౌలోమీప్రభృతుల్ =శచీదేవి మొదలయినవారు, కుమారిన్ = గిరికాదేవిని, ఇటు సంభావింపఁగాన్ = ఈప్రకారము సన్మానము చేయఁగాను, మున్ను=అంతకుముందుగా, దిక్పాలుర్ =దిక్పాలకులు,

భూపు నలంకరించి = వసురాజును శృంగారించి, శుభలగ్నంబుం బ్రతీక్షింపఁగంక్ =వివాహసుముహూర్తమున కెదురుచూచుచుండఁగాను, ఆలోఁదాను = ఆసమయమందుఁదానును, తత్ = ఆగిరికావసురాజులకు, అర్హా = తగిన, సన్మణివిశేష=శ్రేష్ఠమయిన మణివిశేషములయొక్క, అన్వేష = వెదకుటకు, సన్నద్ధుఁడో నాఁ=యత్నపడినవాఁడో యన్నట్టులుగా, లోకాప్తుఁడు = లోకబాంధవుఁడయినసూర్యుఁడు, రాగమహిమన్ = ప్రేమాతిశయముచేత ననియర్థము. రక్తిమాతిశయముచేత ననిభావము. రత్నాకర ప్రాంతమున్ =రత్నములకు స్థానమయిన పశ్చిమసముద్రముయొక్క సమీపమును, చేరన్ = చేరినవాఁడాయెను, అనఁగా సూర్యాస్తమయమాయె ననుట.

ఇందులో లోకాప్తుఁడ నెడుపదంబును రత్నాకరమనెడుపదంబును సాభిప్రాయములు. దిక్పాలురు, అన్నచోట దిక్పాలశబ్దము లకారాంతముగనుక, శ్లో. 'లాంతాత్తురురాతయోఃక్రమేణ స్తః' న. అనెడు సూత్రముచేత బహువచనమునకుఁ బ్రథమా రువర్ణకము వచ్చినది. 'కుత్రచిద్రేఫగస్యస్యాదుతో లోపః ప్రయోగతః' అనెడు నథర్వణవచనమువలన దిక్పాలురు అనెడిశబ్దమందలి రేఫముమీఁది యుకారమునకు లోపము వచ్చినది. పౌలోమీప్రభృతులు దిక్పాలపత్నులు. పత్నులు నాయికను భర్తలగు ఇంద్రప్రభృతులు వసురాజు నలంకరించిరి. ఇందఱిన్నివిధముల సత్కరించినపుడు లోకాప్తుఁడు గూడ లోకేశ్వరుని సత్కరింపవలయును. సత్కరింపఁదగిన దర్హమణులతోడను గావున వెదకఁదగిన చోటు రత్నాకరము. అలం. ఉత్ప్రేక్ష.

మ. వసుసమ్రాడ్గిరికాకరగ్రహమహా◆వ్యాలోకనానందసాం
ద్రసురేంద్రప్రమదాశ్రయం బగునభః◆ప్రాసాదదేశంబునన్
ఘుసృణాలేప మొనర్చి ధూప మిడి ము◆గ్గుల్వెట్టిరో నాఁ గరం
బెసఁగెన్ సంజయు నిర్లుఁ దారకలు భూ◆యిష్ఠప్రకాశంబునన్. 4

వసుసమ్రాట్ = వసురాజుయొక్కయు, గిరికా = గిరికాదేవియొక్కయు, కరగ్రహమహ = పాణిగ్రహణమహోత్సవముయొక్క, వ్యాలోకన = విశేషదర్శనమందలి, ఆనందసాంద్ర = ఆనందముచేతఁ బూర్ణీభవించిన, సురేంద్రప్రమదా = ఇంద్రునిభార్యయైన శచీదేవికి, ఆశ్రయంబగు=స్థానమైయున్న, నభః = ఆకాశమనెడు ప్రాసాదదేశంబునన్ = మేడయందు, ఘుసృణాలేపమొనర్చి=కుంకుమ పూఁతపూసి, ధూపమిడి = కృష్ణాగరుధూపమిచ్చి, ముగ్గుల్వెట్టిరో నాన్ = ముత్యాలముగ్గులు తీర్చినారో యనునట్టులుగా, సంజయున్ = సంధ్యారాగంబును, ఇర్లున్ =చీఁకటులును, తారకలు = నక్షత్రములును, భూయిష్ఠప్రకాశంబునన్ = అతిశయప్రకాశముచేత, కరంబెసఁగెన్ = మిగులనొప్పుచుండెను.

ఇక్కడ సంధ్యారాగమును గుంకుమపూఁతగాను జీఁకట్లను ధూపధూమములుగాను, నక్షత్రములను ముత్యపుముగ్గులుగాను నుత్ప్రేక్షించి చెప్పినాఁడు.

గిరికావసురాజుల వివాహము వేలుపుటింతులకు సంతోషకారణము. కాన వారు ఆకాశహర్మ్యములందుండి క్రీడావిశేషములను దిలకింపసాగిరి. గృహాలంకరణము కుంకుమపూవుతో నలుకుట. ఇది సంజకావి. ధూపము చీఁకటులు. ముగ్గులు నక్షత్రసముదాయము. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. ఒప్పుననంతసౌధమున ◆ నుండి తదుత్సవచిత్రసంపదల్
ముప్పదిమూఁడుకోట్లసుర◆ముఖ్యులపట్టపుదేవు లందఱుం

దప్పక చూడఁగా నిడిన • పట్టపుసోరణగండ్లు నా దెస
ల్గప్పు రుచిప్రరోహములఁ • గానఁగ నయ్యె నపారతారకల్. 5

ఒప్పు = ప్రకాశించుచున్న, అనంతసౌధమునుండి = ఆకాశమనెడి మేడలోపలనుండి, తదుత్సవచిత్రసంపదలు = ఆ వివాహమహోత్సవముయొక్క విచిత్రవైభవములను, ముప్పదిమూఁడుకోట్లసురముఖ్యులపట్టపుదేవులందఱున్ = ముప్పదిమూఁడుకోట్ల దేవతాశ్రేష్ఠులయొక్క భార్యలందఱును, తప్పకచూడఁగా నిడిన = తప్పకచూచెదముగాక యని యేర్పఱిచిన, పట్టపుసోరణగండ్లువాన్ = సాంద్రగవాక్షములో యన్నట్లుగా, అపారతారకలు = మితములేని నక్షత్రములు, దెసల్గప్పు = దిక్కుల నాచ్ఛాదించుచున్న, రుచిప్రరోహములన్ = ప్రభాంకురములచేత, కానఁగనయ్యెన్ = చూడ నొప్పెను.

చుక్కలపుడె తలసూపుటచే వానికాంతు లంకురములు. అయినను ప్రకాశాతిశయముగా నుండెను అపారములుగావున. వివాహోత్సవము చిత్రసంపదలతో నిండాయునది. తిలకించువారు ముప్పది మూఁడుకోటుల వేలుపులపట్టపురాణులు. కావున విశాలసౌధము కావలయును. కాన నేయనంతసౌధము పట్టపుదేవు లవరోధకాంతలు కావున మఱుఁగునుండి చూడఁదగినవారు. అట్టిచో గవాక్షములైన నెవటి వారికిఁ గనుపింతురు. కావున సోరణగండ్లు ఉచితము. సోరణగండ్లను తెఱలను గోడలను నవరోధ స్త్రీలు వింతలుచూడ నేర్పఱచు చిన్నరంధ్రములు. ఇవి పెక్కులున్న గాని చూడవీలుండదు. ఇటులనే యర్థము చెప్పనగును గాని గవాక్షము లనఁదగదు.

తే-గీ. మలయమారుత మేతెంచు తలిరుటాకు, గములసందులు సోరణగండ్లుగాఁగ,
భానుమతీపరిణయము.

సీ. పరులదృష్టికి నగోచరమగు సంవృతస్థలినిచ్చి రాణివాసపుజనంబు
చూచునట్టుగఁ జేసి. ప్రభావతీప్రద్యుమ్నము. ఆ. ౪.

ఇటుల రాణివాసపుజనులు చూచునట్లు చేసినవియే సోరణగండ్లు.

ఉ. ఉన్నత వైజయంతవల • యోపరిభాగము చేరి చేదిభూ
భృన్నగరీమహోత్సవము • పెంపఖిలంబును నిక్కి చూచు వేఁ
గన్నులవేల్పురాణిముఖ • కంజము పైపయిఁ దోఁచు రేఖ రే
గన్నియ తేనిమేను తొలు • గట్టుతుదం బొదలెం గ్రమంబునన్. 6

ఉన్నత = పొడవైన, వైజయంతవలయ = పట్టుపగానుండునట్టి యింద్రుని మేడయొక్క, ని. 'స్యాత్ప్రాసాదో వైజయంతః' అని అ. ఉపరిభాగము చేరి = ఊర్ధ్వప్రదేశమందుఁ బ్రవేశించి, చేదిభూభృత్ = చేదిదేశాధిపతియైన వసురాజుయొక్క, నగరీ = పట్టణమందలి, మహోత్సవముపెంపు = మహత్తరమయిన వివాహమహోత్సవసమృద్ధిని, అఖిలంబును నిక్కిచూచు = సకలమును దలయెత్తి చూచుచున్న, వేఁగన్నులవేల్పురాణి = సహస్రాక్షుఁడయిన యింద్రునిభార్యయొక్క - అనఁగా శచీదేవియొక్క, ముఖకంజము = పద్మమువంటిముఖము, పైపయిఁదోఁచు రేఖ = మీఁదమీఁదఁ గనుపించుచున్నదో యన్నట్టులుగా, రేగన్నియతేనిమేను = నిశానాథుఁడయిన చంద్రునియొక్క బింబము, తొలుగట్టుతుదన్ = పూర్వశైలాగ్రమందు, క్రమంబునన్ = వెంబడివెంబడిగా, పొదలెన్ = ప్రకాశించెను.

చ. సరసిరుహారి యప్పు డిలఁ • జందనసేకము దిక్తటంబులం
బరమసుధానులేపము నభంబునఁ బాండువితానలక్ష్మియున్
నిరుపమకౌముదీరుచుల • నించుచు సారె నలంకరించె నా
సురకులసార్వభౌమహిత•శోభనవేళ నజాండగోళమున్. 7

సరసిరుహారి = చంద్రుఁడు, అప్పుడు = ఆ సమయమందు, ఇలన్ = భూమియందు, చందన సేకము = తెల్లని శ్రీచందనముచేతఁ దడుపుటను, దిక్తటంబులన్ = దిక్కులయొక్క పార్శ్వముల యందు, పరమసుధానులేపము = యోగ్యమైనసున్నపు పూఁతను, నభంబునన్ = ఆకాశమందు, పాండు వితానలక్ష్మియున్ = తెల్లనిమేలుకట్టుయొక్క - అనఁగాఁ జాందినీయొక్కశోభను, నిరుపమకౌముదీ రుచులన్ = ఉపమానరహితమైన వెన్నెలయొక్క శుభ్రకాంతులచేత, నించుచున్ = నిండించుచు, అజాండగోళమున్ = బ్రహ్మాండకుహరమును, ఆ = అట్టి, సురకులసార్వభౌమ = దేవేంద్రునకు, హిత = ఆప్తుఁడైన వసురాజుయొక్క, శోభనవేళన్ = వివాహసమయమందు, అలంకరించెన్ = శృంగా రించెను. చంద్రుఁడు జరుగనున్న యింద్రహితుఁడగు వసురాజు వివాహమునకు బ్రహ్మాండము నలంక రించెను. చంద్రకిరణములు భూమిని చందనపుగలయంపిని చల్లినట్లు, ఆకసమున జాందినిగట్టినట్లు దిక్కులను సున్నముగొట్టినట్లు నలంకరించెను. కౌముదీరుచి నిరుపమము గావున బ్రహ్మాండము నిటుల నొనర్పఁగలిగెను. అలం. ఉత్ప్రేక్ష.

చ. అతినికటంబు లగ్న మని • యాంగిరసుం డపు డెచ్చరింప దై
వతవిభుఁ డాదరోక్తిఁ బిలు•వ న్నలువంకలఁ బుణ్యభామినీ
కృతశుభగేయము ల్మగధ•కీర్తనవైభవము ల్చెలంగఁగా
సితకరి నెక్కి యొప్పెఁ బతి • శీతనగోజ్జ్వలశంకరాకృతిన్. 8

అతినికటంబులగ్నమని = లగ్నము మిక్కిలి సమీపించినదని, అంగిరసుండపుడెచ్చరింపన్ = బృహస్పతి యప్పు డెచ్చరికసేయఁగా, దైవతవిభుఁడు = దేవేంద్రుఁడు, ఆదరోక్తిబిలువన్=గారవింపు మాటలచేతఁ బిలుపఁగాను, నలువంకలన్ = నాలుగుదిక్కులను, పుణ్యభామినీకృతశుభగేయములు = పుణ్యాంగనలచేతఁ జేయఁబడుచున్న పెండ్లిమాటలును, మగధకీర్తనవైభవములు = మాగధులు చేయునట్టి గానముతోఁగూడిన కైవారములయొక్క వైభవమును, చెలంగఁగాన్ = ఒప్పుచుండఁగాను, పతి = వసురాజు, సితకరినెక్కి = వెల్లయేనుఁగునెక్కి, శీతనగోజ్జ్వలశంకరాకృతిన్ = హిమవత్పర్వతము మీఁదఁ బ్రకాశించు సాంబమూర్తివలె, ఒప్పెన్ = చూడనొప్పెను. సితకరిదేవేంద్రదత్తము. ఈయంశము క్రింది వచనములో వ్యక్తపఱుపఁబడినది. మంచుకొండవలెఁ దెలియేనుఁగును శంకరునివలె వసురాజు నుండెను. అలం. ఉపమ.

వ. ఇవ్విధంబున నవ్వసుంధరాధురంధరుండు పురందరసింధురస్కంధాధిరూఢుం డై పాండురద్వీపరాజోపరిక్రీడనోల్లాసి యగుసింధుజావిలాసియో యన ననం తమణిమాలికామహితమహాభోగాతపత్త్రసహస్రంబులనడుమ విలసిల్లుచు నతి తుములతమఢమిఢమికాతమ్మటభేరికాపటహతుత్తుంభికాదివాదిత్ర గంభీరఘో షసంరంభంబు కుంభినీకబళనారంభ జృంభమాణ జంభారిపురముఖరభరవంబు

పై ఱవఱవంబోలె హాటకగిరికూటకటకవాటికాపాటనాటోపంబు వాటింప,
నిబిడతరవిద్యోతమాననూతనకేతనప్రకాండదండాఘాతకాతరత్వంబున ధరా
తలంబునకు డిగినజ్యోతిర్జాతంబుకరణి గణనాతీతగంధతైలదీపితకరదీపికానికా
యంబులు వెలుంగ, సమగ్రతరసామ్రాణికధూపధూమంబులజాడలను జడి
గొన్నగొడుగులనీడలను గెరలి తెర లెత్తునిరులం దెరలింప ననేకరూపం
బులం దీపించుతమోరిపుత్రయం బనం జిత్రయంత్రకారసంధానితలీలాగ్ని
యంత్రచంద్రసూర్యజ్యోతులమరిచిధట్టంబులు దట్టంబులై నెట్టనం బట్టి
పగలు గావింప, నాత్మీయసామ్రాజ్యలక్ష్మీసకాశంబున ననిందితస్థైర్యవిద్యాపరి
చయంబు పచరింప నవతరించినక్రొమ్మించుదీవియగుంపునింపు వెలయం
గలయ వెదకికొన వచ్చినతదీయవిరహాపాండురం బగునంబుదంబుడంబు విడం
బించుచుఁ, గంబుకంఠికదంబంబు పయిం బట్టినయుల్లాభంబు పశ్యల్లోచనవల్ల
భం బై మెఱయఁ బాకశాసనశాసనంబునం బరిణయోచిత దివ్యవస్తుసంభార
సంభావనంబునకు నై విశ్వంభరావలయంబుఁ జెందినమందారవల్లి కలయం
దంబునం గొంద ఱిందువదనలు చిత్రజాంబూనదాంబరఫలకుసుమాదిమంగళ
ద్రవ్యంబులు పూని కురంగట నడువ, జగత్త్రయజేగీయమానధైర్యసమాన
వసుమానవనాథచిత్తంబు శైలజాయత్తంబుగా సమకట్టి గాసిం బెట్టిన జగజె
ట్టినెఱజో దని బిరుదు వక్కాణించి చెఱకువిలుకానికోదండదండంబులం
బూదండలు గట్టి యగ్గించుతదీయవిజయేందిరలచందంబున మఱికొంద ఱిందీవ
రాక్షులు పుష్పమాలికాలంకృతపుండ్రేక్షుకాండంబులు పూని పురోభాగంబున
నడ తేరఁ, గందర్పకోటిసౌందర్యశాలి యగునితని కామనీయకంబు భవదీయ
లోకాలోకనీయకుమారబృందంబునందు నెందేనియుం గంటిరే యని దివిజ
భుజగరాజరాజీవగంధులకుం దెలుపు పోలుపున లాస్యప్రవీణకమలాస్య లభి
నయముఖంబుగాఁ గరకిసలయంబులు సాచి మెలపు సూప, వైవాహికము
హూర్తసారప్రతీక్షాపరమహర్షులు పరమహర్షులై పర్వానుపర్వసుపర్వ
పాతితపారిజాతపరాగపాళికాదుర్లక్ష్యం బగునంతరిక్షంబువలన సమక్షంబు
నకు నాకర్షించి దాక్షాయణీచక్రంబుకై వడి నవక్రచక్రడోలాయంత్రంబు
లం దిరుగుమెఱుంగుబోండ్లతండంబు శాణభ్రమస్మరదనబాణభ్రమం బొస
రింప, నెడనెడం బన్నినయపరంజికుఘుంజులపై రంజిలుచు మృదంగడింధిమ
ధ్వానంబులకు నాడుయంత్రపాంచాలికాసముచయంబు విమలమణివిమానమం
డలంబున నుండి గొండ్లిఁ బరిఢవించు తెఱగంటి తెఱవల తెఱంగు నంగీకరింప,
వర్ణనీయవారవరవర్ణినీవారవారణదుర్లభయానవైభవంబు వాసవావాసవామ
లోచనావర్గంబులకు వసుధాపదన్యాసవైధుర్యంబు సంపాదింపఁ, బల్యంకి
కాదివాహనంబులు డిగ్గి పాదచారంబుల నడుచుపట్టాభిషిక్తుల పద్మరాగ

కిరీటపాటలప్రభాపటలంబులు పవనసఖశిఖాముఖంబులకు మలినసరణి సవరింప, సమస్తజనసముచిత మార్గమర్యాదానుశాసనసముద్దండదండధరసంభ్రమంబులు సమవర్తికి సమధికశ్యామిక సమకూర్పఁ బ్రబలతమస్స్ఫారదురహంకార వీరభటకృపాణికాచాకచక్యంబులు రాత్రించరకరాళకరవాల కాళిమంబులు మూలకుం జొనుప, బహుళసితదంతిధారాటకోటీసమాటీకనిర్వేలసర్వతో ముఖవాహినీశ్వరసంసేవ్యమానరసాధినాథ సన్నాహంబులు వారిధిస్వామికి వదలనిజడస్థితి యొసంగఁ, బరిమిళితఘనసారగంధసారపరిమిళితకస్తూరికాసారంబుల వసంతమాడుసామంతబాంధవావళి గంధవహుని కపారతారళ్యంబు వెనుప, గంభీరబిరుదగాథాపఠనపరాయణపాఠకపరంపరలకు నెడనెడ హితపురోహితామాత్యజనం బొసంగునసంఖ్యాతధనసంఘాతంబున ధనదున కమందమందాక్షభావంబు సంఘటింపఁ, బ్రచండతరనటనప్రకాండతాండవ పాండిత్యంబులు ప్రాచీననటుని నెమ్మేనఁ బాండిమంబు నిండింప, నిట్లాశాపతులకు నాశాసనీయంబును నహివల్లభులకు నతిదుర్లభంబును సిద్ధుల కననుభూతసిద్ధంబును సాధ్యుల కసాధ్యంబును చారణులకు నవిచారణీయంబును యక్షులకు ననతిలక్షితంబును నైనయనన్యసామాన్యమహావిభవంబునం గోలాహలపురంబుఁ జేరం జనుసమయంబున. 9

ఇవ్విధంబునన్ = ఈచెప్పఁబడినప్రకారముగా, అవ్వసుంధరాధురంధరుండు = భూభారవహుఁడయిన యావసురాజు; పురందరసింధురస్కంధారూఢుండయి = ఇంద్రగజమునైనయైరావతముయొక్క మెడమీఁద నెక్కినవాఁడయి, పాండురద్వీపరాజ = శ్వేతద్వీపరాజముయొక్క, ఉపరి = ఊర్ధ్వభాగమందలి, క్రీడన = విహరించుటయందు, ఉల్లాసియగు = ఉల్లాసముగలవాఁడయిన, సింధుజావిలాసియోయనన్ = లక్ష్మీకాంతుఁడో యన్నట్లు - అనఁగా నైరావతారూఢుఁడైన వసురాజు శ్వేతద్వీపవాసియైన లక్ష్మీకాంతుఁడో యన్నట్లుండెననుట. ఇక్కడ వసుంధరాధురంధరుండు విష్ణుదేవుఁడును సింధుజావిలాసి వసురాజును నగుదురుగనుక స్వారస్యము గ్రహింపవలయును. అనంతమణిమాలికామహితమహాభోగాతపత్రసహస్రంబునడుమ విలసిల్లుచున్ - అనంత = అసంఖ్యములయిన, మణిమాలికా = రత్నమాలికలచేత, మహిత = ఒప్పుచున్న, మహాభోగ = అతివిస్తారమయిన, ఆతపత్ర = వెల్లగొడుగులయొక్క, సహస్రంబు = సమూహముయొక్క, నడుమన్ = మధ్యప్రదేశమందు, విలసిల్లుచున్ = ప్రకాశించుచును, అని రాజపరమయిన యర్థము. అనంత = శేషునియొక్క, మణిమాలికామహిత = రత్నశ్రేణులచేత నొప్పుచున్న, మహాభోగాతపత్ర = ఆతపత్రములవంటి - అనఁగా వెల్లగొడుగులవంటి మహత్తరములయిన భోగములయొక్క, అనఁగాఁ బడగలయొక్క, సహస్రంబునడుమ విలసిల్లుచునని విష్ణుపరమయిన యర్థము. రాజులు ధరించుగొడుగులు తెల్లనివలువలతో సువర్ణదండములతో నలరారుచుండును.

"సిచితంతుమాంసపక్షైః, కృకవాకుమయూరసారసానాం
దోకూలేనసవేసతు, సమగ్రతశ్చాదితంశుక్లం.
ముక్తాఫలై రుచితం, ప్రలంబమాలావిలం స్ఫటికమూలం

షడ్ధస్తశుద్ధహైమం నవపర్వనగైకదండంచ
దండార్థవిస్తృతంతత్, సమవృత్తం రత్నభూషితముదగ్రం
నృపతేస్తదాతపత్త్రం, కళ్యాణకరం విజయదంచ." బృహత్సంహిత.

అతితుములతమ = మిక్కిలి సంకులమగు చున్న, ఢమామికాతమ్మట భేరికాపటహతుత్తుంభికా = ఢమామికా తమ్మట భేరికా పటహ తుత్తుంభికా, అనునివి, ఆది = మొదలు గాఁగల, వాదిత్ర = చతుర్విధ వాద్యములయొక్క, (ని. 'చతుర్విధమిదంవాద్యం వాదిత్రాతోద్యనామకమ్' అని అ) గంభీర = మంద్రమైన, ఘోష = ధ్వనియొక్క, సంరంభంబు = విజృంభణము, కుంభినీకబళన = భూమిని మ్రింగివేయుట యొక్క, ఆరంభ = ప్రయత్నమందు, జృంభమాణ = విజృంభించుచున్న, జంభారిపుర = స్వర్గపురమందలి, మురవ = మద్దెళ్ళయొక్క, రవంబుపైన్ = ధ్వనిమీఁద, అవఅవంబోలెన్ = కొఅకొఅచేతవలె అనఁగా నసూయచేతఁబలె, హాటకగిరి = మేరుపర్వతముయొక్క, కూట = శృంగములయొక్కయు, కటక = సానువులయొక్కయు, వాటికా = శ్రేణియొక్క, పాటన = భేదనమందలి, ఆటోపంబువాటింపన్ = విజృంభణము గనుపఱుపఁగాను అనియర్థము. అనఁగా వివాహసమయమున స్వర్గమందును భూమియందును వాద్యధ్వనులు చెలఁగుచుండఁగా స్వర్గమందలి వాద్యధ్వనులు కుంభినీకబళన సంరంభమునుఁ జూపఁగానే వానిమీఁది యసూయచేతవలె భూమియందలి వాద్యధ్వనులు దేవతాస్థానమయిన మేరుగిరి శిఖరములయొక్కయుఁ జరులయొక్కయు వాటికను భేదించెనని తాత్పర్యము. అనఁగా వాద్యధ్వనులు మేరువు భేదిల్లునట్టులుగాఁ జెలఁగుచుండెనట.

నిబిడతర = మిక్కిలి దట్టమగునట్టులుగా, విద్యోతమాన = ప్రకాశించుచున్న, నూతన = నవీనములైన, కేతనప్రకాండ = శ్రేష్ఠములయిన టెక్కెములయొక్క, దండాఘాత = కఱ్ఱదెబ్బలవలని, కాతరత్వంబునన్ = భయముచే, ధరాతలంబునకుడిగిన = భూప్రదేశమునకుదిగిన, జ్యోతిర్జాతంబు కరణిన్ = నక్షత్రసమూహమోయన్నట్లు, గణనాతీత = లెక్కకెక్కువైన, గంధతైలదీపిత = చందన తైలముచేత వెలిఁగింపఁబడిన, కరదీపికానికాయంబులు = చేదివ్వెలయొక్క-అనఁగా దివిటీలయొక్క సమూహమును, వెలుంగన్ = ప్రకాశింపఁగాను, టెక్కెములు మిగులఁ బొడవైనవి. మిగులదట్టముగాఁ బ్రకాశించునవి. కాంతులచేఁ బరాభవించుటయేగాక దండాఘాతములచేఁగూడఁ డెక్కెములు చుక్కలను బరాభవించెను. కావుననే కాతరము లయ్యెను. కరదీపికలు చుక్కలవలె నసంఖ్యాకములుగను నున్నతములుగను నుండెనని భావము.

సమగ్రతర = సంపూర్ణములయిన, సాంబ్రాణికధూప = సాంబ్రాణిధూపములయొక్క, ధూమంబుల = పొగలయొక్క, జాడలను = మార్గములచేతను, జడిగొన్నగొడుగులనీడలన్ = ముసురుకొన్న శ్వేతచ్ఛత్రములయొక్క నీడలచేతను, కెరలి = విజృంభించి, తెరలెత్తు = తెరలుగట్టుచున్న, ఇరులన్ = చీఁకటులను, తెరలింపన్ = పోఁగొట్టెడుకొఱకు, అనేకరూపంబులదీపించు = బహురూపములచేతఁ బ్రకాశించునట్టి, తమోరిపుత్రయంబునన్ = చంద్రసూర్యాగ్నులో యన్నట్లుగాను, (ని. 'చంద్రాగ్న్యర్కాస్తమోనుదః' అని అ.) చిత్రయంత్రకార = బాణాకారీలచేత, సంధానిత = ఘటింపఁబడిన, లీలాగ్నియంత్ర = వేడుకకొఱకైన కొమ్ముపల్లాలు మొదలయినవానియొక్కయు, చంద్రసూర్యజ్యోతుల = చంద్రజ్యోతుల యొక్కయుఁ సూర్యజ్యోతులయొక్కయు, మరీచిఘట్టంబులు = కాంతిపుంజములు, దట్టంబులై = సాంద్ర

ములై, నెట్టనం బట్టపగలుగావింపన్ = శీఘ్రముగా దివాభాగమును జేయుచుండఁగాను, ఆత్మీయ = తనయొక్క, సామ్రాజ్యలక్ష్మీ = అచంచలమైన రాజ్యలక్ష్మియొక్క, సకాశంబునన్ = సన్నిధానమందు, అనిందిత = నిందింపఁబడని, స్థైర్యవిద్యా=చలించిపోకుండెడు విద్యయొక్క, పరిచయంబుపచరింపన్ = అభ్యాసముచేయఁగోఱకు, అవతరించిన = క్రిందికిదిగివచ్చిన, క్రొమ్మించుదీవియగుంపునింపు వెలయం గలయ వెదకికొనవచ్చిన = మెఱుపుతీఁగెలయొక్క గుంపును నింపు గనుపడునట్లుగా నంతట వెదకెడు నిమిత్తముగా వచ్చినదియు, తదీయ=ఆమెఱుపు తీఁగెలయొక్క, విరహ = వియోగముచేత, పాండు రంబగు = పాలితెల్లఁబడినదియునగు, అంబుదంబు=మేఘముయొక్క, డంబువిడంబించుచున్ = వైఖరిని గనుపఱుచుచును, కంబుకంఠీకదంబంబుపయింబట్టిన = స్త్రీజనసమూహముమీఁదఁబట్టిన, ఉల్లాభంబు = వెలిపట్టుమేలుఁకట్టు - అనఁగా నుల్లెడ, పశ్యత్=చూచుచున్నవారికి, లోచనవల్లభంబై=కన్నులపండువై, మెఱయన్ = ప్రకాశింపఁగాను, ఇక్కడ మెఱుపుతీఁగెలకును స్త్రీలకును ధవళమేఘమునకును నుల్లెడ కును నుపమానోపమేయభావము. నీలమేఘముల వెంటనంటి మెఱుపులుండును. శరత్కాలశుభ్రమేఘ ముల ననుసరించి మెఱుపులుండమి ప్రసిద్ధము. మేఘములు తెల్లఁగానుండుట మెఱుపుదీఁగలయెడవాటు వలనఁ బాలిపోయి యని గ్రాహ్యము. లక్ష్మి చంచలస్వభావ. రాజ్యలక్ష్మియచంచల. అచాంచల్యమును మెఱుపుదీఁగలు రాజ్యలక్ష్మివద్ద నేర్చుకొనుటకుఁ గ్రిందికి దిగివచ్చినటుల మెఱుంగుబోండ్లరారుచుండి రని భావము.

పాకశాసనశాసనంబునన్ = ఇంద్రునియాజ్ఞచేత, పరిణయోచిత=వివాహమునకుఁదగిన, దివ్య వస్తు=దేవతాసంబంధమయిన వస్తువులయొక్క, సంభార=సముదాయముయొక్క, సంభావనంబునకునై= బహుమానముకొఱకు, విశ్వంభరావలయంబుఁజెందిన = భూవలయమును బొందిన-అనఁగా భూమికి వచ్చిన, మందారవల్లికలయందంబునన్=మందారమనెడు దేవతావృక్షముయొక్క తీఁగెలోయన్నట్లు, కొందఱిందువదనలు = కొందఱుస్త్రీలు, చిత్ర = చిత్రవర్ణముగలిగిన, జాంబూనద = సువర్ణమయము లయిన, అంబర = వస్త్రములును, ఫల=ఫలములును, కుసుమ=పుష్పములును, ఆది = మొదలుగాఁగలిగిన, మంగళద్రవ్యంబులు = శోభనవస్తువులను, పూని = పట్టుకొని, కురంగటనడువన్ = సరసననడువఁగాను, జగత్త్రయ=మూఁడులోకములవారిచేతను, జేగీయమాన = కొనియాడఁబడుచున్న, ధైర్య=ధీరత్వమందు, అసమాన = సమానరహితుఁడయిన, వసుమానవనాథ = వసురాజుయొక్క, చిత్తంబునన్ =మానసమును, శైలజాయత్తంబుగా సమకట్టి = గిరికాదేవియొక్క యధీనమగునట్టులుగా సమకూర్చి, గాసింబెట్టిన = శ్రమపెట్టిన, జగజెట్టినెఱజోదనన్ =శ్రేష్ఠులయిన శూరులలో మేటిశూరుఁడని, బిరుదువక్కాణించి = బిరుదావళియుగ్గడించి, చెఱకువిలుకాని=చెఱకువిల్లుగాఁగల మన్మథునియొక్క, కోదండదండంబులన్ = వింటికఱ్ఱలయందు, పూదండలుగట్టి = పుష్పమాలికలుగట్టి, అగ్గించు=పొగడుచున్న, తదీయవిజయేందిరల చందంబునన్ = ఆమన్మథునియొక్క విజయలక్ష్ములో యన్నట్లు, మఱికొందఱిందీవరాక్షులు = మఱి కొందఱుస్త్రీలు, పుష్పమాలికాలంకృత పుండ్రేక్షుకాండంబులుపూని = పుష్పదండలచేత శృంగా రింపఁబడిన నల్లచెఱకుగడలుపట్టుకొని, పురోభాగంబుననడతేరన్ = ముందరనడువఁగాను, వివాహముల యందుఁ జిలుకలు చెఱకుగడలకుఁ బూవులు చుట్టికొనిపోవుట యిట ననుసంధింపఁదగినది. వసురాజు మూఁడులోకములలో ధీరమునందుఁ బేరెన్నికఁ గన్నవాఁడు. అట్టివానిని గిరికను లోఁబఱచి శ్రమ

పెట్టుట మన్మథుని జెగజెట్టితనమునకు జోదుతనమునకు సాధనములు. శూరులను బ్రశంసించి వారివిండ్లకు మాలికాదులు గట్టినట్టు చెఱకువింటికిఁ బూలదండలు గట్టిరని భావము.

కందర్పకోటిసౌందర్యశాలియగు = కోటిమన్మథులయొక్క చక్కఁదనముచేత నొప్పుచున్న, ఇతని = ఈ వసురాజుయొక్క, కామనీయకంబు = సౌందర్యము, భవనీయలోక = మీమీలోకముల యందు, ఆలోకనీయ = చూడఁదగియున్న, కుమారబృందంబునందుక్ = యౌవనపురుషసమూహ మందు, ఎందేనియుంగంటిరేయని = ఎక్కడనైనప్పటికిని జూచితిరా యని, దివిజభుజంగరాజ రాజీవగంధులకుం దెలుపుచోలుపునక్ = దేవతా శ్రేష్ఠులయొక్కయు సర్పశ్రేష్ఠులయొక్కయు స్త్రీలకుఁ దెలియఁజేయుచున్నారో యన్నట్టులుగా, లాస్యప్రవీణ కమలాస్యలు = నాట్యమందు నిపుణలైన పద్మముఖులు - అనఁగా వేశ్యాంగనలనుట, అభినయముఖంబుగాక్ = అభినయపూర్వకముగా, కరకిసలయంబులుసాచి = చిగురుటాకులవంటి హస్తములుచాపి, మెలపుసూపక్ = చమత్కారము గనుపఱుపఁగాను, వసురాజు కందర్ప శతకోటిసుందరుఁడు. కావున నిట్టి సుందరాకారులు భోగిలోకమునందును స్వర్గమునందును నరిది. వేశ్య లభినయము చేయుచుఁ గ్రిందికి మీఁదికిఁ జేయుహస్తవిన్యాసములు వసురాజువంటి సుందరాకారుఁడు భోగిలోకమున స్వర్గలోకమునఁ గలఁడాయని యడుగుచున్నటు లుండెను. ఇది అభినయరూపమగు చమత్కృతి.

వైవాహిక = వివాహసంబంధమయిన, ముహూర్త = లగ్నముయొక్క, సార = పుష్కరాంశము యొక్క, పుష్కరాంశములనఁగా,

> శ్లో. 'ఏకవింశో మనుశ్చైవ జలాక్షి మునయ స్తథా
> మేషాదిమీనపర్యంతరాశీనాం పుష్కరాంశకాః.'

మేష ౨౧ వృషభ ౧౪ మిథున ౨౪ కటక ౭ సింహ ౨౧ కన్య ౧౪ తులా ౨౪ వృశ్చిక ౭ ధనుస్సు ౨౧ మకర ౧౪ కుంభ ౨౪ మీన ౭ ఈరాసులయం దీభాగములు పుష్కరాంశములు, ప్రతీక్షాపరఁకనిపెట్టుటయం దాసక్తులైన, మహర్షులు = ఋషిశ్రేష్ఠులు, పరమహర్షులై = పరమానందయుక్తులై, పర్వానుపర్వ = దట్టమగునట్టులుగా, సుపర్వపాతిత = దేవతలచేత గుప్పఁబడుచున్న, పారిజాతపరాగపాళికా = పారిజాతవృక్షములయొక్క పుప్పొడుల పరంపరలచేత, దుర్లక్ష్యంబగు = కనఁబడక యున్న, అంతరిక్షంబువలనక్ = ఆకాశమువలన, సమక్షంబునకు నాకర్షించిన = తమయెదుటికి రప్పింపఁబడిన, దాక్షాయణీచక్రంబుకైవడిక్ = నక్షత్రమండలమోయన్నట్టులుగా, (ని. 'దాక్షాయణ్యోశ్విన్యాదితారాః' అని అ.) అవక్ర = తిన్ననైన, చక్రడోలాయంత్రంబులం దిరుగు = చక్రాకృతి గలిగి తొట్లనమర్చిన యంత్ర విశేషములయందుఁ దిరుగుచున్న, మెఱుంగుబోండ్లతండంబు = స్త్రీసమూహము, శాణ = చికిలిసానమీఁద, భ్రమత్ = తిరుగుచున్న, మదనబాణ = మన్మథబాణములో యనునట్టి, భ్రమంబొనరింపక్ = భ్రాంతిని గల్పింపఁగాను, మహర్షులు పుష్కరాంశములు గనిపెట్టుచుండ దట్టము వేలుపులురాల్చు పారిజాతరజఃపరంపర దృష్ట్యాంధ్యము కలిగించెననియు నందుచేఁ జెంతకు రప్పించిన గ్రహమండలమువలెఁ జక్రడోలాయంత్రమునందుఁ దిరుగుచెలువలుండిరని భావము. చక్రాకారముగఁ దిరుగుచెలులు సానపై మెఱుఁగుఁబెట్టఁబడు మదనబాణములవలె నుండిరి. సానఁబెట్టుటవలన బాణములకు మెఱుంగెక్కును. మెఱుంగుబోండ్లుగావున నట్టులుండిరనుట.

ఎడనెడంబన్నిన = అంతటంతటనమర్చిన, అపరంజికురుంజులపైన్ = మేలిబంగారు చప్పరముల మీఁద, రంజిలుచున్ = ప్రకాశించుచు, మృదంగదింధిమి ధ్వానంబునకున్ = దింధిమ్మని మ్రోయుచుండెడు మర్దలధ్వనులకు, ఆడు = తమయంతట తామే నాట్యముచేయుచున్న, యంత్రపాంచాలికా సముదయంబు = కీలుబొమ్మలయొక్క సమూహము, విమలమణీవిమానమండలంబునయుండి = నిర్మలమయిన రత్నములుగూర్చిన విమాన సమూహమునందు నిలిచి, గొండ్లిఁబరిఢవించు = నాట్యమును గనుపఱుచుచున్న, తెలిగంటి తెలివల తెలుఁగు నంగీకరింపన్ = దేవతాస్త్రీలయొక్క రీతిని బొందుచుండఁగాను, ఇక్కడఁ గీలుబొమ్మలును దెలిగన్నులుగలవియ గనుక తెలిగంటి తెలివలతో సామ్యమును జెప్పినాఁడు. కురుంజులనఁగా నెత్తగుమంచెలు. అందు యంత్రవిగ్రహములు విశేషముగా నమర్పఁబడియుండెను. ఆవిమద్దెలల మ్రోఁతలకు నాట్యమునలుపుట విమానమందున్న వేలుపులలనలు నాట్యముచేయునటులుండెను. చిత్రప్రతిమలకు వేలుపుఁజెలువలకు దెప్పపాటుండదు గావున నిటనేకార్థము గ్రాహ్యము.

వర్ణనీయ=కొనియాడఁదగిన, వారవరవర్ణినీవార = వేశ్యాస్త్రీసమూహముయొక్క, వారణదుర్లభ = ఏనుఁగులకు లభింపని, యానవైభవంబు = నడకయొక్క వైభవము, వాసవావాస = ఇంద్రునకావాసమయిన స్వర్గసంబంధినులయిన, వామలోచనా = స్త్రీలయొక్క, వర్గంబులకున్ = సమూహములకు, వసుధా = భూమియందలి, పదన్యాస = పాదసంచారముయొక్క, వైధుర్యంబు = శూన్యత్వమును, సంపాదింపన్, అనఁగా నీవారకాంతలయొక్క నడక చక్కఁదనము తమకులేనందున సిగ్గుపడి దేవతాస్త్రీలు భూమియందు నడుచుట మానినారని తాత్పర్యము. దేవతలు భూమిని స్పృశింపకుండుట ప్రకటము.

పల్యంకికాదివాహనంబులు డిగ్గి = పాలకి మొదలయిన సవారులుదిగి, పాదచారంబులనడుచు = కాలినడకలచేత నడుచుచున్న, పట్టాభిషిక్తుల = రాజులయొక్క, పద్మరాగకిరీటపాటలప్రభాపటలంబులు = పద్మరాగమణిమయములయిన కిరీటములయొక్క కొంచెము దెలుపుగలిసిన యెఱ్ఱనికాంతుల యొక్క సమూహములు - అనఁగా నగ్నివర్ణముగల కాంతులు, పవనసఖ = అగ్నిహోత్రునియొక్క, శిఖా = జ్వాలికలయొక్క, ముఖంబులకున్=అగ్రములకు, మలినసరణిసవరింపన్=వైవర్ణ్యము గలుగఁజేయుచుండఁగాను - అనఁగా ముఖము నల్లఁబుచ్చుకొనుటకుఁ గలుగఁజేయఁగాను, ఇక్కడఁ బద్మరాగకిరీటపాటలప్రభ లపరిమితములు గనుకఁ బరిమితములయిన పవనసఖశిఖలయొక్క ముఖములకు వైవర్ణ్యంబు సంపాదించిన వని యర్థము. ముఖములనఁగా నగ్రములనియు మలినసరణియనఁగా శిఖాగ్రధూమమనియును భావము. పద్మరాగకిరీటపాటలప్రభలనంతములు. అగ్నిజ్వాలాముఖములుతొమ్మిది. అసంఖ్యాకబలముచే సంఖ్యాకమగు స్వల్పబల మోడిపోవుటయుఁ బరాభవవశమున నల్లనగుటయు సాజము. పరాభవమున మోము నల్లబడుననుటకు-

తే-గీ. దాసిచేసిన యప్పురిహాసమునకు, హాసపరిపాండురంబైన యక్కొలువున
నానృపాలు ముఖమ్మాని గానఁబడియె, నలుపు గానఁగఁబడుగదా తెలుపులోన.

(శృంగార-నై. ఆ. ౫)

సమస్తజన=సకలమయినవారికి, సముచిత=అర్హమగునట్టులుగా, మార్గమర్యాదా=త్రోవ నడచుటకు, అనుశాసన = శిక్షకులయిన, సముద్దండ=పరభీకరులైన, దండధర = దండధరులయొక్క, సంభ్రమంబులు = తొందరలు, సమవర్తికిన్ = యమునికి, ని. 'ధర్మరాజః పితృపతి స్సమవర్తీ పరేతరాట్'

సమధికశ్యామిక = అత్యధికమయిన శరీరవైవర్ణ్యమును, సమకూర్పఁ = కలుగఁజేయఁగాను - అనఁగా సమస్తజన సముచితమార్గమర్యాదానుశాసనులై వర్తించినవారు గనుక సమస్తులైన దండధరు లనేకు లయినందున నొకసమవర్తియైన దండధరునకు శరీరవైవర్ణ్యము సంపాదించినారని యర్థము. దండధరులనఁగా వేత్రధరులనియు శ్యామికయనఁగా శరీరనీలిమయనియును భావము.

ప్రబలతమస్స్ఫారదురహంకార- ప్రబల=బలిష్ఠమయిన, తమః=చీఁకటులయందు, స్ఫార = అతిశయించుచున్న, దురహంకార = దుర్గర్వముగలవారని యర్థము. అనఁగా రాత్రించరులనుట. ప్రబలతమమును స్ఫారమునయిన దురహంకారముగలవారని భావము. అటువంటి, వీరభటుల = శూరులయిన భటులయొక్క, కృపాణికా=ఖడ్గములయొక్క, చాకచక్యంబులు=చకచకాయమానములయిన కాంతులు, రాత్రించర=నైరృతియొక్క, కరాళ = భయంకరమయిన, కరవాల = ఖడ్గముయొక్క, కాళిమంబులు= మాలిన్యములను, మూలకుఁదోనుపఁ = అప్రయోజకమగునట్లుచేయఁగాను అని యర్థము. నిరృతి మూలను వసించుచున్నాఁడని భావము. కరవాలకాంతులు కృష్ణగణములోఁ జేరినవనుటను దృష్టాంతము లింతకుమున్నె సంగఁబడెను. నిరృతిరాక్షసుఁడుగావున నలుపుచాయగాఁ జెప్పఁబడెనని వ్యాఖ్యానము.

బహుల=అనేకములయిన, సితదంతి=వెల్లనియేనుఁగులయొక్క, ఘోరాట = అశ్వములయొక్కయు- అనఁగా నైరావతోచ్చైశ్శ్రవములయొక్క, కోటీ = సమూహములయొక్క, సమాటీక = సంచారము గలిగిన, నిర్వేల = వేలాతిక్రాంతములయిన, సర్వతోముఖ = జలములుగలిగిన, వాహినీశ్వర నాథులచేత= అనఁగా సముద్రములచేత, సంసేవ్యమాన = సేవింపఁబడుచున్న, రసాధినాథ = సలిలాధినాథులయిన వరుణులయొక్క, ఇక్కడ రసశబ్దము సలిలపరము. సన్నాహంబులు = ఆడంబరములు అని యర్థము. బహుల=అనేకములయిన, లసిత=ఒప్పుచున్న, దంతి = ఏనుఁగులయొక్క, ఘోరాట=అశ్వములయొక్కయు, కోటీ=సమూహములయొక్క, సమాటీక = సంచారముగలిగినవియు, నిర్వేల=అతిమాత్రములయినవియు, సర్వతోముఖ = నానాముఖములైనవియునగు, వాహినీ = సేనలకు, ఈశ్వర = నాయకులయినవారిచేత, సంసేవ్యమాన = సేవితులయిన, రసాధినాథుల = భూపతులయొక్క, సన్నాహంబులు = ఆడంబరములని భావము. ఇక్కడ రసాశబ్దము భూమియందు వర్తించుచున్నది. వారధిస్వామికిఁ = వరుణునికి, పదలని జడస్థితియొసంగఁ = విడువనిజాడ్యమును సంపాదింపఁగాను అని యర్థము. అనఁగా ననేకములయిన యైరావతోచ్చైశ్శ్రవములయొక్క సంచారముగలిగి వేలాతిక్రాంతజలముగలిగిన యనేక సముద్రముల చేత సేవింపఁబడుచున్న వరుణులనేకులు గనుక నొక్కయైరావతముయొక్కయు నుచ్చైశ్శ్రవము యొక్కయు సంచారముగలిగిన వేలాతిక్రమము సేయలేనిజలములు గలిగిన యొక్క సముద్రునిచేత సేవింపఁబడుచున్న యొకవరుణునికి జాడ్యమును సంపాదించినారనుట. జడస్థితియనఁగా జలస్థితియని భావము. ఐరావతము, ఉచ్చైశ్శ్రవము సముద్రజన్యములని పురాణప్రసిద్ధము.

పరిమళిత = సంజాతపరిమళములయిన, ఘనసారగంధసార = కర్పూర శ్రీచందనములతోడ, పరిమిళిత=కూడుకొన్న, కస్తూరికా = కస్తూరియొక్క, ఆసారంబులఁ = జలధారాసంపాతములచేత, వసంతంబులాడు=వసంతములాడుచున్న, సామంతబాంధవావళి = సమానప్రతిపత్తిగలబంధుజనసమూహము, గంధవహునకుఁ =వాయువునకు, అపారతారళ్యంబు నెసపఁ = అపరిమితచిత్తచాంచల్యముఁ బుట్టింపఁగాను-అనఁగా సురభిద్రవ్యములచేత వసంతములాడి గంధవహులయిన బంధువులు గంధవహునకుఁ జిత్తచాంచల్యము పుట్టించినారని యర్థము. వాయువు చంచలమని భావము, వివాహసమయమునందు

సుగంధవస్తువులు నీళ్లలో గలిపి సమాన ప్రతిపత్తిగల సామంతబాంధవాదులు ధారాపాతముగ జలము చల్లుకొనునాచారము గలదు. సుగంధోదకములు నలుగడల చల్లుకొనుటచేః దావియు నలుగడల వ్యాపించె ననియు నందుచే గంధవహుండై (తావిబరువు మోయువాఁడై) మందముగ నడుచుచు వాయువు చలింప సాగెనని భావము.

గంభీర = మంద్రధ్వని గలుగునట్లుగా, బిరుదగాథాపఠన = వసురాజుయొక్క బిరుదావళులు చదువుటయందు, పరాయణ = ఆసక్తులైన, పాఠక = వందిమాగధులయొక్క, పరంపరలకున్ = సమూహము లకు, ఎడనెడన్ = అప్పుడప్పుడు, హితపురోహితామాత్యజనంబు = ఇష్టపురోహితమంత్రిజనము, ఒసంగు = తామిచ్చునట్టి, అసంఖ్యాతధనసంఘాతంబులన్ = లెక్కలేని ధనసమూహములచేత, ధనదున కున్ = కుబేరునకు, అమందమందాక్షభావంబుసంఘటింపన్ = అధికలజ్జాభావమును గలుగఁజేయఁగాను- అనఁగా నసంఖ్యధనసంఘాతప్రదాతలయిన, హితపురోహితామాత్యజనులు నవసంఖ్యాకనిధిధనప్రదాత యయిన కుబేరుని సిగ్గుపడఁజేసినారని యర్థము. మందాక్షభావ మనఁగా గుబేరుఁడు పింగళాక్షుఁడు గనుకఁ దద్భావమని తెలియవలయును. అనఁగాఁ గాయకంటివాఁడని భావము. మందాక్ష మన సిగ్గు టకు (ని. 'మందాక్షంహ్రీస్త్రపావ్రీడా' అని అ.) మందాక్షునకు మందాక్షభావమును గలిగించిరని భావము. రాజులు మహారాజులుకాక సామాన్యమంత్రులు హితులు పురోహితులు వందిమాగధులకు అసంఖ్యాకధనములొసంగి సత్కరించుట కుబేరునకు లజ్జాకరముగ నుండెననుట.

ప్రచండతర=దుర్ధర్షమయిన, నటన = వీరతాండవము గలవారిలో, ప్రకాండ=శ్రేష్ఠులయినవారి యొక్క, తాండవపాండిత్యంబులు = నటనసామర్థ్యములు, ప్రాచీననటుని నెమ్మేనన్ = హరునియొక్క దేహమందు, పాండిమంబునిండింపన్ = తెల్లఁదనమును బూర్ణీభవింపఁజేయఁగాను అని యర్థము. ధవళిమ యని భావము. సర్వత్ర యనేకత్వము వ్యతిరేకమని తెలియవలయును.

ఇట్లు=ఈప్రకారముగా, ఆశాపతులకాశాసనీయంబును = దిక్పతులకుఁ గోరఁదగినదియును, అహి వల్లభులకు దుర్లంభంబును = సర్పశ్రేష్ఠులకుఁ బొందశక్యముగానిదియును, సిద్ధులకననుభూతసిద్ధంబును= సిద్ధులకనుభవముగానిదియును, సాధ్యులకసాధ్యంబును = సాధ్యులకు సాధింపశక్యముగానిదియును, చార ణులకు నవిచారణీయంబును = చారణులకు విచారింపనలవిగానిదియు, యక్షులకు ననక్షిలక్షితంబును = యక్షులకు దుర్లక్ష్యమయినదియును, ఐన=అయినట్టి, అనన్యసామాన్య మహావిభవంబునన్ =అన్యసాధా రణముగాని మహావైభవముచేత, కోలాహలపురంబుఁ జేరంజనుసమయంబునన్ = కోలాహలపర్వతపట్టణ మును సమీపించిపోవుచున్న సమయంబునందు.

శా. వ్రీడామంథరదృష్టిపాతముల నుర్వీపాలవంశాగ్రణీ
చూడారంజితపాదపీఠు నతనిం • జూడ న్మణినిర్మిత
క్రీడాసౌధతలంబు లెక్కిరి నవశ్రీమన్మహాశైలస
మ్రాడావాసపురాంగనల్కుతుకసామగ్రీసముద్దీపికన్. 10

వ్రీడా=లజ్జచేత, మంథర = మందప్రచారములుగలవైన, (ని. 'మందగామీతు మంథరః' అని అ.) దృష్టిపాతములన్ = చూపులచేత, ఉర్వీపాలవంశాగ్రణీ = రాజవంశశ్రేష్ఠులయొక్క, చూడా= మణులచేత, రంజిత = ప్రకాశింపఁజేయఁబడిన, పాదపీఠున్ = పాదముల క్రిందిపీఠముగలిగిన, అతనిన్ =

ఆవసురాజును, చూడన్ = వీక్షించుటకు, నవ = నూతనమయిన, శ్రీమన్మహాశైల సమ్రాడావాసపుర= శ్రీమంతుఁడైన కోలాహల మహాపర్వతరాజునకు నివాసమయిన పట్టణమందల్, అంగనల్ = స్త్రీలు, కుతుకసామగ్రి = సంతోష సామగ్రివలని, సముద్గ్రీవికన్ = గ్రీవోన్నయనముతోడ - అనఁగా నెత్తఁబడిన కంఠములతోడ, (శ్లో. 'గ్రీవోన్నయన ముద్గ్రీవో ద్గ్రీవికా చాశిక్యతే' అనికోశము.) మణి నిర్మితక్రీడాసౌధతలంబులెక్కిరి = మణులచేతఁ గట్టఁబడిన క్రీడార్థమ్మునైన మేడలమీఁది కెక్కిరి.

వసురాజు సామాన్యుఁడు కాఁడు. రాజన్యకిరీటమణిరంజితపాదపీఠుఁడు. రాజవంశాగ్రణి. వానిని జూచుతఱి స్త్రీలకు సహజముగాఁ జూపులందు సిగ్గొలయుటయుఁ జూపులు మందగించుటయుఁ గలదు. గ్రీవోన్నయనమునకు హేతువు కుతుకసామగ్రి.

సీ. రాగంబుమూర్తమై • రహిఁ ద్రోవఁజూపు పెంపునఁ బదచ్ఛాయ ము • న్నున్న నిగుడ
వీక్షా ప్రహితదూతి • వెసనేఁగు మని మ్రొక్కుగతి నంఘ్రిఁ గర్ణాబ్జ • కళికవ్రాల
నీవిఁ జుట్టినభోగి • నిట్టూర్పుగమి నుబ్బ సడలె నా నొడ్డాణ • మెడలి తూల
గందు నెన్నడుముపైఁ • గరుణించి చనుదోయి చిందుపన్నీరునాఁ • జెమరు వోరుగఁ
తే. గటికరటికంఠపీఠిపైఁ • గంతుఁ డనెడి
బిరుదుమావంతుఁ డేసిన • పీలిజల్లి
పెంపు గను పెన్నెఱులగుంపు • ప్రిదిలి జార
వచ్చె నొకసతి వసుమతీ • వరుని జూడ. 11

రాగంబు = అనురాగము, అరుణిమయనియును జమత్కారము గ్రహింపఁదగును. మూర్తమై= ఆకృతివహించినదై, రహిన్ =చక్కఁగా, త్రోవఁజూపు పెంపునన్ = దారిచూపుచున్నదో యన్నట్టులుగా, పదచ్ఛాయమున్నున్ననిగుడన్ = చరణారుణకాంతి ముందుముందుసాగఁగాను, 'రాగోనురాగే లాక్షాదౌ మాత్సర్యే రక్తిమత్విషాం' వి. వచ్చుట కనురాగప్రేరణము కారణము. కావుననే యను రాగము మున్నున్న దారిచూపెననుట. రాగ మాకారముదాల్చి త్రోవఁజూపుచుండఁ బాదకాంతులు రక్తవర్ణముతోఁ బ్రసరింప బయలుదేరెనని భావము.

వీక్షా = చూపనెడునాయికచేత, ప్రహిత=రాజదర్శనాపేక్షచేతఁ బంపఁబడిన, దూతి=దూతిక, వెసనేఁగుమని మ్రొక్కుగతిన్ = శీఘ్రముగాఁ బొమ్మని నమస్కారము సేయుచున్నదో యన్నట్టులుగా, అంఘ్రిన్ = పాదమందు, కర్ణాబ్జకళికవ్రాలన్ = కర్ణావతంసమయిన తామరమొగ్గపడఁగాను, ఇక్కడ నబ్జకళికను సన్నిహితవర్తినియైన దూతికనుగాఁ జెప్పినందున వీక్షకుఁ గర్ణాంతవిశ్రాంతత్వంబును నబ్జాధికసౌందర్యసంపదయును స్ఫురించుచున్నది. ఇట దూతిక కర్ణావతంసమగు నబ్జకళిక. యజమానిని కంటె దాసి కొంతతక్కువ గాన నబ్జము కనులకంటె సోగతనమునందు సొంపునందును వెనుకఁబడియున్నదని భావము. వేగగమనమువలన నవతంసము జారుట తొందరగఁ బయనము కమ్మని.

నీవిఁజుట్టినభోగి = నీవి యనఁగాఁ గోకముడియును మూలధనంబును, (ని. 'నీవీ పరిపణే గ్రంథౌ స్త్రీణాం జఘనవాససి' అని వి.) పరిపణమనఁగా మూలధనము. ఇందుకు, (వి. 'నీవీ పరిపణం మూల ధనమ్' అని యమరసింహుఁడు చెప్పినాఁడు గనుక) నీవి యనెడునీవిని, అనఁగాఁ గోకముడియనెడు మూలధనమును జుట్టిపెట్టుకొనియున్న సర్పము. నిట్టూర్పుగమినుబ్బ = నిశ్వాసవాయుసముదాయము

చేత నుబ్బరించి, సడలెనాన్ = వదలినదో యన్నట్టులుగా, ఒడ్డాణమెడలితూలన్ = కమ్మరుపట్టావదలి తూలి పడుచుండఁగాను, నిధినిక్షేపాదులను భూతప్రేతములు సర్పవృశ్చికాదు లావరించియుండుననుప్రతీతి యిచట ననుసంధింపఁదగినది. కామేంగితమగు నిశ్శ్వాసాతిశయమువలన నీవి సడలినదని భావము. తనంతన నీవి సడలుట కామేంగితమనుటకు-

శ్లో. 'స్రస్తా నీవీ నఖలు సహసా సా స్వయం ముక్తబంధా' — బిల్హణీయము.

శ్లో. 'నీవీచ స్ఖలతి స్థితాఽపి సుదృఢం కామేంగితం యోషితాం.' — రతిరహస్యము.

కందు నెన్నడుముపైఁ గరుణించి = బడలికనొందుచున్న నడుముమీఁద దయచేసి, చనుదోయి చిందు పన్నీరుకాన్ - కుచద్వయము చిలకరించునట్టి పన్నీరో యన్నట్టులుగా, చెమరుదొరుగన్ = చెమటనీరు జారఁగాను, నడుము గమనవేగమునఁ జలించు గుబ్బలవ్రేఁకచేఁ గందిపోయెను. దయామృతరసము జిలికించునటులఁ జెమ్మట జారుచుండెను. స్వేదోత్పత్తి గమనాతిశయమువలనఁ గలిగిన యలసటచే నని భావము.

కటి=నితంబోపరిభాగమనెడు, కరటికంఠపీఠిపైన్ =గజస్కంధముమీఁద, కంతుఁడనెడి=మన్మథుఁడనెడి, బిరుదుమావంతుఁడేసిన = శూరుఁడైన మావటీఁడిడిన, పీలిజల్లిపెంపుగను = నల్లసౌరపుచౌరి యొక్క ఘనతనొందుచున్న-అనఁగా దానివలెనున్న, పెన్నెఱులగుంపు = కచభారము, ప్రిదిలి=సడలి, జారన్ = వ్రేలఁగాను, ఒకసతి = ఒక స్త్రీ, వసుమతీవరునిజూడన్ = వసురాజును జూచునిమిత్తము, వచ్చెన్ = ఏతెంచెను.

ఈపద్యమందు నావేగమనెడు సంచారిభావమును జెప్పినాఁడు. ఇందుకు, శ్లో. 'ఇష్టానిష్టాగమాజ్జాత ఆవేగ శ్చిత్తవిభ్రమః' అని లక్షణము.

ఉ. డించఁగఁ బ్రొద్దు లే కెద ఘటించినరత్నవిపంచితో సువ
ర్ణాంచితమూర్తి యోర్తు ముఖరాంఘ్రిసమాశ్రితసత్కలాప యై
యంచల వచ్చునోయగపుటంచలఁ దోలుచు మిన్కుచేడె యా
నంచు నుతింప వచ్చె వెస నాచతురాస్యునిమోముఁ గన్గొనన్. 12

డించగఁ బ్రొద్దులేక=దించి దిగువనుంచెడుమాత్రపు వ్యవధానములేక, ఎదఘటించిన=ఱొమ్మునఁ బూనిన, రత్నవిపంచితోన్ = రత్నమయమయిన వీణతోడను, సువర్ణ = బంగారపుకాంతివంటి కాంతిచేతఁగాని చంపకపుష్పకాంతివంటి కాంతిచేతఁగాని, అంచిత = ఒప్పుచున్న, మూర్తియోర్తు = శరీరముగల యొకపఁడుపయని స్త్రీపరమైన యర్థము. శోభనవర్ణస్వరూపురాలని సరస్వతీపరమైన యర్థము. ముఖర=మ్రోయుచున్న, అంఘ్రిసమాశ్రిత=పాదముల నాశ్రయించుచున్న, సత్కలాపయై=శ్రేష్ఠమైన భూషణములుగలదై - అనఁగా నందెలుగలదై యని యర్థము. ముఖర = వాచాలురైన, అంఘ్రిసమాశ్రిత = పాదాశ్రితులైన, సత్ = సత్పురుషులయొక్క, కలాపయై = సమూహముగలదై యని సరస్వతీపరమైన యర్థము. (ని. 'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతా వపి' అని వి.) అంచలవచ్చునోయగపుటంచలఁ దోలుచున్ = అందగొనివచ్చినట్టి యొయ్యారపుఠాయంచలఁ దొలంగఁ దోలుచునని స్త్రీపరమైన యర్థము. వాహనసమీపముగా వచ్చువాహంసములను దోలుచునని సరస్వతీపరమైన యర్థము. మిన్కుచేడె యానంచునుతింపన్ = సరస్వతీదేవియే యవునని కొనియాడఁగా

వేసన్ = త్వరితగతిచేత, ఆచతురాస్యురి మోము గన్గొనన్ = చతురోక్తులచే యా వసురాజు ముఖమును జూచుకొఱకని స్త్రీపరమైన యర్థము. బ్రహ్మముఖస్థితికొఱకని సరస్వతీపరమైన యర్థము. వచ్చెన్ = విచ్చేసెను.

సువర్ణాంచితమూర్తి గావున మిఱుకుచేసె. చతురాస్యుని సువర్ణాంచితమూర్తి చూడవచ్చుట యొప్పి యున్నది. వీణడించమి దర్శనోత్సుకాతిశయమున. ఉత్సుకాతిశయమున బయలువెడలు చుండు టచే వీణ డించఁదగినంత యవకాశము లేకపోయెఁ గావున డించఁ బ్రొద్దులేకపోయెనని భావము.

చ. పొలఁతి యొకర్తు చెంగలువ • పొట్లము చేతనె పూని వచ్చుచు
న్వలపులదండ జార గుణ • వద్దళమాత్రమె తాల్చె నిమ్మహీ
తలపతి కేన కూర్తు నని • తప్తపరశ్వథ మెత్తివైచి మం
జులదళతంతులేశపరి • శుద్ధి జనాళికిఁ దెల్పుకై వడిన్. 13

పొలఁతియొకర్తు=మఱియొక స్త్రీ, చెంగలువపొట్లము చేతనె పూని = ఎఱ్ఱగలువపూదండ పొదిగిన పొట్లము చేతనేపట్టుకొని, వచ్చుచున్ = విచ్చేయుచు, వలపులదండజారన్ = పరిమళయుక్తమైన యా పూదండ జారిపడిపోఁగా, గుణవద్దళమాత్రమెతాల్చెన్ = ఆ పొట్లపుసంబంధమైనదారముతోఁ గూడిన చిగురుటాకులను మాత్రమే చేతఁబట్టుకొన్నదాయెను. ఏలాగునననిన, ఇమ్మహీతలపతికిన్ = ఈ వసురాజునకు, ఏన = నేనే, కూర్తునని = ప్రియురాలనౌదునని, తప్తపరశ్వథమెత్తివైచి = ఎఱ్ఱగాఁ గాలిన గండ్రగొడ్డలి దూసివైచి, మంజుల = కమిలిపోక కోమలములైయున్న, దళ = చిగురు టాకులతోఁ గూడిన, తంతులేశ = సన్నపునూలుపోగులు గలుగునట్టులుగా, పరిశుద్ధిన్ = తనయొక్క శపథపరిశుద్ధతను, జనాళికిన్ = చూచెడువారికి, తెల్పుకైవడిన్ = తెలియఁజేసినట్టులుగా, గుణవద్దళ మాత్రమె తాల్చెనని సంబంధము.

లోకములో నెవరైనప్పటికిని ప్రమాణముసేయువారు సన్నపు నూలుదారములతోఁ గూడుకొన్న లేఁతచిగురుటాకులు దోసిటఁ బెట్టుకొని యెఱ్ఱగాఁ గాలిన యినుపముద్ద నాదోసిటనేపట్టి యెత్తివైచి యందువలన నెంతమాత్రమును గందకుండెడు దారములతోఁ గూడిన చిగురుటాకులు చూచెడు వారి కందఱికిని గనుపఱిచిన దృఢాధ్యవసాయమును బ్రకటముచేయుట ప్రసిద్ధము గనుక నాప్రతీతి ననుసంధించి చెప్పినాఁడు. గుణవంతమగు దళము కేలనుంచుకొను చిగురాకుదారము. కాలినగండ్ర గొడ్డలి చెంగలువపూవులు. ఈ రాజునకు నేను గూర్తునని ప్రమాణముచేయునటులఁ దెలియయునికిఁ దోఁచఁ జేసెను. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. చిత్తరియోర్తు ముత్తియపు • బేరు వలగ్నమునన్ ఘటించి కే
ల్గుత్తపుఁజన్నుదోయి నొనఁ • గూర్చి రయంబునఁ జూడ వచ్చె రా
జోత్తము నాత్మహారవిభ • వోజ్జ్వలమధ్యవిదారణక్రియా
యత్తము లైనచన్నులఁ బ్రి • యంబున వేఁడుచు వచ్చెనో యనన్. 14

చిత్తరియోర్తు = శృంగారవతియైన మఱియొకస్త్రీ, ముత్తియపుబేరు వలగ్నమునన్ ఘటించి = ముత్యాలహారము నడుమున దోపుకొని, కేలు=హస్తాగ్రమును, గుత్తచన్నుదోయి నొనఁగూర్చి = గమన వేగముచేతఁ గంపించుచున్నవి గనుక బిగువైన కుచద్వయముపైని జేర్చుకొని, రాజోత్తమున్ = రాజ

శ్రేష్ఠుని, రయంబునఁ జూడవచ్చెన్ = వేగముగాఁ జూడవచ్చెను. ఏలాగనిన, ఆత్మహారవిభవ = తన సంబంధమయిన ముత్యాలహారముయొక్క వైభవముచేత, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, మధ్య = నడుము యొక్క, విదారణక్రియాయత్తములైన = భగ్నక్రియాచరణమున కధీనములైన - అనఁగా నడుమును భంగపెట్టుట కుద్యుక్తములగుచున్న, చన్నులన్ =కుచములను, ప్రియంబున వేఁడుచువచ్చెనోయనన్ = మంచితనముచేతఁ బ్రార్థించుచు వచ్చెనో యన్నట్టులుగా వచ్చెనని సంబంధము.

ఇందులో విభ్రమమును జెప్పినాఁడు. శ్లో. 'విభ్రమ స్త్వరయాకాలే భూషార్థనవిపర్యయః' అని లక్షణము. ముత్తెపుసరులు గుత్తపుఁజన్నుదోయి 'జవ్వాదునడుముగలది గావున బిత్తరి. హారము గుబ్బలపై వేసికొనఁబోవుతఱి రాజాగమనము విని నడుమున దోపుకొని బిత్తరి త్వరగా వచ్చెను. త్వరగా నేతెంచుటచే నుబ్బుగుబ్బల ప్రేగున నడుము మిగులఁ గంపింపసాగెను. నడుమును విదారణముచేయుటకు బిత్తరిసహింపక గుబ్బలను బ్రతిమాలుచున్నటుల గుబ్బలపైఁ గేలుదోయియుంచుకొని వచ్చెను. గుబ్బలుబ్బుఁ జూపుట కామేంగితము. దానిని మఱుఁగుపఱచుట కేలుగవ చనులపై నొసగూర్చుట. అవుడు నడుము మఱింత జవ్వాడెను.

మ. రమణీయోజ్జ్వలవజ్రకుట్టిమముపై • రత్నాంకభూషానుబం
ధముతోడం బరువెత్తె మే లని పద•ద్వంద్వంబుపై నాహిత
ప్రమదం బై హృదయంబు వేగవిగళ•త్ప్రాలంబముక్తాభిషే
కము గావింపఁగ వచ్చె నోర్తు వసులో•కస్వామి నీక్షింపఁగన్. 15

రమణీయోజ్జ్వల వజ్రకుట్టిమముపైన్=మనోహరమగునట్టులుగాఁ బ్రకాశించుచున్న వజ్రమణుల చేతఁ గట్టఁబడిన భూమిమీఁద, రత్నాంక = వజ్రమణిమయములైన, భూషా = అందెలయొక్క, అనుబంధముతోడన్ = సంబంధాపలంబనముతోడ, పరువెత్తెన్ = జారిపడక వడిగాఁ బరుగెత్తెను, మేలని = సెబాసని, పదద్వంద్వంబుపైన్ = పాదద్వయముమీఁద, ఆహితప్రమదంబై = కూర్పఁబడిన సంతోషముగలదై, హృదయంబు = డెందము, వేగ = గమనవేగముచేత, విగళత్ = తెగిజారిపడుచున్న, ప్రాలంబ = హారసంబంధములయిన, (ని. 'ప్రాలంబ మృజులంబి స్యా త్కంఠాత్' అని అ.) ముక్తా = ముత్తియములచేత, అభిషేకము గావింపఁగన్ = అభిషేకము సేయుచుండఁగా, ఓర్తు=ఒకవనిత, వసులోక స్వామిన్ = వసురాజును, ఈక్షింపఁగన్ = చూచుకొఱకు, వచ్చెన్ = ఏతెంచెను.

అనఁగా వసురాజును జూడవలెనన్న యపేక్షచేత నొకస్త్రీ వజ్రకుట్టిమముమీఁదఁ బరుగెత్తి నడువఁగా ముత్యాలహారము తెగి రాలుచున్న ముత్యము లాస్త్రీ పాదద్వయముమీఁదఁ బడుచుండఁగా నది హృదయము త్వరగాఁ జూడవలెనన్న యభిలాషగలది గనుక నందు కనుకూలముగా స్నిగ్ధమైన వజ్రకుట్టిమముమీఁదఁ బడుదునేమోయని యయినను విచారింపక పరుగెత్తుచున్నది. సెబాసు అని మెచ్చుకొని యాపదద్వయముమీఁద ముక్తాభిషేకము చేయుచున్నదో, యన్నట్టులుగా నుండెనని తాత్పర్యము. కుట్టిమము రమణీయోజ్జ్వలహారమయమనుటవలన మిగుల నునుపుగా నుండెనని భావము. అందు నడచుటయే కష్టము. రత్నఖచితములగు నందియలతో నేగుట మఱియుఁ గష్టము. హృదయమును మన్నించియే పాదము లింతశ్రమకోర్చెను. అందులకై హృదయము ముక్తాహారమునందలి ముత్తెములు రాల్చుటతో నభిషేక మొనరించెను. ముక్తాఫలము తెగి ముత్తెములు జారుట వేగవశమున.

సీ. తను ఘనంబుగ నమ్మి♦దరియునెమ్మికిఁగొప్పు మాల్యభోగినొసంగి♦మఱలఁబంచెఁ
దనుఁగొండయనివచ్చు♦నునుజింకఁగుచము గారుడశిలాసరదూర్వ ♦ లిడిమరల్చెఁ
దనుఁగల్పలతికఁగాఁ ♦ దలఁచి వ్రాలెడుశారిఁ గరమురత్నఫలాళి ♦ నెరపి నిలిపెఁ
దనుఁ బద్మమనియంటఁ♦బెనఁగునంచకు నంఘ్రిహీరాంగదమృణాళ♦మిచ్చియనిచె
తే. నాత్మపోషితవర్గంబు ♦ లవనిపావ
లోకగమనాంతరాయంబు ♦ గాక యుండ
నవయవంబులె తోడయ్యె ♦ నతివ కనుచు
నెచ్చెలులు మెచ్చ వచ్చె మానిని యొకర్తు. 16

తనుఘనంబుగనమ్మి = తన్ను మేఘమని విశ్వసించియని యర్థము. ఉత్తమవస్తువని నమ్మియని యర్థాంతరము. దరియు=డాసివచ్చుచున్న, నెమ్మికిన్ = నెమిలికి, కొప్పు=కబరీభారము, మాల్య=పుష్పదండ యనెడు, భోగిన్ = సర్పమును, ఒసంగి = ఇచ్చి, మఱలఁబంచెన్ = వెనుకకుఁదిరుగాఁ బంపించెను. ఇక్కడ మేఘమువలన నీరుపాములు పడుచున్నవిగనుక భోగినిచ్చుటగాఁ జెప్పినాఁడు. నెమిలికి పాముపాహారముగావున దానితోఁ దృప్తినొందివెనుకకు మఱలెననిభావము. ఘనముగా నమ్ముటచేఁ గామిత వస్తువిచ్చి తృప్తిపఱచుట.

తనుఁగొండయని = తన్నుఁబర్వతమని భ్రాంతిపడి యనియర్థము. మహోన్నతవస్తువని యర్థాంతరము. వచ్చు = ఏతెంచుచున్న, నునుజింకన్ = బాలకురంగమును, కుచము=గుబ్బచన్ను, గారుడశిలా సర = గరుడపచ్చలబన్నసరమనెడు, దూర్వలిడి = లేఁతగఱికిపోచలనిచ్చి, (ని. 'దూర్వాతు శతపర్వికా, సహస్రవీర్యా భార్గవ్యౌ రుహానంతా' అని అ.) మఱల్చెన్ = తిరుగనంపించెను. నునుజింకగావున గఱికి మొలక లాహారము. గారుడశిలాహారము లేఁతగఱికివలెనుండును గావున బాలహరిణమును హారమొసంగి మఱల్చెను. గరుడపచ్చలు గఱికివలె నుండుననుటకు-

సీ. ...రాజితదూర్వాంకురముల పసను, జిగితటుకొత్తరాచిలుక ఱెక్కలవన్నె
............. శుద్ధమరకతంబు. రత్నపరీక్ష.

తనుఁగల్పలతికఁగాఁదలఁచి = తన్నుఁదీఁగెయని విచారించియనియర్థము. కోరికలిచ్చెడిదానినిఁగాఁ దలఁచి యని యర్థాంతరము. వ్రాలెడు=వచ్చివ్రాలినట్టి, శారిన్=మాటాడెడు గోరువంకపక్షిని, కరము= హస్తము, రత్నఫలాళిన్=రత్నము లనెడుఫలసమూహమును, నెరపి = వెదచల్లి, నిలిపెన్=నివారించెను. రత్నము రక్తగణములోఁ జేరినదికావున వెంటనంటినమచ్చిక గోరువంకకు రత్నఫలము నొసంగెను. దానినిఫలమనుకొని గోరువంకవెంటరాక యచటనే యాఁగిపోయెను. కీరశారికాదులుఁరత్నములను ఫలములని భ్రమించుటయు సఖీజనము భ్రమింపఁజేయుటయు గ్రంథాంతరములందుఁ గలదు.

తనుఁబద్మమని = తన్నుఁబంకజమనివిచారించియని యర్థము. పద్మమనెడునిధినిగా విచారించియని యర్థాంతరము. అంటఁబెనఁగు = కదలిమల్లాడుచున్న, అంచకున్ = హంసకు, అంఘ్రి=పాదము, హీర= వజ్రమయమయిన, అంగద=అందెయనెడు, మృణాళము=తామరతూఁడును, ఇచ్చి=అందిచ్చి, అనిచెన్ = పంపించెను. చిరకాలమునుండి పద్మమని పాదముల నంచ యాశ్రయించెను. పాదకంకణము మృణాళము వలె నుండెను గావున దాని నాయంచ కొసంగుటచే నది పరితృప్తినొంది వెనుకకు మఱలెను.

ఆత్మపోషితవర్గంబులు = తనచేతఁ బోషింపఁబడుచున్నయీమయూరాదికములు, అవనిప = వసురాజుయొక్క, అవలోక = దర్శనార్థమయిన, గమన = యానమునకు, అంతరాయంబుగాకయుండన్ = విఘ్నకారులు గాకుండునట్టులుగా, అవయవంబులె = అనఁగాఁ గొప్పు కుచము కరము అంఘ్రి యనునవయవములే, తోడయ్యెవతివకనుచున్ = సహాయమాయె నీవుగువకని, నెచ్చెలులు మెచ్చన్ = చెలికత్తెలు మెచ్చుకొనఁగా, మానినియొకర్తు=ఒకస్త్రీ, వచ్చెను = ఏతెంచెను.

ఇంతమట్టుకు నావేగమనెడు సంచారిభావమును జెప్పినాఁడు. ఈపద్య మక్కలిప్రాససీసము. నెమిలికిఁ బాములు, జింకలకు గఱికె, శారికలకు ఫలములు, హంసలకు మృణాళములు నాహారములు. దండలు, మరకతహారము, రత్నము, కడియము నొసంగుటతో నెరులు, గుబ్బలు, కరములు, పదములు నాయాపోషితవర్గము నానందపఱచెననిభావము. ఇందు నాయిక యచ్చరలేమగావున శిరఃప్రభృతి పాదపర్యంత మభివర్ణితము.

ఉ. పౌరపురంధ్రు లిట్లు వసు • పార్థివుఁ గన్గొన వచ్చి మంగళా
చారమనోజ్ఞలాజములు • చల్లిరి సింధుభవావివాహదీ
క్షారమణీయమూర్తి యగు • శౌరిపయిం గలశాబ్ధినిర్మలో
దారతరంగరేఖలు సు • ధాలవము ల్వెదచల్లుకైవడిన్. 17

పౌరపురంధ్రులు = కోలాహలపుర సంబంధినులయిన స్త్రీలు, ఇట్లు=ఈపూర్వోక్తప్రకారముగా, వసుపార్థివుఁ గన్గొనవచ్చి = వసురాజును జూడనేతెంచి, సింధుభవా = క్షీరాబ్ధిసంభవయైనలక్ష్మీదేవితోడఁగాఁబోవు, వివాహ = పెండ్లియందలి, దీక్షా = నియమముచేత, రమణీయ = సుందరమగుచున్న, మూర్తియగు=ఆకృతిగలవాఁడైన, శౌరిపయిన్ = విష్ణుదేవునిమీఁద, కలశాబ్ధి=క్షీరాబ్ధియొక్క, నిర్మల= స్వచ్ఛములైన, ఉదార = అతిశయములయిన, తరంగరేఖలు = తరంగశ్రేణులు, సుధాలవములు వెదచల్లుకైవడిన్ = అమృతజలబిందువుల వెదచల్లినట్లుగా, మంగళాచారమనోజ్ఞలాజములు = మంగళార్థములయిన వరిపేలాలు, సింధుభవా = శుక్తిమతీనదీసంభవయైన గిరికాదేవిసంబంధమయిన, వివాహదీక్షా= వివాహమందలినియమముచేత, రమణీయమూర్తియగు=సుందరమైన యాకృతిగలవాఁడైన, శౌరిపయిన్= శూరసంభవుఁడయిన వసురాజుమీఁద, చల్లిరి=చల్లినవారైరి.

శ్రీమహావిష్ణువునకును వసురాజునకును లక్ష్మీదేవికిని గిరికాదేవికిని క్షీరాబ్ధితరంగశ్రేణులకును బుర స్త్రీలకును సుధాజలబిందువులకును శుభలాజములకును నుపమానోపమేయభావమని విచారింపవలయును. వరిపేలాలుచల్లుట మంగళార్థము. ఇటుల సంభ్రమముగా నేతెంచుట సకాలమున దర్శింపవలయుననియె కాదు. లాజలుచల్లి విధి నెఱవేర్పవలయునని. అలం. ఉత్ప్రేక్ష.

మ. అపు డద్రీశ్వరుఁ డాప్తబాంధవులతో • నభ్రాపగాముఖ్యపు
ణ్యపురంధ్రీతతితో నెదుర్కొనఁ దదీ • యద్వారసీమన్ సిత
ద్విపమున్ డిగ్గి సురాధిరాజపుర వే • త్రిశ్రేణి సాహో యనన్
నృపచూడామణి తత్ప్రధానజనతా • నిర్దిష్టమార్గంబునన్. 18

అపుడు=ఆసమయమందు, అద్రీశ్వరుఁడు=కోలాహలుఁడు, ఆప్తబాంధవులతోన్=ఆప్తులైనబంధువులతోడను, అభ్రాపగాముఖ్యపుణ్యపురంధ్రీతతితోన్ = ఆకాశగంగమొదలయిన పుణ్యాంగనా

సమూహముతోడను, ఎదుర్కొనన్ = ఎదురరాఁగా, తదీయద్వారసీమన్ = ఆకోలాహలపురద్వారదేశమందు, సితద్వీపమున్ డిగ్గి = వెల్లయేనుఁగునుదిగి, సురాధిరాజపురవేత్రిశ్రేణి = ఇంద్రపురసంబంధులైన వేత్రధరులయొక్క, సమూహము - అనఁగాఁ జోపుదార్లు, సాహోయనన్ = పరాకు దెలుపఁగా, నృపచూడామణి = వసురాజశిఖామణి, తత్ప్రధానజనతానిర్దిష్టమార్గంబునన్ = ఆకోలాహలుని యొక్క మహామాత్యజనసమూహముచేత నియమింపఁబడిన మార్గముచేత, ముందరిపద్యముతో నన్వయము.

సీ. మణికుట్టిమములు భామాగీతికార్ద్రవిభావభవ్యజలాప్తిఁబాద్య మిడఁగ
మందారసుమకాయమానము ల్పవమానశీర్ణకేసరములఁ సేస చల్లఁ
జిత్రితారాత్రికాపుత్త్రిక ల్కరదీప్తరత్నదీధితుల నారతులు ద్రిప్ప
బహువిధద్వారరంభాకోటిపరిపక్వఫలరసంబులమధుపర్క మొసఁగ
తే. మున్ను గా నన్నగాన్వయముఖ్యభవన
లక్ష్మి యిట్లు వివాహవేళామహోప
చారముల నన్నిటి ఘటింప సాంద్రవిభవ
కలితకల్యాణవేదికఁ గదిసె నపుడు. 19

మణికుట్టిమములు = మణులచేతఁ గట్టఁబడిన కట్టుభూములు, భామా = స్త్రీలయొక్క, గీతికా= గానమహిమచేత, ఆర్ద్రవిభావ = కరఁగినందున, భవ్యజలాప్తిన్ = యోగ్యమయిన యుదకప్రాప్తిచేత, పాద్యమిడఁగన్ = పాద్యముసమర్పింపఁగాను, మందార = మందారమను దేవతరువుయొక్క, సుమ = పుష్పములచేత రచింపఁబడిన, కాయమానముల్ = పందిళ్ళు, పవమాన = వాయువుచేత, శీర్ణ=రాల్పఁబడిన, కేసరములన్ = కింజల్కములచేత, సేసచల్లన్=సేసచల్లఁగాను,

చిత్రిత=సంజాతచిత్రములైన-అనఁగాఁ జిత్రదళయుక్తములయిన, ఆరాత్రికా = ఆరతిపళ్లెరములతోఁ గూడుకొన్న, పుత్త్రికలు = కీలుబొమ్మలు, కర = హస్తములయందు, దీప్త=వెలుఁగుచున్న, రత్నదీధితులన్ = మణికాంతులచేత, ఆరతులుద్రిప్పన్ = నీరాజనములియ్యఁగాను, బహువిధ=అనేకవిధములయిన, ద్వార=వాకిళ్ళయందలి, రంభాకోటి=కదళీతరుసమూహము, పరిపక్వఫలరసంబులన్=చక్కఁగాఁ బండిన పండ్లయొక్కరసముచేత, మధుపర్క మొసఁగన్=మధుపర్కమియ్యఁగాను, మధుపర్క మనఁగాఁ బెరుఁగును దేనెయును గలిపిచేసినదానికి పేరు.

'దధి సర్పి ర్జలం క్షౌద్రం సితైతాభిస్తు పంచభిః
ప్రోచ్యతే మధుపర్కస్తు సర్వదేవౌఘతుష్టయే
జలంతు సర్వతః స్వల్పం సితాదధ్యఘృతం సమం
సర్వేషా మధికం క్షౌద్రం మధుపర్కే ప్రయోజయేత్' కాళికాపురాణము.

ఉపవాసానంతరము పెండ్లికుమారుఁడు దీనిని భుజించుట సుప్రసిద్ధము.

ఇట్లు = ఈప్రకారముగా, మున్నుగాన్ = ముందుగా, అన్నగాన్వయముఖ్యభవనలక్ష్మి = పర్వతకులశ్రేష్ఠుఁడయినయాకోలాహలుని గృహసంపత్తి, వివాహవేళామహోపచారములన్నిటి ఘటింపన్ = పెండ్లిసమయమందు వరునకుఁ జేయవలయునధికోపచారములను యావత్తును సమకూర్పఁగా, అపుడు =

ఆసమయమునందు, సాంద్ర=నిబిడమైన, విభవ=వైభవముతోడ, కలిత = కూడుకొన్న, కల్యాణవేదికన్ = వివాహవేదికయైన బంగారపుటరుగును, (ని. 'కల్యాణం మఙ్గళే స్వర్ణే' అని నా.) కదిసెన్ = సమీపించెను.

మహోపచారములను భవనలక్ష్మియె యొనర్చెను. పాద్యమను కుట్టిమములు, మందారలతికలు సేసలు, చిత్రనిగ్రహములు ఆరతులు, ద్వారకదళీస్తంభములు మధుపర్కములు సమయోచితముగఁ బ్రసాదించెను.

మ. నరనాథోత్తముమ్రోల నున్నమితదంతస్తంభమై చారుచా
మరకక్ష్యాకదళీకలాపశుభకుంభంబై సదామోదమే
దురసారంగమదాంకసంకలితమై తోడ్తో మహావారణ
స్ఫురణన్దెల్పువివాహవేదికపయిన్ శోభిల్లెఁ బద్మావళుల్. 20

ఈపద్యమునందు మహావారణస్ఫురణన్ అనువిశేషమువలన వివాహవేదికాపరముగను గజపరముగను నర్థద్వయము కలదు.

నరనాథోత్తముమ్రోలన్=వసురాజునెదుట, ఉన్నమిత = ఎత్తఁబడిన, దంత = గజదంతకృతములైన, స్తంభమై = స్తంభములుగలదై యని వివాహవేదికాపరమయిన యర్థము. ఎత్తఁబడిన స్తంభసదృశదంతములుఁగలదై యని గజపరమైన యర్థము. చారు=సుందరమయిన, చామర=చమరీశబ్దము పువ్వుగుత్తియందును వర్తించుచున్నది. ('చమరీణాంసమూహశ్చామరమ్') అనఁగాఁ బువ్వుగుత్తులసమూహంబును, లేక వింజామరలును, (ని. 'చమరం చామరే స్త్రీతు మఞ్జరీ మృగభేదయోః' అని మేదిని.) కక్ష్యా = బంతులును, (అనఁగా సుమవీథులు) కదళీకలాప = రంభాతరుసమూహములను, శుభకుంభంబై= పూర్ణకలశములుగలదై యని వేదికాపరమయిన యర్థము. చారుచామర = సుందరములయిన వింజామరలును, కక్ష్యా = మధ్యభాగమందుఁ గట్టెడుత్రాడును, కదళీ = కేతనవస్త్రమును, కలాప = నెమిలిపింఛమును, శుభకుంభంబై = కుంభస్థలములునుగలదై యని గజపరమయిన యర్థము. కక్ష్యాశబ్దమునకు, (శ్లో. 'కక్ష్యా బృహతికాయాంచ కాంచ్యాం మధ్యేభబంధనే, హర్మ్యాదీనాం ప్రకోష్ఠేచ' అని వి.) కదళీశబ్దమునకు, (ని. కదళీ వైజయంత్యాంచ రంభాయాం హరిణాంతరే') కలాపశబ్దమునకు, (శ్లో. 'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతా వపి' అని అ.) కుంభశబ్దమునకు, (శ్లో. 'కుంభౌ ఘటేభమూర్ధాంశౌ' అని అ.) సత్ = శ్రేష్ఠమయిన, ఆమోద=పరిమళముచేత, మేదుర = సాంద్రమయిన, సారంగమద = కస్తూరియొక్క, అంక=చిహ్నములతోడ, సంకలితమై=కూడుకొన్నదై యని వేదికాపరమయిన యర్థము. సదా=ఎల్లప్పుడును, మోదమేదుర=ఆనందసాంద్రములగుచున్న, సారంగ=తుమ్మెదలు గలిగిన, మద = మదజలముయొక్క, అంక=చిహ్నములతోడ, సంకలితమై=కూడుకొన్నదై యని గజపరమయిన యర్థము. సారంగశబ్దమునకు, (శ్లో. 'చాతకే హరిణే పుంసి సారఙ్గశ్శబలే త్రిషు' అని అ.) తోడ్తోన్ = వెంబడిగా - అనఁగా గజపరముగాఁ జెప్పఁబడిన యర్థాంతరములచేతననుట. మహావారణస్ఫురణన్దెల్పు = మహాగజస్ఫూర్తులను కనుపఱుచుచున్న యని యర్థము. మహ = ఉత్సవముయొక్క, అవారణ = అనివార్యములయిన, స్ఫురణన్దెల్పు=స్ఫురణలను దెలుపుచున్నదనిభావము. ఇక్కడ, మహాభద్రవిస్ఫురణన్దెల్పు, అని పాఠాంతరము. భద్రమనఁగా గజవిశేషమును మంగళమును అని గ్రహింప

పలయును. వివాహవేదికపయిక్ = అట్టిపెండ్లియరుగుమీఁద, శోభిల్లెఁబద్మావళుల్ = పద్మమాలికలు ప్రకాశించె నని యర్థము. గజగాత్రబిందుజాలములని యర్థాంతరము. (ని. 'పద్మకం బిందుజాలకమ్' అని యమరము.)

వివాహవేదికను దంతంపుగంబములు పూవుగుత్తులు అరఁటిచెట్లు పూర్ణకుంభములు తావిచిందు కస్తూరియలుకు పద్మమాలికలు లోనగువానిచే నలంకరించిరనిభావము.

క. మనుజవిభుఁ డపుడు నగపతి, పనుపున మణిపీఠి నమరెఁ ◆ బ్రకటితకమలా
కనకాంబరకల్యాణాం, కన కాంత వివాహసదన◆కాంచనవేదిన్. 21

మనుజవిభుఁడు = వసురాజు, అపుడు = ఆసమయమందు, నగపతిపనుపునక్ = కోలాహలపర్వత నాథునియనుజ్ఞచేత, ప్రకటిత = సిద్ధమగుచున్న, కమలాకనకాంబర = లక్ష్మీనారాయణులయొక్క, కల్యాణాంకన = పెండ్లిపాటలచేత, కాంత=ఒప్పుచున్న, వివాహసదన = పెండ్లిచవికలోనున్న, కాంచన వేదిక్=బంగారపుఁ బెండ్లియరుగునందలి, మణిపీఠిక్ = రత్నమయమయిన పెండ్లిపీటయందు, అమరెక్= ఒప్పెను. అనఁగాఁ గూర్చుండెననుట.

చ. విధివిహితంబుగాఁ బుధగ◆వీదధిమిశ్రసురద్రుమంజరీ
మధుమధుపర్కము న్విమల◆మౌక్తికపాత్రికఁ దెచ్చి యాగుణో
దధికి నొసంగె మామ మధు◆దానవవైరికి లచ్చి నిచ్చునం
బుధి యమృతాంశుతో నమృత◆పూరము మున్నొ యొసంగుకై వడిన్. 22

విధివిహితంబుగాక్ = శాస్త్రోక్తప్రకారముగా, బుధగవీ=కామధేనుసంబంధమయిన, దధి=పెరుగు తోడ, మిశ్ర = కలిసిన, సురద్రు = కల్పవృక్షముయొక్క, మంజరీ = పువ్వుగుత్తియందలి, మధు = మకరందమనెడు, మధుపర్కముక్ = మధుపర్కమును, (శ్లో. 'దధిమధుసీసర్పిర్వామధ్వలాభే' అని మధుపర్కలక్షణము.) విమలమౌక్తికపాత్రికఁదెచ్చి = స్వచ్ఛమైన ముత్తెపుగిన్నెతోఁ బట్టుకొనివచ్చి, ఆగుణోదధికిక్ = గుణసముద్రుఁడయిన యావసురాజునకు, మామ = మామయగుకోలాహలుఁడు, ఒసంగెక్ = ఇచ్చెను. ఏలాగనిన, మధుదానవవైరికిక్ = శ్రీమహావిష్ణువునకు, లచ్చినిచ్చునంబుధి = లక్ష్మీదేవి నిచ్చునట్టి క్షీరసముద్రుఁడు, అమృతాంశుతోక్ = చంద్రునితోడ, అమృతపూరముక్ = సుధాపరిపూర్తిని, మున్నొయొసంగుకైవడిక్ = ముందుగానే యిచ్చినట్లువలె, ఇచ్చెనని సంబంధము.

వసురాజునకు గిరికాదేవి నిచ్చునట్టి కోలాహలుఁడు మౌక్తికపాత్రతో మధుపర్క మిచ్చుట విష్ణుదేవునకు లక్ష్మీదేవి నిచ్చునట్టి సముద్రుఁడు చంద్రునితో నమృతపూరము నిచ్చినట్లుండెననియర్థము. అంబుధి యనఁగా నుదధియనిచెప్పి విష్ణుదేవుని మామయయిన యుదధికంటె గుణోదధికిమామయయిన కోలాహలుఁ డధికుఁడని వ్యతిరేకమును విచారింపవలయును. మామయయిన యుదధికంటె గుణోదధికి మామయయినవాఁ డధికుఁడగుట యుక్తము. ద్రుశబ్దమునకు, (ని. 'అనోకహాః కుట స్సాలః పలాశీ ద్రుద్రుమా గమాః' అని అ.)

మౌక్తికపాత్రి యనుటకు బదు లొకరు శంఖపాత్రమని చెప్పియున్నారు. మౌక్తికపాత్రిక యనుచో ముత్తెపుఁజిప్పను చెప్పుటయె యుచితము. ముత్తెములలో ముత్తెపుఁజిప్పలందుఁబుట్టినవి ప్రశస్తములు. అటులె మౌక్తికపాత్రములలో ముక్తాపాత్రములే గణ్యములు. ఇటులనుటకు.

శ్లో. కరీంద్ర జీమూత వరాహ శంఖ మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని
ముక్తాఫలాని ప్రథితానిలోకే తేషాంతు శుక్త్యుద్భవ మేవభూరి.

చ. అపుడు పురంధ్రివర్గవృతయై చరణాంకకృతార్థ మైనక
ర్ప్రపునుముగ్గుపై మకరపద్మము లేర్పడ నీక్షణప్రభా
స్నపనపవిత్రకుట్టిమమునన్ వరనీలనిధు ల్జనింప నా
నృపమణిభాగ్యలక్ష్మికరణిం దరుణీమణి వచ్చె నొయ్యనన్. 23

అపుడు = ఆసమయమందు, పురంధ్రివర్గవృతయై = ముత్తయిదువలగుంపుచేత నాదరింపఁబడినదై, చరణాంక = పాదచిహ్నములచేత, కృతార్థమైన = ధన్యమయిన, కర్ప్రపునుముగ్గుపైన్ = కర్పూరపరాగ రచితమయిన రంగవల్లికమీఁద, మకరపద్మములేర్పడన్ = మకరపద్మనిధు లేర్పడఁగాను అని యర్థము. మకరపద్మరేఖలు - అనఁగా మకర పద్మాకృతులుగల ముద్ర లేర్పడఁగానని భావము. ఇక్కడ రంగవల్లీరూపక మకరపద్మములను మకరపద్మనిధులుగా నధ్యవసించినాఁడు. చరణాంక కృతార్థమన్నచోట, చరణాంక = సకలసంపత్సంపాదకములైన పాదచిహ్నములచేత, కృత = చేయఁబడిన, అర్థము = మకరపద్మనిధిరూపార్థముగలదని యొక యర్థము. మకరపద్మరూపములు గలవై కర్పూరపరాగగతములయిన పాదచిహ్నములచేతఁ జేయఁబడిన - అనఁగా నభేదాధ్యవసాయసంపాదితమయిన మకరపద్మనిధిరూపార్థముగలదని మఱియొక యర్థము. ఈలాగున నర్థద్వయమును సూక్ష్మదృష్టిచేత గ్రహింపఁదగినది. ఈక్షణప్రభా = దృష్టిప్రభలయొక్క, స్నపన=స్నానముచేత, పవిత్ర = పావనమయిన, కుట్టిమమునన్ = కట్టుభూమియందు, వరనీలనిధుల్జనింపన్ = వరనిధియును నీలనిధియును జనింపఁగా ననియర్థము. శ్రేష్ఠమయిన నీలకాంతిస్తోమములు జనింపఁగా ననిభావము. ఇక్కడ శ్రేష్ఠములయిన నీలకాంతిస్తోమములు వరనిధియును నీలనిధియునుగా నధ్యవసించినాఁడు. ఆనృపమణిభాగ్యలక్ష్మికరణిన్ = ఆవసురాజుయొక్క భాగ్యలక్ష్మివలె, తరుణీమణి = గిరికాదేవి, ఒయ్యనన్ = ఒప్పిదమగునట్లుగా, వచ్చెన్ = ఏతెంచెను. అనఁగా వసురాజుయొక్క భాగ్యలక్ష్మివంటిది గనుకఁ దాను ద్రొక్కినచోట మకరపద్మనిధులును దాను జూచినచోట వరనీలనిధులును జనింపఁగా గిరికాదేవి వచ్చెననుట. ఈక్షణరుచులను నీలముగను శ్వేతముగను జెప్పుట కలదు.

"యన్ముక్తాశ్రవణాంతరేణతరళా తీక్ష్ణాకటాక్షచ్ఛటాః
భృంగాధిష్ఠిత కేతకాగ్రిమదళ ద్రోణీ సదృక్షచ్ఛవిః" కర్పూ.
"వేశ్యాః త్వత్తో నఖపదసుఖాన్ ప్రాప్య వర్షాగ్రబిందూన్
ఆమోక్ష్యన్తే త్వయిమధుకరశ్రేణి దీర్ఘాన్ కటాక్షాన్." మేఘదూతము.

ఉ. ఐదువ లామహేంద్రగురునాననతిం గొందెర యొత్తి విశ్వధా
త్రీదయితున్ సతిం గడియఁ దెచ్చిరి వేడ్కఁ బ్రభాతవాతసం
పాదితబోధ లైననవపద్మిను లాత్మపరాగపాళికా
చ్ఛాదన మావహించి కవజక్కవలం గదియించుకై వడిన్. 24

ఐదువలు = సువాసినులు, ఆమహేంద్రగురునాననతిన్ = అబృహస్పతియొక్క యనుజ్ఞచేతన గొందెరయెత్తి = ...

వసురాజును, సతిన్ = గిరికాదేవిని, కదియఁ దెచ్చిరి వేడ్కన్ = వేడుకచేత సమీపించునట్టులుగాఁ దెచ్చిరి. ఏలాగనిన, ప్రభాతవాత = ప్రాతఃకాలవాయువుచేత, సంపాదిత = పొందఁబడిన, బోధలైన = వికాసముగలవైన, నవపద్మినులు = నూతనపద్మలతలు, ఆత్మపరాగపాళికాచ్ఛాదన మావహించి = తమ యొక్క యరుణపరాగ పటలముచేత మాటుచేసి, కవ జక్కవలం గదియించుకైవడిన్ = చక్రవాక మిథునమును గదియఁజేసినట్టులుగా, కదియించిరని సంబంధము.

ప్రాతఃకాలవాయువుచేత సంపాదింపఁబడిన వికాసముగల పద్మలతలు తమయొక్క యరుణ పరాగపటలమును మాటుచేసి చక్రవాకమిథునమును గదియఁజేసినట్టులుగా బృహస్పతి యనుమతిచేత సంపాదితబోధలై సువాసిను లెల్లపట్టు తెరఁబట్టి వసురాజును గిరికాదేవిని గదియించిరని యర్థము. పద్మిను లనఁగా స్త్రీలును గనుక స్వారస్యమును గ్రహింపవలయును. ప్రభాతమునందు మందపవమానము వీచును. ఆ వాయువులు పద్మములకు నితరకుసుమములకు వికాసహేతువులు. గాలికి లేచు పద్మపరాగము కెందెర. పరాగము రక్తగణముగఁ జెప్పఁబడినది. ప్రాతఃకాలమునందు వీచుగాడ్పులు మృదుతరముగ నుండును.

చ. తెలతెలవార నొయ్యఁ జనుదెంచి నితాంతరతాంతతాంతలా
చెలువలకింపుగా మెలఁగి చెక్కుఁటఁగూరిన చూర్ణకుంతలా
వళిసరళంబుగా జడిసి వాడిన స్వేదలవోద్గిరావళుల్
తొలఁగఁ బ్రభాతవాయువులు దోఁచుఁ బురిం బరిచారికాకృతిన్.

(పాండురంగమాహాత్మ్యము.)

రేలయందు జక్కవలజంట విడిపోవును. రెండును విరహార్తిమై తపించుచుండును. వేగినంతనఁ జిఱుగాలి వీచును. అపుడు తమ్మిపూదుమారము తెరవలె లేచును. ఆ తెర తొలంగఁగనే చక్రవాక ద్వయము గలసికొనును. కవ వీడిన జక్కవపులుగులవలెఁ బరస్పరాలోకనోత్సాహముమై గిరికావసురాజు లుత్సాహాతిశయమున నుండిరని భావము. ప్రభాతమునందు జక్కవలజంట గలిసికొనుననుటకు-

సీ. సంజ్వరార్తరథాంగసమ్మదప్రతిపాది దారుణతిమిరకాంతారవహ్ని

గీ. గ్రహావతంసంబు పూర్వాద్రి గాన నయ్యె. (పంచతంత్రము.)

ఉ. రాజకరానుషంగమున • రామకరాంబుజ మొప్పఁ గన్యకా
రాజితహస్తయోగమున • రాజకరంబు నతిప్రకాశమై
రాజిల రత్నిఁ గట్టుక్రియ • రాజముఖీకపంకజంబున
న్రాజకరంబునన్ గురుఁ డొనర్చె సమంత్రకకౌతుకాంకముల్. 25

రాజకరానుషంగమునన్ = వసురాజుయొక్క హస్తస్పర్శముచేత, రామకరాంబుజ మొప్పన్ = గిరికాదేవియొక్క యంబుజమువంటి హస్త మొప్పునట్టులుగా ననియర్థము. చంద్రకిరణానుషంగముచేత రమణీయ కరసదృశాంబుజ మొప్పఁగా నని యర్థాంతరము. ఇక్కడ రామపదము రమణీ యార్థము. కన్యకారాజిత హస్తయోగమున రాజకరంబు నతిప్రకాశమయి రాజిలన్ = అనఁగా గిరికాదేవియొక్క యొప్పిదమయిన హస్తస్పర్శముచేత వసురాజుయొక్క హస్త మత్యంతప్రకాశమై యొప్పునట్టులుగా నని యర్థము. కన్యారాశియైన హస్తనక్షత్రముతోడి యోగముచేతఁ జంద్రకిరణము

ప్రకాశింపఁగా నని యర్థాంతరము. ఇంతవఱకు నభేదాధ్యవసాయము. రక్షగట్టుక్రియన్ = రక్షాబంధనము చేసినట్టులుగా, రాజముఖీకరపంకజంబునన్ = గిరికాదేవియొక్క హస్తకమలమందును, రాజకరంబునన్ = వసురాజుయొక్క హస్తమందును, గురుఁడు = బృహస్పతి, సమంత్రక కౌతుకాంకముల్ = వేదమంత్రసహితములయిన కంకణలాంఛనములను, ఒనర్చెన్ = చేసెను. అనఁగాఁ గంకణములు గట్టెననుట.

కౌతుకమనఁగా వివాహసూత్రము. కౌతుకమునకు సమంత్రకత్వము ధర్మశాస్త్రమందు,

శ్లో. 'విశ్వేత్తాతే త్ర్యృచా పుంసాం బధ్నీయా ద్దక్షిణేకరే
అథ వామకరే స్త్రీణాం బృహత్సామేతి మంత్రతః.'

అని చెప్పఁబడియున్నది.

మ. సుముహూర్తం బని సన్మును ల్దెలుప నచ్చో దివ్యశైలేంద్రుఁడా
యమరాధీశహితక్రియానిరతు నాయమ్లానమాలాకలా
పమనోహారి నకుంఠవిక్రమునిఁగా భావించి లక్ష్మీగురు
త్వము దీపింపఁగ ధార వోసెఁ దనయ న్వర్ధిష్ణుసంపన్నిధిన్. 26

సముహూర్తంబని సన్మునుల్దెలుపన్ = ఇది మంచి ముహూర్తసమయమని మునిశ్రేష్ఠులు బోధింపఁగా, అచ్చోన్ = ఆయెడ, దివ్యశైలేంద్రుఁడు = దేవతామహిమగల కోలాహలశైలశ్రేష్ఠుఁడు, ఆయమరాధీశహితక్రియానిరతున్ = ఇంద్రున కిష్టమయిన కార్యమందాసక్తుఁడయిన వసురాజునని యర్థము. రాక్షససంహారము జేసి దేవతాధిపతులకు హితము సేయుచున్నవాని నని విష్ణుపరమైన యర్థాంతరము. ఆ = అట్టి, అమ్లాన = వాడకుండు, మాలాకలాప = పద్మమాలికాభూషణముచేత, మనోహారిన్ = ఒప్పుచున్న యా వసురాజునని యర్థము. వైజయంతీమాలికాలంకృతునని యర్థాంతరము. అకుంఠవిక్రమునిఁగా భావించి = విశబ్దము పక్షియందును వర్తించును గనుక నిక్కడ గరుత్మంతుఁడని చెప్పవలయును. క్రమ మనఁగా సంచారంబును గనుక నకుంఠమయిన గరుత్మత్సంచారముగలవానిఁగా భావించి - అనఁగా నారాయణస్వరూపునిఁగా భావించి యని యర్థము. వసురాజకుంఠిత పరాక్రమముగలవాఁడని భావము. లక్ష్మీగురుత్వము దీపింపఁగన్ = లక్ష్మీజనకత్వము ప్రకాశింపఁగానని యర్థము. విభవగౌరవము దీపింపఁగా నని భావము. వర్ధిష్ణుసంపన్నిధిన్ = వృద్ధిఁబొందెడు సంపదల కాస్పదురాలయిన లక్ష్మీదేవినని యర్థము. అభ్యుదయములకు నిధియయినదాని నని భావము. తనయన్ = అట్టి కొమార్తెను, ధార వోసెన్ = ఉదకధారాపూర్వకముగా దానము చేసెను. వసురాజు అమ్లానమాలోదరుఁడు. అకుంఠవిక్రముఁడు గావున విష్ణుమూర్తి గిరిక వర్ధిష్ణుసంపన్నిధి గావున లక్ష్మీదేవి. కోలాహలుఁడు సముద్రుఁడుగావున లక్ష్మీగురువు. ఇటులనుటచేఁ గన్యాదానసమయమున విష్ణుస్వరూపునిగా నల్లుని భావించి కన్యను లక్ష్మీగాఁ దెలుపుమంత్రములతో ధారారూపముగాఁ గన్యాదాతగావించు కన్యాదానవిధి యిట గ్రాహ్యము.

మ. సతచూడాపరికర్మచంద్రతపను ల్నక్షత్రదామంబునం
బ్రతిబింబింపఁగ నున్నకన్నెయఁ బుత న్మాంగల్యసూత్రంబు శా
శ్వతకల్యాణగుణావహుం డునిచె నాచంద్రార్కనక్షత్ర సం
తతపై వించుతదీయనిత్యగుణము ల్నాకు ల్ప్రశంసింపఁగన్. 27

నత=సిగ్గుచేత వంచుకొనఁబడిన, చూడా = శిరస్సునందలి, పరిసర్పచంద్రతపనుల్ = అలంకార భూతచంద్రసూర్యులు, నక్షత్రదామంబునన్ = ముత్యాలహారమందు, ప్రతిబింబింపఁగన్ = ప్రతి ఫలించునట్లుగా, ఉన్నకన్నెయయుతన్=ఉన్నట్టి గిరికాదేవియొక్క కంఠమందు, మాంగల్యసూత్రంబు= మంగళసూత్రమును, శాశ్వతకల్యాణగుణావహుండు = శాశ్వతమంగళసూత్రావహుఁడని యర్థము. శుభ గుణావహుఁడని భావము. అట్టి వసురాజు, ఉనిచెన్ = ఉంచెను. ఏలాగనిన, ఆచంద్రార్కనక్షత్ర సంతతిశైమితిచు, ఇక్కడ ఆఙ్ అనునవ్యయమభివ్యాప్తిని జెప్పుచున్నది. (ని. 'ఆ జీవదర్థే భివ్యాప్తౌ సీమార్థే ధాతుయోగజే' అని అ.) చంద్రసూర్యసమేతనక్షత్ర సమూహముమీఁద వ్యాపించుచున్న, తదీయనిత్యగుణముల్=ఆ గిరికాదేవియొక్క నిత్యములయిన సుగుణంబులనియర్థము.

గుణములు భూమియందు వ్యాపించి యూర్ధ్వలోకమందును వ్యాపించిన వనుట. ప్రతిబింబిత చంద్రార్కసమేతనక్షత్రదామముమీఁద నున్న గిరికాదేవియొక్క మంగళసూత్రత్రయము నని యర్థాంతరము. మంగళసూత్రత్రయమన్నందుకు గృహ్యాకారులచేతఁ జెప్పఁబడినది.

శ్లో. 'మాఙ్గల్యతంతునానేన బధ్వా మఙ్గళసూత్రకమ్
హేమహస్తసరం బధ్వా కణ్ఠేచ త్రిసరంతథా.'

ఈయాచారము దేశాంతరవిషయమని తెలియవలెను. నాకులు)శంసింపఁగన్=దేవతలు శ్లాఘింప, మంగళసూత్రమును గట్టెనని సంబంధము. నక్షత్రదామమనుటకు, (ని. 'సైవ నక్షత్రమాలా స్యా త్సప్తవింశతిమౌక్తికా' అని యమరము.)

చంద్రసూర్యభూషణములు నొసటగలవని యొకరువ్రాసిరి. ఇది ప్రమాదము. మూలమున స్పష్టముగాఁ జూడాభోగాలంకృతములని కలదు. వసురాజుగుణములు భూలోకమునందు నూర్ధ్వలోకమునందును వ్యాపించెను. గిరిక తలవంచుకొనుటచే నాయమతారహారముపై శిరఃకలిత సూర్యచంద్ర ప్రతిబింబమేర్పడెను. మంగళసూత్రములు మూఁడా హారముపైఁగట్టుట సూర్యచంద్రనక్షత్రములపై వసురాజు మంగళగుణములవ్యాప్తిగా నధ్యవసితము. వసురాజుగుణము లూర్ధ్వలోకవ్యాప్తములు గావు నసే నాకులు ప్రశంసించిరని భావము.

చ. అతివ సతీకరోన్నమిత ♦ యై విభునొదల నేసెఁ జల్లెఁ ద
త్పతినవమౌళిరత్నగత♦భవ్యనిజాకృతి చూచి కంటిరే
పతిశిర నెక్కె నీక్షణమె ♦ బాలయటంచు ధరాధరోపరి
స్థితిసరిదాత్మసంభవకుఁ ♦ జెల్లదె యంచు సఖు ల్వచింపఁగన్. 28

అతివ = గిరికాదేవి, సతీకరోన్నమితయై = పతివ్రతా స్త్రీలయొక్కహస్తములచేతనెత్తఁబడినదై, విభునొదలన్=పతియైన వసురాజు శిరస్సునందు, నేసఁజల్లన్=తలఁబ్రాలు పోసెను. ఏలాగనిన, తత్పతి= ఆవసురాజుయొక్క, నవ=నూతనమయిన, మౌళి = కిరీటసంబంధములయిన, రత్న=మణులయందు, గత= పొందియున్న-అనఁగాఁ బ్రతిఫలించిన, భవ్య=యోగ్యతరమయిన, నిజాకృతిచూచి = తనయొక్క రూప మును జూచినవారై, కంటిరేపతిశిరనెక్కెనీక్షణమె బాలయటంచున్ = చూచినారటే యీక్షణ మందే యీ చిన్నది పెనిమిటితలపై నెక్కెను అని పలుకుచు, ధరాధరోపరిస్థితి సరిదాత్మసంభవకుఁ జెల్లదెయంచున్ = పర్వతాధిపునియొక్క యుపరిభాగమందలి యునికి నదీసంభవయైనదానికిఁ జెల్లదా

యని పలుకుచు అని యర్థము. వసురాజశిరస్స్థితి శుక్తిమతీసంభవయైన గిరికాదేవికిఁ జెల్లదావసని భావము. సఖుల్వచింపఁగన్ = చెలికత్తెలు సరసోక్తులాడఁగా, సేసచల్లెనని సంబంధము. వసురాజు మణిఖచిత కిరీటాలంకృత శిరస్కుఁడు. నిలిచి గిరిక సేసలుచల్లునపుడు ఆమెప్రతిబింబము వసురాజు శిరోరత్నములయందుఁ బ్రతిబింబించెను. మగనితలయెక్కినది గిరికయని కొందఱును అది తగియె యున్నదని కొందఱును బలుక సాగిరి. గిరికనదీసంభవ. వసురాజు ధరాధరుఁడు. ధరాధరోపరిస్థితి నదీసంభవకుఁ దగియుండునని పలికిరని భావము. కొండలపై సెలయేళ్లుంట సాజమెగదా యని యభిప్రాయము.

ఉ. శుక్తిమతీకుమారి కర • శుక్తుల ముత్తెపుసేస చల్లనా
రక్తసరోజపాణిపయి • రమ్యగుణాబ్ధియు నట్ల నించెఁ ద
న్మౌక్తికము ల్వధూకచస • మాజకరాంబుజకాయకాంతిసం
సక్తి ననేకవర్ణమణి • జాలము లై విభవంబుఁ దెల్పఁగన్. 29

శుక్తిమతీకుమారి = గిరికాదేవి, కరశుక్తులన్ = హస్తములనెడు ముత్తెపుఁజిప్పలచేత, ముత్తెపుసేసచల్లన్ = ముత్యాలతలఁబ్రాలు పోయఁగా, ఇక్కడఁ దల్లి శుక్తులుగలదిగనుకఁ గుమారికయును గరములనెడుశుక్తులు గలదని స్వారస్యము గ్రహింపవలయును. ఆరక్తసరోజపాణిపయిన్ = ఎఱ్ఱతామరపువ్వులవంటి హస్తములుగల యా గిరికాదేవిమీఁద, రమ్యగుణాబ్ధియు నట్లనించెన్ = రమ్యగుణాబ్ధి యనెడు నబ్ధియును-అనఁగా సుగుణసముద్రుఁడయిన వసురాజనెడు సముద్రుఁడును నాప్రకారముగా ముత్యాలతలఁబ్రాలు నించెను. ఏలాగుననిన, తన్మౌక్తికముల్ = ఆముత్తియములు, వధూ = గిరికాదేవి యొక్క, కచసమాజ=తలవెండ్రుకలయొక్కయు, కరాంబుజ = హస్తకమలములయొక్కయు, కాయ= శరీరముయొక్కయు, కాంతి=కాంతులయొక్కయు, సంసక్తిన్ = సంపర్కముచేత, అనేకవర్ణ మణిజాలములై=అనేకవర్ణములుగల రత్నసమూహములై-

అనఁగాఁ గచకాంతిచేత నింద్రనీలములును గరకాంతిచేతఁ బద్మరాగములును శరీరకాంతిచేతఁ బుష్యరాగములును నైనవని తాత్పర్యము. ఇక్కడ రక్తసరోజపాణియనెడు గిరికానామము సాభిప్రాయము. విభవంబుఁ దెల్పఁగన్=వైభవము గనుపఱుపఁగా, అట్లనించెనని వెనుకకు నన్వయము.

ఉ. ఆతఱి నమ్మహోనిధి ని • రావరణస్ఫురణంబుతోఁ బరి
ద్యోతితపద్మినీసుమమృ • దుచ్ఛదసంగ్రథితాంశుకాంతుఁడై
యాతతదీప్తివైభవవృ • తాంబరపీఠికఁ బొల్చి ప్రాజ్యయో
గాతిశయప్రకాశము హు • తాశికిఁ గూర్చె మహాద్భుతంబుగన్. 30

ఆతఱిన్ = ఆసమయమందు - అనఁగా సుముహూర్తము రాత్రియందుఁ గనుక రాత్రియందని యర్థము. అమ్మహోనిధి = ప్రతాపనిధియయిన యావసురాజని యర్థము. సూర్యుఁడని యర్థాంతరము. నిరావరణస్ఫురణంబుతోన్ = తెరచాటులేని యునికితోననియర్థము. తమోరూపావరణములేక యని యర్థాంతరము. పరిద్యోతిత=మిక్కిలి ప్రకాశమానమగుచున్న, పద్మినీ = పద్మినీజాతి స్త్రీయైన గిరికాదేవియొక్క, సుమమృదుచ్ఛద = పుష్పకోమలమైనవస్త్రముతోడ, సంగ్రథిత=కూర్పఁబడిన, అంశుకాంతుఁడై=వస్త్రాంచలముగలవాఁడై యని యర్థము. పరిద్యోతిత=ప్రకాశితమైన, పద్మినీ=పద్మలతయొక్క,

సుమసృదుచ్ఛద = పుష్పములయొక్క కోమలదళములతోడ, సంగ్రథిత=సంయోజితములయిన, అంశు= కిరణములచేత, కాంతుఁడై = ఒప్పువాఁడైయని యర్థాంతరము. ఆతత = విస్తారమైన, దీప్తివైభవ = రత్న కాంతులయొక్క వైభవముచేత, వృత = ఆవరింపఁబడిన, అంబర = వస్త్రముగల, పీఠిక = రత్నపీఠ మందు, పొల్చి = ప్రకాశించి యని యర్థము. అతిశయదీప్తిచేత వ్యాపింపఁబడిన గగనమనెడు పీఠ మందుఁ బ్రకాశించినవాఁడైయని యర్థాంతరము. మహాద్భుతంబుగన్ = అత్యంతాశ్చర్యకరమగునట్టు లుగా, ప్రాజ్యయోగ=ప్రకృష్టమయిన యాజ్యాహుతిచేతనైన, అతిశయప్రకాశము=అధికప్రకాశము, హుతాశికిన్=అగ్నిహోత్రునికి, కూర్చెన్ = కలుగఁజేసెనని యర్థము. ప్రాజ్యయోగ = ప్రాజ్యమనఁగా నధికము గనుక నధికసంయోగముచేతనైన, యతిశయప్రకాశము నగ్నికిఁగూర్చెనని సూచ్యపరమైన యర్థాంతరము.

శ్లో. 'దినాంతేనిహితం తేజ స్సవిత్రేవహుతాశనః' అని చెప్పఁబడియున్నది గనుక నస్తంగతుఁ డయిన సూర్యునిచేతనే యగ్నికిఁ బ్రకాశమియ్యంబడునని వరిదోఁతిత అనునది మొదలు, పొల్చి అను పఱకు అనస్తమితుఁడుగాఁ జెప్పఁబడిన సూర్యుఁడు ప్రకాశము నగ్నిదేవునకుఁ గూర్చెననుట యద్భు తము. ఇందుకు శ్రుతిప్రమాణము. 'ఆదిత్యోవా స్తమయన్నగ్నిమనుప్రవిశతి, అగ్నింవావాదిత్యస్సాయం ప్రవిశతి.' అనియున్నది. అయితే యిక్కడ రాత్రియందుదయించిన సూర్యునివలన నగ్నికిఁ బ్రకాశ మాశ్చర్యమును గనుక నర్థాంతర మాశ్చర్యముగా నుండెననియు విచారింపవలయును. పగలు సూర్యుఁ డుదయించి యస్తమయమునఁ దనతేజము నగ్నిహోత్రమునం దుంచుట ప్రసిద్ధమైయుండఁగా (అర్థాం తరముచే) రాత్రియందుదయించుచుఁ దనతేజము నగ్నియందుంచుట మహాద్భుతముగదా! సూర్యుఁ డస్తమించుచుఁ దనప్రకాశము నగ్నిహోత్రమునందుంచుననుటకు-

శ్లో. రుచి ధామ్ని భర్తరి భృశం విమలాః పరలోక మభ్యుపగతే వివిశుః
జ్వలనంత్విషః కథమివేతరథా సులభోన్యజన్మని సనివపతిః. మాఘకావ్యము.

ఉ. లేజవరాలిపాణియుగళీపరిరంభణపాటలీభవ
ల్లాజచయంబు భావినిఖిలక్రతుభుక్తినిమంత్రణాక్షత
శ్రీజనకంబు గాఁగ నునిచెన్ శిఖ నాశిఖియుం బ్రసన్నుఁడై
యాజితచిత్తభూరతుల కారతు లిచ్చెఁ బ్రదక్షిణార్చులన్. 31

లేజవరాలి = లేఁతవయస్సుగల గిరికాదేవియొక్క, పాణియుగళీ=హస్తద్వయముయొక్క, పరి రంభణ = సంపర్కముచేత, పాటలీభవత్ = పాటలవర్ణమగుచున్న, అనఁగాఁ దెలుపుఎఱుపుగలిసిన వర్ణమగుచున్న, లాజచయంబు = వరిపేలాలు, ఇక్కడ గిరికాదేవి హస్తము లెఱ్ఱనికాంతిగలదిగనుకఁ దత్సంపర్కముచేతఁ దెల్లనిలాజలు పాటలవర్ణములయినవని యాశయము. భావి=ముందుఁ జేయఁబోవు, నిఖిలక్రతు=అశ్వమేధాంతములయిన సకలయజ్ఞములయందలి, భుక్తి = భోజనముకొఱకు, నిమంత్రణా క్షత=నియమించి యిచ్చునట్టి యక్షతలయొక్క, శ్రీ = సమృద్ధికి, జనకంబు గాఁగన్ = సంపాదకమగు నట్టులుగా, శిఖన్ = అగ్నియందు, ఉనిచెన్ = ఉంచెను. అనఁగా నగ్నియందు లాజహోమము చేసె ననుట. ఆశిఖియున్ = ఆ యగ్నిహోత్రుఁడును, ప్రసన్నుఁడై = అనుగ్రహించినవాఁడయి, ఆజితచిత్త భూరతులకున్ = సౌందర్యముచేత జయింపఁబడిన మన్మథుఁడును రతీదేవియునుగల వసురాజు

నకు గిరికాదేవికిని, ప్రదక్షిణార్చులన్ = ప్రదక్షిణాకారజ్వాలలచేత, ఆరతులిచ్చెన్ = నీరాజనము లిచ్చెను.

అగ్నిదేవుఁడు కుడిదిక్కునకై ప్రజ్వరిల్లిన శుభము చేకూడు నని ప్రసిద్ధము. లాజలు చయము గావున రెండుచేతులతోఁ గలయఁబట్టుకొనెను. ఇదియ పరిరంభణము. "ఈషద్రక్తస్తు పాటలః". కావున స్వతస్సిద్ధముగాఁ దెల్లనివగు పేలాలు హస్తస్పర్శమున నెఱ్ఱబడెను. కావునఁ దెలుపు నెఱుపు గలసియుండెను. ఇవి యగ్నియందుంచుట ముందుయజ్ఞాదులందు భుక్తికిని మంత్రణాక్షతల నొసంగు నటులుండెను. కావుననే యగ్నిభట్టారకుఁడు తృప్తినొంది నివాళు లొసంగెను,

మ. జనకోత్సంగనివాసవాసననొ రాజన్యస్తహస్తాభిమ
ర్శనసౌఖ్యామృతపారవశ్యముననో సైచెన్ శిలాయోజనం
బని సాధ్వు ల్పొగడం బ్రియాంఘ్రి సనెక ల్హత్తించె భూజాని త
ద్ఘనభాగ్యంబు ఝళంఝళత్కటకరత్నంబు ల్ప్రశంసింపఁగన్. 32

జనక = తండ్రియైన కోలాహలపర్వతునియొక్క, ఉత్సంగ = తొడయందలి, నివాస = ఉనికి యొక్క, వాసననో = సంస్కారముచేతనో - అనఁగా నభ్యాసముచేతనో, లేక, రాజ = వసురాజు చేత, న్యస్త = ఉంపఁబడిన, హస్త = కరముయొక్క, అభిమర్శన = సంపర్కమువలననయిన, సౌఖ్యామృత = అమృతప్రాయమైన సుఖభావముచేత, పారవశ్యముననో = పరవశత్వముచేతనో, శిలాయోజనంబు = ఱాయిదాఁకుటను, సైచెన్ = వహించెను, అని = అన్నవారై, సాధ్వులు=పతివ్రతలు, పొగడన్ = కొనియాడుచుండఁగా, భూజాని = వసురాజు, ప్రియాంఘ్రిన్ = ప్రియురాలయిన గిరికాదేవి పాదమును, సనెకల్హత్తించెన్ = సన్నెకల్లు తాఁకించెను. ఏలాగనిన, తద్ఘనభాగ్యంబు = ఆసన్నెకల్లు త్రొక్కించుటయొక్క వైభవమును, ఝళంఝళత్ = ఝళంఝళమని మ్రోయుచున్న, కటక= అందెలయొక్క, రత్నంబుల్ = మణులు, ప్రశంసింపఁగన్ = శ్లాఘించుచునట్లుగా, సనెకల్హత్తించెను. అని సంబంధము.

రత్నములు శిలాజాతియే కావున మనజాతిలోని సన్నెకల్లు గిరికాపదస్పర్శభాగ్యముం బొందె నని ఝళంఝళధ్వని యనువాక్యముచేఁ బొగడె నని తాత్పర్యము. కటకములు రత్నఖచితములు. అవి మొరయుట సహజముగనె కానిరత్నములు తమకృతార్థత వెలిబుచ్చుగతి మెఱసె ననుభావ మిట గ్రాహ్యము. వసురాజు గిరికపాదమును బట్టుకొని సన్నెకలును దాఁకించెను. కావుననే హస్తాభిమర్శన సౌఖ్యామృతపారవశ్యము గిరికకుఁ గలిగెను. గిరికతండ్రి శిలామూర్తి కోలాహలుఁడు. అతనియుత్సంగనివాసము అభ్యాసవాసన. గిరిక సుకుమారి, లేజవరాలు. శిలాయోజనము సైచుట స్పర్శసుఖపరవశము ననో అభ్యాసవాసననో యైయుండును. లేకున్న నోరువఁజాలదని భావము.

చ. సిరులు ఫలింప దంపతులు చెంత నరుంధతిఁ జూచుచోఁ బర
స్పరనయనాంతము ల్గవియ బాలికచూపులు పర్వె నప్పు డ
ప్పరమసతీపదాబ్జములపై భవదీయసువాసినీత్వవై
ఖరిఁ గరుణింపు మంచు విరిఁగల్వలఁ బూజలు సల్పెనో యనన్. 33

సిరులుఫలింపన్ = సకలసంపత్తులును జేకూడెడుకొఱకు, దంపతులు=వధూవరులు, చెంతనరుంధతిఁ జూచుచోన్ = ఈవివాహార్థమైవచ్చి సమీపమందేయున్న యరుంధతిని జూచెడుసమయమందు, పరస్పరనయనాంతము ల్గదియన్ = అన్యోన్యావలోకనముగాఁగానే, బాలికచూపులు = గిరికాదేవివీక్షణములు, అప్పుడు=ఆసమయమందు, అప్పరమసతీపదాబ్జములపైన్ = పరమపతివ్రతయైన యాయరుంధతియొక్క పాదములమీఁద, పర్వెన్ = వ్యాపించెను. అనఁగా దంపతులకుఁ బరస్పరావలోకనము సిద్ధింపఁగానే గిరికాదేవి లజ్జచేతఁ దలవంపఁగా నాయమచూపు లరుంధతియొక్క పాదములమీఁదఁ బ్రసరించెనని తాత్పర్యము. ఆప్రసరించుట యేలాగుననుండెననిన, భవదీయసువాసినీత్వమై ఖరిఁగరుణించుమంచున్ = నీయొక్క ముత్తైదువతనమువంటి ముత్తైదువతనమును దయచేయుమని, విరిగల్వలఁబూజ సల్పెనోయనన్ = వికసించినకలువపూవులచేతఁ బూజచేసినదో యన్నట్టులుగా నుండె ననుట. జవ్వనుల చూపులు నల్లకలువలవలె నుండుననుట ప్రసిద్ధము.

శ్లో. కాంతే త్యుత్పలలోచనేతి విపులశ్రోణీభరేతి. భర్తృహరి.

చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతో. శృంగారనైషధము.

శ్లో. నీరాత్తీర ముపాగతా శ్రవణయో స్సీమ్ని స్ఫురన్నేత్రయోః
శ్యామం లగ్నమిదం కిముత్పలమితి జ్ఞాతుం కరం న్యస్యతి. రసమంజరి.

శ్లో. ఇందీవరేణ నయనం ముఖ మంబుజేన
కుందేన దంత మధరం నవపల్లవేన. ఋతుసంహారము.

సీ. వెలయించి రభిజాత♦వేదులతో జాతవేదుఁ బ్రదక్షిణా♦పాదనములఁ
గాంచిరి ధ్రువపదం ♦ బంచితామరవర్యవరముతో నుత్తరో♦త్తరముగాఁగఁ
జాల్చిరి గురుతపో♦ధనులదీవనలతో నమృతవర్ణంబు లా♦ర్ద్రాక్షతములు
తిలకించి రవలోకి♦చలకిరీటములతో రత్నరమ్యములు నీ♦రాజనములు

తే. తనిపి రనుపాధికహావ ప్ర♦ద త్తరుచిమ
దమృతసారాన్నసామగ్రి ♦ నాత్మబంధు
జాతములతో మహోత్సవా♦యాతసకల
శతమఖపురాధివాసుల ♦ సతియుఁ బతియు. 34

సతియుఁబతియున్ = గిరికాదేవియును వసురాజును, అభిజాతులనఁగా సత్కులీనులును, వేదులనఁగా వేదముగలవారునుగనుక సత్కులీనులైనశ్రోత్రియులతోడ, (ని. 'అభిజాతస్తుకులజేబుధే' అని అ.) జాతవేదున్ = అగ్నిహోత్రుని, ప్రదక్షిణాపాదనములన్ = ప్రదక్షిణాపాదనములచేత, వెలయించిరి= ఉల్లసిల్లఁజేసిరి, అనఁగా నగ్నిదేవుని బ్రదక్షిణములచేతను శ్రోత్రియులను బ్రకృష్టదక్షిణలచేతను వెలయించిరని యర్థము. విధివిహితముగా నగ్నిదేవుని భూదేవుల సంతుష్టిపఱచి రనుట.

అంచితామరవర్యవరముతోన్ = ఒప్పుచున్నదేవతావరముతోడ, ధ్రువపదంబు=ధ్రువునియొక్క స్థానమును, ఉత్తరోత్తరముగాఁగన్ = అనఁగా నుత్తరస్థితములైనచుక్కలకు నుత్తరస్థితముగాను నుత్తరోత్తరాభివృద్ధిగాను, కాంచిరి, అనఁగా ధ్రువపదమును జూచిరనియును దేవతావరముఁ బొందిరనియు నర్థము.

గురుతపోధనులదీవనలతోఁ = పెద్దలైనమునులయొక్క దీవనలతోడ, అమృతవర్ణంబు లార్ద్రాక్షతములు=అనఁగా నమృతధవళములని యక్షతపరమైనయర్థము. అమృతాక్షరములు గలవియని దీవనలపరమైన యర్థము. కనుక నమృతధవళాక్షతములను నమృతాక్షరసహితములైనదీవనలను, తాల్చిరి = వహించిరి.

అవలోకి = చూచెడివారియొక్క, చల=శిరఃకంపమువలనచంచలములైన, కిరీటములతోఁ=కిరీటములతోడ, రత్నరమ్యములు నీరాజనములు = అనఁగా రత్నములవలె రమ్యములైనవని నీరాజనపరంబును రత్నములచేత రమ్యములైనవని కిరీటపరంబును గనుక రత్నరమ్యములైన నీరాజనములను నవలోకిజనశిరఃకిరీటములను, తిలకించిరి = కటాక్షించి చూచిరనియర్థము.

ఆత్మబాంధుజాతములతోఁ = తమబంధుసమూహములతోడ, మహోత్సవ = వివాహమహోత్సవమునకు, ఆయాత = వచ్చిన, సకల=సమస్తమైన, శతమఖపురాధివాసులఁ = ఇంద్రపట్టణమే నివాసముగాఁగలదేవతలను, అనుపాధిక = అయత్నసిద్ధమైనదియు, హవప్రదత్త = హోమముచేత నీఁబడినదియు, రుచిమత్ = చవిగలిగినదియునగు, అమృతసారాన్నసామగ్రిఁ = హవనముచేత దత్తమైనదిగనుకనమృతరూపమైనసారాన్నసామగ్రిచేత, తనిపిరి = దేవతలను దృప్తిబొందించిరనియును నయత్నసిద్ధమైనదియు, హవప్రదత్తమనఁగా నాహ్వానముచేత నీఁబడినదియు, రుచిమత్ = షడ్రుచులుగలిగినదియునగు, అమృతసారాన్నసామగ్రిఁ=అమృతమువలె సారమైన యన్నసామగ్రిచేత నాత్మబాంధువులను దృప్తిబొందించిరనియును నర్థము.

క. వీడు చదివించె నయ్యెడ, వీడనివేడుక బలారి • విబుధులతో లే
వీడు మణు లనఁగఁ దగుతన, వీడునఁ గలమానికములు • వివిధాంబరముల్. 35

అయ్యెడఁ = ఆసమయమందు, బలారి = ఇంద్రుఁడు, విబుధులతోఁ = దేవతలతోడ, వీడని వేడుకఁ = శిథిలముగాని యుత్సవముచేత, లే వీడు మణు లనఁదగు=వీనికి సమానములైన మణులులేవనునట్టులుగాఁ దగియున్న, తనవీడునఁగలమానికములు = తనపట్టణమందు - అనఁగా స్వర్గమందుఁ గలిగిన రత్నములును, వివిధాంబరముల్ = నానావిధములైనదివ్యాంబరములును, వీడుచదివించెఁ = కట్నము చదివించెను.

సీ. గండశైలములకుఁ•గరపాదములు వచ్చెనో యన మెఱయునా•గాయుతములు
హరిణజాతికి మరు•న్నిరసనోద్ధతి గల్గెనో యనఁ దగుసైంధ•వోత్కరములు
సంభోదములకుఁ బా•యనిమించు లొదవెనో యన మించుమణిమయ•స్యందన [ములు
నవలతావళికి యా•నవిలాస మెసఁగెనో యనఁ బొల్చుసరసక•న్యాయుతంబు

తే. లాత్మ మణి హేమరజతంబు • లపుడ యుచిత
తనువ్రులు వహించెనో యనఁ • దనరువివిధ
శయనపాత్రాసనములు భూ•జాని కొసఁగె
హరికృపాలబ్ధశుభశాలి • యచలపాళి. 36

గండశైలములకుఁ = గండశిలలకు - అనఁగా గొప్పగొప్పఱాళ్ళకు, కరపాదములువచ్చెనో యనఁ =తుండములును కాళ్లును వచ్చెఁనా యేమి యనునట్టులుగా, మెఱయు=ప్రకాశించునట్టి, నాగా

యుతములు = అయుతమనఁగాఁ బదివేలకుఁ బేరు. అట్టియనేకాయుతసంఖ్యలు గలయేనుఁగులను, ఏనుఁగులు నడగొండలవలెనున్నవనుటవలన దేహదార్ఢ్యము స్థూలోన్నతములు సూచితములు. కరపాద భేదము లేకున్న నేనుంగులు కొండలు సమానముగా నుండుననుట.

హారిణజాతికిన్ = లేళ్ళసమూహమునకు, మరున్నిరసనోద్ధతిగల్గెనో యనన్ = వాయువును దిరస్కరించెడి యొగుపుగలిగినదాయేమి యనునట్టులుగా, తగు = ఒప్పుచున్న, సైంధవోత్కరములు = అశ్వసమూహములను, హరిణములు వాయువునకువారువములు. వాయువును మోయుటచే భారవహనమువలన గమనమాంద్యమేర్పడెను. వాయువును దిరస్కరించినచో నిరాటంకముగా నతిశయవేగముతోఁ బోఁగలుగు ననుట. గాలిని దిరస్కరించువేగముగల యశ్వములిచ్చెనని భావము.

అంభోదములకున్ = మేఘములకు, పాయనిమించులొదవెనొ యనన్ = ఎడతెగని మెఱుపులు పొందినవారేమి యనునట్టులుగా, మించు = అతిశయించుచున్న, మణిమయస్యందనములు = రత్నమయములైన రథములను, అరదములున్నతముగనుండి రత్నఖచితములై ప్రకాశించుచుండెననిభావము. స్యందనములు మణిమయములు. కావుననే యెడతెగక ప్రకాశించుట. మణికాంతు లెడతెగక కాంతిల్లు మెఱుపులవలె నుండెననిభావము.

నవలతావళికిన్ = లేఁదీఁగెలయొక్క గుంపులకు, యానవిలాసమెసఁగెనో యనన్ = నడకయొక్క విలాస మొప్పినదా యేమి యనునట్టులుగా, పొల్చు = ప్రకాశించుచున్న, కన్యాయుతములు = అయుత సంఖ్యలుగల స్త్రీలను, కన్యామణులందఱు తీఁగవంటి మేనుగలవారు. తీఁగలు గమనశక్తిలేనివి. వీరియందు గమనవిలాసము గలదు. ఇట్టికన్య లొకతెకాదు పదివేలమంది.

ఆత్మమణిహేమరజతంబులు = తనసంబంధమైన - అనఁగాఁ దనయందున్న రత్నములును బంగారును వెండియు, అపుడ = ఆసమయమందే, ఉచితతనువులు వహించెనో యనన్ = అర్హములైన దేహములను ధరించినవారేమి యనునట్టులుగా, తనరు = ఒప్పుచున్న, వివిధ = నానావిధములైన, శయన = శయ్యలును, పాత్ర = పాత్రసామగ్రులును, ఆసనములును = పీఠములు, హరి = ఇంద్రునియొక్క, కృపా = దయచేత, లబ్ధ = పొందఁబడిన, శుభ = శుభములచేత, శాలి = ఒప్పుచున్న, అచలమౌళి = పర్వతశ్రేష్ఠుఁడైన కోలాహలుఁడు, భూజానికొసఁగెన్ = వసురాజున కిచ్చెను. గండశైలములు, హరిణములు, మేఘములు, తీఁగలు మణిహేమరజతములు ఇవి పర్వతస్థితవస్తుసముదాయము. ఇవి నగరోచిత వస్తువులుగా మాఱినటులఁ జూపఱకుఁ దోఁచుచుండెను.

సీ. కస్తూరిమెకములు • కమ్మజవ్వాదిపిల్లులు సుమ్మివి మదంక•విలసితములు
ఘనసారకదళిక • లగంధద్రువులు సుమ్మివి మదీయజీవన•సమధికములు
కిన్నరద్వంద్వము • లీక్కరరాజములు సుమ్మివి మదీయక్రోడ•వివళితములు
మాణిక్యసారంబు • లాణిముత్యములు సుమ్మివి మదాకరవంశ•హిండితంబు

తే. లివి మృదులదివ్యవసనంబు • లివి యమూల్య
భూషణము లివి యమ్లానప్రసూనములు మ
దగ్రసంతానజములు సు • మ్మనుచుఁ దెలిపి
యల్లునికి నిచ్చె వెండియు • నాదరమున.

కస్తూరికామేకములు = కస్తూరిమృగములును, కమ్రజవ్వాదిపిల్లులు = మనోహరమైనజవ్వాదిని గలుగఁజేసెడుపిల్లులును, ఇవి = ఇవి, మత్ = నాయొక్క, అంక = తొడమీఁద, విలసితములుసుమ్ము = ఒప్పుచుండునట్టివి సుమాయని యర్థము. సమీపమం దొప్పుచుండునవియని యర్థాంతరము. ఘనసారకదళికల్ = కర్పూరపునంటులును, గంధద్రుపుల = శ్రీచందనవృక్షములును, ఇవి = ఇవి, మదీయజీవనసమధికములు సుమ్ము = నాయొక్క బ్రతుకునకంటె నధికములైనవి- అనఁగా నాప్రాణమునకంటె నెక్కువైనవి సుమా యని యర్థము. నాయందలి యుదకమువలన నధికములైనవని యర్థాంతరము.

కిన్నరద్వంద్వముల్ = కిన్నరపక్షిమిథునములును, కీరరాజములు = రాచిలుకలును, ఇవి = ఇవి, మదీయ = నాయొక్క, క్రోడ = భుజాంతరమందు, వివళితములుసుమ్ము = ప్రవర్తించునట్టివి సుమాయని యర్థము. నాయొక్క గుహాంతరమందుఁ బ్రవర్తించునట్టివియని యర్థాంతరము. మాణిక్యసారంబులు = పద్మరాగమణిశ్రేష్ఠములును, అణిముత్యములు = అణియనెడు విశేషముగల ముత్తెములును, ఇవి = ఇవి, మదాకర = నాకు నాకరమయిన, పంశ = కులమందు, హిండితంబులుసుమ్ము = ప్రవర్ధమానములైనవి సుమా యని యర్థము. మత్ = నాసంబంధమయిన, ఆకర = గనులయందును, పంశ = వెదుళ్లయందును, హిండితములుసుమ్ము = ప్రవర్ధమానములైనవని యర్థాంతరము.

ఇవి మృదుల దివ్యవసనంబులు = మృదువులైన దివ్యాంబరములివియును, ఇవి యమూల్యభూషణములు = విలువలేనియాభరణములివియును, ఇవి యమ్లానపుష్పములు = ఎప్పటికిని వాడిపోని పుష్పములివియును, మదగ్రసంతానజములుసుమ్ము = నాయొక్కజ్యేష్ఠపుత్రసంభవములు సుమాయని యర్థము. జ్యేష్ఠపుత్త్రునియొక్క సంతానము తండ్రికిఁ బ్రియమయినదగుట ప్రకటము. అగ్రభాగములయందలి సంతానము లనెడు దేవవృక్షములవలనఁ బుట్టినవని యర్థాంతరము. అనుచుఁదెలిపి = ఈలాగనిపలుకుచుఁ దెలియఁజేసి, అల్లునికిచ్చెన్ = అల్లుఁడైనవసురాజునకిచ్చెను, వెండియునాదరమునన్ = తిరుగా మన్ననచేత, ముందరిపద్యముతో నన్వయము.

అంకవిలసితములు, జీవసాధికములు, క్రోడవివళితములు, పంశహిండితములు, అగ్రసంతానజము లనుటవలన నాయీవస్తుసముదాయము కోలాహలునకు మిగులఁ బ్రియతరమైనదనుట. ఇట్టి ప్రియవస్తువుల నల్లునకొసంగుట "వెండియున్ ఆదరమున" వస్తుగుణవిశేషములు తెలిపి యిచ్చుట యుచితవిధి నాదరముతో నుపయోగించుకొనుమని.

చ. అసదృశభక్తి శుక్తిమతి • యాత్మజరత్నములన్ నిరంకుశ
ద్విసృమరదీప్తివాని శుచి•వృత్తమహత్త్వము వాని నన్నిటిన్
వసున కొసంగి యయ్యెడ స•వారితభూరితదీయసామ్యవ
ద్వసుపదనామపుత్త్రమణిఁ • దద్వసుపాదము సేర్చెఁ జేర్చినన్. 38

అసదృశభక్తి = సమానరహితమయిన భక్తిచేత, శుక్తిమతి = శుక్తిమతీనది, ఈశుక్తిమతీపదము సాభిప్రాయము. నిరంకుశత్ = నిరంకుశమయినదానివలె నాచరించుచున్న-అనఁగా నప్రతిహతమును, విసృమర = వ్యాపనశీలమయిన, దీప్తివానిన్ = కాంతిగలిగినవియు, శుచివృత్తిమహత్త్వమువానిన్ = శుభ్రవర్తులపృథుత్వములు గలిగినవియును అనఁగా ధవళమయును వట్రువయును నురువును గలిగిన, ఆత్మజరత్నములన్ = తనవలనఁబుట్టిన ముక్తామణుల నని యర్థము. అప్రతిహతంబును వ్యాపనశీలంబు

నయిన ప్రతాపముగలిగినవియుఁ బరిశుద్ధవృత్తి మహత్త్వము గలిగినవియునగు కుమారరత్నముల నని యర్థాంతరము. అన్నిటివ్వసునకొసంగి=అన్నిటిని వసురాజునకిచ్చి యని యర్థము. వసువనఁగాఁ గాంచనమును గాన, శ్లో. 'అనర్ఘమపిమాణిక్యం హేమాశ్రయమపేక్షతే' అని యున్నది. వసువునకు, వసునకు, అని రెండువిధములుగానుం బ్రయోగింపవచ్చును.

ఇందుకు లక్షణము-

తే. 'ఋత్వము విసర్గలోపంబు నొందనొకటి, చను నుకారాంతశబ్దంబు దెనుఁగుసేయ
రఘురఘువు బాహుబాహువు రాహురాహు, ఘూరుమూరువు నన మేరుమేరు వనఁగ.'

అని చెప్పంబడియున్నది.

అవారిత = అనివార్యమయిన, భూరి = అధికమయిన, తదీయ = ఆయాత్మజరత్నములయొక్క, సామ్యవత్ = సమానధర్మములు గలిగిన, వసుపదనామపుత్త్రమణిన్ = వసుపదుఁడనెడు పుత్త్రమణిని, అని యర్థము. మణిశబ్దము శ్రేష్ఠవాచకము.

ఇక్కడ మణికిని బుత్త్రమణికిని సౌందర్యసామ్యంబును శ్లిష్టవిశేషణసామ్యంబును నాత్మరత్నపదవాచ్యత్వసామ్యంబుననని తెలియవలయును. ఆత్మజరత్నములను వసున కొసంగి యని చెప్పుటచేత రత్నము వసుపదమగుచున్నది గనుక వసుపదరూపమయిన యభిధేయత్వసామ్యంబును గలదని తెలియవలయును. తద్వసుపాదమునఁజేర్చెన్ = ఆ వసురాజుయొక్క పాదమందుఁ జేర్చెను - అనఁగా నమస్కారము సేయించెననుట, చేర్చినన్ = అతాగునఁ జేర్పఁగా, ముందరిపద్యముతో నన్వయము.

శుక్తిమతి తనయందలి రత్నముల నన్నింటిని వసురాజున కొసంగెను. రత్నములు నిరంకుశద్యుతిమదదీప్తివంతములు శుచివృత్తములు. వీనికిఁ దోఁబుట్టువగు వసుపాదుఁడును నిట్టివాఁడె. సామ్యము భూరియు, నవారితమును. ఇట్టి రత్నములు వసురాజున కొసంగుట నసాధారణభక్తిచేత. దీనిచేఁ బుత్త్రిపైఁ గల ప్రేమాతిశయము వ్యక్తము.

మ. సకలాశాంతనిశాంతరాజమకుటీసంక్రాంతమాణిక్యకో
రకనీరాజనము న్మహాకటకధౌరంధర్యముం గాంచి పా
యక పద్మోన్నతిఁ బూనుచు న్నిజపదాఖ్యాయోగ్యత న్మించ రా
జకులగ్రామణి యుంచె నవ్వసుపదున్ సైన్యాధిపత్యంబునన్. 39

సకలాశాంతనిశాంత = సమస్తదిగంతములయందును నివాసముగలిగిన, రాజ = రాజులయొక్క, మకుటీ = కిరీటములయందు, సంక్రాంత = కూడుకొన్న, మాణిక్యకోరక = మొగ్గలవలెనున్న మాణిక్యముల చేత, నీరాజనమున్ = ఆరతియును, మహాకటకధౌరంధర్యమున్ = మహత్తరములైన పాదవలయముల యొక్క ధురంధరత్వమును, కాంచి = పొందియని పాదపరమయిన యర్థము. దిక్కుదిక్కుల యందలి రాజులు కిరీటమాణిక్యకాంతులు పరిభ్రమించునట్టులుగాఁ జేయుచున్న శిరఃకంపములను మహాపట్టణధురంధరత్వమునం బొందియని వసుపదపరమయిన యర్థము. పాయకపద్మోన్నతిఁ బూనుచున్ = విడువక పంకజోన్నతినిగాని పద్మరేఖోన్నతిగాని వహించుచునని పాదపరమయిన యర్థము. సంపదభ్యున్నతిని వహించుచును అని వసుపదపరమయిన యర్థము. నిజపదాఖ్యాయోగ్యతన్మించన్ = తనయొక్క అనఁగా వసురాజుయొక్క పాదమందలి శోభయొక్క యోగ్యతచేత అని యర్థము.

పావనాహ్వయముయొక్క యోగ్యతచేత నని భావము. అనఁగా వసుపదమను పేరునకు సర్థత్వముచేత అతిశయించఁగా, రాజకులగ్రామణి = రాజశ్రేష్ఠుఁడయిన వసురాజు, అవ్వసుపదున్ = ఆవసుపదుని, సైన్యాధిపత్యంబునన్ = సేనాధిపతిత్వమందు, ఉంచెన్ = ఉంచినవాఁడాయెను. అనఁగాఁ దనయొక్క సేనాధిపతినిగా నిర్ణయించె ననుట. కటకధురంధరత్వము, రాజమకుటమణి నీరాజనను, పద్మోన్నతి వసుపాదమునెడ సహజవిభవములు. వసుపాదునకు సైన్యాధిపత్యము నొసఁగుటవలన రాజ్యపాలనము, రాజసేవాగ్రహము, ఐశ్వర్యసమృద్ధి చేకూరెను. ఇవి వసుపాదు పేరికిని వసురాజు పాదమునకును సర్థములు.

ఉ. రాజపురందరుండు నగ♦రాజతనూజయు నిట్లు శక్రసం
యోజితమంగళం బెనసి ♦ యున్కిఁ గనుంగొని మున్ను వారి ను
ద్వేజకతీవ్రతేజమున ♦ వేచినసాహసి గాన వేగ నం
భోజవిరోధి సేరెఁ బర♦భూధరకందరకోటరాంతమున్. 40

రాజపురందరుండు = రాజేంద్రుఁడైన వసురాజును, నగరాజతనూజయున్ = కోలాహలపర్వత రాజనందనయైన గిరికాదేవియును, ఇట్లు = పూర్వోక్తప్రకారముగా, శక్రసంయోజిత మంగళం బెనసి = ఇంద్రునిచేత సంఘటపఱుపఁబడిన వివాహరూపశుభముఁ బొంది, ఉన్కిఁ గనుంగొని = ఉండుటను జూచి, మున్ను = వివాహమగుటకుముందు, వారిన్ = ఆ దంపతులను, ఉద్వేజక = భయంకరమయిన, తీవ్రతేజమునన్ = తీక్ష్ణప్రతాపముచేత నని యర్థము. వేచినసాహసిగానన్ = బాధించిన సాహసవంతుఁడుగనుక, వేగన్ = శీఘ్రముగానని యర్థము. తెల్లవారవచ్చెడు సమయమున నని యర్థాంతరము. అంభోజవిరోధి = చంద్రుఁడు, పరభూధర = పశ్చిమాచలముయొక్క, కందర = గుహయనెడు, కోటర = తొఱ్ఱయొక్క, అంతమున్ = అంతఃప్రదేశమును, చేరెన్ = ప్రవేశించెను. అనఁగా నస్తమించె ననుట. వివాహమంగళము ఇంద్రసంయోజితము. కావున దాంపత్య మెంతయు నొప్పియున్నదనుట. భావిశుభము గమనింపక సాహసియగు చంద్రుఁ డిరువురను మిగుల వేధించెను. ఇపుడు తనలోపముఁ దాను గమనించి దంపతుల చూడ నోడి చంద్రుఁడు చాటున కేగెనని భావము. అవమానితులు చాటుననుంట సహజము.

మ. జనరాడ్దివ్యవివాహవైభవము మిం♦చన్ రేయి రేరాజు నిం
చినజ్యోత్స్నాంశువితానతారకసుమ♦శ్రేణు ల్నెఱు ల్వీడఁగా
దినరా జన్నియు నూడ్చి యయ్యెడ మిళ♦త్తేజోమయాతామ్రనూ
తనపట్టాంబరము ల్ఘటించె హరిదం♦తవ్యోమభాగంబునన్. 41

జనరాడ్దివ్యవివాహవైభవమిుంచన్ = వసురాజుయొక్క యోగ్యమైన వివాహవైభవ మతిశయించునట్టులుగా, రేయిన్ = రాత్రియందు, రేరాజు = చంద్రుఁడు, హరిదంతవ్యోమభాగంబునన్ = దిగంతగగనప్రదేశమందు, నించిన = నిండారునట్లుగాఁ జేసిన, జ్యోత్స్నాంశువితాన = చంద్రికాకిరణ సమూహమనెడు వస్త్రముతోఁ గూర్చిన నవారుపట్టెలను గల మేలుకట్టునందలి, తారకసుమశ్రేణుల్ = నక్షత్రములనెడు పుష్పపంక్తులు, నెఱుల్వీడఁగాన్ = నెఱియనఁగా బాగు, బాగుదప్పి చెడిపోఁగా, దినరాజు = సూర్యుఁడు, అన్నియునూడ్చి = వానినన్నిటిని దీసివైచి, అయ్యెడన్ = ఆ సమయమందు, మిళత్ = మిళితమగుచున్న, తేజోమయ = అరుణకాంతి యనెడు, ఆతామ్ర = అంతట నెఱ్ఱరంగు గలిగిన, నూతన = నవీనమైన, పట్టాంబరముల్ఘటించెన్ = పట్టువస్త్రములు గూర్చెను.

అనఁగా రేరాజును దినరాజును దమకు విహితమైన కాలమందు వసురాజును సేవించిరని యాశయము. తెల్లవారఁగానే వెన్నెలయొక్కయుఁ జంద్రకిరణములయొక్కయు నక్షత్రములయొక్కయు సౌష్ఠవము చెడిపోయెననియును సూర్యునియొక్క యరుణకాంతి యంతటను వ్యాపించె ననియును దాత్పర్యము. చంద్రుఁడు రాజువివాహమునకు కిరణములతో మేలుకట్టుకట్టి చుక్కలతోఁ బూవు లలరించి పందిరి వైచెను. అది చెదరిపోఁగా సూర్యుఁడు తనరక్తాంశువులతోఁ గెంబట్టుగుడ్డల నలు దిక్కులకుఁ గట్టెనని భావము.

ఉ. ఇంతికిఁ జేదిభూపతికి ♦ నిట్లు వివాహమహంబు శేషహో
మాంత మొనర్చి యాచతుర♦హంబులఁ బూర్ణహవాదికక్రియా
సంతతదీయమానచరు♦సారములం బరితృప్తిఁ గాంచి య
త్యంతకుతూహలంబున సు♦ధాంధసు లిచ్చి రభీప్సితార్థముల్. 42

ఇంతికిన్ = గిరికాదేవికిని, చేదిభూపతికిన్=వసురాజునకును, ఇట్లు = పూర్వోక్తప్రకారముగా, వివాహమహంబు=కల్యాణోత్సవము, శేషహోమాంతమొనర్చి = శేషహోమమే చివర యగునట్లుగా నాచరించి, ఆచతురహంబులన్ = ఆ పెండ్లినాలుగుదినములయందును, పూర్ణహవాదిక=పూర్ణాహుతులు మొదలైన, క్రియా = హోమక్రియలయందు, సంతతదీయమాన = నిరంతరము నీఁబడుచున్న, చరుసారములన్ = హోమయోగ్యపక్వాన్నశ్రేష్ఠములచేత, పరితృప్తిఁగాంచి = లెస్సగాఁ దృప్తినిబొంది, అత్యంతకుతూహలంబునన్ = అధికసంతోషముచేత, సుధాంధసులు = అమృతమే యన్నముగాఁగల దేవతలు, ఇచ్చిరభీప్సితార్థముల్ = వాంఛితార్థముల నొసంగిరి. అనఁగా గిరికావసురాజులకు సమస్తవరముల నిచ్చి రనుట.

సీ. సురభిసంతానవి♦స్ఫురణ మిచ్చె నగారి యిష్టార్థసంసిద్ధి ♦ నిడియె వహ్ని
యహతధర్మగుణంబు ♦ లర్పించె సమవర్తి కామరూపతఁగూర్చు ♦ గ్రవ్యభోజి
భువనవశీకార♦ము ఘటించె సలిలేశుఁ డసమదివ్యామోద ♦ మొసఁగె గాడ్పు
కల్యాణసామగ్రి♦ఘటియించె నిధిరాజు జితదర్పకత్వంబు ♦ చేర్చె శివుఁడు
తే. ప్రబలదీర్ఘాయురారోగ్య♦భాగ్యకరము
లగువరంబులు సమకూర్చి ♦ రఖిలమునులు
నూతనవివాహకౌతుక♦ద్యోతమాన
మాననీయాకృతికిఁ జేది♦మనుజపతికి. 43

నూతన = నవీనమైన, వివాహకౌతుక = వివాహసంబంధమైన కంకణముచేత, ద్యోతమాన= ప్రకాశమానమైన, మాననీయ = మన్నింపఁదగిన, ఆకృతికిన్ = ఆకారముగల, చేదిమనుజపతికిన్=చేదిదేశాధిపతియైన వసురాజునకును, నగారి=ఇంద్రుఁడు, సురభిసంతానవిస్ఫురణమిచ్చెన్ = సురభిసంతానవిస్ఫురణముగలవాఁడు గనుక సురభిసంతాన విస్ఫురణ మిచ్చె ననుట. ఉత్తరత్ర యీలాగుననే విచారింపవలయును. కామధేనుకల్పవృక్షస్ఫూర్తినిచ్చెనని యర్థము. సురభిగుణములచేతఁ బరిమళించుచున్న సంతానముల నిచ్చె నని యర్థాంతరము. వహ్ని = అగ్నిహోత్రుఁడు, ఇష్టార్థసంసిద్ధినిడియెన్ = యాగకార్యసంసిద్ధి నిచ్చెనని యర్థము. శ్లో. 'ఏకాగ్నికర్మహవనం త్రేతాయాం యచ్చ హూయతే, అంతర్వే

ద్యాంచ యద్దాన మిష్టం తదభిధీయతే.' అని స్మృతియందుఁ జెప్పఁబడియున్నది. అభీష్టార్థసంసిద్ధి నిచ్చెనని యర్థాంతరము.

సమవర్తి=యముఁడు, అహత ధర్మగుణంబు లర్పించెన్ = అవిచ్ఛిన్నధర్మగుణములను సమర్పించె నని యర్థము. విరుగనివిల్లును దెగనిసారిని నిచ్చెనని యర్థాంతరము. క్రవ్యభోజి = నైరృతి, కామ రూపతఁగూర్చెన్ = కామరూపత్వము ఘటింపఁ జేసెనని యర్థము. మన్మథసౌందర్యము గలుగుటను గూర్చెనని యర్థాంతరము. సలిలేశుఁడు = వరుణుఁడు, భువనవశీకారము ఘటించెన్ = జలవశీకరణము గలుగఁ జేసెనని యర్థము. లోకవశీకరణము గలుగఁజేసె నని యర్థాంతరము. గాడ్పు=వాయువు, అస మదివ్యామోదమొసఁగెన్ = సమానరహితమైన దివ్యసౌరభము నిచ్చెనని యర్థము. పరమోత్కృష్ట మయిన యానందము నిచ్చెనని యర్థాంతరము.

నిధిరాజు=కుబేరుఁడు, కల్యాణసామగ్రి ఘటియించెన్=సువర్ణసామగ్రిని బొందించెనని యర్థము. శుభసామగ్రిని బొందించెనని యర్థాంతరము. శివుఁడు = ఈశానుఁడు, జితదర్పకత్వంబు చేర్చెన్ = జయింపఁబడిన మన్మథుఁడు గలుగుటను సమకూర్చెనని యర్థము. జయింపఁబడిన గర్వగ్రస్తులు గలు గుటను సమకూర్చెనని యర్థాంతరము. అఖిలమునులున్ = సమస్తమునీశ్వరులును, ప్రబలదీర్ఘాయు రారోగ్యభాగ్యకరములగు వరంబులు సమకూర్చిరి = బలిష్ఠమైన దీర్ఘాయువును నారోగ్యమును భాగ్య మును గలుగఁజేయునట్టి వరములను బొందఁజేసిరి.

క. వెండియు నాఖండలుఁ డరి, ఖండనజయసాధనప్ర•కాండము సమిదు
ద్దండ మొకదివ్యవైణవ, దండము దయనొసఁగి ధరణి•ధవునకు ననియెన్. 44

వెండియున్=తిరుగ, ఆఖండలుఁడు = ఇంద్రుఁడు, అరిఖండనజయసాధనప్రకాండము=శత్రు ఖండన జయప్రదాయుధశ్రేష్ఠమయిన, సమిదుద్దండము-సమిత్=యుద్ధమందు, ఉద్దండము = నిరంకుశ విహారముగలిగిన, సమిత్ = కట్టెలయందు, ఉద్దండము = అతిశయమైన కఱ్ఱయనియు నర్థము. ఒకదివ్య వైణవదండము = ఒకదివ్యమయిన వెదురుకఱ్ఱ, దయనొసఁగి = దయచేత నిచ్చినవాఁడై, ధరణిధవునకు ననియెన్ = వసురాజునుగూర్చి యిట్లు పలికెను. రాజులు సంగ్రామోత్సాహులు. కావున వైరుల జయింప ననువగుసాధనమును, యుద్ధమునందు నడ్డమాకలేనిదియు, దివ్యమునగు వెదురుకఱ్ఱను దేవేం ద్రుఁడు వసురాజున కిచ్చి దండప్రభావము నిట్లు చెప్పుచున్నాఁడు.

సీ. తనయనంతాతిదు•ర్దాంతమూలబలంబు లహిలోకతల మెల్ల • నాక్రమింపఁ
దనశతకోటిప•ర్వనితాంతమహిమ యంతికనగంబుల వకా•వకలు సేయఁ
దనమేచకశిలోధి•కనిరూఢనటన మభ్రగపురంబుల నెల్ల • రాయిడింపఁ
దనయభిజాతనూ•తనసువర్ణస్ఫూర్తి విషధరంబుల మూఁక • వి ప్పానర్పఁ
తే. బుట్టె నేవంశ మపరంజి•గట్టుమీఁద
దానితుదవ్రయ్య లీశాన•దనుజహారుల
కాదిఁ బృథుకార్ముకము లయ్యె • నయ్యఖండ
వేణుకాండంబు సుమ్మిది • విబుధమిత్ర. 45

తన=తనయొక్క, అనంత=అసంఖ్యములైన, అతిదుర్దాంత=అత్యంత దుస్సాధ్యములయిన, మూల బలంబులు = వ్రేళ్ళసత్తువలు, అహిలోకతలమెల్ల నాక్రమింపన్ = పాతాళలోకప్రదేశమునుయావత్తు

నావరింపఁగా ననియర్థము. అనంతునియొక్క అనఁగా శేషునియొక్క యతిదుర్దాంతములయిన యాత్మవర్గములు నాగలోకప్రదేశము నాక్రమింపఁగా నని యర్థాంతరము.

తన=తనయొక్క, శతకోటి=అనేకకోట్ల సంఖ్యలుగల, పర్వ=కణుపులయొక్క, నితాంతమహిమ=అతిశయప్రభావము, అంతికనగంబులన్ = సమీపవృక్షములను, వకావకలుసేయన్ = బ్రద్దలు సేయఁగాను అని యర్థము. శతకోటియనఁగా వజ్రాయుధము. అది దధీచియొక్క వెన్ను నెమ్ముగనుకఁ బర్వములనఁగా దానియొక్కగ్రంథులు వానియొక్క యతిశయమహిమ. పర్వములను ప్రక్కలు సేయఁగా నని యర్థాంతరము.

తన = తనయొక్క, మేచక = నల్లనైన, శిరః=అగ్రముయొక్క, అధికనిరూఢనటనము=అత్యంతమగునట్లుగా నభ్యస్తమయిన చలనము, అభ్రగపురంబులనెల్ల రాయిడింపన్ = గగనగతలోకములనన్నిటిని రాపిడి పెట్టఁగా ననియర్థము. మేచకశిరోధికుఁడనఁగా నీలకంఠుఁడైనహరుఁడు. ఆయనయొక్క నిరూఢమయిన తాండవము గగనగతలోకములను రాపిడిపెట్టఁగా ననియర్థాంతరము. ఇక్కడ హరుఁడు తాండవము సలుపఁగా నాయనజటాసమూహమువలన గగనభాగము రాయిడి నొందుచున్నదని చెప్పినాఁడు. నటన మనఁగా విలాసమని యర్థము చేసి హరునివిలాసము పురత్రయమును రాయిడి పెట్టినదనియును జెప్పవచ్చును.

తన = తనయొక్క, అభిజాత = సంజాతమయిన, నూతనసుపర్ణస్ఫూర్తి = నవీనశోభనపర్ణముల యొక్క స్ఫురణము, విషధరంబులకుమూఁకవిప్పొనర్పన్ = విషధరములనఁగా జలధరములును సర్పములును గనుక జలధరముల కన్నిటికిని బలాయనము సిద్ధింపఁజేయఁగాను అని యర్థము. సుందరనవగరుడస్ఫూర్తి సర్పముల కన్నిటికిని బలాయనము సిద్ధింపఁజేయఁగానని యర్థాంతరము. "మూఁక విప్పొనర్పన్" అనుపాఠము వ్యాఖ్యాతయగు సోమకవి యనుసరించినది కావున గ్రాహ్యము. ఎల్లవిప్పు అనుపాఠము ముద్రితగ్రంథములందు మాత్రము కలదు. సోమకవిపాఠమునే యిట గ్రహించితిమి.

ఏవంశము=ఏ వెదురు, అపరంజిగట్టుమీఁదన్ = కాంచనాచలముమీఁద, పుట్టెన్=సంభవించెనో, దానితుదప్రయ్యలు = దానియొక్క చివరబ్రద్దలు, ఈశానదనుజహారులకున్ = శివునకును విష్ణుదేవునకును, ఆదిన్ = పూర్వకాలమందు, పృథుకార్ముకములయ్యెన్ = గొప్పవిండ్లాయెను, అయ్యఖండవేణుకాండంబుసుమ్మిది = అట్టి సంపూర్ణమైన వెదురుయొక్క కఱ్ఱ సుమా యిది, విబుధమిత్ర = దేవసఖుఁడవైన వసురాజా, అని సంబోధనము. ఈపద్య మక్కిలిప్రాసనీస మని తెలియవలయును.

క. ఈదండము పరపాదప, వేదండము పరమపటిమ ♦ విహసితపురభి
త్కోదండము భవదీయభు, జాదండమునన్ ఘటింప ♦ జయ మగు నాజిన్. 46

ఈదండము = ఈవేణుదండము, పర = శత్రులనెడు, పాదప=వృక్షములకు. వేదండము=ఏనుఁగైనది - అనఁగా నేనుఁగు వృక్షముల నేతీరుగా ధ్వంసము సేయునో యాతీరుగా శత్రువులను సంహరించుచున్న దని భావము. పరమపటిమన్ = ఉత్కృష్టమయిన సామర్థ్యముచేత, విహసిత=పరిహాసము చేయఁబడిన, పురభిత్కోదండము = త్రిపురసంహారకుఁడైన హరునిధనుస్సుగలిగినది - అనఁగా హరధనుస్సును దిరస్కరించెడు సామర్థ్యముగల దనుట, భవదీయ భుజాదండమునన్ ఘటింపన్ = నీయొక్క బాహుదండమునందు వహించినపక్షమందు, ఆజిన్ = యుద్ధమందు, జయమగున్ = గెలుపు సిద్ధించును.

సీ. ఘనమై ఘటించు లో • కక్రూరనిర్ఘాత మాశుగమై కూల్చు • నలఘుతరుల
నతిఘోరతమమై ప • రాంధ్య మాపాదించుఁ గీలి యై సమిదిద్ధ • కేళి సలుపు
విలసద్విశేషమై • విషముల నేచు నచ్యుతమూర్తియై బలి • స్ఫురణ మడఁచు
మహితోగ్రవృత్తియై • యహితేభహతి సల్పు భానిధియై ప్రతా • పంబు సూపుఁ
తే. బార్థివ యఖర్వసర్వసు • పర్వవిభవ
దూర్వహము గాన నిది యాజిఁ • దోఁచు నఖిల
దివ్యసాధనసార మై • దీనిఁ దాల్చు
ధన్యుఁ డుద్దండసుభటమూ • ర్ధన్యుఁ డరయ. 47

ఘనమైఘటించు లోకక్రూరనిర్ఘాతము = ఘనతరమై లోకద్రోహి జనఘాత మాచరించునని యర్థము. మేఘమై లోకమందుఁ గ్రూరమగునశనిపాత మాచరించునని యర్థాంతరము. ఆశుగమై కూల్చు నలఘుతరులన్ = తీవ్రగమనము గలదై మిక్కిలియు నధికు లైనవారిని గూల్చునని యర్థము, వాయువై మహావృక్షములను గూలఁద్రోయునని యర్థాంతరము.

అతిఘోరతమమైపరాంధ్యమాపాదించున్=మిక్కిలి భయంకరమయినదై శత్రునిరోధముసేయు నని యర్థము. అతిఘోరమయిన, తమమై=అంధకారమై, పరాంధ్యము=ఉత్కృష్టమయిన యంధత్వము నాపాదించునని యర్థాంతరము. కీలియైసమిదిద్ధకేళిసలుపున్ = కీలలనఁగాఁ జీలలును జ్వాలికలును, కీలియై=చీలలుగలదై, సమిదిద్ధకేళిసలుపున్ = యుద్ధక్రీడసలుపునని యర్థము. జ్వాలికలుగల వహ్నియై సమిత్తులనఁగా నింధనములును గనుక నింధనకేళిసలుపునని యర్థాంతరము.

విలసద్విశేషమై విషములనేచున్ = విలసితవిశేషముగలదైవిషమజనుల బాధించునని యర్థము. వి=పక్షులలో, లసద్విశేషమై=శ్రేష్ఠమైన గరుత్మంతుఁడై విషనివారణసేయునని యర్థాంతరము. అచ్యుత మూర్తియై బలిస్ఫురణమడఁచున్ = అభంగవిగ్రహముగలదై బలవంతులయొక్క విస్ఫూర్తినడఁచివేయు నని యర్థము. విష్ణుమూర్తియై అనఁగా వామనమూర్తియై బలిచక్రవర్తియొక్క విజృంభణమడఁచునని యర్థాంతరము.

మహితోగ్రవృత్తియై యహితేభహతిసల్పున్-మహిత =ఒప్పుచున్న, ఉగ్రవృత్తియై=రౌద్రరస వ్యాపారముగలదై, అహితేభహతిసల్పున్ = శాత్రవశ్రేష్ఠులను హతముసేయుఁనని యర్థము. ఇక్కడ ఇభ శబ్దము శ్రేష్ఠవాచకము. (ని. 'స్యురుత్తరపదేవ్యాఘ్రపుఙ్గవర్షభకుఞ్జరాః, సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః.' అని అ.) ఉగ్రవృత్తియై = హరునివృత్తిగలదై శత్రువైన గజాసురుని వధ సేయునని యర్థాంతరము. భానిధియై ప్రతాపంబుసూపున్=ప్రకాశనిధియై ప్రతాపము గనుపఱుచునని యర్థము. సూర్యుఁడై యాతపతాపము గనుపఱుచు నని యర్థాంతరము.

పార్థివ = ఓయి వసురాజా, అఖర్వ=మహోన్నతమయిన, సర్వసుపర్వవిభవ=సమస్తమయిన మంచి కణుపులయొక్క సంపత్తికి, ధూర్వహముగానన్ = ధురంధరమయినదిగనుక నని యర్థము. అఖర్వమయిన సకలదేవతావిభవములకు ధురంధరమయినదిగనుక ననియర్థాంతరము. అఖిలదివ్యసాధనసారమై = సమస్త మయినదివ్యాయుధములలో శ్రేష్ఠమైయనియర్థము. దేవతాసాధనసారమయిన వజ్రమై యనియర్థాంత రము. ఇదియాజిఁదోఁచున్ =ఇదియుద్ధమందుఁగనఁబడును. కాఁబట్టి, దీనిఁదాల్చుధన్యుఁడు=దీనినిధరించిన

కృతార్థుఁడు, అరయన్ = విచారింపఁగా, ఉద్దండసుభటమూర్ధన్యుఁడు = ఉద్దండులయినశూరులలో శ్రేష్ఠుఁడుసుమా. ఉన్నతదండముగల శూరులలోననియుఁ జమత్కారము.

శా. సచ్ఛిద్రం బసమగ్రసార మొకవం◆శం బూని గోచక్ర మా
త్మేచ్ఛాధీన మొనర్చె గోపతనయుం ◆ డీదివ్యవంశోత్తమం
బచ్ఛిద్రం బతిమాత్రసార మిది బా◆హామండలిం బూనువాఁ
డచ్ఛిన్నంబుగ నేలఁ జాలఁడె సమ◆స్తావక్రగోచక్రమున్. 48

సచ్ఛిద్రంబు = రంధ్రయుక్తమనియును, అంతచ్ఛిద్రత్వరూపదోషయుక్తమనియును నర్థము. అసమగ్రసారము = అంతస్సారరహితంబును, దుర్బలంబును అనియర్థము. అటువంటి, ఒకవంశంబూని= ఒకవేణువును ధరించి, గోపతనయుండు = గోపాలబాలుఁ డని యర్థము. శ్రీకృష్ణస్వామి యనిభావము. గోచక్రము = అనఁగా భూచక్రమునని యర్థము. గోసమూహము నని భావము. ఆత్మేచ్ఛాధీన మొనర్చెన్ = తనయొక్కయిచ్ఛ కధీనమయినదానినిగాఁ జేసెను. అనఁగా స్వాధీనముగాఁ జేసికొనె ననుట. ఈదివ్యవంశోత్తమంబు = దేవసంబంధమయిన యీవేణుదండశ్రేష్ఠము. అచ్ఛిద్రంబు = ఛిద్రములులేనిదియును, అతిమాత్రసారము = అతిశయమయిన యంతస్సారము గలదియును నధికబలము గలదియును అనియర్థము. కాఁబట్టి, ఇది = ఈవేణుదండము, బాహామండలింబూనువాఁడు = భుజమండలమందు ధరించినవాఁడు, సమస్తావక్రగోచక్రమున్ = సమస్తమయిన యకుటిలమయిన భూచక్రమును, అచ్ఛిన్నంబుగన్ = అవిచ్ఛిన్నముగా, ఏలఁజాలఁడె = ఏలుటకు సమర్థుఁడుగాఁడా అనఁగా సమర్థుఁడే యనుట.

రంధ్రయుక్తంబును నంతస్సారము లేనిదియునయిన కొంచెముమాత్రపు వేణువుధరించిన గోపబాలుఁడు భూచక్రమునంతయుఁ దనయధీనము చేసికొనఁగా ఛిద్రములు లేనిదియును సంపూర్ణమయిన చేవగలదియు నయిన యీదివ్యవేణుదండశ్రేష్ఠమును ధరించిన పురుషుఁడు సమస్తభూచక్రము నేలఁగా సమర్థుఁడవుట కేమి యాశ్చర్యమనుట.

ఉ. చండతమంబు పర్వలవ◆సంధి నొకానొకవేళ రాజమా
ర్తాండులఁ బట్టి క్రాయు నది ◆ దారుణచండతమంబె యీమహో
ద్దండతమం బఖండగతిఁ ◆ దార్కొని క్రమ్మఁ బనీడు రాజమా
ర్తాండసులఁ బర్వసంధిఘటి◆తద్రఢిమంబు నిరంతరంబుగన్. 49

చండతమంబు = అత్యంతకోపశీలమయిన రాహుగ్రహము, ని. 'చణ్డస్త్వత్యంతకోపనః' అని అ. 'తమస్తురాహు స్స్వర్భానుః' అని అ. పర్వలవసంధిన్ = పర్వముయొక్క సూక్ష్మకాలసంధియందు-అనఁగాఁ బ్రతిపత్పంచదశ్యంతరమందనుట. ఒకానొకవేళన్ = ఒకానొకప్పుడును, రాజమార్తాండులఁబట్టిక్రాయున్ = చంద్రసూర్యులను గ్రహించి వెంటనే వెళ్ళఁగ్రక్కును. కాఁబట్టి, అది దారుణచండతమంబె = దారుణపదము చండత్వస్తుతిపరము, ఆరాహుగ్రహము దారుణచండతమమా, అనఁగాఁ గాదనియర్థము. అనఁగాఁ జండతమమనెడి నామమునకు యోగ్యముగాదనియుఁ జండతమమయినతమమత్యంతచండముగాదనియును, చండతమముగాని దారుణచండతమముగాదనియు నర్థాంతరము. ఈమహోద్దండతమంబు = అనఁగా మహోద్దండమయిన యీతమము-అనఁగా రాహుగ్రహము

అని యర్థము. మహత్తరమయిన యున్నతదండశ్రేష్ఠ మని భావము. అతిమహోద్దండతమ మని యును విచారింపవలయును. అఖండగతిఁ దార్కొని=సంపూర్ణగతితోడఁ దారసించి యని యర్థము. ప్రసిద్ధరాహువు ఖండితగాత్రుఁడనుట. క్రమ్మఱనీను రాజమార్తాండులన్ = చంద్రసూర్యులను దిరిగి పోనీయ దని యర్థము. రాజశ్రేష్ఠులనని భావము. ఏలాగనిన, పర్వసంధిఘటితద్రఢిమంబు నిరంతరంబుగన్ =పర్వసంధియందు సంఘటితమయిన రాజమార్తాండ గ్రసనదార్ఢ్యము సంతత మగునట్లుగా ననియర్థము.

అనఁగా సంతతమును బర్వసంధియందుఁ బుట్టుట శిథిలము గాకుండునట్లులుగా ననుట. కణుపులయొక్క సంధిదార్ఢ్య మెడతెగకుండునట్లులుగా నని భావము.

క. ఈగద సాకారజయ, శ్రీగద జగదవనధుర్య • చిరకీర్తివధూ
యోగద యనఁ దగుదీని క, యోగద లెన్నేనిఁ బోల • నోపునె జగతిన్. 50

జగదవనధుర్యా = లోకసంరక్షణధురంధరుఁడవైన యోవసురాజా, ఈగద = ఈగదాయుధము, సాకారజయశ్రీగద = ఆకృతివహించిన జయలక్ష్మిగదా, చిరకీర్తివధూయోగద యనఁదగుదీనికిన్ = శాశ్వతకీర్తికాంతాసంయోగము గలుగఁజేయునట్టిది యనుటకుఁ దగియున్నదీనికి, జగతిన్ = లోకమందు, అయోగదలెన్నేనిఁ బోలనోపునె = ఇనుపగదలెన్నయినప్పటికిని బోలఁజాలునా-అనఁగాఁ బోలఁజాలవనుట. యోగదకు అయోగదలు పోల వనియుఁ దాత్పర్యము.

చ. రతిపతితండ్రితూపును బు • రత్రయశాసనుశాతహేతి భా
రతిపతియంబకంబు నగ • రంధ్రవిధాయకుశక్తి దీనికిం
బ్రతి సమ మీడు జోడనఁగ • రాదు ధరాధిప దీని భక్తితోఁ
బ్రతిసమమున్ భజించుచు స • పర్యలొనర్ప శుభంబు నీకగున్. 51

ధరాధిప = ఓవసురాజా, రతిపతితండ్రితూపును = మన్మథజనకుఁ డగువిష్ణుదేవుని యస్త్రమును, అనఁగా నారాయణాస్త్రంబును, పురత్రయశాసనుశాతహేతి = త్రిపురాంతకుం డగుశివునియొక్క నిశితాయుధమును-అనఁగాఁ బాశుపతాస్త్రంబును, లేక త్రిశూలంబును, భారతిపతియంబకంబు = బ్రహ్మాస్త్రంబును, నగరంధ్రవిధాయకుశక్తి = క్రౌంచపర్వతమునకు రంధ్రమేర్పఱిచిన కుమారస్వామి చేతనుండు శక్తియును, దీనికిన్ = ఈవేణుదండమునకు, ప్రతిసమమీడుజోడనఁగరాదు = అనఁగా నారాయణాస్త్రము ప్రతియనియును, పాశుపతాస్త్రముగాని త్రిశూలముగాని సమమనియును, బ్రహ్మాస్త్ర మీడనియును, శక్తి జోడనియును అనరాదు. అనఁగా దీనికి నవి సమానములు కావనుట. కాఁబట్టి, దీనిన్ = ఈవేణుదండమును, ప్రతిసమమున్ భజించుచున్ = ప్రతిసంవత్సరమును సేవించుచు-అనఁగాఁ గొలుచుచు, సపర్యలొనర్పన్ = పూజలుసేయఁగా, శుభంబునీకగున్ = నీకు శుభము గాఁగలదు, ప్రతిసమమున్ = అన్నప్పుడు, ('సమాసుసమాసు ప్రతిసమమ్' అని వ్యుత్పత్తి.) (ని. 'సంవత్సరో వత్సరో ఽబ్దో హాయనో స్త్రీశరత్సమాః' అని అ.) సమాశబ్ద మాకారాంత స్త్రీలింగంబును నిత్యబహువచనాంతంబు నని తెలియవలయును.

త్రిమూర్తులయొక్కయుఁ గుమారస్వామియొక్కయు బాణము లీవేణుదండమునకు సమానములు గావు. ఉత్పత్తినిబట్టిచూడ దివ్యము. కావున భక్తితో భజింపఁదగినది. రతిపతితండ్రి నగరంధ్ర

విధాయకుఁడు. పురత్రయశాసనుఁడు. భారతిపతియను విశేషణములచేత వారల యతిశయప్రభావశక్తి సామర్థ్యాదులు ద్యోతకములు. వారిహితుల నిది మించినది గాన భజనార్హము. దానిచే శుభప్రాప్తి ఫలము.

ఆ. అనుచు దివ్యవంశ • మాదివ్యవంశ బాంధవున కఖిలధరణి•ధవున కొసఁగి
యతుల హితుల నెనసి • యతులవైఖరి నేఁగె, నాసవుఁడు నిజాధి•వాసమునకు.

అనుచున్ = ఈలాగని పలుకుచు, దివ్యవంశము = దేవతాసంబంధమైన వేణుదండమును, ఆ దివ్యవంశబాంధవునకున్ = యోగ్యమైన కులమందలి సగోత్రపురుషుఁడైన యనియర్థము. దేవతావర్గమున కాప్తుఁడని భావము. ఇక్కడ వంశశబ్దము వర్గపరము. ని. 'వంశో వేణౌ కులే వర్గే' అని వి. అఖిలధరణిధవునకున్ = సమస్తభూమికిని నాథుఁడైన వసురాజునకు, ఒసఁగి = ఇచ్చి, యతులహితుల నెనసి = యతీశ్వరులతోడను-అనఁగా మునీశ్వరులతోడను, నాప్తులతోడను గూడుకొని, వాసవుఁడు = దేవేంద్రుఁడు, నిజాధివాసమునకున్ = తన యునికిపట్టయిన స్వర్గమునకు, అతులవైఖరి నేఁగెన్ = సమానరహితమైన వైఖరిచేతఁ బోయెను. ఈపద్యము యమకయుక్తముగాఁ జెప్పఁబడియెను.

క. గిరియును గిరిజామాతయు, గిరిజామాతయు యథార్హ•కృతసత్కారా
దరగరిమ ననుపఁ దమతమ, యిరవుల కరిగిరి సరిద్గి•రీశ్వరు లంతన్. 53

గిరియును = కోలాహలపర్వతుఁడును, గిరిజామాతయున్ = అతనికల్లుఁడైనవసురాజును, ని. 'జామాతా దుహితుః పతిః' అని అ. గిరిజామాతయున్ = గిరికాదేవికిఁ దల్లియైన శుక్తిమతియును, యథార్హకృతసత్కారాదరగరిమ ననుపన్ = వారివారికిఁ దగునట్లుగాఁ జేయఁబడినపూజలచేతను నాదరాతిశయముచేతను నంపకముసేయఁగా; ఇక్కడ, సత్కారాదరతంబునుపఁగ, అని పాఠాంతరము గలదు. తమతమ యిరవులకున్ = తమతమ నివాసములకు, సరిద్గిరీశ్వరులు = నదులును బర్వతశ్రేష్ఠులును, అరిగిరి = పోయిరి, అంతన్ = అమీఁదట.

ఉ. హేమలతానిభాంగికి న•ధీశనివేశనవప్రవేశదీ
క్షామహనీయమంగళము • సర్వము సాంగముగా ఘటించి య
క్కోమలిఁ జేరఁ బిల్చి తల • గ్రుచ్చి కవుంగిటఁ జేర్చి భూధర
గ్రామణి పల్కె గాఢతర•గద్గదికాఘననిస్వనంబునన్. 54

హేమలతానిభాంగికిన్ = బంగారుతీఁగెవంటి దేహముగల గిరికాదేవికి, అధీశ = పెనిమిటి యొక్క, నివేశ=గృహమునందలి, నవప్రవేశ=నూతనప్రవేశముయొక్క, దీక్షా=నియమప్రయుక్తమైన, మహనీయమంగళము=ఒప్పిదమైన శుభము-అనఁగా నూతనగృహప్రవేశమునకుఁ దగినలాంఛనము, సర్వము సాంగముగా ఘటించి = సమస్తంబును సమగ్రమగునట్లుగా సమకూర్చి, అక్కోమలిఁ జేరఁబిల్చి = ఆగిరికాదేవిని డాయంబిలిచి, తలగ్రుచ్చి కవుంగిటఁజేర్చి = తల కడుపులోనుంచి కౌఁగిలించుకొని, భూధరగ్రామణి = పర్వతశ్రేష్ఠుఁడయిన కోలాహలుఁడు, గాఢతర = మిక్కిలి యతిశయమైన, గద్గదికా = డగ్గుత్తికతోఁగూడిన, ఘననిస్వనంబునన్ = గంభీరధ్వనిచేత, పల్కెన్ = వక్ష్యమాణ ప్రకారముగాఁ బలికెను.

అత్తవారింటికి గిరిక క్రొత్తగా నేఁగుచున్నది- కావున జనకునకు మిగులఁ జింతాకారణము. ఇంటికిఁ బెద్ద గావున వసుధా జేటులో కార్యవిధులు నిర్వర్తించెను. కాని నీతులు తెలుపవలసివచ్చు

వఱకు ఎడబాటువలని దుఃఖముచే డగ్గుత్తిక పడెను. అయినను నిబ్బరించి ఘనస్వరమున నిట్లుఁ జెప్ప సాగెను. పుత్త్రికావిశ్లేషణము దుఃఖహేతు వనుటకు కణ్వోక్తి-

"శ్లో. యాస్య త్యద్య శకుంతలేతి విషయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠ స్తంభితబాష్పవృత్తి కలుష శ్చింతాజడం దర్శనం
వైక్లబ్యం మమ తావదీదృశమహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖై ర్నవైః." అభిజ్ఞానశాకుంతలము.

క. నీతమ్ములశుభవాసన, నీతలిదండ్రులగభీర♦నిశ్చలగుణవి
ఖ్యాతియును దలఁచి మెలఁగుము, నాతల్లీ కులవధూజ♦నమతల్లిక వై. 55

నీతమ్ములశుభవాసన = నీతోఁడఁబుట్టువులయొక్క శుభశీలంబును అని యర్థము. పద్మముల యొక్క యోగ్యమైన సౌరభమని భావము. నీ తలిదండ్రుల = నీతల్లియైన శుక్తిమతియొక్కయును నీతండ్రియైన నాయొక్కయు, గభీరనిశ్చలగుణవిఖ్యాతియును = గభీరగుణనిశ్చలగుణములయొక్క ప్రసిద్ధియుననియర్థము. లోఁతును గదలకుండుటయును అనిభావము. ఇక్కడఁ గ్రమాలంకారము. తలంచి=విచారించి, నాతల్లీ=మాయమ్మా, కులవధూజనమతల్లిక వై=పతివ్రతాజనములో శ్రేష్ఠురాలవై, మెలఁగుము = ప్రవర్తింపుము.

సీ. మాఱుమాటాడదు ♦ మఱచియైనను గురువ్యాహారమున కీయ♦హార్యతనయ
యానమ్రగతిఁ బూను ♦ మానంపుసవతు లెట్లైన నీదివ్యర♦త్నానుజాత
ఱాఁగయై మేర మీఱ♦దొకప్పుడును ఘన శ్రీలఁ బొంగియును నీ♦సింధుకన్య
యేకాకృతి వహించు♦నినురాగవృత్తికి నపరాగవృత్తికి ♦ నబ్జసహజ
తే. యచ్చెరువు వింత యబ్బురం ♦ బరిది యనుచు
విశ్వధాత్రీశ్వరులు మెచ్చ ♦ వెలయవమ్మ
యమ్మ భవదీయచిత్రగు♦ణాతిశయము
వలన మాకెల్ల వన్నె రా ♦ మెలఁగవమ్మ. 56

ఈయహార్యతనయ = ఈపర్వతకుమారిక, గురువ్యాహారమునకుఁ = పెద్దలైన యత్తమామలు మొదలగువారిమాటకు, మఱచియైనను = జ్ఞాపకములేకయైనప్పటికిని, మాఱుమాటాడదు = ప్రతికూల వాక్యము పలుకదు అనియర్థము. పర్వతమైతే గురువ్యాహారమునకు మాఱుమాటాడుచున్నదనుట. పెద్దపెట్టుగాఁ బలికినం బ్రతిధ్వని యిచ్చుచున్నదని భావము. వ్యాహారమనఁగాఁ బలుకు, (ని. 'వ్యాహార ఉక్తి ర్లపితమ్' అని అ.)

ఈ దివ్యరత్నానుజాత = యోగ్యమైన ముక్తామణులకుఁ దోఁబుట్టువైన యీచిన్నది, మానంపు సవతులెట్లైనన్ = కోపముగల సపత్నులు తనచోట నేలాగున విపర్యాసము జరిగించునప్పటికిని, ఆ నమ్రగతిఁబూనున్ = నమ్రత్వమువహించును అని యర్థము. ముక్తామణులైతే మానంపుసవతు లెట్లయినను నమ్రభావము వహింపవనుట. రత్నములు తుల్యమానములైన కట్టెలు నీవలావలనిడి తూచి నప్పటికిని సమానముగానే యుండునుగాని మ్రొగ్గుచూపవని భావము. ఈషష్ఠమంధిది సవతుశబ్దము యొక్క బహువచనరూపము.

ఈసింధుకన్య = నదీకన్యయైన యీచిన్నది, ఘనశ్రీలఁ బొంగియును = ఘనమైన సంపదలచేత నుప్పొంగుచున్నదయ్యును, ఒకప్పుడును = ఒకానొక సమయమందైన, ఱాఁగయై మేరమీఱదు = గర్వాళియై మర్యాద నతిక్రమింపదు, అని యర్థము. నదియైతే ఘనశ్రీలచేత నుప్పొంగి యొకప్పుడు ఱాఁగయై మేరమీఱుననుట. నదులు వర్షాకాలమందు మేఘోదకములచేతఁ బొసంగి సంపూర్ణమై దరులమించి ప్రవహించుచున్నవని భావము.

అబ్జసహజ = పద్మములతోడఁబుట్టిన యీ చిన్నది, ఇనురాగవృత్తికి నపరాగవృత్తికిన్ = పెనిమిటియొక్క యనురాగయుక్తమయిన నడవడికిని ననురాగరహితమయిన నడవడికిని, ఏకాకృతి వహించున్ = ఒక్కవిధముగానే యుండునని యర్థము. అబ్జములైతే యినునిరాగవృత్తికిని నపరాగవృత్తికిని ఏకాకృతివహించియుండవనుట. అబ్జములు సూర్యునియుదయమునకును నపరాద్రివర్తనమునకును నేకవిధముగా నుండవని భావము. అచ్చెరువువింతయబ్బురం బరిది (ఈచిన్నది మొదటినాల్గు చరణములయందుఁ జెప్పినచొప్పునఁ దన బంధువులకు విరుద్ధములైన మంచిగుణములం జూపుటచే నాల్గింటికిని నాలుగాశ్చర్యవాచకములు),

అనుచున్ = ఇట్లు చెప్పికొనుచు, విశ్వధాత్రీజనులుమెచ్చన్ = సమస్తభూజనులును మెచ్చుకొనునట్టులుగా, వెలయవమ్మ = ప్రసిద్ధిఁబొందవమ్మా, అమ్మ = మాతల్లీ, భవదీయచిత్రగుణాతిశయమువలనన్ =నీ యద్భుతకరమయిన గుణాతిశయమువలన, మాకెల్లవన్నెరామెలఁగవమ్మ = మాకందఱకును బ్రకాశత గలుగునట్టులుగాఁ బ్రవర్తింపవమ్మా.

చ. పతికృతధర్మకౌశలము•పట్టునఁ దోడగునారి నారి దాఁ
బితృశరణప్రచింత మదిఁ • బెట్టక యీశనివేశితాత్మ యౌ
సతి సతి రాశి కెక్కి యిన•సత్కృతిఁ గైకొనుకన్య కన్య శా
శ్వతమతి నిట్లు గా మనిన•వామయె వామ గదమ్మ కోమలీ. 57

పతికృత ధర్మకౌశలము పట్టునఁ దోడగునారి నారి = ధర్మమనఁగా ధర్మంబును విల్లును, నారి యనఁగా స్త్రీయును శింజినియును, పతి = నాథునిచేత, కృత = చేయఁబడిన, ధర్మకౌశలముపట్టునన్ = ధర్మనైపుణ్యపువేళయందు, తోడగు = సహాయమయిన, నారి = స్త్రీ, నారి = నార్యుచితధర్మవతి యని యర్థము. అధిపతిచేతఁ జేయఁబడిన విలువిద్యయందలి నేర్పుపట్టున సహాయమైయున్న శింజిని యని యర్థాంతరము. తాఁబితృశరణప్రచింతమదిఁబెట్టక యీశనివేశితాత్మయౌ సతిసతి = శరణమనఁగా గృహంబును సంరక్షణంబును, ఈశుఁడనఁగాఁ బెనిమిటియును హరుఁడును, ఆత్మయనఁగా మనస్సును దేహంబును, సతియనఁగాఁ బతివ్రతాంగనయును బార్వతియును, పితృశరణప్రచింత = తండ్రి యింటిమీఁది తలంపు, మదిఁబెట్టక = మనస్సునిడక, ఈశనివేశితాత్మయౌ = పెనిమిటియందుఁ జేర్చఁబడిన మనస్సుగలదైన, సతి = స్త్రీయే, సతి = పతివ్రత అని యర్థము. పితృశరణప్రచింతమదిఁబెట్టక = తండ్రియైన దక్షునియొక్క సంరక్షణముమీఁది తలంపు మనస్సున నిడక, ఈశనివేశితాత్మయౌ = హరునియందుఁ జేర్పఁబడిన యర్ధదేహముగలదైన, సతియే పార్వతి యని యర్థాంతరము. రాశికెక్కియిన సత్కృతిఁ గైకొనుకన్యకన్య - రాశికెక్కి = ప్రసిద్ధికెక్కి, ఇన = పెనిమిటియొక్క, సత్కృతిఁ గైకొను = మన్ననను బొందిన, కన్యకన్య = స్త్రీయేస్త్రీ యని యర్థము. రాశికెక్కి = ద్వాదశరాసులలో

నోకరాశియై, ఇనసత్కృతిఁగాంచిన = సూర్యసత్కారమును బొందిన, కన్యకన్య = కన్యయే కన్యారాశి యని యర్థాంతరము. శాశ్వతమతినిట్లుగామనిన = స్థిరబుద్ధిచేత నీప్రకారముగా బ్రతికిన, వామయె వామగదమ్మకోమలీ = స్త్రీయే యన్వర్థనామవతి - అనఁగా రమ్యమైనదిగదమ్మ యోగిరికాదేవీ యని యర్థము. ఈ పద్యమున లాటానుప్రాసము.

శాశ్వతమతి నిట్లుగా మననివామయెవామ యను పాఠము నూతనముద్రితప్రతులందుఁ గలదు. వామయనుచో వక్రురాలని నూతనముద్రితప్రతిపాఠమున కర్థము. ఇదియె యొప్పియున్నదని సంస్కర్త యభిప్రాయము. వామలోచనేత్యాదులందు వామశబ్దము రమ్యార్థమున రూఢము. వామశబ్దమును ప్రతికూలార్థమునందు వాడుట కవ్యభిప్రాయముగఁ దోపదు. నారియెనారి కన్యయెకన్య సతియెసతి యనుచో ననుకూలశ్లేషార్థముగలదుగాన వామయనుచో మనోహరార్థమె తగియున్నది. రసజ్ఞులువలసిన పాఠము గ్రహింతురుగాక.

శా. ఈశైవాలవతీప్రతీరభజనం • బీనిర్మలప్రస్తరో
ద్దేశావాసము నీమృగార్భకశకుం•తీసఖ్యముల్ లేమిఁ జిం
తాశల్యంబు వహింపకమ్మ చెలి యే•తచ్చర్య లెల్లం దపః
క్లేశాంగంబులు నీ కభీష్టవరల•క్ష్మీధన్య కింకేటికిన్. 58

ఈశైవాలవతీప్రతీరభజనంబు=ఈనదీతీరభజనమును, ఈనిర్మలప్రస్తరోద్దేశావాసము = ఈశుభ్రతరపాషాణోపరినివాసమును, ఈమృగార్భకశకుంతీసఖ్యముల్ = ఈబాలకురంగములయొక్కయు నాఁడుపక్షులయొక్కయు మైత్రియును, లేమిన్ = ఇఁకమీఁద లేక యుండుటచేత, చింతాశల్యంబువహింపకమ్మ = విచారమనెడు ఆయుధపుటలుగును హృదయమందు నిలుపుకొనఁబోకమ్మా, చెలి = ఓగిరికాదేవీ, ఏతచ్చర్యలెల్లన్ = ఈపడవళ్లన్నియును, తపఃక్లేశాంగంబులు = తపోవిషయమైన దుఃఖమునకు నవయవములు, కనుక నివి, యభీష్టవరలక్ష్మీధన్యకున్ = అభిమతవరసంపత్తిచేతఁ గృతార్థురాలవైన, నీకున్ = నీకు, ఇంకేటికిన్ = ఇకమీఁద నెందుకు - అనఁగా నక్కఱలేదనుట.

అనఁగా నిక్కడ గిరికాదేవియొక్క శుక్తిమతీనదీతీరవిహారాదులకు దపశ్చర్యలుగాను నభిమతపురుషప్రాప్తిని నభీష్టవరసంపత్ప్రాప్తినిగాను జెప్పినాఁడని తెలియవలయును. గిరిక అభీష్టవరసిద్ధికై తపఃక్లేశమును సహించెను. తపస్సాధనములు - నదీతీరవాసము, పాషాణశయనము, మృగశకుంతాదికస్నేహము లోనగునవి. తపఃఫలము అభీష్టవరసిద్ధి. అదియె ధన్యతాహేతువు. కావున దపఃక్లేశాంగముల దలంచి చింతాశల్యముతో నవస్థపడకుమని భావము. నదీతీరము మాతృసన్నిధి, ప్రస్తరావాసము పితృసన్నిధి, మృగశకుంతీగణము మాతృపితృపరిజనము. వీనితో నెడబాటు చింతాహేతువని యర్థాంతరము.

క. అని తెలుప నశ్రుధారా, వినివేశవిలీయమాన•వినతానన యా
తనయం గని కల్లోలిని, తనయంగనితాంతయుక్తిఁ • దార్చుచుఁ బలికెన్. 59

అనితెలుపన్ = కోలాహలుఁ డీలాగని బోధింపఁగా, అశ్రుధారా = బాష్పధారలయొక్క, వినివేశ = ప్రవేశముతోడ, విలీయమాన = సంకలితమగుచున్న, వినత = వంచుకొనఁబడియున్న, ఆననయా = ముఖముగలదైన, తనయంగని = కొమార్తెనుజూచి, కల్లోలిని = శుక్తిమతీనది, తనయంగనితాంతయుక్తిఁ

దార్చుచున్ = తనయొక్క శరీరసంయోగమును ఘటించుచు - అనఁగా నాలింగనముసేయుచు, పలికెన్ = వక్ష్యమాణప్రకారము గావించెను.

ఉ. తమ్ములఁ బంపుదున్ మణిశి। తమ్ములఁ బంపుదు రాజహంసపో
తమ్ములఁ బంపుదున్ బరిచి। తమ్ములఁ గానన దేవతాళిజా
తమ్ములఁ బంపుదున్ ద్రుతగ। తమ్ముల నేనును సారణీప్రపా
తమ్ముల వత్తు విశ్వవిది। తా ముదితా మదితాప మేటికిన్. 60

తమ్ములఁబంపుదున్ = నీయొద్దకుఁ దమ్ములను అనఁగా సహోదరుల నంపుదు నని యర్థము. కమలముల నంపుదు నని భావము. మణిశితమ్ములఁబంపుదున్ =అనేకములైన ముక్తామణులను బంపుదును, రాజహంసపోతమ్ములఁబంపుదున్ = రాయంచకొదమలనంపుదును, పరిచితమ్ములన్ = పరిచయముచేయఁబడిన, కానన దేవతా = వనదేవతలనెడు, ఆళిజాతమ్ములఁబంపుదున్ = సఖీసమూహములనుబంపుదును, ద్రుతగతమ్ములన్ =శీఘ్రగతులచేత, నేనును= నేనును, సారణీప్రపాతమ్ములవత్తున్ = సారణియనఁగాఁ బిల్లకాలువ, (ని. 'సారణీచాల్పసరితి' అని వి.) ప్రపాతమనఁగా నిర్ఝరము. (ని. 'ప్రపాతో నిర్ఝరే భృగౌ' అని వి.) అల్పసరిన్నిర్ఝరీస్వరూపములతోడను వత్తును, విశ్వవిదితా = జగత్ప్రసిద్ధురాలవైన, ముదితా=ఓగిరిజాదేవీ, మదితాప మేటికిన్ = నీకు మనస్సంతాపమెందుకు-అనఁగా నక్కఱ లేదనుట, మదియొక్క తాపము అని షష్ఠీసమాసము.

సీ. మెదలుమీటారితుమ్మెదలు ఝుమ్మని మ్రోయఁ। బొదలునిచ్చటిపువ్వు। పొదలు
దేరి మాధురిఁ గడ। తేరి పేరివము నవారిసేయుమదీయ। వారిఁ దేల [సూడఁ
వల నంది దరుల క్రే। వలనొందికొనుచు నావలనగల్పుమహోర్మి । వలనమరయ
గములఁబాయకతరం। గములపైఁ దగుసితాంగములమానసవిహం। గములఁ బట్టి
తే. సరిదివ్రతముల సరిగంగ। లాడఁ జైత్ర, శుచినభోబాహుళతపో। శోభిసకల
సమయములఁబావకప్రాణ। సమునిఁ గూడి, యిచటనె మెలంగెదుకలంగ। దేలతల్లి.

మెదలుమీటారితుమ్మెదలుఝుమ్మనిమ్రోయన్ =తిరుగుచుండెడు చక్కనితుమ్మెదలు ఝుమ్మనిధ్వని సేయఁగా-అనఁగా ఝుంకారము సేయఁగాననుట, పొదలు = ఒప్పుచున్న, ఇచ్చటిపువ్వుపొదలుసూడన్ = ఇక్కడ నుండెడుపూఁబొదలను జూచుకొనుటకును, వసంతర్తువునందుఁ బూవుపొదలు ననలచే నిండారి అళులరవళిచే నలరి నేత్రోత్సవకరముగ నుండును. కావున నుద్యానములు పొదరిండ్లు విహారయోగ్యములు. మీరు చూడ నేతేరఁగలరు.

తేరి=మాలిన్యరహితమయి, మాధురిఁగడతేరి = మాధుర్యముచేతఁగడముట్టి-అనఁగాఁబూర్ణీభవించి, పేరివమును = అధికశీతలభావమును, ఇవమన్నప్పుడు, గకారస్థానమందు వకారమువచ్చినది. అవారి సేయు=అపరిమితమగునట్లుగాఁ జేయుచుండెడు, మదీయవారిఁదేలన్ =నాసంబంధమయిన యుదకమందు జలక్రీడ సలుపుకొనుటకును, గ్రీష్మర్తువునందుఁ బ్రవాహోదకము స్నానయోగ్యముగ నుండును. జలము తేరుటయు నెండవేళఁ జల్లఁగనుంటయు స్నానోచితమగు జలమునకుఁ దగినలక్షణములు. గ్రీష్మమున వారి స్నానయోగ్యమనుభావము కాళిదాసు ఋతుసంహారములో "సదావగాహక్షమవారిసంచయః" అని చెప్పియున్నాఁడు.

వలనంది=ఒప్పిదమునుబొంది, దరులక్రేవలనొందికొనుచున్ = దరులయొక్క పార్శ్వములయందు వ్యాపించుచు, ఆవలన్ = ఆటుతర్వాత, అగల్చు = భేదించునట్టి, మహోర్మివలనమరయున్ = మహాతరంగవిహారము విమర్శసేయుకొఱకును, వర్షర్తువునఁ దరంగముల పొందికలతోఁ దరంగిణులు దర్శనీయముగ నుండును. మహోర్ములుగావున దరులనురెంటిని దాఁకుటయు నావలవిరియుటయు సహజగుణము. తరంగసందర్శనమె సంతోషదాయకమని భావము.

గములఁబాయక = గుంపులనెడవాయక, తరంగములపైఁదగు=కరుళ్లమీఁదనొప్పుచుండెడు, సితాంగముల = తెల్లదేహముగల, మానసవిహంగములన్ = మానససరోవరసంబంధములైనపక్షులను, అనఁగా రాజహంసలను, పట్టన్ = పట్టుకొనుటకొఱకును, తరంగములు తఱుచుగా హేమంతశిశిరర్తువులలో నుండును. అందు మానససరోవిహారము జేయురాయంచలు గుంపులుగావచ్చి జంటలుగఁ జరించుచుండును. గములుగా నరుదెంచి యీఁదుచుండునుగాన నేయంచనేని క్రీడార్థము పట్టుకొనవచ్చును.

అరిదివ్రతములసరిగంగలాడన్ = విశేషవ్రతములయందు సరిగంగాస్నానములుసేయుటకొఱకును, చైత్రశుచి నభో బాహుల తపో విశోభి సకలసమయములన్ = చైత్రా షాఢ శ్రావణ కార్తిక మాఘ మాసములచేత నొప్పుచుండెడు సమస్తసమయములయందును, శుచ్యాదిశబ్దచతుష్టయమునకు నిఘంటువులు, (ని. 'శుచిస్త్వయం, ఆషాఢే శ్రావణే తుస్యా న్నభా శ్శ్రావణిక శ్చసః, బాహు లోర్జా కార్తికికః తపామాఘే' అని అ.) ఇక్కడఁ జైత్రాదిమాస పంచకముచేత వసంతగ్రీష్మవర్షాశరచ్ఛిశిరర్తువులను గ్రహింపవలయును. హేమంతర్తువు శిశిరర్తువం దంతర్భూతమైనది. తావకప్రాణసమునిఁ గూడి = ప్రాణసమానుఁడయిన నీవిభునిఁగూడి, ఇచటనెమెలంగెదు = ఇక్కడనే విహరింపఁగలవు. అనఁగా వసంతర్తువునందుఁ బూఁబొదలు చూచుకొఱకును, గ్రీష్మర్తువునందు జలక్రీడ లాడుకొఱకును, వర్షర్తువునందుఁ దరంగవిహారము విమర్శించుకొఱకును, శరదృతువునందు హంసలఁబట్టెడుకొఱకును నీవు నీవిభునితోఁగూడి యిక్కడనే విహరింతు వనుట. కాఁబట్టి, కలంగెదేలతల్లి = అమ్మాయేలచింతపడుచున్నావు. అనఁగాఁ జింతిలవలదనుట. ఈపద్య మవకలివడిసీసమని తెలియవలయును.

క. బెగడవల దనుచు బెట్టిద, మగునెవ్వగ నగడుపడుచు ♦ నాఁడుపడుచు లే
పగవారికి వల దన నా, పగవారికి నేల యొసఁగెఁ ♦ బద్మజుఁ డనుచున్. 62

బెగడవలదనుచున్ = జడియకుమనిపలుకుచును, బెట్టిదమగునెవ్వగనగడుపడుచున్ = ఘనమైనవిచారముచేతఁ దొట్రుపడుచును, ఆఁడుపడుచు లేపగవారికివలదనన్ = ఎట్టి పగవారికైనను నాఁడుపడుచులు కలుగరాదని లోకమం దనుచుండఁగా, ఆపగవారికి నేలయొసఁగెఁ బద్మజుఁడనుచున్ - ఆపగవారికిన్ = ఆపగయొక్కవారికి - అనఁగా నదీజలమునకు బ్రహ్మ యేలాయిచ్చెను అని పలుకుచును,

ఇక్కడ ఏపగవారికి వలదనఁగాను ఆపగవారి కిచ్చెనని స్వారస్యము గ్రహింపవలయును. ఆపగవారియనునది తెనుఁగు షష్ఠీసమాసము గావున నాపగాశబ్దమునకు హ్రస్వమువచ్చినది. అపగాశబ్దమునకు, (ని. 'స్రోతస్వినీ ద్వీపవతీ స్రవంతీ నిమ్నగాపగా' అని యమరము.)

చ. అనుపమహేలతో నరవ♦రాగ్రణి రత్నరథాధిరూఢుఁడై
యనుపమహేలతోఁ గదలె♦ నాత్మపురంబున కభ్రమండలిన్

ఘనమురవార్భటిం దెరువు • గట్టి నిలింపనితంబినుల్ ఘనా
ఘనమురవార్భటి న్మెఱచు•గాఱుమెఱుంగులరంగు లీనఁగన్. 63

అనుపన్ = అంపకముసేయఁగా, (ఇక్కడ, అపగవారికి నేలయొసఁగెఁ బద్మజుఁడనుచున్, అని శ్లేషకముచెప్పినాఁడు. ఆంధ్రమందును గులకము చెప్పవచ్చునన్నందుకు, అధర్వణవచనము. శ్లో. 'క్వచిత్కులకసమ్బన్ధో ప్యత్ర సాహిత్యకృద్భవేత్' అని ప్రమాణము.) మహేలతోన్ = స్త్రీతోఁగూడ-అనఁగా గిరికాదేవితోఁగూడ, మహిళాశబ్దంబును మహేలాశబ్దంబును రెండును గలవు. మహేలాశబ్దమునకు, (ని. 'మహేలా యోషితా యోషా యువతిః' అని యమరశేషము.) నరవరాగ్రణి = వసురాజు, రత్నరథాధిరూఢుండై = రత్నమయమైన రథమునెక్కినవాఁడై, అభ్రమండలిన్ = గగనమండలమందు, ఘనమురవార్భటిం దెరువుగట్టి = ఘనతరమయిన మృదంగధ్వనితోడ దారి నడ్డగించి, నిలింపనితంబినుల్ = దేవతాస్త్రీలు, ఘనాఘన=వర్షించుచున్న మేఘముయొక్క, రవార్భటిన్ = రవార్భటితోఁగూడి-అనఁగా గర్జితముతోఁగూడి, మెఱచు = మెఱయుచున్న, కాఱుమెఱుంగుల = తొలకరి మెఱుపుతీఁగెలయొక్క, రంగులీనఁగన్ = వైఖరులను గనుపఱుపఁగా, అనుపమహేలతోఁగదలె నాత్మపురంబునకున్ = అసమానమయిన విలాసముతోడఁ దనపట్టణమునకుఁ బోవుటకై కదలెను.

వసురాజు విమానసంచారశక్తిగలవాఁడు గావున గిరికతో నిజనగరమునకు అసమానవిలాసముతో రత్నకలితమగు రథమెక్కి యభ్రమండలిని బ్రయాణ మయ్యెను. వేలుపుముగుద లాయుత్సవము చూచుటకు మురవాదివాద్యముల మ్రోఁగించుచుఁ దెరువుకట్టిరి. వేల్పువెలఁదుకలమురవధ్వనులుఱుములవలెను వారి మేనుదీవియలు తొలకరి మెఱపుదీవియలవలెను నుండెను. మురవశబ్దోత్పత్తి, 'మురఃచర్మపట్టికాసంవేష్టనం తంవాతిప్రాప్నోతీతిమురవః.' వాగతిగంధనయోః అనిధాతువు.

ఉ. వేడుక నిట్లగణ్యరుచి•విభ్రమధన్య యగేంద్రకన్య రాఁ
జూడఁ దలంచి నిల్చిరి వ•సుక్షితిపాలపురీపురంధ్రికల్
మాడువులన్ హజారముల • మచ్చుల సజ్జల గోపురంబుల
న్మేడల నాట్యశాలికల • మేరువులన్ భువనేశ్వరంబులన్. 64

వేడుకన్ = ఉత్సవముతోడ, ఇట్లు = ఈచెప్పఁబడినప్రకారము, అగణ్యా = వర్ణింపనలవికాని, రుచి = కాంతిచేతను, విభ్రమ = విలాసముచేతను, ధన్య = కృతార్థురాలయిన, అగేంద్రకన్య = గిరికాదేవి, రాన్ = రాఁగా, చూడఁదలంచి = చూడనిచ్ఛయించి, వసుక్షితిపాలపురీపురంధ్రికల్ = వసురాజుయొక్క పట్టణమందుండుస్త్రీలు, మాడువులన్ = ప్రాసాదవిశేషములయందును, హజారములన్ = ముఖశాలలయందును-అనఁగా మొగసాలలయందనుట, మచ్చులన్ = డాబాలయందును, సజ్జలన్ = ఉప్పరిగలయందును, గోపురంబులన్ = బహిర్ద్వారములయందును, మేడలన్ = హర్మ్యములయందును, నాట్యశాలికలన్ = నాటకశాలలయందును, మేరువులన్ = పోఁతమట్టెదిన్నెలయందును, భువనేశ్వరంబులన్ = గృహవిశేషములయందును, నిల్చిరి = నిలిచియుండిరి.

గిరిక నగేంద్రకన్య. మఱియు నగణ్యరుచివిభ్రమధన్య కావున నాయమను సందర్శింపఁ బురకాంత లందఱు వచ్చిరి. మచ్చులు, హజారములు, మేరువులు, భువనేశ్వరములు నున్నతస్థలములు గాన దర్శనోత్సాహముచే నటఁ జేరిరని భావము. సజ్జయన శిరోగృహమనుటకు-

"ఉప్పరిగల్ సజ్జలు చప్పరాలు చవికల్ పైఁజూడ లేదెక్కి" రామాభ్యుదయము. ఆ. ౬.
మచ్చు అన మిద్దెయిల్లనుటకు-

తే-గీ. "...     ...     మచ్చులమేడల నెలవులెల్ల
క్రొత్తసింగారములఁ దళుకొత్తఁ జేసి."     అచ్చ తెనుఁగురామాయణము.

సీ. సరిగాదు మద్వధూ♦సర్గమీసతికంచుఁ దెలుప నందఱుఁ దెచ్చె♦నలువ యనఁగ
నిజభాగ్యలక్ష్మిరా♦నెమ్మిఁ బోఁజిడ ననంగుఁడు మూలబలమెల్లఁ♦గూర్చె ననఁగఁ
గొనియె మాసిరుల నీ♦కొమ్మంచుఁ బతికిఁ దెల్ప నశేషయావతం♦బెనసె ననఁగ
జలసుతాసమకన్య ♦ గలుగునో యని నేల యీసున వేవేల ♦ నీనె ననఁగ
తే. గణనమీఱిన యోరూప♦గరిమమించు, లలనతోఁ దులఁదూఁగఁజా♦లక భజించి
రుపరిభాగంబు లనఁ జేడి♦నృపలలామ, పట్టణపయోజముఖులు చూ♦పట్టి రపుడు.

నలువ = బ్రహ్మదేవుఁడు, సరిగాదు మద్వధూసర్గమీసతికంచున్ = నాయొక్క స్త్రీజనసృష్టి యీస్త్రీకి సమానముగాదని, తెలుపన్ = తెలియఁజేయుటకొఱకు, అందఱుఁ దెచ్చెన్ = స్త్రీలనందఱ నొక చోటికిఁ దెచ్చెనో, అనఁగన్ = అనునట్లుగాను, పురసుందరులందఱును గిరికాదేవిని గాంచవచ్చిరి. వచ్చిన చెలువలందఱు బ్రహ్మసృష్టియందుఁ బేరెన్నికఁ గలవారలె. గిరిక యందఱికంటె సౌందర్యవతి. అందఱు సుందరు లేతెంచుట గిరిక లోకాతిశయసౌందర్యవతి యని నిరూపించుట కని భావము.

అనంగుఁడు = మన్మథుఁడు, నిజభాగ్యలక్ష్మిరాన్ = తనయొక్క భాగ్యలక్ష్మివచ్చుచుండఁగా, నెమ్మిన్ =మైత్రిచేత, పోఁజిడన్ =వెంటపోఁజూచుటకు, మూలబలమెల్లఁగూర్చెననఁగన్ =ఆప్తసైన్యము నంతయుఁ గూర్చినాఁడో-అనఁగా గుంపుచేసినాఁడో యనునట్లుగాను, చక్కఁదనము మరుని భాగ్యము. సౌందర్యవతియగు గిరిక మరునిభాగ్యలక్ష్మి తనయైశ్వర్యసమృద్ధిని దెచ్చునపుడు మూల బలమును వెంట బారులుతీర్చి నడిపించుట గలదు. గిరిక భాగ్యలక్ష్మి. చూడవచ్చిన పౌరసుందరులు మూలబలము. ఇదియంతయు మన్మథుని బలప్రదర్శనమువలె నుండెనని భావము.

కొనియెమాసిరుల నీకొమ్మంచున్ = ఈకొమ్మ అనఁగా నీగిరికాదేవి మాసౌందర్యసంపదల నపహరించెనని, పతికిఁ దెల్పన్ = వసురాజునకుఁ జెప్పుటకు, అశేషయావతంబెనసెననఁగన్ = సమస్తయువతీ సమూహమును గుంపుగూడినదో యన్నట్లుగాను, గిరిక లోకాతిశయసౌందర్యవతి. సమస్తసుందరీ సౌందర్యము రాశీకృత మొనరించి నలువ యీచెలువను సృజించెను. అదియె యువతీసౌందర్యముల హరించెననుట. గిరిక చెలువలందఱికంటెఁ జక్కఁదనమున మిన్నయగుట తమచెలువము దొంగలించుట వలన. దొంగను రాజునకుఁ బట్టి యీయ చెలువలు మూఁగినటులున్నదని భావము.

జలసుతాసమకన్యగలుగునో యని=జలోద్భవయైన గిరికాదేవితో సమానమైనకన్యకలుగునేమో యని, నేల=భూమితత్త్వము, ఈసునన్ =జలతత్త్వముమీఁది యసూయచేత, వేవేల నీనె ననఁగన్ = అనేకస్త్రీసహస్రములున్నట్టుల నీనినదో యనఁగాను, గిరిక జలసముద్భూత. అతిశయసౌందర్యాభి రామ. గిరికాజననవశమున జలతత్త్వము ప్రశస్తినొందఁ జూపోపక యంతకు మిన్నలగు సతుల భూమి గనకెంచి పెక్కండ్రు చెలువల నీనినటుల రూపవతులు గిరికాదర్శనమునకు వచ్చిరని భావము.

గణనమీఱి = లెక్క కెక్కువయై, పయోరూపగరిమమించు = పయోరూపముయొక్క గౌరవముచేత-అనఁగా భారముచేత నతిశయించుచున్న, లలనతోడన్ = గిరికాదేవితోడ, తులఁదూఁగఁజాలక= సరితూఁగలేక, భజించిరుపరిభాగంబులన్ = పైకిఁ బోయినారో యనునట్టులుగా, మ్రొగ్గవహించి= క్రిందనున్న గిరికాదేవితో సరితూఁగలేక మీఁది కెగసిరో యన్నట్టులుగా, చేదినృపలలామపట్టణపయోజముఖులు = వసురాజుయొక్క పట్టణమయిన యధిష్ఠానపురమందలి స్త్రీలు, అపుడు = అనఁగా సౌధోపరిభాగముల నెక్కి చూచుచున్నసమయమునందు, చూపట్టిరి = కనుపించిరి, ఈగీతి మొదటనున్న గణనమీఱి యనెడుపదము పయోజముఖుల్ చూపట్టిరన్నచోటి కన్వయింపవలయును.

కొమ్మంచున్ అనుట స్త్రీవాచకతత్సమాదులకు సంధిలేదను వ్యాకరణసూత్రముచే బాధితము. ఇటులె ఈయాశ్వాసమునందలి ఎనుబదవపద్యమునందును "అమ్మని" యనుచో స్త్రీవాచకసంధి గలదు. ఇట్టిసంధులు ప్రౌఢకవిప్రయోగములందుఁ గానరావు.

క. కమలోపమలోచన లా, కమలోపేంద్రులవిభాతిఁ గనఁ దగుజగదు
త్తమలోలాక్షీరమణులఁ, దమలో నెన్నుచు గుణార్హతమలోభమునన్. 66

కమలోపమలోచనలు = పద్మములవంటి కన్నులుగలస్త్రీలు, ఆకమలోపేంద్రులవిభాతిన్ = ఆలక్ష్మీనారాయణులవలె, కనఁదగు = చూడనొప్పుచున్న, జగదుత్తమలోలాక్షీరమణులన్ =లోకోత్తరులయిన స్త్రీపురుషులను-అనఁగా గిరికావసురాజులను, తమలోనెన్నుచున్ = తమలోఁ దాము స్తోత్రము సేయుచు, గుణార్హతమలోభమునన్ = గుణములచేఁ బూజ్యులైనవారియందలియాసక్తిచేత, ముందరి పద్యముతో నన్వయము.

చ. అమరబలాపకృష్ట మయి • యంబుధిఁ జేరి యొసంగెఁ బూరుషో
త్తమునకు మందరాగ మొక • తన్వి నదెంత యటంచు నీనగం
బమర నమందరాగ మయి • యావరసింధువుఁ జేరి పూరుషో
త్తమున కొసంగె నౌర వని • తామణి నంచు నుతించి రెంతయున్. 67

అమరబలాపకృష్టమయి = దేవతలచే బలాత్కారముగా నీడువఁబడినదై యనియర్థము. అమరసైన్యాపకృష్టమని భావము. (ని. 'స్థౌల్య సామర్థ్యసైన్యేషు బలమ్' అని అ.) అంబుధిఁజేరి = సముద్రమునఁ బ్రవేశించి, మందరాగము = మందమయిన యనురాగముగల మందరాచలము, ఒకతన్విన్ = ఒకచిన్నదానిని, పూరుషోత్తమునకొసంగెన్ =విష్ణుదేవునకిచ్చెను, అదెంతయటంచున్ =అదియేమి యెక్కువకార్యమని నిరాకరించుచు, ఈనగంబు = ఈకోలాహలాచలము, అమరనమందరాగమయి = ఒప్పిదమగునట్టులుగా నధికానురాగముగలదై, ఆవరసింధువుఁజేరి = శ్రేష్ఠమయిన యాసముద్రముఁజేరి యనియర్థము. శుక్తిమతీనదిని జేరియని భావము. సింధుశబ్దము సముద్రమందును నదియందును వర్తించును. (ని. 'సింధు స్సముద్రే నద్యాంచ' అని ని.) వనితామణిన్ = స్త్రీరత్నమును, పూరుషోత్తమునకొసంగున్ = విష్ణుదేవున కిచ్చె నని యర్థము. పురుషశ్రేష్ఠుఁడైన వసురాజున కిచ్చెనని భావము. ఔర=భళా, అంచున్ = అనిపలుకుచు, నుతించిరెంతయున్ = మిక్కిలి స్తోత్రము చేసిరి. పూర్వపద్యాంతమందలి, గుణార్హతమలోభమునన్, అనుపదము నీపద్యమునందలి నుతించి రెంతయున్ అను వాక్యమున కన్వయింపవలయును-

వరసింధుపదములోని వరశబ్దంబును వనితామణియన్న పదములోని మణిశబ్దంబును వ్యతిరేకమును దెలుపుచున్నవి. మందరాగము మందగించిన రాగముగలది. మఱియు సమరబలావకృష్టము. అట్లయ్యుఁ బురుషోత్తమున కొసంగిన దొకానొక తన్వి. కోలాహలుఁడు వరసింధువునుపొంది వనితామణి నొసంగెను. కావున నిది సతిపాత్రము. పురుషోత్తమునకుఁ దగినది తన్వికాదు వనితామణి. ఇట్టి లోకోత్తరవనితామణి నొసంగుటచేఁ గోలాహలుఁ డెంతయుఁ గొనియాడఁబడెను.

ఉ. కాంతికలాపరూపజిత•కంతుజయంతున కీవసుంధరా
కాంతునకుం జరాచరయుః•గంబున నీ డగుకాంత లేమి య
త్నాంతరశాలి యై విధి చ•రాచరయోజనచే సృజించెఁ గా
కింతి ఝరిం గిరిం బొడము•నే యని పల్కిరి కొంద ఱయ్యెడన్. 63

కాంతికలాపరూప జితకంతుజయంతునకున్ = కాంతిసముదాయముచేతను రూపముచేతను జయింపఁబడిన మన్మథుఁడును జయంతుఁడును గలిగిన, ఈవసుంధరాకాంతునకున్ = ఈవసురాజునకు, చరాచరయుగంబునన్ = జంగమములయందును, స్థావరములయందును, ఈడగుకాంతలేమిన్ = ఈడైన స్త్రీ లేనందున, యత్నాంతరశాలియై = నూతనముగా మఱియొకయత్నము చేసినవాఁడై, విధి = బ్రహ్మదేవుఁడు, చరాచరయోజనచే సృజించెఁ గాక = జంగమస్థావరములయొక్క పరస్పరయోగముచేత సృజించినాఁడేకాక, లేనట్టయిన, ఇంతి = స్త్రీ, ఝరింగిరిం బొడమునేయని పల్కిరి గొందఱయ్యెడన్ = నదీప్రవాహమువలనను బర్వతమువలనను నుత్పత్తియగునా యని కొంద ఱాసమయమందుఁ బల్కిరి.

వసురాజు కాంతికలాపశాలి, రూపజితకంతుఁడు. ఇట్టివానికి లోకోత్తరసౌందర్యవతి నాయిక కాఁదగినది. నలువ యొనర్చిన చరాచరములలో వసురాజున కీడగు చెలువ లేదు. విధి సామాన్యుఁడా? యత్నాంతరశాలి. చరము అచరమును సమకూర్చినఁ జరాచరములందులేని సౌందర్యవతి యుద్భవించునని శుక్తిమతీ కోలాహలులకుఁ బొందుఁ గూర్చెను. ఇది విధియత్నాంతరములేకున్న ప్రవాహమునకుఁ బాషాణమునకు బాలిక జన్మించుట యసాధ్యము. నది ప్రవహించునది గావునఁ జరము శైలము కదలనిది గావున నచరము. ఝరిగిరియనుటలో రెండవది నిందావాచకమయ్యుఁ గథ కన్వయించుట స్వారస్యము.

సీ. తరుణధూర్తశిఖావ•తంసున కొక్కకాత్యాయనిఁ గూర్చిన•యఱగొఱంత
రాజుతో సత్కళా•రాశితో నక్షత్రజాతిఁ దార్చినపక్ష•పాతరచన
యభినవచ్ఛాయతో • నతిదుస్సహచ్ఛాయఁ జేర్చిననేరని•చేతఁబట్టు
రతితో ననిందితా•కృతితో మధుపగుణంబులవానిఁ గూర్చిన•మోహసృష్టి
తే. సమవయోవంశలావణ్య•సద్గుణాభి, సుతులనీదంపతులశుభా•న్వితులసంఘటించివారించికొనియోవి•రించియనుచుఁ,బొగడిరొకకొంద ఱానంద•పూర్ణ ఫణితి.

తరుణధూర్తశిఖావతంసున కొక్కకాత్యాయనిఁ గూర్చినయఱగొఱంత = లేఁతవయస్సుగల విటాగ్రేసరునకు నొకయర్ధవృద్ధురాలిని - అనఁగా, సగము ముదిసినదానిని ఘటనచేసిన హీనదృష్టి అని యర్థము. (ని. 'కాత్యాయ న్యర్ధవృద్ధాయా కాషాయవసనా ధవా' అని అ.) తరుణ = నూతనమైన,

ధూర్త = ఉన్మత్తపువ్వు, శిఖావతంసునకున్ = శిరోభూషణముగాఁగల హరునకు, కాత్యాయనిం గూర్చిన = గౌరీదేవిని నర్ధదేహముగాఁ గూర్చిన, అరగొఱంత = అర్ధనారీశ్వరత్వ సృష్టి యని భావము. (ని. 'ధూర్తంతు ఖండలవణే ధుత్తూరే నావిటే త్రిషు' అని మేదిని.) శివుని ధూర్తకశిఖామణి యని వ్యవహరించుట గలదు.

చ. పలుచఁదనంబునొంది జడభావము నూనినవారి మౌళిపై
నిలిపి స్వవిగ్రహైకగతి నిచ్చలు నార్యమహాగుణోన్నతిం
గలియఁగఁ జేసి ధూర్తకశిఖామణివైతని గౌరి యల్లఁగా
నలఘుమృదూక్తి వేఁడు శివుఁ డాయతసౌఖ్యము మా కొసంగుతన్.

చంద్రికాపరిణయము. ప్ర. ఆ.

రాజుతో సత్కళారాశితో నక్షత్రజాతిఁ దార్చిన పక్షపాతరచన - సత్కళారాశితోన్ = సకల విద్యానిధియైన, రాజుతోన్ = క్షత్త్రియునితో, నక్షత్రజాతిఁ దార్చిన = క్షత్త్రేతరజాతినిగూర్చిన, పక్ష పాతరచన = పక్షపాతసృష్టి యని యర్థము. అనఁగా లోకములో జాతిగాని జాతిని గూర్చినాఁడు గనుక నిక్కడఁ బక్షపాతసృష్టి యనుట. (ఇక్కడ, న+క్షత్రమ్' సుప్సుపేతిసమాసః.) అని యైనను లేక అక్షత్రమ్ అని స్వరాదిగాఁ జెప్పి సంధిచేత నకారము వచ్చినదనియైనను జెప్పవచ్చును. షోడశ కళానిధియైన చంద్రునితో నశ్విన్యాది నక్షత్రములను గూర్చిన శుక్లపక్ష కృష్ణపక్ష పాతసృష్టి యని భావము. (ని. 'రాజా ప్రభౌ నృపే చంద్రే' అని వి.)

అభినవచ్ఛాయతో నతిదుస్సహచ్ఛాయుఁ జేర్చిన నేరనిచేతఱట్టు = కోమలమయిన ఛాయగల స్త్రీతో మిక్కిలి సహింపఁగూడవని ఛాయగల పురుషునిఁగూర్చిన సృష్టివలని యపవాదమని యర్థము. సంజ్ఞాదేవితో నతితీవ్రతేజుఁడయిన సూర్యునిఁగూర్చిన నేరనిసృష్టి యని భావము. అభినవచ్ఛాయ యన్నపదము స్త్రీసామాన్యవాచకము గనుక నిక్కడఁ బ్రకరణబలముచేత సంజ్ఞానామక స్త్రీ విశేషవాచక మయినదని గ్రహింపవలయును. లేక అభినవచ్ఛాయాదేవి యే స్త్రీవలననైనదో యది యభినవచ్ఛాయ యని సంజ్ఞాదేవియొక్క యౌగిక నామముగా నైనను గ్రహింపవలయును. సూర్యుని తీవ్రకిరణములు సహింపలేక సంజ్ఞాదేవి ఛాయాదేవిని నిర్మించి గృహమందు నిల్పి తాను దప మాచరింపఁ బోవుట విష్ణుపురాణమునందును స్కాందపురాణమునందును జెప్పఁబడియున్నది.

రతితో ననిందితాకృతితో మధుపగుణాంబులవానిఁ గూర్చిన మోహసృష్టి - అనిందితాకృతితోన్ = నిందితము గాని యాకృతిగల, రతితోన్ = రతీదేవితో, మధుపగుణాంబులవానిఁ గూర్చిన = మద్యపాయి గుణములు గలవానిని గూర్చిన, మోహసృష్టి = భ్రాంతిసృష్టి యని యర్థము. మధుపములు నారిగాఁగల మన్మథునిఁగూర్చిన సమ్మోహవిద్యాసృష్టి యని భావము. రతి స్తవనీయమగు నాకారవిశేషము గలది. అట్టి రూపవతికి ననంగుని మఱియుఁ ద్రాఁగుబోతును భర్తగాఁ గూర్చుట భ్రాంతిసృష్టి. ఒక యాకారము నందెగాక గుణములందుఁగూడ లోటుగూర్చుట మోహాతిశయమున గాన నట్టి సృష్టి గర్హ్యము.

సమవయోవంశలావణ్య సద్గుణాభినుతులన్ - సమ = సమానమయిన, వయః = వయస్సుచేతను, వంశ = వంశముచేతను, లావణ్య = కాంతిచేతను, సద్గుణ = శ్రేష్ఠగుణములచేతను, అభినుతులన్ = స్తుతి చేయఁబడిన, ఇక్కడఁ గ్రమాలంకారంబును సమశబ్దము వయోవంశలావణ్యసద్గుణములకు విశేషణంబును నని తెలియవలయును. శుభాన్వితులన్ = శుభలక్షణములతోఁ గూడిన, ఈదంపతులన్ = ఈ వధూ

వరులను, సంఘటించి = కూర్చి, విరించి = బ్రహ్మదేవుఁడు, వారించికొనియెన్ = పైనఁ జెప్పంబడిన సృష్టిదోషములనుఁ బోఁగొట్టుకొనెను, అనుచున్ = అని పలుకుచు, ఒకకొందఱానందపూర్ణఫణితిన్ = మఱికొందఱు సంతోషముచేతనైన సంపూర్ణవైఖరితోడ, పొగడిరి = స్తోత్రము చేసిరి.

బ్రహ్మకూర్చిన తొల్లింటిసంబంధములు నాలుగు వరుసగా వయస్సు, వంశము, లావణ్యము, గుణములందుఁ గొఱంతపడినవి. ఆలోపములన్నియు గిరికావసురాజుల వివాహము జతపఱచి వారించి కొనుటచే బ్రహ్మ పొగడికకుఁ దగెను. విధిఘటన మీయెడ నానందపూర్ణహేతువై ప్రజారంజన మయ్యెనని భావము.

మ. అవి యాలించుచు వేడ్క నచ్ఛతరముక్తాలంకృతంబై ద్విజ
ప్రవరాధిష్ఠిత మై యనంతమణిశోభానిత్యనీరాజనో
త్సవదం బై తెలిదీవిఁ బోలునిజసద్మంబుం బ్రవేశించె న
య్యవనీభర్త తరంగిణీప్రియసుతాహస్తాంబుజాలంబి యై. 70

అవనీభర్త యను పదము విష్ణువునకు వసురాజునకుఁ జెల్లును గావున నర్థద్వయము గ్రాహ్యము. అయ్యవనీభర్త = ఆ వసురాజని యర్థము. విష్ణుదేవుఁడని యర్థాంతరము. అవి యాలించుచున్ = పురజనులాడుకొనునట్టి యా వాక్యములను వించును, వేడ్కన్ = సంతోషముచేత, అచ్ఛతరముక్తాలంకృతంబై = స్వచ్ఛతరమౌక్తికాలంకృతమై యని రాజగృహపరమయిన యర్థము. పరిశుద్ధులైన ముక్తపురుషులచేత నలంకరింపఁబడినదై యని శ్వేతద్వీపపరమయిన యర్థము. ద్విజప్రవరాధిష్ఠితమైన = బ్రాహ్మణోత్తములచేత నధిష్ఠింపఁబడినదై యని గృహపరమయిన యర్థము. ద్విజప్రవరుఁడనఁగా గరుత్మంతుఁడు గనుక నాయనచేత నధిష్ఠింపఁబడిన దని శ్వేతద్వీపపరమయిన యర్థము. అనంతమణి శోభానిత్యనీరాజనోత్సవదంబై = అపరిమితరత్నకాంతులచేత నిరంతరమును నీరాజనోత్సవమును గలుగఁ జేయుచున్నదై యని గృహపరమయిన యర్థము. అనంతుఁ డనఁగా శేషుఁడు గాన నాయన ఫణామణి కాంతులచేత నిత్యనీరాజనోత్సవ ప్రదాయకమై యని శ్వేతద్వీపపరమైన యర్థము. తెలిదీవిఁ బోలు = శ్వేతద్వీపమును బోలుచున్న, నిజసద్మంబున్ = తనయొక్క గృహమును, తరంగిణీ ప్రియసుతాహస్తాంబుజాలంబియై - తరంగిణీ = శుక్తిమతీనదియొక్క, ప్రియసుతా = ప్రియకుమారిక యైన గిరికాదేవియొక్క, హస్తాంబుజాలంబియై = పద్మమువంటి హస్తముయొక్క యవలంబనము గలవాఁడై - అనఁగాఁ జేయిపట్టుకొన్నవాఁడై యని రాజపరమయిన యర్థము. తరంగిణీ ప్రియుఁ డనఁగా నదీనాథుఁడైన సముద్రుఁడు గనుక నాయనయొక్క సుతయైన లక్ష్మియొక్క హస్తావలంబనముగలవాఁడై యని విష్ణుపరమయిన యర్థము. ప్రవేశించెన్ = అనఁగా వసురాజు పురజనుల వాక్యములు వించు గిరికాదేవి చెయిపట్టుకొని పైని జెప్పఁబడిన విశేషణములతోఁ గూడిన నిజగృహమును బ్రవేశించె నని తాత్పర్యము.

అనంతమణికాంతులు నిత్యనీరాజనములవలె వెలుంగుటచేతను, నిర్మలములగు ముక్తాఫలములు కాంతిసంవృతములై ప్రజ్వరిల్లుటచేతను, రాజగృహము తెలిదీవివలె నుండెను. వసురాజు పౌరప్రశంసా వాక్యముల నాలించుచు గిరికాహస్తము గొని గృహప్రవేశము చేసెను.

వ. ఇట్లు శుభలగ్నంబునం గృశావలగ్నయుం దానును నమందవిభవసందీపితనిజ మందిరప్రవేశమంగళం బంగీకరించి గురుబుధకవిసమాజంబునకు నతిభాస్వ

రుచికలాపసౌభాగ్యంబు సంఘటించుచు రాజమండలంబునకు నక్షీణలక్ష్మీవిలాసంబుఁ గల్పించుచు మిత్రవర్గంబునకు నసంఖ్యాతరతురంగతరంగితశతాంగసంఘాతంబు నొసంగుచు మహానటులకు మహనీయచిత్రాంబరసంపదల సొంపు సంపాదించుచు విద్యాధరులకు విపులవిపులాధిపత్యంబు వెలయించుచు మఱియుం దక్షిణమార్గణగణంబులకు వేత్వేఱ నగణితఫలంబు లొదవించుచు విశ్వవిశ్వంభరాజనవిస్మయనీయవితరణచాతురీధురీణుం డై విలసిల్లు నవ్విబుధరాజబాంధవుండు వివిధకల్యాణగుణవిభాసితం బగునొక్కసమయంబున.

ఇట్లు = ఈప్రకారముగా, శుభలగ్నంబునన్ = శుభకరమైన ముహూర్తమందు, కృశావలగ్నయుం డానును = సూక్ష్మమయిన నడుముగల గిరికాదేవియును దానును, అమంద = అధికమయిన, విభవ = వైభవముచేత, సందీపిత = లెస్సగాఁ బ్రకాశింపఁ జేయఁబడిన, నిజమందిర = తనయొక్క గృహమందలి, ప్రవేశ = ప్రవేశయుక్తమయిన, మంగళంబు = శుభమును, అంగీకరించి = స్వీకరించి-అనఁగా గృహప్రవేశముచేసియనుట, గురు = గురువులయొక్కయు, బుధ = పండితులయొక్కయు, కవి = కవీశ్వరులయొక్కయు, సమాజంబునకున్ = సమూహమునకు, అతిభాస్వత్ = మిక్కిలి ప్రకాశించునట్టి, రుచి = కాంతులుగల, కలాప = భూషణములయొక్క, సౌభాగ్యంబునున్ = సౌష్ఠవమును, సంఘటించుచున్ = ఘటనపఱుచుచు అనియర్థము. గురుబుధకవిసమాజంబునకున్ = బృహస్పతి బుధశుక్రులకు, అతిభాస్వత్ = సూర్యాతిక్రాంతమయిన, రుచికలాప = కాంతిసమూహముయొక్క, సౌభాగ్యంబు సంఘటించుచున్ = సౌష్ఠవమును ఘటనపఱుచుచును, అని యర్థాంతరము. (ని. 'భాస్వాన్ భాస్వర సూర్యయోః' అని వి.) రాజమండలంబునకున్ = రాజసమూహమునకు, అక్షీణ = అక్షయమయిన, లక్ష్మీవిలాసంబున్ = సంపద్విలాసమును, కల్పించుచున్ = కలుగఁజేయుచును అని యర్థము. చంద్రమండలమున కక్షయశోభావిలాసమును గలుగఁజేయుచును అని యర్థాంతరము. (ని. 'శోభా సంపత్తి పద్మాసు లక్ష్మీ శ్రీశ్చరపి కథ్యతే' అని కోశము.) మిత్రవర్గంబునకున్ = సుహృజ్జనసమూహమునకు, అసంఖ్యాతర = అగణితములైన, తురంగతరంగిత = అశ్వములచేతఁ బరంపరితమైన-అనఁగా ననేకాశ్వములనుబూన్చిన, శతాంగసంఘాతంబు నొసంగుచున్ = రథసమూహము నిచ్చుచును అనియర్థము. ద్వాదశాదిత్యులకు నగణితతురంగయుక్తరథసమూహ మిచ్చినాఁడని యర్థాంతరము. మహానటులకు మహనీయచిత్రాంబరసంపదలసొంపు సంపాదించుచున్ = అధికులైన నటులకు యోగ్యములయినచిత్రవస్త్రసంపదలయొక్క సౌష్ఠవమును గలుగఁజేయుచును అని యర్థము. ఏకాదశరుద్రులకు యోగ్యమయిన చిత్రవర్ణముగల వ్యాఘ్రచర్మాంబరము లిచ్చినాఁడని యర్థాంతరము. విద్యాధరులకు విపులవిపులాధిపత్యంబు వెలయించుచున్ = విద్యావంతులకు విస్తారమయిన ధరాధిపత్యము గలుగఁజేయుచును అనియర్థము. దేవయోనివిశేషులైన విద్యాధరులకు భూపతిత్వము గలుగఁజేసినాఁడని యర్థాంతరము.

మఱియుం దక్షిణమార్గణగణంబులకు వేత్వేఱ నగణితఫలంబులొదవించుచున్ = మార్గణశబ్దము యాచకునియందును బాణమందును వర్తించును. (ని. 'మార్గణో యాచకే శరే' అని అ.) ఫలశబ్దము లాభమందును బాణాగ్రమందును వర్తించును. (ని. 'ఫలం లాభ శరాగ్రయోః' అని వి.) మఱియును మిగిలిన యాచకసమూహములకుఁ బ్రత్యేక ప్రత్యేకముగా నగణితలాభములను గలుగఁజేయుచును

అనియర్థము. బాణముల కొకటొకటి కనేకములయిన యగ్రము లొదవించినాఁ డని యర్థాంతరము. విశ్వ=సమస్తమైన, విశ్వంభరారాజన = భూజనులచేత, విస్మయనీయ = ఆశ్చర్యమును బొందఁదగిన, వితరణచాతురీ=దాతృత్వప్రవీణతయందు, ధురీణుండై=ధురంధరుఁడై, విలసిల్లి=ఒప్పినవాఁడై, ఇక్కడ నర్థాంతరములు విస్మయకరములని గ్రహింపవలయును. అవ్విబుధరాజబాంధవుండు = ఇంద్రసఖుఁడైన యావసురాజు, వివిధ=నానావిధములయిన, కల్యాణగుణ = శుభగుణములచేత, విభాసితంబగు = ప్రకాశింపఁబడుచున్న, ఒక్కసమయంబునఁ=ఒకానొకసమయమునందు, దీనికి ముందరిపద్యముతో నన్వయము.

సీ. అత్రాసవృత్తిఁ జెన్నలరినూతనరాగమహిమఁ గుల్కెడు కల్కి♦మానికములు
నవసమాగమమునఁ♦జవులు వక్కాణించి మించఁజాలు వెలంది♦మిన్నగములు
మరునితేజీలవై♦ఖరిఁ బొల్చి రతులనిరూఢిఁ జూపునితాంత♦రుచిరమణులు
ప్రౌఢపుంభావసం♦భావన ల్పచరించి ప్రబలువామాలోక♦రత్నతతులు

తే. గలయఁ గిలించి చిత్రించి ♦ కన్నియలకుఁ, గామ నిగమరహస్యప్ర♦కాశనం బొ
నర్పఁ బన్నినయాత్మీయ♦ నర్మభర్మ, హర్మ్యశ్రీ రాజంబునకు నేడ్క♦నరిగి యచట. 72

అత్రాసవృత్తిఁ జెన్నలరి = త్రాసమనఁగా బద్మరాగమణియొక్క షడ్విధదోషములలో భేదము. ఇందుకు రత్నపరీక్షయందు,

సీ. 'పగిలినగతి రేఖవైనున్నఁ ద్రాసంబు కలహ మెప్పుడు దానఁ గలుగుచుండు'

అని చెప్పఁబడియున్నది గనుకఁ, దద్దోషరహితవృత్తిచేత నొప్పుచున్నవై, నూతనరాగమహిమఁ గుల్కెడు=నవీనరక్తిమాతిశయముచేతఁ జక్కనగుచున్న, కల్కిమానికములు=సుందరమణులని యర్థము. అనఁగాఁ బద్మరాగమణులనుట, త్రాసమనఁగా లజ్జాకార్యమైన భయము గనుక నత్రాసవృత్తియనఁగా లజ్జాభయరహితవృత్తి. అనఁగాఁ బ్రౌఢత్వముగాన నట్టిప్రౌఢత్వముతోడ, చెన్నలరి = బాగుమీఱి, నూతనరాగమహిమఁగుల్కెడు=నవీనమైనయనురాగముచేత నొప్పుచుండెడు, కల్కిమానికములు = కాంతారత్నములును అనియర్థాంతరము. కలికియనఁగా సుందరమును గాంతయును, ని. 'కలికియొప్పిదంబు కాంతయయ్యె'అని యాంధ్రనిఘంటువు. కూటములలో గడితేఱి వెఱపుమఱచి క్రొత్తయనురాగమున మగలఁ దనియించుట ప్రౌఢచెలువలచేతలు. అట్టిచెలువలు కలికిమానికములు. సుందరీమణులని భావము.

నవసమాగమమునఁ జవులు వక్కాణించి = చవులనఁగా ముత్యాలయొక్క తులామానములు, ఇందుకు విజయవిలాసమందుఁ బ్రయోగము- సీ. 'చక్కెరమోవిచ్చి చవులఁదేలించు నీముత్యాలకమ్మల ముద్దులాడి' అనియున్నది. నూతనముగా వచ్చుటయందుఁ జవులు ప్రకటనపఱిచి, మించఁజాలు=అతిశయింపఁజాలిన, వెలందిమిన్నగములు = మేలైనరత్నములని యర్థము. అనఁగా ముత్యములనుట. నూతనసంభోగానుభవములను దేటపఱిచి యతిశయింపఁజాలిన స్త్రీరత్నములును అనియర్థాంతరము. వెలందియనఁగా మేలైనదియును మగువయును, ఇందుకుఁ బ్రయోగము విజయవిలాసమునందు, తే. 'ఈ వెలందియొద్దలై ప్పెడిలో వెలంది' అనియున్నది.

మరునితేజీలవై ఖరిఁ బొల్చి = మరునితేజీలనఁగాఁ జిలుకలు గనుక వానివలెఁ బ్రకాశించి- అనఁగాఁ బసరుగలిసినకాంతిచేతఁ బ్రకాశించియనుట, రతులనిరూఢిఁజూపు = రతులనఁగాఁ బచ్చలయొక్క తులామానములు, ఇందుకు విజయవిలాసప్రయోగము. సీ. 'అతివినోదముగాఁగ రతులఁ దేలించు నీపచ్చలకడియాలపద్మగంధి' అనియున్నది గనుక నట్టిరతులయొక్క నిరూఢిని గనుపఱుచు

చున్న, నితాంతరుచిరమణులు = మిక్కిలి ప్రకాశమానములగుచున్న మణులని యర్థము. పచ్చలనుట. మన్మథునిగుజ్జుములవలెఁ బ్రకాశించి సురతనిరూఢిగనుపఱుచుచున్న యతిశయకాంతి గలరమణులని యర్థాంతరము.

ప్రౌఢపుంభావ సంభావన లాచరించి = పుంభావమనఁగాఁ బురుషత్వము, ప్రౌఢ=ప్రవృద్ధమైన, పుంభావ = పురుషత్వముయొక్క, సంభావన లాచరించి=ప్రతీతులనుగనుపఱిచి-అనఁగాఁ బురుషరత్నము లనెడు ప్రతీతిని గనుపఱిచియనుట, ప్రబలు=బలిష్ఠములగుచున్న, వామాలోకరత్నతతులు = మనోహర ప్రకాశముగల రత్నసమూహము లనియర్థము. అనఁగా వజ్రములనుట, వజ్రములు పురుషరత్నము లని ప్రసిద్ధము. ప్రవృద్ధపురుషాయితరతియందలి బహుమానములను గనుపఱిచి విజృంభించుచున్న స్త్రీజన రత్నములును అని యర్థాంతరము.

కలయఁగీలించి చిత్రించి = అనఁగాఁ బైనిఁజెప్పఁబడిన పద్మరాగమౌక్తికమరకతవజ్రమణుల నంతటఁ జెక్కియనియును, స్త్రీరత్నములను జిత్తరువుగా వ్రాసియనియును గ్రమాలంకారము. కన్నియలకుఁ = నవోఢలకు, కామనిగమరహస్యప్రకాశనం బొనర్పఁ = మన్మథవేదరహస్యములను - అనఁగా సంభోగకేళీరహస్యములను బ్రకటముచేయుకొఱకు, పన్నిన = నిర్మించిన, ఆత్మీయనర్మభర్మ హర్మ్యరాజంబునకుఁ - ఆత్మీయ = స్వకీయమైన, నర్మ=క్రీడార్హమైన, భర్మ = సువర్ణమయమయిన, హర్మ్యరాజంబునకుఁ = శ్రేష్ఠతరమైన మేడకు, వేడ్క నరిగి= వేడుకచేతఁబోయి, అచటఁ=అక్కడను. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము. ఈసీసపద్యపు నాలుగుచరణములయందును బ్రౌఢలనే చెప్పినాఁడు.

హర్మ్యరాజము సువర్ణనిర్మితము. అందున్న చిత్తరువులన్నియుఁ గన్నియలకుఁ గామవేదరహస్య బోధకములుగా నుండెను. కన్నెలు సురతమునం దప్రౌఢలు. భయవతులుగాన మెలపుమై చెలిమిచేయ నగును. అందులకు సహకారముగఁ జిత్తరువులు శయ్యామందిరముల నలవరించిరి. అనురాగాతిశయము దెలుపుట, కూటమిలో రుచిఁజూపుటను, రతులలో నారితేరుట, మగచేఁతలొనర్చుట లోనగు క్రమాభివృద్ధి యాచిత్తరువులందుఁ గలదు. ఇదియ కన్నియలకుఁ గామశాస్త్రరహస్యములఁ గ్రమముగా బోధించువైఖరి. మహిమగుల్కుట, మించజాలుట, నిరూఢిఁజూపుట, ప్రబలుట యాయాచిత్తరువుల యందుఁగల కామశాస్త్రానుభవమునకుఁ దార్కాణలు. ఇట్టిగృహములో నవోఢతోఁ బ్రవేశించుట రాజునకు వేడుక కలిగించుట సాజము.

సీ. బందీకృతాన్యరా♦డ్భవనలక్ష్మీపరంపరలు నిట్టూరుపు ♦ లూరపుకరణిఁ
పుంజీకృతస్నేహ♦భూరిమోహనశక్తు లనురాగకళికలఁ ♦ బెనఁచుకరణి
నంగీకృతాంగచై♦త్రాధిదేవత లాత్మ సుమచోరుమచ్చంబు ♦ చూపుకరణిఁ
బ్రకటీకృతానంత♦రతిమూర్తులు లతాంతశరశాస్త్రసంచిక ♦ ల్సాఁచుకరణి
తే. యంత్రపాంచాలికలు గొన్ని ♦ యగురుధూప
వితతి వెడలింపఁ గొన్నిదీ♦వియలు దాల్పఁ
గొన్ని విరివీవనలు వీవఁ ♦ గొన్ని పసిఁడి
తళుకుఁదెలనాకు లొసఁగ సం♦తసము లెసఁగ.

బందీకృత = చెఱఁబెట్టఁబడిన-అనఁగాఁ గైదుచేయఁబడిన, అన్యరాట్ = శత్రురాజులయొక్క,

భవనలక్ష్మీపరంపరలు = గృహలక్ష్మీశ్రేణులు, నిట్టూరుపుల్వరపుకరణిన్ = నిట్టూర్పులుపుచ్చునట్లుగాను, భవనలక్ష్ములనుటచేఁ జిత్తరువుల యసామాన్య సౌందర్యాతిశయము వ్యంజితము. భవనలక్ష్ములబలలు. బందీకృతలగుటచే నేమియుఁ జేయఁజాలక సంతాపసూచకముగ నిట్టూర్పులుమాత్రము విడువసాగిరి. ఇది యగురుధూపము.

పుంజీకృత = సంపూర్ణముగాఁజేయఁబడిన, స్నేహ = విశ్వాసముగల, భూరి = అనేకములైన, మోహనశక్తులు = సమ్మోహనశక్తులు, అనురాగకలికలఁబెనఁచుకరణిన్=అనురాగకోరకముల నవలంబించి నట్లుగాను, అనియర్థము. ఇక్కడ మోహనశబ్దము భావార్థరహితల్యుట్ప్రత్యయాంతము. స్నేహ మనఁగాఁ జమురును భూరియనఁగాఁ గనకమునుగనుకఁ బుంజీకృతస్నేహకనకమయసుందరశక్తులనియును నర్థము. ఇక్కడ మోహనపదము కర్త్రర్థవిహితల్యుట్ప్రత్యయాంతము. ఇట యంత్రపాంచాలికలు గావించు దీవియలు దాల్చుట గ్రాహ్యము.

అంగీకృత = స్వీకరింపఁబడిన, అంగ = దేహములుగల, చైత్రాధిదేవతలు=వసంతాధిదేవతలు, ఆత్మ సుమచోరు = తమపువ్వులదొంగయొక్క, మచ్చుంబుచూపుకరణిన్ = గుఱుతుచూపినట్లుగాను, పూవు లతోఁగట్టఁబడినసురటీలు మేనుదాల్చిన వసంతాధిదేవతలవలె నుండెను. అందుండి వీచునపుడు తావి గాడ్పులు బయలువెడలుట. వాయువు తమకుసుమసుగంధములు కొల్లగొనినవిధము చూపునట్లుగ నుండె ననిభావము. ఇందుఁ బాంచాలిక లొనర్చువీవనల వీచుటలు చెప్పఁబడెను.

ప్రకటీకృత = ప్రకటముగాఁజేయఁబడిన, అనంత = అపరిమితములైన, రతిమూర్తులు = ఇచ్ఛా మూర్తులు, లతాంతశరశాస్త్రసంచికల్సాఁచుకరణిన్=మన్మథశాస్త్రపుసంచికలందిచ్చునట్లుగాను, యంత్ర పాంచాలికలుగొన్ని తాంబూలముల నందీయసాగెను. ఇదియిచ్ఛామూర్తులు కామశాస్త్రసంపుటములను జదివికొనఁ గోడెకాండ్ర కొసంగుచున్నటులుండెనని భావము.

యంత్రపాంచాలికలు = జంత్రపుబొమ్మలు-అనఁగా కీలుబొమ్మలు, కొన్నియగురుధూపవితతివెడ లింపన్ = కొన్నియగురుధూపసమూహములను బయలువెడలించుచుండఁగాను, కొన్నిదీవియలుదాల్పన్ = కొన్నిదీపములు పట్టఁగాను, కొన్నివిరివీవనలువీవన్ = కొన్నిపూసురటులువిసరఁగాను, కొన్నిపసిఁడితళుకు తెలనాకులొసఁగన్ = కొన్ని బంగారువరకువేసిన పండుటాకులియ్యఁగాను, అని క్రమాలంకారము. సంతసము లెసఁగన్ = సంతోషము లతిశయింపఁగాను, ముందరిపద్యముతో నన్వయము.

చ. చికిలిపసిండిప్రాఁతనును◆చెంద్రికపన్నియమేలుకట్టునం
జకచకపర్వఁ గ్రొవ్విరులు ◆ చంపకముల్సవిఁ దేంట్లు మూలిము
ట్టక నవకంపుఁగెంపుమొగ ◆ డల్గని రాఁ దెలిముత్తియంపుబ
ల్సకినలకూకలం గిలకిల న్నగుఁమోహనశయ్య నున్నెడన్. 74

చికిలిపసిండిప్రాఁత = తళుకుగలబంగారుప్రాఁతపనిగలిగిన, నును=మృదువైన, చెంద్రికపన్నియ= చంద్రకాంతిరంగుగల, మేలుకట్టునన్ = చాందినీయందు, చకచకపర్వన్ = చకచకమెఱయుచుండెడు కాంతివ్యాపింపఁగాను, క్రొవ్విరులు = అచాందినీయం దలంకరింపఁబడినపుష్పములను, చంపకము ల్సవిన్=సంపంగిపువ్వులనెడు భ్రాంతిచేత, తేంట్లు = తుమ్మెదలు, మూలిముట్టక=ఆస్వాదింపక, నవకంపుఁ గెంపుమొగడల్గనిరాన్ = శయ్యయందలి నేవళమయినపద్మరాగమణులచేతఁ జేయఁబడినమొగ్గలను జూచి మొల్లనిపువ్వులని భ్రాంతిపడి రాఁగా, తెలిముత్తియంపుబల్సకినలకూకలన్ = తెల్లనిముత్యములు

గూర్చిన కీఁచుబిళ్ళలమ్రోఁతలనెడువ్యాజముచేత, కిలకిలన్నగు = అపహసించుచున్న, మోహనశయ్యనున్నెడన్ = మోహనకరమయిన పానుపుమీఁదఁ బ్రవేశించియున్నసమయమునందు. ఈపద్యమునకు ముందరిపద్యముతో నన్వయము.

శయనగృహమునం దమర్పఁబడిన మేలుకట్టు (చాందిని) పైనున్న పుష్పాదిచిత్రములు పసిండివ్రాఁతమెఱుంగులచే సంపంగిపూవులవలెనుంటచేఁ దుమ్మెదలు ముట్టవెఱచి శయ్యాస్థగిత పద్మరాగములను రక్తాంభోజములని వ్రాలుచుండెను. తాఁకినంతనఁ గీచుకీచుమని మ్రోఁగుముత్తెములు చెక్కినదిండ్లు తుమ్మెదలతెలివితక్కువకు నవ్వునటు లుండెను.

సావియనుటకు రూపాంతరము సవి. ఇందులకు భ్రాంత్యర్థమునఁ బ్రయోగము-

చ. తలపక్షచ్ఛటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁగుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుపస్నానప్రయాతద్విజా
వళి పిండీకృతశాటులన్ సవి తదావాసంబు జేరంగ రే
వులు డిగ్గన్ వెసఁబాఱు వానిఁగని నవ్వున్ శాలిగోప్యౌఘముల్.

ఆముక్తమాల్యద. ఆశ్వా. ౧.

శా. ఆకోలాహలశైలసంభవ రసవ్యాకృద్ఘనాళీప్రయ
త్నైకప్రస్థిత యై ప్రతిక్షణసభంగారాళసంచార యై
వ్యాకీర్ణాంబరఫేన యై పిహితవక్త్రాబ్జస్ఫురద్వేణి యై
శ్రీకల్యాణగుణార్ణవుం డలర వచ్చె న్నూత్నరాగంబునన్. 75

ఆకోలాహలశైలసంభవ = కోలాహలపర్వతమువలన జన్మించిన యాగిరికాదేవియని యర్థము. సెలయేఱని యర్థాంతరము. సర్వత్ర రూపకము చెప్పవలయును. రసవ్యాకృద్ఘనాళీప్రయత్నైకప్రస్థితయై-అనఁగా, రస = శృంగారరసమును, వ్యాకృత్ = వెదచల్లుచున్న, అనఁగాఁ దెలియఁజేయుచున్న, ఘనాళీ=అధికురాండ్రైన సఖులయొక్క, ప్రయత్న=ప్రయత్నముచేతనే, ఏకప్రస్థితయై = ముఖ్యముగాఁ దరలుచున్నదై యని గిరికాపరమయిన యర్థము. రస = ఉదకమును, వ్యాకృత్ =వెదచల్లుచున్న-అనఁగా వర్షించుచున్న, ఘనాళీ = మేఘపంక్తియొక్క, ప్రయత్నముచేతనే ముఖ్యముగాఁ బ్రవహించుటగలదై యని యర్థాంతరము. ప్రతిక్షణసభంగారాళసంచారయై-ప్రతిక్షణ = ప్రతిక్షణమును, సభంగ= తొట్రుపాటుతోఁగూడిన, అరాళ = కుటిలమయిన, సంచారయై = గమనముగలదై యని యర్థము. ప్రతిక్షణమును దరంగయుక్తమయినదియును వక్రమయినదియునగు సంచారముగలదై యని యర్థాంతరము. వ్యాకీర్ణాంబరఫేనయై-వ్యాకీర్ణ = వ్యాప్తమయిన, అంబరఫేనయై= తెల్లని నురుగువంటి వస్త్రముగలదైయని యర్థము. వ్యాకీర్ణమయిన గగనముగలిగిన నురుగులుగలదై యని యర్థాంతరము. పిహితవక్త్రాబ్జస్ఫురద్వేణియై - పిహిత=ఆచ్ఛాదింపఁబడిన, వక్త్రాబ్జ=ముఖకమలముగలిగిన, స్ఫురత్ = ప్రకాశించుచున్న, వేణియై = జడగలదై యని యర్థము. ఆచ్ఛాదింపఁబడిన ముఖసదృశకమలములుగలదై ప్రకాశించుచున్న పాయలుగలదై యని యర్థాంతరము. శ్రీకల్యాణగుణార్ణవుండలరన్ =సంపత్కరములయిన శుభగుణములకు సముద్రుఁడయినవసురాజు సంతోషించునట్లుగానని యర్థము. శుభగుణములుగల

సముద్రుఁడు సంతోషించునట్లుగానని యర్థాంతరము. నూత్నరాగంబునన్ =అభినవానురాగముచేత నని యర్థము. అరుణిమచేతనని యర్థాంతరము. వచ్చెన్=ఏఁగుదెంచెను.

గిరికాదేవిని చెలులు బలవంతముగాఁ గొనివచ్చుచుండ వెనుకడుగు మాటిమాటికి వేయుచుఁ బెన్నెఱివిరియ మోము మఱుగుపఱచికొనుచు ననురాగము రేకెత్తి వసురా జానందించుచుండ నరుదెంచె ననిభావము.

ఉ. వచ్చి నృపాలకేళిగృహవాటము నెచ్చెలిపిందుచాటునం
జొచ్చి మెఱుంగుదేరుతొగచుట్టపుఁ దా మొగరంబుమాటుగా
నచ్చపలాక్షి నిల్వ నది యవ్వల భర్తకుఁ జూపె రాచసొ
మ్మెచ్చట నైన నిత్యశుచివృత్తులు మాటికొనంగ నేర్తురే. 76

వచ్చి = పైనిజెప్పఁబడిన ప్రకారముగా నరుగుదెంచి, నృపాలకేళిగృహవాటమున్ = వసురాజు యొక్క క్రీడామందిర ప్రదేశమును, నెచ్చెలిపిందుచాటునంజొచ్చి = చెలికత్తియలగుంపుమఱుఁగునఁ బ్రవేశించి, మెఱుంగుదేరు తొగచుట్టపుఁదా మొగరంబుమాటుగాన్ = మెఱయుచున్న చంద్రకాంత శిలా స్తంభముచాటుగా, అచ్చపలాక్షినిల్వన్ = ఆగిరికాదేవి నిలిచియుండఁగా, అది = ఆ స్తంభము, అవ్వలన్ = ఆపిమ్మట, భర్తకుఁజూపెన్ = పెనిమిటియైన వసురాజునకుఁ గనుపఱచెను, రాచసొమ్మెచ్చటనైనన్=రాజద్రవ్యమెక్కడనైనప్పటికిని, నిత్యశుచివృత్తులు=నిరంతరపరిశుద్ధవృత్తిగలవారనియర్థము. స్వచ్ఛవృత్తిగలవియనిభావము. మాటికొనంగనేర్తురే = దాచిపెట్టుకొనఁజాలుదురా-అనఁగాఁజాల రనుట.

చంద్రకాంత స్తంభము మెఱుంగులుదేరి యుండెను. గిరిక చెలులచాటున శయనమందిరము చేరి తనమేను చంద్రకాంతశిలా స్తంభమునకు మాటుపఱచి నిలచెను. నిత్యశుచివృత్తులు రాజధనము మాటి కొనరుగావున చంద్రకాంతశిలనుండి గిరికాస్వరూపము రాజునకు గోచరించెను.

మ. నవరత్నప్రతిబింబదంభమున నన్నాళీకపత్రాక్షిఁ ద
త్సవయోరూపసఖుల్ భజింపఁ గని లజ్జాయుక్తిమైఁ బోలె నా
ళివితానం బొకనేర్పున న్వెడల నిల్చెం దాన వ్రీడావయ
స్యవధూటీలలితాంతరంగచిరసఖ్యాభ్యాసబంధంబునన్. 77

నవరత్న = గృహసంబంధములైన నూత్నరత్నములయందలి, ప్రతిబింబ = నీడలనెడు, దంభమునన్ = వ్యాజముచేత, అన్నాళీకపత్రాక్షిన్ = ఆగిరికాదేవిని, తత్సవయోరూపసఖుల్భజింపన్ = ఆగిరికాదేవికి సమానమయినవయస్సును రూపమును గలసఖులు సేవింపఁగా, కని = చూచి, లజ్జాయుక్తిమైఁబోలెన్ = సిగ్గుతోఁగూడుకొనుటచేతవలె, ఆళివితానం బొకనేర్పునన్వెడలన్ = సఖీ సమూహ మొక్కొక్కనేర్పుచేత వెళ్ళఁగా, తాన=తానుమాత్రమే, వ్రీడా = లజ్జయనెడు, వయస్యవధూటీ = చెలికత్తెయొక్క, లలిత=మనోహరమైన, అంతరంగ = మనస్సుగలిగిన, చిర = చిరకాలజనిత మయిన, సఖ్య = స్నేహమందలి, అభ్యాసబంధంబునన్ = పరిచయానుబంధముచేత, నిల్చెన్ = నిలిచి యుండెను.

సఖీసమూహము గిరికాదేవియొక్క ప్రతిబింబములను గిరికాదేవికి సమానవయోరూపసఖు లని భ్రాంతినొంది తాము సమానవయోరూపవతులు కారు గనుక నాసిగ్గుచేతవలె నొక్కొక్కరని గల్పించు

కొని వెళ్ళఁగానే గిరికాదేవి సిగ్గనెడుచెలికత్తెతో నిలిచెనని తాత్పర్యము. "సలజ్జాగణికానష్టా నిర్లజ్జాచ కులాంగనా, అన్యదాభూషణం పుంసాం...లజ్జైవయోషితాం" అనునట్టిసుభాషితములవలనఁ గుల కాంతలకు లజ్జ యలంకారమని చెప్పఁబడుచున్నది. యౌవనప్రాదుర్భావమునకు మున్నె చెలువలకు లజ్జ యంకురించును. చిరకాలసఖ్యముగల లజ్జమాత్రము గిరిక నాశ్రయించియుండెను. లజ్జకును గిరికకు గల చెలిమి అంతరంగచిరకాలాభ్యాసబాధము గావున విడిచిపోఁజాలదయ్యెను. పూర్వపరిచితలగు చెలుల విడిచిపోయిన కారణము ప్రతిబింబములు సవయోరూపసఖులని.

సీ. అంబుజాంబకుపూన్కి ♦ నతనిర్మలస్థాణువున మించువామార్ధ♦తను వనంగ
మోహకాగ్రణియత్న♦మునఁదోఁచి మగుడఁ గంబముఁజేరుజంత్రంపుఁ♦బ్రతిమ
సహకారతరుపరి♦గ్రహమునఁదగియుపఘ్నావాప్తియెడలని♦తీవయనఁగ [యనఁగ
మావంతుప్రార్థనా♦మహిమ నాలానంబు దరలి వచ్చుమనోజ♦దంతి యనఁగ
తే. నట్టిరమణుండు దివియ సౌ♦హార్యతనయ
విధుమణిస్తంభమున నర♦వెడలి బయలు
పడి పెనంగుచు మరలి కం♦బ మొకకేల
నూని యూఁతయుఁ దక్కి పొ♦న్పొయ్యఁ జేరె. 78

అంబుజాంబకుపూన్కిన్ = మన్మథునిపూనికచేత, అతినిర్మల స్థాణువునమించు = అత్యంతధవళ వర్ణుఁడైన హరునియందు విలసిల్లుచున్న, వామార్ధతను వనంగన్ = వామార్ధతనురూపగౌరియో యన్నట్లుగానని యర్థము. అంబుజాంబకుఁ డనఁగా నంబుజములవంటి కన్నులుగల వసురాజనియును అతి నిర్మలస్థాణువున ననఁగా నతిస్వచ్ఛవిధుమణిస్తంభమం దనియును వామార్ధతనువనఁగా వామయొక్క, అనఁగా సౌందర్యవతియైన గిరికాదేవియొక్క యర్ధదేహ మనియును నర్థాంతరము. (ని. 'స్థాణుః కీలే స్థిరేహరే' అని వి.)

మోహకాగ్రణియత్నమునఁదోఁచి = అనఁగా సూత్రధారియొక్క ప్రయత్నముచేత నావిర్భ వించి యని యర్థము. భువనమోహన సౌందర్యశాలియైన వసురాజుయొక్క యత్నముచేతఁ గనుపడి యని యర్థాంతరము. మగుడఁగంబముఁజేరు = తిరుగా స్తంభము జేరుచున్న, జంత్రంపుఁ బ్రతిమ యనఁగన్ = కీలుబొమ్మయో యన్నట్లుగాను, యంత్రపుబొమ్మలు లోకోత్తరసౌందర్యవిరాజితములు. వాని క్రీడాదికములు సూత్రధారి యాధీనమునం దుండును. క్రీడాంతమున యథాస్థానమగు స్తంభము మఱుఁగుఁజేరును. రాజు గిరికను లాగుట మఱుఁగువదలుటగను వదలించుకొని మఱుఁగుఁజేరుట స్తంభముచాటు చేరుటగ నుండెనని భావము.

సహకారతరుపరిగ్రహమునఁ దగి=అనఁగా రసాలవృక్షముయొక్క పట్టుచేత నమరి యని యర్థము. సహృదయశ్రేష్ఠుఁడయిన వసురాజుయొక్క పరిగ్రహముచేతనని యర్థాంతరము. ఉపఘ్నావాప్తియెడలని తీవయనఁగన్ = ఉపఘ్నమనఁగా సమీపాశ్రయము, గనుక దానియొక్క పొందికను వదలకుండునట్టి తీఁగెయో యన్నట్లుగాను, (ని. 'స్యాదుపఘ్నోఽంతికాశ్రయే' అని అ.)

మావంతు ప్రార్థనామహిమన్ = మావంతుఁడనఁగా మావటీఁడని యర్థము. మాయనెడు పదము లక్ష్మియందు వర్తించును. గనుక శ్రీమంతుఁడయిన వసురాజని యర్థాంతరము. మావంతునియొక్క

ప్రార్థన మహిమచేత, అనఁగా బుజ్జగింపుమాటలయొక్క సామర్థ్యముచేత, ఆలానంబుదరలివచ్చు మనోజ దంతియనఁగన్ = ఏనుఁగుయొక్క కట్టుగంబమునుండి కదలివచ్చునట్టి మన్మథగజమో యన్నట్లుగాను, ని. 'ఆలానంబంధన స్తంభే' అని అ. ఇక్కడ బంధన స్తంభ మనఁగా గజబాధ స్తంభము.

అట్టిరమణుండుదివియన్ = అటువంటి పెనిమిటి చెయ్యిపట్టి తియ్యఁగా, ఇక్కడ అట్టి యనెడు పదము అంబుజాంబకాది పదములయొక్క యర్థాంతరము నావిష్కరణము సేయుచున్నది. అహార్య తనయ = గిరికాదేవి, విధుమణి స్తంభమున నరవెడలి = చంద్రకాంత మణిస్తంభము వల్లనుండి సగము తొలఁగినదై, బయలువడిపెనఁగుచున్ = స్తంభమువదలియును రాక పెనఁగులాడుచు, మరలికంబమొక కేలనూని = తిరుగా స్తంభమొకచేతఁ బట్టుకొన్నదై, ఊఁతయుఁ దక్క = స్తంభము పట్టుకొనుట మాని, పాన్పొయ్యఁ జేరన్ = పానుపుమీఁదికిఁ దిన్నగాఁ బ్రవేశించెను.

వారునియందు విలసిల్లుచున్న యర్ధదేహముగల పార్వతివలెనే చంద్రకాంతమణి స్తంభమునుండి సగము తొలఁగియును, సూత్రధారియొక్క యత్నముచేత నావిర్భవించి తిరుగ స్తంభము చేరుచున్న జంత్రపుబొమ్మవలెనే బయలుపడి పెనఁగుచును, రసాలవృక్షావలంబనము గలిగియు సమీపాశ్రయా వాప్తిని వదలని తీఁగెవలెనే వసురాజుచేతఁ బట్టువడియును దిరుగ స్తంభమొకచేతఁ బట్టుకొనియును మావంతుని ప్రార్థనముచేతఁ గట్టుగంబము దరలివచ్చిన మన్మథగజమువలెనే స్తంభము పట్టుమానియును గిరికాదేవి నాథుఁడు లాఁగఁగా మెల్లఁగ శయ్యఁ జేరెను. పెనఁగిలాగ కంబము దాఁటి కొంచెము సాగి, మరలఁ జాటున కేఁగి, కేల కంబము పట్టుకొని, చివరకు బుజ్జగింపుమాటలతో గిరిక శయ్యమీఁదికి మెల్లఁగఁ జేరెనని భావము.

మ. మృదుకర్ణోత్పలసంగతాళిరవభూరిప్రేరణన్బోలెఁ ద
త్సదనాధారము మాని మానిని సదాధారంబు భూభృజ్జయా
స్పదదోస్స్తంభము డాయఁ దాదృశభుజస్తంభోచ్ఛ్రయాసూయ న
భ్యుదితస్తంభము లయ్యె నంబకము లాభూమండలస్వామికిన్. 79

మృదు = కోమలమయిన, కర్ణోత్పల = చెవియందలి నల్లగలువతోడ, సంగత = కూడుకొన్న, అళిరవ = తుమ్మెదయొక్క ఝుంకారమనెడు, అళిరవ = సఖీవాక్యరవమువలని, భూరిప్రేరణన్బోలెన్ = అతిశయప్రేరేపకత్వముచేతవలె, తత్సదనాధారము మాని, తత్ = ఆ, సదనాధారముమాని = సత్పురుషుల కనాధారమయిన స్తంభమును విడిచిపెట్టి యని యర్థము. సదనముయొక్క యాధారమునని భావము. మానిని = గిరికాదేవి, సదాధారంబు = సజ్జనుల కాధారమయిన యని యర్థము. శ్రేష్ఠమైనయాధారమని యర్థాంతరము. భూభృజ్జయాస్పదదోస్స్తంభమున్ - భూభృత్ = వసురాజుయొక్క, జయాస్పద = జయమున కాస్పదమయిన, దోస్స్తంభమున్ = భుజమనెడు స్తంభమును, డాయన్ = హత్తుకొనఁగా, తాదృశభుజస్తంభోచ్ఛ్రయాసూయన్ = అట్టిభుజాస్తంభముయొక్క యతిశయమునందలి యసహిష్ణుత చేతనని యర్థము. భుజౌన్నత్యమని భావము. అంగకములు = అవయవములన్నియు, ఆ భూమండల స్వామికిన్ = ఆ వసురాజునకు, అభ్యుదితస్తంభములయ్యెన్ = అభ్యుదయమును బొందుచున్న స్తంభము లాయెనని యర్థము.

శ్లో. 'స్తంభ స్స్యాన్నిష్క్రియాఙ్గత్వం రాగభీత్యాదిసమ్భవమ్' అని చెప్పంబడియున్నది నుక నభ్యుదితమయిన స్తంభాఖ్య సాత్త్వికభావము గలవాఁడాయెనని భావము. అనఁగా గిరికాదేవి

చంద్రకాంతమణిస్తంభమును వదలి శయ్యపైకి వచ్చి వసురాజుయొక్క భుజస్తంభమును హత్తఁగానే వసురాజునకు స్తంభమనెడు సాత్త్వికభావముదయించి, సర్వావయవములును నిశ్చలములై యుండె నని తాత్పర్యము. గిరిక చెవియందున్న నల్లగలువలోని తేటిపాట గిరికతో రాజును డాయుమని ప్రోత్సహించునటులుండెను. స్తంభము సత్+అనాధారముగాన దానివదలి సత్+ఆధారమగు జయాస్పదమగు రాజు దోస్స్తంభమును డాయుమనెను. స్తంభమను సాత్త్వికభావలక్షణము.

చ. కలికి నృసింహభూవరునిఁ గన్గొని నిశ్చలగాత్రవల్లియై
యలరువిలాసచేష్ట లొలయం గలయంగ నటింపఁజేయునా
వలపులసూత్రధారుఁ డనవద్యనృపాకృతిఁ జూచి తాను ని
శ్చలత వహింపఁగాఁ గదలఁజాలనిజంత్రపుబొమ్మయో యనన్. నరసభూపాలీయము. తృ.

సాత్త్వికభావాదులు స్త్రీకే గాక పురుషులకు నుదయించు ననుటకు లక్ష్యములు పెక్కులు గలవు గాని విస్తరభీతిచే వదలితిమి. రసమంజరిలోని శ్రీకృష్ణుని రోమాంచమును గూర్చిన యీక్రిందిశ్లోకమును జూచి యిట్టి యన్యములు పరికించునది.

శ్లో. "ఏతత్పరిస్ఫురతి పద్మదృశాంసహస్ర, మక్షిద్వయం కథయ కుత్ర నివేశయామి
ఇత్యాకలయ్య నయనాంబురుహే నిమీల్య, రోమాంచితేన వపుషా స్థిత మచ్యుతేన."

క. అమ్ముదితరత్నకటకచ, య మ్ముదితనినాద మయ్యె • నయ్యెడఁ జల మే
ల మ్మని పలితోఁ దగు మే, ల మ్మని సహజానురక్తి • లాలించు క్రియన్. 80

అమ్ముదిత = ఆగిరికాదేవియొక్క, రత్నకటకచయమ్ము = రత్నమయములయిన గాజులయొక్క సమూహము, అయ్యెడన్=ఆసమయమందు, ఉదితనినాదమయ్యెన్ = పుట్టినధ్వని గలదాయెను. ఏలాగనిన, చల మేలమ్మని = చలమెందుకమ్మా అనియును, పలితోఁదగుమేలమ్మని = పెనిమిటితో సరసోక్తులాడుట తగుననియును, సహజానురక్తిన్=తోడఁబుట్టినదానియందలి యనురాగముచేత లేక సహజప్రేమచేత, లాలించుక్రియన్=బుజ్జగించునట్లుగా, ఉదితనినాదమయ్యెనని సంబంధము.

ఇక్కడ గిరికాదేవియును రత్నములును సహజవస్తువులు గనుక, అనఁగా గోలాహలాద్రివలనఁ గాని శుక్తిమతీనదివలనఁ గాని కూడఁబుట్టినవారు గనుక సహజానురక్తియని చెప్పినాఁడు. కోలాహలాద్రియందుఁ బద్మరాగాదిరత్నములును శుక్తిమతియందు ముత్యములును బుట్టుచున్నవని తెలియవలయును. గిరిక సిగ్గుపెంపున నణంగియుండ రాజు మెలపుమెయి చుంబనాదులు నీవి కంచుకగ్రంథిమోక్షణాదులు చేయఁదొడఁగెను. గిరిక వారించుచుండఁ గరకంకణాదులు మ్రోఁగెను. కంకణములు రత్నములు గానఁ దోఁబుట్టువనుప్రేమతో గిరిక నొప్పించుటకు లాలించునటుల మొరసెనని భావము.

శా. ఆశారోధక మావృతాంబర మనూ•ధాలోక ముచ్చైస్స్తనో
ద్దేశప్రావరణంబు నై యలఘువృ•త్తిన్ శ్యామమందాక్షము
ద్రాశుంభత్తిమిరంబు పర్వ మదనా•ధ్వన్యుండు ఖిన్నాత్ముఁ డై
యాశించె న్గమనీయరాజకరలీ•లాలంబసంచారమున్. 81

ఈపద్యమందు మందాక్షముద్రాశుంభత్తిమిరంబు అని చెప్పుటచేత నంతపర్యంతంబును నర్థద్వయము. ఏలాగనిన, ఆశారోధకము = ఇచ్ఛాప్రతిబంధక మని మందాక్షపరమయిన యర్థము. దిక్కి

రోధక మని తిమిరపరమయిన యర్థము. ఆవృతాంబరము = కప్పుకొనఁబడిన యుత్తరీయముగలదని యర్థము. ఆవరింపఁబడిన గగనభాగము గలదని యర్థాంతరము. అనూఢాలోకము = పొందఁబడని చూపుగలదని యర్థము. పొందఁబడని కాంతిగలదని యర్థాంతరము. 'వహప్రాపణే' అనెడు ధాతువు మీఁద ఊఢశబ్దము నిష్పన్నమయినది. ఉచ్చైస్స్తనోద్దేశప్రావరణంబుగా = ఉన్నతస్తనోపరిప్రదేశప్రావరణ మని యర్థము. ఉన్నతప్రదేశప్రావరణమని యర్థాంతరము. ప్రావరణమనఁగా ముసుఁగు, ఐ= అయినదై, అలఘువృత్తిగా = అధికవర్తనముచేత, శ్యామమందాక్షముద్రాశుంభత్తిమిరంబుపర్వగా = మందాక్షము శ్యామలవర్ణమని కవిసంకేత సిద్ధము, గనుక, శ్యామ = నల్లనయిన లేక శ్యామయొక్క, మందాక్షముద్రా = లజ్జాస్వరూపమనెడు, శుంభత్తిమిరంబు = విజృంభమాణమయిన చీఁకటి, పర్వగా= వ్యాపింపఁగా, మదనాధ్వన్యుండు = మన్మథుఁడనెడు పథికుఁడు, అనఁగా దారినడుచువాఁడు, (ని, 'అధ్వనీనోధ్వగో ధ్వన్యః పాంథః పథిక ఇత్యపి' అని అ.) ఖిన్నాత్ముఁడై = ఏమియుం దోఁచకుండెడు మనస్సుగలవాఁడై, కమనీయరాజకరలీలాలంబసంచారముగా-కమనీయ = ఒప్పుచున్న, రాజకర=వసురాజు యొక్క హస్తమనెడు, రాజకర = చంద్రకిరణముయొక్క, లీలాలంబ = విలాసావలంబయుక్తమయిన, సంచారముగా = గమనమును, ఆశించెగా = ఇచ్ఛయించెను.

గిరికాదేవి గాఢలజ్జాన్వితురాలయియుండుటవలన మన్మథుఁడు తనశక్తిని గనుపఱుపఁజాలని వాఁడై యాలజ్జను విడిపించుకొనుటకు వసురాజుహస్తమును సహాయమగునట్టులుగాఁ గోరెనని తాత్పర్యము. ఈపద్యములో నలఘువృత్తియనెడు పదముచేత లజ్జకుఁ బ్రాబల్యమును మదనాధ్వన్యుండు ఖిన్నాత్ముఁడై యన్నందుచేత మన్మథునకు దౌర్బల్యమును జెప్పంబడినది గనుక గిరికాదేవి ముగ్ధయని తెలియవలయును. ఇందుకు లక్షణము- శ్లో. 'ఉదయద్యౌవనాముగ్ధా లజ్జా విజితమన్మథా' అని. ఇది గాక 'ఆశారోధక మస్ఫుటాక్షివలనం బాపాద్యమానాఖిలో, ద్దేశప్రావరణంబునై' అనెడు పాఠాంతరమునకు నర్థము స్పష్టము. రాజకరలీలాలంబసంచారమనుటచేఁ గళాస్థానములను రాజంటి వలపు గలిగించెనను స్వారస్యము గోచరించెడిని. సిగ్గుచే గిరిక చలించుచుండ మన్మథుఁడు తన నేరుపుచాలమి రాజకరము నవలంబనముగాఁ గొనెను. "దుర్బలస్యబలం రాజా" అనునట్లు, గిరిక వసురాజు పైకొని తన తలంపు సాగమి వలువుచే నంగకములు మాటుపఱచికొనుచుఁ జూడక మోముత్రిప్పుచు గుబ్బలపైఁ బైటబిగించుచు సిగ్గుపెంపునఁ దప్పించుకొనుచుండెనని భావము. లజ్జచే మొగము నల్లనగుననుట కవిసమయము. ఇందులకు-

శ్లో. "సంచారిణీదీపశిఖేవరాత్రౌ యంయం వ్యతీయాయ పతిం వరాసా
నరేంద్రమార్గాట్టఇవ ప్రపేదే వివర్ణభావం సనభూమిపాలః." రఘువంశము.

ఇటులె శృంగారనైషధములో దమయంతీస్వయంవరఘట్టమున రాజులు లజ్జాజన్యవిచారమున నల్లఁబడిరని చెప్పఁబడెను.

తే-గీ. లలన పొద మవ్వలికటంచుఁ బలుకుటయును, ఋష్కరద్వీపపతియాస్యపుష్కరమునఁ
దదనవాప్తిజఘనపరితాపవహ్ని, చిహ్నమగు కార్ష్ణ్యధూమ మీక్షింపఁబడియె.

కృష్ణధూమము లజ్జాతిరేకముచే జనించెనని భావము.

ఉ. మంచుముసుంగు పూని లవమాత్రము పద్మినిమోముదమ్మి దీ
పించమిఁ జన్ను మొగ్గ లవిభేద్యతరచ్ఛదగుప్తి నేమియు

న్మించమి నొక్కటం గడు భ్రమించుచుఁ దత్సుమనోవికాసవే
ళాంచితవైభవంబునకు నాసపడు న్నృపనేత్రభృంగముల్. 82

పద్మిని= పద్మినీజాతియయిన గిరికాదేవియనెడు పద్మలతయొక్క, మోముదమ్మి = పద్మమువంటి ముఖము ముఖమువంటిపద్మము, మంచుమునుంగుపూని = మంచువంటిముసుఁగు ముసుఁగవంటి మంచును వహించి, లవమాత్రము = లేశమాత్రమయినప్పటికిని, దీపించమిన్ = ప్రకాశింపకయున్నందుచేతను, చన్నుమొగ్గలు = కుచములనెడు కోరకములు, అవిభేద్యతరచ్ఛదగుప్తినేమియున్మించమిన్ - అవిభేద్యతర = భేదింపనలవిగాని, ఛద = వస్త్రమనెడు పత్రసమూహముయొక్క, గుప్తిన్ = కప్పికచేత, ఏమియున్మించమిన్ = ఎంతమాత్రమును నతిశయింపకయున్నందుచేతను, ఒక్కటన్ = ఏకరీతిగా, కడుభ్రమించుచున్=మిక్కిలి చుట్టిచుట్టితిరుగుచు, నృపనేత్రభృంగముల్ = వసురాజుయొక్క నేత్రములనెడు తుమ్మెదలు, తత్సుమనోవికాస వేళాంచితవైభవంబునకున్ - తత్ = ఆగిరికాదేవియనెడు పద్మలతయొక్క, సుమనోవికాసవేళా = యోగ్యమయిన మనోవికాసమనెడు పుష్పవికాససమయమందలి, అంచితవైభవంబునకున్ = ఒప్పిదమయిన వైభవమునకు, ఆసపడున్ = ఎప్పుడో యని యాసపడుచుండెను.

అనఁగా గిరికాదేవి గాఢమయినలజ్జచేత సన్నపుముసుంగిడికొని ముఖము విప్పిచూడక దట్టమయినవస్త్రముచేతఁ గుచములు గప్పిపెట్టుకొనియుండఁగా నాగిరికాదేవియొక్క మానసోల్లాసవైభవ మెప్పుడు గనుపడునని వసురాజుయొక్క నేత్రములు కోరుచుండెనని తాత్పర్యము. అ. ఉ. వ. 3౹౹లో డించఁగన్ అనియు నీపద్యమున దీపించమి యనియు ముత్తుపరంబగుచో నాగమచకారమునకుఁ బకారంబు వచ్చునను వ్యాకరణసూత్రవిరుద్ధముగాఁ జెప్పఁబడెను. లాక్షణికులకవితయందుఁ గొన్నిచోటుల విట్టిప్రయోగములు గానవచ్చెడిని.

క. మించి మదించినరిపుల వ్రఢించక...... దశకుమారచరిత్రము.

క. నవలానవలావణ్యా, ర్ణవలాలితకాంతిరమకు నయనద్యుతుల
న్నవనీరాజన మొసఁగుచు, నవనీరాజాగ్రగణ్యుఁ డనియెం బ్రేమన్. 83

నవలా = గిరికాదేవియొక్క, ఇది దేశ్యపదము గనుక, (సూ. 'నచదేశ్యపదే' న. అను సూత్రముచేత హ్రస్వము రాలేదు.) నవ = నూతనమయిన, లావణ్య = కళయనెడు, అర్ణవ = సముద్రమందు, లాలిత = ఒప్పుచున్న, కాంతిరమకున్ = రమయనఁగా సమృద్ధియును లక్ష్మియును గనుకఁ గాంతిసమృద్ధి యనెడు లక్ష్మికి, నయనద్యుతులన్ = తనయొక్క నేత్రకాంతులచేత, నవనీరాజనమొసఁగుచున్=అభినవనీరాజన మిచ్చుచు, అవనీరాజాగ్రగణ్యుఁడు = భూమియందుఁ గల రాజులలో శ్రేష్ఠుఁడయిన వసురాజు, అనియెంబ్రేమన్ = ప్రేమచేత నొకవాక్యము పలికెను. అనఁగా గిరికాదేవి గాఢమైన లజ్జచేత మనసియ్యకుండఁగా నాయమకాంతిసంపదను వసురాజు పలుమాఱుఁ జూచుచున్నవాఁడై యనురాగముచేత నొకవాక్యము పలికెను. ఏమనియనిన,

సీ. వరపద్మముకరము లకారగతంబులు నీకు సతి నీవి యింతచే సడల రాదె
బహుళశతచ్ఛదరాశి భవదక్షియుగళంబు నేత్రాంచలం బింత నెరప రాదె
యనఘుదివ్యాహారఖని నీదుకెమ్మోవి లేమ ముద్దింత పాలింప రాదె
తావిగంబూరంపుదీవి నీమొగ మొక్కపలు కింత నాపైని జిలుక రాదె

తే. చక్రవిజయంబొనర్చె నీచన్నుదోయి
కంచుకం బేల యింకఁ జాలించ రాదె
నిర్మలామూల్యగుణరత్ననిధికి నీకు
వనజముఖి త్రాస మిది యేల వదల రాదె. 84

సతీ=ఓగిరికా, నీకు వరపద్మ మకరము ల్కరగతంబులు-నీకున్=నీకు, వర=వరనిధియును, పద్మ=పద్మనిధియును, మకరముల్ = మకరనిధియును, కరగతంబులు = హస్తగతములయి యున్నవిగదా, నీవి=మూలధనమును, ఇంతచే సడలరాదె = ఇంచుకంత చెయివదలరాదా యనియర్థము. శ్రేష్ఠములయిన పద్మ మకరరేఖలు హస్తమందుఁ గలవనియును నీవియనఁగాఁ బోఁకముడియగుటగనుక నది కొంచెము చేవదలరాదా యనియును భావము.

భవదక్షియుగళంబు = నీయొక్క నేత్రద్వయము, బహుశతచ్ఛదరాశి = అనేక శతవస్త్రరాసులు గలదిగదా, నేత్రాంచలంబింత నెరపరాదె = వస్త్రాంచలమును కొంచెమంత ఘటింపఁజేయరాదా యని యర్థము. (ని. 'స్యాజ్జటాంశుకయోర్నేత్రమ్' అని అ.) శతచ్ఛదమనఁగా శతపత్రము అనఁగాఁ గమలము గనుక నీనేత్రద్వయమనేకమలమునకు రాశియైనదనియును నయనాంచలమును గించిన్మాత్రము ప్రకటింపరాదా యనియును భావము. (ని. 'శతపత్రం కుశేశయమ్' అని అ.)

లేమ = ఓ మగువా, నీదుకెమ్మోవి = నీయొక్క యరుణాధరము, అనఘదివ్యాహారఖని-అనఘ = నిష్కల్మషములయిన, దివ్య = శ్లాఘ్యములయిన, ఆహార = భోజ్యవస్తువులకు, ఖని = గనియైనదిగదా, ముద్దింతపాలింపరాదె = ముద్దయనఁగాఁ గబళము గనుక నది కొంచెముగా భాగించి యివ్వరాదా యని యర్థము. దివ్యాహారఖనియనఁగా దివ్యులు దేవతలును, వారియొక్క యాహార మమృతంబును గనుక నట్టి యమృతమునకు గనియైన దనియును, ముద్దు అనఁగాఁ జుంబనము. అది కొంచెమంత దయ చేయు మని భావము.

నీమొగము = నీయొక్కవదనము, తావిగంబూరంపుదీవి=పరిమళయుక్తమైన కర్పూరమునకు స్థానమయినది గదా, ఒక్క పలుకింతనాపైని జిలుకరాదె = ఆకర్పూరశకలమును గొంచెమంతనాపైఁ జిలుకరింపరాదా యని యర్థము. కర్పూరసౌరభస్థానమనియును వాక్యమును గొంచెముగాఁ బలుకరాదా యనియును భావము.

నీచన్నుదోయి = నీయొక్కకుచద్వయము, చక్రవిజయంబొనర్చెన్=రాష్ట్రవిజయమును జేసెను గదా, కంచుకంబేలయింకఁజాలించరాదె = కవచధారణ మెందుకుఁగావలెను, ఇఁకమీఁదఁ జాలింపరాదా యని యర్థము. చక్రవాకములను జయించినదనియును రవిక విడువరాదా యనియును భావము. నిర్మలామూల్యగుణరత్ననిధికినీకున్ - నిర్మల = దోషరహితములయిన, అమూల్య = విలువలేని, గుణ = శాంత్యాదిగుణములతోఁగూడిన, రత్న = పద్మరాగమణులకు, నిధికినీకున్ = స్థానభూతురాలవైన నీకు, వనజముఖి = ఓగిరికాదేవీ, త్రాసమిదియేలవదలరాదె=త్రాసనామకరత్నదోషమిదియెందుకు విడిచి పెట్టరాదా యనియర్థము. గుణరత్నములనఁగా సద్గుణములు వానికి స్థానమనియును, త్రాసమనఁగా లజ్జాకార్యమయిన భయమనియును భావము. (ని. 'త్రాసోభీమణిదోషయోః' అని విశ్వనిఘంటువు.)

గిరికను వసురాజు బుజ్జగించుచు నీవి సడలింపనిమ్మనియుఁ గడకంటఁ గాంచుమనియు ముద్దొసంగుమనియుఁ బలుకుమనియు రైకముడి విప్పనిమ్మనియు వెఱపు మానుమనియుఁ గోరెను.

సీ. లాలింతు నేఁ బాద•నాళీకయుగళి నాకటకేశ్వరత్వంబు • గణన మీఱఁ
బాలింతు నేఁ గటి•స్పర్శవైభవము నానేత్రాహ్వయంబు వ•న్నియకు నెక్కఁ
గీలింతు నేఁ గుచ•శ్రీలాభగరిమ నానాయకత్వము సార్థ•తాయుతముగ
శీలింతు నేఁ గర్ణ•సీమాంతికంబు నాకువలయరాజత్వ • మవనిఁ బొసఁగ

తే. నిగనిగనిసంజకెంజాయ•పొగడు దెగడు
మోవిమానిక మాని సం•పూర్ణరుచిస
మగ్రత వహింతు నే నింతి • మామకాభి
రామవసునామ ముచితగౌ•రవము దాల్ప. 85

ఇంతి = ఓగిరికాదేవీ, నేఁక్ = నేను, నాకటకేశ్వరత్వంబుగణనమీఱన్ = నాయొక్క పాదవలయ శ్రేష్ఠత్వమెన్నికకెక్కునటులుగానని యర్థము. పట్టణాధీశ్వరత్వమనిభావము. (ని. 'కటకో స్త్రీ నితంబో ద్రే ర్దంతినాం దంతమణ్డలే, సాముద్రలవణే రాజధానీ వలయయో రపి' అని మేదిని.) పాదనాళీకయుగళిన్ = నీయొక్క పాదకమలద్వయమును, లాలింతున్ = లాలనముసేయుదును, అనఁగా నీపాద భజనముసేయుదుననుట. పాదములను లాలనముచేయుటవలనిఫలము కటకాధిపత్యము, పొందుటయు నందియ యగుటయునని భావము.

నేఁక్ = నేను, నానేత్రాహ్వయంబు వన్నియకు నెక్కన్ = నేత్రమనఁగా వస్త్రంబుగనుక నావస్త్రాభిధానము వన్నెకెక్కునట్లుగా నని యర్థము. నేతయనెడు, అనఁగా స్వామియనెడు నామమని భావము. ఈయర్థమున నేతృ+ఆహ్వయము = నేత్రాహ్వయము అని. కటిస్పర్శవైభవము = నీయొక్క నితంబస్పర్శవైభవమును, పాలింతున్ = పాలనముసేయుదును, నేత్రాహ్వయము సార్థముకావలయుననఁ గటిసంస్పర్శము తగినది. కటిస్పర్శము మోహోద్దీపకము.

నేఁక్ = నేను, నానాయకత్వము=నాయొక్క హారమధ్యనాయకత్వమని యర్థము. స్వామిత్వ మనిభావము. (శ్లో. 'నాయకో నేతరి శ్రేష్ఠే హారమధ్యమణా వపి' అని మే.) సార్థతాయుతముగన్ = సార్థకత్వముతోఁగూడుకొనునట్లుగా, కుచశ్రీలాభగరిమన్ = నీకుచశోభయొక్క లాభగౌరవమును, కీలింతున్ = సంఘటింతును, నేఁక్ = నేను, నాకువలయరాజత్వము=నాయుత్పలశ్రేష్ఠత్వమని యర్థము. భూవలయరాజత్వ మనిభావము. అవనిఁబొసఁగన్ = భూమియం దొప్పునట్లుగా, కర్ణసీమాంతికంబు=నీ యొక్క కర్ణప్రదేశసమీపమును, శీలింతున్ = ఒప్పిదమగునట్లుగాఁ జేయుదును.

నేఁక్=నేను, మామకాభిరామవసునామము-మామక=నాసంబంధియైన, అభిరామ=మనోహరమ యిన, వసునామము=కాంచనాభిధాన మని యర్థము. వసురాజనామమని భావము. ఉచితగౌరవము దాల్పన్=అర్హమయినఘనతవహించునట్లుగా, నిగనిగనిసంజకెంజాయపొగడు దెగడు మోవిమానికమాని= నిగనిగనిమెఱయు సంధ్యారాగముయొక్క శ్లాఘ్యతను నిరసించునట్టి నీయొక్క పెదవియనెడు మాణిక్యమునుబొంది, సంపూర్ణరుచిసమగ్రతవహింతున్ = అత్యంతకాంతిపరిపూర్ణతను వహింతును. ముందరి పద్యముతో నన్వయము.

ఇందుఁ బాదాదిశిరఃపర్యంతం మభివర్ణితము. తొలుత పాదసంస్పర్శాదికములతో బుజ్జగించు టయుఁ బిదప నీవీమోక్షణాదులతోఁ గటిస్పృశించుటయు, అవల శైకముడి సడల్చి గుబ్బలంటుటయు నవలఁ జెలిచెంత మంతనములాడుటయు ననంతరము మోవి తేనియ లానుటయుఁ గా మోపభోగోచిత

క్రియలు. ఇవియన్నియు నానావిధముల ధన్యతాహేతువులు. మాణిక్యములు రక్తగణములోనివి గాన మోవిగాఁ జెప్పఁబడెను. వసునామము అభిరామము. దానికుచితగౌరవము మణితో నెనయుట. దాన ఫలితము సంపూర్ణరుచిసమగ్రత వహించుట యని భావము.

తే. అనుచు నరపతి కెంగేల ♦ నచలకన్య
కాత్రపాఝరగూఢాంగ♦కములు దడవె
నొయ్య నాభీకుచాదని♦మ్నోన్నతప్ర
దేశములు తద్వ్రగాహేచ్ఛఁ ♦ దెలియుకరణి. 86

అనుచున్ = పూర్వోక్తప్రకారముగాఁ బలుకుచు, నరపతి = వసురాజు, కెంగేలన్ = తనయొక్క హస్తముచేత, అచలకన్యకా = కోలాహలపర్వతపుత్త్రికయైన గిరికయనెడు పర్వతమువలనఁబుట్టిన సెలయేటియొక్క, త్రపాఝర = లజ్జయనెడు ప్రవాహముచేత, గూఢ = ఆచ్ఛాదింపఁబడియున్న, అంగకములు = అవయవములను, తడవెన్ = విమర్శించెను. ఏలాగనిన, తద్వ్రగాహేచ్ఛన్ = ఆలజ్జాప్రవాహమందుఁ జొరఁబారవలెనన్న తాత్పర్యముచేత, ఒయ్యన్ = తిన్నఁగా, నాభీకుచాదినిమ్నోన్నతప్రదేశములు = నాభియును గుచములును మొదలుగాఁ గల పల్లము మెరక యయిన స్థలములను, తెలియుఁ కరణిన్ = తెలిసికొనునట్లుంబలె, తడవెనని యన్వయము.

గిరికాదేవి లజ్జచేతఁ గప్పుకొనియున్న నాభీకుచాదికళాస్థానములను వసురాజు తనహస్తముచేత స్పృశించె నని భావము. కళాస్థానసంస్పర్శము కామోద్దీపకము. లజ్జ సెలయేరుగాఁ జెప్పఁబడుటచే నాయకసమావేశమునఁ గొండలుకొట్టుగవచ్చి సంభోగానంతరము తొలంగిపోవుననుభావ మూహ్యము. లజ్జసెలయేరు, దానస్నానమాడ నెంచినచో తొలుత మిట్టపల్లము లెఱుంగవలయును. నిమ్నము నాభి, ఉన్నతము గుబ్బలు. ఈ రెంటినెఱింగినపిదప విచ్చలవిడిగ సంచరింపవచ్చును. నాయిక నవోఢగావున లజ్జాతిశయమున నంగకములు మఱుఁగుపఱచికొనుచుండ నాయకుఁడు కళాస్థానము లెఱింగి తాఁకఁ దొడఁగెనని భావము.

మ. తరళాధార మతిప్రవాళశయగు♦ప్తం బంచు నభ్యంతర
స్మరుఁ డుత్తంభితకంపలోలపటసం♦జ్ఞం బిల్వ బాలాపయో
ధరదుర్గంబు గ్రహించె రాజకర మే♦తజ్జాతసంత్రాసవై
ఖరిఁ దెల్పెన్ జఘనస్థలీవరణజా♦గ్రద్ఘంటికాఘోషముల్. 87

తరళాధారము = అనఁగాఁ దరళశబ్దము హారమధ్యనాయకరత్నమందును దరళాశబ్దము గంజియందును వర్తించును, గనుక హారమధ్యగతరత్నమున కాధారమై యున్నదని కుచదుర్గపరమయిన యర్థము. గంజియె యాధారమై యున్నదని దుర్గపరమయిన యర్థము. అనఁగా దుర్గస్థితజనులకు గంజిమాత్రమే కాని యన్నములేదు గనుక సుఖసాధ్యమని భావము. (ని. 'తరళం చఞ్చలే షిద్గే భాస్కరే ఽపి త్రిలిఙ్గకమ్, హారమధ్యమణౌ పుంసి యవాగూ సురయో స్త్రియామ్.' అని మేదిని.) యవాగు వనఁగా గంజి, అతిప్రవాళశయగుప్తంబు-అతిప్రవాళ = చిగురుటాకుల నతిక్రమించిన, శయ = హస్తములచేత, గుప్తంబు = ఆచ్ఛాదింపఁబడినదని యర్థము. వాలమనఁగా ఖడ్గము, ప్రకృష్టమయిన వాలము ప్రవాళము, అతిప్రవాళ = అతీతములైన ప్రకృష్టఖడ్గములుగల, శయ = హస్తములుగలవారిచేత -

అనఁగాఁ జేతఁగత్తిలేని నిరాయుధులచేత, గుప్తంబు = కాపాడఁబడుచున్నదని యర్థాంతరము. అంచున్ = కాలాగని పలుకుచు, అభ్యంతరస్మరుఁడు = అనఁగా లోపలనుండునట్టి మన్మథుఁడనెడు, సభ్యంతరస్మరుఁడు = ఒళవిచ్చెడువాఁడు, ఉత్తంభిత కంపలోలపటసంజ్ఞంబిల్వన్ - ఉత్తంభిత= పొదుకొనియున్న, కంప = సాత్త్వికభావజనితమయిన వడంకుచేత, లోల = చలించుచున్న, పట=వస్త్రమనెడు విసరఁబడుచున్న వస్త్రముయొక్క, సంజ్ఞన్ = సైగచేత, పిల్వన్ = పిలువఁగా, రాజకరము= వసురాజుయొక్కహస్తము, బాలాపయోధరదుర్గంబుగ్రహించెన్ = గిరికాదేవియొక్క కుచగిరిదుర్గమును స్వాధీనముఁ జేసికొనెను. జఘనస్థలీవరణజాగ్రద్ఘంటికాఘోషముల్ - జఘనస్థలీ = కటిపురోభాగముయొక్క, వరణ = మొలనూలనెడు కోటయందలి, జాగ్రద్ఘంటికాఘోషముల్ = హెచ్చరికసేయుచున్న ఘంటానాదములు, ఏతజ్జాతసంత్రాసవైఖరిఁదెల్పెన్ = అనఁగా రాజకరము పయోధర దుర్గమును వైకొన్నందువలనఁ బుట్టిన యధికభయలక్షణమును దెలియఁజేసెను.

హారమధ్యగతనాయకమణిచేత నొప్పుచున్నదియుఁ జిగురుటాకులవంటిహస్తముచేతఁ గప్పఁబడియున్నదియు గిరిదుర్గసదృశమయినదియునగు గిరికాదేవియొక్క కుచము మన్మథప్రేరితుఁడైనవసురాజునకు హస్తగతముగాఁగా లజ్జాకార్యమయిన భయముచేత గిరికాదేవి చలింపఁగానే మొలనూలిచిఱుగంటలు మ్రోసెనని తాత్పర్యము. రాజు కోటను బట్టుకొనఁదలఁచినపుడు ప్రతిపక్షుల దుర్బలస్థితి తొలుతఁ దెలిసికొనవలయును. లోనిపరివారము గంజియె ఆధారముగఁ జేసికొని నిరాయుధముగనుండెను. ఇది మిత్రునివలె లోననుండిన మరుఁడు కేతనసంచలనరూపమున రాజున కెఱిఁగింప రాజు దుర్గమును బట్టుకొనెను. వెఱపుచేఁ బరిజనము ఘంటికల మ్రోఁగించి విరోధిరాజవిజృంభణము సాటెనని దుర్గగ్రహణపరమగు భావము.

మన్మథుఁడు హృదయజుఁడు గావున అభ్యంతరస్మరుఁడని చెప్పఁబడెను. రాజును బ్రోత్సహించి గుట్టుతెలిపినవి మరుఁడనుటచే గిరిక లోలోన మన్మథవేదన మొందుచుండెననియు నది రాజు గ్రహించెననియు భావము. ఉత్తంభితకంపము సాత్త్వికభావము. తదావేశవిశేషమున పటము లోలమయ్యెను. తొలుత సాత్త్వికభావవశమునఁ గంపము గుబ్బలంటునంతనె వెఱపుగలిగెనని భావము. మొలనూలు మొరయుననుటకు-

శ్లో. ఏతశ్చలద్వలయనూపురమేఖలోత్థ, ఝుంకారనూపురపరాజితరాజహంసాః. భర్తృహరి.

ఉ. తొయ్యలి ముద్దరాలు కుచ • దుర్గము లాత్మశయైకవంచనన్
నెయ్యపుఁ తేనిపాల్పఱిచి • నీవియుఁ గోల్పడఁగాఁ దలంచెఁ గా
కయ్యెడ నేలకో యునిచె • నాత్మశయద్వితయంబు మున్నె లో
నయ్యె సరాగమై నృపక • రార్పణ కింకఁ బెనంగ నేర్చునే. 83

తొయ్యలి=గిరికాదేవి, ముద్దరాలు = ఎంతమాత్రము ప్రౌఢిమలేనిముగ్ధగదా. ఏమనిన, కుచదుర్గములు = స్తనములనెడు గిరిదుర్గములు, ఆత్మశయైకవంచనన్ = ఇక్కడ నాత్మశయైకవంచనయనెడు నాత్మశయైకవంచనచేత ననిచెప్పవలయును. ఆత్మశయమనఁగాఁ దనయొక్కహస్తము. ఆత్మశయుఁడనఁగా హృదయమును హత్తుకొనియుండెడు మన్మథుఁడును, ఎల్లప్పుడును దనయొద్దఁ గాచుకొనియుండెడు బంటును గనుక, తనయొక్క యేకహస్తమువలని వంచనచేత నని కుచపరమయినయర్థము. మన్మథుఁడనెడు నొకనమ్మకంపుబంటుయొక్క యొళవుచేత నని దుర్గపరమయిన యర్థము. నెయ్యపు

జేనిపాల్పఱచి = ప్రేమగలవసురాజు పాలుచేసియు, నీవియుఁ గోల్పడఁ గాదలంచెఁ గాక = నీవియనఁగాఁ బోఁకముడియును మూలధనమును గనుకఁ బోఁకముడియనెడు మూలధనమును బోఁగొట్టుకోఁదలఁచినదియు, కాక = లేనట్టయితే, అయ్యెడఁ = ఆనీవిస్థానమందు, ఏలకోయునిచెసాత్మశయద్వితయంబు = ఆత్మశయద్వితయమనెడు సాత్మశయద్వితయము సెందుకుంచవలయును, అనఁగా వ్యర్థమనుట. ఇక్కడ సాత్మకరద్వితయమని వస్త్రగ్రంథిపరమయిన యర్థము. పంచకభటద్వితయమని మూలధనపరమయిన యర్థము. ఏమనిన, ఆయాత్మశయద్వితయము, అనఁగా నట్టిపంచ శాభటద్వితయము, సరాగమై = అనురాగముతోఁగూడుకొన్నదై, నృపకరార్పణకుఁ = ఆమూలధనమును రాజుచేతి కప్పగించుటకు, మున్నె = మునుపే, లోనయ్యెఁ = అలాయపడియుండెను. కాఁబట్టి ఇంకఁ బెనంగ నేర్చునే=ఇకఁమీఁద రాజు హరింపకుండఁ బోరాడఁ జాలునా యని యర్థము.

ఆయాత్మ కరద్వితయము రక్తితోఁ గూడుకొన్నదై వివాహానంతరమం దప్పగింత సేయుచెడల రాజకరార్పణకుమునుపే లోఁబడియున్న దనియును నట్టిది వస్త్రగ్రంథిని రాజు హరింపకుండునట్లు పెనఁగఁజాలునా యనియును హస్తపరమయిన యర్థము. అనఁగా గిరికాదేవి రెండుహస్తములచేతను గుచద్వయమును గ్రమ్ముకొనియుండగా వస్త్రగ్రంథి సడలుటచే నది జాఱకుండఁ బట్టుకొనునిమిత్తమయి యొకచేయివదలఁగానే రాజు కుచగ్రహణము చేసెననియును నంతట రెండుహస్తములును వస్త్రగ్రంథియందే చేర్చుకొనియెననియును దాత్పర్యము.

గిరిక ముద్దరాలు గావున నృపకరార్పణమునకు సరాగముగ లోనయిన హస్తయుగమును గుబ్బలపైఁ గాపుంచెను. అవి తొలుతనే రాజునకు లోనైనవగుటచే వంచించి కుచములను నీవిని గూడ రాజునకుఁ బాలుపఱచెను. మున్ను లోఁబడినవానిని గాపుంచిన నవి సమయమునఁ బెనంగి మాట దక్కించుట యసంభవము. ఇట్టిబంటుల నియోగించుటచే గిరిక ముద్దరాలని స్పష్టము.

క. అతినీతసమయుఁ డై పతి, సతినీవి హరింప లజ్జ • సనియెఁ దృఢ యో
గత నీవిఁ గన్న బోంట్లును, గతనీవిక లైనవారి•కడ నుందురు రే. 89

అతినీతసమయుఁడై=అతిక్రమింపఁబడిననియమముగలవాఁడై, పతి=వసురాజు, సతి = గిరికాదేవి యొక్క, నీవిహరింపఁ = మూలధనమునుహరింపఁగానే యనియర్థము. ఇక్కడ స్త్రీధనాపహరణము రాజునకు నిషేధము గనుక నది విచారింపక అతినీతసమయుఁడైనాఁ డని తెలియవలయును. వస్త్రగ్రంథిని హరింపఁగానే యనిభావము. లజ్జసనియెఁ = లజ్జాసఖి తొలఁగిపోయె నని యర్థము. సిగ్గు తొలఁగిపోయె నని భావము. ఈయాశ్వాసమందు, ౭౭ వ పద్యములో లజ్జావయస్యవధూటి యని చెప్పినాఁడు గనుక నాయర్థ మిక్కడి కాకర్షింపవలయును. దృఢయోగతనీవిఁగన్నబోంట్లును=దృఢసాంగత్యముచేతను ఈవినిబొందిన, అనఁగా ధనధాన్యలాభమును బొందియున్న సఖీజనములును, గతనీవికలైనవారికడనుందురే = గతమైనమూలధనముగలవారిదగ్గరనుందురా యనియర్థము. అనఁగా ధనహీనతనుబొందినమీఁదట వారిదగ్గరనుండరుగదా యనుట.

లజ్జ వస్త్రగ్రంథినిబొందియున్నది గనుక వసురాజు వస్త్రగ్రంథిని హరించినమీఁదట గిరికాదేవి దగ్గర నెందుకొఱ కుండునని భావము.

ఉ. చేడియకోఁపులావయవ•సీమలఁ జెల్వొనిసోయగంపుఁజే
యూడఁ బ్రభూతనూతనన•సాకృతిఁ గ్రొంజెమ రొయ్య నొయ్యఁ బై

యాడఁ గరంగి జాఱె నెద • నంటినకస్తురిరేఖ లాకుల
వ్రీడతమంబు లాత్మపద•విన్నిలు పోపక పోవుకైవడిన్. ౯౦

చేడియ = గిరికాదేవియొక్క, కోమలావయవసీమలన్ = మృదువైనకచకుచాద్యవయవముల యందు, చెల్వుని = పతియైన వసురాజుయొక్క, సోయగంపుఁజేయాడన్ = విలాసకరమైన హస్తము వ్యాపింపఁగాను, ప్రభూత = పుట్టిన, నూతన = అభినవమైన, రసాకృతిన్ = అనురాగరసమువలె, క్రొంజెమరు = సాత్వికభావజనితమైన క్రొత్తచెమట, ఒయ్యనొయ్యఁబైయాడన్ = తిన్నతిన్నఁగాఁ బైని వ్యాపింపఁగాను, ఎదనంటిన కస్తురిరేఖలు = హృదయమంటియున్న కస్తూరికాపత్రరచనలు, కరంగి జాఱెన్ = కరఁగి నీరయి జాఱిపోయెను. ఏలాగనిన, ఆకులవ్రీడతమంబులు = తొట్రుపడుచున్న లజ్జా తిమిరములు, ఆత్మపదవిన్నిలుపోపక పోవుకైవడిన్ = తన మార్గమందు నిలువలేక తొలఁగి పోయినట్టులుగా, జాఱెనని సంబంధము.

వసురాజు తన సోయగంపుఁజేయిచే గిరికావయవములను గళాస్థానము లెఱింగి స్పృశించెను. సాత్వికభావజన్యమగు క్రొంజెమట నూతనానురాగరసమువలె నుండెను. చెమటచేఁ గస్తురిరేకలు కరఁగిపోవుట తొట్రుపడులజ్జాతిమిరములు విడిపోవునటు లుండెను. సోయగంపుఁజేయి యాడినచోటున నెల్ల లజ్జకు నిలువ నెలవు లేకపోయెను. చెల్వుఁడనుటచే వసురాజు హృదయరంజకసుస్వరూపుఁడని భావము.

సీ. నెలఁతగుత్తపుగుబ్బ•నెత్తమ్మిమొగడల నెలకూనసోఁకులు • నిగుడకుండ
ముదితచందురుకావి•మోవి లేఁదలిరున కలఘుద్విజాహతి • యంటకుండ
మగువ పెన్నెరిగుంపు•మొగులుజొంపమునఁ బ్రకంపనాయాసంబు•గదురకుండ
జెలుపకప్రపుఁబూఁత•చిన్నివెన్నెలలకు ఘనతిరోధానంబు • గలుగకుండ

తే. సిరుల నలరించె నిద్దంపు•జిగి ఘటించె
నొయ్య నెఱయించె నొకయింత • యొఱపు నించె
లలితనవ్యోపభోగలీ•లాలతాంత
నాయకుఁడు చేదిమేదినీ•నాయకుండు ౯౧

లలిత = మనోహరమైన, నవ్యోపభోగ = నూతనసంభోగమందు, లీలాలతాంతనాయకుఁడు = లీలామన్మథుఁడైన, చేదిమేదినీనాయకుండు = చేదిభూపతియైన వసురాజు, నెలఁతగుత్తపుగుబ్బనెత్తమ్మిమొగడలన్ = గిరికాదేవియొక్క బిగువైన గుబ్బచన్నులనెడు చక్కని తామరమొగ్గలయందు, నెలకూన సోఁకులు = నెలకూనయనఁగా బాలచంద్రుఁడు - బాలచంద్రసదృశములైన నఖములయొక్క సోఁకులనెడు బాలచంద్రునియొక్క కిరణప్రసారణములు, నిగుడకుండన్ = వ్యాపింపకుండునట్లుగాను,

ముదితచందురుకావిమోవిలేఁదలిరునకున్ = గిరికయొక్క చంద్రకావిరంగుగల పెదవియనెడు లేఁతచిగురుటాకునకు, అలఘుద్విజాహతియంటకుండన్ = ద్విజశబ్దము దంతములయందును బక్షుల యందును వర్తించుచున్నది గనుక దంతక్షతమనెడు పక్షిఘాత మంటకయుండునట్లుగాను, మోవి యను తలిరున కంటనీయ లేదని భావము. లేఁదలిరుగావున మిగుల సుకుమారముగ నుండును. అందు సహజ ముగ నిద్దంపుసిరి నించారును. అలఘుద్విజాహతిసహజసౌకుమార్యమునకుఁ దగినది కాదు గాన దంతక్షతము లాన్పఁడయ్యెనని భావము.

మగువపెన్నెరిగుంపు మొగులుజొంపమునన్ = గిరికయొక్క చికుర సమూహమనెడు మేఘ బృందమునందు, ప్రకంపనాయాసంబు గదురకుండన్ = ప్రకంపనశబ్దము ప్రకృష్టచలనమందును వాయువునందును వర్తించుచున్నది గనుకఁ బ్రకృష్టమైన చలనాయాసమనెడు పవనాయాసము తగులకుండునట్లుగాను, (ని. 'ప్రకంపన శ్చాతిబలః' అని యమరశేషము.) పెన్నెరిగుంపు గా నుండెనుగాన మొగులుజొంపముతోఁ బోల్కి చెప్పఁబడెను. కంపవిశేషాదికములచే గిరిక పెన్నెరిపిడి చిక్కుబడకుండ నొనర్చెననుట. ప్రౌఢరతమున నెరివీడుట సహజము. "మేఘోవర్షతి మీనకేతువిశిఖాన్" ఇత్యాదిసురతవర్ణనములు గాంచునది.

చెలువకప్రపుఁబూఁత చిన్నివెన్నెలలకున్ =గిరికయొక్క కర్పూరలేపనమనెడు బాలచంద్రికలకు, ఘనతిరోధానంబుగలుగకుండన్ = ఘనతిరోధానమనెడు ఘనతిరోధానము గలుగకుండునట్లుగాను - ఘనతిరోధానమనఁగా ఘనమైన యదర్శనమనియును మేఘమువలనియాచ్ఛాదనమనియును దెలియవలయును. సిరులనలరించెన్ = సమృద్ధులచేత నొప్పునట్లు చేసెననియును, నిద్దంపుజిగిఘటించెన్ = స్నిగ్ధకాంతిని బొందించె ననియును, ఒయ్యనెఱయించె = తిన్నఁగాఁ జక్కపఱిచెననియును, ఒకయింత యొఱపునించెన్ = మఱికొంత మెఱుపుగలుగఁ జేసెననియును గ్రమాలంకారము. అనఁగా గిరికాదేవి ముగ్ధగనుకఁ బ్రథమసంగమమం దెంతమాత్రమును గాసివగులకుండునట్లుగా వసురాజు క్రీడించెనని తాత్పర్యము.

వసురాజు నూతనసంభోగములం దారితేరిన చతురుఁడు. కానఁనే లీలాలతాంతసాయకుఁడు. కావున గుబ్బలపై గోటిగంటు లుంచక నిద్దంపుసిరియు మోవిపై పలుగాటులుంచక నిద్దంపుజిగియుఁ బెన్నెరి విడిపోకుండ మెల్లఁగ నెఱపుటయు మేనిపూఁత తొలఁగిపోకుండ నొఱపునించుటయు నొనర్చెనని భావము.

ఉ. భూసుతకీర్తి వేఁడ నుడి • వోవనితావులగుబ్బగుత్తులన్
తేనియ లాన నానఁ గడ•తేరనివాచవిపండు నిచ్చె భూ
షానివహంబు దాల్చె మృదు•శాటిక మున్న యొసంగు సింధుసం
తానము గావునం గడు నుఁ•దారత నాలతకూన యొప్పుచున్. 92

భూసుతకీర్తివేఁడన్ = భూజనులచేతఁ గొనియాడఁబడిన కీర్తిగల వసురాజు యాచింపఁగా, ఆలతకూన = ఆ గిరికాదేవి, సింధుసంతానము గావునన్ = సముద్రసంజాతదేవతరు విశేషము గాఁబట్టి యని యర్థము. శుక్తిమతీనదీసంతానమని భావము. కడునుదారతన్ = మిక్కిలి యౌదార్యముచేత, ఒప్పుచున్ = ప్రకాశించుచు, ఉడివోవనితావులగుబ్బగుత్తులన్ = ఉడిగిపోని పరిమళమునుగల వట్రువ పువ్వుగుత్తులను-ఇక్కడ ఉడిగి యనెడు పదమునందలి యంతిమవర్ణము లోపించినది, తేనియలాననానఁ గడతేరనివాచవిపండున్ =మధురరసాస్వాదనము చేయఁ జేయఁగా నెప్పటికిని వాచవి దీరకుండెడు ఫలమును ఇచ్చెననియర్థము. స్తనగుచ్ఛములను నధరబింబమును నిచ్చినదని భావము. భూషానివహంబు దాల్చెన్ = ఆభరణములను వర్షించెనని యర్థము. అలంకారములు సడలిపోవునట్లుగాఁ బెనఁగెనని భావము. మృదుశాటిక మున్నయొసంగెన్ =మృదువైనవస్త్రమును ముందుగానే యిచ్చెనని యర్థము. కట్టుకొంగు ముందుగానే స్వాధీనపఱచెనని భావము.

సింధుసంతానము లతకూన యనువిశేషణములచే గిరికయెడఁ గల్పలతాభావము ద్యోతకమగు చున్నది. కల్పలతకు ఉడిగిపోనితావులు వాచవికడతేఱనిపండ్లు లోనగునవి సహజములు. మఱియుఁ గడునుదారతయుఁ గలదు. వసురాజు బుజ్జగించి గిరిక నొడంబఱచి గుబ్బలంటి మోవియాని సొమ్ములు రాలునంత దిటవుగఁ బెనంగి నీవి తొలఁగించి రతులఁదేలెనని భావము.

ఉ. ముప్పిరిగొన్న వాచవుల ♦ మోహ మొకింతయుఁ దప్పనీదు కన్
ఱెప్పలు విప్ప నీ దొకతఱిం జెమ రారఁగనీదు మేన నె
ల్లప్పుడుఁ దృష్ణచేఁ దనివి ♦ నందఁగనీదు నృపాలమౌళి నే
చొప్పునఁ బుట్టెనో భువన♦సుందరి సింధువరామృతంబునన్. 93

భువనసుందరి = గిరికాదేవి, సింధువరామృతంబునన్-సింధువర=సముద్రములలోశ్రేష్ఠమైన క్షీర సముద్రసంబంధమయిన, అమృతంబునన్ = సుధయందు అని యర్థము. సింధు=శుక్తిమతీనదియొక్క, వర = శ్రేష్ఠమయిన, అమృతంబునన్ = సలిలమందనిభావము. (ని. 'అమృతం యజ్ఞశేషేస్యా త్పీయూషే సలిలే ఘృతే' అని మేదిని.) ఏచొప్పునఁబుట్టెనో = ఏప్రకారముగా జన్మించినదోకాని, నృపాలమౌళిన్ = వసురాజశ్రేష్ఠుని, ముప్పిరిగొన్న వాచవుల మోహ మొకింతయుఁ దప్పనీదు=ముబ్బడిగాఁ బెనఁచుకొన్ననోటి రుచులయందలి యాసక్తిని గొంచెమయినప్పటికిని వదలనియ్యదు, కన్ఱెప్పలువిప్పనీదు = కనుఱెప్పలు విప్పిచూడనీయదు. ఒకతఱిం జెమరారఁగనీదు మేనన్ = ఒకసమయమందైనను దేహమందుఁ జెమటూరనియ్యదు, ఎల్లప్పుడుఁ దృష్ణచేఁ దనివినందఁగనీదు = ఎప్పుడు దప్పిచేతఁ దృప్తిపొందనీదు.

అనఁగా నమృతమందుఁ బుట్టినదానికి నమృతధర్మములు లేక యమృతేతర ధర్మములు గలిగి యుండుటవలన నమృతమం దేరీతిగాఁ బుట్టినదో యని యాశ్చర్యము. అమృతాస్వాదనముచేసిన దేవతలకు మఱియొకవాచవులయందు మోహములేకయుండుటయును గన్నులకు ఱెప్పపాటు లేకయుండుటయును శరీరమందుఁ జెమటపట్టకుండుటయును దప్పిలేకయుండుటయును బ్రసిద్ధము. ఎంతగ్రోలినను మోవిచవిపై మక్కువదీఱలేదనియు సుఖపరవశమునఁ గనుఱెప్పలు విప్పిచూడఁజాలఁడయ్యెననియు నతులితక్రీడావశమున మేనఁజెమట పొడసూపెననియు భావము. గిరిక భువనసుందరిగావునఁ దన్నిరతిశయ విభ్రమలావణ్యాదులచే వసురాజు పరవశుఁడయ్యెననుట.

మ. సతి సాహిత్యరహస్య మీశువలనన్ ♦ సాధించి తోడ్తోన త
త్పతికిం బ్రత్యుపదేశ మిచ్చె నతుల♦ప్రౌఢిన్ ధ్వనివ్యక్తిఁ ద
చ్ఛ్రితికిం జొన్పుచు లోచనాంజనరస♦ప్రోన్మేషము ల్సన్ముఖో
ద్గతము ల్సేయుచుఁ బ్రత్యలంకరణమా♦ఖర్యంబు దీపింపఁగన్. 94

సతి = గిరికాదేవి యనియర్థము. పార్వతియని యర్థాంతరము. (ని. 'సతీదక్షసుతా సాధ్వ్యోః, అని నానార్థరత్నమాల) సాహిత్యరహస్యము=కలయికయొక్కమర్మమను-అనఁగా సంభోగరహస్య మని యర్థము. సాహిత్యవిద్యామర్మమని యర్థాంతరము. ఈశువలనన్ = పతియయిన వసురాజువలన నని యర్థము. హరునివలనని యర్థాంతరము. (ని. 'ఈశ శ్శమ్భౌ ప్రభౌ త్రిషు' అని నా.) సాధించి =

అభ్యసించి, తోడ్తోన = వెంబడిగానే, తత్పతికిం బ్రత్యుపదేశమిచ్చెన్ = పతియయిన యావసురాజునకు నాసంభోగరహస్యమును దిరుగ నుపదేశము చేసె నని యర్థము. పతియయిన హరునకు నాసాహిత్య విద్యారహస్యమును దిరుగ నుపదేశముచేసె నని యర్థాంతరము. ఏలాగనిన, అతులప్రౌఢిన్ = అసమాన మయిన ప్రాగల్భ్యముచేత, ధ్వనివ్యక్తిఁ దచ్ఛ్రుతికిం జొన్పుచున్ = గళధ్వనియొక్క ప్రాకట్యము నాతని చెవికి వినఁబడునట్లుగాఁ జేయుచు నని యర్థము. ధ్వన్యర్థముయొక్క ప్రాకట్యము నతఁడు వినునట్లుగా జేయుచు నని యర్థాంతరము. లోచనాంజనరసప్రోన్మేషము ల్తన్ముఖోద్గతముల్సేయుచున్ = కన్నుల యందలికాటుక గలసిన యానందబాష్పసలిలవికాసములు వసురాజుయొక్క ముఖమందుఁ బడునట్లుగాఁ జేయుచునని యర్థము.

లోచనమనఁగాఁ గళాస్థానభేదము. దానికినంజనమయిన - అనఁగా దానిని గనుపఱుచునది కళాశాస్త్రముగనుక దానియందలి శృంగారరసవికాసముల నతని వచించునట్లుగాఁ జేయుచు అని సాహిత్య విద్యాపరమయిన యర్థాంతరము. ప్రత్యలంకరణమౌఖర్యంబు దీపింపఁగన్ - ప్రత్యలంకరణ = కంకణనూపురాదిప్రత్యాభరణములయొక్క, మౌఖర్యంబు = ముఖరభావము, అనఁగా మ్రోఁత, దీపింపఁగన్ = ప్రకాశింపఁగా అని యర్థము. ఉపమోత్ప్రేక్షాది ప్రత్యలంకారములయొక్క వాచాలత్వము ప్రకాశింపఁగానని యర్థాంతరము. ప్రత్యుపదేశ మిచ్చెనని సంబంధము.

అనఁగా గిరికాదేవి పెనిమిటివలన సంభోగరహస్యమును గ్రహించి యాపైని నర్థముగాఁ జెప్పఁబడిన క్రియలతోఁగూడుకొనునట్లుగాఁ బుంభావరతి సలిపెనని తాత్పర్యము. సంభోగరహస్యమును గిరికాదేవి వసురాజునుండి గ్రహించి వెంటనే మిగులనేరుపుతో భూషణాది నిస్వనము మణితాదిగళరవాదికములు పెంపార కనులకాటుకకన్నీరు వసురాజుమొగముపైఁబడ మగచేఁతగావించెనని భావము. పుంభావసురతవిశేషము పురుషుని సౌభాగ్యాతిశయమునఁగాని లభింపదని భర్తృహరి యిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో. "ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకుళితనయనానాం కించి దున్మీలితానాం,
ఉపరిసురతఖేదస్విన్నగండస్థలానాం
అధరమధువధూనాం భాగ్యవంతః పిబంతి."
"అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియన్త్రితే,

సంయోగాద్యై రవాచార్థ ధీకృద్వ్యాపృతిరంజనం." అను కావ్యప్రకాశికసూక్తినిబట్టి లోచనాంజన మనుచోఁ గళాశాస్త్రమనుటకంటె సాహిత్యవ్యంజనవ్యాపారమనుట యుచితమని యొకరు వ్రాయుచున్నారుగాని పూర్వవ్యాఖ్యాతృభావమె సుగమము సరసముగ నున్నది.

శా. భూనాథాగ్రణికి స్వధూమణికి సంభోగాంతసౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్పె ననవద్యం బై యవేద్యాంతరం
బై నిర్లేపకలాప మై క్రమవిముక్తానేకబంధానుసం
ధానం బై యపునర్భవప్రభవఖేదం బై విజృంభించుచున్. 95

భూనాథాగ్రణికిన్ = వసురాజునకును, వధూమణికిన్=గిరికాదేవికిని, సంభోగాంతసౌఖ్యంబు= సురతాంతమందలి సుఖభావము - అనఁగాఁ గళలువదలెడు సమయమందలి సౌఖ్యము. బ్రహ్మానందానుభవంబుఁ జెల్పెన్ = బ్రహ్మవిషయికమయిన యానందముయొక్క యనుభవమును దెలియఁజేసెను. ఏలాగనిన, అనవద్యంబై = అనిందితమైనదైయని సంభోగాంతసౌఖ్యపరమయిన యర్థము. నిర్దుష్టమయినదని బ్రహ్మానందానుభవపరమయిన యర్థము. అవేద్యాంతరంబై = తెలియఁదగినది మఱియొకటిలేనిదై యని యుభయత్ర అర్థము. నిర్లేపకలాపమయి = వీడిపోయిన భూషణములుగలదై యని సంభోగాంత సౌఖ్యపరమయిన యర్థము. నిర్గతమయిన సంసర్గసమూహము గలదని బ్రహ్మానందానుభవపరమయిన యర్థము. క్రమవిముక్తానేక బంధానుసంధానంబై = క్రమక్రమముగా విడువఁబడిన యనేక రతి బంధాను సంధానములు గలదై యని యర్థము. క్రమవిముక్తములయిన యనేక కర్మబంధానుసంధానములు గలదై యని యర్థాంతరము. అపునర్భవప్రభవఖేదంబై = పునర్భవశబ్దము నఖములయందును బునర్జన్మమందును వర్తించుచున్నది. (ని. 'పునర్భవః కరరుహో౽నఖో౽స్త్రీనఖరో౽స్త్రియామ్' అని అ.) నఖక్షతములవలనఁ బుట్టెడు బాధలేనిదై యని యర్థము. పునర్జన్మమువలనఁ బుట్టెడుదుఃఖములేనిదని యర్థాంతరము. విజృంభించుచున్ = సామర్థ్యప్రకారము గనుపఱుచుచు బ్రహ్మానందానుభవంబుఁ జెల్పెనని సంబంధము.

గిరికయుఁ వసురాజును సంభోగసౌఖ్య బ్రహ్మానందలోలురై ప్రపంచమును, విడిపోయిన భూషణసమూహమును నెఱుంగక యనేకబంధములతోఁ గ్రీడించి నఖక్షతాది బాధలనుగూడ గణింపక చెలరేఁగి వర్తించిరని భావము.

క. సుమనోనాళీకార్పిత, సుమనోనాళీకకలనఁ ♦ జొక్కుచు వసుధీ
రమణియు రమణియు నీక్రియ, రమణీయతఁ గాంచి రనవ♦రతనవరతులన్. 96

సుమనోనాళీక = పుష్పములే బాణములుగాఁగల మన్మథునియందు, ఇక్కడ నాళీకశబ్దము బాణపరము. (ని. 'నాళీకం త్వబ్జే క్లీబం శరే పుమాన్' అని నా.) అర్పిత=సమర్పింపఁబడిన, సుమనోనాళీకకలనన్ = శోభనమనస్కకమలములు గలుగుటచేత - ఇక్కడ నాళీకశబ్దము కమలవాచకము. చొక్కుచున్ = పారవశ్యమును బొందుచు, వసుధీరమణియున్ - వసు = వసునామముగల, ధీరమణియున్=ధీరశ్రేష్ఠుఁడును, రమణియున్ = గిరికాదేవియును, ఈక్రియన్ = ఈచెప్పఁబడినప్రకారముగా, అనవరతనవరతులన్ = నిరంతరనూతనసంభోగక్రీడలచేత, రమణీయతఁ గాంచిరి = ఒప్పిదమును బొందిరి.

సీ. అభిరామనవపల్ల♦వారామకుంజవాటికలఁ గీరముల నా♦డించికొనుచుఁ
బద్మాలయోదర♦ప్రౌఢసారసవీథి నంచలవేడంబు ♦ లరసికొనుచు
గాంగేయధామశృం♦గవికటంకముల నీలకంధరరోజ్జ్వలగతు ♦ ల్గాంచికొనుచు
విమలసింధుద్వీప♦వేదిక నరుణాస్త్రఖగవిహారప్రౌఢిఁ ♦ బొగడికొనుచు
తే. రతియుఁ జేతోభవుండు భా♦రతియు నజుఁడు
శచియు నమరాధినాథుండు ♦ జలధిసుతయు
నబ్జనాభుండు నన మించి ♦ యఖిలసమయ
సముచితక్రీడ సలిపిరి ♦ సతియుఁ బతియు. 97

అభిరామ నవపల్లవారామకుంజవాటికలన్ - అభిరామ = ఒప్పుచున్న, నవపల్లవ = క్రొంజిగుళ్లు గల, ఆరామ=ఉద్యానవనములయందలి, కుంజవాటికలన్=పొదరిండ్లచాలుపులయందు, కీరములనాడించి కొనుచున్ = చిలుకగుజ్జములనెక్కి త్రిప్పుచు అనియర్థము. చిలుకల నాటలాడించుకొనుచునని భావము. ఇందువలన రతీమన్మథులసామ్యము సిద్ధించుచున్నది.

పద్మాలయోదరప్రౌఢసారసవీథిన్ - పద్మాలయ = సరోవరములయొక్క, ఉదర = గర్భమందు, ప్రౌఢ = వృద్ధిపొందిన, సారస = కమలములయొక్క, వీథిన్ = శ్రేణియందు, అంచలవేడంబు లరసికొనుచున్ = హంసవాహనములనెక్కి గతివిశేషములను బరీక్ష సేయుచు నని యర్థము. హంస విహారముల నవలోకించుచు నని భావము. అందువలన వాణీహిరణ్యగర్భులసామ్యము సిద్ధించుచున్నది.

గాంగేయధామ శృంగవిటంకములన్ - గాంగేయధామ = సువర్ణస్థానమైన మేరుపర్వతము యొక్క, శృంగవిటంకములన్ = శిఖరములయొక్క యంచులయందు, (ని. 'తపనీయం శాతకుమ్భం గాఙ్గేయం భర్మ కర్బురమ్' అని అ.) నీలకంధరోజ్జ్వలగతుల్గాంచికొనుచున్ = కంధరశబ్దము మేఘ మందును, గంధరాశబ్దము కంఠమందును వర్తించును గనుక, నీలకంధరమనఁగా నీలమేఘంబును నెమిలియును, (ని. 'గ్రీవాయాం కన్ధరా మేఘే పుమాన్' అని నా.) నీలకంధర = నీలమేఘవాహన ములయొక్క, ఉజ్జ్వలగతులు = ప్రకాశమానమయిన గమనములను, కాంచికొనుచున్ = పొందుచునని యర్థము. సువర్ణమయకోలాహలాచలశిఖరపార్శ్వములయందు నెమళ్ళయొక్క నడకలు చూచుకొంచు నని భావము. ఇందువలన శచీసురేంద్రుల సామ్య మభిహిత మయినది.

విమలసింధుద్వీపవేదికన్ - విమల = తెల్లనైన, సింధు = సముద్రమందలి - అనఁగా క్షీరసముద్ర మందలి,ద్వీపవేదికన్=వేదికాసదృశమయిన శ్వేతద్వీపమందు,అరుణాప్తవిహారప్రౌఢిఁబొగడికొనుచున్= అరుణశబ్దము సూర్యసారథియైన యనూరునియందును సూర్యునియందును వర్తించుచున్నది. (ని. 'అరుణో ర్కే తత్సూతే' అని నా.) అరుణాప్తఖగ = అనూరుని కాప్తుఁడైన గరుత్మంతుని యందును, విహారప్రౌఢిఁ బొగడికొనుచున్ = సంచారప్రౌఢిమను మెచ్చుకొనుచు నని యర్థము. సింధుశబ్దము నదియందు వర్తించుచున్నది గనుక స్వచ్ఛమయిన శుక్తిమతీనదియందలి వేదికవంటి యిసుకదిన్నె యందును,నరుణాప్తఖగములనఁగా సూర్యుఁడాప్తుఁడుగాఁగల పక్షులు చక్రవాకములుగనుక వానియొక్క విహారప్రౌఢిమను మెచ్చుకొనుచు ననిభావము. ఇందువలన లక్ష్మీనారాయణుల సామ్యము చెప్పఁబడినది.

రతియుఁజేతోభవుండున్ = రతీదేవియును మన్మథుఁడును, భారతియునజుఁడున్ = సరస్వతీదేవి యును బ్రహ్మయును, శచియు నమరాధినాథుండున్ = శచీదేవియును దేవేంద్రుఁడును, జలధిసుతయు నబ్జనాభుండున్ = లక్ష్మీదేవియును శ్రీమహావిష్ణువును, అనమించి = అనునట్టులుంగా నతిశయించి యని క్రమాలంకారము. సతియుఁ బతియున్ = గిరికాదేవియును వసురాజును, అఖిలసమయసముచితక్రీడ సలిపిరి = వసంతాదిసర్వర్తుసమయములయందును దగియుండునట్టి కేళీవిహారము చేసిరి.

మొదటిపాదమున వసంతఋతువునకు రెండవపాదమున శరదృతువునకు మూఁడవపాదమున వర్షర్తువునకు నాలుగవపాదమున హేమంతర్తువునకు ననుకూలములగు కీరాదికములు, నవపల్లవారామాది ఋతుధర్మములు చెప్పఁబడెను. అయాఋతుధర్మముల కనుకూలములగు క్రీడాదికములె సముచితక్రీడలు గిరికయు వసురాజు సముచితక్రీడాలోలురై సర్వర్తువులయందు సుఖ మనుభవింప సాగిరని భావము

తే. ఇట్లతఁడు శైలజకుఁ జొక్కు • టెఱిఁగి యొక్కొ-
యలఘుసద్గోత్రనందన • యయ్యెఁ గీర్తి
యగతనయ యయ్యె జయరమ • యచలభూతి
మహిత గైమి మించె నపుడు సా•మ్రాజ్యలక్ష్మి. 98

ఇట్లు=ఈ ప్రకారముగా, అతఁడు = ఆ వసురాజు, శైలజకుఁజొక్కుటెఱిఁగియొక్కొ- = పర్వత పుత్త్రియైన గిరికాదేవికి స్వాధీనుఁడగుట దెలిసికొని కాఁబోలు, అపుడు = ఆసమయమందు, కీర్తి= వసురాజుయొక్క కీర్తికాంత, అలఘుసద్గోత్రనందనయయ్యె - అలఘు = అధికమయిన, సద్గోత్ర= కులపర్వతముయొక్క, నందనయయ్యెన్ = కొమార్తెయాయెను అని యర్థము. సత్కులీనులను సంతోషింపఁజేయుచున్నదని భావము. ఇక్కడ గోత్రశబ్దము పర్వతమునందును గులమందును వర్తిం చును. (శ్లో. 'గోత్రం నామ్నికులే క్షేత్రే గోత్రా భువి గవాఙ్గణే, గోత్రశ్శైలే' అని నా.) నందన శబ్ద మపత్యమందును సంతోషకరమయినదానియందును వర్తించును. (ని. 'నన్దనం వాసవోద్యానే నన్దనో హర్షకే సుతే' అని మే.) జయరమ = ఆతనిజయలక్ష్మి, అగతనయయయ్యెన్ = పర్వతపుత్త్రిక యయ్యెనని యర్థము. అగత=పోకయుండునట్టి, నయయయ్యెన్=నీతిగలదాయెనని భావము. ఇక్కడ శబ్దశ్లేషము, సామ్రాజ్యలక్ష్మి=ఆయనరాజ్యలక్ష్మి, అచలభూతిమహితయై మించెన్ = పర్వతసంభవత్వము చేత నొప్పినదై యతిశయించెనని యర్థము. చలింపని యైశ్వర్యముచేత నొప్పినదై యతిశయించెనని భావము.

ఇక్కడ అచలమనఁగాఁ బర్వతమును జలింపనిదియును, భూతియనఁగాఁ బుట్టువును నైశ్వర్యం బును, (ని. 'భూతి ర్మాతఙ్గశృఙ్గారే జన్మ సంపత్తి భస్మసు' అని నా.) అనఁగా నీరీతిగా వసురాజు గిరికాదేవియం దాసక్తుఁడై ప్రవర్తించుచుండఁగా నాతనికీర్తి సత్పురుషులకు సంతోషింపఁజేయుచుండె ననియు నాతనిజయలక్ష్మి నీతిసహితయై యుండెననియు నాతనిరాజ్యలక్ష్మి సుస్థిరైశ్వర్యముచేత నొప్పు చుండె ననియును దాత్పర్యము.

సీ. ఆరాజువిమలవి•ఖ్యాతిచంద్రిక నిచ్చ రహిఁ గెక్కు జారజా•ర ప్రసంగ
మాఘనుదానధా•రాపూర్ణ వర్ష మున్నర్వరఁ బర్వ డిగియె న•వగ్రహార్తి
యాలోకహితుప్ర తా•పాతపం బవిరతోదయరూఢిఁ దగ నింకె • దస్యుపంక
మాసద్గుణాబ్ధిచ•రామృతం బెల్లచోఁ దయివారఁ దెరలె నా•మయవిభూతి
తే. యమ్మహాశైలదమనురా•జ్యమున నిట్లు
ఫలము లీనెడుచెట్లతోఁ • బాలవెల్లి
కాన్పుపసితో నఖండభో•గములతోడఁ
బ్రజలు గాంచిరి భూరివై•భవసమృద్ధి. 99

ఆరాజు=ఆవసురాజనెడు చంద్రునియొక్క, (ని. 'రాజా నృపే తాలభేదే పత్యౌ క్షత్త్రియ చన్ద్రయోః' అని నా.) ఇక్కడ శ్లిష్టరూపకము-సర్వత్ర వసురాజపరమయిన విశేష్యపదముల కన్ని టికి నీలాగుననే విచారింపవలయును. విమలవిఖ్యాతచంద్రిక = శుభ్రకీర్తియనెడువెన్నెల, నిచ్చరహి కెక్కెన్ = నిరంతరమును వన్నె కెక్కఁగా, జారప్రసంగము = విటులయొక్క ప్రసక్తి, జారెన్ = వదలెను.

అఘనుఃఘనుఁడైన యావసురాజనెడు మేఘునియొక్క, (ని. 'మేఘే పుమాన్ ఘనః' అని నా). దానధారా = దానజలధారలనెడు, అపూర్ణవర్షము = సంపూర్ణమైన వర్షము, ఉర్వరఁబర్వన్ = సకలసస్యములచేతఁ బరిపూర్ణమైన భూమియందు వ్యాపింపఁగా, (ని. 'ఉర్వరా సర్వసస్యాఢ్యా' అని అ). అవగ్రహార్తి=వర్షప్రతిబంధమువలన సైనపీడ, డిగియెన్=తగ్గిపోయెను. ఆలోకహితు = జనహితుఁడైన యా వసురాజనెడు సూర్యునియొక్క-ఇక్కడ సూర్యపరముగా లోకబాంధవశబ్ద మనుసంధింప వలయును. (ని. 'ప్రద్యోతనో దినమణిః ఖద్యోతో లోకబాన్ధవః' అని అ.)

ప్రతాపాతపంబు = ప్రతాపమనెడు నెండ, అవిరతోదయరూఢిఁదగన్ = నిరంతరాభ్యుదయ రూఢిచేత నొప్పఁగా, దస్యుపంకము = శత్రువులును జోరులును ననెడుబురద, (ని. 'దస్యుః ప్రత్యర్థి చోరయోః' అని నా.) ఇంకెన్ = ఇగిరిపోయెను. ఆసద్గుణాబ్ధి = సద్గుణసముద్రుఁడైన యా వసురాజనెడు సముద్రునియొక్క, చర్యా=శ్రుతిస్మృత్యాచారస్థిరవృత్తియనెడు, అమృతంబు = సుధారసము, ఎల్లచోదయివారన్ = అంతటఁ బూర్ణీభవింపఁగా, ఆమయవిభూతి = రోగసంపత్తి, తెరలెన్ = విచ్చిపోయెను.

అమ్మహాశైలదమను = కోలాహలపర్వతశిక్షకుఁడైన యా వసురాజనెడుశైలదమనునియొక్క-అనఁగా దేవేంద్రునియొక్క, రాజ్యమునన్ = రాజ్యమందు, ఇట్లు = ఈప్రకారముగా, ఫలములీనెడు చెట్లతోన్ = వాంఛితఫలమునిచ్చెడు మందారపారిజాతాదివృక్షములతోడ నని యర్థము. మధురఫల ప్రదములయిన వృక్షములతోడ నని భావము. పాలవెల్లికామ్రుపసితోన్ = క్షీరసముద్రమువలనఁ బుట్టిన కామధేనుగుణముతోనని యర్థము. పాలు వెల్లువఁబారనిచ్చునట్టి గోసమూహముతో నని భావము.

అఖండభోగములతోడన్ = సంపూర్ణసుఖములతోనని యర్థము. అష్టభోగములతోననిభావము. భూరివైభవసమృద్ధిన్-భూరి = కాంచనముయొక్కయు, వైభవ = విభవములయొక్కయు, సమృద్ధిన్ = సంపూర్ణతను, ప్రజలుగాంచిరి=జనులుపొందినవారైరి. (ని. 'స్వర్ణేపిభూరి' అని యమరము.)

క. అని యిట్లు రోమహర్షణ, తనయుఁడు వసురాట్కథాసుధారస మఖిలం
బును దెలుప విని మహోత్సవ, మునఁ బొదలిరి శౌనకాదిమునికులచంద్రుల్.

అనియిట్లు = ఈలాగని, రోమహర్షణతనయుఁడు = రోమహర్షణపుత్త్రుఁడైన సూతుఁడు, వసురాట్కథాసుధారసము = అమృతరసప్రాయమైన వసురాజుయొక్క చరిత్రము, అఖిలంబును దెలుపన్ = సమస్తమును దెలియఁజెప్పఁగా, విని = ఆకర్ణించి, శౌనకాదిమునికులచంద్రుల్ = శౌనకుఁడు మొదలుగాఁగల మునిపంక్తిశ్రేష్ఠులు, మహోత్సవమునఁ బొదలిరి = మహత్తరమయిన వేడుకచే నొప్పిరి.

ఆ శ్వా సాం త ము.

మ. దృఢబాహాబలభీమ భీమసమరప్రేంఖజ్జయశ్రీపరి
బ్రఢిమాఢౌకితభూమ భూమహితతూర్యధ్వానదత్తైళధా
క్కృథమత్కారవినామ నామకథనక్లామ్యన్మహోద్ధిల్లికా
గళరాడాద్యరిధామ ధామగరిమగ్రస్తగ్రహాధీశ్వరా.

దృఢబాహాబలభీమ = గాఢమయిన బాహుబలమందు భీమసేనుఁడవైనవాఁడా, భీమసమర = భయంకరయుద్ధములయందు, ప్రేంఖత్ = నటించుచున్న, జయశ్రీ = జయలక్ష్మియొక్క, పరిబ్రఢిమా = పరిబృఢత్వముచేత - అనఁగా నాధిపత్యముచేత, పరివృఢశబ్ద మధిపతియందు వర్తించును. ని. 'ప్రభుః పరివృఢోఽధిపః' అని అ. వబలకభేదము, ఆఢౌకిత = వ్యాపింపఁజేయఁబడిన, భూమ = సామర్థ్యము గలవాఁడా, భూమహిత = భూమియం దొప్పుచున్న, తూర్యధ్వాన = చతుర్విధవాద్యధ్వనులచేత, దత్త = ఈఁబడిన, ఈశఢాక్కృఢమత్కార = హరునియొక్క ఢక్కాసంబంధమయిన ఢమఢమ ధ్వనియొక్క, వినామ = నమ్రభావముగలవాఁడా - అనఁగా హరుని ఢక్కానాదమును దిరస్కరించిన భేరీకాహళాదిధ్వనులు గలవాఁడా యనుట. నామకథన = పేరు చెప్పినంత మాత్రముచేతనే, గ్లామ్యత్ = వాడిపోవుచున్న, మహాఢిల్లీకాగఢరాడాది = ఢిల్లీ యాగఢా పాదుషాలు మొదలైన, అరి = శత్రువులయొక్క, ధామ = ప్రభగలిగినవాఁడా - అనఁగా నీరాజుపేరు వినఁగానే వారికి ముఖవైవర్ణ్యము సంభవించుచున్న దనుట. ధామగరిమగ్రస్త గ్రహాధీశ్వరా - ధామగరిమ = తేజో గౌరవముచేత, గ్రస్త = కబళింపఁబడిన, గ్రహాధీశ్వరా = సూర్యుఁడుగలవాఁడా - అనఁగా సూర్య తేజస్సుకంటె నధికమయిన తేజస్సుగలవాఁడనుట. అని యాశ్వాసాంతమందుఁ గృతిపతినిగూర్చి సంబోధనము. ఈపద్యము ముక్తపదగ్రస్తము గలదిగాఁ జెప్పంబడియెను.

క. ధాటీబహుధాఽఽటీకన
ఘోటీఘోట్టాణకోటిఖురకోటిరజ
శ్శాటీవృతహరిదవధివ
ధూటీకుచశైల ప్రబలదోర్బలలీలా. 102

ధాటియనఁగా, శ్లో. 'శత్రుసేనావమర్దాయ సద్యస్సుభటఘోటకైః, విజిగీషాప్రవృత్తిర్యా సాధాటీతి నిగద్యతే' అను నీ శ్లోకోక్తలక్షణముగల ధాటియందు - అనఁగా దాడియందు, బహుధా = అనేకవిధములైన, ఆటీకన = గతివిశేషముఁ గలిగిన, ఘోటీ = ఆఁడుగుఱ్ఱములయొక్కయు, ఘోట్టాణ = మగగుఱ్ఱములయొక్కయు, కోటి = కోట్లయొక్క - అనఁగా ననేకములైన స్త్రీపురుషాశ్వసమూహముల యొక్క, ఖుర = గొరిజలయొక్క, కోటి=కొనలవల్లఁ బుట్టిన, రజః = ధూళియనెడు, శాటీ = వస్త్రము చేత, వృత = కప్పఁబడిన, హరిదవధివధూటీ = దిక్కులే చివరగాఁగల భూమియనెడు స్త్రీయొక్క, కుచశైల = స్తనప్రాయములైన పర్వతముగలవాఁడా, ప్రబలదోర్బలలీలా = బలిష్ఠమైన బాహుబల విలాసముగలవాఁడా అని సంబోధనము.

సుగంధివృత్తము

సారసాహితీసదధ్వచారిభూరిధీరసా
ధీరసాహసోరుదోరతిస్ఫురన్మహారసా
హారసానుమత్తటీసురాపగాసుధారసా
ధారసాధుకీర్తిహంసధారిసూరిసారసా. 103

సార = శ్రేష్ఠమయిన, సాహితీ = సాహిత్యమనెడు, సదధ్వ = సన్మార్గమందు, చారి = సంచరించు చున్న, భూరి = అధికమైన, ధీరసా = బుద్ధిగుణముల గలవాఁడా ! ఇక్కడ రసశబ్దము గుణార్థకము. ని

'శృఙ్గారాదౌ విషే వీర్యే గుణే రాగే ద్రవేరసః' అని అ. ధీరసాహస=మహత్తరమైనసాహసము గలిగిన, ఊరు=దీర్ఘమైన,దోః=బాహువునందు, అతిస్ఫురత్=మిక్కిలి ప్రకాశించుచున్న, మహత్=విస్తారమైన, రసా=భూమిగలవాఁడా, ని. 'రసావిశ్వమ్భరా స్థిరా' అని అ. హార=హారసంబంధమైన, సానుమత్=పర్వతముయొక్క - అనఁగాఁ గైలాసపర్వతముయొక్క, తటీ = దరులకును, సురాపగా = దేవనదికిని-అనఁగా నాకాశగంగకును, సుధారస = అమృతరసమునకును, ఆధార = ఆధారమయిన, సాధు = లెస్సయిన, కీర్తి = కీర్తియనెడు, హంస = హంసను, ధారి=ధరించుచున్నది, సూరి = విద్వాంసులనెడు, సారసా = కమలములు గలవాఁడా అని సంబోధనము. ఈ వృత్తము ముక్తపదగ్రస్తపాదములుగలదిగాఁ జెప్పం బడియెను. ఈ సుగంధివృత్తమునకు ర జ ర జ ర గణము లుండవలయును. తొమ్మిదవయక్షరము యతిస్థానము. ఇది పదునేనవఛందంబగు నతిశక్వరియందుఁ బుట్టినది. దీనిని శాలినీ ప్రశాంతి చామరవృత్తంబు లని కొందఱండ్రు, దీని నుత్సాహం బని కొందఱు భ్రమింతురు.

గద్యము. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందవందనపవననందనప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్యసర్వంకషచతుర్విధకవితానిర్వాహకసాహిత్యరసపోషణరామరాజభూషణప్రణీతం బయినవసుచరిత్రం బనుమహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

ఇది శ్రీమదాత్రేయకులకలశాంభోనిధి సంపూర్ణసోమ సోమాభిధానమంత్రివరపౌత్త్రుండును, సోమసుతసిద్ధేశ్వర మంత్రీశ్వరపుత్త్రుండును శ్రీమత్పార్వతీరాజేశ్వరవర ప్రసాదసమాసాదిత హృద్యానవద్యనిఖిలవిద్యావిశారదుండును నగు సోమకవిచేత విరచితం బయినవిద్వజ్జనరంజనీనామకపూర్వవ్యాఖ్యానమందలి విశేషవిషయసహితంబుగాఁ బరిష్కృతం బయి యొప్పారు ప్రతిపదటీకారూపం బగు వసుచరిత్ర నామకాంధ్ర కావ్యరత్నవ్యాఖ్యానమునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

విద్వజ్జనరంజనీనామకప్రతిపదటీకారూపం బగు వసుచరిత్ర వ్యాఖ్యానమందలి శ్రీశేషాచలాధీశ్వరకరుణాసమాసాదితోభయభాషాకవితాధురంధర శేషాద్రిరమణకవిసోదరవిరచిత భావప్రకాశిక యని వివరణము సంపూర్ణము.

వసుచరిత్రము సవ్యాఖ్యానము షష్ఠాశ్వాసము

సర్వంబును సంపూర్ణము



చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.

# పద్యానుక్రమణిక